ఓమ్

శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః



# శ్రీమదాంధ్ర భాగవతము

దశమస్కంధము

ఉత్తర భాగము



పోతనామాత్య ప్రణీతము

ఇది

పాలపర్తి నాగేశ్వర శాస్త్రుల చేత

టీకా తాత్పర్యములు వేదాంతార్థ విశేషములు పటములతో
సకల జనాహ్లాదముగ వ్రాయబడి 1884లో తొలిసారిగా ప్రచురించ బడినది

ప్రచురణ

శ్రీ సర్వారాయ ధార్మిక విద్యా ట్రస్టు
కాకినాడ-533 001

1992 సం॥ జూలై

ఓమ్.

# శ్రీమదాంధ్రభాగవతదశమస్కంధమునందలియుత్తరభాగ

## కథాసూచిక.



## [illegible] సూచిక.



ఉత్తరభాగకథాసూచిక సమాప్తము.





శ్రీరామమూర్తి.

## ఓమ్
### శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్రభాగవతము ✱ దశమస్కంధము.
## టీకా తాత్పర్య సహితము.

### ఉత్తరభాగము.

౧.—క॥ శ్రీకర పరిశోషిత ర। త్నాకర కమనీయ గుణగ ✱ ణాకర కారు
ణ్యాకర భీకర శర ధా.। రా కంపిత దానవేంద్ర ✱ రామనరేంద్రా.

టీ॥ శ్రీకర — శ్రీ=ధన ధాన్య వస్త్ర వాహన పుత్ర మిత్ర బంధు దాసులు అనెడి అష్టైశ్వర్యములను. లేక, అణిమ మహిమ గరిమ లఘిమ ప్రాప్తి ప్రాకామ్యము ఈశత్వము వశిత్వము అనెడి అష్ట మహావిభూతులను. కర=కలుగఁజేయువాఁడా. లేక, శ్రీ=ధర్మము అర్థము కామము అనెడి త్రివర్గసంపదలను. క = ఆనందరూపమైన మోక్షమును. ర=ఇచ్చువాఁడా. రాదానే అని ధాతువు. ని॥ లక్ష్మీ సరస్వతీధాత్రీ త్రివర్గసంపద్విభూతిశోభాసు। ఉపకరణవేషరచనా విశేషేషుచ శ్రీరితి ప్రథితా॥ అని. పరిశోషితరత్నాకర = ఇంకిపోవునట్లుచేయఁబడిన సముద్రముగలవాఁడా. కమనీయగుణగణాకర= మనోజ్ఞములైన సర్వజ్ఞత్వము సర్వేశ్వరత్వము సర్వభోక్తృత్వము సర్వనియంతృత్వము సర్వాంతర్యామిత్వము సర్వస్రష్టృత్వము సర్వ పాలకత్వము సర్వసంహారకత్వము మొదలయిన మంచి గుణముల సమూహములకు నిధియయినవాఁడా. కారుణ్యాకర=పరులదుఃఖమును నశింపఁజేయవలెనను కోరికకు నిధియైనవాఁడా. భీకర శర ధారాకంపితదానవేంద్ర=భయంకరమయిన బాణముల ధారలచేత వణఁకింపఁబడిన దానవరాజులు గలవాఁడా. రామనరేంద్రా = రామరాజా.

తా॥ సకలసంపదలను కలుగఁజేయు వాఁడవును, సముద్రపు నీటిని బాణప్రయోగముచేత ఇంకిపోవునట్లుచేసినవాఁడవును, మంచి గుణములన్నికలవాఁడవును, దయాపరుఁడవును, భయంకరమయిన బాణప్రయోగములచేత రాక్షస రాజులనెల్లను వణఁకింపఁ జేయునట్టివాఁడవును అయిన ఓరామరాజా! అని తాత్పర్యము.

### విశేషార్థము.

టీ॥ శ్రీకర—శ్రీ=బ్రహ్మవిద్యను. క=కంబ్రహ్మ ఖంబ్రహ్మ అని శ్రుతిగనుక ఆబ్రహ్మవిద్యాభ్యాసముగలవారికి (సర్వంఖల్విదంబ్రహ్మ,

బ్రహ్మణోన్యంనకించన, పురుషఏవేదగ్ంసర్వం, పురుషాన్నపరం కించిత్, విశ్వమేవేదంపురుషః, ఏకోదేవోబహుధానివిష్టః, బ్రహ్మైవాహమిదం జగచ్చసకలం చిన్మాత్రవిస్తారితం) అను నివి మొదలగు శ్రుతిప్రమాణములనుపట్టి (బ్రహ్మైవాహమస్మి) అను నిర్వికల్పబ్రహ్మనిష్ఠను. ర=ఇచ్చువాఁడా. ర దానే అనిధాతువు. పరిశోషితరత్నాకర=భార్యలనెడు జలగలును, తోడఁబుట్టువులనెడు పల్లములును, పుత్రులనెడు మత్స్యములును, క్రోధమనెడు తాబేళ్లును, కామమనెడుపాచియు, లోభమనెడునురుగును, మోహమనెడుగట్టును, తాపత్రయ దుఃఖమనెడు బడబాగ్నియును, కోరికలనెడు అలలును, కాలాకాలమృత్యువులనెడు మొసళ్లును, రోగములనెడు బుగ్గలును, స్రక్చందన వనితాది విషయ భోగ మనెడి జలమును గల సంసార సముద్రమును ఇంకించువాఁడా – అనన్యభక్తితో నిన్నారాధించు వారికి సంసార బాధ లేకుండఁ జేయువాఁడా యనుట. భీకరశర...వేంద్ర – భీకర = శ్రుతి యుక్తి అనుభవము లేనివారికి భయంకరములైన. శరధారాకంపిత = ప్రజ్ఞానంబ్రహ్మ అని ఋగ్వేదమందును, తత్వమసి అని సామవేదమందును, అయమాత్మాబ్రహ్మ అని అథర్వణవేదమందును,అహంబ్రహ్మాస్మి అని యజుర్వేదమందును గలదు కాఁబట్టి దుర్లభమయిన మనుష్యజన్మమెత్తి పశుబుద్ధితో తానువేఱు జగత్తువేఱు జీవుఁడువేఱు ఈశ్వరుఁడువేఱని యెంచుటయు, పూనికతో వాదించుటయు మహా పాపహేతువును మనుష్యజన్మమును వ్యర్థము సేయుటయును అగును మఱియు, శ్రు॥ అనేన జీవేనాత్మనాను ప్రవిశ్యనామరూపేవ్యాకరవాణీతి నామరూపేవ్యాకరోత్॥ శ్లో॥ ఈశ్వరోజీవకళయా ప్రవిష్టోభగవానితి। ప్రణమేద్దండవద్భూమా వాశ్వచండాలగోఖరం ॥ మయేశ్వరేణ జీవేన గుణేన గుణినావినా। సర్వాత్మనాపిసర్వేణనాభావోవిద్యతేక్వచిత్॥దేహోదేవాలయఃప్రోక్తోజీవోదేవస్సదాశివః।త్యజేదజ్ఞాననిర్మాల్యంసోహంభావేనపూజయేత్ ॥ మమైవాంశోజీవలోకే జీవభూతస్సనాతనః। మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థానికర్షతి ॥ జీవస్య పరమాత్మాచ పర్యాయేణాత్మభేదధీః ॥ చిదేవదేహాః చిదిమేచలోకాః చిదేవ భూతాని చిదింద్రియాణి కర్తాచిదంతఃకరణంచిదేవ చిదేవసర్వం పరమార్థరూపం ॥ తస్మాత్కదాచిన్నైవాస్తి భేదమీశ్వరజీవయోః॥ అని యున్నదిగనుక జీవేశ్వరులకు భేదము స్వప్నమందుకూడ కలుగదు అనునివి మొదలయిన మహావాక్యార్థములనెడు బాణవర్షము చేత వణఁకింపఁబడిన–మనమిఁక సన్మార్గమున ప్రవర్తింపకపోతిమేని అధోగతిపాలగుదుమని భయపఱచఁబడిన. దానవ = శ్లో॥ మనస్యేకంవచస్యేకం కర్మణ్యేకంమహాత్మనాం। మనస్యన్య ద్వచస్యన్యత్కార్యమన్యద్దురాత్మనాం॥అనుప్రమాణమునుపట్టి మనస్సునతలఁచునది నోటపలుకునది దేహముతో అనఁగా,చేతితోచేయునది ఒక్కతీరుననుండుట మహాత్ముల లక్షణము. తలఁచునది చెప్పునది చేయునదిభేదముగనుండుట దురాత్ముల లక్షణముగనుక, దానవులనఁగా, దురాత్ములు విషకంతులు ఆభాసవేదాంతులు. లేక, శ్రు॥ యోన్యథా సంతమాత్మాన మన్యథాప్రతిపద్యతే। కింతేననకృతంపాపం చోరేణాత్మాపహారిణా ॥ అను శ్రుతి ప్రమాణముచేత పరమాత్మ ఆయా ప్రాణిరూపముగానే యుండఁగా పరమాత్మ తానుకాదని యెక్కడనో యున్నదని యెంచువారు ఆత్మద్రోహులు మహాపాపులు అట్టిపాపులలో. ఇంద్ర = శ్రేష్ఠులు గలిగినవాఁడా. రామ = (రమక్రీడాయాం) అను ధాతువుచేతను, శ్రు॥ రమంతేయోగినోనంతే సత్యానందేచిదాత్మని। ఇతిరామపదేనాసౌ పరబ్రహ్మాభిధీయతే॥ అను శ్రుతిచేతను, రామశబ్దమునకు పరబ్రహ్మమర్థము గనుక ఓ పరబ్రహ్మమైన శ్రీరామా. నరేంద్రా=నృణంతినయంతిసర్వంస్వవశమితినరాఃనృనయే,విషయములను పొందింపఁజేయునవి. అనఁగా, ఇంద్రియములు వానిని పాలించువాఁడైనందున నరేంద్రుఁడు, హృషీకేశుఁడు, దేహేంద్రియాద్యుపాధులతోఁగూడిన చైతన్యుఁడై అహమ్మనిపలుకఁబడు ప్రత్యగాత్మ, అట్టివాఁడా.

౨.—వ॥ మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన
సూతుం డిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు రుక్మిణీ పరిణయా
నంతరంబునన్నైన కథావృత్తాంతంబంతయు వినిపింపుమనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

టీ॥ మహనీయగుణగరిష్ఠులు=గౌరవింపఁదగిన మహాగుణముల చేత మిక్కిలి గొప్పవారు. అగునమ్మునిశ్రేష్ఠులకున్ = అగునట్టి ఆశౌనకాది మహామునులకు. నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీసమేతుండు=సమస్త పురాణములను చెప్పునట్టి విధముతోఁగూడుకొన్నవాఁడు. అయినసూతుండు = అయినట్టిసూతుఁడు. ఇట్లనియెన్=ఈమీఁదచెప్పఁబోవురీతినిచెప్పనారంభించెను. అట్లు=ఆవిధముగా. ప్రాయోపవిష్టుండైన = ప్రాయోపవేశము చేసినవాఁడైన. పరీక్షిన్నరేంద్రుండు=పరీక్షిన్మహారాజు.రుక్మిణీపరిణయానంతరంబునన్=రుక్మిణి పెండ్లి అయిన పిమ్మట. (అయిన కథా వృత్తాంతంబు) అంతయున్=సర్వమును. వినిపింపుమనినన్=చెప్పుమనియడుగఁగా. శుకయోగీంద్రుండు=శుకమహాముని. (ఇట్లనియెను)

తా॥ మిక్కిలి గొప్పగుణముల చేత గౌరవింపఁ దగినవారైన శౌనకాదిమహామునులకు సమస్తపురాణములను తెలియఁజెప్పుటయందలి నేర్పుతోఁగూడుకొన్నవాఁడైనసూతుఁడుచెప్పినట్లు ప్రాయోపవేశముచేసినవాఁడైన పరీక్షిన్మహారాజురుక్మిణీకల్యాణకథవిని ఆవలి కథను చెప్పుమని యడుగఁగా శుకమహాముని యిట్లుచెప్ప నారంభించెనని తాత్పర్యము.

## వి శే షా ర్థ ము.

టీ॥ పరీక్షిత్తనఁగా పక్వసంస్కారముగలిగినమనస్సు, శుకుఁడనఁగా ప్రజ్ఞానస్వరూపమైనబుద్ధిగనుక మనోబుద్ధులసంవాదము. (ఆత్మనోగురురాత్మైవస్వంశిష్యగురురాత్మనా)అని,మునిశ్రేష్ఠులనఁగా మునిర్నారణ్యవాసీ నాజ్ఞౌరీ=ముని యనువాఁడు అరణ్యమునందు వాసముచేయువాఁడునుకాఁడు. తలపెంచుకొనియుండువాఁడును కాఁడు. కింతు=మఱియెవఁడనిన. మననశీలః=బ్రహ్మవిద్యను మన

శేముచేయువాఁడు. మననంనామ = మననమనఁగా. యుక్తిభిరను చింతనం=యుక్తులచేత పౌర్వాపర్యసాధకబాధకములను బాగుగా చింతించుట. యుక్తయస్తు = యుక్తులనఁగా. నతువైతండికాసత్తర్కాదిరూపాః=వితండముతోఁ గూడుకొన్న నీచములయిన తర్కప్రసంగములుకావు. కింతు=మఱేమియనిన. (శ్రుతిప్రత్యక్షమైతిహ్యం అనుమానచతుష్టయం। ఏతైరాదిత్యమండలమితిశ్రుతిః॥) ఈశ్రుతిలో చెప్పఁబడినవియుక్తులు. ఏతద్రూపాః=ఇట్టివి. ఆదిత్యమండలంప్రత్యగాత్మస్వరూపం=ఆదిత్యమండల మనఁగా ప్రత్యగాత్మస్వరూపము. ఆభిఃశ్రుతిప్రత్యక్షాదిరూపాభిర్యుక్తిభిః=ఈ ప్రత్యక్షాదియుక్తులచేత అన్వను ప్రతిక్షణంఅసంభావనాదిపరాహత్యైక్రియమాణంపరిశీలనం మననం = అసంభావనాదులను పోఁగొట్టుకొనునిమిత్తము చేయఁబడెడి విచారమేమననము. ఏతదేవమానం = ఇదేమానము. నతుపాషాణ కాష్ఠవదవస్థాన మవ్యుత్పన్నసమధిగతం = అవ్యుత్పన్న వేదాంతులు తెలుసుకొనియుండు బాయి మొద్దు వీనివలె మాటాడకయుండుట కాదు గనుక మునులనఁగా బ్రహ్మవిచారపరులని అర్థము, వ్యాఖ్యావిశేషేణవస్తుయాథాత్మ్యజ్ఞానం యథాభవతితథా ఆఖ్యానంకథనంప్రకాశమానం వ్యాఖ్యాశబ్దార్థః=విశేషముగవస్తువుయొక్కనిజార్థము ఎట్లు అవునో అట్లు చేయుట చెప్పుట ప్రకాశింపఁజేయుట వ్యాఖ్య అను శబ్దమున కర్థము. సావ్యాఖ్యామాన మేవ=ఆవ్యాఖ్యకేమానమని పేరు. తక్కినదిసమము.

3.—ఉ॥ తామర సాక్షు నంశమున * దర్పకుఁ డీశ్వరు కంటి మంటలన్
దాముసు దగ్ధుఁడై పిదపఁ * దత్పరమేశుని దేహలబ్ధికై
వేమఱు నిష్ఠఁజేసి హరి * వీర్యమునం బ్రభవించె రుక్మిణీ
కామిని గర్భమం దసుర * ఖండను మారట మూర్తియోయనన్.

టీ॥ తామర సాక్షు నంశమునన్ = శ్రీవిష్ణు మూర్తి యంశమునందుఁబుట్టిన. దర్పకుఁడు=మన్మథుఁడు. ముసు=మునుపు. తాన్=తాను. ఈశ్వరుకంటిమంటలన్ = శివునియొక్క కంటిమంటలచేత. దగ్ధుఁడై = కాల్పఁబడినవాఁడై. పిదపన్=పిమ్మట. దేహలబ్ధికై=దేహమును పొందుటకై. తత్పరమేశునిన్ = ఆశివునిఁగురించి. వేమఱున్=పలుమాఱు. నిష్ఠఁజేసి=తపస్సుచేసి. హరివీర్యమునన్=శ్రీకృష్ణునివీర్యముచేత. రుక్మిణీకామినిగర్భమందున్ = రుక్మిణీదేవి కడుపునందు. అసురఖండను మారటమూర్తియో = శ్రీకృష్ణునిప్రతిరూపమో. అనన్=అనునట్లు. ప్రభవించెన్ = పుట్టెను.

తా॥ శ్రీవిష్ణుని అంశమునందుపుట్టినవాఁడైనమన్మథుఁడు యోగనిష్ఠాగరిష్ఠుఁడైయున్న శివునిచలింపఁజేసి ఆయననొసటికన్ను తెఱచి కోపముతోఁచూడఁగాఆకంటియందలియగ్నిచేత కాల్పఁబడినవాఁడై మరలదేహముధరింపవలెననిఆశివునినే ఉద్దేశించి చిరకాలముతపస్సుచేసి శ్రీకృష్ణునివీర్యముచేత రుక్మిణీదేవి గర్భమునందు కృష్ణుని ప్రతిబింబమో యనునట్లు పుట్టెనని తాత్పర్యము.

పూర్వకాలమునందు శివుఁడు యోగనిష్ఠయందుండఁగా అనేకులుదుష్టరాక్షసులు విజృంభించి దేవతాసమూహమును బాధించిరి, అప్పుడు ఆదేవతలందఱును బ్రహ్మయొద్దకుఁ బోయి మాకేమి గతియని మొఱపెట్టుకొనిరి, అంతటబ్రహ్మ వారినందఱిని పిలుచుకొని శ్రీవిష్ణుసన్నిధికిఁ బోయి దేవతలయవస్థచెప్పి యిందుకేమి చేయుదుమని యడిగెను, అందుకు విష్ణువు బ్రహ్మతోనీవు క్రూరులైన రాక్షసులకు ఇయ్యరానివరములు ఇచ్చి వృద్ధిపొందించితివి ఇప్పుడందులకు చాలప్రయాస పడవలసినది లయకర్తయగు రుద్రుని తేజస్సు తప్ప మఱియేదియు ఆరాక్షసులను సంహరింప నేరదు కాఁగా ఇప్పుడు శివునికి సురతేచ్ఛ పుట్టించి ఆయన వీర్యమువల్ల ఉదయించిన మహాపురుషుని తోడు చేసి కొని ఆరాక్షసులను చంప వలెనని చెప్పెను అప్పుడుదేవతలందఱుశివునినిష్ఠచెఱుప నితరులకు ఆలవిగాదనిమన్మథునినియమించి అతఁడుశివునిచెంతకేఆయననొసటియగ్గికంటిమంటలచేతభస్మమయ్యెనని పురాణ కథకలదు.

## విశేషార్థము.

టీ॥ తామరసాక్షునంశమునన్—తామరసాక్షు=హృదయకమలమునందే దృష్టిగలవానియొక్క—అనఁగా, ఆత్మానుసంధానపరుఁడైన బ్రహ్మవేత్తయొక్క. అంశమునన్=కళచేత — బ్రహ్మవేత్తకళబ్రహ్మవేత్తయేగనుక అతనియందేపుట్టిన. దర్పకుఁడు=(దర్పయతీతి దర్పకః) అను వ్యుత్పత్తిచేత దర్పకుఁడనఁగా, గర్వించినవాఁడు. ద్వైతవృత్తి=ద్వైతవృత్తియనఁగా, స్వేతరముగ జీవేశ్వరజగత్తులుగలవనెడుభ్రమనుపుట్టించునది. ఈశ్వరుకంటిమంటలన్—ఈశ్వరు=మోక్షరూపపరమైశ్వర్యముగలబ్రహ్మవేత్తయొక్క. కంటిమంటలన్=అపరోక్షజ్ఞానవ్యాపకముచేత. తాన్=తానైనద్వైతవృత్తి. మును దగ్ధుఁడై = ముందునశించినదై — అనఁగా, బ్రహ్మవిద్యాభ్యాసముచేతను, బ్రహ్మనిష్ఠచేతనుగలిగినవిజ్ఞానదృష్టిచేత. శ్లో॥ నాహందేహోనేంద్రియాణ్యంతరంగం నాహంకారఃప్రాణవర్గోనబుద్ధిః। దారాపత్యక్షేత్రవిత్తాదిదూర స్సాక్షీనిత్యఃప్రత్యగాత్మాశివోహం॥ రజ్జ్వజ్ఞానాద్భాతిరజ్జౌయథాహిస్స్వాత్మాజ్ఞానాదాత్మనోజీవభావః। ఆప్తోక్త్యాహిభ్రాంతినాశేసరజ్జుః జీవోనాహందేశికోక్త్యాశివోహం॥ అను ప్రమాణమునుపట్టి ఆహా నాయందుపుట్టినఅజ్ఞానముచేత వ్యష్టిసమష్టి స్థూల సూక్ష్మ కారణశరీరములును, వ్యష్టిసమష్టి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును, వ్యష్టి సమష్టి శరీరాభిమానులైన విశ్వతైజస ప్రాజ్ఞ విరాడ్ఢిరణ్యగర్భా వ్యాకృతనామములును నేనను కొంటిని. ఇప్పుడు నాప్రజ్ఞానమనెడు గురువువలన బోధింపఁబడుటచేత శరీరాదులకు సాక్షిని అయితిని—అనఁగా, ద్వైతవృత్తిసాక్షివృత్తియై. పిదపన్=సాక్షివృత్తి స్థిరపడినవెనుక. తత్పరమేశుని దేహలబ్ధికై వేమఱు నిష్ఠఁజేసి = ఆసాక్షివృత్తియునశించి (సర్వంఖల్విదంబ్రహ్మ, సర్వమేతచ్ఛివేవహి, హరిరేవజగత్ జగదేవహరిః, బ్రహ్మైవాహమిదం జగచ్చసకలం చిన్మాత్రవిస్తారితం, అను అఖండాకారవృత్తి గలుగుటకై తన యందే నిర్వికల్ప నిష్ఠ గలదై. రుక్మిణీ కామిని గర్భమందున్=తన అపరోక్షజ్ఞానమందే. అసురఖండను మారటమూర్తియోయనన్ = ఆసురీసంపదయైనసంశయము అసంభావన విపరీత

భావన అజ్ఞానము ఆవరణము విక్షేపము పరోక్షము మొదలయిన దుర్గుణములను నశింపఁజేయునట్టి ప్రజ్ఞానస్వరూపియైన బ్రహ్మవేత్త యొక్క మాఱురూపమో అనునట్లు—అనఁగా, అఖండాకారవృత్తి రూపములో. ప్రభవించెను=పుట్టెను.

(*) శంబరాసురుఁడుసముద్రములో ప్రద్యుమ్నునివేయమత్స్యముమ్రింగుట.(*)



వ॥ అంత నాఁడింభకుండు ప్రద్యుమ్నుం డనుపేర విఖ్యాతుండయ్యె నాశిశువు సూతికాగృహంబున దల్లి పొదిఁగిటనుండం దనకు శత్రుండని యెఱింగి శంబరుండను రాక్షసుండు దన మాయాబలంబునం గామరూపియై వచ్చి కొనిపోయి సముద్రంబులో వైచి తన గృహంబునకుం జనియె నంత నాశాబకుండు జలధి జలంబునం దిగంబడ నొడిసి యొక మహామీనంబు మ్రింగె నందు.

టీ॥ అంతన్ = అట్లుపుట్టినతరువాత. ఆడింభకుండు = ఆబాలుఁడు. ప్రద్యుమ్నుండను = ప్రద్యుమ్నుఁడు. అనుపేరన్ = అనుపేరితో. విఖ్యాతుండయ్యెన్=ప్రసిద్ధుఁడాయెను. ఆశిశువు=ఆబిడ్డ. సూతికాగృహంబునన్=పురిటింటిలో. తల్లిపొదిఁగిటన్=తల్లిసందిటిలో. ఉండన్ = పండుకొనియుండఁగా. (శంబరుండుఅనురాక్షసుండు) తనకుశత్రుండు= తనకువాఁడుపగవాఁడు. అనియెఱింగి= అనితెలిసికొని. తనమాయాబలంబునన్=తనదైన మాయాబలముచేత. కామరూపియైవచ్చి = తానుకావలెనన్నరూపమును పొందినవాఁడైవచ్చి. కొనిపోయి=ఎత్తుకొనిపోయి. (సముద్రంబులో) వైచి=వేసి. తనగృహంబునకున్ = తనయింటికి. చనియెన్ = పోయెను. అంతన్=అప్పుడు. ఆశాబకుండు=ఆపిల్లకాయ. జలధిజలంబునన్=సముద్రపునీటిలో. దిగంబడన్ = మునిఁగిపోవుచుండఁగా. ఒక మహామీనంబు = ఒకపెద్దచేఁప. ఒడిసి = కమిచిపట్టి. మింగెన్=మ్రింగెను. అందున్=ఆసముద్రములో.

తా॥ అనంతరము ఆచిన్నవాఁడు ప్రద్యుమ్నుఁడు అను పేరితో ప్రసిద్ధి నొందిన వాఁడయ్యెను, ఆచిన్నవాఁడు పురిటింటిలో తల్లి ప్రక్కను పండుకొనియుండఁగాశంబరుఁడను రాక్షసుఁడు అతఁడు తనకుపగవాఁడు కాఁగలఁడని తెలిసి తనమాయ చేత అంతఃపురమునకు పోఁదగిన రూపమును ధరించినవాఁడై ఆపురిటింటిలో ప్రవేశించి ఆబిడ్డనుకొనిపోయి సముద్రములోపడవేసి తనపట్టణమునకు పోయెను అప్పుడు ఆసముద్రములో ఒక గొప్పచేఁప ఆబిడ్డను మ్రింగెనుఅనితాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ ఆడింభకుండు=ఆరూఢస్థితినిపొందని ఆయఖండాకారవృత్తి. ప్రద్యుమ్నుండనుపేరన్=ప్రకర్షేణద్యుమ్నం ద్రవిణం అస్యేతి ప్రద్యుమ్నః అను వ్యుత్పత్తిచేత ప్రసిద్ధముగ ప్రజ్ఞాన మనెడు ధనముగలది అను నామముతో. ఆశిశువుసూతికాగృహంబునందల్లిపొదిఁగిటనుండన్ = ఆ అఖండాకారవృత్తి కోమలకంటకన్యాయముగ ఆరూఢస్థితి గలదికాకయుండఁగా. శంబరుండను రాక్షసుండు = అసంభావనాదిదుర్గుణసంఘము గలిగించి మోక్షసుఖమును చెఱచు జీవాహంకారుఁడు. సముద్రంబులోవైచి=దేహేంద్రియాదులుతాననెడు ద్వైతబుద్ధిగలసంసారసముద్రములో పడఁద్రోసి. తనగృహంబునకుంజనియెన్=తనకు వాసస్థానమయిన అజ్ఞానమునందే యుండెను. ఆశాబకుండు=ఆరూఢస్థితిని పొందని ఆయఖండాకారవృత్తి. జలధిజలంబునన్ = సంసారసముద్రమందలి మోహమనెడు నీటియందు. దిగంబడన్ = మునుఁగుచుండఁగా. ఒక మహామీనంబు = తనకు సాటిలేనిదై పరోక్షజ్ఞానము గలిగించు మనస్సనెడుమత్స్యము. మ్రింగెన్=ఆయఖండాకారవృత్తిని కబళించెను—పరోక్షజ్ఞానముగలదానిఁగా చేసెననిభావము.

౫.—క॥ జాలిఁబడి పాఱు జలచర । జాలంబులఁ బోవనీక ✻ చని రోషాగ్ని
జ్వాలలు నిగుడఁగ నూరక । జాలంబులు వైచిపట్టు ✻ జాలరులంతన్.

టీ॥ జాలిఁబడి=దిగులుపడి. పాఱు=పరుగెత్తునట్టి. జలచరజాలంబులన్=చేఁపలగుంపులను. పోనీక=పోనీయక. చని=అడ్డముపోయి. రోషాగ్నిజ్వాలలు=కోపమువలనినిప్పుమంటలు. నిగుడఁగన్=వ్యాపింపఁగా—అతిశయింపఁగా. ఊరక=సందువిడువక. జాలంబులు=వలలు. వైచి=వేసి. పట్టు=పట్టునట్టి. జాలరులు=చేఁపలవేఁటకాండ్రు. అంతన్=అంతట.

తా॥ ఆసముద్రములో చేఁపల వేఁటాడునట్టి జాలివాండ్రు దిగులుపడిపరుగెత్తిపోవునట్టి చేఁపలగుంపులనుపోనీకఅడ్డగించికోపమువలని నిప్పుమంటలు అతిశయింపఁగా సందు విడువకవలలువేసి చేఁపలనుపట్టుచుండిరి అప్పుడు అనితాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ జలచరజాలంబులన్=అజ్ఞానమను నీటియందే పుట్టి తిరుగుచున్న సంశయ వితర్క విపర్యయాది మనోవృత్తులనెడుమత్స్యసంఘములను. జాలంబులు=ఆవరణపరోక్షవిక్షేపాదులనెడువలలను. జాలరులు=అజ్ఞానులు. మనోవృత్తులైన సంకల్ప వికల్ప అజ్ఞానాదులలో మునుఁగువారు.

శరీరమును ధరించుటకు. (ఎదురుచూచుచున్నయది) కావునన్ = కనుక. అయ్యర్భకుండు=ఆశిశువు. కందర్పుండని = మన్మథుఁడని. (తెలిసి) మెల్లనన్ = తిన్నగా. పుత్త్రార్థిని = కొడుకునుకోరినది. ఆయినతెఱంగునన్=అయిన విధమున. శంబరునియనుమతివడసి= శంబరాసురునియాజ్ఞనుపొంది. సూపకారులయొద్దన్=వంటవాండ్ర వద్ద. ఉన్నపాపనిన్=ఉండినపిన్నవానిని. తెచ్చి = తీసికొనివచ్చి. పోషించుచుండెన్ = పెంచుచుండెను. ఆకుమారుండును = ఆపిల్ల వాఁడును. (శీఘ్రకాలంబున) ఆరూఢయౌవనుండై=ఎక్కినయౌవనముగలవాఁడై—యౌవనమును పొందినవాఁడై యనుట.

తా॥ అంతట నారదుఁడు రతీదేవి యొద్దకు వచ్చి రుక్మిణికి కొడుకుపుట్టుటయు, వానినిశంబరాసురుఁడు ఎత్తుకొనివచ్చిసముద్రములో వేయుటయు, అప్పుడు వానిని చేఁపమ్రింగుటయు,చెప్పఁగా ఆరతీదేవి మాయావతియని పేరుపెట్టుకొని శంబరాసురునియింటిలో పతివ్రతాధర్మము చెఱుచుకొనక మెలఁగుచు, శివునికంటి నిప్పుచేత కాల్పఁబడిన తనమగఁడు మరల శరీరము ఎప్పుడు ధరించునో అని యెదురు చూచుచుండెనుకాఁబట్టి, ఆచిన్నవాఁడు మన్మథుఁడేయని తెలిసికొని బిడ్డను పెంచుకోఁగోరిన దానివలె శంబరునివలన సెలవు పొంది ఆచిన్నవానిని తీసికొనివచ్చి పెంచుకొనుచుండెను ఆకుమారుఁడుఅట్లు పెంపఁబడియౌవనమునుపొందినవాఁడుకాఁగాననితా

వి శే షా ర్థ ము.

టీ॥ నారదుండు=బ్రహ్మవేత్త—నారం అజ్ఞానంద్యంతీతినారదః ద్వైతవృత్తిగల అజ్ఞానమును నశింపఁజేయునట్టివాఁడు. బాలకుని జన్మంబును = ఆరూఢస్థితినిపొందని అఖండాకారవృత్తి పుట్టినవిధమును. శంబరోద్యోగంబును = ద్వైతవృత్తిగలజీవాహంకారుఁడు ఆయఖండాకారవృత్తిని విషయసుఖములచవిచూపి సంసారమనెడు సముద్రమున త్రోయుటను. మీనోదరప్రవేశంబును=సంకల్పవికల్పములుగల మనస్సనెడు మత్స్యము కవ్వుకొనుటను. ఆరతి = ఆప్రజ్ఞానవృత్తి. పాతివ్రత్యంబు=తనకుభర్తయైన పరబ్రహ్మమందేజ్ఞప్తి గలిగియుండుటను. సూపకారులయొద్దన్=ఆవరణవిక్షేపాదివృత్తులలోచిక్కియున్న. పాపనిన్=అఖండాకారవృత్తిజ్ఞానమనుబిడ్డను. ఆకుమారుండును=ఆయఖండజ్ఞానము. శీఘ్రకాలంబునన్=నిరంతర నిర్వికల్పనిష్ఠచేత వేగముగానే. ఆరూఢయౌవనుండై=ఆరూఢస్థితి గలవాఁడై—బ్రహ్మైవాహమను నిశ్చలతగలవాఁడైఅనుట. క॥ఆరూఢుఁడుముక్తినగా। గ్రారూఢుండారురుక్షుఁ డారోహణకా। ర్యారంభపరుఁడుగావున। నారెంటికిఁగలదె భేదమధికారములన్॥ అని నారద పురూరవ స్సంవాదము.

౯.—క॥ సుందరమగు తనరూపును । సుందరు లొకమాఱు తేఱి ✱ చూచినఁ జాలున్
సౌందర్య మేమిచెప్పను । బొందెదమని డాయ బుద్ధిఁ ✱ బుట్టించు నృపా.

టీ॥ నృపా=రాజా. సుందరము=అందము. అగుతనరూపున్= అగునట్టి తన ఆకారమును. సుందరులు=ఆఁడువారు. ఒకమాఱు= ఒకసారి. తేఱిచూచినఁజాలున్ = చక్కఁగా చూచిననుజాలును. సౌందర్యమేమిచెప్పను = వాని చక్కఁదనము ఏమిచెప్పవచ్చును. పొందెదము = మీనినికలసెదము. అనిడాయన్=అనిచేరఁబోవుటకు. బుద్ధి=తలఁపు. పుట్టించున్=కలుగఁజేయును—మిక్కిలిచక్కని వాఁడనిభావము.

తా॥ ఓరాజా ! ఆచిన్నవాని చక్కఁదనము ఏమనవచ్చును ఆఁడుపుట్టుక పుట్టినది యేదియైనను సరే వాని ఆకారమును చక్కఁగా చూచెనా మీనితో పొందుదమా అని తలఁచి చేరఁబోవునట్లు చేయుచుండును అని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ సుందరము=అఖండపరిపూర్ణసచ్చిదానందములుగలదగుటచేత రమణీయమయినది. సుందరులు=చతుర్దశేంద్రియములు.

౧౦.—సీ॥ చక్కని వారల ✱ చక్కఁదనంబున - కుపమింప నెవ్వఁడు ✱ యోగ్యుఁడయ్యె
మిక్కిలి తపమున ✱ మెఱయు నంబికకునై - శంకరు నెవ్వఁడు ✱ సగముచేసె
బ్రహ్మత్వమును బొంది ✱ పరఁగు విధాతను - వాణికై యెవ్వఁడు ✱ వాఁడిచెఱిచె
వేయిడాఁగులతోడి ✱ విబుధ లోకేశుని - మూర్తికి నెవ్వఁడు ✱ మూలమయ్యె

తే॥ మునులతాలిమి కెవ్వఁడు ✱ ముల్లుసూపు । మగల మగువల నెవ్వఁడు ✱ మరులుగొలుపుఁ
గుసుమధనువున నెవ్వఁడు ✱ గొను విజయము । చిగురువాలున నెవ్వండు ✱ చిక్కవఱుచు.

టీ॥ (చక్కనివారలచక్కఁదనంబునకు)ఉపమింపన్=పోల్పను. (ఎవ్వఁడు) యోగ్యుఁడయ్యెన్=తగినవాఁడాయెనో. మిక్కిలితపమునన్=మిక్కుటమైన తపస్సుచేత. మెఱయునంబికకునై=ప్రకాశించునట్టి పార్వతీదేవికొఱకు. శంకరున్ = శివునిని. (ఎవ్వఁడు) సగముచేసెన్=అర్థదేహముగలవానిఁగాఁజేసెనో—అర్థనారీశ్వరుఁడయ్యెననుట. బ్రహ్మత్వమునుబొంది = బ్రహ్మాధికారమునుపొంది. పరఁగువిధాతన్=ప్రసిద్ధినొందినచతుర్ముఖుని. వాణికై=సరస్వతికిఁగాను. (ఎవ్వఁడు) వాఁడిచెఱిచెన్=ప్రతాపము చెడఁగొట్టెనో. వేయిడాఁగులతోడివిబుధలోకేశుని=వేయిగుఱుతులుగలయింద్రుని యొక్క. మూర్తికిన్ = ఆకారమునకు. (ఎవ్వఁడు) మూలమయ్యెన్=ముఖ్యకారణమాయెనో. మునులతాలిమికిన్=ఋషీశ్వరులయొక్క ధైర్యమునకు. (ఎవ్వఁడు) ముల్లుసూపున్=ముల్లుకనఁబఱచునో—బాధించునో. మగలన్ = పురుషులను. మగువలన్ = స్త్రీలను (ఎవ్వఁడు) మరులుకొలుపున్ = పరస్పరానురాగము కల

వారినిఁగాఁ జేయునో. కుసుమధనువునన్ = పూవింటిచేత, విజయమున్ = గెలుపును. (ఎవ్వఁడు) కొనున్=పొందునో. చిగురువాలునన్=చిగురు అనెడుకత్తిచేత. ఎవ్వాండు=ఎవ్వఁడు. చిక్కువఱుచున్=లోకమునుత్రొక్కటపడునట్లుచేయునో.

తా॥ చక్కనివారి చక్కఁదనమునకు పోల్పఁదగినవాఁడు ఎవఁడో, అధికతపస్సుచేసిన పార్వతీదేవికొఱకు శివునిఅర్ధదేహము గలవానిఁగా చేసినవాఁడు ఎవఁడో, బ్రహ్మాధికారమును పొందిన బ్రహ్మను సరస్వతికైబిగువుతప్పినవానిఁగాఁ జేసినవాఁడుఎవఁడో, ఇంద్రునియొక్క దేహమునకు వేయిగుఱుతులు కలుగుటకు మూలమైనవాఁడు ఎవఁడో, ఋషులధైర్యమును చెఱుచువాఁడును, లోకములోని స్త్రీ పురుషులను అన్యోన్యము అనురాగము కలవారుగాఁ జేయువాఁడును,పువ్వువింటిచేత లోకమునెల్లనుజయించువాఁడును, చిగురుకత్తిగాఁ జేసికొని లోకుల నెల్లవారిని త్రొక్కటుపడునట్లుచేయువాఁడునుఎవఁడో అట్టిమన్మథుఁడుఅనితాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ చక్కనివారలచక్కఁదనంబునకున్—క॥వినుమవిటితనముఁ జెఱుచుం। జెనుసమ్మోదంబువెనుచు విసుమానపుత్రో । వనునడువనీదు విద్యా। ధనమారయ దానిఁబోని ధనముంగలదే ॥ శ్లో॥ కేయూరాణినభూషయంతిపురుషం హారానచంద్రోజ్జ్వలా । నస్నానం నవిలేపనం నకుసుమం నాలంకృతామూర్ధజాః। వాణ్యేకాసమలంకరోతి పురుషం యాసంస్కృతాధార్యతే। క్షీయంతేఖిలభూషణానిసతతం। వాగ్భూషణంభూషణం ॥ అన్యవిద్యాపరిజ్ఞాన మవశ్యం నశ్వరంభవేత్ । బ్రహ్మవిద్యాపరిజ్ఞానం; బ్రహ్మప్రాప్తికరంపరం ॥ అను ప్రమాణములను పట్టి ఆభరణ వస్త్ర చందన పుష్పముల ధరించుట మొదలగునవి అందముకాదు తన్ను దుఃఖసముద్రమునుండి లేవనెత్తి మోక్షమనెడు గట్టునందుఁ జేర్చునట్టి బ్రహ్మవిద్యను అభ్యసించుటయే చక్కఁదనము అట్టి బ్రహ్మవిద్యాభ్యాసము గల బ్రహ్మవిద్వరిష్ఠులతోడ. స్వేతరులుకాని రుద్ర బ్రహ్మ దేవేంద్రాదులకు ద్వైతభ్రమనుఅఖండాకారవృత్తిస్వరూపుఁడైనయేబ్రహ్మముగలిగించెనో.

౧౧.—వ॥ అని తన్ను లోకులు వినుతించు ప్రభావంబులుగలిగి పద్మదళలోచనుండును, ప్రలంబ బాహుండును, జగన్మోహనాకారుండునైన పంచబాణునింగని లజ్జాహాసగర్భితంబులైనచూపులంజూచుచుమాయావతి సురతభ్రాంతి జేసినంజూచి ప్రద్యుమ్నుండిట్లనియె.

టీ॥ (అని తన్ను) లోకులు=లోకములోనిజనులు. వినుతించు=పొగడునట్టి. ప్రభావంబులు=మహిమలు. కలిగి=కలవాఁడై. పద్మదళలోచనుండును = తామరతేకులవంటి కన్నులు గలవాఁడును. ప్రలంబబాహుండును=మిగులవ్రేలుచున్న భుజములుగలవాఁడును. జగన్మోహనాకారుండును=లోకమునకు మోహమును పుట్టించునట్టి ఆకారముగలవాఁడును. ఐనపంచబాణునిన్=అయినట్టిమన్మథుని. కని=చూచి. లజ్జాహాసగర్భితంబులు=సిగ్గునునవ్వునులోపలఁగలవి. అయినచూపులన్=అయినట్టిచూపులతో. (చూచుచుమాయావతి) సురతభ్రాంతిచేసినన్ = క్రీడింప యత్నించినది కాఁగా. (చూచి ప్రద్యుమ్నుండు) ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

తా॥ అని యీవిధముగా లోకులు పొగడుటకుఁ దగిన మహిమలు గలవాఁడై, తామరతేకులవంటికన్నులును, మోఁకాళ్లదాఁక వ్రేలుచున్న బాహువులును, లోకమునకు మోహమును పుట్టించునట్టి ఆకారమును గలిగియున్న మన్మథునిఁ జూచి మాయావతి కలయికకై తత్తరమును వహింపఁగా ప్రద్యుమ్నుఁడు దానితో ఇట్లు పలికెనని తాత్పర్యము.

### (*) ప్రద్యుమ్నునకు రతీదేవి యతని పూర్వవృత్తాంతము చెప్పుట (*) —ప్రద్యుమ్నుఁడు.



మత్త॥ నాతనూభవుఁ డీతఁడంచును * నానయించుక లేకయో
మాతనీవిది యేమినేడిటు * మాతృభావము మాని సం
ప్రీతిఁగాముకి భంగిఁజేసెదు * పెక్కువిభ్రమ ముల్మహా
ఖ్యాతవృత్తికి నీకు ధర్మము * గాదు మోహముసేయఁగాన్.

టీ॥ ఓమాత=ఓతల్లీ. (నీవు) నాతనూభవుఁడు = నాకొడుకు. ఈతఁడు=ఈచిన్నవాఁడు. అంచున్=అనుచుండి. నానయించుకలేక=కొంచెమైనసిగ్గులేక. నేడు=ఈదినము. ఇటు=ఈవిధముగా. మాతృభావముమాని=తల్లితనమువదలి. సంప్రీతిన్=ఎక్కువయైనమక్కువతో. కాముకిభంగిన్ = కేవలముకాముకురాలివలె. పెక్కువిభ్రమములు = అనేకములైన విలాసచేష్టలు. చేసెదు = చేయుచున్నావు. ఇదియేమి=ఈచేయుటలేమి? మహాఖ్యాతవృత్తికిన్=మిక్కిలి శ్లాఘ్యమయిన నడవడిగలదానవైన. (నీకు) మోహముసేయఁగాన్=మోహమునొందుట. ధర్మముకాదు=న్యాయముకాదు.

తా॥ ఓ యమ్మా! నీవు ఇన్నాళ్లదాఁక నన్ను కొడుకు అని ప్రీతితో పెంచి నేడు కొంచెమయిన లజ్జలేనిదానవై యిట్లు తల్లిరీతినిమాని కాముకురాలివలె ఈబహువిధములయిన విలాసచేష్టలు చేయుట ఇదియేమిపని? మిక్కిలిశ్లాఘింపఁదగిన నడవడిగలనీవంటిదానికి అనుచితమయిన యీ మోహము నొందుట న్యాయము కాదు అని తాత్పర్యము.

౧౩.—వ॥ అనినరతియిట్లనియె నీవు నారాయణనందనుండవైన కందర్పుండవు పూర్వకాలంబున నేనునీభార్య
నైనరతిని నీవుశిశువవైయుండ నిర్దయుండైదొంగిలి తల్లిదొంగంజేసి శంబరుండుగొనివచ్చినిన్ను
నీరధిలోవైచిన నొక్కమీనంబు మ్రింగె మీనోదరంబువెడలితీవు మీఁదటికార్యంబాకర్ణింపుము.

టీ॥ అనినన్ = అనిప్రద్యుమ్నుఁడుచెప్పఁగా. (రతియిట్లనియె నీవు) నారాయణనందనుండవైన కందర్పుండవు = శ్రీవిష్ణుమూర్తి కొమారుఁడవైన మన్మథుఁడవు. పూర్వకాలంబునన్ = తొల్లిటి కాలమునందు. (నేను) నీభార్యనైనరతిని = నీపెండ్లామయినరతిని. (నీవు) శిశువవైయుండఁగ = చంటిబిడ్డవుగానుండఁగా. శంబరుండు = శంబరాసురుఁడు. నిర్దయుండై = దయమాలినవాఁడై. దొంగిలి = దొంగిలించి. తల్లిఁదొంగంజేసి = తల్లినియెడఁబాసి. కొనివచ్చి = తీసికొనివచ్చి. (నిన్ను) నీరధిలోన్ = సముద్రములో. వైచినన్ = వేయఁగా. ఒక్కమీనంబుమ్రింగెన్ = ఒకచేఁపమ్రింగెను. మీనోదరంబువెడలితీవు = చేఁపకడుపునుండి బయటవచ్చితివి. మీఁదటి కార్యంబు = ఇఁకమీఁదచేయవలసినపనిని. ఆకర్ణింపుము = వినుము.

తా॥ అనఁగా రతీదేవివానినిఁజూచిఓచిన్నవాఁడా! నీవుశ్రీమహావిష్ణుని కొమారుఁడవైన మన్మథుఁడవు, నేను మునుపు నీకుభార్యను, నీవు పసిబిడ్డవై యుండఁగా క్రూరుఁడైన శంబరాసురుఁడు నిన్ను మీతల్లిని యెడఁబాపి మొగతనముగా తీసికొనివచ్చి సముద్రములో పడవేసినాఁడు, అంతట ఒకచేప నిన్నుమ్రింగెను, ఆచేఁప కడుపునుండి బయటవచ్చి నాచేత పెంపఁబడితివి అని వాని పూర్వవృత్తాంతమంతయు తెలియఁబఱిచి యిఁక చేయవలసినపనిని చెప్పెదను వినుమని రతీదేవి చెప్ప నారంభించెనని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ నీవు=నాయెదుట కనఁబడుచున్న నీవు. నారాయణనందనుండవు—నారాయణ=పరబ్రహ్మమునకు. నందనుండవు=నందత్యానందయతీతినందనః॥ అను వ్యుత్పత్తిచేత ఆనందమును గలిగించువాఁడవు. (అయిన) కందర్పుండవు=ఆనందరూపప్రత్యగాత్మవు — (ఆత్మావైపుత్రనామాసీత్తను) శ్రుతిచేత, ప్రత్యగాత్మరూపముననుండునది పరమాత్మయేగనుక నీవు పరమాత్మవేఅనుట. కం అనఁగా, ఆనందము ఆయానందముచేత అతిశయించువాఁడు కందర్పుఁడనుట. శ్రు ॥ ఆనందోబ్రహ్మేతి వ్యజానాత్ ॥ యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతిభావయేత్॥ అనుశ్రుతిచేత బింబప్రతిబింబ భావముతో తనయెదుట కనఁబడునది తానేగనుక తనయెదుటనున్నవానిని నీవు పరబ్రహ్మమని పలుకవలసినదిగనుక రతీదేవి తనయెదుటనున్న ప్రద్యుమ్నుని నీవుపరబ్రహ్మమనిచెప్పెననుట. పూర్వకాలంబునన్=ప్రపంచసృష్టిలేనికాలమందుసహితము. నీభార్యనైన రతిని=నీచేత భరింపఁబడు చిచ్ఛక్తిని.

౧౪.—క॥ మాయావి వీఁడు దుర్మతి । మాయఁడు సంగరములంద * మర్త్యుల గెలుచున్
మాయికు రణమున వీనిని । మాయింపుము మోహనాది * మాయల చేతన్.

టీ॥ వీఁడు=ఈశంబరాసురుఁడు. మాయావి = మాయలుగలవాఁడు. దుర్మతి=చెడ్డబుద్ధిగలవాఁడు. సంగరములందున్=యుద్ధములందు. అమర్త్యులన్ = దేవతలను. గెలుచున్ = జయించును. మాయఁడు = ఆదేవతలచేతచావఁడు. మాయికున్ = మాయావియైన. వీనిన్=ఈశంబరుని. రణమునన్=యుద్ధమునందు మోహనాదిమాయలచేతన్ = మోహనము మొదలుగాఁగలమాయలచేత. మాయింపుము=చంపుము.

తా॥ ఈశంబరాసురుఁడు బహుమాయలుగలవాఁడుగనుక తన చెడ్డబుద్ధిచేత మాయలుపన్ని దేవతలను గెలుచుచుండును గాని వారిచేత చావఁడు కనుక నీవు మాయలుగలవాఁడైన వీనిని మోహనము మొదలగు మాయలచేత యుద్ధములో చంపుము అని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ వీఁడు=ద్వైతవృత్తిరూపుఁడైన యీ జీవోహంకారుఁడు. మాయావి=అనేకవిధములైనసువృత్తిదుర్వృత్తిరూపములతోనుండువాఁడు. సంగరములందున్=బ్రహ్మవిచారణలయందు. అమర్త్యులన్=బ్రహ్మవిద్వరిష్ఠులనైనను. మాయఁడు=ఎంతటినిర్వికల్పనిష్ఠలచేతను నశింపఁడు. మోహనాదిమాయలచేతన్ = అజ్ఞానబుద్ధికి భ్రమను పుట్టించు షడ్విధసమాధిభేదములచేత. మాయింపుము = నశింపఁజేయుము. షడ్విధ సమాధులవివరణము కైవల్యనవనీతపు ఇరువది మూడవ పద్యమునఁ జూడుఁడు.

౧౫.—మత్తకోకిల॥ పాప కర్ముఁడు వీఁడు నిన్నిటు * పట్టి తెచ్చిన లేచి నా
పాపఁ డెక్కడఁ బోయెనో సుతుఁ * బాపితే విధియంచుఁ దాఁ
గ్రేపుఁ బాసిన గోవు భంగిని * ఖిన్నయై పడి గాఢ సం
తాపయై నిను మోఁచి కాంచిన * తల్లి కుయ్యిడ కుండునే.

టీ॥ పాపకర్ముఁడు = పాపపుపనులు చేయువాఁడైన. వీఁడు= ఈశంబరుఁడు. (నిన్ను) ఇటుపట్టితెచ్చినన్ = ఈవిధముగా పట్టితేఁగా. లేచి = నిద్రలేచి. నాపాపఁడు = నాబిడ్డ. (ఎక్కడఁబోయెనో) సుతున్=కొడుకును. పాపితే విధి=దైవమా ఎడఁబాపితివా. అంచున్=అని. నినున్=నిన్ను. మోఁచికాంచినతల్లి=కడుపునమోసి కన్నతల్లి. తాన్=తాను. క్రేపుఁబాసినగోవుభంగిన్=దూడనెడఁబాసిన ఆవువలె. ఖిన్నయై = దుఃఖితయై. పడి=క్రిందపడి. గాఢసంతాపయై=అధికమయినసంతాపముగలదై. కుయ్యిడకుండునే=మొఱపెట్టకుండునా.

తా॥ ఓప్రియ[redacted]! పాపియైన యీశంబరుఁడు మీతల్లికి తెలియకుండ నిన్ను తెచ్చినపిమ్మట మేలుకొని నిన్ను పదినెలలుమోచి కన్నదయిన మీతల్లి దైవమా ! నాబిడ్డను ఎడఁబాపితివా ? ఆబిడ్డ యెక్కడ పోయెనోనే అని దూడఁబాసిన ఆవువలె మిక్కిలి సంతాపముగలదై మొఱపెట్టకుండ ఉండునా కాఁబట్టి నీవు ఆపగదీఱ వానిని చంపుమని తాత్పర్యము.

౧౬.—వ॥ అని పలికి మాయావతి మహానుభావుండైన ప్రద్యుమ్నునికి సర్వశత్రు మాయా వినాశినియగు మహా మాయావిద్య నుపదేశించె నివ్విధంబున.

టీ॥ అనిపలికి = అనిచెప్పి. (మాయావతి) మహానుభావుండైన ప్రద్యుమ్నునికిన్=గొప్పమహిమగలవాఁడైన ప్రద్యుమ్నునికి. సర్వశత్రుమాయావినాశిని=ఎల్ల పగవారిమాయలను నశింపఁజేయునది. అగుమహామాయావిద్యన్=అగునట్టిమహామాయయనువిద్యను.(ఉపదేశించెను) ఇవ్విధంబునన్=ఈరీతిగా.

తా॥ అని చెప్పి మాయావతి మహామహిమగలవాఁడైన ప్రద్యుమ్నునికి ఎల్లశత్రువుల మాయలను అణఁచునట్టిదైన మహామాయఅను విద్యను ఉపదేశించెను ఈవిధముగామాయనుపొందినవాఁడైలనితా.

### విశేషార్థము.

టీ॥ సర్వశత్రుమాయావినాశిని=రాగద్వేష కామక్రోధ లోభ మదమత్సర అజ్ఞాన సందేహావిపరీతసలయవిక్షేపకషాయ రసాస్వాదాదిదుర్గుణవృత్తులనెడుశత్రువులనందఱిని నశింపఁజేయునది.(అగు) మహామాయావిద్యన్ = బ్రహ్మైవాహమస్మి అను దృఢాపరోక్ష జ్ఞానమును—అనఁగా, బ్రహ్మవిద్యను.

### (*) ప్రద్యుమ్నుఁడు శంబరుని వధించుట. (*)




౧౭.—మ॥ గురు మాయారణ వేదియై కవచియై * కోదండియై బాణియై
హరిజుం డోరి నిశాట వైచితివి నా * డంభోనిధి న్నన్ను ఘో
ర రణాంభోనిధి వైతు నిన్ను నిదె వే * రమ్మంచుఁ జీరెన్మనో
హర దివ్యాంబరు నుల్లసద్దనుజ సే * నాడంబరున్ శంబరున్.

టీ॥ హరిజుండు=ప్రద్యుమ్నుఁడు. గురుమాయారణవేదియై = అధికమయిన మాయాయుద్ధము నెఱిఁగినవాఁడై. కవచియై = కవచముతొడిగినవాఁడై. కోదండియై = ధనుస్సుగలవాఁడై. బాణియై=బాణములు గలవాఁడై. ఓరినిశాట=ఓరిరాక్షసుఁడా. నాడు=ఆదినము. (నన్ను) అంభోనిధిన్=సముద్రమునందు. వైచితివి=వేసితివి. ఇదె=ఇదిగోయిప్పుడు.(నిన్ను) ఘోరరణాంభోనిధిన్=భయంకరమయిన యుద్ధమునందు. వైతున్ = వేసెదను—చంపెదననుట. వే=శీఘ్రముగా. రమ్మంచున్=రమ్మని. మనోహర దివ్యాంబరున్=మనోజ్ఞములును దివ్యములునైన వస్త్రములు గలవాఁడును. ఉల్లసద్దనుజ సేనాడంబరున్ = ఉత్సాహ పడుచున్నరాక్షస సేనల యొక్క యాడంబరము కలవాఁడునైన. శంబరున్ = శంబరాసురుని. చీరెన్=పిలిచెను.

తా॥ శ్రీకృష్ణునికొడుకైనప్రద్యుమ్నుఁడుగొప్పమాయాయుద్ధము నెఱిఁగిన వాఁడును, కవచమును విల్లును అమ్ములును ధరించిన వాఁడునునై ఓరిరాక్షసుఁడా! నాడునన్నుసముద్రములోఁ బడవేసితివికదా ఇప్పుడు నిన్ను నేను భయంకరమైన యుద్ధసముద్రములోఁ ద్రోసెదను వేగరమ్మురమ్ము అని మనోహరములును దివ్యములునైన వస్త్రములు ధరించినవాఁడును, ఉత్సాహపరులైయున్న రాక్షససైనికులయాడంబరము కలవాఁడునైన శంబరాసురుని పిలిచెనని తా.

### విశేషార్థము.

టీ॥ హరిజుండు=పరబ్రహ్మమైన తనయందేపుట్టి ద్వైతవృత్తిని హరించునట్టిఅఖండాకారవృత్తి—అనఁగాఆరూఢబ్రహ్మనేత్త. గురుమాయా రణవేదియై—గురు = అజ్ఞానుల బుద్ధిలో గొప్పదియైన. మాయా=జీవుఁడువేఱు దేవుఁడువేఱు తానువేఱు అనుభేదవృత్తిని గలిగించునదియైనప్రకృతి. రణ = కాలత్రయమందులేనిదే ఉన్నట్టు గనఁబడుచున్నదని శ్రుతి యుక్తి అనుభవములనుజూపి వాదించుటకు. వేదియై=తెలిసినవాఁడై.కవచియై=బ్రహ్మజ్ఞానమనెడుకవచమును ధరించినవాఁడై. కోదండియై = ప్రణవమనెడు విల్లుధరించినవాఁడై. బాణియై = శుద్ధజీవుఁడనెడు బాణమును దాల్చినవాఁడై. నిశాట = రాత్రివంటిదైన అజ్ఞానమునఁదిరుగువాఁడా — అజ్ఞానీ అనుట. నన్ను = అపరోక్షజ్ఞానమయిననన్ను. అంభోనిధిన్ = సంసారసముద్రమునందు. రణాంభోనిధిన్ = సముద్రమువలెమితిలేనినిత్యానిత్యవస్తు విచారణయందు. వైతును = త్రోతును—త్రోసితినేనినీవునిర్మూలమగుదువనుట. దనుజసేన = రాగద్వేషాదులనెడు రాక్షససేనలు.శంబరున్=మోక్షసుఖమునుచెఱచుజీవాహంకారుని.

౧౮.—చ॥ అదలిచి యిట్లు కృష్ణసుతుఁ * డాడిన నిష్ఠుర భాషణంబులన్
బదహతమై వడింగవయు * సన్నగ రాజముఁబోలె శంబరుం
డదురుచు లేచివచ్చి గద * నచ్యుతనందను వ్రేసె నుజ్జ్వల
ద్భిదుర కఠోర ఘోషసమ * భీషణనాదముచేసి యార్చుచున్.

టీ॥ అదలిచి = అదలించి. (ఇట్లు) కృష్ణసుతుఁడు = కృష్ణుని కొమారుఁడైనప్రద్యుమ్నుఁడు. ఆడిననిష్ఠురభాషణంబులన్ = చెప్పిన కఠోరపుమాటలచేత. పదహతమై = కాలితోఁదన్నఁబడినదై. వడిన్ = వేగముతో. కవయుపన్నగరాజమున్ = ఆక్రమించునట్టిసర్పశ్రేష్ఠమును. పోలెన్ = వలెను. శంబరుండు = శంబరాసురుఁడు. అదరుచున్ = తత్తఱిల్లుచు. (లేచివచ్చి) ఉజ్జ్వల...చేసి—ఉజ్జ్వలత్ = వెలుఁగుచున్న. భిదుర = వజ్రాయుధమువలె. కఠోర = కఠినమైన—భయంకరమైన. ఘోష = ధ్వనితోడ. సమ = సమానమయిన. భీషణ = భయంకరమయిన. నాదముచేసి = ధ్వనికలుగఁజేసి. ఆర్చుచున్ = సింహనాదమునుచేయుచు. గదన్ = గదతో. అచ్యుతనందనున్ = కృష్ణునికొడుకైనప్రద్యుమ్నుని. [illegible]సెన్ = కొట్టెన

తా॥ ప్రద్యుమ్నుఁడు అట్లు అదలించి యుద్ధమునకు రమ్మనిపిలువఁగా కాలితోఁతన్నఁబడినపామువలెనే శంబరాసురుఁడు మిట్టిపడి లేచివచ్చి ప్రకాశించుచున్న వజ్రాయుధముయొక్క కఠోరమయి ధ్వనివలెనే ధ్వనిగలుగ సింహనాదముచేసి గదతో ప్రద్యుమ్నుని గొట్టెననితాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ అచ్యుతనందనున్ = నాశనరహితమైన బ్రహ్మవేత్తయందు గలిగినప్రజ్ఞానవృత్తిని. లేచి = విజృంభించి. గదన్ = అజ్ఞానవృత్తితో. వ్రేసెన్ = కమ్మెను.

౧౫.—క॥ దనుజేంద్రుఁడు వ్రేసినగదఁ। దనగదచేఁ బాయనడఁచి ✱ దనుజులు బెదరన్
దనుజాంతకుని కుమారుఁడు। దనుజేశునిమీఁద నార్చి ✱ తనగద వైచెన్.

టీ॥ దనుజాంతకుని కుమారుఁడు = రాక్షస సంహారకుఁడైన కృష్ణునికొడుకు — ప్రద్యుమ్నుఁడు. దనుజేంద్రుఁడు = శంబరాసురుఁడు. వ్రేసినగదన్ = తన్నుకొట్టినగదను. తనగదచేన్ = తనగదచేత. పాయనడఁచి = తొలఁగఁగొట్టి. దనుజులు = రాక్షసులు. బెదరన్ = భయపడునట్టుగా. ఆర్చి = సింహనాదముచేసి. (తనగదను) దనుజేశునిమీఁదన్ = రాక్షసరాజైనశంబరాసురునిమీఁద. వైచెన్ = విసరివేసెను.

తా॥ ప్రద్యుమ్నుఁడు తన్ను శంబరాసురుఁడు కొట్టిన గదను చెదరిపడిపోవునట్టుగా తనగదతోఁగొట్టి రాక్షసులందఱు భయపడునట్టుగా సింహనాదము చేసి తనగదను శంబరాసురునిమీఁద ప్రయోగించెనని తాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ దనుజాంతకునికుమారుఁడు = సలయవిక్షేపకషాయరసాస్వాద కామ క్రోధ లోభాదులనెడు రాక్షసులను నశింపఁజేయువాఁడైన ప్రజ్ఞానరూపపరబ్రహ్మమునందుఁబుట్టినఅపరోక్షజ్ఞానము. దనుజేంద్రుఁడు = సంశయా సంభావన విపరీతభావనాదు లనెడు రాక్షసులకురాజైన అహంకారుఁడు. తనగదచేన్ = ప్రజ్ఞానవృత్తియనెడి గదతో.

వ॥ అంత నారక్కసుండు వెక్కసంబగు రోసంబునఁ దనకుఁదొల్లి మయుండెఱింగించిన దైతేయమాయ నాశ్రయించి మింటికినెగసి పంచబాణునిపై బాణవర్షంబులుగురిసిన నమ్మహారథుండు నొచ్చియు సంచలింపక మత్సరంబున సర్వమాయా వినాశినియయిన సాత్త్వికమాయం బ్రయోగించి దనుజుని బాణవృష్టి వారించె మఱియు వాఁడు భుజగ గుహ్యక పిశాచ మాయలు పన్ని నొప్పించిన నన్నియుం దప్పించి.

టీ॥ అంతన్ = అంతట. ఆరక్కసుండు = ఆరాక్షసుఁడు. వెక్కసంబు = అసహ్యము. అగురోసంబునన్ = అగునట్టి కోపముచేత. (తనకు) తొల్లి = పూర్వకాలమునందు. మయుండు = దానవవిశ్వకర్మ. ఎఱింగించిన = తెలియఁజేసిన. దైతేయమాయన్ = రాక్షసమాయను. ఆశ్రయించి = పొంది. మింటికినెగసి = ఆకాశమునకెగసి. పంచబాణునిపైన్ = ప్రద్యుమ్నునిమీఁద. బాణవర్షంబు = బాణములవానను. కురిసినన్ = కురియింపఁగా. ఆమ్మహారథుండు = పదునొకండువేల యోధులతో ఎదిరించి యుద్ధము చేయఁజాలినవాఁడైన యాప్రద్యుమ్నుఁడు. నొచ్చియున్ = బాధనొందియు. సంచలింపక = సోలక. మత్సరంబునన్ = విడువనివిరోధముతో. సర్వమాయావినాశిని = ఎల్లమాయలను నశింపఁజేయునది. అయినసాత్త్వికమాయన్ = అయినట్టిసత్త్వగుణ ప్రధానమయినమాయను. ప్రయోగించి = వినియోగింపఁజేసి—ఆరాక్షసమాయపైవ్యాపింపఁజేసి. దనుజుని = రాక్షసుఁడైనశంబరునియొక్క. బాణవృష్టిన్ = బాణములవానను. వారించెన్ = అణఁచివేసెను. (మఱియును) వాఁడు = శంబరుఁడు. భుజగగుహ్యకపిశాచమాయలు = పాములయు గుహ్యకులయు పిశాచములయు మాయలను. పన్ని = కలుగఁజేసి. నొప్పించినన్ = బాధించినను. అన్నియున్ = ఆమాయలనన్నిటిని. తప్పించి = తొలఁగించి.

మహారథుఁడు = శ్లో॥ ఏకాదశసహస్రాణి యోధయేద్యస్తుధన్వినామ్। శస్త్రశాస్త్రప్రవీణస్తు మహారథఇతిస్మృతః॥ అమితాన్యోధయేద్యస్తు సంప్రోక్తోతిరథస్తుసః। సహస్రై[illegible]నయోయోద్ధా తస్యోనోర్ధరథోమతః॥ తా॥ పదునకొండువేలవిలుకాండ్రతో యుద్ధము చేయు సామర్థ్యముగల శస్త్రశాస్త్రప్రవీణుఁడైనవాఁడు మహారథుఁడనంబడును. అపరిమితరథికులతో యుద్ధముచేయువాఁడుఅతిరథుఁడనఁబడును. ఒకరథికునితో యుద్ధముచేయువాఁడుసమరథుఁడనఁబడును. ఆసమరథునికంటె తక్కువయినవాఁడు అర్ధరథుఁడనఁబడును.

తా॥ అంతట శంబరాసురుఁడు సహింపరానికోపముతో తనకు పూర్వకాలమునందుమయుఁడుఅను పేరుగలదానవవిశ్వకర్మ తెలియఁజేసిన రాక్షసమాయనుఅవలంబించి ఆకాశమునకుఎగసిప్రద్యుమ్నునిమీఁద వానకురిసినట్టు బాణములనుప్రయోగింపఁగా మహారథుఁడైన ప్రద్యుమ్నుఁడు ఆబాణములచేతనొచ్చినవాఁడయ్యును సోలిపోకవిడువనిపట్టుదలతో దేవతాసంబంధమయిన సర్వమాయావినాశినిఅను మహామాయచేత ఆరాక్షసమాయను అణఁచివేసి అంతటితో పోక

వాఁడు పాములయు[redacted]హ్వాకులయు పిశాచములయు మాయలను పన్ని నొప్పింపఁగా ప్రద్యుమ్నుఁడు అన్నిటిని తొలఁగించెనని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ మయుండు=అజ్ఞానమే స్వరూపముగగల ఆభాసవేదాంతి. మింటికిన్ = హృదయాకాశమునందు. ఎగసి = వ్యాపించి. పంచ బాణుని పైన్=ప్రజ్ఞానంబ్రహ్మ అయమాత్మాబ్రహ్మ తత్త్వమసి అహంబ్రహ్మాస్మి సర్వంఖల్విదంబ్రహ్మ అనెడు పంచమహావాక్యములే పంచబాణములుగాఁగల ప్రజ్ఞానమునకు. బాణవర్షంబు = జ్యోతిష్టోమో స్వర్గకామోయజేత గామాలభేత అనునివి మొదలగు కర్మకాండ ప్రబోధకములైన వాక్యములనెడు బాణములను.

౨౧.—క॥ దండధర మూర్తిఁ గైకొని । యొండాడక చక్రిసూనుఁ * డుగ్రతరాసిన్
ఖండించె శంబరునితలఁ । గుండల కోటీర మణులు * కుంభిని రాలన్.

టీ॥ చక్రిసూనుఁడు = కృష్ణునికొడుకు. ఒండాడక=ఏమియు ననక. దండధరమూర్తిన్=యమునియాకృతిని. కైకొని=గ్రహించి. ఉగ్రతరాసిన్=మిక్కిలియుగ్రమయిన ఖడ్గముచేత. కుండలకోటీర మణులు = కుండలములందలివియు కిరీటమునందలివియు నైన రత్నములు. కుంభినిన్=భూమియందు. రాలన్=రాలఁగా. (శంబరుని తలను) ఖండించెన్=నఱికెను.

తా॥ అట్లు ప్రద్యుమ్నుఁడు శంబరుఁడు పన్నిన మాయ లన్ని అణఁచివేసి ఏమియు పలుకక మిక్కిలి భయంకరమైన కత్తి ఒకటి చేతఁబుచ్చుకొని దానితో కిరీటమునందలివియు చెవిపోగులయందలివియునైన మణులు నేలరాలునట్లుగా శంబరాసురునితలనఱికెనని తా.

వి శే షా ర్థ ము.

టీ॥ చక్రిసూనుఁడు=సంసారచక్రమును విలాసముగ చేతఁబట్టి త్రిప్పువాఁడైన బ్రహ్మవేత్తయందుఁబుట్టిన అపరోక్షజ్ఞానము. ఉగ్రతరాసిన్ = మిక్కిలి భయంకరమైన వైరాగ్యమనెడు ఖడ్గముచేత. శంబరునితల=జీవాహంకారుని ద్వైతవృత్తియనెడు తలను.

౨౨.—క॥ చిగురాకడిదపుధారను । జగములఁ బరవశము సేయు * చలపాదికి దో
డ్డగు నుక్కడిదంబునఁ దన । పగతుం దెగ వ్రేయు టెంత * పని చింతింపన్.

టీ॥ చింతింపన్ = విచారింపఁగా. చిగురాకడిదపుధారన్= చిగురాకనెడి కత్తియొక్క వాదరచేత. జగములన్=లోకములను. పరవశము సేయుచలపాదికిన్=చొక్కించునట్టిహరవాదికి. దొడ్డగు నుక్కడిదంబునన్ = పెద్దయినయుక్కుకత్తితో. తనపగతున్ = తనశత్రువును. తెగవ్రేయుట = తెగఁగొట్టుట. ఎంతపని = ఎంత మాత్రపుపని—అలక్ష్యమనుట.

తా॥ విచారింపఁగా చిగురాకును కత్తిగాఁ జేసికొని యెల్లలోకములను కళతప్పిపోవునట్లు చేయువాఁడైన ప్రద్యుమ్నునికి పెద్దయిన యుక్కుకత్తితో తన పగవానిని నఱికివేయుట యొకకష్టమైన పని కాదని తాత్పర్యము.




(*) దేవతలు ప్రద్యుమ్నునిమీఁద పుష్పవర్షము గురియుట. (*)

౨౩.—క॥ తెగడుచు నుండక శంబరుఁ । దెగడుచుఁ బూవింటిజోదు * ధీరగుణంబుల్
పొగడుచుఁ గురిసిరి ముదమున । నెగడుచుఁ గుసుమములమునురు * నిర్జరు లధిపా.

టీ॥ అధిపా=రాజా. నిర్జరులు=దేవతలు. బెగడుచున్=భయపడుచు. ఉండక = ఊరకయుండక. శంబరున్ = శంబరాసురుని. తెగడుచున్=నిందించుచు. పూవింటిజోదు ధీరగుణంబులు=ప్రద్యుమ్ననియొక్కధైర్యముతోడిగుణములను. పొగడుచున్ = శ్లాఘించుచు. ముదమునన్ = సంతోషముతో. నెగడుచున్ = అతిశయించుచు. కుసుమముల ముసరు = పువ్వుల వానను. కురిసిరి= కురియించిరి.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! అప్పుడు దేవతలందఱుభయపడుచు ఒకమూలనాదిఁగి యూరకుండక శంబరాసురుని నిందించుచుప్రద్యుమ్ననిధీరగుణములనుశ్లాఘించుచు సంతోషాతిశయముచేతనిక్కుచు ప్రద్యుమ్ననిమీఁద పువ్వులవాన కురియించిరనితాత్పర్యము.

విశేషార్థము.

టీ॥ నిర్జరులు = ఆరూఢబ్రహ్మవేత్తలు. కుసుమములముసురు= మహావాక్యములనెడు పుష్పములవానను.

(*) రతీదేవి ప్రద్యుమ్న సహితయై ద్వారకాపురికిఁ బోవుట. (*)



వ॥ ఇట్లు శంబరునివధించివిలసిల్లుచున్నయించువిలుకానింగొంచునాకాశచారిణియై యారతీదేవిగగనపథంబువట్టి ద్వారకానగరోపరి భాగంబునకుంజనుదెంచిన.

టీ॥ ఇట్లు = ఈవిధముగా. శంబరునివధించి = శంబరాసురునిఁజంపి. విలసిల్లుచున్నయించువిలుకానిన్ = ప్రకాశించుచున్నమన్మథునిని కొంచున్=పిలుచుకొని. (ఆరతీదేవి) ఆకాశచారిణియై = ఆకాశమునందునడచునదియై. గగనపథంబువట్టి=ఆకాశమార్గమును అవలంబించి. ద్వారకా నగరోపరిభాగంబునన్ = ద్వారకాపట్టణమునకు మీఁదితట్టు. చనుదెంచినన్=రాఁగా.

తా॥ ఈప్రకారము శంబరాసురుని చంపి సంతోషించుచున్నప్రద్యుమ్నుని పిలుచుకొని రతీదేవి ఆకాశమార్గమున ద్వారకాపట్టణము మీఁదితట్టునకు రాఁగానని తాత్పర్యము.

ఆ॥ మెఱుఁగుఁదీఁగెతోడి * మేఘంబుకైవడి । యువిదతోడ మింట * నుండికదలి
యరుగుదెంచెమదనుఁ*డంగనాజనములు । మెలఁగుచున్నలోని*మేడకడకు.

టీ॥ మెఱుఁగుఁ దీఁగెతోడి మేఘంబుకైవడిన్ = తీఁగెమెఱపుతోఁగూడుకొన్ననల్లమబ్బువలెనే. ఉవిదతోడన్ = భార్యయైన రతీదేవితోఁగూడ. మింటనుండి = ఆకాశమునందుండి. కదలి = బయలుదేఱి. మదనుఁడు=మన్మథుఁడు. అంగనాజనములు=రుక్మిణీదేవిమొదలగుస్త్రీలు. మెలఁగుచున్న లోనిమేడకడకున్=విహరించుచున్న యంతఃపురపు మేడవద్దకు. అరుగుదెంచెన్ = వచ్చెను.

తా॥ ఆవిధముగా రతీదేవితోఁ గూడుకొన్నవాఁడై తీఁగెమెఱపుతోడి నల్లమబ్బువలెనే ప్రకాశించుచు ప్రద్యుమ్నుఁడు రుక్మిణీదేవి మొదలైన స్త్రీలు విహరించునట్టి అంతఃపురపు మేడ యొద్దకు వచ్చెనని తాత్పర్యము.

౨౬.——మ॥ జలదశ్యాముఁ బ్రలంబ బాహుయుగళుం * జంద్రాననున్ నీలసం
కుల వక్రాలకుఁ బీతవాసు ఘనవ * క్షుస్ సింహ మధ్యున్ మహో
త్పల పత్రేక్షుణు మందహాస లలితుం * బంచాయుధున్ నీరజా
క్షులు దారేమఱిపాటఁజూచి హరియం * చున్ డాఁగి రయ్యై యెడన్.

టీ॥ జలదశ్యామున్ = మేఘమువంటినీలవర్ణముగలవాఁడును. ప్రలంబబాహుయుగళున్ = మిక్కిలిప్రేలుచున్నభుజములజంటగలవాఁడును. చంద్రాననున్ = చంద్రునివంటి ముఖముగలవాఁడును. నీలసంకులవక్రాలకున్ = నల్లనివైవంకరలై చలించుచున్న ముంగురులుగలవాఁడును. పీతవాసున్=పచ్చనివస్త్రముగలవాఁడును. ఘనవక్షున్=పెద్దఱొమ్ముగలవాఁడును. సింహమధ్యున్ = సింహమునడుమువంటినడుము గలవాఁడును. మహోత్పల పత్రేక్షణున్ = తామరతేకులవంటి కన్నులుగలవాఁడును. మందహాసలలితున్ = చిఱునవ్వుచేత మనోహరుఁడైన వాఁడునునైన.. పంచాయుధున్ = ప్రద్యుమ్నుని. నీరజాక్షులు=ఆఁడువారు. తారు = తాము. ఏమఱిపాటఁజూచి = పరాకుచేతచూచి. హరియంచున్ = కృష్ణుఁడే యని. అయ్యైయెడన్=ఆయాప్రదేశములయందు—ఎవరున్నతావునవారు అనుట. డాఁగిరి=దాఁగిరి.

తా॥ నీలమేఘవర్ణము గలవాఁడును, నిడుపాటిబాహువులుగలవాఁడును, చంద్రునివలె కళలు దేఱుచున్న ముఖముగలవాఁడును, నల్లనివై వంకరగలిగి చలించునవియునైన ముంగురులెంద్రుకలుగలవాఁడును, పీతాంబరముగలఁవాఁడును, పెద్ద ఱొమ్ముగలవాఁడును, సింహమునడుమువలె సన్నని నడుము గలవాఁడును, తామరతేకులవలె పెద్దపెద్ద కన్నులుగలవాఁడును, చిఱునవ్వుచేత మనోహరుఁడైనవాఁడునునైనప్రద్యుమ్ననిఁజూచి ఆయంతఃపురస్త్రీలుఅందఱును శ్రీకృష్ణమూర్తియని భ్రమసి తమతమ ఉనికిపట్లలో దాఁగినవారైరని తాత్పర్యము.






అంతర్గపుర స్త్రీలు.




ప్రద్యుమ్నుఁడు.

(*) అంతర్గిపుర స్త్రీలు ప్రద్యుమ్నునిఁజూచి కృష్ణుఁడనిభ్రమసి ఒకరితోనొకరు పలుకుట. (*)

౨౭.—క॥ కొందఱు హరియగు నందురు । కొందఱు చిహ్నములు కొన్ని * కొన్ని హరికి వే
అందురు మెల్లనఁ దెలియుద । మందురు మరుఁజూచి కొంద * ఱబలలు గుములై.

టీ॥ అబలలు=స్త్రీలు. గుములై=గుంపులు గూడుకొన్నవారై. మరున్=మన్మథుని. (చూచి) కొందఱు = కొంతమంది. హరియగు నందురు=కృష్ణుఁడేయందురు. కొందఱు=కొంతమంది. చిహ్నములు కొన్నికొన్ని = కొన్నికొన్ని గుఱుతులు. హరికివేఱందురు=కృష్ణునికి వీనికిభేదముగానున్నవిఅందురు. కొందఱు=కొంతమంది. మెల్లనన్= తిన్నగా. తెలియుదము=తెలిసికొందము. (అందురు)

తా॥ ఆయంతర్గపుర స్త్రీలందఱుగుంపులుగూడుకొని ప్రద్యుమ్నుని జూచినవారై కొందఱు ఇతఁడు శ్రీకృష్ణుఁడుగానే యుండవలెనను వారును, కొందఱు కృష్ణునికిని వీనికిని కొన్ని కొన్ని గుఱుతులచేత భేదముతోఁచుచున్నదని చెప్పువారును, మఱికొందఱు నిదానించి చూచి తెలిసికొందము అనువారునై యుండిరని తాత్పర్యము.

౨౮.—క॥ హరియని వెనుచని పిదపన్ । హరిఁబోలెడు వాఁడుగాని * హరిగాఁడనుచున్
హరిమధ్య లల్ల నల్లన । హరినందనుఁ డాయవచ్చి * రాశ్చర్యముగన్.

టీ॥ హరిమధ్యలు = సింహమునడుమువలెసన్ననినడుములుగల యాస్త్రీలు. హరియని = ఈవచ్చినవాఁడు కృష్ణుఁడుఅని. వెనుచని=వెనుకకుపోయి. పిదపన్ = పిమ్మట. హరిఁబోలెడువాఁడుగాని = కృష్ణునివంటివాఁడుగాని. హరి = కృష్ణుఁడు. కాఁడనుచున్ = కాఁడుఅని. అల్లనల్లనన్ = మెల్లమెల్లఁగా. హరి నందనున్ = కృష్ణునికొడుకైనప్రద్యుమ్నుని. ఆశ్చర్యముగన్ = వింతగా. డాయవచ్చిరి=చేరవచ్చిరి.

తా॥అంతర్గపుర స్త్రీలుఅందఱునుముందుకృష్ణుఁడనియెంచివెనుకకు ఒదిఁగినవారై పిమ్మట కృష్ణునివంటివాఁడేకాని కృష్ణుఁడుకాఁడని తెలిసి వింతగా ఆప్రద్యుమ్నునిదగ్గఱకు వచ్చిరని తాత్పర్యము.

(*) రుక్మిణీదేవి ప్రద్యుమ్నునిఁజూచి తనచెలికత్తెతో సంభాషించుట. (*)

ఉ॥అన్నులు సేరవచ్చి మరు * నందఱుఁ జూడఁగఁదానువచ్చిసం
పన్న గుణాభిరామ హరి * పట్టపు దేవి విదర్భ పుత్త్రి క్రేఁ
గన్నుల నాకుమారకుని * కైవడి నేర్పడఁ జూచి బోటితోఁ
జన్నులు చేఁపనిట్లనియె * సంభ్రమ దైన్యములుల్లసిల్లఁగన్.




ప్రద్యుమ్నుఁడు.

టీ॥ అన్నులు=స్త్రీలు. అందఱున్=ఎల్లవారును. చేరవచ్చి = దగ్గఱవచ్చి. మరున్=మన్మథుని. చూడఁగన్=చూచుచుండఁగా. సంపన్నగుణాభిరామ = మంచిగుణములచేత ఒప్పునట్టిదైన. హరి పట్టపుదేవి = కృష్ణునిపట్టపుదేవియైన. విదర్భపుత్త్రి = రుక్మిణీదేవి. (తానువచ్చి) క్రేఁగన్నులన్ = కడగన్నులచేత. ఆకుమారకుని కైవడిన్=ఆచిన్నవానివిధమును. ఏర్పడన్=విశదముగా. (చూచి) చన్నులుచేఁపన్ = స్తనములయందు పాలుచేఁపుచుండఁగా. సంభ్రమ దైన్యములు=త్రొట్రుపాటును దీనత్వమును. ఉల్లసిల్లఁగన్=వ్యక్తముకా శింపఁగా. బోటితోన్=తనచెలికత్తెతో. ఇట్లనియెన్=ఇట్లుపలికెను

తా॥ ఇట్లు ఆఁడువారందఱువచ్చి మన్మథునిఁ జూచుచుండఁగా ఎల్లసద్గుణములచేతను ఒప్పునట్టిదియు శ్రీకృష్ణుని పట్టపుదేవియునైన

రుక్మిణీదేవి తానును అతనిఁ జేరవచ్చి కడగంటిచూపులచేత ఆచిన్న వాని యునికిని విశదముగా చూచి స్తనములయందు పాలుఉబ్బఁగా తడఁబాటును దీనత్వమును కన్పఁబడ తన చెలికత్తెతో నిట్లు చె నారంభించెనని తాత్పర్యము.

౩౦.—శా॥ ఈకంజేక్షణుఁ డీకుమారతిలకుం * డీయిందుబింబాననుం
డీకంఠీరవమధ్యుఁ డిచ్చటికి నే * డెందుండి యేతెంచెనో
యీకల్యాణునిఁ గన్న భాగ్యవతి ము * న్నేనోముల నోఁచెనో
యేకాంతామణియందు వీఁగి కనెనో * యేకాంతుఁ డీకాంతునిన్.

టీ॥ ఈకంజేక్షణుఁడు = ఈకమలములవంటి కన్నులుగలవాఁడును. ఈయిందుబింబాననుండు = ఈ చంద్రబింబమువంటి ముఖముగలవాఁడును. ఈకంఠీరవమధ్యుఁడు=ఈసింహమునడుము వంటి సన్ననినడుముగలవాఁడునునైన. ఈకుమారతిలకుండు=ఈ కుమారులలో శ్రేష్ఠుఁడు. ఇచ్చటికిన్ = ఈచోటికి. నేఁడు=ఈది నము. ఎందుండియేతెంచెనో = ఎక్కడనుండివచ్చెనో. ఈకల్యాణునిన్=శుభలక్షణము లన్నియునుగల ఈసుందరుని. కన్న=కనిన. భాగ్యవతి=అదృష్టవంతురాలు. మున్ను = మునుపు—పూర్వజన్మము నందు. ఏనోములనోఁచెనో = ఏవ్రతములను ఆచరించెనో. ఏకాంతుఁడు=ఏపురుషుఁడు. ఈకాంతునిన్=ఈయందగానిని. వీఁగి= అతిశయించి. ఏకాంతామణియందున్ = ఏయుత్తమస్త్రీయందు కనెనో=ప్రసవించెనో.

తా॥ తామరలవంటి కన్నులుగలవాఁడును, కుమారులలో ప్రశ్రేష్ఠుఁడును, చంద్రబింబమును బోలిన ముఖము గలవాఁడును సింహమునడుమువలె సన్నని నడుముగలవాఁడునునైన యీచిన్న వాఁడు ఎక్కడినుండి యిచ్చటికి ఇప్పుడువచ్చినాఁడో ఈచక్కఁదనాలబిడ్డను గన్న తల్లి యే పుణ్యాత్మురాలో ఏమహాపురుషుఁడు ఏయుత్తమస్త్రీవలన నీముద్దులకుమారునిఁ గనెనో అనిరుక్మిణి తనలో తాను అనుకొనెనని తాత్పర్యము.

౩౧.—శా॥ ఆళీ నాతొలిచూలు బిడ్డనికి బో * ర్కాడించి నే సూతికా
శాలా మధ్య విశాల తల్పగతనై * చన్నిచ్చి నిద్రింప నా
బాలు న్నాచనుఁబాలకుం జెఱిచి యే * పాపాత్ము లేత్రోవ ము
న్నేలీలం గొనిపోయిరో శిశువుఁ దా * నేతల్లి రక్షించెనో.

టీ॥ ఆళీ=ఓసఖీ. (నేను)నాతొలిచూలుబిడ్డనికిన్=నాకు మొట్ట మొదట పుట్టిన కొడుకునకు. బోర్కాడించి = జలకములాడించి. సూతికా...తల్పగతనై — సూతికాశాలా = పురిటింటియొక్క. మధ్య=నడుమనున్నటెడు. విశాల=విరివియైన.తల్పగతనై=పఱుపును పొందినదాననై. చన్నిచ్చి=చనుగుడిపి. నిద్రింపన్ = నిద్రపోవు చుండఁగా. ఆబాలున్=ఆబిడ్డను.నాచనుఁబాలకున్=నా స్తన్యము వలన. చెఱిచి = చెడఁగొట్టి. ఏపాపాత్ములు= ఏపాపచిత్తులు. ఏత్రోవన్=ఏమార్గమున. ఏలీలన్=ఏవిధముగా.మున్ను=మునుపు. కొనిపోయిరో = తీసికొనిపోయిరో. శిశువున్=ఆబిడ్డను. (ఏతల్లి తాను రక్షించెనో)

తా॥ ఓసఖీ! నేను తొలుతఁగన్నబిడ్డను జలకములాడించి పురిటింటిలో పాన్పుమీఁద పండఁబెట్టుకొని చన్నిచ్చుచు నిద్రపోఁగా ఆబిడ్డను నాచనుఁబాలకుదూరముచేసి యెవరో పాపాత్ములు ఏవిధముగానో ఎత్తుకొని యేతట్టోపోయిరి ఆబిడ్డను ఏతల్లి యెక్కడ పెంచెనో తెలియదు అని అనెనని తాత్పర్యము.

౩౨.—క॥ కొడుకఁడు నాపాదిఁగిటిలోఁ । జెడిపోయిన నాటనుండి * చెలియా తెలియం
బడ దేవార్తయు నతఁడే । వడువున నెచ్చోట నిలిచి * వర్తించె నొకో.

టీ॥ కొడుకఁడు= కొడుకు. నాపాదిఁగిటిలోన్ = నాసందిటిలోనుండి. చెడిపోయిననాటనుండి=వదలిపోయిననాడు మొదలుకొని. చెలియా = ఓసఖీ. ఏవార్తయున్ = వానిసంబంధమయిన వృత్తాంతము ఏదియును. తెలియంబడదు=తెలియరాదు. అతఁడు= ఆబిడ్డఁడు. ఏవడువునన్=ఏవిధముగా. ఎచ్చోటన్=ఏప్రదేశము నందు. (నిలిచి) వర్తించెనొకో=ఉన్నాఁడో.

తా॥ ఓచెలీ! నాకొడుకు నాసందిటనుండి తప్పిపోయినది మొదలు నేటిదాఁకనాఁడు ఎక్కడ నివసించియున్నాఁడో ఏమయినాఁడో వానివృత్తాంతము ఏమియు తెలియరాదయ్యెనని తాత్పర్యము.

౩౩.—క॥ ఇందాఁక వాఁడు బ్రతికిన । సందేహము లేదు దేహ * చాతుర్య వయ
స్సౌందర్యంబుల లోకులు । వందింపఁగ నితనియంత * వాఁడగుఁ జుమ్మీ.

టీ॥ వాఁడు=ఆబిడ్డఁడు. ఇందాఁకన్=ఇన్నాళ్లదాఁక. బ్రతికినన్=జీవించియున్నను. దేహ...బులన్—దేహ=శరీరముచేతను. చాతుర్య=నేర్పుచేతను. వయః = ప్రాయముచేతను. సౌందర్యంబులన్=చక్కఁదనముచేతను. లోకులు=ప్రజలు. వందింపఁగన్ = కొనియాడఁగా. ఇతనియంతవాఁడు అగును సందేహము లేదు = ఇతనియంతవాఁడు అగుటకు అనుమానము లేదు. చుమ్మీ=సుమా.

తా॥ ఓచెలీ! ఆచిన్నవాఁడు ఇన్నాళ్లదాఁక బ్రతికియున్న పక్షమున వీని దేహమంత దేహమును వీని నేర్పువంటి నేర్పును వీనివయసంతే వయసును, వీని చక్కఁదనమువంటి చక్కఁదనమును గలవాఁడై యుండును గాని అందులకు సందేహము లేదని తాత్పర్యము.

౩౪.—మ॥ అతివా సిద్ధము నాటిబాలకునకి * యయ్యాకార మీవర్ణ మీ
గతిహాసంబు విలోకనస్వరము లీ * గాంభీర్య మీకాంతి వీఁ
డతఁడేకాఁదగు నున్నవారలకు నా * యాత్మేశు సారూప్య సం
గతి సిద్ధింపదు వీనియందు మిగులం * గౌతూహలం బయ్యెడిన్.

టీ॥ అతివా=ఓసఖీ. నాటిబాలకునకున్ = అప్పుడు నేనుకన్న బిడ్డనికి. ఇయ్యాకారము = ఈరూపమును. ఈవర్ణము=ఈదేహవర్ణమును. ఈగతిహాసంబున్ = ఇటువంటినవ్వును. విలోకనస్వరములు = చూపునుకంఠస్వరమును. ఈగాంభీర్యము = ఈగొప్పతనమును. ఈకాంతి = ఈలావణ్యమును. సిద్ధము = తప్పకకలిగియుండును. వీఁడు=ఈచిన్నవాఁడు. అతఁడేకాఁదగున్=అతఁడుగానేయుండును. ఉన్నవారలకున్ = తక్కినవారికి. నాయాత్మేశసారూప్యసంగతి = నాప్రియుఁడైనశ్రీకృష్ణమూర్తియొక్క సమానరూపత్వముయొక్కకూడిక. సిద్ధింపదు=కలుగదు. వీనియందున్= ఈచిన్నవానియందు. మిగులన్=మిక్కిలి. కౌతూహలంబు=వేడుక. అయ్యెడిన్ = అగుచున్నది.

తా॥ ఓచెలియా! నాఁడు నేను గన్నబిడ్డఁడే వీఁడుగానుండవలెను, వాఁడు ఇట్టివర్ణమును, ఇటువంటినవ్వును, ఇటువంటి చూపును, ఈలాటికంఠస్వరమును, ఈలాగంటిగంభీరత్వమును, ఇట్టి లావణ్యమును, తప్పకకలిగియుండును, వీఁడు ఆబిడ్డఁడేయనితోఁచుచున్నది, కానిపక్షమున నాప్రియుఁడైనశ్రీకృష్ణమూర్తితోడి సమానరూపత్వము తక్కినవారికి ఎట్లుకలుగును కలుగనేరదు కాఁబట్టి నాకు వీనియందు వేడుకయగుచున్నదని తాత్పర్యము.

౩౫.—క॥ పొదలెడి ముదమునఁ జిత్తము । గదలెడి నాయెడమ మూఁపు * గన్నులవెంటన్
బొదలెడి నానందాశ్రులు । మెదలెడిఁ జాలిండ్లఁ బాలు * మేలయ్యెడినో.

టీ॥ చిత్తము = నామనస్సు. ముదమునన్ = సంతోషముచేత. పొదలెడిన్=అతిశయించుచున్నది. నాయెడమమూఁపు = నాయెడమబుజము. కదలెడిన్=అదురుచున్నది. కన్నులవెంటన్=కన్నులలోనుండి. ఆనందాశ్రులు = సంతోషబాష్పములు. పొదలెడిన్= హెచ్చుచున్నవి. పాలిండ్లన్=స్తనములయందు. (పాలు) మెదలెడిన్= పైకుబుకుచున్నవి. మేలు=శుభము. అయ్యెడినో = కలుగునేమో.

తా॥ ఓచెలియా! నామనసున సంతోషము హెచ్చుచున్నది, ఎడమమూఁపు అదురుచున్నది, కన్నులలో ఆనందబాష్పములు రాలుచున్నవి, స్తనములయందు పాలు ఉబ్బుచున్నవి ఏమయిన మేలు కలుగునేమో యనితాత్పర్యము.

౩౬.—వ॥ అని డోలాయమాన మానసయై వితర్కించుచు.

టీ॥ (అని) డోలాయమాన మానసయై = ఉయ్యేలవలెఁ దూఁగుచున్నమనస్సుగలదై — మనసునఏవిధమయిన ఆలోచనయును తహపడకయనుట. వితర్కించుచున్ = తనలోతాను ఆలోచించుచు.

తా॥ అని యీవిధముగా మనసున విచారము పుట్టుచుండఁగా ఏవిధమయిన ఆలోచనయును స్థిరపడక తనలోతాను ఆలోచించుచును. అని తాత్పర్యము.


వసుదేవుఁడు.


దేవకీదేవి.


కృష్ణుఁడు.


ఉగ్రసేనుఁడు.



(*)నారదుఁడు వసుదేవాదులకు ప్రద్యుమ్నవృత్తాంతముఁ జెప్పుట.(*)

౩౭.—క॥ తనయుఁడని వాడువఁ దలఁచును । దనయుఁడు గాకున్న మిగులఁ * దఱిఁగొనిసవతుల్
తను నగిరొందరని తలఁచున । తనుసంశయ మలముకొనియెఁ * దనుమధ్యమదిన్.

టీ॥ తనయుఁడు = కొడుకు. (అని) నొడువక = చెప్పను. తలఁచుక =ఎంచును. తనయుఁడుగాకున్నక =వాఁడుతనకొడుకు కానిపక్షమున. తతిగొని = గుంపుగూడి(సవతులు)తనుక =తన్ను. మిగులక = మిక్కిలి. నగియెదరు = పరిహాసముచేయుదురు. అని తలఁచుక =అనియెంచును. తనుమధ్యమదిక =రుక్మిణీదేవియొక్క మనస్సునందు. (ఇట్లు) అతనుసంశయము=అధికమైనసందేహము. అలముకొనియెక = ఆవరించెను—సందేహముప్రబలికమ్ముకొనెను.

తా॥ రుక్మిణి తనకొడుకే వీఁడని చెప్పఁదలఁచుచు, వీఁడేతన కొడుకనిచెప్పి కాకపోయినపక్షమున సవతులందఱు గుంపుగూడి తన్ను ఎగతాళిచేయుదురేమోయని సందేహించుచు, ఇట్లు అధిక మయిన సందేహము తన మనసును ఆవరింపఁగా విచారించుచు ఉండెనని తాత్పర్యము.

౩౮.—వ॥ ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ లోపలినగరికావలివారివలనవిని కృష్ణుండు దేవకీవసు
దేవులందోడ్కొని చనుదెంచి సర్వజ్ఞుండయ్యు నేమియు వివరింపక యూరకుండె నంత
నారదుండుచనుదెంచిశంబరుండుకుమారునిం గొనిపోవుట మొదలైనవార్తలెఱింగించిన.

టీ॥ (ఇట్లురుక్మిణీదేవి) విచారించుచుండక = ఆలోచించుచుండఁగా. లోపలినగరికావలివారివలనక =అంతర్గపురపుకావలివారివలన. విని = ఈవృత్తాంతమునువిని. (కృష్ణుండు) దేవకీవసుదేవులక =దేవకిని వసుదేవుని. తోడ్కొనిచనుదెంచి=పిలుచుకొనివచ్చి. సర్వజ్ఞుండయ్యును = అన్నియు తెలిసినవాఁడు అయ్యును. ఏమియుక = ఏసంగతియు. వివరింపక=తెలియఁబఱుపక. (ఊరకుండెను) అంతక =అప్పుడు. (నారదుండు) చనుదెంచి = వచ్చి. (శంబరుండు)కుమారునిక =బిడ్డను. కొనిపోవుట=ఎత్తుకొనిపోవుట. మొదలైనవార్తలు = మొదలుగాఁగల వృత్తాంతములు. ఎఱింగించినక =తెలియఁజేయఁగా.

తా॥ ఈవిధముగారుక్మిణీదేవి ఆలోచించుచుండఁగా అంతర్గపురపు కావలివారివలన ఈవృత్తాంతమును శ్రీకృష్ణమూర్తి విని తన తల్లిదండ్రులైన దేవకిని వసుదేవుని వెంటఁదీసికొని అచ్చటికి వచ్చి తాను సర్వము తెలిసినవాఁడుగా నుండియు ఏమియు తెలియనివానివలె ఊరకుండెను, అంతటనారదుఁడువచ్చి శంబరాసురుఁడుబిడ్డను కొనిపోవుట మొదలుగాఁగలవృత్తాంతములన్ని తెలియఁజేసెననితా.

౩౯.—క॥ చచ్చిన బాలుఁడు క్రమ్మఱ । వచ్చినక్రియ వచ్చె పెక్కు ✻ వర్షములకు నీ
సచ్చరితు నేడు గంటిమి । చెచ్చెర మున్నెట్టితపము ✻ సేయంబడెనో.

టీ॥ (చచ్చినబాలుఁడు) క్రమ్మఱక =మరల. వచ్చినక్రియక =బ్రతికివచ్చినవిధమున. పెక్కువర్షములకుక =అనేకసంవత్సరములకు పిమ్మట. (వచ్చెను) నేడు=ఈదినము. ఈసచ్చరితుక =ఈమంచినడవడిగలచిన్నవానిని. కంటిమి = చూచితిమి. చెచ్చెరక = శీఘ్రముగా—అక్క—అతోననుట. మున్ను = మునుపు. ఎట్టితపముసేయంబడెనో = ఎటువంటి కఠినమైనతపస్సు మనచేత చేయఁబడెనో.

తా॥ పూర్వజన్మమునందు మనము ఏమితపస్సు చేసితిమోగాని యీామంచినడవడిగల చిన్నవానిని అనేక సంవత్సరములు గడచిన పిమ్మట నేటికాలమునకు చచ్చినబిడ్డను మరలఁ జూచినట్టు చూచితిమి అని తాత్పర్యము.








వసుదేవుఁడు. రతీదేవి. మన్మథుఁడు.





ప్రద్యుమ్నుఁడు.

(✻) వసుదేవాదులురతీమన్మథులకుబహుమానమిచ్చుట. (✻)

వ॥ అని యంతర్గపుర కాంతలును దేవకీ వసుదేవ రామకృష్ణులును యథోచిత క్రమంబున నాదంపతులకు దివ్యాంబరా భరణా లంకృతుల సత్కరించి సంతోషించిరి రుక్మిణీదేవి నందనుం గౌగిలించుకొని.

టీ॥ (అని) అంతఃపురకాంతలును=అంతఃపురము నందుండు స్త్రీలును. (దేవకీవసుదేవరామకృష్ణులును) యథోచితక్రమంబునన్=తగినరీతిని. ఆదంపతులకున్=ఆ ఆలుమగలకు — రతీమన్మథులకు. దివ్యాంబరాభరణాలంకృతులన్ = దివ్యములయిన వస్త్రములయు ఆభరణములయు అలంకారములచేత. సత్కరించి=సన్మానముచేసి. (సంతోషించిరిరుక్మిణీదేవి) నందనున్=కొడుకును (కౌఁగిలించుకొని)

తా॥ ఇట్లుఅనుకొనుచు అంతఃపురమునందలిఆఁడువారును దేవకియు వసుదేవుఁడును కృష్ణుఁడును బలరాముఁడును తమకుఁదగినట్టిరీతిని ప్రద్యుమ్నుని వస్త్రములు ఆభరణములు మొదలయినవి యిచ్చి సన్మానించి సంతోషించిరి రుక్మిణీదేవికొడుకునుగౌఁగిలించుకొని మీఁదఁజెప్పఁబోవు రీతిని పలికెనని తాత్పర్యము.

౪౧.—శా॥ అన్నా నాచనుఁబాపి నిన్ను దనుజుం * డంభోనిధిన్ వైచెనే
యెన్నే వర్షము లయ్యెఁ బాసి సుత నీ * వేరీతి జీవించితే
సన్నాహంబున శత్రుఁ గెల్చితివి యా * శ్చర్యంబు సంధిల్లెడిన్
నిన్నుం గాంచితి నింతకాలమునకున్ * నే ధన్యతం జెందితిన్.

టీ॥ అన్నా=ఓరినాయనా. (నిన్ను) దనుజుండు=రాక్షసుఁడు. నాచనుఁబాపి=నా స్తన్యపానమునకుఁదొలఁగించి. అంభోనిధిన్=సముద్రమునందు. వైచెనే = పడవేసెనా. సుత = ఓరికొడుకా. పాసి = నన్నెడఁబాసి. ఎన్నేవర్షములయ్యెన్ = ఎన్నోయేండ్లాయెను — అనేక సంవత్సరములాయెను. (నీవు) ఏరీతిన్ = ఏవిధముగా. జీవించితి=బ్రతికితివి. ఏసన్నాహంబునన్ = ఏపరికరముల కలిమిచేత. శత్రున్=పగవానిని. గెల్చితివి=జయించితివి. ఆశ్చర్యంబు సంధిల్లెడిన్= (ఇదంతయుఁదలఁపఁగా) వింతయగుచున్నది. ఇంత కాలమునకున్ = ఇన్నాళ్లకు. నేన్=నేను. నిన్నుంగాంచితిన్ = నిన్నుఁజూచితిని. ధన్యతన్=కృతార్థత్వమును. చెందితిన్=పొందితిని.

తా॥ ఓరినాయనా! నిన్నా రాక్షసుఁడు నాచనుఁబాలకు ఎడఁబాపి తీసికొనిపోయి సముద్రములోపడవేసెఁగా? నీవునన్నెడఁబాసిపోయిచాలకాలము ఆయెఁగా? నీవుఏవిధముగాబ్రతికినావు? ఎట్టిపరికరములచేత నీపగవానిని జంపినావు? ఇదియంతయువిచారింపఁగా, చాలవింతయగుచున్నది? ఇన్నాళ్లు ఎడఁబాసియున్నను నేడునిన్నుఁ జూచుటవలన నేను కృతార్థురాలనైతినని తాత్పర్యము.

౪౨.—వ॥ అని కొడుకుంజూచి సంతోషించి కోడలిగుణంబులు కైవారంబు చేసి
వినోదించుచుండె నంత ద్వారకానగరంబు ప్రజలు విని హర్షించి రందు.

టీ॥ (అనికొడుకుంజూచిసంతోషించి) కోడలిగుణంబులు=కోడలైనరతీదేవియొక్క మంచిగుణములను. కైవారంబుచేసి=శ్లాఘించి. వినోదించుచుండెన్=వేడుకతో మెలఁగుచుండెను. అంతన్=అనంతరము. ద్వారకానగరంబుప్రజలు=ద్వారకాపట్టణములోనిజనులు. (విని) హర్షించిరి=సంతోషించిరి. అందున్=ఆపురజనములందును.

తా॥ అనిరుక్మిణీదేవికొడుకునుజూచి సంతోషించి కోడలిమంచిగుణములను శ్లాఘించి వేడుకగా కాలముగడుపుచుండెను, పిమ్మట ఆవృత్తాంతము ద్వారకాపట్టణమునందలి జనులందఱువినిచాలసంతోషించిరి ఆపురజనులయందును అని తాత్పర్యము.

౪౩.—క॥ సిరిపెనిమిటి పుత్త్రకుఁడగు । మరుఁగని హరిఁ జూచినట్లు * మాతలు దమలోఁ
గరఁగుదురఁట పరకాంతలు । మరుఁగని మోహాంధకార * మగ్నలు గారే.

టీ॥ మాతలు = ఆప్రద్యుమ్నునితల్లులు — కృష్ణభార్యలుఅనుట. సిరిపెనిమిటిపుత్రకుఁడు = శ్రీలక్ష్మీదేవి పెనిమిటియైన విష్ణుమూర్తి యొక్క కొడుకు. అగుమరున్ = అగునట్టిమన్మథుని. కని=చూచి. హరిన్=కృష్ణుని. చూచినట్లు = చూచినవిధముగా. తమలోన్=తమలోతాము. కరఁగుదురఁట = అనురాగము కలవారు అగుదురఁట. పరకాంతలు = అన్యస్త్రీలు. మరున్ = మన్మథుని. (కని) మోహాంధకార మగ్నలు = మోహమను-చీఁకటియందు మునిఁగినవారు. కారే = కారా — అగుటకు సందేహములేదని భావము.

తా॥ ఆపురమునందలిస్త్రీలలోపలమన్మథునితల్లులయినశ్రీకృష్ణుని భార్యలుసయితము తమపెనిమిటియైన శ్రీకృష్ణమూర్తిని జూచినవారివలెనే అతనికొడుకైనప్రద్యుమునిఁజూచి అనురాగమునొందుదురు. ఇఁకఇతరస్త్రీలు అతనిఁజూచినప్పుడు మోహాతిశయముచేత కన్నుగానని వారుకాకపోదురా అగుదురు అని తాత్పర్యము.

వ॥ అని చెప్పిన శుకుం డిట్లనియె.

౪౪.—క॥ సత్రాజిత్తు నిశాచర । శత్రునకుం గీడుచేసి * సద్వినయముతోఁ
బుత్త్రి శమంతకమణియును । మైత్త్రిం గొని తెచ్చియిచ్చె * మనుజాధీశా.

టీ॥ మనుజాధీశా=రాజా. సత్రాజిత్తు=సత్రాజిత్తుఅనువాఁడు. నిశాచరశత్రునకున్=రాక్షసులకుపగవాఁడైనశ్రీకృష్ణునికి. కీడుచేసి=చెఱుపుచేసి. సద్వినయముతోన్ = మంచివినయముతో. పుత్రిన్=తనకొమార్తను. శమంతకమణియున్ = శమంతకము అనుమణిని. మైత్రిన్=మిత్రత్వముతో. కొనితెచ్చి = తీసికొనివచ్చి. (ఇచ్చెను)

తా॥ ఓరాజా! సత్రాజిత్తుఅనువాఁడు శ్రీకృష్ణునికి అపకారము చేసి ఆయపకారమునకు ప్రతిక్రియగా మిక్కిలివినయమునుమిత్రత్వమును కనఁబడునట్లు శమంతకము అను మణిని తనకూఁతురైనసత్యభామను తెచ్చియిచ్చి క్షమాపణమును చేసికొనియెనని తాత్పర్యము.

వ॥ అనిన విని రాజిట్లనియె.

## విశేషార్థము.

టీ॥ సత్రాజిత్తు–సత్ర = వైశ్వదేవము ప్రతిపదస్థాలీపాకము ఈశానసర్పబలులు త్రిస్రాష్టకలు మాసదర్శశ్రాద్ధపిండ పితృయజ్ఞములు నిత్యోపాసనము కూశ్మాండగణహోమములు అనెడు సప్తపాకయజ్ఞములను, అగ్న్యాధేయము అగ్నిహోత్రము దర్శపూర్ణమాసేష్టులు ఆగ్రయణేష్టి చాతుర్మాస్యలు నిరూఢపశుబంధము సౌత్రామణి అనెడు సప్తహవిర్యాగములను, అనఁగా, అత్యగ్నిష్టోమము ఉక్థ్యము షోడశి ఆప్తోర్యామము పౌండరీకము మొదలయిన యజ్ఞకర్మములను. అజిత్తు = గెలువనివాఁడు – అనఁగా, (జ్యోతిష్టోమే స్వర్గకామోయజేత గామాలభేత) అను శ్రుతులనుపట్టి యజ్ఞకర్మములను విడువకచేసి స్వర్గాదిపుణ్యలోకసుఖములననుభవించి (తేతం భుక్త్వాస్వర్గలోకంవిశాలం క్షీణేపుణ్యే మర్త్యలోకంవిశంతి) అనుగీతాప్రమాణముచేత మరల మనుష్యలోకమునందు (పునరపిజననం పునరపిమరణం పునరపిజననీ జఠరేశయనం) అనుప్రమాణముచేత పుట్టిపుట్టిచచ్చిచచ్చి సంసారసముద్రమునమునుఁగుచుండు కర్మనిష్ఠుఁడు వాఁడేసత్రాజిత్తు. ని॥ సత్రమాచ్ఛాదనేయజ్ఞే సదాదానేవనేపిచ॥ అని అమరము. నిశాచరశత్రునకున్–నిశాచర=శ్లో॥ మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం। మనస్యన్యద్వచస్యన్యత్కార్యమన్యద్దురాత్మనాం॥ అను ప్రమాణముచేత మనసున తలఁచునది, నోట పలుకునది, చేయునది, వేఱువేఱుగ నుండువారు నిశాచరులు – రాక్షసులు. (వారికి) శత్రునకున్=పగవాఁడైన బ్రహ్మవేత్తయనెడు శ్రీకృష్ణపరబ్రహ్మమునకు. లేక, ఆసురీసంపదయైన అసంభావన విపరీతభావన మొదలైన దుర్గుణములను నశింపఁజేసి బ్రహ్మైవాహమను దృఢాపరోక్షజ్ఞానమును గలిగించు కృష్ణమూర్తియనెడుబ్రహ్మవేత్తకు. (బ్రహ్మవేదబ్రహ్మైవభవతి) అనిశ్రుతి. కీడుచేసి=ఈషణత్రయమునందు ఆసక్తిగలిగి దుష్కృత్యములు చేయువాఁడవనిదూషించి (పిమ్మట) సద్వినయముతోన్ = బహుజన్మకృతసుకృతపరిపాకవిశేషముచేత బ్రహ్మవిచారముచేసితత్త్వజ్ఞానముగలిగి మిక్కిలిఅణఁకువతో. శమంతకమణియున్=సూర్యోపాసనఅనెడు వేదాంతశాస్త్రవిచారణచేత లభ్యమైన (పురుషఏవేదగ్ంసర్వం, పురుషాన్నపరంకించిత్, విశ్వమేవేదంపురుషః, ఏకోదేవోబహుధానివిష్టః, హరిరేవజగత్, జగదేవహరిః, విశ్వంవిష్ణుః, బ్రహ్మైవాహమిదం జగచ్చసకలం చిన్మాత్రవిస్తారితం) అను అపరోక్షజ్ఞానమనెడు శమంతకమణిని. పుత్రిన్ = ఆయపరోక్షజ్ఞానముచేత తనయందుఁ గలిగిన ముక్తియనెడు కొమార్తను. మైత్రిన్ = నీవేనేను నేనేనీవు అనునట్టి అభేదబుద్ధితో. (కొనితెచ్చి) ఇచ్చెన్=కృష్ణబ్రహ్మవేత్తకు సమర్పించెను. శమంతకమణి=ని॥శోవల్మీకేశివేకూర్మేభూషేశిష్యేతనూకృతౌ॥ అని నిఘంటువుగనుక. శం=తన్నుతక్కువస్థితికి అనఁగా, అధోగతికి తెచ్చునట్టి అజ్ఞానమును. అంతక = నశింపఁజేయునది–అనఁగా, బ్రహ్మవిద్య. మణి=శ్రేష్ఠము–అనఁగా, శ్లో॥ అన్యవిద్యాపరిజ్ఞానమవశ్యంనశ్వరంభవేత్। బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరంపరం॥ అను ప్రమాణముచేత బ్రహ్మవిద్య అన్నివిద్యలలో శ్రేష్ఠమైనదని భావము.



సత్రాజిత్తు.



(*) సత్రాజిత్తు తపస్సుచేసి సూర్యునివలన శమంతకమణిఁగైకొనుట. (*)

౪౫.—ఆ॥ శౌరికేమితప్పు * చేసె సత్రాజిత్తు । కూఁతు మణియు నేల * కోరియిచ్చె
నతని కెట్లు గలిగె * నాశమంతకమణి । విప్రముఖ్య నాకు * విస్తరింపు.

టీ॥ (సత్రాజిత్తు) శౌరికిన్=శ్రీకృష్ణమూర్తికి. (ఏమితప్పుచేసెను) కూఁతున్ = కొమార్తను. మణియున్ = శమంతకమణిని. కోరి= అపేక్షించి. (ఏలయిచ్చెను) అతనికిన్=సత్రాజిత్తునకు. (ఆశమంతకమణి) ఎట్లుకలిగెన్=ఏవిధముగాఁగలిగెను. విప్రముఖ్య=ఓ బ్రాహ్మణ

శ్రేష్ఠుఁడవయిన శుకమహర్షీ. (నాకు) విస్తరింపు = విశదముగా తెలియఁ జెప్పుము.

తా॥ ఓశుకమహర్షీ! సత్రాజిత్తు కృష్ణునికి ఏమినేరము చేసెను, పిమ్మట ఆనేరమును మానుపుకొనుటకై కూఁతును మణిని ఏలప్రియపడి యిచ్చెను, ఆశమంతకమణి అతనికి ఎట్లుదొరకెను, నాకువిశదముగా తెలియఁజెప్పుమని పరీక్షిన్మహారాజు శుకుని అడిగెనని తా.

విశేషార్థము.

టీ॥ శౌరికిన్ = శ్రీకృష్ణపరబ్రహ్మవేత్తకు. శూరునివంశమునఁ బుట్టినవాఁడు శౌరి గనుక శూరశబ్దమునకు అర్థము ఈస్కంధ పూర్వభాగమందలి ఇరువదియవపద్యపు విశేషార్థమునఁజూడుఁడు. సత్రాజిత్తు=కర్మనిష్ఠుఁడు. కూఁతున్ =ముక్తికాంతను. మణియున్ = ఆపరోక్షజ్ఞానమును. ఆశమంతకమణి = సకలవిద్యలలో శ్రేష్ఠమైన ఆబ్రహ్మవిద్య. విప్రముఖ్యా = బ్రహ్మవిద్వరిష్ఠుఁడా – (ఆత్మానం పరంచపాపేభ్యః పాతీతివిప్రః తేషాంశ్రేష్ఠః విప్రముఖ్యః తస్య సంబుద్ధి విప్రముఖ్య. తా॥తన్నును అన్యునిపాపములనుండిరక్షించువాఁడు విప్రుఁడు – అనఁగా, బ్రహ్మవేత్త. వారిలో శ్రేష్ఠుఁడు – అనఁగా, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు. నాకున్ = తీవ్రమోక్షేచ్ఛ గలిగి నీకుశిష్యుఁడైన నాకు. పాపేభ్యః=దుఃఖములనుండి.

వ॥ అనినవిని శుకయోగివర్యుం డిట్లనియె. సత్రాజిత్తనువాఁడు సూర్యునకు భక్తుండై చెలిమి
సేయ నతనివలన సంతసించి సూర్యుండు శమంతకమణినిచ్చె. నామణి కంఠంబున ధరియించి
సత్రాజిత్తుండు భాస్కరునిభంగి భాసమానుండై ద్వారకానగరంబునకు వచ్చిన దూరంబున
నతనింజూచి జనులు మణిప్రభాపటల తిరోహితదృష్టులై సూర్యుండని శంకించివచ్చి హరికిట్లనిరి.

టీ॥ అనినన్=అనియడుగఁగా. (విని) శుకయోగివర్యుండు= శుకమహర్షిశ్రేష్ఠుఁడు.(ఇట్లనియెనుసత్రాజిత్తనువాఁడుసూర్యునకు) భక్తుండై = సేవకుఁడై. చెలిమిసేయన్ = స్నేహముచేయఁగా– సేవచేయఁగాననుట. (సూర్యుండు) అతనివలనన్=ఆసత్రాజిత్తునెడల. సంతసించి=సంతోషించి. శమంతక మణిన్=శమంతకము అనుమణిని. (ఇచ్చెను ఆమణిని) కంఠంబున ధరియించి = మెడను వేసికొని. (సత్రాజిత్తుండు) భాస్కరునిభంగిన్ = సూర్యునివలె. భాసమానుండై = ప్రకాశించు చున్నవాఁడై. ద్వారకానగరంబునకున్ = ద్వారకాపట్టణమునకు. వచ్చినన్ = రాఁగా. జనులు= పట్టణములోని ప్రజలు. అతనిన్ = సత్రాజిత్తును. దూరంబునం జూచి = దూరమునందుండఁగాఁజూచి. మణి...దృష్టులై–మణి = ఆరత్నముయొక్క. ప్రభా=కాంతులయొక్క. పటల = సమూహములచేత. తిరోహిత=కప్పఁబడిన. దృష్టులై=చూపులు గలవారై. (సూర్యుండని) శంకించి=సందేహించి. (వచ్చి) హరికిన్=శ్రీకృష్ణునితో. ఇట్లనిరి=ఇట్లుచెప్పిరి.

తా॥ అనిపరీక్షిన్మహారాజుఅడుగఁగావిన్నవాఁడైశుకమహాముని యిట్లుపలికెను, సత్రాజిత్తు అనువాఁడు సూర్యునికి భక్తుఁడై కొలువఁగా సూర్యుఁడు వానియెడల ప్రీతిగలవాఁడై, శమంతకము అను మణిని యిచ్చి పంపెను, ఆమణిని మెడనుధరించి సత్రాజిత్తుఁడు ద్వారకాపట్టణమునకు రాఁగా పట్టణపు ప్రజలందఱు దూరమున వచ్చునప్పుడుచూచి ఆమణివలని వెలుఁగులచేత కన్నులుమూఁతలు పడఁగా సూర్యుఁడేయని సందేహించి కృష్ణునియొద్దకు వచ్చి ఆతనితో ఇట్లు పలికిరని తాత్పర్యము.

విశేషార్థము.

టీ॥ సూర్యునకుభక్తుండైచెలిమిసేయన్ = శ్లో॥బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్ మాంప్రపద్యతే। వాసుదేవస్సర్వమితిసమహాత్మా సుదుర్లభః ॥ అను గీతాప్రమాణముచేత బహుజన్మకృత సుకృతపరిపాకమువలన అయ్యో నేను కామనాకర్మనిష్ఠుఁడనై చెడితినేయని దుఃఖపడి సద్గురువులసన్నిధానమునఁజేరిబ్రహ్మవిచారముచేయఁగా. సూర్యుండుశమంతకమణినిచ్చెన్ = ఆబ్రహ్మవిచారణవలన. శ్లో॥ మయ్యేవసకలంజాతం మయిసర్వంప్రతిష్ఠితం। మయిసర్వం లయంయాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహం॥అనుఅపరోక్షజ్ఞానముగలిగెను. ఆమణిన్=ఆ అపరోక్షజ్ఞానమును. కంఠంబునధరియించి=తనవిశుద్ధచక్రమునధరించి. ద్వారకానగరంబునకు వచ్చినన్ = మనుష్యదేహధారులుసంచరించినట్లే సంచరించుచుండఁగా. జనులు=శ్రుతియుక్తిఅనుభవములులేనిఅజ్ఞానులు. దృష్టులై=వివేకములుగలవారై.

౪౭.—క॥ నారాయణ దామోదర। నీరజదళనేత్ర చక్రి * నిఖిలేశ గదా
ధారణ గోవింద నమ। స్కారము యదుపుత్ర నిత్య * కల్యాణ హరీ.

టీ॥ నారాయణ = మహాజలము స్థానముగా నుండునట్టి వటపత్రశాయీ. దామోదర=వ్రేలుచున్నవనమాలతోడి కడుపుమీఁది ప్రదేశముగలవాఁడా. నీరజదళనేత్ర=తామరతేకులవంటిపెద్దపెద్ద కన్నులుగలవాఁడా. చక్రి=చక్రమునుధరించినవాఁడా. నిఖిలేశ= సర్వేశ్వరుఁడా. గదాధారణ=గదనుధరించినవాఁడా. గోవింద= వేదములచేత తెలియఁబడువాఁడా. యదుపుత్ర = యదువంశమునందుదయించినవాఁడా. నిత్యకల్యాణ=చెడని మేలుగలవాఁడా. హరీ = పాపపరిహారకుఁడా. నమస్కారము=నీకుమ్రొక్కు.

తా॥ వటపత్రశాయివై, కడుపుపై వ్రేలుచున్న వనమాలగలవాఁడవై, తామరతేకులవంటి కన్నులుగలవాఁడవై, చక్రమునుధరించినవాఁడవై, సర్వేశ్వరుఁడవై, గదాధరుఁడవై, వేదములచేతఁదెలియఁబడువాఁడవై, ఎప్పుడునుచెడనిమేలుగలవాఁడవై, ఎల్లపాపములనుహరించువాఁడవై, ఒప్పునట్టి ఓయాదవోత్తమా! నీకు మ్రొక్కెదము అనితాత్పర్యము.

విశేషార్థము.

టీ॥ నారాయణ = విజ్ఞానమేస్థానముగఁ గలవాఁడా–విజ్ఞాన

మునఁ బ్రకాశించువాఁడా అనుట. (నారంవిజ్ఞానం తదయనమాశ్రయోయస్యసః నారాయణః) అని వ్యుత్పత్తి. శ్లో॥ సర్వత్రావస్థితో హ్యాత్మా నసర్వత్రావభాసతే। బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్॥ అని ఆచార్యకృతాత్మబోధప్రకాశిక. లేక, నారములు= జలములు–అవ్యక్తాదితత్త్వములు – స్థావర జంగమజీవులు–అవిష్ఠానముగఁ గలవాఁడా. క॥ నారములనఁగా జలములు। పేరయనమునాఁగ నెలవు ప్రీతిగ నాకుఁ। నారములయనములగుటను। నారాయణుఁడం డ్రుజనులు నన్నుఁగిరీటీ॥ అని భారతశాంతిపర్వము. దామోదర= దమమనెడి యుత్తమసాధనముచేత శ్రేష్ఠమైన మోక్షగతిని పొందువాఁడా–శ్రు॥ దమేన దాంతాః కిల్బిషమవధూన్వంతి దమేన బ్రహ్మచారిణస్సువరగచ్ఛం దమోభూతానాందురాధర్షం దమే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్దమగ్ంపరమం వదంతి॥ అని–లేక, శ్లో॥ దామాని లోకనామాని తానియస్యోదరాంతరే। తేన దామోదరో దేవశ్శ్రీధరస్త్వం సమాశ్రితః॥ అని వ్యాసవచనము. దామములనఁగా లోకములు గనుక పదునాలుగులోకములను కడుపునందుఁగలవాఁడా. ఆ॥ దమమునాఁగ నుత్తమధర్మమెదకు। నలవరించి నర్గామించునార్యజనము। దివియుభువియు నానడుమన తేజరిల్లు। నట్టులగుట దామోదరుఁడండ్రు నన్ను॥ అని భారతశాంతిపర్వము. లేక, బాల్యమున యశోదాదేవిచేత నడుమునకట్టఁబడిన త్రాడుగలవాఁడా. శ్లో॥ తర్వోర్మధ్యగతం బద్ధం దామ్నా గాఢం తథోదరే। తతశ్చ దామోదరతాం పయయా దామబంధనాత్॥ అని బ్రహ్మపురాణము. నీరజదళనేత్ర=హృదయకమలమందలి అష్టదళములయందు వ్యాపించు ప్రజ్ఞానమే కన్నులుగాఁగలవాఁడా. చక్రి=మనస్తత్త్వాత్మకమైన సుదర్శన చక్రమును ధరించినవాఁడా. లేక, సంసారచక్రమును ద్రిప్పువాఁడా. నిఖిలేశ=విషయేంద్రియాధి దేవతామయములై బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంధి సంజ్ఞలుగల త్రిలోకములను ప్రథమస్ఫురణ రూపముచేత ప్రకాశింపఁజేయుటకు పెంచుటకు ద్రుంచుటకు దొరయైనవాఁడా. గదాధారణ=బుద్ధితత్త్వాత్మకయైన కౌమోదకియను గదను ధరించినవాఁడా. శ్లో॥ మనస్తత్త్వాత్మకం చక్రం బుద్ధితత్త్వాత్మికాం గదాం। ధారయఁల్లోకరక్షార్థం యుక్తశ్చక్రగదాధరః॥ అని విష్ణుసహస్రనామభాష్యము. గోవింద=వేదాంతమహావాక్యములచేతఁ దెలియఁదగినవాఁడా–శ్లో॥ గోభిరేవయతో వేద్యో గోవిందస్సముదాహృతః॥ అని శ్రీవిష్ణుతిలకము. యదుపుత్ర = బ్రహ్మవేత్తలయందుఁ బుట్టువాఁడా–అపరోక్షజ్ఞానముగల బ్రహ్మవేత్తలకుఁగనఁబడువాఁడా. నిత్యకల్యాణ = నిత్యమంగళమయిన మోక్షస్వరూపుఁడా. హరీ= యాగభాగములను భుజించువాఁడా–ఆ॥ పరమ వరద లోకభావనేశ్వర హృషీ। కేశ నామకములహీనచిత్త। యనియుమతియునిట్టులను యాగములభాగ। మాహరింతుఁగాన హరియనండ్రు॥ అని భారతశాంతి. అష్టదళపద్మవివరణము సటీక సీతారామాంజనేయసంవాద ప్రథమాశ్వాసమున (౧౭౧) టవ పద్యమునఁ జూడుఁడు.

౭౮.—మ॥ దివిజాధీశ్వరు లిచ్చగింతురుగదా ✱ దేవేశ నిం జూడ యా
దవ వంశంబున గూఢమూర్తివి జగ ✱ త్ప్రాణుండవై యుండఁగా
భవదీయాకృతిఁ జూడ నేడదె రుచి ✱ ప్రచ్ఛన్న దిగ్భాగుఁడై
రవియో నీరజగర్భుఁడో యొకఁడు చే ✱ రన్వచ్చె మార్గంబునన్.

టీ॥ దేవేశ = దేవతలకునీశ్వరుఁడవైన యోస్వామీ. నిన్= నిన్ను. చూడన్=చూచుటకు. దివిజాధీశ్వరులు=దేవతాశ్రేష్ఠులు. ఇచ్చగింతురుగదా=కోరుదురుగదా. యాదవవంశంబునన్=యాదవకులమునందు. గూఢమూర్తివి = దాఁచఁబడినస్వరూపముగలవాఁడవును. జగత్ప్రాణుండవై = లోకమునకు ప్రాణమువంటివాఁడవునై. (ఉండఁగా) భవదీయాకృతిన్=నీయాకారమును. చూడన్= చూచుటకు. (నేడు) అదె=అదిగో. రుచిప్రచ్ఛన్నదిగ్భాగుఁడై= తనవెలుఁగుచేత కప్పఁబడినదిక్ప్రదేశములుగలవాఁడై. రవియో= సూర్యుఁడో. నీరజగర్భుఁడో=బ్రహ్మయో. (ఒకఁడు) మార్గంబునన్= ఆదారిగుండ. చేరన్ వచ్చెన్=దగ్గఱవచ్చెను.

తా॥ దేవతలకు ప్రభువైనయో శ్రీకృష్ణమూర్తీ! దేవతాధిపతులైన యింద్రుఁడు మొదలగు వారు నిన్నుఁ జూడవచ్చుట సహజము కాఁబట్టి యిప్పుడు యాదవవంశమునందు స్వస్వరూపమును దాఁచి మనుష్యాకృతితో నవతరించి లోకమునకు ప్రాణమువంటివాఁడవై యుండఁగా నిన్నుఁ జూచుటకై నేడు సూర్యుఁడో బ్రహ్మయో యొక దేవత తన వెలుఁగులు దిక్కులను ఆవరించుకొనుచుండఁగా అదిగో ఆదారిగుండ దగ్గఱ వచ్చుచున్నాఁడు అని తాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ దేవేశ=బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులకు ప్రభువైన కృష్ణా. దివిజాధీశ్వరులు = బ్రహ్మవేత్తలు – దివ్ విజిగీషాస్వప్నకాంతిగతిషు, అని ధాతువు గనుక మహాప్రకాశముగల హృత్పుండరీకమునఁ బుట్టిన బ్రహ్మోవాహమను దృఢాపరోక్షజ్ఞానమునకు ప్రభువులు అనఁగా, అట్టిజ్ఞానముగలవారు. యాదవవంశంబునన్=స్వరూపసాక్షాత్కారజ్ఞానముచేత బ్రహ్మత్వమును, ఆ జ్ఞానము లేకపోవుటచేత జీవత్వమును వహించునట్టి మనుష్యులయందు. గూఢమూర్తివి= కనఁబడకయున్న సచ్చిదానందరూప పరబ్రహ్మవు. (ఏష సర్వేషు భూతేషు గూఢాత్మా న ప్రకాశత ఇతి శ్రుతిః) జగత్ప్రాణుండవు = నిద్రయనెడు ప్రళయమున లయించిన స్థూలశరీరమనెడు జగత్తును నేననెడు జ్ఞప్తిచేత బ్రతికించి రక్షించువాఁడవు.

వ॥ అని యిట్లు పలికిన మూఢజనులం జూచి గోవిందుండు నగి మణిసమేతుండైన సత్రాజిత్తుండు గాని సూర్యుండు గాఁడని పలికె నంత సత్రాజిత్తుండు శ్రీయుతంబై మంగళాచార సంచారితంబైన తనగృహంబునకుం జని మహీసురులచేత నిజదేవతామందిరంబున నమ్మణి శ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె నది ప్రతిదినంబు నెనిమిది బారువుల సువర్ణంబు లొసంగుచుండు.

టీ॥ (అనియిట్లుపలికిన) మూఢజనులకు=తెలివిమాలినమనుష్యులను. (చూచి) గోవిందుండు=కృష్ణుఁడు. నగి=నవ్వి. మణిసమేతుండైనసత్రాజిత్తుండుగాని = శమంతకమణితోడవచ్చుసత్రాజిత్తుఁడు గాని. (సూర్యుండుగాఁడు) అనిపలికెన్=అనిచెప్పెను. అంతన్=అంతట. (సత్రాజిత్తుండు) శ్రీయుతండై=కలిమితోఁగూడుకొన్నదై. మంగళాచారసంచారితంబైన = శుభకార్యములు నడపఁబడునదియైన. తనగృహంబునకున్ = తనయింటికి. చని = పోయి. మహీసురులచేతన్=బ్రాహ్మణులచేత. నిజదేవతా మందిరంబునన్=తనదేవునియింటిలో. అమ్మణిశ్రేష్ఠంబు=ఆశ్రేష్ఠమయిన మణిని. ప్రవేశంబుసేయించెన్ = ప్రవేశపెట్టెను. అది=అరత్నము. ప్రతిదినంబును = దినదినమును. (ఎనిమిదిబారువుల) సువర్ణంబులు=బంగారును. ఒసంగుచుండున్=ఇచ్చుచుండును.

తా॥ ఇట్లుపలికిన తెలివిమాలిన పురజనులనుజూచినవ్వి ఆవచ్చువాఁడు శమంతకమణితో వచ్చు సత్రాజిత్తుఁడుగాని సూర్యుఁడు గాఁడు అనిచెప్పెను. అంతట సత్రాజిత్తుఁడుసకలసంపదలు గలిగి శుభకార్యములు చేయఁబడుచున్న తనయింటికిపోయి బ్రాహ్మణులగుండ ఆమణిని తనదేవునియింటిలో పెట్టించెను ఆరత్నము ప్రతిదినము ఎనిమిదిబారువుల బంగారును ఇచ్చుచుండును అని తా.

విశేషార్థము.

టీ॥ శ్రీయుతండై=అమానిత్వాదిసకలసుగుణసంపదతోఁగూడినదై. మంగళాచార సంచారితంబైన = తనకు సంతోషమును గలిగించుచున్న సకలేంద్రియప్రవర్తనలుగలదైన — అనఁగా, సకలేంద్రియప్రవర్తనములును చిన్మయములుగానే యుండెననుట. మహీసురులచేతన్=బ్రహ్మవేత్తలచేత, తనగృహంబునన్=శరీరమనెడు గృహమునందలి. నిజదేవతామందిరంబునన్ = తన హృదయకమలమందు. అమ్మణిశ్రేష్ఠంబుప్రవేశంబుసేయించెన్=బ్రహ్మైవాహమనెడి అపరోక్షజ్ఞానమునుండఁజేసెను—బ్రహ్మవేత్తల సద్బోధచేత(బ్రహ్మైవాహమిదంజగచ్చసకలం చిన్మాత్రవిస్తారితమను) విజ్ఞానమును తనయందు స్థిరపఱచుకొనెననుట. ప్రతిదినంబు = ఎల్లప్పుడును. ఎనిమిదిబారువుల సువర్ణంబులొసంగుచుండున్ = అష్టప్రకృతులును బ్రహ్మమయమేయను విజ్ఞానమును గలిగించుచుండును. సువర్ణము=పరబ్రహ్మము.

౪౯.—క॥ ఏరాజేలెడు వసుమతి । నారత్నము పూజ్యమాన ❋ మగు నక్కడ రో
గారిష్ట సర్ప మాయిక । మారీ దుర్భిక్ష భయము ❋ మాను నరేంద్రా.

టీ॥ నరేంద్రా=రాజా. అరత్నము=ఆశమంతకమణి. ఏరాజేలెడు వసుమతిన్ = ఏరాజు పాలించునట్టి భూమియందు. పూజ్యమానమగున్ = పూజింపఁబడుచుండునో. అక్కడన్=ఆభూమియందు. రోగ...భయము — రోగ = వ్యాధులు. అరిష్ట = పీడలు. సర్ప= పాములు. మాయిక=వంచకులు. మారి=క్షుద్రశక్తులు. దుర్భిక్ష = కఱవు. భయము=వీనివలనిభీతి. మానున్=తొలఁగును.

తా॥ ఓరాజా! ఈశమంతమణి యేరాజుదేశములో పూజింపఁబడుచుండునో ఆదేశములో వ్యాధులు నానావిధపీడలు పాములు వంచకులు క్షుద్రశక్తులు కఱవు మొదలగువానివలని భయము లేకపోవునని తాత్పర్యము.

విశేషార్థము.

టీ॥ ఏరాజేలెడువసుమతిన్=రాజర్దీప్తౌ అనిధాతువుగనుకసకల జన్మములలో శ్రేష్ఠమైన మనుష్యజన్మమెత్తిన యెవనిహృదయకమలమందు. ఆరత్నముపూజ్యమానమగున్=బ్రహ్మైవాహమనెడి ఆయపరోక్షజ్ఞానము చెడకుండ స్థిరపడియుండునో. అక్కడన్ = ఆహృదయమందు. రోగారిష్టసర్పమాయికమారీదుర్భిక్షభయము = రోగములు మొదలైనవానివలనిసర్వభయములును. మానున్=వదలును. సకలదుఃఖములును వానిని అంటవనుట— తే॥ ప్రజ్వలత్పావకావృత పర్వతంబు । నాశ్రయించునె మృగవిహంగాదికములు । బ్రహ్మమయుఁడై ప్రకాశించుబ్రహ్మవిదుని। నంటునే పుణ్యపాపంబు లాంజనేయ॥ ఆ॥ బహుళసంకటములు ప్రాప్తంబులైనచోఁ । దల్లడింపఁడాత్మతత్త్వవిదుఁడు। వాయుశీతవహ్ని వర్షాతపంబుల। కించుకైనగిరి చలించనట్లు॥ అని సీతారామాంజనేయసంవాదము.

(❋) సత్రాజిత్తు తమ్ముఁడైన ప్రసేనుఁడు వేఁటాడఁబోయి సింహముచే నడవిలోఁ జచ్చుట. (❋)






క॥ అమ్మణియాదవవిభునకు।
నిమ్మని హరియడుగ నాతఁ ❋
డీక ధనేచ్ఛన్. । బొమ్మని పలి
కెనుజక్రిని। నిమ్మణి యాకున్న
మీఁద ❋ నేమానను‌ఘన్.

టీ॥ హరి=కృష్ణుఁడు. అమ్మణిన్= ఆరత్నమును. యాదవవిభునకున్= యాదవులకురాజైన ఉగ్రసేనునికి. (ఇమ్మనియడుగ) ఆతఁడు=ఆసత్రాజిత్తుఁడు. ధనేచ్ఛన్=ద్రవ్యాపేక్ష

చేత. ఇమ్మణి = ఈరత్నము. ఈకున్నన్ = ఇయ్యనిపక్షమున. మీఁదన్=పిమ్మట. ఏమౌను=ఏమిచెఱుపుఅగునో. అనుచున్=అని. ఈక=రత్నమునుఇయ్యక. చక్రిన్ = కృష్ణుని. పొమ్మనిపలికెన్= ఇయ్యను పొమ్మని చెప్పెను.

తా॥ కృష్ణుఁడు ఆరత్నమును ఉగ్రసేనునికి ఇమ్మని అడుగఁగా ఇతనికి ఇయ్యకపోయిన రాఁగలచెఱుపును రానిమ్మని కృష్ణునిని నీకు నేను రత్నమును ఇయ్యను పొమ్మనెను అని తాత్పర్యము.

౫౧.—చ॥ అడరెడువేడ్కఁ గంఠమున * నమ్మణిఁదాల్చి ప్రసేనుఁ డొక్కనా
డడవికి ఘోరవన్య మృగ * యారతి నేగిన వానిఁజంపి పైఁ
బడి మణిఁగొంచు నొక్కహరి * పాఱఁగ దాని వధించి డాసి యే
ర్పడఁగను జాంబవంతుఁడు ప్ర * భాత్తదిగంతము నాశమంతమున్.

టీ॥ ఒక్కనాడు = ఒకదినము. అడరెడువేడ్కన్ = అతిశయించుచున్న కుతూహలముతో. అమ్మణిన్=ఆరత్నమును. (ప్రసేనుఁడు) కంఠమునన్=మెడను. తాల్చి=ధరించి. ఘోరవన్యమృగయారతిన్=భయంకరములైన అడవిమృగములవేఁటయందాసక్తిచేత అడవికిన్ = అరణ్యమునకు. ఏగినన్=పోఁగా. ఒక్కహరి=ఒకసింహము. పైబడి = మీఁదఁబడి. వానిన్=ఆప్రసేనుని.(చంపి) మణిన్ = రత్నమును. కొంచున్ = తీసుకొని. పాఱఁగన్=పఱెత్తఁగా. (జాంబవంతుఁడు) దానిన్=ఆసింహమును. డాసి=సమీపించి. వధించి=చంపి. ఏర్పడఁగన్=తెలియఁబడునట్లుగా. ప్రభాత్తదిగంతమున్—ప్రభా=కాంతులచేత. ఆత్త=పొందఁబడిన. దిగంతమున్=దిక్కులయొక్కకొనలుగల. ఆశమంతమున్=ఆశమంతకమణిని. (కని) అని మీఁదికన్వయము.

తా॥ ఒకనాడు సత్రాజిత్తు తమ్ముఁడైన ప్రసేనుఁడనువాఁడు మిక్కిలి కుతూహలముతో ఆమణిని మెడను ధరించుకొని. భయంకరములయిన అడవి మృగములవేఁటాడ ఇచ్ఛచేత అడవికిపోఁగా ఒకసింహమువానినిజంపి ఆరత్నమును ఎత్తుకొనిపఱుగెత్తెను ఆసింహమును జాంబవంతుఁడు చూచి కదియఁబోయి చంపి దిక్కుల కొనలవఱకు వ్యాపించుచున్న కాంతులు కలిగిన శమంతకమణిని చూచి అని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ ప్రసేనుఁడు = రాగద్వేషాది దుర్వృత్తులనెడు సేనలుగల అహంకారుఁడు. ఘోరవన్యమృగయారతిన్ = తొలుత సుఖకరములై వెనుక భయంకరములుగా తోఁచునట్టి విషయానుభవములయందు ఆసక్తిగలిగి. అడవికినేగినన్ = సంసారారణ్యమునఁ బ్రవేశింపఁగానే. హరి=మృత్యువనెడిసింహము. జాంబవంతుఁడు=బ్రహ్మవేత్త—జంబూసంబంధమైనదిజాంబవము. అనఁగా, సువర్ణము—పరబ్రహ్మమనుట. అది తనయందుఁగలవాఁడు జాంబవంతుఁడు. దాని డాసివధించి=ఆమృత్యువును గెల్చి.

౫౨.—క॥ కనిజాంబవంతుఁడామణిఁ । గొనిపోయిసమీపశైల * గుహఁజొచ్చి ముదం
బునఁ దనకూరిమి సుతకును । ఘనకేళీ కందుకంబు * గాఁ జేసె నృపా.

టీ॥ నృపా=రాజా.కని=చూచి.(జాంబవంతుఁడు)ఆమణిన్=ఆరత్నమును. కొనిపోయి = తీసికొనిపోయి. సమీపశైలగుహన్=ఆచటికి దాపుననున్నపర్వతబిలమందు. చొచ్చి=ప్రవేశించి. ముదంబునన్=సంతోషముతో. తనకూరిమిసుతకున్=తనప్రియపుత్రికకు. ఘనకేళికందుకంబుగాన్=ఘనమైన ఆడుకొనుచెండుగా.(చేసెను)

తా॥ ఓరాజా! అట్లు జాంబవంతుఁడు ఆరత్నమునుజూచి తీసికొనిపోయి అచ్చటికి సమీపమునందున్న కొండగుహలో ప్రవేశించి అందున్నతనముద్దులకూఁతునకుఆడుకొనుబంతిగాచేసియుంచెననితా

వి శే షా ర్థ ము.

టీ॥ సమీపశైలగుహఁజొచ్చి=అజ్ఞానులకుదూరమందును, జ్ఞానులకు దగ్గఱనున్న అంతరహృదయమనెడు గుహలోఁబ్రవేశించి. శ్రు॥ యోవేదనిహితంగుహాయాం పరమేవ్యోమన్ ॥ అని యుపనిషత్తు. సుతకున్=తనయందుఁబుట్టిన ముక్తియనెడు కొమార్తకు.

౫౩.—వ॥ అంత సత్రాజిత్తుండు తన సహోదరుండయిన ప్రసేనునింగానక దుఃఖించుచు.

టీ॥ అంతన్=అంతట. (సత్రాజిత్తుండు)తనసహోదరుండు= తనతోడఁబుట్టినవాఁడు. అయినప్రసేనునిన్ = అయినట్టి ప్రసేనుని. కానక = చూడనేరక. దుఃఖించుచున్ = దుఃఖపడుచు.

తా॥పిమ్మట సత్రాజిత్తుఁడు ప్రసేనునిగానక దుఃఖించుచునుఅనితా.

౫౪.—మ॥ మణి కంఠంబునఁ దాల్చి నేడడవిలో * మావాఁడు వర్తింపఁగా
మణికై పట్టి వధించినాఁడు హరికిన్ * మర్యాద లేదంచు మూ
షణముం జేయఁగ వానిదూషణముఁ గం * స ధ్వంసి యాలించి యే
వ్రణమున్ నామెడ లేదు నింద గలిగెన్ * వారించు టేరీతియో.

టీ॥ మావాఁడు=మాతమ్ముఁడు. మణి = రత్నమును. కంఠంబునన్=మెడను. తాల్చి=ధరించి. (నేడు అడవిలో)వర్తింపఁగా=మెలఁగుచుండఁగా. మణికై=రత్నముకొఱకు.పట్టివధించినాఁడు=పట్టుకొనిచంపినాఁడు. హరికిన్=కృష్ణునికి.మర్యాదలేదు=క్రమము

లేదు. అంచున్ = అని. దూషణముంజేయఁగన్ = దూషింపఁగా. వానిదూషణమున్ = వానిదూషించుటను — వాఁడువ్రదూఱుటను. కంసధ్వంసి = కంసునిచంపినవాఁడైన. (కృష్ణుఁడు) ఆలించి = విని. ఏవ్రణమున్ = ఏదోషమును. నాయెడలేదు = నాయందు లేదు. నిందగలిగెన్ = అపదూఱుగల్గెను. వారించుట = ఈనిందను తొలఁగించుకొనుట. ఏరీతియో = ఏవిధమో.

తా॥ మాతఙ్గుఁడు శమంతకమణిని మెడను ధరించి అడవిలో మెలఁగుచుండఁగా శ్రీకృష్ణుఁడు వానిని జంపి రత్నమును అపహరించెను ఇతఁడు ఎంతఅక్రమస్థుఁడో చూడుఁడుఅని సత్రాజిత్తుఁడు అల్లరిచేయఁగా కృష్ణుఁడు విని నేను ఏపాపమును ఎఱుఁగను ఇట్లుండఁగా లేని అపదూఱు నాయందు సత్రాజిత్తు మోపినాఁడు ఈనింద యెట్లు తప్పించుకోవచ్చునని ఆలోచించెననితా. వ॥ అనివితర్కించి.



(*) శ్రీకృష్ణుఁడు లోకాపవాద నివృత్తికొఱకు శమంతకమణిఁ దెచ్చుట. (*)

౫౫.—మ॥ తనవారెల్లఁ బ్రసేను జాడఁ దెలుపం * దర్కించుచున్ వచ్చి త
ద్వనవీథిం గనె నేలఁ గూలిన మహా * శ్వంబుం బ్రసేనుం బ్రసే
నుని హింసించిన సింహమున్ మృగపతిన్ * నొప్పించి ఖండించి యే
గిన భల్లూకము చొచ్చియున్న గుహయుం * గృష్ణుండు రోచిష్ణుఁడై.

టీ॥ కృష్ణుండు = శ్రీకృష్ణుఁడు. రోచిష్ణుఁడై = ప్రకాశించుస్వభావముగలవాఁడై — నిందను పోఁగొట్టుకోఁ దలఁచినవాఁడై. తనవారెల్లన్ = తనకుఁగావలసినవారందఱు. ప్రసేనుజాడన్ = ప్రసేనుఁడు పోయినమార్గమును. తెలుపన్ = తెలియఁజేయఁగా. తర్కించుచున్ = విచారించుచు. (వచ్చి) తద్వనవీథిన్ = ఆయడవిత్రోవయందు. నేలఁగూలినమహాశ్వంబున్ = నేలఁబడియున్న పెద్దగుఱ్ఱమును. (ప్రసేనుని) ప్రసేనునిహింసించినసింహమున్ = ఆప్రసేనునిఁ జంపినసింహమున్ను. మృగపతిన్ = ఆసింహమును. నొప్పించి = బాధించి. ఖండించి = చంపి. ఏగినభల్లూకముచొచ్చియున్నగుహయున్ = పోయినట్టియెలుఁగుగొడ్డుపోయి ప్రవేశించినగుహను. కనెన్ = చూచెను.

తా॥ అంతట శ్రీకృష్ణమూర్తి ఆనిందను పోఁగొట్టుకోఁదలఁచినవాఁడై తనకు కావలసినవారైన జనులవలన ప్రసేనుఁడు పోయినజాడ తెలిసికొని పోయి ఆయడవిలో చచ్చిపడియున్న ప్రసేనునివాని గుఱ్ఱమును జూచి వెంటనే ఆప్రసేనునిఁ జంపిన సింహమును సింహమునుజంపినయెలుఁగుగొడ్డు ప్రవేశించినగుహనుజూచెననితా.

## విశేషార్థము.

టీ॥ తనవారెల్లన్ = బ్రహ్మవేత్తలందఱును. ప్రసేనుజాడన్ = ద్వైతవృత్తిగల అహంకారుననడువడినంతయును. మహాశ్వంబున్ = రాగ ద్వేష కామ క్రోధములనెడు నాలుగు కాళ్లుగల మనస్సనెడు గుఱ్ఱమును. ప్రసేనున్ = మనసనెడు గుఱ్ఱము నెక్కి విషయాభిలాషగలిగి సంసారారణ్యములోఁ బ్రవేశించి మృత్యువనెడు సింహముచేతకబళింపఁబడి అధోగతిపాలైన అహంకారుని.

వ॥ కని తనవెంట నంటివచ్చిన ప్రజనెల్ల గుహాముఖంబున విడిచి సాహసంబున మహానుభావుండైన హరి నిరంతర నీరంధ్ర నిబిడాంధకార బంధురంబై విశాలంబైన గుహాంతరాళంబు సొచ్చి చని యక్కడ నొక్కబాలికకెదుర దర్శనీయ కేళికందుకంబుగా వ్రేలంగట్టిన యమ్మణి శ్రేష్ఠంబుఁ గని హరింప నిశ్చయించి.

టీ॥ కని = చూచి. తనవెంటనంటివచ్చినప్రజనెల్లన్ = తన్ను వెంబడించివచ్చినజనులనందఱను. గుహాముఖంబునన్ = గుహవాకిట. (విడిచి) సాహసంబునన్ = తెగువతో. మహానుభావుండైనహరి = గొప్పమహిమగలవాఁడైన శ్రీకృష్ణుఁడు. నిరంత...బై — నిరంతర = ఎడములేక. నీరంధ్ర = దట్టముగా. నిబిడ = నిండుకొన్న. అంధకార = చీఁకటిచేత. బంధురంబై = ఏటువాలై. విశాలంబైన = విరివిగలదైన.

గుహాంతరాళంబు=గుహలోపలిభాగమును. చొచ్చి = ప్రవేశించి. చని=పోయి. అక్కడన్=ఆగుహలోపల. ఒక్కబాలికకెదురన్= ఒక ఆఁడుబిడ్డకెదుట. దర్శనీయకేళికందుకంబుగాన్ = చూడఁదగిన వినోదపుబంతిగా. వ్రేలంగట్టిన = వ్రేలాడఁగట్టిన. అమ్మణి శ్రేష్ఠంబున్=శ్రేష్ఠమైనఆమణిని. (కని) హరింపన్=తీసికొనుటకు. నిశ్చయించి=నిశ్చయముచేసికొన్నవాఁడై.

తా॥ చూచి మహానుభావుఁడైన శ్రీకృష్ణుఁడు తనవెంట వచ్చిన వారినెల్లను ఆగుహవాకిటనే నిలిపి మిక్కిలి తెగువతో దట్టమయిన చీఁకటిచేత అంతట కమ్మఁబడియుండెడదియు పెట్టవాలుగా నుండునదియు నైన ఆగుహలో తాను ప్రవేశించి పోయి ఆలోపల ఒక ఆఁడుబిడ్డయెదుట వినోదనుగా చెండు వ్రేలఁగట్టినట్టు కట్టఁబడి యున్న శమంతకమణినిజూచి దానినితీసికోవలెనని నిశ్చయించుకొన్న వాఁడై అని తాత్పర్యము.

౫౬.—క॥ మెల్లనఁ బదము లిడుచు యదు । వల్లభుఁ డాబాలకడకు ✻ వచ్చిన గుండెల్
జల్లనఁగఁజూచి కంపము । మొల్లంబుగ దాని దాది ✻ మొఱవెట్టె నృపా.

టీ॥ నృపా=రాజా. యదువల్లభుఁడు=కృష్ణుఁడు. మెల్లనన్= తిన్నగా. పదములు=అడుగులు. ఇడుచున్ = పెట్టుచు. ఆబాల కడకున్=ఆబిడ్డదగ్గఱకు. వచ్చినన్=రాఁగా. దానిదాది=ఆబిడ్డకు పాలిచ్చునట్టి ఆఁడుది. గుండెలు=హృదయము. జల్లనఁగన్=భేదిల్లఁగా. (చూచి) కంపము = వణఁకు. మొల్లంబుగన్ = అధికమ్ముకాఁగా. మొఱవెట్టెన్=మొఱ్ఱోయని అఱచెను.

తా॥ ఓరాజా! శ్రీకృష్ణమూర్తి చప్పుడుగాకుండ అడుగు మెల్లమెల్లగా ఎత్తి పెట్టుచు ఆబిడ్డ దాపునకు రాఁగా దానిదాది చూచి గుండెలు అదరఁగా దేహము గడగడ వణఁకఁగా మొఱ్ఱో యని అఱచెనని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ యదువల్లభుఁడు = బ్రహ్మవిద్వరిష్ఠుఁడు. మెల్లనపదము లిడుచున్ = శుభేచ్ఛ విచారణ తనుమానసి సత్త్వాపత్తి సంసక్తి నామిక పదార్థభావన అనెడుభూమికలను క్రమముగ పొందుచు. ఆబాలకడకున్=మనోబుద్ధిచిత్తాహంకారములనెడునాలుగుకాళ్లను నిర్మలాంతఃకరణమనెడు పైపలకయును, సత్వగుణ రజోగుణతమోగుణ సమావస్థలనెడు నాలుగుగోలుసులును, బ్రహ్మమనెడి ఆధారదారువునుగల తొట్లమంచమునందు నున్న తురీయస్థితి గల ముక్తి యనెడుకన్యవద్దకు. దానిదాది మొఱవెట్టెన్=ఆముక్తికాంతనశింపకుండ రక్షించునట్టి అపరోక్షజ్ఞానము వృత్తిజ్ఞానరూపముగ వెలుపలికివచ్చెను. రణము=బ్రహ్మవిచారము.

## (✻) జాంబవంతుఁడు కృష్ణునితో పోరుట. (✻)



వ॥ అంత నాధ్వని విని బలవంతుండైన జాంబవంతుండు వచ్చి తనస్వామియని యెఱుంగక ప్రాకృత పురుషుండని తలంచి కృష్ణునితో రణంబుచేసె నందు.

టీ॥ అంతన్=అప్పుడు. ఆధ్వనిన్=ఆమొఱచప్పుడు. (విని) బలవంతుండైన=మిక్కిలిబలముగలవాఁడైన(జాంబవంతుండువచ్చి) తనస్వామియని=తనయేలినవాఁడని. ఎఱుంగక=తెలియక. ప్రాకృత పురుషుండు=సామాన్యమనుష్యుఁడు. అనితలంచి=అనియెంచి. అందున్=ఆగుహయందు. కృష్ణునితోన్ = శ్రీకృష్ణమూర్తితో రణంబుచేసెన్=యుద్ధముచేసెను.

తా॥ అప్పుడు ఆదాది మొఱను విని మిగుల బలవంతుఁడైన జాంబవంతుఁడు వచ్చి చూచి అతఁడు తన యేలినవాఁడని తెలియక సామాన్యమనుష్యుఁడు అను తలఁపుచేత ఆగుహలోనే శ్రీకృష్ణునితో యుద్ధము చేసెనని తాత్పర్యము.





క॥ పలలమునకుఁ బోరెడు డే
గలక్రియ శస్త్రములఁ దరులఁ ✻ గరముల విజయే
చ్ఛల నిరువదియెనిమిది దిన
ములు పోరిరి నగచరేంద్ర ✻ ముఖ్యుఁడు హరియున్.

టీ॥ పలలమునకున్=మాంసముకొఱకు. పోరెడుడేగలక్రియన్= పోరాడునట్టిడేగలవలె. నగచరేంద్రముఖ్యుఁడున్=జాంబవంతుఁడును. హరియున్ = కృష్ణుఁడును. శస్త్రములన్ = కత్తులచేతను. తరులన్=వృక్షములచేతను. కరములన్ = చేతులచేతను. విజయేచ్ఛలన్ = గెలువవలెననుకోరికలచేత. (ఇరువదియెనిమిదిదినములు) పోరిరి=యుద్ధముచేసిరి.

తా॥ ఆజాంబవంతుఁడును కృష్ణుఁడును మాంసమునకై పోట్లాడెడు డేగలవలెనే శమంతకమణికై కత్తులు వృక్షములు చేతులును సాధనములుగా ఇరువది యెనిమిది దినములు పోరాడిరి అని తా.

## విశేషార్థము.

టీ॥ నగచరేంద్రముఖ్యుఁడుఁ = బ్రహ్మవిద్వరిష్ఠులలో శ్రేష్ఠుఁడైన జాంబవంతుఁడు. గముల్గతౌ అను ధాతువునుపట్టి. గ=జనన మరణాదులను పొందునది. న=లేనిదిఅనిఅర్థముగనుక నగ అనఁగా — జననమరణాదులులేనిది—అక్షరబ్రహ్మము. (దానియందు) చర=తిరుగువారిలో—అనఁగా, బ్రహ్మనిష్ఠగలవారిలో. ఇంద్రముఖ్యుఁడుఁ= మిగులశ్రేష్ఠుఁడు. హరియుఁ=శ్లో॥ మయ్యేవసకలంజాతం మయిసర్వంప్రతిష్ఠితం । మయిసర్వం లయంయాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహం॥ అనుప్రమాణమునుపట్టి, సర్వమును తనయందులయింపఁజేసికొనియెడు కృష్ణబ్రహ్మమును—బ్రహ్మవేత్తలిరువురును వేదాంతమహావాక్యములనెడు సాధనములచేత అక్కజతో బహుకాలము బ్రహ్మవిచారముచేసిరి. విఱుఁగక=పూర్వపక్షములుకాఁగా.

౨౦.—క॥ అడిదములు దరులు విఱిగిన । బెడిదములగు మగతనములఁ ✻ బిఱుతివక వడిఁ
బిడుగుల వడువునఁ బడియెడి । పిడికిటి పోడుపులను గలనఁ ✻ బెరసి రిరువురుఁ.

టీ॥ ఇరువురుఁ = ఆయిద్దఱును. అడిదములు = కత్తులును. తరులు=వృక్షములును. (విఱిగిన) బెడిదములగు=కఠినములైన. మగతనములఁ=శూరత్వములచేతను. పిఱుతివక=వెనుదీయక. వడిఁ= వేగముతో. పిడుగులవడువునఁ=పిడుగులవలె. పడియెడి=పడునట్టి. పిడికిటిపోడుపులఁ = పిడికిళ్లఁబొడుచుటచేత. కలనఁ= యుద్ధమునందు. బెరసిరి = తలపడిరి — మహాయుద్ధముచేసిరనుట.

తా॥ కృష్ణ జాంబవంతు లిద్దఱును కత్తులు వృక్షములు విఱిగి ఉపయోగింపకపోయినను తక్కువగాని పరాక్రమములచేత ఒకరినొకరు పొడుచుకొను పోడుపులు పిడుగులు పడునట్లు తోఁచుచుండఁగా పోరాడిరని తాత్పర్యము.

౨౧.—శా॥ స్ఫష్టాహంకృతు లుల్లసిల్ల హరియుఁ ✻ భల్లూకలోకేశుఁడుఁ
ముష్టాముష్టి నహర్నిశంబు జయస ✻ మ్మోహంబులం బోరుచోఁ
బుష్టింబాసి ముకుందముష్టి హతులఁ ✻ బూర్ణశ్రమోపేతుఁడై
పిష్టాంసోరు శరీరుఁడై యతఁడు దా ✻ భీతాత్ముఁడై యిట్లనెఁ.

టీ॥ హరియుఁ=కృష్ణుఁడును. భల్లూకలోకేశుఁడుఁ=ఎలుఁగులరాజైన జాంబవంతుఁడును. స్ఫష్టాహంకృతులు = చక్కఁగాఁ దెలియఁబడునట్టి అహంకారములు. ఉల్లసిల్లఁ = ప్రకాశింపఁగా. ముష్టాముష్టిఁ = పిడికిటిపోట్లాటలచేత. అహర్నిశంబు = అహోరాత్రులు—పగళ్లురాత్రులును. జయసమ్మోహంబులఁ=జయముపొందవలెనను ఇచ్ఛలచేత. పోరుచోఁ = పోరాడునపుడు. ముకుందముష్టిహతులఁ = కృష్ణునిపిడికిటిపోట్లచేత. పుష్టింబాసి = బలము తొలఁగి. పూర్ణశ్రమోపేతుఁడై = నిండుబడలికతోఁ గూడుకొన్నవాఁడై. పిష్టాంసోరుశరీరుఁడై—పిష్ట=పిండిగాఁజేయఁబడిన. అంస=భుజములును. ఉరు=పెద్దదయిన. శరీరుఁడై=దేహముగలవాఁడునై. అతఁడు=జాంబవంతుఁడు. తాఁ=తాను. భీతాత్ముఁడై=భయమును పొందిన మనసుగలవాఁడై. ఇట్లనెఁ=ఇట్లుపలికెను.

తా॥ కృష్ణ జాంబవంతు లిద్దఱును ఒకరినొకరు పిడికిళ్లతోఁ బొడుచుటలచేత అహంకారములు అతిశయింపఁగా రేయింబగళ్లు ఎడతెగక పోరాడునపుడు జాంబవంతుఁడు కృష్ణునిపిడిగ్రుద్దులచేత దేహబలముతగ్గఁగా మిక్కిలిబడలికనొందినవాఁడును పిండిపిండిగా నలియఁగొట్టఁబడిన మూఁపులును తక్కినశరీరమును గలవాఁడునై భయపడి కృష్ణునిఁజూచి యిట్లు మందలించెనని తాత్పర్యము.

## (✻) జాంబవంతుఁడు శ్రీకృష్ణమూర్తిని పొగడి పుత్రికను మణిని సమర్పించుట. (✻)

వ॥ దేవా నిన్ను పురాణపురుషు నధీశ్వరుండైన విష్ణుం
బ్రభవిష్ణుంగా నెఱుంగుదు, సర్వభూతంబులకుం
బ్రాణ ప్రతాప ధైర్య బలంబులునీవ, విశ్వంబు
నకు సర్గ స్థితి లయంబుల నెవ్వ రాచరింతురు వారికి
సర్గ స్థితి లయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ,
యాత్మకుం బరమాత్మవు నీవ యని మఱియును.

టీ॥ దేవా = స్వయంప్రకాశుఁడవయిన ఓస్వామీ. పురాణపురుషుఁ = ప్రాఁతమగవాఁడును — అనఁగా, పంచబ్రహ్మలకును ముందున్నవాఁడనుట. అధీశ్వరుండైన=పంచబ్రహ్మలను పుట్టింపపెంప త్రుంప ధ్వారమైన. విష్ణుఁ = అంతర్బహిఃపూర్ణుఁడైన పరబ్రహ్మముగాను. ప్రభవిష్ణుంగాఁ=సర్వమును సృజించుకర్తవునుగా




(నిన్ను) ఎఱుంగుదుఁ = తెలియుదును. సర్వభూతంబులకుఁ=సకలప్రాణులకును. ప్రాణప్రతాపధైర్యబలంబులు = ప్రాణము ప్రతా

పము ధైర్యము బలము అనునవి. నీవ=నీవే. విశ్వంబునకున్=ప్రణవ రూప ప్రపంచమునకు. సర్గస్థితిలయంబులన్=సృజించుట రక్షించుట నాశము చేయుట అనువానిని. ఎవ్వరాచరింతురు = ఏబ్రహ్మ విష్ణు రుద్రులు చేయుదురో. వారికిన్=ఆబ్రహ్మ విష్ణు రుద్రులకు. సర్గస్థితి లయంబులన్=సృష్టి స్థితి లయములను. చేయనీశ్వరుండవు=చేయు నట్టికర్తవు. నీవ=నీవే. ఆత్మకున్=ప్రత్యగాత్మకు. పరమాత్మవు= ఉపాస్యుఁడవైన పరబ్రహ్మమవు. నీవ=నీవే. (అని మఱియును)

తా॥ ఓస్వామీ! నీవు పురాతనపురుషుఁడవు, సర్వమునకు నధీశ్వరుఁడైనవిష్ణుఁడవు, సర్వమును సృజించు స్వభావముగలవాఁడవు, నైననిన్ను నెఱుఁగుదును, ఎల్లప్రాణులకు ప్రతాపమును ధైర్యమును బలమును నీవే, సర్వప్రపంచమును పుట్టించుటకును పెంచుటకును నాశము చేయుటకును కర్తలైన త్రిమూర్తులను పుట్టింపను పెంపను నాశము చేయను కర్తవు నీవే, ప్రత్యగాత్మకు ప్రాపకుఁడవైన పరబ్రహ్మవును నీవే, అని తాత్పర్యము.

౬౩.—సీ॥ బాణాగ్ని నెవ్వఁడు * పఱపి పయోరాశి - నింకించి బంధించి * యేపు మాపెఁ
బరఁగ నెవ్వఁడు ప్రతా * ప ప్రభారాశిచే - దానవ గర్వాంధ * తమస మడఁచెఁ
గంజాతములు ద్రెంచు * కరిభంగి నెవ్వఁడు - దశకంఠుకంఠ బృం * దములు ద్రుంచె
నాచంద్రసూర్యమై * యమరు లంకారాజ్య - మునకు నెవ్వఁడు విభీ * షణుని నిలిపె

తే॥ నన్ను నేలిన లోకాధి * నాథుఁ డెవ్వఁ । డంచితోదార కరుణార * సాబ్ధి యెవ్వఁ
డాతఁడవు నీవకావె మ * హాత్మ నేఁడు । మాఱుపడి యెగ్గు చేసితి * మఱువ వలయు.

టీ॥ ఎవ్వఁడు=ఏపురుషుఁడు. బాణాగ్నిన్=బాణపు నిప్పును. పఱపి=వ్యాపింపఁజేసి. పయోరాశిన్ = సముద్రమును. ఇంకించి= ఇంకునట్లుచేసి. బంధించి = కట్టకట్టి. ఏపుమాపెన్ = గర్వమును పోఁగొట్టెనో. ఎవ్వఁడు=ఏపురుషుఁడు. పరఁగన్=ప్రసిద్ధముగా. ప్రతాపప్రభారాశిచేన్=ప్రతాపకాంతిసముదాయముచేత. దానవ గర్వాంధతమసమున్=రాక్షసుల గర్వమనెడిదట్టమయినచీఁకటిని. అడఁచెన్=అణఁచెనో. (ఎవ్వఁడు) కంజాతములు=కమలములను. త్రెంచు=తెగఁబెఱుకునట్టి. కరిభంగిన్ = ఏనుఁగువలె. దశకంఠు కంఠబృందములు = రావణుని తలలసమూహములను. త్రుంచెన్= నఱికెనో, (ఎవ్వఁడు) ఆచంద్రసూర్యమై=చంద్రసూర్యులుఉన్నంత కాలము ఉండునదియై. అమరులంకారాజ్యమునకున్ = ఒప్పునట్టి లంకదొరతనమునకు. (విభీషణుని) నిలిపెనో = ఏర్పఱచెనో. (ఎవ్వఁడు నన్ను) ఏలినలోకాధినాథుఁడు=సేవకునిగాఁజేసికొన్న లోకప్రభువో. (ఎవ్వఁడు) అంచితోదారకరుణారసాబ్ధి—అంచిత= ఒప్పిదమయిన, ఉదార=అడ్డులేని. కరుణారస=దయారసమునకు. అబ్ధి=సముద్రుఁడో. ఆతఁడవు=ఆయేలినవాఁడవు. నీవకావె=నీవే కదా. మహాత్మ=ఓగొప్పమహిమగలస్వామీ. (నేఁడు) మాఱుపడి= నీయాకృతిమాఱినందున నే నెదిరించి. ఎగ్గుచేసితిన్=తప్పుచేసినాను. మఱువవలయున్=ఈయేమఱిచేసినతప్పును మఱువవలయును.

తా॥ ఏపరమపురుషుఁడు తన బాణాగ్నిచేత సముద్రమును ఇంకించి కట్టకట్టి తనదైనప్రతాపాతిశయముచేత దట్టమయినచీఁకటి వలెనే దిక్కులను ఆవరించుచు పైకి వచ్చునట్టి రాక్షసులమూఁకను నాశముచేసి రావణునితలలనెల్లను తామరపువ్వులను తెగఁబెఱుకు నట్టి యేనుఁగువలె తెగనఱికివేసి సూర్యచంద్రు లున్నంతకాలమును ఏలుకొనునట్లు విభీషణునికి లంకాప్రభుత్వమును కలుగఁజేసెనో? ఏమహాపురుషుఁడు నన్నేలినలోకనాయకుఁడో? ఏపురుషోత్తముఁడు దయారసము అనెడు జలముచేత నిండుకొన్నసముద్రుఁడో, అటు వంటి మహానుభావుఁడైన శ్రీరామమూర్తివి, నీవేకదా, వేఱిదినము ఆరూపము మాఱి వేఱురూపముతో దర్శన మిచ్చినందున తెలిసికొ లేక నీయెడ అపరాధముచేసితిని, నాయపరాధమును మన్నింపవ రక్షింపుమని జాంబవంతుఁడు శ్రీకృష్ణుని ప్రార్థించెనని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ ఎవ్వఁడు=ఏబ్రహ్మవేత్త. బాణాగ్నిన్=(ప్రణవోధనుశ్శరో హ్యాత్మా) అను శ్రుతిచేత బాణమనఁగా, ప్రత్యగాత్మగనుక (ప్రత్యగాత్మస్వరూపేణ దృశ్యరూపేణచస్వయం) అను ప్రమాణమువలన ప్రత్యగాత్మ స్వరూపముతో దృశ్యరూపముతో తానే యున్నాఁడు కాఁబట్టి ప్రత్యగాత్మోహమనువిజ్ఞానమును. పఱపి = వ్యాపింపఁజేసి. అనఁగా,కనఁబడునది వినఁబడునది ఊహింపఁబడునది అంతయుప్రత్యగాత్మయేకాని అన్యముగాదని నిశ్చయించి. పయోరాశిన్ = అహంకారవ్యాపారమైన సంసారసముద్రమును, ఇంకించి=ఉప్పొంగకుండఁ జేసి. బంధించి = జనన మరణాదులనెడు తరంగములు లేకుండఁజేసి. ప్రతాపప్రభారాశిచేన్=ఆరూఢమైన అపరోక్షజ్ఞానసమూహముచేత. దానవగర్వాంధతమసము=అధోగతిపాలుచేయుచున్న కామక్రోధాది దుర్గుణములనెడు రాక్షసులగర్వమను చీఁకటిని. దశకంఠు = దశేంద్రియములనెడు దశశిరస్సులుగల జీవాహంకారుని యొక్క. కంఠబృందములు = జీవుఁడువేఱు దేవుఁడువేఱు నేనువేఱు నీవువేఱు అనునవి మొదలైన దుర్వృత్తులను. ఆచంద్రసూర్యమై = చంద్రమండల సూర్య మండలములుగలదై. ఇచ్చట మండలత్రయమునందు రెంటిని చెప్పుట చేత మూడవదియైన అగ్నిమండలమునుగూడ గ్రహింపవలెనుగాన సూర్యసోమాగ్నిమండల మధ్యమముననున్నదై. అమరు = మనోహరమగుచున్న. లంకారాజ్యమునకున్=లంక అనఁగా, నాలుగుప్రక్కల నీళ్లుగల మిట్టనేలకాఁబట్టి ఇడా పింగళా సుషుమ్నా నాడీరూపము లైన గంగా యమునా సరస్వతీ నదులనడుమనుండెడు చిదాకాశమును పాలించుట అనెడు దొరతనమునకు. విభీషణునిన్ = పోయిన మృత్యుభయముగలవానిని. (ద్వితీయాద్వైభయంభవతి భయంద్వితీయాభినివేశతస్స్యాత్) అనుశ్రుతిప్రమాణముచేత దేవుఁడుతనకంటె వేఱుగ నున్నాఁడనుటవలన జననమరణాదిభయము గలుగునుగనుక తన్నాశ్రయించిన బ్రహ్మవిద్యాభిలాషులకు అట్టిభేదజ్ఞానము లేకుండఁ జేసి—(తరతిశోకమాత్మవిత్, బ్రహ్మవిదాప్నోతిపరం) అను శ్రుతులను పట్టి నిర్వికల్పబ్రహ్మనిష్ఠగలవారినిగఁజేసియనుట. ఆతఁడు=ఆబ్రహ్మ వేత్త—నీవేకదా.

౬౪.—వ॥అనియిట్లు పరమభక్తుండైన జాంబవంతుండు వినుతించిన నతనిశరీరనిగ్రహ నివారణంబుగా
భక్తవత్సలుండైన హరి తనకరంబున నతనిశరీరంబునిమిరి మేఘగంభీరభాషణంబులనిట్లనియె.

టీ॥ (అనియిట్లు)పరమభక్తుండైన=ఉత్తమసేవకుఁడైన. (జాంబవంతుండు) వినుతించినన్ = పొగడఁగా. అతనిశరీరనిగ్రహనివారణంబుగాన్ = ఆజాంబవంతుని దేహశ్రమము నివారణము అగునట్టుగా. భక్తవత్సలుండైన = భక్తులయందు ప్రేమగలవాఁడైన. హరి=కృష్ణుఁడు. తనకరంబునన్ = తనచేతితో. (అతనిశరీరంబు నిమిరి) మేఘగంభీరభాషణంబులన్=మేఘధ్వనివలెనే గంభీరమైన ధ్వనిగలమాటలచేత. (ఇట్లనియెను)

తా॥ అని యీవిధముగా వేఁడుకొనిన యుత్తమ భక్తుఁడయిన జాంబవంతునియందు కరుణించి అతని దేహశ్రమ తీఱునట్టుగా తన దివ్యహస్తములతో అంతట నిమిరి మిక్కిలి గంభీరములయిన మాటలతో శ్రీకృష్ణమూర్తి యిట్లుపలికెనని తాత్పర్యము.

౬౫.—క॥ ఈమణి మాచేఁబడెనని। తామసు లొనరించు నింద * దప్పెడుకొఱకై
నీమందిరమగు బిలమున। కేమరు దెంచితిమి భల్లు * కేశ్వర వింటే.

టీ॥ భల్లుకేశ్వర = ఓయెలుఁగులరాజా — జాంబవంతుఁడా. వింటే=వింటివా. ఈమణి=ఈరత్నము. మాచేఁబడెననని=మాచేత చిక్కెనని. తామసులు=అజ్ఞానులు. ఒనరించునింద=చేయునట్టినింద. తప్పెడుకొఱకై=తప్పిపోవుటకుఁగాను. నీమందిరము = నీయిల్లు. అగుబిలమునకున్=అగునట్టి యీగుహకు. ఏము = మేము. అరుదెంచితిమి=వచ్చితిమి. భలభల్లపరిభాషణహింసాదానేషని ధాతువు.

తా॥ ఓ జాంబవంతుఁడా! నీవు వినోదపుబంతిగా నీబిడ్డయుయ్యాలలో వ్రేలఁగట్టిన యీరత్నమును మేము అపహరించితిమని కొందఱు అజ్ఞానులు మమ్ము నిందించుటచేత ఈరత్నమును కొనిపోయి యిచ్చి అనిందను పోఁగొట్టుకొనుటకై యిప్పుడు నీయిల్లయినయీగుహకువచ్చితిమిఅని శ్రీకృష్ణమూర్తిపలికెననితాత్పర్యము

౬౬.—వ॥అనినవినిసంతసించి జాంబవంతుండు మణియునుం దనకూఁతు జాంబవతియను కన్యకామణియునుం
దెచ్చి హరికిం గానుకగాసమర్పించె నట మున్నహరివెంటవచ్చినవారు బిలంబువాకిటం బండ్రెండు
దినంబులు హరిరాక కెదురుచూచి వేసఱివగచి తమపురంబునకుం జనిరంత దేవకీ వసుదేవులు
రుక్మిణియును మిత్ర బంధు జ్ఞాతి జనులును గుహసొచ్చి కృష్ణుండు రాఁడు చిక్కెనని శోకించి.

టీ॥ అనినన్=అనఁగా. (విని)సంతసించి=సంతోషించి. (జాంబవంతుండు) మణియును = శమంతకమణియు. తనకూఁతున్=తనకొమార్తెయయిన. (జాంబవతి) అనుకన్యకామణియును=అనుపేరుగల శ్రేష్ఠురాలయినకన్యకను. తెచ్చి=తీసికొనివచ్చి. (హరికి)కానుకగాన్=నజరుగా. సమర్పించెన్=ఇచ్చెను. అటమున్న = అంతకుముందే. హరివెంటవచ్చినవారు = కృష్ణునితోఁగూడ అడవికివచ్చిన యాదవులు. బిలంబువాకిటన్ = గుహవాకిటియందు. (పండ్రెండు దినంబులు) హరిరాకకున్ = కృష్ణునివచ్చుటకు. (ఎదురుచూచి) వేసఱి=నిరాశులై. వగచి=దుఃఖించి. తమపురంబునకుంజనిరి=తమపట్టణమునకుఁబోయిరి. అంతన్=అంతట. (దేవకీవసుదేవులును రుక్మిణియును)మిత్రబంధుజ్ఞాతిజనులును=స్నేహితులునుచుట్టములును దాయాదులునైన జనులును. గుహసొచ్చి = గుహలో ప్రవేశించి. (కృష్ణుండు) రాఁడు=వచ్చినవాఁడుకాఁడు. చిక్కెన్=ఆగుహలో చిక్కుపడిపోయెను. (అనిశోకించి)

తా॥ అని శ్రీకృష్ణమూర్తి చెప్పఁగా జాంబవంతుఁడు సంతోషించి శమంతకమణిని తనకూఁతురైన జాంబవతియనెడి యుత్తమకన్యకను కృష్ణమూర్తికి కానికగాసమర్పించెను ఇంతలోపల ఇక్కడ గుహవాకిట కాచియున్నయాదవులు పండ్రెండుదినములదాఁక శ్రీకృష్ణుఁడురాఁగలఁడనికనిపెట్టియుండి అంతటితోఇఁకరాఁడని నిరాశచేసికొని తమపట్టణమునకు పోయి చేరిరి అంతట ఈవృత్తాంతమును దేవకీ వసుదేవుఁడు రుక్మిణీదేవి యింకను కావలసినవారైన చుట్టములు చెలికాండ్రు దాయాదులు మొదలగువారు కృష్ణుఁడు గుహలోచిక్కుపడిపోయెననిదుఃఖమునొందినవారైఅనితాత్పర్యము.

౬౭.—క॥దుర్గమమగు బిలమున హరి। నిర్గతుఁడై చేరవలయు * నేడని పౌరుల్
వర్గములై సేవించిరి। దుర్గం గృతకుశలమార్గ * తోషిత భర్గన్.

టీ॥ దుర్గమమగుబిలమునన్ = చొరరానిదైన గుహయందుండి. హరి=కృష్ణుఁడు. నిర్గతుఁడై=బయలువెడలినవాఁడై. (నేడు) చేరవలయున్=పట్టణమునకు వచ్చి చేరవలెను. (అని) పౌరులు=పురజనులు. వర్గములై=గుమిగూడినవారై. కృతకుశలమార్గన్=చేయఁబడిన మంచిమార్గములుగలదియు. తోషితభర్గన్=సంతోషపెట్టఁబడిన శివుఁడుగలదియునైన. దుర్గన్=దుర్గాదేవిని—పార్వతీదేవిని అనుట. సేవించిరి = అనన్య భక్తి భయ వినయములతో కొలిచిరి.

తా॥ నేడు చొరరాని గుహలో చొచ్చి చిక్కుపడిన మాకృష్ణుఁడు బయటికి వచ్చునట్లు అనుగ్రహింపుమని యెల్లమేలులను కలుగఁజేయునదియు శ్రీమహేశ్వరునికి ప్రియురాలునైన దుర్గాదేవిని పురజనులందఱు గుంపుగూడి సేవించిరనితాత్పర్యము.




వసుదేవుఁడు. రుక్మిణిదేవి చెలికత్తెలు. ఉగ్రసేనుఁడు.

(*) దేవకీవసుదేవాదులు శ్రీకృష్ణుఁడు సురక్షితముగ వచ్చుటకై దుర్గాదేవిని పూజించుట. (*)

ఉ.—క॥ డోలాయిత మానసులై । జాలింబడి కొలుచుజనులఁ * జండిక పలికెన్
బాలామణితో మణితో । హేలాగతివచ్చు నంబు * జేక్షణుఁ డనుచున్.

టీ॥ డోలాయితమానసులై = ఉయ్యాలవలె ఊఁగులాడుచున్న మనస్సులుగలవారై—చలించుచున్న మనస్సులుగలవారై. జాలింబడి= విచారమనుపొంది. కొలుచుజనులన్ — సేవించునట్టి పురజనులను గూర్చి. చండిక=దుర్గాదేవి. బాలామణితోన్=స్త్రీరత్నముతోను. మణితోన్ = రత్నముతోను. అంబుజేక్షణుఁడు = శ్రీకృష్ణమూర్తి. హేలాగతిన్ = ఒయ్యారపునడకతో. (వచ్చు నంచు పలికెను)

తా॥ ఇట్లు తత్తఱపడుచున్న మనస్సులతో పురజనులందఱు సేవింపఁగా ఆదుర్గాదేవి శ్రీకృష్ణమూర్తి ఒక స్త్రీరత్నమును రత్నమును తీసికొని ఒయ్యారపునడలతో నెమ్మదిగా రాఁగలఁడు మీరు చింతింప నక్కఱలేదని ఆపురజనులను గూర్చి యానతిచ్చెనని తా.

ఉ.—క॥ యత్నము సఫలంబైన స । పత్నసమూహములు బెగడఁ * బద్మాక్షుండా
రత్నముతోఁ గన్యాజన । రత్నముతోఁ బురికి వచ్చె * రయమున నంతన్.

టీ॥ అంతన్=అనంతరము. యత్నము=తన ప్రయత్నము. సఫలంబైనన్ = సఫలమౌఁగా. సపత్నసమూహములు = శత్రువుల మూఁకలు. బెగడన్=భయపడునట్లు. పద్మాక్షుండు=కృష్ణుఁడు. ఆరత్నముతోన్=ఆశమంతకమణితోను. కన్యాజనరత్నముతోన్=

కన్యలలోరత్నమువంటిదైన జాంబవతితోను. పురికిన్ = ద్వారకా పట్టణమునకు. రయమునన్ = శీఘ్రముగ. వచ్చెన్ = వచ్చెను.

తా॥ అంతట శ్రీకృష్ణుఁడును తానుచేసిన యత్నము నెఱవేఱఁగా తనపై నింద మోపినవారికి భయము పుట్టునట్లు శమంతక రత్నమును జాంబవతిని తీసికొని తనపట్టణమయిన ద్వారకకు వచ్చి చేరెనని తాత్పర్యము.

౨౦.—క॥ మృతుఁడైనవాఁడు పునరా । గతుఁడైన క్రియం దలంచి ✻ కన్యామణి సం
యుతుఁడై వచ్చిన హరిఁగని । వితతోత్సవ కౌతుకముల ✻ వెలసిరి పౌరుల్.

టీ॥ మృతుఁడైనవాఁడు = చచ్చినవాఁడు. పునరాగతుఁడైన క్రియన్ = మరల బ్రతికివచ్చినవిధమున. తలంచి = ఎంచి. పౌరులు = పురజనులు. కన్యామణిసంయుతుఁడై = కన్యకతోను శమంతకమణితోనుకూడుకొన్నవాఁడై. వచ్చినహరిన్ = వచ్చినట్టి శ్రీకృష్ణమూర్తిని. (కని) వితతోత్సవకౌతుకములన్ = విశేషములైన వేడుకలతోను కుతూహలములతోను. వెలసిరి = ప్రకాశించిరి.

తా॥ చచ్చినవాఁడు మరల బ్రతికివచ్చినట్లు శమంతకమణిని జాంబవతిని తీసికొని వచ్చిన శ్రీకృష్ణమూర్తినిజూచి పురజనులందఱు అధికసంతోషమునుకుతూహలమును పొందినవారలైరనితాత్పర్యము.

౨౧.—వ॥ ఇట్లు హరి తన పరాక్రమంబున జాంబవతీ దేవిం బరిగ్రహించి రాజసభకు సత్రాజిత్తుం
బిలిపించి యావృత్తాంత మంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణి నిచ్చిన నతండు సిగ్గువడి
మణిం బుచ్చుకొని పశ్చాత్తాపంబు నొందుచు బలవద్విరోధంబునకు వెఱచుచు నింటికిం జని.

టీ॥ (ఇట్లు) హరి = కృష్ణుఁడు. తనపరాక్రమంబునన్ = తనశూరత్వముచేత. (జాంబవతీదేవిని) పరిగ్రహించి = కైకొని. రాజసభకున్ = రాజైన యుగ్రసేనుని కొలువుకూటమునకు. (సత్రాజిత్తును పిలిపించి) ఆవృత్తాంతమంతయున్ = తాను పోయివచ్చిన సమాచారమంతయు. ఎఱింగించి = తెలియఁజేసి. (సత్రాజిత్తునకు) మణినిచ్చినన్ = శమంతకమణినియియ్యఁగా. అతండు = ఆసత్రాజిత్తు. (సిగ్గుపడి) మణింబుచ్చుకొని = మణినితీసికొని. పశ్చాత్తాపంబు నొందుచున్ = తెలియక యిట్లుచేసితినేయని నొచ్చుకొనుచు. బలవద్విరోధంబునకున్ = బలవంతుఁడైన కృష్ణునితోడి విరోధమునకు. వెఱచుచున్ = భయపడుచు. ఇంటికింజని = తనయింటికిపోయి.

తా॥ ఈవిధముగా కృష్ణుఁడు తన పరాక్రమముచేత జాంబవంతుని గెలిచి జాంబవతిని పెండ్లియాడి రాజు కొలువుకూటమునకు సత్రాజిత్తును రప్పించి రత్నము పోయిన పోకయు తాను జాడఁబట్టి తెచ్చినవిధమును అందఱకు తెలియఁజెప్పి శమంతకమణిని సత్రాజిత్తునకు ఇయ్యఁగా అతఁడు సిగ్గుచేత తలవంచుకొని రత్నమును పుచ్చుకొన్నవాఁడై తెలివిమాలి కృష్ణుని నిందించితినేయని నొచ్చుకొనుచు ఆబలవంతుని విరోధమువలన తనకేమికీడుమూఁడునోయని భయపడుచు తనయింటికి పోయినవాఁడైయని తాత్పర్యము.

౨౨.—క॥ పాపాత్ముల పాపములం । బాపంగా నోపునట్టి ✻ పద్మాక్షునిపైఁ
బాపము గలదని నొడివిన । పాపాత్ముని పాపమునకుఁ ✻ బారము గలదే.

టీ॥ పాపాత్ములపాపములన్ = పాపబుద్ధిగలవారిపాపములను. పాపంగాన్ = పోఁగొట్టుటకు. ఓపునట్టి = సామర్థ్యముగలవాఁడైన. పద్మాక్షునిపైన్ = శ్రీకృష్ణమూర్తిమీఁద. పాపముగలదని = తప్పుగలదని. నొడివినపాపాత్మునిపాపమునకున్ = చెప్పిన పాపబుద్ధిగలవాని పాపమునకు. పారముగలదే = మేరగలదా.

తా॥ లోకములోని పాపబుద్ధిగలవారిపాపములనెల్ల పోఁగొట్టఁజాలిన శ్రీకృష్ణమూర్తియందు పాపమునుమోపిన పాపాత్మునియొక్క పాపమునకు మేరగలదా లేదు అనఁగా, అది ఏవిధముచేతను పోలఁగని పాపము అని తాత్పర్యము.

౨౩.—మ॥ మితభాషిత్వము మాని యేల హరిపై ✻ మిథ్యాభియోగంబు చే
సితిఁ బాపాత్ముఁడ నర్థలోభుఁడను దు ✻ శ్చింతుండ మత్తుండ దు
ర్మతి నీదేహముఁ గాల్పనే దురిత మే ✻ మార్గంబునం బాయునే
గతిఁ గంసారి ప్రసన్నుఁడై మనుచునన్ ✻ గారుణ్య భావంబునన్.

టీ॥ మితభాషిత్వమున్ = తగినట్టు మాటలాడు స్వభావమును. మాని = విడిచి. ఏల = ఎందుకు. హరిపైన్ = కృష్ణునిమీఁద. మిథ్యాభియోగంబుచేసితిన్ = లేనినింద మోపితిని. పాపాత్ముఁడను = పాపస్వభావముగలవాఁడను. అర్థలోభుఁడను = ధనమునందుఅత్యాశగలవాఁడను. దుశ్చింతుండన్ = చెడ్డఆలోచనగలవాఁడను. మత్తుండన్ = ఒళ్లు తెలియనివాఁడను. దుర్మతిన్ = చెడ్డబుద్ధిగలవాఁడను. ఈదేహమున్ = ఇట్టి యకృత్యములకు సాధకమైన దేహమును. కాల్పనే = తగులఁబెట్టనా. దురితము = కృష్ణునిపై నిందమోపిన పాపము. ఏమార్గంబునంబాయున్ = ఏవిధముగా తొలఁగును. ఏగతిన్ = ఏవిధముగా. కంసారి = శ్రీకృష్ణమూర్తి. ప్రసన్నుఁడై = అనుగ్రహము గలవాఁడై. కారుణ్యభావంబునన్ = దయతోడిస్వభావముతో. నన్ = నన్ను. మనుచున్ = మన్నించును.

తా॥ నేను ఎవరియెడల యెట్లు మాటలాడవచ్చునో అది తెలిసి

మాటాడక శ్రీకృష్ణమూర్తిమీఁద లేని నింద యేల మోపితిని, పాప స్వభావముగలవాఁడును, ధనలోభము గలవాఁడును, చెడ్డఆలోచన గలవాఁడును, మత్తుగొన్నవాఁడును, చెడ్డబుద్ధిగలవాఁడును అయిన యీనా దేహమును కాల్పవలెను లేనిపక్షమున ఈమహాపురుషునియెడ నింద మోపిన మహాపాతకము ఎట్లుతొలఁగును ఇఁక శ్రీకృష్ణమూర్తి యేరీతిగా దయచేసినన్ను మన్నించునుఅని విచారించెనని.

౨౪.—ఆ॥ మణినిఁ గూఁతు నిచ్చి * మాధవు పదములఁ । బట్టుకొంటి నేని * బ్రతుకు గలదు
సంతసించు నతఁడు * సదుపాయ మగునిది । సత్య మితరవృత్తిఁ * జక్కఁబడదు.

టీ॥ మణిని=శమంతకమణిని. కూఁతుర్=నా కొమార్తను. (ఇచ్చి) మాధవుపదములన్ = లక్ష్మీపతియైన శ్రీకృష్ణమూర్తి పాదములను. (పట్టుకొంటి నేని) బ్రదుకుగలదు=నాకుజీవనముగలదు—నేను బ్రతికి యుండవచ్చును. అతఁడు=ఆశ్రీకృష్ణుఁడు. సంతసించున్=దీనిచేత సంతోషించును. (ఇది) సదుపాయము=మంచియుపాయము. అగున్= అవును. సత్యము=నిజముగా. ఇతరవృత్తిన్ = మఱియొకపనిచేత. చక్కఁబడదు=ఈకార్యము నెఱవేఱదు—ఇదే మంచియుక్తిఅను.

తా॥ శమంతకమణిని నాకూఁతురైన సత్యభామను కొనిపోయి సమర్పించి పాదములమీఁదఁబడితినేని శ్రీకృష్ణమూర్తి సంతోషించు నేను సుఖముగా జీవింపవచ్చును ఇదియే మంచియుపాయము ఇంతకు మించిన ఉపాయమే సత్యముగా విచారించునపుడు మఱియేదియు కాదు అని తాత్పర్యము.







వసుదేవుఁడు.







సత్రాజిత్తు.

(*) శ్రీకృష్ణుఁడు సత్యభామను పెండ్లియాడుట. (*)

౨౫.—మ॥ అని యిబ్భంగి బహుప్రకారముల నే * కాంతస్థుఁడై యింటిలోఁ
దనబుద్ధిం బరికించి నీతిఁగని స * త్రాజిత్తు సంప్రాప్తశో
భనుఁడై యిచ్చె విపత్పయోధి తరికిన్ * భామా మనో హారికిన్
దనుజాధీశ విదారికిన్ హరికిఁ గాం * తారత్నమున్ రత్నమున్.

టీ॥ (అని) ఇబ్భంగిన్ = ఈవిధముగా. (సత్రాజిత్తు) బహుప్రకారములన్=పలువిధములచేత. ఇంటిలోన్ = తనయింటిలో. ఏకాంతస్థుఁడై = ఏకాంతమునందున్నవాఁడై. తనబుద్ధిన్=స్వబుద్ధిచేత. పరికించి=విచారించి. నీతిన్=న్యాయమును. కని=తెలిసికొని. సంప్రాప్తశోభనుఁడై = పొందఁబడిన శుభముగలవాఁడై. విపత్పయోధితరికిన్ = ఆపదలనెడు సముద్రమునకు ఓడయైనవాఁడును.

భామామనోహారికిన్=ఆఁడువారిమనసులకుఁ బ్రియమైనవాఁడును. దనుజాధీశవిదారికిన్ = రాక్షసరాజులను ఛేదించువాఁడునునైన. హారికిన్=శ్రీకృష్ణమూర్తికి. కాంతారత్నముఁ=స్త్రీరత్నమయినతన కొమార్తను. రత్నముఁ=శమంతకమణిని. ఇచ్చెను=సమర్పించెను.

తా॥ అని యీప్రకారముగా సత్రాజిత్తు బహువిధముల తన యింటిలో ఏకాంతమునం దాలోచనలుచేసి కడపటు స్వబుద్ధిచేతనే న్యాయ మిట్టిదని తెలిసి మేలుఁబొందువాఁడై ఆపదలనెడు సముద్రమును ఱేఁడయై దాఁటించువాఁడును, ఆఁడువారిమనసులకు ఇంపును బుట్టించువాఁడును, రాక్షసులనెల్లను చంపువాఁడు నైన శ్రీకృష్ణమూర్తికి తాననుకొన్నచొప్పున కొమార్తను శమంతకమణిని కొనిపోయి సమర్పించెనని తాత్పర్యము.

౭౬.—ఉ॥ తామరసాక్షుఁ డచ్యుతుఁడు * దారయశోనిధి పెండ్లియాడె నా
నామనుజేంద్ర నందిత గు * ణస్థితి లక్షణ సత్యభామ ను
ద్దామ పతివ్ర తాత్వ నయ * ధర్మ విచక్ష ణతా దయా యశః
కామను సత్యభామను ము * ఖద్యుతి నిర్జిత సోమ నయ్యెడన్.

టీ॥ అయ్యెడన్ = ఆసమయమునందు. తామరసాక్షుఁడు = కమలములవంటి కన్నులుగలవాఁడును. అచ్యుతుఁడు = నశింపనివాఁడును. ఉదారయశోనిధి=అడ్డులేని కీర్తిగలవాఁడునునైన శ్రీకృష్ణుఁడు. నానా...భామన్—నానా=అనేకులయిన. మనుజేంద్ర=రాజులచేత. నందిత=కొనియాడఁబడిన. గుణ = మంచిగుణముల యొక్క. స్థితి=ఉనికియే. లక్షణ=గుఱుతు అనెడు. సత్య = నిజమైన. భామన్=కాంతిగలదానిని. ఉద్దామ...కామన్—ఉద్దామ=ఘనమైన. పతివ్రతాత్వ=పాతివ్రత్యమనెడు. నయ=నీతితోడి. ధర్మ=స్వభావముయొక్క. విచక్షణతా = నేర్పును. దయా = దయను. యశః=కీర్తిని. కామన్ = కోరుదానిని. ముఖద్యుతినిర్జితసోమన్—ముఖద్యుతి=ముఖకాంతిచేత. నిర్జిత = జయింపఁబడిన. సోమన్=చంద్రుఁడుగలదానిని. (సత్యభామను పెండ్లియాడెను)

తా॥ ఆసమయమునందు కమలములవంటి నేత్రములుగలవాఁడును, నాశము లేనివాఁడును, విశేషకీర్తిగలవాఁడునైన శ్రీకృష్ణమూర్తి ఎల్లరాజులచేతను గొనియాడఁబడిన మంచిగుణములు గలిగి ప్రకాశించునదియు, పతివ్రతాధర్మము నడప నిచ్ఛగలదియు, ప్రాణులయందు దయగలదియు, కీర్తినికోరునదియు, చంద్రునిదిరస్కరించిన ముఖవికాసముగల్లదియు నైన సత్యభామను పెండ్లాడెనని తాత్పర్యము.

౭౭.—క॥ మణి యిచ్చినాఁడు వాసర । మణి నీకును మాకుఁగలవు * మణులు కుమారీ
మణిచాలునంచుఁ గృష్ణుఁడు । మణి సత్రాజిత్తునకును * మరలఁగ నిచ్చెన్.

టీ॥ (కృష్ణుఁడు నీకు) వాసరమణి=సూర్యుఁడు. (మణియిచ్చినాఁడు మాకు) కలవుమణులు=అనేకరత్నములు గలవు. కుమారీమణిచాలున్ = శ్రేష్ఠురాలయినయీకన్యకచాలును. అంచున్ = అని. (మణిని సత్రాజిత్తునకు) మరలఁగన్ = తిరుగా. (ఇచ్చెను)

తా॥ అప్పుడు శ్రీకృష్ణమూర్తి సత్యభామను పెండ్లాడి మాకు ఈకన్యకయే చాలును నీకు సూర్యుఁడు ఇచ్చినమణిని మరల నీవేతీసికొనిపో? మాకు ఇటువంటిరత్నములు ఎన్నో ఉన్నవి అని శమంతకమణిని మరల సత్రాజిత్తునకు ఇచ్చెనని తాత్పర్యము.

## (*) కుంతీపాండవులు లక్కయింటఁగాలుటవిని రామకృష్ణులు హస్తినాపురికరుగుట. (*)



కుంతీదేవి. పాండవులు.




కృపాచార్యులు.


భీష్ముఁడు.


కృష్ణుఁడు.


ధృతరాష్ట్రుఁడు.


ద్రోణాచార్యులు.

(*) శ్రీకృష్ణమూర్తి ధృతరాష్ట్రాదులకు దుఃఖోపశమనంబు చేయుట. (*)

వ॥ అంతనక్కడకుంతీసహితులైన పాండవులులాక్షాగారంబునదగ్ధులైరనివిని నిఖిలార్థదర్శనుండయ్యునుగృష్ణుండుబల భద్రసహితుండైకరినగరంబునకుఁజని కృపవిదురగాంధారీభీష్మద్రోణులంగనిదుఃఖోపశమనంబు సేయునయ్యెడ.

టీ॥ అంతన్ = అటుపిమ్మట. అక్కడ = హస్తినాపట్టణమునందు. కుంతీసహితులయినపాండవులు = కుంతీదేవితోఁగూడినపాండురాజు కొడుకులు. లాక్షాగారంబునన్ = లక్కయింట. దగ్ధులైరి = కాలిపోయిరి. అనివిని = అనివృత్తాంతమరాఁగావిని. (కృష్ణుండు) నిఖిలార్థదర్శనుండు = ఎల్లవిషయములను చూచుటగలవాఁడు—సర్వము నెఱిఁగినవాఁడు. అయ్యును = అయియుండియు. బలభద్రసహితుండై = బలరామునితోఁ గూడుకొన్నవాఁడై. కరినగరంబునకున్ = హస్తినాపట్టణమునకు. చని = పోయి. (కృపవిదురగాంధారీభీష్మద్రోణులను) కని = చూచి. దుఃఖోపశమనంబు = దుఃఖమునుఅణఁచుటను. చేయునయ్యెడన్ = చేయునప్పుడు.

తా॥ అటుపిమ్మట హస్తినాపట్టణములో కుంతీదేవియు ఆమె కొడుకులయిన ధర్మరాజు మొదలగువారును లక్కయింటఁజిక్కి కాలిపోయిరను వృత్తాంతమును విని కృష్ణుఁడు సర్వము తెలిసినవాఁడుగానుండియు బలరామునితోఁగూడ హస్తినాపట్టణమునకుఁబోయి కృపాచార్యులు విదురుఁడు ద్రోణాచార్యులు భీష్ముఁడు ధృతరాష్ట్రుఁడు మొదలగువారిని జూచి యూఱడించునప్పుడనితా.


అక్రూరుఁడు.


కృతవర్మ.


అంతఃపుర స్త్రీలు.
శతధన్వుఁడు.

(*) అక్రూరకృతవర్మలు ప్రేరేఁప శతధన్వుఁడుసత్రాజిత్తుంజంపి మణినపహరించుట. (*)

౭౯.—సీ॥ జగతీశ వినవయ్య * శతధన్వుఁ బాడగని - యక్రూరకృతవర్మ * లాప్తవృత్తి
మనకిత్తుననుచు స * మ్మతిఁజేసి తనకూఁతుఁ - బద్మాక్షునకు నిచ్చి * పాడిదప్పె
ఖలుఁడు సత్రాజిత్తు * గడఁగిమేక్రియనైన - మణిఁ బుచ్చుకొనుము నీ * మతము మెఱసి
యనితన్నుఁ బ్రేరేఁప * నాశత ధన్వుఁడు - పశువుఁ గటికవాఁడు * పట్టిచంపు

ఆ॥ కరణి నిదురవోవఁ * గడఁగి సత్రాజిత్తుఁ । బట్టిచంపి వాని * భామలెల్ల
మొఱలు వెట్టలోభ * మునఁజేసి మణిఁగొంచుఁ । జనియె నొక్కనాఁడు * జనవరేణ్య.

టీ॥ జగతీశ = ఓరాజా. వినవయ్య = వినుము. అక్రూరకృతవర్మలు=అక్రూరుఁడును కృతవర్మయు. ఆ ప్తవృత్తిక్ = కావలసినవారినడవడితో. శతధన్వుక్ = శతధన్వుఁడు అనువానిని. పొడగని=చూచి. ఖలుఁడు=దుర్జనుఁడయిన(సత్రాజిత్తు)తనకూఁతుక్=తనకొమార్తను. మనకిత్తుననుచుక్ = మనకు ఇచ్చెదనని. సమ్మతిఁజేసి = ఒప్పుకొని. పద్మాక్షునకుక్ = కృష్ణునికి. (ఇచ్చి) పాడి=న్యాయము. (తప్పెను) నీమతము మెఱసి=నీయభిప్రాయముసుప్రకాశింపఁజేసి — వానికి తెలియఁజేసి. కడఁగి = ప్రయత్నించి. ఏక్రియ నైనక్=ఏవిధముచేతనైనను. (మణిని)పుచ్చుకొనుము=తీసికొనుము. (అని) తన్నుఁద్రేరేఁపక్ = తన్నుపురికొలుపఁగా. జనవరేణ్య = రాజా. (ఒక్కనాడు ఆశతధన్వుఁడు) పశువుక్ = మృగమును. కటికవాఁడు=కసాయివాఁడు. (పట్టి) చంపుకరణిక్=చంపెడువిధమున. (సత్రాజిత్తును) నిదురవోవక్ = నిద్రపోవుచుండఁగా. కడఁగి=ప్రయత్నపడి. (పట్టిచంపి) వానిభామలెల్లక్=వానిపెండ్లాలందఱు. మొఱలుపెట్టక్ = ఆపదవిన్నపములుచేయఁగా. లోభమునఁజేసి=లుబ్ధత్వముచేత. మణిక్=శమంతకమును. కొంచుక్=తీసికొని. చనియెక్=పోయెను.

తా॥ ఓరాజా! ఆసమయమునందు అక్రూరుఁడునుకృతవర్మయు సత్రాజిత్తునందు కోపముగలవారై శతధన్వునిఁబిలిచి సత్రాజిత్తు తనకొమార్తను మనకు నిచ్చునట్లు నిశ్చయముచేసియుండి యిప్పుడు కృష్ణుని కిచ్చి అక్రమముచేసినాడు కాఁబట్టి నీవు ఏవిధముచేతనైన నీయభిప్రాయము అనఁగా సత్రాజిత్తును శిక్షించుట యనునది నెఱవేఱునట్లుగా ప్రయత్నముచేసి వానియొద్దనుండి శమంతకమణిని పుచ్చుకొమ్మని పురికొలుపఁగా ఆశతధన్వుఁడు ఒకనాడు సత్రాజిత్తు నిద్రపోవుచుండఁగా ఇంటఁజొచ్చి వానిఁబట్టుకొని కసాయివాఁడు మృగమును జంపునట్లు గొంతుకోసి చంపి వానిపెండ్లాలందఱు కుయ్యో మొఱోయని యేడ్చుచుండఁగా రత్నమును తీసికొని పోయెను అని తాత్పర్యము.







(*) శ్రీకృష్ణుఁడు సత్యభామా బలభద్రులతోడ ద్వారకకు వచ్చుట. (*)

వ॥ ఇట్లు హతుండైన తండ్రిం గని శోకించి సత్యభామ యతనిం దైలద్రోణియందుఁ బెట్టించి హస్తిపురంబునకుం జని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తు మరణంబు విన్నవించిన హరియును బలభద్రుండు నీశ్వరు లయ్యును మనుష్యభావంబుల విలపించి రంత సత్యభామా బలభద్రసహితుండై హరి ద్వారకానగరంబునకు మరలివచ్చి శతధన్వుం జంపెదనని తలంచిన నెఱింగి శతధన్వుండు ప్రాణభయంబునఁ గృతవర్మ యింటికిం జని తనకు సహాయుండవు గమ్మని పలికినఁ గృతవర్మ యిట్లనియె.

టీ॥ (సత్యభామ) ఇట్లు=ఈవిధముగా. హతుండైనతండ్రిక్=చంపఁబడినవాఁడైనతండ్రిని. కని=చూచి. శోకించి = దుఃఖించి. అతనిక్=ఆతండ్రియైన సత్రాజిత్తును. తైలద్రోణియందుక్=నూనెకొప్పెరయందు. (పెట్టించి) హస్తిపురంబునకుక్ = హస్తినాపట్టణమునకు. చని=పోయి. సర్వజ్ఞుండైనహరికిక్ = ఎల్లవిషయములుఁ దెలిసినవాఁడైన శ్రీకృష్ణమూర్తికి. సత్రాజిత్తుమరణంబుక్=సత్రాజిత్తుచావును. విన్నవించినక్ = తెలియఁజెప్పఁగా. హరియును = కృష్ణుఁడును. బలభద్రుండును = బలరాముఁడును. ఈశ్వరులయ్యుక్=సర్వనియామకులైయుండియు. మనుష్యభావంబులక్=మనుష్యస్వభావములతో. విలపించిరి = దుఃఖముతోడిమాటలాడిరి. అంతక్=అంతట. సత్యభామాబలభద్రసహితుండై = సత్యభామతోనుబలరామునితోడనుగూడుకొన్న. హరి=కృష్ణుఁడు.(ద్వారకానగరంబునకుమరలివచ్చి శతధన్వుని చంపెదను అని) తలంచినక్=ఎంచఁగా. (శతధన్వుండు) ఎఱింగి=ఆయెన్నిక తెలిసి. ప్రాణభయంబునక్=ప్రాణముపోవునను భయముచేత. (కృతవర్మయింటికింజని) తనకుసహాయుండవుగమ్ము = నాకుతోడుపడుము. అనిపలికినక్=అనిచెప్పఁగా. కృతవర్మయిట్లనియెక్ = కృతవర్మ యిట్లుపలికెను.

తా॥ అంతట సత్యభామ అట్లు చచ్చిన తన తండ్రిదేహమును కంపెత్తి చెడకుండ నూనెకొప్పెరలో పెట్టించి వెంటనే హస్తినాపట్టణమునకుఁ బోయి శ్రీకృష్ణమూర్తికి తనతండ్రిచావు తెలియఁజేయఁగా అతఁడును బలరాముఁడు కొంచెము దుఃఖించి అందుండి బయలుదేఱి ద్వారకాపట్టణమునకు వచ్చిరి అప్పుడు శ్రీకృష్ణుఁడు శతధన్వునిఁ జంపునట్లు నిశ్చయింపఁగా ఆయభిప్రాయము తెలిసి భయపడినవాఁడై శతధన్వుఁడు కృతవర్మయింటికి పోయి అతనిని తనకుతోడుపడుమనఁగాకృతవర్మశతధన్వునితో నిట్లుపలికెననితా.

## (*) శతధన్వుఁడు అక్రూర కృతవర్మలను కృష్ణబలరాముల నెదిరింప తోడుపిలుచుట. (*)


అక్రూరుఁడు.


కృతవర్మ.


శతధన్వుఁడు.

ఉ॥ అక్కట రామకృష్ణులు మ * 
హాత్ములు వారల కెగ్గుసేయఁగా
నిక్కడ నెవ్వఁడోపు విను * 
మేర్పడఁ గంసుఁడు బంధుయుక్తుఁడై
చిక్కఁడె మున్ను మాగధుఁడు * 
సేనలతోఁ బదియేడు తోయముల్
దిక్కులఁబాఱఁడే మనకు * 
దృష్టము వారల లావు వింతయే.

టీ॥ అక్కట=అయ్యో. (రామకృష్ణులు) మహాత్ములు = విరాట్స్వరూపులు. వారలకున్=ఆరామకృష్ణులకు. ఎగ్గుసేయఁగాన్=కీడుచేయను. ఇక్కడన్=ఈచోట.(ఎవ్వఁడు) ఓపున్=చాలును. ఏర్పడన్ = విశదముగా. వినుము = చెప్పెదనువినుము. మున్ను=మునుపు. (కంసుఁడు)బంధుయుక్తుఁడై=చుట్టములతోఁగూడుకొన్నవాఁడై. చిక్కఁడె=చిక్కుపడలేదా—నశింపలేదా. మాగధుఁడు=జరాసంధుఁడు. పదియేడుతోయములు=పదియేడుమాఱులు. సేనలతోన్=దండుతో. దిక్కులన్=దిక్కులయందు. పాఱఁడే=పఱ గెత్తలేదా. వారలలావు = రామకృష్ణులబలము. మనకుదృష్టము=మనకు కనఁబడినది. వింతయే=క్రొత్తదా.

తా॥ అయ్యో రామకృష్ణులువిరాట్స్వరూపులే,వారికికీడుచేయుటకు ఇక్కడ యెవఁడుచాలును, వారి బలము సామర్థ్యము మనకు క్రొత్తగాదు, వారివిరోధముచేత కంసుఁడు తనచుట్టములతోడనశించెను, జరాసంధుఁడు పదియేడుమార్లు దండెత్తివచ్చి పోరాడ లేక ఓడి పాఱిపోయెను కనుక నేను నీకు తోడుపడఁ జాలననెననితా.

౮౨.—వ॥ అనియుత్తరంబు చెప్పిన విని శతధన్వుం డక్రూరుని యింటికిం జని హరితోడి పగకుం దోడు
రమ్మని చీరిన నక్రూరుండు హరి బలపరాక్రమధైర్యస్థైర్యంబు లుగ్గడించి మఱియునిట్లనియె.

టీ॥ అనియుత్తరంబుచెప్పినన్ = అనియిట్లు బదులుచెప్పఁగా. (వినిశతధన్వుండు అక్రూరునియింటికి) చనిపోయి. హరితోడి పగకున్ = కృష్ణునితోడివిరోధమునకు. (తోడురమ్మని) చీరినన్=పిలువఁగా. (అక్రూరుండు) హరిబలపరాక్రమధైర్యస్థైర్యంబులు = కృష్ణునియొక్కబలము పరాక్రమము ధీరత్వము చలింపక నిలుచుటలు. ఉగ్గడించి=చెప్పి. (మఱియునిట్లనియెను)

తా॥ అనికృతవర్మప్రత్యుత్తరముచెప్పఁగా శతధన్వుఁడు అక్రూరునియింటికిపోయి కృష్ణునితోపోరాడుటకు తోడుపడుదువురమ్మని పిలువఁగా అక్రూరుఁడు కృష్ణునిబలమును పరులను ఆక్రమించు సామర్థ్యమును ధీరత్వమునుచలింపక నిలుచునట్టిస్వభావమును విశదముగా తెలియఁజెప్పి మఱియు నిట్లు మందలించెనని తాత్పర్యము.

౮౩.—సీ॥ ఎవ్వఁడు విశ్వంబు * నెల్ల సలీలుఁడై - పుట్టించు రక్షించుఁ * బొలియఁజేయు
నెవ్వని చేష్టల * నెఱుఁగరు బ్రహ్మాదు - లెవ్వనిమాయ మో * హించు భువన
మేడేండ్లబాలుఁడై * యేవిభుఁ డొకచేత - గోరక్షణమునకై * కొండనెత్తె
నెవ్వఁడు కూటస్థుఁ * డీశ్వరుఁ డచ్యుత - కర్ముఁ డనంతుఁడు * కర్మసాక్షి

తే॥ యట్టిఘనునకు శౌరికి * ననవరతము । మ్రొక్కెదముగాక విద్వేష * మునకు నేము
వెఱతుమొల్లము నీపొందు * వేగఁబొమ్ము । చాలుఁ బదివేలువచ్చె నీ * సఖ్యమునను.

టీ॥ ఎవ్వఁడు = ఏపురుషుఁడు. విశ్వంబునెల్లన్=ప్రపంచమునెల్లను. సలీలుఁడై = విలాసముతోఁ గూడుకొన్నవాఁడై (పుట్టించును రక్షించును) పొలియఁజేయున్=నాశముచేయునో. ఎవ్వని చేష్టలన్ = ఎవనియొక్కకార్యములను. బ్రహ్మాదులును = బ్రహ్మ మొదలగువారును. ఎఱుఁగరు=తెలియలేరో. ఎవ్వనిమాయన్=ఎవనిమాయచేత. భువనము=లోకము. మోహించున్=మోహము

కొండనో. ఏవిభుఁడు=ఏయేలినవాఁడు. ఏడేండ్లబాలుఁడై = ఏడు సంవత్సరములపిన్నవాఁడై. గోరక్షణమునకై=గోవులనుకాపాడుటకొఱకు. ఒకచేతన్ = ఒకచేతితో. కొండనెత్తెన్ = కొండను ఎత్తెనో. ఎవ్వఁడు=ఏమహాత్ముఁడు. కూటస్థుఁడు = క్షేత్రజ్ఞుఁడో. ఈశ్వరుఁడు=సర్వనియామకుఁడో. అద్భుతకర్ముఁడు=వింతపనులు గలవాఁడో. అనంతుఁడు=అంతము (నాశము) లేనివాఁడో. కర్మసాక్షి = ఇంద్రియవ్యాపారములను చూచుచుండువాఁడో. అట్టి ఘనునకున్ = అటువంటిమహాపురుషునికి. శౌరికిన్ = శూరుని మనుమఁడైనకృష్ణునికి. అనవరతము=ఎల్లప్పుడు. మ్రొక్కెదము= మ్రొక్కుదుము. కాక=అట్లుగాక. విద్వేషమునకున్=విరోధించుటకు. వెఱతుము=మేముభయపడుదుము. నీపొందు=నీస్నేహము. ఒల్లము=అపేక్షింపము. నీసఖ్యమునన్ = నీస్నేహముచేత. పదివేలువచ్చెన్ = బహుధనమువచ్చెను. చాలున్ = చాలును. వేగపొమ్ము=శీఘ్రముగాఅవతలపో.

తా॥ ఈసర్వప్రపంచమును త్రిమూర్తిస్వరూపముచేత ఆట్లాటవలెనే పుట్టించి పెంచినశింపఁజేయువాఁడు ఎవఁడో, ఎవనియొక్క చర్యలు బ్రహ్మ మొదలగువారుగూడ తెలిసికోలేకయుందురో, ఎవని మాయచేత లోకమంతయు భ్రమను పొందుచున్నదో, ఏడేండ్లపిల్లకాయగానుండియు గోవులను కాపాడుటకొఱకు ఒంటిచేతితో కొండను ఎత్తి గొడుగుగాపట్టినవాఁడు ఎవఁడో, ఎవఁడుక్షేత్రజ్ఞుఁడును, సర్వనియామకుఁడును, వింతవింతపనులు చేయువాఁడును, నశింపనివాఁడును, సర్వేంద్రియవిషయములను సాక్షియై కనిపెట్టియుండువాఁడునునై యున్నాఁడో, అటువంటిశూరుని మనుమఁడైన శ్రీకృష్ణమూర్తికి సర్వదా మేము మ్రొక్కుచుందుము అట్లుండఁగా అతనితోడి విరోధమునకు భయపడుదుముగాని యత్నపూర్వకముగా ప్రవేశింతుమా మాకు నీస్నేహమువలన పదివేలులాభము వచ్చునట్లున్నను అక్కఱలేదు నీస్నేహమును మేము ఒల్లము ఇంత మట్టుకు నీతోచేసిన స్నేహము చాలును పొమ్మని చెప్పెనని తా.

(*) శతధన్వుఁడు ద్వారకనుండి పాఱిపోవ రామకృష్ణులు వెంటనంటి వానిఁజంపుట. (*)



శతధన్వుఁడు.





శతధన్వుఁడు.





బలరాముఁడు.

౪౮.—వ॥ అనియిట్లక్రూరుం డుత్తరంబువలికిన నమ్మహామణి యక్రూరునివద్ద నునిచి వెఱచి శతధన్వుండు తురగారూఢుండై శతయోజన దూరంబుచనియె నంత గరుడ కేతనాలంకృతంబైన తేరెక్కి రామకృష్ణులు వెనుచనిరంత నతండును మిథిలానగరంబుఁజేరి సమీపంబునందు.

టీ॥ (అనియిట్లు అక్రూరుండు) ఉత్తరంబుపలికినన్ = బదులుమాటచెప్పఁగా. అమ్మహామణిన్=ఆగొప్పదియయిన శమంతకమణిని. (అక్రూరునివద్దను) ఉనిచి = పెట్టి. వెఱచి = భయపడి. (శతధన్వుండు) తురగారూఢుండై = గుఱ్ఱమునెక్కినవాఁడై. శతయోజనదూరంబుచనియెన్=నూఱామడదూరముపోయెను. అంతన్= అంతట. (రామకృష్ణులు) గరుడకేతనాలంకృతంబైన = గరుడధ్వజముచేత అలంకరింపఁబడినదైన. (తేరెక్కి) వెనుచనిరి=వెంబడించిపోయిరి. అతండును=ఆశతధన్వుఁడును. మిథిలానగరంబు=మిథిలాపట్టణమును. చేరి=సమీపించి. సమీపంబునందున్=ఆపట్టణముదగ్గఱ.

తా॥ అనియీవిధముగా అక్రూరుఁడు ఉత్తరముచెప్పఁగా శతధన్వుఁడు భయపడి తప్పించుకొను నుపాయమును ఆలోచించిశమంతకమణిని ఆయక్రూరు నింటనే పెట్టి ఒక గుఱ్ఱమునెక్కి ద్వారక నుండి బయలువెడలి నూఱామడదూరము పోయెను అది యెఱిఁగి రామకృష్ణులు గరుడధ్వజముచేత అలంకరింపఁబడిన మహారథమును ఎక్కి వానిని వెంబడించిరి అంతలో వాఁడు మిథిలాపట్టణము దగ్గఱఁబోయి ఆపట్టణము వెంబడిని అని తాత్పర్యము.

౮౫.—చ॥ తురగముడిగ్గి తల్లడము * తో శతధన్వుఁడు పాదచారియై
పరువిడఁ బోకు పోకుమని * పద్మదళాక్షుఁడు గూడఁ బాఱి భీ
కరగతి వానిమస్తకము * ఖండితమై పడనేసెఁ జక్రముం
బరిహత దైత్యచక్రముఁ బ్ర * భాచయ మోదిత దేవశక్రమున్.

టీ॥ (శతధన్వుఁడు) తురగముడిగ్గి = గుఱ్ఱమునుదిగి. తల్లడముతోన్=భయముతో. పాదచారియై=కాలినడగలవాఁడై. పరువిడన్ = పరుగెత్తఁగా. పద్మదళాక్షుఁడు = కృష్ణుఁడు. పోకు పోకుము = పోఁబోకుము. (అని) కూడఁబాఱి = దగ్గఱపరుగెత్తిపోయి. భీకరగతిన్=భయంకరమయినరీతితో. వానిమస్తకము = ఆశతధన్వునితల. ఖండితమైపడన్ = తెగిపడునట్టుగా. పరిహత దైత్యచక్రమున్=అంతటుచంపఁబడినరాక్షససమూహముగలదియు. ప్రభా...క్రమున్–ప్రభా=కాంతియొక్క. చయ=సమూహముచేత. మోదిత=సంతోషింపఁజేయఁబడిన. దేవ=దేవతలును. శక్రమున్= ఇంద్రుఁడును గలదియైన. (చక్రమును) ఏసెన్=ప్రయోగించెను.

తా॥ శతధన్వుఁడు గుఱ్ఱము మీఁదనుండి దిగినవాఁడై భయముచేత తత్తఱిల్లుచు కాలినడతో పరుగెత్తఁగా శ్రీకృష్ణుఁడు వానిని పోఁబోకుము అని చెప్పుచు తేరుదిగి దగ్గఱ పరుగెత్తిపోయి ఎల్ల రాక్షసులను చంపినదియు దేవతలను దేవేంద్రునిని తన ప్రకాశముచేతనే సంతోష పెట్టునదియునైన సుదర్శన చక్రమును ప్రయోగించి వానితల నఱికి చంపెనని తాత్పర్యము.

౮౬.—వ॥ ఇట్లు హరి శతధన్వుని వధియించి వానివస్త్రంబులందు మణివెదకి లేకుండుటఁదెలిసి బలభద్రునికడకువచ్చి శతధన్వుం డూరక హతుండయ్యె మణి లేదనిన బలభద్రుం డిట్లనియె.

టీ॥ (ఇట్లు) హరి=కృష్ణుఁడు. (శతధన్వుని వధియించి) వాని వస్త్రంబులందున్ = వానియొక్కబట్టలయందు. (మణివెదకి) లేకుండుట=ఆగుడ్డలలో లేకపోవుట. తెలిసి=తెలిసికొని. బలభద్రునికడకు వచ్చి=బలరామునొద్దకువచ్చి. (శతధన్వుండు) ఊరక=వ్యర్థముగా. హతుండయ్యెన్=చంపఁబడెను. మణిలేదు=వానివద్ద శమంతకమణి లేదు. అనినన్ = అనఁగా. (బలభద్రుండు ఇట్లనియెను)

తా॥ ఈవిధముగా కృష్ణుఁడు శతధన్వునిఁజంపి వానిగుడ్డలలో శమంతకమణిని వెదకి అదిచిక్కకపోఁగా వ్యర్థముగా శతధన్వునిఁ జంపితిని వానియొద్ద మణి లేదని బలరామునితో చెప్పఁగా బలరాముఁడు కృష్ణునితో ఇట్లు పలికెనని తాత్పర్యము.

## (*) బలరాముఁడు మిథిలాపురమునకుఁ బోవుట. (*)

౮౭.—సీ॥ ఆమణి శతధన్వుఁ * డపహరించుట నిక్క
మెవ్వరిచే దాఁప * నిచ్చినాఁడొ
వేగమె నీవేగి * వెదకుము పురిలోన
వైదేహు దర్శింప * వాంఛ గలదు
పోయివచ్చెద నీవు * పొమ్మని వీడ్కొల్పి
మెల్లన రాముండు * మిథిలఁ జొచ్చి
పోయిన జనకుండు * పొడగని హర్షించి
యెంతయుఁ బ్రియముతో * నెదురువచ్చి
తే॥ యర్ఘ్యపాద్యాది కృత్యంబు * లాచరించి
యిచ్చవచ్చిన వస్తువు * లెల్ల నిచ్చి
యుండుమని భక్తిఁ జేసిన * నుండె ముసలి
కువలయేశ్వర మిథిలలోఁ * గొన్నియేండ్లు.


బలరాముఁడు.

టీ॥ కువలయేశ్వర = రాజా. ఆమణిన్ = ఆరత్నమును. (శతధన్వుఁడు) అపహరించుట=తీసికొనుట. నిక్కము = నిజము. ఎవ్వరిచేన్=ఎవరిచేత. దాఁపనిచ్చినాఁడో=దాఁచిపెట్టనిచ్చినాఁడో. (నీవు) వేగమె=శీఘ్రముగానే. ఏగి=పోయి. పురిలోనన్=పట్టణములో. (వెదకుము) వైదేహున్ = విదేహరాజును – జనకుని. దర్శింపన్=చూడ. వాంఛగలదు=కోరికగలదు. (పోయివచ్చెదను నీవుపొమ్ము) అనివీడ్కొల్పి=అనిచెప్పిపంపి. (రాముండు) మెల్లనన్=తిన్నగా. మిథిలఁజొచ్చి=మిథిలాపట్టణమునుప్రవేశించి. పోయినన్=పోఁగా. (జనకుండు) పొడగని=చూచి. హర్షించి=సంతోషించి. ఎంతయున్=మిక్కిలి. ప్రియముతోన్=ఇష్టముతో. ఎదురువచ్చి= ఎదురుగావచ్చి. అర్ఘ్యపాద్యాదికృత్యంబులు=అర్ఘ్యము పాద్యము మొదలగుపనులు. ఆచరించి = చేసి. ఇచ్చవచ్చినవస్తువులెల్లన్ = మనసువచ్చినపదార్థములన్నియు. (ఇచ్చి) ఉండుమని=తమపట్టణములోనేయుండుమని. భక్తిచేసినన్ = సేవచేయఁగా. ముసలి=బలరాముఁడు. మిథిలలోన్ = మిథిలాపట్టణములో. (కొన్నియేండ్లు ఉండెను.

తా॥ ఓరాజా! అంతట బలరాముఁడు ఆరత్నమును శతధన్వుఁడు అపహరించినదినిజముగాని అబద్ధముకాదు దానిని ఎవరి దగ్గఱనో దాఁచిపెట్టి నిచ్చినాఁడుకాఁబట్టి నీవు పట్టణమునకు శీఘ్రముగాఁబోయి అంతట వెదకిచూడుము నాకు జనకునిఁ జూడవలెనను కోరిక కలదు కాఁబట్టి నేను మిథిలాపట్టణమునకు పోయి వచ్చెదనని చెప్పి ఆపట్టణమును ప్రవేశింపఁగా జనకుఁడు ఈయన రాకవిని యెదురుగావచ్చి అర్ఘ్యము పాద్యము మొదలయినమర్యాదలతో పూజించి కొన్నాళ్లు తమపట్టణములోనే యుండుమని వేఁడుకొనఁగా బలరాముఁడు కొన్నిసంవత్సరములు మిథిలాపట్టణములోనే యుండెను అని తాత్పర్యము.

విశేషార్థము.

టీ॥ వైదేహుఁడు=శ్లో॥ దేహస్థోపినదేహస్థః విద్వాన్ స్వప్నాద్యథోత్థితః। అదేహస్థోపిదేహస్థో కుమతిస్స్వప్నదృగ్యథా॥ అనెడి శ్రీభాగవతప్రమాణముచొప్పున దేహము కలిగియు లేనివాఁడనని తెలిసికొన్న మహాపురుషుఁడైన బ్రహ్మవేత్త. మఱి, శ్లో॥ నాహం దేహో నేంద్రియాణ్యంతరంగం నాహంకారఃప్రాణవర్గోనబుద్ధిః। దారాపత్యక్షేత్రవిత్తాదిదూర స్సాక్షీనిత్యఃప్రత్యగాత్మాశివోహం॥ రజ్జ్వజ్ఞానాద్భాతిరజ్జౌయథాహి స్వాత్మాజ్ఞానాదాత్మనోజీవభావః। ఆప్తోక్త్యాహిభ్రాంతినాశేసరజ్జు ర్జీవోనాహం దేశికోక్త్యాశివోహం॥ అను నభ్యాసగలవాఁడు. మంచిది దేహము కనఁబడుచుండఁగా నాకుదేహము లేదనినమాత్రముననే బ్రహ్మవేత్తయగునా? ఆమాట ప్రత్యక్షవిరోధముకాదా యనిన చూడుము ఇది దేహమా? తెలివియా? నిద్రలో తెలివి లీనమైనప్పుడు దేహేంద్రియాద్యుపాధులు ఏవియునుతోఁచవు. ఆతెలివి (సుఖమహమస్వాప్సంనకించిదవేదిషం) అనెడి ప్రత్యభిజ్ఞ కలిగినప్పుడేకదా కలిగినది అప్పుడేకదా దేహేంద్రియాద్యుపాధులు తోఁచుచున్నవి. దీనిని ప్రజ్ఞయని తెలిసికొనక దేహమని యింద్రియములని అనుకొనుటు, అదేసత్యమనుట, మూఢత్వముకాఁబట్టి సత్పురుషసాంగత్యము చేసి వారుపదేశించిన మహావాక్యార్థములను శ్రవణమనన నిదిధ్యాసములు చేసి పక్షపాతము లేనిబుద్ధితో శ్రుతి యుక్తి అనుభవములచేత ఆలోచించి (సర్వాణ్యేతానిప్రజ్ఞానస్య నామధేయాని, ప్రజ్ఞానంబ్రహ్మ) అని యెఱుఁగువాఁడువిదేహుఁడు అనఁగా సర్వము ప్రజ్ఞానపరబ్రహ్మమేకాని అన్యముకాదని యెఱిఁగినవాఁడుగాని ఒకరాజుగాఁడనుట.

చ॥ మనసు సుషుప్తియందెనసి మ్రగ్గిననేమియుఁదోపకుండున మ్మనమటు మేలుకొన్నను సమస్తజగంబులు గల్గితోఁచు నీ। ఘనతరబంధమోక్షమయ కారణకార్యములెల్లఁదానయై। యనిశములో వెలిందిరుగు నారయ నెమ్మనమట్లుగావునన్॥ అని సీతారామాంజనేయసంవాద తృతీయాశ్వాసము.

౮౮.—వ॥ అంత దుర్యోధనుండు మిథిలానగరంబునకుం జనుదెంచి జనకరాజుచేత సమ్మానితుండై.

టీ॥ అంతన్=అప్పుడు. (దుర్యోధనుండు మిథిలానగరంబునకు చనుదెంచి జనకరాజుచేత)సమ్మానితుండై=గౌరవింపఁబడినవాఁడై.

తా॥ ఆసమయమునందు దుర్యోధనుఁడు మిథిలాపట్టణమునకుఁ బోయి జనకరాజుచేత మర్యాదను పొందినవాఁడైయనితాత్పర్యము.

౮౯.—క॥ చలమున గాంధారేయుఁడు। లలితగదాయుద్ధకౌశ ✻ లము నేర్చెఁదగన్
హలిచే శ్రితజన నిర్జర। ఫలిచేఁ ద్రైలోక్య వీర ✻ భటగణ బలిచేన్.

టీ॥ గాంధారేయుఁడు = గాంధారికొడుకైనదుర్యోధనుఁడు. చలమునన్=పట్టుదలతో. శ్రితజననిర్జరఫలిచేన్ - శ్రిత = ఆశ్రయించిన. జన=జనులకు. నిర్జరఫలిచేన్ = దేవతాఫలమైన వానిచేతను—కల్పవృక్షపుపండైనవానిచేత. అనఁగా, ఆశ్రయించినవారికి కోరినవాని నిచ్చువాఁడనుట. త్రైలోక్య వీరభట గణబలిచేన్ — త్రైలోక్య = మూడులోకములందలి. వీరభట = యుద్ధశూరుల యొక్క. గణ=సమూహము. బలిచేన్=గావుగాఁగలవానిచేతను. హలిచేన్=బలరామునిచేత. లలితగదాయుద్ధకౌశలమున్ = ఒప్పిదమైనగదతోడిపోట్లాటయందలినేర్పు. తగన్=తగునట్లు. నేర్చెను= పాండవులను జయింపవలెననెడి అక్కఱతో నేర్చుకొనెను.

తా॥ దుర్యోధనుఁడుకోరినవారికోరికలను నెఱవేర్చువాఁడును, మూడులోకములలోని యుద్ధశూరులను గావు తీసికొనువాఁడునైన బలరామునిచేత గదాయుద్ధమును చక్కఁగా పనుపడునట్లు పట్టుదలతో నేర్చుకొనెనని తాత్పర్యము.

విశేషార్థము.

టీ॥ దుర్యోధనుఁడు = చెడ్డ ఆలోచన గలవాఁడు—అనఁగా, ద్వైతబుద్ధిగల అహంకారుఁడు. పాండవులు=శుద్ధసత్వగుణముగలవారు—బ్రహ్మవిద్యాభ్యాసులనుట. గదాయుద్ధము = వారినిహతము చేయునట్టి ప్రసంగము.

౯౦.—వ॥ అటఁ గృష్ణుండును ద్వారకానగరంబునకుంజని శతధన్వుని మరణంబును, మణిలేకుండుటయును,
సత్యభామకుం జెప్పి సత్యభామాప్రియకరుండు గావున సత్రాజిత్తునకుం బరలోక క్రియలు
సేయించె నక్రూర కృతవర్మలు శతధన్వుమరణంబు విని వెఱచి ద్వారకానగరంబు వెడలి బహు
యోజనదూర భూమికిం జని రక్రూరుండు లేమింజేసి వానలులేక మహోత్పాతంబులును శరీర
మానసతాపంబులును ద్వారకానగరవాసులకుసంభవించిన నందులవృద్ధజనులు బెగడిహరికిట్లనిరి.

టీ॥ అట=అచ్చట. (కృష్ణుండును) ద్వారకానగరంబునకున్= ద్వారకాపట్టణమునకు. చని = పోయి. శతధన్వునిమరణంబును= శతధన్వుఁడు చచ్చుటను. మణిలేకుండుటయు = వానియొద్ద మణి లేకయుండుటను. సత్యభామకున్=సత్యభామతో. (చెప్పి) సత్యభామాప్రియకరుండు = సత్యభామకు ప్రియమును చేయువాఁడు. కావునన్=కనుక. (సత్రాజిత్తునకు) పరలోకక్రియలు=ఉత్తరక్రియ

లను. (చేయించెను) అక్రూరకృతవర్మలు = అక్రూరుఁడును కృతవర్మయు. శతధన్వుమరణంబు = శతధన్వునిచావు. (విని) వెఱచి= భయపడి. ద్వారకానగరంబువెడలి=ద్వారకాపట్టణమునుండిబయలు దేఱి. బహుయోజనదూరభూమికిన్ = పెక్కు ఆమడలదూరమున నుండు దేశమునకు. చనిరి=పోయిరి. (అక్రూరుండు) లేమిం జేసి= లేకపోవుటచేత. (వానలులేక)మహోత్పాతంబులును=గొప్పగొప్ప యుత్పాతములును. శారీరమానసతాపంబులును=దేహసంబంధములును మనస్సంబంధములునైన తాపములును. ద్వారకానగర వాసులకున్=ద్వారకాపట్టణమునందుండు వారికి. సంభవించినన్=కలుగఁగా. అందులవృద్ధజనంబులు=ఆద్వారకాపట్టణమునందలిపెద్దలు. బెగడి=భయపడి. హరికిట్లనిరి=శ్రీకృష్ణునితో నిట్లుపలికిరి.

తా॥ పిమ్మట శ్రీకృష్ణమూర్తియు ద్వారకాపట్టణమునకుఁబోయి శతధన్వుఁడు చచ్చుటయు వానియొద్ద శమంతకమణి లేకుండుటను సత్యభామతోఁజెప్పి ఆమెకు ప్రీతికలుగఁజేయువాఁడుగనుక సత్రాజిత్తునకు ఉత్తరక్రియలును చేయించెను ఈవృత్తాంతము అక్రూరుఁడును కృతవర్మయు విని ఇఁక మనకేమి కీడఁదవచ్చునోయని భయపడి ద్వారకాపట్టణమువిడిచి పెక్కు ఆమడలదూరముననుండుదేశములలో వాసము చేయఁబోయిరి అక్రూరుఁడు ద్వారకను విడిచి పోయినందున ఆపట్టణములోని ప్రజలకు గొప్పగొప్ప ఆపదలును దేహతాపములును మనస్తాపములును కలుగసాగెను వానలు లేకపోయెను అదిచూచి ద్వారకలోని పెద్దలండఱు భయము నొందినవారై శ్రీకృష్ణునితో నిట్లు పలికిరని తాత్పర్యము.



















(*) అక్రూరుని రప్పింపుమని యుద్ధవాదులు వేఁడ శ్రీకృష్ణుఁడు రప్పించుట. (*)

౯౧.—సీ॥ కమలాక్ష వినవయ్య * కాశీశుఁ డేలెడి - కుంభిని వానలు * గురియకున్నఁ
గోరి శ్వఫల్కునిఁ * గొనిపోయి యతనికి - గాందిని యనియెడు * కన్య నిచ్చి
కాశీవిభుండు స * త్కారంబు చేసిన - వానలు గురిసె నా * వసుధ మీఁద
నాతనిపుత్రకుఁ * డైన యక్రూరుండు - నంతటివాఁడె మ * హాతపస్వి

ఆ॥ మరలి వచ్చెనేని * మాను నుత్పాతంబు । లెల్ల వానగురియు * నీస్థలమున
దేవ యతనిఁదోడి * తెప్పింపు మన్నింపు । మానవలయు పీడ * మానవులకు.

టీ॥ కమలాక్ష = ఓ శ్రీకృష్ణా. వినవయ్య = మామనవివినుము. కాశీశుఁడేలెడికుంభినిన్ = కాశిరాజు పాలించునట్టి దేశమునందు. (వానలు కురియకున్నను) కాశీవిభుండు=కాశిరాజు. కోరి = అపే క్షించి. శ్వఫల్కునిన్=శ్వఫల్కుఁడు అనువానిని.కొనిపోయి=పిలుచు కొనిపోయి. అతనికిన్ = ఆఫల్కునికి. (గాందినియనియెడు కన్యను ఇచ్చి) సత్కారంబుచేసినన్ = గౌరవింపఁగా. ఆవసుధమీఁద = ఆకాశీదేశపుభూమిమీఁద. (వానలుకురిసెను) వానిపుత్రకుఁడు = ఆఫల్కునికొడుకు. (అయినయక్రూరుండును) అంతటివాఁడె=అంత గొప్పవాఁడె. (అగును) మహాతపస్వి = గొప్పతపస్సుగలవాఁడు. మరలివచ్చెనేనిన్ = అతఁడు తిరిగివచ్చినపక్షమున. ఉత్పాతంబు లెల్లన్=అన్నియుత్పాతములును. (మానును) ఈస్థలమునన్ = ఈ భూమియందు. (వానకురియును) దేవ = స్వామీ. మానవులకున్= ఇందలిమనుష్యులకు. పీడ=దుఃఖము. మానవలయున్=పోవలెను. అతనిన్=ఆయక్రూరుని. తోడి తెప్పింపుము=రప్పింపుము. మన్నింపు= అతనితప్పు మన్నింపుము.

తా॥ ఓ శ్రీకృష్ణా ! మునుపు ఒకానొకప్పుడు కాశీదేశములో వానలు లేకపోఁగా ఆదేశపురాజు ప్రీతితో శ్వఫల్కుని పిలుచుకొని పోయి వానిని సన్మానించి తనకొమార్తయైన గాందిని అను కన్యక నిచ్చి పెండ్లిచేయఁగా వానలుకురిసి ఆదేశపువఆపుమానెను ఆశ్వఫ ల్కుని కొడుకయిన అక్రూరుఁడును తపస్సుకలిమిచేత తండ్రియంతటి వాఁడే కాఁబట్టి ఆపుణ్యాత్ముఁడు మరలివచ్చినపక్షమున మనభూమి యందును వానలు కురిసి యెల్లయుత్పాతములు అణఁగి పోవును స్వామీ ! జనులమేలును కోరి యిప్పుడు అతనిని రప్పించి మన్నింపు మని తాత్పర్యము.

౯౨.—వ॥ అనిపలుకు పెద్దల పలుకు లాకర్ణించి దూతజనులంబంపి కృష్ణుం డక్రూరుని రావించి పూజించి
ప్రియకథలు కొన్ని చెప్పి సకల లోకజ్ఞుండు గావున మృదు మధుర భాషణంబుల నిట్లనియె.

టీ॥ అనిపలుకు=అనిచెప్పునట్టి. పెద్దలపలుకులు=పెద్దలయొక్క మాటలు. ఆకర్ణించి=విని. (కృష్ణుండు) దూతజనులంబంపి=వేగుల వాండ్రనుబంపి. (అక్రూరునిరావించి) పూజించి=సన్మానించి. ప్రియ కథలు=ప్రియములైనకథలు. (కొన్ని చెప్పి) సకలలోకజ్ఞుండుగావునన్ =సమస్తజనులవర్తమానములు తెలిసినవాఁడుకాఁబట్టి. మృదుమధుర భాషణంబులన్ = తిన్ననియింపులైనమాటలతో. (ఇట్లనియెను)

తా॥ అనిచెప్పిన పెద్దలమాటలువిని శ్రీకృష్ణమూర్తి అప్పుడేతగిన చారులనుబంపి అక్రూరునిరప్పించి అతనిని సన్మానించి ప్రియములైన కథలుచెప్పి మనసు కలఁతపోఁగొట్టి తాను ఎల్లవారివృత్తాంతములు నెఱిఁగినవాఁడే గనుక ఇంపైన తిన్ననిమాటలతో అక్రూరుని జూచి యిట్లు పలికెనని తాత్పర్యము.

౯౩.—సీ॥ తానేగు తఱి శత * ధన్వుఁడు మణిఁదెచ్చి - నీయింటఁ బెట్టుట * నిజము దెలిసి
నాఁడ సత్రాజిత్తు * నకుఁ బుత్రకులులేమి - నతనికిఁ గార్యంబు * లాచరించి
విత్తంబు ఋణమును * విభజించుకొనియెద - రతని పుత్రికలెల్ల * నతఁడుపరుల
చేత దుర్మరణంబుఁ * జెందినాఁడతనికై - సత్కర్మములు మీఁద * జరపవలయు

తే॥ మణిగ్రహింపుమీవ * మాయన్న నను నమ్మఁ । డెలమి బంధుజనుల * కెల్లఁజూపు
మయ్య నీగృహమున * హాటకవేదికా । సహిత మఖములమరు * సంతతమును.

టీ॥ (శతధన్వుఁడు) తానేగుతఱిన్ = తానుపోవునపుడు. మణిన్ = శమంతకమణిని. తెచ్చి = తీసికొనివచ్చి. నీయింటన్= నీయింటిలో. (పెట్టుట) నిజము=నిజముగా. తెలిసినాఁడన్=తెలిసి కొన్నాను. (సత్రాజిత్తునకు) పుత్రకులు = కొడుకులు. లేమిన్ = లేకుండుటచేత. (అతనికి) కార్యంబులు=ఉత్తరక్రియలు.ఆచరించి= నేనేచేసి. విత్తంబున్=అతనియాస్తియు. ఋణమున్ = అప్పును. అతనిపుత్రికలెల్లన్ = అతనికొమార్తలందఱును. విభజించుకొనియె దరు=పంచుకొనెదరు. అతఁడు=ఆసత్రాజిత్తు. పరులచేతన్=శత్రు వులచేత. దుర్మరణంబుఁజెందినాఁడు=చెడ్డచావుచచ్చినాఁడు. అత నికై=సత్రాజిత్తునకై. సత్కర్మములు=ప్రాయశ్చిత్తాదికార్యములు. మీఁదన్=ఇఁకమీఁద. జరపవలయున్=చేయవలెను. ఈవ=నీవే. మణిగ్రహింపుము=మణినిపుచ్చుకొనుము. మాయన్న=బలరాముఁడు. (నను నమ్మఁడు) ఎలమిన్=నెమ్మదితో. బంధుజనులకెల్లన్=చుట్ట ములకందఱికిని. చూపుమయ్య = ఆమణినికనఁబఱుపుము. సంతత మును=ఎల్లప్పుడును. నీగృహమునన్=నీయింటిలో. హాటకవేదికా సహితమఖములు = బంగారుతిన్నెలతోడియజ్ఞములు. అమరున్= అమరును—జరగుచుండుననుట.

తా॥ ఓయక్రూరుఁడా ! శతధన్వుఁడు తాను ఊరువిడిచి పరు గెత్తిపోవునపుడు శమంతకమణిని నీయింటిలో తీసికొనివచ్చి పెట్టి పోయినసంగతి నాకుస్పష్టముగా తెలిసినది,సత్రాజిత్తునకుకొడుకులు లేరుగనుక అతనికిఉత్తరక్రియలు నేనేచేసితిని,అతనిఅప్పు ఆస్తియును అతనికొమార్తలు తలాకొంచముగా పంచుకోఁగలరు,ఇంకనుసత్రా జిత్తు శత్రువులచేతచెడ్డచావుచచ్చినందులకైకొన్ని ప్రాయశ్చిత్తకార్య ములు చేయవలసియున్నది కాఁబట్టి ఆరత్నమును నీవేతీసికో అయి నను మాయన్నయైనబలరాముఁడు నన్నునమ్మఁడు నేను ఆరత్నమును

అపహరించి యిన్నిమాటలాడుచున్నాను అని తలంచును, ఆయను మానమతీఱునట్లు నీవు శమంతకమణిని తెచ్చి మనచుట్టములకందఱికి చూపి తీసికొనిపో నీయింటిలో ఎల్లప్పుడు బంగారుతో నేర్పఱుపఁబడిన వేదికలతోడియజ్ఞములు జరుగుచుండును అని చెప్పెననితా.

౯౪.—వ॥ అనియిట్లు సామవచనంబులు హరి పలికిన నక్రూరుండు వస్త్రచ్ఛన్నంబైన మణిఁ దెచ్చి హరికిచ్చిన.

టీ॥ (అనియిట్లు) హరి = కృష్ణుఁడు. సామవచనంబులు = మంచిమాటలు. పలికినన్=చెప్పఁగా. (అక్రూరుండు) వస్త్రచ్ఛన్నంబైనమణిన్=గుడ్డచేతఁ గప్పఁబడియున్నరత్నమును. (తెచ్చి) హరికిచ్చినన్=కృష్ణునికియ్యఁగా.

తా॥ అని యీవిధముగా, శ్రీకృష్ణమూర్తి తిన్ననిమాటలుచెప్పి మనసులోని కలవరము తీర్పఁగా అక్రూరుఁడు తనకొంగునమడిచి యుంచుకొన్న శమంతకమణిని శ్రీకృష్ణునిచేతికి ఇచ్చెననితాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ వస్త్రము=అజ్ఞానావరణము. ఛన్నము=దానిచేతమఱుఁగుపఱచఁబడినది. శమంతకమణి=ద్వైతవృత్తిలేని అపరోక్షజ్ఞానము.

౯౫.—ఉ॥ సంతస మంది బంధుజన ✻ సంతతికిన్ హరిదెచ్చి చూపెన
క్రాంత విభాసమాన ఘృణి ✻ జాల పలాయిత భూనభోంతర
ధ్వాంతము హేమభారచయ ✻ వర్షణ విస్మిత దేవ మానవ
స్వాంతముఁ గీర్తిపూరిత ది ✻ శావలయాంతము నాశమంతమున్.

టీ॥ హరి=కృష్ణుఁడు. సంతసమంది=సంతోషించి. అక్రాంత...ధ్వాంతమున్—అక్రాంత=ఎడతెగక, విభాసమాన=ప్రకాశించుచున్న. ఘృణి=కాంతులయొక్క. జాల = సమూహముచేత. పలాయిత=తఱుమఁగొట్టఁబడిన. భూనభోంతర = భూమ్యాకాశముల మధ్యముననుండెడు. ధ్వాంతమున్=చీఁకటిగలదానిని. హేమ...స్వాంతమున్ — హేమ = బంగారుయొక్క. భార = బారువుల యొక్క. చయ=సమూహమును. వర్షణ=కురియుటచేత. విస్మిత=ఆశ్చర్యపడిన. దేవ=దేవతలయొక్కయు. మానవ = మనుష్యుల యొక్కయు. స్వాంతమున్ = మనసులు గలదానిని. కీర్తి...యాంతమున్—కీర్తి=యశస్సుచేత. పూరిత=నిండింపఁబడిన. దిశావలయ=వలయాకారమైనదిక్కులయొక్క. అంతమున్ = కొనలు గలదానిని. ఆశమంతమున్=ఆశమంతకమణిని. తెచ్చి = తీసికొనివచ్చి. బంధుజనసంతతికిన్=చుట్టములసమూహమునకు. చూపెన్=కనఁబఱిచెను.

తా॥ అంతట శ్రీకృష్ణమూర్తి సంతోషించి యెడతెగక ప్రకాశించునట్టి కాంతులచేత భూమికి ఆకాశమునకు నడుమనుండు చీఁకటి నెల్లను పోఁగొట్టునదియు, ప్రతిదినము బారువుల కొలఁది బంగారును కురియుటచేత దేవతల మనసులకును మనుష్యుల మనసులకును ఆశ్చర్యమును పుట్టించునదియు, ఎల్లదిక్కులకొనలయందు నిండుకొన్న కీర్తి గలిగినదియు నైన శమంతకమణిని తీసికొనివచ్చి తమచుట్టముల కందఱికిని జూపించెనని తాత్పర్యము.

౯౬.—క॥ చక్రాయుధుఁ డీక్రియఁ దన । యక్రూరత్వంబు జనుల ✻ కందఱకును ని
ర్వక్రముగఁ దెలిపి క్రమ్మఱ । నక్రూరున కిచ్చె మణిఁ గృ ✻ పాకలితుండై.

టీ॥ చక్రాయుధుఁడు=కృష్ణుఁడు. ఈక్రియన్=ఈవిధముగా. తనయక్రూరత్వంబు = తనయొక్క క్రూరత్వములేమిని. జనులకందఱకున్=ఎల్లజనులకును. నిర్వక్రముగన్ = వంకరలేకుండునట్లు—స్పష్టముగా. తెలిపి = తెలియఁజేసి. కృపాకలితుండై = దయతోఁగూడుకొన్నవాఁడై. క్రమ్మఱన్ = మరల. మణిన్ = రత్నమును. అక్రూరునకిచ్చెను = బ్రహ్మవేత్తయైన అక్రూరునికేసమర్పించెను.

తా॥ శ్రీకృష్ణుఁడు ఈవిధముగా తనయందు దోషము లేమిని తమచుట్టముల కందఱికిని స్పష్టముగాఁ దెలియఁజేసి మరల దయచేసి ఆమణిని అక్రూరునికే యిచ్చెనని తాత్పర్యము.

౯౭.—క॥ ఘనుఁడు భగవంతుఁ డీశ్వరుఁ । డనఘుఁడు మణిఁదెచ్చి యిచ్చి ✻ నట్టి కథనమున్
వినిన పఠించిన తలఁచిన । జనులకు దుర్యశముఁ బాప ✻ సంఘముఁ దలఁగున్.

టీ॥ ఘనుఁడు=విరాట్స్వరూపుఁడును. భగవంతుఁడు=షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును. ఈశ్వరుఁడు=సర్వనియామకుఁడును. అనఘుఁడు=పాపములేనివాఁడునైన శ్రీకృష్ణమూర్తి. (మణితెచ్చియిచ్చినట్టి) కథనమున్=కథను. వినినపఠించినతలఁచినజనులకున్=విన్నవారును చదివినవారును తలఁచినవారునైనజనులకు. దుర్యశమున్=చెడ్డపేరును—అపకీర్తియు. పాపసంఘమున్ = పాపములసమూహమును. తలఁగున్=తొలఁగిపోవును.

తా॥ విరాట్స్వరూపుఁడును, షడ్గుణైశ్వర్య సంపన్నుఁడును, సర్వనియామకుఁడును, ఏదోషములు లేనివాఁడునైన శ్రీకృష్ణమూర్తి శమంతకమణిని తెచ్చియిచ్చిన కథను ఎవరు చదువుదురో ఎవరు విందురో ఎవరు తలఁచుకొందురో అట్టి జనులందఱకు అపకీర్తియు పాపసమూహములును తొలఁగిపోవునని తాత్పర్యము.














(*) శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబున కరిగి పాండవులచేత సమ్మానింపఁబడుట. (*)

వ॥ అంత నొక్కనాడు పాండవులంజూడ నిచ్ఛయించి సాత్యకిప్రముఖ యాదవులు గొలువఁ బురుషోత్తముం డింద్రప్రస్థపురంబునకుం జనినం బ్రాణంబులంగనిన యింద్రియంబులభంగి నఖిలేశ్వరుం డైనహరింగని కౌఁగిలించుకొని కృష్ణుని దివ్యదేహసంగమంబున నిర్ధూతకల్మషులై యనురాగ హాస విభాసితం బైన ముకుందు ముఖారవిందంబు దర్శించి యానందంబునొందిరి గోవిందుండును యుధిష్ఠిర భీమసేనులచరణంబులకు నభివందనంబు చేసి యర్జును నాలింగనంబునసత్కరించినకులసహదేవులు మ్రొక్కిన గ్రుచ్చి యెత్తియుత్తమపీఠంబుననాసీనుం డైయుండనప్పుడు.

టీ॥ అంతన్ = అటుపిమ్మట. (ఒక్కనాడు) పాండవులన్ = పాండురాజుకొడుకులను. చూడనిచ్ఛయించి=చూడఁగోరి. సాత్యకి ప్రముఖయాదవులు = సాత్యకి మొదలుగాఁగల యాదవులు. కొలువన్=సేవింపఁగా. పురుషోత్తముండు = శ్రీకృష్ణుఁడు. ఇంద్రప్రస్థపురంబునకున్=ఇంద్రప్రస్థపట్టణమునకు. చనినన్=పోఁగా. ప్రాణంబులంగనిన యింద్రియంబులభంగిన్ = ప్రాణములనుపొందిన చక్షురాదింద్రియములవలెనే. అఖిలేశ్వరుండైనహరిన్=సర్వమునకు నీశ్వరుఁడైన శ్రీకృష్ణమూర్తిని. కని = చూచి. (కౌఁగిలించుకొని) కృష్ణునిదివ్యదేహసంగమంబునన్ = శ్రీకృష్ణమూర్తియొక్క దివ్యశరీరముయొక్క చేరికచేత. నిర్ధూతకల్మషులై=పోఁగొట్టఁబడినపాపములు గలవారై. అనురాగ...తంబు=అనురాగ = ప్రేమతోడి. హాస= నవ్వుచేతను. విభాసితంబు=మిక్కిలిప్రకాశించునది. అయినముకుందు

ముఖారవిందంబు=అయినట్టి శ్రీకృష్ణుని ముఖకమలమును. దర్శించి= చూచి. ఆనందంబునొందిరి = సంతోషమునుపొందిరి. గోవిందుండును=కృష్ణుఁడును. యుధిష్ఠిరభీమసేనులచరణంబులకున్ = ధర్మరాజుయొక్కయు భీమసేనునియొక్కయు అడుగులకు. అభివందనంబుచేసి=మ్రొక్కి. (అర్జునుని) ఆలింగనంబునన్=కౌఁగిలింతచేత. సత్కరించి=సన్మానించి. (నకులసహదేవులు) మ్రొక్కినన్=నమస్కారముచేయఁగా. గ్రుచ్చియెత్తి=రెండుచేతులతోనుపొదివియెత్తుకొని. ఉత్తమపీఠంబునన్=శ్రేష్ఠమయినపీఁటయందు. ఆసీనుండై = కూర్చున్నవాఁడై. ఉండన్=ఉండఁగా. అప్పుడు=ఆసమయమునందు

తా॥ అటుపిమ్మట ఒకనాడు శ్రీకృష్ణుఁడు పాండవులను చూచి రావలెనను తలఁపున సాత్యకి మొదలగు యదుకుమారులు వెంటరాఁగా ఇంద్రప్రస్థపట్టణమునకుఁబోయి తనదర్శనమువలన ప్రాణములను పొందిన యింద్రియములవలెనే వికాసమువహించి కొలిచుకొని సర్వేశ్వరుఁడైన తన దేహసంస్పర్శముచేత పాపములవలన తొలఁగినవారగుచు ప్రేమతోడి నవ్వుచేత వెలుఁగుచున్న తన ముఖకమలమునుజూచి వారు సంతోషమునుపొందఁగా తానును ధర్మరాజునకును భీమసేనునకును నమస్కారములుచేసి అర్జునుని కౌఁగిలింతచేత మన్నించి నకులసహదేవులు తనకుమ్రొక్కఁగా రెండుచేతులను పొదివి యెత్తుకొని లాలించి వారు తగినపీఁటవేసి కూర్చుండుమనఁగాఁ గూర్చుండెను ఆసమయమునందు అని తా.

౯౯.—క॥ చంచద్ఘన కుచభారా । కుంచితయై క్రొత్తపెండ్లి ✻ కూఁతురగుట నిం
చించుక సిగ్గుజనింపఁగ । బాంచాలతనూజ మ్రొక్కెఁ ✻ బద్మాక్షునకున్.

టీ॥ పాంచాలతనూజ = ద్రుపదమహారాజు కూఁతురైనకృష్ణ. చంచ...కుంచితయై—చంచత్=ఒప్పిదమయిన. ఘన=గొప్పలైన. కుచ = స్తనములయొక్క. భార = బరువుచేత. ఆకుంచితయై = మిక్కిలివంపఁబడినదై. (క్రొత్తపెండ్లికూఁతురు) అగుటన్=అగుటచేత. ఇంచించుక = కొంచెముకొంచెము. సిగ్గుజనింపఁగన్=సిగ్గుపుట్టుచుండఁగా. పద్మాక్షునకున్=శ్రీకృష్ణమూర్తికి. (మ్రొక్కెను)

తా॥ ద్రౌపది యొప్పిదమయి గొప్పలైయొప్పుచున్న స్తనముల బరువుచేత వంపఁబడినదో అనునట్లు మిక్కిలి వంగి క్రొత్తపెండ్లి కూఁతురు అగుటచేత కొంచెము కొంచెము సిగ్గు కనఁబడ తిన్నగా వచ్చి శ్రీకృష్ణమూర్తికి నమస్కారము చేసెనని తాత్పర్యము.

వ॥ అంత సాత్యకి పాండవులచేతం బూజితుండై యొక్కపీఠంబున నాసీనుఁడయ్యెఁ దక్కిన యనుచరులును. వారిచేతఁ బూజితులై కొలిచియుండిరి హరియుం గుంతీదేవి కడకుం జని నమస్కరించి యిట్లనియె.

టీ॥ అంతన్=పిమ్మట. (సాత్యకి పాండవులచేత) పూజితుండై=పూజింపఁబడినవాఁడై. ఒక్కపీఠంబునన్ = ఒకపీఁటపై. ఆసీనుండయ్యెన్ = కూర్చుండెను. తక్కినయనుచరులును = కృష్ణునితోడ వచ్చిన తక్కినపరిజనులును. వారిచేతన్=ఆపాండవులచేత. పూజితులై=సత్కారముచేయఁబడినవారై. కొలిచియుండిరి = సేవించుచుండిరి. హరియున్=శ్రీకృష్ణుఁడును. కుంతీదేవికడకున్=కుంతీదేవిదగ్గఱకు. చని=పోయి. నమస్కరించి = మ్రొక్కి. ఇట్లనియెన్= ఇట్లుపలికెను.

తా॥ పిమ్మట సాత్యకి పాండవులచేత మర్యాదను పొందినవాఁడై ఒకపీఁటమీఁదఁగూర్చుండెను అటుపిమ్మట కృష్ణుని పరిజనులందఱు పాండవులవలన సన్మానింపఁబడి సేవించుచుండిరి అంతట కృష్ణుఁడు కుంతీదేవియొద్దకుఁబోయి యిట్లు పలికెనని తాత్పర్యము.

౧౦౧.—క॥ అత్తా కొడుకులుఁ గోడలుఁ । జిత్తానందముగఁ బనులు ✻ సేయఁగ నాత్మా
యత్తానుగవై యాజ్ఞా । సత్తాదులు గలిగి మనుదె ✻ సమ్మోదమునన్.

టీ॥ (అత్తా ! కొడుకులును కోడలును) చిత్తానందముగన్ = మనసునకుసంతోషముగా. పనులుసేయఁగన్=చెప్పినపనులుచేయుచుండఁగా. ఆత్మాయత్తానుగవై=మనసువచ్చినట్టు వర్తించుదానవై. ఆజ్ఞాసత్తాదులు=ఆజ్ఞా గౌరవము మొదలగునవి. (కలిగి) సమ్మోదమునన్=సంతోషముతో. మనుదె=వర్తించుచున్నావా.

తా॥ ఓయత్తా! నీకొడుకులునుకోడలుమనసునకుతృప్తిగాచేయుమన్న పనులు చేయుచుండఁగా మనసునకు ఏకొఱఁతయు లేక మాట సాగుదలగలిగి సంతోషముతో మెలఁగుచున్నావుగదా అనియడిగెనని తాత్పర్యము.

౧౦౨.—చ॥ అనవుడుఁ బ్రేమ విహ్వలత ✻ నందుచు గద్గద భాషణంబులన్
గనుఁగవ నశ్రుతోయములు ✻ గ్రమ్మఁగఁ గుంతిసుయోధనుండు చే
సిన యపకారముం దడవి ✻ చెందిన దుఃఖము లెల్లఁ జెప్పి యా
దనుజ విరోధికిట్లనియెఁ ✻ దద్దయుఁ బెద్దఱికంబు సేయుచున్.

టీ॥ అనవుడున్=అనఁగా. కుంతి = కుంతిదేవి. ప్రేమవిహ్వలతన్=ప్రేమవలనిచొక్కును. అందుచున్=పొందుచును. గద్గదభాషణంబులన్=గొంతడుపుతోడిమాటలతో. కనుఁగవన్=రెండుకన్నులందును. అశ్రుతోయములు=కన్నీళ్లు. క్రమ్మఁగన్=కమ్ముకొనుచుండఁగా. సుయోధనుండు = దుర్యోధనుఁడు. చేసిన యపకారమున్=చేసినట్టికీడును. తడవి=తలఁచుకొని. చెందినదుఃఖములెల్లన్=ఆదుర్యోధనునివలన తాముపొందినబాధలన్నియు. (చెప్పి) తద్దయున్=మిక్కిలి. పెద్దఱికంబుచేయుచున్=గౌరవముచేయుచు. ఆదనుజవిరోధికిన్ = రాక్షసశత్రువైన యాశ్రీకృష్ణునితో. ఇట్లనియెన్=ఈమీఁదఁజెప్పఁబోవువిధమునఁజెప్పెను.

తా॥ అనియిట్లు శ్రీకృష్ణమూర్తి యోగక్షేమములువిచారింపఁగా కుంతీదేవి ఆయనయందలి ప్రేమాతిశయముచేత పరవశురాలై నోట మాట వెడలకున్నను ప్రయత్నముచేత మాటతెచ్చుకొని కన్నుల యందు నీళ్లుపెట్టుకొనుచు తమకు దుర్యోధనుఁడు చేసిన అపకారములను తలఁచుకొని వానిచేత తాముపడిన పాటులన్ని చెప్పి ఆశ్రీకృష్ణమూర్తినిమిక్కిలిగౌరవించుచు ఒకమాటచెప్పెననితాత్పర్యము.

౧౦౩.—సీ॥ అన్న నీచుట్టాల * నరయుదు మఱవవు - నీవు పుత్తెంచిన * నెమ్మితోడ
మాయన్న యేతెంచి * మముఁజూచి పోయెను - నిల్చియున్నారము * నీబలమున
నాపిన్నవాండ్రకు * నాకు దిక్కెవ్వరు - నేఁడాదిగానింక * నీవెకాక
నఖిలజంతువులకీ * వాత్మవు గావునఁ - బరులు నావారని * భ్రాంతిసేయ

తే॥ వయ్య నాభాగ్య మెట్టిదో * యనవరతముఁ । జిత్తముననుండి కరుణ మా * చిక్కులెల్లఁ
బాచుచుందువుగాదె యో * పరమపుణ్య । యదుకుమారవరేణ్య బు * ధాగ్రగణ్య.

టీ॥ అన్న = ఓనాయనా. నీచుట్టాలన్ = నీకుకావలసినబంధువులను. అరయుదువు = నీవువిచారింతువు. మఱవవు = ఎప్పుడును మఱచిపోవు. నీవుపుత్తెంచినన్ = నీవుపంపఁగా. నెమ్మితోడన్ = ప్రేమతో. (మాయన్న) ఏతెంచి=వచ్చి-మమున్=మమ్మును—నాకొడుకులనునన్నుననుట. (చూచిపోయెను) నీబలమునన్ = నీయొక్క బలముచేత. నిల్చియున్నారము = మేమునిలిచియున్నాము. నాపిన్నవాండ్రకున్=నాకొడుకులకును. (నాకును) నేఁడాదిగాన్=ఈదినము మొదలుకొని. ఇంకన్=ఇఁకమీఁదటనుగూడ. నీవెకాక=నీవేగాక. దిక్కెవ్వరు=ఎవరురక్షకులు. అఖిలజంతువులకున్=స్థావరజంగమప్రాణులకన్నిటికిని. ఈవు = పరమాత్మవైననీవు. ఆత్మవుగావునన్=జీవముకాఁబట్టి. పరులు=ఇతరులు. నావారు=నాకుఁగావలసినవారు (అని) భ్రాంతిసేయవు=భ్రమపడవు. అయ్య=ఓలోకజనకుఁడా. నాభాగ్యము = నాయదృష్టము. ఎట్టిదో = ఎటువంటిదో — ఎంతమంచిదోయనుట. అనవరతమును = ఎల్లప్పుడు. చిత్తముననుండి = నా అంతరంగకరణములోనేయుండి. కరుణన్= నిర్వ్యాజకృపతో. మాచిక్కులెల్లన్=మాకువచ్చునట్టి యాపదలనన్నిటిని. పాచుచుందువుగాదె=తొలఁగించుచుందువుగదా. ఓపరమపుణ్య = ఓమిక్కిలిపుణ్యాత్ముఁడా. యదుకుమారవరేణ్య= యాదవులలోశ్రేష్ఠుఁడా. బుధాగ్రగణ్య = ఆత్మానాత్మవివేకులైన పండితులలో (దేవతలలో) శ్రేష్ఠుఁడా.

తా॥ ఓనాయనా! నీవు నీకు కావలసిన చుట్టములను మఱవక యక్కఱతో విచారించుకొనుచుందువు నీవు పంపఁగా మాయన్న కూడవచ్చి నన్ను నాకొడుకులను జూచిపోయెను నీసహాయముచేతనే మేము ఇంతవట్టున నిలిచియున్నాము నేడు మొదలు ఇఁకమీఁదమాత్రము మాకు దిక్కు నీవుగాక మఱియెవరు నీవు ఎల్లప్రాణులకును జీవమువంటివాఁడవు గనుక నీకు అన్యులు మనవారు అను భేదము లేదు ఎల్లదేవతలలోనుత్తముఁడవును మిగులపుణ్యాత్ముఁడవును యాదవవంశమునందుఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడవునైన ఓశ్రీకృష్ణా! నీవు ఎల్లప్పుడు నామనసులోనే యుండి దయతో మాకు వచ్చిన ఆపదలన్ని తొలఁగించుచుందువు గదా అని తాత్పర్యము.

వ॥ అనిన యుధిష్ఠిరుం డిట్లనియె.

౧౦౪.—ఉ॥ పట్టఁగ లేరు నిన్నుఁ దమ * భావములందు సనందనాదులే
పట్టున నైన నట్టిగుణ * భద్రచరిత్రుఁడవీవు నేడు మా
చుట్టమటంచు వచ్చెదవు * చూచెద వల్పులమైన మమ్ము నే
మెట్టితపంబుచేసితిమొ * యధీశ్వర పూర్వశరీర వేళలన్.

టీ॥ అధీశ్వర=బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులనెడు పంచకర్తలను పుట్టింప పెంప త్రుంప కర్తవైన ఓస్వామీ. నిన్నున్= సచ్చిదానంద నిర్మలపరిపూర్ణుఁడవైన నిన్ను. సనందనాదులు=సనక సనందన సనత్కుమార సనత్సుజాతాది బ్రహ్మవేత్తలు. ఏపట్టుననైనన్=ఏసమయమునందును — ఆంతరబాహ్య నిర్వికల్పక సవికల్పకాది సమాధులలోదేనియందైనను అనుట. తమభావములందున్= తమ అంతఃకరణములలో. పట్టఁగలేరు=గ్రహింపలేరు—ఎఱుఁగఁజాలరనుట. అట్టిగుణభద్రచరిత్రుఁడవు = అటువంటి సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వభోక్తృత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వపాలకత్వ సర్వసంహారకత్వాది సద్గుణములచేత మేలైన నడవడిగలవాఁడవు. నీవు=అహంపదార్థస్వరూపుఁడవైననీవు. నేడు= ఈదినము. మాచుట్టమటంచున్ = మాచుట్టముఅని. వచ్చెదవు = వచ్చుచున్నావు. అల్పులమయినమమ్మున్=నీయంశాంశజులమయిన మమ్మును. శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః॥ అని భగవద్గీత. చూచెదవు = దయతోచూచుకొనుచున్నావు. ఏము = నీయంశజులమయినమేము. పూర్వశరీరవేళలన్ = పూర్వజన్మములయందు—స్థావర క్రిమి జలచర పక్షి పశు జన్మములయందనుట. ఎట్టితపంబుచేసితిమి = కాయిక వాచిక మానసికాదితపస్సులలో ఎటువంటితపస్సుచేసినామో.

తా॥ ఓసర్వేశ్వరుఁడవైన శ్రీకృష్ణా! నిన్ను సనందనుఁడు మొదలగు నిత్యసూరులుగూడ తమ మనసులలో తెలియలేక యున్నారు అటువంటి సర్వోత్కృష్టమయిన నడవడిగల నీవు మాచుట్టము అని మమ్ము చూడవచ్చుచున్నావు అల్పులమయినమమ్ము చుట్టములని మన్నించుటకు మేము పూర్వజన్మములయందు ఎటువంటితపస్సు చేసితిమోకదా అని ధర్మరాజు పలికెనని తాత్పర్యము.

౧౦౫.—వ॥ అని ధర్మజుండు దన్నుం బ్రార్థించిన నింద్రప్రస్థపురంబు వారలకు నయనా
నందంబు సేయుచు హరిగొన్నినెలలువసియించియుండె నందొక్కనాడు.

టీ॥ (అని) ధర్మజుండు=ధర్మరాజు. (తన్ను) ప్రార్థించినన్=వేఁడుకొనఁగా. ఇంద్రప్రస్థపురంబువారలకున్ = ఇంద్రప్రస్థపట్టణమునందుండువారికి. నయనానందంబుసేయుచున్=కన్నులపండుగు చేయుచు. హరి=కృష్ణుఁడు. (కొన్నినెలలు) వసియించి=ఉనికిచేసికొని. (ఉండెను) అందున్ = అట్లుండునప్పుడు. (ఒక్కనాడు)

తా॥ అని యీవిధముగా ధర్మరాజుప్రార్థింపఁగా శ్రీకృష్ణుఁడు కొన్నినెలలు ఆయింద్రప్రస్థములోనే యునికిచేసికొని యందలి జనులకు నేత్రోత్సవము కలుగఁజేయుచునుండెను అట్టియెడ నొకనాడు అని తాత్పర్యము.

(*) కృష్ణార్జునులు వేఁటాడఁబోవుట. (*)




మ॥ తురగశ్రేష్ఠము నెక్కి కంకటధనుస్తూణీశరోపేతుఁడై
హరితోడన్వనభూమి కేగివిజయుం * డాసక్తుఁడై చంపె శం
బర శార్దూల తరక్షుశల్యచమరీ * భల్లూక గంధర్వకా
సరకంఠీరవ ఖడ్గకోలహరిణీ * సారంగ ముఖ్యంబులన్.

టీ॥ విజయుండు = అర్జునుఁడు. హరితోడన్=కృష్ణునితోఁగూడ. తురగశ్రేష్ఠము నెక్కి=శ్రేష్ఠమయినగుఱ్ఱము నెక్కి. కంకటధనుస్తూణీశరోపేతుఁడై-కంకట=కవచముతోడను. ధనుః=వింటితోడను. తూణీ=అమ్ములపొదితోడను. శర=బాణములతోడను. ఉపేతుఁడై = కూడుకొన్నవాఁడై. వనభూమికిన్=అడవిప్రదేశమునకు. ఏగి=పోయి. ఆసక్తుఁడై=వేఁటయందాసక్తిగలవాఁడై. శంబర...ముఖ్యంబులన్ — శంబర=ఎఱ్ఱనివన్నెగలచిన్నజింకలు. శార్దూల=పెద్దపులులు. తరక్షు=సివంగులు. శల్య=ఏఁదుఁబందులు. చమరీ=సవరపుమెకములు. భల్లూక = ఎలుఁగుగొడ్లు. గంధర్వ=వట్రువతోఁకయును దొడ్డకడుపునుగల దుప్పులు. కాసర=కారుదున్నపోతులు. కంఠీరవ=సింహములు. ఖడ్గ=ఖడ్గమృగములు. కోల=పందులు. హరిణీ=ఆఁడుజింకలు. సారంగ=మగజింకలు. ముఖ్యంబులన్=మొదలగువానిని. (చంపెను)

తా॥ ఒకనాడు అర్జునుఁడు కృష్ణునితోఁగూడ కవచము విల్లు అమ్ములపొదులు బాణములను ధరించినవాఁడై గుఱ్ఱము నెక్కి అడవికిపోయి ఎఱ్ఱవన్నెగల జింకలు పెద్ద పులులు సివంగులు ఏఁదుఁబందులు సవరపు మెకములు ఎలుఁగుగొడ్లు చిన్నజాతి దుప్పులు కారుదున్నపోతులు సింహములు ఖడ్గమృగములు అడవిపందులుఆఁడుజింకలు మగజింకలు మొదలగు మృగములను ఆసక్తితో వేఁటాడి చంపెనని తాత్పర్యము.

౧౦౬.—క॥ అచ్చోటఁ బవిత్రములై । చచ్చిన మృగరాజినెల్ల * జననాథునకుం
దెచ్చిరి పర్వము వచ్చినఁ । జెచ్చెర నరుఁగొల్చియున్న * సేవకులధిపా.

టీ॥ అధిపా = రాజా. నరుఁగొల్చియున్నసేవకులు=అర్జునుని గొల్చుచున్న బంట్లు. పర్వమువచ్చినన్ = పండుగ రాఁగా. అచ్చోటన్ = ఆయడవిప్రదేశమునందు. పవిత్రములై = పరిశుద్ధములయి. చచ్చిన = శ్లో॥ రతికాలేముఖంస్త్రీణాం శుద్ధమాఖేటకే శునాం॥ అను ప్రమాణమునుపట్టి వేఁటకుక్కలచేతఁజచ్చిన వైభక్షింపఁదగినట్టి. మృగరాజినెల్లన్=మృగములపట్టుల నెల్లను. జననాథునకున్=రాజునకై. చెచ్చెరన్=శీఘ్రముగా. తెచ్చిరి=తీసికొనివచ్చిరి.

తా॥ ఓరాజా! అర్జునుని కొలిచియున్న సేవకులు అతనికివేడుక వచ్చినందున ఆయడవిప్రదేశమునందు చచ్చిన పరిశుద్ధములయిన మృగములనన్నిటిని అనఁగా, పులి మొదలగు ఆహారయోగ్యములు కానిమృగములను వదలి జింక కుందేలు మొదలగు ఆహారయోగ్యములనన్నిటినిరాజునకు కానుకగా తీసికొని శీఘ్రముగావచ్చిరనితా.

౧౦౭.—వ॥ అంత నర్జునుండు నీరు వట్టుఁగొని డస్సి యమునకుం జని యె న్మహారథులైన నర
నారాయణులందు వార్చి జలంబులు ద్రావి యొక్క పులిన ప్రదేశంబున నుండుచు.

టీ॥ అంతక్ = అంతట. (అర్జునుండు) నీరువట్టుగొని = దప్పిగొని. డస్సి = బడలికనొంది. యమునకుక్ = యమునానదికి. చనియెక్=పోయెను. అమ్మహారథులైననరనారాయణులు = పదునాకండువేలమందియోధులతో ఎదిరించిపోరఁజాలినవారైన ఆకృష్ణార్జునులు. అందుక్ = ఆయమునయందు. వార్చి = ఆచమనముచేసి. జలంబులుద్రావి = నీళ్లుత్రాగి. ఒక్కపులినప్రదేశంబునక్ = ఒకయిసుక దిబ్బయందు. ఉండుచుక్ = కూర్చున్నవారు అగుచును.

తా॥ అంతట అర్జునుఁడు దప్పిగొని బడలినవాఁడై వేఁటాడుట మాని యమునానదికినీళ్లుత్రాగపోయెను,అట్లుపోయిన అర్జునునితోడ కృష్ణుఁడును పోయి యిరువురును ఆయేటినీళ్లలో ఆచమించి దప్పిదీర నీళ్లుత్రాగి అచ్చట ఒక యిసుకదిబ్బమీఁదఁ గూర్చుండియుండి యని తాత్పర్యము.

## (*) సూర్య తనూజయగు కాళిందిని గృష్ణుఁడు వరించుట. (*)

౧౦౯.—చ॥ ఉపగతులైన యట్టి పురు * షోత్తమ పార్థులు గాంచి రాపగా
విపుల విలోల నీలతర * వీచికలందు శిరోజ భార రు
చ్యపహసితాళి మాలిక ను * దంచిత బాలశశి ప్రభాలికం
దపనుని బాలికక్ మదన * దర్పణ తుల్య కపోలపాలికక్.

టీ॥ ఉపగతులు=సమీపమునుపొందినవారు. ఐనయట్టిపురుషోత్తమపార్థులు=అయినకృష్ణార్జునులు. ఆపగా...వీచికలందుక్—ఆపగా=నదియొక్క. విపుల=గొప్పలైన. విలోల=మిక్కిలిచలించుచున్న. నీలతర = మిగులనల్లనైన. వీచికలందుక్ = అలలలో. శిరోజ...మాలికక్—శిరోజ=తలవెండ్రుకలయొక్క. భార=కొప్పుయొక్క. రుచి=కాంతిచేతను. అపహసిత=ఎగతాళిచేయఁబడిన.అళి=తుమ్మెదలయొక్క. మాలికక్ = పఙ్క్తిగలదానిని. ఉదంచిత...లికక్—ఉదంచిత=మిక్కిలియొప్పిదమయిన.బాలశశి=లేఁతచంద్రునివంటి. ప్రభా=ప్రకాశముగల. అలికక్ = నొసలుగలదానిని. మదన...పాలికక్ — మదన = మన్మథునియొక్క. దర్పణ = అద్దముతోడ. తుల్య=సమానమయిన. కపోలపాలికక్=చెక్కిటిప్రదేశములు గలదానిని. తపనునిబాలికక్ = సూర్యుని కూఁతురైన కాళిందిని. కాంచిరి=చూచిరి.

తా॥ అప్పుడు ఆనదిచేరువను పొందియున్న కృష్ణార్జునులు నదియొక్క మిక్కిలిచలించుచున్న నలుపుమీరిన పెద్ద అలలవంటి తలవెండ్రుకల కాంతిచేత పరిహాసము చేయఁబడిన తుమ్మెదల చాలుగలదియు, మిక్కిలి యొప్పిదమైన బాలచంద్రరేఖనుబోలిన నొసలు గలిగినదియు, మన్మథుని అద్దములనుబోలిన చెక్కిళ్లుగలిగినదియునైన సూర్యుని కూమార్తెయగుకాళిందిని జూచిరని తాత్పర్యము.

౧౧౦.—వ॥ కాంచి యచ్యుతుండు పంచిన విజ్వచ్చుండు చని యాకన్య కిట్లనియె.

టీ॥ కాంచి=చూచి. అచ్యుతుండు = కృష్ణుఁడు. పంచినక్=పంపఁగా. విజ్వచ్చుండు = అర్జునుఁడు. చని=పోయి. ఆకన్యకిట్లనియెక్=ఆకన్యకతోనిట్లుపలికెను.

తా॥ అట్లు చూచి కృష్ణుఁడు ఆకన్యక యెవరో విచారించి తెలిసికొని రమ్మని పంపఁగా అర్జునుఁడు ఆకన్యక దాపునకుపోయి దానితో ఇట్లు పలికెనని తాత్పర్యము.

౧౧౧.—మ॥ సుదతీ యెవ్వరిదాన వేమికొఱ కి * చ్చోటం బ్రవర్తించె దె
య్యది నీనామము కోర్కి యెట్టిది వి * వాహాకాంక్షతోఁగూడి నీ
నదికిక్ వచ్చిన జాడ గానఁబడె ధ * న్యంబయ్యె నీరాక నీ
యుదయాదిస్థితి నెల్లఁజెప్పు మబలా * యుద్యత్కు రంగేక్షణా.

టీ॥ సుదతీ=ఓచిన్నదానా. ఎవ్వరిదానవు = నీవు ఎవరిబిడ్డవు. ఏమికొఱకుక్=ఏమిటికై. ఇచ్చోటక్=ఇక్కడ. ప్రవర్తించెదు=ఉన్నావు. ఎయ్యదినీనామము=నీపేరేమి. కోర్కియెట్టిది=నీకోరికయెటువంటిది—ఏమికోరియిచట ఈనీళ్లలోఇట్లున్నావనుట. వివాహాకాంక్షతోక్=పెండ్లివలనికోరికతో. (కూడి) ఈనదికిక్ = ఈయేటికి. వచ్చినజాడ = వచ్చినట్టివిధము. కానఁబడెక్ = మాకుఁదోఁచెను. నీరాక = నీవువచ్చుట. ధన్యంబయ్యెక్ = కృతార్థమాయెను — నీవువచ్చినపనినెఱవేఱునట్టిదాయెననుట. అబలా = స్వశక్తిలేని యోకన్యకా. ఉద్యత్కురంగేక్షణా = మెఱయుచున్నలేడిచూపులవంటి చూపులుగల ఓబాలికా. నీయుదయాదిస్థితిక్=నీపుట్టుకమొదలయినవృత్తాంతమును. ఎల్లక్=అంతయు.(చెప్పుము)

తా॥ చలించుచున్న లేడిపిల్లచూపులవంటి బెదురుచూపులు గలదానవును మంచి పలువరుసగలదానవునైన ఓ కన్యకామణీ! నీవు ఎవరిబిడ్డవు ఎందులకై యిచ్చటికి వచ్చియున్నావు నీపేరేమి ఈనీళ్లలో ఇట్లు ఉండుటకు కారణమేమి నీకోరికయేమినిన్నుఁజూడఁగా పెండ్లిని అపేక్షించి వచ్చినట్లు తోఁచుచున్నది అట్లయినపక్షమున నీవువచ్చినపని నెఱవేఱినట్టే యెంచవచ్చును అయినను నీవు పుట్టిన కథమొదలయినవానిని మాకు తెలియఁజేయుము అని యడిగెననితా.

౧౧౨.—వ॥ అనిన నర్జునునకుఁ గాళింది యిట్లనియె.

౧౧౩.—మ॥ నర వీరోత్తమ యేను సూర్యునిసుతన్ ✽ నాపేరు కాళింది భా
స్కర సంకల్పిత గేహ నిందు నదిలోఁ ✽ గంజాక్షు విష్ణుం బ్రభుం
వరుఁగాఁగోరి తపంబుసేయుదు నొరున్ ✽ వాంఛింపఁ గృష్ణుండు వ
న్యరతిన్వచ్చి వరించునంచుఁ బలికెన్ ✽ నాతండ్రి నాతోడుతన్.

టీ॥ వీరోత్తమ = శూరశ్రేష్ఠుఁడవైన. నర = ఓయర్జునుఁడా. ఏను = నేను. సూర్యునిసుతన్ = సూర్యునికొమార్తను. నాపేరు కాళింది = కాళిందియనుపేరుగలదానను. ఇందున్ = ఇచ్చట. భాస్కరసంకల్పిత గేహన్=సూర్యునిచేత కలుగఁజేయఁబడినయిల్లు గలదానను. ఇందున్=ఇచ్చట. నదిలోన్=ఏటిలో. కంజాక్షున్= కమలములవంటికన్నులుగలవాఁడును. ప్రభున్=సర్వమునకు నీశ్వరుఁడునైన. విష్ణున్=విష్ణుదేవుని. వరుగాన్=పెనిమిటియగునట్లు. (కోరి) తపంబుసేయుదున్ = తపస్సుచేయుచున్నాను. (నాతండ్రి) నాతోడుతన్=నాతో. (కృష్ణుండు) వన్యరతిన్=వేఁటాడువేడుకచేత. (వచ్చి) వరించునంచున్=పెండ్లాడునని. పలికెన్=చెప్పెను. (కాఁబట్టి) ఒరున్=ఇతరుని. వాంఛింపన్=కోరను.

తా॥ ఓశూరశేఖరుఁడవైన అర్జునుఁడా! నేను సూర్యునికొమార్తను నాపేరుకాళింది మాతండ్రినాకు ఇక్కడ ఉనికిపట్టు ఏర్పఱిచి ఉంచఁగా ఉన్నాను ఈనదిలో సర్వేశ్వరుఁడును తామరలవంటి కన్నులుగలవాఁడునైన శ్రీవిష్ణుమూర్తిని పెనిమిటిగా పడయఁగోరి తపస్సుచేయుచున్నాను మాతండ్రి నాతో ఇక్కడ తపస్సుచేయుచున్నయెడల శ్రీకృష్ణుఁడు వేఁటాడుచు వచ్చి తీసికొనిపోయి పెండ్లాడునని చెప్పినాడు కనుక నేను ఇతరపురుషులను అపేక్షించుదానను కాను అని చెప్పెనని తాత్పర్యము.

## వి శే షా ర్థ ము.

టీ॥ కాళిందీ=(కాళిందీసూర్యతనయా) అనియర్థము. సూర్యుఁడనఁగా జ్యోతిష్టోముఁడు జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత యని శ్రుతి. జ్యోతిస్సులనఁగా సౌరచాంద్ర ఆగ్నేయనక్షత్రాదులు ఇవియన్నియెవనివల్లకలుగునో వాఁడుజ్యోతిష్టోముఁడు. జ్యోతిషాంస్తోమఃజ్యోతిష్టోమః, సమస్తప్రకాశములకు ఆధారభూతుఁడు అట్టి జ్యోతిస్సు ఏదియనిన. శ్లో॥ యదాదిత్యగతంతేజోజగద్భాసయతేఖిలం। యచ్చంద్రమసియచ్చాగ్నౌ తత్తేజోవిద్ధిమామకం॥ అనిభగవద్గీత, సయశ్చాయం పురుషే, యశ్చాసావాదిత్యే, సఏకః, సయఏవంవిత్, అనియొపనిషత్తు. వా॥ యోయందేహేచేష్ట ఇతాంతఃకరణస్థః సూర్యేచాసౌతాపయితాసోస్మ్యహామేవ. తా॥ ఈదేహమందు వసించి చూచుట వినుట నడుచుట ఇచ్చుట పుచ్చుకొనుట మొదలయిన పనులకు నిమిత్తమెవఁడో, నేనని పలుకఁబడువాఁడు ఆనేనేనుసూర్యాదులయందుండి జగత్ప్రకాశకుఁడనైతిని అనియీవాక్యమునకు అర్థము అయినందున జ్యోతిష్టోమమనఁగా అస్మత్ప్రత్యయార్థమయిన దేహేంద్రియాద్యుపాధ్యుపహిత చైతన్యస్వరూపుఁడనైననేనని అర్థము. జ్యోతిష్టోమేన= స్వప్రకాశ స్వరూపుఁడైన తనచేత. స్వర్గకామః = తన్ను పొందనిచ్ఛగలవాఁడు. యజేత = అనఁగా, విచారింపవలసినది. స్వప్రకాశమనఁగా, చిద్భాస్యభాస్యత్వమేతప్ప వేఱుకాదు. చిత్తనఁగా, జ్ఞానము ముందుచెప్పినశరీరము మీఁది ప్రజ్ఞాస్వరూపుఁడైన తనవల్లనే తాను చూచుజగత్తు పుట్టింపఁబడినందున చిత్తనెడుతనవల్లనే. భాస్య= ప్రకాశింపఁబడ్డ యీకనుపించుప్రపంచముచేత తాను చూడఁబడుటే చిద్భాస్యభాస్యత్వమనెడిస్వప్రకాశత్వము. ఎట్లనఁగా, అద్దమునుచూచువానికి అద్దములో కనఁబడు ప్రతిబింబము చూచునట్టిబింబమనెడి తన్ను చూచినను ఆబింబమునకు ప్రతిబింబము రెండవదయినను దానిచేత చూడఁబడుట చూచుబింబమునకు దోషమయిన దేమో చూడు అది యెటుల దోషము కాలేదో అట్లనే తనచేత సృష్టింపఁబడ్డ ప్రపంచముచేత తానుచూడఁబడుట స్వప్రకాశత్వమునకు బాధకముకానందున (స్వప్రకాశంబ్రహ్మ, అహమస్మి) అని బుద్ధిమంతులు తెలుసుకోవలయును. ప్రకృతిపుంసనామక కాళింది అనునది బ్రహ్మభూతుఁడైన బ్రహ్మవేత్తయొక్క కొమార్తయొక్క స్వరూపిణియైన బ్రహ్మవిద్య, అది శ్రీకృష్ణుఁడనఁగా సాక్షాన్నారాయణుఁడు, అట్టిఁగానిని వరించునేగాని అనఁగా తన్నేతాను వరించునుగాని మిథ్యాస్వరూపమైనద్వైత వస్తువును వరింపదని ముఖ్యార్థము.

వ॥ అనిన విని ధనంజయుం డానీలవేణి పలుకులు హరికిం జెప్పినవిని సర్వజ్ఞుండైన హరియు హరిమధ్యను రథంబు మీఁదనిడుకొని ధర్మరాజుకడకుంజని వారలుకోరిన విశ్వకర్మునురావించి వారిపురం బతివిచిత్రంబుసేయించె.

టీ॥ అనినన్=అనఁగా. (విని) ధనంజయుండు = అర్జునుఁడు. ఆనీలవేణిపలుకులు = ఆకన్యకయొక్కమాటలు. హరికిన్=కృష్ణునితో. చెప్పినన్ = చెప్పఁగా. (విని) సర్వజ్ఞుండైనహరియున్ = సర్వము తెలిసినవాఁడైన శ్రీకృష్ణమూర్తియు. హరిమధ్యను=సింహము నడుమువంటి నడుముగలదైన ఆకాళిందిని. (రథంబుమీఁద) ఇడుకొని=పెట్టుకొని. ధర్మరాజుకడకున్ = ధర్మరాజునొద్దకు. చని=పోయి. వారలుకోరినన్ = ఆధర్మరాజు మొదలగువారు అపేక్షింపఁగా. (విశ్వకర్మను) రావించి=రప్పించి. వారిపురంబు=ఆపాండవులపట్టణమును. అతివిచిత్రంబు=మిక్కిలి వినోదకరమైనదానిఁగా. (చేయించెను)

తా॥ అని కాళింది చెప్పఁగా విని ఆవృత్తాంతమును అర్జునుఁడు కృష్ణునకు తెలియఁజేసెను అంతట ఆయన ఆకన్యకను ఎత్తి రథము మీఁద పెట్టుకొని ధర్మరాజు దగ్గఱకు వచ్చి ధర్మరాజు మొదలగువారు పెండ్లి వేడుకలు కొన్ని యిక్కడను జరగవలెనని కోరఁగా విశ్వకర్మను రప్పించి వారిపట్టణమయిన యింద్రప్రస్థమును అలంకరింపఁజేసి కొన్నివేడుకలు జరపెనని తాత్పర్యము.





అర్జునుఁడు. (*) అగ్నిదేవుఁడు కృష్ణార్జునులు తోడుపడ ఖాండవవనము దహించుట. (*)

౧౧౪.—క॥ దేవేంద్రుని ఖాండవ.మ । ప్పావకునకు నీఁదలంచి * పార్థుని రథికున్
గావించి సూతుఁడయ్యెను । గోవిందుఁడు మఱఁదితోడఁ * గూరిమి వెలయన్.

టీ॥ గోవిందుఁడు = కృష్ణుఁడు. దేవేంద్రునిఖాండవమున్ = దేవేంద్రునిదైన ఖాండవవనమును. అప్పావకునకున్=ప్రసిద్ధుఁడైన యగ్నిదేవునకు. ఈఁదలంచి=ఇయ్యఁగోరి. పార్థునిన్ = అర్జునుని. రథికున్=రథమునందుండుయోధునిఁగా. కావించి=చేసి. మఱఁది తోడన్=మఱఁదియైన అర్జునునితోడ. కూరిమి = స్నేహము. వెలయన్=ప్రకాశింపఁగా. సూతుఁడయ్యెను=తాను సారథియయ్యెను.

తా॥ అంతట శ్రీకృష్ణుఁడు దేవేంద్రునిదైన ఖాండవ వనమును అగ్నిదేవునిచేత దహనము చేయింపఁగోరి అర్జునుని రథికునిఁగాఁ జేసి అతనియందుఁ దనకుఁగల స్నేహము విశదమగునట్లుగా తాను అతనికి సారథియాయెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు నరనారాయణులుసహాయులుగా దహనుండు ఖాండవవనంబుదహించిసంతసించివిజయునకునక్షయతూణీరంబులు నభేద్యకవచంబును, గాండీవమనియెడి బాణాసనంబును, దివ్యరథంబును, ధవళరథ్యంబుల నిచ్చె నందు.

టీ॥ (ఇట్లు) నరనారాయణులు = కృష్ణార్జునులు. సహాయులుగాన్=తోడుపడినవారుకాఁగా. దహనుండు=అగ్ని. (ఖాండవవనంబు) దహించి = కాల్చి. సంతసించి = సంతోషించి. విజయునకున్=అర్జునునికి. అక్షయతూణీరంబులును=తఱఁగని బాణములుగల. (అమ్ములపొదులును) అభేద్యకవచంబును=శత్రువులకు భేదింపరానికవచమును. (గాండీవమనియెడి) బాణాసనంబును = విల్లును. దివ్యరథంబును=దేవసంబంధమయిన తేరును. ధవళరథ్యంబులును=తెల్లనిగుఱ్ఱములను. (ఇచ్చెను) అందున్=ఆఖాండవదహనమునందు.

తా॥ ఈవిధముగా కృష్ణార్జునులు తనకు తోడుపడఁగా అగ్నిదేవుఁడు ఖాండవవనమునుకార్చి, అందువలనిసంతోషముచేత అర్జునునికి ఎప్పుడు బాణములు తఱఁగక యుండునట్టి అమ్ములపొదులును, శత్రువులకు భేదింపరాని కవచమును, గాండీవము అను పేరుగలవిల్లును, దివ్యమయిన రథమును తెల్లనిగుఱ్ఱములను ఇచ్చెను ఇట్లు చేయఁబడిన ఖాండవదహనమునందు అని తాత్పర్యము.

౧౧౫.—ఉ॥ వాసవ సూనుచేఁ దనకు * వహ్నిశిఖా జనితోగ్ర వేదనల్
వాసిపఁ జేసి యొక్క సభ * పార్థున కిచ్చె మయుండు ప్రీతుఁడై
యాసభలోనఁగాదె గమ * నాగమనంబులఁ గౌరవేంద్రుఁ డు
ల్లాసముఁబాసి యుండుట జ * లస్థల నిర్ణయ బుద్ధిహీనుఁడై.

టీ॥ (మయుండు) వాసవసూనుచేన్ = అర్జునునిచేత. (తనకు) వహ్నిశిఖాజనితోగ్రవేదనలు=అగ్నిజ్వాలలవలనఁ బుట్టిన బాధలు. పాసినన్=తొలఁగఁగా. ప్రీతుఁడై = సంతోషించినవాఁడై. ఒక సభన్=ఒకసభామండపమును. చేసి=రచియించి. పార్థునకున్=అర్జునునకు. (ఇచ్చెను) ఆసభలోనఁగాదె = ఆసభలోనే కదా. కౌరవేంద్రుఁడు=దుర్యోధనుఁడు. గమనాగమనంబులన్ = పోకరాకలయందు. జలస్థలనిర్ణయబుద్ధిహీనుఁడై=ఇదినీళ్లుండుచోటు ఇది నీళ్లులేనిచోటు అను తెలివిచేతతక్కువైనవాఁడై. ఉల్లాసముఁబాసి= ఉత్సాహమువిడిచి. (ఉండుట)

తా॥ మయుఁడు అను పేరుగలదానవ విశ్వకర్మ అగ్నివలనిబాధ

తనకు కలుగకుండ అర్జునుఁడు కాపాడఁగా అందులకు సంతోషించి ఒకసభనుచేసి తీసికొనివచ్చి అర్జునున కిచ్చెను ఆసభలోనే కదాదుర్యోధనుఁడు నీళ్లుండుచోటును నీళ్లులేనిచోటును తెలిసికొనలేక పోకరాకలయందు భంగపడినదియని తాత్పర్యము.





## (*) శ్రీకృష్ణుండు కాళిందిని మిత్రవిందను పరిణయంబగుట. (*)

వ॥ అంతం గృష్ణుండు ధర్మరాజప్రముఖుల వీడుకొని సాత్యకి ప్రముఖ సహచరులుగొలువ మఱలి తనపురంబునకుం జనుదెంచి బంధుజనంబులకుఁ బరమానందంబు సేయుచు నొక్క పుణ్యదివసంబున శుభలగ్నంబునం గాళిందిం బెండ్లియయ్యె మఱియు నవంతీ దేశాధీశ్వరులైన విందానువిందులు దుర్యోధనునకు వశులై హరికి మేనత్తయైన రాజాదేవి కూఁతుఁ దమచెలియలిని వివాహంబు సేయ నుద్యోగించి స్వయంవరంబు చాటించిన.

టీ॥ అంతన్=అంతట. (కృష్ణుండు) ధర్మరాజప్రముఖులన్=ధర్మరాజు మొదలగువారిని. వీడుకొని=వదలుకొని-వారిచేత సెలవుపుచ్చుకొని. సాత్యకిప్రముఖసహచరులు=సాత్యకి మొదలుగాఁగల పరిజనులు. కొలువన్=సేవింపఁగా. (మరలి) తనపురంబునకున్=తనదైన ద్వారకాపట్టణమునకు. చనుదెంచి = వచ్చి. బంధుజనులకున్=చుట్టములకు. పరమానందంబుసేయుచున్=అధికసంతోషమునుకలుగఁజేయుచు. ఒక్కపుణ్యదివసంబునన్=ఒకమంచిదినమునందు. శుభలగ్నంబునన్=మంచిముహూర్తమునందు. (కాళిందిని) పెండ్లియయ్యెన్=పెండ్లాడెను. మఱియున్=పిమ్మట. అవంతిదేశాధీశ్వరులు = అవంతిదేశము నేలువారు. అయినవిందానువిందులు = అయినట్టి విందుఁడు అనువిందుఁడు అనువారు. (దుర్యోధనునకు) వశులై=అధీనులై. (హరికిమేనత్తయైన) రాజాదేవికూఁతున్=రాజాదేవియను ఆమెకొమార్తెను. తమచెలియలిన్ = తమచెల్లెలిని. వివాహంబుసేయన్=పెండ్లిచేయుటను. ఉద్యోగించి = యత్నించి. స్వయంవరంబుచాటించినన్=స్వయంవరము అని చాటింపఁగా.

తా॥ అంతట కృష్ణుఁడు ధర్మరాజు మొదలగువారిచేత సెలవు దీసికొని సాత్యకి మొదలగువారితోఁగూడ ద్వారకాపట్టణమునకు మరలివచ్చితమచుట్టములకెల్ల సంతోషముకలుగఁజేయుచు ఒకమంచి దినము చూచుకొని కాళిందిని పెండ్లాడెను పిమ్మట అవంతిదేశపు రాజులును కృష్ణునిమేనత్తయైన రాజాదేవికొడుకులునైన విందుఁడు అనువిందుఁడు అనువారు తమచెల్లెలయిన మిత్రవిందకు పెండ్లిచేయ యత్నించిదుర్యోధనుని ప్రేరేపణచేత స్వయంవరముచాటించిరనితాత్పర్యము.

౧౧౮.—క॥ భూరమణులు సూడఁగ హరి । వీరతఁ జేకొనియె మిత్ర * విందను నిత్యా
పూరిత సుజనానందన్ । జారు చికురకాంతి విజిత * షట్పద బృందన్.

టీ॥ (హరి) భూరమణులు=రాజులు. చూడఁగన్ = చూచుచుండఁగా. వీరతన్=శూరత్వముచేత. నిత్యా...నందన్-నిత్య=ఎల్లప్పుడు. ఆపూరిత=అంతటనిండింపఁబడిన. సుజన=సత్పురుషులయొక్క. ఆనందన్=సంతోషముగలిగినదియు. చారు...బృందన్-చారు=మనోజ్ఞమయిన. చికుర=తలవెండ్రుకలయొక్క. కాంతి=ప్రకాశముచేత. విజిత=జయింపఁబడిన. షట్పదబృందన్=తుమ్మెదగుంపులుగలదియునైన(మిత్రవిందను)చేకొనియెన్=పరిగ్రహించెను

తా॥ అంతట శ్రీకృష్ణమూర్తి ఎల్లప్పుడు సత్పురుషులను ఆనందింపఁజేయునదియు,తుమ్మెదలబారును తిరస్కరింపఁజాలిన కాంతిగల నల్లని తలవెండ్రుకలు గలిగినదియు, విందానువిందుల చెల్లెలునైన మిత్రవిందను ఎల్లరాజులు చూచుచుండఁగా తనవీరత్వమును గనఁబఱిచి పరిగ్రహించెనని తాత్పర్యము.

౧౧౯.—సీ॥ జననాథ వినుము కో * సల దేశమేలెడు - నగ్నజిత్తను నర * నాథుఁ డొకఁడు
సుమతి ధార్మికుఁడు ద * త్సుత నాగ్నజిత్తి య - నఁ గన్యక గుణవతి * గలదు దానిఁ
బెండ్లియాడుటకునై * పృథివీశు లేతెంచి - వాఁడికొమ్ములుగల * వాని వీర
గంధంబు సోఁకినఁ * గాలుద్రవ్వెడువాని - నతిమద మత్తంబు* లైనవాని

తే॥ గోవృషంబుల నేడింటిఁ * గూర్చి తిగిచి । బాహుబలమున నెవ్వఁడు * పట్టికట్టు
నతఁడు కన్యకు వల్లభుం * డనినవానిఁ । బట్టఁజాలక పోదురా * ప్రజలు బెగడి.

టీ॥ జననాథ = ఓరాజా. (వినుము కోసలదేశము) ఏలెడు= ఏలునట్టి. (నగ్నజిత్తు) అనునరనాథుఁడు=అనునట్టిరాజు. (ఒకఁడు) సుమతి=మంచిబుద్ధిగలవాఁడు. ధార్మికుఁడు=ధర్మమునడపువాఁడు. తత్సుత=అతనికూఁతురు. (నాగ్నజిత్తి) అన్కన్యక=అనునట్టికన్యక. గుణవతి=గుణవంతురాలు. (కలదు) దానిన్ = ఆకన్యకను. పెండ్లియాడుటకునై = పెండ్లాడుటకొఱకు. పృథివీశులు = రాజులు. ఏతెంచి=వచ్చి. వాఁడికొమ్ములుగలవానిన్ = సన్నని మొనలుగల కొమ్ములుగలవానిని. వీరగంధంబుసోఁకినన్ = వీరులైనవారివాసన తగిలినను. కాలుద్రవ్వెడువానిన్=కలహమునకు యత్నించువానిని. అతిమదమత్తంబులు = అధికమయిన మదముచేత ఒళ్లుతెలియనివి. (అయినవానిని) గోవృషంబులన్ = ఆఁబోతులను. (ఏడింటిని) కూర్చి=కూడఁబెట్టి. తిగిచి=లాగి. బాహుబలమునన్ = భుజబలముతో. (ఎవ్వఁడు పట్టికట్టునో) అతఁడు=ఆశూరుఁడు. కన్యకున్= తనకొమారితకు. వల్లభుండనిన = పెనిమిటియనఁగా. ఆప్రజలు= ఆపెండ్లాడవచ్చిన రాచకొమాళ్లు. వానిన్ = ఆయాఁబోతులను. పట్టఁజాలక=పట్టలేక. బెగడి=భయపడి. (పోదురు)

తా॥ ఓపరీక్షిన్మహారాజా! కోసలదేశమును ఏలునట్టి నగ్నజిత్తు అనురాజు ఒకఁడు గలఁడు, అతఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు, ధర్మాత్ముఁడునైయుండును, అతనికి గుణవంతురాలైన ఒకకూఁతురు కలదు, ఆకన్యకను పెండ్లాడవలెనని అనేకులు రాజులు ఆరాజునొద్దకు వచ్చి అతఁడు వాఁడియైన కొమ్ములుగలిగినవియు, శూరుఁడనువానిపైగాలిసోఁకినను కలహమునకుసిద్ధపడునవియును, మిక్కిలి క్రొవ్వినవియునైన ఆఁబోతులను ఏడింటినిజూపి వీనిని అణఁచి పట్టి కట్టివేయఁగలశూరుఁడు ఎవఁడో వాఁడు నాకొమార్తకు పెనిమిటి కాఁగలవాఁడు అని చెప్పఁగా ఆఁబోతులను జూచి వెఱచి పెండ్లాడవచ్చిన రాజులందఱు తమవచ్చినదారిఁబట్టి పోవుచుందురు అని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ నగ్నజిత్తు–నగ్న=దిగంబరను–సర్వదరిద్రము. అనఁగా, కనఁబడునది వినఁబడునది ఊహింపఁబడునదియెల్ల తానైయుండ తానుకాదను ద్వైతవృత్తినిపుట్టించునట్టి ఆవరణశక్తిని. జిత్=గెలిచినవాఁడు–బ్రహ్మవేత్త. నాగ్నజిత్తి = ఆబ్రహ్మవేత్తయందుఁగలిగినది–ముక్తికాంత. పృథివీశులు=బ్రహ్మవేత్తలుకాకనే బ్రహ్మవేత్తలమనిగర్వించినవారు. గోవృషంబులనేడింటిన్=కామ క్రోధ లోభ మోహ మద మత్సరములనెడి అరిషడ్వర్గమును,ఆవరణవిక్షేపరూపమయిన అజ్ఞానము అనెడి యేడాబోఁతులను. కృష్ణుఁడనెడుబ్రహ్మవేత్తగెల్చి ముక్తికాంతయనెడు నాగ్నజిత్తిని పెండ్లాడెను.



అర్జునుఁడు.

కృష్ణుడు



(*) శ్రీకృష్ణమూర్తి నాగ్నజిత్తిని పెండ్లాడ కోసలపురమున కరుగుట. (*)

౧౨౦.—వ॥ ఇట్లు గోవృషంబుల జయించినవాఁ డక్కన్యకకు వరుండనిన భగవంతుండైన హరి విని
సేనాపరివృతుండై కోసలపురంబునకుం జనినఁ గోసలాధీశ్వరుండు హరి నెదుర్కొని
యర్ఘ్యపాద్యాదివిధుల నర్చించి పీఠంబు సమర్పించి ప్రతినందితుండై యున్నయెడ.

టీ॥ (ఇట్లు)గోవృషంబులంజయించినవాఁడు=ఆఁబోతులనుగెలిచినవాఁడు. (అక్కన్యకకు) వరుండు = పెనిమిటి. అనినన్ = అనఁగా. (విని) భగవంతుండైనహరి=షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన శ్రీకృష్ణమూర్తి. సేనాపరివృతుండై=దండుచేత చుట్టఁబడినవాఁడై. కోసలపురంబునకున్=కోసలపట్టణమునకు. చనినన్ = పోఁగా. కోసలాధీశ్వరుండు = కోసలపట్టణమునకు రాజైన నగ్నజిత్తు. హరి నెదుర్కొని=కృష్ణునికిఎదుర్కొలువచ్చి. అర్ఘ్యపాద్యాదివిధులన్= అర్ఘ్యము పాద్యము మొదలయిన క్రియలచేత. అర్చించి=పూజించి. పీఠంబుసమర్పించి = పీఁటయిచ్చి. ప్రతినందితుండై = బదులు కొనియాడఁబడినవాఁడై. ఉన్నయెడన్=ఉండునప్పుడు.

శ్లో॥ ఉత్పత్తించవినాశంచ భూతానామాగతింగతిం । వేత్తి విద్యామవిద్యాంచ షణ్ణాంభగ ఇతీరితః ॥ అను ప్రమాణమును పట్టి యీయాఱునుగలవాఁడు భగవంతుఁడు.

తా॥ ఈప్రకారము ఆఁబోతులను గెలిచినవాఁడు ఆకన్యకను

పెండ్లాడవలసినవాఁడు అనువృత్తాంతమును శ్రీకృష్ణమూర్తివినిదండు తోడ కోసలపట్టణమునకు పోయెను, అప్పుడు ఆపట్టణమునకు రాజైన నగ్నజిత్తు కృష్ణునకు ఎదుర్కొలుచేసి పిలుచుకొనిపోయి అర్ఘ్యము పాద్యము మొదలగు క్రియలచేత పూజచేసి కృష్ణునిచే అందులకు తగినట్టు కొనియాడఁబడినవాఁడై తగిన పీఁట యిచ్చి కూర్చుండఁబెట్టెను ఆసమయమునందు అని తాత్పర్యము.

౧౨౧.—క॥ ఆరాజకన్య ప్రియమున । నారాజీవాక్షు మోహ * నాకారుఁ ద్రిలో
కారాధితు మాధవుఁ దన । కారాధ్యుండైన నాథుఁ * డనికోరె నృపా.

టీ॥ నృపా = రాజా. ఆరాజకన్య = ఆనగ్నజిత్తునికూఁతురు. ప్రియమునన్ = ఇష్టముతో. ఆరాజీవాక్షున్ = ఆకమలములవంటి కన్నులుగలవానిని. మోహనాకారున్ = మోహమునుపుట్టించునట్టి ఆకారముగలవానిని. త్రిలోకారాధితున్=మూడులోకములప్రజల చేత ఆరాధనచేయఁబడువానిని. మాధవున్ = కృష్ణుని. (తనకు) ఆరాధ్యుండైననాథుఁడని = పూజ్యుఁడైనభర్తయని. (కోరెను)

తా॥ ఓరాజా! ఆనాగ్నజిత్తి ప్రియముతో తామరలవంటికన్నులును, మోహమును పుట్టించునట్టి ఆకారమునుగలిగి, మూడులోకముల జనులచేతను పూజింపఁబడినవాఁడైన శ్రీకృష్ణమూర్తియేతనకు తగినపెనిమిటియని ఆయనను కోరెనని తాత్పర్యము.

౧౨౨.—వ॥ మఱియు నక్కన్యకారత్నంబు దనమనంబున.

టీ॥ మఱియును=ఇదిగాక. అక్కన్యకారత్నంబు = శ్రేష్ఠురాలైనఆకన్యక. తనమనంబునన్ = తనమనసులో. (ఇట్లుతలఁచెను)

౧౨౩.—తే॥ విష్ణుఁ డవ్యయుండు * విభుఁడు గావలెనని । నోఁచినట్టి తొంటి * నోము ఫలము
సిద్ధియయ్యెనేనిఁ * జేకొనుఁబో నన్నుఁ । జక్రధరుఁడు వైరి * చక్ర హరుఁడు.

టీ॥ అవ్యయుండు = నాశములేనివాఁడునైన. విష్ణుఁడు=సర్వవ్యాపకుఁడైన భగవంతుఁడు. విభుఁడు=పెనిమిటి. (కావలెనని) నోఁచినట్టితొంటినోము=ఆచరించిన పూర్వజన్మపువ్రతముయొక్క. (ఫలము) సిద్ధియయ్యెనేనిన్ = నెఱవేఱినపక్షమున. వైరిచక్రహరుఁడు=శత్రుసమూహములనురుద్రునివలెనశింపఁజేయువాఁడైన. చక్రధరుఁడు = చక్రాయుధమును ధరించినకృష్ణుఁడు. (నన్ను) చేకొనుఁబో=గ్రహింపనేగ్రహించును.

తా॥ సర్వవ్యాపకుఁడును నాశములేనివాఁడునైన శ్రీకృష్ణుని పెండ్లాడవలెనని నేను పూర్వజన్మమున నోఁచిననోము ఫలించెడు పక్షమున ఇప్పుడు శత్రుసమూహములను నాశముచేయువాఁడైన శ్రీకృష్ణమూర్తి నన్నుఁ పెండ్లాడకపోఁడు అని అనుకొనెనని తా.

౧౨౪.—మ॥ సిరియుం బద్మభవేశ దిక్పతులు మున్ * సేవించి యెవ్వాని శ్రీ
చరణాంభోజ పరాగము ల్శిరములన్ * సమ్యగ్గతిం దాల్తు రీ
ధరణీచక్ర భరంబు వాపుటకును * ద్యత్కేళి మూర్తు ల్దయా
పరుఁడై యెవ్వఁడు దాల్చు నట్టిహరి యే * బ్భంగిం బ్రవర్తించునో.

టీ॥ సిరియున్=లక్ష్మీదేవియును. పద్మభవేశదిక్పతులును—పద్మభవ=బ్రహ్మయు. ఈశ=శివుఁడును. దిక్పతులును = ఇంద్రుఁడు మొదలగు దిక్పాలకులును. మున్=పూర్వకాలమునందు. సేవించి=కొలిచి. ఎవ్వాని... గములు—ఎవ్వాని = ఏపురుషోత్తమునియొక్క. శ్రీ = సంపదను కలుగఁజేయునట్టి. చరణ = పాదములనెడు. అంభోజ=కమలములయందలి—కమలములవంటి పాదములయందలి. పరాగములు=దుమ్ములనెడుపుప్పొళ్లు. శిరములన్ = తలలయందు. సమ్యగ్గతిన్=మంచిరీతిచేత—చక్కఁగా. తాల్తురు = ధరింతురో. (ఎవ్వఁడు) ఈధరణీచక్రభరంబు = ఈభూమండలముయొక్కబరువును. వాపుటకున్ = పోఁగొట్టుటకు. ఉద్యత్కేళిమూర్తులు — ఉద్యత్=పుట్టుచున్న. కేళి=క్రీడారూపములైన. మూర్తులు=ఆకారములను. దయాపరుఁడై=దయయందాసక్తుఁడై — మిక్కిలి దయగలవాఁడై. తాల్చున్=ధరించునో. అట్టిహరి = అటువంటి యీశ్రీకృష్ణుఁడు. ఎబ్భంగిన్=ఏవిధముగా. ప్రవర్తించునో=నడచుకొనునో.

తా॥ శ్రీలక్ష్మీదేవియు బ్రహ్మయు శివుఁడును ఇంద్రుఁడు మొదలయిన దిక్పాలకులును పూర్వకాలమునందు తమకోరికలు నెఱవేర్చుకొనుటకై యేమహాపురుషుని సేవించి వాని పాదకమలములయందలి దుమ్మనెడు పుప్పొడిని ప్రీతితో తలలో ధరింతురో, ఏమహాపురుషుఁడు ఈభూమి బరువును పోఁగొట్టుటకై యిచ్చవచ్చినక్రీడారూపములను దయతో ధరించునో అట్టి సర్వేశ్వరుఁడైన యీకృష్ణమూర్తి నావిషయమునందు ఏమిచేయఁదలఁచునో తెలియదుఅనితా.

౧౨౫.—వ॥ అనియిట్లు నాగ్నజిత్తి విచారించు నెడఁ గృష్ణుం డారాజుంజూచి మేఘగంభీర నినదంబున నిట్లనియె.

టీ॥ (అని యిట్లు నాగ్నజిత్తి) విచారించు నెడన్=విచారపడుచుండుసమయమున. (కృష్ణుండు) ఆరాజుంజూచి = ఆనగ్నజిత్తును జూచి. మేఘగంభీరనినదంబునన్=ఉఱుముఉఱిమినట్టుగంభీరముగా వినవచ్చునట్టి కంఠధ్వనితో. (ఇట్లనియెను)

తా॥ అని యీప్రకారముగా నగ్నజిత్తుకూఁతురు విచారపడుచుండఁగా శ్రీకృష్ణుఁడు ఉఱుము ఎంతగంభీరముగా వినవచ్చునో అంతగంభీరమైన కంఠధ్వనితో నగ్నజిత్తుతోపలికెననితాత్పర్యము.

౧౭౬.—క॥ అన్యుల యాచింపరు రా । జన్యులు సౌజన్యకాంక్షఁ * జనుదెంచితి నీ
కన్యన్వేఁడెద నిమ్మా । కన్యా శుల్కదుల మేము * గాము నరేంద్రా.

టీ॥ నరేంద్రా = రాజా. రాజన్యులు = రాజవంశమునఁబుట్టిన వారు. అన్యులన్=ఇతరులను. యాచింపరు = ఏమియునడుగరు. (నేను) సౌజన్యకాంక్షన్ = సుజనత్వమువలనికోరికచేత — మంచి తనమునపేక్షించి. చనుదెంచితిన్=నీయింటికివచ్చితిని. నీకన్యన్= కొమార్తను. వేఁడెదన్=కోరెదను. ఇమ్మా=నాకుఇయ్యవయ్యా. (మేము) కన్యాశుల్కదులము=ఓలియిచ్చువారము. (కాము)

తా॥ ఓరాజా! రాజవంశమునఁబుట్టినవారు ఇతరులను ఏమియు నడుగనేరరు, అయినను నేనుమంచితనమును గోరినవాఁడనై (నీకొమార్తను మునుపు రుక్మిణిని తీసికొనిపోయినట్లు బలాత్కారముగా తీసికొనిపోను ఇష్టము లేకయనుట) నీకొమార్త నిమ్మని అడుగుటకై నీయింటికివచ్చితిని కనుక నీవు ఆకన్యకను మాకు ఇమ్ము అందులకై ఓలియడిగెడుపక్షమున మేము ఇయ్యనేరము ఇందులకేమిచెప్పెద వని యడిగెనని తాత్పర్యము.

వ॥ అనిన రాజిట్లనియె.

౧౭౭.—శా॥ కన్యం జేకొన నిన్నిలోకముల నీ * కన్నన్ ఘనుండైన రా
జన్యుం డెవ్వఁడు నీగుణంబులకు నా * శ్చర్యంబునంబొంది తా
నన్యారంభము మాని లక్ష్మి భవ దీ * యాంగంబు నన్నిత్యయై
ధన్యత్వంబునఁ జెందియున్నదిగదా * తాత్పర్య సంయుక్తయై.

టీ॥ ఇన్నిలోకములన్=ఇప్పుడు వాడఁబడు పదునాలుగులోకములలోను. కన్యన్=నాకొమార్తను. చేకొనన్ = పరిగ్రహించుటకు — పెండ్లాడుటకు. నీకన్నన్ = నీకంటెను. ఘనుండైనరాజన్యుండు = గొప్పవాఁడైనరాచవాఁడు. (ఎవ్వఁడు) నీగుణంబులకున్=నీవైన కల్యాణగుణములకు. ఆశ్చర్యంబునంబొంది = వింతపడి. లక్ష్మి=లక్ష్మీదేవి. తాన్=తాను. అన్యారంభముమాని=ఇతర ప్రయత్నమునువదలి. భవదీయాంగంబునన్=నీదేహమునందు—వక్షస్థలమునందనుట. నిత్యయై=నిలుకడనుపొందినదై. తాత్పర్యసంయుక్తయై = తత్పరత్వముతోఁ గూడుకొన్నదై. ధన్యత్వంబునఁజెందియున్నదిగదా = కృతార్థురాలయియున్నదిగదా.

తా॥ ఎల్లలోకములలోను వెదకి చూచినను నాకొమార్తకు నీకంటె ఘనుఁడైనవరుఁ డెవఁడుగలఁడు నీకల్యాణగుణములను జూచి చొక్కికదా లక్ష్మీదేవి తక్కిన ప్రయత్నము లేవియుఁజేయక నీవక్షస్స్థలమునందేయునికిఁజేసికొని నీయందాసక్తురాలై కృతార్థత్వమును పొందియున్నది అని పలికెనని తాత్పర్యము.

౧౭౮.—శా॥ చంచద్గోవృష సప్తకంబు కడిమిన్ * సైరించి యెవ్వాఁడు భం
జించున్ వానికిఁ గూఁతుఁ నిత్తునని యేఁ * జీరించి నన్వైభవో
దంచద్గర్వులు వచ్చి రాజతనయుల్ * దత్పాద శృంగాహతుల్
గించిత్కాలము నోర్వకేగిరనికిం * గేడించి భిన్నాంగులై.

టీ॥ చంచద్గోవృషసప్తకంబుకడిమిన్—చంచత్=ఒప్పిదములైన. గోవృష = ఆఁబోతులయొక్క. సప్తకంబు = ఏడింటియొక్క—క్రొవ్విన ఆఁబోతులేడింటియొక్క. కడిమిన్ = పరాక్రమమును. సైరించి=ఓర్చి. ఎవ్వాఁడు=ఎవఁడు. భంజించున్ = వానినిభంగపెట్టునో. వానికిన్=అట్టివానికి. కూఁతున్ = కొమార్తను. (ఇత్తునని) ఏఁజీరించినన్=నేనుపిలిపింపఁగా. వైభవోదంచద్గర్వులు = ఐశ్వర్యాతిశయముచేత ఒప్పిదమయినగర్వముగలవారైన. రాజతనయులు=రాచకొమాళ్లు. (వచ్చి) తత్పాదశృంగాహతులు=ఆయాఁబోతులకాళ్లయొక్కయు కొమ్ములయొక్కయు తన్నులను పోట్లను. కించిత్కాలమున్=కొంతసేపైనను. ఓర్వక=సహింపక. అనికిన్=యుద్ధమునకు. కేడించి=వెనుదీసి. భిన్నాంగులై = భేదింపఁబడిన అవయవములుగలవారై. ఏగిరి=పోయిరి.

తా॥ ఈపట్టణములో క్రొవ్విన ఏడు ఆఁబోతులు గలవు వానివలనిబాధకు తాళలేక ఎవఁడు ఆయాఁబోతుల పరాక్రమమునకు ఓర్చి నిలిచి వానిని ఎవఁడు పడఁగొట్టునో అట్టివానికి నాకొమార్తనిచ్చెదనని నేను అనేకులను రాచకొమారులనుపిలిపించితిని ఆరాచకొమాళ్లందఱు తమతమవైభవములతో వచ్చి ఆ యాఁబోతులనెదిరించి వాని కాలి తన్నులచేతను కొమ్ములపోట్లచేతను భేదింపఁబడిన అవయవములుగలవారై కొంచెముసేపైన నిలువలేక వెఱచి పాఱిపోయిరి అని తాత్పర్యము.

౧౭౯.—శా॥ ఉష్ణాంశుండు తమంబుఁ దోలుక్రియ నీ * వుగ్రాహవ క్షోణిలోఁ
గృష్ణా వైరులఁ దోలినాఁడవు రణ * క్రీడా విశేషంబులన్
నిష్ణాతుండవు సప్తగోవృషములన్ * నేడాజి భంజించి రో
చిష్ణుత్వంబున నేడుచేకొనుము మా * శీతాంశు బింబాననన్.

టీ॥ (కృష్ణా నీవు) ఉగ్రాహవక్షోణిలోన్ = భయంకరమయిన యుద్ధభూమియందు. ఉష్ణాంశుండు=సూర్యుఁడు. తమంబున్=చీకటిని. తోలుక్రియన్ = తఱుమురీతిగా. వైరులన్ = శత్రువులను. తోలినాఁడవు = తఱుమఁగొట్టినావు. రణక్రీడావిశేషంబులన్ =

విశేషములయినయుద్ధక్రీడలయందు. నిష్ణాతుండవు=చలింపకనిలుచువాఁడవు. ఆజిన్ = యుద్ధమునందు. (నేఁడు)సప్తగోవృషములన్=ఏడుఆఁబోతులను. భంజించి=వానినిభంగపెట్టి-చంపి. మాశీతాంశుబింబాననన్=చంద్రబింబమువంటి ముఖముగలమాబిడ్డను. రోచిష్ణుత్వంబునన్=ప్రకాశశీలత్వముతో. (నేఁడు)చేకొనుము=గ్రహింపుము.

తా॥ ఓకృష్ణమూర్తీ! నీవు ఇప్పుడు సూర్యుఁడు చీఁకట్లనుదూరముగాతొలఁగించునట్లు యుద్ధభూమియందు శత్రువులనుతఱిమినవాఁడవునుయుద్ధక్రీడయందు కదలకనిలుచునట్టినియమముగలవాఁడవును గనుక యుద్ధమునందుఆ యేడు ఆఁబోతులను జంపి ప్రతాపముచేత వెలుఁగొందినవాఁడవగుచు మాబిడ్డను నేఁడు పెండ్లాడుమనెననితా.

౧౩౦.—వ॥ అని నగ్నజిత్తు దనకూఁతు వివాహంబునకుం జేసిన సమయంబు చెప్పినవిని.

టీ॥ (అనినగ్నజిత్తు)తనకూఁతువివాహంబునకున్=తనకొమార్తె పెండ్లికి. చేసినసమయంబు = చేసినట్టిప్రతిజ్ఞను. ( చెప్పిన విని )

తా॥ ఈప్రకారముగా నగ్నజిత్తు తనకూఁతుపెండ్లికై తాను జేసికొన్న నియమమును తెలియఁజేయఁగావిని అనితాత్పర్యము.

౧౩౧.—చ॥ కనియె నఘారి వత్స బక * కంస విదారి ఖలప్రహారి దా
ఘనతర కిల్బిషంబుల న * గణ్య భయంకర పౌరుషంబులన్
సునిశిత శృంగ నిర్దళిత * శూరసమూహ ముఖామిషంబులన్
హనన గుణోన్మిషంబుల మ * హా పరుషంబుల గోవృషంబులన్.

టీ॥ అఘారి = అఘుఁడనువానికి పగవాఁడును. వత్సబకకంసవిదారి = వత్సాసుర బకాసుర కంసులను జంపినవాఁడును. ఖలప్రహారి=దుర్జనులను లెస్సగా కొట్టువాఁడునునైనకృష్ణుఁడు. తాన్=తాను. ఘనతరకిల్బిషంబులన్=మిక్కిలి అధికములయినపాపములుగలవానిని-పాపకృత్యములుగలవి అనుట. అగణ్యభయంకరపౌరుషంబులన్ = ఎంచరానిభయమును పుట్టించునట్టిమగతనము-శూరత్వముగలవానిని. సునిశిత...ఆమిషంబులన్ - సునిశిత = మిక్కిలి వాఁడియైన. శృంగ = కొమ్ములచేత. నిర్దళిత=చీల్పఁబడిన. శూరసమూహ=శూరులగుంపులయొక్క. ముఖామిషంబులన్=ముఖములయందలి మాంసములు గలవానిని. హననగుణోన్మిషంబులన్ = చంపెడిస్వభావమునందు (ఎచ్చరికగలవానిని)మహాపరుషంబులన్=అతిక్రూరములైనవానిని. గోవృషంబులన్=ఆఁబోతులను(కనియెను)

తా॥ అఘాసురుఁడు వత్సాసురుఁడు కంసుఁడు మొదలగువారిని చంపినవాఁడును, తక్కిన దుర్జనులను శిక్షించువాఁడును అయిన శ్రీకృష్ణమూర్తి మిక్కుటమయిన పాపములు గలవియును, ఇంత అంత అని చెప్పరానిభయమును కలుగఁజేయునట్టిపౌరుషము కలిగినవియును, మిక్కిలివాఁడియైనకొమ్ములచేత ఎగఁజిమ్మఁబడిన శూరులగుంపుల మొగములయందలిమాంసములుగలిగినవియు, తమ్ము ఎదిరించినవారిని చంపుటయందు ఎచ్చరికగలిగినవియును అతిక్రూరస్వభావముగలవియునైన ఆఁబోతులను చూచెను అని తాత్పర్యము.

## (*) శ్రీకృష్ణమూర్తి వృషభంబుల నంటఁగట్టి నాగ్నజిత్తిని పెండ్లాడుట. (*)



ఉ॥ చేలము చక్క గట్టుకొని *
చిత్రగతిన్ వడి నేడు మూర్తులై
బాలుఁడు దారురూపములఁ *
బట్టెడు కైవడిఁ బట్టి వీర శా
ర్దూలుఁడు గ్రుద్ది నేలఁబడఁ *
ద్రోచి మహోద్ధతిఁ గట్టియీడ్చె భూ
పాలకులెల్ల మెచ్చ వృష *
భంబులఁ బర్వత సన్నిభంబులన్.

టీ॥ వీరశార్దూలుఁడు = వీరులలో శ్రేష్ఠుఁడైన కృష్ణుఁడు. చేలము=వస్త్రమును. చక్కగట్టుకొని=చక్కగాకట్టుకొని. చిత్రగతిన్=వింతయైనరీతితో. వడిన్=వడిగా. ఏడుమూర్తులై=ఏడురూపములుపొందినవాఁడై. బాలుఁడు = పసివాఁడు. దారురూపములన్=మానితోచేసినస్వరూపములను. పట్టెడుకైవడిన్=పట్టుకొనురీతిగా. (పట్టి)గ్రుద్ది=పిడికిటితోకొట్టి. నేలన్=భూమియందు. (పడఁద్రోచి) మహోద్ధతిన్=అధికమయిననిక్కుతోకట్టి. భూపాలకులెల్లన్=రాజులందఱును. మెచ్చన్=శ్లాఘించునట్టుగా. పర్వతసన్నిభంబులన్=కొండలనుబోలినవైన. (వృషభంబులను ఈడ్చెను)

తా॥ శూరశ్రేష్ఠుడైనశ్రీకృష్ణమూర్తి పైయుత్తరీయమును మొలను చక్కగాచుట్టి బిగఁగట్టుకొని చూచువారికి వింతగా ఏడువృషభములకును ఏడురూపములుగా కనఁబడి యెవఁడైన ఒకపసిపిన్నవాఁడు కొయ్యతోఁజేయఁబడిన వృషభరూపములను త్రాటితో కట్టి యీడ్చునట్టుగా పర్వతములను బోలిన ఆ యేడువృషభములను నేలఁబడ గ్రుద్ది అణఁచిపట్టి త్రాళ్లతో కట్టి రాజులందఱు సెభాసని శ్లాఘించునట్టుగా ఈడ్చెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు వృషభంబుల నన్నింటినిం గట్టియాడ్చినంజూచి సంతసించి హరికి నగ్నజిత్తు నాగ్నజిత్తి నిచ్చిన విధివత్ప్రకారంబునం బెండ్లియయ్యె, నారాజుసుందరు లానందంబుఁబొంది రాసమయంబున బ్రాహ్మణాశీర్వాదంబులును,గీత పటహ శంఖ కాహళ భేరీమృదంగనినదంబులుచెలంగె,నంత నాకోసలేంద్రుండు దంపతుల రథారోహణంబుసేయించి పదివేల ధేనువులను, విచిత్రాంబరాభరణ భూషితలైన యువతులమూడువేలను, దొమ్మిదివేల గజంబులను, గజంబులకు శతగుణ రథంబులను, రథంబులకుశతగుణంబులైనహయంబులను,హయంబులకు శతగుణాధికంబైన నరసమూహంబునునిచ్చి పుత్తెంచిన వచ్చునప్పుడు.

టీ॥ (ఇట్లు) వృషభంబులన్=ఆఁబోతులను. (అన్నింటినిఁగట్టియాడ్చినంజూచి) సంతసించి=సంతోషించి. హరికిన్=కృష్ణునికి. (నగ్నజిత్తు నాగ్నజిత్తిని) ఇచ్చినన్=ఇయ్యఁగా. విధివత్ప్రకారంబునన్=శాస్త్రపద్ధతిచొప్పున. పెండ్లియయ్యెన్ = పెండ్లాడెను. ఆరాజుసుందరులును = ఆరాజుభార్యలును. ఆనందంబుఁబొందిరి=సంతోషించిరి. ఆసమయంబునన్ = ఆకాలమునందు. బ్రాహ్మణాశీర్వాదంబులును = బ్రాహ్మణులు దీవించుదీవెనలును. గీత...నినదంబులును–గీత = పాటలయొక్కయు. పటహ=డవిణయనువాద్యముయొక్కయు. శంఖ=శంఖములయొక్కయు. కాహళ = తుతారలయొక్కయు. భేరీ=పెద్దనగారాలయొక్కయు. మృదంగ=మద్దెలలయొక్కయు. నినదంబులు=ధ్వనులు. చెలంగెన్=అతిశయించెను. అంతన్=అంతట. ఆకోసలేంద్రుండు=నగ్నజిత్తు. దంపతులన్ = పెండ్లికొడుకు పెండ్లికొమార్తలను. రథారోహణంబుచేయించి = రథముపైనెక్కించి. (పదివేల)ధేనువులను=ఆవులను. విచిత్రాం...భూషితలు–విచిత్ర=వింతవింతలయిన. అంబర=వస్త్రములచేతను. ఆభరణ = భూషణములచేతను. భూషితలు = అలంకరింపఁబడినవారు. ఐనయువతులన్=అయినట్టియౌవనస్త్రీలను. మూడువేలను=మూడువేలమందిని. (తొమ్మిదివేల) గజంబులను=ఏనుఁగులను. గజంబులకున్=ఏనుఁగులకంటె. శతగుణరథంబులను=నూఱంతలతేరులను. రథంబులకున్=తేరులకంటె. శతగుణంబులైన = నూఱంతలైన. హయంబులను=గుఱ్ఱములను. హయంబులకున్ = గుఱ్ఱములకంటె. శతగుణాధికంబైన=నూఱంతలకెక్కువైన. నరసమూహంబును=మనుష్యులగుంపును. (ఇచ్చి) పుత్తెంచినన్=పంపఁగా. వచ్చునప్పుడు=ద్వారకకువచ్చునప్పుడు.

తా॥ ఈవిధముగా ఏడు ఆఁబోతులను కృష్ణుఁడు కట్టియాడ్చివేయఁగా అతనికి నగ్నజిత్తు సంతోషించి తనకొమార్త నిచ్చెను, అంతట కృష్ణుఁడు శాస్త్రమునందు చెప్పఁబడినచొప్పున నాగ్నజిత్తిని పెండ్లియాడెను, నగ్నజిత్తు భార్యలును అందులకు సంతోషించిరి, అప్పుడు బ్రాహ్మణులు దీవించు దీవెనలును, సంగీతవాద్యధ్వనులును అతిశయించెను, పిమ్మటనగ్నజిత్తు కొమార్తను అల్లుని రథముమీఁదఁ గూర్చుండఁబెట్టి పదివేలపాఁడియావులను, వింతవింతచీరలు సొమ్ములు ధరించిన పరిచారికలను మూడువేలమందిని తొమ్మిదివేలయేనుఁగులను, తొంబదివేలరథములను, తొమ్మన్నూరువేలగుఱ్ఱములను, అంతకు నూఱంతలకంటె అధికమయిన సేవకులగుంపును అరణముగా నిచ్చిపంపఁగా కృష్ణుఁడు అందుండి బయలుదేరి ద్వారకాపట్టణమునకు వచ్చుచుండఁగానని తాత్పర్యము.

౧౩౪.—ఉ॥ భూతియలర్పఁ గోసలుని * పుత్రికకై చనుదెంచి తొల్లి యాఁ
బోతులచేత నోటువడి * పోయిన భూపతులెల్ల మాధవుం
డాతరుణిన్ వరించుట చ * రావలిచే విని త్రోవ సైన్య సం
ఘాతముతోడఁ దాఁకి రరి * గర్వవిమోచనుఁ బద్మలోచనున్.

టీ॥ తొల్లి = మునుపు. భూతియెలర్పన్ = ఐశ్వర్యముఅతిశయింపఁగా. కోసలునిపుత్రికకై = కోసలదేశప్రభువైన నగ్నజిత్తుకొమార్తకొఱకు. చనుదెంచి=వచ్చి. (ఆఁబోతులచేత) ఓటువడి=ఓటమినిపొంది–అపజయమునొంది. పోయినభూపతులు=పోయినట్టిరాజులు. ఎల్లన్=అందఱును. మాధవుండు=కృష్ణుఁడు. ఆతరుణిన్=ఆయువతిని. వరించుట=పెండ్లాడుట. చరావలిచేన్=వేగులవారిచారులచేత. (విని) త్రోవన్ = మార్గమునందు. సైన్యసంఘాతముతోడన్=సేనాసమూహముతోడ. అరిగర్వవిమోచనున్=పగవారిఅహంకారము తొలఁగించువాఁడైన. పద్మలోచనున్=శ్రీకృష్ణుని. తాఁకిరి=ఎదిరించిరి.

తా॥ మునుపు నాగ్నజిత్తికొఱకుఁగాను పోయి ఆఁబోతులచేత పోట్లు తప్పించుకొని పారిపోయినరాజులందఱు కృష్ణుఁడు నాగ్నజిత్తిని పెండ్లాడెనను వర్తమానము వేగులవారివలన విని దారిలో శ్రీకృష్ణమూర్తిని ఎదిరించిరని తాత్పర్యము.

౧౩౫.—ఉ॥ దండిని రాజులెల్ల హరిఁ * దాఁకిన నడ్డము వచ్చి పీఁకతో
భండన భూమియందుఁ దన * బాంధవు లెల్లను సన్నుతింపఁగా
గాండివ చాపముక్త విశి * ఖంబుల వైరుల నెల్లఁ జంపె నా
ఖండల నందనుండు శశ * కంబుల సింహము చంపుకైవడిన్.

టీ॥ రాజులెల్లన్ = ఆరాజులందఱును. దండిన్ = పరాక్రమసమృద్ధితో. హరిన్=కృష్ణుని. తాఁకినన్=ఎదిరింపఁగా. ఆఖండలనందనుండు=అర్జునుఁడు. పీఁకతోన్=పరాక్రమముతో (అడ్డమువచ్చి) భండనభూమియందున్=యుద్ధభూమియందు. తనబాంధవు

తెల్లన్ = తనచుట్టములందఱు. సన్నుతింపఁగాన్ = పొగడఁగా. గాండివచాపము క్తవిశిఖంబులన్ = గాండివము అను ధనుస్సువలన నుండి విడువఁబడిన బాణములచేత. (సింహము) శశకంబులన్ = కుందేళ్లను. చంపుకైవడిన్ = చంపెడువిధమున. వైరుల నెల్లన్= ఆపగవారినందఱను. (చంపెను)

తా॥ ఆవిధముగా ఆరాజులందఱు కృష్ణునిత్రోవను అడ్డగించి ఎదిరింపఁగా అర్జునుఁడుకోపించినవాఁడై పరాక్రమించి అడ్డముగా వచ్చి తనగాండివమనెడు ధనుస్సునుండి విడువఁబడిన బాణముల చేత సింహము విజృంభించి కుందేళ్లనుచంపెడురీతిని పగవారి నంద ఱిని అనాయాసముగా చంపెను అని తాత్పర్యము.

౧౩౬.—వ॥ ఇట్లు హరి నాగ్నజిత్తిని బెండ్లియాడి యరణంబు పుచ్చుకొని ద్వారకా
నగరంబునకు వచ్చి సత్యభామతోఁ గ్రీడించుచుండె మఱియును.

టీ॥ (ఇట్లు హరి నాగ్నజిత్తిని పెండ్లియాడి) అరణంబుపుచ్చు కొని= పెండ్లికాలమునందు మామగారిచ్చునట్టిధనమును పుచ్చుకొని. ద్వారకానగరంబునకున్ = ద్వారకాపట్టణమునకు. (వచ్చి సత్య భామతో క్రీడించుచుండెను) మఱియును=ఇదిగాక.

౧౩౭.—మ॥ జనవంద్యన్ శ్రుతకీర్తి నంద్యఁ దరుణిన్ * సందర్శన క్షోణిపా
ద్యనుజన్ మేనమఱందలిన్ విమల లో * లాపాంగఁ గైకేయి ని
త్యనయోన్నిద్రఁ బ్రపూర్ణ సద్గుణ సము * ద్రన్ భద్ర నక్షుద్ర నా
వనజాతాక్షుఁడు పెండ్లియాడె నహిత * వ్రాతంబు భీతిల్లఁగన్.

టీ॥ జనవంద్యన్ = జనులచేత కొనియాడఁబడఁదగినదానిని. శ్రుతకీర్తినంద్యన్ = కృష్ణునిమేనత్తయగు శ్రుతకీర్తియను ఆమెను సంతోషపెట్టఁదగినదానిని. తరుణిన్ = యౌవనవతిని. సందర్శన క్షోణిపాద్యనుజన్ = సందర్శనరాజు మొదలగువారిచెల్లెలిని. మేన మఱందలిన్=మేనమఱఁదలయినదానిని. విమలలోలాపాంగన్= నిర్మలములును చలించునవియునైన కడకన్నులుగలదానిని. కైకే యిన్=కేకయరాజుకూఁతును. నిత్యనయోన్నిద్రన్=ఎడతెగని నీతి చేత పరాకుపడనిదానిని. ప్రపూర్ణ సద్గుణసముద్రన్=చక్కగాతన యందునిండుకొన్నమంచిగుణములకుసముద్రమైనదానిని. అక్షుద్రన్ =గౌరవముగలదానిని. భద్రన్ = భద్రయనుదానిని. ఆవనజా తాక్షుఁడు=ఆకృష్ణుఁడు. అహితవ్రాతంబు = శత్రుసమూహము. భీతిల్లఁగన్=భయపడుచుండఁగా. (పెండ్లియాడెను)

తా॥ కేకయదేశపురాజు భార్యయు కృష్ణుని మేనత్తయునైన శ్రుతకీర్తియను ఆమెను సంతోషపెట్టునట్టికొమార్తయు, సందర్శన రాజు మొదలగువారి చెల్లెలును, తనకు మేనమఱఁదలును, నిర్మల ములు చలించునవియునైన కడకన్నులుగలదియు, ఎడతెగని నీతిచేత పరాకుపడనిదియు, మంచిగుణములనెడు రత్నములకు సముద్రము వంటిదియు, గొప్పతనముగలదియు, ఎల్లజనులచేత కొనియాడఁ బడునదియునైన భద్రయనుకన్యకను శత్రువులందఱు భయమొందు నట్లుగా శ్రీకృష్ణమూర్తి పెండ్లియాడెనని తాత్పర్యము. (మఱియును)

౧౩౮.—చ॥ అమరులఁ బాఱఁదోలి భుజ * గాంతకుఁడైన ఖగేశ్వరుండు ము
న్నమృతముఁ దెచ్చుకైవడి మ * దాంధుల రాజుల నుక్కడంచి యా
కమల దళాయతేక్షణుఁడు * కైకొని తెచ్చెను మద్రకన్యకన్
సమద మృగేక్షణన్ నయవి * చక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్.

టీ॥ ఆకమలదళాయతేక్షణుఁడు=తామరతేకులవంటివిశాలము లైనకన్నులుగలశ్రీకృష్ణమూర్తి. మున్ను = మునుపు. భుజగాంతకుఁ డైన=పాములకుయముఁడైన. ఖగేశ్వరుండు = పక్షిరాజైనగరుత్మం తుఁడు. అమరులన్ = దేవతలను. పాఱఁదోలి = తఱుమఁగొట్టి. (అమృతమును) తెచ్చుకైవడిన్=తెచ్చినవిధమున. మదాంధులన్= క్రొవ్వుచేతకన్నుగాననివారైన. రాజులన్=శత్రురాజులను. ఉక్క డంచి = మదమణఁగఁగొట్టి. మద్రకన్యకన్ = మద్రదేశపురాజు కూఁతురైన. సమదమృగేక్షణన్=మదించినలేఁడికన్నులవంటికన్నులు గలదానిని. నయవిచక్షణన్ = నీతియందలి నేర్పుగలదానిని. పుణ్య లక్షణన్=మంచిలక్షణములుగలదానిని. లక్షణన్=లక్షణయనుకన్య కను. కైకొని=పరిగ్రహించి. తెచ్చెన్=తీసికొనివచ్చెను.

తా॥ ఆశ్రీకృష్ణుఁడు మునుపు పాములనుజంపువాఁడైన గరుత్మం తుఁడు దేవతలను తఱుమఁగొట్టి అమృతమును తీసుకవచ్చినట్లు మదించి కన్నుగానక తిరుగుచున్న శత్రురాజులను అణఁగఁగొట్టి మద్రదేశపురాజు కూతురునుమదించిన లేఁడిచూపులవంటి చూపులు గలిగినదియు, నేర్పుతో నీతిని నడపునదియు, ఎల్లమంచిలక్షణములు గలిగినదియునైన లక్షణయనుకన్యకను తీసుకవచ్చిపెండ్లాడెననితా.

వ॥ ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయుఁ, గాళిందియు, మిత్రవిందయు, నాగ్నజిత్తియు,
భద్రయు, మద్రరాజనందనయైన లక్షణయు, ననఁగ నెనమండ్రు భార్యలైరి, మఱియు నరకాసురుని
వధియించి తన్నిరుద్ధకన్యకల సహస్రసంఖ్యల రోహిణి మొదలైన వారిం బరిగ్రహించె ననిన విని.
౧౬౧౦౦

తా॥ ఈవిధముగా శ్రీకృష్ణమూర్తికి రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజిత్తి, భద్ర, మద్రదేశపురాజు కూఁతురైన లక్షణ అనఁగా ఎనిమిదిమందిభార్యలయిరి, వీరుగాక నరకాసురునిఁజంపి వానిచేతఁ జెఱఁబెట్టఁబడిన వేలకొలఁదులైన రోహిణి మొదలయినవారినిగూడ శ్రీకృష్ణుఁడు భార్యలుగాఁ జేసికొనెనుఅనఁగావినిపరీక్షిన్మహారాజు ఒకప్రశ్నచేసెననితాత్పర్యము.

౧౪౦.—క॥ ధరకుం బ్రియనందనుఁడగు । నరకుని హరియేలచంపె * నరకాసురుఁడా
వరకుంతలలగు చామీ । కర కుంభ స్తనుల నేల * కారలఁ బెట్టెన్.

టీ॥ ధరకున్=భూదేవికి. ప్రియనందనుఁడు = ప్రియమయినకొడుకు. అగునరకునిన్=అగునట్టినరకాసురుని. (హరియేలచంపెను నరకాసురుఁడు) ఆవరకుంతలలు = ఆమంచి తలవెండ్రుకలు గలవారు. అగుచామీకరకుంభ స్తనులన్=అయినబంగారుకుండలవంటి స్తనములుగలవారిని. (ఏల) కారలఁబెట్టెన్=చెఱలయందుఁబెట్టెను.

తా॥ భూదేవికి ప్రేమాస్పదుఁడైనకొడుకునరకాసురుఁడు అట్టి నరకాసురునికృష్ణమూర్తి ఏలచంపెనుఆనరకాసురునిచేతవేలకొలఁది స్త్రీలు ఏలచెఱఁబెట్టఁబడిరి ఆవృత్తాంతముచెప్పుమని అడిగెననితా.

వ॥ అనిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె నరకాసురునిచేత నదితి కర్ణకుండలంబులును, వరుణఛత్రం
బును, మణిపర్వతమనియెడు నమరాద్రిస్థానముం, గోలుపడుటయు నింద్రుండువచ్చి హరికి విన్నవించిన
హరి నరకాసురవధార్థంబు గరుడవాహనారూఢుండై చనుసమయంబున హరికి సత్యభామ యిట్లనియె.

టీ॥ (అనిన) నరేంద్రునకున్ = పరీక్షిన్మహారాజునకు. మునీంద్రుండు = శుకమహాముని. (ఇట్లనియెను నరకాసురునిచేత) అదితి కర్ణకుండలంబులును = అదితిదేవియొక్క చెవికమ్మలును. వరుణఛత్రంబును = వరుణునిగొడుగును. (మణిపర్వతమనియెడు) అమరాద్రిస్థానమున్=మేరుపర్వతప్రదేశమును. కోలుపడుటయున్= కోలుపోఁగా— అపహరింపఁబడఁగా. (ఇంద్రుండువచ్చి)హరికివిన్నవించినన్ = శ్రీకృష్ణునితో విన్నపముచేయఁగా. (హరి) నరకాసురవధార్థంబు = నరకాసురుని చంపుట కొఱకు. గరుడవాహనారూఢుండై=గరుడవాహనమునెక్కినవాఁడై. చనుసమయంబునన్= పోవునప్పుడు. హరికిన్=కృష్ణునితో. (సత్యభామయిట్లనియెను)

తా॥ అని యడిగిన పరీక్షిన్మహారాజుతో శుకమహాముని యిట్లు చెప్ప నారంభించెను నరకాసురునిచేత దేవతలతల్లియైన అదితి చెవికమ్మలును, వరుణునిగొడుగును, ఇంద్రుఁడు కొలువుచేయు మణిపర్వతమనెడు మేరుపర్వతస్థానమును అపహరింపఁబడఁగా ఆవృత్తాంతము ఇంద్రుఁడు శ్రీకృష్ణమూర్తితో చెప్పుకొనెను అప్పుడు కృష్ణుఁడు గరుడవాహము నెక్కి నరకాసురునిఁ జంపుటకై బయలుదేరఁగాఁజూచిసత్యభామశ్రీకృష్ణునితో ఇట్లుపలికెననితాత్పర్యము.

## (*) నరకాసురునిఁజంపఁబోవు శ్రీకృష్ణునితో సత్యభామ తన్నుఁ బిలుచుకొనిపొమ్మనుట. (*)



౧౪౨.—శా॥ దేవా నీవునిశాటసంఘముల ను * ద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు చూడఁగోరుదుసదా * ప్రాణేశ మన్నించి న
న్నీవెంటం గొనిపొమ్ము నేడు కరుణన్ * నేఁజూచి యేతెంచి నీ
దేవీసంహతికెల్లఁ జెప్పుదు భవ * ద్దీప్త ప్రతాపోన్నతుల్.

టీ॥ దేవా=ఓస్వామీ. (నీవు) నిశాటసంఘములన్=రాక్షసులగుంపులను. ఉద్దీపించి=మిక్కిలి తేజరిల్లి—విజృంభించి. చెండాడన్=నఱకిచంపఁగా. నీప్రావీణ్యంబులు = నీసమర్థతలు. సదా=ఎల్లప్పుడు. చూడఁగోరుదున్=చూచుటకు అపేక్షించుచుందును. ప్రాణేశ=ఓప్రాణనాయకా. (నేడు) కరుణన్ = దయతో. నన్ = నన్ను. (మన్నించి) నీవెంటన్=నీవెంబడిని. కొనిపొమ్ము = పిలుచుకొనిపో. నేన్=నేను. చూచి=నీయుద్ధచతురత్వములనుజూచి. ఏతెంచి=వచ్చి. నీదేవీసంహతికెల్లన్= నీభార్యాసమూహమునకెల్లను. భవద్దీప్తప్రతాపోన్నతులు=నీయొక్క వెలుఁగునట్టిప్రతాపముయొక్క ఆధిక్యములను. (చెప్పుదును)

తా॥ ఓస్వామీ! నీవురాక్షసులమూఁకలనుఅట్టెరేఁగిచెండ్లెగయునట్లు తల లెగిరిపడ నఱకిచంపఁగా నీసామర్థ్యములను ఎల్లప్పుడు చూడఁగోరుచుందునుకాఁబట్టి ఓప్రాణనాయకా! నాయందు దయచేసి నన్ను నేడునీవెంటఁబిలుచుకొనిపొమ్ము నేనునీయుద్ధసామర్థ్యమును చక్కగాఁ జూచివచ్చి నీభార్యలకందఱకు నీపరాక్రమవిశేషముల తెలియచెప్పి నీయందువారికిగౌరవముకలుగునట్లుచేసెదననితా.

౧౪౩.—వ॥ అనినఁ బ్రాణవల్లభకు వల్లభుం డిట్లనియె.

టీ॥ అనినన్=అనివేఁడుకొనఁగా. ప్రాణవల్లభకున్ = సత్యభామకు. వల్లభుండు = ప్రియుఁడైనశ్రీకృష్ణమూర్తి. (ఇట్లనియెను)

తా॥ అట్లు తన్ను పిలుచుకొనిపొమ్మన్న సత్యభామతో శ్రీకృష్ణమూర్తి యీమీఁదఁ జెప్పఁబోవునట్లు చెప్పెనని తాత్పర్యము.

౧౪౪.—సీ॥ సమదపుష్పంధయ * ఝంకారములుగావు - భీషణ కుంభీంద్ర * బృంహితములు
వాయునిర్గత పద్మ * వన రేణువులుగావు - ఘోర్గగరింఖాముఖో * ద్ధూత రజము

లాకీర్ణ జలతరం * గాసారములుగావు - శత్రు ధనుర్ముక్త * సాయకములు
కలహంస సారస * కాసారములుగావు - దనుజేంద్రసైన్య క * దంబకములు
తే॥ కమల కల్హార కుసుమ సం * ఘములుగావు । చటులరిపుశూల ఖడ్గాది * సాధనములు
కన్య నీవేడ రణరంగ *.గమనమేడ । వత్తు వేగమ నిలువుము * వలదు వలదు.

టీ॥ కన్య=ఓపడుచా—సత్యభామా. సమద... కావు—సమద=మదముతోఁ గూడుకొన్న. పుష్పంధయ = తుమ్మెదలయొక్క. ఝంకారములు=జుమ్మనురొదలు. కావు = అచ్చట వినఁబడునవి కావు. భీషణ...బృంహితములు — భీషణ = భయంకరములయిన. కుంభీంద్ర = శ్రేష్ఠములయినయేనుఁగులయొక్క. బృంహితములు=ఘీంకలు. వాయు... కావు — వాయు = గాలిచేత. నిర్గత=బైలుదేఱఁ బడిన. పద్మవన=తామరగుబురులయొక్క. రేణువులు=పుప్పొళ్లు. (కావు) తురగ...రజములు—తురగ = గుఱ్ఱములయొక్క. రింఖ=గిట్టలయొక్క. ముఖ=మొనలనుండి. ఉద్ధూత=ఎగఁజల్లఁబడునట్టి. రజములు=దుమ్ములు. ఆకీర్ణ... కావు—ఆకీర్ణ=అంతటనుజల్లఁబడిన. జలతరంగ=నీటియలలవలని. ఆసారములుగావు=తుంపురులవానలు గావు. శత్రు...సాయకములు—శత్రు=పగవారియొక్క. ధనుః = విండ్లవలననుండి. ముక్త = విడువఁబడిన. సాయకములు = బాణములు. కలహంస... కావు — కలహంస = హంసవిశేషములును. సారస=బెగ్గురుపక్షులునుగల. కాసారములు=కొలఁకులు. (కావు) దనుజేంద్ర... ములు—దనుజేంద్ర=రాక్షసశ్రేష్ఠులయొక్క. సైన్య=దండుయొక్క. కదంబకములు=సమూహములు. కమల... కావు—కమల = తామరలును. కల్హార = ఎఱ్ఱదామరలునైన. కుసుమసంఘములు=పువ్వులగెలు. (కావు) చటుల...సాధనములు—చటుల=శ్రేష్ఠములయిన. రిపు=పగవారియొక్క. శూలఖడ్గాది=త్రిశూలము కత్తి మొదలుగాఁగల. సాధనములు = పోటుముట్లు. నీవేడ=నీవెక్కడ. రణరంగగమనమేడ=యుద్ధరంగమునకువచ్చుట యెక్కడ. వత్తువేగమ=శీఘ్రముగా నేవచ్చెదను. (నిలువుము) వలదువలదు = నావెంటరాఁదలఁచుటయెంతమాత్రమువలదు.

తా॥ ఓసత్యభామా! నీవుయుద్ధభూమికి వచ్చెదనంటివి అక్కడ ఇక్కడివలె తుమ్మెదల జుమ్మనెడురొదలును, గాలికొట్టఁగా రాలునట్టిపుప్పొళ్లును,నీటి అలలయందుండిచెదరిపడిన తుంపురువానలును, కొలఁకులయందు విహరించునట్టి హంసలు బెగ్గురుపక్షులు మొదలగు పక్షులును, తామరలు ఎఱ్ఱదామరలు మొదలగు పువ్వుల వాసనలును కానరావు. మఱియేమియనఁగా భయంకరములయినయేనుఁగుల ఘీంకారము వినఁబడును, గాలికంటె వేగముగా నడవగల గుఱ్ఱముల కాలిగిట్టలవలన నుండి రేఁగునట్టి దుమ్ము దిక్కులనెల్ల ఆవరించుచుండును, పగవారు విండ్లయందు సంధించి ప్రయోగించు బాణములతెగలు వానకురిసినట్టు ఎడతెగకపడుచుండును, భయంకరులయిన రాక్షసుల మూఁకలు ఎక్కడఁ జూచినను గానఁబడుచుండును, వాఁడులయిన శూలములు ఖడ్గములు మొదలగు ఆయుధములు పగవారిచేతఁ బ్రయోగింపఁబడుచుండును, కనుక నీవు నావెంట రాఁదగినదానవుకాదు, నేను శీఘ్రముగ వచ్చెదను, నీవు ఇంటిపట్టున నెమ్మదిగా నుండుము అని పలికెనని తాత్పర్యము.

౧౮౫.—వ॥ అనినం బ్రియునకుఁ బ్రియంబు జనియింప దగ్గఱి.

టీ॥ అనినన్=అనఁగా. ప్రియునకున్=పెనిమిటికి. ప్రియంబు జనియింపన్=ప్రేమపుట్టునట్టుగా. దగ్గఱి=సమీపించి.

తా॥ అని యీవిధముగా కృష్ణుఁడు చెప్పిన మాటలువిని ఆయనకుఁదనయందుప్రీతికలుగునట్టుగా దగ్గఱచేరినదైయనితాత్పర్యము.

౧౮౬.—ఉ॥ దానవులైననేమి మఱి * దైత్య సమూహములైననేమి నీ
మానిత బాహు దుర్గముల * మాటున నుండఁగ నేమిశంక నీ
తో నరుదెంతునంచుఁ గర * తోయజముల్ముకుళించి మ్రొక్కెన
మ్మానిని దన్ను భర్త బహు * మానపురస్సర దృష్టిఁ జూడఁగన్.

టీ॥ అమ్మానిని = ఆమానవంతురాలయిన సత్యభామ. దానవులైనన్=దనువుకొడుకులైనరాక్షసులైనను. ఏమి=దిగులేమి. మఱి=ఇంకను. దైత్యసమూహములైనన్ = దితికొడుకులయిన రాక్షసుల సమూహమునైనను. ఏమి = దిగులేమి. నీమానిత బాహుదుర్గముల మాటునన్ = ఒప్పిదములయిన నీభుజములనెడు చొరరానికోటల మఱుఁగునందు. ఉండఁగన్=ఉండఁగా. ఏమిశంక = నాకుభయమేమి. నీతోన్=నీవెంట. అరుదెంతున్ = వచ్చెదను. అంచున్=అని.(తన్ను)భర్త=పెనిమిటి. బహుమానపురస్సరదృష్టిన్=మన్ననముందు వ్యాపించునట్టిచూపుతో. చూడఁగన్=చూచుచుండఁగా. కరతోయజములు=కమలములవంటిచేతులను. ముకుళించి=మోడ్చి. (మ్రొక్కెను)

తా॥ అట్లు దగ్గఱచేరినదై సత్యభామతనపెనిమిటితోదనువుకొడుకులు దితికొడుకులునైన రాక్షసులయిన మాత్రమున నేనీభుజములనెడు శత్రువులకు చొరరానికోటల మఱుఁగుననుండునట్టి నాకు భయమేమి? ఎట్లయిన నీవెంటరావలెనన్న మక్కువ నాకు కలదు గనుక నేనువచ్చెదను నన్నుఁబిలుచుకొనిపొమ్ము అని తన్నుప్రీతితోఁ జూచుచున్నకృష్ణుని వేఁడుకొనుచుచేతులు జోడించుకొని మ్రొక్కెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు తనకుమ్రొక్కిన సత్యభామను గరకమలంబులఁ గ్రుచ్చియెత్తి తోడ్కొని గరుడారూఢుండై గగనమార్గంబునఁజని గిరి శస్త్ర సలిల దహన పవనదుర్గంబై మురాసుర పాశ పరివృతంబైన ప్రాగ్జ్యోతిష పురంబు డగ్గఱి.

టీ॥ (ఇట్లు) తనకుమ్రొక్కిన = తనకు నమస్కరించిన. (సత్యభామను శ్రీకృష్ణుఁడు) కరకమలంబులన్ = కమలములవంటి తన రెండుచేతులతోను. గ్రుచ్చియెత్తి = పొదిఁగి పట్టి యెత్తి. తోడ్కొని = పిలుచుకొని. గరుడారూఢుండై = గరుత్మంతునిపై నెక్కినవాఁడై. గగనమార్గంబునన్ = ఆకాశపుత్రోవను. చని= పోయి. గిరి...దుర్గంబై—గిరి=పర్వతమయమును. శస్త్ర = బాణ మయమును. సలిల = జలమయమును. దహన = అగ్నిమయమును. పవన=వాయుమయమునైన. దుర్గంబై=దుర్గములుగలదై. (దుర్గము= పరులకుఁజొరశక్యముగానికోట) మురా...వృతంబైన—మురాసుర= మురాసురునిచేతకల్పింపఁబడిన. పాశ=త్రాళ్లచేత.పరివృతంబైన= అంతటను జుట్టఁబడినదైన. ప్రాగ్జ్యోతిషపురంబున్ = నరకాసురుని దైన ప్రాగ్జ్యోతిషము అనుపట్టణమును. డగ్గఱి=సమీపించి—చేరి.

తా॥ ఈప్రకారముగా తనకు మ్రొక్కి వేడుకొనఁగా సత్యభామను ప్రేమతో రెండుచేతులను పొదిఁగియెత్తి వెంటఁబెట్టుకొని గరుడవాహనము నెక్కి కదలినవాఁడై ఆకాశమార్గమునఁ బోయి పర్వతమయమును బాణమయమును జలమయమును అగ్నిమయమును వాయుమయమునైన అయిదు దుర్గములుగలిగి మురాసురునిచేతనైన త్రాళ్లచేతఁ జుట్టఁబడినదైన ప్రాగ్జ్యోతిషమనెడు పట్టణమును జేరి యని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ హరి=నిద్రయనెడు ప్రళయమున ప్రపంచమనంతయు తన యందు లయింపఁజేసికొని నిద్రగడవఁగావచ్చిన ప్రజ్ఞతోఁగూడి (సుఖమహమస్వాప్సంనకించిదవేదిషం) అని అనుకొన్న బ్రహ్మవేత్త. సత్యభామన్ = త్రికాలములయందును నశింపకవెలిఁగెడు ముక్తి కాంతను. కరకమలంబులన్=యోగము జ్ఞానము అనెడు హస్తముల చేత. (పొదిఁగిపట్టి) ముక్తినిపొంది అనుట. గరుడారూఢుండై = వేదమునధిష్ఠించినవాఁడై=వేదమార్గమునుపట్టి అనుట. శ్రు॥ సుపర్ణోసి గరుత్మాంస్త్రివృత్తే శిరో గాయత్రం చక్షుస్తోమ ఆత్మా సామతే తనూ ర్వామదేవ్యం బృహద్రథంతరేపక్షౌ యజ్ఞాయజ్ఞియం పుచ్ఛం ఛందాగ్స్యంగాని ధిష్ణియాశ్శఫాయజూగ్ంషినామ సుపర్ణోసిగరుత్మాం దివంగచ్ఛ సువఃపత॥ గగనమార్గంబునఁజని=హృదయాకాశమార్గమునఁబోయి. గిరి శస్త్ర సలిల దహన పవన దుర్గంబై = అన్నమయ ప్రాణమయమనోమయవిజ్ఞానమయ ఆనందమయపంచకోశములనెడు పంచదుర్గములచేత చొరశక్యముగానిదై. మురాసురపాశపరివృతంబైన—ము=ఆనందమును. ర = నశింపఁజేయునట్టి. అసుర=అజ్ఞానరూపుఁడైనజీవాహంకారునియొక్క. పాశ = అష్టపాశములచేత. పరివృతంబైన = చుట్టుకోఁబడినదైన. ప్రాగ్జ్యోతిషపురంబు=శ్రుతి యుక్తియను అనుభవమునులేక స్వేతరముగలదనెడి అజ్ఞానులకు తొలుత మిగుల సంతోషకరముగ తోఁచుచు ప్రకాశించుచున్న మాయాపురమును. (సమీపించి) నామైకదేశేనామగ్రహణమను న్యాయముచేత ముఅనునదిముచ్ఛబ్దముయొక్క మాఱురూపము.

## (*) శ్రీకృష్ణమూర్తి మురాసురుని సంహరించుట. (*)

మ॥ గదచేఁ బర్వత దుర్గముల్ శకలముల్ *
గావించి సత్తేజిత
ప్రదరశ్రేణుల శస్త్రదుర్గచయముల్ *
భంజించి చక్రాహతిన్
జెదరన్ వాయు జలాగ్ని దుర్గముల ని *
శ్శేషంబులంజేసి భీ
ప్రదుఁడై వాలునఁ ద్రుంచెఁ గృష్ణుఁడు ముర *
ప్రచ్ఛన్నపాశంబులన్.


శ్రీకృష్ణుఁడు.


మురాసురుఁడు.

టీ॥ (కృష్ణుఁడు) గదచేన్=గదాయుధముచేత. పర్వతదుర్గములు = పర్వతమయములైన దుర్గములను. శకలములు=ఖండములుగా.కావించి=చేసి. సత్తేజిత ప్రదరశ్రేణులన్—సత్=చెడని.తేజిత=సానఁదేఱిన. ప్రదర=బాణములయొక్క. శ్రేణులన్ = పఙ్క్తుల చేతను. శస్త్రదుర్గచయముల్ = బాణమయమయిన దుర్గసమూహమును. భంజించి=భంగపెట్టి — విఱిగిపడఁగొట్టి. చక్రాహతిన్= చక్రపుపెట్టుచేత. చెదరన్=చెదరిపోవునట్లు. (వాయుజలాగ్నిదుర్గములను) నిశ్శేషంబులన్=మిగులులేనివానిఁగా. చేసి = నిర్మూలము చేసి. భీప్రదుఁడై=భయమును కలుగఁజేయువాఁడై. వాలునన్ = కత్తిచేత. మురప్రచ్ఛన్నపాశంబులన్ = మురాసురుఁడు చుట్టు పాతించియున్నత్రాళ్లను. త్రుంచెన్=తెగనఱికెను.

తా॥ అట్లు ప్రాగ్జ్యోతిషముఁజేరిన శ్రీకృష్ణుఁడు తన గదచేత పర్వతదుర్గములను, బాణములచేత బాణమయదుర్గములను, చక్రము చేత వాయుదుర్గజలదుర్గాగ్ని దుర్గములను నిర్మూలము చేసి తనకత్తి చేత మురాసురునిచేత చుట్టు పాతింపఁబడియున్న త్రాళ్లనన్నిటిని తెగనఱికెనని తాత్పర్యము. (మఱియును)

వి శే షా ర్థ ము.

టీ॥ (కృష్ణబ్రహ్మవేత్త) గదచేన్=బ్రహ్మాకారాకారితవృత్తిగల బుద్ధి తత్త్వస్వరూపిణియైన కౌమోదకియనుపేరుగల గదచేత — వ్యా॥ కుం భూమిం మోదయతి హర్షయతీతి కుమోదకోవిష్ణుః తస్యేయం కౌమోదకీ. తా॥ భూమిని సంతోషింపఁజేయు విష్ణుసంబంధ

మయినది. పర్వతదుర్గమల్లకలమఁల్లావించి=పర్వతదుర్గమనెడిఅన్న మయకోశమును తుత్తునుకలుచేసి. సత్తేజితప్రదరశ్రేణులన్ = ఏకో దేవోబహుధానివిష్టః, చిదేవభువనత్రయం, బ్రహ్మైవాహమిదం జగచ్చసకలం చిన్మాత్రవిస్తారితం, సర్వంఖల్విదంబ్రహ్మ, ఏకోదేవో బహుధానివిష్టః ॥ అను మహావాక్యార్థవిచారణలనెడు బాణముల చేత. శస్త్రదుర్గచయమున్ = స్వేతరమగ ప్రాణమయకోశముగల దనెడు పూర్వపక్షవాక్యదుర్గమును—అనఁగా, ప్రాణమయకోశమును తిరస్కరించి. చక్రాహతిన్ = అపరోక్షజ్ఞానమనెడు సుదర్శన చక్రపుపెట్టుచేత. వాయుజలాగ్నిదుర్గములన్ = మనోమయవిజ్ఞాన మయ ఆనందమయ కోశములను. నిశ్శేషంబులంజేసి = నిర్మూలము చేసి. భీప్రదుఁడై=ఆభాసవేదాంతులకు భయమును కలుగఁజేయు వాఁడై. వాలునన్ = ఇహపరలోకభోగ వైరాగ్యమనెడు ఖడ్గము చేత. మురప్రచ్ఛన్నపాశంబులన్ = జీవాహంకారకల్పితములైన అష్టపాశములను. (త్రుంచెను)

౧౪౯.—శా॥ ప్రాకారంబు గదాప్రహారముల ను * త్పాటించి యంత్రంబులన్
నాకారాతుల మానసంబులను ఖి * న్నత్వంబునొందించి య
స్తోకాకారుఁడు శౌరి యొత్తె విలయో * ద్ధూతాభ్ర నిర్ఘాత రే
ఖాకాఠిన్యముఁ బాంచజన్యము విము * క్తప్రాణి చైతన్యమున్.

టీ॥ గదాప్రహారములన్ = గుదియమోఁదులచేత. ప్రాకారంబు = కోటను. యంత్రంబులన్ = నానావిధములయిన కీలుగల సాధనములను. ఉత్పాటించి = పెల్లగిలఁగొట్టి. నాకారాతులమాన సంబులను = దేవశత్రువులయిన రాక్షసులహృదయములను. ఖిన్న త్వంబునొందించి=ఖేదమునొందునట్లుగాఁజేసి. అస్తోకాకారుఁడు= గొప్పయాకృతిగలవాఁడైన. శౌరి = కృష్ణుఁడు. విలయో...కాఠి న్యమున్—విలయ=ప్రళయకాలమునందు. ఉద్ధూత = ఎగఁజిమ్మఁ బడిన. అభ్ర=మేఘములవలని. నిర్ఘాత=పిడుగులయొక్క. రేఖా= రీతిగల. కాఠిన్యమున్ = కఠినత్వముగలదానిని. విముక్తప్రాణిచైత న్యమున్—విముక్త=విడువఁబడిన. ప్రాణి = జీవులయొక్క. చైత న్యమున్=చేష్టలుగలదానిని. పాంచజన్యమున్ = పాంచజన్యము అనుశంఖమును. ఒత్తెన్=పూరించెను—ఊఁదెను.

తా॥ ఇదిగాక ఆశ్రీకృష్ణమూర్తి తనగదపెట్టులచేత ప్రాకార ములను కొన్ని కీలుగల సాధనములను పెల్లగిల నిడియఁగొట్టి రాక్ష సులగుండెలు ఖేదిల్లఁజేసి ప్రళయకాలమునందుఁ బడు పిడుగుల మ్రోఁతవంటి మ్రోఁతచేత కఠినమయినదియు, ఎల్లప్రాణులనుచేష్ట లుడుగునట్లు చేయునదియునైన పాంచజన్యమనెడు శంఖమును ఊఁదెనని తాత్పర్యము.

విశేషార్థము.

టీ॥ గదాప్రహారములన్=బ్రహ్మాకారమయిన మనస్సనెడుగద దెబ్బలచేత. ప్రాకారంబు=అవ్యక్త మహదహంకారపంచభూతము లనునట్టిఅష్టావరణములనెడుకోటలను. యంత్రంబులన్=సంశయము అసంభావన విపరీతభావన వితర్కము మొదలయినవి యనెడు సాధనములను(పెల్లగిలఁగొట్టి)నాకారాతులమానసంబులను=మోక్ష లక్ష్మితోఁగూడిన బ్రహ్మవేత్తలయందు పగగల ఆభాసవేదాంతుల మనస్సులను. అస్తోకాకారుఁడుశౌరి=విరాట్స్వరూపుఁడైన కృష్ణ బ్రహ్మవేత్త. పాంచజన్యమున్=భూతాదియైన అహంకారాత్మకమైన పాంచజన్యశంఖమును. (ఊఁదెను) అహంకారతత్వమును మ్రింగెను.

వ॥ అంత లయకాల కాలాభ్ర గర్జనంబు పగిది నొప్పు నమ్మహాధ్వనివిని పంచశిరుండైన మురాసురుండు నిదుర సాలించి యావులించి నీల్గిలేచి జలంబులు వెడలివచ్చి హరిం గని ప్రళయకాల కీలికైవడి మండుచు దుర్నిరీక్ష్యుండై కరాళించుచుం దనపంచముఖంబులం బంచభూతమయంబైన లోకంబులు మ్రింగ నప్పళించుచందంబునం గదిసి యాభీల కీలచ్ఛటా జాలంబగు శూలంబున గరుడునివైచి భూనభోంతరంబులునిండ నార్చుచు.

టీ॥ అంతన్=అంతట. లయ...పగిదిన్—లయకాల=ప్రళయ కాలమునందలి. కాలాభ్ర=నీలమేఘముయొక్క. గర్జనంబుపగిదిన్= ఉఱుమువిధమున. ఒప్పునమ్మహాధ్వని = ఒప్పునట్టి యాగొప్పచప్పుడును. (విని) పంచశిరుండైనమురాసురుండు = అయిదుతలలుగల వాఁడైన మురాసురుఁడు. నిదురసాలించి = నిద్రనుండి మేలుకొని. (ఆవులించి నీల్గిలేచి) జలంబులువెడలివచ్చి = నీళ్లలోనుండిబయటికి వచ్చి. (హరిఁగని) ప్రళయకాలకీలికైవడిన్=ప్రళకాలమునందలిఅగ్ని వలెనే. (మండుచు) దుర్నిరీక్ష్యుండై = చూడశక్యముకానివాఁడై. కరాళించుచున్=భయంకరముగా ముఖవికారమునుజూపుచు. తన పంచముఖంబులన్ = తన అయిదు ముఖములచేతను—అయిదునోళ్ల చేతను. పంచభూతమయంబైనలోకంబులు = పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులను అయిదుమహాభూతంబులే ఆకారముగాఁగల లోకములను. మ్రింగన్ = మ్రింగుటకు. అప్పళించుచందంబునన్ = యత్నించువిధమున. కదిసి = మిగుల దగ్గఱఁ బోయి. ఆభీల... జాలంబు — ఆభీల = భయంకరమయిన. కీల = మంటలయొక్క. ఛటా=సమూహములయొక్క. జాలంబు = సమూహములుగలది. అగుశూలంబునన్ = అగునట్టిశూలముచేత. గరుడునిన్=గరుత్మంతుని. వైచి = కొట్టి. భూనభోంతరంబులు = భూమికినాకాశమునకు నడుమనుండు నవకాశములు. నిండన్=నిండుకొనునట్లు. ఆర్చుచున్=బొబ్బలుపెట్టుచు.

తా॥ అంతట ప్రళయకాలమునందలి మబ్బు ఉఱిమినధ్వనివంటి ఆమహాధ్వనినివిని అయిదుతలలుగలవాఁడైన మురాసురుఁడు నీళ్లలో పండుకొని నిద్రపోవుచున్నవాఁడు ఆనిద్రనుండి మేలుకొని ఆవు లించుచును నీల్గిలేచి బయటికివచ్చి శ్రీకృష్ణమూర్తినిజూచి తన్నుఁ జూచువారికి భయముపుట్టునట్టు వికారమయిన ఆకారమును వహించినవాఁడై తన అయిదునోళ్లతోను అయిదుభూతముల వికారమైన

లోకమును మ్రింగ యత్నించునట్టిరీతితో కృష్ణునిఁ గదియవచ్చి భయంకరమయినమంటలో అనునట్లు మూఁడుమొనలు వెలుఁగఁగా ఒప్పుచున్న తనశూలముతో గరుత్మంతునిఁగొట్టి భూమికి ఆకాశమునకు నడిమి అవకాశమంతయు నిండుకొనునట్లు గొప్పధ్వనితో బొబ్బలుపెట్టుచుననని తాత్పర్యము.

### వి శే షా ర్థ ము.

టీ॥ పంచశిరుండైనమురాసురుండు = పంచభూతములనెడు పంచశిరస్సులుగల జీవాహంకారుఁడు. జలంబులువెడలివచ్చి=విషయాభిలాషలనెడు జలముల చవిచూపి కృష్ణబ్రహ్మవేత్తను సంసారసముద్రమున ముంచుటకు బహిర్ముఖుఁడై—శ్లో॥ సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోభిజాయతే । క్రోధాద్భవతిసమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః॥ అనుగీతావాక్యమునుపట్టి కామమువలన క్రోధము పుట్టెనని భావము.

౧౫౧.—క॥ దురదురఁ బరువిడి బిరుసున । హరిహరి నిలునిలువు మనుచు ✱ నసురయుఁ గదిసెన్
మురముర దివిజుల హృదయము । మెరమెరయిదె యడఁగుననుచు ✱ మెఱసెన్ హరియున్.

టీ॥ అసురయున్=మురాసురుఁడును. దురదురన్ = బిరబిర. పరువిడి=పరుగెత్తి. బిరుసునన్=పరుషత్వముతో. హరిహరి=ఓరికృష్ణాకృష్ణా. నిలునిలువుమనుచున్ = నిలువుము నిలువుము అని. కదిసెన్=మిక్కిలిచేరవచ్చెను. హరియున్ = కృష్ణుఁడును. మురముర=ఓరిమురాసురుఁడా మురాసురుఁడా. ఇదె = ఇదిగో. దివిజుల హృదయము మెరమెర = దేవతల మనసులలోని దిగులు. అడఁగున్=అణఁగిపోను. అనుచున్=అని. మెఱసెన్=తేజరిల్లెను.

తా॥ అట్లు నరకాసురుని అన్నయైన మురాసురుఁడు ఓయి కృష్ణుఁడా! నిలువుమునిలువుము అని బిరబిరపరుగెత్తివచ్చి కదియఁబడఁగా శ్రీకృష్ణమూర్తియు ఓరిమురాసురుఁడా! త్వరపడకుము ఇప్పుడే నీవల్ల దేవతల మనసులలో వ్యాపించియున్న దిగులు తీర్చెదను అని యెదిరించెనని తాత్పర్యము. (అప్పుడు)

### వి శే షా ర్థ ము.

టీ॥ అసురయున్=సు బ్రహ్మ రాతి దదాతీతి సురా. తా॥ బ్రహ్మమును తెలుపునది గనుక సుర. అనఁగా, బ్రహ్మవిద్య. దానినిగ్రహించినవారుసురలు పూజ్యులు. గ్రహింపనివారు అసురులు అపూజ్యులు రాక్షసులు. దివిజులహృదయముమెరమెర = నీకువెఱచెడి బ్రహ్మవిద్యాభ్యాసుల మనసులలోని దిగులు. హరి=బ్రహ్మవేత్త.

౧౫౨.—క॥ గరుడునిపైఁ బడవచ్చిన । మురశూలము నడుమ నొడిసి ✱ ముత్తునియలుగాఁ
గరముల విఱిచి ముకుందుఁడు । మురముఖముల నిశితవిశిఖ ✱ ములు వడిఁజొనిపెన్.

టీ॥ ముకుందుఁడు = కృష్ణుఁడు. గరుడునిపైఁబడవచ్చినమురశూలమున్ = మురాసురుఁడు ప్రయోగింపఁగా గరుత్మంతునిమీఁద పడఁబోవు శూలమును. నడుమన్=నడుమనే — గరుత్మంతునిదాఁకరాకమునుపే. ఒడిసి=పొంచిపట్టి. ముత్తునియలుగాన్=మూఁడుతునకలు అగునట్లుగా. కరములన్ = చేతులతో. (విఱిచి) మురముఖములన్=మురాసురునిముఖములయందు. వడిన్=వేగముతో. నిశితవిశిఖములు=వాఁడులైనబాణములను. చొనిపెన్ = చొప్పించెను.

తా॥ అట్లు ఎదిరించిన శ్రీకృష్ణమూర్తి మురాసురుఁడు గరుత్మంతుని మీఁదవేసిన శూలమును నడుమంత్రముననే ఒడిసిపట్టి విఱిచి మూఁడుతునకలుగాఁజేసి ఆమురాసురునిముఖములందు చుఱుకుగల బాణములను వడిగాఁ జొప్పించెనని తాత్పర్యము.

### వి శే షా ర్థ ము.

టీ॥ ముకుందుఁడు=ముంచకుంచదదాతీతిముకుందః, తా॥ ఇహపరసుఖముల నిచ్చునట్టి విజ్ఞానరూపకృష్ణపరబ్రహ్మము. గరుఁడునిపైన్=వేదమనెడుగరుడునిమీఁద. శూలమున్=అనృత జడ దుఃఖ ఖండ మలినస్వరూపమై శాంత ఘోర మూఢ వృత్తులుగల ప్రకృతిమయమగు త్రిశూలమును.

౧౫౩.—మ॥ గదయేసెన్ మురదానవుండు హరిపైఁ ✱ గంసారియుం దద్గదన్
గదచేఁ ద్రుంచి సహస్రభాగములుగాఁ ✱ గల్పించె నాలోన వాఁ
డెదురై హస్తము లెత్తికొంచు వడిరా ✱ నీక్షించి లీలా సమ
గ్రదశన్ వానిశిరంబులైదును వడిన్ ✱ ఖండించెఁ జక్రాహతిన్.

టీ॥ మురదానవుండు = మురాసురుఁడు. హరిపైన్=కృష్ణునిమీఁద. గదయేసెన్ = గదనుప్రయోగించెను. కంసారియున్ = కృష్ణుఁడును. తద్గదన్=ఆగదను. గదచేన్=తనగదచేత. త్రుంచి=విఱుగఁగొట్టి. సహస్రభాగములుగాన్ = వేయి తునకలుగా. కల్పించెన్ = చేసెను. ఆలోన = అంతలోనే. వాఁడు = మురాసురుఁడు. ఎదురై=ఎదురుకొన్నవాఁడై. హస్తములు = చేతులను. ఎత్తికొంచున్ = పైకెత్తుకొని. వడిరాన్ = వేగమునరాఁగా. ఈక్షించి=చూచి.. లీలాసమగ్రదశన్=సమగ్రమైనవినోదదశతో అవలీలగా. చక్రాహతిన్=చక్రపుపెట్టుచేత. వానిశిరంబులైదును=వాని అయిదుతలలను. వడిన్=శీఘ్రముగ. ఖండించెన్=నఱికెను.

తా॥ అంతట మురాసురుఁడు కృష్ణునిమీఁద గదను ప్రయోగింపఁగా కృష్ణుఁడు ఆగదను తనగదచేత వేయితునుకలగునట్లుగా విఱుగఁగొట్టి అంతలో వాఁడు చేతులు పైకెత్తుకొని మీదికి వచ్చుటనుజూచి చక్రమునుప్రయోగించి తటాలున వానితలలు అయిదును తెగనఱికి చంపెనని తాత్పర్యము.

మురాసురునిపుత్రులు.

## (*) మురాసురునిపుత్రులు శ్రీకృష్ణునిచేఁ జచ్చుట. (*)



వ॥ ఇట్లు శిరంబులు చక్రిచక్ర ధారా ఛిన్నంబులైన వజ్రి వజ్ర ధారాదళిత శిఖరంబై కూలెడి శిఖరిచందంబున మురాసురుండు జలంబులందుఁగూలిన వాని సూనులు జనకవధజనిత శోకాతురులై జనార్దను మర్దింతుమని రణకుర్దనంబునఁ దామ్రుండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు, నననేడ్వురుయోధులు సక్రోధులై కాలాంతకచోదితంబైన ప్రళయపవనసప్తకంబుభంగి నరకాసురప్రేరితులై రయంబునఁ బీఠుండ నియెడు దండనాథుం బురస్కరించికొని పఱతెంచి హరిం దాఁకి శర శక్తి గదా ఖడ్గ కరవాల శూలాది సాధనంబులు ప్రయోగించిన.

టీ॥ (ఇట్లు) శిరంబులు = తలలు. చక్రిచక్రధారాఛిన్నంబులైనన్ = కృష్ణునిచక్రముయొక్క అంచులచేత నఱకఁబడినవి కాఁగా. వజ్రి... శిఖరంబై—వజ్రి=ఇంద్రునియొక్క. వజ్ర=వజ్రాయుధముయొక్క. ధారా=వాదరచేత. దళిత=నఱకఁబడిన. శిఖరంబై=శిఖరములుగలదై, కూలెడి=పడునట్టి, శిఖరిచందంబునన్= కొండవిధమున. (మురాసురుండు) జలంబులందున్ = నీళ్లలో. కూలినన్=పడఁగా. వానిసూనులు = ఆమురాసురునికొడుకులు. జనకవధ...తురులై — జనక = తండ్రియొక్క. వధ=చావువలన. జనిత=పుట్టిన. శోక = దుఃఖముచేత. ఆతురులై = పీడింపఁబడినవారై. జనార్దనున్=కృష్ణుని. మర్దింతుమని=చంపుదుమని. రణకుర్దనంబునన్ = యుద్ధమువలని వేడుకచేత. (తామ్రుండు, అంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, అరుణుండు) అనన్ = అనఁగా. ఏడ్వురుయోధులు = ఏడుగురు బంట్లు. సక్రోధులై=కోపముతోఁ గూడుకొన్నవారై. కాలాంతకచోదితంబు = ప్రళయకాలపు యమునిచేత ప్రేరేపింపఁబడినది. అయినప్రళయపవనసప్తకంబుభంగిన్ = అయినట్టి ప్రళయకాలపు వాయువులేడింటివలె. (సప్తవాయువులు.—ప్రవహము, వివహము, ఆవహము, ప్రతివహము, ఉద్వహము, సంవహము, పరివహము. పక్షాంతరమున.—గగనము, స్పర్శనము, వాయువు, అనిలము, ప్రాణము, ప్రాణేశ్వరము, జీవము.) నరకాసురప్రేరితులై=నరకాసురునిచేత ప్రేరేపింపఁబడినవారై. రయంబునన్ = శీఘ్రముగ. పీఠుండనియెడుదండనాథున్ = పీఠుఁడు అనుపేరుగల సేనానాయకుని. పురస్కరించుకొని=ముందుపెట్టుకొని. పఱతెంచి=పరుగెత్తివచ్చి. హరిన్=కృష్ణుని. తాఁకి=ఎదిరించి. శర...నంబులు—శర=బాణములు. శక్తి = పలుచేతులవంటి ప్రక్కయలుఁగులును నిడుపాటివాఁడిమొనయునుగల ఆయుధవిశేషము. గదా = గుదియ. ఖడ్గ=కత్తి. కరవాల=చేకత్తి. శూల=మూడుమొనలుగల ఆయుధవిశేషము. ఆది=మొదలుగాఁగల. సాధనంబులు=ఆయుధములను. ప్రయోగించినన్=ప్రయోగింపఁగా.

తా॥ ఈచెప్పిన మురాసురుఁడు కృష్ణునిచక్రముచేత తలలు నఱకఁబడఁగా ఇంద్రునివజ్రాయుధముచేత శిఖరములు నఱకఁబడి పడెడి కొండవలెనే నీళ్లలో పడెను, అంతట వానికొడుకులైన తామ్రుఁడు, అంతరిక్షుఁడు, శ్రవణుఁడు, విభావసుఁడు, వసుఁడు, నభస్వంతుఁడు, అరుణుఁడు అనువారు ఏడుగురు తమతండ్రి చచ్చినందులకు దుఃఖము నొందినవారై కృష్ణునిఁజంపుదుమని యుద్ధమునందలి వేడుకచేత వెడలి అతికోపముతో ప్రళయకాలమునందు యమునిచేత ప్రేరేపింపఁబడిన ఏడుప్రళయవాయువులో అనునట్లు నరకాసురునిచేత ప్రేరేపింపఁబడి పీఠుఁడనుసేనానాయకుని ముందుపెట్టుకొని శీఘ్రముగ పరుగెత్తివచ్చి కృష్ణునిమార్కొని బాణములు శక్తులు గదలు పట్టాకత్తులు చేకత్తులు శూలములు మొదలుగాఁగల ఆయుధములను ప్రయోగించిరి అట్లు ప్రయోగింపఁగా నని తాత్పర్యము.

### విశేషార్థము.

టీ॥ తామ్రుఁడు మొదలయినవారు ఏడుగురును, పీఠుఁడనెడువాఁడును కూడి ఎనమండ్రుగురును అష్టప్రకృతులు.

౧౫౫.—ఉ॥ ఆదనుజేంద్రయోధ వివి * ధాయుధ సంఘము నెల్ల నుగ్రతన్
మేదినిఁ గూలవేయుచు స * మిద్ధ నిరర్గళ మార్గణాళిఁ గ్ర
వ్యాదకులాంతకుం డసుర * హ స్త భుజానన కంఠ జాను జం
ఘాదులఁ ద్రుంచివైచె దిల * లంతలఖండములై యిలం బడన్.

టీ॥ క్రవ్యాదకులాంతకుండు = మాంసభక్షకులయినరాక్షసుల సముదాయమునకు యముఁడైన శ్రీకృష్ణమూర్తి. ఆదనుజేంద్ర ... సంఘమున్—ఆ=ముందుచెప్పిన. దనుజేంద్ర=రాక్షసశ్రేష్ఠులయిన. యోధ=భటులవైన. వివిధ=నానావిధములయిన. ఆయుధ=పోటుముట్లయొక్క. సంఘమ్మున్=సమూహమును. ఎల్లన్ = అంతయు. ఉగ్రతన్=భయంకరత్వముతో. మేదినిన్ = భూమియందు. కూలవేయుచున్ = పడఁగొట్టుచును. సమిద్ధనిరర్గళమార్గణాళిన్ — సమిద్ధ=వెలుఁగుచున్న. నిరర్గళ=అడ్డములేని. మార్గణాళిన్=బాణ

పఙ్క్తిచేత. అసుర...జంఘాదులన్—అసుర = రాక్షసులయొక్క. హస్త=చేతులు. భుజ=బాహువులు. ఆనన=ముఖములు. కంఠ = మెడలు. జాను=మోఁకాళ్లు. జంఘ=పిక్కలు. ఆదులన్ = మొదలగువానిని. తిలలంతలఖండములై = నువ్వుగింజలంతేసితునుకలయి. ఇలన్ = భూమియందు. పడన్ = పడునట్టుగా. త్రుంచివైచెన్=నఱకివేసెను.

తా॥ రాక్షసకులమును నశింపఁజేయువాఁడైన శ్రీకృష్ణమూర్తి ఆరాక్షసభటులు ప్రయోగించిన నానావిధములయిన ఆయుధముల సముదాయములనెల్లను మిక్కిలి వెఱపులోఁచునట్లు నేలఁబడఁగొట్టుచు సానఁదేఱినవియు అడ్డములేనివియునైన బాణములవరుసలచేత ఆరాక్షసుల చేతులు బుజములు మొగములు మెడలు మోఁకాళ్లు పిక్కలు మొదలగు అవయవముల నెల్లను నువ్వుగింజలంత లేసి తునుకలై నేలఁబడునట్లుగా నఱకివేసెనని తాత్పర్యము.

వ॥ మఱియు హరిశరజాలచక్రనిహతులై తనవారలుమడియుటకువెఱఁగుపడిరోషించి గరుడగమనునిదూషించితన్ను భూషించుకొని సరకుసేయకనరకుండు వరకుండల ప్రముఖాభరణభూషితుండై దానసలిలధారాసిక్తగండంబులును, మహాదండశుండా దండంబులునగు వేదండంబులు దండతండంబులైనడవ వెడలి భండనంబునకుం జని.

టీ॥ (మఱియు) హరి = కృష్ణునియొక్క. శరజాలచక్రనిహతులై=బాణసమూహములచేతను చక్రముచేతనునఱకఁబడినవారై. (తనవారలు) మడియుటకున్=చచ్చుటకు. వెఱఁగుపడి=ఆశ్చర్యపడి. నరకుండు=నరకాసురుఁడు. రోషించి=కోపించి. గరుడగమనునిన్ = గరుత్మంతుఁడు వాహనముగాఁగలకృష్ణుని. దూషించి = దూఱి. (తన్ను) భూషించుకొని = పొగడుకొని. సరకుసేయక = లక్ష్యముచేయక. వరకుండలప్రముఖాభరణభూషితుండై — వర = శ్రేష్ఠములయిన. కుండల=చెవిపోగులు. ప్రముఖ=మొదలగు. ఆభరణ = సొమ్ములచేత. భూషితుండై = అలంకరింపఁబడినవాఁడై — అలంకరించుకొనియనుట. దాన...గండంబులును—దానసలిల=మదజలముయొక్క. ధారా=దారలచేత. సిక్త=తడుపఁబడిన. గండంబులును=చెక్కిళ్లుగలిగినవియు. మహా...దండంబులును — మహాదండ = గొప్పవియు మీఁదికెత్తఁబడినవియునైన. శుండాదండంబులును=కఱ్ఱలవంటి తొండములు గలిగినవియు. అగువేదండంబులు=అయినట్టియేనుఁగులు. తండతండంబులై=పరంపరలయి. నడవన్=రాఁగా. వెడలి=పట్టణమునుండిబయలుదేఱి. భండనంబునకున్=యుద్ధమునకు. చని=పోయి.

తా॥ పిమ్మట శ్రీకృష్ణమూర్తి ప్రయోగించు బాణసమూహములయు చక్రముయొక్కయు వ్రేటులచేత తనవారందఱు చచ్చుటకు ఆశ్చర్యపడినవాఁడై నరకాసురుఁడు కోపించి కృష్ణునిదూషించి తన్ను పొగడుకొని కృష్ణుఁడెంతమాత్రపువాఁడని లక్ష్యముచేయక శ్రేష్ఠములయిన చెవిపోగులు మొదలగు ఆభరణములను ధరించుటచేత చక్కగాశృంగారించుకొన్నవాఁడై చెక్కిళ్లయందు మదజలము ధారలుధారలుగా స్రవింపఁగా మదించిన యేనుఁగులు గుంపులు గుంపులుగ నడవఁగా పట్టణమునుండి బయలుదేఱి యుద్ధమునకు పోయెనని తాత్పర్యము.

౧౫౭.—మ॥ బలవంతుండు ధరాసుతుండు గనె శుం * భ ద్రాజ బింబోపరి
స్థల శంపాన్విత మేఘమోయన ఖగేం * ద్ర స్కంధ పీఠంబుపై
లలనారత్నముఁ గూడి సంగరకథా * లాపంబులం జేయు ను
జ్జ్వలనీలాంగుఁ గనన్నిషంగుఁ గుహనా * చంగున్ రణాభంగునిన్.

టీ॥ బలవంతుండు=బలముగలవాఁడైన. ధరాసుతుండు=భూదేవి కొడుకైన నరకాసురుఁడు. శుంభ...మేఘమో—శుంభత్=ప్రకాశించుచున్న. రాజబింబ=చంద్రబింబమునకు. ఉపరిస్థల=మీఁదిప్రదేశమునందుండెడు. శంపా=మెఱపుతోడ. అన్విత = కూడుకొన్న. మేఘమో=మబ్బో. అనన్ = అనునట్టుగా. ఖగేంద్రస్కంధపీఠంబుపైన్=పక్షిరాజైనగరుత్మంతునిమూఁపు అనెడుపీఠముమీఁద లలనారత్నమున్=స్త్రీలలో శ్రేష్ఠురాలైనసత్యభామతో. కూడి=చేరి. సంగరకథాలాపంబులం జేయు = యుద్ధవృత్తాంతమును చెప్పుకొనుచుండునట్టి. ఉజ్జ్వలనీలాంగున్=వెలుఁగుచున్న నల్లనిదేహము గలవాఁడును. కనన్నిషంగున్=ప్రకాశించుచున్న యమ్ములపొదులుగలవాఁడును. కుహనాచంగున్ = కపటపునేర్పుగలవాఁడును. రణాభంగునిన్=యుద్ధమునందు భంగమునొందనివాఁడునైన. (శ్రీకృష్ణమూర్తిని) కనెన్=చూచెను.

తా॥ బలవంతుఁడును భూదేవి కొడుకునైన నరకాసురుఁడు ప్రకాశించుచున్న చంద్రబింబమునకు మీఁదితట్టుండెడు మెఱపుతోఁ గూడిన నీలమేఘమో అనునట్లు గరుత్మంతునిపై సత్యభామతోఁ గూడి కూర్చుండి యుద్ధసంబంధమయినమాటలు చెప్పుకొనుచున్న నల్లగా వెలుఁగుచున్న దేహముగలవాఁడును, మిక్కిలి మెఱయుచున్న అమ్ములపొదులుగలవాఁడును, కపటవ్యాపారమునందు చాల నేర్పుగలవాఁడును, యుద్ధములయందు భంగమునొందనివాఁడునైన శ్రీకృష్ణమూర్తిని చూచెనని తాత్పర్యము.

౧౫౮.—వ॥ కనికలహంబునకు నరకాసురుండు గమకింపందమకింప విలోకించి సంభ్రమంబున.

టీ॥ (కని నరకాసురుండు కలహంబునకు) గమకింపన్=యత్నించుటకు. తమకింపన్=త్వరపడఁగా. విలోకించి = చూచి. సంభ్రమంబునన్=వేగిరపాటుతో.

తా॥ చూచినవాఁడై నరకాసురుఁడు యుద్ధమునకు ప్రయత్నపడఁగాఁజూచి సత్యభామ వేగిరపాటుతోలేచినదైయని తాత్పర్యము.

## (*) సత్యభామ నరకాసురునితో యుద్ధముచేయుట. (*)










౧౪౯.—శా॥ వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీ * వీబంధ యై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందు మండల మ * రీచీజాల ము ల్పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కఁగా దుఱిమి శుం * భద్వీర సంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దనప్రా * ణేశాగ్ర భాగంబునన్.

టీ॥ ఏణీలోచన=లేడికన్నులవంటి బెదరుచూపులతోడికన్నులు గలదైన సత్యభామ. వేణిన్=జడను. చొల్లెముపెట్టి= దిండుగాఁ జుట్టిపట్టి. సంఘటితనీవీబంధయై=చక్కఁగాబిగియఁజేర్చి కట్టినపోక ముడిగలదై. భూషణశ్రేణిన్ = ఆభరణపఙ్క్తులను. తాల్చి = చక్కఁగాసవరించుకొని. ముఖేందు...ములు—ముఖ=మొగమనెడు. ఇందుమండల=చంద్రబింబముయొక్క. మరీచీజాలములు = కాంతు లనెడు కిరణసమూహములు. పర్వఁగాన్ = నలుప్రక్కలవ్యాపింపఁగా. పాణిన్ = చేతితో. పయ్యెద = పైఁట. చక్కఁగాన్ = సరిగా. తుఱిమి=చెక్కుకొని. శుంభద్వీరసంరంభయై=ప్రకాశించు నట్టి వీరరసముతోడి ఆటోపముగలదై. తనప్రాణేశాగ్రభాగం బునన్=తనపెనిమిటియెదుటితట్టు. (లేచినిల్చెను)

తా॥ సత్యభామ తనజడ చుట్టగాఁజుట్టి కట్టుకొని, పోక ముడి బిగించి,ఆభరణములను సవరించుకొని,చంద్రబింబమునుబోలినముఖ కాంతులు నాలుగుప్రక్కలనువ్యాపింపఁగా,పైఁట చక్కఁగాచెక్కు కొని,వీరరసమువలని ఆటోపమును వహించినదై, యుద్ధమునకు సిద్ధ పడి లేచి తనపెనిమిటియైన కృష్ణునియెదుట నిలిచెననితాత్పర్యము.

౧౫౦.—క॥ జన్యంబున దనుజుల దౌ । ర్జన్యము లుడుపంగఁగోరి * చనుదెంచిన సౌ
జన్యవతిఁ జూచి యదురా । జన్యశ్రేష్ఠుండు సరస * సల్లాపములన్.

టీ॥ జన్యంబునన్ = యుద్ధమునందు. దనుజులదౌర్జన్యములు= రాక్షసులయొక్కచెడ్డతనములను. ఉడుపంగన్ =పోఁగొట్టుటకు. (కోరి) చనుదెంచినసౌజన్యవతిన్ = వచ్చిన సుజనత్వముగల సత్య భామను. (చూచి)యదురాజన్యశ్రేష్ఠుండు=యదువంశపురాజులలో శ్రేష్ఠుఁడయినకృష్ణుఁడు. సరససల్లాపములన్=సరసములైనమంచి మాటలతో. (అనిపలికియని క్రియ మీఁదనున్నది)

తా॥ యుద్ధమునందు దుర్మార్గులగు రాక్షసులను అణఁగఁగొట్టఁ గోరి తనయెదుట మంచిస్వభావముతో వచ్చి నిలిచిన సత్యభామను జూచి యదువంశశ్రేష్ఠుఁడయినశ్రీకృష్ణమూర్తి యిట్లుపలికెనని తా.

౧౫౧.—క॥ లేమా దనుజులఁగెలువఁగ । లేమా నీవేలఁగడఁగి * లేచితి విటురా
లేమాను మానవేనియు । లేమా విల్లందికొనుము * లీలం గేలన్.

టీ॥ లేమా=ఓచిన్నదానా. దనుజులన్ = రాక్షసులను. గెలు వఁగలేమా=మేముజయింపలేమా. (నీవు) ఏల=ఎందుకు. కడఁగి= ప్రయత్నపడి. (లేచితివి) ఇటురా = ఇవతలరమ్ము. లే = లెమ్ము. మాను=ఈయుద్ధప్రయత్నమునుమానుము. మానవేనియున్=మానని పక్షమున. (లే) మావిల్లు=మాయొక్కవింటిని. కేలన్ = చేతితో. లీలన్=విలాసముగా.అందికొనుము=పుచ్చుకొనుము. వ॥అనిపలికె.

తా॥ ఓసత్యభామా! మేమురాక్షసులను గెలువలేమా?నీవుయుద్ధ ప్రయత్నము చేయనేల,ఇట్లులేచివచ్చి నిలువనేల, ఈప్రయత్నమును విడుపుము, అట్లువదలుకొన నిష్టము లేనిపక్షమునశీఘ్రముగలేచివచ్చి మావిల్లువిలాసముగాచేతఁబుచ్చుకొనుము అనిపలికెననితాత్పర్యము.

౧౬౨.—క॥ హరిణాక్షికి హరి యొసఁగెను । సురనికరోల్లాసనమును ✻ శూర కఠోరా
సుర సైన్య త్రాసనమును । బరగర్వ నిరాసనమును ✻ బాణాసనముఁ.

టీ॥ హరిణాక్షికిఁ=లేఁడికన్నులవంటి బెదరుకన్నులుగలసత్యభామకు. హరి = కృష్ణుఁడు. సురనికరోల్లాసనమును = దేవతాసమూహమునకు ఉల్లాసముకలుగఁజేయునదియు. శూర...త్రాసనమును—శూర=వీరులైన. కఠోర=కఠినులైన. అసుర = రాక్షసులయొక్క. సైన్య=దండునకు. త్రాసనము=భయమునుకలుగఁజేయునదియు. పరగర్వనిరాసనమును = పగవారి అహంకారమును పోఁగొట్టునదియునైన. బాణాసనమును = వింటిని. ఒసఁగెను = ఇచ్చెను.

తా॥ లేడికన్నులవంటి కన్నులుగల ఆసత్యభామకు శ్రీకృష్ణమూర్తి దేవతలకుసంతోషమును శూరులయిన రాక్షసులమూఁకలకు భయమును కలుగఁజేయునదియు, పగవారిగర్వమును అణఁచునదియునైన తనవింటిని ఇచ్చెనని తాత్పర్యము.

౧౬౩.—శా॥ ఆవిల్లంది బలంబునొంది తదగ ✻ ణ్యానంత తేజో విశే
షావిర్భూత మహాప్రతాపమున వీ ✻ రాలోక దుర్లోక్యయై
తా వేగఁ సగుణంబుచేసె ధనువుం ✻ దన్వంగి దైత్యాంగనా
శ్రీవాసంఘము నిర్గుణంబు ✻ గ రణక్రీడా మహోత్కంఠతోఁ.

టీ॥ తన్వంగి=సన్నని మేనుగల ఆసత్యభామ. ఆపిల్లంది=ఆధనుస్సును పుచ్చుకొని. బలంబునొంది = బలమునుపొందినదై. తద...మునఁ—తత్=ఆబలమువల్లనైన. అగణ్య = ఎన్నరాని. అనంత = మేరలేని. తేజః=తేజస్సుయొక్క. విశేష = అతిశయముచేత. ఆవిర్భూత=పుట్టిన. మహాప్రతాపమునఁ=అధికమయినపరాక్రమముచేత.వీరాలోకదుర్లోక్యయై—వీర=శూరులైనశత్రుయోధులయొక్క. ఆలోక=చూపులకు. దుర్లోక్యయై=చూడశక్యముగానిదై. తాఁ=తాను. దైత్యాంగనాశ్రీవాసంఘము = రాక్షసస్త్రీల మెడలసమూహము. నిర్గుణంబుగఁ = త్రాడులేనిది యగునట్టుగా. రణక్రీడామహోత్కంఠతోఁ = యుద్ధమనెడు ఆట్లాటయందలి అధికమైన తహతహతో. ధనువుఁ=కృష్ణుఁడిచ్చినధనుస్సును. వేగఁ=వడిగా. సగుణంబు=అల్లెత్రాటితోఁగూడినదిగా. (చేసెను)

తా॥ అట్లుకృష్ణుఁడు ధనుస్సును ఇయ్యఁగా సత్యభామ ఆధనుస్సును పుచ్చుకొన్నదై తనకు లేనిబలమును పొంది ఆబలాతిశయముచేత మితిలేని తేజస్సు తనయందుతోఁచఁగా ఆతేజస్సువలనఁబుట్టిన అధికమైన పరాక్రమముచేత తన్నుఁజూచునట్టి శత్రువీరుల కన్నులు మూతలుపడఁగా రాక్షసస్త్రీలమెడలు మంగళసూత్రములు లేనివగునట్టుగా యుద్ధక్రీడయందలి మిక్కుటమయిన తహతహతో ఆధనుస్సునందు అల్లెత్రాడు ఎక్కుపెట్టెనని తాత్పర్యము.

౧౬౪.—క॥ నారిమొరయించె రిపుసే । నారింఖణ హేతువైన ✻ నాదము నిగుడఁ
నారీమణి బలసంప । న్నారిభాదికము మూర్ఛ ✻ నంద నరేంద్రా.

టీ॥ నరేంద్రా=రాజా. నారీమణి=స్త్రీరత్నమయిన యాసత్యభామ. రిపుసేనారింఖణహేతువు—రిపు=శత్రువులయొక్క. సేనా=దండుయొక్క. రింఖణ=చలనమునకు. హేతువు=కారణము. ఐన నాదము=అయినట్టిధ్వని. నిగుడఁ = వ్యాపింపఁగాను. బలసంపన్నారిభాదికము—బలసంపన్న=బలముకలిమిగల. అరి = శత్రువులయొక్క. ఇభాదికము=ఏనుఁగులుమొదలయినవి. మూర్ఛనందఁ=మూర్ఛనుపొందునట్లు. నారిఁ = అల్లెత్రాటిని. మొరయించెఁ = ధ్వనింపఁజేసెను.

తా॥ ఓరాజా! స్త్రీరత్నమయిన ఆసత్యభామ శత్రుసేనలు చలించుటకు కారణమయినదియు బలసంపదగలిగిన శత్రువుల యేనుఁగులు మొదలగునవి మూర్ఛనొందునట్లు చేయునదియునైన గొప్పధ్వని కలుగునట్లు వింటినారి మ్రోయించెనని తాత్పర్యము.

౧౬౫.—సీ॥ సౌవర్ణ కంకణ ✻ ఝుణఝుణ నినదంబు - శింజినీ రవముతోఁ ✻ జెలిమిసేయఁ
దాటంక మణిగణ ✻ ధగధగ దీప్తులు - గండమండలరుచుల్ ✻ గప్పికొనఁగ
ధవళ తరాపాంగ ✻ ధళధళ రోచులు - బాణజాల ప్రభా ✻ పటలి నడఁప
శరపాత ఘుమఘుమ ✻ శబ్దంబు పరిపంథి - సైనిక కలకల ✻ స్వనము లుడుప

తే॥ వీర శృంగార భయరౌద్ర ✻ విస్మయములు । గలసి భామిని యయ్యెనో ✻ కాక యనఁగ
నిషువుఁ దొడుగుట దివుచుట ✻ యేయుటెల్ల । నెఱుఁగరాకుండ ననిచేసె ✻ నిందువదన.

టీ॥ సౌవర్ణకంకణఝుణఝుణనినదంబు — సౌవర్ణ = బంగారుమయమయిన. కంకణ=కడియములయొక్క. ఝుణఝుణనినదంబు=ఝుణఝుణయనుధ్వని. శింజినీరవముతోఁ=అల్లెత్రాటిచప్పుడుతో. చెలిమిసేయఁ = స్నేహింపఁగా. తాటంక...దీప్తులు—తాటంక=కమ్మలయందలి. మణిగణ = రత్నసమూహములయొక్క. ధగధగదీప్తులు=దగదగయనెడికాంతులు. గండమండలరుచులు=చెక్కిటిప్రదేశమునందలికాంతులను. కప్పికొనఁగఁ=ఆవరించుకొనఁగా. ధవళ...రోచులు—ధవళతర = మిక్కిలితెల్లనైన. అపాంగ = కడ

గన్నులవలని. ధళధళరోచులు = తళతళనికాంతులు. బాణ ... పటలిన్ — బాణజాల = బాణసమూహములయొక్క. ప్రభా = కాంతులయొక్క. పటలిన్ = సముదాయమును. అడఁపన్ = అణఁచివేయఁగా. శర...శబ్దంబు — శర = బాణములయొక్క. పాత = పడుటవలని. ఘుమఘుమశబ్దంబు = ఘుమఘుమయనెడుధ్వని. పరి...స్వనములు — పరిపంథి = శత్రువులయొక్క. సైనిక = సేనాజనులయొక్క. కలకలస్వనములు = కోలాహలధ్వనులను. ఉడుపన్ = నిలిపివేయఁగా. వీరశృంగారభయరౌద్రవిస్మయములు = వీరము శృంగారము భయానకము రౌద్రము ఆశ్చర్యమునను రసములు. కలసి = కూడి. భామినియయ్యెనోకాక = ఈస్త్రీరూపముగా నేర్పడెనేమో కాని. అనఁగన్ = అనునట్లు. ఇషువు = బాణమును. తొడుగుట = సంధించుటయు. తివుచుట = ఆకర్షించుటయు. ఏయుట = ప్రయోగించుటయు. ఎల్లన్ = అంతయు. ఎఱుఁగరాకుండన్ = తెలిసికోఁగూడకుండ. ఇందువదన = సత్యభామ. అనిచేసెన్ = యుద్ధముచేసెను.

తా॥ సత్యభామ అట్లు అల్లెత్రాడు మ్రోయించినదై తనచేతి బంగారుకడియముల ఝణఝణయనుశబ్దము అల్లెత్రాటి టంకారధ్వనితో కలియఁబడఁగా, కమ్మలలోని రత్నకాంతులు చెక్కిళ్ల తళతళలను కమ్ముకొనఁగా, మిక్కిలి తెల్లగా వెలిఁగెడుకడకన్నులవలని ధళధళని వెలుఁగులు బాణముల మెఱుఁగులను అణఁచివేయఁగా, బాణములు పడునప్పుడు కలుగు ఘుమఘుమయను ధ్వనులు శత్రుసేనల కోలాహలధ్వనులను అణఁచివేయఁగా, వీరశృంగారాది రసములెల్లను ఒక్కటిగాఁగూడి యీయాఁడురూపమును వహించెనో అనునట్లు బాణములను సంధించుట ఆకర్షించుట ప్రయోగించుట లనునవి తెలియఁబడకుండ యుద్ధముచేసెనని తాత్పర్యము.

౧౬౬.—మ॥ పరుఁ జూచున్ వరుఁజూచు నొంప నలరిం * పన్ రోష రాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో * వీరంబు శృంగారముం
జరగం గన్నుల కెంపుసొంపు పరఁగన్ * జండాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచున్ * జంద్రాస్య హేలాగతిన్.

టీ॥ చంద్రాస్య = చంద్రునిఁబోలిన మొగముగల సత్యభామ. హేలాగతిన్ = విలాసవిధమున — ఒయ్యారముగాను. రోష...ములతోన్ — రోష = కోపముయొక్క. రాగ = అనురాగముయొక్క. ఉదయ = పుట్టుకచేత. అవిరత = విశ్రాంతిలేని. భ్రూకుటి = బొమముడితోను. మందహాసములతోన్ = చిఱునవ్వుతోను. వీరంబు = వీరరసమును. శృంగారమున్ = శృంగారరసమును. జరగన్ = వర్తింపఁగా. కన్నులన్ = కన్నులయందు. కెంపు = ఎఱ్ఱఁదనమును. సొంపు = మనోజ్ఞతయు. పరఁగన్ = వ్యాపింపఁగా. చండా...మున్ — చండ = తీక్ష్ణమైన — చుఱుకైన. అస్త్ర = మంత్రములచేత ప్రయోగింపఁబడు బాణములయొక్క. సందోహమున్ = సమూహమును. సర...మున్ — సరస = రసవంతములైన. ఆలోక = చూపులయొక్క. సమూహమున్ = సముదాయమును. నెఱపుచున్ = ప్రసరింపఁజేయుచు. పరున్ = శత్రువైననరకాసురుని. ఒంపఁజూచున్ = నొప్పింపయత్నించును. వరున్ = పెనిమిటియైనకృష్ణుని. అలరింపఁజూచున్ = సంతోషపెట్ట యత్నించును.

తా॥ చంద్రునివంటి మొగముగలదైన ఆసత్యభామ ఒయ్యారముగా మెలఁగుదానివలెనే రోషమును అనురాగమును పైపైనిపుట్టుచుండఁగా మాననిబొమముడితోను చిఱునవ్వుతోను వీరరసమును శృంగారరసమును గనఁబడునట్లు కన్నులయందు ఎఱ్ఱఁదనమును మనోజ్ఞతయు నిండుకొనఁగా చుఱుకుగల బాణములసమూహమును ప్రయోగించుటచేతను సరసములైనచూపులను ప్రసరింపఁజేయుటచేతను శత్రులైన నరకాసురుని నొప్పింపను తనపెనిమిటియైనకృష్ణమూర్తిని సంతోషము నొందింపను యత్నించెనని తాత్పర్యము.

౧౬౭.—మ॥ అలినీలాలక చూడనొప్పెసఁగెఁ బ్ర * త్యాలీఢ పాదంబుతో
నలిక స్వేద వికీర్ణ కాలకలతో * నాకర్ణ కానీత స
ల్లలిత జ్యా నఖ పుంఖ దీధితులతో * లక్ష్యావలోకంబుతో
వలయాకార ధనుర్విముక్త విశిఖ * వ్రాతాహతారాతియై.

టీ॥ అలినీలాలక — అలి = తుమ్మెదలవలె. నీల = నల్లనైన. అలక = ముంగురులుగలసత్యభామ. ప్రత్యాలీఢపాదంబుతోన్ = ఎడమకాలు ముందటికిచాఁచి నిలుచునట్టిస్థితితోను. అలిక...కలతోన్ — అలిక = నొసటియందలి. స్వేద = చెమటయందు. వికీర్ణక = చెదరియంటుకొన్న. అలకలతోన్ = ముంగురులతోను. ఆకర్ణ...దీధితులతోన్ — ఆకర్ణక = చెవిపఱకు. ఆనీత = లాఁగఁబడిన. సత్ = దృఢమయిన. లలిత = మనోజ్ఞమైన. జ్యా = అల్లెత్రాటియందలి. నఖ = గోళ్లయొక్కయు. పుంఖ = బాణపుపింజలయొక్కయు. దీధితులతోన్ = కాంతులతోను. లక్ష్యావలోకంబుతోన్ = గుఱినిపొందినచూపుతోను. వలయా...రాతియై — వలయాకార = గుండ్రముగాఁగానవచ్చెడు. ధనుః = వింటివలననుండి. విముక్త = విడువఁబడిన. విశిఖ = బాణములయొక్క. వ్రాత = సమూహములచేత. ఆహత = చంపఁబడిన. ఆరాతియై = శత్రువులుగలదై. చూడన్ = చూచుటకు. ఒప్పెసఁగెను = అందమతిశయించి యుండెను.

తా॥ తుమ్మెదలవంటి నల్లనిముఖభాగమునందలిపాడివెంట్రుకలుగల సత్యభామ, ఎడమకాలు ముందటికిఁజాఁచి నిలుచునట్టి ఉనికితోను, నొసటిచెమటయందు చెదరి అంటుకొనియుండు ముంగురులతోడను, చెవినంట లాగఁబడిన అల్లెత్రాటియందుపొందిన బాణపుపింజలయొక్కయు వ్రేళ్లగోళ్లయొక్కయు కాంతులతోను, గుఱియందుంచఁబడిన చూపుతోను, గుండ్రముగాఁజేయఁబడిన వింటివలననుండి విడువఁబడిన బాణసమూహములచేత చంపఁబడిన శత్రువులుగలదై చూడ నందగించుచుండెనని తాత్పర్యము.

౧౬౮.—సీ॥ బొమ్మపెండ్లిండ్లకుఁ * బోనొల్ల ననుబాల - రణరంగమున కెట్లు * రాఁదలంచె
మగవారిఁగనినఁ దా * మఱుఁగుఁజేరెడు నింతి - పగవారి గెల్వనే * పగిదిఁజాలెఁ
బసిఁడి యుయ్యాలలెక్క * భయమందుభీరువు - ఖగపతిస్కంధమే * కడిఁది నెక్కె
సఖులకోలాహల * స్వనము లోర్వనికన్య - పటహభాంకృతుల కే * బ్భంగి నోర్చె

ఆ॥ నీల కంఠములకు * నృత్యంబు గఱపుచు । నలసి తలఁగిపోవు * నలరుఁబోఁడి
యేవిధమున నుండె * నెలమి నాలీఢాది । మానములను రిపుల * మానమడఁప.

టీ॥ (బొమ్మపెండ్లిండ్లకు) పోనొల్లన్ = పోఁజాలను. అనుబాల = అనునట్టి యీచిన్నది. రణరంగమునకున్ = యుద్ధభూమికి. ఎట్లు = ఏవిధముగా. రాఁదలంచెను = వచ్చుటకుఁదలఁచెను. (మగవారిని) కనినన్ = చూచినను. తాన్ = తాను. మఱుఁగుఁజేరెడునింతి = చాటునఁజేరునట్టియీచిన్నది. పగవారిన్ = శత్రువులను. గెల్వన్ = జయింపను. ఏపగిదిన్ = ఏవిధముగా. చాలెన్ = శక్తురాలయ్యెను. పసిఁడియుయ్యేలలు = బంగారు ఉయ్యాలలు. ఎక్కన్ = ఎక్కుటకు. భయమందు = భయపడునట్టి. భీరువు = భయశీలయైనయీచిన్నది. ఖగపతిస్కంధము = గరుత్మంతునిమూఁపుమీఁద. ఏకడిఁదిన్ = ఏసామర్థ్యముచేత. (ఎక్కెను) సఖులకోలాహలస్వనములు = చెలికత్తెల యొక్క కలకలధ్వనులు. ఓర్వనికన్య = సహింపనిచిన్నది. పటహభాంకృతులకున్ = యుద్ధవాద్యములయొక్క భాం అను ధ్వనులకు. ఎబ్భంగిన్ = ఏవిధముగా. ఓర్చెన్ = సహించెను. నీలకంఠములకున్ = నెమళ్లకు. నృత్యంబు = ఆటను. కఱపుచున్ = నేర్పుచు. అలసి = విసుఁగుఁజెంది. తలఁగిపోవునలరుఁబోఁడి = తొలఁగిపోవునట్టిపుష్పమువలెమనోజ్ఞురాలైనయీచిన్నది. ఏవిధమునన్ = ఏరీతిగా. ఎలమిన్ = సంతోషముతో. ఆలీఢాదిమానములన్ = కుడికాలుముందఱికిచాచి యుద్ధముచేయనిలుచుట మొదలగు కొలఁదులచేత. (ఆలీఢాదులు— ఆలీఢము, ప్రత్యాలీఢము, సమపదము, విశాఖము, మండలము. అని అయిదు) రిపులమానము = శత్రువులగర్వమును. అడఁపన్ = అణఁచివేయుటకు. (ఉండెను)

తా॥ ఈసత్యభామ బొమ్మపెండ్లిండ్లకు పోవలెనన్నను పోలేకయుండును, మగవారిని జూచి మఱుఁగున దూఱుకొనును, బంగారు ఉయ్యాలలపైనెక్క భయపడును, చెలికత్తెలు గలగలమాటలాడిరేని యోర్వదు, నెమళ్ల ఆటలు నేర్పలేక విసుఁగుకొని తొలఁగిపోవుచుండును, ఇటువంటి ఈసత్యభామ యుద్ధభూమికి ఎట్లువచ్చెను, శత్రువుల నెదిరించి గెలువ నెట్లు సమర్థురాలాయెను, గరుత్మంతుని మూఁపుమీఁద నెక్కి కూర్చుండ నెట్లుచాలెను, యుద్ధవాద్యముల యొక్క భాంభాం అను ధ్వనులను ఎట్లు విని సహింపఁగలిగెను, ఏరీతిగా ఆలీఢము మొదలగు నిలుకడలయందు నిలిచి శత్రువులగర్వమును ఎట్లు అణఁపఁజాలెను అని తాత్పర్యము.

౧౬౯.—సీ॥ వీణెఁ జక్కఁగఁ బట్ట * వెరవెఱుంగనికొమ్మ - బాణాసనం బెట్లు * పట్టనేర్చె
మ్రాఁకునఁదీఁగెఁ గూ * ర్పంగనేరని లేమ - గుణము నే క్రియ ధనుః * కోటిఁగూర్చె
సరసముత్యముఁ గ్రువ్వఁ * జాలనియబల యే - నిపుణత సంధించె * నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు * చెప్పనేరనితన్వి - యస్త్రమంత్రము లెన్నఁ * డభ్యసించెఁ

ఆ॥ బలుకుమనినఁ బెక్కు * పలుకనిముగుద యే । గతి నొనర్చె సింహ * గర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగ * దభిరామ గుణధామ । చారు సత్యభామ * సత్యభామ.

టీ॥ వీణెన్ = వీణెను. చక్కఁగన్ = సరిగా. పట్టన్ = పట్టుకొనను. వెరవు = ఉపాయము. ఎఱుంగనికొమ్మ = తెలియని యీచిన్నది. బాణాసనంబు = వింటిని. ఎట్లు = ఏవిధముగా. పట్టనేర్చెన్ = పట్టుకొనభ్యసించెను. మ్రాఁకునన్ = వృక్షమునందు. (తీఁగెను) కూర్పంగన్ = పెనఁచుటకు. నేరనిలేమ = శక్తురాలుకాని యీచిన్నది. గుణమున్ = అల్లెత్రాటిని. ఏక్రియన్ = ఏవిధముగా. ధనుఃకోటిన్ = వింటికొనను. కూర్చెన్ = కూడఁబెట్టెను. సరసముత్యమున్ = ముత్యముప్రక్క మఱియొకముత్యమును. క్రువ్వఁజాలనియబల = కూర్పలేనిచిన్నది. ఏనిపుణతన్ = ఏనేర్పుచేత. నిశితశరమున్ = వాఁడిగలబాణమును. సంధించెన్ = కూర్చెను. (చిలుకకు) పద్యంబు = పద్యమును. చెప్పనేరనితన్వి = చెప్పను ఓపికలేనిచిన్నది. అస్త్రమంత్రములు = అస్త్రములను ప్రయోగించు మంత్రములను. ఎన్నఁడు = ఎప్పుడు. అభ్యసించెన్ = నేర్చెను. పలుకుమనినన్ = మాటలాడుమన్నను. పెక్కు = విశేషముగా. పలుకనిముగుద = మాటలాడఁజాలనిముగ్ధ. ఏగతిన్ = ఏవిధముగా. సింహగర్జనములు = సింహనాదములను. ఒనర్చెన్ = చేసెను. అనఁగన్ = అనునట్లుగా. త్రిజగదభిరామగుణధామ = మూడులోకములందు ఒప్పిదమయినగుణములకు ఉనికిపట్టయినదియు. చారుసత్యభామ = ఒప్పిదమునుసత్యమునైన కాంతిచేత లక్ష్మియైనదియునైన. (సత్యభామ) మెఱసెన్ = ప్రకాశించెను.

తా॥ మూడులోకములలోని మనోజ్ఞగుణములకు ఉనికిపట్టయినదియు, ఎప్పుడును చెడని మనోజ్ఞకాంతిచేత లక్ష్మీస్వరూపురాలైనదియునైన సత్యభామ, వీణె చక్కగా పట్టనేరనిది విల్లుపట్టనెప్పుడు నేర్చెను, మ్రానియందు తీఁగను అల్లింపనేర్పుచాలనిది వింటియందు అల్లెత్రాటి నెట్లుఎక్కుపెట్టనేర్చెను, ముత్యముప్రక్కమఱియొకముత్యమును సరముగఁగూర్పనేరనిది వాఁడి బాణములను అల్లెత్రాటియం

డెట్లు కూర్పనేర్చెను, చిలుకకు పద్యము చెప్పుమన్నఁ జెప్పఁజాలనను నది అస్త్రములను ఓపికతో నెప్పుడభ్యసించెను, మాటలాడుమన్నను మాటలాడనేరనిది సింహనాదము చేయ నెట్లు నేర్చెను, అని కృష్ణమూర్తి తలఁచునట్లుగా ప్రకాశించెనని తాత్పర్యము.

౧౭౦.—శా॥ జ్యావల్లీధ్వని గర్జనంబుగ సుర * ల్సారంగ యూధంబుగా
నావిల్లింద్ర శరాసనంబుగ సరో * జాక్షుండు మేఘంబుగాఁ
దావిద్యుల్లత భంగి నింతి సురజి * ద్దావాగ్ని మగ్నంబుగాఁ
బ్రావృట్కాలముఁ జేసె బాణచయ మం * భశ్శీకర శ్రేణిగాన్.

టీ॥ ఇంతి=సత్యభామ. జ్యావల్లీధ్వని=అల్లెత్రాటి మ్రోఁత. గర్జనంబుగన్=ఉఱుముగాను. సురలు = దేవతలు. సారంగయూథంబుగాన్=వానకోయిలలసమూహముగాను. ఆవిల్లు=తానుధరించిన శార్ఙ్గధనుస్సు. ఇంద్రశరాసనంబుగన్=ఇంద్రధనుస్సుగాను. సరోజాక్షుండు = కృష్ణుఁడు. మేఘంబుగాన్ = మబ్బుగాను. బాణచయము = బాణములసమూహము. అంభశ్శీకరశ్రేణిగాన్ = నీటిదారలపఙ్క్తులు కాఁగాను. తాన్ = తాను. విద్యుల్లతభంగిన్=మెఱపుతీఁగవిధమున. సురజిద్దావాగ్ని=దేవశత్రువులయిన రాక్షసులనెడు కార్చిచ్చు. మగ్నంబుగాన్=మునిఁగిపోవునట్టుగా. ప్రావృట్కాలమున్=వర్షాకాలమును. (చేసెను)

తా॥ అప్పుడు సత్యభామ, అల్లెత్రాటిమ్రోఁతయుఱుమును, దేవతలు వానకోయిలలును, ధనుస్సు ఇంద్రధనుస్సును, శ్రీకృష్ణమూర్తి నీలమేఘమును, బాణములసమూహములు నీటిచినుకులును కాఁగా, తాను మెఱపుతీఁగయై రాక్షసులనెడు కార్చిచ్చు అణఁగిపోవునట్లు వర్షాకాలమును గల్పించెనోయన్నట్లుండెనని తాత్పర్యము.

౧౭౧.—సీ॥ రాకేందు బింబమై * రవిబింబమైయొప్పు - నీరజాతేక్షణ * నెమ్మొగంబు
కందర్ప కేతువై * ఘనధూమకేతువై - యలరుఁ బూఁబోఁడి చే * లాంచలంబు
భావజుపరిధియై * ప్రళయార్క పరిధియై - మెఱయు నాకృష్టమై * మెలఁతచాప
మమృత ప్రవాహమై * యనల సందోహమై - తనరారు నింతి సం * దర్శనంబు

ఆ॥ హర్షదాయియై మ * హారోష దాయియై । పఱచు ముద్దరాలి * బాణవృష్టి
హరికి నరికిఁ జూడ * నందంద శృంగార । వీరరసము లోలి * విస్తరిల్ల.

టీ॥ హరికిన్=కృష్ణునకును. అరికిన్ = శత్రువైననరకాసురునికిని. చూడన్=చూడఁగా. (శృంగారవీరరసములు) ఓలిన్=క్రమముగా. విస్తరిల్లన్ = అతిశయింపఁగా. నీరజాతేక్షణ=కమలమువంటి ముఖముగల సత్యభామయొక్క. నెమ్మొగంబు=విశాలమైన ముఖము. రాకేందుబింబమై=పున్నమనాటిచంద్రమండలమయి. రవిబింబమై=సూర్యమండలమయి. (ఒప్పును) పూఁబోఁడి=పుష్పమువలె మనోజ్ఞురాలయిన సత్యభామయొక్క. చేలాంచలంబు = కోకచెఱఁగు. కందర్పకేతువై=మన్మథుని కేతనమై. ఘనధూమకేతువై=గొప్పదైన అరిష్టసూచకనక్షత్రమయి. అలరున్=ఒప్పును. మెలఁతచాపము = సత్యభామచేతిధనుస్సు. ఆకృష్టమై = లాగఁబడినదై. భావజుపరిధియై = మన్మథావరణమయి. ప్రళయార్కపరిధియై=ప్రళయకాల సూర్యపరివేషమయి. మెఱయున్ = ప్రకాశించును. ఇంతిసందర్శనంబు=సత్యభామయొక్క చూపు. అమృతప్రవాహమై=అమృతపువెల్లువయై. అనలసందోహమై=అగ్నిసమూహమయి. తనరారున్=ఒప్పును. ముద్దరాలిబాణవృష్టి=అందగత్తెయైన సత్యభామయొక్క బాణములవాన. హర్షదాయియై=సంతోషమునిచ్చునదియై. మహారోషదాయియై=అధికకోపమునిచ్చునదియై. పఱచున్=ప్రసరించును—లేక, వ్యాపించును.

తా॥ అప్పుడు సత్యభామయొక్క ముఖమును, వ్రేలాడుచీరచెఱఁగును, వలయాకారమయిన విల్లును, మేలయినచూపును, బాణములవానయు, ప్రియుఁడైన శ్రీకృష్ణమూర్తికి శృంగారరసమతిశయింపఁగా, పున్నమనాటినిండుచంద్రబింబముగాను, మన్మథుని టెక్కెముగాను, మన్మథుఁడు ఆవరింపఁజేసిన తెరచీరగాను, అమృతప్రవాహముగాను, సంతోషకరముగాను, తోఁచుచుండెననియు, వీరరసము అతిశయింపఁగా, శత్రువైన నరకునికి ప్రళయకాలపుసూర్యబింబముగాను, అరిష్టమును తెలుపునట్టి తోఁకచుక్కగాను, ప్రళయకాల సూర్యుని పరివేషముగాను, అగ్నిప్రవాహముగాను, అధికరోషమును కలుగఁజేయునదిగాను తోఁచెననియు తాత్పర్యము. వ॥ ఇవ్విధంబున.

౧౭౨.—క॥ శంపాలతాభ బెడిదపు । టంపఱచే ఘోర దాన * వానీకంబుల్
పెంపఱి సన్నాహంబుల । సొంపఱి భూసుతుని వెనుకఁ * జొచ్చెన్విచ్చెన్.

టీ॥ శంపాలతాభ=మెఱపుతీఁగవంటి దేహముగల సత్యభామయొక్క. బెడిదపుటంపఱచేన్ = భయంకరమయిన బాణసమూహముచేత. ఘోరదానవానీకంబులు = భయంకరమయిన రాక్షససేనలు. పెంపు=ఘనత. అఱి = నశించి. సన్నాహంబులసొంపు = యుద్ధప్రయత్నములక్రమము. అఱి=నశియించి. భూసుతునివెనుకన్=భూదేవికొడుకైన నరకునివెనుకను. చొచ్చెన్ = చొరఁబడెను. విచ్చెన్=చెదరిపాఱిపోయెను.

తా॥ అప్పుడు సత్యభామయొక్క వాఁడియైనబాణములవ్రేటులచేత రాక్షసులదండంతయు తమగౌరవమునుయుద్ధప్రయత్నములును మాని భయముచేత నరకాసురునిమఱుఁగునకు పాఱిపోయెనని తా.

వ॥ అయ్యవసరంబునం గంససంహారి మనోహారిణిం జూచి సంతోషకారియుం గరుణారసావలోకన ప్రసారియు మధురవచన సుధారస విసారియుం దదీయ సమరసన్నాహ నివారియు నై యిట్లనియె.

టీ॥ అయ్యవసరంబునన్=ఆసమయమునందు. కంససంహారి = కంసునిఁజంపినవాఁడైనకృష్ణుఁడు. మనోహారిణింజూచి = తనప్రియురాలినిజూచి. సంతోషకారియున్ = సంతోషమును కలుగఁజేయువాఁడును. కరుణా... ప్రసారియున్ — కరుణారస = దయారసము లొలుకుచున్న. అవలోకన=చూపును. ప్రసారియున్=ప్రసరింపఁజేయువాఁడును. మధు...విసారియున్ — మధుర = ఇంపయిన. వచన=మాటల నెడు. సుధారస=అమృతరసమును. విసారియున్=వ్యాపింపఁజేయువాఁడును. తదీయ...నివారియున్—తదీయ=ఆమె దైన. సమర=యుద్ధమునందలి. సన్నాహ=అయిత్తపాటును. నివారియున్=నిలుపువాఁడును. (అయి) ఇట్లనియెన్=ఇట్లు పలికెను.

తా॥ ఆసమయమునందు శ్రీకృష్ణమూర్తి తనప్రియురాలైన సత్యభామను జూచి సంతోషించువాఁడును, కరుణతోడిచూపుతో ఆమెను జూచువాఁడును, ఇంపయినమాట లాడువాఁడును, ఆమె దయిన యుద్ధప్రయత్నమును మాన్పువాఁడును నై యిట్లు పలికెను అని తా.

౧౭౪.—క॥ కొమ్మా దానవనాథుని । కొమ్మాహవమునకుఁ దొలఁగె ✻ గురువిజయముఁ గై
కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ । గొమ్మాభరణములు నీవు ✻ గోరినవెల్లన్.

టీ॥ కొమ్మా=ఓచిన్నదానా. దానవనాథునికొమ్ము = రాక్షసరాజైననరకాసురునిపక్షపుదండు. ఆహవమునకున్=యుద్ధమువలన నుండి. తొలఁగెన్=తొలఁగిపోయెను. గురువిజయమున్ = గొప్ప గెలుపును. కైకొమ్మా=గ్రహింపుమా. మెచ్చితిన్ = నిన్ను మెచ్చుకొన్నాను. ఆభరణములు = సొమ్ములు. నీవుగోరినవెల్లనిచ్చెదను= నీవు కోరినవానినన్నిటిని ఇచ్చెదను. కొమ్మా = పుచ్చుకొనుమా.

తా॥ ఓచిన్నదానా! మనకుపగవాఁడైన నరకాసురుని సైన్యము యుద్ధమునకు వెనుదీసి పాఱిపోయెను, నీవిక గొప్ప గెలుపును పొందుము, ఈగొప్పపనిని చేసినందులకై నిన్ను మెచ్చుకొన్నాను, నీవేసొమ్ము కోరినను ఇచ్చెదను అడిగి పుచ్చుకొమ్మని తాత్పర్యము.

వ॥ అని పలికి సమ్మానరూపంబులును, మోహనదీపంబులును, దూరీకృత చిత్తవిక్షేపంబులు నైన సల్లాపంబులం గళావతిం దద్దయుఁ బెద్దఱికంబు చేసి తత్కరకిసలయోల్లసిత బాణాసనంబు మరల నందుకొని యెనప్పుడు సురవైరి మురవైరి కిట్లనియె.

టీ॥ (అనిపలికి) సమ్మానరూపంబులును=మన్ననవిధము గలిగినవియు. మోహనదీపంబులును=మోహింపఁజేయుటయందు దీపములును. దూరీకృతచిత్తవిక్షేపంబులును—దూరీకృత=ఎడముగాఁజేయఁబడిన. చిత్తవిక్షేపంబులును=మనస్సుయొక్క కలఁతపాటు గలవియును. ఐన సల్లాపంబులన్=అయినట్టిముచ్చట్లచేత. కళావతిన్ = కళలుగలదైనసత్యభామను. తద్దయున్=మిక్కిలి. పెద్దఱికంబుచేసి = గౌరవించి. తత్కర...బాణాసనంబున్ — తత్=ఆసత్యభామయొక్క. కరకిసలయ=చిగురువంటిచేతియందు. ఉల్లసిత = ప్రకాశించునట్టి. బాణాసనంబు=ధనుస్సును. మరలన్=తిరుగా. అందుకొనియెన్=పుచ్చుకొనెను. (అప్పుడు) సురవైరి = దేవశత్రువయిన నరకాసురుఁడు. మురవైరికిన్=కృష్ణునితో. ఇట్లనియెన్=ఇట్లు పలికెను.

తా॥ అని చెప్పి మన్ననను దెలుపునవియు మనసు కలవరమును పోఁగొట్టునవియు, మోహమును బుట్టించునవియు నైన ముచ్చట్ల మాటలచేత, సత్యభామను లాలించి గౌరవించి ఆమె చేతనున్న ధనుస్సును పుచ్చుకొనఁగా, కృష్ణునిఁజూచి నరకాసురుఁడు ఇట్లని పలికెనని తాత్పర్యము.

౧౭౫.—క॥ మగువ మగవారి ముందట । మగతనములు సూప రణము ✻ మానుట నీకున్
మగతనము గాదు దనుజులు । మగువలదెసఁ జనరు మగల ✻ మగలగుట హరీ.

టీ॥ హరీ=కృష్ణుఁడా. మగువ=ఆఁడుది. మగవారిముందటన్=పురుషునియెదుట. మగతనములు=పౌరుషములు — శూరత్వములు. చూపన్=కనఁబఱుపఁగా. రణము=యుద్ధమును. మానుట=మానియుండుట. (నీకు) మగతనము గాదు=పౌరుషము కాదు. దనుజులు=రాక్షసులు. మగలమగలగుటన్ = మగవారికి మగలగుటచేత. మగువలదెసన్=స్త్రీలతట్టు. చనరు=పోరు.

తా॥ ఓయి కృష్ణా! ఆఁడుది పౌరుషము కనఁబడ యుద్ధము చేయుచుండఁగా, అంతకంటె హీనునివలె ఊరక చూచుచుండుట నీకు పౌరుషము కాదు, రాక్షసులమయిన మేము పురుషులకు పురుషులము గనుక ఆఁడువారితట్టు పోకయూరకున్నాము అని తాత్పర్యము.

వ॥ అనిన హరి యిట్లనియె.

౧౭౬.—క॥ నరకా ఖండించెద మ । త్కరకాండాసన విముక్త ✻ ఘనశరముల భీ
కరకాయ నిన్ను సురకి । న్నర కాంతలు సూచి నేడు ✻ నందింపంగన్.

టీ॥ (నరకా) భీకరకాయున్=భయంకరమయిన దేహముగలవాఁడవైన. (నిన్ను) నేడు=ఈదినము. సురకిన్నరకాంతలు=దేవతలయు కిన్నరులయు స్త్రీలు. (చూచి) నందింపంగన్ = శ్లాఘింపఁగా — పొగడఁగా. మత్కర...శరములన్—మత్=నాయొక్క. కర=చేతిదైన. కాండాసన=వింటియందుండి. విముక్త=విడువఁబడిన. ఘనశరములన్ = గొప్పబాణములచేత. ఖండించెదన్ = నఱికెదను—చంపెదను.

తా॥ ఓరి నరకాసురుఁడా! మిక్కిలి క్రూరుఁడవైన నిన్ను నీచేత చెఱఁబెట్టఁబడిన దేవతల కిన్నరుల స్త్రీలందఱు పొగడునట్లుగా నా వింటియందుండి విడువఁబడునట్టి బాణములచేత నఱికి చంపెదనని తా.

౧౭౮.—వ॥ అనిపలికి హరి నరకాసుర యోధులమీఁద శతఘ్నియను దివ్యాస్త్రంబు ప్రయోగించిన నొక్కవరుసను వారందఱు మహావ్యథం జెందిరి మఱియును.

టీ॥ అనిపలికి=అనిచెప్పి. హరి=కృష్ణుఁడు. నరకాసురయోధులమీఁదన్=నరకాసురునివారైన భటులమీఁద. శతఘ్ని = పిరంగి. అనుదివ్యాస్త్రంబు=అనునట్టిదివ్యమయినయస్త్రమును. ప్రయోగించినన్=ప్రయోగింపఁగా. (ఒక్కవరుసను)వారందఱున్=ఆయోధులందఱును. మహావ్యథం జెందిరి=చచ్చిరి. మఱియును=అదిగాక.

తా॥ అని చెప్పి శ్రీకృష్ణమూర్తి నరకునికి సహాయిగా వచ్చిన భటులమీఁద శతఘ్నియనెడు అస్త్రమును ప్రయోగింపఁగా ఆయోధులందఱు ఒకసారిగా చచ్చిరి అని తాత్పర్యము.

౧౭౯.—మ॥ శరవిచ్ఛిన్న తురంగమై పటుగదా ✻ సంభిన్న మాతంగమై
యురుచక్రాహత వీరమధ్యపద బా ✻ హుస్కంధ ముఖ్యాంగమై
సురభిత్సైన్యము హైన్యముం బొరయుచున్ ✻ శోషించి దైన్యంబుతో
హరిమ్రోలన్ నిలువంగలేక పఱచెన్ ✻ హాహా నినాదంబులన్.

టీ॥ సురభిత్సైన్యము=నరకాసురునిసేన. శర...తురంగమై—శర = బాణములచేత. విచ్ఛిన్న = మిక్కిలి ఛేదింపఁబడిన. తురంగమై=గుఱ్ఱములుగలదై. పటు...మాతంగమై—పటు=దృఢమైన. గదా=గుదియచేత. సంభిన్న = లెస్సగా ఛేదింపఁబడిన. మాతంగమై=ఏనుఁగులుగలదై. ఉరుచక్రా...ముఖ్యాంగమై—ఉరు=గొప్పదైన. చక్ర=చక్రాయుధముచేత. ఆహత = కొట్టఁబడిన. వీర = యోధులయొక్క. మధ్య=నడుములు. పద=కాళ్లు. బాహు=భుజములు. స్కంధ=మూఁపులు. ముఖ్య=మొదలుగాఁగల. అంగమై=అవయవములుగలదై. హైన్యమున్=హీనత్వమును. పొరయుచున్=పొందుచును. శోషించి=సారముచెడినదై. దైన్యంబుతోన్=దీనత్వముతో. హరిమ్రోలన్=కృష్ణునియెదుట. నిలువంగలేక = నిలువఁజాలక. హాహానినాదంబులన్=హాహా అనుధ్వనులతో. పఱచెన్=పాఱిపోయెను.

తా॥ అంతేగాక ఆనరకాసురునిసేన బాణములచేత నఱకఁబడిన గుఱ్ఱములును, గదలచేత తలలు పగులఁగొట్టఁబడిన యేనుఁగులును, గొప్పదైన చక్రముచేత నఱకఁబడిన నడుములు కాళ్లు చేతులు మూఁపులు మొదలగు అవయవములును గల వీరభటులును గలదై, హీనస్థితిని బొంది నిస్సారమై దుఃఖముతో ఆకృష్ణునియెదుట నిలిచి పోరాడలేక పాఱిపోయెను అని తాత్పర్యము.

వ॥ అప్పుడు.

౧౮౦.—ఆ॥ మొనసి దనుజయోధ ✻ ముఖ్యులు నిగుడించు । శస్త్రసముదయములు ✻ జనవరేణ్య
మురహరుండు వరుస ✻ మూఁడేసి కోలల । ఖండితంబు చేసెఁ ✻ గదనమందు.

టీ॥ జనవరేణ్య=రాజా. కదనమందున్=యుద్ధమునందు. మురహరుండు=కృష్ణుఁడు. మొనసి = పూని. దనుజయోధముఖ్యులు=రాక్షసభటశ్రేష్ఠులు. నిగుడించు = ప్రయోగించునట్టి. శస్త్రసముదయములు—శస్త్ర=బాణములయొక్క. సముదయములు=సమూహములను. వరుసన్=క్రమముగా. మూఁడేసికోలలన్ = మూఁడు మూఁడుబాణములచేత. ఖండితంబుచేసెన్ = తునుకఁగొట్టెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! యుద్ధమునందు రాక్షసులు పూనికతో ప్రయోగించునట్టి బాణసమూహములనన్నిటిని శ్రీకృష్ణమూర్తి క్రమముగా ఏఆయాసమును లేక ఒక్కొకసారి ప్రయోగింపఁబడ్డవానిని మూఁడేసిబాణములచేత నఱికి తునుకలుచేయసాగెనని తా.

౧౮౧.—క॥ వెన్నుని సత్యను మోచుచుఁ । బన్నుగఁ బదనఖరచంచు ✻ పక్షాహతులన్
భిన్నములుసేసె గరుడుఁడు । పన్నిన గజసముదయములఁ ✻ బౌరవముఖ్యా.

టీ॥ పౌరవముఖ్యా = పూరువంశశ్రేష్ఠుఁడవైన పరీక్షిన్మహారాజా. గరుడుఁడు=గరుత్మంతుఁడును. వెన్నునిన్ = కృష్ణునిని. సత్యను=సత్యభామను. మోచుచున్=మోయుచును. పన్నుగన్=ఒప్పిదముగా—తగునట్టు. పద...హతులన్—పదనఖర=కాలిగోళ్లయొక్కయు. చంచు = ముక్కుయొక్కయు. పక్ష = తెక్కలయొక్కయు. ఆహతులన్ = గీఱుట పొడుచుట కొట్టుటలచేతను. పన్నిన=యుద్ధమునకుసిద్ధమయివచ్చిన. గజసముదయములన్=ఏనుఁగులగుంపులను. భిన్నములు చేసెన్ = ఛేదింపఁబడినవానిఁగాఁ జేసెను—అడఁగఁగొట్టెననుట.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! గరుత్మంతుఁడును కృష్ణుని సత్యభామను మోచుకొని, తనకుతగిన కొలఁదిని కాలిగోళ్లచేత గీఱియు, ముక్కుతో పొడిచియు, తెక్కలతో మోదియు, యుద్ధమునకు సిద్ధపఱిచి తేఁబడిన యేనుఁగులనెల్లను అణఁగఁ గొట్టెను అని తా.

౧౮౨.—వ॥ మఱియు విహగరాజపక్షవిక్షేపణ సంజాతవాతంబును సైరింపంజాలక హతశేషంబైన సైన్యంబు పురంబు సొచ్చుటఁ జూచి నరకాసురుండు మున్ను వజ్రాయుధంబుం దిరస్కరించిన దనచేతిశక్తిం గొని గరుడునివైచె నతండును విరులదండ ప్రేటునఁజలింపని మదోద్దండంబగు వేదండంబునుంబోలె విలసిల్లెనయ్యవసరంబున గజారూఢుండై కలహారంగంబున.

టీ॥ (మఱియును) విహగ...వాతంబుఁ—విహగరాజ = పక్షిరాజైన గరుత్మంతునియొక్క. పక్ష=ఱెక్కలయొక్క. విక్షేపణ = ఆడించుటచేత. సంజాత=పుట్టిన. వాతంబుఁ=గాలిని. సైరింపంజాలక=సహింపలేక. హతశేషంబైనసైన్యంబు = చావఁగామిగిలినదండు. పురంబుసొచ్చుటఁ = పట్టణమునందు చొరఁబడుటను. (చూచి నరకాసురుండు) మున్ను=మునుపు. వజ్రాయుధంబుఁ = ఇంద్రునివజ్రాయుధమును. తిరస్కరించిన = అలక్ష్యముచేసిన. తనచేతిశక్తిఁ=తనచేతనున్న శక్తియను ఆయుధమును. కొని=పూని. గరుఁడునిపైచెఁ=గరుత్మంతునిమీఁదవేసెను. అతండును = ఆగరుత్మంతుఁడును. విరులదండవ్రేటునఁ=పూలదండపెట్టుచేత. (చలింపని) మదోద్దండంబు = మదముచేతనిక్కినది. అగువేదండంబునుంబోలెఁ = అగునట్టి ఏనుఁగువలెనే. విలసిల్లెఁ = ప్రకాశించెను. ఆయ్యవసరంబునఁ=ఆసమయమునందు. గజారూఢుండై=ఏనుఁగునెక్కినవాఁడై. కలహరంగంబునఁ=యుద్ధభూమియందు.

తా॥ పిమ్మట గరుత్మంతునిఱెక్కల కదలికవలనఁ బుట్టిన గాలికి సహింపలేక చావఁగా మిగిలినదండు పాఱిపోయి పట్టణమునందు ప్రవేశింపఁగాఁ జూచి నరకాసురుఁడు ముందు వజ్రాయుధమును మీఱుటకు సాధనమయిన శక్తియను ఆయుధమును గరుత్మంతుని మీఁద వేసెను, ఆశక్తిదెబ్బకు గరుత్మంతుఁడు చలింపక పూలదండవ్రేటున చలింపని మదపుఏనుఁగువలెనే ప్రకాశించెను, అంతట నరకాసురుఁడు ఏనుఁగునెక్కినవాఁడై యుద్ధభూమియందు కృష్ణుని ఎదిరించెనని తాత్పర్యము.

నరకాసురుఁడు.







(❋) నరకాసురుఁడు శ్రీకృష్ణమూర్తిచేతఁ జచ్చుట. (❋)

౧౮౩.—మ॥ సమదేభేంద్రమునెక్కి భూమిసుతుఁడా ❋ చక్రాయుధున్వైవ శూ
లముఁ జేఁబట్టిన నంతలోన రుచి మా ❋ లాభిన్న ఘోరాసురో
త్తమ చక్రంబగు చేతిచక్రమున దై ❋ త్యధ్వంసి ఖండించె ర
త్నమయోదగ్ర వినూత్నకుండల సమే ❋ తంబైన తన్మూర్ధముఁ.

టీ॥ భూమిసుతుఁడు=భూదేవికొడుకైన నరకాసురుఁడు. సమదేభేంద్రముఁ=మదముతోఁగూడుకొన్న శ్రేష్ఠమయినయేనుఁగును. (ఎక్కి) ఆచక్రాయుధుఁ=ఆకృష్ణమూర్తిని. వైవఁ = కొట్టుటకు. శూలముఁ=మూడుమొనలుగల ఆయుధమును. చేఁబట్టినఁ=చేతఁబట్టుకొనఁగా. అంతలోనఁ=ఆలోపలనే. రుచిమాలా...చక్రంబు—రుచి=కాంతులయొక్క. మాలా = పఙ్క్తులచేత. అభిన్న=వేఱుపడని. ఘోర=భయంకరులయిన. అసురోత్తమ=రాక్షసశ్రేష్ఠులయొక్క. చక్రంబు = సమూహముగలది. అగుచేతిచక్రమునఁ = అగునట్టి తనచేతనున్నచక్రముతో. దైత్యధ్వంసి = రాక్షసులను చెఱుచువాఁడైనకృష్ణుఁడు. రత్న...సమేతంబు—రత్నమయ=మణివికారమైన. ఉదగ్ర=శ్రేష్ఠమైన. వినూత్న=క్రొత్తదైన—అపురూపమయిన. కుండల=చెవిపోఁగులతోడ. సమేతంబు=కూడుకొన్నది. ఐనతన్మూర్ధముఁ = అయినట్టివానితలను. ఖండించెఁ=నఱికెను.

తా॥ అట్లు నరకాసురుఁడు మదపుఏనుఁగుపైనెక్కివచ్చికృష్ణునిపై ప్రయోగించుటకై శూలాయుధమును చేతపట్టుకొనెను, అంతలోపలనే కృష్ణుఁడు ఎల్లరాక్షసుల సమూహములయొక్క తలలను నఱికినదైన తనచక్రముచేత రత్నములుచెక్కిన కుండలములచేత వెలుఁగుచున్నచెవులతోడినరకాసురునితలను నఱికెనని తాత్పర్యము.

౧౮౪.—శా॥ ఇల్లాలం గిటియైన కాలమున ము ❋ న్నేనంచు ఘోషింతు వో
తల్లీ నిన్నుఁ దలంచియైన నిచటఁ ❋ నన్నుం గృపం గావకే
చెల్లంబో తలఁద్రెంచెనంచు నిల నా ❋ క్షేపించు చందంబునం
ద్రెళ్లెం జప్పుడుగాఁగ భూమిసుతుఁ డు ❋ ద్దీప్తాహవ క్షోణిపై.

టీ॥ (ఓతల్లీ) మున్ను=మునుపు. కిటియైనకాలమునన్=వరాహరూపమున నవతరించినప్పుడు. ఏన్=నేను. ఇల్లాలన్ = భార్యను. అంచున్=అని. ఘోషింతువు = చాటించిచెప్పుచుందువు. నిన్నుఁదలంచిరయైనన్ = భార్యవైననిన్నుఁ గూర్చియైనను. ఇచటన్ = ఈసమయమునందు. (నన్ను) కృపన్=దయతో. కావకే=కాపాడకయే. (తలఁ ద్రెంచెను) చెల్లఁబో = అయ్యో. అంచున్ = అని. ఇలన్=భూమిని. ఆక్షేపించుచందంబునన్ = ఇట్లు చేయవచ్చునాయని ఆక్షేపించురీతిగా. చప్పుడుగాఁగన్ = ధ్వనికలుగునట్టుగా. భూమిసుతుఁడు = భూదేవికొడుకైననరకాసురుఁడు. ఉద్దీప్తాహవక్షోణిపైన్=ప్రకాశించుచున్నయుద్ధభూమిమీఁద. త్రెళ్లెన్=పడెను.

తా॥ ఓయమ్మా! నీవు కృష్ణుఁడు వరాహావతారమెత్తినప్పుడు నీకు పెనిమిటియయ్యెనని చాటించి చెప్పుచుందువు, అట్లుండఁగా నీయందలి మొగమోటముచేతనైనను ఇప్పుడు నన్ను కాపాడక తల తెగనఱకెను, అయ్యో? యీయన్యాయమెక్కడనైనఁగలదాయని భూదేవిని ఆక్షేపించుచున్నాఁడేమో అనునట్లు అధికమయిన ధ్వనితో నరకాసురుఁడు నేలఁగూలెనని తాత్పర్యము.

౧౮౫.—క॥ కంటిమి నరకుఁడు వడఁగా । మంటిమి నేడనుచు వెస న * మర్త్యులు మునులున్
మింటం బువ్వులు గురియుచుఁ । బంటింపక పొగడి రోలిఁ * బద్మ దళాక్షున్.

టీ॥ అమర్త్యులు=దేవతలును. మునులును=ఋషులును. నేడు=ఈదినము. నరకుఁడువడఁగా = నరకాసురుఁడు చచ్చి నేలఁగూలఁగా. కంటిమి = చూచితిమి. మంటిమి = ఇఁక బ్రతికితిమి. అనుచున్=అని. మింటన్=ఆకాశమునందు. వెసన్=వేగముగా. (పువ్వులు) కురియుచున్=కురియించుచును. ఓలిన్=క్రమముగా. పద్మదళాక్షున్=కృష్ణుని. పంటింపక = సంకోచింపక. (పొగడిరి)

తా॥ అప్పుడు దేవతలును ఋషులును నేడుగదా నరకాసురుఁడు నేలఁగూలఁగాఁ జూచునంతటిభాగ్యమును పొందితిమి, ఇఁక నెమ్మదిగా బ్రతుకఁగలము అని ఆకాశమునందుండి పువ్వుల వానకురియించుచు శ్రీకృష్ణమూర్తిని క్రమముగా స్తోత్రముచేసిరని తా.

### విశేషార్థము.

టీ॥ నరకుఁడు = మమ్మును సంసారసముద్రమునముంచి అధోగతిపాలుచేయునట్టి జీవాహంకారుఁడు. నేడు = బహుకాలమునుండి వేదాంతశాస్త్ర శ్రవణమనననిదిధ్యాసములుచేయఁగా నేటికాలమునకు. పడఁగాన్=నశింపఁగా. (కంటిమి)మంటిమి=మేమందఱమును మోక్షసుఖమునుజెంది బ్రతికితిమి. మింటన్=హృదయాకాశమునందు. పువ్వులు = మహావాక్యములనెడు పుష్పములను. కురియుచున్=ఎడతెగకపలుకుచు. పద్మదళాక్షున్=హృదయకమలమునందేదృష్టిగల బ్రహ్మవిద్వరిష్ఠుఁడైనకృష్ణుని. అమర్త్యులు మునులును=బ్రహ్మవేత్తలు. (పొగడిరి)

### (*) భూదేవి శ్రీకృష్ణుని స్తుతించుట. (*)






వ॥ అంతట భూదేవి వాసుదేవుని డగ్గఱనేతెంచి జాంబూనద రత్నమండితంబులైన కుండలంబులును, వైజయంతియను వనమాలయును, వరుణదత్తంబైన సితచ్ఛత్రంబు నొక్క మహారత్నంబును సమర్పించి మ్రొక్కి భక్తితాత్పర్యంబులతోడం గరకమలంబులుముకుళించి విబుధవందితుండును, విశ్వేశ్వరుండునునైన దేవదేవుని నిట్లని వినుతించె.

టీ॥ అంతటన్ = పిమ్మట. (భూదేవి) వాసుదేవునిడగ్గఱన్ = కృష్ణునిదగ్గఱఁగా. ఏతెంచి=వచ్చి. జాంబూ...బులు=బంగారుచేతను రత్నములచేతను అలంకరింపఁబడినవి. ఐనకుండలంబులును=ఐనట్టికర్ణభూషణములును. (వైజయంతి) అను వనమాలయున్ = అనుపేరుగల తులసిపువ్వులుచేర్చికట్టిన తోమాలయు. వరుణదత్తంబు=వరుణునిచే నియ్యఁబడినది. (అయిన)సితచ్ఛత్రంబును=తెల్లగొడుగును. ఒక్కమహారత్నంబున్=ఒకగొప్పరత్నమును(సమర్పించి)మ్రొక్కి=నమస్కరించి. భక్తితాత్పర్యంబులతోడన్=భక్తియుతత్పరత్వమునుగలుగుటతోడ కరకమలంబులు = తామరలవంటిచేతులను. ముకుళించి = మోడ్చి. విబుధవందితుండును = దేవతలచేతఁ గొనియాడఁబడువాఁడును. విశ్వేశ్వరుండును=సర్వము నేలినవాఁడును. (ఐన) దేవదేవునిన్= దేవతలకు దేవుఁడైనకృష్ణుని. (ఇట్లని) వినుతించెన్ = పొగడెను.

తా॥ అటుపిమ్మట భూదేవి స్త్రీరూపముతో శ్రీకృష్ణమూర్తియొద్దకువచ్చి రత్నములు పొదిఁగి బంగారుచేతఁ జేయఁబడి అందగిల్లుచున్న అదితిచెవికమ్మలను, వైజయంతి అనుపేరుగలతోమాలను, వరుణునిచేత నియ్యఁబడిన తెల్లగొడుగును, మఱియొక గొప్పరత్నమును తెచ్చియిచ్చి భక్తియు తత్పరత్వమునుగలదై దేవతలచేతకొనియాడఁబడువాఁడును, ప్రపంచమునకు నీశ్వరుఁడును, దేవతలకును దేవుఁడునైన శ్రీకృష్ణమూర్తికి నమస్కరించి యిట్లు పొగడెననితా.

౧౮౩ —సీ॥ అంభోజ నాభున ✱ కంభోజ నేత్రున - కంభోజనిలయా స ✱ మన్వితునకు
నంభోజ పదున క ✱ నంతశ క్తికి వాసు - దేవునకును దేవ ✱ దేవునకును
భక్తులు గోరిన ✱ భంగి నేరూపైనఁ - బొందువానికి నాది ✱ పురుషునకును
నఖిల నిదానమై ✱ యాపూర్ణ విజ్ఞాన - మైన వానికిఁ బర ✱ మాత్మునకును

ఆ॥ ధాతఁ గన్న మేటి ✱ తండ్రికి నజునకు । నీకు వందనంబు ✱ లేనొనర్తు
నిఖిలభూతరూప ✱ నిరుపమ యీశ ప । రాపరాత్మమహిత ✱ యమితచరిత.

టీ॥ నిఖిలభూతరూప=సమస్తజీవస్వరూపుఁడవును. నిరుపమ=పోలిక లేనివాఁడవును. పరాపరాత్మమహిత = పరాప్రకృతియు అపరాప్రకృతియు స్వరూపముగాఁ గలిగిన ఘనుఁడవును. అమితచరిత = మేరలేని నడవడ్లు గలవాఁడవునైన. ఈశ = ఓస్వామీ. అంభోజనాభునకున్=జగత్సృష్టికారణుఁడైన బ్రహ్మపుట్టినట్టికమలము నాభియందుఁ గలవాఁడవును. (అజస్యనాభావధ్యేకమర్పితం) అనిశ్రుతి. లేక, చతుర్దశభువనాత్మకమయినకమలము నాభియందు గలవాఁడవును. లేక, హృదయకమలకర్ణికయందు వసించువాఁడవును. అంభోజనేత్రునకున్ = కమలములవంటి కన్నులు గలవాఁడవును. అంభోజ...సమన్వితునకున్ — అంభోజనిలయా=లక్ష్మీదేవితోడ. సమన్వితునకున్=కూడుకొన్నవాఁడవును. అంభోజపదునకున్ = కమలములవంటి పాదములుగలవాఁడవును. అనంతశక్తికిన్=సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వభోక్తృత్వ సర్వనియంతృత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వపాలకత్వ సర్వసంహారకత్వాది శక్తులు గలవాఁడవును. వాసుదేవునకున్=ప్రపంచమునులోపలనుంచుకొని ప్రపంచమందెల్లయెడలను వసించువాఁడవును. శ్లో॥ వాసనాద్వాసుదేవస్య వాసితంతేజగత్త్రయం । సర్వభూతనివాసోసి వాసుదేవ నమోస్తుతే॥ అని. దేవదేవునకున్=దేవతలకు ప్రభువైనవాఁడవును. భక్తులు=సేవకులు. కోరినభంగిన్ = అపేక్షించినచొప్పున. ఏరూపైనన్=జలచరస్థలచరమానవాదిరూపములలో నేరూపమునైనను. పొందువానికిన్ = పొందునట్టివాఁడవును. ఆదిపురుషునకున్ = ప్రపంచసృష్టికి ముందున్నపురుషుఁడవును. అఖిలనిదానమై = సర్వమునకు ఆదికారణమయి. ఆపూర్ణవిజ్ఞానము=అంతటనిండినఅఖండజ్ఞానము. అయినవానికిన్=అయినట్టివాఁడవును. పరమాత్మునకున్=పరబ్రహ్మమయినవాఁడవును. ధాతన్=బ్రహ్మను. కన్న = కనిన. మేటితండ్రికిన్=గొప్పవాఁడైనతండ్రివియు. అజునకున్ = పుట్టుకలేనివాఁడవునైన. లేక, బ్రహ్మవిష్ణు రుద్రస్వరూపుఁడవైన. నీకున్=నీకొఱకు. వందనంబులు = నమస్కారములను. ఏన్ = నేను. ఒనర్తున్=చేయుదును.

తా॥ సకలజీవస్వరూపుఁడును, పోలికచేయఁదగినయితరవస్తువు లేనివాఁడును, పరాపర స్వరూపముగల ఘనుఁడును, మితిలేని చర్యలుగలవాఁడునునైన ఓస్వామీ! బొడ్డునందు తామరగలవాఁడును, తామరలవంటి కన్నులుగలవాఁడును, లక్ష్మీదేవితోఁగూడుకొన్నవాఁడును, తామరలవంటి పాదములు గలవాఁడును, మితిలేని సర్వజ్ఞత్వాది శక్తులు గలవాఁడును, ప్రపంచమునందు నిండుకొనియుండియు తనయందు ప్రపంచము నెల్లను ఉంచుకొని యుండువాఁడును, దేవతలకు సైతము దేవుఁడైనవాఁడును, సేవకులు కోరినచొప్పున ఏరూపమునైనపొంది కాపాడువాఁడును, ప్రపంచసృష్టికి మొదటనుండిన మహాపురుషుఁడును, సమస్తమునకు మూలకారణమైనవాఁడును, సర్వవ్యాపకమైన అఖండజ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడును, పరబ్రహ్మమును, బ్రహ్మనుకన్నతండ్రియును, పుట్టుకలేనివాఁడునైన నీకొఱకు నమస్కారము నేనుచేయుదును అనితా.

వ॥ దేవా నీవు లోకంబులుసృజియించుటకు రజోగుణంబును, రక్షించుటకు సత్వగుణంబును, సంహారించుటకుఁ దమోగుణంబును, ధరియింతువు. కాలమూర్తివి, ప్రధానపూరుషుండవు, పరుండవు నీవ, నేనును వారియు వహ్నియు ననిలుండు నాకాశ భూతతన్మాత్రలు నింద్రియంబులును దేవతలును మనంబును గర్తయును మహత్తత్వంబును జరాచరంబైన విశ్వంబు నద్వితీయుండవైన నీయందు సంభవింతుము.

టీ॥ దేవా=స్వామీ. (నీవు) లోకంబులు = విషయేంద్రియాధిదేవతామయములైనత్రిలోకములను. సృజియించుటకున్=పుట్టించుటకు. రజోగుణంబును=ఘోరవృత్తిగల రజోగుణమును. రక్షించుటకున్=పెంచుటకు. సత్వగుణంబును = శాంతవృత్తిగలసత్వగుణమును. సంహరించుటకున్=చంపుటకు. తమోగుణంబును=మూఢవృత్తిగలతమోగుణమును. ధరియింతువు=తాల్తువు. కాలమూర్తివి=నిమేషాది ప్రకృతిప్రళయాంతమయిన కాలమే స్వరూపముగాఁగలవాఁడవును. ప్రధానపూరుషుండవు=ప్రకృతియును, జీవుఁడును, రూపముగాఁ గలవాఁడవును. పరుండవు=కాలప్రధాన పురుషులకు వ్యతిరిక్తమయిన పరబ్రహ్మవును. నీవ = నీవే. నేనును = భూమియు. వారియు=జలమును. వహ్నియు=నిప్పును. అనిలుండును=గాలియు. ఆకాశభూతతన్మాత్రలును=ఆకాశమును శబ్దస్పర్శ రూపరస గంధములును. ఇంద్రియంబులును=నేత్రముశ్రోత్రము మొదలగునింద్రియములు పదియును. దేవతలును = ఇంద్రియాధిదేవతలును. మనంబును=మనస్సును. కర్తయును=అహంకారమును. మహత్తత్వంబును=బుద్ధియు. చరాచరంబైనవిశ్వంబును = చరములును (తిరుగునవియును) అచరములును (ఉన్నతావునుండి కదలనేరనివియునుఅయిన ప్రాణులుగలదైనప్రపంచమును) అద్వితీయుండవు = రెండవది లేనివాఁడవు. అయిననీయందున్=అయినట్టినీయందే. సంభవింతుము=పుట్టుదుము. (జగద్విలక్షణంబ్రహ్మ బ్రహ్మణోన్యంనకించన)

తా॥ స్వామీ! నీవు త్రిలోకములను సృజించుటకు రజోగుణముగల చతుర్ముఖబ్రహ్మరూపమును, కాపాడుటకు సత్వగుణముగల

విష్ణుస్వరూపమును, నశింపఁజేయుటకు తమోగుణముగల రుద్ర స్వరూపమును, ధరింతువు, కాలస్వరూపుఁడవును, ప్రకృతి జీవ స్వరూపుఁడవును, కాల ప్రకృతి జీవ విలక్షణమైన పరమాత్మవును, నీవే, భూమి మొదలుగాఁగల పంచభూతములును, భూతతన్మాత్రములైన శబ్దస్పర్శాదులును, దశేంద్రియములును, ఇంద్రియాధిదేవతలును,మనస్సును, అహంకారమును, బుద్ధియును,చరములును, అచరములునైన ప్రాణులతోఁగూడిన యీప్రపంచమును, ఒక్కఁడవైన నీయందే పుట్టుదుమ అని భూదేవి పలికెనని తాత్పర్యము.

౧౮౯.—చ॥ దయ నిటుచూడు మానరక * దైత్యుని బిడ్డఁడు వీఁడు నీదెసన్
భయమున నున్నవాఁడు గడు * బాలుఁ డనన్యశరణ్యుఁ డార్తుఁ డా
శ్రయ రహితుండు తండ్రిక్రియ * శౌర్యము నేరఁడు నీపదాంబుజ
ద్వయిఁ బొడగాంచె భక్తపర * తంత్ర సువీక్షణ దీనరక్షకా.

టీ॥ భక్తపరతంత్ర=అనన్యభక్తిగలసేవకులకు లోఁబడిన నడవడిగలవాఁడా. సువీక్షణ=సమరసదృష్టిగలవాఁడా. దీనరక్షకా= దీనులగువారిని రక్షించువాఁడా. దయన్ = దయతో. ఇటుచూడుము=ఈతట్టుచూడుము.వీఁడు=ఈచిన్నవాఁడు. ఆనరకదైత్యుని బిడ్డఁడు = ఆనరకాసురునికొడుకు. నీదెసన్ = నీయెడ. భయమునన్=భయముతో. ఉన్నవాఁడు=ఉన్నాఁడు. కడుబాలుఁడు= మిక్కిలి పసివాఁడు. అనన్యశరణ్యుఁడు = నీకంటె ఇతరులు రక్షకులు లేనివాఁడు. ఆర్తుఁడు = పీడితుఁడు. ఆశ్రయరహితుండు = ప్రాపులేనివాఁడు. తండ్రిక్రియన్ = తనతండ్రియైన నరకునివలె. శౌర్యము=శూరత్వము. నేరఁడు=నేర్చినవాఁడుకాఁడు. నీపదాంబుజద్వయిన్=నీపాదకమలములజంటను. పొడగాంచెన్=పొందెను.

తా॥ భక్తులకువశమయినవాఁడును,మంచిచూపుగలవాఁడును, దీనులను రక్షించువాఁడును నైన ఓస్వామీ ! దయతో నాతట్టు చూడుము, ఈచిన్నవాఁడు నీతో ఎదిరించి చచ్చిన నరకాసురుని కొడుకు,వీఁడు నీయెడ చాలభయము కలిగియున్నాఁడు,మిగులపసివాఁడు, వీనికి నీకంటె ఇతరులు రక్షకులులేరు, చాల దుఃఖమునొంది యున్నాఁడు, ప్రాపులేనివాఁడైన వీఁడు తండ్రివలె శూరత్వమును చూపవచ్చువాఁడుకానేరఁడు, నీపాదములనే ఆశ్రయించినాఁడు, వీనిని రక్షించుభారము నీదే అనియెనని తాత్పర్యము.

వ॥ అనియిట్లుభూదేవి భక్తితోడహరికినమస్కరించి వాక్కుసుమంబులఁబూజించిననర్చితుండై భక్తవత్సలుండైనపర
మేశ్వరుండునరకపుత్రుండైనభగదత్తునకభయంబిచ్చి సర్వసంపదలొసంగినరకాసురగృహంబుఁబ్రవేశించియందు

టీ॥ (అనియిట్లుభూదేవి) భక్తితోడన్ = అనన్యభక్తిగలదై. హరికిన్=కృష్ణమూర్తికి. నమస్కరించి = మ్రొక్కి. వాక్కుసుమంబులన్=మాటలనెడుపువ్వులచేత. పూజించినన్=పూజచేయఁగా. అర్చితుండై=పూజింపఁబడినవాఁడై.భక్తవత్సలుండు=భక్తులయందు ప్రేమగలవాఁడు.అయినపరమేశ్వరుండు=అయినట్టిశ్రీకృష్ణమూర్తి. నరకపుత్రుండైన=నరకాసురునికొడుకైన. (భగదత్తునకు) అభయంబిచ్చి = భయములేదన్నమాటయిచ్చి. సర్వసంపదలు = ఎల్లకలుములు. ఒసంగి = ఇచ్చి. నరకాసురగృహంబున్ = నరకాసురుని యింటియందు. ప్రవేశించి = చొచ్చి. అందున్ = ఆయింటిలో.

తా॥ అని యీవిధముగా భూదేవి భక్తిపూర్వకముగా శ్రీకృష్ణమూర్తికి మ్రొక్కి మాటలనెడు పువ్వులచేత పూజింప అనఁగా, పొగడఁగా, కృష్ణుఁడు పూజింపఁబడినవాఁడై, భక్తులయందు ప్రేమగలవాఁడుకాఁబట్టి నరకునికొడుకైన భగదత్తునికి భయములేదన్న మాటయిచ్చి, అష్టయిశ్వర్యములును ఇచ్చి, నరకాసురునియింటిలో ప్రవేశించి, ఆయింటిలోపలి భాగమందు పదియాఱువేలకన్యకలను జూచెనని తాత్పర్యము.

౧౯౧.—ఉ॥ రాజకులావతంసుఁడు ప * రాజితకంసుఁడు సొచ్చి కాంచె ఘో
రాజుల రాజులన్ బటుశ * రాహతి నొంచి ధరాతనూజుఁ డు
త్తేజిత శక్తిఁ దొల్లి చెఱఁ * దెచ్చినవారిఁ బదాఱువేల ధా
త్రీజన మాన్యలన్ గుణవ * తీ వ్రత ధన్యల రాజ కన్యలన్.

టీ॥ రాజకులావతంసుఁడు=చంద్రవంశశ్రేష్ఠుఁడైనవాఁడును. పరాజితకంసుఁడు = ఓడఁగొట్టఁబడిన కంసుఁడుగలవాఁడు — కంసునిజంపినవాఁడైనశ్రీకృష్ణుఁడు. చొచ్చి = లోపలప్రవేశించి. ఘోరాజులన్ = భయంకరయుద్ధములయందు. రాజులన్=రాజులనెల్లను. పటుశరాహతిన్=బటువైనబాణములపెట్టుచేత. నొంచి= నొప్పించి. ధరాతనూజుఁడు = నరకాసురుఁడు. ఉత్తేజితశక్తిన్= మెఱయుచున్న బలముచేత. తొల్లి = పూర్వము. చెఱఁదెచ్చిన వారిన్ = చెఱఁబట్టి తీసికొనివచ్చినవారిని, పదాఱువేలన్ = పదియాఱువేలమందియైన. ధాత్రీజనమాన్యలన్ = భూమి జనులచేత గౌరవింపఁదగినవారును. గుణవతీవ్రతధన్యలన్=మంచిగుణముగల స్త్రీలయొక్క వ్రతమునందు కృతార్థులైనవారునైన. రాజకన్యలన్= రాచకొమార్తలను. కాంచెన్=చూచెను.

తా॥ చంద్రవంశశ్రేష్ఠుఁడునుకంసునిఁజంపినవాఁడునైనశ్రీకృష్ణమూర్తి నరకాసురునియింటిలో ప్రవేశించి నరకాసురుఁడు తన పరాక్రమముచేత భయంకరయుద్ధములయందు రాజులనుజయించి చెఱఁబట్టి తీసికొనివచ్చిన మంచిగుణములచేత గౌరవింపఁదగినవారును, భూమిలోని జనులు మెచ్చుకోఁదగిన మంచి నడవడిగలవారునైన పదియాఱువేలమంది రాచకొమార్తలను చూచెనని తా.

౧౯౨.—మ॥ కనిరా రాజకుమారికల్ పరిమళ * త్కౌతూహలాక్రాంతలై
దనుజాధీశ చమూవిదారు నతమం * దారుఁ శుభాకారు నూ
తనశృంగారు వికారదూరు సుగుణా * ధారుఁ మృగీలోచనా
జన చేతోధనచోరు రత్నమకుట * స్ఫారుఁ మనోహారునిఁ.

టీ॥ ఆరాజకుమారికలు=ఆరాచకొమార్తలు. పరిమళత్కౌతూహలాక్రాంతలై — పరిమళత్ = పరిమళించుచున్న. కౌతూహల=పేడుకచేత. ఆక్రాంతలై = చుట్టుకోఁబడినవారై. దనుజాధీశచమూవిదారుఁ—దనుజాధీశ=రాక్షసరాజులయొక్క. చమూ=సేనలయొక్క. విదారుఁ = భేదించుటకలవానిని. నతమందారుఁ = మ్రొక్కినవారికి కల్పవృక్షమైనవానిని. శుభాకారుఁ=అందమయిన ఆకారముగలవానిని. నూతనశృంగారుఁ = క్రొత్తసింగారముగలవానిని. వికారదూరుఁ=షడ్భావవికారములకు దూరమైనవానిని. సుగుణాధారుఁ = మంచిగుణములకు ఆధారమయినవానిని. మృగీలోచనా...చోరుఁ—మృగీలోచనా=లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీలయిన. జన=జనసమూహముయొక్క. చేతః=మనస్సులనెడు. ధన = పైకమునకు. చోరుఁ = దొంగయైనవానిని. రత్నమకుటస్ఫారుఁ = రత్నములు పొదిఁగినకిరీటముచేత ప్రకాశించువానిని. మనోహారునిఁ=మనోజ్ఞుఁడైనవానిని. కనిరి=చూచిరి.

తా॥ ఆనరకాసురునియింట చెఱలోనున్న రాచకొమార్తలు అత్యంతమయిన కుతూహలముతో రాక్షసులమూఁకలను చంపువాఁడును, తన్ను సేవించువారికి కోరినకోరిక లిచ్చువాఁడును, అందమయిన ఆకారముగలవాఁడును, క్రొత్తసింగారము గలవాఁడును, షడ్భావవికారములు లేనివాఁడును,మంచిగుణములకు ఉనికిపట్టయినవాఁడును, స్త్రీలమనసులనెడు ధనములను దొంగవలె అపహరించువాఁడును, రత్నమయమైన కిరీటముచేత వెలుఁగుచున్నవాఁడును, మిక్కిలి మనోజ్ఞుఁడయినవాఁడునైన శ్రీకృష్ణమూర్తిని జూచిరనితా.

వ॥ కని యతనిసౌందర్య గాంభీర్య చాతుర్యాది గుణంబులకు మోహించి తమకంబులు జనియింప ధైర్యంబులు సాలించి సిగ్గులు వర్జించి పంచశర సంచలిత హృదయలై దైవయోగంబునఁ బరాయత్తంబులైన చిత్తంబులనమ్మత్తకాశినులుదత్తరంబున మనోజుఁడు త్తలపెట్ట నతండు తమకుఁ బ్రాణవల్లభుండనివరియించి.

టీ॥ కని=చూచి. అతని...గుణంబులకుఁ—అతని = ఆకృష్ణుని యొక్క. సౌందర్య=చక్కఁదనము. గాంభీర్య=చలింపనిస్వభావము. చాతుర్య=నేర్పరితనము. ఆది=మొదలగు.గుణంబులకుఁ= మంచిగుణములకు. (మోహించి) తమకంబులు=త్వరపాటులు. జనియింపఁ=పుట్టఁగా. ధైర్యంబులు=తాలుములు. చాలించి=విడిచి. (సిగ్గులు) వర్జించి=వదలి. పంచశరసంచలితహృదయలై=మన్మథుని బాణములచేత కలఁతనొందిన మనసులుగలవారై. దైవయోగంబునఁ=దైవాధీనతచేత. పరాయత్తంబులు=పరవశములు—స్వాధీనత తప్పినవి. అయినచిత్తంబులఁ=అయినట్టిమనసులతో. అమ్మత్తకాశినులు=ఆవిలాసవతులైనస్త్రీలు. తత్తఱంబునఁ = తొట్రుపాటుతో.మనోజుఁడు=మన్మథుఁడు. ఉత్తలపెట్టఁ=దుఃఖపెట్టఁగా. అతండు=ఆకృష్ణమూర్తి. (తమకు) ప్రాణవల్లభుండు = ప్రాణమువలె ప్రియమయినభర్త. (అని) వరియించి=కోరి.

తా॥ అట్లా రాజకన్యకలందఱు కృష్ణునిఁ జూచి అతనివైన చక్కఁదనము గొప్ప అభిప్రాయముతోడిస్వభావము నేర్పరితనము, మొదలైనమంచిగుణములకుమచ్చికపుట్టినవారై అనురాగములుఅతిశయింపఁగా ధైర్యములు లేనివారై సిగ్గులుమాని మన్మథునిబాణములవలని బాధ తాళలేక దైవయత్నముచేత స్వాధీనతతప్పిన మనసులతో మన్మథుఁడు వేగిరపాటుతో తమ్ము బాధించుచుండఁగాను శ్రీకృష్ణమూర్తినివారందఱును ప్రియభర్తగాకోరిరి అనితాత్పర్యము.

౧౯౪.—ఉ॥ పాపపురక్కసుండు చెఱఁ * బట్టెనటంచుఁ దలంతు మెప్పుడుఁ
బాపుఁడె వానిధర్మువునఁ * బద్మదళాక్షునిఁ గంటిమంచు ము
న్నీపురుషోత్తముం గదియ * నేమివ్రతంబులు చేసినారమో
యాపరమేష్ఠి పుణ్యుఁడు గ * దమ్మ హరిన్మముఁ గూర్చె నిచ్చటన్.

టీ॥ పాపపురక్కసుండు = పాపియైనరాక్షసుఁడు. చెఱఁబట్టెన్=చెఱఁబట్టితెచ్చెను. అటంచున్ = అని. ఎప్పుడున్=ఎల్లప్పుడు. తలంతుము = మనము ఎంచుకొనుచుందుము. పాపుఁడె = వాఁడుపాపాత్ముఁడా. వానిధర్మువునన్ = వానిపుణ్యముచేత — వాఁడిట్లు తెచ్చి చెఱలోఁబెట్టినందున. పద్మదళాక్షునిన్=కృష్ణుని. కంటిమి = చూచితిమి. అంచున్ = అనియనుకొనుచు. మున్ను = మునుపు—పూర్వజన్మమునందు. ఈపురుషోత్తమున్ = పురుషులలో శ్రేష్ఠుఁడయినయీకృష్ణమూర్తిని.కదియన్=కూడుటకు.ఏమివ్రతంబులు=ఏయేనోములను. చేసినారమో=నోచినామో. ఆపరమేష్ఠి=ప్రసిద్ధుఁడైన ఆబ్రహ్మ. పుణ్యుఁడుగదమ్మ=పుణ్యపురుషుఁడుగదా. (కనుకనే) హరిన్=కృష్ణుని. మమున్ = మమ్మును. ఇచ్చటన్ = ఇక్కడ.(కూర్చెను) అనుకొనుచుండిరి అనుమాటయధ్యాహార్యము.

తా॥ ఓయమ్మా ! మనలను పాపాత్ముఁడైన రాక్షసుఁడు చెఱఁబట్టి తెచ్చి యిచ్చటనుంచెనేయని నరకాసురుని ఎల్లప్పుడు తిట్టుచుంటిమి వాఁడు పాపాత్ముఁడా? వానిపుణ్యముననేగదా ఈమహాపురుషుని ఇప్పుడు చూచితిమి,ఈమహానుభావునికూడుటకు మనము పూర్వజన్మమునందు ఎటువంటినోములు నోచినామో, ఇదిగాకసృష్టికర్తయైనబ్రహ్మ యెంతపుణ్యాత్ముఁడో చూడుఁడు, ఇచ్చటశ్రీకృష్ణమూర్తితో మమ్మును గూర్చినాడు అని తమలోతాము అనుకొనుచుండిరని తాత్పర్యము.

౧౯౫.—క॥ ఉన్నతి నీతఁడు కౌఁగిట । మన్నింపం గనినబ్రతుకు * మానిని మనలో
మున్నేమి నోమునోచెనొ । సన్నుతమార్గముల విపిన * జలదుర్గములన్.

టీ॥ మనలోన్ = మనయిందఱిలోను. ఉన్నతిన్ = గౌరవముతో. ఈతఁడు=ఈకృష్ణమూర్తి. కౌఁగిటన్=కౌఁగిటియందు. మన్నింపన్=సన్మానింప. కనినబ్రతుకుమానిని=పొందినట్టిజీవనముగలమానవతి. మున్ను=పూర్వజన్మమునందు. సన్నుతమార్గములన్=పొగడఁబడిన మంచిమార్గములచేత. విపినజలదుర్గములన్ = చొరరాని అడవిప్రదేశములందును జలప్రదేశములందును. ఏమినోము నోచెనో=ఏలాటివ్రతములుచేసెనో.

తా॥ ఓచెలియా ! మనలోపల ఈకృష్ణమూర్తి గౌరవముతో మన్నించి కౌఁగిటఁజేర్పఁగా జీవింపఁగల పుణ్యాత్మురాలు పూర్వజన్మమునందు చొరరాని అరణ్యప్రదేశములందును జలప్రదేశములందును ఎటువంటి కష్టతరములైనవ్రతములు చేసెనోయని తలఁచిరి అనఁగా, ఈయనచేత ఆలింగనము చేయఁబడి మన్నింపఁబడునట్టి భాగ్యము మనలోఏధన్యురాలికిఅబ్బునోఅది పూర్వజన్మమునమిక్కిలి శ్రమపడి అనేకవ్రతములుచేసి యుండునని తలఁపవలసినదని తా.

౧౯౬.—క॥ విన్నారమె యీచెలువముఁ । గన్నారమె యిట్టిశౌర్య * గాంభీర్యంబుల్
మన్నార మింతగాలము । గొన్నారమె యెన్నఁడైనఁ * గూరిమిఁజిక్కన్.

టీ॥ ఇంతకాలము=ఇన్నాళ్లు. మన్నారము=బ్రతికినాము. ఎన్నఁడైనన్=ఎప్పుడైనను. ఈచెలువమున్=ఈయనయందుఁగలచక్కఁదనమువంటి చక్కఁదనమును. విన్నారమె = ఎవరియందైనఁ గలదనఁగా మనమువిన్నామా. ఇట్టిశౌర్యగాంభీర్యంబులు=ఇటువంటి శూరత్వమును గంభీరత్వమును. కన్నారమె = మనము ఎవరియందైనను చూచినామా. కూరిమి=స్నేహము. చిక్కన్ = లభింపఁగా. కొన్నారమె = ఇట్టివానివలన పొందినామా — లేదనిభావము.

తా॥ ఓసఖీ! మనము ఇంతకాలము బ్రతికినాము, ఎప్పుడైనను ఎక్కడనైనను ఇటువంటి చక్కఁదనముగలవాఁడు కలఁడనఁగా వినియుందుమా? ఇటువంటి శూరత్వమును గొప్పతనమును గలవారి నెవరినైనచూచియుందుమా? ఇట్టివానిస్నేహమునుసంపాదించుకొనియుందుమా? ఇందు ఏదియుమన మెఱుఁగముగదాయనితాత్పర్యము.

౧౯౭.—సీ॥ వనజదళాక్షి నే * వైజయంతికనైనఁ - గదిసి వ్రేలుదుఁ గదా * కంధరమున
బింబోష్ఠి నేఘన * పీతాంబరమునైన - మెఱసియుండుదుఁగదా * మేనినిండఁ
గాంతాలలామ నేఁ * గౌస్తుభమణినైన - నొప్పఁజూపుదుఁగదా * యురమునందు
బాలికాతిలక నేఁ * బాంచజన్యమునైన - మొనసిచొక్కుదుఁగదా * మోవిఁగ్రోలి

ఆ॥ పద్మగంధి నేను * బర్హదామమునైనఁ । జిత్రరుచులనుందు * శిరమునందు
ననుచుఁ బెక్కుగతుల * నాడిరి కన్యలు । గములుగట్టి గరుడ * గమనుఁజూచి.

టీ॥ కన్యలు = ఆరాచకొమార్తలు. గములుగట్టి = గుంపులుగూడి. గరుడగమనున్=శ్రీకృష్ణుని. చూచి=చూచినవారై. వనజదళాక్షి = తామరరేకులవంటి కన్నులుగల ఓచిన్నదానా. నేన్= నేను. వైజయంతికనైనన్=వైజయంతియనుహారమైనపక్షమున. కంధరమునన్=మెడయందు. కదిసి=చేరి. వ్రేలుదుఁగదా = వ్రేలాడుదునుగదా. బింబోష్ఠి=దొండపండువంటిపెదవిగలదానా. (నేను) ఘనపీతాంబరమునైనన్=శ్రేష్ఠమైన పచ్చపట్టువస్త్రమునైనయెడ. మేనినిండన్=దేహమునిండుకొనునట్లు. మెఱసి=ప్రకాశించి(ఉండుదుఁగదా) కాంతాలలామ=శ్రేష్ఠురాలవైనకామినీ. నేన్=నేను. కౌస్తుభమణినైనన్=కౌస్తుభమణివైనపక్షమున. ఉరమునందున్=ఱొమ్మునందు. ఒప్పన్=మనోజ్ఞతను. చూపుదుఁగదా=కనఁబఱతునుగదా. బాలికాతిలక = శ్రేష్ఠురాలైన ఓచిన్నదానా. నేన్ = నేను. పాంచజన్యమునైనన్=పాంచజన్యమనెడుశంఖమునైనయెడ. మోవి=అధరామృతమును. గ్రోలి=త్రాగి. మొనసి=అతిశయించి. చొక్కుదుఁగదా=పరవశత్వమునుపొందుదునుగదా. పద్మగంధి= కమలపరిమళమువంటి దేహపరిమళముగల ఓచిన్నదానా. (నేను) బర్హదామమునైనన్ = నెమలియీఁకలదండనైనయెడ. శిరమునందున్ = తలలో. చిత్రరుచులన్ = పలువన్నెకాంతులచేత. (ఉందును) అనుచున్=అని. పెక్కుగతులన్=బహువిధములుగా. ఆడిరి=ఒకరితోనొకరు చెప్పుకొనిరి.

తా॥ అప్పుడు ఆరాజకన్యకలందఱు గుంపులుగూడి శ్రీకృష్ణమూర్తినిజూచి ఆయనయందలి మోహావేశముచేత నేను వైజయంతీమాలగా పుట్టియున్నయెడల ఎడతెగక యీమోహనాంగుని మెడయందు వ్రేలాడుచుందునుగదా, నేను పీతాంబరముగాఁబుట్టియున్నయెడ ఈపురుషశ్రేష్ఠుని దేహమంతయు నావరించుకొని ప్రకాశించుచుందునుగదా, నేను కౌస్తుభమణినై పుట్టియున్నయెడ ఈయందగాని ఱొమ్మునందు తళతళ మెఱయుచుందునుగదా, నేను పాంచజన్యమను శంఖమునై పుట్టియున్నయెడ ఈసుందరుని అధరపానము చేసి చొక్కుచుందునుగదా, నేను నెమలియీఁకలదండనై పుట్టియున్నపక్షమున ఈసొగసుకానితలయందు పలువన్నెలుగలిగిప్రకాశించుచుందునుగదా, అనియీవిధముగా ఒకరితో నొకరు తమతమ కోరికలు చెప్పుకోసాగిరి అని తాత్పర్యము.

శా॥ భూనాథోత్తమకన్యకల్వరుసనం * భోజాతనేత్రుండున । న్నేనవ్వొద్దఁగఁజూచెడగ్గఱియెవ * ర్ణించెన్వివేకించెస
న్మానించెంగరుణించెఁ బేరడిగెస * న్మార్గంబుతోఁ బెండ్లియా । నేనేచక్రికిదేవినంచుఁదమలో * నిర్ణీతలైరందఱున్.

టీ॥ భూనాథోత్తమ=ఓరాజశ్రేష్ఠుఁడా. కన్యకలు=ఆకన్యలు. (భూనాథోత్తమకన్యకలు అని యేకపదముగాను గ్రహింపవచ్చును) వరుసన్=క్రమముగా. అంభోజాతనేత్రుండు=కృష్ణమూర్తి. నన్నే నవ్వెన్ = నన్నేపరిహాసముచేసెను. తగన్ = యుక్తముగా. (చూచెను) డగ్గఱియెన్=సమీపించెను. వర్ణించెన్=రూపవిచారము చేసెను. వివేకించెన్ = చక్కఁగా తెలిసికొనెను. సన్మానించెన్ = మన్నించెను. కరుణించెన్=దయచేసెను. పేరడిగెన్=నీపేరేమని అడిగెను. సన్మార్గంబుతోన్ = క్రమమైనరీతితో. పెండ్లియాడెన్= పెండ్లాడును. (నేనే) చక్రికిన్=కృష్ణునికి. దేవిని = పట్టాభిషిక్తురాలైనభార్యను. అంచున్=అని. (అందఱును) తమలోన్=తమలోఁదాము. నిర్ణీతలైరి=నిర్ణయించుకోఁబడినవారలయిరి.

తా॥ ఓరాజా! ఆపదియాఱువేలకన్యకలును క్రమముగా తమలోతాము కృష్ణుఁడు నన్నే పరిహసించెను, నన్నే చక్కఁగాఁజూచెను, నాదగ్గఱికే వచ్చెను, నారూపమును జూచియే వర్ణనచేసెను, నావిషయమునే చక్కగాఁ దెలిసికొనెను, నన్నే మన్నించెను, నాయందే దయ కనఁబఱిచెను, నాపేరే అడిగెను, క్రమముగా నన్నే పెండ్లాడును, నేనే ఈకృష్ణమూర్తికి పట్టపురాణినగుదును అని నిశ్చయించుకొని సంతోషించిరి అని తాత్పర్యము.

## (*) శ్రీకృష్ణమూర్తి దేవలోకమునుండి పారిజాతము దెచ్చుట. (*)



౧౮౮.—వ॥ అని బహువిధంబులం దమతమ మన్ననలకు నువ్విళ్లూరు కన్నియలం బదాఱువేల ధవళాంబరాభరణ మాల్యానులేపనంబుల నొసంగి యందలంబులనిడి వారలను నరకాసుర భాండాగారంబులంగల నానావిధంబులైన మహాధనంబులను, రథంబులను, దురంగంబులను, ధవళంబులై వేగవంతంబులై యైరావతకుల సంభవంబులైన చతుర్దంత దంతావళంబులను, ద్వారకానగరంబునకుం బనిచి దేవేంద్రుని పురంబునకుం జని యదితిదేవి మందిరంబు సొచ్చి యాపెద్దమ్మకు ముద్దుసూపి మణికిరణపటల పరిభావిత భానుమండలంబులైన కుండలంబులొసంగి శచీసమేతుండైన మహేంద్రునిచేత సత్యభామతోడం బూజితుండై పిదప సత్యభామ గోరిన నందనవనంబు సొచ్చి.

టీ॥ (అని) బహువిధంబులన్ = అనేకవిధములుగా. తమతమ మన్ననలకున్=కృష్ణునివలనఁగలుగఁబోవు తమతమసన్మానములకు. ఉవ్విళ్లూరు=వేడుకపడుచున్న. కన్నియలన్=కన్యకలను. పదాఱువేలన్=పదియాఱువేలమందిని. ధవళాం... లేపనంబులన్ — ధవళాంబర=తెల్లకోకలను. ఆభరణ=సొమ్ములను. మాల్య = పూవుదండలను. అనులేపనంబులన్=పూఁతలను. ఒసంగి=ఇచ్చి. అందలంబులన్=ఉయ్యాలపల్లకులయందు. ఇడి=కూర్చుండఁబెట్టి. (వారలను) నరకాసుర భాండాగారంబులన్ = నరకాసురుని బొక్కసములయందు. కల=కలిగిన. (నానావిధంబులైన) మహాధనంబులను= అధిక ధనములను. రథంబులను=తేరులను. తురంగంబులను=గుఱ్ఱములను. ధవళంబులై=తెల్లనివై. వేగవంతంబులై=వడిగలవై. ఐరావతకులసంభవంబులైన = ఐరావతమను ఇంద్రునియేనుఁగువంశమునందుఁబుట్టినవైన. చతుర్దంతదంతావళంబులను = నాలుగుకొమ్ములయేనుఁగులను. ద్వారకానగరంబునకున్=ద్వారకాపట్టణమునకు. పనిచి=పంపి. దేవేంద్రునిపురంబునకున్=అమరావతీపట్టణమునకు. చని=పోయి. అదితిదేవిమందిరంబు = అదితిదేవియొక్కయింటిని. చొచ్చి=ప్రవేశించి. ఆపెద్దమ్మకున్=వృద్ధురాలయిన ఆతల్లికి. ముద్దుసూపి=తనమనోజ్ఞపునడతను కనఁబఱిచి. మణి...భానుమండలంబులైన—మణికిరణ=రత్నకాంతులయొక్క. పటల = సమూహములచేత. పరిభావిత=భంగపెట్టఁబడిన. భానుమండలంబులైన=సూర్యబింబములుగలవైన. కుండలంబులు=కమ్మలను. ఒసంగి=ఇచ్చి. శచీసమేతుండైన = శచీదేవితోఁ గూడుకొన్నవాఁడైన. మహేంద్రునిచేతన్=దేవేంద్రునిచేత. (సత్యభామతోడ) పూజితుండై=పూజింపఁబడినవాఁడై. పిదపన్=పిమ్మట. (సత్యభామ కోరిన) నందనవనంబు= నందనమను దేవేంద్రుని ఉద్యానవనమునందు. చొచ్చి=ప్రవేశించి.

తా॥ అని నానావిధముల కృష్ణునివలన తాముపొందఁగలసన్మానములకు వేడుకపడుచున్న పదియాఱువేల రాచకన్యలను జూచి కృష్ణమూర్తి తెల్లకోకలు సొమ్ములు పూలదండలు గంధపుపూఁతలు మొదలగువాని ఇచ్చి ఉయ్యాలపల్లకీలయందుఁ గూర్చుండఁబెట్టి నరకాసురుని బొక్కసమునందుఁ గల నానావిధద్రవ్యములను రథములను గుఱ్ఱములను ఐరావత సంతతియందుఁబుట్టిన నాలుగుకొమ్ముల తెల్లయేనుఁగులను వారితోడ ద్వారకాపట్టణమునకుఁబంపి తాను దేవేంద్రునిపట్టణమునకుఁ బోయి అతనితల్లియైన అదితిదేవి యిల్లుచొచ్చి ఆమెకు తన వినోదచర్యలెల్లఁ జూపి సంతోషపెట్టి రత్నకాంతులచేత సూర్యమండలమును తిరస్కరించుచున్న కమ్మలనిచ్చి శచీదేవితోఁ గూడుకొన్న యింద్రునిచేత సత్యభామతోఁ గూడ పూజింపఁబడినవాఁడై తరువాత సత్యభామ అపేక్షింపఁగా యింద్రుని యుద్యానవనమయిన నందనమునందుప్రవేశించియనిభా.

మ॥ హరి కేలన్ పెకలించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టె సుందరగంధానుగత భ్రమద్భ్రమర నాదవ్రాతమున్ పల్లవాంకుర శాఖాఫల పర్ణ పుష్ప కలికాగుచ్ఛాదికోపేతము। న్నిరతిశయ ఖ్యాతముఁ బారిజాతముఁ ద్రిలోకీయాచకాఖ్యాతమున్.

టీ॥ హరి=కృష్ణుఁడు. సుందర...వ్రాతముక్=సుందర=మనోజ్ఞమైన. గంధ=వాసనను. అనుగత=అనుసరించిపొందఁబడినవియై. భ్రమత్=తిరుగుచున్న. భ్రమర=తుమ్మెదలయొక్క. నాద=ధ్వనులయొక్క. వ్రాతముక్=సమూహముగలదియు. పల్ల...పేతముక్—పల్లవ=చిగుళ్లయొక్క. అంకుర=మొలకలతోడి. శాఖా=కొమ్మలతోడను. ఫల=పండ్లు. పర్ణ = ఆకులు. పుష్ప=పువ్వులు. కలిక=మొగ్గలు. (వీనియొక్క) గుచ్ఛ = గుత్తులు. ఆదిక = మొదలగువానితోడ. ఉపేతముక్=కూడుకొన్నదియు. గిరిభిత్త్రాతముక్=ఇంద్రునిచేతకాపాడఁబడునదియు. త్రిలోకీ...తముక్—త్రిలోకీ=మూడులోకములక్షమదాయము. యాచక=యాచకులుగాఁగలదియను. ఆఖ్యాతముక్=ప్రసిద్ధిగలదియునైన. పారిజాతముక్=పారిజాతవృక్షమును. కేలక్=చేతితో. పెకలించి=పెల్లగించి. తెచ్చి=తీసికొనివచ్చి. భుజగేంద్రారాతిపైక్=గరుత్మంతునిమీఁద. (పెట్టెను)

తా॥ శ్రీకృష్ణమూర్తి మనోజ్ఞమైనవాసనను అనుసరించి పొందఁబడినవై మెలఁగుచున్న తుమ్మెదలగొదలును, చిగుళ్లచేత నిండుకొన్న కొమ్మలును, పండ్లును, ఆకులును, పుష్పములయు మొగ్గలయు గుత్తులును కలిగి ఇంద్రునిచేత రక్షింపఁబడుచు మూడులోకములవారికోరికల నిచ్చునదియనెడు ప్రసిద్ధినివహించిన పారిజాతవృక్షమును పెల్లగించి తెచ్చి గరుత్మంతునిమీఁదఁ బెట్టెనని తాత్పర్యము.

౨౦౧.—వ॥ ఇట్లు పారిజాతమ్ము హరియించి యదువల్లభుండు వల్లభయుం
దానును విహగవల్లభారూఢుండయి చనుచున్న సమయంబున.

టీ॥(ఇట్లుపారిజాతమ్ముహరియించి)యదువల్లభుండు=కృష్ణుఁడు వల్లభయుక్=ప్రియురాలైనసత్యభామయు (తానును)విహగవల్లభారూఢుండై=గరుత్మంతునిపైనెక్కి. (చనుచున్నసమయంబున)

తా॥ ఈవిధముగా కృష్ణుఁడు పారిజాతవృక్షమును అపహరించుకొని తనప్రియురాలైనసత్యభామతోఁగూడ గరుడవాహనము నెక్కి పోవుచుండఁగానని తాత్పర్యము.

౨౦౨.—సీ॥ నరకాసురునిబాధ * నలఁగిగోవిందుని - కడకేగి తత్పాద * కమలములకుఁ
దనకిరీటము సోఁక * దండప్రణామముల్ - గావింప నాచక్రి * కరుణచేసి
చనుదెంచి భూసుతు * సమయించి తనవారిఁ - దన్నురక్షించుటఁ * దలఁపకేదను
యింద్రుండు బృందార * కేంద్రత్వ మదమునఁ - బద్మలోచన పోకు * పారిజాత

ఆ॥ తరువు విడువుమనుచుఁ * దాఁకె నడ్డమువచ్చి । తఱిమిసురలునట్లు * దాఁకిరకట
యెఱుక వలదె నిర్జ * రేంద్రత గాల్పనే । సురల తామసమును * జూడ నరిది.

టీ॥ (ఇంద్రుండు) నరకాసురునిబాధక్ = నరకాసురునివలని బాధచేత. నలఁగి=పీడితుఁడై. గోవిందునికడకుక్=కృష్ణునొద్దకు. ఏగి=పోయి. తత్పాదకమలములకుక్=కమలములవంటియతనిపాదములకు. (తనకిరీటము) సోఁకక్ = తాఁకునట్టుగా. దండప్రణామములు = సాగిలఁబడి మ్రొక్కుటలను. కావింపక్ = చేయఁగా. ఆచక్రి=ఆకృష్ణుఁడు. కరుణచేసి=దయచేసి. చనుదెంచి = వచ్చి. భూసుతుక్=నరకాసురుని. సమయించి=చంపి. తనవారిక్=తనపక్షమువారైనదేవతలను. (తన్నును) రక్షించుటక్=కాపాడుటను. ఎదక్=మనస్సునందు. తలఁపక=ఎంచక. బృందారకేంద్రత్వమదమునక్=దేవతలరాజను అను క్రొవ్వుచేత. పద్మలోచన = కృష్ణా. (పోకుము) పారిజాతతరువుక్=పారిజాతవృక్షమును. (విడువుము) అనుచుక్=అని. అడ్డమువచ్చి=కృష్ణునికిఅడ్డముగావచ్చి. తాఁకెక్=ఎదిరించెను. సురలును=దేవతలును. అట్లు=ఆవిధముగా. తఱిమి=కవిసి. తాఁకిరి=ఎదిరించిరి. అకట=అయ్యో. ఎఱుకవలదె=జ్ఞానము అక్కఱలేదా—కృతజ్ఞత ఉండవలదాయనుట. నిర్జరేంద్రత = దేవరాజత్వము. కాల్పనే=తగులఁబెట్టనా. సురలతామసముక్=దేవతలఅజ్ఞానమును. చూడక్=విచారింపఁగా. అరిది=ఆశ్చర్యము.

తా॥ శ్రీకృష్ణమూర్తి పారిజాతమును ఎత్తుకొని బయలుదేఱఁగానే ఇంద్రుఁడు తనకు నరకాసురునివల్లనైన బాధను పోఁగొట్టి తనవారిని తన్నుకాపాడినవాఁడు అను జ్ఞాపకము కొంచెమయినలేక తాను నరకునివలనఁబడిన బాధలు చెప్పుకొని కృష్ణునిపాదములకు సాగిలఁబడి మ్రొక్కుటలోనగు విషయములన్ని మఱచి తాను దేవతలకెల్ల రాజు అనుక్రొవ్వుచేత కన్నుగానక కృష్ణా! కల్పవృక్షమును తీసికొనిపోఁబోకుము నిలువుము అని తఱుముకొనిపోయి అడ్డగించి యెదిరించెను తక్కిన దేవతలును అతనివెంటనే పోయి ఆక్రమించుకొనిరి దేవేంద్రుఁడు అయినమాత్రముననేమి నెనరు కొంచెమయిన అక్కఱలేదా అతఁడొకవేళ రాజ్యమదముచేత అట్లు ఎదిరింపఁబోయినను తక్కినదేవతలకైన వివేకము కలిగియుండరాదా? ఇట్టివారిచర్య చూడఁగా మిక్కిలి దుఃఖకరమును ఆశ్చర్యకరమునైయున్నదియని తాత్పర్యము.

వ॥ ఇట్లు తనకు నోడ్డారించి యడ్డంబువచ్చిన నిర్జరేంద్రాదుల నిర్జించి తనపురంబునకుం జని నిరంతర
సురభికుసుమ మకరంద మాధురీ విశేషంబులకుం జొక్కి చిక్కక నాకలోకంబుననుండి వెంట
నరుగుదెంచు తుమ్మెదలకు నెమ్మిదలంచుచున్న పారిజాతము నాశ్రితపారిజాతుండైన హరి మహా
ప్రేమాభిరామయగు సత్యభామతోఁగ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి నరకాసురునియింటం
దెచ్చిన రాజకన్యలెందఱు అందఱకు నన్నినివాసంబులు గల్పించి గృహోపకరణంబులు సమర్పించి.

టీ॥ (ఇట్లు) ఒడ్డారించి=ఎదిరించి. (తనకు అడ్డంబువచ్చిన) నిర్జరేంద్రాదులన్=దేవేంద్రుఁడు మొదలగువారిని. నిర్జించి=జయించి. తనపురంబునకున్=తనపట్టణమునకు. చని=పోయి. నిరంతర... విశేషంబులకున్—నిరంతర=ఎల్లప్పుడు. సురభి=మంచివాసనగల. కుసుమ = పుష్పములయొక్క. మకరంద = తేనెయొక్క. మాధురీ=తియ్యఁదనముయొక్క. విశేషంబులకున్=అతిశయములకు. చొక్కి=పరవశములయి. చిక్కక = ఉన్నతావుననే చిక్కులపడియుండక. నాకలోకంబుననుండి=స్వర్గలోకమునందుండి. వెంటన్=వెంబడిని. అరుగుదెంచుతుమ్మెదలకున్ = వచ్చునట్టితుమ్మెదలకు. నెమ్మి = మేలును. తలంచుచున్న=ఎంచుచున్న. పారిజాతమున్=కల్పవృక్షమును. ఆశ్రితపారిజాతుండైనహరి=ఆశ్రయించినవారికికల్పవృక్షమువంటివాఁడైన శ్రీకృష్ణమూర్తి. మహాప్రేమాభిరామ=అధికమయిన ప్రేమచేత ఒప్పినది. అగుసత్యభామతోన్ = అగునట్టి సత్యభామతోడ. క్రీడించుమహోద్యానంబునన్=విహరించునట్టిశృంగారపుఁదోఁటయందు. సంస్థాపించి=నాటి. (నరకాసురునియింటందెచ్చిన రాజకన్యలు) ఎందఱు=ఎందఱో. అందఱకున్=అంతమందికి. అన్నినివాసంబులు=అన్నియునికిపట్లు. కల్పించి=కలుగఁజేసి. గృహోపకరణంబులు=ఇంటికికావలసిన సాధనములను. సమర్పించి=ఇచ్చి.

తా॥ ఈవిధముగా తన్ను అడ్డగించి యెదిరించిన యింద్రుఁడు మొదలగువారినందఱిని యుద్ధమునందు ఓడఁగొట్టి శ్రీకృష్ణమూర్తి తనపట్టణమునకుఁ బోయిచేరి ఎడతెగని పరిమళముచేత ఒప్పునట్టి పూవులయందలి తేనెల తియ్యఁదనమునకు, చొక్కి యెప్పటితావుననే చిక్కులఁబడియుండక దేవలోకమునుండి వెంబడించివచ్చు తుమ్మెదలకు మేలుదలఁచునట్టిదైన పారిజాతవృక్షమును యాచకుల పాలిటి పారిజాతవృక్షమయిన శ్రీకృష్ణమూర్తి తనకు అత్యంతప్రియురాలైన సత్యభామయు తానును గూడి విహరించునట్టి శృంగారపుఁదోఁటయందు నాటి నరకాసురుని యింటినుండి తీసికొనివచ్చిన రాచకొమార్తలు ఎందఱో అందఱకును అన్నియిండ్లుకట్టించియిచ్చి వారివారికి కావలసిన యింటికొఱముట్లును కలుగఁజేసినవాఁడై అని తాత్పర్యము.

౨౦౪.—చ॥ అమితవిహారుఁ డీశ్వరుఁ డ * నంతుఁడు దానొకనాఁడు మంచి ల
గ్నమునఁ బదాఱు వేల భవ * నంబులలోనఁ బదాఱు వేల రూ
పములఁ బదాఱు వేల నృప * బాలలఁ బ్రీతిఁ బదాఱు వేల చం
దముల విభూతినొందుచు య * థావిధితో వరియించె భూవరా.

టీ॥ భూవరా = రాజా. అమితవిహారుఁడు = మితిలేనివినోదసంచారములుగలవాఁడును. ఈశ్వరుఁడు=సర్వనియామకుఁడును. అనంతుండు=తుదిలేనివాఁడునైన శ్రీకృష్ణమూర్తి. తాన్ = తాను. (ఒకనాఁడు) మంచిలగ్నమునన్=శుభముహూర్తమునందు. పదాఱువేలభవనంబులలోనన్=పదియాఱువేలయిండ్లలోను. పదాఱువేలరూపములన్ = పదియాఱువేల ఆకారములతో. పదాఱువేలనృపబాలలన్=పదియాఱువేల రాచకొమార్తలను. ప్రీతిన్=ప్రేమతో. పదాఱువేలచందములన్=పదియాఱువేలవిధములచేత. విభూతిన్=కలిమిని—భోగమనుట. ఒందుచున్=పొందుచు. యథావిధితోన్=శాస్త్రమునందుచెప్పఁబడినక్రమమున. వరియించెన్=పెండ్లాడెను.

తా॥ ఓరాజా! బహువిధవినోదములచేత మెలఁగువాఁడును, సర్వనియామకుఁడును, నశింపనివాఁడునైన శ్రీకృష్ణమూర్తి ఒకనాఁడు మంచిముహూర్తమునందు పదియాఱువేల యిండ్లలోనుండెడు పదియాఱువేల రాచకొమార్తలను పదియాఱువేలరూపములతో పదియాఱువేలరీతుల భోగములువెలయ శాస్త్రమునందు చెప్పఁబడినక్రమమున అతిప్రీతితో పెండ్లాడెనని తాత్పర్యము.

౨౦౫.—ఉ॥ దానములందు సమ్మద వి * ధానములం దవలోకభాషణా
హ్వానములందు నొక్కక్రియ * నాలలితాంగుల కన్నిమూర్తులై
తాననిశంబు గానఁబడి * తక్కువ యెక్కువ లేక యుత్తమ
జ్ఞానగృహస్థ ధర్మమునఁ * జక్రి రమించెఁ బ్రపూర్ణకాముఁడై.

టీ॥ దానములందున్=ఇష్టవస్తువులనిచ్చుటలయందును. సమ్మదవిధానములందున్=సంతోషకృత్యములందును. అవలోకభాషణాహ్వానములందున్—అవలోక=చూపులందును. భాషణ=మాటలయందును. ఆహ్వానములందున్=పిలుచుటలయందును. ఒక్కక్రియన్=ఒకవిధముగానే. ఆలలితాంగులకున్=ఆస్త్రీలకు. అన్నిమూర్తులయి=అన్నిరూపములనుపొందినవాఁడై. తాన్=తాను. అనిశంబు=ఎల్లప్పుడు. కానఁబడి=అగపడి. (తక్కువయెక్కువలేక) ఉత్తమజ్ఞానగృహస్థధర్మమునన్=మంచిజ్ఞానముగల గృహస్థుని నడవడిచేత. ప్రపూర్ణకాముఁడై=చక్కగానిండుకొన్నకోరికలుగలవాఁడై. చక్రి=శ్రీకృష్ణమూర్తి. రమించెన్=క్రీడించెను.

తా॥ అడిగిన వస్తువుల నిచ్చుటయందును, సంతోషకృత్యములందును, చూపులు మాటలు పిలుచుటలు మొదలగువానియందును ఒకవిధముగానడపుచు, ఆస్త్రీలకు అందఱకును అన్ని ఆకారములను పొంది ఎల్లప్పుడు ఒకరియందున్న ఎక్కువతక్కువలులేక మంచి తెలివిగల గృహస్థుని నడవడివంటి నడవడితోను చక్కగా నిండుకొన్నకోరికలు గలవాఁడై శ్రీకృష్ణమూర్తి క్రీడించెనని తాత్పర్యము.

౨౦౬.—క॥ తరుణులు పెక్కండ్రైనను । బురుషుఁడు మన లేఁడు సవతి * పోరాటమునన్
హరియా పదాఱు వేవురు । తరుణులతో సమతమని యెం * దక్షత్వమునన్.

టీ॥ తరుణులు=స్త్రీలు—భార్యలు. పెక్కండ్రైరనఁ=అనేకులై నను. సవతిపోరాటమునఁ=సవతులకలహములచేత. పురుషుఁడు=మగవాఁడు—పెనిమిటి. మనలేఁడు=బ్రతుకలేఁడు—నెమ్మదిగాఁ బ్రవర్తింపనేరఁడనుట. (హరి) దక్షత్వమునఁ = చాలినతనముతో. అపదాఱువేవురుతరుణులతోఁ = అపదియాఱువేలమంది స్త్రీలతోను. సమతఁ = ఎచ్చుతక్కువలు లేకుండ. మనియెఁ = వర్తించెను.

తా॥ అనేకులు భార్యలు గలవాఁడు వారిపరస్పరకలహముల చేత నెమ్మది నొందలేక అల్లాడుచుండును అట్లయ్యును శ్రీకృష్ణమూర్తి అపదియాఱువేలస్త్రీలతోను నేర్పుతో ఏకాంతయు లేక మెలఁగెనని తాత్పర్యము.

౨౦౭.—శా॥ ఎన్నేభంగుల యోగమార్గముల బ్ర * హ్మేంద్రాదు లీక్షించుచున్
మున్నే దేవునిఁ జూడఁ గానక తుదిన్ * మోహింతు రామేటికే
విన్నాణంబుననో సతుల్గృహిణులై * విఖ్యాతి సేవించి ర
చ్ఛిన్నాలోకన హాస భాషణ రతి * శ్లేషాను రాగంబులన్.

టీ॥ ఎన్నేభంగులయోగమార్గములన్ = ఎన్నోవిధములయిన యమ నియమాది యోగములచేత. బ్రహ్మేంద్రాదులు = బ్రహ్మ ఇంద్రుఁడు మొదలగువారును. ఈక్షించుచున్ = చూచుచును. మున్ను = మునుపు. (ఏదేవుని) చూడఁగానక = చూచునంతటి యదృష్టమునుపొందలేక. తుదిన్=కడపట. మోహింతురు=అజ్ఞానమునువహింతురో. ఆమేటికిన్=ఆగొప్పవానికి. ఏవిన్నాణంబుననో= ఏనేర్పుచేతనో. సతులు=అపదియాఱువేలరాచకొమార్తలు. గృహిణులై=భార్యలై. అచ్ఛిన్నా...రాగంబులన్—అచ్ఛిన్న=ఎడతెగని. ఆలోకన=చూపులచేతను. హాస=నవ్వులచేతను. భాషణ=మాటలచేతను. రతి=క్రీడలచేతను. శ్లేష=ఆలింగనములచేతను. అనురాగంబులన్=ప్రేమలచేతను. విఖ్యాతిన్=ప్రసిద్ధితో. సేవించిరి=కొలిచిరి.

తా॥ ఎన్నోవిధములయినయోగమార్గములచేతచూచియుబ్రహ్మ యింద్రుఁడు మొదలగువారు సయితము ఏదేవుని చూడలేక కడపట అజ్ఞానావరణములో చిక్కుకొని అల్లాడుచుందురో అటువంటిసర్వోత్కృష్టుఁడయిన శ్రీకృష్ణమూర్తికి ఏనేర్పుచేతనోభార్యలై ఎడతెగని చూపులు నవ్వులు మాటలు మెచ్చుకొనుటలు అనురాగములు అనువానిచేత ప్రసిద్ధివహించినవారై ఆకృష్ణమూర్తినిసేవించిరి అని తాత్పర్యము.

౨౦౮.—సీ॥ ఇంటికి వచ్చిన * నెదురేగుదెంచుచు - నానీతవస్తువు * లందు కొనుచు
సౌవర్ణ మణిమయా * సనములు వెట్టుచుఁ - బదములు గడుగుచు * భక్తితోడ
సంవాసితస్నాన * జలములందిచ్చుచు - సద్గంధ వస్త్రభూ * షణములొసఁగి
యిష్టపదార్థంబు * లిడుచుఁ దాంబూలాదు - లొసఁగుచు విసరుచు * నోజమెఱసి

తే॥ శిరముదువ్వుచు శయ్యపైఁ * జెలువుమిగుల । నడుగులొత్తుచు దాసీస * హస్రయుక్త
లయ్యుఁ గొలిచిరి దాసలై * హరి నుదారుఁ । దారకాధిప వదనలు * దారు దగిలి.

టీ॥ ఇంటికిన్=తమయింటి. (వచ్చినను) ఎదురేగుదెంచుచున్= ఎదురుగావచ్చుచును. ఆనీతవస్తువులు = అతనిచేత తేఁబడినవస్తువులను. అందుకొనుచున్=పుచ్చుకొనుచును. సౌవర్ణమణిమయాసనములు = బంగారుమయములు రత్నమయములు నైన పీఁటలు. పెట్టుచున్=వేయుచును. భక్తితోడన్ = పూజ్యానురాగముతో. పదములు=అడుగులను. (కడుగుచును) సంవాసితస్నానజలములు= వాసనగలస్నానమునకొఱకైననీళ్లను—స్నానమునకై పన్నీటిననుట. (అందిచ్చుచును) సద్గంధ...ణములు—సత్=మేలైన. గంధ=వాసనద్రవ్యములను. వస్త్ర=కోకలను. భూషణములు=ఆభరణములను. ఒసఁగి = ఇచ్చి. ఇష్టపదార్థంబులు = ఇష్టములయినవస్తువులను. ఇడుచున్=పెట్టుచును. తాంబూలాదులు=తాంబూలము మొదలగునవి. ఒసఁగుచున్=ఇచ్చుచు. విసరుచున్=వింజామరలువేయుచు. ఓజ=ఒప్పిదము. మెఱసి=ప్రకాశింపఁజేసి. శిరముదువ్వుచున్=తలదువ్వుచు. శయ్యపైన్=పఱుపుమీఁద. చెలువు=అందము. మిగులన్= అతిశయింపఁగా. అడుగులొత్తుచున్=కాళ్లుపిసుకుచు. దాసీసహస్రయుక్తలు = వేలకొలఁది ఊడిగపుస్త్రీలతోఁ గూడుకొన్నవారు. అయ్యున్=అయినను. దాసలై=దాసురాండ్రై. ఉదారున్=ఘనుఁడైన. హరిన్=కృష్ణుని. తారకాధిపవదనలు=చంద్రునివంటిముఖము గలవారు—స్త్రీలు. తారు=తాము. తగిలి = ఆసక్తలై. కొలిచిరి = సేవించిరి.

తా॥ అపదియాఱువేల రాచకన్యకలును కృష్ణుఁడు తమ యింటికివచ్చినప్పుడు ఎదురుగాపోయి ఆయన తెచ్చిన వస్తువులను తీసికొనుచును, ఆయనను బంగారుపీఁటలను రత్నాలపీఁటలను వేసి కూర్చుండఁబెట్టుచు, భక్తితోకాళ్లుగడిగి పన్నీటిని స్నానముచేయుటకై అందిచ్చుచు, మంచి వాసనద్రవ్యములను వస్త్రములను ఆభరణములను ఇచ్చి అలంకరించుకొనిచ్చి తాంబూలమిచ్చివింజామరలు వేయుచు, తలదువ్వుచు, పానుపునందుఁజేరి కాళ్లుపిసుకుచు, వేలకొలఁది ఊడిగపు స్త్రీలతోఁ గూడుకొన్నవారుగా నుండియు తామే ఆసక్తితో తమప్రియుఁడైనశ్రీకృష్ణమూర్తికి సేవచేయుచుండిరని తాత్పర్యము.

శా॥ నన్నేపాయఁడు రాత్రులన్దివముల * న్నన్నేకృపం జెన్నడిన్ । నన్నేదొడ్డుగఁజూచుపల్లభలలో * నాధుండు నాయింట నే
యున్నాఁడంచుఁబదాఱువేలుదమలో * మోహించి సేవించి రా । యన్నుల్గాఢపతివ్రతాత్వపరిచ * ర్యాభక్తియోగంబులన్

టీ॥ ఆయన్నులు=ఆస్త్రీలు. పదాఱువేలుర్=పదియాఱువేవు రును. తమలోన్ = తమమనసులలో. గాఢ...యోగంబులన్ — గాఢ=దృఢమయిన. పతివ్రతాత్వ=పతివ్రతాభావమువల్లనైన. పరిచర్య=పూజించుటయొక్కయు. భక్తి=సేవయొక్కయు. యోగంబులన్=కూడికలచేత. నాథుండు = ప్రియభర్తయైనకృష్ణమూర్తి. రాత్రులన్=రాత్రివేళలయందును. దివములన్ = పగటివేళలయందును. నన్నే పాయఁడు=నన్నుమాత్రమే యెడఁబాయకయుండును. నన్నే కృపం జెందెడిన్=దయతో నన్నుమాత్రమే పొందియుండును. వల్లభలలోన్ = ప్రియురాండ్రలోపల. నన్నే = నన్నుమాత్రమే. దొడ్డుగఁజూచున్=గొప్పగాఁజూచును(నాయింటనేయున్నాఁడు) అంచున్=అని. ఊహించి=తలఁచి. సేవించిరి=కొలిచిరి.

తా॥ ఆపదియాఱువేలమంది కన్యకలును తమలోఁదాము శ్రీకృష్ణుఁడు నన్నుతప్ప మఱియెవరినిచేరఁడు, మఱియొకరినిపొందఁడు, రేయుంబగలు నాయింటనేయుండును, నన్నుమాత్రమే తక్కిన ప్రియురాండ్రకంటె గొప్పగానెంచి మన్నించును అని తమయొక్క పరిచర్యావిశేషముచేతను, సేవావిశేషముచేతను తలఁచుకొని, సంతోషముతో సేవించుచుండిరని తాత్పర్యము.

౨౧౦.—క॥ ఆరామలతో నెప్పుడుఁ। బోరాములు చాల నెఱపి ✻ పురుషోత్తముఁడున్
గారామునఁ దిరిగెను సౌ। ధారామ లతా సరో వి ✻ హారముల నృపా.

టీ॥ నృపా=రాజా. పురుషోత్తముఁడును=శ్రీకృష్ణమూర్తియు. ఎప్పుడున్=ఎల్లప్పుడును. ఆరామలతోన్ = ఆపదియాఱువేవురు రాచకన్నెలతోను. పోరాములు=మిత్రత్వములు — స్నేహములు. చాలన్=మిక్కిలి. నెఱపి=వ్యాపింపఁజేసి. గారామునన్=గౌరవముతో. సౌధా...ములన్—సౌధ=మేడలలోను. ఆరామ=ఇంటిచేరువనుండెడి ఉద్యానవనములయందలి. లతా=తీఁగపందిళ్లలోను. సరః=కొలఁకులలోను. విహారములన్=విహరించుటలచేత(తిరిగెను)

తా॥ ఓరాజా! ఆశ్రీకృష్ణమూర్తియును ఆస్త్రీలతోఁ గూడి యెల్లప్పుడును మిక్కిలి ప్రియము కనఁబడ మేడలలోను, ఇంటి వెంబడి సింగారపు తోఁటలలోని తీఁగపందిళ్లలోను, వినోదములోను, గౌరవముతోను మెలఁగెను అని తాత్పర్యము.

౨౧౧.—క॥ ఏదేవుఁడు జగముల ను। త్పాదించును మనుచుఁ జెఱుచుఁ ✻ బ్రాభవమున మ
ర్యాదా రక్షణ మునకై। యాదేవుం డట్లు మెఱసె ✻ యాదవు లందున్.

టీ॥ (ఏదేవుఁడు) ప్రాభవమునన్ = ప్రభుత్వముతో. జగములన్=లోకములను. ఉత్పాదించును=పుట్టించునో. మనుచున్= రక్షించునో. చెఱుచున్ = లయమునొందించునో. (ఆదేవుండు) మర్యాదారక్షణమునకై=బ్రాహ్మణాదిజనుల ఆశ్రమాచారములను కాపాడుటకై. యాదవులందున్ = యదువంశమునఁబుట్టిన రాజులందు. అట్లు=అవిధముగా. మెఱసెన్=ప్రకాశించెను.

తా॥ ఏభగవంతుఁడు తనప్రభుత్వము కనఁబడ లోకములను బ్రహ్మరూపముచేత పుట్టింపను విష్ణురూపముచేత పెంపను రుద్రరూపముచేత చంపను జాలినవాఁడై వర్తించునో ఆభగవంతుఁడైన కృష్ణుఁడు యాదవులలోఁ బుట్టి లోకులు నడపవలసిన మర్యాదలను కనఁబఱచుటకై ఆపదియాఱువేలమంది కన్యకలతోను అవిధముగా వర్తించెనని తాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ ఏదేవుఁడు = స్వయంప్రకాశుఁడైన యేపరబ్రహ్మము. యాదవులందున్ = బ్రహ్మవేత్తలయందు. రాజకన్యలు = ప్రకాశమానములయిన ఇంద్రియములు. దాసీసహస్రములు = ఇంద్రియవృత్తులు. ఇండ్లు=శరీరములు.

వ॥ అంత నొక్కనాడు రుక్మిణీదేవి లోఁగిట మహేంద్ర నీల మరకతాది మణిస్తంభ వలభి విటంక పటల దేహళీ కవాట విరాజమానంబును, శాతకుంభ కుడ్య గవాక్ష వేదికా సోపానంబును, విలంబమాన ముక్తాఫలదామ విచిత్రకౌశేయ వితానంబును, వివిధ మణిదీపికావిసర విభ్రాజమానంబును, మధుకర కులకలిత మల్లికాకుసుమ మాలికాభిరామంబును, జాలకరంధ్ర నిర్గత కర్పూరాగరు ధూపధూపంబును, వాతాయనవిప్రకీర్ణ శిశిరకరకిరణ స్తోమంబును, పారిజాత ప్రసవామోద పరిమిళిత పవనసుందరంబునయినలోపలిమందిరంబునశరచ్చంద్రచంద్రికా ధవళపర్యంకమధ్యంబున జగదీశ్వరుండైనహరిసుఖాసీనుండయియుండసఖీజనంబులుం దానునుడగ్గఱికొలిచియుండె.

టీ॥ అంతన్ = అటుపిమ్మట. (ఒక్కనాడు) రుక్మిణీదేవిలోఁగిటన్ = రుక్మిణీదేవియింటిలో. మహేంద్ర...విరాజమానంబును— మహేంద్రనీల=ఇంద్రనీలమణులు. మరకతాది = పచ్చలుమొదలగు వానిచేతనైన. మణిస్తంభ = రత్నముల కూచములచేతను. వలభి= మంజూరులచేతను. విటంక = పావురాగూండ్లచేతను. పటల=పైకప్పులచేతను. దేహళీ=దారబంధములచేతను. కవాట = తలుపుల చేతను. విరాజమానంబును = ప్రకాశించుచున్నదియు. శాతకుంభ ...సోపానంబును—శాతకుంభ=బంగారువికారమయిన. కుడ్య= గోడలును. గవాక్ష=కిటికీలును. వేదికా = అరుఁగులును. సోపానంబును = మెట్లునుగలిగినదియు. విలంబమాన...వితానంబును — విలంబమాన=మిక్కిలివ్రేలుచున్న. ముక్తాఫలదామ=ముత్యాలసరములతోడి. విచిత్ర=నానావర్ణమైన. కౌశేయ = పట్టువస్త్రముల యొక్క. వితానంబును = మేలుకట్టుకలిగినదియు. వివిధ...మానంబును—వివిధ=నానావిధములయిన. మణి=రత్నములనెడు. దీపికా= దీపములయొక్క. విసర=సమూహములచేత. విభ్రాజమానంబును= వెలుఁగుచున్నదియు. మధుకర...రామంబును—మధుకర=తుమ్మెదల

యొక్క. కుల=సమూహములతోడ. కలిత=కూడుకొన్న. మల్లికా కుసుమ=మల్లెపువ్వులయొక్క. మాలికా=దండలచేత. అభిరామంబును=మనోహరమయినదియు. జాలక...ధూమంబును—జాలక=కిటికీలయొక్క. రంధ్ర=సందులనుండి. నిర్గత = బయలువెడలిన. కర్పూర=కర్పూరదీపముల యొక్కయు. అగరుధూప=అగరుచేతఁ జేయఁబడిన ధూపద్రవ్యములయొక్క. ధూమంబును=పొగలుగలిగినదియు. వాతాయన...స్తోమంబును—వాతాయన = కిటికీలనుండి. విప్రకీర్ణ=అంతటవ్యాపించిన. శిశిరకర=చంద్రునియొక్క. కిరణ=వెలుఁగులయొక్క. స్తోమంబును=సమూహములుగలిగినదియు. పారిజాత...సుందరంబును—పారిజాత=కల్పవృక్షమునందలి. ప్రసవ=పువ్వులయొక్క. ఆమోద=వాసనచేత. పరిమళిత = పరిమళించుచున్న. పవన = గాలిచేత. సుందరంబును = అందమయినదియు. (అయిన) లోపలిమందిరంబునన్ = లోపలిదైనయింటిలో. శరచ్చంద్ర...మధ్యంబునన్ — శరత్ = శరత్కాలమందలి. చంద్ర=చంద్రునిదైన. చంద్రికా=వెన్నెలవలె. ధవళ = తెల్లఁదనముగల. పర్యంక = పానుపుయొక్క. మధ్యంబునన్ = నడుమ. జగదీశ్వరుండు=ఎల్లలోకములకురాజు. (అయినహరి) సుఖాసీనుండై=సుఖముగాఁగూర్చుండి. (ఉండఁగా) సఖీజనంబులును=చెలికత్తెలును. (తానును) తగ్గఱి=దగ్గఱికిపోయి. కొలిచియుండె=సేవచేయుచుండె.

తా॥ అటుపిమ్మట ఒకనాడు శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవియింటిలో ఇంద్రనీలమణివికారమును పచ్చలవికారమునైన కూపములచేతను, ముంజూరులచేతను, పావురాలగూండ్లచేతను, పైకప్పుచేతను, దారబంధములచేతను, తలుపులచేతను, ప్రకాశించునదియు, బంగారువికారమయిన గోడలు కిటికీలు అరుఁగులు మెట్లును గలిగినదియు, మిక్కిలి వ్రేలుచున్న ముత్యాలసరములతోడి నానావర్ణమైన మేలుకట్లు గలిగినదియు, నానావిధములయిన రత్నముల నెడు దీపముల సమూహములచేత ప్రకాశించునదియు, తుమ్మెదలతో కూడుకొన్న మల్లెపువ్వుల సరములచేత మనోహరమయినదియు, కిటికీలసందుల నుండి బయలువెడలుచున్న కర్పూరదీపములయు అగరు మొదలగు ధూపములయు పొగలు గలిగినదియు, కిటికీలసందులనుండి లోపల ప్రసరించుచున్న చంద్రునికిరణముల సముదాయము గలిగినదియు, కల్పవృక్షముల పువ్వులవాసనచేత వాసనగలదియగుచున్న తిన్నని గాలిచేత మనోజ్ఞమయినదియునైన లోపలియింటిలో, శరత్కాల చంద్రసంబంధమయిన తేటవెన్నెలవంటి తెల్లని పానుపునందుఁ గూర్చుండి యుండఁగా రుక్మిణీదేవి తన చెలికత్తెలతోడ ఆయన వెంబడిఁ జేరి సేవచేయుచుండె అని తాత్పర్యము.

## (*) శ్రీకృష్ణుఁడు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట. (*)



౨౧౩.—సీ॥ కుచకుంభములమీఁది * కుంకుమతో రాయు
హారంబు లరుణంబు * లగుచు మెఱయఁ
గరపల్లవము సాఁచి * కదలింప నంగుళీ
యక కంకణ ప్రభ * లావరింపఁ
గదలిన బహురత్న * కలిత నూపురముల
గంభీర నినదంబు * గడలుకొనఁగఁ
గాంచన మణికర్ణి * కా మయూఖంబులు
గండపాలికలపై * గంతు లిడఁగఁ
తే॥ గురులు నర్తింపఁ బయ్యెద * కొంగు దూఁగ
బోటిచేనున్న చామరఁ * బుచ్చుకొనుచు
జీవితేశ్వరు రుక్మిణి * చేర నరిగి
వేడ్క లిగురొత్త మెల్లన * వీవఁదొడఁగె.

టీ॥ రుక్మిణి=రుక్మిణీదేవి. కుచ...కుంకుమతోన్ — కుచకుంభములమీఁది=కుంభములవంటి స్తనములమీఁదిదైన. కుంకుమతోన్=కుంకుమగంధపుపూఁతతో. రాయుహారంబులు=ఒరయుచున్నట్టిముత్యాలసరులు. అరుణంబులు=ఇంచుకయెఱ్ఱనైనవి. అగుచు మెఱయన్=మిగుల ప్రకాశింపఁగా. కరపల్లవము=చిగురువంటిచేయి. చాఁచి=చాఁగించి. కదలింపన్=కదలింపఁగా. అంగుళీయకకంకణప్రభలు=ఉంగరములయు కడియములయు కాంతులు. ఆవరింపన్ = క్రమ్మఁగా. కదలిన...నూపురములన్—కదలినన్=కదలుట కొఱకు నను. బహు=అనేకములైన. రత్న=రత్నములతోడ. కలిత=కూడుకొన్న. నూపురములన్=అందెలయందుండి. గంభీరనినదంబు=ఘనతనుదెలుపునట్టిధ్వని. గడలుకొనఁగన్=అతిశయింపఁగా. కాంచనమణికర్ణికామయూఖంబులు=రత్నములు పొదిఁగిన బంగారుకమ్మల కాంతులు. గండపాలికలపైన్=చెక్కిటిమీఁది పార్శ్వములయందు. గంతులిడఁగన్ = తళతళలాడఁగా. కురులు = తలవెండ్రుకలు. నర్తింపన్ = చలింపఁగా. పయ్యెదకొంగు = పైఁటచెఱఁగు. దూఁగన్=వ్రేలాడఁగా. బోటిచేనున్న చామరన్ =చెలికత్తెచేత

నున్న వింజామరమును. పుచ్చుకొనుచున్ = తీసికొనుచు. జీవితేశ్వరున్ = ప్రాణనాయకుఁడైనకృష్ణుని. చేరనరిగి = దగ్గఱపోయి. వేడ్కలు=కోరికలు. ఇగుర్కొత్తన్ = చిగిరింపఁగా - పెరుగఁగా, మెల్లనన్ = తిన్నగా, వీవఁదొడఁగెన్ = వీచుట కారంభించెను.

తా॥ అప్పుడు రుక్మిణీదేవి బొమ్మలయందలి కుంకుమపువ్వుపూఁత అంటుకొని యించుక యెఱ్ఱఁబాఱిన ముత్యాలహారములు ప్రకాశింపఁగా, చిగురాకువంటి మృదువైనచేయి చాఁచి చలింపఁజేయఁగా, ఉంగరములయు ముంజేతికడియములయు కాంతులు ఆవరించుకొనుచుండఁగా, కాలు కదలింపఁగా రత్నములు పొదిఁగిన అందెలయొక్క గంభీరమయిన ధ్వనులు అతిశయింపఁగా, రత్నమయములయిన బంగారుకమ్మలకాంతులు చెక్కిళ్లయందు తళతళ మెఱయుచుండఁగా, తలవెంట్రుకలుచలింపఁగా, పైఁటకొంగు ప్రేలాడఁగా, చెలికత్తెచేతి వింజామరమును పుచ్చుకొని శ్రీకృష్ణమూర్తి వెంబడిఁ జేరి మిక్కిలి వినోదముగా వింజామర వీవ ఆరంభించెనని తాత్పర్యము.

వ॥ అప్పుడు.

౨౧౪.—ఉ॥ పతి యేరూపము దాల్చినం దదనురూ * పంబైన రూపంబుతో
సతి తానుండెడు నాసురూపవతి నా * చంద్రాస్య నాలక్ష్మి నా
సుతనున్ రుక్మిణి నాయనన్యమతి నా * శుద్ధాంతరంగం గళా
చతురత్వంబున శౌరి యిట్లనియెఁ జం * చన్మంద హాసంబుతో.

టీ॥ పతి=పెనిమిటి. ఏరూపముదాల్చినన్ = ఏయాకృతిధరించినను. తదనురూపంబైనరూపంబుతోన్ = దానికిఁదగినరూపముతో. తాన్ = తానును. ఉండెడునాసురూపవతిన్ = ఉండునట్టిఆమంచిరూపముగలదానిని. సతిన్ = ఉత్తమస్త్రీని. ఆచంద్రాస్యన్ = ఆచంద్రునివంటిముఖముగలదానిని. ఆలక్ష్మిన్ = ఆలక్ష్మీదేవిని. ఆసుతనున్ = ఆచక్కని దేహముగలదానిని. ఆయనన్యమతిన్ = ఆయితరులయందలిబుద్ధిలేనిదానిని. ఆశుద్ధాంతరంగన్ = ఆపరిశుద్ధమైనమనసుగలదానిని. రుక్మిణిన్ = రుక్మిణీదేవిని. శౌరి = కృష్ణుఁడు. చంచన్మందహాసంబుతోన్ = ఒప్పిదమయిన చిఱునవ్వుతో. కళాచతురత్వంబునన్ = శృంగారశాస్త్రమందలి నేర్పరితనముచేత. ఇట్లనియెన్ = ఇట్లు పలికెను. శ్లో॥ దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ। విష్ణోర్దేహానురూపాం వైకరోత్యేషాత్మన స్తనుం॥ అని శ్రీపరాశరులు. శ్లో॥ రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీకృష్ణజన్మని। అన్యేషు చావతారేషు విష్ణోరేషానపాయినీ॥ అను ప్రమాణములచేత కృష్ణస్వరూపుఁడైన విష్ణుమూర్తి దేవమనుష్యాదిరూపములలో ఏరూపమునుధరించినను రుక్మిణీస్వరూపిణియైన శ్రీలక్ష్మీదేవి దానికిఁదగిన రూపములను ధరించునని భావము.

తా॥ పెనిమిటియైన శ్రీవిష్ణుమూర్తి దేవతామనుష్యాది మూర్తులలో ఏయేమూర్తులనుధరించునో ఆయామూర్తులకుఁ దగినమూర్తులను అప్పుడప్పుడు ధరించుచుండునట్టిదియు, మంచిరూపవతియు, ఉత్తమస్త్రీయు, చంద్రునివంటిముఖముగలిగినదియు, శ్రీలక్ష్మీదేవియు, చక్కని శరీరముగలదియు, ఇతరులయందు పొందని బుద్ధిగలదియు, పరిశుద్ధమయిన మనసుగలదియునైనరుక్మిణీదేవిని చిఱునవ్వునవ్వుచ చాతుర్యముతో శ్రీకృష్ణమూర్తి ఇట్లు పలికెను అని తాత్పర్యము.

౨౧౫.—మ॥ బల శౌర్యంబుల భోగ మూర్తి కుల రూ * ప త్యాగ సంపద్గుణం
బుల దిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్ * పూర్ణుల్ఘను ల్వారికిన్
నెలఁతా తల్లియుఁ దండ్రియున్ సహజుఁడున్ * నిన్నిచ్చినం బోక యీ
బలవద్భీరుల వార్ధిలీనుల మముం * బాటింప నీకేటికిన్.

టీ॥ నెలఁతా = ఓచిన్నదానా. చైద్యముఖరులు=శిశుపాలుఁడు మొదలగువారు. బలశౌర్యంబులన్ = బలముచేతను శూరత్వముచేతను. భోగ...ణంబులన్—భోగ = సుఖానుభవము. మూర్తి= ఆకారము. కుల = వంశము. రూప = చక్కఁదనము. త్యాగ = ఈవియునని యెడు. సంపద్గుణంబులన్ = శుభగుణములచేత. పూర్ణులు= నిండి యుండు వారులు. దిక్పాలురకంటెన్ = అష్టదిక్పాలకులకంటెను. ఘనులు=గొప్పవారు. వారికిన్ = ఆశిశుపాలుఁడు మొదలగువారికి. (తల్లియుఁ దండ్రియు) సహజుఁడున్ = తోడఁబుట్టినవాఁడును. (నిన్ను) ఇచ్చినన్ = ఇయ్యఁగా. పోక=వారివెంటఁబోక. ఈబలవద్భీరులన్ = ఈబలవంతులకు వెఱచువారిని. వార్ధిలీనులన్ = సముద్రములో అణఁగియుండువారిని. మముస్ = మమ్ము. పాటింపన్ = అంగీకరింప. నీకేటికిన్ = నీకుఏల—నీకు మమ్ము అంగీకరింపవలెనన్నబుద్ధి యేలపుట్టెననుట.

తా॥ ఓచిన్నదానా! నీతల్లిదండ్రులును, తోడఁబుట్టినవాఁడును, శిశుపాలునకు నిన్ను ఇచ్చినను, బలము శూరత్వము త్యాగము భోగము సౌందర్యము విగ్రహపుష్టి కులము మొదలగువానిచేత దిక్పాలకులకంటె మించినవారైన ఆశిశుపాలుఁడు మొదలగువారిని విడిచి బలవంతులను జూచి వెఱచునట్టి స్వభావముగలవారై సముద్రమునడుమ దాఁగియుండెడుమమ్ము నీవు ఏమనివరించితివిఅనితా.

౨౧౬.—సీ॥ లోకుల నడవడి * లోని వారముగాము - శరులకు మాజాడ * బయలుపడదు
బలమదోపేతులు * పగగొంద్రు మాతోడ - రాజపీఠములకు * రాము తలఁచు
శరణంబు మాకు నీ * జలరాశి సతతంబు - నిష్కించనుల మేము * నిద్ధులు లేవు
కలవారి చుట్టాలు * గారు నిష్కించన - జనబంధులము ముక్త * సంగ్రహులము

ఆ॥ గూఢ వర్తనులము * గుణహీనులము భిక్షు । లైనవారిఁగాని * నాశ్రయింప
మిందుముఖులు దగుల * రిటువంటి మముబోఁటి । వారి నేల దగుల * వారిజాక్షి.

టీ॥ వారిజాక్షి=కమలములవంటికన్నులుగల ఓరుక్మిణీ. లోకుల నడవడిలోనివారము=వేదశాస్త్రపద్ధతులనుపట్టి లోకములోని జనులందఱు నడుచుకొనునడవడిని అనుసరించినడచువారము. (కాము) వేదశాస్త్రపద్ధతులనుమీఱినడచువారమనుట.(జగద్విలక్షణంబ్రహ్మ) అనిశ్రుతి. (శాస్త్రయోనిత్వాత్) అనిసూత్రము. (మమైవాంశోజీవలోకే) అని గీతావచనము గనుక ప్రపంచాతీత పరబ్రహ్మస్వరూపులమును వేదశాస్త్రముల పుట్టుకకు కారణులమును అయినమేము మాయంశజులైనజీవులవలె పుణ్యపాప మిశ్ర కర్మమార్గముల ననుసరించి నడువమని భావము. మాజాడ = మావిధము. పరులకుఁ= ఇతరులకు. బయలుపడదు = తెలియఁబడదు—మాభక్తులకు మాస్వరూపస్వభావములు తెలియునుగాని యితరులకు తెలియవనుట. బలమదోద్ధతులు=బలముతోడను మదముతోడను గూడుకొన్నవారు. మాతోడఁ=మాతో. పగగొండ్రు=విరోధింతురు—అనఁగా, మేము మంచికులమును విద్య సంపద ఆచారము కీర్తి భోగము దాతృత్వము జ్ఞానము మొదలగునవి గలవారము అనెడు గర్వముగలవారము కాము అని భావము—అష్టమదముల నంటనివారమనుట. క॥ ధనమునువిద్యయువంశం। బును దుర్మదులకు మదంబు బొనరించును స। జ్జనులైనవారికడఁకువ। యనువినయమునివియ తెచ్చునుర్వీనాథా॥అని భారతము. తలుచు=విశేషించి. రాజపీఠములకుఁ=రాజసింహాసనములకు. రాము = రానేరము—మేము త్రిలోకములకును రాజులము గనుక కొంతదేశమునకు రాజులయినవారి సింహాసనములపైఁ గూర్చుండమనుట. సతతంబు = ఎప్పుడును. మాకుఁ=జరాసంధాదులకు వెఱచియుండుమాకు. ఈజలరాశి = ఈసముద్రము. శరణంబు=రక్షకము. (ఇల్లు) సముద్రమునందలి వైకుంఠమున నెప్పుడు వసించువారమనిభావము. ఏము=మేము. నిష్కించనులము=ఏదియు లేనివారము—దరిద్రులము—సంచితప్రారబ్ధాగాములును జననమరణ పుణ్య పాపమానావమాన నిందాస్తుతి స్వర్గనరకాదులును లేనివారమని భావము. నిధులు = ధనపుప్రోఁవులు. (లేవు) నితరాంధీయతే అస్మిన్నితినిధిః,దుధాఞ్ధారణపోషణయోః,మిక్కిలిరక్షింపఁబడునది నిధిగనుక, శ్లో॥ అర్థానామార్జనేదుఃఖం ఆర్జితానాంచరక్షణే। ఆర్జితానాంవ్యయేదుఃఖం ధిగర్థందుఃఖభాజనం॥అనుమనువచనమునుపట్టి నశించునవియును దుఃఖకారణములునునైన నిధులు లేవనిభావము—కాలత్రయమందును నశింపనిదియు మహానందము నిచ్చునదియునైన మోక్షరూప పరమయిశ్వర్యము గలవారమనుట. కలవారు=సంపన్నులు. చుట్టాలుగారు = మాకుబంధువులుకారు—దరిద్రులే మమ్ము సేవింతురుగాని సంపన్నులు సేవింపరు అనుట. సంపదలుగోరి మమ్మును గొలిచిరేని వారికి సకలసంపదల నిత్తుమని భావము. నిష్కించనజనబంధులము = దరిద్రులకుఁజుట్టములము. శ్లో॥ నాహం దేహోనేంద్రియాణ్యంతరంగం నాహంకారఃప్రాణవర్గోనబుద్ధిః। దారాపత్యక్షేత్రవిత్తాదిదూర స్సాక్షీనిత్యఃప్రత్యగాత్మా శివోహం॥ అనెడు బ్రహ్మవేత్తలచుట్టఱికముగలవారమనిభావము. ముక్తసంగ్రహులము=విడువఁబడిన సంగ్రహముగలవారము — ఆస్తియేమియు లేనివారము—శ్లో॥మాతానాస్తిపితానాస్తి నాస్తిబంధుసహోదరః। అర్థంనాస్తిగృహంనాస్తి తస్మాజ్జాగ్రతజాగ్రత ॥ అనుప్రమాణమును పట్టి గృహ ధన ధాన్యాదులయందలిప్రీతిగల. సంసారాదిబంధముల వలనవిడువఁబడిన వైరాగ్యపరులుకలవారము. గూఢవర్తనులము= దాఁచఁబడిననడవడిగలవారము — మఱుఁగున నేయుండువారము—శ్లో॥ సర్వత్రావస్థితోప్యాత్మా నసర్వత్రావభాసతే । బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషుప్రతిబింబవత్॥ అనిఆచార్యోక్తి. పురుషఏవేదగ్ంసర్వం పురుషాన్నపరంకించిత్ విశ్వమేవేదంపురుషః॥అనిశ్రుతిగనుక సర్వరూపనామపరబ్రహ్మస్వరూపుఁడనైన నేను అజ్ఞానులకుఁ గనఁబడననిభావము, గుణహీనులము = మంచిగుణములచేత తక్కువైన వారము—హేయగుణములచేత తక్కువైనవారము—పక్షమున త్రిగుణములులేనివారము. భిక్షులు=బిచ్చమెత్తువారు—సన్యాసులు. అయినవారిఁగాని=అయినవారినేగాని. (ఆశ్రయింపము) నకర్మణా నప్రజయాధనేన త్యాగేనైకే నమృతత్వ మానశుః పరేణనాకంనిహితం గుహాయాం విభ్రాజదేత ద్యతయోవిశంతి వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా స్సన్యాసయోగాద్యతయ శ్శుద్ధసత్వాః తేబ్రహ్మలోకేతి పరాంతకాలే పరాపరాత్పరిముచ్యంతిసర్వే ॥ అనుశ్రుతినిపట్టి సర్వసంగపరిత్యాగస్థితిగలిగి సన్యాసులయినబ్రహ్మవేత్తలనే ఆశ్రయింతుమని భావము. ఇటువంటి = ఇప్పుడుచెప్పినలక్షణములుగల. మముబోఁటివారిఁ=మావంటివారిని. ఇందుముఖులు=స్త్రీలు. తగులరు= ఆసక్తితోఁగూడరు. తగులనేల=నీవు మాతోకూడనేల.

తా॥ ఓరుక్మిణీ! మేము లోకపు నడవడిని అనుసరించి యుండువారముకాము, మావిధమును ఇతరు లెవరునెఱుఁగరు, బలవంతులును మదించినవారును మాతో విరోధించుచుందురు, మేము తలుచుగా రాజసింహాసనములు ఎక్కఁబోము, ఎల్లప్పుడు ఈసముద్రమే మాకు రక్షకము, మేము అతిదరిద్రులము, మాకు రూకలపాఁతఱలు లేవు, సంపదగలవారు మాకుఁజుట్టములైయుండరు, మేముదరిద్రులకేచుట్టములము, ఆస్తియేమాత్రమును లేనివారము, ఎక్కడనయిన దాఁగియుండువారముగాని బహిరంగముగా తిరుగువారముగాము, మంచిగుణములు లేనివారము, బిచ్చమెత్తువారినేగాని యితరులను మేము ఆశ్రయింపము, ఇటువంటి అల్పులమయిన మాబోఁటివారిని స్త్రీలు అపేక్షింపరు, అట్లుండఁగా నీవు నన్నెట్లు కోరితివని తాత్పర్యము.

లోకము ననుసరించి వర్తింపక మావర్తన మిటువంటిదని యితరులకు తెలియఁబడనీయక బలముచేతను మదముచేతను హెచ్చినవారికి విరోధబుద్ధిని బుట్టించి పరశురామావతారమునందు తప్పఁ దక్కిన అవతారములందు రాజులసింహాసనములను ఆక్రమింపక ఎల్లప్పుడు పాలసముద్రమే యిల్లుగా వటపత్రమునందుశయనించి ధనాసక్తిలేక సంపన్నులదగ్గఱఁజేరక దరిద్రులనుకాపాడుచు మోక్షేచ్ఛగలవారిని సన్నిధానమునందుఁజేర్చుకొనుచు రహస్యప్రవర్తనముతో సన్యాసులను ఆశ్రయించుచు వర్తించువారము మేము ఇటువంటి నిర్వికారస్వరూపులమైన మమ్ము సర్వవికారములకు ఉనికిపట్లయిన స్త్రీలు చేరనేరరే నీవెట్లు చేరితివి అని భావము.

### విశేషార్థము.

టీ॥ లోకులనడవడిలోనివారముగాము—లోకుల = లోక్యతే ఇతి

లోకః, లోకృదర్శనే, అని ధాతువు గనుక చూడఁబడునదిగావున, లోకము అట్టిలోకసంబంధులు లోకులు—చూడఁబడువారనిభావము. యద్యత్పశ్యతిచక్షుర్భ్యాం తత్తదాత్మేతిభావయేత్. ॥ అనిశ్రుతి, శ్లో॥ మనసా వచసా దృష్ట్యా గృహ్యతే న్యైరపీంద్రియైః.। అహమేవ నమత్తోన్య దితిబుధ్యధ్వమంజసా॥ అని శ్రీభాగవతము కాఁబట్టి కనఁబడునది వినఁబడునది చూడఁబడునది అంతయును తామే అని తలఁచక వేఱఁని తలఁచునట్టి అజ్ఞానజనులప్రవర్తన గలవారము కాము—సర్వము తామే అనెడు దృఢాపరోక్షజ్ఞానముగల బ్రహ్మవిదులప్రవర్తన గలవారమనిభావము. పరులకుఁ = బ్రహ్మైవేదబ్రహ్మైవభవతి, అను ప్రమాణముచేత మాస్వరూపులైనబ్రహ్మవిద్వరిష్ఠులుకానివారికి—అజ్ఞానులకు. మాజాడ=మాయొక్క—సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వాదిప్రవర్తనలు. బయలుపడదు=విశదముకాదు. శరణంబు మాకునీజలరాశిసతతంబు=కుక్షీ స్సప్తసముద్రం, అనుప్రమాణముచేత మనుష్యశరీరమందలి సప్తధాతుమయ సప్తసముద్రమునందు ఎప్పుడును వాసము చేయుదుము. తక్కినదిసమము.

౨౧౭.—క॥ సిరియును వంశము రూపము। సరియైన వివాహ సఖ్య ✻ సంబంధంబుల్
జరగును సరిగాకున్నను। జరగవు లోలాక్షి యెట్టి ✻ సంసారులకుఁ.

టీ॥ లోలాక్షి=చలించునట్టి కన్నులుగల ఓరుక్మిణీ. ఎట్టిసంసారులకుఁ=సంసారముచేయువారికిఎటువంటివారికైనను. సిరియుఁ=సంపదయు. వంశముఁ=మంచికులమును. రూపముఁ=చక్కఁదనమును. సరియైనఁ=ఉభయపక్షములయందునుసరిగానున్నయెడల, వివాహసఖ్యసంబంధంబులు=పెండ్లిస్నేహము వియ్యమందుటయును, జరగుఁ=నడచును. (సరిగాకున్న జరగవు)

తా॥ ఓరుక్మిణీ! ఎవరికేనియు సంసారులైనవారికి సంపదయు వంశమును, చక్కఁదనమును, ఉభయపక్షములందును, సమానములుగా నున్నపక్షమునందు పెండ్లినడచును, స్నేహము కలిగియుండును, వియ్యమందవచ్చును, ఆసంపద కులము రూపము నను నవి సమానములు కానిపక్షమున మీఁదఁజెప్పిన వివాహస్నేహబాంధవ్యములు జరగనేరవు అని తాత్పర్యము,

సంసారులతో సంసారులకు సంబంధ బాంధవ్యస్నేహములు జరగునుగానివిరాగులగువారికినిసంసారులకును నెట్లుజరుగుననిభావము

౨౧౮.—క॥ తగదని యెఱుఁగవు మమ్ముఁ। దగిలితివి మృగాక్షి దీనఁ ✻ దప్పగు నీకుం
దగిన మనుజేంద్రు నొక్కనిఁ। దగులుము గుణహీనజనముఁ ✻ దగునే తగులఁ.

టీ॥ మృగాక్షి = ఓరుక్మిణీ. తగదు = వీరితోడి సహవాసము తగినదికాదు. (అనియెఱుఁగవు) మమ్ముఁ = మమ్ము, తగిలితివి= మోహించితివి. దీనఁ=ఈమోహమువలన(నీకు)తప్పగుఁ=లోపము వచ్చును. గుణహీనజనముఁ=మంచి గుణములులేని మనుష్యులను—హేయగుణరహితులయిన అవతారపురుషులను. తగులఁ=కలయ. తగునే=యుక్తమగునా—శక్యమగునా.(కాదుగనుక నీకు)తగినమనుజేంద్రుఁ=తగినవాఁడైనరాజును. (ఒక్కని)తగులుము=కూడుము.

తా॥ ఓరుక్మిణీ! నీవు రాచకూఁతురవు నీకుఁదగిన ఒకరాచకొమారుని వరింపక మంచిగుణములు లేనివారము లేక, హేయగుణములు లేనివారమయిన మమ్మునుగూడుట నీకు యుక్తముకాదు లేక,సాధ్యముకాదు కాఁబట్టి వీరితోడి సహవాసముమనకుతగునా. తగదాయని విచారింపక మమ్మువరించుట నీయెడల గొప్పతప్పుగా నున్నది కాఁబట్టి యిప్పుడైన నీకుఁదగిన ఒకరాచకొమారుని వెదకి వరింపుము అని శ్రీకృష్ణమూర్తి పలికెననితాత్పర్యము.

౨౧౯.—సీ॥ సాల్వ జరాసంధ ✻ చైద్యాది రాజులు - చెలఁగి నిన్వీక్షింప ✻ మలయుచుందు
రదిగాక రుక్మి నీ ✻ యన్నయు గర్వించి - వీర్యమదాంధుఁడై ✻ వెలయుచుండు
వారి గర్వంబులు ✻ వారింపఁ దఱిగోరి - చెలువ నిన్నొడిచి తె ✻ చ్చితిమిగాని
కాంతాతనూజార్థ ✻ కాముకులముగాము - కామమోహాదులఁ ✻ గ్రందుకొనము
తే॥ విను ముదాసీనులము క్రియా ✻ విరహితులము। పూర్ణులము మేము నిత్యాత్మ ✻ బుద్ధితోడ
వెలుఁగుచుందుము గృహదీప ✻ విధము మెఱసి। నవలతాతన్వి మాతోడ ✻ నవయ వలదు.

టీ॥ నవలతాతన్వి = లేఁతతీఁగవంటి దేహముగల ఓరుక్మిణీ. సాల్వజరా... రాజులు=సాల్వుఁడు జరాసంధుఁడు శిశుపాలుఁడు మొదలుగాఁగలరాజులు. చెలఁగి = ఉత్సహించి. నిన్ = నిన్ను. వీక్షింపన్=చూచుటకు. మలయుచుందురు = తమకపడుచుందురు, (అదిగాక) రుక్మినీయన్నయుఁ=నీయన్నయైనరుక్మియనువాఁడును. గర్వించి = అహంకరించి. వీర్యమదాంధుఁడై = వీరగుణముచేతను క్రొవ్వుచేతను కన్నుగాననివాఁడై. వెలయుచుండుఁ=ప్రకాశించుచుండును. వారి గర్వంబులు = ఆసాల్వుఁడు మొదలగువారియొక్కయుమీయన్నయొక్కయు అహంకారములను. వారింపన్= అణఁచివేయుటకు. తఱిగోరి = సమయమునపేక్షించి. చెలువన్= సుందరివైన. నిన్నుఁ=నిన్ను. ఒడసి=పొంచిపట్టి. తెచ్చితిమిగాని= తీసుకవచ్చినాముగాని. కాంతా...కాముకులము—కాంతా=స్త్రీలయందును, తనూజ=కొడుకులయందును. అర్థ=ధనములయందును. కాముకులము = అపేక్షగలవారము. కాము=మేముకాము. కామమోహాదులన్=కామము మోహము మొదలగు అరిషడ్వర్గముచేత. క్రందుకొనము = చిక్కుపడము. (వినుము) ఉదాసీనులము = దేనినంటుకయుండువారము. క్రియావిరహితులము=క్రియలచేతవిడువఁబడినవారము—చతుర్దశేంద్రియ వ్యాపారములలో నొక్కటియైన

స్వేతరముగఁ గలదని తలఁచువారముకాము అనుట. పూర్ణులము మేము=మేము అంతటనిండుకొన్నవారము. నిత్యాత్మబుద్ధితోడన్= సత్యమయినపరబ్రహ్మస్వరూపులముఅనుబుద్ధితో. గృహదీపవిధము= ఇంటిలోని దీపముయొక్కరీతి. మెఱసి = మెఱయించి. వెలుఁగు చుందుము=ప్రకాశించుచుందుము—దీపము ఇంటఁగలవస్తువుల నన్నిటిని వెలిఁగించుచు ఆవస్తువికారముల నంటకయున్నట్లు మేమును సర్వేంద్రియవృత్తులను ప్రకాశింపఁజేయుచును వాని వికారముల నంటక వెలుఁగుచుందుమనుట. మాతోడన్ = ఇటువంటిమాతో. నవయవలదు=శ్రమపడవలదు.

తా॥ ఓరుక్మిణీ! సాల్వుఁడు జరాసంధుఁడు శిశుపాలుఁడు మొదలగువారు ఉత్సాహముతో నిన్నుజూడ తమకపడుచుందురు, నీయున్నతమైన రుక్మి వీర్యముచేతను మదముచేతను కన్నుగానని వారై మమ్మునుతిరస్కరించుచుందురు,అందువల్ల వారిగర్వములను అణఁపఁదలఁచి నిన్ను తెచ్చుకొంటిమేగాని మేము నీయందు మోహముచేత నిన్ను ఎత్తుకవచ్చినవారముకాము, మేము పెండ్లాలు బిడ్డలు ధనము మొదలగువానియందు అపేక్షకలవారముకాము, కామ క్రోధ మద మత్సర లోభ మోహములనెడి అరిషడ్వర్గముచేత చిక్కుపడువారముకాము ఎందునుసంబంధములేక యుండువారము, ఏపనియు లేనివారము, అంతట నిండుకొనియుండువారము, సచ్చిదానందపరబ్రహ్మస్వరూపులము అనుబుద్ధిగలవారము ఇంటిలో దీపము వెలుఁగునట్లు ఎల్లప్రాణులయందును వెలుఁగుచుండువారము ఇటువంటి మాతోఁజేరి నీవేల యిడుమలపడెదవు అని తాత్పర్యము.

౩౦౦.-వ॥ అని యిట్లు భగవంతుండైన హరి దన్నుఁబాయక సేవించు ప్రియురాలి పట్టంపు దేవి నని యెడి
దర్పంబు నేర్పున నుపసంహరించి యూరకుండిన నమ్మానవతి యప్రియంబులు నగౌరవంబులు
నపూర్వంబులు నైన మనోవల్లభు మాటలువిని దురంతంబైన చింతాభరంబున సంతాపంబునొందుచు.

టీ॥ (అని యిట్లు) భగవంతుండయినహరి = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన శ్రీకృష్ణమూర్తి. (తన్ను) పాయక = ఎడవిడువక. సేవించుప్రియురాలి = కొలుచునట్టి యిష్టురాలియొక్క. పట్టంపుదేవిని=నేనుపట్టాభిషిక్తురాలనైనభార్యను. అనియెడిదర్పంబున్= అనునట్టిగర్వమును. నేర్పునన్=చతురత్వముతో. ఉపసంహరించి= అణఁచి, ఊరకుండినన్ = ఏమియు మాటాడకయూరకుండఁగా. ఆమ్మానవతి=మానవంతురాలైనఆరుక్మిణి. అప్రియంబులును=ప్రియములుగానివియు—విననిష్టముగానివనుట, అగౌరవంబులును=గొప్పతనము లేనివియును, అపూర్వంబులును=క్రొత్తవియు. అయినమనోవల్లభుమాటలు=అయినట్టిపెనిమిటియొక్కమాటలు. (విని) దురంతంబయినచింతాభరంబునన్=మేరలేని దుఃఖాతిశయముచేత. సంతాపంబున్=పరితాపమును. ఒందుచున్=పొందుచును.

తా॥ అని యీవిధముగా షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన శ్రీకృష్ణమూర్తి తన్ను ఎడఁబాయక కొలుచునట్టిదైన రుక్మిణీదేవియొక్క నేను పట్టాభిషిక్తురాలనైనభార్యను అనుగర్వమును చతురత్వముతో పోఁగొట్టి యూరకుండఁగా ఆరుక్మిణీదేవి అయిష్టములును హీనములును క్రొత్తవియునైన ఆశ్రీకృష్ణునిమాటలను విని మేరలేని దుఃఖాతిశయముచేత తపించుచును అని తాత్పర్యము.

౩౦౧.—సీ॥ కాటుక నెఱయంగఁ * గన్నీరువరదలై - కుచకుంభయుగళ కుం * కుమము దడియ
విడివడి వెడలెడి * వేఁడి నిట్టూర్పుల - లాలితాధర కిస * లయము గందఁ
జెలువంబు నెఱిదప్పి * చిన్నవోవుచునున్న - వదనారవిందంబు * వాడు దోఁప
మారుతాహతిఁ దూలు * మహిత కల్పకవల్లి - వడువున మేన్వడ * వడ వడంకఁ

తే॥ జిత్త మెరియంగఁ జెక్కిటఁ * జెయ్యిచేర్చి । కౌతుకంబేది పదతలా * గ్రమున నేల
వ్రాసికొనుచును మోమర * వాంచి వగలఁ । బొందె మవ్వంబుగందిన * పువ్వుఁబోఁడి.

టీ॥ (కాటుక) నెఱయంగన్ = అంతటను వ్యాపించునట్లు. (కన్నీరు) వఱదలై=ప్రవాహములై, కుచకుంభయుగళకుంకుమము= కుంభములవంటి చనులజంటయందలికుంకుమపుపూఁత, తడియన్= తడియఁగా, విడివడి=విడువఁబడి. వెడలెడి = బయటికివచ్చెడి. వేఁడినిట్టూర్పులన్ = వెచ్చనైన నిట్టూర్పులచేత. లాలితాధరకిసలయము=మనోజ్ఞమైన మోవియనెడుచిగురు, కందన్=వాఁడినల్లఁబడిపోఁగా. చెలువంబునెఱి=అందముయొక్క మేలిమి. (తప్పి) చిన్నవోవుచునున్న=కళతఱిఁగిపోవుచున్న, వదనారవిందంబువాఁడు= ముఖకమలముయొక్క వాఁడుట, తోఁపన్=కానఁబడఁగా, మారుతాహతిన్=గాలిసోఁకుడుచేత. తూలు = చలించునట్టి, మహిత= గొప్పదైన, కల్పకవల్లివడువునన్=కల్పకవృక్షపుకొమ్మవలె. మేను= దేహము, వడవడవడఁకన్ = వడవడయనివణఁకఁగా, చిత్తము= మనస్సు, ఎరియంగన్=మండఁగా, చెక్కిటన్ = చెక్కిటియందు. (చెయ్యిచేర్చి) కౌతుకంబు=కుతూహలము, ఏది=పోయి, పదతలాగ్రమునన్=అడుగుమొనతో — కాలిబొటనవ్రేలితోననుట. (నేల వ్రాసికొనుచు) మోము=మొగమును. అరవాంచి = సగమువంచి. మవ్వంబు=కోమలత్వము. కందిన=మాసిపోయిన. పువ్వుఁబోఁడి= పువ్వువంటి మేనుగలరుక్మిణి. వగలఁబొందెన్=దుఃఖములనుపొందెను.

తా॥ వాడినపువ్వువలె కాంతిహీనమైన దేహముగల ఆరుక్మిణీదేవి కన్నులనుండె కాటుకతోడి నీరు ప్రవాహరూపమున కాటిబొమ్మనఁబూసికొన్న కుంకుమపుపూఁతను తడుపఁగా, వెచ్చగా వెడలుచున్న నిట్టూర్పుసెగలచేత చిగురువంటి పెదవి కందిపోఁగా, అందము చెడునట్లు కళ తఱిఁగిపోవుచున్న కమలమువంటి ముఖము నందు కళాహీనత కానరాఁగా, గాలిసోఁకుడుచేత చలించుచున్న కల్పవృక్షపుకొమ్మవలె మృదువైనదేహమువడవడవణఁకుచుండఁగా, మనసున సంతాపము హెచ్చఁగా, చెక్కిటియందు చెయ్యియుంచుకొని కుతూహలము లేనిదై కాలిబొటనవ్రేలితో నేలవ్రాయుచు మొగము కొంచెమువంచి దుఃఖింపసాగెనని తాత్పర్యము.

౩౦౨.—చ॥ అలికులవేణి దన్నుఁ బ్రియుఁ * డాడిన యప్రియభాష లిమ్మెయిన్
సొలవక కర్ణరంధ్రముల * సూదులు చొన్పినరీతిఁ గాఁగ బె
బ్బులిరొద విన్న లేడిక్రియఁ * బొల్పఱి చేష్టలు దక్కి నేలపై
వలనఱి వ్రాలెఁ గీలెడలి * వ్రాలిన పుత్తడి బొమ్మకైవడిన్.

టీ॥ అలికులవేణి = తుమ్మెదబారునుబోలిన జడగలదైనరుక్మిణి. (తన్ను) ప్రియుఁడు=పెనిమిటి. ఆడినయప్రియభాషలు = చెప్పిన అప్రియములైనమాటలు. ఇమ్మెయిన్ = ఈవిధముగా. సొలవక=వెనుదీయక. కర్ణరంధ్రములన్=చెవిరంధ్రములయందు. (సూదులు) చొన్పినరీతిన్=చొప్పించినవిధము. కాఁగన్ = కాఁగా. బెబ్బులి రొద=పెద్దపులియొక్క కాండ్రించుటను. విన్నలేడిక్రియన్=వినిన ఆఁడుజింకవలె. పొల్పఱి=బాగుతప్పి. చేష్టలుదక్కి=కదలమెదల నేరనిదై. నేలపైన్=భూమిమీఁద. వలను = నేర్పు—సామర్థ్యము. అఱి=నశించి. కీలెడలి=కీలువదలి. వ్రాలిన=నేలకొఱఁగిన. పుత్తడి బొమ్మకైవడిన్=బంగారుబొమ్మవిధమున. వ్రాలెన్=నేలఁబడియెను.

తా॥ అంతట రుక్మిణి పెనిమిటి చెప్పిన ప్రియములుగానిమాటలు సంకోచింపక సూదులను చెవులలో చొప్పించినట్లు ఈవిధముగా వినఁబడఁగా పెద్దపులికాండ్రింపును విన్న ఆఁడుజింకవలె మనసు చలించి నిశ్చేష్టురాలై నేలమీఁదనిలువ సామర్థ్యములేక కీలుతొలఁగిన బంగారుబొమ్మవలె క్రిందఁబడెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు వ్రాలిన.

౩౦౩.—మ॥ ప్రణుతామ్నాయుఁడు కృష్ణుఁ డంతఁ గనియెన్ * బాష్పావరుద్ధారుణే
క్షణ విస్రస్త వినూత్న భూషణ దురు * క్త క్రూరనారాచ శో
షణ నాలింగిత ధారుణిన్ నిజకులా * చారైక సద్ధర్మ చా
రిణి విశ్లేషిణి వీతతోషణిఁ బురం * ధ్రీగ్రామణిన్ రుక్మిణిన్.

టీ॥ బాష్పావరుద్ధారుణేక్షణన్ = కన్నీళ్లచేత ఆవరింపఁబడిన చూపులు గలిగినదియు. విస్రస్తవినూత్నవిభూషణన్ = వీడిపడిన క్రొత్తఆభరణములుగలిగినదియు. దురుక్తక్రూరనారాచశోషణన్= చెడ్డమాటలనెడు వాఁడిబాణములచేతకళతప్పిపోవుటకలిగినదియు. ఆలింగితధారుణిన్=కౌఁగిలింపఁబడిన భూమిగలిగినదియు. నిజ... చారిణిన్—నిజ=తనదైన. కుల=జాతికిఁదగిన. ఆచార = నడవడి అనెడు. ఏక=ఒక్కటయిన. సత్=శ్రేష్ఠమైన. ధర్మ=ధర్మమును. చారిణిన్=నడపునదియు. విశ్లేషిణిన్ = ఎడఁబాటుగలిగినదియు. వీతతోషణిన్ = పోయినసంతోషముగలిగినదియు. పురంధ్రీగ్రామణిన్=ఇల్లాండ్రలో శ్రేష్ఠురాలునునైన. రుక్మిణిన్=రుక్మిణీదేవిని. ప్రణుతామ్నాయుఁడు=కొనియాడఁబడిన వేదములుగలవాఁడైన. (కృష్ణుఁడు) అంతన్=అప్పుడు. కనియెన్=చూచెను.

*దురుక్త అనుచోట కర్తయందు క్తప్రత్యయము.

తా॥ అప్పుడు కన్నీళ్లచేత కమ్మఁబడిన చూపులును, వీడిపడిన క్రొత్తక్రొత్తసొమ్ములును, చెడ్డమాటలనెడువాఁడిబాణములసోఁకుడుచేతకళతప్పుటయు, కౌఁగిలించుకొన్నట్టు భూమియందు బోరగిలఁబడుటయు, తన కులాచారమనెడు ధర్మమునుతప్పక నడపుటయు, పెనిమిటివలనియెడఁబాటునుసంతోషము లేమియుఁగలిగినయుత్తమ స్త్రీయగు రుక్మిణీదేవిని వేదమునందుఁ జెప్పఁబడిన ధర్మములను నడపువాఁడైన శ్రీకృష్ణమూర్తి చూచెనని తాత్పర్యము.

౩౦౪.—సీ॥ కని సంభ్రమంబునం * దనువునం దనువుగా - ననువునఁ జందనం * బల్లనలఁది
కన్నీరు పన్నీటఁ * గడిగి కర్పూరంపుఁ - బలుకులు చెవులలోఁ * బాఱనూఁది
కరమొప్ప ముత్యాల * సరుల చిక్కెడలించి - యురమునఁ బొందుగా * నూలుకొల్పి
తిలకంబు నునుఫాల * ఫలకంబుపైఁ దీర్చి - వదలిన భూషణా * వళులు దొడిగి

తే॥ కమలదళచారు తాళవృం * తముల విసరి । పొలయఁబయ్యెద కుచములఁ * బొందుపఱిచి
చిత్తమిగురొత్త నొయ్యన * సేదఁదేర్చి । బిగియఁ గౌఁగిటనొత్తి నె * మ్మొగము నిమిరి.

టీ॥ కని = అట్లుచూచి. సంభ్రమంబునన్ = తొత్తఱపాటుతో. తనువునన్=ఆమెదేహమునందు. తనువుగాన్=అప్యాయముగా. అనువునన్=పొందికగా. చందనంబు = గంధమును. అల్లనలఁది=మెల్లఁగాఁబూసి. కన్నీరు=కన్నులనీటిని. పన్నీటన్=పన్నీటిచేత. (కడిగి) కర్పూరంపుఁబలుకులు=కర్పూరఖండములను. (చెవులలో) పాఱన్=వ్యాపింప. (ఊఁది) కరము=మిక్కిలి. ఒప్పన్=ఒప్పిదముగా. ముత్యాలసరులచిక్కు=ముత్తెములహారములచిక్కును. ఎడలించి = విడఁదీసి. ఉరమునన్ = రొమ్మునందు. పొందుగాన్=యుక్తముగా. నూలుకొల్పి=అమర్చి. తిలకంబు = బొట్టును. నును ఫాలఫలకంబుపైన్ = నునుపైన నొసటిపట్టెయందు. తీర్చి=దిద్దిపెట్టి. వదలిన=వీడిన. భూషణావళులు=ఆభరణములపఙ్క్తులను. తొడిగి=ధరింపఁజేసి. కమల...ములన్—కమలదళ=తామరతేకుల చేతఁగట్టిన. చారు=మనోజ్ఞమయిన. తాళవృంతములన్ = విసనకఱ్ఱలచేత. (విసరి) పొలయన్ = చక్కఁగావ్యాపింప. పయ్యెద=పైఁటను. కుచములన్= స్తనములపైని. పొందుపఱిచి=కూడఁబెట్టి. చిత్తము = మనస్సు. ఇగురొత్తన్ = వికాసమునువహించునట్లు. ఒయ్యనన్=తిన్నఁగా. సేదఁదేర్చి=బడలికనుపోఁగొట్టి. బిగియన్=గట్టిగా. కౌఁగిటన్=బాహువుమధ్యమునందు. ఒత్తి=అదుముకొని.

నెమ్మొగము = విశాలమయిన ముఖమును. నిమిరి = తడవి.

తా॥ అట్లు శ్రీకృష్ణమూర్తి రుక్మిణీదేవిని చూచి, మిక్కిలి వేగిర పాటుతో ఆమెదేహమునందుతాపమువలన గండమునుబూసికన్నుల జాఱుచున్న నీరంతయు పన్నీటితోఁ గడిగి, కర్పూరపుపొడి చెవులలోనుంచి ఊఁది, చిక్కుపడియున్న ముత్యాలహారముల చిక్కుదీసి యొప్పున పొందికగాఁవ్రేలవేసి, నాసటియందు బొట్టుపెట్టి, వీడిపోయిన ఆభరణములన్ని చక్కగాఁ దొడిగి, తామరతేకుల విసనకఱ్ఱతో తిన్నగావిసరి, జాతీసన్నపైఁటను స్తనములపైకప్పి, మనసుతేలునట్లు బడలికదీర్చి, బిగ్గరకౌఁగిలించుకొని, మొగమును నిమిరినవాఁడై అని తాత్పర్యము.

౩౦౫.—తే॥ నెఱులుగలమరుని నీలంపు ✻ టురుల సిరుల | నరులుగొనఁజాలి నరులను ✻ మరులుగొలుపు
నిరుల గెలిచిన తుమ్మెద ✻ గఱులఁ దెగడు | కురుల నులిదీర్చి విరులిడి ✻ కొప్పు వెట్టి.

టీ॥ నెఱులు = వంకరలు. కల=కలిగిన. మరుని=మన్మథుని యొక్క. నీలంపుటురులసిరులన్ =నీలవర్ణమైనయుచ్చులకలిమలను. అరులు=కప్పములుగా. కొనఁజాలి=తీసికోఁజాలి. నరులన్=మనుష్యులను. మరులుగొలుపు=మోహింపఁజేసెడి. ఇరులన్=చీఁకట్లను. గెలిచిన = జయించిన. తుమ్మెదగఱులన్ = తుమ్మెదతెక్కలను. తెగడు=పరిహాసముచేయునట్టి. కురుల = తలవెంట్రుకలయొక్క. నులిదీర్చి=చిక్కుతీసి. విరులు=పువ్వులు. ఇడి=పెట్టి. (కొప్పు పెట్టి)

తా॥ చుట్టలు చుట్టుకొని మన్మథుని నీలపు త్రాళ్ల యుచ్చులను కప్పము పుచ్చుకోఁజాలినవై మనుష్యులను భ్రమింపఁజేయునట్టి చీఁకట్లను జయించిన తుమ్మెదలతెక్కలను ఎగతాళిచేయుచున్న తలవెంట్రుకల చిక్కుదీసి పువ్వులు తుఱిమి కొప్పుపెట్టినవాఁడై అని తా.

౩౦౬.—క॥ మురసంహారుఁ డిందిందిర | గరుదనిల చలత్ప్రసూన ✻ కలికాంచిత సుం
దర శయ్యఁ జేర్చె భీష్మక | వరపుత్రిన్ నుతచరిత్ర ✻ వారిజనేత్రన్.

టీ॥ మురసంహారుఁడు = కృష్ణుఁడు. ఇందిందిర...శయ్యన్ — ఇందిందిర=తుమ్మెదలయొక్క. గరుత్=తెక్కలవలని. అనిల=గాలిచేత. చలత్=కదలుచున్న. ప్రసూన = పువ్వులయొక్క. కలికా=మొగ్గలచేత. అంచిత=ఒప్పిదమయిన. సుందరశయ్యన్=అందమైనపానుపునందు. నుతచరిత్రన్=కొనియాడఁబడిన నడవడిగల. వారిజనేత్రన్=తామరలవంటికన్నులుగల. భీష్మకవరపుత్రిన్ = భీష్మకమహారాజుయొక్క కొమార్తను. చేర్చెన్ = చేర్చెను.

తా॥ శ్రీకృష్ణుఁడు తుమ్మెదతెక్కలవలని గాలిచేత చలించునట్టి పూమొగ్గలపానుపునందు ఎల్లవారిచేతను కొనియాడఁబడిననడవడి గలిగినదియు, తామరలవంటి కన్నులు గలిగినదియు, భీష్మకమహారాజు కూఁతురునైన రుక్మిణిని చేర్చెనని తాత్పర్యము.

౩౦౭.—వ॥ ఇట్లు పానుపునం జేర్చి మృదుమధుర భాషణంబుల ననునయించిన.

టీ॥ (ఇట్లు) పానుపునన్=పఱుపునందు. (చేర్చి) మృదుమధుర భాషణంబులన్=తిన్ననివియు ఇంపైనవియునైన మాటలచేత. అనునయించినన్=ఓఁదార్పఁగా.

తా॥ ఈవిధముగా పానుపునందుఁ జేర్చి తిన్ననివియు ఇంపైనవియునైన మాటలచేత ఊఱడింపఁగానని తాత్పర్యము.

## (✻) రుక్మిణీదేవి శ్రీకృష్ణలాలితయై యతనిస్తుతించుట. (✻)



క॥ పురుషోత్తమ ముఖకోమల | సరసిజమయ్యిందువదన ✻ సవ్రీడా హా
సరుచిస్నిగ్ధాపాంగ | స్ఫురదవలోకనము లొలయఁ ✻ జూచి తగ ననెన్.

టీ॥ పురుషోత్తమ... సరసిజము — పురుషోత్తమ = కృష్ణునియొక్క. ముఖ=మొగమనెడు. కోమల=మృదువైన. సరసిజము=కమలమును. సవ్రీడా...లోకనములు — సవ్రీడా = సిగ్గుతోఁగూడుకొన్న. హాస=నవ్వుయొక్క. రుచి=కాంతిచేతను. స్నిగ్ధ = నిగనిగలాడుచున్న. అపాంగ = కడగన్నులనుండి. స్ఫురత్ = ప్రకాశమగుచున్న. అవలోకనములు = చూపులు. ఒలయన్ = వ్యాపింపఁగా. (చూచి) ఆయ్యిందువదన = చంద్రునివంటి ముఖముగల రుక్మిణి. తగన్=ఉచితముగా. అనెన్=పలికెను.

తా॥ రుక్మిణీదేవి శ్రీకృష్ణునిముఖమనెడి వికాసముగల కమలమునందు సిగ్గుతోఁగూడిన చిఱునవ్వుయొక్క కాంతులు ప్రసరించుటచేత నిగనిగలాడుచున్న కడగంటిచూపులను ప్రసరింపఁజేసి తగునట్టుగా నిట్లుపలికెను అని తాత్పర్యము.

కుమురకుహరదితహాసముదర | [illegible] ✻ నదియట్టిదగుణుక్
[illegible]

టీ॥ మురహర = మురాసురుని సంహరించిన. దివసాగమ... వళాక్ష—దివసాగమ=ప్రాతఃకాలమునందు. దరత్ = ఇంచుకవికసించుచున్న. అరవింద = తామరలయొక్క. దళ = రేకులవంటి. అక్ష=కన్నులుగలస్వామీ. తలఁపఁగ=విచారింపఁగా, అది = నీవు చెప్పినమాట. అట్టిదగుఁగా = అటువంటిదేయగును — వాస్తవము అనుట. ఎందుఁగా=ఎల్లప్పుడు. భక్తవత్సల=భక్తులయందువాత్సల్యము గల ఓస్వామీ. నిరవధిక...మూర్తివి—నిరవధిక = మేరలేని—దేశకాలవస్తుపరిచ్ఛేదములులేని. విమల=నిర్మలమైన. తేజః=విజ్ఞానమే. వర=శ్రేష్ఠమయిన. మూర్తివి=ఆకృతిగాఁగలవాఁడవు. నీవ=నీవే.

తా॥ మురాసురుని సంహరించినవాఁడవును, తెల్లవారి విరిసీవిరియని తామరరేకులనుబోలిన కన్నులుగలవాఁడవును, భక్తులయందు ప్రేమగలవాఁడవునైన ఓస్వామీ! నీవుచెప్పినట్టు నేను నీకు తగినదాననుకానుఅనుటనిజమే ఎప్పుడునుమితిలేనిదియునిర్మలమైనదియునైన విజ్ఞాన స్వరూపమైన పరబ్రహ్మము నీవేగదాఅనిపలికెననితా.

౩౧౦.—తే॥ సంతత జ్ఞాన సుఖ బలై * శ్వర్య శక్తు । లాదిగాఁగల సుగుణంబు * లమరునీకు
నేను దగుదునె సర్వలో * కేశ్వరేశ । లీలమై సచ్చిదానంద * శాలి వనఘ.

టీ॥ అనఘ = ఓపాపములులేనిస్వామీ. సర్వలోకేశ్వరేశ = పదునాలుగు లోకములకును ప్రభువులయిన బ్రహ్మేంద్రాదులకు నియామకుఁడా. (నీవు) లీలమై = విలాసముతో. సచ్చిదానందశాలివి — సత్ = త్రికాలములయందు నశింపనిదియు. చిత్=అపరోక్షజ్ఞానస్వరూపమయినదియు. ఆనంద = సంసారదుఃఖనివృత్తిపూర్వకానందమయమయినదియునైన రూపముచేత. శాలివి=ఒప్పుచున్నవాఁడవు. సంతత...శక్తులు = ఎడపడని జ్ఞానశక్తి సుఖశక్తి బలశక్తి అణిమాద్యైశ్వర్యశక్తి — సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వసర్వాంతర్యామిత్వ సర్వభోక్తృత్వాదిశక్తులును అనుట. ఆదిగాఁగలసుగుణంబులు = మొదలుగాఁగలిగిన మంచిగుణములు. అమరునీకుఁగా = ఒప్పియుండునట్టినీకు. నేనుదగుదునె = అనృత జడ దుఃఖ మలిన ఖండ ప్రకృతిస్వరూపిణినైన నేను దగుదునా—తగను అనుట.

తా॥ ఏపాపములు లేనివాఁడవును, సర్వలోకములకు నియామకుఁడవునైన ఓస్వామీ! విలాసార్థముగా జ్ఞానశక్తి సుఖశక్తి బలశక్తి ఐశ్వర్యశక్తి మొదలగు అనంతశక్తులతోఁగూడి సకలకల్యాణగుణములు గలవాఁడవై సచ్చిదానందపరబ్రహ్మవై ఒప్పునట్టి నీకు శాంత ఘోరమూఢవృత్తులుగల ప్రకృతిరూపిణినైన నేను తగననితా.

౩౧౧.—సీ॥ రూఢిమైఁ బ్రకృతి పూ * రుష కాలములకు నీ - శ్వరుఁడవై భవదీయ * చారుదివ్య
లలిత కళా కౌశ * లమున నభిరతుఁడై - కడఁగు నీరూప మె * క్కడ మహాత్మ
సత్వాది గుణసము * చ్చయ యుక్త మూఢాత్మ - నైన యేనెక్కడ * ననఘచరిత
కోరి నీమంగళ * గుణభూతి దానంబు - సేయంగఁబడునని * చెందు భీతి

తే॥ నంబునిధి మధ్యభాగమం * దమృత ఫేన । పటలపాండుర నిభమూర్తి * పన్నగేంద్ర
భోగశయ్యను బవ్వళిం * పుచును దనరు । నట్టి యున్నతలీల ది * వ్యంబు దలఁప.

టీ॥ రూఢిమై = ప్రసిద్ధముగా. ప్రకృతిపూరుషకాలములకుఁగా — ప్రకృతి=మూలప్రకృతికిని. పూరుష = జీవునికిని. కాలములకుఁగా= జీవేశ్వర జగత్పర విభాగ కారణమగు నిమేషాది ప్రళయాంతమైన కాలమునకును. ఈశ్వరుఁడవై = ప్రభుఁడవై. భవదీయ...కౌశలమునఁగా—భవదీయ=నీదైన. చారు=మనోజ్ఞమయిన. దివ్య=అప్రాకృతమయిన. లలిత=కోమలమయిన. కళా=సచ్చిదానందనిర్మలపరిపూర్ణములనెడు పంచకళలవలని. కౌశలమునఁగా=నేర్పుచేత. అభిరతుఁడై = ఆసక్తిగలవాఁడవై. కడఁగు = ప్రకాశించునట్టి. నీరూపము=నీస్వరూపము. (ఎక్కడ) మహాత్మ=విరాట్స్వరూపుఁడవైన ఓస్వామీ. సత్వాది...మూఢాత్మను—సత్వ=శాంతవృత్తిగల సత్వగుణమే. ఆది = మొదలగు. గుణ=ఘోరమూఢవృత్తులుగల రజోగుణ తమోగుణములయొక్క. సముచ్చయ = సమూహముతోడ. యుక్త=కూడిన. మూఢాత్మను=ప్రకృతియే రూపము గాఁగలదానను. ఐనయేను=అయినట్టినేను, (ఎక్కడ) అనఘచరిత=పాపములేనినడవడిగల ఓస్వామీ. తలఁపఁగ = విచారింపఁగా. కోరి=ఇష్టపడి. నీమంగళగుణభూతి = నీదైన కళ్యాణగుణసంపద. దానంబు సేయంగఁబడును = కోరినవారికి ఇయ్యఁబడును. అని=అనుకొని. చెందుభీతిఁగా=కలిగినభయముతో. అంబునిధి...మరుఁగా—అంబునిధి=సముద్రముయొక్క. మధ్యభాగమందుఁగా = నడిమిప్రదేశమందు. అమృత...శయ్యఁగా—అమృత=అమృతముయొక్కయు. ఫేనపటల=నురుఁగుతెట్టెలయొక్కయు. పాండుర=తెల్లఁదనముతోడ. నిభ= సమానమయిన. మూర్తి=ఆకారముగలవాఁడైన. పన్నగేంద్ర = శేషునియొక్క. భోగ=దేహమనెడు. శయ్యఁగా=పానుపునందు. పవ్వళింపుచుఁగా=పండుకొనుచు. తనరునట్టి = ఒప్పునట్టి. ఉన్నతలీల = గొప్పవిలాసము. దివ్యంబు=అప్రాకృతమైనది.

తా॥ ఓస్వామీ! ప్రసిద్ధముగా విచారించునప్పుడు నీవు మూలప్రకృతికిని జీవునికిని జగజ్జీవ పరవిభాగకారణమైన కాలమునకును కర్తవైన నీసంబంధమయినమనోజ్ఞమై అప్రాకృతమై కోమలమైసచ్చిదానందనిర్మలపరిపూర్ణమయమైప్రకాశించునట్టినీస్వరూపమెక్కడ, శాంత ఘోర మూఢ వృత్తులుగల త్రిగుణాత్మకప్రకృతి స్వరూపిణినైన నేనెక్కడ, నీకునాకు చాలతారతమ్యముగలదు నీవు నీకల్యాణగుణ సంపద భక్తులచేత అపహరింపఁబడునని భయమువలన నేమోయన్నట్టు సముద్రమునడుమ అమృతమువలెను నురుఁగుతెట్టెలవలెను తెల్లఁగా ప్రకాశించునట్టి శ్రీసర్పరాజయిన ఆదిశేషుని దేహమును శయ్యగాఁ జేసికొని యుండునట్టి నీగాంభీర్యరీతి అప్రాకృతమయినది కదా అని తాత్పర్యము.

వ॥ శబ్ద స్పర్శ రూప రస గంధంబు లనియెడుగుణంబులచేతం బరిగ్రహింపఁబడిన మంగళసుందర విగ్రహుండవై, యజ్ఞానాంధకార నివారకంబైన రూపంబుఁ గైకొని, భవదీయులైన సేవకులకు ననుభావ్యంబవైతి, భవత్పాదారవింద మకరంద రసాస్వాదలోలాత్ములైన యోగీంద్రులకైనను, భవన్మార్గంబు స్ఫుటంబుగాదట్లగుటం జేసి, యీ మనుజపశువులకు దుర్విభావ్యంబగుట యేమిచెప్ప, నిట్టియీశ్వరుండవైన నీకు నిచ్ఛ స్వతంత్రంబదియును నాకధికంబుగావున నిన్ను నేననుసరింతు, దేవా నీవకించనుండవై తేని బలిభోక్తలైన బ్రహ్మేంద్రాదు లెవ్వనికొఱకు బలిసమర్పణంబుచేసిరి, నీవు సమస్తపురుషార్థమయుండవనియును, ఫలస్వరూపివనియును, నీయందలి ప్రేమాతిశయంబులం జేసి విజ్ఞానదీపాంకురంబున నిరస్త సమస్తదోషాంధకారులై యిహసౌఖ్యంబులు విడిచి భవదీయ దాససంగమంబె కోరుచుందు, రట్లు సేయనేరక నిజాధికారాంధకారమగ్నులై భవత్తత్త్వంబు దెలిసి బలిప్రక్షేపణంబులు సేయంజాలక మూఢులై సంసార చక్రంబునం బరిభ్రమింతు రదియునుం గాక.

టీ॥ శబ్ద స్పర్శ రూప రస గంధంబులు = శబ్దము స్పర్శము రూపము రసము గంధమును. అనియెడుగుణంబులచేతన్ = అనునట్టి పంచభూత గుణములచేతను. పరిగ్రహింపంబడిన = అంగీకరింపఁబడిన. మంగళసుందరవిగ్రహుండవై = శుభస్వరూపమును చక్కఁదనముగలదియునైన రూపముగలవాఁడవై. అజ్ఞానాంధకారనివారకంబు = అజ్ఞానమనెడుచీఁకటినిపోఁగొట్టునది. అయినరూపంబున్ = అయినట్టిజ్ఞానరూపమును. కైకొని = పరిగ్రహించి. భవదీయులైన = నీవారైన. సేవకులకున్ = అనన్యభక్తులకు. అనుభావ్యంబవు = శ్రవణమనన నిదిధ్యాసములచేత అనుభవింపఁదగినవాఁడవు—ఆరాధింపఁదగినవాఁడవు. అయితి = అయితివి. భవ...త్ములు—భవత్ = నీదైన. పాదారవింద = పాదకమలములవలని. మకరంద = తేనెయొక్క. రస = ద్రవమును. ఆస్వాద = త్రాగుటయందు. లోల = ఆసక్తమైన. ఆత్ములు = మనసుగలవారు. అయినయోగీంద్రులకైనను = అయినట్టి బ్రహ్మవిద్వరిష్ఠులకైనను. భవన్మార్గంబు = నీవిధము. స్ఫుటంబు = స్పష్టము. (కాదు) అట్లగుటం జేసి = కాఁబట్టి. ఈమనుజపశువులకున్ = అజ్ఞానులయిన పశువులవంటి యీమనుష్యులకు. దుర్విభావ్యంబు = తెలిసికోశక్యముకానిది. (అగుట) ఏమిచెప్పన్ = చెప్పవలసినదేమి. ఇట్టి) ఈశ్వరుండవు = సర్వనియామకుఁడవు. (అయిననీకు) ఇచ్ఛ = కోరిక. స్వతంత్రంబు = స్వాధీనమయినది—సర్వస్వతంత్రుఁడవగుటచేత తలఁచినట్టు చేయుదువు అనుట. అదియు = ఆయిచ్ఛయు. నాకున్ = నాకంటెను. అధికంబు = హెచ్చయినది. కావునన్ = కనుక. (నిన్ను నేను అనుసరింతును) దేవా = స్వామీ. (నీవు) అకించనుండవై తేని = ఏమియులేనివాఁడవైనపక్షమున. బలిభోక్తలు = భూతతృప్తికై పెట్టునట్టి ఆహారమును భుజించువారు. (ఐన) బ్రహ్మేంద్రాదులు = బ్రహ్మ యింద్రుఁడు మొదలగువారు. (ఎవ్వనికొఱకు) బలిసమర్పణంబుచేసిరి = బలులను ఇచ్చిరి. (నీవు) సమస్తపురుషార్థమయుండవు = ధర్మము మొదలగు నన్నిపురుషార్థములే స్వరూపముగాఁగలవాఁడవు. (అనియును) ఫలస్వరూపివి = నిరతిశయానందమే స్వరూపముగాఁగలవాఁడవు. (అనియును) శ్రు॥ ఏతస్యైవానందస్యాన్యానిభూతానిమాత్రాముపజీవంతి॥ నీయందలిప్రేమాతిశయంబులంజేసి = నీయందుఁగల నవవిధములైన భక్తిమార్గములయొక్క అతిశయములచేతఁ గలిగిన. విజ్ఞానదీపాంకురంబునన్ = అనుభవజ్ఞానమనెడు దీపముయొక్క పుట్టుకచేత. నిరస్తసమస్తదోషాంధకారులై = పోయిన యెల్లపాపములనెడు చీఁకట్లుకలవారై. ఇహసౌఖ్యంబులు = ఈలోకమునందలి సుఖములను. (విడిచి) భవదీయదాససంగమంబె = నీసేవకులతోడి కూడికనే. కోరుచుందురు = అపేక్షించుచుందురు. (అట్లు చేయనేరక) నిజాధికారాంధకారమగ్నులై = తమ అధికారములనెడు చీఁకట్లయందు అణఁగిపోయినవారై. భవత్తత్త్వంబు = నీస్వరూపమును. తెలిసి = తెలిసికొని. బలిప్రక్షేపణంబులు = బలులుచల్లుటలను—పూజించుటలనుఅనుట. చేయంజాలక = చేయసమర్థులుగాక — నిన్నారాధింపనేరక. మూఢులై = తెలివిమాలినవారై. సంసారచక్రంబునన్ = కళత్ర పుత్రాదిరూప సంసారము అనెడు చక్రమునందు. పరిభ్రమింతురు = తిరుగుచుందురు. అదియునుంగాక = అంతేగాక. నవవిధభక్తివివరణము.

శ్లో॥ శ్రవణంకీర్తనంవిష్ణోఃస్మరణంపాదసేవనం।అర్చనంవందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం॥ అని, మ॥తనుహృద్భాషలసఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా। ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం। బనునీతొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్నమ్మిస। జ్జనుఁడై యుండుటభద్రమంచుఁదలఁతున్ సత్యంబు దైత్యోత్తమా.

తా॥ శబ్దము స్పర్శము రూపము రసము గంధమననెడు పంచభూతగుణములచేత అంగీకరింపఁబడిన అప్రాకృతదివ్యమంగళవిగ్రహము గలవాఁడవై, జననమరణాదులకుకారణమైన అజ్ఞానమనెడు చీఁకటిని పోఁగొట్టఁజాలిన విజ్ఞానస్వరూపమును వహించి, శ్రవణ మనన నిదిధ్యాసములచేత నీసేవకులకు అనుభవింపఁదగిన వాఁడవయితివి, నీపాదకమలములవలని మకరందమును త్రాగుటయందలి ఆసక్తిగల మహాత్ములకుఁగూడ నీస్వరూపము స్పష్టముగాఁ దెలియఁబడదు కాఁబట్టి విజ్ఞానములేక పశువులవలె మెలఁగునట్టి యీమానవులు నిన్ను తెలిసికోలేకపోవుట వింతకాదు, ఇట్టి యీశ్వరుఁడవు కనుకనే నీకు ఇచ్ఛయనునది స్వాధీనముగనున్నది, ఆయిచ్ఛయు నాకంటె హెచ్చయినదికాని తక్కువైనదికాదు కనుక నిన్ను నేను అనుసరించుచున్నాను, స్వామీ! నీవు ఏమియు లేనివాఁడవని చెప్పెడు పక్షమున త్రిలోకపూజ్యులైన బ్రహ్మయింద్రుఁడు మొదలగువారు ఎవనిని పూజించుచున్నారు, నీవు ధర్మార్థ కామ మోక్షస్వరూపుఁడవు, సమస్తఫలములును నీస్వరూపములు, అని యెంచి నీయందుఁగల భక్తివిశేషములచేత కలిగినవిజ్ఞానమనెడు దీపప్రకాశముచేత ఎల్లపాపములు ననెడు చీఁకట్లను పోఁగొట్టి ఈలోకము

నందలి సుఖములను అపేక్షింపక నీసేవకులతోడి సాంగత్యమునే కోరుచున్నారు, పామరులగువారు అట్లు చేయనేర్పులేక తమ తమ అధికారములనెడు చీకట్లలో తగులుకొని నీస్వరూపమును తెలిసికొనను నిన్ను పూజింపను సమర్థులుగాక మూఢులై సంసారము అనునట్టి చక్రమునందు తగులుకొని తిరుగుచుందురు ఇంతేకాదు ఇంకను కొన్నివిశేషములు గలవు చిత్తగింపుము అని తాత్పర్యము.

౩౧౩.—ఆ॥ వర మునీంద్ర యోగి * వర సురకోటిచే। వర్ణిత ప్రభావ * వైభవంబు
కలిగి యఖిలచేత * నులకు విజ్ఞానప్ర। దుండవగుదు వభవ * దురితదూర.

టీ॥ అభవ=పుట్టుకలేనివాఁడవు. దురితదూర = పాపములకు ఎడమయినవాఁడవునైనస్వామీ. వర...కోటిచేన్—వర = శ్రేష్ఠులయిన. మునీంద్ర=వ్యాస నారద సనకసనందనాది మహామునులచేతను. యోగివర = శుకవామదేవాది బ్రహ్మనిష్ఠులచేతను. సురకోటిచేన్ = దేవతాసమూహముచేతను. వర్ణిత ... వైభవంబు — వర్ణిత=వర్ణనచేయఁబడిన. ప్రభావ=మహిమయొక్క. వైభవంబు= సంపద. (కలిగి) అఖిలచేతనులకున్ = ఎల్లప్రాణులకును. విజ్ఞానప్రదుండవు = నిన్నెఱుఁగఁదగిన విజ్ఞానము నిచ్చువాఁడవు. అగుదువు=కాఁగలవు.

తా॥ పుట్టుకలును పాపములును లేనివాఁడవైన ఓస్వామీ! శ్రేష్ఠులయిన వ్యాస నారద సనందనాది మునులచేతను, శుకవామదేవాది బ్రహ్మనిష్ఠులచేతను, దేవతాసమూహముచేతను, బహువిధములవర్ణన చేయఁబడుచున్న మహిమనువహించి ఎల్లప్రాణులకును విశేషజ్ఞానమును కలుగఁజేసి రక్షించుచుందువు అని తాత్పర్యము.

౩౧౪.—వ॥ దేవా భవదీయ కుటిల భ్రూవిక్షేపోదీరిత కాలవేగంబుచేత విధ్వస్త మంగళులగు కమలభవ పాకశాసనాదులం దిరస్కరించినట్టి మదీయ చిత్తంబున.

టీ॥ దేవా=స్వామీ. భవదీయ... చేతన్—భవదీయ = నీదైన. కుటిల=వంకరైన. భ్రూవిక్షేప=బొమముడిచేత.(లేక)కనుబొమలకదలికచేత. ఉదీరిత = పుట్టిన. కాల=నిమేషాదికాలముయొక్క. వేగంబుచేతన్ = వడిచేత. విధ్వస్తమంగళులు = చెఱుపఁబడిన మేలులుకలవారు—సృష్టి స్థితిలయాదులను పొందుచున్నవారు. అగు ...నాదులన్—అగు=అగునట్టి. కమలభవ=బ్రహ్మ. పాకశాసన= ఇంద్రుఁడు. ఆదులన్ = మొదలగువారిని. తిరస్కరించినట్టి=తిరస్కారముచేసిన. మదీయచిత్తంబునన్=నామనసునందు.

తా॥ స్వామీ! నీకనుబొమలయొక్క వికారవు కదలికచేత జనించిన కాలవిశేషమువలన సృష్టిస్థితిలయాదులుగలవారగు బ్రహ్మయింద్రుఁడు మొదలుగాఁగల దేవతలను తిరస్కరించిన నామనసునందు అని తాత్పర్యము.

౩౧౫.—చ॥ నినువరియించినం బెలుచ * నీరజలోచన శార్ఙ్గసాయకా
సన నినదంబులన్ సకల * శత్రు ధరాపతులన్ జయించి బో
రనఁ బశుకోటిఁ దోలు మృగ * రాజునిజాంశము భూరిశక్తిఁ గై
కొనిన విధంబునన్నను న * కుంఠిత శూరతఁ దెచ్చితీశ్వరా.

టీ॥ ఈశ్వరా=స్వామీ. నినువరియించినన్=నిన్నుకోరఁగా. నీరజలోచన =కమలములవంటి కన్నులుగలవాఁడా. పెలుచన్= భయంకరముగా. శార్ఙ్గసాయకాసన=శార్ఙ్గమనెడు ధనుస్సునుండి కలిగిన. నినదంబులన్=ధ్వనులచేత. సకలశత్రుధరాపతులన్=ఎల్ల శత్రురాజులను. జయించి=గెలిచి, బోరనన్ = శీఘ్రముగా, పశుకోటిన్=అల్పమృగములసమూహములను. తోలు = తఱుమునట్టి. మృగరాజు=సింహము. నిజాంశము=తనకురావలసిన ఆమిషభాగమును. భూరిశక్తిన్=అధికబలములో. కైకొనినవిధంబునన్ = తీసికొన్నరీతిగా. ననున్=నన్ను. అకుంఠితశూరతన్ = మొక్కపోని శూరత్వముచేత. తెచ్చితి=తీసికొనివచ్చితివి.

తా॥ తామరలవంటి కన్నులుగల ఓస్వామీ! నేను నిన్ను కోరఁగా నీవు నీధనుస్సునందుండి భయంకరముగాఁబుట్టిన ధ్వనిచేతనే నీశత్రువులైన రాజులనందఱిని జయించి నక్కలు మొదలగు చిల్లరమృగములను బెదరించి తఱిమి తనకు చేరవలసిన మాంసభాగమును తీసికొనిపోవునట్టి సింహమువలె నన్ను అత్యంత శూరత్వముచేత తీసికొనివచ్చితివి అని తాత్పర్యము.

౩౧౬.—ఉ॥ అట్టి నృపాల కీటముల * నాజి నెదుర్పఁగ లేనివాని య
ట్లొట్టిన భీతిమై నిటు ప * యోధి శరణ్యుఁడవైతి వింతయున్
నెట్టన మాయగాక యివి * నిక్కములే భవదీయ భక్తులై
నట్టి నరేంద్ర మౌళిమణు * లంచిత రాజ్యసుఖమ్ములుదంబునన్.

టీ॥ అట్టినృపాలకీటములన్ = అటువంటి రాచపురుగులను. ఆజిన్=యుద్ధమునందు. ఎదుర్పఁగలేనివానియట్లు = ఎదిరింపలేనివానివలె. ఒట్టినభీతిమైన్ = కలిగినభయముతో. ఇటు = ఈవిధముగా. పయోధిశరణ్యుఁడవు=సముద్రము రక్షకముగాఁగలవాఁడవు. (ఐతివి) ఇంతయున్=ఇదియంతయు. నెట్టనన్ = మిక్కిలి. మాయగాక = కపటముగాక. ఇవినిక్కములే = ఇట్టిపనులన్నినిజ

ములా, భవదీయభక్తులు = నీసేవకులు. (ఐనట్టి) నరేంద్రమహాళి మణులు=అంగ పృథు భరత యయాతి గయాంబరీషాదిరాజశిరోమణులు. అంచితరాజఋషులు = యోగ్యులగు జనకాదిరాజఋషులు. ముదంబునన్=సంతోషముతో.

తా॥ స్వామీ! నీవు అటువంటి రాచపురుగులను ఎదిరింపలేక భయపడిన వానివలె ఈసముద్రమును రక్షకముగాఁ జేసికొని యిక్కడనున్నావు ఇది నీస్వభావమేనా కాదుగనుక ఇదియంతయు టక్కు అగును అది యెట్లు అనఁగా ఏరాజులు నిన్ను భక్తితో సేవింతురో వారందఱు ఋషులయి వర్తించుచున్నారు అట్టివారు సంతోషముతోనని మీఁదికి అన్వయము.

౩౧౭.—ఆ॥ వితత రాజ్యగరిమ ✱ విడిచికాననముల । నాత్మలందు మీప ✱ దాబ్జయుగము
వలఁతిగాఁగనిలిపి ✱ వాతాంబుపర్ణాశ । నోగ్ర నియతులగుచు ✱ నుందురభవ.

టీ॥ అభవ = పుట్టుక లేనివాఁడవైన ఓస్వామీ. వితతరాజ్యగరిమ=విశాలమైన రాజ్యముయొక్క గౌరవమును. విడిచి=వదలి. కాననములన్ = అడవులందు. ఆత్మలందున్ = తమ మనసులలో. మీపదాబ్జయుగము = మీపాదకమలములజంటను. వలఁతిగాఁగన్= అనువుగా. నిలిపి=ఉంచి. వాతాంబుపర్ణాశనోగ్రనియతులు—వాత= గాలియు. అంబు=జలమును. పర్ణ=ఆకులును. అశన = ఆహారములుగా. ఉగ్రనియతులు=భయంకరమైననియమముగలవారు. (అగుచు) ఉందురు=ఉండుదురు.

తా॥ ఓస్వామీ! ఆరాజులు సంతోషముతో నేను నాది అను విచారములు లేక గొప్పరాజ్యముయొక్క గౌరవమును మాని అడవులకుపోయి మనసులలో మీపాదములను స్మరించుచు గాలి నీళ్లు ఆకులు ఆహారముగాఁజేసికొని సుఖించుచుందురనితాత్పర్యము.

౩౧౮.—మ॥ విమలజ్ఞాన నిరూఢులైన జనముల్ ✱ వీక్షింప మీపాద కం
జమరందస్ఫుట దివ్యసౌరభము నా ✱ స్వాదించి నిర్వాణ రూ
పము సత్పూరుష వాగుదీరితము శో ✱ భా శ్రీనివాసంబునౌ
మిము సేవింపక మానవాధముని దు ✱ ర్మేధాంధు సేవింతునే.

టీ॥ విమలజ్ఞాననిరూఢులు—విమల=నిర్మలమగు[illegible] రాగద్వేషాదులు లేని. జ్ఞాన=ఆత్మానాత్మజ్ఞానముచేత. నిరూఢులు = ప్రఖ్యాతిపడిన వారు. జనములు=అనట్టి సత్పురుషులు. వీక్షింపన్=చూడఁగా. మీపాద... సౌరభమున్—మీ= మీదైన. పాద = అడుగుల నెడు. కంజ = తామరలయొక్క. మరంద = తేనెయొక్క. స్ఫుట = చక్కఁగాఁదోఁచుచున్న. దివ్య=అప్రాకృతమైన. సౌరభమున్= పరిమళమును. ఆస్వాదించి =[illegible]. నిర్వాణరూపమున్= మోక్షస్వరూపమును. సత్పూరుషవాగుదీరితమున్ = సజ్జనులనోటిచేత ఉచ్చరింపఁబడునదియు. శోభాశ్రీనివాసంబు=కాంతిసంపదకు ఉనికిపట్టును. ఔ=అగునట్టి. మిమున్=మిమ్ము. సేవింపక=కొలువక. దుర్మేధాంధున్ = చెడ్డబుద్ధిచేత కన్నుగాననివాఁడైన. మానవాధమునిన్ = నీచమనుష్యుని. సేవింతునే=కొలుతునా.

తా॥ పరిశుద్ధమైన జ్ఞానముచేత మేలిమిని వహించిన సత్పురుషులందఱు చూచుచుండఁగా మీపాదకమలములవలని మకరందము యొక్క పరిమళమును మూర్కొనుచు మోక్షస్వరూపులును, సత్పురుషులచేత సదాస్మరింపఁబడుచుండువారును, మహాప్రకాశ సంపద గలిగినవారును అగు మిమ్మును కొలువక బుద్ధిహీనుఁడైన ఒక నీచ మనుష్యుని నేను సేవింతునాయని తాత్పర్యము.

వ॥ మఱియును దేవా భూలోకంబునందును, నిత్యనివాసంబులందును, సకలప్రదేశంబులందును, జగదీశ్వరుండవైన నిన్ను నభిమతంబులైన కామరూపంబులు గైకొని వరింతు భవదీయ చరణారవింద మకరందాస్వాదనచాతుర్యభృంగివైనకామిని యతిహేయంబైన త్వక్శ్మశ్రురోమనఖ కేశంబులచేతఁ గప్పంబడి యంతర్గతంబైనమాంసాస్థిరక్త క్రిమి విట్కఫ పిత్తవాతంబుల భీభత్సంబైన నరాధముని మూఢాత్మవై కామించునే యదియునుంగాక.

టీ॥ మఱియును=ఇదిగాక. దేవ = స్వామీ. (భూలోకంబునందును) నిత్యనివాసంబులందున్=ఎల్లప్పుడు నివాసము చేయునట్టి శ్రీవైకుంఠము సత్పురుషహృదయములు మొదలగు చోటులందును. సకలప్రదేశంబులందును=తక్కినయెల్లచోట్లయందును, జగదీశ్వరుండవు=లోకమునకుప్రభుఁడవు. (అయిననిన్ను) అభిమతంబులైన= కోరినవైన. కామరూపంబులు=ఇచ్ఛారూపములను. కైకొని=పొంది. వరింతున్ = నిన్నువరునిగాఁ జేసికొనుచుందును. భవదీయ... భృంగి—భవదీయ=నీదైన. చరణారవింద=పాదకమలములయొక్క. మకరంద=పూఁదేనెను. ఆస్వాదన=[illegible]. చాతుర్య= నేర్పుగల. భృంగి=[illegible]. కామిని = [illegible]. అతిహేయంబైన = [illegible]. త్వక్... చేతన్—త్వక్ = చర్మము. శ్మశ్రు = మీసములు. రోమ=మేనివెంట్రుకలు. నఖ=గోళ్లు. కేశంబులచేతన్ = తలవెంట్రుకలు వీనిచేతను. కప్పంబడి=ముఱుఁగుచేయఁబడి. అంతర్గతంబైన... బులన్— అంతర్గతంబైన=లోపల పొందినదైన. మాంస=మాంసము. అస్థి= ఎముకలు. రక్త=నెత్తురు. క్రిమి=సులిపురుగులు. విట్ = మలము. కఫ=గళ్ల. పిత్త=పైత్యము. వాతంబులన్=గాలి వీనిచేతను. భీభత్సంబు=రోఁతగలది. (అయిన) నరాధమునిన్ = నీచమానవుని. మూఢాత్మవై= తెలివిమాలిన బుద్ధిగలదై. కామించునే=కోరునా. (యదియునుంగాక)

తా॥ ఓ[illegible]! ఇదిగాక యీభూలోకమునందును, వైకుంఠము మొదలగునిత్యనివాసములయందును, తక్కినచోట్లయం

దును, నీవు కోరిన రూపమునుపొంది లోకములకు ఏలినవాఁడవైన నిన్ను భర్తగాఁ జేసికొనుచుందును, అట్టి నీపాదకమలములవలని తేనెను త్రాగుటయందలి నేర్పుగల తుమ్మెదయైన కాముకురాలు మిక్కిలి రోయఁదగిన తోలు మీసము మేనివెంట్రుకలు తలవెండ్రుకలుమొదలైనవానిచేత కప్పఁబడిన దేహమును ధరించిన ఒక అల్ప మనుష్యుని మాంసము నెత్తురు ఎముకలు నులిపురుగులుమలము గళ్ల పిత్తము మొదలయినవానిచేత రోఁతగలవానిని తెలివిలేక కోరునా కోరదు అని తాత్పర్యము.

౩౨౦.—సీ॥ నీరదాగమ మేఘ * నిర్యత్పయఃప్రపాన - చాతకం బేగునే * చౌటి పడెకుఁ
బరిపక్వ మాకంద * ఫలరసంబులు గ్రోలు - కీరంబుచనునె దు * త్తూరములకు
ఘనరవాకర్ణనో * త్కలిక మయూరము - గోరునే కఠిన ఝి * ల్లీ రవంబుఁ
గరికుంభపిశిత స * ద్గ్రాస మోదితసింహ - మరుగునే శునకమాం * సాభిలాషఁ
తే॥ బ్రవిమలాకార భవదీయ * పాదపద్మ । యుగసమాశ్రయ నైపుణో * ద్యోగచిత్త
మన్యుఁ జేరునె తనకుపా * స్యంబుఁగాక । భక్తమందార దుర్భవ * భయవిదూర.

టీ॥ భక్తమందార=సేవకులకుకల్పవృక్షమయిన. దుర్భవభయవిదూర=చెడ్డపుట్టుకలవలనిభయమునకు మిక్కిలి ఎడమైనవాఁడా. నీరదా...చాతకంబు—నీరదాగమ = వర్షాకాలమునందలి. మేఘ= మబ్బువలననుండి. నిర్యత్=జాఱుచున్న. పయః = నీళ్లను. ప్రపాన= త్రాగునట్టి. చాతకంబు = వానకోయిల. చౌటిపడెకున్ = చౌటి నేలలో వానకురియఁగా నీళ్లునిలిచిన చిన్నపల్లమునకు. ఏగునే = పోవునా. పరిపక్వ...రసంబులు — పరిపక్వ = చక్కఁగాపండిన. మాకంద=తియ్యమామిడియొక్క. ఫల = పండుయొక్క. రసంబులు=రసములను. గ్రోలు=త్రాగునట్టి. కీరంబు=చిలుక. దుత్తూరములకున్=ఉమ్మెత్తచెట్లకు. చనునె = పోవునా. ఘన...మయూరము—ఘనరవ=మేఘధ్వనిని. ఆకర్ణన=వినుటయందు. ఉత్కలిక= ఉత్కంఠగలిగిన—తహతహగల. మయూరము=నెమలి. కఠినఝిల్లీ రవంబున్=విననింపుగానిచిమ్మటమ్రోఁతను. కోరునే=వినవపేక్షించునా. కరి...హము—కరి=ఏనుఁగులయొక్క. కుంభ=కుంభస్థలమునందలి. పిశిత=మాంసమనెడు. సద్గ్రాస = మంచి ఆహారముచేత. మోదిత=సంతోషపెట్టఁబడిన(సింహము) శునకమాంసాభిలాషన్= కుక్కయొక్క మాంసమునందలి అపేక్షచేత. అరుగునే=పోవునా. ప్రవిమలాకార=మిక్కిలి నిర్మలమైన ఆకారముగల ఓస్వామీ. భవ...చిత్తము—భవదీయ = నీదైన. పాదపద్మ = అడుగుఁదామరల యొక్క. యుగ=జంటను. సమాశ్రయ = ఆశ్రయించుటయందలి. నైపుణ = నేర్పునకు. ఉద్యోగ = యత్నముచేయునట్టి. చిత్తము= మనస్సు. (తనకు) ఉపాస్యంబుఁగాక=సేవింపఁదగినదానినేగాక. అన్యున్=ఇతరుని. చేరునె=సమీపించునా.

తా॥ సేవకులకు కోరినకోరికలనిచ్చుటయందుకల్పవృక్షమువంటి వాఁడును, చెడ్డజన్మములవలని భయమును దూరముగా తొలఁగించువాఁడునైన ఓస్వామీ! వర్షాకాలమునందలి మేఘమునందుండి పడుచున్న నీటినిత్రాగునట్టి వానకోయిల చౌటిపడెకును, తియ్యమామిడి పండురసమునుత్రాగునట్టి చిలుక ఉమ్మెత్తకాయలకును, మేఘధ్వనిని విన తహతహపడెడి నెమిలి చిమ్మటమ్రోఁతలను, ఏనుఁగు తల మెదడు తిను సింహము కుక్క మాంసమును అపేక్షింపనట్లు నీపాద సేవయందు ఆసక్తమయినమనస్సు అల్పులైన యితరులను సేవింపఁ గోరదు తనకుఉపాసింపఁదగినదానినేఉపాసించునుఅనితాత్పర్యము.

౩౨౧.—క॥ వాసవవందిత భవ కమ । లాసన దివ్యప్రభా స * భావలి నెపుడున్
నీసమధిక చారిత్రక । థాసురుచిరగాన మవిత * థంబయి చెల్లున్.

టీ॥ వాసవవందిత=ఇంద్రునిచేతపొగడఁబడుచున్న ఓస్వామీ. భవ...వలిన్—భవ=రుద్రునియొక్క. కమలాసన=బ్రహ్మయొక్క. దివ్య=అప్రాకృతములైన. ప్రభా = కాంతులుగల. సభావలిన్ = సభలయందు. ఎపుడున్=రాత్రిపగళ్లయందు. నీసమ...గానము— నీ=సృష్టి స్థితి లయకారణుఁడవైన నీయొక్క. సమధిక = మిక్కిలి మెచ్చయిన. చారిత్ర=సగుణనిర్గుణరూపమైనప్రవర్తనముయొక్క. కథా=పలుకుటయొక్క. సురుచిర = మనోజ్ఞమైన — వినసొంపైన. గానము=రాగ తాళ వాద్య నృత్యాదులతోడి సంగీతము. అవితథంబయి=విరామము లేనిదై—సత్యమై. చెల్లున్=సాగుచుండును.

తా॥ ఇంద్రునిచేత కొనియాడఁబడుచున్న ఓస్వామీ! శివుఁడు బ్రహ్మమొదలైన దేవతాశ్రేష్ఠుల సభలయందు నీచరిత్రమ్ము తాళ రాగవాద్యనృత్యములతోడసంగీతఫక్కిగపాడఁబడుచుండుననితా.

౩౨౨.—క॥ ధరణీనాథులు తమతమ । వరవనితా మందిరముల * వసియించుచు గో
ఖరమార్జాలంబులగతి సు । స్థిరబద్ధులగుదురు నిన్నుఁ * దెలియని కతనన్.

టీ॥ ధరణీనాథులు = శిశుపాల జరాసంధాదులయిన రాజులు. నిన్నున్ = సర్వేశ్వరుఁడవైననిన్ను. తెలియనికతనన్ = (ఐశ్వర్య గర్వమువలన) తెలిసికొననికారణముచేత. తమ...ములన్ — తమతమ=తమతమవియైన. వర=శ్రేష్ఠములైన—తమమనసులలోమిక్కలి మెక్కువనితోఁచుచున్న. వనితామందిరములన్ = భార్యలయిండ్లయందు. వసియించుచున్=కాపురములుచేయుచు. గోఖరమార్జాలంబులగతిన్—గో = ఎడతెగని కృషిక్రియలచేత వృషభములవలెను. ఖర = కేవలభారవాహకృత్యములచేత గాడిదలవలెను. మార్జాలంబులగతిన్=ఆహారహింసాకృత్యములచేత పిల్లులవలెను. సుస్థిరబద్ధులగుదురు=మోహపాశములచేత దిట్టముగ కట్టఁబడినవారగుదురు.

తా॥ ఓస్వామీ! ధనమదాంధులైన శిశుపాలాది రాజులు సర్వలోకనాయకుఁడవైన నిన్ను తెలిసికొననందునభార్యాపుత్రాదులుగల సంసారారణ్యములోఁ జిక్కి మోహపాశములచేతదిట్టముగ కట్టఁబడి యెద్దులవలె గాడిదలవలె పిల్లులవలె నుందురని తాత్పర్యము.

౩౨౩.—ఆ॥ జలజనాభ సకల * జగదంతరాత్మవై । నట్టి దేవ నీప * దారవింద
యుగళసానురాగ * యుక్తమై నామది । గలుగునట్లుగాఁగఁ * దలఁపుమనఘ.

టీ॥ జలజనాభ=బొడ్డునందు చతుర్ముఖబ్రహ్మ పుట్టినట్టితామర గలవాఁడవును. దేవ = విజ్ఞానస్వరూపుఁడవగుటచేత స్వయం ప్రకాశుఁడవును. అనఘ=నిత్యానందస్వరూపుఁడవగుటచేత దుఃఖ రహితుఁడవునైన ఓస్వామీ ! సకలజగదంతరాత్మవు–సకలజగత్= అధిదేవతలును, ఇంద్రియములును, విషయములును,రూపములుగాఁ గల స్వర్గ మర్త్య పాతాళములనెడు త్రిలోకములయందును, లేక (జాయతేగచ్ఛతఇతిజగత్) అని వ్యుత్పత్తి గనుక నీయందే పుట్టి నీయందే లయించుచున్న లోకమునందు. (యతోవాఇమానిభూతాని జాయంతే, ఏనజాతానిజీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి) అని ఉపనిషత్తు. శ్లో ॥ యతస్సర్వాణి భూతాని భవంత్యాదియుగాగమే। యస్మింశ్చప్రళయంయాంతి పునరేవయుగక్షయే । తస్యలోకప్రధానస్య జగన్నాథస్యభూపతే॥ అని విష్ణుసహస్రనామము. శ్లో॥ లీయతేగమ్యతేయత్రవిశ్వం యేనచరాచరం । తదేతల్లింగమిత్యుక్తం లింగతత్త్వపరాయణైః । లీయతేలయమిత్యుక్తం గమ్యతేసృష్టిరుచ్యతే॥ అనిలింగపురాణమును గనుక పరబ్రహ్మమైన నీయందే లోకము పుట్టిగిట్టుచున్నది అట్టి ఆలోకమునందు. అంతరాత్మవు=నిండియున్నవాఁడవు. శ్రు॥ యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతేశ్రూయతేపివా । అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః॥అని. (అయినట్టి) నీపదార...యుక్తమై–నీపదారవిందయుగళ=నీపాదపద్మములజంటయందు. సానురాగయుక్తమై= అనన్యభక్తితోఁగూడినదై. నామదిగలుగునట్లుగాఁగన్ = నామనస్సునిలుచునట్లుగా.తలఁపుము=నీదివ్యాంతరంగమందుతలంచుము.

తా॥ బొడ్డునందుబ్రహ్మపుట్టినట్టి పద్మముగలవాఁడవును,విజ్ఞానస్వరూపుఁడవుగనుక నీయంతట నీవే ప్రకాశించుచున్నవాఁడవును, నిరతిశయానందస్వరూపుఁడవు గనుక దుఃఖములు లేనివాఁడవును అయిన ఓస్వామీ ! స్థావర జంగమ రూపమయిన ప్రపంచమందు అంతటనిండియున్నట్టి నీపాదారవిందభక్తి నామనస్సునం దెల్లప్పుడు నిలుచునట్లు అనుగ్రహింపుమని తాత్పర్యము.

౩౨౪.—ఆ॥ పృథు రజోగుణ ప్ర * వృద్ధమైనట్టి నీ । దృష్టిచేత నన్నుఁ * దేరకొనఁగఁ
జూచుటెల్లఁ బద్మ * లోచన నామీఁది । ఘనదయార్ద్రదృష్టి * గాఁదలంతు.

టీ॥ పద్మలోచన = తామరలవంటి కన్నులుగల ఓ స్వామీ, పృథు...చేతన్–పృథు=గొప్పదియైన–అఖండమైన. రజోగుణ= సృష్టికారణమైన రజోగుణముచేత. ప్రవృద్ధము = వృద్ధిపొందుచున్నది. (అయినట్టి) నీదృష్టిచేతన్=నీచూపుచేత, (నన్ను) తేరకొనఁగన్ = సంబంధములేనివిధముగా — అనాదరముగా, చూచుటెల్లన్ = చూచుటంతయు. నామీఁది...దృష్టిగాన్–నామీఁది = నాపైఁగల. ఘన = అధికమయిన. దయా = దయారసముచేత. ఆర్ద్ర=తడిసిన. దృష్టిగాన్=చూపుగా. తలంతున్=ఎంతును.

తా॥ ఓస్వామీ! నీవు మిక్కిలి రాజసమయినచూపుతో నన్ను ఆదరములేనట్టు చూచుటంతయు నేనునాయందుఁగలమిక్కుటమైన, దయతోఁ గూడినదైన చల్లని చూపుగాఁ దలఁతునని తాత్పర్యము.

వ॥ అదియునుంగాక మధుసూదన నీవాక్యంబులు మిథ్యగావు తల్లివచనంబు కూఁతున కభిమతంబుగాదె యౌవనా రూఢమదంబున స్వైరిణియగుకామిని పురుషాంతరాసక్త యగుటవిచారించి పరిజ్ఞానియైనవాఁడువిడుచు నవివేకి యయినపురుషుం డింద్రియలోలుండై రతిందగిలి దానివిడువనేరక పరిగ్రహించి యుభయలోకచ్యుతుండగునట్లు గావున నీ వెఱుంగనియర్థంబుగలదేయని విన్నవించిన రుక్మిణీదేవివచనంబులకుఁ గృష్ణుండు సంతసిల్లి యిట్లనియె.

టీ॥ మధుసూదన=మధువను రాక్షసునిఁజంపిన ఓస్వామీ, అదియునుంగాక = నేను అట్లు తలఁచుటయేకాక. నీవాక్యంబులు = నీమాటలును, మిథ్యగావు=అబద్ధములుగావు, తల్లివచనంబు=తల్లియొక్కమాట. కూఁతునకున్ = కొమార్తకు, అభిమతంబుగాదె= ఇష్టమయినదేకదా. యౌవనారూఢమదంబునన్ = వయసెక్కిన క్రొవ్వుచేత, స్వైరిణి=విచ్చలవిడిగాఁ దిరుగునట్టిది. అగుకామిని= ఐనఆఁడుది. పురుషాంతరాసక్త=అన్యపురుషునియం దాసక్తిగలది. అగుటన్=ఔటను, విచారించి=తెలిసికొని.పరిజ్ఞానియైనవాఁడు= మంచివివేకముగలవాఁడు.విడుచున్=విడిచిపెట్టును.అవివేకి=తెలివిమాలినవాఁడు, అయినపురుషుండు=ఐనట్టిమనుష్యుఁడు. ఇంద్రియలోలుండై=ఇంద్రియవిషయములందాసక్తుఁడై. రతిన్=క్రీడయందు. తగిలి=అపేక్షపడి. దానిన్ = అట్టి ఆఁడుదానిని, విడువనేరక= విడిచిపెట్టలేక. పరిగ్రహించి = చేపట్టి. ఉభయలోకచ్యుతుండు= ఇహపరలోకములు రెంటియందలి సుఖములవలనను జాఱినవాఁడు, (అగును) అట్లుగావునన్=అట్లగుటచేత, నీయెఱుంగనియర్థంబు = నీవు తెలిసికొననివిషయము, కలదే = ఉన్నదా. అనివిన్నవించినన్= అని మనవిచేయఁగా, రుక్మిణీదేవివచనంబులకున్ = రుక్మిణీదేవి మాటలకు. (కృష్ణుండు) సంతసిల్లి=సంతోషించి. (ఇట్లనియె)

తా॥ ఓస్వామీ! నేనట్లు తలఁచుటయేగాక నీమాటలును నిజములే యవును, తల్లిమాట కూఁతునకు ఇష్టముగాక పోవునా పోదు అయినను యౌవనమదముచేత విచ్చలవిడిగాఁదిరుగనేర్చినఆఁడుది పరపురుషునియం దాసక్తురాలగుట తెలిసికొని వివేకియగువాఁడు అట్టిదానిని విడిచిపెట్టును అవివేకియగువాఁడు ఇంద్రియార్థముల వలన ఆసక్తుఁడై క్రీడయందంటిన చిత్తముతో అట్టి ఆఁడుదానిని విడిచిపెట్టనేరక ఇహపరలోకములు రెంటియందును సుఖమును పొందఁజాలకపోవును ఇదియంతయు నేను నీకు చెప్పవలెనా! నీవు ఎఱుగనివిషయము ఏదికలదు అని రుక్మిణీదేవి విన్నవింపఁగా ఆమె మాటలకు సంతోషించి కృష్ణుఁ డిట్లు పలికెనని తాత్పర్యము.

## (*) కృష్ణుండు రుక్మిణీదేవిని యూఱడించుట. (*)

౩౭౬.—చ॥ అలికులవేణి నవ్వులకు * నాడినమాటల కింత నీమదిం
గలఁగఁగ నేల వేఁటలను * గయ్యములన్ రతులందు నొవ్వఁగాఁ
బలికిన మాట లెగ్గులని * పట్టుదురే భవదీయ చిత్తముం
దెలియఁగఁ గోరి యేఁబలికి * తిన్ మదిలో నిటు గుంద నేటికిన్.

టీ॥ అలికులవేణి = తుమ్మెదబారునుబోలిన జడగల ఓరుక్మిణీ. నవ్వులకునాడినమాటలకున్=వేడుకగా చెప్పినమాటలకు. ఇంత= ఇంతవిశేషముగా. నీమదిన్ = నీమనస్సునందు. కలఁగఁగనేల = కలఁతనొంద నేమిటికి. వేఁటలన్=వేఁటాడుటలయందును. కయ్యములన్ = యుద్ధములయందును. రతులందున్ = క్రీడలయందును. నొవ్వఁగాన్ = నొచ్చుకొనునట్టుగా. పలికినమాటలు = చెప్పిన మాటలు. ఎగ్గులు=కీడుమాటలు. (అని) పట్టుదురే=గ్రహింతురా. ఏన్=నేను. భవదీయచిత్తమున్=నీమనసును. తెలియఁగన్=తెలిసికొనను. కోరి=అపేక్షించి. పలికితిన్=అట్లుపలికితిని. ఇటు=ఈవిధముగా. మదిలోన్=మనసునందు. కుందనేటికిన్ = దుఃఖింపనేల.

తా॥ ఓరుక్మిణీ ! నేను వేడుకగా ఆడిన మాటలకు నీమనసున నింతకలఁత పుట్టనేల వేఁటాడునపుడును,యుద్ధముచేయునపుడును, క్రీడించునపుడును మనస్సు నొవ్వ మాటలాడినను అవి కీడుమాటలు అని తలఁపరాదు నీమనసు తెలిసికోఁగోరి అట్లు పలికినానుగాని వేఱుకాదు కాఁబట్టి నీవు నీమనసున చింతిల్ల నక్కఱలేదు అని కృష్ణుఁడు పలికెనని తాత్పర్యము. వ॥ అదియునుంగాక.

౩౭౭.—ఉ॥ కిన్కలు ముద్దుఁబల్కులును * గెంపుఁగనుంగవ తియ్యమోవియున్
జంకెలుఁ దేరి చూపు లెక * సక్కెములు న్నెలవంక బొమ్మలుం
గొంకక వీడనాడుటలుఁ * గూరిమియుంగల కాంతఁగూడుటల్
అంకిలి లేక జన్మఫల * మబ్బుట గాదె కురంగలోచనా.

టీ॥ కురంగలోచనా = లేడి కన్నులవంటి కన్నులుగలదానా. కిన్కలు=ప్రణయకోపములును. ముద్దుఁబల్కులును = ముద్దుమాటలును. కెంపుఁగనుంగవ=ఎఱ్ఱని కన్నుల జతయును—ఉరిమిచూచుటలును. తియ్యమోవియున్=మధురమైన పెదవియును. ఉ॥ కన్నులు మోవి చన్నుగవకంఠము చెక్కులుముక్కుఫాలమున్ । మున్నుగఁ జుంబనంబునకు మూలములయ్యెనుగక్షయుగ్మముల్ । గ్రొన్ననవిల్తునిల్లునుద్రికోణముఖంబును జుంబితంబులై। యున్నవహించుదేశ హితమొప్పఁగలాటవధూటియింపునన్ ॥ అని యున్నదిగావున నీపద్యమందలి దశవిధస్థానములను నమితము స్ఫురితము ఘటితము భ్రాంతము తిర్యగము పీడితము అనువదనము అన్వర్థము ప్రాతిబోధకము ఛాయకము క్రాంతము అను (౧౫) భేదములచేత చుంబించుటయును అనుట. వీని వివరణములు కొక్కోకశాస్త్ర ప్రథమాశ్వాసమున (౧౩౦) వ పద్యము మొదలుగఁ జూడఁదగును. జంకెలును = బెదరింపుమాటలును. తేఱిచూపులును=తేటఁదనముగలచూపులును. ఎకసక్కెములును=పరిహాసములును. నెలవంకబొమ్మలును=చంద్రరేఖవలె వంపుగానుండు కనుబొమ్మలును. లేక, నఖక్షతములును. వ ॥ కరములు నూరుయుగ్మములు గక్షములున్గటిపార్శ్వపృష్ఠకంధరహృదయస్తనద్వయము తానముతానఖరక్షతాళికిన్ । విరహావిదేశయానసవవిభ్రమకోపబుతుప్రమత్తలన్ । నరులతిచండవేగమున నాటరుమార్ధ్రవమాచరింపుచున్ ॥ అని యున్నదిగనుక యీపద్యమునఁజెప్పిన తొమ్మిదిస్థానములయందు ఛురిత అర్ధచంద్ర మండల మయూర శశప్లుత కుముదపత్రములనెడు భేదములచేత గోళ్లతో నొక్కుటలు వీనివివరణము కొక్కోకశాస్త్ర ప్రథమాశ్వాసమున (౧౪౪) గవ పద్యము మొదలుగఁ జూడఁదగును. కొంకక=సంకోచింపక. వీడనాడుటలు = ఖండితపుమాటలాడుటయును. కూరిమియున్=ప్రేమయు. కల = కలిగిన. కాంతన్ = ప్రియురాలిని. కూడుటలు=కూడుకొనుటలు. అంకిలిలేక=అడ్డిలేక. జన్మఫలము= పుట్టినందులకైనప్రయోజనము. అబ్బుటగాదె=లభించుటకదా.

తా॥ ఓరుక్మిణీ! ప్రణయకోపము మొదలగు విలాసచేష్టలుకలిగిన ప్రియురాలినిగూడి సుఖించుట ఈజన్మమెత్తినందులకు పొందగలఫలముగాక వేఱుకాదు అని తాత్పర్యము.

వ॥ అని మఱియు నిట్లనియె.

౩౭౮.—ఉ॥ నీవు పతివ్రతామణివి * నిర్మల ధర్మ వివేక శీల స
ద్భావవు నీమనోగతులఁ * బాయక యెప్పుడు నస్మదీయ సం
సేవయ కాని యన్యము భ * జింపవు పుట్టిననాటనుండి నీ
భావ మెఱింగియుండియును * బల్కినతప్పు సహింపు మానినీ.

టీ॥ మానినీ=ఓరుక్మిణీ. (నీవు) పతివ్రతామణివి=పతివ్రతలలో శ్రేష్ఠురాలవు. నిర్మల...ద్భావవు—నిర్మల=పరిశుద్ధమయిన. ధర్మ= ధర్మమును. వివేక=విమర్శించుటయే. శీల=నడవడిగాఁగల. సద్భావవు = మంచిస్వభావముగలదానవు. నీమనోగతులన్ = నీమనస్సునందునునడకయందును. పాయక=ఎడతెగక. ఎప్పుడున్=ఎల్లప్పుడును. అస్మదీయసంసేవయకాని=నాకొలువేగాని. అన్యము=ఇతరమును. భజింపవు=సేవింపవు. పుట్టిననాటనుండి=నీవుపుట్టినదినము మొదలుకొని. నీభావము = నీస్వభావము. (ఎఱింగియుండియును)

పల్కినతప్పు = నేనునిందించిననేరమును. సహింపు = ఓరువుము.

తా॥ ఓరుక్మిణీ ! నీవు పతివ్రతలలో శ్రేష్ఠురాలవు నిర్మలమైన ధర్మమును నడపునట్టి స్వభావముగలదానవు నీవు సర్వకాలములందును త్రికరణశుద్ధిగా నా సేవ చేయుచుందువుగాని మఱియొకవిధముగా ప్రొద్దుపుచ్చుదానవుకావు పుట్టిననాటనుండి నీస్వభావరీతి తెలిసినవాఁడనై యుండియు నిన్ను నిందించితిని ఈతప్పును సహింపుము అని తాత్పర్యము.

వ॥ అనివెండియు నిట్లనియె నీవాక్యంబులు శ్రవణసుఖంబులుగావించెనీవు వివిధంబులైన కామంబులు గోరితివేనియు నవియన్నియు నాయందయుంటంజేసి యేకాంత సేవాచతురవైన నీకు నవియన్నియు నిత్యంబులైయుండు నీపాతివ్రత్యంబును నాయందలి స్నేహంబు నతివిశదంబులయ్యె నావాక్యంబులచేత భవదీయచిత్తంబు చంచలంబుగాక నాయందులబుద్ధి దృఢంబగుంగావున సకలసంపద్విలసితంబైన ద్వారకాదినగరదివ్యమందిరంబులందు నీదుభాగ్యంబునం జేసి సంసారికైవడి నీయందు బద్ధానురాగుండనై వర్తింతుఁ దక్కిన ప్రాణేంద్రియ పరవశత్వంబున వికృతశరీరధారిణియైనసతి నన్నుంజెందుట దుష్కరంబదియునుంగాక మోక్షప్రదుండనైన నన్నుం గామాతురలై యల్పమతులై వ్రతతపోమహిమలచేత దాంపత్యయోగంబుకై సేవింతురదియంతయు నామాయావిజృంభితంబున మందభాగ్యలై నిరయంబునొందుదు రట్లుగావున నీసమానయైనకాంత యేకాంతలంగలదె నీవివాహకాలంబున ననేకరాజన్యవర్యులఁ గైకొనక భవదీయమధురాలాప శ్రవణాత్మకుండనైన నాసన్నిధి కన్యశరీరం బయోగ్యంబు నీకు శేషంబైయున్నదాననని యేకాంతంబునం బ్రాహ్మణుంబుత్తెంచిన యేనునుజనుదెంచి నీపరిణయసమయంబున భవత్సహోదరుంబట్టి విరూపుంగావించిన నదిగనుంగొనియును నాయందలి ప్రేమాతిశయంబుననూరకుండితివదిగావున బహుప్రకారంబులైవర్తించునీసద్గుణంబులకుసంతసింతుననియివ్విధంబున దేవకీసుతుండు నరలోకవిడంబనంబుగగృహస్థునిభంగి నిజగృహకృత్యంబులాచరించుచుండెనన్నిశుకుండుమఱియునిట్లనియె.

టీ॥ (అని) వెండియుఁ=మఱియును. ఇట్లనియె = ఇట్లుపలికెను. నీవాక్యంబులు = నీమాటలు. శ్రవణసుఖంబులుగావించెఁ= చెవులకుఁ దృప్తిని కలుగఁజేసెను. (నీవు) వివిధంబులైన = నానావిధములయిన. కామంబులు=కోరికలు. కోరితివేనియుఁ=కోరినను. అవియన్నియుఁ=ఆకోరికలన్నియు. నాయంద=నాయందే. ఉంటంజేసి=ఉండుటచేత. ఏకాంతసేవాచతురవు=ఏకాంతమునందు సేవచేయ నేర్పుగలదానవు. అయిననీకుఁ = అయినట్టినీకు. అవియన్నియుఁ = ఆకోరికలన్నియు. నిత్యంబులై = శాశ్వతములయి. (ఉండును) నీపాతివ్రత్యంబును=నీపతివ్రతాత్వమును. నాయందలి= నాయందుఁగల. స్నేహంబును=ప్రీతియు. అతివిశదంబులయ్యెఁ= మిక్కిలి స్పష్టములయ్యెను. నావాక్యంబులచేతఁ=నామాటలచేత. భవదీయచిత్తంబు=నీమనస్సు. చంచలంబు = చలించినది. (కాక) నాయందులబుద్ధి=నాయందుఁబొందినబుద్ధి. దృఢంబగుఁ=దృఢము అగును. కావునఁ=కాఁబట్టి. సకలసంపద్విలసితంబు = ఎల్లకలుములచేతను ప్రకాశించునది. అయినద్వారకానగరదివ్యమందిరంబులందుఁ=అయినట్టిద్వారకాపట్టణమునందలి మేలైనయిండ్లయందు. నీదుభాగ్యంబునంజేసి = నీయదృష్టముచేత. సంసారికైవడిఁ = సంసారివలె. (నీయందు) బద్ధానురాగుండనై=మిక్కిలిఅనురాగము గలవాఁడనై. వర్తింతుఁ = ఉందును. (తక్కిన) ప్రాణేంద్రియపరవశత్వంబునఁ=ప్రాణములయందలియు ఇంద్రియములయందలియు పరవశత్వముచేత-ప్రాణధర్మములయిన తినుట త్రాగుటలయందును ఇంద్రియధర్మములైన చూచుట వినుట మొదలగు వానియందును ఆసక్తిగల. వికృతశరీరధారిణి = వికారపుశరీరమును ధరించినది. అయినసతి = అయినట్టిస్త్రీ. నన్నుఁజెందుట = నన్ను పొందుట. దుష్కరంబు=అసాధ్యము. (అదియునుంగాక) మోక్షప్రదుండను= మోక్షమునిచ్చువాఁడను. అయిననన్నుఁ=అయినట్టినన్ను. కామాతురలై=కామముచేత పీడింపఁబడినవారై. అల్పమతులై=కొంచెపుబుద్ధిగలవారై. వ్రతతపోమహిమలచేతఁ = వ్రతములయు తపస్సులయు మాహాత్మ్యములచేత. దాంపత్యయోగంబుకై = ఆలుమగలకూడికకై. సేవింతురు = కొలుతురు. (అదియంతయు) నామాయావిజృంభితంబునఁ=నామాయయొక్క రేఁగుటచేత. మందభాగ్యలై= అదృష్టములేనివారై. నిరయంబుఁ=నరకమును. ఒందుదురు=పొందుదురు. (అట్లుగావున) నీసమానయైనకాంత = నీతోసమానురాలైన ఆఁడుది. ఏకాంతలఁ = ఏయాఁడువారియందైనను. కలదె= ఉన్నదా. నీవివాహకాలంబునఁ=నీపెండ్లిసమయమునందు. అనేకరాజన్యవర్యులఁ = పెక్కండ్రు క్షత్రియశ్రేష్ఠులను. కైకొనక = లక్ష్యముచేయక. భవదీయమధురాలాపశ్రవణాత్మకుండనైన=నీదైనయింపుమాటలువినుటయందాసక్తమైనమనసుగలవాఁడనైన. నాసన్నిధికిఁ=నాదగ్గఱకు. అన్యశరీరంబు=ఇతరదేహము. అయోగ్యంబు= తగినదికాదు. నీకుశేషంబై = నీకు మిగిలినదాననై. ఉన్నదానఁ= ఉన్నాను. (అని) ఏకాంతంబునఁ = రహస్యమున. (బ్రాహ్మణుని) పుత్తెంచినఁ=పంపఁగా. ఏనును = నేనును. చనుదెంచి = వచ్చి. నీపరిణయసమయంబునఁ=నీపెండ్లియప్పుడు. భవత్సహోదరుఁ= నీయన్నను. పట్టి=పట్టుకొని. విరూపుఁ = వికారరూపమునొందినవానిఁగా. కావించినఁ=చేయఁగా. అది=ఆవిరూపునిఁగాఁజేయుటను. కనుంగొనియును=చూచికూడ. (నాయందలిప్రేమాతిశయంబున) ఊరకుండితివి=ఏమియుననకయుంటివి. అదిగావునఁ=అట్లగుటచేత. బహుప్రకారంబులై=అనేకవిధములై. వర్తించు=ఉండునట్టి. నీసద్గుణంబులకుఁ = నీమంచిగుణములకు. సంతసింతుఁ = సంతోషించెదను. (అని) ఇవ్విధంబునఁ = ఈరీతిగా. దేవకీ

సుతుండు=శ్రీకృష్ణుడు. నరలోకవిడంబనంబుగన్ = మనుష్యుల సమూహము తోపాటు మాటలను ప్రకటించుటచేత. గృహస్థుని భంగిన్=సంసారివలె. నిజగృహకృత్యంబులు=తనయింటిపనులను. ఆచరించుచుండెన్=చేయుచుండెను. (అనిశుకుండు) మఱియున్= ఇంకను. (ఇట్లనియెను)

తా॥ ఇదిగాక నీమాటలు నాచెవులకు ఇంపు పుట్టించునవియై యున్నవి నీవు ఏమికోరినను నన్నే కోరవలసినదానవు కాబట్టి నాయందు ఏకాంతసేవ చేయు నేర్పుగలదానవయితివి నీవు కోరు కోరికలన్నియు శాశ్వతములై నాయందేయుండును నీపాతివ్రత్యమును నీకునాయందుగలప్రీతియు ఇప్పుడుస్పష్టములయ్యెను ఇప్పటి నామాటలవల్ల నీమనసు చలింపక నాయందు దృఢముగ పొంది యుండును నేను సకలసంపదలచేతను నిండుకొన్నదైన ద్వారకాపట్టణమునందలి దివ్యమందిరములలో సంసారివలెనే నీతోగూడి వర్తించుట నీభాగ్యవిశేషమేకాని ఇతరముకాదు నీకంటె నితరములయినప్రాణులవలె ఇంద్రియపారవశ్యముచేత వికారశరీరముగలదానవై నన్నుజెందుట అసాధ్యము ముక్తినిచ్చు స్వభావముగల నన్ను కామాతురలును అల్పబుద్ధులునునై వ్రతములయు తపస్సులయు మహిమలచేతను, ఆలుమగలను సంబంధముచేతను, అదృష్టహీనులయి నరకమును పొందుదురు కాబట్టి నీబోటియాడుది యెవరియందును లేదు నీపెండ్లిసమయమునందు రాజశ్రేష్ఠులను అనేకులను లక్ష్యపెట్టక ఇంపైననీమాటల వినగోరినవాడవైన నాదగ్గఱకు నీచేత ఏకాంతముగబంపబడిన బ్రాహ్మణునితో ఈదేహము ఇతరదేహములతోడి కూడికకు తగినదికాదు సర్వశేషియైననీకు శేషమునైయున్నానని నీవు చెప్పిపంపగా నేనును వెంటనేబయలుదేఱి వచ్చి నీయన్నయైనరుక్మినిబట్టి విరూపునిగాజేసి అవమానించినను అందులకు నీవు నాయందలి ప్రేమ విడువక యూరకుంటివికాబట్టి బహువిధములయిన నీమంచిగుణములకు సంతోషించితినిఅని ఈవిధముగా ఆనతిచ్చిన శ్రీకృష్ణమూర్తి నరలోకధర్మమును ప్రకటించునట్టి స్వభావముగలవాడై సామాన్యసంసారివలెనే గృహకృత్యములునడపుచుండెనుఅని శుకమహర్షి మఱియు నిట్లుపలికెనుఅని. తా.

౩౩౦.—క॥ అని యిట్లు కృష్ణు డాడిన । వినయ వివేకానులాప ✻ వితతామృత సే
చనముదిత హృదయయై య । వ్వనితామణి వికచవదన ✻ వనరుహయగుచున్.

టీ॥ (అని యిట్లు కృష్ణుడు) ఆడిన...హృదయయై—ఆడిన = చెప్పిన. వినయ=విశేషనీతియుక్తములును. వివేక=తెలివిని (కలుగజేయునవియునైన) అనులాప=ముచ్చటలనెడు. వితత=విశేషమైన. అమృత=అమృతమునందు. సేచన=తడియుటచేత. ముదిత=సంతోషించిన. హృదయయై = మనసుగలదయి. అవ్వనితామణి = ఆస్త్రీశ్రేష్ఠము—రుక్మిణి. వికచ...రుహ—వికచ=వికాసమ్మునొందిన. వదన=ముఖమనెడు. వనరుహ=తామరగలది. అగుచున్=అవుచును.

తా॥ అని యీవిధముగా శ్రీకృష్ణుడుచెప్పిన విశేషనీతియుక్తములును తెలివి గలుగజేయునవియునైన తిన్ననిమాటలనెడి అమృతమునందు దడిసిన మనసుగలదైన ఆరుక్మిణీదేవి కలకదేఱిన హృదయకమలముగలదై అని తాత్పర్యము.

౩౩౧.—క॥ నగవామతిరచు చూపులు । నగధరు మొగమునను నిలిపి ✻ నయమునఁ గరముల్
మొగిచి వినుతించె గృష్ణున్ । ఖగవాహున్ రుచిరదేహు ✻ గలితోత్సాహున్.

టీ॥ నగవు = నవ్వును. ఆమతించుచూపులన్ = రప్పించునట్టి చూపులతో. నగధరుమొగమునన్=కృష్ణుని మొగమునందు. నిలిపి= ఉంచి. ఖగవాహున్ = పక్షివాహనము గలవాడును. రుచిరదేహున్ = ప్రకాశించునట్టి దేహము గలవాడును. కలితోత్సాహున్ = పొందినయుత్సాహముగలవాడునునైన. (శ్రీకృష్ణుని) నయమునన్=చిన్నదనమ్ములో. కరములు = చేతులను. మొగిచి= జోడించుకొని. వినుతించెన్ = స్తోత్రముచేసెను - స్తుతించెననుట.

తా॥ నవ్వులుగులుకు చూపులతో పక్షివాహనుడును కాంతియుక్తమయిన దేహముగలవాడును ఉత్సాహమునుబొందినవాడునైన శ్రీకృష్ణమూర్తిని జూచి తిన్నదనముతో ఆయనకు నమస్కారముచేసి పొగడెనని తాత్పర్యము.

౩౩౨.—చ॥ అతడు విరాజమానముఖు ✻ డై వివిధాంబర చారుభూషణ
ప్రతతులతోడఁ గోరిన వ ✻ రంబులొసంగుచుండెడి యుచ్చెఁ గృష్ణుడు
న్నత శుభమూర్తి దేవగణ ✻ నందితకీర్తి దయానువర్తియై
యతిమృదువాణికిం గిసల ✻ యారుణ పాణికి నీలవేణికిన్.

టీ॥ ఉన్నతశుభమూర్తి—ఉత్ = ఆకాశాదులకంటె పెద్దదియు. నత=అణువుకంటెచిన్నదియు. శుభ=అనంతకల్యాణగుణపరిపూర్ణమైనదియునైన. మూర్తి = ఆకృతిగలవాడును. (అణోరణీయాన్మహతోమహీయానని శ్రుతి) దేవగణనందితకీర్తి = దేవతాసమూహముచేత కొనియాడబడిన కీర్తిగలవాడును. కృష్ణుడు = సృష్ట్యాది సర్వకార్యకర్తయునైన. అతడు = ఆకృష్ణుడు. విరాజమానముఖుడై = ప్రకాశించుచున్న మొగముగలవాడై. దయానువర్తియై=దయను అనుసరించియుండువాడై. అతిమృదువాణికిన్ = మిక్కిలి తిన్ననిమాటలు గలిగినదియు. కిసలయారుణపాణికిన్ = చిగురుటాకులవలె ఎఱ్ఱనైన ఆఱచేతులుగలిగినదియు. నీలవేణికిన్= నల్లనిజడ గలిగినదియునైనరుక్మిణికి. వివిధా...తోడన్ — వివిధ = నానావిధములయిన. అంబర=వస్త్రములతోడను. చారు=ఒప్పిదమునైన. భూషణ=ఆభరణములచేతను. ప్రతతులతోడన్=సమూహములతోను. కోరినవరంబులు=కోరినకోరికలను. తద్దయున్=

మిక్కిలి. ఇచ్చెను = వస్త్రభూషణములను కోరికలను ఒసఁగెను.

తా॥ ఆకాశాదులకంటె పెద్దదియును అణువుకంటె చిన్నదియును సర్వశుభలక్షణములు గలదియునైన దేహముగలవాఁడును, దేవసమూహముచేత స్తోత్రముచేయఁబడిన కీర్తిగలవాఁడును, సృష్టిస్థితిలయాది సర్వకార్యకర్తయునైన శ్రీకృష్ణమూర్తి వికాసము నొందుచున్న ముఖము గలవాఁడును, దయగలవాఁడునై మిక్కిలి తిన్ననిమాటలు గలదియు చిగురుటాకులవలె ఎఱ్ఱనిచేతులుగలదియు నల్లనిజడ గలదియునైన శ్రీరుక్మిణీదేవికి మేలైన వస్త్రములతోడను, ఆభరణములతోడను ఆమె కోరినవరముల నన్నిటిని విశేషముగా నిచ్చెనని తాత్పర్యము.

౩౩౩.—వ॥ ఇట్లు సన్మానించి కృష్ణుండు రుక్మిణియుం దానును దదనంతరంబ.

టీ॥ (ఇట్లు) సన్మానించి=గారవించి. (కృష్ణుండు రుక్మిణియుం దానును) తదనంతరంబ=ఆటుపిమ్మట.

తా॥ ఈవిధముగా శ్రీకృష్ణమూర్తి రుక్మిణీదేవిని ఊఱడించి ఆమెతోఁ గూడుకొన్నవాఁడై ఆటుపిమ్మట నని తాత్పర్యము.

౩౩౪.—చ॥ ఎలమి ఘటింపఁగాఁ గలసి * యీడెల నీడల మల్లికాలతా
వలిఁ గరవీరజాతి విర * వాదుల వీధులఁ గ్రమ్ము తెమ్మెరల్
పొలయ నవీనవాసనల * పొన్నలదిన్నెలఁ బచ్చరచ్చలన్
గొలఁకుల లేఁగెలంకులను * గోరిక లీరికలెత్తఁ గ్రొత్తలై.

టీ॥ ఎలమి = సంతోషము. ఘటింపఁగాన్ = కలుగఁగా. కలసి=కూడి. ఈడెలనీడలన్=ఈడెగ్రామఁకులనీడలయందును. మల్లికాలతావలిన్=మల్లెతీఁగలచాళ్లయందును. కరవీరజాతిన్=గన్నేరుచెట్లసమూహములయందును. విరవాదులవీధులన్ = విరజాజిచెట్ల చాళ్లయందును. క్రమ్ము=వ్యాపించునట్టి. తెమ్మెరలు=మందమారుతములు. పొలయన్=ప్రసరింపఁగా. నవీనవాసనలపొన్నలన్=క్రొత్తవాసనలుగల పొన్నచెట్లయందును. తిన్నెలన్=కర్పూరపుమేరువులయందును. పచ్చరచ్చలన్ = పచ్చలుదాఁపిన రచ్చపట్టులందును. కొలఁకులలేఁగెలంకులన్=సరస్సులయొక్క మనోజ్ఞములైన తీరములందును. (క్రొత్తలై కోరికలు) ఈరికలెత్తన్=అంకురింపఁగా.

తా॥ మిక్కిలి సంతోషముగా కూడుకొని యీడెలు మల్లెలు, గన్నేరులు విరవాదులు మొదలగు చెట్లయందుండి వచ్చునట్టి చల్లని తిన్ననిగాలి ప్రసరింపఁగా క్రొత్తక్రొత్తవాసనలతోడి పొన్నచెట్ల నీడలుగల పచ్చరాలకట్టడపు రచ్చపట్టులందును సరస్సుల తీరములందును క్రొత్తక్రొత్త కోరికలు పుట్టుచుండఁగా నని తాత్పర్యము.

౩౩౫.—క॥ ఆరామభూములందు వి। హారాధిక సౌఖ్యలీల * నతిమోదముతో
నారామానుజుఁ డుండెను। నారామామణియుఁ దాను * నభిరామముగన్.

టీ॥ ఆరామభూములందున్ = ఉపవనప్రదేశములందును. విహారాధికసౌఖ్యలీలన్=వేడుకగాతిరుగుటలవలని అధికమైన సుఖము కలుగువిధమున. అతిమోదముతోన్=మిక్కిలిసంతోషముతో. ఆరామామణియున్=స్త్రీశ్రేష్ఠమైన ఆరుక్మిణియు. (తానును) అభిరామముగన్=ఒప్పిదముగ. ఆరామానుజుఁడు=ఆకృష్ణమూర్తి. (ఉండెను)

తా॥ ఆకృష్ణమూర్తి ఉపవనములందును విహరించుటవలని అధిక సౌఖ్యమును అనుభవించుచు అతిసంతోషముతో రుక్మిణీదేవియు తానును ఉండెనని తాత్పర్యము.

వ॥ మఱియు ననేక వివిధవిచిత్ర మణివితానాభిశోభిత ప్రాసాదోపరిభాగంబులను, లాలిత నీలకంఠ కలకంఠ పికశుక కలాపకలితమకరందపాన మదవ దిందిందిర ఝుంకారసంకుల కమల కల్హార సుధాసార నీహారపూరిత కాసారతీరంబులను, ధాతునిర్ఝరరంజిత సానుదేశగిరి కుంజపుంజంబులను, కృతకశైలంబులను, క్రీడాగృహంబులను వెలంగి నందనందనుండు విదర్భరాజనందనందగిలికందర్పకేళీలోలాత్ముండై యనంతరంబా సుందరీలలామంబువలనఁ బ్రద్యుమ్నుండు చారుదేష్ణుండును దేష్ణుండు చారుదేవుండు సుచారువు చారుగుప్తుండు భద్రచారువు చారుభద్రుండు విచారువు చారువునని యెనుబదుగురు తనయులంబడసె నట్లు సత్యభామాజాంబవతీనాగ్నజితీకాళిందీ మాద్రీ మిత్రవిందా భద్రలకు వేఱు వేఱంబదుగురేసి భద్రమూర్తులైనకుమారులుదయించిరివ్విధంబునమఱియును.

టీ॥ మఱియున్=ఇదిగాక. అనేక...భాగంబులను—అనేక=పెక్కులయిన. వివిధ=నానావిధములయిన. విచిత్ర=నానావర్ణములుగల. లేక, వింతలయిన. మణివితాన=రత్నసమూహములచేత. అభిశోభిత=ప్రకాశించునట్టి. ప్రాసాద=మేడలయొక్క. ఉపరిభాగంబులను=మీఁదిప్రదేశములయందును, లాలిత...తీరంబులను—లాలిత=మనోజ్ఞములయిన. నీలకంఠ=నెమళ్లయు. కలకంఠ=పావురాలయు. పిక=కోయిలలయు. శుక=చిలుకలయు. కలాప=సమూహములతోడ. కలిత=కూడుకొన్నవియు. మకరంద=పూఁదేనెలయొక్క. పాన=త్రాగుటచేత. మదవత్=క్రొవ్విన. ఇందిందిర=తుమ్మెదలయొక్క. ఝుంకార=ఝుంకృతులయొక్క, సంకుల=సందడితోడి. కమల=తామరలచేతను, కల్హార=ఎఱ్ఱగలువలచేతను, సుధాసార=అమృతవర్షమునుబోలిన, నీహార=మంచుచేత. పూరిత = నిండింపఁబడిన. కాసార=సరస్సులయొక్క, తీరంబులను=దరులయందును. ధాతు...పుంజంబులను—ధాతు=గైరికాదిధాతువులతోడి. నిర్ఝర=సెలయేళ్ల

చేత. రంజిత=ఎఱ్ఱగాప్రకాశించుచున్న. సానుదేశ=చఱులయందలి. గిరి=కొండలయొక్క. కుంజ = పొదరిండ్లయొక్క. పుంజంబులను=సమూహములందును. కృతకశైలంబులను=కృతకాద్రులయందును. క్రీడాగృహంబులను = కేళికాగృహములందును. చెలంగి = విజృంభించి. నందనందనుండు=కృష్ణుఁడు. విదర్భరాజనందనన్=రుక్మిణీదేవిని. తగిలి=మోహించి. కందర్పకేళీలోలాత్ముండై=మన్మథక్రీడయం దాసక్తమయినబుద్ధిగలవాఁడై. అనంతరంబు = పిమ్మట. ఆసుందరీలలామంబువలనన్ = ఆశ్రేష్ఠురాలయిన పెండ్లామువలన. (ప్రద్యుమ్నుఁడును చారుదేష్ణుఁడును సుదేష్ణుఁడును చారుదేవుఁడును సుచారువును చారుగుప్తుఁడును భద్రచారువును చారుభద్రుఁడును విచారువును చారువును) అనియెడు=అనుపేరులుగల. పదుగురుతనయులన్=పదిమందికొడుకులను. పడసెన్ = కనియెను. అట్లు=ఆవిధముగానే. సత్యభామా=సత్యభామయందును. జాంబవతీ = జాంబవతియందును. నాగ్నజిత్తీ = నాగ్నజిత్తియందును. కాళిందీ=కాళిందియందును. మాద్రీ=మద్రరాజుకూఁతురైనసుదంతయందును. మిత్రవిందా=మిత్రవిందయందును. భద్రలకున్ = భద్రయందును. వేలువేలన్=వేలువేలుగా. పదుగురేసీ = ఒక్కొకరికి పదిమందిచొప్పున. భద్రమూర్తులయిన = అందమయినరూపములుగల. కుమారులు = కొడుకులు. ఉదయించిరి = పుట్టిరి. ఇవ్విధంబునన్=ఈరీతిగానే. మఱియును=ఇంకను.

తా॥ ఇదిగాక వింతలయిన అనేకరత్నసముదాయములచేత వెలుఁగుచున్న మేడలమీఁదను, లాలనచేయఁబడిన నెమళ్లు పావురాలు కోవెలలు చిలుకలుమొదలగువాని సమూహములతోఁగూడుకొన్నవియు పూఁదేనెత్రాగి మదించిన తుమ్మెదలఝుమ్మను నాదములతోడి తామరలచేతను ఎఱ్ఱగలువులచేతను అమృతతుల్యమయిన మంచునీటితోను నిండుకొన్న సరస్సులదరులయందును, ఝాజుతోడి సెలయేళ్లచేత ఎఱ్ఱగాప్రకాశించు కొండలచఱులయందలి పొదరిండ్లయందును, కృత్రిమపు పర్వతములయందును, కేళికా గృహములయందును, శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవియందలి మోహాతిశయముచేత విజృంభించి మన్మథక్రీడయందలి ఆసక్తిచేత వర్తించి పిమ్మట రుక్మిణియందు ప్రద్యుమ్నుఁడు చారుదేష్ణుఁడు సుదేష్ణుఁడు చారుదేవుఁడు సుచారువు చారుగుప్తుఁడు భద్రచారువు చారుభద్రుఁడు విచారువు చారువులనెడు పదుగురుకొడుకులనుగనెను, అనంతరము తక్కిన పట్టపుదేవులయిన సత్యభామ మొదలగు ఏడుగురియందు ఒక్కొకరికి పదుగురేసికొడుకులచొప్పున డెబ్బంద్రు కొడుకులను పడసెను మఱియు ఈవిధముగానే అని తాత్పర్యము.

౩౩౭.—చ॥ అనఘ పదాఱువేల సతు ✻ లందు జనించిరి వేలువేల నం
దనదశకంబు దత్సుత వి ✻ తానముగాంచి రనేకసూనులన్
నెనయఁగ నిట్లు పిల్లచెఱు ✻ కీనిన కైవడిఁ బుత్ర పౌత్ర వ
ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ము ✻ దంబునఁ దామరతంపరై భువిన్.

టీ॥ అనఘ=పాపములేనివాఁడవైనపరీక్షిన్మహారాజా. పదాఱువేలసతులందున్ = పదియాఱువేవురుభార్యలందును. వేలువేల=వేలువేలుగా. నందనదశకంబు = కొడుకులయొక్కపదులు—పదుగురు పదుగురుకొడుకులు. జనించిరి = పుట్టిరి. తత్సుతవితానము=ఆకొడుకుగుమి. అనేకసూనులన్ = పెక్కండ్రు కొడుకులను. కాంచిరి=కనిరి. నెనయఁగన్=కూడఁగా. ఇట్లు = ఈవిధముగా. పిల్లచెఱకు=పిలకలుపుట్టునట్టిచెఱకు. ఈనినకైవడిన్ = పెక్కుపిలకలను కలుగఁజేసినట్లు. పుత్రపౌత్రవర్ధనమునన్ = కొడుకులయు మనుమలయు వృద్ధిచేత. (కృష్ణుఁడు) తామరతంపరై=తామరపరంపరవలె — తామరతీఁగ ఒకటి యొకసరస్సులో వేయఁబడి ఆసరస్సంతయు అల్లుకొనునట్లు. భువిన్ = భూలోకమునందు. ముదంబునన్=సంతోషముతో. (ఒప్పెను)

తా॥ ఓపరీక్షిన్మహారాజా ! పిమ్మట పదియాఱువేవురు భార్యలందును ఒక్కొకరియందు పదేసిమంది చొప్పున ననేకులుకొడుకులు కృష్ణునకు జనించిరి ఆకుమారులకు ననేకులు కుమారులుపుట్టిరి ఇట్లు తామరతంపరగా కృష్ణుని సంతానము భూలోకమంతయు నిండుకొని సంతోషమెచ్చఁగా నతిశయించెను అని తాత్పర్యము.

౩౩౮.—తే॥ అట్లు యదువృష్ణి భోజాంధ ✻ కాది వివిధ । నామధేయాంతరముల నె ✻ న్నంగ నూట
యొక్కలై చాల వర్ధిల్లె ✻ నక్కులంబు । నృప కుమారులఁ జదివించు ✻ నేర్పు గలుగు.

టీ॥ (అట్లు) యదువృష్ణిభోజాంధకాది = యదువులు వృష్ణులు భోజులు అంధకులు మొదలుగాఁగల. వివిధ నామధేయాంతరములన్=బహువిధములయినపేరులచేతను. ఎన్నంగన్=ఎంచఁగా. నూటయొక్కలై =నూటొక్కలెక్కగలదై. చాలన్ = మిక్కిలి. ఆక్కులంబు=ఆకృష్ణునివంశము. వర్ధిల్లెన్ = వృద్ధినొందెను. నృపకుమారులన్=ఆరాచకొమారులను. చదివించు = చదివించునట్టి, నేర్పుగలుగు=సామర్థ్యముగల.

తా॥ ఆవిధముగ యదువులు వృష్ణులుభోజులు అంధకులు అనునవి మొదలుగాఁగల బహువిధములైన పేళ్లచేత నూటొక్కలెక్కగలదై శ్రీకృష్ణునికులము వృద్ధిఁబొందెనని తాత్పర్యము.

౩౩౯.—తే॥ గురుజనంబులువిను మూఁడు ✻ కోట్లమీఁద । నెనుబదెనిమిదివేలపై ✻ నెసఁగ నూర్గు
రన్నఁ దద్బాలకావలి ✻ నెన్నఁ దరమె । శూలికైనను దామర ✻ చూలికైన.

టీ॥ గురుజనంబులు=ఉపాధ్యాయులు. మూఁడుకోట్లమీఁదనెనుబదెనిమిదివేలపైన్ = మూఁడుకోట్ల యెనుబదియెనిమిదివేలమీఁద. ఎసఁగన్=అతిశయింపఁగా. నూర్గురు = నూఱుమంది. అన్నన్ = అనఁగా. తద్బాలకావలిన్ = ఆపిల్లకాయలసమూహమును. శూలి

కైనన్ = శివునకైనను. తామరచూలికైనన్ = బ్రహ్మకైనను. ఎన్నన్ = లెక్కపెట్టను. తరమె=శక్యమా. (వినుమ)

తా॥ ఆ శ్రీకృష్ణుని కులమునందుఁ బుట్టిన రాచకొమారులను చదివించు సుపాధ్యాయులలెక్కమాత్రము మూడుకోట్లు నెనుబది వేలు నూటమంది ఇఁక ఆబాలకుల సమూహమును లెక్కఁబెట్ట బ్రహ్మ శివులకైన శక్యమగునా? ఈసంగతిని వినుమని తాత్పర్యము.

౩౮౧.—వ॥ అందు గోవిందనందనుండైన ప్రద్యుమ్నునకు రుక్మి కూఁతువలన
ననిరుద్ధుండు సంభవించెననిన మునివరునకు భూవరుండిట్లనియె.

టీ॥ అందున్ = వారియందు. గోవిందనందనుండైన = కృష్ణుని కొడుకైన. (ప్రద్యుమ్నునకు) రుక్మికూఁతువలనన్=రుక్మియనువాని కొమార్తవలన. (అనిరుద్ధుండు) సంభవించెన్=పుట్టెను. అనినన్= అనఁగా. మునివరునకున్=శుకమహామునీశ్వరునితో. భూవరుండు= పరీక్షిన్మహారాజు. (ఇట్లనియెను)

తా॥ అట్లు వర్ధిల్లిన కృష్ణుని పుత్రపౌత్రులలోపల రుక్మిణీదేవి కొడుకైన ప్రద్యుమ్నునికి రుక్మియనువానికూఁతురివలన అనిరుద్ధుఁడు అనుకొమారుఁడు పుట్టెను అని చెప్పఁగా విని పరీక్షిన్మహారాజు శుకమహర్షితో నిట్లు వచియించెనని తాత్పర్యము.

౩౮౨.—క॥ బవరమునఁ గృష్ణుచే మ । న్నవమానము నొంది రుక్మి * యచ్యుతుఁ గెలువం
దివురుచుఁ దనసుత నరిసం । భవునకు నెట్లిచ్చె నెఱుఁగఁ * బలుకు మునీంద్రా.

టీ॥ మునీంద్రా=మునిశ్రేష్ఠుఁడవైనఓశుకుఁడా. బవరమునన్= యుద్ధమునందు. కృష్ణుచేన్=కృష్ణునిచేత. మన్ను=మనుపు. అవమానమునొంది = అవమానపడి. (రుక్మి) అచ్యుతున్ = కృష్ణుని. గెలువన్=జయింప. దివురుచున్=ప్రయత్నించుచు. తనసుతన్= తనకొమార్తను. అరిసంభవునకున్=పగవానికొడుకునకు. ఎట్లు= ఏవిధముగా. (ఇచ్చెను) ఎఱుఁగఁబలుకుము = తెలియఁజెప్పుము.

తా॥ ఓశుకమహర్షీ! యుద్ధమునందు కృష్ణునిచేత అవమానింపఁబడిన రుక్మి కృష్ణుని జయింపవలెనని ప్రయత్నపడుచుండెనే అటువంటివాఁడు తనపగవాఁడైనకృష్ణుని కొడుకునకు తనకూఁతునెట్లు ఇచ్చెనో తెలియఁజెప్పుము అని తాత్పర్యము.

౩౮౩.—సీ॥ నావుడు శుకయోగి * నరనాయకోత్తమ - నీవు చెప్పినయట్ల * నెమ్మనమునఁ
బద్మాయతాక్షుచే * బడిన బన్నమునకుఁ - గనలుచునుండియు * ననుజతోడి
నెయ్యంబునను భాగి * నేయునకిచ్చెను - గూఁతునంచితపుష్ప * కోమలాంగిఁ
దనపూన్కి దప్పినఁ * దగవిదర్భేశుండు - వినుమెఱిఁగింతు న * వ్విధముదెలియఁ

తే॥ బరఁగ రుక్మవతీస్వయం * వరమునకొగి । నరుగుదెండని భీష్మ భూ * వరసుతుండు
వరుస రప్పించె రాజన్య * వరకుమార । వరుల ననువార్త కలరియా * హరిసుతుండు.

టీ॥ నావుడున్=అనఁగా. శుకయోగి = శుకమహాముని. నరనాయకోత్తమ=ఓరాజశ్రేష్ఠుఁడా. నీవుచెప్పినయట్లు=నీవుచెప్పినట్టే. నెమ్మనమునన్=మనస్సునందు. పద్మాయతాక్షుచేన్=కృష్ణునిచేత. పడినబన్నమునకున్ = పొందిన అవమానమునకు. కనలుచునుండియున్ = తపించుచుండియును. తనపూన్కి = తనప్రయత్నము. తప్పినన్=తప్పిపోఁగా. తగన్=యుక్తముగ. విదర్భేశుండు=విదర్భదేశపురాజు. అనుజతోడినెయ్యంబునన్ = చెల్లెలైన రుక్మిణితోడి స్నేహముచేతను. భాగినేయునకున్ = మేనల్లునకు. అంచితపుష్పకోమలాంగిన్ = ఒప్పిదమయినపువ్వువంటి కోమలమయినదేహము గలదానిని. కూఁతున్ = తనకొమార్తను. (ఇచ్చెను) అవ్విధము = ఆపెండ్లియయినవిధమును. తెలియన్=విశదముగ. ఎఱిఁగింతున్= తెలియఁబఱిచెదను. (వినుము) పరఁగన్ = ప్రసిద్ధముగ. రుక్మవతీస్వయంవరమునకున్=రుక్మికూఁతురైన రుక్మవతియొక్కస్వయంవరమునకు. ఒగిన్=పూనికతో. అరుగుదెండని=రండుఅని. భీష్మభూవరసుతుండు=భీష్మకమహారాజుకొడుకైనరుక్మి. వరుసన్=క్రమముగా. రాజన్యవరకుమారవరులన్ = రాజశ్రేష్ఠుల కుమారముఖ్యులను (రప్పించెను) అనువార్తకున్ = అనునట్టివృత్తాంతమునకు. అలరి= సంతోషించి. ఆహరిసుతుండు=కృష్ణునికొడుకైన ఆప్రద్యుమ్నుఁడు.

తా॥ అని పరీక్షిన్మహారాజు అడుగఁగా శుకమహర్షి యిట్లుపలికెను నీవిప్పుడు చెప్పినచొప్పున యుద్ధమునందుఁ గృష్ణునిచేత అవమానపడినందులకై తపించుచుండిన ఆరుక్మి తనప్రయత్నము నెఱవేఱకపోఁగానే తనచెల్లెలియందలిప్రీతిచేత మేనల్లునికి తన్నకొమార్త నిచ్చి పెండ్లిచేసెను. అది యెట్లనఁగా చెప్పెదను వినుము రుక్మి తన కూఁతురైన రుక్మవతియొక్క స్వయంవరమునకు ఎల్లరాచకొమారులను రమ్మని చాటించెనన్న వర్తమానమును ప్రద్యుమ్నుఁడు విన్నవాఁడై అని తాత్పర్యము.

౩౮౪.—చ॥ వరమణి భూషణప్రభల * వర్గమనర్గళభంగిఁ బర్వఁ బ్ర
స్ఫురిత రథాధిరోహణ వి * భూతిదలిర్ప మనోహరైక సు
స్థిర శుభలీల నేగెయదు * సింహకిశోరము రాజకన్యకా
పరిణయ వైభవాగత.నృ * పాలక కోటికి రుక్మినీటికిన్.

టీ॥ వరమణి...వర్గము—వర=శ్రేష్ఠములయిన. మణి = రత్నములయొక్క. భూషణ=ఆభరణములయొక్క. ప్రభల=కాంతులయొక్క. వర్గము=సముదాయము. అనర్గళభంగిన్=అడ్డములేనివిధముగ. పర్వన్=వ్యాపింపఁగా. ప్రస్ఫురిత...విభూతి—ప్రస్ఫురిత=మిక్కిలి ప్రకాశించునట్టి. రథ=తేరును. అధిరోహణ = ఎక్కుటయొక్క. విభూతి = సంపద. తలిర్పన్ = చిగిరింపఁగా — అతిశయింపఁగా. యదుసింహకిశోరము = యాదవవంశమునఁ బుట్టిన సింహపుఁ బిల్లయైనప్రద్యుమ్నుఁడు. రాజ ... కోటికిన్ — రాజకన్యకా = రాచకొమార్తయొక్క. పరిణయ = పెండ్లియొక్క. వైభవ=వేడుకకొఱకు. ఆగత=వచ్చిన. నృపాలకకోటికిన్=రాజసమూహములుగలదానికి. రుక్మిపీటికిన్=రుక్మియొక్కపట్టణమునకు. మనోహరైక...లీలన్—మనోహర=మనోజ్ఞమయిన. ఏక = ముఖ్యమయిన. సుస్థిర=మిక్కిలినిలుకడగల. శుభ=మేలైన. లీలన్=విధమున. ఏగెన్=పోయెను.

తా॥ శ్రేష్ఠములయిన రత్నములకాంతులనువ్యాపింపఁజేయుచుఁ బ్రకాశించుచున్న రథమునెక్కి రాచకొమార్త పెండ్లివేడుకను జూడఁగోరివచ్చిన రాజసమూహములుగలదైన రుక్మియొక్కపట్టణమునకు యదువంశమునఁ బుట్టినవారిలో సింహమువంటివాఁడైన ప్రద్యుమ్నుఁడు మిక్కిలి వినోదముగా పోయెననితాత్పర్యము.

౩౪౫.—చ॥ చనిపురిఁజొచ్చి వృష్ణికుల * సత్తముఁ డచ్చటమూఁగియున్న య
మ్మనుజవరేణ్య నందనుల * మానము దూల భయాకులాత్ములై
చనఁగ ననేక చండతర * సాయక సంపదఁ జూపి రుక్మి నం
దనఁగొనివచ్చి వేడ్కనిజ * ధామముఁ జొచ్చెనవార్య శౌర్యుఁడై.

టీ॥ చని = పోయి. పురిన్=పట్టణమునందు. చొచ్చి=ప్రవేశించి. 'వృష్ణికులసత్తముఁడు=వృష్ణివంశశ్రేష్ఠుఁడైనప్రద్యుమ్నుఁడు. అచ్చటన్ = ఆపట్టణమునందు. మూఁగియున్న = ఆవరించుకొనియున్న. అమ్మనుజవరేణ్యనందనులన్ = ఆరాజకుమారశ్రేష్ఠులను. (మానము) తూలన్ = తొలఁగిపోఁగాను. భయాకులాత్ములై చనఁగన్=భయముచేత కలఁతనొందినవారైపోఁగాను. అనేక... సంపదన్—అనేక=పెక్కులైన. చండతర=మిక్కిలితీక్ష్ణములయిన. సాయక=బాణములయొక్క. సంపదన్=కలిమిని. చూపి = కనఁబఱిచి. రుక్మినందనన్=రుక్మికొమార్తను. కొనివచ్చి=తీసుకవచ్చి. అవార్యశౌర్యుఁడై = నివారింపఁగూడని శూరత్వముగలవాఁడై. వేడ్కన్ = సంతోషముతో. నిజధామమున్ = తనయింటిని — ద్వారకాపట్టణమునందు. (చొచ్చెను)

తా॥ ఆవిధముగాఁబోయి కుండినపట్టణమునుజొచ్చిన ప్రద్యుమ్నుఁడు ఆపట్టణమునకు వచ్చియున్న రాచకొమారుల నందఱను తనబాణముల వాఁడిమిచూపియోడించి రుక్మికూఁతురైన రుక్మవతిని ఎత్తుకొనితనపట్టణమునకువచ్చి చేరెననితాత్పర్యము.

వ॥ ఇట్లు తెచ్చి ప్రద్యుమ్నుండు హరిణనయనం బరిణయంబంది నిఖిలసుఖంబు లనుభవించుచుండె ననంతరంబ.

టీ॥ (ఇట్లు) తెచ్చి = తీసికొనివచ్చి. (ప్రద్యుమ్నుండు) హరిణనయనన్=లేడికన్నులవంటికన్నులుగలరుక్మవతిని. పరిణయంబంది= పెండ్లియాడి. నిఖిలసుఖంబులు = ఎల్లసుఖములను. (అనుభవించుచుండెను) అనంతరంబ=సుఖములననుభవించుచుండనటుపిమ్మటను.

తా॥ ఈవిధముగా ప్రద్యుమ్నుఁడు రుక్మవతిని తీసుకవచ్చి పెండ్లియాడి ఆమెవలనసకలసుఖములనుఅనుభవించుచుండెననితా.

౩౪౬.—క॥ ధీరుఁడు కృతవర్మ్మని సుకు । మారుఁడు వరియించె రుచిర * మండనయుత నం
భోరుహ ముఖి రుక్మిణిసుతఁ । జారుమతిన్ గన్యఁ బ్రకట * సజ్జనమాన్యన్.

టీ॥ ధీరుఁడు = ధైర్యవంతుఁడైన. కృతవర్మ్మనిసుకుమారుఁడు= కృతవర్మయొక్కకొడుకు. రుచిరమండనయుతన్=ప్రకాశించునట్టి ఆభరణములతోఁ గూడుకొన్నదానిని. అంభోరుహముఖిన్=కమలమువంటి ముఖముగలదానిని. రుక్మిణిసుతన్ = రుక్మిణీదేవికూఁతురైన. కన్యన్=పెండ్లికానిపడుచైన. ప్రకటసజ్జనమాన్యన్=ప్రసిద్ధులైనసజ్జనులచేతఁ గౌరవింపఁదగిన. చారుమతిన్=చారుమతియనుపేరుగల దానిని. వరియించెన్ = కోరి పెండ్లి యాడెను.

తా॥ ధీరుఁడైనకృతవర్మకొడుకు ప్రకాశించునట్టి ఆభరణములు ధరించినదియు,కమలమువంటి ముఖముగలిగినదియు,ప్రసిద్ధులైన సజ్జనులచేత బహుమానింపఁదగినదియునైన రుక్మిణీదేవికూఁతురుచారుమతిని వరించెనని తాత్పర్యము.

౩౪౭.—తే॥ ప్రకటచరితుండు భీష్మభూ * వరసుతుండు । మనము మోదింపఁ దనకూర్మి * మనుమరాలి
రుక్మలోచన నసమాన * రుక్మకాంతిఁ । బేర్మినినిరుద్ధునకుఁ బెండ్లి * సేయునపుడు.

టీ॥ ప్రకటచరితుండు=ప్రసిద్ధమయిననడవడిగలవాఁడైన.భీష్మభూవరసుతుండు = భీష్మకమహారాజు కొడుకైనరుక్మి. మనము = మనస్సు. మోదింపన్=సంతోషింపఁగా. తనకూర్మిమనుమరాలిన్= ప్రియమయినతనమనుమరాలిని. అసమానన్=ఈడులేనిదియు.రుక్మకాంతిన్ = బంగారు డాలు గలదియునైన. (రుక్మలోచనను) పేర్మిన్ = గౌరవముతో. (అని రుద్ధునకు పెండ్లి చేయునప్పుడు)

తా॥ ప్రసిద్ధమయిన ప్రవర్తనముగలరుక్మి తనమనస్సు సంతోషింపఁగా ప్రియమయిన తనమనుమరాలిని బంగారువన్నెవంటి మేనివన్నెగల రుక్మలోచనయనుదానిని అనిరుద్ధునికిచ్చి పెండ్లిచేయు సమయమునందు అని తాత్పర్యము.

౩౪౮.—క॥ పొలుపగు రత్నవిభూషో । జ్జ్వలులై శుభవేళ నవ్వి * వాహార్థము ని
ర్మల బహువైభవ శోభన । కలిత విదర్భావనీశ * కటకంబునకున్.

టీ॥ అవ్వివాహార్థము = ఆపెండ్లికొఱకు. శుభవేళన్ = మంచి మహూర్తమునందు. పొలుపగు=ఒప్పిదమయిన. రత్నవిభూషోజ్జ్వలులై = రత్నాభరణములచేత వెలుఁగుచున్నవారై. నిర్మల....కటకంబునకున్—నిర్మల=పరిశుద్ధమయిన. బహు = నానావిధములైన. వైభవ=వేడుకలతోడను. శోభన=శుభకార్యములచేతను. కలిత=కూడిన. విదర్భావనీశ = విదర్భదేశపురాజుయొక్క. కటకంబునకున్ = పట్టణమునకు — కుండినము అనుపట్టణమునకు అనుట.

తా॥ ఆపెండ్లికిఁగాను మంచిమహూర్తమునందు ఒప్పిదములైన రత్నములచేత మెఱయుచున్నవారై, స్వచ్ఛములయిన బహువిధ వినోదములకు ఉనికిపట్టయి అలంకరింపఁబడిన విదర్భరాజుపట్టణమునకు నని తాత్పర్యము.

౩౪౯.—చ॥ హరియును రుక్మిణీసతియు * నాబలభద్రుఁడు శంబరారియున్
నరిమదభేది సాంబుఁడును * వాదిగ రాజకుమారకోటి సిం
ధుర రథ వాజి సద్భటుల * తోఁ జని యందు సమగ్ర వైభవా
చరితవివాహయుక్త దివ * సంబులు వేడుకఁ బుచ్చి యంతటన్.

టీ॥ హరియును=కృష్ణుఁడును. రుక్మిణీసతియున్=రుక్మిణీదేవియును. ఆబలభద్రుఁడును=బలరాముఁడును. శంబరారియును = ప్రద్యుమ్నుఁడును. అరిమదభేది = శత్రువులమదము నణఁచునట్టివాఁడైన. (సాంబుఁడును) ఆదిగన్ = మొదలుగా. రాజకుమారకోటి=రాజకుమారులసమూహము. సింధుర....తోన్ — సింధుర = ఏనుఁగులతోను. రథ=తేరులతోను. వాజి=గుఱ్ఱములతోను. సద్భటులతోన్=మంచిబంట్లులతోను. చని=పోయి. అందున్=ఆపట్టణమునందు. సమ...దివసంబులు—సమగ్ర=పూర్తియైన. వైభవ=వేడుకలను. ఆచరిత=చేయఁబడునట్టి. వివాహ=పెండ్లితోడ. యుక్త=కూడిన. దివసంబులు=దినములు. వేడుకన్=వినోదముతో. పుచ్చి=జరపి. అంతటన్=అటుపిమ్మట.

తా॥ కృష్ణుఁడును రుక్మిణీదేవియు బలరాముఁడును, ప్రద్యుమ్నుఁడును, సాంబుఁడును మొదలుగాఁగల రాజకుమారులు రథగజతురగ పదాతులతో పోయి ఆవిదర్భపట్టణమునందు పెండ్లి వేడుకలు జరగుదినములను జరపి అటుపిమ్మటనని తాత్పర్యము.

౩౫౦.—క॥ ఒకనాడు యదుకుమారకు । లకలంక సమగ్ర వైభ * వాటోప మహో
త్సుకులై యుండఁగఁ జూపో । పక యెకసక్కెమున నవని * పాలురు వరుసన్.

టీ॥ (ఒకనాడు) యదుకుమారకులు = కృష్ణుఁడు మొదలగు యాదవులు. అకలంక...త్సుకులై — అకలంక = కలంకములేని. సమగ్ర=పూర్ణమయిన. వైభవ=వేడుకలవలని. ఆటోప = వేగిరపాటునందు. మహోత్సుకులై = మిక్కుటమయినపూనికకలవారై. ఉండఁగన్=ఉండఁగా. చూపోపక=చూడసహింపక. ఎకసక్కెమునన్=పరిహాసముతో. అవనిపాలురు = రాజులు. వరుసన్= క్రమముగా.

తా॥ ఒకనాడు యాదవులందఱు కొఱఁతలేని వేడుకలవలని ఆటోపమునందు ఉత్సాహము గలవారైయుండఁగాఁ జూచి ఓర్వలేక రాజులందఱు పరిహాసముతో క్రమముగానని తాత్పర్యము.

౩౫౧.—ఉ॥ ఎచ్చరికం గళింగ ధర * ణీశుఁడు రుక్మి మొగంబు సూచి నీ
యొచ్చెముదీర్చుకో నిదియ * యొప్పగువేళ బలుండు జూదమం
దిచ్చ గలండు గాని పొలు * పెక్కిన నేర్పరి గాఁడు గాన నీ
కిచ్చునవశ్యమున్ జయము * నీఁగుము తొల్లిటి బన్నమున్వడిన్.

టీ॥ ఎచ్చరికన్ = జాగ్రత్తతో. కళింగధరణీశుఁడు = కళింగదేశపురాజు. (రుక్మిమొగంబుసూచి)నీయొచ్చెమున్=నీభంగమును. ...ర్చుకోన్=పోఁగొట్టుకొనుటకు. ఇదియ=ఇదియే. ఒప్పగువేళ=...గినసమయము. బలుండు=బలరాముఁడు. జూదమందున్=జూదమాడుటయందు. ఇచ్చగలండుగాని = అపేక్షగలవాఁడైయుండును ...ాని. పొలుపెక్కిన = బాగైన. నేర్పరి = సమర్థుఁడు. (కాఁడు) ...నన్=కాఁబట్టి. అవశ్యమున్=తప్పక. (నీకు) ఇచ్చుజయము=యను కలుగఁజేయును. వడిన్ = వేగముతో. బన్నమున్ = ఆయవమానమును. ఈఁగుము = పోఁగొట్టు కొనుము.

తా॥ కళింగరాజు ఎచ్చరికగలవాఁడై రుక్మితో నీయవమానమునకుబదులు యాదవులను అవమానించుటకు ఇదితగినసమయము బలరాముఁడు జూదమాడుటయందు మిక్కిలి ఆసక్తిగలవాఁడు అయినను అతనికి జూదమునందు సామర్థ్యముచాలదు కనుక అవశ్యము నీకు జయము గలుగును నీవు ఇప్పుడు అతనితో జూదమాడి ఓడించి శీఘ్రముగ గెలుపును పొంది అవమానము తొలఁగించుకొమ్మని చెప్పెనని తాత్పర్యము.

౩౫౨.—క॥ అని పురికొల్పిన రుక్మియు । దనచేటు తలంపలేక * తాలాంకునితో
డను జూదమాడ దివిరెను । వనజాసన కృతముగాను * వా రెవ్వరిలన్.

టీ॥ (అని) పురికొల్పినన్ = ప్రేరేపింపఁగా. (రుక్మియనుతన చేటును తలంపలేక) తాలాంకునితోడన్ = బలరామునితో. (జూదమాడను) తివిరెన్ = ప్రయత్నపడెను. ఇలన్ = భూమియందు. వనజాసనకృతము = బ్రహ్మచేయుపనిని. కడచువారు = మీరువారు (ఎవ్వరు)

తా॥ అని కళింగరాజు పురికొలుపఁగానే రుక్మియందులకొప్పుకొన్నవాఁడై అందువల్లతనకురాఁబోవుచెఱుపునెఱుఁగక బలరామునితో జూదమాడ నారంభించువాఁడయ్యెను విధికృతము నెవరు మీరఁగలరు అని తాత్పర్యము.





(*) బలరామునితో రుక్మి జూదమాడుట. (*)



క॥ కోరి విదర్భుఁడు కుటిలవి। హారుండై పిలిచె జూద * మాడ జితారిన్
హారిన్ సన్నతసూరిన్। సీరిన్ రైవతసుతార్ద్ర * చిత్త విహారిన్.

టీ॥ విదర్భుఁడు = విదర్భదేశపురాజైనరుక్మి. కుటిలవిహారుండై = కపటముగా ఆడువాఁడై. జితారిన్ = జయింపఁబడిన శత్రువులుగలవాఁడును. హారిన్ = ముత్యాలహారముల్ధరించినవాఁడును. లేక, మనోహరుఁడును. సన్నతసూరిన్ = వంగిన పండితులుగలవాఁడును. రైవతసుతార్ద్రచిత్తవిహారిన్ = రేవతియొక్క మృదువైన మనసునందువిహరించువాఁడునునైన. సీరిన్ = బలరాముని (జూదమాడ కోరిపిల్చెను)



తా॥ అప్పుడు రుక్మి కపటముగా ఆడఁగోరినవాఁడై జయింపఁబడిన శత్రువులుగలవాఁడును, ముత్యాలహారములను ధరించినవాఁడును, పండితులచేత మ్రొక్కించుకొనువాఁడును, రేవతీదేవి పెనిమిటియునైన శ్రీబలరామునిజూదమాడుమురమ్మనికోరిపిలిచెననితా.

౩౫౪.—ఆ॥ పూని మనము గొంత * ప్రొద్దుపోకకు రామ। నెత్తమాడనీవు * నేర్తువనఁగ.
విందు మిపుడుకొంత * వెలయొడ్డియాడుద। మనినబలుఁడు లెస్స * యనిచెలంగె.

టీ॥ రామ = బలరాముఁడా. పూని = ప్రయత్నపడి. (మనము) కొంత = కొంచెము. ప్రొద్దుపోకకున్ = ప్రొద్దుపోవుటకు. నెత్తమాడన్ = జూదమాడుటకు. (నీవునేర్తువు) అనఁగన్ = అనిచెప్పఁగా. విందుము = వినుచున్నాము. (ఇపుడు) కొంత వెలయొడ్డి = కొంచెము పందెముపెట్టి. (ఆడుదము) అనినన్ = అనఁగా. బలుఁడు = బలరాముఁడు. లెస్సయని = మంచిదని. చెలంగెన్ = సంతోషించెను.

తా॥ ఓబలరామా! నీవు జూదమాడనేర్తువు అనిచెప్పఁగా మేము వినియున్నాము మనము కొంచెము ప్రొద్దుపోకకు కొంత పందెముపెట్టి ఆడుదము రమ్మనఁగా, బలరాముఁడు అట్లేకానిమ్మని జూదమాడ సమ్మతించెనని తాత్పర్యము.

౩౫౫.—క॥ మదిలోని చలము డింపక । పది యిరువై నూఱువేయి ✻ పదివేలిదె ప
న్నిదమని యొడ్డుచు నాడిరి । మదమున నిద్దఱును దురభి ✻ మానము పేర్మిన్.

టీ॥ మదిలోనిచలము = మనసులోనిపట్టుదల. డింపక=విడువక. (పది ఇరువయి నూఱువేయి పదివేలు) ఇదెపన్నిదము = ఇదిగోపందెము. (అని) ఒడ్డుచున్=పందెముపెట్టుచు. ఇద్దఱును= రుక్మిబలరాము లిరువురును. దురభిమానముపేర్మిన్ = చెడ్డగర్వము యొక్క. అతిశయముచేత. మదమునన్ = క్రొవ్వుతో. (ఆడిరి)

తా॥ అంతట బలరాముఁడును రుక్మియు గర్వమతిశయింపఁగా తమమనసులలోని పట్టుదలలను విడువక పదిఇరువయి నూఱు వేయి పదివేలు అని పందెములు పెట్టుచు జూదమాడిరని తాత్పర్యము.

౩౫౬.—ఉ॥ ఆడిన యాటలెల్లను హ ✻ లాయుధుఁ డోడిన రుక్మి గెల్చుడున్
దోడి నృపాలకోటి పరి ✻ తోషము చెందఁ గళింగభూవిభుం
డోడెబలుండటంచుఁ బ్రహ ✻ సోక్తుల నెంతయు రాముఁ జుల్కఁగా
నాడెను దంతపఙ్క్తి వెలి ✻ యై కనుపట్టఁగఁ జాలనవ్వుచున్.

టీ॥ ఆడినయాటలెల్లన్=అట్లు ఆడినయాట లన్నిటియందును. హలాయుధుఁడు=బలరాముఁడు. ఓడినన్ = ఓడిపోఁగా. (రుక్మి) గెల్చుడున్=జయించినంతట. తోడినృపాలకోటి=తనతోడిరాజుల సమూహము. పరితోషము=సంతోషము. చెందన్ = పొందఁగా. కళింగభూవిభుండు=కళింగరాజు. ఓడెబలుండు=బలరాముఁడుఓడిపోయెను. అటంచున్=అని. ప్రహసోక్తులన్=ఎగతాళిమాటలతో. రామున్=బలరాముని. ఎంతయున్ = మిక్కిలి. చుల్కఁగాన్ = అలక్ష్యముగా. దంతపఙ్క్తి = పలువరుస. వెలియై=బయలై. కనుపట్టఁగన్=కానఁబడఁగా. (చాలనవ్వుచును) ఆడెను=పలికెను.

తా॥ అప్పుడు ఆడిన అన్ని యాటలును రుక్మి గెలుచుచు బలరాముఁడు ఓడిపోవుచునుండఁగాఁజూచితనసరిరాజులందఱు సంతోషించునట్లు కళింగరాజు బలరాముఁడు ఓడిపోయెను ఓడిపోయెను అని యెగతాళిమాటలాడుచు అలక్ష్యముగా పండ్లిగిలించి పకపక నవ్వెనని తాత్పర్యము.

౩౫౭.—తే॥ బలుఁడు కోపించి యొకలక్ష ✻ పణముసేసి । యాడి ప్రకటంబుగాజూద ✻ మపుడు గెల్చె
గెల్చినను రుక్మి యిది యేను ✻ గెల్చియుండ । గెలుపు నీదని కికురింప ✻ నలవి యగునె.

టీ॥ బలుఁడు = బలరాముఁడు. కోపించి = కోపగించుకొని. (ఒకలక్ష) పణముసేసి=ఒడ్డుపెట్టి. ప్రకటంబుగాన్=ప్రసిద్ధముగా. (జూదముఆడి)అపుడు=ఆసమయమునందు. గెల్చెన్=బలరాముఁడు జయించెను. గెల్చినను=జయించినను. (రుక్మి) ఇది=ఈయాటయు. ఏనుగెల్చియుండన్=నేనుగెలిచియుండఁగా. గెలుపు = జయము. (నీదని) కికురింపన్=మోసపుచ్చుట. అలవియగునె=శక్యమగునా.

తా॥ అప్పుడు బలరాముఁడు కోపించి ఒకలక్ష పందెము పెట్టి ప్రసిద్ధముగా జూదమాడి జయించెను అట్లు జయించినను రుక్మి ఈ ఆటయు నేనే గెలిచియుండఁగా ఈగెలుపు నీదని వంచింప నీకెట్లు సాధ్యమగునని పలికెనని తాత్పర్యము.

౩౫౮.—క॥ అనవుడు హలధరుఁడచ్చటి । జనపాలక సుతులఁజూచి ✻ సత్యము పలుకుం
డని యడిగినవారలు రు । క్మిని హితులయి పలుకరైరి ✻ మొగమోటమునన్.

టీ॥ అనవుడున్ = అనఁగా. హలధరుఁడు = బలరాముఁడు. అచ్చటిజనపాలకసుతులన్ = అచ్చట నున్న రాచకొమారులను. (చూచి) సత్యముపలుకుండు=నిజముచెప్పుఁడు. అనియడిగినన్ = అనియడుగఁగా. వారలు=ఆరాచకొమారులు. రుక్మినిహితులై= రుక్మి మేలుగోరువారై. మొగమోటమునన్=దాక్షిణ్యముచేత. పలుకరైరి = గెలిచితి వనియు ఓడితి వనియు ఏమియు చెప్పక పోయిరి.

తా॥ అనిపలుకఁగా బలరాముఁడు అచ్చటనున్నరాచకొమారులను జూచి నిజముచెప్పుఁడని అడుగఁగా వారు రుక్మికి మేలు గోరువారయి వానివలని మొగమోటముచేత ఏమియుచెప్పక యూరకుండిరి అని తాత్పర్యము.

౩౫౯.—ఉ॥ అప్పటియట్ల యొడ్డిముస ✻ లాయుధుఁ డేపుననాడి జూదముం
జొప్పడగెల్చి యీగెలుపు ✻ చూడఁగ నాదియొ వానిదో జనుల్
దప్పక చెప్పుఁడన్న విది ✻ త ధ్వనితో నశరీరవాణి దా
నిప్పటియాట రాముఁడె జ ✻ యించె విదర్భుఁడె యోడెనావుడున్.

టీ॥ ముసలాయుధుఁడు=బలరాముఁడు. అప్పటియట్ల=అప్పుడు ఒడ్డినట్టుగానే. (ఒడ్డి) ఏపునన్ = విజృంభణముతో. (ఆడి) జూదమున్=జూదమునందు. చొప్పడన్ = క్రమముగా. గెల్చి = జయించి. ఈగెలుపు=ఈజయము. చూడఁగన్=విచారింపఁగా. నాదియొ=నాదో. వానిదో = రుక్మిదో. జనులు = ఓజనులారా. తప్పక=న్యాయముతప్పక. (చెప్పుఁడు) అన్నన్ = అనఁగా. అశరీరవాణి = ఆకాశవాణి. విదితధ్వనితోన్ = అందఱకు వినునట్టి ధ్వనితో. (తాను ఇప్పటియాటరాముఁడెజయించెను) విదర్భుఁడె= రుక్మియే. (ఓడెను) నావుడున్=అనఁగా.

తా॥ అంతట బలరాముఁడు మునుపటివలెనే పందెము పెట్టి

జూదమాడి గెలిచి. యీ గెలుపు నాదో రుక్మిదో మీరందఱు న్యాయము విచారించి చెప్పఁడు అని అడుగఁగా ఆకాశవాణి అధికమయిన ధ్వనితో ఇప్పటి ఈయాట రాముఁడే గెలిచెను రుక్మి యోడెను అని అందఱు వినునట్టుగా పలికెనని తాత్పర్యము.




(*) బలభద్రుఁడు రుక్మి మొదలగు రాజులఁ జంపుట. (*)

వ॥ అనిసవిని సకలజనంబులు నద్భుతానంద నిమగ్నమానసులైరి కుటిలస్వభావులైన భూవరులు రుక్మిం గైకొల్పిన నతండు తనతొల్లింటి పరాభవంబు దలంచి యెదిరిం దన్ను నెఱుంగక బలాబలవివేకంబు సేయనేరక విధివశానుగతుండై చలంబునం బలునిం గని యిప్పటియాటయు నేన గెల్చియుండ వృథాజల్పన కల్పనుండవై నీవు గెల్చితి నని పలికెద వక్షవిద్యానైపుణముగల భూపకుమారులతోఁ బసులగాపరు లెత్తువత్తురే యని క్రొవ్వున నవ్వుచుం బలికిన నప్పలుకులు చెవులకు ములుకులక్రియం దాఁకినఁ గోపోద్దీపితమానసుండై పెటపెటం బండ్లుగొఱుకుచుం గన్నుల నిప్పు లుప్పతిల్లంగినుకం దోఁకఁద్రొక్కిన మహోరగంబునోజ రోఁజుచు దండతాడితంబైన పుండరీకంబులీల హుమ్మని మ్రోయుచుఁ బ్రచండ బాహుదండంబులు సాఁచి పరిఘంబందుకొని రుక్మిని నతని కనుకూలంబైన రాజలోకంబును బడలువడ నడిచె నయ్యవసరంబున.

టీ॥ అనినన్=అని ఆకాశవాణిపలుకఁగా. (విని) సకలజనంబులును=ఎల్లజనులును. అద్భు...సులు—అద్భుత=ఆశ్చర్యమునందును. ఆనంద=సంతోషమునందును. నిమగ్న = మునిఁగిన. మానసులు=మనస్సులుగలవారు. (అయిరి) కుటిలస్వభావులు=కపటుస్వభావము గలవారు. అయినభూవరులు=అయినట్టిరాజులు. రుక్మిన్=రుక్మిని. కైకొల్పినన్=సమ్మతింపఁజేయఁగా. అతండు=ఆరుక్మి. తనతొల్లింటి పరాభవంబు = తాను మునుపుపొందిన అవమానమును. తలంచి = తలఁచుకొని. ఎదిరిన్ = ఎదుటివానిశక్తిని. తన్నున్=తనశక్తిని. ఎఱుంగక=తెలిసికొనక. బలాబలవివేకంబు = బలవంతుఁడువీఁడు బలహీనుఁడువీఁడు అనువిమర్శనము. చేయనేరక = చేయఁజాలక. విధివశానుగతుండై = దైవవశమును అనుసరించినవాఁడై. చలంబునన్=మాత్సర్యముతో. బలునిన్=బలరాముని. కని = చూచి. ఇప్పటియాటయు = ఇప్పుడాడిన ఆటకూడ. నేన=నేనే. గెల్చియుండన్=జయించియుండఁగా. వృథాజల్పనకల్పనుండవై = వ్యర్థవాదమునుగల్పించుకొన్నవాఁడవై. (నీవు గెల్చితిని) అనిపలికెదవు=అనిచెప్పెదవు. అక్షవిద్యానైపుణము = జూదమాడువిద్యయందలి నేర్పు. కల=కలిగిన. భూపకుమారులతోన్ = రాజకుమారులతో. పసులగాపరులు=గొల్లలు. ఎత్తువత్తురే=సమానులగుదురా. (అని) క్రొవ్వునన్=మదముతో. నవ్వుచుంబలికినన్=నవ్వుచుఁజెప్పఁగా. ఆప్పలుకులు = ఆమాటలు. (చెవులకు) ములుకులక్రియన్ = బాణములవలె. తాఁకినన్ = సోఁకఁగా. కోపోద్దీపితమానసుండై = కోపముచేత వెలిఁగింపఁబడిన మనస్సుగలవాఁడై. పెటపెటన్ = పెటపెట అనుధ్వనికలుగునట్టుగా. (పండ్లుకొఱుకుచు) కన్నులన్=కన్నులందు. (నిప్పులు) ఉప్పతిల్లన్ = పుట్టఁగా. కినుకన్ = కోపముతో. తోఁకఁద్రొక్కిన మహోరగంబునోజన్=తోఁకనలియఁద్రొక్కిన గొప్పపామువలె. రోఁజుచున్ = బుసకొట్టుచు. దండ తాడితంబు=కఱ్ఱచేత కొట్టఁబడినది. అయినపుండరీకంబులీలన్ = అయినట్టిపెద్దపులివలె. హుమ్మని=హుం అనుధ్వనికలుగునట్టుగా. మ్రోయుచున్ = కాండ్రించుచు. ప్రచండబాహుదండంబులు = మిక్కిలి భయంకరములైన కఱ్ఱలవంటిచేతులను. చాఁచి=చాఁగించి. పరిఘంబున్=పలకవాటుగుదియను. అందుకొని = చేతికెత్తుకొని. (రుక్మిని) అతనికిన్=ఆరుక్మికి. (అనుకూలంబైన) రాజలోకంబును=రాజులగుంపును. పడలువడన్ = మూటకట్లుగాఁ గూలునట్లు. అడిచెన్=కొట్టెను. అయ్యవసరంబునన్=ఆసమయమునందు.

తా॥ అని ఆకాశవాణిచెప్పఁగా విని సకలజనులును ఆశ్చర్యమును సంతోషమును బొందినవారలైరి కపటస్వభావముగలవారైన ఆరాజులందఱు రుక్మినిపురికొల్పఁగా వాఁడు మునుపు తానుపొందిన అవమానమును తలఁచుకొని తనయందును ఎదుటివారియందును గల

బలాబలములను విచారింపక దైవవశముచేతఁ బుట్టిన మాత్సర్యము చేత బలరామునిజూచి యిప్పుడాడిన ఆటగూడ నేనే గెలిచినాను నీవు నేను గెలిచితినన్ని వృథావాదముచేయుచున్నావు జూదమాడుట అనెడువిద్యయందు నేర్పరులయిన రాజకుమారులతో పసులనుమేపుకొని జీవించునట్టిగొల్లలు సమానులగుదురా అని క్రొవ్వినమాటలు నవ్వుచును ఆడఁగా ఆమాటలు బాణములవలె చెవులలో నాటి కోపముచేత వెలుఁగుచున్న మనస్సుగలవాఁడై పెటపెటయనిపండ్లు కొరుకుచు కన్నులందు నిప్పులు రాలఁగా తోఁక త్రొక్కఁబడిన నాగుఁబామువలె బుసకొట్టుచు కట్టెతోఁకొట్టఁబడిన పులివలె బొబ్బరించుచు కత్తివంటి నిడుపాటిచేతులను జాఁచి ఒకపలకవాటు గుదియనెత్తుకొని రుక్మిని వానికి ఆప్తులైన తక్కినరాజులను మూట కట్టఁగా గూలునట్లు కొట్టెను ఆసమయమందునని తాత్పర్యము.

౩౬౧.—క॥ మును దంతపఙ్క్తి వెలిగాఁ । దనునవ్విన యక్కళింగుఁ * దలవట్టి రయం
బునఁ బడఁదిగిచి వదనమే । పునఁ బెడచేఁ ద్రేసిదంత * ములు వెసడులిచెన్.

టీ॥ మును=మునుపు. దంతపఙ్క్తి = పలువరుస. వెలిగాన్= బయటికికానవచ్చునట్లు. తనున్=తన్ను. నవ్విన = ఎగతాళిచేసి నవ్విన. అక్కళింగున్=ఆకళింగరాజును. తలవట్టి=సిగపట్టుకొని. రయంబునన్ = శీఘ్రముగా. పడఁదిగిచి = దిగువఁబడనీడ్చి. వదనము=ముఖము. ఏపునన్=గర్వముతో. పెడచేన్ = పెడమరలఁ ద్రిప్పినచేతితో. ద్రేసి=కొట్టి. దంతములు=పండ్లు. వెసన్=శీఘ్రముగా. డులిచెన్=రాల్చెను.

తా॥ మునుపు పండ్లిగిలించుకొని నవ్వి తన్ను పరిహాసముచేసిన కళింగదేశపురాజును సిగఁబట్టినేలఁబడఁద్రోసి యీడ్చి ముఖమున పెడచేతితో చఱచి పండ్లు రాలఁగొట్టెను అని తాత్పర్యము.

౩౬౨.—క॥ అంతంబోవక రుక్మిని । దంతంబులు మున్నుడులిచి * తనువగలింపన్
నంతకపురికేఁగెను వాఁ । డెంతయు భయమంది రాజు * లెల్లంగలఁగన్.

టీ॥ అంతన్=అంతటితో. పోవక=నిలువఁబడిపోక. (రుక్మిని) మున్ను=ముందుగా. దంతంబులు=పండ్లు. డులిచి=రాల్చి, తనువు=దేహము. అగలింపన్ = నొప్పింపఁగా, వాఁడు = అరుక్మి. రాజులెల్లన్=అచ్చటనున్నరాజులందఱును. ఎంతయున్=మిక్కిలి, భయమంది=వెఱచి. కలఁగన్ = కలఁతనొందఁగా, అంతకపురికిన్ = యమునిపట్టణమునకు. ఏగెన్=పోయెను — మరణించెననిభావము.

తా॥ బలరాముఁడు అంతటితో తృప్తిపడి యూరకుండక ముందుగా రుక్మి పండ్లు రాలఁగొట్టి పిమ్మట వానిదేహము నలియఁ గొట్టెను అంతట అతఁడు అక్కడనున్న రాజులందఱు వెఱచి కలవరపడిపోవునట్టుగా మరణము నొందెనని తాత్పర్యము.

౩౬౩.—వ॥ అట్లు చేసి యయ్యాదవసింహం బవక్రవిక్రమంబునం జెలంగెనంత.

టీ॥ (అట్లుచేసి)అయ్యాదవసింహంబు=ఆబలరాముఁడు, అవక్రవిక్రమంబునన్=వంకరలేనిపరాక్రమముచేత — అధికపరాక్రమముచేత. చెలంగెన్ = అతిశయించెను, అంతన్=అనంతరము,

తా॥ అట్లు బలరాముఁడు రుక్మిని జంపి రాజులకెల్ల భయము పుట్టించి మిక్కిలియగు పరాక్రమముచేత అతిశయించినవాఁడు కాఁగానని తాత్పర్యము.

౩౬౪.—క॥ భూవర పద్మాక్షుఁడు దన । భావహతుం డగుటఁ గనియుఁ * బలుకకయుండెన్
భావమున రుక్మిణీబల । దేవుల కేమనఁగనెగ్గు * దేరునో యనుచున్.

టీ॥ భూవర=రాజా, పద్మాక్షుఁడు=కృష్ణుఁడు, తనభావ=రుక్మి. హతుండగుటన్=చచ్చుటను. కనియున్=చూచియు, భావమునన్=మనసులో, రుక్మిణీబలదేవులకున్=రుక్మిణికిని బలరామునికిని. ఏమనఁగన్ = ఏమిచెప్పఁగా. ఎగ్గుదేరునో=కీడుతోఁచునో. అనుచున్=అని. పలుకకయుండెన్=ఏమియుఁజెప్పకయూరకుండెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! అట్లు రుక్మిచచ్చుటను ప్రత్యక్షముగాఁ జూచియు శ్రీకృష్ణమూర్తి బలరామునకును రుక్మిణికిని ఏమి చెప్పిన నేమితోఁచునోయని యూరకయుండెనని తాత్పర్యము.

౩౬౫.—వ॥ అంత నావిదర్భనగరంబు నిర్గమించి.

టీ॥ అంతన్=అంతట, ఆవిదర్భనగరంబు=విదర్భనిపట్టణమును. నిర్గమించి=దాఁటి—వదలి బయలుదేఱియనుట.

౩౬౬.—క॥ పరమానురాగరస సం । భరితాంతఃకరణులగుచుఁ * బాటించివధూ
వరులను రథమందిడిహల । ధరహరి రుక్మిణులఁగొల్చి * తగయదువీరుల్.

టీ॥ యదువీరులు = యాదవభటులు. పరమా...కరణులు—పరమ=మిక్కిలి. అనురాగరస = ప్రేమరసముచేత. సంభరిత = నిస్సగా నిండుకొన్న, అంతఃకరణులు = మనస్సులు గలవారు. అగుచున్=అవుచును, పాటించి=ఆదరించి, వధూవరులన్=పెండ్లికొమార్తెను పెండ్లికొమారుని. రథమందున్ = తేరునందు. ఇడి = కూర్చుండఁబెట్టుకొని, హలధరహరిరుక్మిణులన్ = బలరామకృష్ణరుక్మిణీదేవులను, కొల్చి = కొలుచుచును, తగన్ = ఒప్పునట్లు.

తా॥ యాదవభటులందఱు అత్యంతము సంతోషించినవారై ప్రేమ అతిశయింపఁగా ఆదరముతో పెండ్లికూఁతును పెండ్లికొడుకును రథముమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని బలరాముని కృష్ణుని రుక్మిణీదేవిని కొలుచుచుననని తాత్పర్యము.

౩౧౭.—ఉ॥ మంగళ తూర్యఘోషముల * మందగతిం జెలఁగంగ మత్త మా
తంగ తురంగ సద్భట క * దంబముతోఁ జని కాంచిరంత నా
రంగ లవంగ లుంగ విచ * రన్మద భృంగ సురంగనాద సం
సంగ తరంగిణీ కలిత * సంతత నిర్మలి నాకుశస్థలిన్.

టీ॥ మంగళతూర్య ఘోషములు=శుభసూచకములైనవాద్యముల ధ్వనులు. అమందగతిన్=తగ్గనివిధమున. చెలఁగంగన్=మ్రోఁగఁగా. మత్త...కదంబముతోన్—మత్త = మదించిన. మాతంగ = ఏనుఁగులయు. తురంగ = గుఱ్ఱములయు. సద్భట = మంచిబంటులయు. కదంబముతోన్ = సముదాయముతో. చని = పోయి. అంతన్= అంతట. నారంగ...నిర్మలిన్—నారంగ = నారదబ్బలు. లవంగ= లవంగములు. లుంగ=మాదిఫలములు. విచరత్ = వీనియందుసంచరించునట్టి. మద=మత్తుగొన్న. భృంగ=తుమ్మెదలయొక్క. సురంగ= మనోజ్ఞమయిన. నాద = ఝంకారధ్వనులతోడ. సంసంగ = లెస్సగాఁగూడుకొన్న. తరంగిణీ = ఏఱులయందు. కలిత = కూడుకొన్న. సంతత = ఎడతెగని. నిర్మలిన్ = స్వచ్ఛతగలదైన. ఆకుశస్థలిన్=ఆకుశస్థలీప్రదేశమును. కాంచిరి=చూచిరి.

తా॥ ఒప్పిదమగునట్లు శుభసూచకములైనవాద్యములు మిక్కిలి మ్రోఁగఁగా మదపుటేనుఁగులయు గుఱ్ఱములయు మంచిబంటులయు సముదాయముతోఁ గూడఁబోయి నారంగము మొదలగు వృక్షములయందు సంచరించుచున్న మత్తుగొన్నతుమ్మెదలయొక్క మనోజ్ఞమయిన ఝంకారధ్వనులతోఁ గూడుకొన్న నదులచేత ఎడతెగని స్వచ్ఛతను పొందినదైన కుశస్థలియను ప్రదేశమును జూచిరని తా.

౩౧౮.—వ॥ ఇట్లు పురోపవనోప కంఠంబునకుం జని.

టీ॥ (ఇట్లు) పురోపవనోపకంఠంబునకున్ = పట్టణపుశృంగారపుఁదోఁటల దగ్గఱకు. చని = పోయి.

తా॥ ఈవిధముగా పట్టణముచెంబడి శృంగారపుఁ దోఁటల దాపునకుఁ బోయి అని తాత్పర్యము,

౩౧౯.—క॥ అందు వసించిరి నందిత ! చందన మందార కుంద * చంద్ర లసన్మా
కందముల నీడ హృదయా ! నందము సంధింప నంద * నందనముఖ్యుల్.

టీ॥ అందున్ = ఆకుశస్థలియందు. నందనందనముఖ్యులు = కృష్ణుఁడు మొదలగువారు. హృదయానందము=మనస్సంతోషము. సంధింపన్=కలుగఁగా. నందిత...నీడన్—నందిత=కొనియాడఁబడిన. చందన = గందపుచెట్లు. మందార = మందారపుచెట్లు. కుంద=మొల్లచెట్లు. చంద్ర = కర్పూరపుచెట్లు. లసత్ = ప్రకాశించుచున్న. మాకందముల = తియ్యమామిడిచెట్లు వీనియొక్క. నీడన్ = నీడయందు. వసించిరి = బడలిక దీర్చుకొనుటకు ఉండిరి.

తా॥ అంతట కృష్ణమూర్తి మొదలగువారు పట్టణముచెంబడి సింగారపుఁతోఁటల చెంబడికిఁ బోయి మనస్సులకు సంతోషము కలుగునట్టుగా శ్లాఘ్యములయిన గందపుచెట్లు మందారపుచెట్లు మొల్లపొదలు కర్పూరపు అరఁటిమ్రాకులు తియ్యమామిళ్లు మొదలగువాని నీడలయందు వసించిరని తాత్పర్యము.

౩౨౦.—వ॥ తదనంతరంబ పురప్రవేశంబు చేసిరనిచెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

తా॥ ఆటుపిమ్మట పట్టణమునందుఁ జొచ్చిరి అనిచెప్పి పరీక్షిన్మహారాజుతో శుకమహర్షి మఱియు నీచొప్పునపలికెననితాత్పర్యము.

## (*) బాణాసురుం డీశ్వరప్రసాదంబు నొందుట. (*)




తే॥ అనఘ బలినందనులు నూర్వు * రందులోన
నగ్రజాతుండు బాణుఁ డ * త్యుగ్రమూర్తి
చిరయశోహారి విహిత పూ * జిత పురారి
యహితతిమిరోష్ణకరుఁడుస*హస్రకరుఁడు.

టీ॥ అనఘ=ఓపాపములేనివాఁడా. బలినందనులు= బలిచక్రవర్తికొడుకులు. నూర్వురు=నూఱుమంది. అందులోనన్=వారిలోపల. అగ్రజాతుండు = ముందుపుట్టినవాఁడు—పెద్దవాఁడు. అత్యుగ్రమూర్తి=మిక్కిలిభయంకరమైన ఆకృతిగలవాఁడును. చిరయశోహారి=శాశ్వతమయినకీర్తిచేతమనోహరుఁడును. విహితపూజితపురారి= తగినట్టు పూజింపఁబడిన శివుఁడు గలవాఁడును. అహితతిమిరోష్ణకరుఁడు = శత్రువులనెడు చీఁకట్లకు సూర్యుఁడును. సహస్రకరుఁడు = వేయిచేతులుగలవాఁడునైన. బాణుఁడు=బాణుఁడనువాఁడు.

తా॥ ఓపాపములేనివాఁడవైన పరీక్షిన్మహారాజా! బలిచక్రవర్తికి నూఱుగురు కొడుకులు గలరు వారిలో పెద్దవాఁడు మిక్కిలి భయంకరస్వరూపుఁడును, శాశ్వతమయిన కీర్తిగలవాఁడును, శివునితగిన పూజలు చేసి మెప్పించినవాఁడును, శత్రువు లనెడు చీఁకట్లకు సూర్యునివంటివాఁడునై, వేయి చేతులు గలిగియుండు నని తాత్పర్యము.

౩౭౨.—క॥ బాణుఁడు విక్రమజిత గీ । ర్వాణుఁడు సనికాంచె భక్తి ✻ వశుఁడై సగుణున్
స్థాణున్ నిర్దళితాసమ । బాణున్ దాండవ ధురీణు ✻ భక్తత్రాణున్.

టీ॥ విక్రమజితగీర్వాణుఁడు=పరాక్రమముచేత జయింపఁబడిన దేవతలుగలవాఁడగు. (బాణుఁడు) భక్తివశుఁడై = సేవకు అధీనుఁడై. సగుణున్ = త్రిగుణములతోఁ గూడినవాఁడును. నిర్దళితాసమబాణున్=చంపఁబడినమన్మథుఁడుగలవాఁడును. తాండవధురీణున్=నాట్యమునందు భారవాహకుఁడును. భక్తత్రాణున్= భక్తులనుకాపాడువాఁడును.(అగు)స్థాణున్=ప్రళయమునందుండు) శివుని. చని = కైలాసమునకుఁబోయి. కాంచెన్ = చూచెను.

తా॥ తనపరాక్రమముచేత దేవతలనెల్లను జయించినవాఁడైన బాణాసురుఁడు సేవచేయవలెనను ఆసక్తిగలవాఁడై త్రిగుణాత్మకుఁడైనవాఁడును, మన్మథుని నశింపఁజేసినవాఁడును, నాట్యమాడుటయందు పట్టుదల కలవాఁడును, భక్తులను పాలించువాఁడును నైన శివునిసన్నిధానమునకుఁ బోయి దర్శనము చేసెనని తాత్పర్యము.

౩౭౩.—క॥ కని యనురాగవికాసము । దనమనమునఁ గడలుకొనఁగ ✻ ధరఁజాఁగిలి వం
దనమాచరించె మోదము । దనరఁగఁ దాండవముసలుపు ✻ తఱినయ్యభవున్.

టీ॥ (కని) అనురాగవికాసము = అనురక్తివలని తేటఁదనము. (తనమనమున) కడలుకొనఁగన్=అతిశయింపఁగా. ధరన్=భూమియందు. జాఁగిలి = జాఁగిలఁబడి. మోదము = సంతోషము. తనరఁగన్ = అతిశయింపఁగా. తాండవము = నాట్యము. చలుపు తఱిన్=చేయునప్పుడు.అయ్యభవున్=ఆశివుని.(వందనమాచరించెను)

తా॥ అట్లు శివుని దర్శనముచేసి ఆయన నాట్యముచేయునప్పుడు తనమనసున ప్రీతి అతిశయింపఁగా ఆశివునకు సంతోషము కలుగునట్లు భూమిమీఁద జాఁగిలఁబడి బాణాసురుఁడు నమస్కారముచేసెననితా.

౩౭౪.—ఉ॥ సంచితభూరి బాహు బల ✻ సంపద పెంపున నారజంబు వా
యించి యనేకభంగుల ను ✻ మేశుఁ ద్రిలోకశరణ్యు నాత్మ మె
ప్పించి ప్రమోదియై నిజ వ ✻ శీకృత నిశ్చలితాంతరంగుఁ గా
వించి తదాననాంబురుహ ✻ వీక్షణుఁడై తగ మ్రొక్కి యిట్లనెన్.

టీ॥ సంచిత...పెంపునన్—సంచిత=సంపాదింపఁబడిన. భూరి= అధికమయిన. బాహు = భుజములయొక్క. బల = బలముయొక్క. సంపద=కలిమియొక్క. పెంపునన్=అభివృద్ధిచేత. (లేక)గౌరవముచేత. ఆరజంబు = రుంజయనువాద్యమును. (వాయించి) అనేకభంగులన్=బహువిధములచేత. త్రిలోకశరణ్యున్=మూడులోకములకు రక్షకుఁడైన. ఉమేశున్=శివుని. ఆత్మన్ = మనసునందు. మెప్పించి= మెచ్చుకొనునట్లుచేసి. ప్రమోదియై = తానునుసంతోషించినవాఁడై. నిజవశీకృత...రంగున్—నిజ=తనకు.వశీకృత=వశముగాఁజేయఁబడిన. నిశ్చలిత=చలింపని. అంతరంగున్=మనసుగలవానిఁగా. కావించి= చేసి. తదాననాంబురుహవీక్షణుఁడు = ఆయనయొక్క మొగమును జూచినవాఁడు. (అయి) తగన్=ఒప్పునట్లు. మ్రొక్కి=నమస్కరించి. ఇట్లనెన్=ఈవిధముగాపలికెను.

తా॥ పిమ్మట తనకుఁ గలిగియున్న భుజబలము కలిమియొక్క గౌరవము తెలియఁబడునట్లు ఆరజము అనువాద్యమును వాయించి మఱియును అనేకవిధములచేత మూడులోకముల నేలువాఁడైన శివుని మెచ్చుకొనునట్లు చేసి తృప్తివహించినవాఁడై ఆశివుని తనకు వశము చేసికొని ఆయనకు తనయందు చలింపని వాత్సల్యము గలిగినంతట ఆయనను జూచి మరల నమస్కరించి యిట్లుపలికెననితాత్పర్యము.

౩౭౫.—ఉ॥ శంకర భక్తమానస వ ✻ శంకర దుష్టమదాసురేంద్ర నా
శంకర పాండునీల రుచి ✻ శంకరవర్ణ నిజాంగ భోగిరా
ట్కంకణ పార్వతీహృదయ ✻ కైరవ కైరవమిత్ర యోగి హృ
త్పంకజ పంకజాప్త నిజ ✻ తాండవఖేలన భక్తపాలనా.

టీ॥ శంకర = శుభమునుజేయువాఁడా. భక్తమానసవశంకర= సేవకులమనస్సును వశపఱుచుకొనువాఁడా. దుష్ట...శంకర—దుష్ట= చెడ్డవారైన. మద = క్రొవ్వుగల. అసురేంద్ర = రాక్షసశ్రేష్ఠులను. నాశంకర=నశింపఁజేయువాఁడా. పాండు...నిజాంగ — పాండు= తెలుపును. నీల = నలుపునైన. రుచి = కాంతులచేత. శంకర=మేలు కలుగఁజేయుచున్న. వర్ణ=వన్నెలతోడి. నిజాంగ = స్వశరీరముగలవాఁడా. భోగిరాట్కంకణ=సర్పరాజైన వాసుకియే కడియముగాఁ గలవాఁడా. పార్వతీ...మిత్ర — పార్వతీ = గౌరీదేవియొక్క. హృదయ=మనస్సనెడు. కైరవ=తెల్లగలువకు. కైరవమిత్ర=చంద్రుఁడైనవాఁడా. యోగి...జాప్త—యోగి=బ్రహ్మనిష్ఠగలవారియొక్క. హృత్=అంతఃకరణములనెడు. పంకజ=కమలములకు. పంకజాప్త= సూర్యుఁడా. నిజతాండవఖేలన=స్వకీయమైననాట్యముచేత నేక్రీడించువాఁడా. భక్తపాలనా=సేవకులనుపాలించువాఁడా.

తా॥ శుభమును చేయువాఁడవును, భక్తులమనసులను వశపఱుచు

కొనువాఁడవును, పెద్దవారై క్రొవ్విన రాక్షసశ్రేష్ఠులను చంపువాఁడవును, అర్ధనారీశ్వరుఁడవగుటచేత సగముదేహము తెల్లగాను సగముదేహము నల్లగాను వెలుఁగఁగా వర్తించువాఁడవును, వాసుకిని చేతి కడియముగాఁ జేసికొన్నవాఁడవును, పార్వతీదేవియొక్క మనస్సనెడు తెల్లగలువకు చంద్రుఁడైనవాఁడవును, బ్రహ్మనిష్ఠవహించిన వారిమనస్సులనెడు కమలములకు సూర్యుఁడైనవాఁడవును, స్వకీయమయిన నాట్యక్రీడయందు ఉత్సాహము గలవాఁడవును, సేవకులను కాపాడువాఁడవునైన ఓస్వామీఅనిపొగడెననితా. వ॥ అనివినుతించి.

౩౭౬.—ఉ॥ దేవ మదీయవాంఛితముఁ * దేటపడ న్నిటు విన్నవించెదన్
నీవును నద్రినందనయు * నెమ్మిని నాపురి కోట వాకిటన్
గావలియుండి నన్నుఁ గృపఁ * గావుము భక్తఫలప్రదాత యో
భావభవారి నీచరణ * పద్మము లెప్పుడు నాశ్రయించెదన్.

టీ॥ దేవ=స్వామీ. మదీయవాంఛితమున్=నాకోరికను. తేటపడన్=విశదమగునట్లు. ఇటు=ఈవిధముగా—ఇప్పుడుచెప్పఁబోవు రీతిగా. విన్నవించెదన్ = మనవిచేసికొనెదను. (నీవును) అద్రినందనయున్=గౌరీదేవియు. నెమ్మిని=ప్రీతితో. నాపురికోటవాకిటన్=నాపట్టణపు కోటవాకిటియందు. (కావలియుండి నన్ను) కృపన్=దయతో. కావుము=కాపాడుము. భక్తఫలప్రదాత = సేవకులు కోరినకోరికల నిచ్చునట్టి. ఓభావభవారి = ఓమన్మథునికివిరోధివైన స్వామీ. (నీచరణపద్మములు ఎప్పుడును ఆశ్రయించెదను)

తా॥ అనన్యభక్తితో నిన్ను ఆరాధించు సేవకులకోరికల నిచ్చునట్టివాఁడవైన ఓస్వామీ! నీవును నీప్రియురాలయిన పార్వతీదేవియు నాపట్టణపు మొగసాలలో కావలియుండి నన్ను కాపాడుచుండుఁడు ఇది నాకోరిక అని విన్నవించెనని తాత్పర్యము.

వ॥ అని యభ్యర్థించినం బ్రసన్నుండై భక్తవత్సలుండగు పురాంతకుండు గౌరీసమేతుండై తారకాది భూత గణంబులతోడ బాణనివాసంబగు శోణపురంబువాకిటం గాపుండెఁ. బదంపడియొక్కనాఁ డబ్బలినందనుండు.

టీ॥ (అని) అభ్యర్థించినన్ = కోరఁగా. ప్రసన్నుండై = అనుగ్రహముగలవాఁడై. భక్తవత్సలుండు = భక్తులయందుఁ బ్రేమగలవాఁడు. అగుపురాంతకుండు=అయినశివుఁడు. గౌరీసమేతుండై=పార్వతితోఁగూడుకొన్నవాఁడై తారకాదిభూతగణంబులతోడన్=తారకుఁడు మొదలుగాఁగల ప్రమథులసమూహములతో. బాణనివాసంబు=బాణాసురునియునికిపట్టు. (అగుశోణపురంబువాకిటను) కాపుండెన్=కావలియుండెను. పదంపడి=పిమ్మట. (ఒక్కనాడు) అబ్బలినందనుండు=ఆబాణాసురుఁడు.

తా॥ అని కోరఁగా అట్లే కానిమ్మని అనుగ్రహించినవాఁడై శివుఁడు పార్వతితోడను తారకుఁడు మొదలగు ప్రమథగణముల తోడను, బాణాసురుని ఉనికిపట్టయిన శోణపట్టణపువాకిటియందు కావలియుండెను పిమ్మట ఒకనాడు ఆబాణాసురుఁడు అని తా.

౩౭౭.—తే॥ దర్పమునఁబొంగి రుచిరమా * ర్తాండదీప్తి। మండలముతోడ మార్పడు * మహితశోణ
మణికిరీటము త్రిపురసం * హరునిపాద। వనజములుసోఁక మ్రొక్కి—యి * ట్లనినుతించె.

టీ॥ దర్పమునన్=మదముచేత. పొంగి=విజృంభించి. రుచిర...తోడన్—రుచిర=ప్రకాశించుచున్న. మార్తాండ=సూర్యునియొక్క. దీప్తి=వెలుఁగునట్టి. మండలముతోడన్=బింబముతో. మార్పడు...కిరీటము—మార్పడు=ఎదిరించునట్టి. మహిత=పూజ్యములైన. శోణమణి = కెంపులుచెక్కిన. (కిరీటము) త్రిపురసంహారునిపాదవనజములు=శివుని పాదకమలములు. సోఁకన్=తాఁకునట్లు. (మ్రొక్కి) ఇట్లని=ఈమీఁదఁజెప్పఁబడురీతిని. నుతించెన్ = స్తోత్రముచేసెను.

తా॥ మదముచేత విజృంభించి మిక్కిలి వెలుఁగుచున్న సూర్యబింబమును తిరస్కరించునట్టి కెంపులకాంతులచేత వెలుఁగుచున్న కిరీటము శివుని పాదకమలములు సోఁకునట్లు దండములు పెట్టి స్తోత్రము చేసెనని తాత్పర్యము.

౩౭౮.—సీ॥ దేవ జగన్నాథ * దేవేంద్రవందిత - వితతచారిత్ర సం * తతపవిత్ర
హాలాహలాహార * యహిరాజ కేయూర - బాలేందుభూష స * ద్భక్తపోష
సర్వలోకాతీత * సద్గుణసంఘాత - పార్వతీహృదయేశ * భవవినాశ
రజతాచలస్థాన * గజచర్మపరిధాన * సురవైరి విధ్వస్త * శూలహస్త

తే॥ లోకనాయక సద్భక్త * లోకవరద। సురుచిరాకార మునిజన * స్తుతివిహార
భక్తజన మందిరాంగణ * పారిజాత। నిన్ను నెవ్వఁడు నుతిసేయ * నేర్చునభవ.

టీ॥ దేవ=స్వామీ. జగన్నాథ=లోకనాయకుఁడా. దేవేంద్రవందిత = దేవేంద్రునిచేత స్తోత్రము చేయఁబడువాఁడా. వితతచారిత్ర = గొప్పచరిత్రము గలవాఁడా. సంతతపవిత్ర=సదాపరిశుద్ధుఁడయినవాఁడా. హాలాహలాహార = హాలాహలము అనువిషమును హరించినవాఁడా. అహిరాజకేయూర = సర్పరాజభుజకీర్తిగాఁగలవాఁడా. బాలేందుభూష = బాలచంద్రుఁడు ఆభరణముగాఁగలవాఁడా. సద్భక్తపోష = మంచి భక్తులను పోషించువాఁడా. సర్వలోకాతీత=ఎల్లలోకములను అతిక్రమించినవాఁడా.

సద్గుణసంఘాత=మంచిగుణములసముదాయముగలవాఁడా. పార్వతీహృదయేశ=పార్వతీమనోనాయకుఁడా. భవవినాశ = పాపమును నశింపఁజేయువాఁడా. రజతాచలస్థాన = వెండి కొండ యునికిపట్టుగాఁగలవాఁడా. గజచర్మపరిధాన=ఏనుఁగుతోలు కట్టువస్త్రమయినవాఁడా. సురవైరివిధ్వస్త = రాక్షసులను ధ్వంసముచేయువాఁడా. శూలహస్త= శూలము చేతియందుఁగలవాఁడా. లోకనాయక = లోకములకు ప్రభువైనవాఁడా. సద్భక్తలోకవరద = మంచిసేవకులసమూహము కోరికలనిచ్చువాఁడా. సురుచిరాకార=ప్రకాశించు ఆకారముగలవాఁడా. మునిజనస్తుతివిహార=మహర్షులయొక్క స్తోత్రజాలములందు విహరించువాఁడా. భక్తజన ... పారిజాత—భక్తజన=సేవకజనులయొక్క. మందిర=ఇండ్లయొక్క. అంగణ=ముంగిళ్లయందలి. పారిజాత = కల్పవృక్షమయినవాఁడా. అభవ = పుట్టుకలేనివాఁడా. (నిన్ను ఎవ్వఁడు) నుతిసేయన్ = స్తోత్రముచేయ. నేర్చును=శక్తిగలవాఁడగును.

తా॥ లోకనాయకుఁడవును, దేవేంద్రునిచేత కొనియాడఁబడువాఁడవును, విశేషచరిత్రములు గలవాఁడవును, సర్వదాపరిశుద్ధుఁడగువాఁడవును, విషమునుపానముచేసినవాఁడవును, పాములరాజైన ఆదిశేషుఁడు భుజకీర్తులుగాఁగలవాఁడవును, బాలచంద్రుఁడు ఆభరణముగాఁ గలవాఁడవును, ఏకాంతభక్తిగల సేవకులనుపోషించువాఁడవును, ఎల్లలోకములను అతిక్రమించినవాఁడవును, సర్వజ్ఞత్వాదిగుణముల సముదాయము గలవాఁడవును, పార్వతికి మనోనాయకుఁడవును, పాపములనునశింపఁజేయువాఁడవును, వెండికొండయునికిపట్టుగాఁగలవాఁడవును, ఏనుఁగుతోలు కట్టుఁబట్టగాఁగలవాఁడవును, రాక్షసులను జంపువాఁడవును, శూలము చేతధరించినవాఁడవును, లోకములకు ఏలికైనవాఁడవును, నిత్యభక్తులకూటముల కోరికల నిచ్చువాఁడవును, పుట్టుక లేనివాఁడవునైన ఓస్వామీ! నిన్నెవ్వఁడును నుతింపనేరఁడని తాత్పర్యము.

౩౮౦.—మ॥ అనిలోనన్ను నెదిర్చి బాహుబల శౌ * ర్య స్ఫూర్తిఁ బోరాడఁ జా
లిన వీరుం డొకఁడైనఁ బందెమునకున్ * లేఁడయ్యె భూమండలిన్
ననయంబున్ భవ దగ్ర్య దత్త కర సా * హస్రంబు కండూతి వా
యు నుపాయంబును లేదె యీభరము నె * ట్లోర్తున్నుమానాయకా.

టీ॥ ఉమానాయకా=పార్వతీదేవికి పెనిమిటియగు స్వామీ. అనిలోన్=యుద్ధమునందు. (నన్ను) ఎదిర్చి=ఎదిరించి. బాహుబలశౌర్యస్ఫూర్తిన్=భుజబలప్రకాశముచేత. పోరాడఁజాలినవీరుండు=పోరాడుటకుశక్తిగలశూరుఁడు. ఒకఁడైనన్=ఒక్కఁడైనను. పందెమునకున్=పందెమునకైనను. భూమండలిన్ = మండలాకారమైన భూప్రదేశమునందు. లేఁడయ్యెన్=లేకపోయెను. అనయంబున్=మిక్కిలి. భవదగ్ర్యదత్తకర...ఉపాయంబును—భవత్ = నీచేత. అగ్ర్య=ముఖ్యముగాను. దత్త=ఇయ్యఁబడిన. కరసాహస్రంబు=చేతులువేయింటియొక్క. కండూతి=తీఁట. వాయు=తొలఁగునట్టి. ఉపాయంబును = ఉపాయముగూడ. లేదె = లేకపోయెనే. ఈభరమున్=ఈచేతులబరువును. ఎట్లోర్తున్ = ఏవిధముగాసహింతును.

తా॥ ఓపార్వతీపతీ యుద్ధమునందు భుజబలముచేతనన్నెదిరించి పోరాడుటకు ఓపినశూరుఁడు ఒకఁడైనను పందెముపెట్టి పిలిచిన కానరాకయున్నాఁడు నీయనుగ్రహమువలన పొందఁబడిన చేతులు వేయింటియొక్క దురద మానుటకు మార్గము కానరాక యున్నది ఈచేతులబరువునకు నేనెట్లు సహింతునని అడిగెననితాత్పర్యము.

౩౮౧.—సీ॥ హుంకార కంకణ * క్రేంకార శింజినీ - టంకార నిర్ఘోష * సంకులంబు
చండ దోర్దండ భా * స్వన్మండలాగ్ర ప్ర - కాండఖండిత రాజ * మండలంబు
శూలాహత క్షతో * ద్వేల కీల కరాళ - కేళీ సమా లోల * ఖేలనంబు
శుంభ దున్మదకుంభి * కుంభస్థలధ్వంస - సంభూతశౌర్య వి * జృంభణంబు

తే॥ గలుగనుద్దామభీమసం * గ్రామకేళి । ఘనపరాక్రమవిక్రమ * క్రమముగాఁగ
జరుపలేనట్టికరములు * గరముదుఃఖ । కరములగుఁగాకసంతోష * కరములగునె.

టీ॥ హుంకార...సంకులంబు — హుంకార = హుంఅనుటలయొక్కయు. కంకణ=కడియములవలని. క్రేంకార = క్రేం అనుటలయొక్కయు. శింజినీ=అల్లెత్రాటివలని. టంకార=టం అనుటలయొక్కయు. నిర్ఘోష=ధ్వనులచేతనైన. సంకులంబు = కోలాహలమును. చండ...రాజమండలంబు—చండ=వాఁడియైన. దోర్దండ=కఱ్ఱలవంటిచేతులందు. భాస్వత్ = వెలుఁగుచున్న. మండలాగ్ర = కత్తులయొక్క. ప్రకాండ=సమూహములచేత. ఖండిత = నఱకఁబడిన. రాజమండలంబు=రాజులగుంపును. శూలాహత...ఖేలనంబు—శూల=శూలములనెడుఆయుధములచేత. ఆహత=కొట్టఁబడుటచేతనైన. క్షత=గాయములనుండి. ఉద్వేల = మిక్కిలియుబికి. (కాలుచున్న) కీల=నెత్తుటిచేత. కరాళ = భయంకరమయిన. కేళీ=క్రీడయందు. సమాలోల = మిక్కిలి ఆసక్తమయిన. ఖేలనంబు = విహరించుటయు. శుంభ...విజృంభణంబు — శుంభత్ = మిక్కిలయిన. ఉన్మద=మత్తుగల. కుంభి=ఏనుఁగులయొక్క. కుంభస్థల=కుంభస్థలములను. ధ్వంస=భేదించుటచేత. సంభూత=పుట్టిన. శౌర్య=శూరత్వముయొక్క. విజృంభణంబు = రేఁగుటయు. కలుగు... కేళిన్—కలుగు=కలిగిన. ఉద్దామ=గంభీరమయిన. భీమ=భయంకరమైన. సంగ్రామకేళిన్=యుద్ధక్రీడను. ఘన...క్రమముగాఁగన్—ఘన=అధికమైన. పరాక్రమ=శత్రువులనాక్రమించుటయందలి. విక్రమ=శూరత్వ[illegible]క్క. క్రమముగాఁగన్ = విశేషించిదాటుటగలది

యగునట్టుగా. జరుపన్=నడప. లేనట్టి = చాలనట్టి. కరములు=చేతులు. కరము = మిక్కిలి. దుఃఖకరములు=దుఃఖమునుకలుగఁజేయునవి. అగుఁగాక=అవునుగాని. సంతోషకరములు=సంతోషమునుకలుగఁజేయునవి. ఆగునె=ఔనా.

తా॥ శూరులహుంకారములయొక్కయు, కంకణములక్రేంకారములయొక్కయు, అల్లెత్రాళ్లటంకారములయొక్కయు, కోలాహలధ్వనులును, వాఁడిగలిగి చేతులయందు ప్రకాశించుచున్న కత్తులచేత నఱకఁబడిన రాజులగుంపులును, శూలములతో పొడుచుటలచేతనైన గాయములనుండి కాఱుచున్న నెత్తురులచేత భయంకరమయినవిహారమునందు మిక్కిలి ఆసక్తమయిన ఆటయును, మిక్కిలి మదించిన యేనుఁగుల కుంభస్థలములను పగులుచ్చుటచేత పుట్టినశూరత్వముయొక్క ఆటోపమునుగలిగి మిక్కిలి గంభీరమయిన యుద్ధక్రీడను శత్రువుల నాక్రమించునట్టి విశేషమయినక్రమము కలుగునట్టుగా నడపఁజాలని చేతులు మిగుల దుఃఖమును కలుగఁజేయునవి యగును గాని సంతోషమును కలుగఁజేయునవి కావు అని తాత్పర్యము.

౩౮౨.—ఉ॥ కానమదీయ చండభుజ * గర్వపరాక్రమ కేళికిన్ సముం
డీనిఖిలావనిం గలఁడె * యిందుకళాధర నీవు దక్కఁగా
నానిటలాంబకుండు దను * జాధిపు మాటకుఁ జాలరోసి లో
నూనిన రోషవార్ధి గడ * లొత్తఁగ నిట్లనిపల్కె భూవరా.

టీ॥ ఇందుకళాధర=శివుఁడా. కానన్ = కనుక. మదీయ... కేళికిన్—మదీయ=నాదైన. చండ=భయంకరమైన. భుజగర్వ=భుజబలముచేత. పరాక్రమ=శత్రువులనాక్రమించునట్టి. కేళికిన్=క్రీడకు. సముండు=సమానుఁడు. నీవుదక్కఁగా = నీవేతప్ప. ఈనిఖిలావనిన్ = ఈభూలోకమునందెల్లయెడలను. కలఁడె=ఉన్నాఁడా. నాన్=అనఁగా. భూవరా=ఓరాజా. నిటలాంబకుండు=శివుఁడు. దనుజాధిపుమాటకున్=బాణాసురుని ఆమాటకు. చాలన్=మిక్కిలి. రోసి=అసహ్యపడి. లోన్=తనమనస్సులో. ఊనిన=నాటిన. రోషవార్ధి =కోపరసమనుసముద్రము. గడలొత్తఁగన్ = అలలెగయఁగా. ఇట్లనిపల్కెన్=ఈమీఁదఁజెప్పఁబడునట్లు చెప్పెను.

తా॥ ఓస్వామీ! అట్టిచేతులు దుఃఖమును కలుగఁజేయునట్టివి గనుక నాభుజబలమునకుఁ దగినట్టు పరాక్రమమును జూపఁజాలినవాఁడు నీకంటె ఇతరుఁడెవఁడైన ఈభూమండలములో ఉన్నాఁడా అనఁగా శివుఁడు ఆబాణాసురునిపలుకులకు మిక్కిలి కోపించి ఆకోపాతిశయముతో ఇట్లు పలికెనని తాత్పర్యము.

౩౮౩.—క॥ విను మూఢహృదయ నీకే । తనమెప్పు డకారణంబ * ధారుణిపైఁ గూ
లును నపుడనీభుజావలి । తునియఁగ నాయంతవాని * తో నని గల్గున్.

టీ॥ విను=వినుము. మూఢహృదయ = తెలివిమాలినమనసుగలవాఁడా. నీకేతనము=నీటెక్కెము. ఎప్పుడు=ఏసమయమునందు. అకారణంబ = కారణములేకయే. ధారుణిపైన్ = భూమిమీఁద. కూలున్=పడునో. అపుడ=అప్పుడే. నీభుజావలి=నీభుజపఙ్క్తి. తునియఁగన్=తెగునట్టుగా. (నాయంతవానితో) అని=యుద్ధము. కల్గున్=కలుగును — అప్పుడు నీయభిలాష నెఱవేఱునని భావము.

తా॥ ఓరి తెలివిమాలినవాఁడా! నామాటవినుము ఎప్పుడు నీకేతనము కారణము లేకయే విఱిగి నేలఁగూలునో అప్పుడు నీచేతులన్ని తెగిపోవునట్లు నాతో సమానుఁడగువానితో యుద్ధము నీకుఁ గలుగును అని చెప్పెనని తాత్పర్యము.

౩౮౪.—వ॥ అని పలికిన నట్లు సంప్రాప్త మనోరథుండై నిజభుజ వినాశ కార్య ధురీణుండగు
బాణుండు సంతుష్టాంత రంగుండగుచు నిజ నివాసంబునకుం జని తన ప్రాణవల్లభల
యుల్లంబులు పల్లవింపంజేయుచు నిజధ్వజ నిపాతంబు నిరీక్షించుచుండెఁ దదనంతరంబ.

టీ॥ అనిపలికినన్ = అనిచెప్పఁగా. (అట్లు) సంప్రాప్తమనోరథుండై=పొందఁబడిన కోరికగలవాఁడై. నిజభుజవినాశకార్యధురీణుండు = తనభుజములు నశించుటయనెడు పనియొక్క బరువును వహించినవాఁడు. (అగుబాణుండు) సంతుష్టాంతరంగుండు=సంతోషించినమనస్సుగలవాఁడు. అగుచున్ = అవుచును. నిజనివాసంబునకున్ = తనయునికిపట్టునకు. చని = పోయి. తనప్రాణవల్లభలయుల్లంబులు = తనప్రియురాండ్రమనస్సులు. పల్లవింపన్=వికాసమునువహింపఁగా. (చేయుచు) నిజధ్వజనిపాతంబు=తనటెక్కెముయొక్కపాటును. (నిరీక్షించుచుండెను) తదనంతరంబ=ఆటుపిమ్మట.

తా॥ అని శివుఁడు ఆనతియ్యఁగా కోరికనుపొందిన తనభుజములు తెగిపోవలెనను విషయమునందు ప్రయత్నపడుచున్న బాణాసురుఁడు సంతోషించినవాఁడై తనయునికిపట్టునకుఁబోయి తన ప్రియురాండ్రమనస్సులు తనియఁజేయుచు తన టెక్కెము క్రిందఁబడుటను ఎదురుచూచుచుండెనని తాత్పర్యము.

౩౮౫.—సీ॥ ఆదానవేశ్వరు * నసుఁగుఁ గూఁతగు నుషా - కన్య సచ్చరిత సౌ * జన్య ధన్య
రూప విభ్రమకళా * రుచిరకోమలదేహ - యతను నాఱవబాణ * మనఁగనొప్పు
సుందరీ రత్నంబు * నిందు నిభానన - యలినీలవేణి ప * ద్మాయతాక్షి
యొకనాడు రుచిరసౌ * ధోపరివేదికా - స్థలమునమృదుశయ్య * నెలమిఁగూర్కి

తే॥ మున్ను దనచౌల నెన్నఁడు * విననియతఁడుఁ। గన్నులారంగఁ దాఁబొడ * గన్నయతఁడు
గాని యసమాన రూపరే * ఖా విలాస। కలితు ననిరుద్ధు నర్మిలిఁ * గవసి నటుల.

టీ॥ ఆదానవేశ్వరుననుఁగుఁగూఁతగు=ఆరాక్షసరాజైనబాణుని ప్రియపుత్రికయైన. ఉషాకన్య=ఉషయనుపేరుగలకన్యక. సచ్చరిత=మంచినడవడిగలది. సౌజన్య=మంచిపుట్టుకగలది. ధన్య=కృతార్థురాలు. రూపవిభ్రమ...దేహ—రూప=చక్కఁదనమును. విభ్రమ=విలాసమును. కళా=విద్యలును, రుచిర=మనోజ్ఞమయిన. కోమల=మృదువునైన. దేహ = శరీరమునుగలది. అతనునాఅవబాణము=మన్మథునియొక్క ఆఅవబాణము. అనఁగన్ = అనునట్టుగా. ఒప్పున్ = తగియుండును. సుందరీరత్నంబు = చక్కఁదనముగల స్త్రీలలో శ్రేష్ఠురాలు. ఇందునిభానన=చంద్రునివంటిముఖముగలది. అలినీలవేణి = తుమ్మెదలవలె నల్లనైనజడగలది. పద్మాయతాక్షి = కమలములవలె విశాలమయినకన్నులుగలది. (ఒకనాడు) రుచిర...వేదికాస్థలమునన్—రుచిర=ప్రకాశించునట్టి. సౌధ=మేడయొక్క. ఉపరి = మీఁదిభాగముననుండెడు. వేదికాస్థలమునన్ = అరుఁగుమీఁద. మృదుశయ్యన్ = మెత్తనిపఱుపుమీఁద. ఎలమిన్ = సుఖముగా. కూర్కి=నిద్రించి. మున్ను=మునుపు. (తన) చౌలన్=చెవులతో. ఎన్నఁడున్=ఎప్పుడును. విననియతఁడును=విననివాఁడును. కన్నులారంగన్ = కన్నులుచల్లఁగా. తాన్ = తాను. పొడగన్నయతఁడు=చూచినవాఁడును. (కాని) అసమానరూప...కలితున్—అసమాన = సరిలేని. రూప=చక్కఁదనముతోడను. రేఖా=కళతోడను.విలాస=శృంగారపుచేష్టలతోడను.కలితున్=కూడుకొన్నవానిని. (అనిరుద్ధుని) అర్మిలిన్=ప్రీతితో. కవసినటుల=కూడినట్లు.

తా॥ అటుపిమ్మట ఆబాణాసురుని ప్రియపుత్రికయైన ఉషయను కన్యక మంచి పుట్టుక గలదియు, కృతార్థురాలును చక్కఁదనము ఒయ్యారములోనగునవిగలదియు, మనోజ్ఞమయిన ఆకారముగలదియునైమన్మథునియొక్క ఆఅవబాణమోయనునట్లు తన్నుఁజూచువారికి మోహనసంతాపనాదులైన అవస్థలను కల్పించుచు ఒప్పునట్టి అందగత్తె ఒకనాడు ప్రకాశించుచున్న మేడపైనుండునట్టి అరుఁగుమీఁద మెత్తనిపఱుపుపైని పండుకొని సుఖముగా నిద్రించి మునుపు తాను విన్నవాఁడును కన్నవాఁడునుగాని చక్కఁదనము ఒయ్యారము మొదలగు గుణములతోఁ గూడుకొన్న అనిరుద్ధుఁడనువానిని కూడినట్టు కలగనెను అని తాత్పర్యము.

(*) ఉషాకన్య యనిరుద్ధునిఁగూడినటుల కల గనుట. (*)


చెలికత్తె.


ఉషాకన్య.



౩౮౬.—చ॥ కలగని యంత మేలుకొని *
కన్నుల బాష్పకణంబు లొల్కఁగాఁ
గలవలెఁగాక నిశ్చయము *
గాఁ గమనీయ విలాస విభ్రమా
కలిత తదీయరూపము ము *
ఖంబున వ్రేలినయట్ల తోఁచినన్
గళవళమందుచున్ బిగియు *
గౌఁగిటిచేబయ లప్పళించుచున్.

టీ॥ (కలగని) అంతన్ = అంతట. (మేలుకొని) కన్నులన్ = కన్నులయందుండి. బాష్పకణంబులు=నీటిబొట్లు. ఒల్కఁగాన్=కాఱఁగా. కలవలెఁగాక = కలగన్నట్టు అబద్ధముగాక. నిశ్చయముగాన్=నిజముగా. కమనీయ...రూపము — కమనీయ=మనోజ్ఞమయిన. విలాస=ఒయ్యారపుఁబనులతోడను. విభ్రమా=ఒయ్యారపునడకలతోడను. కలిత=కూడుకొన్న. తదీయరూపము=అతని ఆకృతి. ముఖంబునన్=తనయెదుట. వ్రేలినయట్లు=సాక్షాత్కరించినట్టు. తోఁచినన్=కానఁబడఁగా. కళవళమందుచున్ = కలవరపడుచు. బిగియకౌఁగిటిచేన్ = గాఢాలింగనముచేత. బయలప్పళించుచున్=ఏమిలేనిబయలిలో చేతులుచాఁచి పట్టుచును.

తా॥ అట్లు కలగని అంతటిలో మేలుకొని అది నిజముగానే తోఁచఁగా ఆయనిరుద్ధునిఁగానక అతఁడు ఎక్కడపోయెనోయని కన్నుల నీళ్లువిడుచుచు అతనియొక్క అందమయినరూపము తన కెదుట కనఁబడుచున్నట్టు పట్టి బయటిని గాఢముగా ఆలింగనము చేసికొనుచు నుండెనని తాత్పర్యము.

వ॥ మఱియును.

౩౮౭.—చ॥ సరసమృదూక్తులుం గుసుమ * సాయకు కేళియు శాటికా కచా
కర్షణముల్ నఖక్రియలుఁ * గమ్ర కపోల లలాట మేఖలా
కరకుచ బాహుమూలములు * గైకొని యుండుటలాదిగాఁ దలో
దరి మది గాఢమై తగిలె * దర్పకుఁ డచ్చున నొత్తినట్లయై.

టీ॥ సరసమృదూక్తులున్ = సరసములయిన తిన్ననిమాటలును. కుసుమసాయకుకేళియు = మన్మథక్రీడయు. శాటికాకచాకర్షణములు = పైఁటయొక్కయు కొప్పువెండ్రుకలయొక్కయు లాగుటలును. నఖక్రియలు = గోటినొక్కులును. కమ్ర...మూలములు — కమ్ర=మినమినలాడునట్టి. కపోల = చెక్కిళ్లును. లలాట = నొసలును. మేఖలా=మొలనూలును. కర=చేతులును. కుచ = స్తనములును. బాహుమూలములు = చంకలును. కైకొనియుండుటలు = గ్రహించియుండుటలును. ఆదిగాన్ = మొదలుగా. తలోదరి = అణఁగినకడుపుగలదైన ఆ ఉషయొక్క. మదిన్ = మనసునందు. దర్పకుఁడు=మన్మథుఁడు. అచ్చునన్నొత్తినట్లయ్యె=అచ్చువేసినట్టయి. గాఢమయి=దృఢముగా. తగిలెన్=అంటెను.

తా॥ అంతేగాక సరసములయిన తిన్ననిమాటలును, మన్మథక్రీడయు, కొంగుపట్టిలాగుట, కొప్పుపట్టిలాగుట, గోటితో నొక్కుట, తళతళ లాడుచున్న చెక్కిళ్లను నొక్కుట, నొసలుముట్టుట, మొలనూలుపట్టుకొనుట, చేతులుపైన వేసికొనుట, స్తనములంటుట, చక్కిలిగింతలుపెట్టుట మొదలగురహస్యక్రియలు తనమనసులో మన్మథుఁడు అచ్చుగొట్టిపోయినాడో అనునట్లు దృఢముగా తోఁచఁగా నని తా.

౩౮౮.—సీ॥ కలికిచేష్టలు భావ * గర్భంబులైనను - బ్రియుమీఁది కూరిమి * బెగ్గలింపఁ
బిదపిదనై లజ్జ * మదిఁ బదనెచ్చినఁ - జెలిమేనఁ బులకలు * చెక్కులొత్త
మదనాగ్ని సంతప్త * మానస యగుటకు - గురుకుచ హార వ * ల్లరులుగందఁ
జిత్తంబునాయకా * యత్తమైయుంటకు - మఱుమాటలాడంగ * మఱుపుగదుర
తే॥ నతివమనమున సిగ్గుమో * హంబుభయము । పొడమనునుమంచునెత్తమ్మిఁ * బోదువుమాడ్కిఁ
బ్రథమ చింతాభరంబునఁ * బద్మనయన । కోరి తలచీర వాటింప * నేరదయ్యె.

టీ॥ కలికిచేష్టలు=వినోదక్రియలు. భావగర్భంబులైనన్ = వేఱుభావమును తోఁపించునవికాఁగా. ప్రియుమీఁదికూరిమి=పెనిమిటియందలిస్నేహము. బెగ్గలింపన్=అతిశయించుచుండఁగాను. లజ్జ=సిగ్గు. పిదపిదనై=సల్లినదై. మదిన్=మనస్సునందు. పదనెచ్చినన్=అనురాగముహెచ్చఁగా. చెలిమేనన్=ఆచిన్నదానిదేహమునందు. పులకలు=గగుర్పాటులు. చెక్కులొత్తన్=మిక్కుటముకాఁగాను. మదనాగ్నిసంతప్తమానస=మన్మథాగ్నిచేత తపించిన మనస్సుగలది. (అగుటకు) గురుకుచహారవల్లరులు = గొప్పలయిన స్తనములమీఁది ముత్యాలపేరులు. కందన్=నల్లపడిపోఁగాను. చిత్తంబు=మనస్సు. నాయకాయత్తమై=ప్రియుని అధీనమయి. ఉంటకున్ = ఉండుటకు. మఱుమాటలు=బదులుమాటలు. ఆడంగన్ = చెప్పుటకు. మఱుపుగదురన్=మఱపురాఁగాను. అతివ=ఉష. మనమునన్ = మనసునందు. సిగ్గు=లజ్జయు. మోహంబు=మచ్చికయు. భయము = వెఱపును. పొడమన్ = పుట్టఁగాను. నునుమంచు = కొంచెపుమంచు. నెత్తమ్మిన్=వికసించినతామరను. పొదువుమాడ్కిన్ = ఆవరించుకొనునట్లు. ప్రథమచింతాభరంబునన్=తొలుతటిచింతయొక్క అతిశయముచేత. పద్మనయన=ఉష. (కోరి) తలచీర = తలపైబట్టను సైతము. వాటింప నేరదయ్యెన్=ఆదరింపసమర్థురాలుకాకపోయెను.

తా॥ వినోదచేష్టలు వేఱువేఱుభావములను కలుగఁజేయుటచేత పెనిమిటియందలి స్నేహమతిశయింపఁగా, క్రమక్రమముగ లజ్జవదలి మనసునందలి అనురాగము హెచ్చుటచేత దేహమునందు గగుర్పాటులు కలుగుచుండఁగా, మన్మథాగ్నిచేత తపించిన మనసుగలది అగుటచేత బొమ్ములయందు వ్రేలుచున్న ముత్యాలపేరులు నల్లపడిపోఁగా, మనసు ప్రియునికి అధీనమైయుండుటచేత చెప్పినమాటకు బదులుమాట చెప్పను తోఁచకపోఁగా, ఉషాకన్య తనమనసునందు సిగ్గును మచ్చికయు భయమును కలుగుచుండఁగా, మంచుచేత కప్పఁబడిన తామరపువ్వువలె విచారముచేత చిన్నబోయిన ముఖముతో అందులకు తగినచేష్టలను నడపుటకుసయితము నేరనిదయ్యెనని తా.

౩౮౯.—వ॥ ఇట్లు విరహవేదనా దూయమాన మానసయైయుండె నంత నచ్చెలులు డాయం
జనుదెంచినం దనమనంబునం బొడము మనోజవికారంబు మఱుఁగువెట్టుచునప్పుడు.

టీ॥ (ఇట్లు) విరహ...మానసయై—విరహ=ఎడఁబాటువలని. వేదనా=శ్రమచేత. దూయమాన=తపింపఁజేయఁబడుచున్న. మానసయై=మనస్సుగలదై. (ఉండెను) అంతన్=అంతట. అచ్చెలులు=తనచెలికత్తెలు. డాయన్=దగ్గఱ. చనుదెంచినన్=రాఁగా. తనమనంబునన్=తనమనసునందు. పొడము = పుట్టునట్టి. మనోజవికారంబు=మన్మథసంబంధమైనవికారమును (మఱుఁగుపెట్టుచుఅప్పుడు)

తా॥ ఈవిధముగా ప్రియునివలని యెడఁబాటుచేత మనస్తాపమును పొందినదై యుండెను, అప్పుడు చెలికత్తెలందఱు చేరవచ్చి చూచి ఇదియేమియని విచారించునపుడు తనమనసులోని మన్మథవికారమును వారికి తెలియకుండ మఱుఁగుపెట్టుచు ఉండెనని తా.

౩౯౦.—చ॥ పొరిఁబొరివచ్చు నూర్పుగమిఁ * బుక్కిటనుంచి కుచాగ్ర సీమపైఁ
జెరసిన సన్నలేఁజెమట * బిందువు లొయ్యన నార్చుఁ గన్నులం
దొరఁగెడు బాష్పపూరములు * దొంగలి ఱెప్పల నానిచుక్కలం
దరుణులు రండు చూతమని * తామొగమెత్తును గూఢరాగయై.

టీ॥ పొరిఁబొరిన్=క్రమక్రమముగా. (వచ్చు) ఊర్పుగమిన్= నిశ్వాసపుసముదాయమును. పుక్కిటనుంచి=నోటిలోపలిభాగమునందే అణఁచుకొని. కుచాగ్రసీమపైన్=బొమ్మలమీఁద. పెరసిన= ఆవరించిన. సన్నలేఁజెమటబిందువులు = కొంచెము చెమ్మరించిన చెమటబొట్లను. ఒయ్యనన్ = మెల్లగా. ఆర్చున్ = ఆరునట్లు చేయును. కన్నులన్=కన్నులందుండి. తొరఁగెడు=కారుచున్న. బాష్పపూరములు=కన్నీటివెల్లువలను. తొంగలిఱెప్పలన్ = వ్రేలుచున్నఱెప్పలందు. అని = నిలిపి. తరుణులు = ఓచెలికత్తెలారా. చుక్కలన్=నక్షత్రములను. రండుచూతము=చూతమురండు.(అని) తాన్=తాను. గూఢరాగయై=రహస్యమయిన అనురాగముగలదై. మొగమెత్తున్=ముఖమును మీఁదికెత్తును.

తా॥ మీఁదమీఁద వచ్చుచున్న నిట్టూర్పులను లోపలనణఁచుకొని బొమ్మలమీఁద ఆవరించుకొన్న కొంచెము చెమటబొట్లను మెల్లమెల్లగా ఆర్చుకొనుచు, కన్నులందుండి బయలువెళ్లుచున్ననీళ్లను ఱెప్పలందు అణఁచుకొనుచు, ఓచెలికత్తెలారా ! మనము నక్షత్రములను చూతము రండు అని తన అనురాగము బయటికితోఁచకుండునట్లు మొగమును మీఁదికెత్తిమిన్ను చూడఁబోవుచుండునని తా.

౩౯౧.—వ॥ ఇవ్విధంబునం జరియించుచుండె నట్టియెడ.

టీ॥ ఇవ్విధంబునన్=ఈరీతిగా. చరియించుచుండెన్=మెలఁగుచుండెను. అట్టియెడన్=ఆసమయమునందు.

౩౯౨.—తే॥ అంతకంతకు సంతాప * మతిశయించి । వలుద చన్నులు కన్నీటి * వఱదఁ దడువఁ
జెలులదెసఁజూడఁ జాల ల * జ్జించి మొగము । వాంచి పలుకకయుండె న * వ్వనరుహాక్షి.

టీ॥ అవ్వనరుహాక్షి=కమలములవంటికన్నులుగలదైన ఆయుష. అంతకంతకున్ = అప్పటప్పటికి. సంతాపము = మనస్సులోని పరితాపము. అతిశయించి=హెచ్చి. వలుదచన్నులు=వట్రువలైన స్తనములు. కన్నీటివఱదన్ = కంటినీళ్లప్రవాహమునందు. తడువన్= తడియఁగా. చెలులదెసన్ = చెలికత్తెలతట్టు. చూడన్=చూచుటకు. చాలన్=మిక్కిలి. లజ్జించి=సిగ్గుపడి. మొగమువాంచి=తలవంచుకొని. పలుకక యుండెన్ = మాటలాడక యుండెను.

తా॥ ఆయుషాకన్యక అప్పటప్పటికి మనసున సంతాపము హెచ్చఁగా కంటినీళ్లు వెల్లువలుగా పాఱి బొమ్మలను తడుపుచుండఁగా చెలికత్తెలతట్టు చూచుటకు సిగ్గుపడినదై తలవంచుకొని మాటలాడక ఊరకుండెనని తాత్పర్యము.

౩౯౩.—తే॥ బలితనూభవుమంత్రి కుం * భాండుతనయ । తనబహిఃప్రాణ మిదియనఁ * దనరునట్టి
కామినీ మణి ముఖ పద్మ * కాంతి విజిత । శిశిర కరచారు రుచిరేఖ * చిత్రరేఖ.

టీ॥ బలితనూభవుమంత్రి=బాణాసురునిమంత్రియైన. కుంభాండుతనయ= కుంభాండుఁడనువానికూఁతురు. (తన) బహిఃప్రాణము= వెలుపలిప్రాణము. (ఇది) అనన్=అనునట్టుగా. తనరునట్టికామినీమణి = ఒప్పునట్టిమంచిచిన్నది. ముఖ... రేఖ—ముఖ = మొగముయొక్క. పద్మ=కమలములవంటి. కాంతి=ప్రకాశముచేత. విజిత= జయింపఁబడిన. శిశిరకర=చంద్రునియొక్క. చారు=ఒప్పిదమయిన. రుచి=కాంతిగల. రేఖ=రేఖగలదైన. చిత్రరేఖ=చిత్రరేఖయనునది.

తా॥ అప్పుడు బాణాసురుని మంత్రియైన కుంభాండుఁడనువాని కూఁతురు బాలచంద్రరేఖను కమలమువంటి ముఖముయొక్క కాంతి చేత జయించుచున్న చిత్రరేఖయనునది ఉషకు బయటిప్రాణమా అనఁదగిన స్నేహితురాలు దగ్గఱవచ్చియని తాత్పర్యము.

౩౯౪.—వ॥ కదిసి యచ్చాల నుపలక్షించి.

టీ॥ కదిసి=దగ్గఱకువచ్చి. అచ్చాల=ఉషను. ఉపలక్షించి=చూచి. తా॥ అట్లు చేరవచ్చినదై ఉషాకన్యకనుజూచి అనితాత్పర్యము.



(*) చిత్రరేఖ ఉషాకన్యతో సంభాషించుట. (*)

౩౯౫.—తే॥ పడఁతినీవిప్డు సొబగుని * బయల వెదకు
విధమునను నాత్మవిభుఁడని * వేడ్కఁబిలిచి
పూని చేతికి లోనైన * వానిఁ బాసి
భ్రాంతిఁబొందినభావంబు * ప్రకటమయ్యె.

టీ॥ పడఁతి=ఓచిన్నదానా. (నీవు) ఇప్డు=ఈసమయమునందు. సొబగునిన్= ప్రియుఁడైనపురుషుని. బయలన్ = బయటియందు. వెదకువిధమునన్=వెదకునట్టిరీతిగా. ఆత్మవిభుఁడని=తన పెనిమిటియని. వేడ్కన్=కుతూహలముచేత. పిలిచి= దగ్గఱపిలిచి. పూని=క్రీడకుప్రయత్నపడి. చేతికిలోనైనవానిన్ = చేతిలో చిక్కినవానిని. పాసి=ఎడఁబాసి. భ్రాంతిపొందినభావంబు=భ్రమపడినవిధము. ప్రకటమయ్యెన్=ప్రసిద్ధమాయెను.

తా॥ ఓ అమ్మీ! ఇప్పుడు నీవు ప్రియమయినభర్తను బయలునందు వెదకురీతిగాను, తనకు పెనిమిటిగాఁ జేసికోవలెనని పిలిచిన మగవాఁడు చేతికి చిక్కి తప్పించుకొనితొలఁగిపోఁగా భ్రమపడి వెదకుచుండునట్లు తెలియవచ్చుచున్నది అని తాత్పర్యము.

౩౯౬.—తే॥ వనిత నాకన్న నెనరైన * వారు నీకుఁ । గలుగనేర్తురె నీకోర్కిఁ * దెలియఁజెప్ప
కన్న మీయన్నతోడన్నఁ * గన్నుఁగవల । నలరు నునుసిగ్గుతో నగ * వామతింప.

టీ॥ వనిత=ఓచిన్నదానా. నాకన్నన్=నాకంటెను. నెనరైనవారు = ఇష్టమయినవారు. (నీకు) కలుగనేర్తురె = కలుగుదురా—కలుగనేరరుగనుక. నీకోర్కి=నీకోరిక. తెలియఁజెప్పకున్నన్=నాకు తెలియఁబఱుపకపోయినపక్షమున. మీయన్నతోడు=మీతండ్రిమీఁది ఆన. అన్నన్=అనఁగా. కన్నుఁగవలన్=రెండుకన్నులందును. అలరునునుసిగ్గుతోన్=ఒప్పునట్టిక్రొత్తసిగ్గుతో. నగవు = నవ్వు. ఆమతింపన్=మైత్రిచేయఁగా.

తా॥ ఓ అమ్మీ! నాకంటె నీకుకావలసినవారెవరున్నారు, ఎటువంటిరహస్యమయినను దాఁచక నాతో చెప్పవలసినదానవు, ఇట్లు నీకోరికను నీలోనేదాఁచుకొనియుండనేల, ఇప్పుడు నీకోరికయేమో నాతో చెప్పవలసినది, అట్లు చెప్పనియెడ మీతండ్రిమీఁద ఆన పెట్టుచున్నాను అనఁగా, ఉషతనకప్పుడుకలిగినలజ్జతోఁగూడ చిఱునవ్వును ముఖమునందు తోఁచఁగానని తాత్పర్యము.

వ॥ చిత్రరేఖం గనుంగొని యిట్లనియెను.

౩౯౭.—చ॥ చెలి కలలోన నొక్క సర * సీరుహ నేత్రుఁడు హార రత్నకుం
డల కటకాంగుళీయక ర * ణన్మణి నూపుర భూషణుండు ని
ర్మల కనకాంబరుండు సుకు * మారతనుండు వినీలదేహుఁ డు
జ్జ్వలరుచి నూతనప్రసవ * సాయకుఁ డున్నతవక్షుఁ డెంతయున్.

టీ॥ చెలి = ఓస్నేహితురాలా. కలలోనన్ = స్వప్నమునందు. హార...భూషణుండు — హార = ముత్యాలపేరులు. రత్నకుండల= రత్నములచెవిపోఁగులు. కటక = చేతికడియములు. అంగుళీయక= ఉంగరములు. రణన్మణినూపుర=మ్రోఁగుచున్నరత్నములయందెలు. భూషణుండు = ఈభూషణములు గలవాఁడు. నిర్మలకనకాంబరుండు=స్వచ్ఛమయిన బంగారువస్త్రముగలవాఁడు. సుకుమారతనుండు=కోమలమైన దేహముగలవాఁడు. వినీలదేహుఁడు=నల్లని దేహముగలవాఁడు. ఉజ్జ్వల...సాయకుఁడు—ఉజ్జ్వలరుచి=మిక్కిలి వెలుఁగుచుండునట్టి. నూతన=క్రొత్తయైన. ప్రసవసాయకుఁడు= మన్మథుఁడు. ఎంతయున్=మిక్కిలి. ఉన్నత=ఎత్తైన. వక్షుఁడు= ఱొమ్ముగలవాఁడునైన. ఒక్కసరసీరుహనేత్రుఁడు = కమలముల వంటికన్నులుగల ఒకపురుషుఁడు.

తా॥ ఓస్నేహితురాలా! నాకలలో ముత్యాలహారములు రత్నముల చెవిపోఁగులు చేతికడియాలు ఉంగరములు కాలియందెలు మొదలగు ఆభరణములును ధరించినవాఁడును, నిర్మలమైనబంగారు వస్త్రము ధరించినవాఁడును, నీలమేఘచ్ఛాయగల కోమలమయిన దేహముగలవాఁడును, క్రొత్తగా తేజరిల్లుచున్న మన్మథుఁడును, ఉన్నతమయిన ఱొమ్ముగలవాఁడునైన ఒక రాజకుమారుఁడు కనఁబడియెనని తాత్పర్యము.

౩౯౮.—చ॥ నను బిగియారఁ గౌఁగిట మ * నంబలరారఁగఁ జేర్చి మోదముం
దనుకఁగ నంచితాధర సు * ధారసమిచ్చి మనోజకేళికిన్
బనుపడఁజేసి మంజు మృదు * భాషలఁ దేలిచి యంతలోననే
చనియెను దుఃఖవార్ధిఁ బెలు * చన్ననుఁద్రోచి సరోరుహాననా.

టీ॥ సరోరుహాననా=ఓకమలమువంటి ముఖముగల చిత్రరేఖా. ననున్=నన్ను. బిగియారన్ = మిక్కిలిబిగువుగా. కౌఁగిటన్= భుజమధ్యమందు. మనంబలరారఁగన్=మనసుతనియునట్లు. (చేర్చి) మోదముందనుకఁగన్ = సంతోషముకలుగునట్లు. అంచితాధర సుధారసమున్ = ఒప్పిదమయిన అధరామృతరసమును. (ఇచ్చి) మనోజకేళికిన్=మన్మథక్రీడకు. పనుపడఁజేసి=మరిఁగించి. మంజుమృదుభాషలన్=మనోజ్ఞములయిన తిన్ననిమాటలయందు. తేలిచి= తనివినొందించి. అంతలోననే=అంతమాత్రములోనే—అత్యల్పకాలములోనే. దుఃఖవార్ధిన్=దుఃఖసముద్రమునందు. పెలుచన్=క్రూరముగా. ననున్=నన్ను. త్రోచి=పడఁద్రోసి. చనియెన్=పోయెను.

తా॥ ఓచిత్రరేఖా! అట్లు కనఁబడిన ఆపురుషుఁడు నన్నుబిగ్గర కౌఁగిలించుకొని మనసు తనియఁజేసి అధరామృతమునిచ్చి సంతోషపెట్టి మన్మథక్రీడకు మరుఁగునట్లుచేసి మృదువైన మంచిమాటలచేత చెవులకు తృప్తిపుట్టించి అంతట నిలువక నన్ను దుఃఖసముద్రమునందు పడఁద్రోసి అతిక్రూరచిత్తునివలె ఎక్కడనో పోయెను అని చెప్పెనని తాత్పర్యము.

౩౯౯.—వ॥ అనుచు నమ్మత్తకాశిని చిత్తంబు చిత్తజాయత్తంబై తత్తరంబున విరహానలం బుత్తలపెట్టఁ గన్నీరు మున్నీరుగా వగచుచు విన్ననైన వదనారవిందంబు వాంచి యూరకున్నఁజిత్రరేఖ తనమనంబుననయ్యింతి సంతాపంబుచింతించి యిట్లనియె.

టీ॥ అనుచుఁ=అని. అమ్మత్తకాశిని = ఆవరారోహయైన ఉషా కన్యక. చిత్తంబు=మనస్సు. చిత్తజాయత్తంబై=మన్మథాధీనమై. తత్త ఱంబునన్=త్వరచేత. విరహానలంబు=ఎడఁబాటువలనితాపము.ఉత్తల పెట్టన్=దుఃఖపెట్టఁగా. కన్నీరుమున్నీరుగాన్=కంటినీళ్లుసముద్రము వలె పొంగిపొంగిరాఁగా. వగచుచున్ = దుఃఖపడుచు. విన్ననైనవద నారవిందంబు = చిన్నవోయిన ముఖకమలము. వాంచి=వంచి. ఊర కున్నన్=ఊరకయుండఁగా. (చిత్రరేఖ) తనమనంబునన్ = తనమన స్సులో. అయ్యింతిసంతాపంబు=ఆచిన్నదానిపరితాపమును. చింతించి= విచారించి. (ఇట్లనియె)

తా॥ అని యిట్లు పలికి ఆయుషాకన్య మన్మథాధీనమయిన చిత్త ముతో పరితాపపడుచు కన్నుల నీళ్లు విడుచుకొని కుళ్లికుళ్లి యేడ్చుచు మొగము వేలవేసికొని ఊరకుండఁగాఁ జూచి దానిచింత తొలఁగు నట్టి ఉపాయము ఆలోచించి చిత్రరేఖ దానితో నిట్లు పలికెనని తా.

౪౦౦.—చ॥ సరసిజనేత్ర యేటికి వి * చారము నాకుశలత్వ మేర్పడన్
నర సుర యక్ష కింపురుష * నాగ నభశ్చర సిద్ధ సాధ్య కి
న్నర వర ముఖ్యులం బటము * నన్ లిఖియించినఁజూచి నీమనో
హరుఁ గని వీఁడె పొమ్మనిన * నప్పుడ వానిని నీకుఁ దెచ్చెదన్.

టీ॥ సరసిజనేత్ర = కమలములవంటి కన్నులుగల ఓ ఏలికసానీ. ఏటికివిచారము = ఈదుఃఖపడుటయేల. నాకుశలత్వము = నా నేర్పు. ఏర్పడన్=విశదమగునట్లు. నర...ఖ్యులన్—నర=మనుష్యులు. సుర= దేవతలు. యక్ష=యక్షులు. కింపురుష=కింపురుషులు. నాగ=సర్పములు. నభశ్చర=గరుడులు. సిద్ధ=సిద్ధులు. సాధ్య=సాధ్యులు. కిన్నర=కిన్నరులు. వర=వీరికిఏలికలైన. ముఖ్యులన్=ప్రధానులగువారిని. పటమునన్= ఒకపటమునందు. లిఖియించినన్ = చిత్రించినను. (చూచి) నీమనో హరున్=నీమనస్సునుహరించిన రాజకుమారుని. కని=చూచి. వీఁడె= ఈపురుషుఁడే. పొమ్మనినన్=పోయితీసుకరమ్మన్న పక్షమున. అప్పుడ= తోడనే. వానిని=ఆపురుషుని. నీకుఁదెచ్చెదన్=నీకు తెచ్చియిచ్చెదను.

తా॥ ఓ నాయేలినదానా ! నీవు ఊరక విచారపడ నక్కఱలేదు నేను నాసామర్థ్యము తెలియఁబడునట్లు మనుష్యులు దేవతలు కిన్నరులు కింపురుషులు నాగులు గరుడులు మొదలుగాఁగల మూఁడులోకముల లోని ముఖ్యపురుషులను పటములలో వ్రాసి తెచ్చి చూపెదను ఆపట మునుజూచి అందులో ఎవఁడునీకుప్రియుఁడో చెప్పినపక్షమున అప్పుడే వానిని ఎత్తుకొనివచ్చి నీప్రక్కనుంచెదను అని పలికెనని తాత్పర్యము.

(*) చిత్రరేఖ దేవతలను రాజులను బటంబున లిఖించి ఉషాకన్యకుఁ జూపుట. (*)



ఉషాకన్య. చిత్రరేఖ.



చిత్రరేఖ.

వ॥ అనియొడంబఱిచి మిలమిలనిమంచు తోడంబురుడించు ధళధళయనుమెఱుంగులు దురంగలించు పటంబు నావటంబు సేసి వజ్రంబుమెదియించి పంచవన్నియలు వేఱు వేఱఁగనక రజతపాత్రంబులనించి కేలం దూలికధరించి యొక్క విజనస్థలంబునకుం జని ముల్లోకంబులం బేరుకలిగిన వయో రూపసంపన్నులైన పురుషముఖ్యులనన్వయ గోత్రనామధేయంబులతోడ వ్రాసి యాయి తంబైన యప్పటంబుఁ దనముందఱికిం దెచ్చి యుంచి యిప్పటంబునం దగులనివారులేరు సావధానంబున నాకర్ణింపుమనియిట్లనియె.

టీ॥ (అని) ఒడంబఱిచి=సమాధానముకలుగఁజెప్పి. మిలమిలని మంచుతోడన్ = దట్టముగాఁ గురిసినమంచుతో. పురుడించు=సరి పోలునట్టి. ధళధళయనుమెఱుంగులు = తళతళనికాంతులు. తురంగ లించు = అతిశయించునట్టి. పటంబున్ = పటమును. ఆవటంబు సేసి=సిద్ధపఱిచి. వజ్రంబు = వజ్రమనుద్రవ్యమును. మెదియించి= నూఱి. పంచవన్నియలు = అయిదురంగులను. వేఱువేఱ = వేఱు వేఱుగా. కనకరజతపాత్రంబులన్ = బంగారు వెండి పాత్రముల యందు. నించి=నిండించి. కేలన్=చేతిలో. తూలికధరించి=చిత్త రువువ్రాయు కుంచెనుపట్టి. ఒక్కవిజనస్థలంబునకున్=ఒకయేకాంత ప్రదేశమునకు. చని=పోయి. ముల్లోకంబులన్=స్వర్గమర్త్యపాతా ళములనెడు మూఁడులోకములందును. పేరుకలిగిన=ప్రసిద్ధినొందిన. వయోరూపసంపన్నులు = వయస్సుయొక్కయు చక్కఁదనము యొక్కయు కలిమిగలవారు. అయినపురుషముఖ్యులన్=అయినట్టి పురుషశ్రేష్ఠులను. అన్వయగోత్రనామధేయంబులతోడన్ = కులము గోత్రము పేరు వీనితోఁగూడ. (వ్రాసి) ఆయితంబయినయప్ప టంబున్=సిద్ధమయిన ఆపటమును. తనముందఱికిన్=తనయెదుటికి. (తెచ్చి యుంచి) ఇప్పటంబునన్=ఈపటమునందు. తగులనివారు= చిక్కనివారు. (లేరు) సావధానంబుగన్=ఎచ్చరికతోడ. ఆకర్ణిం పుము=వినుము. (అనియిట్లనియె)

తా॥ అని యీవిధముగా చెప్పి చిత్రరేఖ ఉషను సమాధాన పఱిచి మంచు తళతళలాడునట్లు తళతళలాడెడు పటము నొక దానిని సిద్ధపఱిచి దానియందు మూడులోకములందును ప్రసిద్ధులైన పురుషులను అందఱను కులగోత్రనామములతోఁగూడ వ్రాసి తెచ్చి ఉషయెదుటఁబెట్టి యిందులో వ్రాయఁబడనివారు ఏలోకములోను లేరు కనుక ఎచ్చరికతో వినుమని యిట్లు చెప్పనారంభించెననితా.

౮౦౨.—సీ॥ కమనీయ సంగీత * కలితకోవిదులు గిం - పురుష గంధర్వ కి * న్నరులు వీరె
సతత యావనులు ని * చ్ఛావిహారులు సిద్ధ - సాధ్యచారణ వియ * చ్చరులు వీరె
ప్రవిమల సౌఖ్య సం * పద్వైభవులు సు - ధాశన మరుద్యక్ష రా * క్షసులు వీరె
నిరుపమ రుచికళా * న్వితకామరూపులై - పొగడొందునట్టి ప * న్నగులు వీరె

తే॥ చూడుమని నేర్పు దీపింపఁ * జూపుటయును । జిత్తమున నిజ మనోరథ * సిద్ధిపడయఁ
జాలకుండిన మధ్యమ * క్ష్మాతలాధి । పతులఁ జూపుచు వచ్చె న * పద్మనయన.

టీ॥ కమనీయ...కోవిదులు—కమనీయ=మనోజ్ఞమైన. సంగీత = పాటపాడుటతోడ. కలిత=కూడుకొన్న. కోవిదులు = విద్వాంసు లయిన. (కింపురుష గంధర్వ కిన్నరులు) వీరె = ఈయున్నవారే. సతతయావనులు = ఎల్లప్పుడు యౌవనముగలవారు. ఇచ్ఛావిహా రులు=ఇచ్చవచ్చినట్టు సంచరించువారునైన. సిద్ధసాధ్యచారణవియ చ్చరులు=సిద్ధులు సాధ్యులు చారణులు గరుడులుననువారు. (వీరె) ప్రవిమల...ద్వైభవులు—ప్రవిమల=మిక్కిలినిర్మలమయిన. సౌఖ్య= సుఖముయొక్క. సంపద్వైభవులు=కలిమిమేలిమిగలవారైన. సుధా శనమరుద్యక్షరాక్షసులు = దేవతలు మరుత్తులు యక్షులు రాక్షసు లును. (వీరె) నిరుపమ...రూపులై — నిరుపమ = ఈడులేని. రుచి కళా=కాంతితోడను కళలతోడను. అన్విత = కూడిన. కామరూ పులై=కోరినరూపములుగలవారై. పొగడొందునట్టి=కొనియాడఁ బడునట్టి. పన్నగులు = నాగులు. (వీరె చూడుము అని) నేర్పు దీపింపఁ=తనసామర్థ్యము ప్రకాశింపఁగా. చూపుటయును=కనఁ బఱపఁగా. చిత్తమునఁ=మనసునందు. నిజమనోరథసిద్ధి=తనకోరిక యొక్క నెఱవేఱుటను. పడయఁజాలక=పొందలేక. ఉండినఁ= ఉండఁగా. మధ్యమక్ష్మాతలాధిపతులఁ = భూలోకమునందలిరాజు లను. అపద్మనయన=ఆచిత్రరేఖ. (చూపుచువచ్చెను)

తా॥ వీరు ఇంపుగాపాడుటయందు పండితులయిన కిన్నరులును కింపురుషులును గంధర్వులును, వీరు ఎప్పుడును ముసలితనములేక యిచ్చవచ్చినట్టు మెలఁగుచుండునట్టి సిద్ధులు సాధ్యులు చారణులు గరుడులుననువారును, వీరు మిక్కిలిమేలైనసౌఖ్యమే కలిమిగాఁగల వారయిన దేవతలు మరుత్తులు యక్షులు రాక్షసులు ననువారును, వీరుమేలైన చక్కఁదనమును తేజస్సునుగల కామరూపములుధరించి సంచరించువారైన నాగులును చూడుము అని స్వర్గపాతాళవాసు లగువారినెల్లనుచూపఁగా జూచి అందువల్ల ఆమెకోరిక నెఱవేఱక పోఁగా చిత్రరేఖ ఆటుపిమ్మట భూలోకపురాజులను జూప నారం భించెనని తాత్పర్యము.


మాళవదేశపురాజు.


ద్రవిడదేశపురాజు.


మత్స్యదేశపురాజు.


నేపాళదేశపురాజు.


బంగాళదేశపురాజు.

౮౦౩.—ఉ॥ మాళవ కోంకణ ద్రవిడ * మత్స్య పుళింద కళింగ భోజ నే
పాళ విదేహ పాండ్య కురు * బర్బర సింధు యుగంధరాంధ్ర బం
గాళ కరూశ కేంకణ త్రి * గర్త సుదేష్ణ మరాట లాట పాం
చాల నిషాద ఘూర్జరక * సాళ్వ మహీశులు వీరె కోమలీ.

తా॥ ఓచిన్నదానా! మాళవము కోంకణము ద్రవిడము మత్స్యము పుళిందము కళింగము భోజము నేపాళము విదేహము పాండ్యము కురువు బర్బరము సింధువు యుగంధరము ఆంధ్రము బంగాళము కరూశము కేంకణము త్రిగర్త సుదేష్ణము మరాటము లాటము పాంచాలము నిషాదము ఘూర్జరము సాల్వము అను దేశముల నేలు నట్టి రాజులు వీరు ఈరాజులను జూడుమని తాత్పర్యము.

౪౦౪.—ఉ॥ సింధుర వైరి విక్రముఁడు * శీతమయూఖమరాళికా పయ
స్సింధు పటీర నిర్మలవిశే * ష యశోవిభవుండు శౌర్య ద
ర్పాంధ రిపుక్షితీశ నిక * రాంధ తమఃపటలార్కుఁ డీజరా
సంధునిఁజూడు మాగధుని * సద్బృహదశ్వసుతుం గృశోదరీ.


జరాసంధుఁడు.

టీ॥ కృశోదరీ = అణఁగిన కడుపుగలదానా. సింధురవైరివిక్రముఁడు=సింహముయొక్క పరాక్రమమువంటి పరాక్రమముగలవాఁడు. శీతమయూఖ...విభవుండు — శీతమయూఖ=చంద్రునివలెను. మరాళికా=హంసపిల్లలవలెను. పయస్సింధు = పాలసముద్రమువలెను. పటీర=గంధమువలెను. నిర్మల = స్వచ్ఛమైన. విశేష=ఎచ్చైన. యశః=కీర్తియొక్క. విభవుండు = మేలయినకలిమిగలవాఁడు. శౌర్య...అర్కుఁడు—శౌర్య=శూరత్వముచేతనైన.దర్ప=మదముచేత. అంధ=కన్నులుతెలియని. రిపుక్షితీశ=శత్రురాజులయొక్క. నికర=సమూహముఅనెడు. అంధతమః=దట్టమయినచీకటియొక్క. పటల=సమూహమునకు.అర్కుఁడు=సూర్యుఁడైనవాఁడు. (నైన) మాగధునిన్ = మగధదేశపురాజైన. సద్బృహదశ్వసుతున్ = బృహదశ్వునికి మంచికొడుకైన. ఈజరాసంధునిన్=జరాసంధుఁడనెడి యీరాజును. (చూడుము)

తా॥ ఓయమ్మీ! సింహము పరాక్రమమువంటి పరాక్రమముగలవాఁడును, చంద్రుఁడు హంసలు పాలసముద్రము మంచిగంధము వీనివలె స్వచ్ఛమయిన కీర్తిగలవాఁడును, శూరులమనిమదించి కన్నుగానక తిరుగునట్టి శత్రురాజులసమూహములను దట్టమైన చీఁకటిని సూర్యుఁడు అణఁచివేయునట్లు తన తేజస్సుచేత అణఁచివేయువాఁడును,మగధదేశపురాజును బృహదశ్వుఁడు అనుమహారాజునకు కొమారుడునైనజరాసంధుఁడు వీఁడువీనినిచూడుమని తాత్పర్యము.

౪౦౫.—మ॥ సకలోర్వీతలనాథ సన్నుతుఁడు శ * శ్వద్భూరి బాహాబలా
ధికుఁ డుగ్రాహవకోవిదుండు త్రిజగ * ద్విఖ్యాతచారిత్రకుం
డకలంకోజ్జ్వల దివ్యభూషుఁడు వి * దర్భాధీశ్వరుండైన భీ
ష్మక భూపాల కుమారుఁ జూడు మితనిన్ * మత్తద్విరేఫాలకా.


రుక్మి.

టీ॥ మత్తద్విరేఫాలకా = మత్తుగొన్న తుమ్మెదలవంటి ముంగురులుగలదానా. సకలోర్వీతల నాథసన్నుతుఁడు=ఎల్లరాజులచేతను కొనియాడఁబడినవాఁడు. శశ్వ...కుఁడు—శశ్వత్=ఊర్జితమయిన. భూరి=అధికమయిన. బాహాబల = భుజబలముచేత. అధికుఁడు=గొప్పవాఁడు. ఉగ్రాహవకోవిదుండు=భయంకరమైన యుద్ధమునందు నేర్పరి. త్రిజగ...కుండు—త్రిజగత్=మూడులోకములందును.విఖ్యాత=ప్రసిద్ధమయిన. చారిత్రకుండు=మంచినడవడిగలవాఁడు. అక...షుఁడు—అకలంక=కలంకములేని. ఉజ్జ్వల=వెలుఁగుచున్న.దివ్య=అప్రాకృతమైన. భూషుఁడు=ఆభరణములుగలవాఁడు. విదర్భాధీశ్వరుండు=విదర్భదేశపురాజు. ఐనభీష్మక భూపాలకుమారున్=అయినట్టి భీష్మకమహారాజు కొడుకైనరుక్మిని. (ఇతనినిచూడుము)

తా॥ ఓయేలినదానా! ఎల్లరాజులచేతను కొనియాడఁబడినవాఁడును, ఊర్జితమును విస్తారమునైన భుజబలముగలవాఁడును, భయంకరమయిన యుద్ధములందు గడిదేఱినవాఁడును, మూడులోకములందు ప్రసిద్ధివహించిన నడవడిగలవాఁడును, మిక్కిలి చక్కగా వెలుఁగుచున్న ఆభరణములు గలవాఁడునైన విదర్భదేశపురాజు అగుభీష్మకునికొడుకు రుక్మియనువాఁడు ఇతఁడు ఇతనినిచూడుము అని తాత్పర్యము.

౪౦౬.—ఉ॥ సంగర రంగ నిర్దళిత * చండ విరోధి వరూధినీశ మా
తంగ తురంగ సద్భట ర * థ ప్రకటైక భుజావిజృంభణా
భంగ పరాక్రమ ప్రకట * భవ్యయశో మహనీయమూర్తి కా
ళింగుఁడు వీఁడె చూడు తర * ళీకృత చారు కురంగ లోచనా.


కాళింగుఁడనురాజు.

టీ॥ తరళీ...లోచనా—తరళీకృత=చలించినదిగా చేయఁబడిన, చారు=మనోజ్ఞమైన. కురంగలోచనా=లేడికన్నులవంటి కన్నులుగలదానా. సంగర...మూర్తి—సంగరరంగ=యుద్ధరంగమునందు. నిర్దళిత=నఱకఁబడిన. చండ=భయంకరులైన. విరోధి=శత్రువులయొక్క. వరూధినీశ=సేనానాయకులును. మాతంగ = ఏనుఁగులును. తురంగ=గుఱ్ఱములును. సద్భట=మంచియోధులును. రథ=తేరులునుగలిగిన. ప్రకట=ప్రసిద్ధమును.ఏక=ముఖ్యమునైన,భుజా=భుజములయొక్క. విజృంభణ=ఆటోపముచేత.అభంగ=భంగమునొందని. పరాక్రమ=శత్రువులనాక్రమించుటను. ప్రకట=ప్రసిద్ధపఱుచుచున్న.భవ్య=మేలైన.యశః=కీర్తిచేత. మహనీయ=మహిమగల. మూర్తి=స్వరూపముగలవాఁడు. కాళింగుఁడు=కళింగదేశపురాజు. వీఁడె=ఈకనఁబడువాఁడు. చూడు=చూడుము,

తా॥ లేడికన్నులవలె చలించుచున్న కన్నులుగల ఓచిన్నదానా! యుద్ధరంగమునందు చతురంగ బలములతోఁగూడిన శత్రురాజులను సంహరించి మేలయినకీర్తినివహించిన కళింగదేశపురాజు వీఁడిదిగో ఉన్నాఁడు చూడుము అని తాత్పర్యము.

భగదత్తుఁడు.



౪౨౭.—మ॥ సుగుణాంభోనిధి ఫాలలోచను నుమే * శున్నాత్మ మెప్పించి శ
క్తి గరిష్ఠంబగు శూలముం బడసె న * క్షీణ ప్రతాపోన్నతిన్
జగతిన్మిక్కిలి మేటివీరుఁడు రణో * త్సాహుండు భూపౌత్రుఁ డీ
భగదత్తుం గనుఁగొంటె పంకజముఖీ * ప్రాగ్జ్యోతిషా ధీశ్వరున్.

టీ॥ పంకజముఖీ=కమలమువంటి ముఖముగలదానా. సుగుణాంభోనిధి=మంచిగుణములకు సముద్రుఁడైన వాఁడు — ఎల్లమంచిగుణములుగలవాఁడు. ఫాలలోచనున్ = నొసట కన్నుగలవాఁడైన. ఉమేశున్=శివుని. ఆత్మన్=మనస్సునందు. మెప్పించి=మెచ్చుకొనునట్లుచేసి. శక్తిగరిష్ఠంబు=బలముచేత మిగులగొప్పది. అగు శూలమున్=అగునట్టిశూలమును. పడసెన్=పొందెను. జగతిన్ = భూమియందు. అక్షీణప్రతాపోన్నతిన్= తఱుగని ప్రతాపముయొక్క ఆధిక్యముచేత. (మిక్కిలి) మేటివీరుఁడు = అధికుఁడైనశూరుఁడు. రణోత్సాహుండు=యుద్ధమునం దుత్సాహముగలవాఁడు. భూపౌత్రుఁడు= భూదేవికిమనుమఁడు. ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్=ప్రాగ్జ్యోతిషముఅను పట్టణమునకధిపతియైన. (ఈభగదత్తుని)కనుఁగొంటె=చూచితివా.

తా॥ కమలమువంటి ముఖముగల ఓచిన్నదానా! ఎల్లమంచిగుణములుగలవాఁడును, శివునిమెప్పించి మిక్కిలి బలవంతమయిన శూలమును సంపాదించుకొన్నవాఁడును, భూమియందలి శూరులలో తఱుఁగనిప్రతాపముచేత గొప్పను వహించినవాఁడును, యుద్ధమునందు ఉత్సాహముగలవాఁడును, భూదేవికిమనుమఁడునునై ప్రాగ్జ్యోతిషపట్టణము నేలెడుభగదత్తుఁడనఁబడిన యీమహారాజును చూచితివా అని తాత్పర్యము.

పౌండ్రకవాసుదేవుఁడు.



౪౨౮.—మ॥ వికచాంభోరుహ పత్ర నేత్రుఁడగు గో * విందుండు దాఁబూను నం
దక చక్రాబ్జ గదాది చిహ్నములచే * తన్ వాసుదేవాఖ్యను
త్సుకుఁడై యెప్పుడు మచ్చరించు మదిఁ గృ * ష్ణుండన్న నీమేటి పౌం
డ్రకుఁ గాశీశసఖుం గనుంగొనుము వే * డ్కం జంద్రబింబాననా.

టీ॥ చంద్రబింబాననా=చంద్రునిబింబమువంటి ముఖముగలదానా. వికచాంభోరుహపత్రనేత్రుఁడు = వికసించిన తామరతేకులనుబోలిన కన్నులుగలవాఁడు. అగుగోవిందుండు=అగునట్టిశ్రీకృష్ణమూర్తి. తాన్ = తాను. పూను=ధరించునట్టి. నందక...చేతన్—నందక=ఖడ్గము. చక్ర=చక్రము. అబ్జ=శంఖము. గదా=గద. ఆది = మొదలుగాఁగల. చిహ్నములచేతన్ = గుఱుతులచేత. ఉత్సుకుఁడై = కుతూహలముగల వాఁడై. ఈమేటి=ఈఘనుఁడు. వాసుదేవాఖ్యన్=వాసుదేవుఁడు అనుపేరితో. ఎప్పుడున్=ఎల్లప్పుడును. మదిన్=మనస్సునందు. కృష్ణుండన్నన్=కృష్ణుఁడుఅనినపక్షమున. మచ్చరించున్=కోపించును. పౌండ్రకున్= ఇట్టిపౌండ్రకదేశపురాజును. కాశీశసఖున్=కాశిరాజునకుచెలికానిని. వేడ్కన్=సంతోషముతో. కనుంగొనుము=చూడుము.

తా॥ ఓచంద్రముఖీ! విరిసిన తామరపూవునందలి తేకులవలె విశాలములయిన కన్నులుగలవాఁడైన శ్రీకృష్ణమూర్తి ధరించునట్టి శంఖ చక్ర గదా ఖడ్గములు మొదలగు సాధనములనుధరించి వాసుదేవుఁడను పేరుపెట్టుకొని కృష్ణుఁడు వాసుదేవుఁడు అనుమాట విన్నమాత్రమున అదిరిపడుచు ఉండునట్టి కాశిరాజునకు చెలికాఁడైనపౌండ్రకవాసుదేవుఁడువీఁడువీనినివేడుకగాచూడుము అనితా.

పాండవులు







మ॥ ద్విజశుశ్రూషయసూనృతవ్రతముస * ద్వృత్తిన్భుజాగర్వము న్విజయాటోపముఁజాపనైపుణియుధీ * విస్ఫూర్తిసత్కీర్తులీ
రజనీనాథకులప్రదీపకులఁ బా * ఱంజూడుపద్మాక్షి ధ। ర్మజభీమార్జునమాద్రినందనులసం * గ్రామైకపారీణులన్.

టీ॥ పద్మాక్షీ=కమలములవంటికన్నులుగలదానా. ద్విజశుశ్రూషయుఁ=బ్రాహ్మణసేవయు. సూనృతవ్రతముఁ = నిజము పలుకవలెనను నియమమును. సద్వృత్తిఁ = మంచిప్రవర్తనముచేత. భుజాగర్వముఁ=భుజబలమునుజూపుటయు. విజయాటోపముఁ= గెలుపునందు వేగిరపాటును. చాపనైపుణియుఁ=విలువిద్యయందు నేర్పును. ధీవిస్ఫూర్తిసత్కీర్తులును = బుద్ధివికాసమును మంచికీర్తియును. (గల) ఈరజనీనాథకులప్రదీపకులఁ = చంద్రవంశమును వెలుఁగఁజేయువారైన యీరాజులను. సంగ్రామైకపారీణులఁ= యుద్ధమునందు ముఖ్యముగా నేర్పుగలవారిని. ధర్మజభీమార్జునమాద్రినందనులఁ = ధర్మరాజు భీముఁడు అర్జునుఁడు నకులుఁడు సహదేవుఁడు అనువారిని. పాఱంజూడుము=చక్కఁగాఁజూడుము.

తా॥ ఓపద్మముఖీ! బ్రాహ్మణసేవయు,నిజముచెప్పనియమమును, క్రమము తప్పక పరాక్రమించుటయు, జయమును పొందుటయందు వేగిరపాటును, విలువిద్యయందలి నేర్పును, బుద్ధివికాసమును మంచి కీర్తియుగలిగి చంద్రవంశమును ప్రకాశింపఁజేయువారై యుద్ధమునందు సమగ్రమయిన ప్రయత్నముగలవారయిన ధర్మరాజునుభీముని అర్జునునినకులునిసహదేవుని విశదముగాఁజూడుమనితాత్పర్యము.

తమ్ములు దుర్యోధనుఁడు.



౪౧౦.—మ॥ బలిమిఁ సర్వనృపాలురన్నదిమి క * ప్పంబుల్దగంగొంచు ను
జ్జ్వల తేజోవిభవాతిరేకమున భా * స్వత్కీర్తి శోభిల్లఁగాఁ
బొలుపొందం దను రాజరాజన మహా * భూరి ప్రతాపంబులుం
గల దుర్యోధనుఁజూడు సోదరయుతుం * గంజాత పత్రేక్షణా.

టీ॥ కంజాతపత్రేక్షణా=తామరతేకులవంటికన్నులుగలదానా. బలిమిఁ=బలముచేత. సర్వనృపాలురఁ=ఎల్లరాజులను. అదిమి= అణఁచి. కప్పంబులు=పన్నులను. తగఁ=ఒప్పునట్లు. కొంచుఁ= తీసికొనుచు. ఉజ్జ్వల...అతిరేకమునఁ—ఉజ్జ్వల=వెలుఁగుచున్న. తేజోవిభవ = తేజస్సంపదయొక్క. అతిరేకమునఁ = అతిశయముచేత. భాస్వత్కీర్తి=ప్రకాశించుచున్నకీర్తి. శోభిల్లఁగాఁ=అందగింపఁగా. పొలుపొందఁ=బాగొప్పఁగా. తనుఁ=తన్ను. (రాజరాజు) అనఁ=అనునట్లు. మహాభూరిప్రతాపంబులఁ = మిక్కిలి యెచ్చైనప్రతాపములను. కల = కలిగిన. (దుర్యోధనుని) సోదరయుతుఁ=తోడఁబుట్టినవారితోఁ గూడినవానిని. (చూడుము)

తా॥ తామరతేకులవంటికన్నులుగల ఓచిన్నదానా! తనబలము చేత ఎల్లరాజులను లోఁబఱుచుకొని కప్పములు పుచ్చుకొనుచు మిక్కిలి వెలుఁగునట్టి తేజస్సుతో తనకీర్తి మిక్కిలిప్రకాశించియొప్పుచుండఁగా తన్ను అందఱు రాజరాజు అని సేవించునట్లు మిక్కిలి అధికమయిన పరాక్రమముచేత ఒప్పునట్టి దుర్యోధనుని వానితమ్ములను జూడుము అని తాత్పర్యము.



౪౧౧.—వ॥ అని యిబ్భంగి సకల దేశాధీశులగు రాజవరులనెల్లం జూపుచు యదువంశ సంభవులైన శూరసేన వసుదేవ యుద్ధవాదులం జూపి మఱియును.

టీ॥ (అని) ఇబ్భంగిన్=ఈరీతిగా. సకలదేశాధీశులు=ఎల్లదేశముల అధిపతులు. అగురాజవరులనెల్లన్=అగునట్టిరాజులను అందఱను. చూపుచున్=కనఁబఱుచుచు. యదువంశసంభవులయిన=యదువువంశమునందుఁ బుట్టినవారైన. (శూరసేన.వసుదేవ ఉద్ధవ) ఆదులన్ = మొదలగువారిని. (చూపి) మఱియును = పిమ్మటను.

తా॥ అని యీరీతిగా ఎల్లదేశముల రాజులునైన రాజులనందఱను జూపుచు యాదవవంశమునందుఁబుట్టిన శూరసేనుఁడు వసుదేవుఁడు ఉద్ధవుఁడు మొదలగువారిని జూపి అటుపిమ్మటనని తా.



౪౧౨.—ఉ॥ శారద నీరదాబ్జ ఘన * సార సుధాకర కాశ చంద్రికా
సారపటీర వర్ణు యదు * సత్తము నుత్తమనాయకుం బ్రమ
త్తారి నృపాలకానన హు * తాశనమూర్తిఁ బ్రలంబదైత్యసం
హారునిఁ గామపాలుని హ * లాయుధుఁ జూడుము దైత్యనందనా.

టీ॥ దైత్యనందనా = రాక్షసరాజైన బాణాసురునికూఁతురా. శారద...వర్ణున్—శారద=శరత్కాలమునందలి. నీరద=మేఘముయొక్కయు. అబ్జ=శంఖముయొక్కయు. ఘనసార=కర్పూరముయొక్కయు. సుధాకర=చంద్రునియొక్కయు. కాశ=తెల్లుపువ్వులయొక్కయు. చంద్రికా=వెన్నెలయొక్కయు. సారపటీర=మంచిగందముయొక్కయు. వర్ణున్=దేహపువన్నెగలవాఁడును. యదుసత్తమున్=యాదవవంశ శ్రేష్ఠుఁడును. ఉత్తమనాయకున్=ధీరోదాత్తాదినాయకులలోనుత్తముఁడును. ప్రమత్త...మూర్తి—ప్రమత్త = మదముచేత ఒళ్లు తెలియని. అరి=శత్రువులైన. నృపాల=రాజులనెడు. కానన=అడవికి. హుతాశనమూర్తిన్=అగ్నిస్వరూపుఁడును. ప్రలంబదైత్యసంహారునిన్=ప్రలంబుఁడనురాక్షసునిచంపినవాఁడును. హలాయుధున్=నాఁగేలుఆయుధముగాఁగల. కామపాలున్=బలరాముని. (చూడుము)

తా॥ ఓబాణాసురునికూఁతురా! శరత్కాల మేఘమువలెను, శంఖమువలెను, కర్పూరమువలెను, చంద్రునివలెను, తెల్లుపువ్వులవలెను, వెన్నెలవలెను, మంచిగందమువలెను, తెల్లగానుండువాఁడును, యాదవవంశ శ్రేష్ఠుఁడును, ఉత్తముఁడైననాయకుఁడును, మదముచేత దేహము తెలియని రాజులనెడు అడవిని కాల్చుటకు అగ్నియైనవాఁడును, ప్రలంబాసురుని చంపిన వాఁడును, నాఁగేలు ఆయుధముగాఁ గలవాఁడునైన బలరాముని చూడుమని తాత్పర్యము.



౪౧౩.—సీ॥ కమనీయ శుభగాత్రుఁ * గంజాతదళనేత్రు - వసుధాకళత్రుఁ బా * వనచరిత్రు
సత్యసంకల్పు ని * శాచరోగ్ర వికల్పు - నతపన్నగాకల్పు * నాగతల్పుఁ
గౌస్తుభమణి భూషు * గంభీరమృదుభాషు - శ్రితజనపోషు నం * చితవిశేషు
నీలనీరదకాయు * నిర్జితదైతేయు - ధృతపీత కౌశేయు * నతవిధేయు
తే॥ నఘమహాగదవైద్యు వే * దాంతవేద్యు । దివ్యమునిసన్నుతామోదుఁ * దీర్థపాదు
జిష్ణుఁ వర సద్గుణాలంక * రిష్ణుఁ గృష్ణుఁ । జూడు దైతేయకులబాల * సుభగలీల.

టీ॥ దైతేయకులబాల = రాక్షసకులమున జనించిన ఓచిన్నదానా. కమనీయశుభగాత్రున్=మనోజ్ఞమును సుందరమునైన దేహముగలవాఁడును. కంజాతదళనేత్రున్=తామరతేకులవంటి కన్నులుగలవాఁడును. వసుధాకళత్రున్=భూమిభార్యగాఁగలవాఁడును. పావనచరిత్రున్ = పరిశుద్ధమయిన నడవడిగలవాఁడును. సత్యసంకల్పున్=నిజము తలంపునందుగలవాఁడును. నిశాచరోగ్రవికల్పున్ = రాక్షసులకు భయంకరమయిన ప్రళయమును (నాశమును) చేయువాఁడును. నతపన్నగాకల్పున్=నమస్కరించినశివుఁడుగలవాఁడును. నాగతల్పున్=శేషశయ్యగలవాఁడును. కౌస్తుభమణిభూషున్ = కౌస్తుభమనెడు రత్నము అలంకారముగాఁగలవాఁడును. గంభీరమృదుభాషున్ = గంభీరములును మృదువులునైన మాటలు గలవాఁడును. శ్రితజనపోషున్=ఆశ్రయించినవారిని కాపాడువాఁడును. అంచితవిశేషున్=ఒప్పిదమయిన మేలిమిగలవాఁడును. నీలనీరదకాయున్=నల్లనిమేఘమువంటి దేహముగలవాఁడును. నిర్జితదైతేయున్ = జయింపఁబడినరాక్షసులుగలవాఁడును. ధృతపీతకౌశేయున్=ధరింపఁబడిన పచ్చపట్టుగలవాఁడును. నతవిధేయున్=మ్రొక్కినవారికి అణఁగినవాఁడును. అఘమహాగదవైద్యున్=పాపములనెడు గొప్పవ్యాధులకు వైద్యుఁడును—ఎల్లపాపములను తొలఁగించువాఁడును. వేదాంతవేద్యున్ = ఉపనిషత్తులచేత తెలియఁదగినవాఁడును. దివ్యమునిసన్నుతామోదున్ = దేవమునులైన సనకాదుల మేలయినస్తోత్రముచేత సంతోషించువాఁడును. తీర్థపాదున్ = గంగపుట్టినట్టి పాదములు గలవాఁడును. జిష్ణున్ = జయశీలుఁడును. వరసద్గుణాలంకరిష్ణున్=శ్రేష్ఠములయిన మంచిగుణములచేత అలంకరింపఁబడుస్వభావముగలవాఁడునైన. కృష్ణున్=శ్రీకృష్ణమూర్తిని. సుభగలీలన్=కోరఁదగినవిధములో. చూడు=చూడుము.

తా॥ ఓ ఉషాసుందరీ ! యీ కనంబడుచున్న మనోజ్ఞమును సుందరమునైన దేహముగలవాఁడును, తామరరేకులవంటి కన్నులుగల వాఁడును, భూమికిభర్తయును, నిర్మలమయిన నడవడిగలవాఁడును, నిజమును సంకల్పించువాఁడును, రాక్షసులకు కీడుచేయువాఁడును, శివునిచేత మ్రొక్కించుకొనువాఁడును, శేషుఁడే శయ్యగాఁగలవాఁడును కౌస్తుభమణి ఆభరణముగాఁగలవాఁడును, గంభీరముగాను మృదువుగాను మాటలాడువాఁడును, తన్ను ఆశ్రయించినవారిని పోషించువాఁడును, ఒప్పిదమయిన మేలిమిగలవాఁడును, నల్లమబ్బువన్నెగల దేహముగలవాఁడును, ఓడఁగొట్టఁబడిన దితికొడుకులుగలవాఁడును, పచ్చ పట్టువస్త్రము ధరించినవాఁడును, తన్ను సేవించువారికి లోఁబడి యుండువాఁడును, పాపములనెడు గొప్పవ్యాధులనుతొలగించు వైద్యుఁడును, ఉపనిషత్తులచేతఁ దెలియఁదగినవాఁడును, సనకాదులైన దేవమునులు కొనియాడుటలచేత సంతోషించువాఁడును, గంగపుట్టినట్టి పాదములుగలవాఁడును, జయించుస్వభావముగలవాఁడును, మేలైన సద్గుణములచేత అలంకరింపఁబడు స్వభావముగలవాఁడునైన శ్రీకృష్ణమూర్తిని కోరుకొను తలఁపుతోఁ జూడుమని తాత్పర్యము.



౪౧౪.—చ॥ స్ఫురదళి శింజినీరవ వి * భూషిత పుష్పధనుర్విముక్త భా
స్వర నవచూతకోరక ని * శాతశిలీముఖ పాత భీత పం
కరుహభవాది చేతనని * కాయు మనోజనిజాంశు రుక్మిణీ
వరసుతు రాజకీర పరి * వారుని మారునిఁ జూడు కోమలీ.

టీ॥ కోమలీ=ఓచిన్నదానా. స్ఫురదళి...నికాయుఁ—స్ఫురత్=చలించుచున్న. అళి=తుమ్మెదలనెడు. శింజినీ=అల్లెత్రాటియొక్క. రవ=ధ్వనిచేత. విభూషిత=అలంకరింపఁబడిన. పుష్పధనుః=పూవింటినుండి. విముక్త=విడువఁబడిన. భాస్వర=ప్రకాశించునట్టి. నవ=క్రొత్తయైన. చూతకోరక = మామిడిచిగురు మొగ్గయనెడు. నిశాత=వాఁడియైన. శిలీముఖ=ములికిగలబాణముయొక్క. పాత = పాటునకు. భీత= భయపడిన. పంకరుహభవ = బ్రహ్మ. ఆది=మొదలుగాఁగల. చేతన=ప్రాణులయొక్క. నికాయుఁ= సమూహములుగలవాఁడును. మనోజనిజాంశుఁ=మన్మథునిస్వకీయమయిన అంశముగలవాఁడును. రుక్మిణీ వరసుతుఁ=రుక్మిణీదేవియొక్క సత్పుత్రుని. రాజకీరపరివారునిఁ = శ్రేష్ఠములయిన చిలుకల పరివారము గలవాఁడునైన. మారునిఁ=ప్రద్యుమ్నుని. (చూడుము)

తా॥ చలించుచున్న తుమ్మెదలనెడి అల్లెత్రాటి చప్పుడుచేత అలంకరింపఁబడిన పూవింటివలననుండి విడువఁబడిన మామిడి చిగురు మోసు అనెడు ములికిగలబాణముయొక్క పాటుచేత చలింపఁజేయఁబడుచున్న బ్రహ్మ మొదలుగాఁగల ప్రాణులు గలవాఁడును, మన్మథుని అంశమునందు శ్రీరుక్మిణీదేవి కొడుకై పుట్టినవాఁడును, రాచచిలుకలే పరివారముగాఁ జేసికొనియుండువాఁడునైన ప్రద్యుమ్నుఁడు వీఁడు వీనినిజూడుమని ఉషతో చిత్రరేఖపలికెనని తాత్పర్యము. వ॥ ఇవ్విధంబునంజూపిన. అనిరుద్ధుఁడు.

౪౧౫.—మ॥ వనితారత్నము కృష్ణనందనుని భా * వప్రౌఢిఁ దాఁజూచి గ్ర
ద్దనఁ దన్నర్థివరించి చన్నసుగుణో * త్తంసంబకా నాత్మలో
ననుమానించి యనంతరంబ యనిరు * ద్ధాఖ్యుఁ సరోజాక్షు నూ
తన చేతోభవమూర్తిఁ జూచి మది సం * తాపించుచు న్నిట్లనుఁ.

టీ॥ వనితారత్నము=స్త్రీలలో శ్రేష్ఠురాలయినయుష. కృష్ణనందనునిభావప్రౌఢిఁ = పటమునందు వ్రాయఁబడిన ప్రద్యుమ్నునిరూపముయొక్క మేలిమిని. తాఁ = తాను. (చూచి) గ్రద్దనఁ=తటాలున. (తన్ను) అర్థిఁ=ప్రీతితో. వరించి = కోరికలసి. చన్నసుగుణోత్తంసంబకాఁ = పోయినట్టి సద్గుణశిఖామణియేయని. ఆత్మలోఁ=మనసులో. అనుమానించి=సందేహించి. అనంతరంబ=వెంటనే. సరోజాక్షుఁ = తామరలవంటి కన్నులుగలవాఁడును. నూతనచేతోభవమూర్తిఁ = క్రొత్తయైన మన్మథుని ఆకారమువంటి ఆకారముగలవాఁడును. అనిరుద్ధాఖ్యుఁ = అనిరుద్ధుఁడను పేరుగలవాఁడునైన ప్రద్యుమ్నునికొడుకును. (చూచి) మదిఁ = మనసులో. సంతాపించుచుఁ = సంతాపమును పొందుచు. ఇట్లనుఁ = ఈవిధముగా పలికెను.



తా॥ స్త్రీశిరోమణియైన యుష ప్రద్యుమ్నునిరూపమును జూచి ముందు తన్నుఁ గోరి కూడిపోయిన పురుషశ్రేష్ఠుఁడేయని భ్రమించి వెంటనే అతనివెంబడి రెండవమన్మథుఁడేమోయనునట్లు కానఁబడుచున్న తామరలవంటి కన్నులుగల అనిరుద్ధునిఁ జూచి మనస్సులో తాపము నొందుచును ఇట్లు పలికెనని తాత్పర్యము.

ఉ॥ ఇంతిమదీయమానధన * మెల్లహరించినమ్రుచ్చునిమ్మెయిం । బంతమెలర్పవ్రాసిపట * భాగనిరూపితుఁజేసినట్టినీ
యంతటిపుణ్యమూర్తిఁగొని * యాడఁగ నేర్తునెనీచరిత్రము ల్వింతలెనాకునీమహిత * వీరుకులంబుబలంబుఁజెప్పుమా

టీ॥ ఇంతి = ఓచెలీ. మదీయమానధనమెల్లన్ = నాదైనమానమనెడు ధనమునంతయు. హరించినక్రుమ్చ్చున్ = దొంగిలించుకొనిపోయినదొంగను. ఇమ్మెయిన్=ఈవిధముగా. పంతము=ప్రతిజ్ఞ. ఎలర్పన్=నెఱవేఱఁగా. (వ్రాసి) పటభాగనిరూపితున్ = చిత్తరుపటమునందుకనఁబడువానిఁగా. చేసినట్టినీయంతటిపుణ్యమూర్తిన్=చేసినటువంటినీయంతపుణ్యస్వరూపురాలిని. కొనియాడఁగనేర్తునే=నేనుపొగడఁగలనా. నీచరిత్రములు=నీనడవళ్లు. వింతలె=క్రొత్తలే. నాకున్=నాతో. ఈమహితవీరుకులంబున్=ఈమహిమనుపొందినవీరునియొక్క కులమును. బలంబు=బలమును. (చెప్పుమా)

తా॥ ఓచెలీ! నామానమనెడు ధనమును దొంగిలించినదొంగను ఈమేరకు పటమునందు వ్రాసి నాకుఁ గనఁబఱిచితివి, నీయంతటి పుణ్యాత్మురాలిని నేను పొగడఁజాలుదునా,నీనడవళ్లు మిక్కిలిక్రొత్తలుగానున్నవి,ఇఁక ఈమహావీరుని కులగోత్రములను కలిమి బలుములను నాకు విశదముగా తెలియఁజేయవేయని తాత్పర్యము.

౪౧౭.—చ॥ అనవుడు చిత్రరేఖ జల * జాక్షికి నిట్లను నీకుమారకుం
డనఘుఁడు యాదవాన్వయ సు * ధాంబుధి పూర్ణసుధాకరుండు నాఁ
దనరిన కృష్ణపౌత్రకుఁ డు * దారచరిత్రుఁడు భూరిసింహ సం
హననుఁ డరాతిసైన్య తిమి * రార్కుఁడు పేరనిరుద్ధుఁ డంగనా.

టీ॥ అనవుడున్=ఇట్లు అనఁగా. (చిత్రరేఖ) జలజాక్షికిన్ = ఉషాకన్యతో. ఇట్లనున్=ఇట్లుపలికెను. అంగనా=ఓచిన్నదానా. ఈకుమారకుండు = ఈచిన్నవాఁడు. అనఘుఁడు = పాపములేనివాఁడు. యాదవా...సుధాకరుండు—యాదవ = యదువంశస్థులయొక్క.అన్వయ=వంశమనెడు.సుధాంబుధి=పాలసముద్రమునకు. పూర్ణసుధాకరుండు=నిండుచంద్రుఁడు. నాన్=అనఁగా.తనరిన=ప్రసిద్ధికెక్కిన.కృష్ణపౌత్రకుఁడు=శ్రీకృష్ణమూర్తికిమనమఁడు.ఉదారచరిత్రుఁడు=సరళమయిన నడవడిగలవాఁడు. భూరిసింహసంహననుఁడు = మిక్కిలి శ్రేష్ఠమయిన శరీరముగలవాఁడు — అందగాఁడు. అరాతి ... అర్కుఁడు — అరాతి = శత్రువులయొక్క. సైన్య=దండుఅనెడు. తిమిర=చీఁకటికి. అర్కుఁడు=సూర్యుఁడు. పేరు=వీనిపేరు. (అని రుద్ధుఁడు)

తా॥ అనియిట్లు ఉష అడుగఁగా చిత్రరేఖ ఓఅమ్మీ! ఈచిన్నవాఁడు పాపములు లేనివాఁడును, యదువంశమనెడు పాలసముద్రమునకు పూర్ణచంద్రుఁడునునైన శ్రీకృష్ణమూర్తికిమనుమఁడు,మిక్కిలి గంభీరమయిన నడవడిగలవాఁడు, చాల అందగాఁడు, శత్రువుల దండు అనెడు చీఁకటికి సూర్యుఁడైనవాఁడు,వీనిపేరు అనిరుద్ధుఁడు అని తాత్పర్యము.

౪౧౮.—వ॥ అనిచెప్పి యేనతిత్వరితగతింజని యిక్కుమారరత్నంబుఁ దోడ్కొని వత్తు
నంతకు సంతాపింపకుండుమని యాక్షణంబ వియద్గమనంబునఁజనిచనిముందట.

టీ॥ (అనిచెప్పి) ఏను=నేను. అతిత్వరితగతిన్=మిక్కిలివడిగల నడకతో. చని = పోయి. ఇక్కుమారరత్నంబున్ = ఈకుమారశ్రేష్ఠుని. (తోడ్కొనివత్తును) అంతకున్=అంతపర్యంతము. సంతాపింపకుండుము = పరితాపము పొందకయుండుము. (అని) ఆక్షణంబ = అప్పుడే. వియద్గమనంబునన్=ఆకాశముననడచుటచేత. చనిచని=చాలదూరముపోయి. ముందటన్=తనపురోభాగమందు.

తా॥ అని ఉషతో చెప్పి అమ్మీ నేను మిక్కిలి వడిగాపోయి ఈచిన్నవానిని పిలుచుకొని రాఁగలను. నేను వచ్చునంతదాఁక కొంచెము త్రొక్కటుపడక యుండుము అని అప్పుడే ఆకాశమార్గమున బహుదూరముపోయి యెదుట అని తాత్పర్యము.

(*) చిత్రరేఖ యనిరుద్ధునిఁ దెచ్చి యుషాకన్యకకు నొప్పగించుట. (*)



క॥ సరసిజముఖికనుఁగొనెశుభ । భరితవిలోకన విధూత * భవవేదనమున్
వరసాధనమును సుకృత । స్ఫురణాపాదనముఁ గృష్ణ * పుటభేదనమున్.

టీ॥ శుభ ... వేదనమున్—శుభ=మేలుచేత. భరిత=నిండుకొన్న. విలోకన=చూపుచేత. విధూత = దూరముగాతొలఁగింపఁబడిన. భవ=పుట్టుకలవలని. వేదనమున్=దుఃఖములుగలదానిని. వరసాధనమున్=శ్రేష్ఠములైనముక్తిసాధనములుగలదానిని. సుకృతస్ఫురణాపాదనమున్—సుకృత = పుణ్యముయొక్క. స్ఫురణ = ప్రకాశమును. ఆపాదనమున్ = కలిగించుదానిని. కృష్ణపుటభేదనమున్ = శ్రీకృష్ణమూర్తియొక్క పట్టణమయిన ద్వారకను. సరసిజముఖి=కమలములవంటికన్నులుగలదైనచిత్రరేఖ. కనుఁగొనెన్=చూచెను.

తా॥ శుభముతో నిండుకొన్న చూపుచేత జన్మదుఃఖములను దూరముగాఁ దొలఁగిపోవునట్లు చేయునదియు, మేలైన ముక్తిసాధనములు గలిగినదియు,పుణ్యమును ప్రకాశింపఁజేయునదియునైన శ్రీకృష్ణమూర్తిదైన ద్వారకాపట్టణమునుచూచియని తాత్పర్యము.

వ॥ కని డాయంజని తదీయ సుషమావిశేషంబునకుం బరితోషంబు నొందుచుం గామినీచరణ రణిత మణినూపుర ఝుణఝుణ ధ్వనిత మణిగోపురంబును, విభవవిజిత గోపురంబును, నగుద్వారకానగరంబు నిశాసమయంబునం బ్రచ్ఛన్న వేషంబునంజొచ్చి కనకకుంభకలిత సౌధాగ్రంబున మణిదీపనిచయంబు ప్రకాశింపఁ జంద్రకాంత శిలాభవనంబున సుధాధామ రుచిర రుచి నిచయంబు నపహసించు హంసతూలికా తల్పంబున నిజాంగనా రతిశ్రమంబున నిద్రాసక్తుండైయున్న యనిరుద్ధుంజేరి తన యోగ విద్యామహత్వంబున నతని నెత్తుకొని మనోవేగంబున శోణపురంబునకుంజని బాణాసుర నందనయగు నుషాసుందరీ తల్పంబునందిడి యిట్లనియె.

టీ॥ (కని) డాయంజని=చేరఁబోయి. తదీయసుషమావిశేషంబునకుɴ=దానిదైన శోభాతిశయమునకు. పరితోషంబునొందుచుɴ=సంతోషమునుపొందుచు. కామినీ...గోపురంబును—కామినీ=స్త్రీలయొక్క. చరణ=పాదములయందు. రణిత=మొరయుచున్న. మణినూపుర=రత్నాలయందెలచేత. ఝుణఝుణధ్వనిత=ఝుణఝుణయని ధ్వనింపఁజేయుచున్న. మణిగోపురంబును=రత్నాలగోపురములుగలదియు. విభవవిజితగోపురంబును=వైభవముచేతజయింపఁబడిన స్వర్గపట్టణముగలదియు. అగుద్వారకానగరంబు=అగునట్టిద్వారకాపట్టణమును. నిశాసమయంబునɴ=రాత్రివేళ. ప్రచ్ఛన్నవేషంబునɴ=ఇతరులకు తెలియరాని వేషముతో. చొచ్చి=ప్రవేశించి. కనకకుంభకలితసౌధాగ్రంబునɴ=బంగారుకుండలతోఁ గూడిన మేడమీఁద. మణిదీపనిచయంబు=రత్నప్రదీపములసముదాయము. ప్రకాశింపɴ=వెలుఁగఁగా. చంద్రకాంతశిలాభవనంబునɴ=చంద్రకాంతపురాళ్లచేతఁ గట్టఁబడిన యింటియందు. సుధాధామ...నిచయంబుɴ—సుధాధామ=చంద్రునియొక్క. రుచిర=వెలుఁగుచున్న. రుచి=కాంతులయొక్క. నిచయంబుɴ=సమూహమును. అపహసించుహంసతూలికాతల్పంబునɴ=పరిహాసము చేయునట్టి హంసతెక్కలపానుపునందు. నిజాంగనారతిశ్రమంబునɴ=తనభార్యతోడక్రీడవలనిబడలికచేత. నిద్రాసక్తుండై=నిద్రించినవాఁడై. (ఉన్న అనిరుద్ధుంజేరి) తనయోగవిద్యామహత్వంబునɴ=తనదైన యోగవిద్యయొక్క మహిమచేత. అతనిɴ=ఆయనిరుద్ధుని. (ఎత్తుకొని) మనోవేగంబునɴ=మనసుయొక్క వేగమువంటి వేగముతో. శోణపురంబునకుɴ=శోణపట్టణమునకు. (చని) బాణాసురనందన=బాణాసురునికూఁతురు. అగునుషాసుందరీతల్పంబునɴ=అగునట్టి ఉషాకన్యకయొక్క పానుపునందు. ఇడి=ఉంచి. (ఇట్లనియెను)

తా॥ అట్లు ద్వారకాపట్టణమునుజూచి దానిదైన మేలైనశోభావిశేషమునకు మెచ్చుకొనుచు స్త్రీలయొక్క పాదములయందలి ఝుణఝుణయను రత్నాలయందెల మ్రోఁతలచేత మాఱుమ్రోయుచున్న గోపురములుగలదియు, వైభవాతిశయముచేత స్వర్గపట్టణమును మించినదియునైన ఆపట్టణమునందు రాత్రికాలమునందు ఎవరికిని తెలియఁబడని వేషముతో ప్రవేశించి బంగారుకుండలెత్తియుండు మేడమీఁద రత్నప్రదీపములు వెలుఁగుచుండఁగా చంద్రకాంతమణులచేత నిర్మింపఁబడిన యింటియందు మిక్కిలిప్రకాశించుచున్న పండువెన్నెలనుమించి వెలుఁగుచున్న తెల్లని హంసతెక్కల మెత్తని పానుపునందు పండుకొని తనభార్యతో క్రీడించుటవలని బడలికచేత నిద్రపోవుచున్న అనిరుద్ధుని తనదైన యోగవిద్యా మహిమచేత మేలుకోకుండ ఎత్తుకొని మనసుయొక్క వేగమువంటి వేగముతో, శోణపట్టణమునకు పోయి బాణాసురునికూఁతురైన ఉషాకన్యక పానుపునందు పండఁబెట్టి ఆయుషతో ఇట్లు పలికెననితాత్పర్యము.

౭౩౧.—క॥ వనజాక్షి చూడు నీవిభు । ననిమిష నగధీరు శూరు ✽ నభినవమారుɴ
వనధి గభీరు నుదారుని । ననిరుద్ధ కుమారు విదళి ✽ తాహిత వీరుɴ.

టీ॥ వనజాక్షీ=కమలములవంటి కన్నులుగల ఓచిన్నదానా. అనిమిషనగధీరుɴ=మేరుపర్వతమువలె చలింపని ధైర్యముగలవాఁడును. శూరుɴ=శూరత్వముగలవాఁడును. అభినవమారుɴ=క్రొత్తమన్మథుఁడును—మునుపటి మన్మథుని మరపించుటకై పుట్టిన క్రొత్తమన్మథుఁడో యనఁదగినవాఁడనుట. వనధిగభీరుɴ=సముద్రమువలె గాంభీర్యముగలవాఁడును. ఉదారుɴ=సరళమయినవాఁడును. విదళితాహితవీరుɴ=నఱకఁబడిన శత్రువీరులుగలవాఁడునైన. (అనిరుద్ధకుమారుని) నీవిభుɴ=నీపెనిమిటిని (చూడుము)

తా॥ ఓ అమ్మి! మేరుపర్వతమువలె చలింపని ధైర్యముగలవాఁడును, మన్మథుని మఱపించు సౌందర్యము గలవాఁడును, అతిశూరత్వముగలవాఁడును, సముద్రము లోఁతు తెలియరానట్లు తన మనస్సులోని అభిప్రాయము బయలుపడ నియ్యనివాఁడును, ఉదారగుణముగలవాఁడును, శత్రువులనెల్ల నశింపఁజేసినవాఁడును, నీభర్తయునైన అనిరుద్ధకుమారుఁడు వీఁడిదిగో వీనినిచూడుమీ అనితా.

౭౩౨.—క॥ అనిన నుషాసతి దనమన । మున ననురాగిల్లి మేనఁ ✽ బులకాంకురముల్
మొనయఁగ నానందాశ్రులు । గనుఁగవ జడిగురియ ముఖవి ✽ కాస మెలర్పɴ.

టీ॥ అనినɴ=అనఁగా. (ఉషాసతి) తనమనమునɴ=తనమనసునందు. అనురాగిల్లి=అనురాగమునుపొంది. మేనɴ=దేహమునందు. పులకాంకురములు=గగుర్పొడుపులు. మొనయఁగɴ=కనఁబడఁగా. ఆనందాశ్రులు=సంతోషబాష్పములు. కనుఁగవɴ=రెండుకన్నులనుండి. జడిగురియɴ=వానకురిసినట్టు స్రవింపఁగా. ముఖవికాసము=మొగముయొక్క తేటఁదనము. ఎలర్పɴ=మొలవఁగా.

తా॥ అనఁగానే ఉషాకన్యక అనురాగమును వహించినదై దేహమునందు గగుర్పాటు కలుగఁగాను కన్నులనుండి ఆనందబాష్పములురాలఁగాను మొగము తేటపాఱఁగానుఅనితాత్పర్యము.

౪౨౩.—వ॥ ఇట్లు మనంబున నుత్సహించి చిత్రరేఖం గనుంగొని యయ్యింతి యిట్లనియె.

టీ॥ (ఇట్లు) మనంబునన్=మనసునందు. ఉత్సహించి = సంతోషించి. (చిత్రరేఖంగనుంగొని) అయ్యింతి=ఆయుష. (ఇట్లనియెను)

తా॥ ఈరీతిగా మనస్సున సంతోషమును పొందినదై ఆయుషా కన్యక చిత్రరేఖతో ఒకమాట చెప్పెనని తాత్పర్యము.

౪౨౪.—సీ॥ అతివ నీసాంగత్య * మనుభానురుచి నాకుఁ - గలుగుటఁ గామాంధ * కార మడఁగెఁ
దరలాక్షి నీసఖి * త్వంబను నావచేఁ - గడిఁది వియోగాబ్ధిఁ * గడవఁగంటి
నబల నీయనుబంధ * మనుసుధావృష్టిచే - నంగజ సంతాప * మార్పఁగంటి
వనిత నీచెలితనం * బనురసాంజనముచే - నామనోహర నిధా * నంబుఁగంటేఁ

తే॥ గలలఁదోఁచిన రూపును * గడఁకవ్రాయు । వారు నౌనన్నఁ దోడ్తెచ్చు * వారుఁగలరె
నీటిలోఁ జాడఁ బట్టంగ * నేర్పు నీక । కాక గల్గునె మూఁడు లో * కములయందు.

టీ॥ అతివ=ఓయింతీ. నీసాంగత్యము = నీసహవాసము. అనుభానురుచి=అనునట్టిసూర్యప్రకాశము. (నాకు) కలుగుటన్=కలిగినందున. కామాంధకారము=మన్మథవేదనఅనుచీఁకటి. అడఁగెన్=పోయెను. తరళాక్షి = చలించుకన్నులుగలదానా. నీసఖిత్వంబు=నీచెలికత్తెతనము (లేక) నీస్నేహము. అనునావచేన్=అనునట్టి ఓడచేత. కడిఁది = అసాధ్యమయిన. వియోగాబ్ధిన్=విరహసముద్రమును. కడవఁగంటిన్ = దాఁటునంతటి భాగ్యమును పొందితిని. అబల=ఓచిన్నదానా. నీయనుబంధము = నీతోడిచేరిక. అనుసుధావృష్టిచేన్=అనునట్టిఅమృతపువానచేత. అంగజసంతాపము=మన్మథసంబంధమయినతాపమును. ఆర్పఁగంటిన్=చల్లార్చునంతటిభాగ్యమునుపొందితిని. వనిత=ఓచిన్నదానా. నీచెలితనంబు=నీస్నేహము. అనురసాంజనముచేన్=అనునట్టిశ్రేష్ఠమైనకాటుకచేత. నామనోహరనిధానంబుఁగంటిన్=నాప్రియుఁడు అనునిధినిచూచితిని. కలలన్=స్వప్నములలో. తోఁచినరూపున్=కనఁబడినరూపమును. కడఁకన్=పూనికతో. వ్రాయువారును = చిత్తరువునందు వ్రాయువారును. ఔనన్నన్=ఈరూపమేయగునన఼గా. తోడ్తెచ్చువారును=తీసికొనివచ్చువారును. కలరె = ఎక్కడనైన ఉన్నారా. నీటిలోఁజాడఁబట్టంగన్=నీళ్లలో జాడ కనిపెట్టుటకు. నేర్పు=సామర్థ్యము. నీకకాక=నీకేకాని. మూఁడులోకములయందున్ = స్వర్గమర్త్యపాతాళములనెడులోకములు మూటియందు. కల్గునె=ఎవరికైనకలుగునా.

తా॥ ఓచిత్రరేఖా! నీస్నేహమనుసూర్యప్రకాశముచేత మన్మథవేదనయను కన్ను గాననియ్యని చీఁకటి తొలఁగెను, నీస్నేహమనెడి ఓడచేత దాఁటరాని విరహసముద్రమును దాఁటఁ గలిగితిని, నీస్నేహము అనెడు అమృతపువానచేత మన్మథతాపముతొలఁగెను, నీస్నేహము అను అంజనముచేత నాపెనిమిటి అనునిధిని పొందితిని, ఏలోకములోనైన కలలోఁ జూచినానన్న రూపమును చిత్తరువునందు వ్రాయువారును, వ్రాసినదే ఔనన్న తెచ్చువారునుగలరా? ఇట్టినేర్పు నీయందేగాని మఱియెందును లేదు అనఁగా, నీస్నేహము అనునది నావిషయమునందు ఎండయు ఓడయు అమృతపువానయు అంజనము అయి నన్నుపొందియుండిన చీఁకటివంటిదియు దాఁటరాని సముద్రమువంటిదియు ఆఱనివేండ్రమునైన మన్మథవేదనను తొలఁగించి నాప్రియుఁడు అను నిధిని నాయెదుటఁ గనఁబఱిచినదనియు ఇట్టినేర్పు నీకుఁగాకమఱియెవరికిని లేదనియు పలికెనని తాత్పర్యము.

(*) అనిరుద్ధుఁడు ఉషాకన్యతోఁ గ్రీడించుట. (*)



వ॥ అని వినుతించి చిత్రరేఖను నిజమందిరంబునకుం బోవంబనిచినం జనియె
ననంతరంబ వింత జనుల కెవ్వరికిఁ బ్రవేశింపరాని యంతఃపుర సౌధాం
తరంబున ననిరుద్ధుండు మేల్కని యయ్యింతిం గనుంగొని యప్పుడు.

టీ॥ (అని) వినుతించి = పొగడి. (చిత్రరేఖను) నిజమందిరంబునకున్=సొంతపు ఇంటికి. పోవంబనిచినన్=పంపఁగా. చనియెన్=పోయెను. అనంతరంబ = ఆటుపిమ్మట. వింతజనులకున్=ఇతరులకు. ఎవ్వరికిన్=ఎవరికిని. ప్రవేశింప...రంబునన్–ప్రవేశింపరాని = చొరఁగూడని. అంతఃపురసౌధాంతరంబునన్=అంతఃపురపు మేడలోపల. (అనిరుద్ధుండు మేల్కని) అయ్యింతిన్=ఆయుషాకన్యను. కనుంగొని=చూచి. (అప్పుడు)

తా॥ అని ఉషాకన్యక చిత్రరేఖను పొగడి దానియింటికిఁ బంపఁగా అది పోయెను, అటుపిమ్మట ఇతరులకెవరికిని చొరననువుగాని అంతఃపురపు మేడమీఁద అనిరుద్ధుఁడు మేలుకొన్నవాఁడై ఉషనుజూచి యని తాత్పర్యము.

క॥ సురుచిర మృదుతల్పంబునఁ । బరిరంభణ సరసవచన * భావ కళా చా
తురి మెఱయ నాకుమారుఁడు । తరుణీమణిఁబొందెమదన * తంత్రజ్ఞుండై-

టీ॥ ఆకుమారుఁడు=ఆచిన్నవాఁడు. (అనిరుద్ధుఁడు) సురుచిర మృదుతల్పంబునన్ = ప్రకాశించుచున్న మెత్తనిపానుపునందు. పరిరంభణ...చాతురి—పరిరంభణ=ఆలింగనములయు. సరసవచన=పరిహాసపుమాటలయు. భావకళా = భావములయు కళలయు. చాతురి=నేర్పు. మెఱయన్=ప్రకాశింపఁగా. తరుణీమణిన్=స్త్రీశ్రేష్ఠమైన ఉషాకన్యను. మదనతంత్రజ్ఞుండై=మన్మథశాస్త్రవిషయములను తెలిసినవాఁడై. పొందెన్=కూడెను—ఆలింగన లక్షణములు కొక్కోకశాస్త్రి ప్రథమాశ్వాసపు (౪౭) పుటయందుఁజూచునది.

తా॥ అప్పుడు అనిరుద్ధుఁడు మెత్తగా నొప్పుచున్న పానుపునందు ఉషతోఁ గూడినవాఁడై కౌఁగిలింతలయు పరిహాసపుమాటలయు నేర్పు మెఱయఁగా భావకళారహస్యముల నెఱిఁగినవాఁడై మన్మథక్రీడ సలిపెనని తాత్పర్యము.

వ॥ ఇవ్విధంబున నతిమనోహరవిభవాభిరామంబులగు దివ్యాంబరాభరణమాల్యానులేపనంబులఁ గర్పూరతాంబూలంబుల వివిధాన్నపానంబుల సురుచిరమణిదీపికానీరాజనంబుల సుగంధబంధురాగరుధూపంబుల నాటల పాటల వీణావినోదంబులం బరితుష్టింబొంది కన్యాకుమారు లానందసాగరాంతర్నిమజ్యమానమానసులై యుదయాస్తమయనిరూపణంబు సేయనేరక ప్రాణంబు లొక్కటియైన తలంపులం గదిసి యిష్టోపభోగంబుల సుఖియించుచుండి రంత.

టీ॥ ఇవ్విధంబునన్ = ఈరీతిగా. అతిమనో...బులు — అతి=మిక్కిలి. మనోహర=మనసునకింపైన. విభవ=వైభవముచేత. అభిరామంబులు=ఒప్పినవి. అగు...బులన్—అగు = అగునట్టి. దివ్య=దేవసంబంధమయిన. అంబర=వస్త్రములచేతను. ఆభరణ=సొమ్ముల చేతను. మాల్య=పూలదండలచేతను. అనులేపనంబులన్=గందపుపూఁతలచేతను. కర్పూరతాంబూలంబులన్=పచ్చకర్పూరముతోడి విడియములచేతను. వివిధాన్నపానంబులన్=నానావిధములైన అన్నపానములచేతను. సురుచిర...బులన్—సురుచిర=మిక్కిలి వెలుఁగునట్టి. మణి=రత్నమయములయిన. దీపికా=దీపములచేతను. నీరాజనంబులన్=ఆరతులచేతను. సుగంధ...బులన్—సుగంధ=మంచివాసనచేత. బంధుర=మేలైన. అగరుధూపంబులన్=అగరుగంధపుధూపములచేతను. ఆటలన్=నృత్యములచేతను. పాటలన్=సంగీతములచేతను. వీణావినోదంబులన్=వీణెపాటలవలని వేడుకలచేతను. పరితుష్టింబొంది = చక్కగాతృప్తినిపొంది. కన్యాకుమారులు = ఉషాకన్యయు అనిరుద్ధుఁడును. ఆనంద...మానసులై—ఆనందసాగర=సంతోషసముద్రముయొక్క. అంతః = లోపల. నిమజ్యమాన=మునుఁగుచున్న, మానసులై = మనసులుగలవారై. ఉదయా ... సేయన్—ఉదయ=ప్రొద్దుపొడుచుటను. అస్తమయ=ప్రొద్దుగ్రుంకుటను. నిరూపణంబుసేయన్=నిర్ణయించి తెలిసికొనుటకు. నేరక=చాలక. (ప్రాణంబులు ఒక్కటియైన తలంపుల) కదిసి = కూడి. ఇష్టోపభోగంబులన్ = ఇచ్చవచ్చిన సుఖానుభవములచేత. (సుఖియించుచుండిరి) అంతన్=అప్పుడు.

తా॥ ఈప్రకారము మిగుల మనోహరమును సంపదయొక్క మేలిమితోఁ గూడినవియు దివ్యములునయిన వస్త్రములు సొమ్ములు పూలదండలు గందపుఁబూతలు పచ్చకర్పూరపు విడియములు బహువిధములైన అన్నములు త్రాగఁదగినవస్తువులు మొదలగువానిచేతను మిక్కిలి వెలుఁగునట్టి రత్నమయములైన దీపహారతులచేతను మంచివాసనగల అగరు ధూపములచేతను, ఆట పాటలచేతను, వీణె వాయించుటలచేతను, చక్కగా తనిసి ఉషాకన్యయు అనిరుద్ధుఁడును సంతోషము అనెడు సముద్రమునందు మునిఁగిన మనస్సులు గలవారై ప్రొద్దుపొడుచుటయు ప్రొద్దుగ్రుంకుటయుఁ దెలియక ఇరువురిప్రాణమును ఒక్కటియైనట్లు కూడి యిచ్చవచ్చిన భోగముల చేత సుఖించుచుండిరి అట్లు సుఖించుచుండు కాలమునందని తా.

౪౨౭.—క॥ ఆలోనన యతిచిరమగు । కాలము సుఖలీల జరగఁ * గా వరుస నుషా

బాలాలలామ కొయ్యనఁ । జూలేర్పడి గర్భ మొదవె * సురుచిరభంగిన్.

టీ॥ ఆలోనన=అంతలోపలనే. అతిచిరమగు=మిక్కిలి తడవైన (కాలము) సుఖలీలన్=సుఖవిలాసముతో. (జరగఁగా) వరుసన్=దినములపేరట. ఉషాబాలాలలామమునకున్=ఉషాకన్యకు. ఒయ్యనన్=క్రమముగా. చూలు=గర్భపిండము—కడుపు(ఏర్పడి) సురుచిరభంగిన్=ప్రకాశించువిధమున. గర్భము=కడుపు. ఒదవెన్=పెద్దదయ్యెను.

తా॥ అంతలో చాలతడవుకాలము అట్లు సుఖముగా జరగఁగా దినక్రమమున ఉషాకన్యగర్భము ధరించెను అందువలన కడుపుపెద్దదియగుట మొదలగు చిహ్నములు ప్రకాశించెనని తాత్పర్యము.

౪౨౮.—క॥ కాచిన కావలివారలు । సూచి భయాకులతనొంది * స్రుక్కుచుఁ దమలో

నోచెల్ల యిట్లుదానీ । రాచూలికిఁ జూలునిలిచె * రా యెబ్భంగిన్.

టీ॥ కాచినకావలివారలు=ఆయంతఃపురమును కాచియుండునట్టి కావలివాండ్రు. చూచి = అగర్భచిహ్నములనుజూచి. భయాకులతన్=వెఱపువలనిత్రొక్కటను. ఒంది=పొంది. స్రుక్కుచున్=సంతాపపడుచు. తమలోన్=ఒకరికొకరు. ఓచెల్ల=ఔరా. ఈరాచూలికిన్=ఈరాచకూఁతురికి. (ఇట్లు) ఎబ్భంగిన్=ఏవిధముచేతనో. చూలు=గర్భము, దాన్ = దాను, నిలిచెరా = నిలిచెనుగదరా.

తా॥ ఆయంతఃపురమునందు కాచియున్న కావలికాండ్రు ఉషాకన్యకయొక్క గర్భచిహ్నములను జూచి భయపడి యీరాచకూతురు ఏవిధముగా గర్భము ధరించెను ఇట్లు గర్భము దాల్చుట విచారింపఁగా వింతగా నున్నదియని ఒకరితో నొకరు ఇది యెట్లు పొసఁగెనని విచారింప సాగిరని తాత్పర్యము.

౮౩౦.—క॥ అని గుజగుజ వోవుచు ని। ప్పనితప్పక దనుజలోక * పాలునితోడన్
వినిపింప వలయునని వే। చని బాణుంజేరి మ్రొక్కి * సద్వినయమునన్.

టీ॥ (అని) గుజగుజవోవుచున్=గుసగుసలాడుచును-తమలోఁదామ త్రొక్కటపడి రహస్యముగా చెప్పుకొనుచు. ఇప్పని=ఈచిన్నది గర్భముధరించిన దనువిషయమును. (తప్పక) దనుజలోకపాలునితోడన్ = రాక్షసరాజైన బాణాసురునితో. వినిపింప వలయున్=మనవిచేయవలసినది. (అని) వేచని=శీఘ్రముగాఁబోయి. బాణుంజేరి=బాణాసురునిదగ్గఱకుఁబోయి. మ్రొక్కి=దండముపెట్టి. సద్వినయమునన్-సత్=ఎక్కువైన. వినయమునన్=అడఁకువతో.

తా॥ అని యీవిధముగా గుసగుసలాడుచు ఈవిషయమును రాజుతో చెప్పకపోయినపక్షమున మనకు మోసమువచ్చును అవశ్యము రాజుతో చెప్పవలసినదేయని నిశ్చయించుకొని బాణాసురుని సన్నిధానమునకుఁ బోయి దండముపెట్టి మిక్కిలివినయముతో ఇట్లు పలికిరని తాత్పర్యము.

౮౩౧.—క॥ మంతనమున దేవర క। న్యాంతఃపుర మేముగాచి * యరయుచు నుండన్
వింత జనులకును జొరఁగదు। రంతము విను పోతుటీఁగ * కైన సురారీ.

టీ॥ సురారీ=దేవశత్రుఁడగు బాణాసురుఁడా. విను=వినుము. మంతనమునన్=ఏకాంతమునందు. దేవరకన్యాంతఃపురము=దేవరవారికన్యకయుండెడి యంతఃపురమును. ఏము=మేము. కాచి=కనిపెట్టి. అరయుచునుండన్=విచారించుకొనుచుండఁగాను. వింతజనులకున్ = క్రొత్తమనుష్యులకు. పోతుటీఁగకైనన్ = మగయీఁగకైనను. చొరఁగన్=ప్రవేశింపను. దురంతము=అసాధ్యము.

తా॥ ఓ దేవతాశత్రువైన బాణాసురమహారాజా! దేవరవారి కూఁతురు ఉండునట్టి లోపలియింటిని ఎంతో ఎచ్చరికతో రహస్యముగా కనిపెట్టి కాపాడుచుందుము అట్లుండఁగా ఆయింటిలోపల ఇతరజనులకుమాత్రము అననేల తుదకు మగయీఁగకైన ప్రవేశింప శక్యముగాక యుండును అని తాత్పర్యము.

౮౩౨.—తే॥ ఇట్టిచోఁ గావలున్న మే * మెవ్వరమును। ఏమికనుమాయయో కాని * యెఱుఁగమధిప
నీకుమారిక గర్భంబు * నివ్వటిల్లి। యున్న దన్నను విని రోష * యుక్తుఁ డగుచు.

టీ॥ ఇట్టిచోన్=ఇట్టియెడ - ఇట్లు జాగ్రత్తతో మేము కావలి యుండఁగాను. అధిప=స్వామీ. ఏమికనుమాయయో=ఏవిధమైన చూపుమోసమో. (కాని కావలున్న మేమెవ్వరమును ఎఱుఁగము) నీకుమారిక=నీకూఁతురు. గర్భంబు=కడుపు. నివ్వటిల్లి = పెరిఁగి. (ఉన్నది) అన్నన్=అనఁగా. (విని) రోషయుక్తుఁడగుచున్=కోపముతోఁ గూడుకొన్నవాఁడగుచు — కోపించినవాఁడయియనుట.

తా॥ ఇట్లు మేము ఎచ్చరికతో కనిపెట్టియుండియును ఏమి మాయయో మేమెఱుఁగము కావలివారమయిన మాకెవ్వరికిని తెలియకయే మీకొమార్తె గర్భముధరించివర్తిల్లుచున్నది అనఁగా బాణాసురుఁడు కోపించినవాఁడగుచు అని తాత్పర్యము.

౮౩౩.—వ॥ అట్టియెడ దానవేంద్రుండు రోష భీషణాకారుండై కటములదర బొమలు ముడివడం
గనుంగవల ననలకణంబు లుప్పతిల్ల సటలువెఱికినం జటులగతినెగయు సింగంబువిధంబున
లంఘించుచు భీకరకరవాలంబు కేలందాల్చి సముద్దండగతిం గన్యాసౌధాంతరంబునకుం జని.

టీ॥ అట్టియెడన్=అప్పుడు. దానవేంద్రుండు=బాణాసురుఁడు. రోషభీషణాకారుండై=కోపముచేత భయంకరమయిన ఆకృతిగలవాఁడై. కటములదరన్=చెక్కిళ్లు అదురఁగా. బొమలుముడివడన్= కనుబొమలుముడిపడఁగా. కనుంగవలన్ = రెండుకన్నులందును. అనలకణంబులు=నిప్పురవలు. ఉప్పతిల్లన్=పుట్టఁగా. సటలు వెఱికినన్=జూలువెండ్రుకలుఊడఁబెఱుకఁగా. చటులగతిన్=వేగముతోడిగమనముతో. ఎగయుసింగంబువిధంబునన్ = ఎగయునట్టి సింహమువలె. లంఘించుచున్ = దాఁటుచు. భీకరకరవాలంబు= భయంకరమయినకత్తిని. కేలన్ = చేతియందు. తాల్చి = ధరించి. సముద్దండగతిన్=మిక్కిలి నిక్కుగలగమనముతో. కన్యాసౌధాంతరంబునకున్=కన్యకయుండు మేడలోపలికి. చని=పోయి.

తా॥ ఆసమయమునందు బాణాసురుఁడు కోపముచేత భయంకరమయినరూపమునువహించినవాఁడైచెక్కిళ్లు అదురుచుండఁగాను, కనుబొమలు ముడివడుచుండఁగాను, రెండుకన్నులనుండియు నిప్పురవలు రాలుచుండఁగాను జూలు పెఱుకఁగా మిట్టిపడు సింహమువలె ఎగసిదాఁటుచు భయంకరమయినకత్తి చేతపట్టుకొని మిక్కిలి నిక్కుచు వడిగాకన్యకయుండుమేడమీఁదికిపోయిఅనితాత్పర్యము.

౮౩౪.—సీ॥ కనియె శుభోపేతుఁ * గందర్పసంజాతు - మానితదేహు సా * జానుబాహు
మకరకుండలకర్ణు * మహితప్రభాపూర్ణుఁ - జిరయశోల్లాసుఁ గౌ * శేయవాసుఁ
గస్తూరికాలిప్తు * ఘనకాంతి కుముదాప్తు - హారశోభితవక్షు * నంబుజాక్షు
యదువంశతిలకు మ * త్తాలసలాలకు - నవపుష్పచాపుఁ బ్రా * జ్ఞప్రతాపు

తే॥ నభినవాకారు నక్షవి * ద్యావిహారు । మహితగుణవృద్ధు మన్మథ * మంత్రసిద్ధుఁ
గలితపరిశుద్ధు నఖిలలో * కప్రసిద్ధుఁ । జతురుననిరుద్ధు నంగనా * జనవిరుద్ధు.

టీ॥ శుభోపేతుఁ=మేలుతోఁ గూడుకొన్నవాఁడును. కందర్పసంజాతుఁ=మన్మథునికొడుకును. మానితదేహుఁ = ఉన్నతమైన దేహముగలవాఁడును. ఆజానుబాహుఁ = మోఁకాళ్లానఁ బ్రేలుచున్న చేతులుగలవాఁడును. మకరకుండలకర్ణుఁ=మొసలిరూపుగల పోఁగులతోడి చెవులుగలవాఁడును. మహితప్రభాపూర్ణుఁ=గొప్ప తేజస్సుచేత నిండుకొన్నవాఁడును. చిరయశోల్లాసుఁ = శాశ్వతమయినకీర్తిచేత ప్రకాశించువాఁడును. కౌశేయవాసుఁ = పట్టువస్త్రములు గలవాఁడును. కస్తూరికాలిప్తుఁ = కస్తురిగంధముచేతఁ బూయఁబడినవాఁడును. ఘనకాంతికుముదాప్తుఁ=అధికలావణ్యముచేత చంద్రుఁడైనవాఁడును. హారశోభితవక్షుఁ=ముత్యాలపేరులచేత ప్రకాశించునట్టి వక్షస్థలముగలవాఁడును. అంబుజాక్షుఁ = కమలములవంటి కన్నులు గలవాఁడును. యదువంశతిలకుఁ = యాదవవంశమునకు తిలకమువంటివాఁడును. మత్తాళినీలాలకుఁ= మత్తుగొన్నతుమ్మెదలవలె నల్లనైన ముంగురులుగలవాఁడును. నవపుష్పచాపుఁ=క్రొత్తపుష్పములు ధనుస్సుగఁగలవాఁడును. పూర్ణప్రతాపుఁ = కొఱఁతలేని ప్రతాపముగలవాఁడును. అభినవాకారుఁ = నూతనమయిన ఆకారముగలవాఁడును. అక్షవిద్యావిహారుఁ = జూదమాడెడువిద్యయందు మెలఁగుచున్నవాఁడును - జూదమాడుచున్నవాఁడు అనుట. మహితగుణవృద్ధుఁ=గొప్పగుణములచేత గొప్పవాఁడును. మన్మథమంత్రసిద్ధుఁ = మన్మథసంబంధమయిన ఆలోచనయందుసిద్ధిఁబొందినవాఁడును. కలితపరిశుద్ధుఁ= కూడుకొన్నపరిశుద్ధిగలవాఁడును. అఖిలలోకప్రసిద్ధుఁ=ఎల్లలోకములందు ప్రసిద్ధిని వహించినవాఁడును. చతురుఁ=చాతుర్యముగలవాఁడును. అంగనాజననిరుద్ధుఁ=సౌందర్యముచేత స్త్రీజనులనుఅడ్డగించువాఁడును నైన. (అనిరుద్ధుని) కనియెఁ=చూచెను.

తా॥ శుభముతోఁ గూడుకొన్నవాఁడును, మన్మథునికొడుకును, మనోజ్ఞమయిన దేహము గలవాఁడును, మోఁకాళ్లదాఁక వ్రేలుచున్న బాహువులుగలవాఁడును, మొసలినోరువంటి ప్రోఁగులు చెవులయందుఁగలవాఁడును, మహత్తైనకాంతిచేత నిండుకొన్నవాఁడును, శాశ్వతమయిన యశస్సుచేత ఉల్లాసము నొందువాఁడును, పట్టుపచ్చడముగలవాఁడును, కస్తూరిచేతపూయఁబడినవాఁడును, అధికమయినకాంతిచేత చంద్రుఁడయినవాఁడును, ముత్యాలపేరులచేత అందగించునట్టి వక్షస్స్థలముగలవాఁడును, కమలములవంటికన్నులు గలవాఁడును, యాదవవంశమునకు తిలకమయినవాఁడును, మత్తగొన్న తుమ్మెదలవలె నల్లనైనముంగురులుగలవాఁడును, క్రొత్తయైన పుష్పములతోడి ధనుస్సుగలవాఁడును, కొఱఁతలేని ప్రతాపముగలవాఁడును, క్రొత్తయయిన ఆకృతిగలవాఁడును, జూదమాడుటచేత ప్రొద్దుపుచ్చుచున్నవాఁడును, గొప్పగుణములచేత పెద్దవాఁడును, మన్మథక్రీడయనెడు మంత్రమువలన సిద్ధివహించినవాఁడును, మిక్కిలి పరిశుద్ధుఁడును, ఎల్లలోకములందు ప్రసిద్ధివహించినవాఁడును, చాతుర్యముగలవాఁడును, స్త్రీజనులను తనసౌందర్యముచేత అడ్డగించువాఁడునైన అనిరుద్ధునిఁగనియెనని తాత్పర్యము.

౭౩౫.—చ॥ కని కనలగ్గలింప సుర * కంటకుఁ డుద్ధతి నబ్భటావళిం
గనుఁగొని యీనరాధమునిఁ * గట్టుఁడు పట్టుఁడు కొట్టుఁడన్న వా
రనుపమ హేతిదీధితు ల * హర్పతి తేజము మాయఁజేయ డా
సిన నృపశేఖరుండు మదిఁ * జేవయు లావును నేర్పు దర్పముఁ.

టీ॥ కని = చూచి. కనలు = కోపము. అగ్గలింపఁ = అతిశయింపఁగా. సురకంటకుఁడు = దేవతలకుపగవాఁడైనబాణుఁడు. ఉద్ధతిఁ=నిక్కుతో. అబ్భటావళిఁ=ఆయంతఃపురపుకావలివారైన సేవకులసమూహమును. కనుఁగొని = చూచి. ఈనరాధమునిఁ= మనుష్యులలోఅల్పుఁడైనవీనిని. కట్టుఁడు=కట్టివేయుఁడు. పట్టుఁడు= పట్టుకొనుడు. (కొట్టుఁడు) అన్నఁ=అనఁగా. వారు=ఆభటులు. అనుపమ... దీధితులు—అనుపమ=ఈడులేని. హేతి=కత్తులయొక్క. దీధితులు = కాంతులు. అహర్పతితేజముఁ = సూర్యుని తేజస్సును. మాయఁజేయఁ = మాసిపోవునట్లుచేయఁగా. డాసినఁ = సమీపింపఁగా. నృపశేఖరుండు=రాజశ్రేష్ఠుఁడు. మదిఁ=మనసునందు. చేవయుఁ=బలమును. లావుఁ=సామర్థ్యమును. నేర్పు = చతురత్వమును. దర్పముఁ=అహంకారమును. (కలిగినవాఁడై)

తా॥ బాణాసురుఁడు అనిరుద్ధునిఁ జూచి మిక్కిలి కోపము హెచ్చఁగా తనసేవకులతట్టు నిక్కి చూచి యీనీచమానవునిపట్టుకొని కట్టివేయుఁడు కొట్టుఁడు అని ఆజ్ఞాపింపఁగా వారు తళతళ మెఱయుచున్న కత్తులను చేతఁబట్టుకొని అనిరుద్ధుని కదియఁబోయిరి అప్పుడు అనిరుద్ధుఁడు వారికి భయపడక తనబలమును సామర్థ్యమును నేర్పును మదమును గలవాఁడై అని తాత్పర్యము.

౭౩౬.—చ॥ కలిగిమహోగ్రవృత్తిఁ బరి * ఘంబు గరంబున లీలఁదాల్చి దో
ర్బల ఘనవిక్రమ ప్రళయ * భైరవు భంగి విజృంభణక్రియా
కలన నెదిర్చె దానవ ని * కాయముతోఁ దలపాటుఁ బోటునుం
జలము బలంబు ధైర్యమును * శౌర్యము వ్రేటును బాటుఁజూపుచుఁ.

టీ॥ (కలిగి) మహోగ్రవృత్తిఁ = మిక్కిలి భయంకరమయిన వ్యాపారముతో. పరిఘంబుఁ= పరిఘమను ఆయుధమును. కరంబునఁ=చేత. లీలఁ = విలాసముగా - వేడుకకువలెనే. తాల్చి= ధరించి. దోర్బలఘనభంగిఁ—దోర్బల = భుజబలముచేత. ఘన=

మేలయిన. విక్రమ = పరాక్రమముగల. ప్రళయభైరవుభంగిన్ = ప్రళయకాలపు భైరవమూర్తివలెనే. విజృంభణక్రియాకలనన్ = ఆటోపవ్యాపారముతోడికూడికతో. తలపాటును=తల్లడపడుటయు—పూనుదలయును. పోటును=పోట్లాటయు. చలమును=పట్టుదలయు. బలంబును=శక్తియు. (ధైర్యమును) శౌర్యమును = శూరత్వమును. వ్రేటును=కొట్టుటయును. పాటును = పడుటయు. (చూపుచు) దానవనికాయముతోన్=రాక్షససమూహముతో. (ఎదిర్చెను)

తా॥ అనిరుద్ధుఁడు మిక్కిలి క్రూరమైన వృత్తిగలవాఁడై తటాలున పరిఘాయుధమును చేతఁబట్టుకొని భుజబలముతోడి మేలైన పరాక్రమముగల భైరవుఁడు ప్రళయకాలమునందు విజృంభించి ప్రాణులను హింసించునట్లు తనయొక్క యుద్ధపు పూనుదలయు యుద్ధముచేయుటయు మచ్చరమును బలమును ధీరత్వమును శూరత్వమును కొట్టుటయు కొట్టునప్పుడుశత్రువులుపడుటయు చూచువారికి వింతగా కనఁబఱుచుచు రాక్షససేనతో ఎదిరించెనని తాత్పర్యము.

౪౩౪.—చ॥ పదములు బాహులుం దలలుఁ ✻ బ్రక్కలుఁ జెక్కులు జానుయుగ్మముల్
రదములుఁ గర్ణముల్మెడలు ✻ రంబులు మూఁపులు వీఁపు లూరువుల్
చిదురుపలై ధరం దొరఁగఁ ✻ జిందఱ వందఱ సేయ సైనికుల్
గదన పరాఙ్ముఖ క్రమము ✻ గైకొని పాఱిరి కాందిశీకులై.

టీ॥ పదములు=అడుగులును. బాహులున్=భుజములును. (తలలును ప్రక్కలును) చెక్కులును=చెక్కిళ్లును. జానుయుగ్మములును=మోఁకాళ్లజంటలును. రదములును=పండ్లును. కర్ణములును=చెవులును. (మెడలును) ఉరంబులును=ఱొమ్ములును. మూఁపులును=భుజశిరస్సులును. (వీఁపులును) ఊరువులును=తొడలును. చిదురుపలై=చిన్నచిన్నతునుకలై—పొడియై. ధరన్=భూమియందు. తొరఁగన్=పడునట్లు. చిందఱవందఱసేయన్=ఛిన్నభిన్నముచేయఁగా. సైనికులు = సేనాజనులు. కదనపరాఙ్ముఖక్రమము = యుద్ధమునకు మాఱుమొగమగువిధమును. కైకొని=అవలంబించి. కాందిశీకులై = యుద్ధముచేయవెఱచి. పాఱిరి=పరుగెత్తిరి.

తా॥ అనిరుద్ధుఁడు తన్ను ఆక్రమించుకొన్న సైనికుల కాళ్లు చేతులు తలలు ప్రక్కలు చెక్కిళ్లు మోఁకాళ్లు తొడలు మెడలు పండ్లు చెవులు ఱొమ్ములు మూఁపులు వీఁపులు మొదలుగాఁగల అవయవములు చిన్నచిన్నతునుకలుగా తెగి నేలఁబడునట్లు కొట్టఁగా ఆసైనికులు భయపడి యుద్ధముచేయ ధైర్యముచాలక మూలకొకరుగా పాఱిపోయిరని తాత్పర్యము.

వ॥ ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబు నొందియు వెఱచియుఁ బఱచియు విచ్చియుఁ జచ్చియుఁ గలంగియు నలంగియు విరిగియు సురిఁగియుఁ జెదరియు బెదరియుఁ జేవదఱిగి నుఱుములై తనమఱుఁగుసొచ్చిన బాణుండు శౌర్యధురీణుండునుం గోపోద్దీపితమానసుండునునై కదిసి యేచియేసియుఁ బొడిచియు నడిచియు ననంగియుఁ బెనంగియు.

టీ॥ ఇవ్విధంబునన్=ఈరీతిగా. సైన్యంబు = దండు. దైన్యంబు నొందియున్=దీనత్వమునుపొందియు. వెఱచియున్=భయపడియు. పఱచియున్=పరుగెత్తియు. విచ్చియున్ = పరస్పరముచేరికలేక తొలఁగియు. (చచ్చియు) కలంగియున్ = కలఁతనొందియు. నలంగియున్=మెత్తపడియు. విఱిగియున్=వెనుదీసియు. సురిఁగియున్=డాఁగియు. చెదరియున్ = ఒకక్రమములేక నిలువఁబడిపోయియు. బెదరియున్=దిగులుపడియు. చేవదఱిగి=బలముతగ్గి. నుఱుములై=త్రొక్కటనొందినవారై. తనమఱుఁగు చొచ్చినన్ = తనచాటున చొరఁగా. (బాణుండు) శౌర్యధురీణుండును=శూరత్వమునువహించినవాఁడును. కోపోద్దీపితమానసుండును=కోపముచేత వెలిఁగింపఁబడిన మనసుగలవాఁడును. (అయి) కదిసి=మిక్కిలిచేరఁబోయి. ఏచి=విజృంభించి. ఏసియున్=బాణములుప్రయోగించియు. (పొడిచియు) అడిచియు=కొట్టియు. అనంగియున్=అనుఁవుగాచిక్కించుకొనియు. పెనంగియున్=పెనఁగులాడియు.

తా॥ ఈవిధముగా తనసేన దీనత్వమును పొంది భయపడియు పరుగెత్తియు ఒకరితోనొకరు కూడక తొలఁగియు చచ్చియు కలఁతపడియు మెత్తపడియు వెనుదీసియు డాఁగియు మూలమూలకు నాదిఁగి నిలిచియు దిగులుపడియు బలము ఉడిగి త్రొక్కటపడుచు తనమఱుఁగుచొరఁగా బాణాసురుఁడుకోపించి శూరత్వముతో అనిరుద్ధుని కదియఁబోయి అట్టెరేఁగి బాణములు ప్రయోగించియు ఆయుధములతో పొడిచియు కొట్టియు అనువుగా పట్టుకొనియు పెనఁగులాడియు అనితాత్పర్యము.

## —(✻) బాణాసురుఁ డనిరుద్ధుని నాగపాశములతోఁ గట్టుట. (✻)—



క॥ క్రుద్ధుండై యహిపాశ ని। బద్ధుం గావించె నసుర ✻ పాలుఁడు రణస
న్నద్ధున్ శరవిద్ధు న్నని। రుద్ధున్ మహిత ప్రసిద్ధు ✻ రూపసమృద్ధున్.

టీ॥ అసురపాలుఁడు=బాణాసురుఁడు. రణసన్నద్ధున్ = యుద్ధమునకు సిద్ధపడినవాఁడును. శరవిద్ధున్ = బాణములచేత గ్రుచ్చఁబడినవాఁడును. మహితప్రసిద్ధున్=గొప్పతనముచేత ప్రసిద్ధినొందినవాఁడును. రూపసమృద్ధున్=చక్కఁదనముచేత నిండుకొన్నవాఁడునునైన. (అనిరుద్ధుని) క్రుద్ధుండై=కోపించినవాఁడై. అహిపాశనిబద్ధున్=నాగపాశములచేత కట్టుపడ్డవానిఁగా. కావించెన్=చేసెను.

తా॥ బాణాసురుఁడు కోపించినవాఁడై తనతోడి యుద్ధమునకు సిద్ధపడినవాఁడును, తనబాణములచేత గ్రువ్వఁబడినవాఁడును, గొప్పతనముచేత ప్రసిద్ధివహించినవాఁడును, మిక్కిలిచక్కఁదనము గలవాఁడునైన అనిరుద్ధుని నాగపాశములచేత కట్టివేసెను అని తా.

౪౪౦.—వ॥ ఇట్లు కట్టి త్రోచిన నుషాసతి శోకవ్యాకులితచిత్తయై యుండె నంత నక్కడ.

టీ॥ (ఇట్లుకట్టి) త్రోచినన్ = ఒకతట్టు పడఁద్రోయఁగా. ఉషాసతి=ఉషాకన్యక. శోకవ్యాకులితచిత్తయై—శోక=విచారము చేత. వ్యాకులిత = కలఁతపెట్టఁబడిన. చిత్తయై = మనసుగలదై. (ఉండెను) అంతన్=అప్పుడు. అక్కడ=ద్వారకాపట్టణమునందు.

తా॥ ఈవిధముగాబాణాసురుఁడు అనిరుద్ధునినాగపాశములతో కట్టి ఒకతట్టు పడఁద్రోసిపోఁగా ఉషాకన్యక దుఃఖపడుచుండెను అప్పుడు ద్వారకలో ఏమిజరగెననఁగాను అనితాత్పర్యము.

౪౪౧.—క॥ ద్వారకలో ననిరుద్ధ కు । మారుని పోకకును యదు స ✻ మాజమువగలం
గూరుచు నొకవార్తయు విన । నేరక చింతింప నాల్గు ✻ నెలలరిగె నృపా.

టీ॥ నృపా=రాజా. ద్వారకలోన్=ద్వారకాపట్టణమునందు. అనిరుద్ధకుమారునిపోకకున్ = పసివాఁడైన అనిరుద్ధుని పోవుటకు, యదుసమాజము=యాదవసమూహము, వగలంగూరుచున్=విచారములనొందుచు. ఒకవార్తయున్=ఏవిధమైనవృత్తాంతమును. విన నేరక = వినఁజాలక. చింతింపన్ = దుఃఖించుచుండఁగా. (నాల్గు నెలలు) అరిగెన్=కడచెను—నాల్గునెలలదాఁక యేమి తెలియకుండెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! ద్వారకాపట్టణమునందు యాదవు లందఱును అనిరుద్ధుఁడు కానరాక పోవుటకు విచారమునొందుచు వానివిషయమయిన క్షేమవృత్తాంతము ఏమియు తెలియక దుఃఖపడు చుండఁగా నాలుగు నెలలు జరగెనని తాత్పర్యము. వ॥అయ్యెడ.

## (✻) నారదుం డనిరుద్ధునివృత్తాంతము కృష్ణమూర్తికిఁ జెప్పుట. (✻)

క॥ శారద నిర్మల నీరద
పారదరుచి దేహుఁడతుల ✻ భాగ్యోదయుఁడా
నారదముని యేతెంచె న
పారదయామతి మురారి ✻ భజన ప్రీతిన్.


కృష్ణుఁడు.


నారదుఁడు.

టీ॥ శారద .. దేహుఁడు — శారద = శరత్కాలమునైన. నిర్మల=స్వచ్ఛమయిన. నీరద = మేఘముయొక్కయు. పారద = పాదరసముయొక్కయు. రుచి=కాంతివంటికాంతిగల. దేహుఁడు= దేహముగలవాఁడును, అతులభాగ్యోదయుఁడు = ఈడులేని అదృష్టముయొక్క కలిమిగలవాఁడునునైన. (ఆనారదముని) మురారిభజన ప్రీతిన్=శ్రీకృష్ణుని సేవించుటవలని ప్రీతిచేత. అపారదయామతిన్= మేరలేని దయతోడి బుద్ధితో. ఏతెంచెన్=వచ్చెను.

తా॥ శరత్కాలమేఘమును పాదరసమునుబోలిన స్వచ్ఛమైన దేహముగలవాఁడును, ఈడులేని అదృష్టముగలవాఁడునైన నారద మహాముని శ్రీకృష్ణమూర్తిని సేవించుటయందలి ప్రీతిచేత వచ్చెను అని తాత్పర్యము.

వ॥ ఇట్లు చనుదెంచిన నద్దివ్యమునికి నిర్మలమణి వినిర్మిత సుధర్మాభ్యంతరంబున యదువృష్ణి భోజాంధక వీరులుగొలువం గొలువున్న కమలలోచనుండు ప్రత్యుత్థానంబు చేసి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి సముచిత కనకాసనాసీనుం జేసిన నత్తాపసోత్తముండు పురుషోత్తము నుదాత్త తేజోనిధిం బొగడి యనిరుద్ధు వృత్తాంతంబంతయుఁ దేటపడ నెఱింగించి యప్పుండరీకాక్షునిచేత నామంత్రణంబు వడసి యంతర్ధానంబు నొందెఁ దదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబున దండయాత్రాభిముఖుండై ప్రయాణభేరి వ్రేయించి బలంబుల వెడలింపఁ బడవాళ్లంబనిచి తానును గట్టాయితంబయ్యె నంత.

టీ॥ ఇట్లుచనుదెంచిన=ఈవిధముగావచ్చిన. అద్దివ్యమునికిన్= ఆదేవమునికి. నిర్మల...రంబునన్—నిర్మల = మలినములేని. మణి= రత్నములచేత, వినిర్మిత=చేయఁబడిన. సుధర్మ=సుధర్మయనెడుసభ యొక్క. అభ్యంతరంబునన్ = నడుమ. (యదువృష్ణిభోజాంధక వీరులు) కొలువన్=సేవింపఁగా. కొలువున్న=కొలువుచేయుచున్న. కమలలోచనుండు=శ్రీకృష్ణుఁడు. ప్రత్యుత్థానంబుచేసి=ఎదురుగాని లేచి. అర్ఘ్యపాద్యాదివిధులన్ = అర్ఘ్యము పాద్యము మొదలగు క్రియలచేత. (పూజించి) సముచితకనకాసనాసీనుం జేసినన్=తగిన బంగారుపీఁటమీఁద గూర్చున్నవానిఁగాఁ జేయఁగా. అత్తాపసోత్త ముండు=అఋషిశ్రేష్ఠుఁడు. పురుషోత్తమున్=శ్రీకృష్ణుని. ఉదాత్త

తేజోనిధిన్ = అధిక తేజస్సనకుఁడనికిపట్టయినవాని. (పొగడి) అనిరుద్ధ వృత్తాంతంబు = అనిరుద్ధునియొక్క సమాచారము. (అంతయు) తేట పడన్ = విశదమగునట్లు. ఎఱింగించి = తెలియఁజేసి. అప్పుండరీకాక్షునిచేతన్ = ఆకృష్ణునిచేత. ఆమంత్రణంబువడసి = సెలవుపుచ్చుకొని. అంతర్ధానంబునొందెన్ = కానరాకపోయెను. తదనంతరంబ = వెంటనే. (కృష్ణుండు) శుభముహూర్తంబునన్ = మంచిలగ్నమునందు. దండయాత్రాభిముఖుండై = యుద్ధప్రయాణమునకు మొనసినవాఁడై. ప్రయాణభేరి వేయించి = ప్రయాణమును తెలియఁజేయు పెద్దనగారానువాయింపఁజేసి. బలంబులన్ = సేనలను. వెడలింపన్ = తరలించుటకు. పడవాళ్లన్ = సేనానాయకులను. పనిచి = ఆజ్ఞాపించి. (తానును) కట్టాయితంబయ్యెన్ = మిగుల సిద్ధపడెను. అంతన్ = అంతట.

తా॥ ఈచొప్పున నారదమహాముని ద్వారకాపట్టణమునకువచ్చి సుధర్మయను సభనడుమ దేవేంద్రునివలెనే దేవతలను బోలిన యాదవులు కొలువఁగా కొలువున్న శ్రీకృష్ణమూర్తిని దర్శింపఁగా ఆకృష్ణమూర్తియు సింహాసనమునుండి లేచి యెదుర్కొని అర్ఘ్యము పాద్యము మొదలగు క్రియలచేత నారదమహామునిని పూజించెను నారదమహామునియు ఆపూజను అంగీకరించి కృష్ణమూర్తిని పొగడి అనిరుద్ధుఁడు బాణాసురునిచేత కట్టుపడిన వృత్తాంతమును తెలియఁజేసి అంతర్ధానమయిపోయెను అంతట కృష్ణమూర్తి మంచిముహూర్తమునందు యుద్ధయాత్ర వెడలుచు ప్రయాణభేరి వాయింప నుత్తరవుచేసి సేనానాయకుల నందఱిని తమతమ సేనలను తరలింప ఆజ్ఞాపించి తానును సర్వాలంకారములతో సిద్ధపడినవాఁడయ్యెనని తా


కృష్ణుఁడు.


బలరాముఁడు.











(*) కృష్ణమూర్తి బాణాసురునిపై దండెత్తుట. (*)

౪౪౪.—సీ॥ హార కిరీట కే * యూర కంకణ కట - కాంగుళీయక నూపు * రాది వివిధ
భూషణ ప్రతతిచేఁ * బొలుపారు కరముల - ఘనగదాశంఖ చ * క్రములుదనర
సురభిచందనలిప్త * సురుచిరోరస్థ్సలిఁ - బ్రవిమల కౌస్తుభ * ప్రభలు నిగుడఁ
జెలువారఁ బీత కౌ * శేయచేలముఁ గాశ - వలనుగా రింగులు * వాఱఁ గట్టి



(9)

తే॥ సైన్య సుగ్రీవ మేఘపు * ష్పక వలాహ । కములఁ బూన్చిన తేరాయి * తముగఁ జేసి
దారకుఁడు దెర నెక్కె మో * దంబుతోడ । భానుఁడుదయాచలంబెక్కు * పగిది మెఱయ.

టీ॥ హార... ప్రతతిచేత — హార=ముత్యాలపేరులు. కిరీట = కిరీటము. కేయూర = భుజకీర్తులు. కంకణ = కడియములు. కటక= ముంజేతికడియములు. అంగుళీయక=ఉంగరములు. నూపుర=కాలియందెలు. ఆది=మొదలుగాఁగల. వివిధ భూషణ ప్రతతిచేత = నానావిధములైన ఆభరణములసమూహములచేతను. పొలుపారు= ఒప్పునట్టి. కరములన్ = చేతులందు. ఘనగదాశంఖచక్రములు = గొప్పవైన గద శంఖము చక్రమును. తనరన్=ఒప్పఁగాను.సురభిస్థలిన్—సురభి = మంచివాసనగల. చందన = మంచిగంధముచేత. లిప్త= పూయఁబడిన. సురుచిర = వెలుఁగుచున్న. ఉరస్స్థలిన్= ఱొమ్ముప్రదేశమునందు. ప్రవిమల=మిక్కిలినిర్మలమయిన. కౌస్తుభ ప్రభలు=కౌస్తుభమణికాంతులు. నిగుడన్ = వ్యాపింపఁగా. చెలువారన్=అందగించునట్లు. పీతకౌశేయచేలమున్=పచ్చపట్టువస్త్రమును. కాసెవలనుగాన్=కాసెకట్టువిధముగా. రింగులువాఱన్= చెంగులుప్రేలాడునట్లు. కట్టి=కట్టుకొని. సైన్యసుగ్రీవమేఘపుష్పకవలాహకములన్=సైన్యము సుగ్రీవము మేఘపుష్పము వలాహకము నను గుఱ్ఱములను. పూన్చినతేరు = కట్టినరథమును. ఆయితముగఁ జేసి=సిద్ధముచేసి. భానుఁడు = సూర్యుఁడు. ఉదయాచలంబు = పొడుపుకొండను. ఎక్కుపగిది = ఎక్కునట్టివిధము. మెఱయన్ = తెలియఁబడునట్లు. దారకుఁడు = కృష్ణునిసారథియైన దారకుఁడు అనువాఁడు. మోదంబుతోడన్=సంతోషములో. తేరన్=తేఁగా. ఎక్కెన్=రథముపైనెక్కెను.

తా॥ ముత్యాలహారములు మొదలుగాఁగల ఆభరణములును మంచి గంధపు పూఁతయు అందగింపఁగా వెలుఁగుచున్న ఱొమ్మునందు కౌస్తుభమణి వెలుఁగుచుండఁగా, పట్టుపీతాంబరమును కాసె వోసి చెంగులు ప్రేలాడఁగట్టుకొని కృష్ణుఁడు సిద్ధపడియుండఁగా. సైన్య సుగ్రీవ మేఘ పుష్ప వలాహకములనెడు నాలుగుగుఱ్ఱములను గట్టిన రథమును సిద్ధముచేసి దారకుఁడు తీసుకరాఁగా కృష్ణమూర్తి సూర్యుఁడు ఉదయపర్వతముపై నెక్కినట్లు అరథముపై నెక్కి కూర్చుండెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు రథారోహణంబుచేసి భూసురాశీర్వచనపూతుండును, మహిత దూర్వాంకురాలంకృతుండును, లలిత పుణ్యాంగనా కరకిసలయకలిత శుభాక్షత విన్యాసభాసుర మస్తకుండును, మాగధమంజుల గానానుమోదితుండును, వందిజన సంకీర్తనానందితుండును, పాఠక పఠనరవ వికాసిత హృదయుండునై వెడలు నవసరంబున.

టీ॥ (ఇట్లు) రథారోహణంబుచేసి = తేరెక్కి. భూసురాశీర్వచనపూతుండును=బ్రాహ్మణులదీవనలచేత పరిశుద్ధుఁడును. మహిత దూర్వాంకురాలంకృతుండును = పూజ్యమయిన గఱికమోసులచేత అలంకరింపఁబడినవాఁడును. లలిత... కుండును—లలిత = మనోజ్ఞమయిన. పుణ్యాంగనా=పుణ్యస్త్రీలయొక్క. కరకిసలయ=చిగుళ్లవంటిహస్తములందు. కలిత=కూడుకొన్న. శుభాక్షత=శుభసూచకములైనయక్షింతలయొక్క. విన్యాస = ఉంచుటలచేత. భాసుర= ప్రకాశించునట్టి. మస్తకుండును = తలగలవాఁడును. మాగధ... డును—మాగధ=స్తుతిపాఠకులయొక్క. మంజుల = రమణీయమైన. గాన=పాటలచేత. అనుమోదితుండును = సంతోషించువాఁడును. వందిజన... డును—వందిజన=బిరుదులుగ్గడించువారియొక్క. సంకీర్తన=పొగడ్తలచేత. ఆనందితుండును = సంతోషింపఁజేయఁబడినవాఁడును. పాఠక... హృదయుండును—పాఠక = పాటపాడువారియొక్క. పఠన=పాడుటలయొక్క. రవ = నాదములచేత. వికాసిత = తేటపాటిన. హృదయుండును = మనసుగలవాఁడును. (ఐ) వెడలునవసరంబునన్=బయలుదేఱుసమయమునందు.

తా॥ ఈచొప్పున రథమెక్కి బ్రాహ్మణు లాశీర్వదింపఁగాను, సువాసినులు శుభాక్షతలువేయుచుండఁగాను, వందిమాగధులు బిరుదులుగ్గడించి పొగడుచుండఁగాను, పాఠకులు పాడుచుండఁగాను, సంతోషించినవాఁడై శ్రీకృష్ణుఁడు యుద్ధయాత్ర వెడలెను, ఆసమయమునందని తాత్పర్యము.

౭౭౮.—సీ॥ బలభద్ర సాత్యకి * ప్రద్యుమ్న ముఖయదు - వృష్ణిభోజాంధక * వీరవరులు
దుర్వార పరిపంథి * గర్వభేదన కళా - చతురబాహాబలో * త్సాహలీల
వారణ స్యందన * వాజి సందోహంబు - సవరణసేయించి * సంభ్రమమున
సముచిత ప్రస్థాన * చటులభేరీభూరి - ఘోషమంభోనిధి * ఘోషమడఁప

తే॥ ద్వాదశాక్షౌహిణీ బలో * త్కరములోలి । నడచెఁ గృష్ణునిరథము వె * న్నంటిచెలఁగి
పృథులగతి మున్ భగీరథు * రథము వెనుక । ననుగమించు వియన్నది * ననుకరించి.

టీ॥ బలభద్ర... వరులు—బలభద్ర=బలరాముఁడు. (సాత్యకి) ప్రద్యుమ్న=ప్రద్యుమ్నుఁడు. ముఖ = మొదలుగాఁగల. యదు = యదువంశస్థులును. వృష్ణి=వృష్ణివంశస్థులును. భోజ=భోజవంశస్థులును. అంధక=అంధకవంశస్థులునైన. వీరవరులు=శూరశ్రేష్ఠులు. దుర్వార... లీలన్—దుర్వార=నివారింపశక్యముగాని. పరిపంథి = శత్రువులయొక్క. గర్వ = అహంకారమును. భేదన=భేదించుట యనెడు. కళా=విద్యయందు. చతుర=నేర్పుగల. బాహాబల=భుజబలముతోడి. ఉత్సాహలీలన్=[illegible]గలవిధమున వారణ

...సందోహంబు—వారణ=ఏనుఁగులయు. స్యందన=రథములయు. వాజి=గుఱ్ఱములయు. సందోహంబుల్ = సమూహమును. సవరణ సేయించి=ఆయిత్తముచేయించి. సంభ్రమమునన్=వేగిరపాటుతో. సముచిత...అడఁపన్—సముచిత=తగిన. ప్రస్థాన=యుద్ధయాత్ర కొఱకైన. చటుల=భయంకరమయిన. భేరీ=పెద్దనగారాలయొక్క. భూరి=అధికమయిన. ఘోషము=ధ్వని. అంభోనిధిఘోషము=సముద్రధ్వనిని. అడఁపన్ = క్రిందుపఱుపఁగా. కృష్ణునిరథము వెన్నంటి=శ్రీకృష్ణమూర్తియొక్క రథమువెంబడిని. చెలఁగి=విజృంభించి. పృథులగతిన్=అధికవేగముతో. మున్=మునుపు. భగీరథు రథమువెనుకన్=భగీరథునితేరివెంట. అనుగమించువియన్నదిన్=అనుసరించివచ్చునట్టి ఆకాశగంగను. అనుకరించి=పోలి. ద్వాదశాక్షౌహిణీబలోత్కరములు=పండ్రెండు అక్షౌహిణుల సేనాసమూహములు. ఓలిన్=క్రమముగా. (నడచెను)

తా॥ బలరాముఁడు సాత్యకి ప్రద్యుమ్నుఁడు మొదలుగాఁగల యాదవులును, వృష్ణులును, భోజులును, అంధకులునైన యోధులు అడ్డగింపరాని శత్రువులను అడఁగఁగొట్టునట్టి విద్యయందు నేర్పరులై విడువనిపూనికతో రథగజ తురగపదాతులైన సేనలను ఆయతముచేసికొని వేగిరపాటుతోకదలి యుద్ధయాత్రార్థము వాయింపఁబడిన పెద్ద నగారాలమ్రోఁతలు సముద్రపుమ్రోఁతను మించఁగా మునుపు భగీరథమహారాజు వెంబడి గంగాప్రవాహము వచ్చినవిధమున శ్రీకృష్ణమూర్తి రథమువెంట పండ్రెండు అక్షౌహిణుల దండు వడిగ నడచెనని తాత్పర్యము.

వ॥ ఇవ్విధంబునంగదలి కతిపయప్రయాణంబుల శోణపురంబు చేరంజని వేలాలంఘనంబుచేసి యదువీరులంత.

టీ॥ ఇవ్విధంబునన్=ఈరీతిగా. కదలి=బయలుదేఱి. కతిపయ ప్రయాణంబులన్=కొన్నిప్రయాణములచేత. శోణపురంబు=శోణపట్టణమును. చేరంజని=చేరఁబోయి. వేలాలంఘనంబుచేసి=చెల్లెలికట్టనుదాఁటి. అంతన్=అంతట. యదువీరులు=యాదవయోధులు.

తా॥ ఈరీతిగా యాదవసేనలు బయలుదేఱి కొన్నిప్రయాణములలోనే శోణపట్టణముచేరఁబోయి యెల్లదాఁటియంతటననితా.

౪౪౯.—మ॥ సరిదారామ సరోవరోపవన య * జ్ఞస్థానముల్మాఁపి వే
పరిఖల్పూడిచి యంత్రముల్దునిమి వ * ప్రవ్రాతముల్ ద్రొబ్బి గో
పురముల్గూలఁగఁద్రోచి సౌధభవనం * బుల్ ద్రుంచి ప్రాకారముల్
ధరణింగూల్చి కవాటముల్విఱిచి రు * ద్దండ క్రియా లోలురై.

టీ॥ ఉద్దండక్రియాలోలురై=అహంకారకృత్యములందాసక్తులై. సరిదారామ...స్థానములు—సరిత్=నదులు. ఆరామ=పెంపుడువనములు. సరోవర = కొలఁకులు. ఉపవన = స్త్రీలువిహరింపఁదగిన శృంగారపుఁదోఁటలు. యజ్ఞస్థానములు=యజ్ఞశాలలు. లేక, దేవపూజాస్థానములు. మాఁపి=పాడుచేసి. వే=శీఘ్రముగా. పరిఖలు=అగడ్తలు. (పూడిచి) యంత్రములు = ఉన్నతప్రదేశములకు బరువెక్కించుట మొదలగుకార్యములకు సాధనములైన కీలుగలవస్తువులను. తునిమి=తెగఁగొట్టి. వప్రవ్రాతములు=కోటకొఱుల్ల సమూహమును ద్రొబ్బి=పడఁగొట్టి. గోపురములు = తోరణద్వారములను. కూలఁగఁద్రోచి=పడఁద్రోసి. సౌధభవనంబులు=రాజులనగళ్లను. త్రుంచి=ఇడియఁగొట్టి. ప్రాకారములు=కోటలను. ధరణింగూల్చి=నేలఁబడఁగొట్టి. కవాటములు=తలుపులు. విఱిచిరి=విఱుగఁగొట్టిరి.

తా॥ యాదవులు అహంకారకృత్యములందు ఆసక్తిగలవారై యేఱ్లు పెంపుడువనములు కొలఁకులు ఉద్యానవనములుయజ్ఞశాలలు మొదలయినవానిని పాడుచేసి వెంటనే అగడ్తలుపూడ్చి యంత్రములను తెగఁగొట్టి కోటకొఱుల్లు పడఁగొట్టి గోపురములనుపడఁద్రోసి రాజులనగళ్లను ఇడియఁగొట్టి కోటలను నేల చదరముచేసి తలుపులు పగులఁగొట్టిరి అని తాత్పర్యము.

వ॥ ఇట్లనేకప్రకారంబుల గాసిచేసి పురంబు నిరోధించి పేర్చి యార్చినం జూచి బాణుం డాగ్రహ
సమగ్రోగ్రమూర్తియై సమరసన్నాహ సంరంభ విజృంభమాణుండై సంగరభేరి వ్రేయించిన.

టీ॥ (ఇట్లు) అనేకప్రకారంబులన్=బహువిధములచేత. గాసిచేసి=కలఁతపెట్టి. పురంబున్ = పట్టణమును. నిరోధించి = ముట్టడించి. పేర్చి=విజృంభించి. ఆర్చినన్=బొబ్బలుపెట్టఁగా. (చూచి) బాణుండు = బాణాసురుఁడు. ఆగ్రహసమగ్రోగ్రమూర్తియై—ఆగ్రహ=కోపముయొక్క. సమగ్ర=పరిపూర్తితోడి. ఉగ్ర=భయంకరమయిన. మూర్తియై=ఆకారముగలవాఁడై. సమర...ణుండు—సమర = యుద్ధముకొఱకై. సన్నాహ = ఆయిత్తపాటువలని. సంరంభ = వేగిరపాటుచేత. విజృంభమాణుండై = రేఁగుచున్నవాఁడై. సంగరభేరిన్=యుద్ధపుభేరిని. వ్రేయించినన్=కొట్టింపఁగా

తా॥ ఈప్రకారముగా నానావిధముల పట్టణమును కలఁచిపెట్టి ముట్టడించి రేఁగి బొబ్బలుపెట్టఁగాఁ జూచి బాణాసురుఁడుమిక్కిలి కోపించినవాఁడై భయంకరమయిన ఆకారముతోయుద్ధప్రయత్నమువలనిఆటోపముచేత రేఁగియుద్ధభేరిని మ్రోఁగింపఁగాననితాత్పర్యము

౪౫౦.—సీ॥ ఆచక్రవాళాచ * లాచక్రమంతయు - భ్రమసి కుమ్మరసారె * పగిదిఁ దిరిగ
ఘనఘోణిఖురకోటి * ఘట్టనస్వనముల - కరణి నంభోనిధు * ల్గలఁగిపొరలెఁ
గాలరుద్రాభీల * కరశూల హతిరాలు - పిడుగులగతి నుడు * గణమురాలెఁ
జటులానిలోద్ధూత * శాల్మలీతూలంబు - చాడ్పున మేఘము * ల్చదలఁదూలె

తే॥ గిరులు వడఁకాడె దివిపెల్లు * గిల్లె సురల । గుండెలవిసెర సాతల * క్షోభమొదవె
దిక్కులదరె విమానము * లెరలిచెదరెఁ । గలఁగి గ్రహరాజ చంద్రుల * గతులుదప్పె.

టీ॥ ఆచక్ర...చక్రము—ఆచక్రవాళ=చక్రవాళపర్వత పర్యంతమయిన. అచలాచక్రము=భూమండలము. అంతయున్=సర్వమును. భ్రమసి=తత్తఱిల్లి. కుమ్మరసారెపగిదిన్ = కుమ్మరవాఁడు కుండలు చేయుటకై త్రిప్పుచక్రమువలె. (తిరిగెను) ఘన...కరణిన్—ఘన=గొప్పదైన. ఘోణి=ఆదివరాహముయొక్క. ఖుర=గిట్టలయొక్క. కోటి=కొనలయొక్క. ఘట్టన = అదుముడులయొక్క. స్వనముల కరణిన్=ధ్వనులవలె. అంభోనిధులు=సముద్రములు. కలఁగి=కలఁకనుపొంది—క్రిందుమీఁదుగా అలలులేచి. పొరలెన్=పొర్లెను. కాల...హతిన్ — కాలరుద్ర = ప్రళయకాలపు రుద్రమూర్తియొక్క. అభీల=భయంకరమైన. కర=చేతియందలి. శూల=శూలాయుధపు. హతిన్=దెబ్బచేత. రాలుపిడుగులగతిన్=రాలునట్టిపిడుగులవలె. ఉడుగణము=నక్షత్రసమూహము. (రాలెను) చటుల...ద్భునన్—చటుల=మిక్కిలివడిగల. అనిల=గాలిచేత. ఉద్ధూత=మీఁదికెగురఁగొట్టఁబడిన. శాల్మలీతూలంబుచాడ్పునన్=బూరుగుదూదివిధమున. మేఘములు=మబ్బులు. చదలన్=ఆకాశమునందు. తూలెన్=చెదరిపోయెను. గిరులు=పర్వతములు. వడఁకాడెన్=అదరెను. దివి = ఆకాశము. పెల్లగిల్లెన్=మీఁదికెగిరెను. సురలగుండెలు = దేవతల హృదయములు. అవిసెన్=పగిలెను. రసాతలక్షోభము = పాతాళలోకముయొక్క తిరుగుడుపాటు. ఒదవెన్=కలిగెను. (దిక్కులు అదరెను విమానములు) తెరలి=క్రిందుమీఁదై. చెదరెను=మూలకొకటిగాఁ బోయెను. కలఁగి = కలఁతనొంది. గ్రహరాజచంద్రుల గతులు=సూర్యచంద్రుల గమనములు. తప్పెన్ = తప్పిపోయెను.

తా॥ బాణాసురుఁడు యుద్ధభేరిమ్రోఁగింపఁగానే ఆధ్వనికిచక్రవాళపర్వతపర్యంతమయినభూమియంతయు కుమ్మరిసారెవలెగిరగిర తిరిగెను, ఆదివరాహముయొక్క గిట్టలతాఁకుడుచేత తిరుగుడుపడి పొరలినట్లు సముద్రములు కలఁగి పొర్లెను, ప్రళయకాలపు రుద్రమూర్తిచేతిదైన శూలాయుధపువ్రేటులవలన రాలుపిడుగులేవోయనునట్లు నక్షత్రములు రాలెను, గొప్పగాలిచేత ఎగురఁగొట్టఁబడిన బూరుగుదూదివిధమున ఆకాశమునందు మేఘములు చెదరిపోయెను, పర్వతములు ఉఱ్ఱట్లూఁగెను, ఆకాశము పైకిలేచెను, దేవతలగుండెలు పగిలెను, పాతాళముతిరుగుడుపడెను, దిక్కులుచలించెను, విమానములన్నిచెదరిపోయెను, సూర్యచంద్రులుకలవరపడిగతులు తప్పిరనితా.

వ॥ అట్టి సమర సన్నాహంబునకుఁ గట్టాయితంబైన మణిఖచిత భర్మవర్మ నిర్మిత నిర్మలాంశుజాలంబులును, శిరస్త్రాణ కిరీటకోటి ఘటిత వినూత్నరత్న ప్రభాపటలంబులును, కనక కుండల గ్రైవేయ హార కంకణ తులాకోటి వివిధ భూషణవ్రాత రుచి నిచయంబులును, ప్రచండ బాహుదండ సహస్రంబు వెలుంగ శరశరాసనశక్తి ప్రాసతోమరగదాకుంతముసల ముద్గరభిండివాల కరవాల పట్టిసశూలక్షురికా పరిఘాది నిశాత హేతి వ్రాతాతి దీధితులును, వియచ్చరకోటి నేత్రంబులకు మిఱుమిట్లుగొలుపఁ గనకాచల శృంగ సముత్తుంగంబగు రథంబెక్కి యరాతివాహినీ సందోహంబునకుం దుల్యంబైన నిజ సేనా సమూహంబు లిరుగడల నడవ బాణుం డక్షీణప్రతాపంబు దీపింప ననికి వెడలె నయ్యవసరంబున.

టీ॥ అట్టిసమరసన్నాహంబునకున్=అటువంటి యుద్ధప్రయత్నమునకు. కట్టాయితంబైన = మిక్కిలి ఆయిత్తమయిన. మణి ... జాలంబులును—మణిఖచిత=రత్నములుచెక్కిన. భర్మవర్మ=బంగారు కవచములచేత. నిర్మిత=కలుగఁజేయఁబడిన. నిర్మల=స్వచ్ఛమైన. అంశుజాలంబులును=కిరణములసమూహములును. శిరస్త్రాణ...పటలంబులును—శిరస్త్రాణ=తలపాగాలయందును. కిరీట=కిరీటములయొక్క. కోటి=మీఁదిభాగములందును. ఘటిత=కూర్పఁబడిన. వినూత్న=మిక్కిలిక్రొత్తలైన. రత్న=మణులయొక్క. ప్రభా=కాంతులయొక్క. పటలంబులును = సమూహములును, కనక...బులును — కనక = బంగారుమయములైన. కుండల=చెవిప్రోఁగులు. గ్రైవేయ=కంఠాభరణములు. హార=ముత్యాలపేరులు. కంకణ = చేతికడియములు. తులాకోటి=కాలియందెలునెడు. వివిధ = నానావిధములయిన. భూషణ=సొమ్ములయొక్క. వ్రాత=సమూహముయొక్క. రుచి = కాంతులయొక్క. నిచయంబులును = సమూహములును. ప్రచండ ...సహస్రంబును—ప్రచండ=మిక్కిలిబిరుసులైన. బాహుదండ = కఱ్ఱలవంటి చేతులయొక్క. సహస్రంబు = వేయియును — మిగుల బిరుసులయిన వేయిచేతులుననుట. వెలుంగన్ = ప్రకాశింపఁగా. శర...లును—శర=బాణములు. శరాసన=విండ్లు. శక్తి=గంటలుగట్టిన ఒకవిధమైనబాణములు. ప్రాస=బల్లెములు. తోమర=చిల్లకోలలు. గదా=గుదియలు. కుంత=ఈఁటెలు. ముసల=రోఁకఁడ్లు. ముద్గర=ఇనుపగుదియలు. భిండివాల=విడిచివాఁటుగుదియలు. కరవాల=కత్తులు. పట్టిస = పట్టెలుదీరిన యినుపగుదియలు. శూల=మూఁడుమొనలుగల ఆయుధములు. క్షురికా=చురకత్తులు. పరిఘ=ఇనుపకట్లగుదియలు. ఆది=మొదలుగాఁగల. నిశాత=వాఁడులైన. హేతి=ఆయుధములయొక్క. వ్రాత=సమూహములయొక్క. అతి=మిక్కుటమయిన. దీధితులును=కాంతులును. వియచ్చరకోటినేత్రంబులకున్=దేవతలసమూహము కన్నులకు. మిఱుమిట్లుగొలుపన్=చెదరుటలను కలుగఁజేయఁగా. కనకాచలశృంగసముత్తుంగంబు=మేరుపర్వతశిఖరమువలె మిక్కిలియున్నతమయినది. అగురథంబు=అగునట్టితేరు. (ఎక్కి) అరాతివాహినీసందోహంబునకున్ = శత్రుసేనలసమూహమునకు. తుల్యంబు = సమానము. అయిననిజసేనాసమూహంబులు=అయినట్టి తనసేనలయొక్క సముదాయములు. ఇరుగడలన్ = రెండుపార్శ్వములందును. నడవన్ = నడవఁగా. బాణుండు=బాణాసురుఁడు. అక్షీణప్రతాపంబు=తగ్గనిపరాక్రమము. దీపింపన్=వెలుఁగగా. అనికిన్=యుద్ధమునకు. వెడలెన్=బయలుదేరెను. అయ్యవసరంబునన్=అప్పుడు.

తా॥ అట్టి యుద్ధప్రయత్నమునకు తగినట్టు రత్నములు చెక్కిన బంగారుకవచము కాంతులును, రత్నములుకూర్చిన తలపాగా కిరీటము మొదలగువానికాంతులును, చెవిపోఁగులు మొదలగు ఆభరణములకాంతులును, పెక్కుయుద్ధములందు గడిదేఱి బిరుసుపాటిన వేయిచేతులును, వెలుఁగఁగా ధనుస్సు బాణములు కత్తులు కటార్లు మొదలగు ఆయుధములకాంతులు దేవతలకన్నులు మూఁతలు పడునట్లుచేయుచు ఎల్లదిక్కులందును వ్యాపింపఁగా మేరుపర్వత శిఖరమో అనునట్లు మిక్కిలిపొడువైన రథముపైనెక్కి తనయిరుప్రక్కలను శత్రుసేనలతో సరిపోలఁజాలిన సేనాజనులు నడవఁగా బాణాసురుఁడు యుద్ధమునకు వెడలెనని తాత్పర్యము.



కూపకర్ణుఁడు.



శివుఁడు.



బాణాసురుఁడు.



బలుఁడు.



కుంభాండుఁడు.









(*) బాణాసురుఁడు కృష్ణునితోఁడి యుద్ధమునకు వెడలుట. (*)

౨౫౭.—చ॥ వరదుఁ డుదారభక్తజన * వత్సలుఁడైన హరుండు బాణునిం
గరమనురక్తి నాత్మజుల * కంటె దయామతిఁ జూచుఁగానఁదా
దురమొనరించు వేడ్కఁ బ్రమ * థుల్గుహుఁడున్నిజ భూతకోటియుఁ
సరవిభజింప నుజ్వల ని * శాత భయంకర శూలహస్తుఁడై.

టీ॥ వరదుఁడు=కోరినవరములనిచ్చువాఁడును. ఉదారభక్తజనవత్సలుఁడు—ఉదార=సరళమయిన. భక్తజన=సేవకజనులయందు. వత్సలుఁడు=ప్రేమగలవాఁడును. పినహరుండు=అయినట్టిశివుఁడు. బాణునిన్ = బాణాసురుని. కరమనురక్తిన్ = మిక్కిలియనురాగముతో. ఆత్మజులకంటెన్ = కొడుకులకంటెను. దయామతిన్ = దయతోడిబుద్ధితో. చూచుఁగాన్=కనిపెట్టియుండునుకాఁబట్టి. తాన్=తాను. మరము=యుద్ధము. ఒనరించువేడ్కన్ = చేయుటయందలి కుతూహలముతో. ప్రమథులు = ప్రమథ గణమును. గుహుఁడున్=కుమారస్వామియు. నిజభూతకోటియున్ = తన్నునాశ్రయించియుండు పిశాచసమూహమును. సరవిన్=క్రమముగా. భజింపన్=సేవింపఁగా. ఉజ్జ్వలనిశాతభయంకరశూలహస్తుఁడై — ఉజ్జ్వల = వెలుఁగుచున్న. నిశాత = వాఁడియైన. భయంకర = భయముపుట్టించుచున్న. శూలహస్తుఁడై=శూలము చేతియందుఁగలవాఁడై. వెడలెనన్క్రియ మీఁదిపద్యములోనున్నది.

తా॥ కోరినవరములనిచ్చిప్రియభక్తుల ఆదరించువాఁడైనశివుఁడు బాణాసురుని తనకొ ...లకం ...టె మిక్కిలి ప్రేమతోఁ గాపాడుచుండును కాఁబట్టి త...పు వానికిఁగాను యుద్ధముచేయవలెనను కుతూహలముతో ప్రమథగణములును, పిశాచసమూహములును, కుమారస్వామియు తన్ను అనుసరించిసేవింపఁగా భయంకరమయి వెలుఁగుచున్నత్రిశూలమునుచేతఁబట్టుకొన్నవాఁడైఅనితాత్పర్యము.

౪౫౩.—సీ॥ ఖురపుటాహతి రేఁగు * ధరణీపరాగంబు - పంకేరుహాప్తబిం * బంబుఁబొదువ
విపుల వాలాటోప * విక్షేపజాత వా - తాహతి వారివా * హములు విరియఁ
గుఱుచతిన్ననివాఁడి * కొమ్ములఁజిమ్మిన - బ్రహ్మాండభాండక * ర్పరము వగుల
నలవోక ఖణిఖణి * ల్లని అంకె వేసిన - రోదసీ కుహరంబు * భేదిలంగ

తే॥ గళచలద్భర్మ ఘంటికా * ఘణఘణ ప్ర ॥ ఘోషమున దిక్తటంబు లా * కులతనొంద
లీలనడతెంచు కలధౌత * శైలమనఁగ ॥ నుక్కుమిగిలిన వృషభేంద్రు * నెక్కి వెడలె.

టీ॥ ఖురపుటాహతిన్=గిట్టలతాఁకుడుచేత. రేఁగుధరణీపరాగంబు = పైకెగయునట్టి నేలదుమ్ము. పంకేరుహాప్తబింబంబున్ = సూర్యబింబమును. పొదువన్=కమ్ముకొనఁగా. విపుల...హతిన్—విపుల=నిడుపైన. వాల=తోఁకయొక్క. ఆటోప = సంభ్రమముతోడి. విక్షేప=ఎగఁద్రిప్పుటవలన. జాత=పుట్టిన. వాత = గాలియొక్క. ఆహతిన్ = దెబ్బచేత. వారివాహములు = మేఘములు. విరియన్ = విచ్చఁబాఱిపోఁగా. కుఱుచతిన్ననివాఁడికొమ్ములన్—కుఱుచ=పొట్టియు. తిన్నని=వంపులేనిదియు. వాఁడి=సన్నని మొనగలవియునైన. కొమ్ములన్ = కొమ్ములచేత. చిమ్మినన్ = ఎగఁజిమ్మఁగా. బ్రహ్మాండభాండకర్పరము = బ్రహ్మాండమనెడు కుండయొక్కమీఁదిచిప్ప. పగులన్=పగిలిపోఁగా. అలవోకన్=వినోదముగా. ఖణిఖణిల్లని=ఖణిల్లుఖణిల్లని. అంకెవేసినన్=ధ్వనిచేయఁగా. రోదసీకుహరంబు = భూమ్యాకాశమధ్యప్రదేశమనెడుగుహ. భేదిలంగన్=బ్రద్దలుకాఁగా. గళ...షమునన్—గళ = మెడయందు. చలత్=కదలుచున్న. భర్మ=బంగారువికారమయిన. ఘంటికా=గంటలయొక్క. ఘణఘణప్రఘోషమునన్ = గణగణయనుధ్వనిచేత. దిక్తటంబులు = దిక్కులప్రదేశములు. ఆకులతన్ = కలఁతపాటును. ఒందన్=పొందఁగా. లీలన్=విలాసముగా. నడతెంచు=నడచునట్టి. కలధౌతశైలము=వెండికొండయో. అనఁగన్ = అనునట్లు. ఉక్కుమిగిలిన=బలముమించిన—క్రొవ్విన. వృషభేంద్రున్ = ఆఁబోతును. (ఎక్కి) వెడలెన్=బయలుదేఱెను.

తా॥ గిట్టల తాఁకుడుచేత నేల దుమ్మెగసి సూర్యబింబమును కమ్ముకొనఁగా, పైకి నిక్కించిన తోఁక జాడించుటవలని గాలిచేత మేఘములు చెదరిపోవుచుండఁగా, వాఁడిగలకుఱుచ నిక్కుకొమ్ములు సోఁకి బ్రహ్మాండముయొక్క మీఁదిచిప్ప పగులఁగా, ఖణిల్లుఖణిల్లని అంకెలువేయు ధ్వనిచేత భూమ్యాకాశమధ్యప్రదేశము భేదిల్లఁగా, మెడను గట్టఁబడిన బంగారుగంటల గణగణయనుమ్రోఁతే దిక్ప్రదేశములందువ్యాపించి కలఁతపుట్టింపఁగా, వినోదముగా నడచునట్టి వెండికొండయో అనునట్లు మదముమించిన ఆఁబోతునెక్కి శివుఁడు బయలుదేఱెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు వెడలి సమరసన్నాహ సముల్లాసంబు మొగంబులకు వికాసంబు సంపాదింపం బ్రతిపక్ష బలంబులతోడం దలపడిన ద్వంద్వయుద్ధంబయ్యె నప్పుడప్పురాతనయోధుల యాయోధనంబుచూచు వేడ్కం జనుదెంచిన సరసిజసంభవ శక్ర సురయక్ష సిద్ధ సాధ్య చారణ గంధర్వ కిన్నర కింపురుష గరుడోరగాదులు నిజవిమానారూఢులై వియత్తలంబుననిల్చి రట్టియెడఁ గృష్ణుండును హరుండును, మారుండును గుమారుండును, గూపకర్ణ కుంభాండులును గామపాలుండును, బాణపుత్రుండగు బలుండును సాంబుండును, సాత్యకియును బాణుండును, రథికులు రథికులు, నాశ్వికులు నాశ్వికులును, గజారోహకులు గజారోహకులును, బదాతులుఁ బదాతులునుం దలపడి యితరేతర హేతి సంఘట్టనంబుల మిణుంగుఱులు చెదరం బరస్పరాహ్వాన బిరుదాంకిత సింహనాద హుంకార శింజినీ టంకార వారణ ఘీంకార వాజిహేషా రవంబులను, బటహ కాహళ భేరీ మృదంగ శంఖ తూర్య ఘోషంబులను బ్రహ్మాండ కోటరంబు పరిస్ఫోటితంబయ్యె నయ్యవసరంబున.

టీ॥ (ఇట్లు) వెడలి = బయలుదేఱి. సమరసన్నాహసముల్లాసంబు=యుద్ధప్రయత్నముయొక్కయుత్సాహము. మొగంబులకున్=ముఖములకు. వికాసంబున్ = తేటఁదనమును. సంపాదింపన్=కలుగఁజేయఁగా. ప్రతిపక్షబలంబులతోడన్=శత్రుసేనలతో. తలపడినన్=మారుకొనఁగా. ద్వంద్వయుద్ధంబయ్యెన్ = జతజతగాఁగూడినయోధులు చేయుయుద్ధము. (అయ్యెను అప్పుడు) అప్పురాతనయోధులయాయోధనంబు=ఆబహుదినములనాఁటి యుద్ధశూరుల యుద్ధమును—శివకేశవులయుద్ధమును. చూచువేడ్కన్=చూడవలెననువేడుకచేత. చనుదెంచిన=వచ్చిన. సర...దులు—సరసిజసంభవ=బ్రహ్మ. శక్ర=ఇంద్రుఁడు. సుర=దేవతలు. యక్ష=యక్షులు. సిద్ధ=సిద్ధులు. సాధ్య=సాధ్యులు. చారణ=చారణులు. గంధర్వ=గంధర్వులు. కిన్నర=కిన్నరులు. కింపురుష=కింపురుషులు. గరుడ=గరుడులు. ఉరగ=నాగులు. ఆదులు=మొదలగువారు. నిజవిమానారూఢులైన=తమవిమానములందెక్కినవారై. వియత్తలంబునన్=ఆకాశప్రదేశమునందు. (నిల్చిరి) అట్టియెడన్ = ఆసమయమునందు. (కృష్ణుండును హరుండును) మారుండునుగుమారుండును = ప్రద్యుమ్నుఁడును కుమారస్వామియు. కూపకర్ణకుంభాండులునుగామపాలుండును = కూపకర్ణుఁడు కుంభాండుఁడు అనువారును బలరాముఁడును. బాణపుత్రుండగు బలుండును సాంబుండును = బాణాసురునికొడుకైన బలుఁడు అనువాఁడును కృష్ణునికొడుకుసాంబుఁడును. (సాత్యకియు బాణుండును) రథికులురథికులు=రథముమీఁదనుండియుద్ధముచేయువారును రథముమీఁదనుండి యుద్ధముచేయువారును. ఆశ్వికులునాశ్వికులును=గుఱ్ఱపురౌతులు గుఱ్ఱపురౌతులును. గజారోహకులు గజారోహకులును = ఏనుఁగులనెక్కి పోరాడువారును ఏనుఁగులనెక్కి పోరాడువారును. పదాతులుఁబదాతులును=కాలిబంట్లు కాలిబంట్లును తలపడి=మార్కొని. ఇతరేతరహేతిసంఘట్టనంబులన్=ఒండొరుల యాయుధముల మోఁదులచేతను. మిడుంగుఱులుచెదరన్=నిప్పురవ లెగయఁగా. పరస్పరా...రవంబులను — పరస్పర = ఒండొరుల యొక్క. ఆహ్వాన=పిలుచుటలచేతను. బిరుదాంకిత = బిరుదుగుఱుతులచేతను. సింహనాద=బొబ్బరింతలచేతను. హుంకార=హుం అనుధ్వనులచేతను. శింజనీటంకార = అల్లెత్రాళ్ల టం అను ధ్వనులచేతను. వారణ = ఏనుఁగులయొక్క. ఘీంకార = గీఁకలచేతను. వాజి = గుఱ్ఱములయొక్క. హేషా = సకిలింతలయొక్క. రవంబులన్ = ధ్వనులచేతను. పటహ...ఘోషంబులను — పటహ = పటహములను వాద్యవిశేషములయు. కాహళ=కాళెలయు. భేరీ = పెద్దనగారాలయు. మృదంగ=మద్దెలలయు. శంఖ=శంఖములయు. తూర్య=తక్కినవాద్యములయు. ఘోషంబులన్ = ధ్వనులచేతను. బ్రహ్మాండకోటరంబు = బ్రహ్మాండమనెడు తొఱ్ఱ. పరిస్ఫోటితంబయ్యెన్=భేదింపఁబడినదాయెను. అయ్యవసరంబునన్=అప్పుడు.

తా॥ అట్లు శివుఁడు యుద్ధమునకు బయలుదేఱి యిరుదెగలసేనలును తలపడఁగా వారలకు ద్వంద్వయుద్ధమాయెను ఆయుద్ధమును చూడవలెనను అపేక్షచేత బ్రహ్మ ఇంద్రుఁడు దేవతలు యక్షరాక్షసాదిదేవతాభేదములు విమానము లెక్కివచ్చి ఆకాశమునందు నిలిచిరి అప్పుడు కృష్ణుఁడును శివుఁడును, ప్రద్యుమ్నుఁడును కుమారస్వామియు, కూపకర్ణ కుంభాండులును బలరాముఁడును, బాణాసురునికొడుకైనబలుఁడును కృష్ణునికొడుకైన సాంబుఁడును, సాత్యకియు బాణాసురుఁడును, ఇట్లు తక్కినయోధులును, మఱియునుంగల రథికులురథికులును, రౌతులు రౌతులును, మావటివాండ్రు మావటివాండ్రును, కాలిబంట్లు కాఁలిబంట్లునుగా పరస్పరముతలపడి ఒకరినొకరుపిలుచుట, తమతమ బిరుదులు చెప్పకొనుట, సింహనాదములు చేయుట, అల్లెత్రాళ్లు లాగివిడుచుట, ఏనుఁగులు గీఁకలు పెట్టుట, గుఱ్ఱములు సకిలించుట, శంఖములు పూరించుట, మద్దెలలోనగు వాద్యములుమ్రోయించుట, పెద్దనగారాలుమ్రోఁగించుట మొదలగు ధ్వనులచేత బ్రహ్మాండమనెడుతొఱ్ఱపగిలిబ్రద్దలయ్యెనని తాత్పర్యము.

## (*) శ్రీకృష్ణమూర్తి శివునితో యుద్ధము చేయుట. (*)

చ॥ జలరుహనాభుఁ డార్చి నిజ *
శార్ఙ్గ శరాసన ముక్త సాయకా
వలి నిగిడించి నొంచెఁ బుర *
వైరిపురోగములన్ రణక్రియా
కలితుల గుహ్యక ప్రమథ *
కర్బుర భూత పిశాచ డాకినీ
బలవదరాతి యోధులను *
బమ్మెరపోయి కలంగి పాఱఁగన్.

శివుఁడు.



కృష్ణుఁడు.



టీ॥ జలరుహనాభుఁడు=కృష్ణుఁడు. ఆర్చి = బొబ్బపెట్టి. నిజశార్ఙ్గ...వలిన్—నిజ=తనయొక్క. శార్ఙ్గశరాసన = శార్ఙ్గమనెడు వింటినుండి. ముక్త = విడువఁబడిన. సాయకావలిన్=బాణముల పజ్క్తిని. నిగిడించి = వ్యాపింపఁజేసి. పురవైరిపురోగములన్ =

శివుఁడు మొదలగువారిని. రణక్రియాకలితులన్ = యుద్ధకార్యముతోఁ గూడుకొన్నవారిని. గుహ్యక...యోధులన్—గుహ్యక = గుహ్యకులు. ప్రమథ=ప్రమథగణము. కర్బుర=రాక్షసులు. భూత=భూతములు. పిశాచ=పిశాచములు. డాకినీ=డాకినులను పిశాచములునైన. బలవదరాతియోధులన్ = బలవంతులయిన శత్రుభటులను. బమ్మెరపోయి = తత్తఱపడి. కలంగి = కలఁతనొంది. పాఱఁగన్=పరుగెత్తునట్టుగా. నొంచెన్=నొప్పించెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి తనధనుస్సువలననుండి విడువఁబడిన బాణములనువ్యాపింపఁజేసి శివుఁడునుఅతనిసేనలోనియోధులును కలఁతనొంది తత్తఱపాటుతో పరుగెత్తునట్టుగా నొప్పించి తఱిమెననితా.

వ॥ ఇట్లేసియార్చిన కుంభినీధరు భుజావిజృంభణ సంరంభంబునకు సహింపక నిటలాంబకుం డనలకణంబు లుమియు నిశితాంబకంబులం బీతాంబరుని నేసినవానినన్నింటినడుమనం బ్రతిబాణంబు లేసి త్రుంచినం గనుంగొని మఱియును.

టీ॥ (ఇట్లు) ఏసి=బాణములనుప్రయోగించి. ఆర్చినన్=సింహనాదముచేయఁగా. కుంభినీధరు...భంబునకున్ — కుంభినీధరు = శ్రీకృష్ణమూర్తియొక్క. భుజావిజృంభణ = చేతులరేఁగుటయొక్క. సంరంభంబునకున్ = ఆటోపమునకు. సహింపక = ఓర్వక. నిటలాంబకుండు=నొసటకన్నుగలవాఁడైనశివుఁడు. అనలకణంబులు=నిప్పురవలను. ఉమియు=రాల్చుచున్న. నిశితాంబకంబులన్=వాఁడియైనబాణములచేత. పీతాంబరునిన్=పచ్చని వస్త్రముగలవాఁడైన శ్రీకృష్ణునిపై. ఏసినన్ = బాణప్రయోగము చేయఁగా. వానినన్నింటిన్=ఆప్రయోగించిన బాణములనన్నిటిని. నడుమన=నడమంత్రముననే. ప్రతిబాణంబులు=బదులుబాణములను.ఏసి=ప్రయోగించి.త్రుంచినన్=తెగనఱకఁగా.కనుంగొని=చూచి.(మఱియును)

తా॥ ఈవిధముగా బాణములను ప్రయోగించి సింహనాదము చేయఁగా శ్రీకృష్ణమూర్తియొక్క భుజ పరాక్రమాతిశయమునకు సహింపనివాఁడై శివుఁడును నిప్పు రవలు రాల్చుచున్న వాఁడిబాణములను కృష్ణునిపైఁ బ్రయోగించెను అంతట శ్రీకృష్ణమూర్తి బదులు బాణములను ప్రయోగించి ఆబాణములను నడుమంత్రముననే తెగనఱకివేసెను అందులకు శివుఁడు సహింపనివాఁడై యింకను ఏమి చేసెననఁగానని తాత్పర్యము.

౭౫౭.—మ॥ అనలాక్షుండు త్రిలోకపూజ్యమగు బ్ర * హ్మాస్త్రం బఱింబోసి యా
వనజాక్షుమీఁదఁ గ్రోధ మహిమా * వ్యాకీర్ణుఁడై యేసె నే
సినఁ దద్దివ్యశరంబుచేతనె మర * ల్చెన్ గృష్ణుఁ డత్యుద్ధతిన్
జనితాశ్చర్య రసాబ్ధిమగ్ను లగుచున్ * శక్రాదు లగ్గింపఁగన్.

టీ॥ అనలాక్షుండు = అగ్నినేత్రముగల శివుఁడు. త్రిలోకపూజ్యము=మూఁడులోకములలోను పూజింపఁదగినది. అగుబ్రహ్మాస్త్రంబు = అగునట్టిబ్రహ్మాస్త్రమును. అఱింబోసి = నారియందుఁగూర్చి. క్రోధమహిమావ్యాకీర్ణుఁడై=కోపముయొక్క ఆధిక్యమును వ్యాపింపఁజేయుచున్నవాఁడై. ఆవనజాక్షుమీఁదన్=ఆ శ్రీకృష్ణమూర్తిపైని. ఏసెన్ = ప్రయోగించెను.(ఏసినను కృష్ణుఁడు) అత్యుద్ధతిన్=మిక్కుటమయిననిక్కుతో. శక్రాదులు=ఇంద్రుఁడు మొదలగువారు. జనితా...లగుచున్—జనిత=పుట్టిన. ఆశ్చర్యరసాబ్ధి=ఆశ్చర్యరససముద్రమునందు.మగ్నులు= మునిఁగినవారు.అగుచున్=అయి. అగ్గింపఁగన్=శ్లాఘింపఁగా.తద్దివ్యశరంబుచేతనె=ఆదివ్యమయినబాణముచేతనే. మరల్చెన్=మరలించెను.

తా॥ శివుఁడు మూఁడులోకములందును గౌరవమును వహించినదైన బ్రహ్మాస్త్రమును నారియందుఁగూర్చి కోపాటోపముతో శ్రీకృష్ణునిపై ప్రయోగింపఁగా అతఁడు ఆయస్త్రమునే ప్రయోగించి యింద్రుఁడు మొదలుగాఁగలదేవతలెల్లను శ్లాఘించునట్లు ఆబ్రహ్మాస్త్రమును త్రిప్పివేసెనని తాత్పర్యము.

౭౫౮.—శా॥ వాయవ్యాస్త్రము పేంద్రుపై నలిగి దు * ర్వారోద్ధతిన్నేయ దై
తేయధ్వంసియుఁ బార్వతాశుగముచే * ద్రెంచెం గ్రతుధ్వంసి యా
గ్నేయాస్త్రం బడరించె నుగ్రగతి ల * క్ష్మీనాథుపై దాని వే
మాయం జేసెను నైంద్రబాణమునఁ బ * ద్మాక్షుండు లీలాగతిన్.

టీ॥ అలిగి = శివుఁడుకోపించి. (వాయవ్యాస్త్రమును) ఉపేంద్రుపైన్=కృష్ణునిమీఁద. దుర్వారోద్ధతిన్=అడ్డగింపరానినిక్కుతో. ఏయన్=ప్రయోగింపఁగా. దైతేయధ్వంసియున్ = కృష్ణుఁడును. పార్వతాశుగముచేన్=పర్వతాస్త్రముచేత. త్రెంచెన్ = ఖండించెను. లక్ష్మీనాథుపైన్=శ్రీకృష్ణునిమీఁద. క్రతుధ్వంసి = శివుఁడు. ఉగ్రగతిన్=భయంకరమయినరీతితో. ఆగ్నేయాస్త్రంబు=ఆగ్నేయాస్త్రమును. అడరించెన్=ప్రయోగించెను.దానిన్=ఆయాగ్నేయాస్త్రమును. పద్మాక్షుండు=కృష్ణుఁడు. లీలాగతిన్=వినోదరీతిచేత. ఐంద్రబాణమునన్ = ఐంద్రాస్త్రముచేత. వే = శీఘ్రముగ. మాయంజేసెన్=నశింపఁజేసెను.

తా॥ అంతట శివుఁడు కోపించినవాఁడై మిక్కిలియుద్ధతితో వాయవ్యాస్త్రమును కృష్ణునిపై ప్రయోగింపఁగా కృష్ణుఁడు పర్వతాస్త్రముచేత దానిని అణఁగఁగొట్టెను వెంటనే శివుఁడు భయంకరముగాఁ దోఁచునట్లు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను కృష్ణుఁడు దానినిసైతము ఐంద్రాస్త్రమును ప్రయోగించి శీఘ్రముగాను అలక్ష్యముగాను అణఁగఁగొట్టి వేసేనని తాత్పర్యము.

౮౫౯.—ఉ॥ పాయనికిన్కతో హరుఁడు * పాశుపతాస్త్రము నారిఁగూర్చినన్
దోయరుహాయతాక్షుఁడును * దోడన లోకభయంకరోగ్ర నా
రాయణబాణరాజము ర * యంబున నేసి మరల్చె దానిఁ జ
క్రాయుధుఁ డిత్తెఱంగునఁ బు * రారి శరావలి రూపుమాపినన్.

టీ॥ హరుఁడు=శివుఁడు. పాయనికిన్కతోన్=తొలఁగనికోపములో. పాశుపతాస్త్రమున్=పశుపతి సంబంధమైన అస్త్రమును. నారిఁగూర్చినన్=నారియందుఁ గూర్పఁగా. తోయరుహాయతాక్షుఁడును=శ్రీకృష్ణమూర్తియు. తోడన=వెంటనే. లోకభయంకరోగ్రనారాయణబాణరాజమున్ = మూడులోకములకును భీతిని పుట్టించునదియు, మిగుల క్రూరమైనదియునైన నారాయణాస్త్రమును. రయంబునన్=శీఘ్రముగ. ఏసి=ప్రయోగించి. దానిన్=ఆపాశుపతాస్త్రమును. మరల్చెన్=మళ్లించెను. ఇత్తెఱంగునన్=ఈవిధముగా. చక్రాయుధుఁడు=కృష్ణుఁడు. పురారిశరావలిన్ = శివుని బాణసమూహమును. రూపుమాపినన్ = స్వరూపనాశము చేయఁగా.

తా॥ పిమ్మట శివుఁడు అధిక కోపముతో పాశుపతాస్త్రమును ప్రయోగింపఁగా కృష్ణుఁడు నారాయణాస్త్రమును ప్రయోగించి దానిని అణఁచివేసెను, ఈవిధముగ కృష్ణుఁడు శివుఁడు ప్రయోగించు బాణముల నన్నిటిని స్వరూపము లేకుండ అణఁచివేయఁగా నని తాత్పర్యము.

౮౬౦.—క॥ ఊహ కలంగియు విగతో । త్సాహుండగు హరునిమీఁద * జలజాక్షుఁడు స
మ్మోహన శిలీముఖం బ । వ్యాహత జయశాలి యగుచు * నడరించె నృపా.

టీ॥ నృపా=రాజా. ఊహ కలంగియున్ = చిత్తము చలించియు. విగతోత్సాహుండు=ఉత్సాహము చెడినవాఁడు. (అగు హరునిమీఁద) జలజాక్షుఁడు=కృష్ణుఁడు. సమ్మోహనశిలీముఖంబు=సమ్మోహనాస్త్రమును. అవ్యాహత జయశాలి యగుచున్ = కొట్టు వడని గెలుపుచేత ఒప్పినవాఁడగుచును. అడరించెన్ = ప్రయోగించెను.

తా॥ ఓ పరీక్షిన్మహారాజా! ఇట్లు తనయస్త్రములన్ని వ్యర్థములై పోఁగా కలవరపడియున్న శివునిమీఁద మొక్కపోని గెలుపుచేత ఒప్పినవాఁడైన శ్రీకృష్ణమూర్తి సమ్మోహనాస్త్రమును ప్రయోగించెనని తా.

౮౬౧.—క॥ జృంభణ శరపాతముచే । శంభుఁడు నిజతనువు పరవ * శంబయి సోలన్
జృంభితుఁడై ఘననిద్రా । రంభత వృషభేంద్రు మూఁపు * రముపై వ్రాలెన్.

టీ॥ జృంభణశరపాతముచేన్ = సమ్మోహనాస్త్రముయొక్క పాటుచేత. శంభుఁడు=శివుఁడు. నిజతనువు = తనదేహము. పరవశంబయి = స్వాధీనత తప్పి. సోలన్ = చేష్టలు తక్కిపడఁగా. జృంభితుఁడై=ఆవులింతలు గలవాఁడై. ఘననిద్రారంభతన్ = అధికనిద్రయొక్క పూనికచేత. వృషభేంద్రు మూఁపురముపైన్ = నంది యొక్క మూఁపురముమీఁద. వ్రాలెన్=పడెను — మూర్ఛిల్లెననుట.

తా॥ శ్రీకృష్ణమూర్తి ప్రయోగించిన సమ్మోహనాస్త్రము తాఁకఁగానే శివుఁడు తనదేహము తనకు వశము గాక వ్రేలఁబడఁగా ఆవులించుచు మిక్కుటమయిన నిద్రను పొందినవాఁడై నందివాహనము మూఁపుమీఁద పడెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు వ్రాలినం జక్రపాణి పరబలంబుల నిశితబాణపరంపరలం దునిమియు నొక్కయెడం గృపాణంబులం గణికలు చేసియు నొక్కచోఁ గదాహతులం దుత్తుమురుగా మొత్తియు నివ్విధంబునఁ బీనుంగుపెంటలు గావించె నంత.

టీ॥ (ఇట్లు) వ్రాలినన్ = శివుఁడు పడఁగానే. చక్రపాణి=కృష్ణుఁడు. పరబలంబులన్=శత్రుసేనలను. నిశితబాణపరంపరలన్=వాఁడియైన బాణముల గుంపులచేత. తునిమియున్=ఖండించియు. ఒక్కయెడన్=ఒకచోట. కృపాణంబులన్=కత్తులచేత. కణికలు చేసియున్=తునుకలు తునుకలుగాఁ జేసియు. ఒక్కచోన్=మఱియొకచోట. గదాహతులన్=గదమోఁదులచేత. తుత్తుమురుగాన్=పొడిపొడి యగునట్టుగా. (మొత్తియు) ఇవ్విధంబునన్=ఈరీతిగా. (పీనుంగుపెంటలు) కావించెన్=చేసెను. అంతన్=అనంతరము.

తా॥ ఈవిధముగా శివుఁడు పడిపోయినంతట కృష్ణుఁడు శత్రుసేనలను బాణములు ప్రయోగించి చంపియు, కత్తులతో తుండ్లు తుండ్లుగా నఱికియు, గదలతో పొడిపొడిగా నలియఁగొట్టియు, పీనుఁగు పెంటలుగాఁ జేసెను అని తాత్పర్యము.

౮౬౩.—చ॥ తఱిమి మురాంతకాత్మజుఁ డు * దారబలంబున బాహులేయుపైఁ
గఱకరిఁ దాఁకి తీవ్రశర * కాండ పరంపర లేసి నొంపఁగా
నెఱకులు గాఁడి పెల్లొరుగు * నెత్తుటఁ జొత్తిలి వైరు లార్వఁ దాఁ
బఱచె మయూర వాహనము * పైకొని తోలుచు నాజి భీతుఁడై.

టీ॥ మురాంతకాత్మజుఁడు = ప్రద్యుమ్నుఁడు. తఱిమి=త్వరపఱచి. ఉదారబలంబునన్=మిక్కుటమయిన బలముతో. బాహులేయుపైన్=కుమారస్వామిమీఁద. కఱకరిన్=కోపముతో. తాఁకి=తలపడి. తీవ్రశరకాండపరంపరలు = తీక్ష్ణములైన బాణసమూహముల వరుసలు. ఏసి=ప్రయోగించి. నొంపఁగాన్=నొప్పింపఁగా. నెఱకులు=మర్మములు. గాఁడి = నాటి. పెల్లొరుగు నెత్తుటన్ = అధికముగాఁ గారుచున్న రక్తమునందు. జొత్తిలి = తడిసి యొల్లఁబాఱి. వైరులు=శత్రువులు. ఆర్వన్=కేకలు వేయఁగా. ఆజిన్=

యుద్ధమునందు. భీతుఁడై = భయపడినవాఁడై. మయూరవాహనముఁ = నెమలివాహనమును. పైకొని=మీరి. తోలుచుఁ=తఱుముకొనుచు. తాఁ=తాను. పఱచెఁ=పరుగెత్తెను.

తా॥ అంతట కృష్ణుని కొడుకైన ప్రద్యుమ్నుఁడు కుమారస్వామిని కదియఁబోయి అధికమయిన బలము కనఁబడఁగా కోపముతో ఎదిరించి తీక్ష్ణములైన బాణములను ఎడతెఱపి లేక ప్రయోగించి నొప్పింపఁగా కుమారస్వామి ఆబాణములు మర్మములు నాటి మిక్కిలివడియుచున్న నెత్తుట తడిసి యెఱ్ఱనైన దేహముతో యుద్ధము చేయవెఱచి పగవారు నవ్వుచు కేకలు వేయఁగా తనవాహనమయిన నెమలిని తఱుముకొనుచు పరుగెత్తిపోయెనని తాత్పర్యము.

౪౬౪.—ఉ॥ పంబి రణావనీస్థల వి * పాటిత శాత్రవ వీరుఁడైన యా
సాంబుఁడు హేమపుంఖశిత * సాయక జాలములేర్చి భూరికో
పంబున నేసినఁ బెదరి * బాణ తనూభవుఁ డోడిపాఱె శౌ
ర్యంబును బీరముం దగవు * నాఱడివోవ బలంబు లార్వఁగన్.

టీ॥ పంబి=పూని. రణావనీస్థలిన్=యుద్ధభూమియందు. విపాటితశాత్రవవీరుఁడు=పడఁగొట్టఁబడిన శత్రుయోధులుగలవాఁడు. ఐనయాసాంబుఁడు=అయినట్టి ఆసాంబుఁడనువాఁడు. హేమ... జాలములు—హేమ=బంగారువికారమగునట్టి. పుంఖ = పింజలుగల. శిత = వాఁడియైన. సాయక = బాణములయొక్క. జాలములు = సమూహములు. ఏర్చి=ఏర్పరించి. భూరికోపంబునన్=మిక్కుటమైన కోపముతో. ఏసినన్ = ప్రయోగింపఁగా. బాణతనూభవుఁడు=బాణునికొడుకు. బెదరి=భయపడి. ఓడి=అపజయమునొంది. శౌర్యంబును=శూరత్వమును. బీరమును=పౌరుషమును. తగవును=న్యాయమును. ఆఱడివోవన్=వ్యర్థములుకాఁగా. బలంబులు=శత్రుసేనలు. ఆర్వన్=కేకలువేయఁగా. పాఱెన్=పరుగెత్తెను.

తా॥ యుద్ధభూమియందు శత్రుయోధులను పూనికతో పడఁగొట్టువాఁడైన సాంబుఁడు బాణునికొడుకును బంగారుపింజలుగల వాఁడిబాణముల సమూహములను ప్రయోగించి నొప్పింపఁగా వాఁడు అపజయము నొందినవాఁడై భయపడి పౌరుషమును శౌర్యమును యుద్ధధర్మమును విడిచి పరుగెత్తిపోయెనని తాత్పర్యము.

౪౬౫.—మ॥ వరబాహాబలశాలి యాహలి రణా * వష్టంభ సంరంభ వి
స్ఫురదుగ్రాశని తుల్యమైన ముసలం * బుం బూన్చి వ్రేసె న్వడిం
బోరిఁగుంభాండక కూపకర్ణుల శిరం * బుల్వ్రస్సి మేదంబు నె
త్తురుఁ గర్ణంబుల వాతనుం దొరఁగ సం * ధుల్వీడి వేచావఁగన్.

టీ॥ వరబాహాబలశాలి=మేలైనభుజబలముచేతఒప్పినవాఁడైన. ఆహలి = ప్రసిద్ధుఁడగుబలరాముఁడు. రణావష్టంభ...తుల్యము — రణ=యుద్ధమునందలి. అవష్టంభ=ప్రయత్నమువలని. సంరంభ=వేగిరపాటుచేత. విస్ఫురత్=ప్రకాశించుచున్న. ఉగ్ర=భయంకరమయిన. అశని=వజ్రాయుధముతోడ. తుల్యము=సమానము. ఐన ముసలంబున్=అయినట్టిరోఁకటిని. (పూన్చి) కుంభాండకకూపకర్ణుల శిరంబులు=కుంభాండుఁడు కూపకర్ణుఁడు అనువారితలలు. వ్రస్సి=పగిలి. మేదంబు=మెదడును. (నెత్తురును) కర్ణంబులన్ = చెవులందుండియు. వాతను = నోటనుండియు. పొరిన్ = మిక్కిలిగా. తొరఁగన్=కాఱుచుండఁగా. సంధులు=కీళ్లు. (వీడి) వే=వడిగా. చావఁగన్=చచ్చునట్లు. వడిన్=వేగముతో. (వ్రేసెను)

తా॥ మహాబలవంతుఁడైన బలరామస్వామి యుద్ధము నందలి ప్రయత్నము చేతను, వేగిరపాటుచేతను, వజ్రాయుధమును బోలిన ముసలాయుధమును చేతఁబూని కూపకర్ణుఁడు కుంభాండుఁడు అను వారినిద్దఱిని తలలుపగిలి మెదడు నెత్తురును చెవుల నుండియు నోట నుండియు వెడలుచు కీళ్లుసడలిచచ్చునట్లుగాకొట్టెనని తాత్పర్యము.

(*) బాణాసుర కృష్ణుల సేనలొకటితో నొకటి పోరుట.(*)

వ॥ అట్టియెడ సైన్యంబు దైన్యంబు నొంది యనాథలై చెడి విఱిగిపాఱినంగని బాణుండు సాత్యకిం గేడించి ప్రళయాగ్నియుంబోలె విజృంభించి చెయివీచి బలంబుల మరలం బురికొల్పి తాను ముంగలియై నడవ నప్పుడుభయసైన్యంబు లన్యోన్యజయకాంక్షులందలపడి దక్షిణోత్తరసముద్రంబులవీఁకం దాఁకినం బోరు ఘోరంబయ్యె. నట్టియెడం గదలనడిచియుఁ, గుఠారంబులం బొడిచియు, సురియలం గ్రుమ్మియు, శూలంబులం జిమ్మియు, శక్తులనొంచియుఁ, జక్రంబులం ద్రుంచియు, ముసలంబుల మొత్తియు, ముద్గరంబుల నొత్తియుఁ, గుంతంబులం గ్రుచ్చియుఁ, బంతంబులిచ్చియుఁ, బరిఘంబులనొంచియుఁ, బట్టిసంబులం ద్రుంచియు, శరంబుల నేసియుఁ, గరవాలంబుల వ్రేసియు, సత్రాసులై పాసియు, వత్రాసులై డాసియుఁ, బెనంగినం దునిసినశిరంబులును, దునుకలైనకరంబులును, దెగినకాళ్లును, ద్రెస్సినవ్రేళ్లును, దుమురులైనయెముకలును, బ్రోవులైనప్రేవులును, నులిసినమేనులును, నలఁగిన జానువులును, నొగిలినవర్మంబులును, బగిలినచర్మంబులును, వికలంబులైన సకలావయవంబులును, వికీర్ణంబులైనకర్ణంబులును, విచ్ఛిన్నంబులైన నయనంబులును, వెడలురుధిరంబులును, బడలువడుబలంబులును, గొండఁ

పడువునంబడు. మాంసఖండంబులును, వాచలచుకొను ప్రాణులును, వాలిన తేరులును, గూలినకరులును, నొఁజలిన గుఱ్ఱంబులును, బలలఖాదన కుతూహలజనిత మదాంధీభూత పిశాచ డాకినీ భూతభేతాళ సమాలోల కోలాహల భయంకరారావబధిరీకృత సకలదిశావకాశంబులునై సంగరాంగణంబు భీషణంబయ్యె నయ్యవసరంబున.



టీ॥ అట్టియెడన్ = ఆసమయమునందు. సైన్యంబు = సేన. దైన్యంబునొంది=దీనత్వమునుపొంది. అనాథలై=దిక్కులేనివారై. చెడి=చేటునొంది. విఱిగి = వెనుదీసి. పాఱినన్ = పరుగెత్తఁగా. కని=చూచి. బాణుండు=బాణాసురుఁడు. సాత్యకిన్=సాత్యకిని. కేడించి=తొలఁగించి. ప్రళయాగ్నియుంబోలెన్ = ప్రళయకాలపు నిప్పువలె. విజృంభించి=రేఁగి. చెయివీచి = చేవిసరి. బలంబులన్= సేనలను. మరలన్=తిరుగునట్లు. పురికొల్పి = ప్రేరేపించి. తాను ముంగలియై=తానుముందునిలిచినవాఁడై. నడవన్ = నడవఁగా. (అప్పుడు) ఉభయసైన్యంబులు=రెండుసేనలును. అన్యోన్యజయకాంక్షలన్=ఒకరొకరిని జయింపవలెనను కోరికలతో. తలపడి=తార సించి. దక్షిణోత్తరసముద్రంబులపోలికన్=దక్షిణముదియు ఉత్తరముదియునైన సముద్రములవలె. తాఁకినన్ = ఎదిరింపఁగా. పోరు = యుద్ధము. ఘోరంబయ్యెన్=భయంకరమాయెను. అట్టియెడన్= ఆసమయమునందు. గదలనడిచియున్ = గదలతోఁ గొట్టియును. కుఠారంబులంబొడిచియున్ = గొడ్డండ్లతోఁ బొడిచియు. సురియలన్=సూరుకత్తులతో. క్రుమ్మియున్=గ్రుచ్చియు. శూలంబులన్= శూలములతో. చిమ్మియున్=ఎగురఁబొడిచియు. శక్తులనొంచియున్ =శక్తియను ఆయుధములతోనొప్పించియు. చక్రంబులన్ = చక్రాయుధములతో. త్రుంచియున్=నఱకియు. ముసలంబులన్=రోఁకండ్లతో. మొత్తియున్=అడఁగఁగొట్టియు. ముద్గరంబులన్ = ఇనుపగుదియలతో. ఒత్తియున్ = తొలఁగనొత్తియు. కుంతంబులన్ = ఈఁటెలతో. గ్రుచ్చియున్ = పొడిచియు. పంతంబులిచ్చియున్= ప్రతిజ్ఞలుచేసియు. పరిఘంబులన్ = ఇనుపకట్ల గుదియలచేత. నొంచియున్ = నొప్పించియు. పట్టిసంబులన్ = పట్టిసము అను ఆయుధవిశేషములతో. త్రుంచియున్ = నఱకియు. శరంబులన్ = బాణములను. ఏసియున్ = ప్రయోగించియు. కరవాలంబులన్ = కత్తులతో. వ్రేసియున్=తెగఁగొట్టియు. సత్రాసులై=భయముతోఁ గూడుకొన్నవారై. పాసియున్=తొలఁగియు. విత్రాసులై=భయము లేనివారై. డాసియున్ = సమీపించియు. పెనంగినన్ = పోరాడఁగా. తునిసినశిరంబులును = తెగినతలలును. (తునుకలైనకరంబులును తెగినకాళ్లును) త్రెస్సినవ్రేళ్లును=తెగినవ్రేళ్లును. తుమురులైన= పొడిపొడియైన. (ఎముకలును) ప్రోవులైన=రాసులైన. ప్రేవులును= ప్రేఁగులును. నులిసినమేనులును=సన్నగిలినదేహములును. నలఁగిన జానువులును=నలఁగిపోయినమోఁకాళ్లును. నొగిలినవర్మంబులును= ఛేదిల్లినకవచములును. పగిలినచర్మంబులును=బ్రద్దలువాఱినతోళ్లను. వికలంబులైన=సంధులువీడిన. సకలావయవంబులును=ఎల్లఅవయవములును. వికీర్ణంబులయిన=తెగిచెదరిపడిన. కర్ణంబులును = చెవులును. విచ్ఛిన్నంబులైన=చెదరఁగొట్టఁబడిన. నయనంబులును=కన్నులును. వెడలు=పైకుబుకు. రుధిరంబులును = నెత్తురులును. పడలువడు = కుప్పఁగూలునట్టి. బలంబులును = సేనలును. కొండలవడువునన్=కొండలవలె. (పడు) మాంసఖండంబులును = మాంసపుకండలును. వాచఱచు=నోరుగొట్టుకొనునట్టి. కొఱప్రాణులును= కొంచెము కొఱఁతగాపోయిన ప్రాణములుగలవారును. వాలినతేరులును=ఒఱఁగినరథములును. కూలినకరులును=పడినయేనుఁగులును. ఒఱలినగుఱ్ఱంబులును=వికారముగ అఱచునట్టిగుఱ్ఱములును. పలల...కాశంబును—పలల = మాంసమును. ఖాదన = తినుటయందలి. కుతూహల=వేడుకవలన. జనిత=పుట్టిన. మద=క్రొవ్వుచేత. అంధీభూత=గ్రుడ్డివిగాఁజేయఁబడిన. పిశాచ = పిశాచము. డాకినీ= డాకినులు. భూత = భూతములు. బేతాళ = బేతాళములు. సమూలోల = వీనియొక్క కలఁతపాటుచేతనైన. కోలాహల = కలకల ధ్వనులవలని. భయంకర=భయమునుబుట్టించునట్టి. ఆరావ=ధ్వని చేత. బధిరీకృత=చెవుడు కలుగఁజేయుచున్న. సకలదిశా = ఎల్ల దిక్కులయొక్క. అవకాశంబును=ఎడముగలదియును. (ఐ) సంగరాంగణంబు=యుద్ధప్రదేశము. భీషణంబయ్యెన్ = భయంకరమాయెను. అయ్యవసరంబునన్=ఆసమయమునందు.

తా॥ అప్పుడు ఉభయసేనలు తలపడి పోరాడఁగా చతురంగబలములును మహారభసముతో చెల్లాచెదరైపోయెను అంతటబాణాసురుఁడు సాత్యకితో పోరాడుటమాని చెదరినసేనలను పురికొలుపుకొని పోరాడఁగా నెత్తురు మాంసము ఎముకలు తలపుఱ్ఱెలు మొదలగువానితో నిండుకొని తెగి నలఁగి విఱిగి పొడిపొడియై చెడిన ఆయుధములు భూషణములు రథములు మొదలయినవిగలదై యుద్ధభూమి మిక్కిలి భయంకరముగా నుండెనని తాత్పర్యము.

౪౬౭.—చ॥ శర కుముదంబు లుల్లసిత * చామర ఫేనము లాతపత్ర భా
సుర నవపుండరీకములు * శోణిత తోయము లస్థి సైకతో
త్కరము భుజాభుజంగమ ని * కాయము కేశకలాప శైవల
స్ఫురణ రణాంగణం బమరెఁ * బూరిత శోణనదంబు పోలికన్.

టీ॥ శరకుముదంబులు = బాణములనెడు తెల్లగలువలును. ఉల్లసితచామరఫేనములు—ఉల్లసిత=ప్రకాశించునట్టి. చామర = వింజామరములనెడు. ఫేనములు=నురుఁగులును. ఆతపత్ర...ములు—ఆతపత్ర=గొడుగులనెడు. భాసుర=ప్రకాశించునవియైన. నవ=నూతనములైన. పుండరీకములు=తెల్లదామరలును. శోణితతోయములు= నెత్తురనెడునీళ్లును. అస్థిసైకతోత్కరము=ఎముకలనెడుఇసుకతిప్పలసమూహమును. భుజాభుజంగమనికాయము = బాహువులనెడు పాముల సమూహమును. కేశ...రణన్—కేశకలాప=వెండ్రుకలసమూహములనెడు. శైవల=పాఁచియొక్క. స్ఫురణన్ = ప్రకాశముచేతను. రణాంగణంబు = యుద్ధభూప్రదేశము. పూరితశోణనదంబుపోలికన్=నిండింపఁబడినశోణముఅనెడుఎఱ్ఱనినీళ్లుగలయేటియొక్క. పోలికన్=విధమున. అమరెన్=ఒప్పెను.

తా॥ బాణములు తెల్లగలువలును, తెల్లఁగా వెలుఁగుచున్న వింజామరములు నురుఁగులును, తెల్లగొడుగులువికసించినతెల్లదామరలును, నెత్తురు నీళ్లును, ఎముకలరాసులు ఇసుకతిప్పలునై, ప్రకాశింపఁగా యుద్ధరంగము శోణమనెడు ఏటివలెనే ఒప్పెనని తా.



బాణాసురుఁడు.



కృష్ణుఁడు.

(*) బాణాసురుఁడు శ్రీకృష్ణమూర్తిచేత భంగపడి పాజిపోవుట. (*)

౪౬౮.—వ॥ అట్టియెడ బాణుండు కట్టలుకం గృష్ణునిపైఁ దనరథంబుఁ బఱపించి
యఖర్వ బాహాసహస్ర దుర్వార గర్వాటోప ప్రదీప్తుండై కదిసి.

టీ॥ అట్టియెడన్ = ఆసమయమునందు. బాణుండు = బాణాసురుఁడు. కట్టలుకన్ = మిక్కిలికోపముతో. (కృష్ణునిపైని) తన రథంబున్=తనతేరును. పఱపించి=తోలించి. అఖర్వ...ప్తుండు— అఖర్వ = తక్కువగాని. బాహాసహస్ర = వేయిచేతులయొక్క. దుర్వార=అడ్డగింపరాని. గర్వ=అహంకారముయొక్క. ఆటోప= విజృంభణముచేత. ప్రదీప్తుండై=వెలిఁగినవాఁడై. కదిసి=సమీపించి.

తా॥ ఆసమయమునందు మిక్కిలి కోపముతో బాణాసురుఁడు కృష్ణునిమీఁదికి తనరథమును తోలించి తక్కువకానిదియు నిలుపఁగూడనిదియునైన వేయిచేతుల అహంకారాతిశయముచేత వెలుఁగుచు మిక్కిలికదియవచ్చి అని తాత్పర్యము..

౪౬౯.—మ॥ ఒక యేనూఱు కరంబులన్ ధనువు ల * త్యుగ్రాకృతిం దాల్చి త
క్కక యొక్కొక్కట సాయకద్వయము వీఁ * కంబూన్చునాలోన నం
దక హస్తుండు దదుగ్ర చాపచయ వి * ధ్వంసంబు గావించి కొం
జకఁ దత్సారథిఁ గూలనేసి రథముం * జక్కాడె శౌర్యోద్ధతిన్.

టీ॥ ఒకయేనూఱుకరంబులన్ = ఒకతట్టువైన యేనూఱుచేతులందు. ధనువులు=విండ్లు. అత్యుగ్రాకృతిన్ = మిక్కిలి భయంకరమయినరీతితో. తాల్చి = ధరించి. తక్కక = తప్పక. ఒక్కొక్కటన్=ఒక్కొక్కవింటియందు. సాయకద్వయమున్ = రెండేసిబాణములను. వీఁకన్=ప్రయత్నముతో. పూన్చునాలోనన్=సంధానముచేయునంతటిలో. నందకహస్తుండు=కృష్ణుఁడు. శౌర్యోద్ధతిన్=శూరత్వమువలని నిక్కుతో. తదుగ్ర...సంబు—తత్ = వానివైన. ఉగ్ర = భయంకరమైన. చాపచయ = విండ్లసమూహముయొక్క. విధ్వంసంబు=విఱుగఁగొట్టుటను. కావించి=చేసి. కొంజక=సంకోచింపక. తత్సారథిన్=వానిరథముతోలువానిని. కూలనేసి=పడమొత్తి. (రథమును) చక్కాడెన్=చెక్కలెగయ విఱుగఁగొట్టెను.

తా॥ ఏనూఱుచేతులందును, ఏనూఱువిండ్లను ధరించి తక్కిన యేనూఱుచేతులతోను, భయంకరవిధమున ఒక్కొక్కవింటియందు రెండేసిబాణములను సంధించునంతలోపల కృష్ణుఁడుతనశూరత్వము హెచ్చుగా వానిభయంకరమయిన విండ్లసముదాయమును తఱికివేసి సారథిని జంపి రథమును విఱుగఁగొట్టెనని తాత్పర్యము.

౪౭౦.—తే॥ ప్రళయ జీమూత సంఘాత * భయదఘోరి ! భైరవారావముగనొత్తెఁ * బాంచజన్య
మఖిలజనులు భయభ్రాంతు * లై చలింపఁ । గడఁగి నిర్భిన్న రాక్షసీ * గర్భముగను.

టీ॥ కడఁగి=పూని. ప్రళయ...ముగన్ — ప్రళయ = ప్రళయకాలమునందలి. జీమూత=మేఘములయొక్క. సంఘాత = సమూహమువలని. భయద=భయమును కలుగఁజేయునట్టి. ఘోరి=అధికమయిన. భైరవ=భయంకరమయిన. ఆరావముగన్ = ధ్వనికలుగునట్టుగా. అఖిలజనులు=ఎల్లజనులును. భయభ్రాంతులై = భయముచేత తత్తఱిల్లినవారై. చలింపన్ = తడఁబడఁగా. నిర్భిన్నరాక్షసీగర్భముగన్=భేదిల్లిన రాక్షసస్త్రీల గర్భములు గలుగునట్టుగాను. పాంచజన్యము = తనశంఖమును. ఒత్తెన్=పూరించెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి అంతటితోనిలువక ప్రళయకాలపుమేఘము ఉఱిమినట్టు వెఱపు కలుగఁజేయునట్టి ధ్వని కలుగఁగా ఎల్లజనులు వెఱచునట్లును రాక్షసస్త్రీలగర్భములు కలఁగుఁగునట్లును పాంచజన్యమనెడుశంఖమును ఊఁదెనని తాత్పర్యము.

వ॥ అట్టియవక్రవిక్రమపరాక్రమంబున వెగడువడిబాణుండు వ్రేలుమొగంబువడిసేయునదిలేక విన్ననైయున్నయెడ.

టీ॥ అట్టి=అటువంటి. అవక్రవిక్రమ=వంకరగానిప్రతాపము తోడి. పరాక్రమంబునన్=శత్రువులను ఆక్రమించునట్టిపనియందు. వెగడుపడి=దిగ్భ్రమఁజెంది. (బాణుండు) వ్రేలుమొగంబువడి=కళ తప్పినమొగముగలవాఁడై. చేయునదిలేక=ఏమిచేయుటకుశక్తిలేక. విన్ననై = చిన్నఁబోయినవాఁడై. ఉన్నయెడన్ = ఉండునప్పుడు.

తా॥ అటువంటికృష్ణునియొక్క పరాక్రమమును జూచి బాణాసురుఁడు భయపడిన మొగము కళతప్పిపోఁగా చిన్నఁబోయిన వాఁడై యుండెనని తాత్పర్యము.

౪౭౨.—సీ॥ అత్తఱిఁ గోటరి * యనుబాణ జనయిత్రి - సుతుఁగాచుమతము స * న్మతిఁదలంచి
వీడి శిరోజముల్ * వ్రేలంగ నిర్ముక్త - పరిధానయై మురా * సుర విభేది
యెదుర నిల్చినఁ జూడఁ * మదిఁజాలరోసి ప - రాఙ్ముఖుఁ డైయున్న * ననువువేచి
తల్లడించుచు బాణుఁ * డుల్లంబు గలఁగంగ - దలచీరవీడ యా * దవులు నవ్వ

తే॥ నవ్యకాంచన మణిభూష * ణములు రాలఁ । బాదహతి నేలగంపింపఁ * బాఱి యాత్మ
పురము వడిఁజొచ్చె నప్పుడు * భూతగణము । లాకులతతోడ నెక్కటి * నరుగుటయును.

టీ॥ అత్తఱిన్ = ఆసమయమునందు. (కోటరి) అనుబాణజనయిత్రి=అనుపేరుగల బాణునితల్లి. సుతున్ = కొడుకైనబాణుని. కాచుమతము = కాపాడువిధమును. సన్మతిన్ = మంచిబుద్ధితో. తలంచి=ఆలోచించి. శిరోజములు = తలవెండ్రుకలు. వీడి = ముడి వదలి. వ్రేలంగన్=వ్రేలాడఁగా. నిర్ముక్తపరిధానయై=విడువఁబడిన వస్త్రముగలదై—దిగంబరయై. మురాసురవిభేదియెదురన్=కృష్ణుని యెదుట. నిల్చినన్ = నిలువఁబడఁగా. చూడన్ = చూచుటకు. చాలన్=మిక్కిలి. మదిన్=మనసునందు. రోసి=రోఁతపడి. పరాఙ్ముఖుఁడై=మాఱుమొగముగలవాఁడై. ఉన్నన్=ఉండఁగా. అనువు వేచి=అనుకూలతను కనిపెట్టి. తల్లడించుచున్ = సంకటపడుచు. (బాణుఁడు) ఉల్లంబు=మనస్సు. కలఁగంగన్=కలఁతనొందఁగా. తలచీరవీడన్=తలగుడ్డవీడిపోఁగా. యాదవులునవ్వన్=యాదవసేనలు నవ్వఁగాను. నవ్యకాంచనమణిభూషణములు = క్రొత్తవై బంగారుమయములును రత్నమయములునైనఆభరణములు. రాలన్=రాలఁగా. పాదహతిన్ = అడుగుల తాఁకుడుచేత. (నేల) కంపింపన్=అదురఁగాను. పాఱి=పరుగెత్తి. ఆత్మపురమున్=తన పట్టణమునందు. వడిన్ = వేగముతో. చొచ్చెన్ = ప్రవేశించెను. (అప్పుడు) భూతగణములు = శివునిసంబంధమయిన భూతముల సమూహములు. ఆకులతతోడన్=కలఁతపాటుతో. ఎక్కటిన్= ఒంటరితనముతో. అరుగుటయున్=పోఁగానే.

తా॥ ఆసమయమునందు బాణునితల్లియైన కోటరి అనునది తన కొడుకును కాపాడవలయునను అభిప్రాయముతో అందులకుఁదగిన ఆలోచనచేసి దిగంబరయై తలవిరియఁబోసికొని యుద్ధరంగమునకు వచ్చి శ్రీకృష్ణమూర్తికెదుట నిలిచెను అప్పుడు కృష్ణుఁడు దానిని జూడమనసొప్పక మాఱుమొగము పెట్టుకొన్నవాఁడైయుండెను అది సందుచేసికొని బాణాసురుఁడు మనసు కొట్టుకొనఁగా సంకటపడుచు తలగుడ్డ వీడిపోఁగా పగవారైన యాదవులందఱు నవ్వుచుండఁగా క్రొత్తలైన బంగారుమయములును రత్నమయములునైన ఆభరణములన్ని నేలరాలఁగా కాళ్లతాఁకుడుచేత నేలయదురుచుండఁగా పరుగెత్తి తనపట్టణమును ప్రవేశించెను అప్పుడు భూతసమూహము లన్ని ఒంటరి ఒంటరిగా చెల్లాచెదరై పరుగెత్తెను అంతట అని తాత్పర్యము.

## (*) వైష్ణవజ్వరముచేత శైవజ్వర మోడి శ్రీకృష్ణుని స్తుతించుట. (*)





శైవజ్వరము.



వైష్ణవజ్వరము.

క॥ శిరములుమూడును ఘనభీ । కరపదములుమూడుగల్గి * కనలిమహేశ
జ్వరముఘోరాకృతితో । నరుదెంచుచునుండఁగృష్ణుఁ * డల్లననగుచున్.

టీ॥ శిరములు=తలలు. (మూఁడును) ఘనభీకరపదములు—ఘన=గొప్పవియు. భీకర=భయంకరములైనవియునైన. పదములు=కాళ్లు. (మూఁడును) కల్గి=కలదై. మహేశజ్వరము=శివజ్వరము—ఉష్ణజ్వరము. కనలి=కోపించి. ఉరుఘోరాకృతితోన్=మిక్కిలిభయంకరమయిన ఆకారముతో. అరుదెంచుచునుండన్=వచ్చుచుండఁగా.(కృష్ణుఁడు) అల్లనన్=మెల్లఁగా. నగుచున్=బాధింపవచ్చెదవా అనినవ్వుచును.

తా॥ అంతట మూఁడుతలలును మూఁడుపాదములును గలిగినదై శివజ్వరము మిక్కిలిభయంకరమయిన ఆకారముతో కోపించుకొని కృష్ణునిమీఁదికివచ్చెను అట్లురాఁగా కృష్ణుఁడు దానిఁజూచినవ్వుచు అని తాత్పర్యము.

౪౭౪.—చ॥ పరువడి వైష్ణవజ్వరముఁ * బంచిన నయ్యుభయ జ్వరంబులున్
చెరవును లావుఁ జేవయును * వీరము బీరము గల్గి ఘోర సం
గర మొనరింప నందుఁ గర * కంఠ కృతజ్వర ముగ్ర వైష్ణవ
జ్వరమున కోడిపాఱె నని * వారణ వైష్ణవి వెంట నంటఁగన్.

టీ॥ పరువడిన్=మిగులవేగముగా. వైష్ణవజ్వరమున్=శీతజ్వరమును. పంచినన్=పంపఁగా. అయ్యుభయజ్వరంబులున్=ఆరెండుజ్వరములును. చెరవును=ఉపాయమును. లావును=బలమును. చేవయును=సత్తయును. వీరము = శూరత్వమును. బీరము=బిగువును. (కల్గి) ఘోరసంగరము = భయంకరమైనయుద్ధము. ఒనరింపన్=చేయఁగా. అందున్=ఆరెండుజ్వరములలో. కరకంఠకృతజ్వరము=శివునిచేతఁజేయఁబడినజ్వరము. ఉగ్రవైష్ణవీజ్వరమునకున్=వేంద్రమయినవిష్ణుసంబంధియైనజ్వరమునకు. ఓడి=వెఱచి. అనివారణన్=ఆఁపరానివిధమున. వైష్ణవి = వైష్ణవజ్వరము. వెంటనంటఁగన్ = వెంబడించితఱుమఁగా. పాఱెన్=పరుగెత్తెను.

తా॥ అట్లు శైవజ్వరము తనమీఁదికిరాఁగాకృష్ణుఁడువేగముగా వైష్ణవజ్వరమునుపంపెను అంతట ఆరెండుజ్వరములును బలమును నేర్పును చలింపనిస్థితియు శూరత్వమును బిగువును గలవై పోరాడు నపుడు శివజ్వరము ఓడిపోయినదై వైష్ణవజ్వరము వెంబడించి తఱుమఁగా భయపడి పాఱిపోయెనని తాత్పర్యము.

౪౭౫.—తే॥ పాఱి యేదిక్కుఁ గానక * ప్రాణభీతిఁ । జేరి యేడ్చుచు నాహృషీ * కేశు పాద
కంజములకెరఁగి ననుఁగావు * కావుమనుచు । నిటలతట లసితాంజలి * ఘటిత యగుచు.

టీ॥ పాఱి=పరుగెత్తిపోయి. ఏదిక్కున్=ఏవిధమయిన రక్షకమును. కానక = పొందక. ప్రాణభీతిన్ = ప్రాణములుపోవునను భయముచేత. చేరి=దగ్గఱవచ్చి. (ఏడ్చుచును) ఆహృషీకేశపాదకంజములకున్=ఆకృష్ణమూర్తియొక్క పాదకమలములకు. ఎరఁగి=మ్రొక్కి. ననున్=నన్ను. కావుకావుమనుచున్ = కాపాడుము కాపాడుము అని వేఁడుకొనుచు. నిటలతట లసితాంజలిఘటిత — నిటలతట=నొసటిప్రదేశమునందు. లసితాంజలిఘటిత=చక్కఁగాఁ గూర్పఁ బడిన చేమోడ్పు గలది. అగుచున్ = అవుచును.

తా॥ ఆవిధముగా పాఱిపోయిన శైవజ్వరము ఎక్కడపోయిన తన్ను రక్షించువారు ఎవ్వరునులేకపోఁగా మరల కృష్ణమూర్తి సన్నిధానమునకు వచ్చిచేరి ఆకృష్ణమూర్తియొక్క పాదములకు మ్రొక్కి నొసట మోడువఁబడిన చేతులను గూర్చుకొని నన్ను కాపాడుము కాపాడుము అని వేఁడుకొనెనని తాత్పర్యము.

టీ॥ (ఇట్లు) వినుతించెన్=పొగడెను.

౪౭౬.—సీ॥ అవ్యయు ననఘు న * నంతశక్తిని బరు - లైనట్టి బ్రహ్మ రు * ద్రామరేంద్ర
వరుల కీశ్వరుఁడైన * వాని సర్వాత్మకు - జ్ఞానస్వరూపు స * మాన రహితు
వరదుని జగదుద్భ * వస్థితి సంహార - హేతుభూతుని హృషీ * కేశు నభవు
బ్రహ్మచిహ్నంబులై * పరఁగుసుజ్ఞాన శ - క్త్యాదులనొప్పు బ్ర * హ్మంబునీశు

తే॥ నజు షడూర్మిరహితు * నిజయోగమాయా వి । మోహితాఖిలాత్మ * ముఖ్యచరితు
మహిత తేజు నాది * మధ్యాంతహీనునిఁ । జిన్మయాత్ము నిను భ * జింతుఁ గృష్ణ.

టీ॥ కృష్ణ=సృష్టి స్థితి లయములను చేయునట్టి ఓశ్రీకృష్ణమూర్తీ. అవ్యయున్ = నాశములేనివాఁడును. అనఘున్=పాపములు లేనివాఁడును. అనంతశక్తిన్=మేరలేని అణిమాదిశక్తులుగలవాఁడును. పరులు = తనకంటె నితరులు. (ఐనట్టి) బ్రహ్మ ... వరులకున్ — బ్రహ్మ=చతుర్ముఖుఁడు. రుద్ర=శివుఁడు. అమరేంద్ర=దేవేంద్రుఁడును. వరులకున్=ప్రభువులకు. ఈశ్వరుఁడైనవానిన్ = ప్రభువైనవాఁడును—త్రిమూర్తులకు నతీతుఁడనుట. సర్వాత్మకున్ = సర్వము తనరూపముగఁ గలవాఁడును. జ్ఞానస్వరూపున్=అపరోక్షజ్ఞానమే స్వరూపముగాఁగలవాఁడును. సమానరహితున్ = ఈడులేనివాఁడును. వరదున్ = కోరినకోరికల నిచ్చువాఁడును. లేక అనన్యభక్తితోతన్నారాధించువారికిశ్రేష్ఠమైనతత్వజ్ఞానమునిచ్చువాఁడును. జగ...భూతున్—జగత్=లోకములయొక్క. ఉద్భవ=పుట్టుకకును. స్థితి=ఉనికికిని. సంహార=లయమునకును. హేతుభూతున్=కారణమైనవాఁడును. హృషీకేశున్=ఇంద్రియములకు నీశ్వరుఁడును—ఇంద్రియములను తమ తమ పనులయందు ప్రవర్తింపఁ జేయువాఁడనుట. అభవున్ = పుట్టుకలేనివాఁడును—లేక, శివస్వరూపుఁడును. బ్రహ్మచిహ్నంబులు=పరబ్రహ్మముయొక్క గుఱుతులు. ఐపరఁగుసుజ్ఞానశక్త్యాదులన్—అయిపరఁగు=ఐయొప్పునట్టి. సుజ్ఞాన=సాధనాంతర

నిరపేక్ష స్వయంప్రకాశమానవస్తు తత్త్వజ్ఞానము. శక్తి=సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వాదిశక్తులు. ఆదులన్=మొదలగువానిచేత. ఒప్పుబ్రహ్మంబున్=ఒప్పిదమగుచున్న పరమాత్ముఁడును. ఈశున్=పరమైశ్వర్యయుక్తుఁడును. అజున్ = ఒకరియందుజనింపనివాఁడును — లేక, చతుర్ముఖబ్రహ్మస్వరూపుఁడును. షడూర్మిరహితున్=అశన పిపాస శోక మోహ జరా మరణములనెడు ఆఱు ఊర్ములు లేనివాఁడును—వీనిలో అశన పిపాసలు సూక్ష్మశరీరధర్మములు. శోక మోహములు కారణశరీరధర్మములు. జరామరణములు స్థూలశరీరధర్మములు గనుక త్రిశరీరోపాధి లేనివాఁడనుట. శ్లో॥ ఉపాధిత్రితయాదన్య మాత్మానమవధారయేత్॥ అనిఆచార్యోక్తి. నిజయోగ...చరితున్—నిజ=తనదైన. యోగ=చేరికగల—చంద్రుని చంద్రికవలె తన్నెడఁబాయనట్టి. మాయన్ = మూలప్రకృతిచేత. విమోహిత=మిక్కిలి మోహము నొందింపఁబడిన. అఖిల=సకలములైన. ఆత్మ=ప్రాణులయొక్క. ముఖ్య=ప్రధానమయిన. చరితున్=నడవళ్లుగలవాఁడును. మహితతేజున్—మహిత=పూజ్యమైన. తేజున్=సూర్యచంద్రాగ్నుల కాంతుల మీఱిన తేజస్సు గలవాఁడును. ఆదిమధ్యాంతహీనునిన్=మొదలునడుముతుద యనునవి లేనివాఁడును—పుట్టుటపెరుగుట లయించుటలులేనివాఁడనుట. చిన్మయాత్మున్=సచ్చిదానందస్వరూపము గలవాఁడునైన. నినున్ = అహంపదార్థస్వరూపమయిననిన్ను. భజింతున్=సేవింతును.

తా॥ సృష్టి స్థితి లయములను బ్రహ్మ విష్ణు రుద్ర రూపములతో నుండి చేయునట్టి ఓశ్రీకృష్ణమూర్తీ! నాశనములేనివాఁడును, అణిమ మహిమ గరిమ లఘిమ ప్రాప్తి ప్రాకామ్యము ఈశత్వము వశిత్వము అనునవి మొదలయిన శక్తులు గలవాఁడును, బ్రహ్మ రుద్రేంద్రాది దేవతాశ్రేష్ఠులకు ప్రభువైనవాఁడును, అన్నియు తనరూపముగఁ గలవాఁడును, అపరోక్షజ్ఞానస్వరూపము గలవాఁడును, సమానుఁడులేనివాఁడును, అనన్యభక్తితో తన్నారాధించువారికితత్త్వజ్ఞానమును కోరినకోరికలను ఇచ్చువాఁడును, లోకములనుపుట్టింపపెంపత్రుంప కారణమయినవాఁడును, ఇంద్రియగోళములయందు విజ్ఞానరూపముతోనుండి ఇంద్రియములను తానివానిపనులయందు వర్తించునట్లు చేయువాఁడును, పుట్టుక లేనివాఁడును, లేక శివస్వరూపుఁడును, అఖండ పరిపూర్ణ సచ్చిదానంద సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వభోక్తృత్వ సర్వనియంతృత్వ సర్వపాలకత్వాది మహాగుణములుగల పరబ్రహ్మమును, మోక్షరూపమయిన పరమైశ్వర్యముగలవాఁడును, ఒకరియందు పుట్టనివాఁడును, లేక చతుర్ముఖబ్రహ్మస్వరూపుఁడును, అశన పిపాస శోక మోహ జరా మరణములు లేనివాఁడును, తనమాయచేత సకలబద్ధజీవులను మోహపెట్టువాఁడును, సూర్యచంద్రాగ్నుల కాంతులను మీఱిన మహాతేజస్సుగలవాఁడును, పుట్టుట పెరుగుట గిట్టుటలు లేనివాఁడును, పరబ్రహ్మస్వరూపుఁడును అయిన నిన్ను సేవించుచున్నాను అని తాత్పర్యము.

వ॥ అదియునుంగాక లోకంబున దైవంబు లనేకప్రకారంబులై యుండు నదియెట్టులనినఁ గలాకాష్ఠాముహూర్తంబులు గలకాలంబును, సుకృత దుష్కృతానుభవ రూపంబులుగల జీవకర్మంబులును, స్వభావంబును, సత్త్వరజస్తమోగుణాత్మకంబునైన ప్రకృతియును, సుఖదుఃఖాశ్రయంబైన శరీరంబును, జగజ్జంతునిర్వాహకంబైన ప్రాణంబును, సకలపదార్థ పరిజ్ఞాన కారణంబైనయంతఃకరణంబును, మహదహంకార శబ్ద స్పర్శ రూప రస గంధ తన్మాత్ర తత్కార్య భూత గగన పవనానల సలిల ధరాది పంచభూతంబులు నాదిగాఁగల ప్రకృతివికారంబు లన్నింటి సంఘాతంబును, బీజాంకుర న్యాయంబునం గార్యకారణరూప ప్రభవంబునునై జగత్కారణ శంకితంబై యుండునది యంతయు భవదీయ మాయావిడంబనంబుగాని యున్నయదికాదు తదీయమాయానివర్తకుండవైన నీవు నానావిధ దివ్యావతార లీలలంజేసి దేవగణంబులను, సత్పురుషులను, లోకనిర్మాణచణులైన బ్రహ్మాదులను బరిరక్షించుచు లోకహింసాప్రవర్తకులైన దుష్టమార్గగతులం గ్రూరాత్ముల హింసించుచు విశ్వంభరాభారనివారణంబు సేయుటకుఁగదా భవదీయదివ్యావతారప్రయోజనంబు గావుననిన్నుశరణంబు వేఁడెద.

టీ॥ (అదియునుంగాక) లోకంబునన్=ఈలోకమునందు. దైవంబులు=దేవతలు. అనేకప్రకారంబులు = బహువిధములుగలవి. ఐయుండున్=అయియుండును. (అదియెట్టులనిన) కలాకాష్ఠాముహూర్తంబులు=కల కాష్ఠ ముహూర్తము అనుభేదములు. కల=కలిగిన. కాలంబును = కాలమును. సుకృతదుష్కృతానుభవరూపంబులు — సుకృత = పుణ్యమును—సుఖములను. దుష్కృత=పాపమును—కష్టములను. అనుభవరూపంబులు=అనుభవించుటయే స్వరూపముగాఁ గలుగుట, కల=కలిగిన. జీవకర్మంబులును = జీవులపుణ్యపాపకర్మములను. స్వభావంబును = పరబ్రహ్మమునకంటె అన్యముగానిదియును. సత్త్వరజస్తమోగుణాత్మకంబును=సత్త్వమ్మురజస్సుతమస్సుఅను గుణములుగలది, అయినప్రకృతియు = అయినట్టిమాయయు. సుఖదుఃఖాశ్రయంబు = సుఖమును దుఃఖమును అనుభవించుటకు ఆధారము, అయినశరీరంబును=అయినపంచకోశాత్మకస్థూలశరీరమ్మును. జగజ్జంతునిర్వాహకంబు=లోకములోని జంతువులను నిర్వహించునది. అయినప్రాణంబును = అయినప్రాణవాయువును. సకలపదార్థపరిజ్ఞానకారణంబు = భూమి మొదలయిన యెల్లపదార్థములను దెలిసికొనుటకు కారణము. అయినయంతఃకరణంబును=అయినట్టి అంతరంగమును. మహదహంకార...భూతంబులును—మహత్ = మహత్తత్త్వమును. అహంకార = భూతాదియైన అహంకారతత్త్వమును. శబ్ద=ధ్వనియు. స్పర్శ=తాఁకుటయు. రూప = ఆకృతియు. రస=ద్రవముగనుండుటయును. గంధ=వాసనయు. తన్మాత్ర=ఇవియనెడి పంచతన్మాత్రలును. తత్కార్యభూత=ఆపంచతన్మాత్రములకార్యములగుచున్న. గగన=ఆకాశము. పవన=గాలి. అనల=అగ్ని. సలిల=నీరు. ధరా=భూమి. ఆది=మొదలగు. పంచభూతంబులును=అయిదయిన మహాభూతములును. ఆదిగాఁగల=మొదలైన. ప్రకృతివికారంబులున్=మాయవలనపుట్టినవియైన. అన్నింటిసంఘాతంబును=

ఈచెప్పఁబడిన అన్నిటియొక్క సముదాయమును. బీజాంకురన్యాయంబునన్=విత్తుమొలకలన్యాయముచేత — విత్తువలననే మొలక పుట్టిన తీరున. కార్యకారణరూపప్రభవంబును నై=కార్యములు కారణములు ననురీతిచేత పుట్టునదియు నై-అనఁగా, పరబ్రహ్మమువలన అవ్యక్తము, అవ్యక్తమువలన మహత్తత్త్వము, మహత్తత్త్వమువలన అహంకారతత్త్వము, దానివలన పంచతన్మాత్రములు, వానివలన పంచమహాభూతములు, పంచమహాభూతములవలన పదునాలుగు భువనములు, భూతములు, వానికితగిన అన్నపానములు మొదలగునవియు పుట్టినట్టుగ ననుట. జగత్కారణశంకితంబై=జగత్తునకుఁ గారణమనెడు శంక గలదై—ఉండునదియంతయున్=ఉండుట యంతయును—జగత్కారణము నీవైయుండ మహాభూతాదులు కారణములని తోఁచుటయంతయును. భవదీయమాయావిడంబనంబుగాని=నీదైనమాయయొక్క ఆడంబరముగాని. ఉన్నయదికాదు = నిజముగా నుండునదికాదు. తదీయమాయానివర్తకుండవు = ఆమాయను తొలఁగించువాఁడవు. అయిననీవు = అయినట్టినీవు. నానావిధదివ్యావతారలీలలఁజేసి = అనేకవిధములును దివ్యములునైన అవతారవిలాసములచేత. దేవగణంబులను=దేవతాసమూహములను. సత్పురుషులను=సజ్జనులను. లోకనిర్మాణచణులు=లోకములను నిర్మించు నేర్పుగలవారు. అయిన బ్రహ్మాదులను=అయినట్టి చతుర్ముఖబ్రహ్మ మొదలైనవారలను. పరిరక్షించుచున్=చక్కగా కాపాడుచు. లోకహింసాప్రవర్తకులు=లోకములకుబాధను చేయువారు. (అయిన) దుష్టమార్గగతులన్ = చెడ్డదారినవలంబించినవారైన. క్రూరాత్ములన్=కఠినమనసు గలవారిని. హింసించుచున్=చంపుచు. విశ్వ... సేయుటకుఁగదా—విశ్వ=సమస్తమయిన. విశ్వంభరా = భూమియొక్క. భార = బరువును.

నివారణంబుసేయుటకుఁగదా=అణఁచివేయుటకేకదా. భవదీయదివ్యావతారప్రయోజనంబు = నీదైన యీయప్రాకృతావతారము నకుఫలము. కావునన్=కనుక. (నిన్ను) శరణంబు=రక్షించుటను. వేఁడెదన్=ప్రార్థించెదను.

తా॥ అదిగాక దైవము బహురూపములుగాఁగనఁబడుచున్నది ఆదియెట్లనఁగా కల కాష్ఠ మొదలగుభేదములుగలకాలమును, సుఖములను దుఃఖములను అనుభవించుటయనెడు జీవుల పుణ్యాపాపకర్మలును, చంద్రుని వెన్నెలవలె భగవంతుని యెడబాయనిదియు సత్త్వరజస్తమస్సులనెడు మూడుగుణములు గలదియునైన మూలప్రకృతియు, సుఖదుఃఖముల ననుభవించుటకు ఆస్పదమగు స్థూలశరీరమును, లోకములోని జంతువులనెల్ల నిర్వహించునదియైన ప్రాణవాయువును, భూమి మొదలైన అన్నివస్తువులను దెలిసికొనుటకు కారణమయినయంతఃకరణమును, మహత్తత్త్వమును, అహంకారము మొదలుగాఁగల తత్త్వములును, వానికికారణమయిన మూలప్రకృతియును, వీని యన్నిటియొక్క సముదాయమును, విత్తువలన మొలక పుట్టుచున్నదా మొలకవలనవిత్తుపుట్టుచున్నదా అనువిచారమునువలె కార్యకారణరూపమునఁబుట్టి జగత్తునకుఁ గారణమేదియనుశంకను జనింపఁజేయుచుండును ఇదియంతయు నీమాయయొక్క ఆడంబరమే కాని వేఱుకాదు నీవు నానావిధములైన అవతారములెత్తి బ్రహ్మ మొదలుగాఁగల సజ్జనులను కాపాడుచు వారికి చెఱుపుచేయునట్టి దుష్టులనెల్ల నాశముచేయుచు భూమిబరువును పోఁగొట్టుటయేకదా నీయవతారమెత్తినందులకు ఫలము. కాఁబట్టి నన్ను రక్షింపుమని వేఁడెదను అని తాత్పర్యము.

౪౭౮.—సీ॥ చండమై మహిత వీ * క్షణ దుస్సహంబై యు - దారమై వెలుఁగొందు * తావకీన
భూరిభాస్వత్తేజ * మునఁ దాపమొందితిఁ - గడుఁగృశించితి నన్నుఁ * గరుణఁజూడు
మితర దేవోపాస్తి * రతి మాని మీపాద - కమలముల్ సేవించు * విమల బుద్ధి
యెందాఁక మదిఁదోఁప * దందాఁక నీజగ - త్ప్రాణులు నిఖిల తా * పములఁబడుట

తే॥ యవిరళానన్య గతికుల * నరసి ప్రోచు । బిరుదుగల నీకు ననుఁగాచు * టరుదె దేవ
ప్రవిమలాకార సంసార * భయ విదూర । భక్తజనపోష పరితోష * పరమపురుష.

టీ॥ దేవ=స్వయంప్రకాశకుఁడవును. ప్రవిమలాకార=మిక్కిలి నిర్మలమయిన ఆకారముగలవాఁడవును. సంసారభయవిదూర = సంసారమువలని భయమునకు మిక్కిలిదూరమైనవాఁడవును. భక్తజనపోష=సేవకజనులను పోషించువాఁడవును. పరితోష=సంతోషస్వభావుఁడవును. పరమపురుష=పురుషోత్తముఁడవునైనఓస్వామీ. చండమై=కోపముగలదై. మహితవీక్షణదుస్సహంబై—మహిత=మహిమముగలదగుటచేత. వీక్షణ = చూపునకు. దుస్సహంబై=సహింపశక్యముకానిదై. ఉదారమై=ఆధిక్యతగలదై. వెలుఁగొందు=ప్రకాశించునట్టి. తావకీనభూరిభాస్వత్తేజమునన్ — తావకీన = నీదైన. భూరి = అధికమయిన. భాస్వత్ = వెలుఁగుచున్న. తేజమునన్=తేజస్సుచేత. తాపమొందితిన్=సంతాపమునుపొందితిని. కడున్=మిక్కిలి. కృశించితిన్=చిక్కిపోతిని. (నన్ను) కరుణన్=దయతో. చూడుము=ఆదరింపుము. ఇతరదేవోపాస్తిరతిన్=ఇతరమైన దేవతలయొక్క యుపాసనయందలి ఆసక్తిని. మాని=వదలి. మీపాదకమలములు = మీయొక్క కమలములవంటి పాదములను. సేవించు విమలబుద్ధి=సేవింపవలెనను నిర్మలమయినబుద్ధి. ఎందాఁకన్=ఎంతవఱకు. మదిన్=మనసునందు. తోఁపదు=తోఁచదో. అందాఁకన్=అంతదాఁక. ఈజగత్ప్రాణులు=ఈలోకములోనిజీవులు. నిఖిలతాపములన్ = ఆధ్యాత్మికము ఆధిదైవికము ఆధిభౌతికము అను సమస్తములయిన సంతాపములను. పడుట = పొందుటయు. అవిరళానన్యగతికులన్ = సందువీడని యితరగతిలేనివారిని. అరసిప్రోచు బిరుదు=విచారించి కాపాడునట్టిబిరుదు. కలనీకున్=కలిగినట్టినీకు. ననున్=నన్ను. కాచుట=కాపాడుట. అరుదె=ఆశ్చర్యమా. (లేక) దుర్లభమా.

తా॥ స్వయంప్రకాశుఁడవును, నిర్మలమయిన ఆకృతిగలవాఁడవును, సంసారభయము లేనివాఁడవును, భక్తులను పోషించువాఁ

డవును, సదా సంతోషించువాఁడవును, పురుషోత్తముఁడవు నైన శ్రీకృష్ణా! కోపముగలదై చూపులకు భయమగొలుపునదియై ఆధిక్యత గలదై వెలుఁగునట్టి నీతేజస్సుయొక్క వేండ్రముచేత మిక్కిలి తాపమునొందితిని,చాలచిక్కిపోతిని, నన్ను దయచేసి ఆదరింపుము, ఇతర దేవతలను కొలుచుట మాని నిన్నే సేవింపవలెనన్న బుద్ధి యెందాఁక పుట్టదో అంతదాఁక ఈలోకములోని జీవులకు పరితాపము తప్పదుకనుక దిక్కులేనివారిని కాపాడుదునన్నబిరుదుగల నీకు నన్నుకాపాడుటదుర్లభముగాదు కాఁబట్టి నన్నేలుకొమ్మనితా.

౪౭౯.—చ॥ అనినఁ బ్రసన్నుఁడై హరి య * నంతుఁడు దైత్యవిభేది దాని కి
ట్లనియె మదీయ సాధన మ * నన్య నివారణ మౌట నీమదిం
గని నను నార్తిఁ జొచ్చితివి * గావున మజ్జ్వరతీవ్రదాహ వే
దన నినుఁబొందదింకఁ బరి * తాపము దక్కుము నీమనంబునన్.

టీ॥ (అనిన) ప్రసన్నుఁడై = అనుగ్రహముగలవాఁడై. అనంతుఁడు=అంతములేనివాఁడయిన. దైత్యవిభేది=రాక్షసులనుభేదించువాఁడయిన. హరి=శ్రీకృష్ణుఁడు. దానికిన్ = ఆశైవజ్వరముతో. (ఇట్లు) అనియెన్ = పలికెను. మదీయసాధనము = నాయుపకరణము—నాసంబంధమయినజ్వరము. అనన్యనివారణము=ఇతరులచేత నిలుపఁగూడనిది. ఔటన్=అగుటను. నీమదిన్ = నీమనసులో. కని=తెలిసికొని. ననున్=నన్ను. ఆర్తిన్ = దుఃఖముతో. చొచ్చితివి=చేరితివి. కావునన్=కనుక. మజ్జ్వరతీవ్రదాహవేదన=నాజ్వరముయొక్కతీక్ష్ణమయినవెట్టవలనిబాధ. ఇంకన్=ఇఁకను.నినున్= నిన్ను. (పొందదు) నీమనంబునన్ = నీమనసులో. పరితాపము = సంతాపమును. తక్కుము=మానుము.

తా॥ అని శైవజ్వరము వేఁడుకొనఁగా రాక్షసనాశకుఁడును నాశరహితుఁడునైన శ్రీకృష్ణమూర్తి దాని ననుగ్రహించినవాఁడై నాసంబంధమయినజ్వరము ఇతరులవలన నివారింపఁబడునదికాదను విషయమును నీవు తెలిసికొనివచ్చి నామఱుఁగుఁ జొచ్చితివికాఁబట్టి ఇఁకను ఆజ్వరబాధ నిన్ను పొందదు నీమనసులోని విచారముమాని నెమ్మదినొందుమని చెప్పెనని తాత్పర్యము.

వ॥ అనిమఱియు నప్పుండరీకాక్షుం డిట్లను నెవ్వరేనియు నీయుభయజ్వర వివాదంబును నీవు మత్ప్రపత్తిం జొచ్చుటయుఁ జిత్తంబులఁ దలంతు రట్టిపుణ్యాత్ములు శీతోష్ణజ్వరాది తాపంబులం బొరయరని యానతిచ్చిన నమ్మహేశ్వరజ్వరంబు పరమానంద భరిత హృదయంబున నారథాంగపాణికి సాష్టాంగ దండప్రణామం బాచరించి నిజేచ్ఛం జనియె నంత బాణాసురుండు.

టీ॥ (అని) మఱియున్ = ఇంకను. అప్పుండరీకాక్షుండు=ఆశ్రీకృష్ణమూర్తి. ఇట్లనున్=ఇట్లుపలికెను. ఎవ్వరేనియున్=ఏమానవులైనను. ఈయుభయజ్వరవివాదంబును=ఈరెండుజ్వరములపోరాటమును. (నీవు) మత్ప్రపత్తిన్=నాప్రాపకమునందు. (చొచ్చుటయు) నాయనుగ్రహమునుపొందుటయుననుట. చిత్తంబులన్=మనసులలో. తలంతురు=ఎంతురో. అట్టిపుణ్యాత్ములు=అటువంటిమంచిమనసుగలవారు—సజ్జనులనుట. శీతోష్ణజ్వరాదితాపంబులన్=శీతజ్వరముతాపజ్వరము వీనివలని తాపములను. పొరయరు=పొందరు. అనియానతిచ్చినన్ = అనిసెలవియ్యఁగా. అమ్మహేశ్వరజ్వరంబు = ఆశైవజ్వరము. పరమానందభరితహృదయంబునన్=మిక్కుటమైనసంతోషముతో—నిండుకొన్నమనస్సుతో. ఆరథాంగపాణికిన్=ఆచక్రము చేతియందుఁగలకృష్ణమూర్తికి. సాష్టాంగదండప్రణామంబు=ఎనిమిదియంగములతోడిదైన దండాకారమయిన నమస్కారమును. ఆచరించి=చేసి.నిజేచ్ఛంజనియెన్=యథేచ్ఛముగాపోయెను.అంతన్= అంతట. (బాణాసురుండు) ఆక్కడన్=అంతఃపురమునందు.

తా॥ అనిచెప్పి మఱియు ఆశైవజ్వరముతో శ్రీకృష్ణమూర్తి యేమనియె ననఁగా ఎవరుగాని యీరెండుజ్వరముల కలహమును, నీవు నాయనుగ్రహమును పొందుటయు, మనసులలో తలఁతురో, అటువంటిసజ్జనులు చలిజ్వరము ఉష్ణజ్వరము అనునివి మొదలయినవానివలని తాపమును పొందరు అని చెప్పి యుత్తరవియ్యఁగా ఆకృష్ణమూర్తికిసాగిలఁబడి మ్రొక్కి శైవజ్వరము యథేచ్ఛముగాపోయెను పిమ్మట అంతఃపురముచేరిన బాణాసురుఁ డేమిచేసెననఁగాననితా.

౪౮౧.—సీ॥ కమనీయ కింకిణీ * ఘంటికాది సహస్ర - ఘణఘణ ధ్వనిచేత * గగన మగల
నన్యజనాలోక * నాభీల తరళోగ్ర - కాంచన ధ్వజపతా * కలు వెలుంగఁ
బృథు నేమిఘట్టనఁ * బృథివి గంపింపంగ - వలనొప్పఁ బటుజవా * శ్వములఁబూన్చి
నట్టి యున్నత రథం * బత్యుగ్ర గతి నెక్కి - కరసహస్రముల భీ * కర తరాసి

తే॥ శర శరాసన ముఖ దివ్య * సాధనములు । దనరఁ జలమును బలము ను * త్కటము గాఁగ
హర్ష మిగురొత్తఁ గయ్యంపు * టాయితముగఁ । బురము వెలువడె బలిపుత్త్రుఁ * డురుజవమున.

టీ॥ కమనీయ...చేతన్—కమనీయ=మనోజ్ఞమయిన. కింకిణీ=చిఱుగంటలు.ఘంటికా=గంటలు.ఆది=మొదలుగాఁగల.సహస్ర= వేయింటియొక్క. ఘణఘణధ్వనిచేతన్ = ఘణఘణయనుమ్రోఁతచేత. గగనము=ఆకాశము. అగలన్=బ్రద్దలువాఱఁగా. అన్య...

పతాకలు—అన్యజన=శత్రుజనులయొక్క. ఆలోకన = చూపులకు. ఆభీల=భయమును బుట్టించుచు. తరళ=చలించునవియైన. ఉగ్ర=భయంకరములైన. కాంచన=బంగారుమయములయిన. ధ్వజపతాకలు = ధ్వజస్తంభములును టెక్కెములును. వెలుంగన్ = ప్రకాశింపఁగా. పృధునేమిఘట్టనన్=పెద్దవైన చక్రముల చుట్టుకమ్ముల యొక్క యొఱపిడిచేత. పృధివి=భూమి. కంపింపంగన్ = వడఁకఁగా. వలనొప్పన్=అనువుగా. పటుజవాశ్వములన్ = బలవంతములును వేగము గలిగినవియునైన గుఱ్ఱములను. పూన్చినట్టియున్నతరథంబు=కట్టిన గొప్ప తేరును. అత్యుగ్రగతిన్=అతిభయంకరమైన గమనముతో. (ఎక్కి) కరసహస్రములన్=వేయిచేతులందును. భీక...సాధనములు—భీకరతర = మిక్కిలిభయంకరములయిన. అసి=ఖడ్గములు. శర=బాణములు. శరాసన=విండ్లు. ముఖ=మొదలైన. దివ్యసాధనములు=మేలయిన ఆయుధములు. తనరన్ = ఒప్పుచుండఁగా. చలమును=పట్టుదలయు. బలమును=శక్తియు. ఉత్కటముగాఁగన్=హెచ్చఁగా. హర్షము = సంతోషము. ఇగురొత్తన్=అంకురింపఁగా — క్రొత్తగాపుట్టుచుండఁగా. కయ్యంపుటాయితముగన్=యుద్ధమునకుసిద్ధముగా. ఉరుజవమునన్=మిక్కిలివడితో. బలిపుత్రుఁడు=బలిచక్రవర్తికొడుకైనబాణాసురుఁడు. పురము వెలువడెన్=పట్టణమునుండి బయలుదేఱెను.

తా॥ మనోహరములయిన చిఱుగంటలు పెనుగంటలు మొదలగునవి అనేకములు గణగణయని మ్రోఁగు చప్పుడుచేత ఆకాశమున ప్రతిధ్వని కలుగుచుండఁగా శత్రువులకు వెఱపు పుట్టించునట్టి భయంకరమయిన ధ్వజస్తంభములును టెక్కెములును వెలుఁగుచుండఁగా పెద్దపెద్ద రథచక్రముల కడెకమ్ములయొఱపిడిచేతభూమి అదురుచుండఁగా మిక్కిలివడిగల బలవంతములయిన గుఱ్ఱములను గట్టిన రథముపైనెక్కి వేయిచేతులందు కత్తులు బాణములు విండ్లు మొదలుగాఁగల బహువిధముల ఆయుధములను ధరించి చలమును బలమును హెచ్చఁగా మిక్కిలి సంతోషముతో యుద్ధమునకు సిద్ధపడినవాఁడై మిగులవడితో బాణాసురుఁడు పట్టణమునుండి బయలువెడలెనని తాత్పర్యము.



బాణాసురుఁడు.



కృష్ణుఁడు.



(*) బాణాసురుఁడు రెండవ తేప యుద్ధమునకు వచ్చి శ్రీకృష్ణునిచేత ఓడుట. (*)

౪౮౨.—క॥ చని రణభూమిని మధ్యం । దిన మార్తాండ ప్రచండ * దీప్తాకృతితోఁ

దనరుచుఁ బరిపంథి బలౌ । ఘన దవశిఖియైన కృష్ణుఁ * దాఁకెం బెలుచన్.

టీ॥ చని = ఈవిధముగా యుద్ధరంగమునకుఁ బోయి. రణభూమిని = ఆయుద్ధరంగమునందు. మధ్యందిన...దీప్తాకృతితోన్ — మధ్యందిన = మధ్యాహ్నకాలమునందలి. మార్తాండ = సూర్యుని యొక్క. ప్రచండ = తీవ్రమయిన. దీప్త = వెలుఁగునట్టి. ఆకృతితోన్ = ఆకారముతో. తనరుచున్ = ఒప్పుచు. పరిపంధిబలేంధనదవశిఖి — పరిపంధి = శత్రువులయొక్క. బల = దండనెడు. ఇంధన = ఎండుకట్టెలకు. దవశిఖి = కార్చిచ్చు. ఐనకృష్ణున్ = అయినట్టికృష్ణమూర్తిని. వెలుచన్ = వడిగా. తాఁకెన్ = మారుకొనెను.

తా॥ ఈవిధముగా యుద్ధభూమికి పోయి అచ్చట మధ్యాహ్నకాలమునందలి సూర్యునివలె వెలుఁగుచు శత్రుసేనలనెడు ఎండు కట్టెలకు కార్చిచ్చువంటి వాఁడైయుండెడి శ్రీకృష్ణమూర్తిని ఎదిరించెను అని తాత్పర్యము.

౪౮౩.—ఉ॥ తాఁకి భుజావిజృంభణము * దర్పము నేర్పును నేర్పడంగ నొ
క్కూఁకున వేయుచేతుల మ * హోగ్రశరావలి పింజపింజతోఁ
దాఁకఁగ నేసినన్ మురవి * దారుఁడు తోడన దచ్ఛరావళిన్
నాఁక గొనాక ద్రుంచె నిశి * తార్ధ శశాంక శిలీముఖంబులన్.

టీ॥ తాఁకి = మార్కొని. భుజావిజృంభణమున్ = భుజముల ఆటోపమును. దర్పమున్ = గర్వమును. నేర్పును = సామర్థ్యమును. ఏర్పడంగన్ = కనఁబడునట్లుగా. ఒక్కూఁకునన్ = ఒక్కపూనికతో. వేయిచేతులన్ = వేయిచేతులతోను. మహోగ్రశరావలి = మిక్కిలివాఁడులైనబాణములపఙ్క్తులు. పింజపింజతోఁదాఁకఁగన్ = ఒకదానిపింజతో నొకటి యంటుకొని కట్టిచాఁపినట్టు కనఁబడునట్టుగా. ఏసినన్ = ప్రయోగింపఁగా. మురవిదారుఁడు = కృష్ణుఁడు. తోడన = వెంటనే. నిశితార్ధశశాంకశిలీముఖంబులన్ = వాఁడులైన అర్ధచంద్రబాణములచేత. తచ్ఛరావళిన్ = ఆబాణపఙ్క్తిని. ఆఁక గొనాక = లత్యపెట్టక. త్రుంచెన్ = తెగనఱికెను.

తా॥ అట్లు ఎదిరించి తన భుజబలమును గర్వమును సామర్థ్యమును తెలియఁబడునట్లుగా బాణాసురుఁడు బాణములను పింజపింజ తాఁకి యేకాకారముగా తోఁచునట్లు ప్రయోగింపఁగా శ్రీకృష్ణమూర్తి వానిని అలత్యముగా అర్ధచంద్రబాణములతో తునుకలు తునుకలుగా తెగనఱికివేసెనని తాత్పర్యము.

౪౮౪.—చ॥ నుతనవ పుండరీక నయ * నుం డననొప్పు మురారి రోష ఘూ
ర్ణిత మహితారుణాబ్జ దళ * నేత్రుఁడు దానయి పంచె దైత్యుపై
దితిసుత కానన ప్రకర * దీపిత శుక్రము రక్షితాంచితా
శ్రితజన చక్రమున్ సతత * సేవిత శక్రము దివ్య చక్రమున్.

టీ॥ నుతనవపుండరీకనయనుండు = కొనియాడఁబడిన క్రొత్త తెల్లదామరలవంటి కన్నులుగలవాఁడు. అననొప్పుమురారి = అనఁదగిన శ్రీకృష్ణమూర్తి. రోషఘూర్ణిత...నేత్రుఁడు — రోష = కోపముచేత. ఘూర్ణిత = తిరుగుడుపడుచున్న. మహిత = గొప్పలైన. అరుణ = ఎఱ్ఱనైన. అబ్జ = కమలములయొక్క. దళ = తేకులవంటి. నేత్రుఁడు = కన్నులుగలవాఁడు. (తానయి) దైత్యుపైన్ = బాణాసురునిమీఁదికి. దితిసుతకాననప్రకరదీపితశుక్రమున్ — దితిసుత = దైత్యులనెడు. కాననప్రకర = అడవిసమూహమును. దీపిత = కాల్చునట్టి. శుక్రమున్ = అగ్నియైనదియు. రక్షితాంచితాశ్రితజనచక్రమున్ — రక్షిత = కాపాడఁబడిన. అంచిత = ఒప్పిదమయిన. ఆశ్రితజన = సేవకజనులయొక్క. చక్రమున్ = సమూహముగలిగినదియు. సతతసేవితశక్రమున్ = ఎల్లప్పుడుకొలువఁబడిన యింద్రుఁడుగలిగినదియు నైన. దివ్యచక్రమున్ = సుదర్శనచక్రమును. పంచెన్ = పంపెను.

తా॥ అంతట తెల్లదామరలవంటి కన్నులు గలవాఁడైన శ్రీకృష్ణమూర్తియెఱ్ఱదామర తేకులవంటికన్నులుగలవాఁడై అనఁగాకోపముచేత కన్నులు ఎఱ్ఱఁగా జేసికొన్నవాఁడై రాక్షసులను ధ్వంసము చేయునదియు, ఆశ్రితులను సంరక్షించునదియు, ఎల్లప్పుడు ఇంద్రునిచేత సేవింపఁబడుచుండు నదియునైన సుదర్శనచక్రమును బాణాసురునిపై ప్రయోగించెనని తాత్పర్యము.

వ॥ అదియునుం బ్రచండ మార్తాండ మండల ప్రభావిడంబితంబును భీషణ శతసహస్రకోటి దంభోళి నిబిడ నిశిత నిష్ఠుర ధారాసహస్ర ప్రభూత జ్వలన జ్వాలికాపాస్త సమస్త కుటిల పరిపంధి దుర్వార బాహు గర్వాంధకారంబును, సకలదిక్పాల దేవతాగణ జేగీయమానంబును, సమంచిత దానవజన లోక భయంకర దర్శనంబునగు సుదర్శనం బసురాంతక ప్రేరితంబై చని యారామకారుండు కదలికా కాండంబులనేర్చు చందంబునం బేర్చి సమద వేదండ శుండాదండ మండితంబును, గనకమణివలయ కేయూర కంకణాంకితంబునగు తదీయ బాహాసహస్రంబుఁ గరచతుష్టయావశిష్టంబుగాఁ దునుము నవసరంబున.

టీ॥ అదియును = ఆచక్రాయుధమును. ప్రచండమార్తాండమండలప్రభావిడంబితంబును = తీవ్రమయిన సూర్యబింబముయొక్క ప్రకాశమును ప్రకటించునదియు, భీషణ..., కారంబును — భీషణ = భయంకరమయిన. శతసహస్రకోటి = నూఱువేలయంచులుగల. దంభోళి = వజ్రాయుధమువలె. నిబిడ = అతిశయించిన. నిశిత = వాఁడిమిగల. నిష్ఠుర = క్రూరమయిన. ధారాసహస్ర = వేయంచుల

వలననుండి. ప్రభూత=పుట్టిన. జ్వలన=అగ్నియొక్క. జ్వాలికా=మంటలచేత. అపాస్త=తొలఁగింపఁబడిన. సమస్త=సకలమయిన. కుటిల = క్రూరులైన. పరిపంధి = శత్రువులయొక్క. దుర్వార=అణఁపరాని. బాహుగర్వ = భుజగర్వమనెడు. అంధకారంబును=చీకట్లుకలిగినదియు. సకల... జేగీయమానంబును—సకలదిక్పాల = ఎల్లదిక్పాలకులచేతను. దేవతాగణ = దేవతల గుంపులచేతను. జేగీయమానంబును=జయజయయని కొనియాడఁబడుచున్నది. సమంచిత ... దర్శనంబును — సమంచిత = ఒప్పిదమయిన. దానవజన=రాక్షసజనులయొక్క. లోక=సమూహమునకు. భయంకరదర్శనంబును=భయమును పుట్టించు చూపు గలదియు. అగుసుదర్శనంబు=అగునట్టిసుదర్శనచక్రము. అసురాంతకప్రేరితంబై = కృష్ణునిచేతఁ బ్రేరేపింపఁబడినదై. చని = పోయి. ఆరామకారుండు = తోఁటవాఁడు. కదళీకాకాండంబులన్ = అరఁటిచెట్ల సమూహములను. ఏర్చుచందంబునన్=ఏర్పఱించి నఱకునట్లు. పేర్చి = విజృంభించి. సమద... మండితంబును—సమద = మదముతోఁగూడిన. వేదండ=ఏనుఁగుయొక్క. శుండాదండ=కఱ్ఱవంటితొండమునువలె. మండితంబును = అలంకరింపఁబడినదియు. కనక ...కితంబును—కనక=బంగారును. మణి=రత్నములునుగలవై. వలయ=గుండ్రనైన. లేక, గగనమణివలయ=సూర్యునియొక్క. పరివేషమువంటి. కేయూర=భుజకీర్తులచేతను. కంకణ = ముంజేతికడియములచేతను. అంకితంబును = గుఱుతిడఁబడినదియు. అగుతదీయబాహాసహస్రంబున్ = అగునట్టి వానివేయిచేతులను. కరచతుష్టయావశిష్టంబుగాన్ = నాలుగుచేతులు మిగిలినవి అగునట్టుగా. తునుమునవసరంబునన్=నఱకునప్పుడు.

తా॥ ఆచక్రాయుధము మిక్కిలి వెలుఁగుచున్న సూర్యబింబమునుబోలినదై, భయంకరమైన నూఱువేలంచులుగల వజ్రాయుధమువలె క్రూరమయి, అడఁపరాని క్రూరులైన శత్రువుల గర్వమును అణఁచునదియు, ఎల్లదిక్పాలకులచేతను దేవతాసమూహములచేతను సేవింపఁబడుచున్నదియు, గొప్పవారైన రాక్షసులసమూహమునకు చూచునప్పుడే భయమును పుట్టించునదియునై శ్రీకృష్ణమూర్తిచేత ప్రేరేపింపఁబడినదై తోఁటవాఁడు గెలవేసిన అరఁటిచెట్లను ఏర్పఱచి నఱకునట్లు ఏనుఁగు తొండములను బోలినవియు సూర్యపరివేషమువలె మణులకాంతులచేత వెలుఁగుచున్నవియునై భుజకీర్తులును కంకణములును గలిగి వెలుఁగునవియునైన బాణాసురుని వేయిచేతులనునాలుగుచేతులుమిగులుగాన ఱకినట్టిసమయమునందు అనితా




(*) సాంబమూర్తి శ్రీకృష్ణమూర్తినిఁ బొగడుట. (*)

౪౮౬.—తే॥ కాలకంఠుఁడు బాణుపైఁ * గరుణ గలఁడు । గాన నఖిలాండపతిఁ గృష్ణుఁ * గదియ వచ్చి
పురుషసూక్తంబుచదివి సం * పుటకరాబ్జుఁ । డగుచుఁ బద్మాయతాక్షు ని * ట్లని నుతించె.

టీ॥ కాలకంఠుఁడు=శివుఁడు. బాణుపైన్=బాణాసురునిమీఁద. కరుణగలఁడు=దయగల్లవాఁడు. కానన్ = కాఁబట్టి. అఖిలాండపతిన్ = బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ మాయాండములకు ప్రభువైన. కృష్ణున్=కృష్ణమూర్తిని. కదియవచ్చి=మిక్కిలి చేరవచ్చి. పురుషసూక్తంబుచదివి=పురుషసూక్తపద్ధతిని ధ్యానించి. సంపుటకరాబ్జుఁడు=మోడ్పఁబడిన చేదామరలుగల్లవాఁడు. (అగుచును) పద్మాయతాక్షున్=తామరలవలె విశాలములయిన కన్నులు గల కృష్ణమూర్తిని. (ఇట్లని) నుతించెన్=స్తోత్రముచేసెను.

తా॥ శివుఁడు బాణాసురునియందు దయగలవాఁడు కాఁబట్టి సర్వేశ్వరుఁడైన శ్రీకృష్ణమూర్తియొద్దకువచ్చి రెండుచేతులుజోడించుకొని ఆకృష్ణమూర్తిని పురుషసూక్తపద్ధతినిధ్యానించి యీవిధముగా పొగడెనని తాత్పర్యము.

వ॥ దేవా నీవు బ్రహ్మస్వరూపంబగు జ్యోతిర్మయుండవు, నిఖిల వేద వేదాంత నిరూఢుండవు, నిర్మలుండవు, సమానాధికరహితుండవు, సర్వవ్యాపకుండవైననిన్ను నిర్మలాంతఃకరణులైనవార లాకాశంబుపగిది నవలోకింతు

రదియునుంగాక పంచోపనిషన్మయంబైన భవదీయ దివ్యమంగళ మహావిగ్రహ పరిగ్రహంబు సేయునెడ నాభి యందాకాశంబును, ముఖంబునం గృశానుండును, శిరంబున స్వర్గంబును, శ్రోత్రంబులఁదిశలను, నేత్రంబుల సూర్యుండును, మనంబున సోమకాములును, బాదంబుల వసుంధరయు, నహంకారంబునం దాత్మయు, జఠరంబున జడధులును, రేతంబున నంబువులును, భుజంబులనింద్రుఁడును, రోమంబుల మహీరుహౌషధివ్రాతంబును, శిరోజంబుల మేఘంబులును, బుద్ధి ధిషణుండును, మేహనంబున బ్రహ్మలును, జ్ఞానంబున సృష్టియు, హృదయంబున ధర్మంబునుగలిగి మహాపురుషుండవై లోకకల్పనంబుకొఱకు నీయకుంఠిత తేజంబు గుప్తంబుచేసి జగదుద్భవంబుకొఱకుఁ గైకొన్న భవదీయ దివ్యావతార వైభవంబెఱింగి నుతింప నెంతవారము నీవు సకల చేతనాచేతన నిచయంబుల కాద్యుండవు, నద్వితీయుండవు, పురాణపురుషుండవు, సకలసృష్టిహేతుభూతుండవు, దినకరుండు, కాదంబినీకదంబావృతుండగుచు భిన్నరూపుండై బహువిధచ్ఛాయలం దోఁచువిధంబున నీయఘటిత ఘటనానిర్వాహకంబైన సంకల్పంబునఁ ద్రిగుణాతీతుండవయ్యును సత్త్వాదిగుణవ్యవధానంబుల ననేకరూపుండవై గుణవంతులైన సత్పురుషులకుఁ దమోనివారకంబైన దీపంబు రూపంబునం బ్రకాశించుచుందువు, భవదీయ మాయావిమోహితులైన జీవులు పుత్ర దార గృహ క్షేత్ర సంసారాదిరూపంబైన పాప పారావార మహావర్తగర్తంబుల మునుంగుచుం దేలుచుందురు, దేవా భవదీయ దివ్యరూపానుభవంబు సేయంజాలక యింద్రియ పరతంత్రుండై భవత్పాదసరసీరుహంబుల నేర్పున నేకాంతభక్తిచేతఁ జేరనెఱుంగని మూఢాత్ముం డాత్మవంచకుండనంబడు విపరీతబుద్ధిం జేసి ప్రియుండవైననిన్నునొల్లక యింద్రియార్థానుభవంబు సేయుట యమృతంబుమాని హాలాహలంబు సేవించుట గాదె జగదుదయపాలనలయలీలాహేతుండవై శాంతుండవై సుహృజ్జన భాగధేయుండవై సమానాధిక వస్తుశూన్యుండవైననిన్ను నేనును బ్రహ్మయుం బరిణతాంతఃకరణులైన మునిగణంబులును భజించుచుందుము మఱియును.

టీ॥ దేవా=స్వామీ. (నీవు) బ్రహ్మస్వరూపంబు=సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపము. (అగు) జ్యోతిర్మయుండవు=సూర్యచంద్రాగ్నులకాంతులనుమీఱిన తేజస్సే స్వరూపముగాఁగలవాఁడవు. నిఖిల వేదవేదాంతనిరూఢుండవు = ఋగ్యజుస్సామాథర్వములనెడు వేదములయందును, సకలోపనిషత్తులందును దృఢముగా చెప్పఁబడువాఁడవు. నిర్మలుండవు=ఆణవ కార్మిక మాయిక మాయేయ తిరోధానములనెడు మలినములు లేనివాఁడవు. సమానాధికరహితుండవు = సమానులును అధికులును లేనివాఁడవు — సర్వమును నీకు లోఁబడినదేగాని నీకు సమానమైనదిగాని నీకు మించినదిగాని లేదనుట. సర్వవ్యాపకుండవు = స్థావరజంగమాత్మకమైన ప్రపంచమం దెల్లయెడలనిండియుండువాఁడవు. (అయిననిన్ను) నిర్మలాంతఃకరణులైనవారలు = రాగ ద్వేషాదులులేని అంతరంగముగలవారు. ఆకాశంబుపగిదిన్ = అన్నిటిని అంటియును అంటకయున్న మింటివలె. అవలోకింతురు=చూతురు. అదియునుంగాక=అంతేగాక. పంచోపనిషన్మయంబు=పంచోపనిషత్తులవికారము. (ఐన) భవదీయ...చేయునెడన్—భవదీయ=నీదైన. దివ్య = అప్రాకృతమయిన. మంగళ=శుభస్వరూపమయిన. మహావిగ్రహ=విరాడ్విగ్రహముయొక్క. పరిగ్రహంబుసేయునెడన్=ధరించునపుడు. నాభియందున్ = బొడ్డునందు. (ఆకాశంబును) ముఖంబునన్ = మొగమునందు. కృశానుండును=అగ్నియు. శిరంబునన్=తలయందు. స్వర్గంబును=దేవలోకమును. శ్రోత్రంబులన్ = చెవులయందు. దిశలను = దిక్కులును. నేత్రంబులన్=కన్నులందు. (సూర్యుండును) మనంబునన్ = మనసునందు. సోమకాములును=చంద్రమన్మథులును. పాదంబులన్=అడుగులయందు. వసుంధరయున్ = భూమియు. అహంకారంబునన్= భూతాదియైన అహంకారమందు. ఆత్మయున్=శివుఁడవైన నేనును. జఠరంబునన్ = కడుపునందు. జడధులును=సముద్రములును. రేతంబునన్=రేతస్సునందు. అంబువులును=నీళ్లును. భుజంబులన్=బాహువులయందు. ఇంద్రుండును=ఇంద్రుఁడు మొదలగు దిక్పాలకులును. రోమంబులన్ = మేనివెండ్రుకలయందు. మహీరుహ=వృక్షములు. ఓషధి=పైరులు. వ్రాతంబును = వీనియొక్క సమూహమును. శిరోజంబులన్=తలవెండ్రుకలయందు. మేఘంబులును=ఆవర్తకాది మేఘములును. బుద్ధిన్=నిశ్చయరూపమైన బుద్ధియందు. ధిషణుండును = బృహస్పతియును. (మేహనంబున) బ్రహ్మలును = సృష్టికర్తలైనచతుర్ముఖుఁడు మొదలగుబ్రహ్మలును. జ్ఞానంబునన్ = తెలివియందు. (సృష్టియు) హృదయంబునన్ = అంతఃకరణమందు. ధర్మంబును= పుణ్యమును. (కలిగి) మహాపురుషుండవై = పంచకర్తలను మీఱినవాఁడవై. లోకకల్పనంబుకొఱకున్=లోకమునుకల్పించుటకొఱకు. నీయకుంఠితతేజంబున్=కొఱఁతపడని నీతేజస్సును. గుప్తంబుచేసి= దాఁచి. జగదుద్భవంబుకొఱకున్=లోకముయొక్క పుట్టుకకొఱకు. కైకొన్న = గ్రహించిన. భవదీయదివ్యావతారవైభవంబు=నీదైన స్వయంప్రకాశకమయిన అవతారవిభవము. ఎఱింగి = తెలిసి. నుతింపన్ = స్తోత్రముచేయను. ఎంతవారము = ఏపాటివారము. నీవు = సర్వకర్తవైననీవు. సకలచేతనాచేతననిచయంబులకున్ — సకల=సమస్తమయిన. చేతన=ప్రాణులయొక్కయు. అచేతన= జడములయొక్కయు. నిచయంబులకున్=సమూహములకు. ఆద్యుండవు=పుట్టింపపెంపద్రుంప మొదటివాఁడవును. అద్వితీయుండవు= రెండవది లేనివాఁడవును — సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనివాఁడవనుట. పురాణపురుషుండవు=పంచకర్తలకుముందునున్న వాఁడవును. సకలసృష్టిహేతుభూతుండవు=ప్రపంచసృష్టికి కారణమయినవాఁడవు—బ్రహ్మవనుట. దినకరుండు=సూర్యుఁడు. కాదంబినీ

కదంబావృతుండు=మేఘపఙ్క్తులసమూహముచేత ఆవరింపఁబడిన వాఁడు(అగుచును)భిన్నరూపుండై=భేదపడినరూపములుగలవాఁడై బహువిధచ్ఛాయలన్ = నానావిధములయినవర్ణముల్చేత. తోఁచు విధంబునన్ = కనఁబడునట్లు. నీయఘటితఘటనానిర్వాహకంబు= నీదైన కూర్పరానిదాని కూర్చుసామర్థ్యముకలది. అయినసంకల్పం బునన్=అయినట్టి తలఁపుచేత. త్రిగుణాతీతుండవు = సత్త్వరజస్త మస్సులనెడు మూఁడుగుణములనుకడచినవాఁడవు. అయ్యును=అయి యుండియును. సత్త్వాదిగుణవ్యవధానంబులన్=సత్త్వము మొదలగు గుణభేదములచేత. అనేకరూపుండవై = బహురూపములు గల వాఁడవై. గుణవంతులైనసత్పురుషులకున్=శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ మొదలైన సుగుణములు గలవారైన సజ్జనులకు. తమో నివారకంబు=అజ్ఞానమనెడిచీఁకటిని పోఁగొట్టునది. అయినదీపంబు రూపంబునన్ = అయినట్టి విజ్ఞానమనెడు దీపమువలె. ప్రకాశించు చుండువు = వెలుఁగుచుండువు. భవదీయమాయావిమోహితులు= నీదైనమాయచేత మోహము నొందినవారు. ఐనజీవులు=అయినట్టి బద్ధజీవులు. పుత్ర...రూపంబు – పుత్ర = కొడుకులు. దార = పెండ్లాలు. గృహ=ఇండ్లు. క్షేత్ర = పంటపొలములు. సంసార = క్షాపురము. ఆది = మొదలుగాఁగల. రూపంబు = విధముగలది. అయిన...గర్తంబులన్–(అయిన) పాప=పాపములనెడు. పారా వార=సముద్రమునందలి. మహావర్త = పెద్దపెద్దసుళ్లనెడు. గర్తం బులన్=పల్లములయందు. మునుంగుచున్=మునుఁగుచును. (తేలు చును ఉందురు) దేవా = స్వామీ. భవదీయదివ్యరూపానుభవంబు సేయంజాలక=నీదైనయప్రాకృతరూపమును సేవింపనేరక. ఇంద్రియ పరతంత్రుండై = ఇంద్రియవ్యవహారములకు లోఁబడిన నడవడిగల వాఁడై. భవత్పాదసరసీరుహంబులన్ = నీపాద కమలములను. నేర్పునన్ = ఉపాయముచేత. (ఏకాంతభక్తిచేత) చేరన్=సమీ పించుటకు. ఎఱుంగని=తెలియని. మూఢాత్ముండు = తెలివిమాలిన బుద్ధిగలవాఁడు. ఆత్మవంచకుండు=తన్నుతాను మోసపుచ్చుకొన్న వాఁడు–ఆత్మద్రోహి. (అనంబడును) విపరీతబుద్ధింజేసి = నీకంటె దేవతాంతర మంత్రాంతర సాధనాంతరములుకలవనెడు విరుద్ధబుద్ధి చేత ప్రియుండవు=మేలుచేయువాఁడవు–సర్వప్రాణులచేతకోరఁ దగినవాఁడవనుట. (అయిన) నిన్నున్ = సర్వస్వామివైన నిన్ను. ఒల్లక=అపేక్షింపక. ఇంద్రియార్థానుభవంబు సేయుట = ఇంద్రియ సుఖములను అనుభవించుట. అమృతంబుమాని=అమృతమునువదలి. హాలాహలంబున్=విషమును. సేవించుట=త్రాగుట. కాదె=కదా. జగదు...హేతుండవు–జగత్ = లోకముయొక్క. ఉదయ=పుట్టుక. పాలన = రక్షణము. లయ = నాశమునెడు. లీలా = వేడుకకు. హేతుండవు=కారణమయినవాఁడవు. (అయి) శాంతుండవై=శుద్ధ సత్త్వవృత్తిగలవాఁడవై. సుహృజ్జనభాగధేయుండవై = బ్రహ్మనిష్ఠుల పాలిటి భాగ్యస్వరూపుఁడవై. సమానాధికవస్తుశూన్యుండవైన = నీకు సమానమును అధికమునైన వస్తువులు లేనివాఁడవైన. (నిన్ను) నేనును=శివుఁడనైననేనును. (బ్రహ్మయు) పరిణతాంతఃకరణులు= శ్రవణ మనన నిదిధ్యాసములచేత నిన్ను సేవించుటయందు తేఱిన మనసుగలవారు. అయినమునిగణంబులును=అయినట్టి సనక నారద వామ దేవాది ఋషిశ్రేష్ఠులును. భజించుచుందుము = సేవించు చుందుము. మఱియును=ఇంతేగాక–ఇట్లు సేవించుచుండుటయేగాక.

తా॥ ఓస్వామీ! నీవు సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమయిన తేజస్సే అయినవాఁడవు, ఎల్ల వేదములయందును వేదాంతముల యందును ప్రసిద్ధుఁడవు, పంచమలములును లేనివాఁడవు, నీకంటె అధికమునుసమానమును లేనివాఁడవు,అంతటనిండియుండువాఁడవు, ఇటువంటి నిన్ను నిర్మలమయిన మనసుగల పుణ్యపురుషులు అన్నిం టిని అంటియును అంటకయున్న ఆకాశమువంటి రూపముగలవానిఁ గాఁజూతురు, అదిమాత్రముగాక పంచోపనిషన్మయమయిన అప్రా కృత దివ్యమంగళ మహావిగ్రహమును నీవు పరిగ్రహించునప్పుడు నీబొడ్డునందు ఆకాశమును, ముఖమునందు అగ్నియు, తలయందు దేవలోకమును, చెవులందు దిక్కులును, కన్నులయందు సూర్యుఁ డును, మనసునందు చంద్రుఁడును, మన్మథుఁడును, పాదములందు భూమియు, భూతాదియైన అహంకారమందు శివుఁడనైన నేనును, కడుపునందు సప్తసముద్రములును, రేతస్సునందు నీళ్లును, భుజము లందు ఇంద్రుఁడుమొదలైన అష్టదిక్పాలకులును, మేనివెండ్రుకలందు చెట్లుపైరులును, తలవెండ్రుకలయందు ఆవర్తము సంవర్తము మొద లైనమబ్బులును, బుద్ధియందు బృహస్పతియును, మేహనమందు సృష్టి కర్తయైన బ్రహ్మ మొదలగువారును, జ్ఞానమునందు సృష్టియు,హృద యమునందు ధర్మమును, మహాపురుషుఁడవై లోకమును కలుగఁ జేయుటకై అణఁగని నీతేజస్సును అణఁచుకొని నానావిధములయిన దివ్యావతారములను పొందుచుందువు,అట్టిదివ్యావతారములమహిమ తెలిసికొనియాడ నాబోఁటులము ఎంతమాత్రపువారము,నీవు చేతన ములును అచేతనములునైన యెల్లవస్తువుల సముదాయమునకు మూల మయినవాఁడవు, నీకంటె నితరము లేనివాఁడవు, పంచకర్తలకు ముందునున్నవాఁడవు,ఎల్లసృష్టికిని కారణమైనవాఁడవు,సూర్యుఁడు మబ్బుచేతకప్పఁబడి నానారూపములఁగనఁబడునట్లు నీవును కూర్ప రానివాని కూర్చునట్టి సామర్థ్యముగల నీసంకల్పముచేత మూఁడు గుణములకు వెలియైనవాఁడవైయుండియు ఆగుణములను పొందిన వాఁడవై పెక్కురూపములను వహించి మంచిగుణములుగల సజ్జనుల అజ్ఞానమనెడుచీఁకటిని పోఁగొట్టు విజ్ఞానమనెడు దీపమువలెవెలుఁ గుచు కానఁబడుచుందువు,నీమాయచేత మోహమునొందినప్రాణులు కొడుకులు పెండ్లాలు ఇండ్లు వాకిండ్లు మడిచేను అనునివి మొదలు గాఁగల పాపమే రూపముగాఁగల సముద్రమునందలి పెదపెద్దసుళ్ల నెడు రంధ్రములందు మునిఁగి తేలుచుండుదురు,దివ్యమయిన నీరూప మును సేవింపనేరక యింద్రియవ్యవహారములకు అధీనుఁడై నీపాద ములసన్నిధిని జేరలేని పామరుఁడు తన్నుఁ దాను వంచించుకొన్న వాఁడగునుగాని యితరముగాదు, నిర్వ్యాజకృపచేత సకలజీవుల కును మేలుచేయువాఁడవైన నిన్నుఁగోరక విషయానుభవమును గోరుట అమృతమునుమాని విషమును త్రాగఁగోరుటకదా,లోకము యొక్క సృష్టికినివృద్ధికిని లయమునకును కారణమయినవాఁడవును, శుద్ధ సత్త్వ వృత్తిగలవాఁడవును,బ్రహ్మనిష్ఠులపాలిటి భాగ్యమయిన వాఁడవును,సమానమును అధికమునైనవస్తువు లేనివాఁడవునైననిన్ను నేనును బ్రహ్మయు పరిపక్వమయిన మనసుగల నారదాదిమహర్షు లును సదా సేవించుచుందుముగదా ఇంతేకాదు ఇంకను చెప్పెద చిత్తగింపుమని తాత్పర్యము.

౪౮౮.—తే॥ అవ్యయుండ వనంతుండ * వచ్యుతుండ । వాదిమధ్యాంత శూన్యుండ * వఖిలధృతివి
నిఖిలమందెల్ల వర్తింతు * నీవు దగిలి । నిఖిల మెల్లను నీయంద * నెగడుఁ గృష్ణ.

టీ॥ కృష్ణ=నిత్యానందపరబ్రహ్మమైన ఓశ్రీకృష్ణస్వామీ. (నీవు) అవ్యయుండవు=తగ్గనివాఁడవు. అనంతుండవు=దేశ కాల వస్తుపరిచ్ఛేదములు లేనివాఁడవు. అచ్యుతుండవు = నశింపనివాఁడవు. ఆదిమధ్యాంతశూన్యుండవు = మొదలు నడుము తుద అనునవి లేనివాఁడవు—పుట్టుట పెరుగుట చచ్చుట లనెడు వికారములు లేనివాఁడవనుట. అఖిలధృతివి=సర్వము ధరించినవాఁడవు. నిఖిలమందున్=సర్వప్రపంచమునందును. ఎల్లన్ = వెలుపల లోపల నంతటను. వర్తింతు = ఉందువు. తగిలి = అంటి. నిఖిలమెల్లను=ఈకనఁబడు ప్రపంచమంతయు. నీయంద=నీయందే. నెగడున్=కలిగివ్యాపించును.

తా॥ పూర్ణానందపరబ్రహ్మమైనఓకృష్ణా! నీవు తగ్గనివాఁడవును ఈదేశమందు ఉన్నాఁడు ఈదేశమందు లేఁడు ఈకాలమందు ఉన్నాఁడు ఈకాలమందు లేఁడు ఈవస్తువునందుఉన్నాఁడు ఈవస్తువునందు లేఁడు అనుట లేనివాఁడవును, నశింపనివాఁడవును, పుట్టుటపెరుగుట చచ్చుటలనెడు వికారములులేనివాఁడవును, సర్వమును ధరించినవాఁడవును, సర్వము నీయందును, నీయందు సర్వమును గలవాఁడవునై యున్నావని తాత్పర్యము.

౪౮౯.—సీ॥ అని సన్నుతించిన * హరియాత్మ మోదించి - మొగమునఁ జిఱునవ్వు * మొలకలెత్త
లలితబాలేందుక * ళామౌళి కిట్లనె - శంకర నీమాట * సత్య మరయ
నేది నీకిష్టమై * యెసఁగెడు దానిన - వేఁడుము నీకిత్తు * వీఁడవధ్యుఁ
డదియెట్టిదనినఁ బ్ర * హ్లాదుండు మద్భక్తుఁ - డతనికి వరము నీ * యన్వయమున
తే॥ జననమందిన వారలఁ * జంపననుచుఁ । గడఁగి మన్నించితిని నది * గారణంబు
విశ్వ విశ్వంభరాభార * విపులభూరి । వరభుజాగర్వ మడఁపంగ * వలయుఁగాన.

టీ॥ (అని) సన్నుతించినన్ = పొగడఁగా. హరి = కృష్ణమూర్తి. ఆత్మన్=మనసునందు. మోదించి = సంతోషించి. మొగమునన్=ముఖమునందు. (చిఱునవ్వు) మొలకలెత్తన్ = పుట్టుచుండఁగా. లలితబాలేందుకళామౌళికిన్ = మనోజ్ఞమయినబాలచంద్రరేఖతోడి శిఖగలవాఁడైన శివునితో. ఇట్లనెన్ = ఇట్లుపలికెను. శంకర=ఓశివుఁడా. నీమాట=నీవుచెప్పినమాట. అరయన్=విచారింపఁగా. సత్యము = నిజము. ఏది = ఏకోరిక. (నీకు) ఇష్టమై=ప్రియమై. ఎసఁగెడున్=అతిశయించునో. దానిన = ఆకోరికనే. వేఁడుము=నీవుకోరుము. (నీకిత్తును) వీఁడు = ఈబాణుఁడు. అవధ్యుఁడు=చంపఁదగనివాఁడు. అది = ఆచంపఁదగనివాఁడగుట, ఎట్టిది=ఎటువంటిది, అనినన్ = అనియడిగెడుపక్షమున. (ప్రహ్లాదుండు) మద్భక్తుఁడు=నాభక్తుఁడు. అతనికిన్=ఆప్రహ్లాదునికి.నీయన్వయమునన్ = నీవంశమునందు. జననమందినవారలన్ = పుట్టినవారిని. (చంపను) అనుచున్=అని. కడఁగి = ప్రయత్నపడి. (వరమును) మన్నించితిన్=ఇచ్చియాదరించితిని, అదికారణంబు=వీఁడు అవధ్యుఁడగుటకు అదికారణము. విశ్వ...గర్వము—విశ్వ=సమస్తమయిన. విశ్వంభరా = భూమియొక్క. భార = బరువుయొక్క. విపుల=విశేషించిన. భూరి = అధికమయిన. వర = వరమువలని. భుజాగర్వము = భుజబలమువలని అహంకారమును. అడఁపంగ వలయుఁగానన్=అణఁచివేయవలెను కాఁబట్టి.

తా॥ అని శివుఁడు పొగడఁగా శ్రీకృష్ణమూర్తి సంతోషించినవాఁడై శివునిఁజూచి ఓశివుఁడా నీవు చెప్పినదంతయు నిజమే, నీవిప్పుడు ఏమి కోరినను ఇచ్చెదను, నీకోరికను తెలియఁ జేయుము, ఈబాణాసురుఁడన్ననో నాచేత చావఁదగినవాఁడు కాఁడు, వీనిముత్తాతయైన ప్రహ్లాదుఁడు నాకు ప్రియమయినభక్తుఁడు కాఁబట్టి వానికి నీవంశమునందుఁ బుట్టినవారిని నేనుచంపను అని వరమిచ్చియుంటిని ఆకారణముచేత వీనిని నేను చంపను, అయినను నీవరముచేత వీనికిఁగల భుజగర్వమువలని భారము భూమియందు లేకుండఁ జేయవలయును కాఁబట్టి అని తాత్పర్యము.

౪౯౦.—క॥ కరములు నాలుగు చిక్కఁగఁ । బరిమార్చితి వీఁడు నీదు * భక్తుల కగ్రే
సరుఁడై పొగడొంది జరా । మరణాది భయంబుదక్కి * మను నిటమీఁదన్.

టీ॥ కరములు=చేతులను. నాలుగుచిక్కఁగన్=నాలుగుమిగులునట్లు. పరిమార్చితిన్ = నఱికివేసితిని, ఇటమీఁదన్=ఇదిమొదలుకొని. వీఁడు=ఈబాణుఁడు, నీదుభక్తులకున్=నీసేవకులకు, అగ్రేసరుఁడై=ముఖ్యుఁడై. పొగడొంది=కీర్తినివహించి, జరామరణాది భయంబు=ముసలితనము చావు మొదలయినవానిభయము. తక్కి=మాని. మనున్ = జీవించును — బ్రతికి యుండునని భావము.

తా॥ వీనిచేతులనుమాత్రము నాలుగిటిని మిగిలించి తక్కినవానిని నఱికితిని, వీఁడు ఇఁకమీఁద నీసేవకులందఱిలోను ముఖ్యుఁడై కీర్తిని వహించి ముసలితనము చావు అనువానివలని భయములేక యుండఁగలఁడు అని తాత్పర్యము.

వ॥ అని యానతిచ్చిన నంబికాధవుండు సంతుష్టాంతరంగుండయ్యె నబ్బలినందనుండు రణరంగవేదిం గృష్ణదేవతా సన్నిధిం బ్రజ్వలితచక్ర కృశాను శిఖాజాలంబులందు నిజబాహా సహస్రశాఖా సమిత్ప్రచయంబులఁ, దత్క్షతోద్వేలకీలాల మహితాజ్య ధారాశతంబులు, బరభయంకర వీరహుంకార మంత్రంబుల

తోడ వేల్చి పరిశుద్ధింబొంది విజ్ఞాన దీపాంకురంబున భుజాగర్వ దర్పాంధకారంబునివారించి యనవరత పూజితస్థాణుండగు బాణుండు నిజభుజవనవిచ్ఛేదజనిత విరూపిత స్థాణుండయ్యును, దదీయవరదానకలి తానందహృదయారవిందుండగుచు గోవిందచరణారవిందంబులకుం బ్రణామంబులాచరించియనంతరంబ.

టీ॥ (అని) ఆనతిచ్చినన్=సెలవియ్యఁగా. అంబికావరుండు=పార్వతికి పెనిమిటియైనశివుఁడు. సంతుష్టాంతరంగుండు = సంతోషించినమనసుగలవాఁడు. (అయ్యెను) అబ్బలినందనుండును=ఆబాణాసురుఁడును.రణరంగవేదిన్=యుద్ధభూమియనెడు వేదికయందు. కృష్ణదేవతాసన్నిధిన్ = కృష్ణుఁడు అను దేవతయెదుట. ప్రజ్వలిత ...జాలంబులందున్-ప్రజ్వలిత=వెలిఁగింపఁబడిన. చక్ర=సుదర్శన చక్రమనెడు. కృశాను=అగ్నియొక్క. శిఖా = మంటలయొక్క. జాలంబులందున్ = సమూహములందు. నిజ...యంబులన్-నిజ=తనయొక్క. బాహాసహస్ర=వేయిచేతులనెడు. శాఖా=కొమ్మలవంటి. సమిత్ప్రచయంబులన్ = సమిధల సమూహములచేతను. తత్క్షతోద్వేల...శతంబులన్-తత్ = ఆభుజములయొక్క. క్షత=గాయములవలని. ఉద్వేల = మేరమీరికాఱుచున్న. కీలాల = నెత్తురనెడు. మహిత=అధికమయిన. ఆజ్యధారా=నేతిదారలయొక్క. శతంబులన్=నూఱులచేతను. పర...తోడన్-పర=శత్రువులకు. భయంకర = భయమునుపుట్టించునట్టి. వీర=వీరభటులయొక్క. హుంకార=హుం అనుధ్వనులనెడు. మంత్రంబులతోడన్=మంత్రములతో. వేల్చి=హోమముచేసి. పరిశుద్ధింబొంది = రాగ ద్వేషాదులులేని మనస్సుగలవాఁడై. విజ్ఞానదీపాంకురంబునన్=విశేషజ్ఞానమనెడుదీపము వెలుఁగుటచేత. భుజాగర్వదర్పాంధకారంబు=భుజబలమువలని మదమనెడిచీఁకటిని. నివారించి=పోఁగొట్టి. అనవరత పూజితస్థాణుండు=ఎల్లప్పుడు పూజింపఁబడిన శివుఁడుగలవాఁడు. అగుబాణుండు=అగునట్టి బాణాసురుఁడు. నిజభుజవనవిచ్ఛేదజనిత విరూపితస్థాణుండయ్యును-నిజ=తనదైన.భుజవన=చేతులనెడువనమును. విచ్ఛేద=నఱకుటవలన. జనిత=పుట్టినదై. విరూపిత=వికారరూపము పొందఁబడినదైన. స్థాణుండయ్యును = మోటు అయినవాఁడయ్యును. తదీయ...పిందుండు — తదీయ = ఆశివునిదైన. వరదాన=వరమిచ్చుటవలన. కలిత=పొందఁబడిన. ఆనంద = సంతోషముతోడి. హృదయారవిందుండు = మనఃకమలము గలవాఁడు. (అగుచును) గోవిందచరణారవిందంబులకున్=శ్రీకృష్ణునిపాదకమలములకు. ప్రణామంబులు=నమస్కారములు. ఆచరించి=చేసి.అనంతరంబ=వెంటనే.

తా॥ అని శ్రీకృష్ణమూర్తి సెలవియ్యఁగా శివుఁడుసంతోషించెను బాణాసురుఁడును యుద్ధభూమి యనెడు హోమకుండమునందు కృష్ణుఁడను దేవతయెదుటసుదర్శనచక్రపుమంటలనెడి నిప్పుమంటలయందు తనవేయిచేతులనెడు సమిధలచేతను ఆభుజములను నఱకుటవలని గాయములందుండి కాఱుచున్న నెత్తురనెడు నేతిదారలచేతను శత్రు వీరులయొక్క భయంకరములైన హుంకారములనెడు మంత్రములతో హోమము చేసి పరిశుద్ధత్వమును పొందినవాఁడై ఎల్లప్పుడు శివుని పూజించుచున్నవాఁడుగా నుండియు ఎల్ల చేతులు నఱకఁబడుటచేత కొమ్మలు నఱకఁబడిన మ్రానిమోటువలె కనఁబడినవాఁడై అందువలని చింత కొంతయేని లేక శివునిచేత ఇయ్యఁబడినవరమును పొందుటవలన సంతోషించినవాఁడై శ్రీకృష్ణుని పాదకమలములకు మ్రొక్కి వెంటనే ఈమీఁద చెప్పఁబడు కార్యమును చేసెనని తాత్పర్యము.

## విశేషార్థము.

ఈకథయందు బాణునకు సహాయమువచ్చిన శివుఁడు ఓడెనని కృష్ణుఁడు గెల్చెనని చెప్పియున్నది గనుక యింతమాత్రముచేతనే శివమతస్థులు ఖేదమును, విష్ణుమతస్థులు మోదమును పొంది వైష్ణవ శైవమతస్థులు శివకేశవులను నిందింపవలదు. శ్లో॥ మద్భక్తశ్శంకర ద్వేషీమద్ద్వేషీశంకరప్రియః। తావుభౌనరకంయాంతి యావచ్చంద్ర దివాకరౌ॥అనిభగవద్వాక్యముగనుక శివకేశవులనుదూషించువైష్ణవ శైవభక్తులు నరకలోకమును పొందుదురు. మఱియు శ్లో॥లోకత్రయ మహాగేహేగృహస్థస్త్వముదాహృతః।త్వంవిష్ణుర్జానకీలక్ష్మీఃశివస్త్వం జానకీశివా। బ్రహ్మాత్వంజానకీవాణీసూర్యస్త్వంజానకీప్రభా। వాయుస్త్వంరామసీతాతు సదాగతిరితీరితా । కుబేరస్త్వంరామసీతా సర్వసంపత్ప్రకీర్తితా। రామత్వమేవవరుణోభారవీజానకీశుభా।రుద్రాణీ జానకీప్రోక్తా రుద్రస్త్వంలోకనాశకృత్ । లోకేస్త్రీవాచకంయద్య త్తత్సర్వంజానకీశుభా । పున్నామవాచకంయద్య త్తత్సర్వంత్వంహిరాఘవ । తస్మాల్లోకత్రయందేవ యువాభ్యాంనాస్తికించన ॥ అని యధ్యాత్మరామాయణమున నారదస్తోత్రమును (రుద్రాణాం శంకరశ్చాస్మి) అని భగవద్గీతా దశమోధ్యాయమునను శ్లో॥ విశ్వంత్వం నాస్తివైభేదః త్వమేకస్సర్వగోయతః । స్తుత్యంస్తోతాస్తుతిస్త్వంచ సగుణోనిర్గుణోభవాన్॥ అని శ్రీభాగవతమునందును (విశ్వంవిష్ణుః, త్రిభువనవపుషంవిష్ణుమీశంనమామి) అనివిష్ణుసహస్రనామమందును. తరల॥ పరమపూరుషుఁ డొక్కఁడాఢ్యుఁడు పాలనోద్భవ నాశముల్ । సారిదిఁజేయుముకుందపద్మజ శూలిసంజ్ఞలఁబ్రాకృత। స్ఫురిత సత్త్వరజస్తమంబులఁ బొందునందుశుభస్థితుల్ । హరిచరాచర కోటికిచ్చునసంతసత్త్వనిరూఢుఁడై॥ అని భాగవతప్రథమస్కంధమందును గలదు గనుక శ్రీరామకృష్ణస్వరూపుఁడైన శివుఁడు, శ్రీరామకృష్ణస్వరూపుఁడైన కృష్ణునిచేత ఓడుట విలాసమాత్రమనియెంచి శివకేశవులకుభేదములేమినిస్థిరపరచి శివకేశవులకు భేదముగలదనెడువృథా వాదములను విరోధములను మాని (ససర్వానామ సచవిశ్వరూపః సర్వాణ్యేతానిప్రజ్ఞానస్యనామధేయాని ప్రజ్ఞానంబ్రహ్మ.ఏకోదేవో బహుధానివిష్టః) అనెడి యుపనిషత్ప్రమాణములను పట్టి జగత్కారణుఁడైన భగవంతుఁడే సకలరూపములతో నున్నాఁడని అతఁడు విలాసమునకు తనచేత తాను ఓడినవాఁడుగా గెల్చినవాఁడుగా నున్నాఁడని తెలిసి సర్వ సమబుద్ధిగలిగి ఆనందింపవలయును. మఱియు, శ్లో॥ అచతుర్వదనోబ్రహ్మా ద్విబాహురపరోహరిః। అఫాలలోచనశ్శంభు ర్భగవాన్బాదరాయణః॥ అనుప్రమాణముచేత శ్రీమన్నారాయణస్వరూపులైనవ్యాసులు తనచేతనిర్మింపఁబడిన పురాణములలో కొన్నిచోట్ల శివునిచేతవిష్ణువును విష్ణువుచేత శివుఁడును భంగపడినట్లు చెప్పియున్నాఁడు కాఁబట్టి అట్లు చెప్ప

టకు కారణమేమని విచారించినయెడల శివకేశవులకు భేదము గలుగుట లేకుండుట మనకే విశదమగును.

టీ॥ బాణాసురుఁడు=తనకంటె నన్యముగ దేవుఁడుగలఁడనియు ఆదేవునికంటె వేఱుగ విష్ణ్వాదిదేవతలుగలరు అనెడు భిన్నజ్ఞానముగల అహంకారుఁడు. అనేకములైన అహంకారవృత్తులే వానివేయి చేతులు. శోణపట్టణము=శోణమనఁగా రక్తవర్ణము గనుక రక్తవర్ణముగలరజోగుణమేవానికి ఉనికిపట్టు—రజోగుణముగలిగివెలుఁగుచుండుననుట. కోటర = చెట్టుతొఱ్ఱ—ఆవరణశక్తి అనుట. ఆసురీసంపదయైన కామక్రోధాది దుర్గుణసమూహమే వానిసేనలు. ఉషాకన్యక=అల్పజ్ఞానముగలబ్రహ్మవిద్యాభ్యాసి—అదికలగనుటఅనఁగా అనుమానప్రమాణమునుపట్టి శరీరాతీతమై బ్రహ్మ మున్నదని లేదని తలఁచుట. చిత్రరేఖ=జీవేశ్వరజగత్తులు తనజ్ఞానమునందేపుట్టిగిట్టుచున్న వన్న స్థిరతగల ఆరూఢ బ్రహ్మవేత్త. రాజులను చూపుట యనఁగా బ్రహ్మవిచారణచేయించుట. అనిరుద్ధుఁడు=ప్రళయముల చేత అడ్డగింపఁబడనివాఁడు—ప్రళయములయందు నశింపకయుండు పరబ్రహ్మము. అపరబ్రహ్మము తాననెడు వ్యక్తి గలుగుటే ఉష అనిరుద్ధునితోఁగలయుట. గర్భముతో నుండుట అనఁగా, అహం బ్రహ్మాస్మి అనుదృఢాపరోక్షజ్ఞానముగలిగి ముక్తినిధరించుట. అంతఃపురము=అంతరహృదయము. అచ్చటికావలివారు అనఁగా,అజ్ఞాన ఆవరణ విక్షేపసంశయాసంభావన వితర్కవిపర్యయాదులు. వారు బాణునకుతెలుపుటయనఁగా అహంకారునకవిగలుగుట. అనిరుద్ధుని కట్టుట యనఁగా బ్రహ్మవేత్తను అహంకారుఁడు అష్టపాశములకు లోఁబఱచుట. కృష్ణుఁడు=బ్రహ్మవేత్త. సుదర్శనచక్రము=అపరోక్షజ్ఞానదృష్టి — కంటికి కనఁబడునది చెవికి వినఁబడునది మనసునకు తోఁచునది అంతయు తాననెడు విజ్ఞానము గలుగఁగానే అహంకారాదివృత్తులు తనకన్యములు కావుగనుక వానిపీడలు తన్నంట వనుట. నాలుగుచేతులతో బాణుఁడు నిల్చెననఁగా అంతఃకరణవృత్తులైన మనోబుద్ధి చిత్తాహంకారములతో నిల్చెననుట.




(*) శ్రీకృష్ణుఁ డనిరుద్ధుఁడు మొదలగువారితో ద్వారకాపురి కేగుట. (*)

౪౯౨.—క॥ పురమున కేగి యుషాసుం । దరికిని ననిరుద్ధునకు ము * దంబున భూషాం
బర దాసీ దాస జనా । వరవస్తు వితాన మొసఁగి * వారని భక్తిన్.

టీ॥ పురమునకున్=తనపట్టణమునకు. ఏగి=పోయి. ఉషాసుందరికిన్=తనకొమార్తయైనఉషకును. అనిరుద్ధునకున్=ఆమెకుప్రియుఁడైన అనిరుద్ధునకును. ముదంబునన్=సంతోషముతో. భూషాంబర ... వితానము—భూష=ఆభరణములను. అంబర = వస్త్రములను.

దాసీ=ఊడిగపుపడుచులు. దాస=ఊడిగపుపురుషులునైన. జన=జనులను. అవర=మిక్కిలి శ్రేష్ఠములయిన.వస్తు=వస్తువులయొక్క. వితానము=సమూహమును. ఒసఁగి=ఇచ్చి.వారని=తగ్గని.భక్తిన్=పూజ్యానురాగముతో.

తా॥ బాణుఁడు తనపట్టణమునందు ప్రవేశించితనకొమార్తకును ఆమెప్రియుఁడైన అనిరుద్ధునకును వస్త్రాభరణములను ఊడిగము చేయు స్త్రీపురుషులను మఱియు మేలైన పదార్థములను అరణమిచ్చి అత్యంతభక్తితో అనితాత్పర్యము.

౪౯౩.—క॥ కనకరథంబున నిడికొని। ఘనవైభవమొప్పఁ గన్య * కా యుక్తముగా
ననిరుద్ధుని గోవిందుం। డనుమోదింపంగఁ దెచ్చి * యర్పించె నృపా.

టీ॥ నృపా=రాజా. కనకరథంబునన్ = బంగారుతేరియందు. ఇడికొని=కూర్చుండఁబెట్టుకొని. ఘనవైభవమొప్పన్=అధిక విభవము ఒప్పఁగా. కన్యకాయుక్తముగాన్=కన్యకతోఁగూడ. (అనిరుద్ధుని) గోవిందుండు=కృష్ణుఁడు. అనుమోదింపంగన్=అంగీకరింపఁగా. తెచ్చి = తీసికొనివచ్చి. అర్పించెన్ = సమర్పించెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! ఒకబంగారుతేరిపైకన్యకతోఁగూడ అనిరుద్ధునిఁగూర్చుండఁబెట్టి పిలుచుకొనివచ్చి శ్రీకృష్ణమూర్తి అనుమతించునట్టుగా ఒప్పగించెనని తాత్పర్యము.

౪౯౪.—ఉ॥ అంత మురాంతకుండు త్రిపు * రాంతకు వీడ్కొని బాణునిల్పి య
త్యంత విభూతిమై నిజ బ * లావలితోఁ జనుదేర నాయుషా
కాంతుఁడు మున్నుగాఁ బటహ * కాహళ తూర్య నినాదపూరితా
శాంతరుఁడై వెసంజనియె * నాత్మపురీ ముఖుఁడై ముదంబునన్.

టీ॥ అంతన్=అంతట. మురాంతకుండు=శ్రీకృష్ణుఁడు. ముదంబునన్ = సంతోషముతో. త్రిపురాంతకున్ = శివుని. వీడ్కొని=వదలుకొని-శివుని అనుమతి పుచ్చుకొనియనుట. బాణున్=బాణాసురుని. నిల్పి = ఆశివునిసన్నిధిలోనేనిలిపి. అత్యంతవిభూతిమైన్=మిక్కిలివైభవములో. నిజభటావలి=తనసేనాయోధులు. తోన్=వెంబడి. చనుదేరన్=రాఁగా. ఆయుషాకాంతుఁడు=బాణునిచేత సమర్పింపఁబడినయాయనిరుద్ధుఁడు. మున్నుగాన్=ముందుతట్టుగా నుండ. పటహ...శాంతరుఁడై — పటహ = తప్పెటలు. కాహళ=కాళెలు. తూర్య=తక్కినవాద్యములు. నినాద=వీనియొక్క మ్రోఁతచేత. పూరిత=నిండింపఁబడిన. ఆశాంతరుఁడై=దిక్కులమధ్యప్రదేశముగలవాఁడై. ఆత్మపురీముఖుఁడై = తమపట్టణముతట్టు తిరిగినవాఁడై. వెసన్=శీఘ్రముగా. చనియెన్=పోయెను.

తా॥ అంతట శ్రీకృష్ణమూర్తి సంతోషించినవాఁడగుచు శివుని వలన సెలవుపుచ్చుకొని ఆయనసన్నిధియందే యుండునట్లు బాణుని నియమించి బాణునిచేత సమర్పింపఁబడిన అనిరుద్ధుని ముందుంచుకొని తనసైన్యమంతయు వెంబడించిరాఁగా నానావిధమయినవాద్యధ్వనులచేత దిక్కులు నిండుకొనఁగా బయలుదేఱి తన పట్టణమునకుఁ బోయెనని తాత్పర్యము.

౪౯౫.—మ॥ కనియెన్ గోపకుమారశేఖరుఁడు రం * గత్ఫుల్ల రాజీవ కో
కనదోత్తుంగ తరంగ సంగత లస * త్కాసారకన్ భూరిశో
భన నిత్యోన్నత సౌఖ్యభారకను శుం * భ ద్వైభవోదారకన్
జనసంతాప నివారకన్ సుజన భా * స్వత్తారకన్ ద్వారకన్.

టీ॥ గోపకుమారశేఖరుఁడు = గోపకులలో శ్రేష్ఠుఁడైనశ్రీకృష్ణుఁడు. రంగ...కాసారకన్—రంగత్ = చలించుచున్న. ఫుల్ల=వికసించిన. రాజీవ=కమలములతోడను. కోకనద=ఎఱ్ఱగలువలతోడను. ఉత్తుంగ=మిక్కిలిపొడవులైన. తరంగ = అలలతోడను. సంగత=కూడినవై. లసత్=ప్రకాశించుచున్న. కాసారకన్=కొలఁకులుగలదానిని. భూరి...భారకన్—భూరి=అధికమయిన. శోభన = శుభకార్యములచేత.నిత్య=ఎడతెగని. ఉన్నత=అతిశయించిన.సౌఖ్య=సుఖముయొక్క. భారకన్=అతిశయముగలదానిని. శుంభద్వైభవోదారకన్=ఒప్పిదమయిన సంపత్సమృద్ధిచేత హెచ్చైనదానిని. జనసంతాపనివారకన్ = జనులయొక్క పరితాపమును పోఁగొట్టుదానిని. సుజనభాస్వత్తారకన్=సజ్జనులనెడు వెలుఁగుచున్న నక్షత్రములుగలదానిని. ద్వారకన్ = ద్వారకాపట్టణమును. కనియెన్ = చూచెను.

తా॥ అట్లు బయలుదేఱిపోయిన శ్రీకృష్ణమూర్తి చలించుచున్న తామరలు ఎఱ్ఱగలువలు పొడవులైన అలలు మొదలయినవానిచేత అందగించుచున్న కొలఁకులు గలిగినదియు, విశేష శుభకార్యములచేతను ఎడతెగని సౌఖ్యముచేతను మేలయినదియు, ఒప్పిదమయిన వైభవముచేత హెచ్చైనదియు,జనులయొక్క పరితాపమును తొలఁగించునదియు,నక్షత్రములవలెవెలుఁగుచున్న సత్పురుషులచేత ప్రకాశించునదియునైన ద్వారకాపట్టణమును చూచెననితాత్పర్యము.

వ॥ కని డాయంజని పురలక్ష్మీ కృష్ణ సందర్శన కుతూహలయై చేసన్నలం జీరుచందంబున నందంబునొందు నుద్ధూత తరళ విచిత్ర కేతు పతాకాభిశోభితంబును, మహనీయ మరకత తోరణ మండితంబును, గనక మణి వినిర్మిత గోపుర సౌధప్రాసాద వీధికావిలసితంబును, మౌక్తిక వితాన విరచిత మంగళ రంగవల్లీవిరాజితంబును, శోభ

నాకలిత విన్యస్త ప్రశస్త కదళికాస్తంభ సురభికుసుమ మాలికాక్షతాలంకృతంబును, కుసుమసలిలసిక్త విపణిమార్గంబును, శంఖ దుందుభి భేరీ మృదంగ పటహకాహళాది మంగళారావకలితంబును, వందిమాగధ సంగీత ప్రసంగంబు,నతిమనోహర విభవాభిరామంబునైన యప్పురంబు సచివపురోహిత సుహృద్బాంధవ ముఖ్యులెదురుకొన భూసురాశీర్వాదంబులును,బుణ్యాంగనాకరకలిత లలితాక్షతలను గైకొనుచుం, గామినీమణులు గర్పూర నీరాజనంబులునివాళింప నిజమందిరంబునం బ్రవేశించి యప్పుండరీకాక్షుండు పరమానందంబున సుఖంబుండెనంత.

టీ॥ కని=చూచి. డాయంజని=దగ్గఱకుంబోయి. పురలక్ష్మి=పట్టణపువైభవమనెడులక్ష్మీదేవి. కృష్ణసందర్శనకుతూహలయై = కృష్ణుని జూచుటయందలి వేడుకగలదై. చేసన్నలన్ = చేతిసైగలచేత. చీరుచందంబునన్ = పిలుచుచున్న రీతిగా. అందంబు నొందు=అందగించునట్టి. ఉద్ధూత...శోభితంబును — ఉద్ధూత=మీఁదికెగురఁజేయఁబడిన. తరళ=చలించుచున్న. విచిత్ర=నానా వర్ణమయిన. కేతు=ధ్వజముల యందలి. పతాకా=టెక్కెపు గుడ్డలచేత. అభిశోభితంబును=ప్రకాశించునదియు. మహనీయ...తంబును—మహనీయ=గొప్పవైన. మరకత=పచ్చలచేనైన. తోరణ=తోరణములచేత. మండితంబును=అలంకరింపఁబడినదియు. కనక...విలసితంబును—కనక=బంగారు చేతను. మణి=రత్నములచేతను. వినిర్మిత = చేయఁబడిన. గోపుర=తోరణద్వారములచేతను. సౌధ=మేడల చేతను. ప్రాసాద=నగళ్లచేతను. వీధికా=ఇండ్లవరుసల నడిమిదారుల చేతను. విలసితంబును = ప్రకాశించునదియు. మౌక్తిక ... విరాజితంబును — మౌక్తిక = ముత్యాలయొక్క. వితాన=మేలుకట్లను. విరచిత=కట్టఁబడుట మొదలయిన. మంగళ=శుభ సూచక ముల చేతను. రంగవల్లీ=ముగ్గులచేత. విరాజితంబును=ప్రకాశించునదియు. శోభనా...తంబును—శోభన = శుభకార్యమునకై. ఆకలిత=అంతటఁగూర్పఁబడినవై. విన్యస్త=ఉంచఁబడిన. ప్రశస్త=శ్లాఘ్యములైన. కదళికా స్తంభ=అరఁటి కంబముల చేతను. సురభి = పరిమళించుచున్న. కుసుమమాలికా = పూలదండలచేతను. అక్షత=అక్షింతలచేతను. అలంకృతంబును=అలంకరింపఁ బడినదియు. కుసుమ...మార్గంబును — కుసుమసలిల = పన్నీటిచేత. సిక్త=తడుపఁబడిన. విపణిమార్గంబును=అంగడివీథులు గలదియు. శంఖ...కలితంబును. శంఖ=శంఖములు. దుందుభి=దుంముం అని మ్రోఁగునగారాలు. భేరీ=శత్రువులకు భయముపుట్టునట్లు మ్రోఁగునగారాలు. మృదంగ=మద్దెలలు. పటహ=తప్పెటలు. కాహళ = కాళెలు. ఆది=మొదలుగాఁగల. మంగళారావ=మేలైన ధ్వనులతోడ. కలితంబును=కూడినదియు. వంది...సంగంబును—వంది=స్తుతిపాఠకులయు. మాగధ=వంశావళి చదువు వారలయు. సంగీత=పాటలయొక్క. ప్రసంగంబును=కూడిక గలదియు. (అయి) అతి...రామంబు—అతి=మిక్కిలి. మనోహర=మనోజ్ఞమయిన. విభవ=వేడుకచేత. అభిరామంబును=ఒప్పినది. ఐనయప్పురంబున్=అయినట్టియాపట్టణమును. సచివ ... ముఖ్యులు—సచివ=మంత్రులు. పురోహిత=పురోహితులు. సుహృత్=స్నేహితులు. బాంధవ = చుట్టములు. ముఖ్యులు = మొదలగువారు. ఎదురుకొనన్=ఎదుర్కోలు చేయఁగా. భూసురాశీర్వాదంబులను=బ్రాహ్మణులదీవనలను. పుణ్యాంగనా...అక్షతలను— పుణ్యాంగనా=బ్రాహ్మణముత్తయిదువులయొక్క. కర=చేతులయందు. కలిత=పొందిన. లలిత=మనోజ్ఞమైన. (అక్షతలను) కైకొనుచున్ = అంగీకరించుచు. కామినీమణులు=ఉత్తమ స్త్రీలు. కర్పూర నీరాజనంబులు=కర్పూరపు నివ్వాళులు. నివాళింపన్ = దిగఁదుడువఁగా. ప్రవేశించి=చొచ్చి. అప్పుండరీకాక్షుండు=ఆకృష్ణుఁడు. నిజమందిరంబునన్=తనయింటి యందు. పరమానందంబునన్=అధికసంతోషముతో. సుఖంబుండెన్=సుఖముగానుండెను. అంతన్=అంతట.

తా॥ ఆట్టిపట్టణమును జూచి చేరఁబోయి పట్టణపుకలిమియనెడు స్త్రీ శ్రీకృష్ణమూర్తిని జూచుట యందలి వేడుక గలదై చేతులు చాఁచి పిలుచు చున్నదోయన్నట్లు చలించుచు మీఁదికెగయుచున్న టెక్కెపు చిత్రవర్ణమయిన గుడ్డలచేతను, గొప్పలైన పచ్చలు గ్రుచ్చి కట్టఁబడిన తోరణముల చేతను, రత్నములు చెక్కఁబడిన బంగారు గోపురముల చేతను, ఉన్నతములైన మేడలు నగళ్లుగల పెద్దపెద్ద బాటల చేతను, ముత్యాలమేలుకట్లు ముత్యాలముగ్గులు మొదలగు శుభసూచక చిహ్నములచేతను, శుభకార్యము కొఱకు అంతటఁగట్టఁబడిన యరఁటికంబములచేతను, మిక్కిలి పరిమళించుచున్న పూలసరములచేతను, పన్నీరు చల్లిన బజారులచేతను, అలంకరింపఁబడినదై శంఖములు భేరులు మద్దెలలు కాళెలు మొదలుగాఁగలనాలుగు తెగలవాద్యములయొక్క ధ్వనులతోడను, స్తుతిపాఠకులు వంశావళి నుగ్గడించువారు మొదలగువారి పాటల ధ్వనులతోడను, కూడినదై నానావిధ మంగళచిహ్నములు గలదైన ఆపట్టణమునందు ప్రవేశించి మంత్రులు పురోహితులు చెలికాండ్రు చుట్టములు మొదలగువారు ఎదుర్కోలు చేయఁగా బ్రాహ్మణుల ఆశీర్వాదములను బ్రాహ్మణ సువాసినులచేతి శుభాక్షతలను పరిగ్రహించుచు కొందఱు ఉత్తమస్త్రీలు కర్పూరపుహారతులిచ్చుచుండఁగా శ్రీకృష్ణమూర్తి తనయింటఁజొచ్చి మిక్కిలి సంతోషముతో సుఖించుచుండెనని తాత్పర్యము.

౪౯౭.—క॥ శ్రీకృష్ణుని విజయంబగు । నీకథఁ బఠియించు వార * లెప్పుడుజయముం
గైకొని యిహపరసౌఖ్యము । లాకల్పోన్నతి వహింతు * రవనీనాథా.

టీ॥ అవనీనాథా=రాజా, శ్రీకృష్ణునివిజయంబు = శ్రీకృష్ణమూర్తి గెలుపుగలది. అగునీకథన్=అగునట్టియీకథను. పఠియించువారలు. చదువునట్టివారు. ఎప్పుడున్=ఎల్లప్పుడును. జయమున్=గెలుపును. కైకొని=పొంది. ఇహపరసౌఖ్యములు = ఈలోకమునందలివియు పరలోకమునందలివియునైనసుఖములను, ఆకల్పోన్నతిన్=ప్రసిద్ధమయిన ప్రళయకాల పర్యంతమైన గొప్పను—(లేక) అలంకార గౌరవముతో. వహింతురు=అవలంబింతురు.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణమూర్తియొక్క గెలుపును తెలుపునట్టిదైన యీకథను ఎవరు చదువుదురో వారు సర్వదా మిక్కుటమైన ఇహపరలోకసుఖములనుపొందుదురని తాత్పర్యము.

౪౯౮.—క॥ అని చెప్పిన శుకయోగికి । జననాయకుఁ డనియెఁ గృష్ణ * చరితము విన నా
మన మెపుడుఁ దనియదింకను । వినవలతుం గరుణఁ జెప్ప * వే మునినాథా.

టీ॥ అనిచెప్పినశుకయోగికిన్=అనిఇట్లుచెప్పిన శుకమహామునితో. జననాయకుఁడు=పరీక్షిన్మహారాజు. అనియెన్=ఇట్లుపలికెను. మునినాథా=ఓమునిశ్రేష్ఠుఁడా. కృష్ణచరితమున్=శ్రీకృష్ణ మూర్తియొక్క చారిత్రమును. వినన్=వినఁగా. ఎప్పుడున్ = ఏసమయమునందును. నా మనము=నామనస్సు. తనియదు=తృప్తినొందదు. (ఇంకను) వినవలతున్=వినఁగోరెదను. కరుణన్=దయతో. చెప్పవే=చెప్పవయ్యా.

తా॥ అని యీవిధముగా చెప్పఁగా విని పరీక్షిన్మహారాజు శుకమహామునినిజూచి ఓమునీంద్రా! కృష్ణుని చరిత్రమును ఎన్నాళ్లువిన్నను నాకు తృప్తి పుట్టలేదు గనుక ఇంకను ఆయన యొక్క చరిత్ర ములను చెప్పవయ్యాయని యడిగెనని తాత్పర్యము.

౪౯౯.—వ॥ అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియెః

టీ॥ (అనిన) పరీక్షిన్నరేంద్రునకున్ = పరీక్షిన్మహారాజుతో. శుకయోగీంద్రుండు=శుకమహాముని. (ఇట్లనియెను)

(*) నృగ మహారాజు చరిత్రము. (*)

సీ॥ ధరణీశ యొకనాడు * హరితనూజులు రతీ
శ్వర సాంబ గద చారు * చారుభాను
లాదిగా యదు కుమా * రావలి యుద్యాన
వనమున కతివైభ * వమున నేగి
వలనొప్ప నిచ్ఛాను * వర్తులై సుఖలీలఁ
జరియించి ఘనపిపా * సలను బొంది
నెఱిదప్పి సలిలమ * న్వేషించుచును వేగ
వచ్చుచు నొకచోట * వారి రహిత



తే॥ కూపమును నందులో నొక * కొండవోలె । విపులమగు మేని యూసర * వెల్లిఁ గాంచి
చిత్తముల విస్మయంబంది * తత్తరమున । దాని వెడలించు వేడుక * దగులుటయును.

టీ॥ ధరణీశ=ఓరాజా. (ఒకనాడు) హరి తనూజులు=శ్రీకృష్ణుని కొడుకులైన. రతీశ్వర ... భానులు — రతీశ్వర = ప్రద్యుమ్నుఁడు. సాంబ=సాంబుఁడు. గద=గదుఁడు. చారు = చారువు. చారుభానులు=చారుభానుఁడు. ఆదిగాన్=మొదలుగా. యదుకుమారావలి=యాదవకుమారుల పఙ్క్తి. ఉద్యానవనమునకున్=సామాన్య మయిన శృంగారపుఁదోఁటకు. అతివైభవమునన్=మిక్కిలి వేడుకతో. ఏగి=పోయి. వలనొప్పన్=అనువుగా. ఇచ్ఛాను వర్తులై=ఇచ్ఛవచ్చినట్టు మెలఁగుచున్నవారై. సుఖలీలన్=సౌఖ్యవిధమున. చరియించి=సంచరించి. ఘనపిపాసలన్=అధికమయిన దప్పులను (పొంది) నెఱిదప్పి=బాగుచెడి. సలిలము=జలమును. అన్వేషించుచున్=వెదకుచు. వేగ వచ్చుచున్=వడిగావచ్చునప్పుడు. ఒకచోటన్=ఒకప్రదేశమునందు. వారిరహిత కూపమును=నీళ్లులేని నూతిని. అందులోన్=ఆనూతిలో. కొండవోలెన్=కొండవలెనే. విపులమగు మేని యూసరవెల్లిన్=పెద్ద దేహముఁగలపచ్చఁబాఱినదానిఁ తొండను. కాంచి=చూచి. చిత్తములన్=తమమనసులలో. విస్మయంబంది=ఆశ్చర్యపడి. తత్తరమునన్=తొందరతో. దానిన్=ఆయూసరవెల్లిని. వెడలించు వేడుక=బయటతీసివేయవలెనను కుతూహలము. తగులుటయున్=తమమనసులలో కలుగఁగా.

తా॥ ఓరాజా! వినుము ఒకనాడుకృష్ణునికొడుకులైన ప్రద్యుమ్నుఁడు సాంబుఁడు చారువు చారుభానుఁడు మొదలగువారు ఉద్యానవనములో వేడుకగా ప్రొద్దుపుచ్చవలెననిపోయి అచ్చట ఇచ్ఛవచ్చినట్లు సంచరించి మిక్కిలిదప్పిగొని ఆదప్పినితీర్చుకొనుటకై నీళ్లున్నతావును వెదకుచుపోవుచుండఁగా ఒకచోట నీళ్లులేని ఒకపాడునూతిని ఆనూతిలో పడి లేవలేకయుండునట్టికొండవలె పెద్దదేహముగలయూసరవెల్లినిచూచిఆతొండను ఆనూతిలోనుండి బయటికి తీయవలెనను కోరికగలవారైరని తా.

౫౦౧.—చ॥ పరువిడి పోయి తెచ్చి ఘన * పాశచయంబుల నంటగట్టి య
గ్గురుభుజులందఱుంగదిసి * కోయనియార్చుచు దానినెమ్మెయిం
దరలఁగఁ దీయలేక దగ * దట్టముగా మది దుట్టగిల్ల నొం
డొరుగడవంగ వేచని ప * యోరుహ నాభున కంతఁజెప్పినన్.

టీ॥ పరువిడిపోయి=పరుగెత్తిపోయి. ఘనపాశచయంబులన్=పెద్ద పెద్దగట్టిత్రాళ్లను. (తెచ్చి) అంటగట్టి=ఆత్రాళ్లతో ఆయూసరవెల్లినిపట్టి కట్టి. అగ్గురుభుజులందఱున్=చేతిబలముగల యారాచకొమారులందఱును. కదిసి=చేరి. కోయని యార్చుచున్ = కోయను ధ్వని కలుగ కేకలువేయుచు. దానినెమ్మెయిన్=ఆయూసరవెల్లి దేహమును. తరలఁగన్=కదలునట్లు. తీయలేక=తియ్యఁజాలక. దగ=దాహము. దట్ట

ముగాన్=అధికము కాఁగా. మది = మనస్సు. తుట్టగిల్లన్ = తపింపఁగా.ఒండొరుగడవంగన్=ఒకనినొకఁడుమించునట్లు.వే=శీఘ్రముగ చని=పోయి. పయోరుహనాభునకున్=శ్రీకృష్ణునకు.అంతన్=సమస్త వృత్తాంతమును.చెప్పినన్=చెప్పఁగా.

తా॥ పరుగెత్తుకొనిపోయి గట్టిత్రాళ్లను తీసుకొనివచ్చి ఆయా సరవెల్లి దేహమునకు కట్టి కేకలువేయుచు పైకిలాఁగియు దానిని ఇటు అటు కదలింపనైన శక్తులుకానివారై అప్పటిపుట్టికి దాహము హెచ్చుచుండఁగామనసులుతపింపఁగాఒకనిమించియొకఁడుపరుగువాఱిపోయి యావృత్తాంతమును శ్రీకృష్ణమూర్తికితెలియఁ జేసిరనితాత్పర్యము.

౫౦౨.—చ॥ విని సరసీరుహాక్షుఁ డతి ✻ విస్మితుఁడై జలశూన్య కూపమ
ల్లనఁ గదియంగఁ నేగి కృక ✻ లాసము నొక్కతృణంబపోలె గొ
బ్బున వెడలించె వామకర ✻ పద్మమునన్నది యంతలోనఁ గాం
చనరుచి మేనుగల్గి పురు ✻ షత్వముతోఁ బొడసూపి నిల్చినన్.

టీ॥ సరసీరుహాక్షుఁడు=కృష్ణుఁడు.విని=ఆవృత్తాంతమునువిని. అతి విస్మితుఁడై=మిక్కిలి యాశ్చర్యము నొందిన వాఁడై. జలశూన్యకూపము = నీళ్లులేనినూతిని. అల్లనన్=మెల్లఁగా. కదియంగన్=చేర. ఏగి=పోయి. కృకలాసమున్ = తొండను. ఒక్కతృణంబ పోలెన్= ఒకపూరిపుడకవలెనే. వామకరపద్మమునన్=కమలమునుబోలినఎడమ చేతితో. గొబ్బునన్ = శీఘ్రముగ. వెడలించెన్ = బయటికీడిచెను. అంతలోనన్=అంతటిలోపల. అది=ఆతొండ. కాంచనరుచిమేను= బంగారు చాయగల దేహము. కల్గి = కలిగి. పురుషత్వముతోన్= మనుష్య రూపముతో. పొడసూపి=కనఁబడి. నిల్చినన్=నిలువఁగా.

తా॥ ఆవృత్తాంతమును విని కృష్ణుఁడు మిక్కిలి ఆశ్చర్యపడి నీళ్లలేనియానూతివద్దకుఁబోయి అందుఁబడియున్నతొండనుజూచి దానిని తనయెడమచేతితో పూరిపుడకను ఎత్తి బయట వేసినట్టు ఎత్తి బయట వేసెను. అంతట ఆతొండబంగారుచాయగల దేహముతోనొక మనుష్యుఁడై నిలువఁబడెను అనితాత్పర్యము.

వ॥ ఇట్లు నిల్చినంజూచి కృష్ణుం డతనివృత్తాంతంబంతయు నెఱింగియు నక్కడిజనంబులుఁ గుమార వర్గంబును దెలియుకొఱకు నతనిచేతన తద్వృత్తాంతంబంతయు నెఱింగించువాఁడై యిట్లనియె.

టీ॥ (ఇట్లు నిల్చినంజూచి కృష్ణుండు) అతనివృత్తాంతంబు=ఆమనుష్యునియొక్కవృత్తాంతమును.అంతయున్=సమస్తమును.ఎఱింగియున్ =తెలిసినవాఁడుగానుండియు.అక్కడిజనంబులును=అప్పుడుఅక్కడికి వచ్చియున్నజనులును.కుమారవర్గంబును=తనకొడుకులసమూహమును. తెలియుకొఱకున్ = తెలిసికొనుటకై. అతనిచేతన = ఆమనుష్యునిచేతనే. తద్వృత్తాంతంబంతయున్=అతనివృత్తాంతము అంతయు. ఎఱింగించువాఁడై = తెలియునట్లు చేయఁదలఁచిన వాఁడై. ఇట్లనియెన్= ముందుఁ జెప్పఁబోవువిధమునఁ బలికెను.

తా॥ ఈవిధముగా మనుష్యుఁడై నిలువఁగానే కృష్ణుఁడు అతని వృత్తాంతము అంతయు తాను ఎఱిఁగిన వాఁడై యుండియు ఆవృత్తాంతమును అతని వలననే అచ్చటికి వచ్చియున్న జనులకును తనకొడుకులకును తెలియఁజెప్పింపఁ దలఁచినవాఁడై యిట్లు పలికెనని తాత్పర్యము.

౫౦౪.—చ॥ కనదురు రత్నభూషణ ని ✻ కాయుఁడవై మహనీయమూర్తివై
యనుపమ కీర్తిశోభితుఁడ ✻ వై విలసిల్లుచు ధాత్రిమీఁదఁ బెం
పొనరిన నీకు నేమిగతి ✻ నూసరవెల్లి తనంబు చొప్పడెన్
విననిది చోద్యమయ్యె సువి ✻ వేకచరిత్ర యెఱుంగఁ జెప్పుమా.

టీ॥ కన...కాయుఁడవై—కనత్=ప్రకాశించుచున్న. ఉరు=గొప్పలైన. రత్నభూషణ = రత్నములుచెక్కిన యాభరణముల యొక్క. నికాయుఁడవై=సముదాయములుగలవాఁడవై. మహనీయమూర్తివై= గొప్పనువహించినయాకృతిగలవాఁడవై. అనుపమకీర్తిశోభితుఁడవై— అనుపమ=ఈడులేని. కీర్తి=యశస్సుచేత. శోభితుఁడవై=ప్రకాశించువాఁడవై. విలసిల్లుచున్=ఒప్పుచు. ధాత్రిమీఁదన్ = భూమియందు. పెంపు=గౌరవము. ఒనరినసీకున్ = ఒప్పిననీకు. ఏమిగతిన్. ఏవిధముగా. ఊసరవెల్లితనంబు=తొండరూపము. చొప్పడెన్=కలిగెను. వినన్=వినుటకు. ఇది=ఈసంగతి. చోద్యము=మిక్కిలియాశ్చర్యము. అయ్యెన్=ఆయెను. సువివేకచరిత్ర = మంచితెలివితోడి నడువడిగలవాఁడా. ఎఱుఁగఁజెప్పుమా=తెలియఁజెప్పుము.

తా॥ మెఱుఁగులుదేఱుచున్నరత్నములసొమ్ములును,బంగారుచాయగలదేహమును, సాటిలేని కీర్తియుఁగలిగి భూమియందు ప్రసిద్ధికెక్కిన నీకు ఈయూసరవెల్లిరూపము కలుగుటకు కారణమేమి చెప్పుమని అడిగెననితాత్పర్యము.

౫౦౫.—క॥ అని యడిగిన మురరిపు పద । వనజంబులఁ దనకిరీట ✻ వరమణు లొరయన్
వినయమున మ్రొక్కియిట్లనె । ఘనమోదముతోడ నిటల ✻ ఘటితాంజలియై.

టీ॥ (అనియడిగిన) మురరిపు పదవనజంబులన్ = కృష్ణునిపాదకమలములయందు. తనకిరీటవరమణులు = తనకిరీటములోని శ్రేష్ఠములయినరత్నములు.ఒరయన్=ఒరసికొనఁగా. వినయమునన్=అడఁకువతో. మ్రొక్కి=నమస్కరించి. ఘనమోదముతోడన్=అధికసంతోషముతో. నిటలఘటితాంజలియై=నొసటఁగూర్పఁబడిన చేమోడ్పుగలవాఁడై. ఇట్లనెన్=ఇట్లుపలికెను.

తా॥ అని శ్రీకృష్ణమూర్తి యడుగఁగా నతఁడు మిక్కిలిసంతోషించినవాఁడై ఆయనపాదములు తన కిరీటము సోఁకునట్లు మ్రొక్కి మోడ్పఁబడిన చేతులను నొసటఁ జేర్చుకొన్నవాఁడై యిట్లు పలికెనని తాత్పర్యము.

౫౦౬.—తే॥ విశ్వ సంవేద్యమహిత యీ * విశ్వమందుఁ। బ్రకటముగనీవెఱుంగని * దొకటిగలదె
యయిన నాచేత విన నిష్ట * మయ్యె నేని। నవధరింపుము వినిపింతు * నంబుజాక్ష.

టీ॥ అంబుజాక్ష=తామరలవంటికన్నులుగలఓకృష్ణా. విశ్వసంవేద్యమహిత=ప్రపంచమునందుఁజక్కఁగా తెలియఁదగినమహిమగలఓస్వామీ. ఈవిశ్వమందున్=ఈలోకమునందు. ప్రకటముగన్ = ప్రసిద్ధముగా. నీవెఱుంగనిదొకటికలదె = నీవెఱుఁగని వృత్తాంతము ఒకటియైనఁ గలదా—అన్నివృత్తాంతములును నీకుఁ దెలియు ననుట. (అయినను) నాచేతన్=నాగుండ. వినన్ = వినుటకు. ఇష్టమయ్యెనేనిన్=ఇచ్ఛయున్నయెడల.వినిపింతున్=చెప్పుదును. అవధరింపుము=చిత్తగింపుము.

తా॥ ఓకృష్ణమూర్తీ ! యీలోకములోనివృత్తాంతము ఏదియు నీవెఱుఁగనిది లేదు. అన్నియు నీవెఱుఁగుదువు అయినను నేను చెప్పఁగా వినవలెనను ఇచ్ఛ కలిగిన యెడల చెప్పెదను వినుము అని తాత్పర్యము.

౫౦౭.—ఉ॥ ఏనిక్ష్వాకు తనూజుఁడన్ నృగుఁడునా * నేపారు భూపాలుఁడన్
దీనవ్రాతము నర్థిఁ బ్రోచుచు ధరి * త్రీనాయకుల్గొల్చి స
మ్మానింపన్ జతురంత భూభరణ సా * మర్థ్యుండనై సంతత
శ్రీనిండారిన వాఁడ నుల్లసిత కీ * ర్తి స్ఫూర్తి శోభిల్లఁగన్.

టీ॥ ఏన్ = నేను. ఇక్ష్వాకుతనూజుఁడన్ = ఇక్ష్వాకుమహారాజుకొడుకను. నృగుఁడునాన్=నృగుఁడుఅనఁగా. ఏపారు=అతిశయించునట్టి. భూపాలుఁడన్=రాజను. దీనవ్రాతమున్=దీనులసమూహమును. అర్థిన్=ప్రీతితో. ప్రోచుచున్=రక్షించుచు. ధరిత్రీనాయకులు=రాజులు. కొల్చి=సేవించి. సమ్మానింపన్ = గౌరవింపఁగా. చతురంత భూభరణసామర్థ్యుండనై=నాలుగు దిక్కులు మేరగాఁగల భూమి నంతయు ఏలునట్టి సామర్థ్యము గలవాఁడనై. ఉల్లసితకీర్తి స్ఫూర్తిన్ = స్వచ్ఛమయిన కీర్తియొక్క ప్రకాశము. శోభిల్లఁగన్=వెలుఁగొందఁగా. సంతతశ్రీన్ = ఎడతెగని కలిమిచేత. నిండారినవాఁడన్=నిండుకొన్నవాఁడను.

తా॥ నేనుఇక్ష్వాకుమహారాజుకొడుకను, నృగుఁడు అను పేరుగలవాఁడను,దీనజనులనుఅన్నవస్త్రములిచ్చిపోషించుచు,అనేకులురాజులు కొలువఁగా,నాలుగుదిక్కులు మేరగాఁగల భూమినెల్ల నేలుచు,స్వచ్ఛమయినకీర్తివెలుఁగఁగా, వర్తించుచున్నవాఁడననితాత్పర్యము.

౫౦౮.—చ॥ పలుకులఁ దన్నుఁదాఁబొగడఁ * బాతకమందు రటుండెఁదారకా
వలి సికతావ్రజంబు హిమ * వారికణంబుల లెక్కపెట్టఁగా
నలవడుఁగాని యేను వసు * ధామరకోటికి దానమిచ్చు గో
వుల గణుతింప ధాతయును * నోపఁడు మాధవ యేమిచెప్పుదున్.

టీ॥ మాధవ=ఓశ్రీకృష్ణా. పలుకులన్=మాటలచేతను. (తన్ను) తాన్ = తాను. పొగడన్ = పొగడుకొనుట. పాతక మందురు= పాపము అనిచెప్పుదురు. అటుండెన్=ఆపాతకము అనుట అట్లుండనిమ్ము. తారకావలిన్ = నక్షత్రపఙ్క్తిని. సికతా వ్రజంబున్=ఇసుకప్రోగును. హిమవారి కణంబులన్= మంచునీళ్ల చినుకులను. లెక్కపెట్టఁగాన్ = లెక్కపెట్టుటకు. అలవడుఁగాని = అనుకూలించునుగాని. ఏను=నేను. వసుధామరకోటికిన్ = బ్రాహ్మణ సమూహమునకు. దానమిచ్చుగోవులన్=దానముగానిచ్చినఆవులను. గణుతింపన్= లెక్కపెట్టుటకు. ధాతయునునోపఁడు=బ్రహ్మగూడ శక్తుఁడుగాఁడు. ఏమిచెప్పుదున్=ఇఁక నేనేమి చెప్పుదును.

తా॥ ఓశ్రీకృష్ణా ! లోకమునందు ఎవరికిఁగాని తన్నుఁ దాను పొగడుకొనుటమహాపాతకమని పెద్దలుచెప్పుదురు అదిపాపమైనను కానీ నేను చెప్పినది చెప్పితీర్చెదను నక్షత్రములను ఇసుకప్రోగులను మంచు చినుకులనుఎంచినను ఎంచవచ్చునుగాని నేనుబ్రాహ్మణులకుదానముగా నిచ్చిన యావులను ఎంచుటకు బ్రహ్మగూడ సమర్థుఁడు గాఁడు ఇఁక నేనేమిచెప్పుదును అనిపలికెననితాత్పర్యము.

౫౦౯.—చ॥ పొలుచు సువర్ణశృంగ ఖుర * ముల్దనరన్ దొలుచూలులై సువ
త్సలుగల పాడియావుల ను * దాత్త తపోవ్రత వేదపాఠముల్
గలిగి కుటుంబులై విహిత * కర్మములం జరియించు పేద వి
ప్రులకు సదక్షిణంబుగ వి * భూతి దలిర్పఁగ నిత్తు నచ్యుతా.

టీ॥ అచ్యుతా=ఓశ్రీకృష్ణా. పొలుచుసువర్ణశృంగఖురముల్=ఒప్పునట్టిబంగారుకొమ్ములునుగొరిసెలు. తనరన్ = ప్రకాశింపఁగా. తొలుచూలులై=మొదటియీఁతగలవిఅయిన.సువత్సలుగల=మంచిదూడలుగల. పాఁడియావులన్=పాలిచ్చునట్టియావులను. ఉదాత్త...పాఠములు—ఉదాత్త=ఉన్నతిగల. తపః=కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సులను వ్రత=నిత్యనైమిత్తికవ్రతములను. వేదపాఠములు = వేదము చదువుటలును. (కలిగి) కుటుంబులై = పెండ్లాముబిడ్డలుగలవారై. విహితకర్మములన్ = వేదములయందు నియమింపఁబడిన యాగాదిక్రియలను. చరియించు = నడపునట్టి. పేదవిప్రులకున్ = పేదబ్రాహ్మణులకు. సదక్షిణంబుగన్=దక్షిణతోఁగూడ. విభూతిన్=ఐశ్వర్యము. తలిర్పఁగన్=

కలుగఁగా. ఇత్తుక్ = బీదబ్రాహ్మణులకు దానము ఇచ్చుచుందును.

తా॥ ఓకృష్ణా! నేనుబంగారుకొమ్ములు గొరిసెలుగల తొలియీఁతయీనినవియు లేఁగదూడలతోఁ గూడినవియునైన పాఁడియావులను ఎక్కువైనతపస్సులు చేసినవారును, గొప్పవ్రతములు నడపువారును, వేదములు చదువువారునునై పెండ్లాముబిడ్డలుగలిగి తమకుశాస్త్రమునందు విధింపఁబడిన కర్మములనుతప్పకనడపువారైన బ్రాహ్మణులకుఅందులకుఁదగిన దక్షిణలతోడమహావైభవముతో ఇచ్చుచుందునుఅనితాత్పర్యము.

వ॥ మఱియు న్యాయసముపార్జిత విత్తమ్ముల గో భూ హిరణ్య రత్న నివాస రథ హస్తి వాజి కన్యా సరస్వతీ వస్త్ర తిలకాంచన రజత శయ్యాది బహువిధదానంబు లనూనంబులుగా ననేకంబులు సేసితిఁ బంచమహాయజ్ఞంబు లొనరించితి వాపీ కూప తటాక వననిర్మాణంబులు సేయించితి నివ్విధంబునం జేయుచో నొక్కనాడు.

టీ॥ మఱియున్ = ఇదిగాక. న్యాయసముపార్జిత విత్తమ్ములన్ = న్యాయముచేత సంపాదించిన ధనములచేత. గోభూ...శయ్యాది — గో=గోవులు. భూ=భూమి. హిరణ్య=బంగారు. రత్న=రత్నములు. నివాస=ఇండ్లు. రథ=తేరులు. హస్తి=ఏనుఁగులు. వాజి=గుఱ్ఱములు. కన్యా=కన్యకలు. సరస్వతీ=విద్య. వస్త్ర=వస్త్రములు. తిల=నువ్వులు. కాంచన=ధనము. రజత=వెండి. శయ్యా=పఱపు. ఆది=మొదలుగాఁగల. బహువిధ = నానావిధము లయిన. దానంబులు=దానములను. అనూనంబులుగాన్=తక్కువలేకుండ. అనేకంబులు=పెక్కులు. (చేసితిని) పంచమహాయజ్ఞంబులు = వేదపాఠము, వైశ్వదేవాది హోమము, అతిథిపూజ, పితృతర్పణము, భూతబలి, అను నీమహాయజ్ఞములైదింటిని. ఒనరించితిన్ = చేసితిని. శ్లో॥ పాఠో హోమ శ్చాతిథీనాం సపర్యాతర్పణంబలిః। ఏతే పంచమహాయజ్ఞాః బ్రహ్మయజ్ఞాదినామకాః ॥ పూజాసపర్యాధ్యయనం బ్రహ్మయజ్ఞస్తుతర్పణం। హోమోదైవోబలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనం॥ తా॥ వేదపాఠము బ్రహ్మయజ్ఞము, హోమము దేవయజ్ఞము, అతిథిపూజ మనుష్యయజ్ఞము, పితృతర్పణము పితృయజ్ఞము, భూతబలి భూతయజ్ఞము అని తా. వాపీ...నిర్మాణంబులు—వాపీ = బావులయు. కూప = నూతులయు. తటాక=చెఱువులయు. వన=తోఁపులయు. నిర్మాణంబులు = కలుగఁజేయుటలను. (చేయించితిని ఇవ్విధంబున) చేయుచోన్ = చేయుచుండఁగా. ఒక్కనాడు=ఒకదినమునందు.

తా॥ ఇట్లు గోదానములుచేయుటయేగాక న్యాయముగా సంపాదించిన ధనముచేత గోదానము భూదానము హిరణ్యదానము రత్నదానము గృహదానము రథదానము గజదానము అశ్వదానము కన్యాదానము విద్యాదానము వస్త్రదానము తిలదానము ధనదానము ధాన్యదానము రజతదానము శయ్యాదానము అనుషోడశమహాదానములను కొఱంతలేక చేయుచుందును, పంచమహాయజ్ఞములును చేసితిని, బావులు నూతులు చెఱువులు త్రవ్వించుట తోఁపులు వేయించుట మొదలగుకార్యము లనేకము చేసితిని ఇట్లు సకల దానములు చేయుచునుండి యొకదినమునందు అని తాత్పర్యము.

౫౧౧.—క॥ అనఘాత్మ కశ్యపాఖ్యుం । డను విప్రున కేనకల్మ ✱ షాత్ముఁడనై యి
చ్చినగోవు దప్పి నామం । దనె గలసినఁ దెలియలేక ✱ దగనాగోవున్.

టీ॥ అనఘాత్మ=దుఃఖములులేనిమనసుగలవాఁడా—కృష్ణా. ఏన్=నేను. అకల్మషాత్ముఁడనై=కపటములేనిమనసుగలవాఁడనై. కశ్యపాఖ్యుండు=కశ్యపుఁడు అను పేరుగల వాఁడు. అనువిప్రునకున్=అనఁబడుబ్రాహ్మణునకు. ఇచ్చినగోవు=ఇచ్చినట్టియావు. (తప్పి) నామందనె=నాయావుల మందలోనే. కలసినన్=కలసికొనఁగా. తెలియలేక=ఇదిముందు కశ్యపునకు ఇచ్చినయావు అనితెలిసికోలేక. తగన్=తగునట్లు. ఆగోవున్=కశ్యపుఁడనుబ్రాహ్మణునకునిచ్చిన ఆయావును.

తా॥ ఓస్వామీ! నేను నిష్కపటు స్వభావముతో కశ్యపుఁడు అనుపేరుగల యొక బ్రాహ్మణునకు ఇచ్చిన యావు తప్పివచ్చి నాయావులమందలో చేరఁగా అదిముందొకనికిచ్చిన యావు అను విషయము తెలిసికోలేక దానినే అని తాత్పర్యము.

౫౧౨.—క॥ ఒండొక భూమీసురకుల । మండనునకు దానమియ్య ✱ మసలక యావి
ప్రుండాగోవుం గొనిచను । చుండన్మునుదార గొన్న ✱ యుర్వీసురుఁడున్.

టీ॥ ఒండొక భూమీసురకులమండనునకున్ = ఇంకొకబ్రాహ్మణశ్రేష్ఠునకు. దానమియ్యన్ = దానముగా నియ్యఁగా. ఆవిప్రుండు=ఆబ్రాహ్మణుఁడు. మసలక = ఆలస్యము చేయక. ఆగోవున్=ఆయావును. కొనిచను చుండన్=తోలుకొని పోవుచుండఁగా. మునుదార గొన్నయుర్వీసురుఁడున్=ముందుదానముపుచ్చుకొన్నబ్రాహ్మణుఁడును

తా॥ ఇంకొకబ్రాహ్మణునకు నేను దానమియ్యఁగా అతఁడుఅప్పుడే దానిని తోలుకొని పోయెను పోవుచుండఁగా ముందు దానము పుచ్చుకొన్నబ్రాహ్మణుఁడును అనితాత్పర్యము.

౫౧౩.—క॥ మది రోషమొదవ దోవతి । వదలిన బిగియించుకొనుచు ✱ వడిఁజని యిది నా
మొదవు నడవీథిఁ దొంగిలి । వదలక కొనిపోయె దిట్టి ✱ వారును గలరే.

టీ॥ మదిన్=మనసునందు. రోషము=కోపము. ఒదవన్=కలుగఁగా. (దోవతి) వదలినన్=వీడిపోయినను. బిగియించుకొనుచున్=బిగఁగట్టుకొనుచు. వడిన్ = వడిగా. చని = పోయి. (ఇది) నా మొదవు=నాయావు. నడవీథిన్=వీధి నడుమ. దొంగిలి=దొంగిలించి. వదలక=విడువక. కొనిపోయెదు—తీసికొనిపోయెదవు. ఇట్టివారును గలరే = ఇటువంటి దొంగలును లోకములోఁ గలరా.

తా॥ మనసునకోపము పెరుగఁగా మొలగుడ్డవీడిపోవుచుండబిగఁగట్టుకొనుచు వడిగా పోయి ఇది నాయావు వీధి నడుమ పోవుచుండఁగా దీని దొంగిలించుకొనిపోవుచున్నావా నీవంటి దొంగలు లోకములో ఎక్కడ నుందురు అని యడిగెనని తాత్పర్యము.

౫౧౪.—చ॥ అనవుడు నాతఁడిట్లనియె * నాతనితో నిపుడేను దీని నీ
జనపతిచేత ధారగొని * సాధుగతిం జన నీదియంట యె
ట్లనిన నతండు నేనును ధ * రాధిపుచే మును ధారగొన్న యా
వని వినిపింప నిద్దఱకు * నయ్యె నపార వివాద మచ్చటన్.

టీ॥ అనవుడున్=అనఁగా. అతఁడు = ఆబ్రాహ్మణుఁడు. ఆతనితోన్ = ఆకశ్యపునితో. ఇట్లనియెన్ = ఇట్లుపలికెను. ఇపుడు= ఇప్పుడు. ఏను=నేను. దీనిన్ = ఈయావును. ఈజనపతిచేతన్= ఈరాజుచేత. ధారగొని=ధారా పూర్వముగా దానము పుచ్చుకొని. సాధుగతిన్=యోగ్యనిరీతిగా – క్రమముగా. చనన్ = పోవుచుండఁగా. నీదియంట=నీదియని చెప్పుట. (ఎట్లు) అనినన్=అనఁగా. అతండు = ఆకశ్యపుఁడు. (నేనును) ధరాధిపుచేన్ = రాజు చేత. మును=మునుపు. ధారగొన్నయావు=ధారాపూర్వకముగా దానము పుచ్చుకొన్నయావు. అనివినిపింపన్ = అని చెప్పఁగా. అచ్చటన్= (అక్కడ) ఇద్దఱకున్=అయిద్దఱుబ్రాహ్మణులకును. అపారవివాదము= మేరలేనికలహము. (అయ్యెను.)

తా॥ అప్పుడా బ్రాహ్మణుఁడు కశ్యపుఁడు అను బ్రాహ్మణునితో నేనిప్పుడు ఈరాజు ధారాపూర్వకముగా దానమియ్యఁగా తోలుకొని వచ్చుచున్నానే ఇదినీయావు అనుట యెటువంటిది అని యడుగఁగా కశ్యపుఁడు నేనును ఆరాజు వద్దనే ధారా పూర్వక దానము పొందిన యావు ఇది అని చెప్పెను అంతట అయిద్దఱును అచ్చట అత్యంతకలహము ఆయెను అనితాత్పర్యము.

౫౧౫.—వ॥ ఇట్లు విప్రులిద్దఱుం దమలో నంతకంతకు మచ్చరంబునం బెచ్చు పెరిగి కలహించి నాయున్న
యెడకుం జనుదెంచి మున్ను నాచేత గోదానంబు గొన్న బ్రాహ్మణుం డిట్లనియె.

టీ॥ (ఇట్లు) విప్రులిద్దఱున్=ఇద్దఱుబ్రాహ్మణులును. తమలోన్= తమలోతాము. అంతకంతకున్=అప్పటికప్పటికి. మచ్చరంబునన్= చలముచేత. పెచ్చుపెరిగి=మిక్కిలివిజృంభించి. కలహించి=జగడమాడి. నాయున్నయెడకున్=నేనున్నతావునకు. చనుదెంచి=వచ్చి. మున్ను= తొలుత. (నాచేత) దానంబుగొన్న బ్రాహ్మణుండు=దానముపుచ్చుకొన్న బ్రాహ్మణుఁడు. ఇట్లనియెను=ముందుఁ జెప్పఁబోవువిధమునఁబలికెను.

తా॥ ఈవిధముగా ఆబ్రాహ్మణు లిద్దఱు అప్పటప్పటికిచలముపెరుగఁగాకలహించి కలహించి తుదకు నేనున్న తావునకు వచ్చిరి అప్పుడు తొలుతనాచేతదానము పుచ్చుకొన్నబ్రాహ్మణుఁడు నాతోనిట్లు అనెను అనితాత్పర్యము.

౫౧౬.—సీ॥ మనుజేంద్ర ప్రజలధ * ర్మ ప్రవర్తనముల - నడవకుండఁగ నాజ్ఞ * నడపు నీవు
మనమున నేధర్మ * మని యాచరించితి - మును నాకు నిచ్చిన * మొదవు దప్పి
వచ్చి నీమందలోఁ * జొచ్చిన నిప్పుడీ - భూసురునకు ధార * వోసియిచ్చి
తగవు మాలితి వీవ * దాతవు నపహర్త - వైన నిన్నేమన * నవని నాథ

తే॥ యనినమాటలు చెవులుసోఁ * కినఁ గలంగి । భూసురోత్తమ యజ్ఞాన * పూర్వకమున
నిట్టిపాతక మొరసె నే * నెఱిఁగి సేయఁ । గొనుము నీకిత్తు నొకలక్ష * గోధనంబు.

టీ॥ మనుజేంద్ర=రాజా. ప్రజలు = జనులు. అధర్మప్రవర్తనములన్=ధర్మముతప్పిననడతలయందు. నడవకుండఁగన్=ప్రవర్తింపకుండ. ఆజ్ఞనడపునీవు = నియమించునట్టినీవు. మనమునన్ = నీమనసులో. ఏధర్మమని=ఏలాటి ధర్మము అని. ఆచరించితి = ఈపనిచేసినావు. మును = ముందు. నాకునిచ్చిన మొదవు=నాకు దానముచేసిన యావు. తప్పివచ్చి = తప్పించుకొనివచ్చి. (నీమందలోఁజొచ్చినను ఇప్పుడు) ఈభూసురునకున్=ఈబ్రాహ్మణునకు. ధారవోసియిచ్చి= ధారాదత్తముచేసియిచ్చి. తగవు మాలితివి=ధర్మము తప్పితివి. అవనినాథ=రాజా. ఈవ=నీవే. దాతవును=దానమిచ్చినవాఁడవును. అపహర్తవును=అపహరించినవాఁడవును. అయినన్=అయిన యెడ. నిన్నేమనన్=నిన్నుఏమియనవచ్చును. (అనినమాటలు) చెవులు సోఁకినన్= చెవులయందుపడఁగానే. కలంగి=కలఁతనొంది. భూసురోత్తమ=ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడా. అజ్ఞానపూర్వకమునన్=అజ్ఞానము ముందుఁగలుగుటచేత-ఇదిముందొకరికిఇచ్చినదిఅని తెలిసికొనకపోవుటచేత. ఇట్టిపాతకము= ఇటువంటిపాపము. ఒరసెన్ = కలిగెను. (నేను) ఎఱిఁగిచేయన్= నాకుఁదెలిసి యీపనిచేయలేదు. ఒకలక్షగోధనంబు=ఒకలక్షయావులను. నీకిత్తున్=నీకు ఇచ్చెదను. కొనుము = పుచ్చుకొనుము.

తా॥ ఓరాజా! నీవు ధర్మముతప్పి నడచువారిని శిక్షించి ధర్మము నడపునట్లు చేయువాఁడవైయుండి ఇది యేమిధర్మమని చేసితివి నీవు మునుపు నాకు ఇచ్చినట్టి యీయావు తప్పించుకొనివచ్చి నీమందలోకలిసినప్పుడు దానిని మరల నాయింటికి తోలిపంపక ఇప్పుడు ఇంకొకబ్రాహ్మణునికి ఇయ్యవచ్చునా ఇది అధర్మముకాదా ఇచ్చువాఁడవు నీవే తీసికొనువాఁడవు నీవే అయినందులకు ఇప్పుడు నిన్నేమనవచ్చును అని అడిగెను ఆమాటలు నాచెవిని పడఁగానే మనసునందు కలవరము పుట్టి అయ్యా! బ్రాహ్మణుఁడా నేను తెలిసి యీపని చేసినవాఁడను కాను బుద్ధి మోసముచేత జరగిన పనికి కోపింపకుము నీకు ఆయావునకు బదులు దానివంటివానిని లక్ష యావులను ఇచ్చెదను పుచ్చుకొనుము అని చెప్పితినని తాత్పర్యము.

౫౧౭.—క॥ అని మఱియును నవ్విప్రుని । సునయోక్తుల ననునయించు * చును నిట్లంటిన్
ననుఁగావు నరకకూపం । బునఁ బడఁగాఁజాలఁ బురుష * పుంగవ యనినన్.

టీ॥ (అని) మఱియును=ఇంకను. అవ్విప్రునిన్=ఆబ్రాహ్మణుని. సునయోక్తులన్ = మంచి నీతిమాటలచేత. అనునయించుచును = సమాధానపఱుచుచును. (ఇట్లంటిని) పురుషపుంగవ = పురుష శ్రేష్ఠుఁడా. (ననున్) కావు=రక్షింపుము. నరకకూపంబునన్= నరకకూపమునందు. పడఁగాఁజాలన్=పడలేను. అనినన్=అనఁగా

తా॥ అని యిట్లుచెప్పి యింకను ఆబ్రాహ్మణుని మంచిమాటల చేత వేఁడుకొని సమాధానపఱుచుచు అయ్యా నేనునరకకూపము నందుపడలేను ఎట్లయిననన్నుమన్నించికాపాడుమనఁగాను అనితా.

౫౧౯.—తే॥ ఎంత వేఁడిన మచ్చరం * బంత పెరిగి । మొదట నాకిచ్చినట్టి యా * మొదవె కాని
యెనయ నీరాజ్యమంతయు * నిచ్చితేని । నొల్లననివిప్రుఁ డచ్చట * నుండ కరిగె.

టీ॥ విప్రుఁడు=ఆబ్రాహ్మణుఁడు. ఎంతవేఁడినన్=ఎంతఅధిక ముగావేఁడుకొంటినో. అంత=అంతటి అధికముగా. మచ్చరంబు= మాత్సర్యము. (పెరిగిమొదట నాకిచ్చినట్టి) ఆమొదవె కాని=ఆయావే కాని. ఎనయన్=దానికిఈడుగా. నీరాజ్యమంతయునిచ్చితేనిన్= నీరాజ్యము నెల్లఇచ్చినను. ఒల్లను=నేన పేక్షింపను—నాకుఅక్కఱలేద నుట. అనుచున్=అనిచెప్పుచు. (అచ్చటనుండక) అరిగెన్=పోయెను.

తా॥ ఆబ్రాహ్మణునకు నేను వేఁడుకొను కొలఁదిని అప్పటప్ప టికి కోపము హెచ్చి నీవు నాకు మొదట ఇచ్చిన ఆవు నిచ్చితివా ఇమ్ము దానినియ్యక దానికి ఈడుగా నీరాజ్యమునంతయు నిచ్చినను నాకు అక్కఱలేదని అచ్చటనిలువక పోయెనని తాత్పర్యము.

వ॥ అట్లతం డరిగిన నా రెండవ బ్రాహ్మణునిం బ్రార్థించిన నతండును జలంబు డింపక పదివేలేఱి కోరి
పాఁడిమొదవుల నిచ్చిననైనను దీనినకాని యొల్లనని నిలువక చనియె నంతఁ గాలపరిపక్వంబైన
నన్ను దండధరకింకరులు గొనిపోయి వైవస్వతుముందఱం బెట్టిన నతండు నన్నుద్దేశించి యిట్లనియె.

టీ॥ ఆతండు=ఆబ్రాహ్మణుఁడు. అట్లరిగినన్ = అట్లుకోపించు కొనిపోఁగా (ఆరెండవబ్రాహ్మణుని) ప్రార్థించినన్=వేఁడుకొన్నను (ఆతఁడును) చలంబుడింపక=పట్టినపట్టువిడువక. ఏఱికోరి=అక్క ఱతో వెదకి యేర్పరించి. పాఁడిమొదవులన్=పాలిచ్చునట్టియావు లను. పదివేలు = పదివేలింటిని. ఇచ్చిననైనన్ = ఇచ్చినను. దీనిన కాని=ఈయావు నేతప్ప. ఒల్లనని=మఱియొకదానిని వలవను అని. నిలువక=అందునిలువక. చనియెన్=పోయెను. అంతన్=అనంత రము. కాలపరిపక్వంబైనన్=కాలముముగిసిరాఁగా. (నన్ను) దండ ధరకింకరులు=యమునిభటులు. కొనిపోయి=తీసికొనిపోయి. వైవ స్వతుముందఱన్ = యమునియెదుట. పెట్టినన్ = నిలుపఁగా. అతండు=యముఁడు. నన్నుద్దేశించి=నన్నుఁగూర్చి. (ఇట్లనియెను)

తా॥ ఆబ్రాహ్మణుఁడు అట్లు కోపించుకొనిపోఁగా రెండవ బ్రాహ్మణుని అయ్యా నీవైననామనవిని అంగీకరింపుమంటిని అతఁ డును నీవు ఈయావు తప్ప ఇంతకంటె మేలైనవానిని ఏఱికోరి యిచ్చినను నేనుపుచ్చుకొనను అని తానుపట్టినపట్టు వదలకబయలు దేఱిపోయెను అంతట కాలమును ముగిసిరాఁగా నన్ను యమకింక రులు పట్టుకొనిపోయి యమునియెదుట నిలిపిరి అప్పుడు యముఁడు నన్నుఁజూచి యిట్లు పలికెనని తాత్పర్యము.

౫౨౦.—మ॥ మనుజేంద్రోత్తమ వంశపావన జగ * న్మాన్యక్రియాచార నీ
ఘనదాన క్రతు ధర్మముల్ త్రిభువన * ఖ్యాతంబులై చెల్లెడిన్
మును దుష్కర్మఫలంబు నొంది పిదపన్ * బుణ్యానుబంధంబులై
చనుసౌఖ్యంబులఁ బొందు పద్మజునియా * జ్ఞం ద్రోవఁగా వచ్చునే.

టీ॥ మనుజేంద్రోత్తమ=రాజశ్రేష్ఠుఁడా. వంశపావన = వంశ మును పవిత్రమునుగాఁ జేయువాఁడా. జగన్మాన్యక్రియాచార = లోకులందఱు గౌరవింపఁదగినకార్యములనునడపినవాఁడా. నీఘన దానక్రతుధర్మములు = నీవైన గొప్పదానములు యజ్ఞములు ననెడు పుణ్యకర్మములు. త్రిభువనఖ్యాతంబులై = మూఁడులోకములలోను ప్రసిద్ధములై. చెల్లెడిన్=చెల్లుబడియగుచున్నవి. మును=ముందుగా. దుష్కర్మఫలంబున్ = చెడ్డకర్మములవలని అనుభవమును. ఒంది= పొంది. పిదపన్=తరువాత. పుణ్యానుబంధంబులై=పుణ్యముననుస రించినవై. చనుసౌఖ్యంబులన్=ఒప్పునట్టిసుఖములను. పొందు=అనుభ వింపుము. పద్మజునియాజ్ఞన్ = బ్రహ్మయొక్క నియమమును. త్రోవఁగాన్=తొలఁగింప. వచ్చునే=శక్యమగునా.

తా॥ పుట్టినవంశమును పావనముగాఁజేయువాఁడవును లోకు లందఱుగౌరవింపఁదగినపనులుచేసినవాఁడవునైన ఓరాజశ్రేష్ఠుఁడా నీవుచేసిన దానములు యజ్ఞములు మొదలుగాఁగల సత్కార్యములు మూఁడులోకములందును ప్రసిద్ధికెక్కియున్నవి కాఁబట్టి నీవుచేసిన పాపములవలని అల్పఫలమును ముందు అనుభవించి పిమ్మట పుణ్య కర్మములవలని మహాఫలమును అనుభవింపుము బ్రహ్మనిర్ణయమును తప్పించుకొనుటకు ఎటువంటివారికినిశక్యముకాదుఅనిచెప్పెననితా.

వ॥ అని వేగంబునం ద్రోపించిన నేనపుడు పుడమిం బడి యీనికృష్టంబైన యాసరవెల్లి రూపంబుఁ గైకొంటి నింత
గాలంబు తద్దోష నిమిత్తంబున నిద్దురవస్థం బొందవలసెఁ బ్రాణులకుఁ బుణ్యపాపంబు లనుభావ్యంబులు గాని
యూరకపోనేరవు నేడు సమస్త దురిత నిస్తారకంబైన భవదీయ పాదారవింద సందర్శనంబునం జేసి యీఘోర
దుర్దశలం బాసి నిర్మలాత్మకుండ నైతినని పునఃపునః ప్రణామంబు లాచరించి మఱియు నిట్లనియె.

టీ॥ (అని) వేగంబునన్=వడితో. ద్రోపించినన్=అధోలోకమునకుపడఁద్రోయింపఁగా. (నేను) అపుడు=అప్పుడు. పుడమిన్= భూమియందు. (పడి) ఈనికృష్టంబైనయూసరవెల్లిరూపంబున్ = మిక్కిలి నీచమయిన యీయూసరవెల్లిరూపమును. కైకొంటిన్= పొందితిని. ఇంతకాలంబు=ఇన్నాళ్లదాఁక. తద్దోషనిమిత్తంబునన్= ఆపాపకారణముచేత. ఇద్దురవస్థన్ = ఈచెడ్డయవస్థను. పొంద వలసెన్ = అనుభవింపవలసివచ్చెను. ప్రాణులకున్ = జీవులకు. పుణ్యపాపంబులు=పుణ్యమును పాపమును. అనుభావ్యంబులు గాని= అనుభవింపఁదగినవికాని. ఊరక = అనుభవింపకయే. పోనేరవు= తొలఁగిపోఁజాలవు. నేడు=ఈదినము. సమస్తదురితనిస్తారకంబు= ఎల్లపాపములను దాఁటించునది. అయినభవదీయ పాదారవింద సందర్శనంబునం జేసి=అయినట్టి నీపాదకమలములను జూచుటచేత. ఈఘోరదుర్దశలన్=భయంకరమైన యీదుఃఖములనుండి. పాసి= తొలఁగి. నిర్మలాత్మకుండనైతిన్ = నిర్మలమయిన మనసుగలవాఁడనైతిని – పరిశుద్ధుఁడనైతిననుట. (అని) పునఃపునఃప్రణామంబులు= మాటికిమాటికినమస్కారములను. ఆచరించి=చేసి. మఱియున్= ఇంకను. ఇట్లనియెన్=ఈమీఁదచెప్పఁబోవువిధముగాపలికెను.

తా॥ అనిచెప్పియముఁడువేగముగదిగువఁబడఁద్రోయింపఁగా నేను భూమిమీఁదఁబడి నీచమయిన యీ యూసరవెల్లిరూపమును పొందితిని ఇన్నాళ్లదాఁక ఈరూపముతో పడవలసిన బాధలన్నిపడి ఆపాపమును అనుభవించితిని లోకమునందలి ప్రాణులలో నెవ్వరికైనను తమతమ చేసికొన్న పుణ్యపాపములు అనుభవింపక తప్పవు ఎల్లపాపములను తొలఁగించునట్టిదైన నీపాదకమలమును దర్శనము చేసి భయంకరమైన దుఃఖదశను పోఁగొట్టుకొని పావనుఁడనైతిని అని పలుమాఱు మ్రొక్కి మఱియు ఒకమాట చెప్పెననితాత్పర్యము.

౫౨౨.—ఆ॥ కృష్ణ వాసుదేవ ❋ కేశవ పరమాత్మ । యప్రమేయ వరద ❋ హరి ముకుంద
నిన్నుఁ జూడఁగంటి ❋ నీకృపఁ గనఁగంటి । నఖిల సౌఖ్యపదవు ❋ లందఁగంటి.

టీ॥ కృష్ణ = సర్వమును కావించువాఁడా—సృష్టి స్థితి లయము తిరోధానము అనుగ్రహము అను పంచకృత్యములను, బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ రూపములతోఁ జేయువాఁడా అనుట. వాసుదేవ = సర్వమును నీయందువసింపఁగా సర్వమునందు నీవు వసించునట్టివాఁడా. కేశవ = బ్రహ్మ రుద్రులకు జన్మస్థానమయిన వాఁడా — లేక, బ్రహ్మ విష్ణు రుద్రులకు జన్మస్థానమయినవాఁడా లేక,సూర్యచంద్రాగ్నులకాంతులను వెండ్రుకలుగధరించినవాఁడా. లేక, కే = జలమందు. శవ=శవవత్తుగానుండువాఁడా—అనఁగా, ప్రళయసముద్రమునందు వటపత్రముమీఁద యోగనిద్రను పొందుచు నుండువాఁడాఅనుట. పరమాత్మ=పరబ్రహ్మమయినవాఁడా అప్రమేయ=కొలఁదితెలియఁబడనివాఁడా — అనుమానము ఉపమానము ప్రత్యక్షము మొదలైన అష్టప్రమాణములను మీఱినవాఁడాఅనుట. వరద=భక్తులకోరికలనిచ్చువాఁడా—లేక, భక్తులకు దివ్యజ్ఞానము నిచ్చువాఁడా. హరి= భక్తులపాపములను హరించువాఁడా—లేక, ప్రళయకాలమునందు సకలలోకములను మ్రింగి వెలుఁగువాఁడా. ముకుంద = ఇహ పర సుఖముల నిచ్చువాఁడా. (నిన్ను) చూడఁగంటిన్ = చూచునంతటిభాగ్యమునుపొందితిని. నీకృపన్ = నీదయను. కనఁగంటిన్=పొందితిని. అఖిలసౌఖ్యపదవులు=ఎల్లసుఖమార్గములను. అందఁగంటిన్=పొందునంతటిభాగ్యముగలవాఁడనైతిని.

తా॥ సృష్టి స్థితి లయాదులను చేయువాఁడవును, సమస్తము నీయందును నీవు సమస్తమునందును నుండఁగా వర్తించువాఁడవును, బ్రహ్మ రుద్రులకు జన్మస్థానమైనవాఁడవును, పరబ్రహ్మ స్వరూపుఁడవును, కొలఁది తెలియఁబడనివాఁడవును, భక్తుల కోరికల నిచ్చువాఁడవును, పాపములనుపరిహరించువాఁడవును, ఇహపరసుఖముల నిచ్చువాఁడవునునైన నిన్నుఁజూచి నీదయను పొందునంతటిభాగ్యము గలవాఁడనైతిని సకలసౌఖ్యములను పొందినవాఁడనైతిని అని పలికెననితాత్పర్యము.

వ॥ అని యనేకభంగులంగొనియాడి గోవిందుని పదంబులు తనకిరీటంబు సోఁకం బ్రణమిల్లి దేవా భవదీయ పాదారవిందంబులు నాహృదయారవిందంబునం బాయకుండునట్లుగాఁ బ్రసాదింపవేయని తదనుజ్ఞాతుండై యచ్చటి జనంబులు సూచి యద్భుతానందంబులం బొంద నతుల తేజోవిరాజితంబైన దివ్య విమానమం దాసీనుండై దివంబున కరిగె నంత నమ్మాధవుండు నచ్చట నున్న పార్థివోత్తములకు ధర్మబోధంబుగా నిట్లనియె.

టీ॥ (అని) అనేకభంగులన్=బహువిధములచేత. కొనియాడి= స్తోత్రముచేసి. గోవిందునిపదంబులు = కృష్ణునిపాదములు. తన కిరీటంబుసోఁకన్=తనకిరీటముతాఁకునట్లు. ప్రణమిల్లి = మ్రొక్కి. దేవా=స్వామీ. భవదీయపాదారవిందంబులు = నీవైన పాదకమలములు. నాహృదయారవిందంబునన్ = నామనఃకమలమునందు. పాయకుండునట్లుగాన్=ఎడఁబాయకయుండునట్లుగా. ప్రసాదింపవే = అనుగ్రహింపవయ్యా. (అని) తదనుజ్ఞాతుండై=ఆకృష్ణుని చేత అనుజ్ఞను పొందినవాఁడై. (అచ్చటిజనంబులు-చూచి) అద్భుతానందంబులన్=ఆశ్చర్యమును సంతోషమును. పొందన్ = పొందుచుండఁగా. అతులతేజోవిరాజితంబు=సాటిలేని తేజస్సుచేత ప్రకాశించునది. (అయిన) దివ్యవిమానమందున్=దేవతలదైన విమానమునందు. ఆసీనుండై=కూర్చున్నవాఁడై. దివంబునకున్=స్వర్గమునకు. అరిగెన్=పోయెను. అంతన్ = అటుపిమ్మట. అమ్మాధవుండును = ఆశ్రీకృష్ణమూర్తియు. అచ్చటనున్నపార్థివోత్తములకున్=అక్కడనున్న రాజశ్రేష్ఠులకు. ధర్మబోధంబుగాన్ = ధర్మమునుబోధించుటగా. (ఇట్లనియెన్)

తా॥ అని బహువిధములుగా పొగడి శ్రీకృష్ణుని పాదకమలములు తనకిరీటము తగులునట్టుగా సాగిలఁబడి మ్రొక్కి స్వామీ పాదకమలములు నామనస్సునందు ఎల్లప్పుడునుండునట్టుగాఅనఁగా నీపాదకమలధ్యానము నాకు సదాకలిగియుండునట్టుగా అనుగ్ర

హింపుము అని ప్రార్థించి శ్రీకృష్ణమూర్తిచేత అనుజ్ఞను పడసినవాఁడై అచ్చటనుండిన జనులందఱు ఆశ్చర్యమును సంతోషమును పొందునట్లుగా దేవతలచేత పంపఁబడిన విమానముపైనెక్కి స్వర్గమునకుఁ బోయెను ఇక్కడ శ్రీకృష్ణమూర్తియు అచ్చటనుండిన రాజులకు అందఱకు ధర్మము తెలియునట్టుగా ఒకమాట చెప్పెను అని తాత్పర్యము.

౫౨౪.—సీ॥ నరనాథకులకాన * నము దహించుటకును - నవనీసురుల విత్త * మగ్నికీల
జననాయకుల నిజై * శ్వర్యాబ్ధి నింకింప - బ్రాహ్మణ క్షేత్రంబు * బాడబంబు
పార్థివోత్తముల సం * పచ్ఛైలములఁగూల్ప - భూసురధనము దం * భోళిధార
జగతీవరుల కీర్తి * చంద్రిక మాయింప - సూర్యోదయము ధరా * సుతుల ధనము

తే॥ విప్రతతి సొమ్ముకంటెను * విషము మేలు । గరళమునకును బ్రతికృతి * గలదుగాని
దానిమాన్పంగ భువినౌష * ధములు లేవు । గాన బ్రహ్మస్వములు గొంట * గాదుపతికి.

టీ॥ నరనాథకులకాననమున్ = రాజులసమూహమనెడుఅడవిని. దహించుటకున్ = కాల్చుటకు. అవనీసురులవిత్తము = బ్రాహ్మణుల ధనము. అగ్నికీల = నిప్పుమంట. జననా... అబ్ధిన్ — జననాయకుల = రాజులయొక్క. నిజ = స్వకీయమయిన. ఐశ్వర్య = కలిమియనెడు. అబ్ధిన్ = సముద్రమును. ఇంకింపన్ = ఇంకునట్లుచేయను. బ్రాహ్మణ క్షేత్రంబు = బ్రాహ్మణులయొక్కపంటభూమి. బాడబంబు = బడబాగ్ని. పార్థివోత్తములసంపచ్ఛైలములన్ = రాజులయొక్క భాగ్యమనెడుకొండలను. కూల్పన్ = పడఁగొట్టుటకు. భూసురధనము = బ్రాహ్మణులధనము. దంభోళిధార = వజ్రాయుధపువాదర. జగతీవరులకీర్తిచంద్రికన్ = రాజులకీర్తియనెడువెన్నెలను. మాయింపన్ = పోఁగొట్టుటకు. ధరాసురులధనము = బ్రాహ్మణులసొత్తు. సూర్యోదయము = ప్రొద్దుపొడుపు. విప్రతతిసొమ్ముకంటెను = బ్రాహ్మణసమూహముయొక్క ధనముకంటెను. (విషము) మేలు = మంచిది. గరళమునకును = విషమునకుఁగూడ. ప్రతికృతి = ప్రతిక్రియ. కలదుగాని = ఉన్నదిగాని. దానిన్ = ఆబ్రాహ్మణుల సొత్తు అనెడువిషమును. మాన్పంగన్ = పోఁగొట్టుటకు. భువిన్ = భూలోకమునందు. ఔషధములు = మందులు. (లేవు) కానన్ = కనుక. పతికిన్ = రాజైనవానికి. బ్రహ్మస్వములు = బ్రాహ్మణద్రవ్యములను. కొంట = తీసికొనుట. కాదు = తగదు. శ్లో॥ నవిషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విషముత్తమం। విషమేకాకినంహంతి బ్రహ్మస్వంపుత్రపౌత్రకం॥

తా॥ రాజులనెడు అడవిని కాల్చుటకు బ్రాహ్మణులసొత్తు అగ్నియగును, రాజులయొక్క ఐశ్వర్యమనెడు సముద్రమును ఇంకిపోవునట్లు చేయుటకు బ్రాహ్మణుల పంటభూములు బడబాగ్నియగును, రాజుల కలిమియనెడు కొండలను అణఁగఁగొట్టుటకు బ్రాహ్మణుల ధనము వజ్రాయుధపు వాదరవంటిది అగును, రాజుల కీర్తియనెడు వెన్నెలను మాపివేయుటకు బ్రాహ్మణులసొత్తు అనునది సూర్యోదయము అగును కనుక బ్రాహ్మణులసొత్తుకంటె విషము మంచిది, విషమునకైన విఱుపుకలదుగాని బ్రాహ్మణులసొత్తునకు విఱుపులేదు కాఁబట్టి రాజైనవాఁడు బ్రాహ్మణులసొత్తును అపహరింపరాదు అని తాత్పర్యము.

౫౨౫.—క॥ ఎఱుఁగమి నైనను భూసుర । వరులధనం బపహరింప * వలవదు పతికిన్
మఱపున ననలము ముట్టిన । దరికొని వెసఁ గాల్పకున్నె * తనువెఱియంగన్.

టీ॥ పతికిన్ = రాజునకు. ఎఱుఁగమినైనను = అజ్ఞానముచేతనైనను. (లేక) తెలియకయైనను. భూసురవరులధనంబు = బ్రాహ్మణశ్రేష్ఠులసొత్తును. అపహరింపవలవదు = నాఁచుకొనుటకూడదు. మఱపునన్ = జ్ఞప్తి లేకపోవుటచేత. అనలమున్ = అగ్నిని. ముట్టినన్ = తాఁకినను. దరికొని = పైనివ్యాపించి. వెసన్ = శీఘ్రముగా. తనువు = దేహము. ఎరియంగన్ = మండఁగా. కాల్పకున్నె - కాల్పక ఉండునా.

తా॥ రాజు పరాకుచేతనైన బ్రాహ్మణులసొత్తులను ముట్టరాదు ముట్టినపక్షమున ఏమఱితాఁకినను దేహము తపించునట్లుగా అగ్ని కాల్చునట్లు బ్రాహ్మణులసొత్తు కాల్చునని తాత్పర్యము.

వ॥ మఱియును దనధనంబు పరులచేతఁగోల్పడిన విప్రుండు దుఃఖంబున రోదనంబుసేయ నురిలిన యశ్రుకణంబుల వలన రేణువు లెన్నిదడియు నన్నివేలేండ్లు దదుపేక్షాపరుండైనపతి దారుణ వేదనలుగల కుంభీపాకనరకంబు నొందు మఱియును గ్రిందటఁ బదితరంబులవారును, ముందటఁ బదితరంబులవారును, మహానరక వేదనలం బొందుదురు స్వదత్తంబైనఁ బరదత్తంబైన నర్థంబు లోభంబునం జేసి దుశ్శీలుండై భుజించు నప్పాపాత్ముండఱువదివేల సంవత్సరంబులు మలకూపంబునం గ్రిమిరూపంబున వర్తించు నట్లగుటనెఱింగి విప్రుం డెంతతప్పుచేసిన నెన్నిగొట్టిన నెన్నిదిట్టిసనతని కెదురుపలుకక వినయంబునవందనంబాచరించుపుణ్యాత్ములు నాదుపాలింటివారదియునుం గాక నేనుబ్రతిదివసంబును భూసురులనతిషిణ్ణంబునఁబూజింతునిట్లుసేయక విపరీతవర్తనులైన తామసులనేవెదకి దండింతునదిగావునమీరలు బ్రాహ్మణజనంబులవలనం బరమభక్తిగలిగి మెలంగుండనియానతిచ్చి యాదవప్రకరంబులు సేవింప నఖిలలోకశరణ్యుండైన యప్పుండరీకాక్షుండు నిజనివాసంబునకుం జనియెనని చెప్పిశుకుం డిట్లనియె.

**టీ॥** మఱియును=ఇదిగాక. (తనధనంబు) పరులచేతన్ = ఇతరులచేత. కోల్పడిన=పోఁగొట్టుకొన్న. విప్రుండు=బ్రాహ్మణుఁడు. దుఃఖంబునన్ = దుఃఖముతో. రోదనంబుసేయన్ = ఏడువఁగా. ఉఱిలిన=రాలిన. అశ్రుకణంబులవలనన్=కన్నీళ్లవల్ల. రేణువులెన్నితడియన్=ఎన్ని రేణువులుతడియునో. అన్నివేలేండ్లు = అన్నివేల సంవత్సరములు. తదుపేక్షాపరుండు=ఆబ్రాహ్మణులవిషయమునందు ఉపేక్షచేయుటయందు మక్కువగలవాఁడు. అయినపతి=అయినట్టి రాజు. దారుణవేదనలు=భయంకరబాధలు. కల = కలిగిన. కుంభీపాకనరకంబున్ = కుంభీపాకము అను నరకమును. ఒందున్ = పొందును. మఱియును = ఇంతేగాక. క్రిందటన్ = తనకుముందు. (పదితరంబులవారును) ముందటన్ = తనకుపిమ్మట. (పదితరంబులవారును) మహానరకవేదనలన్=గొప్పనరకబాధలను.(పొందుదురు) స్వదత్తంబైనన్=తనచేతఇయ్యఁబడినదైనను. పరదత్తంబయినన్=ఇతరులచేతఇయ్యఁబడినదయినను.అర్థంబులోభంబునంజేసి=ధనమునందలిలోభముచేత.దుశ్శీలుండై=చెడ్డస్వభావముగలవాఁడై.భుజించునప్పాపాత్ముండు = అనుభవించునట్టి ఆపాపపుమనసుగలవాఁడు. (అఱువదివేలసంవత్సరంబులు) మలకూపంబునన్=మలముగలనూతియందు. క్రిమిరూపంబునన్=నులిపురుగురూపముతో. వర్తించును=ఉండును. అట్లగుటన్=కాఁబట్టి. ఎఱింగి = ఈవిషయమును తెలిసికొని. విప్రుండు=బ్రాహ్మణుఁడు. (ఎంతతప్పుచేసినను) ఎన్నికొట్టినను=ఎన్నిదెబ్బలు కొట్టినను. ఎన్నితిట్టినను = ఎన్నితిట్లు తిట్టినను. అతనికిన్ = బ్రాహ్మణునికి. ఎదురుపలుకక = విరుద్ధముగా మాటలాడక. వినయంబునన్=అడఁకువతో. వందనంబాచరించుపుణ్యాత్ములు=నమస్కారముచేయునట్టిధర్మాత్ములు. నాదుపాలింటివారు=నాసంబంధులు అగువారు. (అదియునుంగాక నేను) ప్రతిదివసంబును=దినదినమును. భూసురులన్ = బ్రాహ్మణులను. అతివినయంబునన్ = మిక్కిలివినయముతో. పూజింతున్ = పూజచేయుదును. (ఇట్లుచేయక)విపరీతవర్తనులైన=అక్రమమయిననడవడిగలవారైన. తామసులన్=మూర్ఖులను. (నేనువెదకి) దండింతున్ = శిక్షింతును. అదిగావునన్ = కాఁబట్టి. (మీరలు) బ్రాహ్మణజనంబులవలనన్=బ్రాహ్మణులగువారియెడల. పరమభక్తి = మేలైనభక్తి. (కలిగి) మెలంగుండు=వర్తింపుఁడు. (అని) ఆనతిచ్చి=సెలవిచ్చి. యాదవప్రకరంబులు=యాదవులగుంపులు. సేవింపన్=కొలువఁగా. అఖిలలోకశరణ్యుండు = ఎల్లలోకములకు రక్షకుఁడు. వనయపుండరీకాక్షుండు = అయినట్టి ఆకృష్ణుఁడు. నిజనివాసంబునకున్ = తనయునికిపట్టునకు. చనియెన్=పోయెను. (అనిచెప్పిశుకుండిట్లనియెను)

**తా॥** ఇదిగాక పరులచేత తన ధనము అపహరింపఁబడఁగా ఆదుఃఖమువలన ఏడ్చునట్టి బ్రాహ్మణుని కన్నీళ్లచేత భూమిలోని రేణువులు ఎన్నితడియునో అన్నివేలసంవత్సరములు ఆధనమునపహరించినవారిని విచారించి దండింపక ఉపేక్షచేసిన రాజు కుంభీపాకము అను నరకమునందుఁబడి బహువిధములైనబాధల ననుభవించును, అంతమాత్రమేగాక వానికిముందు పదితరములవారును వెనుక పదితరములవారును అఫలమును అనుభవింతురు, తానిచ్చిన దానినైనను ఇతరులిచ్చిన దానినైనను బ్రాహ్మణునిసొత్తును ధనమువలనిలోభముచేత దుస్స్వభావముగలవాఁడై అనుభవించునో అటువంటి పాపాత్ముఁడు అఱువదివేలయేండ్లు మలముగల నూతియందు నులిపురుగై పడియుండును కనుక ఈసంగతి తెలిసి బ్రాహ్మణుఁడు ఎంత తప్పుచేసినను కొట్టితిట్టిబాధించినను ఓర్చుకొని వినయముతో అతనికి మ్రొక్కునట్టి పుణ్యపురుషులు నాసంబంధులు అగుదురు అంతేకాదు నేనుగూడ ఎల్లప్పుడు బ్రాహ్మణులను మిక్కిలి వినయముతో పూజచేయుచుండుదును ఇట్లు చేయక విరుద్ధపు నడవడిగలవారైనమూర్ఖులను నేనువెదకి శిక్షించుచుందునుకనుక మీరు బ్రాహ్మణులయందు మిక్కిలి భక్తిగలిగి మెలఁగవలసినది అనిచెప్పి శ్రీకృష్ణుఁడు యాదవులందఱు తన్ను కొలువఁగా తనయింటికిపోయెను అనిచెప్పి శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో ఈమీఁదచెప్పఁబోవు రీతిగాఁ జెప్పెనని తాత్పర్యము.

**శ్రు॥** బ్రాహ్మణోవైసర్వాదేవతాః, సర్వాభిరేవైనం దేవతాభిముద్ధరతి యావతీర్వైదేవతా, స్తాస్సర్వావేదవిద్బ్రాహ్మణేవసంతి, తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివేదివేనమస్కుర్యా న్నాశ్లీలంకీర్తయేత్. దేతాఏవదేవతాః ప్రీణాతి॥ అని శ్లో॥ విప్రౌఘదర్శనాత్సద్యః క్షీయంతేపాపరాశయః। వందనాన్మంగళావాప్తి రర్చనాదచ్యుతంపదం అని.

**౫౨౭.—క॥** ఈకథఁ జదివినవారలు । గైకొని వినువారు విగత ✻ కలుషాత్మకులై
లౌకిక సౌఖ్యము నొందుదు । రాకైవల్యంబుఁ గరత ✻ లామలకముగన్.

**టీ॥** (ఈకథను) చదివినవారలు = చదివినవారును. కైకొని = ఆదరించి. వినువారును=ఒకరు చదివిచెప్పఁగా విన్నవారును. విగతకలుషాత్మకులై=పోయినపాపములుగలవారై. లౌకికసౌఖ్యమున్=ఈలోకమునందుపొందఁగలసౌఖ్యములను. ఒందుదురు=పొందుదురు. ఆకైవల్యంబున్ = ప్రసిద్ధమైన ముక్తిస్థానమును. కరతలామలకముగన్=అరచేతిలోనిఉసిరికకాయవలెఅతిసులభముగాలభించును.

**తా॥** నృగుమహారాజునకు కృష్ణుఁడు శాపవిముక్తిచేసిన యీకథను ఎవరు శ్రద్ధతో వినుదురో ఎవరు శ్రద్ధతో చదువుదురో అట్టివారికి ఈలోకమునందలి సౌఖ్యములును సుఖముగా లభించును పిమ్మటపరమపదమును అతిసులభముగాలభించును అనితాత్పర్యము.

### విశేషార్థము.

**టీ॥** నృగుఁడు=బ్రహ్మవేత్తయైన కృష్ణసందర్శనముచేత మరల మనుష్యజన్మమునుధరించినవాఁడు—పూర్వము దుర్లభమైన మనుష్యజన్మమెత్తియును బ్రహ్మజ్ఞానము లేక నివృత్తికర్మముచేసి అధోగతిపాలై తర్వాత బహుకాలమునకు బ్రహ్మవేత్తయైన కృష్ణసందర్శనముచేత పూర్వజన్మమునుధరించి పుణ్యగతికిఁబోయెనుగనుక సకలజనులును సర్వసత్కర్మములనుచేసి ఆకర్మఫలమును బ్రహ్మార్పణముచేసినపక్షమున కర్మములుచేసియుచేయనివాఁరైయైమోక్షసామ్రాజ్యమునుచెందుదురు, శ్లో॥ నివృత్తింకర్మసేవేత ప్రవృత్తింమత్పరస్త్యజేత్ । జిజ్ఞాసాయాంసంప్రవృత్తో నాద్రియేత్కర్మచోదనాం॥ అని భగవద్వాక్యము.



(*) బలరాముఁడు సుహృద్బంధుజనదర్శనార్థమై వ్రేపల్లెకుఁ బోవుట. (*)

౫౭౮.—సీ॥ నరనాథ వినుమొక * నాఁడు తాలాంకుండు - చుట్టాల బంధులఁ * జూచువేడ్క
సుందర కాంచన * స్యందనారూఢుఁడై - భాసిల్లుచున్న వ్రే * పల్లె కరిగి
చిరకాలసంగత * స్నేహులై గోప గో - పాంగనా నికర మా * లింగనములు
సముచిత సత్కృతుల్ * సలుపఁగైకొని మనో - త్సుకలీల నంద య * శోదలకును

తే॥ వందనం బాచరించిన * వారుమోద । మంది బిగియారఁ గౌఁగిళ్ల * నొందఁజేర్చి
సమత దీవించి యంక పీ * ఠములఁజేర్చి । శిరము మూర్కొని చుబుకంబుఁ * గరముపుణికి.

టీ॥ నరనాథ=ఓపరీక్షిన్మహారాజా. (వినుము)ఒకనాఁడు=ఒకానొకదినము. తాలాంకుండు=బలరాముఁడు. చుట్టాలన్ = మిత్రులను. బంధులన్=బంధుత్వముగలవారిని. చూచువేడ్కన్=చూడవలెనను కుతూహలముతో. సుందర...రూఢుఁడై—సుందర=అందమయిన. కాంచన=బంగారుమయమయిన. స్యందన=రథమునందు. ఆరూఢుఁడై = ఎక్కినవాఁడై. భాసిల్లుచున్న=ప్రకాశించుచున్న. వ్రేపల్లెకున్ = నందునిమందకు. అరిగి = పోయి. చిరకాలసంగత స్నేహులు—చిరకాల = బహుకాలమునకు. సంగత = కూడిన. స్నేహులు = చెలిమిగలవారు. (ఐ) గోపగోపాంగనానికరము — గోప=గొల్లవాండ్రయొక్కయు. గోపాంగనా=గోపికలయొక్కయు నికరము=సమూహము. ఆలింగనములు=కౌఁగిలింతలును. సముచిత సత్కృతులు=తగినమర్యాదలును. సలుపన్=చేయఁగా. కైకొని= అంగీకరించి. మనోత్సుకలీలన్=మనసునందలి తమకమురీతిని. (నంద యశోదలకును) వందనంబాచరించినన్=నమస్కారముచేయఁగా. వారు=ఆనందుఁడును యశోదయు. మోదమంది=సంతోషించి. బిగియారన్=గట్టిగా. కౌఁగిళ్లన్=సందిళ్లయందు. ఒందన్=పొందికగా. చేర్చి=పొందికగాను బిగువుగాను తొమ్ములనానించి కౌఁగిలించుకొనియనుట. సమతన్=యుక్తరీతిచేత. దీవించి=ఆశీర్వదించి. అంకపీఠములఁజేర్చి=ఒడులనుపీఠములయందుఁజేర్చుకొని. శిరము= తలను. మూర్కొని=మూఁచూచి. చుబుకంబున్=గడ్డమును. కరము పుణికి=మిక్కిలి పట్టిపట్టిచూచి.

తా॥ ఓరాజా! ఒకనాడు బలరాములు తమకు కావలసిన చుట్టములైన నందుఁడు మొదలగువారిని చూడవలెనని వ్రేపల్లెకు పోయి అందుఁగల గోపకులును గోపికలు బహుదినములకు బలరామునితోడి కూడిక కలిగెనని తమతమచెలుములకుఁదగినట్టుఆలింగనములుచేసికొని మర్యాదలుచేయఁగా ఆమర్యాదలను అంగీకరించి నందునికిని యశోదకును నమస్కారము చేయఁగా వారుసంతోషించి కౌఁగిలించుకొని ఒడిలోకూర్చుండఁబెట్టుకొని యుక్తమయిన దీవనలిచ్చి తలనుమూర్కొని గడ్డమును పట్టిపట్టి చూచుచుననితా

వ॥ మఱియు నానందబాష్ప ధారాసిక్త కపోల యుగళంబులతోడం గుశలప్రశ్నంబుల నిట్లనిరన్నా నీవును నీచిన్నితమ్ముండగు వెన్నుండును లెస్సయున్నవారె మమ్మెప్పుడు నరసి రక్షింపవలయు మాకు నేడు నీయు మీరకాక యొరులు గలరే యని సముచిత సంభాషణంబులం బ్రొద్దు పుచ్చుచుండి రంత.

టీ॥ (మఱియును) ఆనంద...తోడన్—ఆనంద = సంతోషము చేతఁగలిగిన. బాష్ప=కన్నీళ్లయొక్క. ధారా=దారలచేత. సిక్త= తడిసిన. కపోల=చెక్కిళ్లయొక్క. యుగళంబులతోడన్ = జంటలతో. కుశలప్రశ్నంబులన్ = క్షేమములు అడుగుటచేత. ఇట్లనిరి= ఇట్లుపలికిరి. అన్నా=నాయనా. (నీవును) నీచిన్నితమ్ముండగువెన్నుండును=నీప్రియమయినతమ్ముఁడగుకృష్ణుఁడును. లెస్సయున్నవారె= బాగుగనున్నారా. (మమ్మును) ఎప్పుడును=ఎల్లప్పుడు. అరసి=విచారించి. రక్షింపవలయున్ = కాపాడవలయును. (మాకు) ఏడు

గడయుఙ్ = తల్లి తండ్రి చుట్టము చెలికాఁడు జ్ఞానము ధనము దాత అనెడి యేడువిధములయిన రక్షకులును. శ్లో॥ త్వమేవమాతాచ పితాత్వమేవ త్వమేవబంధుశ్చ సఖాత్వమేవ। త్వమేవవిద్యాద్రవిణం త్వమేవ త్వమేవసర్వం మమదేవదేవ॥ అని. మీరకాక = మీరేకాక. ఒరులుగలరే = ఇతరు లెవరయినను ఉన్నారా. (అని) సముచిత సంభాషణంబులఙ్ = తగినమాటలచేత. (ప్రొద్దుపుచ్చుచుండిరి) అంతఙ్ = అంతట.

తా॥ సంతోషమువలన కన్నులనుండి వచ్చు నీళ్లచేత తడిసిన చెక్కిళ్లు గలవారగుచు బలరాముని క్షేమము విచారించుమాటలుగ నిట్లుపలికిరి, అయ్యా నీవును నీతమ్ముఁడయిన శ్రీకృష్ణమూర్తియు క్షేమముగ నున్నారుగదా, మమ్ము ఎల్లప్పుడు విచారించి కాపాడ వలసినవారు మీరేకదా, మాకు తండ్రి దాత మొదలుగాఁగలయేడు విధములయినదిక్కును మీరేకాక యితరు లెవరున్నారు అని యప్ప టికితగినమాటలచేత ప్రొద్దులు పుచ్చుచుండఁగానని తాత్పర్యము.

౪౩౦.—క॥ గోపాలవరులు ప్రమదం । బాపోవనిమదిని వర్తి ❋ తాఖిల గేహ
వ్యాపారులగుచు హలధరు । శ్రీపాదంబులకు నతులు ❋ సేసిరి వరుసఙ్.

టీ॥ గోపాలవరులు = గోపకులలో ముఖ్యులగువారు. ప్రమదంబు = సంతోషము. ఆపోవనిమదిఙ్ = తృప్తిచాలనిమనసులతో. నివర్తితాఖిలగేహవ్యాపారులగుచుఙ్ = విడువఁబడిన యెల్లయింటిపనులునుగలవారగుచును—తమయిండ్లలో తాముచేసికోవలసినపనులన్ని వదలియనుట. హలధరుశ్రీపాదంబులకుఙ్ = సంపత్కరములయిన బలరాముని అడుగులకు. వరుసఙ్ = క్రమముగా. నతులుసేసిరి = నమస్కారములుచేసిరి.

తా॥ అప్పుడు వ్రేపల్లెలోని గొల్లలలో ముఖ్యులగువారందఱు మేరమీరిన సంతోషములతో తమతమ యింటిపనుల నన్నిటినివిడిచి వచ్చి శ్రీబలరాముని అడుగులకు మ్రొక్కిరి అని తాత్పర్యము.

౪౩౧.—క॥ సీరియు వారికిఁ గరుణో । దారుండై నడపె సముచి ❋ తక్రియ లంతం
గోరి తనయీడు గోపకు । మారులఁ జేచఱచి బలుఁడు ❋ మందస్మితుఁడై.

టీ॥ సీరియుఙ్ = బలరాముఁడును. వారికిఙ్ = ఆగొల్లలకు. కరుణోదారుండై = దయచేత కళంకములేనివాఁడై. సముచితక్రియలు = తగినమర్యాదలను. నడపెఙ్ = చేసెను. అంతఙ్ = పిమ్మట. బలుఁడు = బలరాముఁడు. కోరి = అపేక్షించి. (తనయీడుగోపకుమారులను) చేచఱచి = చేతులుతట్టి. మందస్మితుఁడై = చిఱునవ్వుగలవాఁడై.

తా॥ అంతట బలరాముఁడును ఆనమస్కరించినవారికి తగిన సన్మానములుచేసి పంపి అందు తనయీడుగల గొల్లచిన్నవాండ్రను చేతులతో తట్టి చిఱునవ్వునవ్వుచును అని తాత్పర్యము.

౪౩౨.—క॥ నిజసుందర దేహద్యుతి । రజతాచలరుచులఁ దెగడ ❋ రాముఁడు వారల్
భజియింపఁ నేగి యొకచో । విజనస్థలమున వసించి ❋ విలసిల్లునెడఙ్.

టీ॥ రాముఁడు = బలరాముఁడు. నిజసుందరదేహద్యుతి—నిజ = తనదైన. సుందర = అందమయిన. దేహద్యుతి = శరీరకాంతి. రజతాచలరుచులఙ్ = వెండికొండకాంతులను. తెగడఙ్ = తిరస్కరింపఁగా. వారలు = తనయీడుగలవారైన ఆగొల్లచిన్నవాండ్రు. భజియింపఙ్ = సేవింపఁగా. ఏగి = పోయి. విజనస్థలమునఙ్ = ఇతరజనులెవరులేనితావున. ఒకచోఙ్ = ఒకస్థలమునందు. వసించి = కూర్చుండి. విలసిల్లునెడఙ్ = మిక్కిలి సంతోషముతో నుండఁగా.

తా॥ బలరామమూర్తిఅట్లునమస్కారములుచేసినగొల్లలకెల్లను తగిన సన్మానములు చేసి వారిలో తన యీడువారైన గొల్లచిన్నవాండ్రనువెంటఁదీసికొని తనదేహకాంతులు వెండికొండకాంతులను మీరి వెలుఁగుచుండఁగా ఎవ్వరులేని ఒక యేకాంతప్రదేశమునకుఁ బోయి కూర్చుండి వినోదముగా ప్రొద్దుపుచ్చుచుండఁగా నని తా.

కవిరాజవిరాజితము. చరణములం గనకస్ఫుట నూపుర ❋ జాలము గల్లనుచుం జెలఁగఙ్
గరములఁ గంకణముల్మొరయన్నలి ❋ గౌనసియాడఁ గుచాగ్రములఙ్
సరులు నటింపఁ గురుల్గుని యన్విల ❋ సన్మణి కుండల కాంతులు వి
స్ఫురిత కపోలములఙ్ బెరయఙ్ వ్రజ ❋ సుందరు లందఱు మందగతిఙ్.

టీ॥ చరణములఙ్ = పాదములయందు. కనకస్ఫుటనూపురజాలము = బంగారువైన ప్రకాశించునట్టి యందెలసమూహము. గల్లనుచుఙ్ = గల్లనుశబ్దముచేత. చెలఁగఙ్ = మ్రోఁగఁగా. కరములఙ్ = చేతులయందు. కంకణములు = కడియములు. మొరయఙ్ = మ్రోఁగఁగా. నలిగౌను = సూక్ష్మములైననడుములు. అసియాడఙ్ = చలింపఁగా. కుచాగ్రములఙ్ = స్తనములమీఁద. సరులు = మెడలోని హారములు. నటింపఙ్ = అల్లలాడుచుండఁగా. కురులు = తలవెండ్రుకలు. గునియఙ్ = కదలాడుచుండఁగా. విలసన్మణికుండలకాంతులు = ప్రకాశించుచున్న రత్నములుపొదిఁగినచెవులలోని కమ్మలకాంతులు. విస్ఫురితకపోలములఙ్ = మెఱుఁగులు దేఱుచున్న చెక్కిళ్లయందు. బెరయఙ్ = వ్యాపింపఁగా. వ్రజసుందరులు = గోపికాస్త్రీలు. (అందఱును) మందగతిఙ్ = మెల్లనినడతో.

తా॥ గోపికాస్త్రీలు పాదములయందలి అందెలును చేతులలోని కడియములును గలగలమ్రోఁగుచుండఁగా, నడుములు అసియాడుచుండఁగా, తొమ్ములందు హారములు చలింపఁగా, తలవెండ్రుకలు తూలాడుచుండఁగా, చెవులలోని రత్నములకమ్మలకాంతులు మెఱుఁగులు దేఱుచున్న చెక్కిళ్లయందు వ్యాపించుచుండఁగా, తిన్నగానడచుచునని తాత్పర్యము.




(*) బలరామునితో గోపికలు సంభాషించుట. (*)

కవిరాజవిరాజితము॥ చని బలభద్రుని శౌర్యసముద్రుని * సంచిత పుణ్యు నగణ్యునిఁ జం
దన ఘనసార పటీర తుషార సు * ధారుచికాయు విధేయు సుధా
శన రిపు ఖండను సన్మణి మండను * సారవివేకు నశోకు మహా
త్ముని గని గోపిక లోపిక లేక య * దుప్రభు నిట్లని రుత్కలికన్.

టీ॥ చని = ఆయేకాంతప్రదేశమునకు పోయి. శౌర్యసముద్రునిన్=అధికశూరత్వముగలవాఁడును. సంచితపుణ్యున్=కూర్పఁబడినపుణ్యముగలవాఁడును. అగణ్యునిన్ = (నతత్రచక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతినోమనః) అను శ్రుతివలన మనస్సుచేత ఇట్టివాఁడని యూహించుటకును, వాక్కుచేతనిట్టివాఁడని పొగడుటకునుసాధ్యము కానివాఁడును. చందన...కాయున్ — చందన = మంచిగంధము యొక్కయు. ఘనసార=కర్పూరముయొక్కయు. పటీర=మంచి గంధపుపూఁతయొక్కయు. తుషార=మంచుయొక్కయు. సుధా= అమృతముయొక్కయు. రుచి=కాంతివంటి కాంతిగల. కాయున్= శరీరముగలవాఁడును — శుద్ధ సత్వ మయ దేహము గలవాఁడనుట. విధేయున్ = అణఁగినవాఁడును. సుధాశనరిపుఖండనున్ = దేవ శత్రువులైన రాక్షసులను చంపువాఁడును — లేక, బ్రహ్మానంద మనెడి అమృతమును పానము చేయునట్టి బ్రహ్మవేత్తలయందు పగగల కర్మఠులను అధోగతిపాలు చేయువాఁడును. సన్మణి మండనున్ = మంచిరత్నాభరణములు గలవాఁడును—లేక, సత్= సత్పురుషులనెడు. మణిమండనున్ = రత్నాలనగలుగలవాఁడు — సత్పురుషులచేత సేవింపఁబడువాఁడనుట. సారవివేకున్=సారమైన తెలివిగలవాఁడును. లేక, అపరోక్షజ్ఞానస్వరూపుఁడును. అశోకున్= నిత్యానందుఁడగుటచేత — శోకము లేనివాఁడును. మహాత్మునిన్ = గొప్పశరీరముగలవాఁడును—విరాట్స్వరూపుడనుట. యదుప్రభున్= యదువులకురాజయిన—లేక, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుఁడునైన. బలభద్రునిన్ = బలరాముని. కని=చూచి. గోపికలు=గోపస్త్రీలు— లేక, బ్రహ్మవిచారపరులనెడు గోపికలు. ఓపికలేక=తాలిమిలేక. ఉత్కలికన్ = తమకముచేత. ఇట్లనిరి=ఇట్లుపలికిరి.

తా॥ శూరత్వముచేతపరిపూర్ణుఁడును, పుణ్యసంపాదకుఁడును, ఎన్నరానివాఁడును, మంచిగంధము కర్పూరము మంచి గంధపు పూఁత మంచు అమృతమువీనివలె తెల్లనైనదేహకాంతిగలవాఁడును, భక్తులకు అణఁగినవాఁడును, దేవశత్రువులయిన రాక్షసులనుచంపువాఁడును, మంచిరత్నములుచెక్కినఆభరణములుగలవాఁడును, సారమయిన తెలివిగలవాఁడును, దుఃఖములేనివాఁడును, గొప్పమనసు గలవాఁడునునైన బలభద్రుఁడున్నచోటికిఁబోయి ఆయనను జూచి తాలిమిలేనివారై గోపికాస్త్రీలు తమకముతో కృష్ణమూర్తినుద్దేశించి యిట్లుపలికిరని తాత్పర్యము.

౫౩౫.—చ॥ హలధర నీసహోదరుఁ డు * దంచిత కంజవిలోచనుండు స
ల్లలిత పురాంగనాజన వి * లాస విహార సమగ్ర సౌఖ్యముల్
గలిగి సుఖించునే మము నొ * కానొక వేళనయేని బుద్ధిలోఁ
దలఁచునొ నూతనప్రియలఁ * దార్కొని యేమియుఁ బల్కకుండునో.

టీ॥ హలధర=ఓబలరాముఁడా. నీసహోదరుఁడు=నీతోడఁ బుట్టినవాఁడును. ఉదంచితకంజవిలోచనుండు = మిక్కిలి యొప్పిద మయిన కమలములవంటి కన్నులుగలవాఁడునైనకృష్ణుఁడు. సల్లలిత ...సౌఖ్యములు—సత్=శ్రేష్ఠమైన. లలిత=మనోజ్ఞమైన. పురాంగనాజన = పట్టణపుస్త్రీజనులయొక్క. విలాస= [illegible]దకరములైన. విహార=సంచారములవలని. సమగ్ర=కొఅఁతలేని. సౌఖ్యములు= సుఖములు. కలిగి=కలవాఁడై. సుఖించునే=సుఖముగనున్నాఁడా. ఒకానొకవేళనయేని=ఏదైన ఒకవేళలోనైన. మమున్=మమ్మును. బుద్ధిలోన్ = తనతలఁపునందు. (తలఁచునొ) నూతనప్రియలన్ = క్రొత్తవారైనప్రియురాండ్రను. తార్కొని=కలసి. ఏమియుఁబల్క

కుండునో = ఏవిధమయిన వృత్తాంతమును చెప్పకయే యుండునో.

తా॥ ఓబలరామా! నీతమ్ముఁడయిన శ్రీకృష్ణమూర్తి మిక్కిలి అందగత్తెలైన మథురాపట్టణములోని ఆఁడుపడుచులతోడి వినోదములలోఁదగిలి చక్కఁగా సుఖమును అనుభవించుచున్నాఁడా ఆసుఖములలో చొక్కుచు నుండుటచేత ఎప్పుడైనను ఒకవేళ మమ్ము తలఁచునో తలఁపఁడో ఆసంగతి నీకుఁ దెలిసియున్నయెడల మాకు తెలియఁజెప్పుమని తాత్పర్యము.

౫౩౬.—క॥ జననీజనకుల ననుజులఁ । దనుజుల బంధువుల మిత్ర * తతివిడి యెపుడున్
మనముల నొండు దలంపక । తననమ్మినవారి విడువఁ * దగునే హరికిన్.

టీ॥ హరికిన్=కృష్ణునికి. జననీజనకులన్=తల్లిదండ్రులను. అనుజులన్=తమ్ములను. తనుజులన్=కొడుకులను. బంధువులన్=చుట్టములను. మిత్రతతిన్ = చెలికాండ్రసమూహమును. విడి=విడిచి. ఎపుడున్=ఎల్లప్పుడును. మనములన్=మనసులలో. ఒండు=ఇతరమును. తలంపక=ఎంచక. తనునమ్మినవారిన్ = తన్నునమ్మియున్నవారిని—గోపికాస్త్రీలననుట. విడువఁదగునే=విడిచిపెట్టవచ్చునా.

తా॥ తల్లిదండ్రులు అన్నదమ్ములు బిడ్డలు చుట్టములు స్నేహితులు మొదలైనవారిని అందఱినివిడిచిపెట్టి తన్నే యెల్లప్పుడు మనసులలో ధ్యానించుచు ఇతరచింత లేనివారమైన మమ్మును విడిచిపెట్టుట మీశ్రీకృష్ణునికి న్యాయమాయని తాత్పర్యము.

౫౩౭.—సీ॥ సలలిత యామున * సైకత స్థలమున - నుండి మమ్మేమని * యూఱడించె
విమలబృందావన * వీధి మాచుబుకముల్ - పుడుకుచు నేమని * బుజ్జగించెఁ
బుష్పవాటికలలోఁ * బొల్చు మాకుచయుగ్మ - మంటుచు నేమని * యాదరించెఁ
గాసారముల పొంతఁ * గౌఁగిటమముఁజేర్చి - నయమొప్ప నేమని * నమ్మఁబలికె

తే॥ నన్నియును మఱచెఁ గాఁబోలు * వెన్నుఁడాత్మ । గోరి తాజాయలగువారిఁ * గేరివిడుచు
నట్టి కృష్ణుఁడు తము బట్టు * పెట్టు ననక । యేల నమ్మిరి పురసతుల్ * బేల లగుచు.

టీ॥ సలలిత ... స్థలమునన్ — సలలిత = మనోజ్ఞమయిన. యామున=యమునానదిలోని. సైకతస్థలమునన్ = ఇసుకదిబ్బలమీఁదను. (ఉండి మమ్ము) ఏమనియూఱడించెను=ఏమిచెప్పియూఱట కలుగఁజేసెను. విమల...వీధిన్—విమల = నిర్మలమయిన. బృందావనవీధిన్=బృందావనప్రదేశమునందు. మాచుబుకములు=మాగడ్డములను. పుడుకుచున్=నొక్కినొక్కిపట్టుచు. ఏమనిబుజ్జగించెన్=ఏమిచెప్పిలాలించెను. పుష్పవాటికలలోన్ = పువ్వుతోఁటలలో. పొల్చు = ఒప్పునట్టి. మాకుచయుగ్మము = మాస్తనములజంటను. అంటుచున్ = ముట్టిచూచుచు. ఏమనియాదరించెన్ = ఏమిచెప్పియోదార్చెను. కాసారములపొంతన్=సరస్సులవెంబడి. కౌఁగిటమముఁజేర్చి=మమ్ముకౌఁగిలించుకొని. నయమొప్పన్=తిన్నఁదనము ఒప్పుచుండఁగా. ఏమనినమ్మఁబలికెన్ = ఏమిచెప్పి నమ్మించెను. వెన్నుఁడు = కృష్ణుఁడు. (అన్నియును) మఱచెఁగాఁబోలున్ = ఇప్పుడు మఱచిపోయినాడో యేమోకదా. ఆత్మన్=మనసునందు. కోరి=అపేక్షించి—వలచి. తాన్=తాను. జాయలగువారిన్=ప్రియురాండ్రగువారిని. కేరి = పరిహసించి. (విడుచునట్టికృష్ణుఁడు) తమున్=తమ్మును. బట్టుపెట్టుననక=అల్లరిచేయుననియెంచక. పురసతులు=పట్టణస్త్రీలు. బేలలగుచున్=పిచ్చివాండ్రయి. (ఏలనమ్మిరి)

తా॥ మనసునకు ఇంపుపుట్టించునట్టి యమునానదిలోని యిసుకదిబ్బలలో నుండునప్పుడు మమ్ము ఊఱడించినవిధమును, నిర్మలమైన బృందావనప్రదేశమునందు మమ్ము గడ్డములు పుణుకుచు లాలించినవిధమును, పువ్వులతోఁటలో మాస్తనములంటుచు ఆదరించినవిధమును, సరస్సులతీరములందు మమ్మును కౌఁగిలించుకొనుచు నమ్మకపుమాటలు చెప్పినవిధమును, ఇప్పుడు కృష్ణుఁడు మఱచిపోయినట్టున్నది అట్లు తన్నునమ్మిన ప్రియురాండ్రను పరిహాసముచేసి విడిచిపెట్టునట్టిస్వభావముగలకృష్ణమూర్తిని ఆపట్టణములోని యిల్లాండ్రు ఎట్లునమ్మినారు, వారు ఎంతపిచ్చివారో కదాయని తాత్పర్యము.

౫౩౮.—మ॥ అని యిబ్భంగి సరోజలోచనుని న * ర్మాలాపముల్ నవ్వులున్
ననుబంధుల్ పరిరంభణంబులు రతి * వ్యాసంగముల్ భావముల్
వినయంబుల్ సరసోక్తులుం దలఁచి యు * వ్విళ్లూరు చిత్తంబులన్
జనితానంగ శరాగ్నిచేత దురవ * స్థం బొంది శోకించినన్.

టీ॥ (అని)ఇబ్భంగిన్=ఈవిధముగా. సరోజలోచనుని=కృష్ణుని యొక్క. నర్మాలాపములు=ప్రియవాక్యములును. నవ్వులున్=నవ్వుకొనుటలును. అనుబంధులు=చేరియుండుటలును. పరిరంభణంబులు=కౌఁగిలింతలును. రతివ్యాసంగములు=కలయికల యలవాటులును. భావములు=తలఁపులును. వినయంబులును=సరసోక్తులును—సరసపుమాటలును. తలఁచి=తలఁచుకొని. ఉవ్విళ్లూరుచిత్తంబులన్=తమకపడునట్టిమనసులతో. జనితానంగశరాగ్నిచేతన్ = అప్పుడుపుట్టిన మన్మథునిబాణములవలని అగ్నిచేత — మన్మథతాపముచేత. దురవస్థన్=సంకటమును. (పొంది) శోకించినన్=దుఃఖింపఁగా.

తా॥ అని యీరీతిగా గోపికలు ముందు కృష్ణుఁడు తమయెడల నడపిన ప్రియముతోడి ముచ్చటలు నవ్వుకొనుటలు సంబంధములు

కౌఁగిలింతలు కలయికలవలన సుఖించుటలు తలఁపులు వినయములు సరసపుమాటలు అనువానినెల్లను తలఁచుకొని ఇఁక నట్టిసుఖమును మేము పొందఁబోయెదమా అను మనసులతో సంకటపడి దుఃఖింపఁగానని తాత్పర్యము.

వ॥ అంత బలభద్రుండు వారలమనంబుల సంతాపంబులువారింప నుపాయంబులగు సరసవచనంబులఁ గృష్ణునిసందేశంబులు చెప్పుచు విగతఖేదలంజేసి యచ్చటమాసద్వయంబునిలిచి వసంతవాసరంబులుగడపుచుఁగాళిందీతీరంబున.

టీ॥ అంతక్=అప్పుడు. బలభద్రుండు = బలరాముఁడు. వారల మనంబుల సంతాపంబులు=వారిమనసులలోని పరితాపములను. వారింపక్=అణఁపను. ఉపాయంబులగు=అనుకూలము లైన. సరసవచనంబులక్=రసవంతములైనమాటలచేత. కృష్ణుని సందేశంబులు=శ్రీకృష్ణమూర్తియొక్కమాటలు. (చెప్పుచు) విగతఖేదలక్=పోయినదుఃఖము గలవారినిగా.(చేసి)—దుఃఖములనుపోఁగొట్టిఅనుట. అచ్చటక్=ఆవ్రేపల్లెయందు. మాసద్వయంబు=రెండునెలలు. నిలిచి=ఉండి. వసంతవాసరంబులు=వసంతకాలపుదినములు. కడపుచుక్=జరపుచు. కాళిందీతీరంబునక్=యమునానదిగట్టున.

తా॥ అప్పుడు బలరాముఁడు వారి మనసులలోని విచారమునుపోఁగొట్టుటకు తగుపాటివయిన కృష్ణుఁడు చెప్పిపంపిన సమాచారములు కొన్ని చెప్పివారిదుఃఖమును పోఁగొట్టి ఆవ్రేపల్లెలోనే వసంతఋతువు రెండునెలలు జరపువాఁడైయుండి ఒక్కనాడు యమునానది గట్టునందు అని తాత్పర్యము.

౫౮౦.—సీ॥ మాకంద జంబీర * మందార ఖర్జూర - ఘనసార శోభిత * వనములందు
నేలాలతా లోల * మాలతీ మల్లికా - వల్లీమతల్లికా * వాటికలను
దరళతరంగ శీ * కర సాధుశీతల - సైకతవేదికా * స్థలములందు
మకరంద రసపాన * మదవ దిందిందిర - పుంజరంజిత మంజు * కుంజములను
తే॥ విమలరుచిగల్గు సానుదే * శములయందు । లలితశశికాంత ఘనశిలా * తలములందు
లీల నిచ్ఛావిహార వి * లోలుఁడగుచు । సుందరీజనములు గొల్వఁ * జూడ నొప్పె.

టీ॥ మాకంద...వనములందుక్—మాకంద=మామిడి చెట్లచేతను. జంబీర=నిమ్మచెట్లచేతను. మందార=మందారపుచెట్లచేతను. ఖర్జూర=కర్జూరపుచెట్లచేతను. ఘనసార=కర్పూరపుఅరఁటిచెట్లచేతను. శోభిత=ప్రకాశించునట్టి. వనములందుక్=తోఁపు లందును. ఏలా...వాటికలను—ఏలాలతా=ఏలకితీఁగలయు. లోల=చలించుచున్న. మాలతీ=జాజులయు. మల్లికా=మల్లెలయు. వల్లీమతల్లికా=శ్రేష్ఠములైనతీఁగలయు వాటికలక్=వరుసలయందును. తరళ...స్థలములందుక్—తరళ=చలించుచున్న. తరంగ=అలలవలని. శీకర=తుంపురులచేత. సాధు=ఒప్పిదమయిన. శీతల=చల్లనైన. సైకతవేదికా = ఇసుకతిన్నెలయొక్క. స్థలములందుక్ = ప్రదేశములందును. మకరంద ... కుంజములను — మకరందరస=పూఁదేనెను. పాన=త్రాగుటచేత. మదవత్=మదము గల. ఇందిందిర=తుమ్మెదలయొక్క. పుంజ = బారులచేత. రంజిత=ప్రకాశించెడి. మంజు=మనోజ్ఞములయిన. కుంజములను=పొదరిండ్లయందును. విమలరుచిగల్గు=నిర్మలమయినప్రకాశముకలుగు. సానుదేశములయందుక్=చఱుల చోట్ల యందును. లలిత ... తలములందుక్= లలిత=ఒప్పిదములైన. శశికాంత=చంద్ర కాంతములైన. ఘనశిలా=గొప్పరాళ్లయొక్క. తలములందుక్ = ప్రదేశములందును. లీలక్=వినోదముగా. ఇచ్ఛావిహారవిలోలుఁడు=ఇచ్చవచ్చిన వినోదసంచారమునందు ఆసక్తుఁడు. (అగుచును) సుందరీ జనములు = అందగత్తెలైన స్త్రీలు. కొల్వక్=సేవింపఁగా. చూడనొప్పెక్=చూడఁదగియుండెను.

తా॥ ఆవసంతఋతువునందు బలరాముఁడు మామిళ్లునిమ్మలుమొదలగు వ్రాఁకులు గలతోఁపులందును, జాజులుమల్లెలు మొదలగు తీఁగలు లోనగునవియల్లుకొన్న పూలపందిళ్లచాలునందును, చలించుచున్న అలలవలనితుంపురులచేత చల్లగానుండునట్టి సరస్సులవెంబడి యిసుకతిన్నెలయందును, పూఁదేనెలుత్రాగి జుమ్మని మొరయుచున్న మదపు తుమ్మెదల బారులచేత అందగించుచున్న పొదరిండ్లయందును, మిక్కిలి స్వచ్ఛముగా ప్రకాశించుచున్న కొండ చఱుల యందును, మనోజ్ఞములయిన చంద్రకాంతమణులప్రదేశములందును, వేడుకగా ఇచ్చవచ్చినట్లు మెలఁగుచు అనేకులుసొగసుకత్తెలుసేవించుచుండఁగాఒప్పియుండెనని తాత్పర్యము.

౫౮౧.—తే॥ అట్లు విహరింప వరుణుని * యాజ్ఞఁజేసి । వారుణీదేవి మద్యభా * వంబునొంది
నిఖిల తరుకోటరములందు * నిర్గమించి । మించువాసనచేత వా * సించెవనము.

టీ॥ (అట్లు) విహరింపక్=బలరాముఁడువిహారము చేయుచుండఁగా వరుణునియాజ్ఞఁజేసి=వరుణుని యొక్క యాజ్ఞచేత. వారుణీదేవి=వారుణియనెడురసాధిదేవత. మద్యభావంబునొంది=మద్యమునాకృతిని వహించి. నిఖిలతరుకోటరములందుక్ = ఎల్లవృక్షములయొక్క తొఱ్ఱల యందుండియు. నిర్గమించి = బయలువెడలి. మించువాసనచేతక్=అధికమైనపరిమళముచేత. (వనమును) వాసించెక్=పరిమళింపఁజేసెను.

తా॥ ఆవిధముగాబలరాముఁడుమెలఁగుచుండనపుడువరుణునియుత్తరువుచేత వారుణి అనునట్టి రసాధిదేవత మద్యముయొక్క ఆకృతిని వహించి యెల్లవ్రాఁకుల తొఱ్ఱలనుండియు బయలువెడలి ఆవనమునెల్ల పరిమళముగలదానినిగాఁజేసెనని తాత్పర్యము. వ॥ అట్టియెడ.

౫౮౨.—మ॥ కరమొప్పారు నవీనవాసనల నా * ఘ్రాణించి గోపాల సుం
దరులుం దానును డాయ నేగి యతి మో * దంబొప్ప సేవించి య్యా
తరలాక్షుల్ మణిహేమకంకణ ఝణ * త్కారాను కారంబులై
కరతాళంబులు మ్రోయఁ బాడుచును వే * డ్కన్నాడుచుక్ సోలుచుక్.

టీ॥ కరము=మిక్కిలి. ఒప్పారు=ఒప్పుచున్నట్టి. నవీనవాసనలన్=క్రొత్తవాసనలను. ఆఘ్రాణించి=మూఁచూచి. గోపాలసుందరులున్=గోపికాస్త్రీలును. (తానును) డాయనేగి=దగ్గఅపోయి. అతిమోదంబాప్పన్=మిక్కిలి యానందము ఒప్పుచుండఁగా. సేవించి=త్రాగి. ఆతరలాక్షులు=ఆగోపికాస్త్రీలు. మణి...కారంబులై — మణి=రత్న మయములైన. హేమకంకణ=బంగారు కడియముల యొక్క. ఝణత్కార=ఝణ ఝణ యనుశబ్దమును. అనుకారంబులై = సరిపోలునవియై. కరతాళంబులు=చప్పట్లు. మ్రోయన్=శబ్దింపఁగా. (పాడుచును) ఖేదక్కన్=వినోదముగా. ఆడుచున్=నృత్యము చేయుచును. సోలుచున్ = చొక్కుపడుచు — దీనికి సమాపక క్రియ మీఁదిపద్యములో నున్నది.

తా॥ మిక్కిలి యింపైన యాక్రొత్తవాసనను మూర్కొని బలరాముఁడు తానును గోపికా స్త్రీలును దగ్గఅపోయి వలసినట్లు ఆమద్యమును త్రాగి అతి సంతోషముతో గోపికాస్త్రీలు తమచేతులందలి రత్నమయములయిన గాజుల చప్పుడును బోలిన చప్పట్లుచప్పుడు అతిశయింపఁగా పాడుచును ఆడుచును చొక్కుపడుచునని తాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ బలరాముఁడు = బ్రహ్మవేత్త. గోపికలు = ఇంద్రియములు. వనము=అంతరహృదయము. మద్యము=సుర—అనఁగా, బ్రహ్మవిద్యావిచారణవలనఁబుట్టిన ఆనందరసము గనుక (బ్రహ్మైవేద బ్రహ్మవిద్భవతి) అను శ్రుతిచేత బ్రహ్మవేత్తయనెడు బలరాముఁడు ఇంద్రియములనెడు గోపికలతోఁగూడి అంతరహృదయమనెడువనమునందు బ్రహ్మానందరసమును త్రాగి చొక్కి విహరించుచుండెనని భావము.

౫౪౩.—సీ॥ తనమీఁది బిరుదాంకి ✻ తములైన గీతముల్ - వాడుచు రా బల ✻ భద్రుఁడంత
మహిత కాదంబరీ ✻ మధుపాన మదవిహ్వ - లాక్షుండు లలిత నీ ✻ లాలకుండు
నాలోల నవపుష్ప ✻ మాలికోరస్థలుం - డనుపమ మణికుండ ✻ లాంచితుండుఁ
బ్రాలేయ సంయుక్త ✻ పద్మంబు గతి నొప్పు - సలలితానన ఘర్మ ✻ జలకణుండు

తే॥ నగుచు వనమధ్యమున సలీ ✻ లానురాగ । శీలుఁడై జలకేళికిఁ ✻ జేరి యమున
నిందురమ్మని పిలువఁ గా ✻ ళిందియతని । మత్తుఁడని సరకుసేయక ✻ మసలుటయును.

టీ॥ తనమీఁదిబిరుదాంకితములు=తనమీఁదివైనఁ బిరుదులనుదెలుపునట్టివి. అయినగీతములు=అయినట్టి పాటలు. పాడుచురాన్=పాడుచును రాఁగా. (బలభద్రుఁడు) అంతన్ = అప్పుడు. మహిత ... క్షుండు — మహిత = గౌరవింపఁ బడఁదగిన. కాదంబరీ=కదంబరససంబంధమయిన. మధు=మద్యమును. పాన=త్రాగుటవలని. మద=మత్తుచేత. విహ్వల=తేలగిలుచున్న. అక్షుండు = కన్నులుగలవాఁడు. లలితనీలాలకుండు=మృదువులైననల్లనిముంగురులుగలవాఁడును. ఆలోల...స్థలుఁడును—ఆలోల=అంతట చలించుచున్న. నవ=క్రొత్తయైన. పుష్పమాలికా=పూలదండలుగల. ఉరస్థలుండును=ఱొమ్ము ప్రదేశముగలవాఁడును. అనుపమమణికుండలాంచితుఁడును — అనుపమ=ఈడులేని. మణికుండల=రత్నములు చెక్కిన చెవిపోఁగులచేత. అంచితుండును=ఒప్పినవాఁడును. ప్రాలేయసంయుక్తపద్మంబుగతిన్ - ప్రాలేయ=మంచుతోడ. సంయుక్త=కూడుకొన్న. పద్మంబుగతిన్=కమలమువలె. ఒప్పు=ఒప్పునట్టి. సలలితాననఘర్మజలకణుండును=మనోజ్ఞమైనముఖమునందుచెమటబొట్లుగలవాఁడును. అగుచున్=అవుచును. వనమధ్యమునన్=అడవినడుమ. సలీలానురాగశీలుఁడై. విలాసముతోఁగూడిన యనురాగస్వభావము గలవాఁడై. జలకేళికిన్ = జలక్రీడలాడుటకు. చేరి=సమీపించి. యమునన్=యమునానదిని. ఇందురమ్మనిపిలువన్=ఇచ్చటికిరమ్ము అనిపిలువఁగా. కాళింది=ఆయమున. అతనిన్=బలరాముని. మత్తుఁడు=ఒళ్లు తెలియనివాఁడు. (అని) సరకు సేయక=లక్ష్యపెట్టక. మసలుటయున్=ఆలస్యముచేయఁగా.

తా॥ బలరాముఁడు గోపికలందఱు తనమీఁది బిరుదులను దెలుపునట్టి పాటలుపాడుచుండఁగా, మేలయిన కాదంబరి అనఁబడునట్టిమద్యమును త్రాగిదానివలని మత్తుచేత కన్నులు తేలవేయుచు మొగముమీఁదను నెంత్రుకలు వీడియావరించుకొనుచుండఁగా, ఱొమ్మున పూలమాలికలు చిక్కులుపడుచుండఁగా, మొగమున తామరపువ్వునందలి మంచుబిందువులవలె చెమటబిందువులుకనఁబడుచుండఁగా, చెవిపోఁగులు వీడి వ్రేలాడఁగా, ఆయడవినడుమ వేడుకగా మెలఁగుచుండి జలక్రీడచేయవలెనను మక్కువచేత యమునా నదిని దగ్గఱ రమ్మని పిలిచెను, ఆయమునా నదయతఁడు ఒళ్లు తెలియనివాఁడుగా నున్నాఁడని లక్ష్యము చేయక దగ్గఱ రాదయ్యెనని తాత్పర్యము.

౫౪౪.—చ॥ ఘనకుపితాత్ముఁడై యమునఁ ✻ గన్గొని రాముఁడు వల్కె డాయ జీ
రినఁ జనుదేక తక్కితివు ✻ డే నిను నిందఱుఁజూడ మధ్భుజా
సునిశిత లాంగలాగ్రమున ✻ సొంపఱియింపుదు నూఱుత్రోవలై
చనవెసఁజించి వైతునని ✻ చండపరాక్రమ మొప్ప నుగ్రుఁడై

టీ॥ (రాముఁడు) ఘనకుపితాత్ముఁడై=మిక్కిలికోపమునొందినమనసుగలవాఁడై. యమునన్=యమునానదిని. కన్గొని=చూచి. పల్కెన్=ఇట్లుపలికెను. డాయఁజీరినన్=దగ్గఱపిలువఁగా. చనుదేక=రాక. తక్కితివి=నిలిచితివి. (ఇప్పుడు) ఏన్=నేను. నినున్=నిన్ను. ఇందఱున్=ఈయుండెడుగోపికలందఱును. చూడన్=చూచుచుండఁగా. మద్భుజాసునిశితలాంగలాగ్రమునన్=నాచేతనుండెడువాఁడియైననాఁగేటికొనచేత. సొంపఱియింపుదున్=బాగుచెఱుతును. నూఱుత్రోవలై=నూఱుపాయలేర్పడి. చనన్=ఒప్పునట్లుగా. వెసన్=శీఘ్రముగా. చించివైతున్=చీలఁదీయుదును. (అని) చండపరాక్రమము=తీక్ష్ణమయిన పరాక్రమము. ఒప్పన్=ఒప్పునట్లుగా. ఉగ్రుఁడై=భయంకరుఁడై.

తా॥ అప్పుడు బలరాముఁడు యమునా నదినిజూచి కోపించిన వాఁడై నేనుదగ్గఱపిలిచిన రాకపోతివిగదా ? ఇప్పుడు ఈగోపిక లంద ఱునుఁ జూచుచుండగా నీవాగు నెడునట్లు నావాఁడిగొయిన నాఁగేటి మొనతో నూఱు పాయ లేర్పడు నట్లుగా నిన్ను చీల దీసెదను చూడుమని చెప్పి భయంకరమయిన రూపమును వహించిన వాఁడై యని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ రాముఁడు=శ్లో॥ రమంతేయోగినోఽనంతే సత్యానందేచిదాత్మని। ఇతిరామపదేనాసౌ పరబ్రహ్మాభిధీయతే॥ అను శ్రుతినిబట్టి పరబ్రహ్మవేత్తయనెడుబలరాముఁడు. యమునన్ = అనాద్యవిద్యారూపమైన ఆంతరసంసారమును. (చూచి) డాయఁజీరినచనుదేకతక్కిటివి= నాకుప్రతికూలురాలవుగాక నన్ననుసరించియుండుమనఁగా నుండక పోతివి. ఇందఱు = ఈయున్నశ్రుతులనెడు గోపికలు. మద్భుజా=జ్ఞానకాండకర్మకాండలనెడు నాచేతులయందలి. సునిశిత = మిగులపదును గలదియైన—ఆరూఢమైన. లాంగల=లంగతిభువోంతగచ్ఛతీతిలాంగలం లగిగత్యా, అనిధాతువు. భూమిలోఁజొచ్చునది అని అర్థముకనుక అజ్ఞానభూమికలను బ్రద్దలుచేసి పోవునట్టి నాప్రజ్ఞానమనెడు నాఁగలి యొక్క. అగ్రమునన్ = చివరచేత, (అహంబ్రహ్మాస్మి) అనునిరంతరానుసంధానముచేత. నూఱుత్రోవలైచనవెసఁజించివైతున్=చిందఱవందఱలుగాచేసెదను—నశింపఁజేసెదననుటు.

(*) కాళిందీనది బలభద్రునికి బొఁగడుట. (*)

వ॥ అట్లు కట్టలుక రాముం డుద్దామంబగు బాహుబలంబున హలంబు చాఁచి యమ్మహావాహినిం దగిల్చి పెకల్చి రాఁదిగిచిన నన్నది భయభ్రాంతయై సుందరీరూపంబుఁగైకొని యతిరయంబునం జను దెంచి యయ్యదువంశ తిలకుండగు హలధరునిపాదారవిందంబులకు వందనంబాచగించి యిట్లనియె.



టీ॥ (అట్లు) కట్టలుకన్=మిక్కిలికోపముతో. (రాముండు) ఉద్దామంబగు=అడ్డములేనిదైన. బాహుబలంబునన్ = భుజబలముచేత. హలంబున్ = నాఁగేటిని. (చాఁచి) అమ్మహావాహినిన్ = అగొప్పనదియందు. తగిల్చి=తగిలించి. పెకల్చి = పెల్లగించి. రాఁదిగిచినన్ = తనయొద్దకువచ్చునట్లులాఁగఁగా. అన్నది= అనేఱు. భయభ్రాంతయై=భయముచేత తొందరగొన్నదై. సుందరీరూపంబున్=స్త్రీరూపమును. కైకొని=పొంది. అతిరయంబునన్ = మిక్కిలివడిగా. చనుదెంచి=వచ్చి. అయ్యదువంశతిలకుండగు=ఆయాదవకుల శ్రేష్ఠుఁడైన. హలధరుని పాదారవిందంబులకున్=బలరాముని పాదకమలములకు, వందనంబాచరించి=నమస్కరించి. (ఇట్లనియెను)

తా॥ ఆవిధముగాబలరాముఁడు మిక్కిలికోపించినవాఁడై తనభుజబలముచేత నాఁగేటిని నిడుపుగా చాఁచి ఆయమునా నదిని తగిలించి పెల్లగించి తనతట్టుకు వచ్చునట్లులాగఁగా ఆయమునభయపడి యొకస్త్రీయైవచ్చిబలరామునిపాదకమలములకుమ్రొక్కియిట్లు పలికెననితా.

వి శే షా ర్థ ము.

టీ॥ ఆమ్మహావాహినిన్ = సంసారమనెడునదిని. హలంబున్ = హలతివిలిఖతిభువమితిహలం అనివ్యుత్పత్తి. హలవిలేఖనే అని ధాతువు గనుక అజ్ఞానమనెడు భూమిని గీచుచున్న అపరోక్షజ్ఞానమునందు. తగిల్చి = చేర్చి — సంసారము స్వేతరముకాదని నిశ్చయింపఁగానే. సుందరీరూపంబుఁ గైకొని = ఆయాంతర సంసారము బ్రహ్మాకారమై. యదువంశతిలకుండు=బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుఁడు—బ్రహ్మవిద్వరిష్ఠుఁడు. పాదారవిందంబులకువందనంబాచరించి=నీకు నేనన్యము గాదనిసూచించి.

౫౮౬.—మ॥ బలరామా ఘనబాహా నీయతుల శుం * భద్విక్రమం బంగనల్
దెలియంజాలెదువారె యీయఖిల ధా * త్రీభార ధౌరేయ ని
శ్చల సత్వుండగు కుండలీశ్వరుఁడు నిన్ * జర్చింప నీసత్కళా
కలితాంశ ప్రభవుండు నీగురుభుజా * గర్వంబు సామాన్యమే.

టీ॥ ఘనబాహా=దృఢములయినచేతులుగల. (బలరామా) నీయతుల శుంభద్విక్రమంబు=నీదైనయీడులేనిమహాపరాక్రమమును. అంగనలు= ఆఁడువారు. తెలియఁజాలెదువారె=తెలిసికోఁజాలినవారా. ఈయఖిల... సత్వుండు—(ఈ) అఖిల=సమస్తమయిన. ధాత్రీ=భూమియొక్క. భార=బరువును. ధౌరేయ=వహించునట్టి. నిశ్చల=చలింపని. సత్వుండు =బలముగలవాఁడు. అగుకుండలీశ్వరుఁడు=అగునట్టియాదిశేషుఁడు. నిన్ = నిన్ను. చర్చింపన్ = విచారింపఁగా. నీసత్కళాకలితాంశప్రభవుండు = నీమంచికళలోఁ గూడుకొన్న యంశమునందుఁ బుట్టినవాఁడు. నీగురుభుజాగర్వంబు=నీయధికమైనభుజబలము. సామాన్యమే= సాధారణమయినదా.

తా॥ దృఢములయినబాహువులుగలబలరాముఁడా! ఈకనఁబడుచున్న భూభారము నంతయు మోచువాఁడైన యాదిశేషుఁడుఁ గూడ నీమేలైనకళాంశమునందుజనించినవాఁడుక అటువంటినీయీడులేనిపరాక్రమమును ఆఁడువారా తెలిసికోఁగలవారు అధికమైననీబాహుబలము సాధారణమైనదికాదేయని తాత్పర్యము.

౫౪౭.—చ॥ అని వినుతించి యేను భవ * దంఘ్రిసరోజము లాశ్రయించెదన్
ననుఁ గరుణింపుమన్న యదు * నందనుఁ డన్నదిఁ బూర్వమార్గమై
చనుమని కామినీ నికర * సంగతుఁడై జలకేళి సల్పె నిం
పెనయఁ గరేణుకాయుత మ * దేభము చాడ్పున నమ్మహానదిన్.

టీ॥ అనివినుతించి=అనిస్తోత్రముచేసి. ఏను = నేను. భవదంఘ్రిసరోజములు = నీపాదకమలములను. ఆశ్రయించెదను = చేరెదను. ననున్=నన్ను. కరుణింపుము = దయచేయుము. అన్నన్=అనఁగా. యదునందనుఁడు=యదు వంశమునఁ బుట్టిన వాఁడైన బలరాముఁడు. అన్నదిన్=ఆయేటిని. పూర్వమార్గమై=మునుపటిదారిగా. చనుము=పొమ్ము. (అని) కామినీనికరసంగతుఁడై=స్త్రీసమూహముతోఁగూడుకొన్నవాఁడై. ఇంపు = ప్రీతి. ఎనయన్ = కూడఁగా-కలుఁగఁగా-ననుట. కరేణుకాయుతమదేభముచాడ్పునన్=ఆడుయేనుఁగులతోఁగూడిన మదపుయేనుఁగువలెనే. అమ్మహానదిన్=ఆగొప్పయేటియందు. జలకేళిన్=జలక్రీడను. సల్పెన్=నడపెను.

తా॥ అనివాగడి స్వామీ నేను నీపాదములనాశ్రయించుచున్నాను నన్ను అనుగ్రహింపుము అనివేఁడుకొనఁగా బలరాముఁడు ఆయమునానదిని యెప్పటివలెప్రవహింపుమనిమన్నించి గోపికాస్త్రీలతోఁగూడ ఆగొప్ప నదియందు ఇచ్చవచ్చినట్టు ఆఁడుయేనుఁగులతోఁ గూడికొన్న మదపు యేనుఁగువలెనే జలక్రీడలాడెనని తాత్పర్యము.

౫౪౮.—తే॥ అంత జలకేళి చాలించి * సంతసంబు। నందుచుండ వినీల వ * స్త్రాది రత్న
మండనంబులు గాంచన * మాలికయును। దెచ్చి హలికిచ్చి చనియె న * దీలలామ.

టీ॥ అంతన్=అటుపిమ్మట. జలకేళిన్=జలక్రీడను. చాలించి=నిలిపి. సంతసంబున్=సంతోషమును. అందుచుండన్=పొందుచుండఁగాను. నదీలలామ=నదులలో శ్రేష్ఠమయినయమున. వినీలవస్త్రాది=మిక్కిలి నల్లనైన వస్త్రములు మొదలయి నవియు. రత్నమండనంబులు=రత్నములసొమ్ములును. కాంచన మాలికయును = బంగారు సరిపెణయు. తెచ్చి=తీసికొనివచ్చి. హలికిన్=బలరామునికి. ఇచ్చిచనియెన్=ఇచ్చిపోయెను.

తా॥ పిమ్మట బలరాముఁడు జలక్రీడమాని సంతోషముగాదరినిజేరియుండఁగా ఉత్తమ నదియైన యమున నల్లని వస్త్రములు మొదలయినవియు రత్నాలసొమ్ములునుబంగారుసరిపెణయు తెచ్చియిచ్చిపోయెను.

౫౪౯.—క॥ అవియెల్లఁ దాల్చి హలధరుఁ। డవిరళగతి నొప్పి వల్ల * వాంగనలును దా
దివిజేంద్రుఁబోలె మహితో। త్సవమున వర్తించుచుండె * సౌఖ్యోన్నతుఁడై.

టీ॥ హలధరుఁడు = బలరాముఁడు. అవియెల్లన్=వానినన్నిటిని. తాల్చి=ధరించి. ఒప్పి=ఒప్పినవాఁడై. అవిరళగతిన్ = దట్టమైన రీతితో. వల్లవాంగనలును=గోపికాస్త్రీలును. తాన్=తాను. దివిజేంద్రుఁబోలెన్=దేవేంద్రునివలె. మహితోత్సవమునన్ = మిక్కుటమయిన సంతోషముతో. సౌఖ్యోన్నతుఁడై=సౌఖ్యముచేత హెచ్చినవాఁడై—సౌఖ్యస్థితితోననుట. వర్తించుచుండెన్ = మెలఁగుచుండెను.

తా॥ బలరాముఁడు ఆయమునానది తెచ్చియిచ్చిన వస్త్రాభరణాదులను ధరించి తానును గోపికాస్త్రీలును అప్సరసలతోఁగూడిన దేవేంద్రునివలెనే ఒప్పినవాఁడై మిక్కిలి సంతోషముతోను సౌఖ్యాతిశయముతోను వర్తించుచుండెనని తాత్పర్యము.

౫౫౦.—క॥ అవనీశ యిట్లు హలమునఁ। దివిచినకాళింది ప్రయ్య * దెలియఁగ నేడున్
భువి నుతికెక్కెను రాముని। ప్రవిమల తరమైన బాహు * బలసూచకమై.

టీ॥ అవనీశ=రాజా. ఇట్లు=ఈవిధముగా. హలమునన్=హలాయుధముచేత. తివిచిన=తీసిన. కాళిందిప్రయ్య=యమునానది చీలిక. తెలియఁగన్=విశదముగా. రాముని ... సూచకమై—రాముని=బలరామునియొక్క. ప్రవిమలతరమైన=మిక్కిలిస్వచ్ఛమయిన. బాహుబల = భుజబలమును. సూచకమై = కనఁబఱుచునదియై. నేడును=ఈదినమునకును. భువిన్=భూలోకమునందు. నుతికెక్కెన్=పొగడ్తచేతఅతిశయించెను.

తా॥ ఓరాజా! యీరీతిగాబలరాముఁడుతనహలాయుధముచేత యమునానదినిచీలఁదీసినచీలికయిప్పటికిఁగూడ ఆయనయొక్కభుజబలమును దెలుపునదియై భూలోకమునందుశ్లాఘింపఁబడుచున్నది అని తా.

౫౫౧.—వ॥ అంత బలభద్రుండు వ్రజ సుందరీసమేతుండై నందఘోషంబునం బరితోషంబు నొందు
చుండె నంత నక్కడఁ గరూశాధిపతియైన పౌండ్రకుండు తనదూతం బిలిచి యిట్లనియె.

టీ॥ అంతన్=అంతట. బలభద్రుండు=బలరాముఁడు. వ్రజసుందరీసమేతుండై=గోపికాస్త్రీలతోఁగూడుకొన్నవాఁడై. నంద ఘోషంబునన్=నందుని మందయందు. పరితోషంబు నొందుచున్=సంతోషించుచు. (ఉండెను) అంతన్=అప్పుడు. అక్కడ=మధురాపట్టణములో. కరూశాధిపతి=కరూశదేశపురాజు. అయినపౌండ్రకుండు=అయినట్టి పౌండ్రకవాసుదేవుఁడనువాఁడు. (తనదూతం బిలిచి యిట్లనియెను)

తా॥ అనంతరము బలరాముఁడు గోపికాస్త్రీలతోఁ గూడుకొన్నవాఁడై నందునిమందయందుసుఖముగాకాలముగడపుచుండెను అప్పుడు మధురాపట్టణములో ఏమిజరగెననఁగా కరూశదేశపురాజైనపౌండ్రకవాసుదేవుఁడు తనదూతను బిలిచి యిట్లుపలికెనని తాత్పర్యము.

దూత.



(*) పౌండ్రకవాసుదేవుఁడంపిన దూత శ్రీకృష్ణునితో భాషించుట. (*)

౫౫౨.—సీ॥ మనుజేశ బలగర్వ * మున మదోన్మత్తుఁడై - యవనిపై వాసుదే * వాఖ్యుఁడనఁగ
నేనొక్కరుఁడఁ గాక * యితరుల కీనామ - మలవడునే యని * యదటు మిగిలి
తెగి హరి దా వాసు * దేవుండ ననుకొంట - యటఁబోయి నీవ వ * ల్దనుము దూత
పద్మాయతాక్షుని * పాలికిఁ బొమ్మన్న - నరిగి వాఁ డంబుజో * దరుఁడు పెద్ద

తే॥ కొలువు గైకొనియుండ సం * కోచపడక । వినుము మా రాజుమాటగా * వనజనాభ
యవని రక్షింప వాసుదే * వాఖ్య నొంది । నట్టి యే నుండ సిగ్గు వోఁ * దట్టి నీవు.

టీ॥ మనుజేశ=ఓరాజా. బలగర్వమ్మునన్=బలమువలనియహంకారముచేత. మదోన్మత్తుఁడై. క్రొవ్వుచేత ఒళ్లు తెలియని వాఁడై. అవనిపైన్=భూమిమీఁద. వాసుదేవాఖ్యుఁడు=వాసుదేవుఁడను పేరుగలవాఁడు. అనఁగన్=అనునట్లుగా. (నేను) ఒక్కరుఁడఁగాక=ఒకఁడే గాక. ఇతరులకున్=అన్యులకు. ఈనామము=ఈపేరు. అలవడునే=సరిపడునా. (అని) అదటు=గర్వము. మిగిలి=అతిశయించి. తెగి=తెగఁబడి. దూత=ఓరిదూతుఁడా. హరి=కృష్ణుఁడు. తాన్=తాను. (వాసుదేవుండను) అనుకొంట=అనుకొనుట. అటఁబోయి=అక్కడికిపోయి. నీవ=నీవే. వల్దనుము=కూడదని చెప్పుము. పద్మాయతాక్షుని పాలికిన్=కృష్ణునియొద్దకు. పొమ్మన్నన్=పొమ్మని చెప్పఁగా. వాఁడు=ఆదూత. అరిగి=పోయి. అంబుజోదరుఁడు = కృష్ణుఁడు. పెద్దకొలువు=పెద్దకచ్చేరి. గైకొనియుండన్=పొంది యుండఁగా — పెద్దకచ్చేరి చేయుచుండఁగా. సంకోచపడక = సంకోచమును పొందక. వనజనాభ= కృష్ణుఁడా. మా రాజుమాటగాన్ = మా రాజు చెప్పునట్టి మాటగా.

వినుము = నేను చెప్పెదను వినుము. అవనిన్=భూమిని. రక్షింపన్=ఏలుటకు. వాసుదేవాఖ్యన్=వాసుదేవుఁడు అను పేరును. ఒందినట్టియే నుండన్ = పొందినవాఁడనైన నేను ఉండఁగా. (నీవు) సిగ్గువోదట్టి= సిగ్గువిడిచినవాఁడవై.

తా॥ ఓపరీక్షిన్మహారాజా ! పౌండ్రకుఁడు తన బల గర్వము చేత మదించి ఒళ్లు తెలియని వాఁడై భూమిలో వాసుదేవుఁడనఁగా నేను ఒకఁడుగాక యీ పేరు ఇతరులకుఁ గూడ ఉండవచ్చునా అని ఒక దూతను బిలిచి ఓరిదూతుఁడా ! కృష్ణుఁడు మిక్కిలి గర్వించి తెగఁబడి తాను వాసుదేవుఁడు అని అనుకొనుట యుక్తముగ నుండలేదు నీవు పోయి అతనితో ఆపేరు నీకు వలదు అని చెప్పిరమ్మనఁగా ఆదూత యు కృష్ణుని యొద్దకుఁ బోయి కృష్ణమూర్తి కొలువు దీరియుండఁగా కొంచమైన సంశయపడక ఓకృష్ణా ! మా రాజు నీతో చెప్పుమన్న మాట చెప్పెద వినుము భూమిని ఏలుటకు వాసుదేవుఁడు అను పేరితో నేను ఉండఁగా నీవు సిగ్గువిడిచినవాఁడవై అని తాత్పర్యము.

౫౫౩.—క॥ నాపేరును నాచిహ్నము । లేపున ధరియించి తిరిగె * దిది పంతమె యిం
తేపో మదిఁ బరికించిన । నేపంత మెఱుంగు గొల్లఁ * డేమిట నైనన్.

టీ॥ (నాపేరును) నాచిహ్నములు=నాగుఱుతులును. ఏపునన్=గర్వముతో. ధరియించి=తాల్చి. తిరిగెదు=తిరుగుచున్నావు. ఇదిపంతమె= ఇదియేమి ప్రతిజ్ఞయా. ఇంతేపో=ఇంతే నీతెలివి. ఏమిటనైనన్=ఏవిషయమందైనను. మదిన్=మనసునందు. పరికించినన్=విచారింపఁగా. గొల్లఁడు=గొల్లవాఁడు. ఏపంతము ఎఱుంగున్=ఏమి ప్రతిజ్ఞ నెఱుఁగును.

తా॥ నాపేరు నాగుఱుతులు ధరియించినవాఁడై గర్వముతో తిరుగుచున్నావు ఇది నీకు గౌరవమా? ఏవిషయమందైనను చక్కగా విచారించు నెడల ఇంతే నీయోగ్యత గొల్లవాఁడు ఏమిగౌరవము నెఱుఁగునని చెప్పెనని తాత్పర్యము.

౫౫౪.—ఆ॥ ఇంత నుండి మైన * నెదిరిఁ దన్నెఱిఁగి నా । చిహ్నలెల్ల విడిచి * చేరి కొల్చి
బ్రతుకుమనుము గాక * పంతంబు లాడెనా । యెదురుమనుము ఘోర * కదనమునకు.

టీ॥ ఇంతనుండి యైనన్ = ఇదిమొదలుకొని యైనను. ఎదిరిన్ = ఎదుటివారిని. తన్నున్ = తన్నును- నాయోగ్యతనునీయోగ్యతనుఅనుట ఎఱిఁగి= తెలిసి. నాచిహ్నలు = నాగుఱుతులను. ఎల్లన్ = అన్నిటిని. (విడిచి) చేరి= నాదగ్గఱచేరి. కొల్చి= కొలువుచేసి. బ్రతుకుము= జీవింపుము. అనుము = అనిచెప్పుము. (కాక) అందులకు ఒప్పకయనుట. పంతంబులాడెనా= పౌరుషపు మాటలాడినపక్షమున. ఘోరకదనమునకున్ = భయంకరయుద్ధమునకు. ఎదురుమనుము= ఎదిరింపుమనిచెప్పుము.

తా॥ ఇది మొదలుకొని యైన తనస్థితిని నాస్థితిని విచారించి తెలివి తెచ్చుకొని నాపేరు నాగుఱుతులు విడిచిపెట్టి నావద్దచేరి నన్నుకొలిచి జీవింపుము అనిచెప్పుము, అది సరిపడక యేమైన గచ్చుమాటలు ఎచ్చుగ నాడినయెడ యుద్ధమునకు సిద్ధమయిగమ్మనిచెప్పుము అనిచెప్పెనని తాత్పర్యము.

౫౫౫.—క॥ అనుదుర్భాషలు సభ్యులు । వినియొండొరు మొగముసూచి ✻ విస్మితు లగుచున్
జనులార యిట్టి క్రొత్తలు । వినఁబడియెడి నిచట లెస్స ✻ వింటిరె యనఁగన్.

టీ॥ అనుదుర్భాషలు= అనునట్టిచెడ్డమాటలను. సభ్యులు= ఆసభలోనున్నవారు. (విని) ఒండొరుమొగము= ఒకరిమొగమొకరు. చూచి= చూచుకొని. విస్మితులు= ఆశ్చర్యమునొందినవారు. (అగుచును) జనులార= ఓప్రజలారా. ఇచటన్ = ఇక్కడ. ఇట్టిక్రొత్తలు= ఇటువంటి వింతమాటలు. వినఁబడియెడిని = వినఁబడుచున్నవి. లెస్స వింటిరె= చక్కగావింటిరా. అనఁగ= అనిపలుకఁగా.

తా॥ అనునట్టి ఆనీచవాక్యములను సభలోనున్న వారందఱువిని ఒకరిమొగ మొకరుచూచుకొనుచు ఓజనులారా! ఇటువంటిక్రొత్త మాటలు వినఁబడెనో చూడుఁడు మీరందఱుచక్కగావింటిరాఅనఁగా ననితాత్పర్యము.

౫౫౬.—వ॥ అట్టియెడఁ గృష్ణుండు వాని కిట్లనియె.

టీ॥ అట్టియెడన్ = ఆసమయమునందు. (కృష్ణుండు) వానికిన్ = ఆదూతతో. (ఇట్లనియెను)

తా॥ ఆసమయమునందు కృష్ణుఁడు ఆదూతనుజూచి యీక్రిందఁ జెప్పఁబోవురీతిగాఁ జెప్పెనని తాత్పర్యము.

౫౫౭.—మ॥ వినురా మీనృపుఁడన్న చిహ్నములు నే ✻ వేవచ్చి ఘోరాజిలోఁ
దనమీఁదన్ వెసవైవఁ గంకముఖ గృ ✻ ధ్రవ్రాతముల్మ్రాఁగఁగా
ననిలో దర్పము దూలి కూలి వికలం ✻ బై సారమేయాళికిన్
ననయంబున్ నశనంబ వయ్యెదని యే ✻ నన్నట్లుగా వానితోన్.

టీ॥ వినురా= నేనుచెప్పెడుదానినివినురా. మీనృపుఁడు= మీరాజు. అన్నచిహ్నములు= చెప్పినగుఱుతులను. నేన్ = నేను. వే= శీఘ్రముగా. (వచ్చి) ఘోరాజిలోన్ = భయంకరమైనయుద్ధమునందు. తనమీఁదన్ = తనపైని. వెసన్ = వడిగా. వైవన్ = వేయఁగా. కంకముఖగృధ్రవ్రాతములు= బోరువలు మొదలుగాఁగలగద్దలగుంపులు. మ్రాఁగఁగాన్ = ఆవరింపఁగా. అనిలోన్ = యుద్ధమునందు. దర్పము= అహంకారము. తూలి= పోయి. కూలి= పడి. వికలంబై= సంధులు వదలినదై. సారమేయాళికిన్ = కుక్కలగుంపునకు. అనయంబున్ = మిక్కిలి. అశనంబవు= ఆహారమవు. అయ్యెదు= కాఁగలవు. (అని) ఏనన్నట్లుగాన్ = నేనుచెప్పినట్టుగా. వానితోన్ = ఆమీరాజుతో. (చెప్పుము)

తా॥ ఓరిదూతుఁడా! వినుము. మీరాజు చెప్పినగుఱుతులను నేను శీఘ్రముగావచ్చి భయంకరమయిన యుద్ధములో వడిగానీమీఁదవేసెదను వేయఁగా నేబోరువలు మొదలుగాఁగలగద్దలన్నివచ్చికమ్ముకొనఁగా నీయహంకార మంతయు పోయి క్రిందఁబడి సంధులు వదలి నీదేహము కుక్కలగుంపునకు తగిన ఆహారము అగును అని నేను చెప్పినట్టుగా వానితోఁ జెప్పుము అనెనని తాత్పర్యము.

౫౫౮.—క॥ అనియుద్రేకముగా నా । డిన మాటల కులికివాఁడు ✻ డెందము గలఁగన్
జని తనయేలిక కంతయు । వినిపించెను నతనిమదికి ✻ విరసము గదురన్.

టీ॥ (అని) ఉద్రేకముగాన్ = ఆటోపముగా. (ఆడినమాటలకు) వాఁడు= ఆదూత. ఉలికి= భయపడి. డెందము= మనసు. కలఁగన్ = కలవరమునొందఁగా. చని= పోయి. తనయేలికకున్ = తన ప్రభువునకు. అంతయున్ = సమస్తమును. అతనిమదికిన్ = ఆరాజుమనసునకు. విరసము= విపరీతభావన. కదురన్ = కలుగఁగా. వినిపించెన్ = తెలియఁజెప్పెను.

తా॥ అనియిట్లు ఆటోపముతో కృష్ణుఁడు చెప్పిన మాటలువిని ఆదూత మనసులో దిగులుపుట్టఁగా తనరాజునొద్దకుఁబోయి వాని మనసులోఁ గలఁతపుట్టునట్టుగా ఎల్లవృత్తాంతమును జెప్పెననితాత్పర్యము.

వ॥ అంతఁ గృష్ణుండు దండయాత్రోత్సాహుండై వివిధాయుధకలితంబును విచిత్రకాంచనపతాకకేతు విలసితంబునునగు సుందర స్యందనంబునఁ బటుజవతురంగంబులంబూన్చి దారకుండు దెచ్చిననెక్కి యతిత్వరితగతిం గాశికానగరంబున కరిగినం బౌండ్రకుండును రణోత్సాహంబు దీపింప నక్షౌహిణీ ద్వయంబుతోడం బురంబువెడలె నప్పు డతని మిత్రుండైనకాశికాధిపతియును మూడక్షౌహిణులతోడం దోడుపడువాఁడై వెడలె నిట్లాప్తయుతుండై వచ్చువాని.

టీ॥ అంతన్ = అంతట. (కృష్ణుండు) దండయాత్రోత్సాహుండై= యుద్ధయాత్రయందలి పూనికగలవాఁడై. వివిధాయుధకలితంబును = నానావిధములయిన ఆయుధములతోఁ గూడినదియు. విచిత్ర...విలసితంబును—విచిత్ర = నానావర్ణమయిన. కాంచన = బంగారుమయమయిన. పతాక= టెక్కెములచేతను. కేతు = ధ్వజస్తంభములచేతను. విలసితంబును= ప్రకాశించునదియు. అగుసుందర

స్యందనంబునన్=అగునట్టి అందమైనరథమునందు. పటుజవతురంగంబులన్=మిక్కిలి వేగముగల గుఱ్ఱములను. పూన్చి=కట్టి. దారకుండు=దారకుఁడు అను పేరుగలసారథి. తెచ్చినన్=తోలుకొని రాఁగా. (ఎక్కి) అతిత్వరితగతిన్=మిక్కిలివడిగలనడతో. కాశికానగరంబునకున్=కాశీపట్టణమునకు. అరిగినన్=పోఁగా. పౌండ్ర కుఁడును = పౌండ్రకవాసుదేవుఁడును. రణోత్సాహంబు=యుద్ధ యత్నము. దీపింపన్ = ప్రకాశింపఁగా. అక్షౌహిణీద్వయంబు తోడన్ = రెండు అక్షౌహిణులసేనతో. పురంబువెడలెన్ = పట్టణమునుండిబయలుదేఱెను. (అప్పుడు) అతనిమిత్రుండు=వానిస్నేహితుఁడు. (ఐన)కాశికాధిపతియును=కాశిరాజును. మూడక్షౌహిణులతోడన్=మూడక్షౌహిణులసేనతో. తోడుపడువాఁడై = సహాయపడువాఁడై. వెడలెన్=బయలుదేఱెను. (ఇట్లు) ఆప్తయుతుండై=మిత్రునితోఁగూడినవాఁడై. వచ్చువానిన్=వచ్చునట్టిఆపౌండ్రకుని.

తా॥ అంతట కృష్ణుఁడు యుద్ధయాత్ర చేయవలెననుపూనికగలవాఁడై అనేకవిధములయిన ఆయుధములును, నానావర్ణములు గలిగి వెలుఁగునట్టి టెక్కెపుగుడ్డలతోఁగూడిన బంగారుధ్వజస్తంభములునుగలదై మిక్కిలి వడిగల గుఱ్ఱములనుగట్టిన అందమయినరథమును దారకుఁడు తీసికొనిరాఁగా దానిపైనెక్కి అతిత్వరితముగా కాశీపట్టణమునకుపోయెను అంతలో అక్కడ పౌండ్రకవాసుదేవుఁడును మూడు అక్షౌహిణులదండుతో కాశిరాజు తోడుపడఁగా రెండు అక్షౌహిణుల సేనను గూర్చుకొన్నవాఁడై పట్టణమునుండి వెడలెను ఈవిధముగా స్నేహితునితోడ బయలుదేఱివచ్చుచున్న పౌండ్రకుని అని తాత్పర్యము.



(*) శ్రీకృష్ణమూర్తి పౌండ్రకవాసుదేవునిమీఁదదండెత్తి వానింజంపుట. (*) —— కాశిరాజు.

౫౬౦.—సీ॥ చక్ర గదా శంఖ * శార్ఙ్గాదిసాధనుఁ - గృత్రిమ కౌస్తుభ * శ్రీనివాసు

మకరకుండల హార * మంజీర కంకణ - మణిముద్రికా వన * మాలికాంకుఁ

దరళవిచిత్ర ప * తంగ పుంగవ కేతుఁ - జెలువొందు పీతకౌ * శేయవాసు

జవనాశ్వకలిత కాం * చన రథారూఢుని - రణకుతూహలుని స * న్మణికిరీటు

తే॥ నాత్మ సమవేషు రంగ వి * హారకలిత । నటసమానునిఁ బౌండ్ర భూ * నాథుఁ జూచి
హర్షమిగురొత్త నవ్వెఁ బ * ద్మాయతాక్షుఁ । డంతవాఁడును నుద్వృత్తుఁ * డగుచునడరి.

టీ॥ చక్ర ... సాధనుఁ — చక్రము గద శంఖము శార్ఙ్గము మొదలుగాఁగలయుద్ధోపకరణములుగలవాఁడును. కృత్రిమకౌస్తుభ శ్రీనివాసుఁ = కల్పింపఁబడిన కౌస్తుభమణియొక్క కాంతికి ఉనికి పట్టైనవాఁడును. మకర... కాంకుఁ—మకరకుండల=మొసలినోరు గల చెవిప్రోఁగులును. హార=ముత్యాలపేరులును. మంజీర=చిఱుగజ్జెలును. కంకణ = కడియములును. మణిముద్రికా = రత్నాల యుంగరములును. వనమాలికా = వనమాలయు — తోమాలయు. అంకుఁ=గుఱుతులుగాఁగలవాఁడును. తరళ... కేతుఁ—తరళ=చలించుచున్న. విచిత్ర=చిత్రవర్ణమయిన. పతంగపుంగవకేతుఁ= గరుడధ్వజముగలవాఁడును. చెలువొందుపీతకౌశేయవాసుఁ=అందగించునట్టిపచ్చపట్టువస్త్రముగలవాఁడును. జవనాశ్వకలితకాంచన రథారూఢునిఁ=వడిగల గుఱ్ఱములతోఁగూడిన బంగారుతేరెక్కిన వాఁడును. రణకుతూహలునిఁ=యుద్ధమునకువేడుకపడువాఁడును. సన్మణికిరీటుఁ = మంచిమణులుచెక్కిన కిరీటముగలవాఁడునునై. ఆత్మసమవేషుఁ=తనతో సమానమైనవేషము వేసికొనియుండెడు. రంగవిహారకలితనటసమానునిఁ=నాట్యస్థానమునందు ఆడుటకుఁ దగిన నట్టువవానినిపోలిన. పౌండ్రభూనాథుఁ=పౌండ్రకరాజును. (చూచి) పద్మాయతాక్షుఁడు=కృష్ణుఁడు. హర్షము=సంతోషము. ఇగురొత్తఁ = పుట్టుచుండఁగా. (నవ్వెను) అంతఁ = అంతట. వాఁడును=పౌండ్రకుఁడును. ఉద్వృత్తుఁడు = నిక్కుగలవాఁడు. (అగుచును) అడరి=విజృంభించి.

తా॥ చక్రము మొదలయిన ఆయుధములచేతను కృత్రిమపు కౌస్తుభమణి మొదలగు ఆభరణములచేతను ఒప్పినవాఁడై గరుడ ధ్వజముతోడిదియు, వడిగల గుఱ్ఱములుగలదియునైన బంగారుతేరి పైనెక్కి వచ్చిన తన్నుఁబోలిన వేషము వేసికొని నిక్కుచున్న పౌండ్రకవాసుదేవునిఁజూచి శ్రీకృష్ణుఁడు నవ్వెను అంతట వాఁడు నిక్కుచు విజృంభించి అని తాత్పర్యము.

౫౬౧.—క॥ పరిఘ శరాసన పట్టిస । శర ముద్గర ముసల కుంత * చక్ర గదా తో
మర భిండివాల శక్తి । క్షురికాసి ప్రాస పరశు * శూలముల వెసఁ.

టీ॥ పరిఘ... శూలములఁ—పరిఘ = ఇనుపకట్లగుదియ. శరాసన=విల్లు. పట్టిస=అడ్డగత్తి. శర = బాణము. ముద్గర = ఇనుపగుదియ. ముసల=రోఁకలి. కుంత=ఈఁటె. చక్ర=చక్రాయుధము. గదా=గుదియ. తోమర=చిల్లకోల. భిండివాల=విడిచివాటుగుదియ. శక్తి=ఒంటిమొనగలిగినశూలమువంటి ఆయుధవిశేషము. క్షురిక= చురకత్తి. అసి=పెద్దకత్తి. ప్రాస=బల్లెము. పరశు=గండ్రగొడ్డలి. శూలములఁ = మూడుమొనలుగల ఆయుధవిశేషము అనువానిని. వెసఁ=వడిగా. దీనికిక్రియ పైపద్యములోని పైచినఁ అనునది.

తా॥ ఇనుపకట్లగుదియ విల్లు అడ్డగత్తి బాణములు ఇనుపగుదియ ఇనుపరోఁకలి ఈఁటె చక్రము గద చిల్లకోల విడిచివాటుగుదియ శక్తి చురకత్తి పెద్దకత్తి బల్లెము గండ్రగొడ్డలి శూలము అనునట్టి ఆయుధములను వెసతో ప్రయోగించి అని తాత్పర్యము.

౫౬౨.—చ॥ పరువడి యేచినఁ దనుజ * భంజనుఁ డంత యుగాంత కాల భీ
కర మహితోగ్ర పావకుని * కైవడి నేచి విరోధి సాధనో
త్కరముల నొక్కటఁ శరని * కాయములఁ నిగిడించి త్రుంచి భా
స్వరగతి నొత్తె సంచలిత * శాత్రవ సైన్యముఁ బాంచ జన్యముఁ.

టీ॥ పరువడిఁ = క్రమముగా. ఏసినఁ = ప్రయోగింపఁగా. అంతఁ = అంతట. దనుజభంజనుఁడు = రాక్షసులను హింసించువాఁడైన శ్రీకృష్ణమూర్తి. యుగాంత... కైవడిఁ—యుగాంతకాల= ప్రళయకాలమునందలి. భీకర=భయంకరమయిన. మహిత=గొప్పను వహించిన. ఉగ్ర = క్రూరమయిన. పావకునికైవడిఁ = అగ్నిహోత్రునివలె. ఏచి=విజృంభించి. విరోధిసాధనోత్కరములఁ = పగవాని ఆయుధసమూహములను. ఒక్కటఁ = ఒక్కసారిగా. శరనికాయములఁ=బాణసమూహములను. నిగిడించి=వ్యాపింపఁజేసి—ప్రయోగించియనుట. త్రుంచి = ఖండించి. భాస్వరగతిఁ = ప్రకాశించునట్లు. సంచలితశాత్రవసైన్యముఁ = మిక్కిలిచలించిన శత్రుసేనలుగలదైన. పాంచజన్యముఁ=పాంచజన్యము అను శంఖమును. ఒత్తెఁ=పూరించెను—ఊఁదెను.

తా॥ ముందుచెప్పిన ఆయుధములను ఒకటివెంటనొకటిని క్రమముగా ప్రయోగింపఁగా శ్రీకృష్ణమూర్తి ప్రళయకాలమునందు వెలుఁగునట్టి అగ్నిహోత్రునివలెనే కోపించి విజృంభించినవాఁడై ఒకసారిగా అనేకబాణములను ప్రయోగించి వాని ఆయుధముల నన్నిటిని నఱికి తనపరాక్రమము చక్కగా తెలియఁబడునట్లు శత్రుసేనలను చలింపఁజేయునట్టిదైన పాంచజన్యమనెడు శంఖమును ఊఁదెనని తాత్పర్యము.

౫౬౩.—ఉ॥ వారని యల్కతోఁ గినిసి * వారిజ నాభుఁడు వారిసైన్యముల్
మారి మసంగినట్లు నుఱు * మాడెనఁ బీనుఁగు పెంటలై వెసం
దేరులు వ్రాలె నశ్వములు * డ్రెల్లె గజంబులు ద్రుంగెసద్భటుల్
ధారుణిఁ గూలి రిట్లు నెఱి * దప్పిచనెఁ హతశేష సైన్యముల్.

టీ॥ వారిజనాభుఁడు=కృష్ణుఁడు. వారనియల్కతోన్=తగ్గని కోపముతో. కినిసి=కోపించి. వారిసైన్యములు=ఆపౌండ్రకునివియు కాశిరాజువియునైనసేనలను. మారి=మారియనెడు ప్రాణిసంహారకదేవత. మసంగినట్లు=విజృంభించినవిధమున. నుఱుమాడిన = ఛిన్నభిన్నములుగాపడఁగొట్టఁగా. (పీనుఁగుపెంటలై) వెసన్=వడిగా. తేరులు=రథములు. వ్రాలెన్=నేలఁగూలెను. అశ్వములు=గుఱ్ఱములు త్రెళ్లెన్=చచ్చిపడెను. గజంబులు=ఏనుఁగులు. త్రుంగెన్ = నశించెను. సద్భటులు = శూరులైనకాలిబంట్లు. ధారుణిన్ = భూమియందు. కూలిరి=పడిరి. హతశేషసైన్యములు = చావఁగా మిగిలినసేనలు. నెఱి=క్రమము. తప్పి=చెడి. చనెన్ = పోయెను-పాఱిపోయెను అనుట. ఇట్లు=ఈవిధముగా.

తా॥ శ్రీకృష్ణమూర్తి మిక్కిలి కోపించినవాఁడై తగ్గని ఆకోపముచేత మారి అనుదేవత విజృంభించి చంపునట్లు ఎల్లసేనలను పాడుచేయఁగా రథములు ఏనుఁగులుగుఱ్ఱములు కాలిబంట్లు అనెడుచతురంగసేనలును నశించెను చావఁగా మిగిలినదండు శూరధర్మమును విడిచి పాఱిపోయెను అని తాత్పర్యము.

వ॥ అట్టియెడ మేదోమాంసపంకంబులు రుధిరప్రవాహంబులునై సంగరాంగణంబు ఘోరంబయ్యె నయ్యవసరంబునం గయ్యంబునకుం గాలు ద్రవ్వు నప్పౌండ్రకునిం గనుంగొని హరి సంబోధించి యిట్లనియె.

టీ॥ అట్టియెడన్ = ఆసమయమునందు. మేదోమాంసపంకంబులు=మెదడు మాంసము ననెడు బురదలును. రుధిరప్రవాహంబులును=నెత్తురువెల్లువలును. (ఐ) సంగరాంగణంబు=యుద్ధప్రదేశము. ఘోరంబయ్యెన్ = భయంకరమయ్యెను. అయ్యవసరంబునన్ = అప్పుడు. కయ్యంబునకున్=యుద్ధమునకు. కాలుద్రవ్వునప్పౌండ్రకునిన్=కాలుచాఁచునట్టి ఆపౌండ్రకవాసుదేవుని. కనుంగొని = చూచి. హరి=కృష్ణుఁడు. సంబోధించి=ఓరీయనిపిలిచి. (ఇట్లనియెను)

తా॥ ఆసమయమునందు యుద్ధరంగము మెదడు మాంసము ననెడు బురదలచేతను, నెత్తుటివెల్లువలచేతను, భయంకరముగాఁ దోఁచెను. అంతట శ్రీకృష్ణమూర్తి కలహమునకు కాలుచాఁచుచున్న పౌండ్రకవాసుదేవునిపిలిచి యిట్లు పలికెనని తాత్పర్యము.

౫౬౫.—మ॥ మనుజేంద్రాధమ పౌండ్ర భూపసుత నీ ✻ మానంబు బీరంబు నే
డనిలో మాపుదు నెద్దు క్రొవ్వి పెలుచన్ ✻ నాఁబోతు పై ఱంకె వై
చిన చందంబున దూతచేత నను నా ✻ క్షేపించి వల్దన్న పే
రును చిహ్నంబులు నీపయిన్విడుతునం ✻ చున్ బల్కితి న్నాజిలోన్.

టీ॥ మనుజేంద్రాధమ = రాజులలోనీచుఁడవైన. పౌండ్రభూపసుత=పౌండ్రకదేశపురాజుకొడుకా. నీమానంబును=నీగర్వమును. బీరంబును = శౌర్యమును. (నేడు) అనిలోన్ = యుద్ధమునందు. మాపుదున్=పోఁగొట్టెదను. (ఎద్దుక్రొవ్వి) పెలుచన్ = గట్టిగా. ఆఁబోతుపైన్ = అచ్చువేసివిడువఁబడిన ఆఁబోతుమీఁద. ఱంకెవైచినచందంబునన్=ఱంకెవేసినవిధమున. దూతచేతన్ = దూతగుండ. ననున్=నన్ను. (ఆక్షేపించి)వల్దన్నపేరును=అక్కఱలేదన్నపేరును. చిహ్నంబులును = గుఱుతులును. నీపయిన్ = నీమీఁద. ఆజిలోనా = యుద్ధమునందు. విడుతునంచున్ = విడిచిపెట్టెదనని. పల్కితిన్=చెప్పితిని.

తా॥ ఓరి రాజులలో తక్కువైనవాఁడవగు పౌండ్రకరాజుకొడుకా! నీగర్వమునుపౌరుషమును నేడు యుద్ధములోపోఁగొట్టెదను సాధారణమయిన ఒక్కయెద్దు గంభీరమయిన ఆఁబోతును జూచి ఱంకెవేసినట్లు నీవు దూతనుబంపి నన్నాక్షేపించి విడువుమని చెప్పినగుఱుతులును పేరును నీమీఁద యుద్ధమునందువిడిచిపెట్టుదును అని చెప్పితిని కనుక అట్లే చేసెదనని తాత్పర్యము.

౫౬౬.—క॥ అదిగాక నీదుశరణముఁ । బదపడి యేఁజొత్తు నీవు ✻ బలవిక్రమ సం
పదగల పోటరివేనియుఁ । గదలక నిలుమనుచు నిశిత ✻ కాండము లంతన్.

టీ॥ (అదిగాక) నీదుశరణమున్=నీప్రాపును-నీయింటిననుట. పదపడి=పిమ్మట. ఏన్=నేను. చొత్తున్ = ప్రవేశింతును. (నీవు) బలవిక్రమసంపదగలపోటరివేనియున్=బలపరాక్రమములకలిమిగలిగినశూరుఁడవైనపక్షమున. (కదలక)నిలుము=నిలువుము. (అనుచు) అంతన్=పిమ్మట. నిశితకాండములు=వాఁడిబాణములను. నిగుడించి.

తా॥ అంతేకాకుండ నాపేరును బిరుదులును యుద్ధమునందు నీపై విడిచినపిమ్మట నీశరణమును నేను చొత్తును ఇప్పుడు నీవు బలపరాక్రమములు గలవాఁడవై శూరత్వముతో నాయెదుట చలింపక నిలిచియుండుము అనిచెప్పి అంతట వాఁడియైనబాణములను ప్రయోగించి అని తాత్పర్యము.

౫౬౭.—మ॥ చలమొప్ప న్నిగిడించి వానిరథమున్ ✻ జక్కాడి తత్సారథిన్
దలవ్రేద్రుంచి హయంబులన్నఱకి యు ✻ ద్దండ ప్రతాపక్రియన్
బ్రళయార్క ప్రతిమాన చక్రమున న ✻ ప్పౌండ్రు న్వెసం ద్రుంప వాఁ
డిలఁగూలెన్ గులిశాహతి న్నొఱగు శై ✻ లేంద్రాకృతిన్ భూవరా.

టీ॥ భూవరా=రాజా. చలము=పట్టుదల. ఒప్పన్ = ఒప్పునట్టుగా. నిగిడించి = ప్రయోగించి. వానిరథమున్ = వానితేరిని. చక్కాడి=విఱుగఁగొట్టి. తత్సారథిన్=వానిరథముతోలువానిని. తలవ్రేద్రుంచి=శీఘ్రముగాతలఁదెగఁగొట్టి. హయంబులన్ = గుఱ్ఱ

ములను. (నఱకి) ఉద్దండప్రతాపక్రియన్ = మిక్కిలిరేఁగిన తేజో వ్యాపారముచేత. ప్రళయార్క....మునన్—ప్రళయార్క=ప్రళయ కాలపుసూర్యునితోడ. ప్రతిమాన=సమానమయిన. చక్రమునన్= చక్రాయుధముచేత. అప్పౌండ్రున్=అపౌండ్రకుని. వెసన్=శీఘ్ర ముగ. త్రుంపన్=నఱకిచంపఁగా. వాఁడు=అపౌండ్రకుఁడు. కులి శాహతిన్ = వజ్రాయుధపుదెబ్బచేత. ఒఱగుశైలేంద్రాకృతిన్= పడునట్టిగొప్పకొండవలెనే. ఇలన్=భూమిమీఁద. కూలెన్=పడెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! విడువనిపట్టుదలతో శ్రీకృష్ణుఁడు వాఁడిబాణములను ప్రయోగించి వానిరథమునుపడఁగొట్టి సారథిని గుఱ్ఱములను జంపి తనతేజస్సు చక్కఁగా వెలుఁగునట్లు ప్రళయ కాలపు సూర్యబింబమును బోలిన తన చక్రాయుధమును ప్రయో గించి వానితల నఱకెను అంతట వాఁడు వజ్రాయుధముచేతనఱకఁ బడిన గొప్పకొండ పడినట్లు నేలఁబడియెనని తాత్పర్యము.

౫౮౮.—చ॥ మడపక కాశికావిభుని ✽ మస్తక ముద్ధతిఁ ద్రుంచి బంతికై
వడినది పింజపింజ గఱ ✽ వన్ విశిఖాళి నిగిడ్చి వాని యే
లెడి పురిలోన వైచె నవ ✽ లీల మురాంతకుఁ డిట్లు వైరులన్
గడఁగి జయించి చిత్తమునఁ ✽ గౌతుకమున్ జిగురొత్త నత్తఱిన్.

టీ॥ మడపక=వెనుదీయక. కాశికావిభునిమస్తకము=కాశిరాజు తలను: ఉద్ధతిన్=నిక్కుతో. త్రుంచి=నఱకి. అది = ఆతల. బంతి కైవడిన్=పుట్టచెండువలె. పింజపింజగఱవన్ = ప్రతిబాణముమొద టను బాణములు గ్రుచ్చుకొనునట్లు. విశిఖాళిన్ = బాణపఙ్క్తిని. నిగిడ్చి=వ్యాపింపఁజేసి. వానియేలెడిపురిలోనన్=వాఁడు ఏలునట్టి దైన కాశీపట్టణమునందు. అవలీలన్=అనాయాసముగా. వైచెన్= పడవేసెను. మురాంతకుఁడు=కృష్ణుఁడు. ఇట్లు = ఈవిధముగా. వైరులన్=శత్రువులను. కడఁగి=ఉత్సహించి. జయించి = గెలిచి. చిత్తమునన్ = మనస్సునందు. కౌతుకమున్ = వేడుకయు. చిగు రొత్తన్=మొలకెత్తుచుండఁగా. అత్తఱిన్=ఆసమయమునందు.

తా॥ కొంచెమునూసంకోచములేక వెంటనే కాశిరాజుతలను నఱకి ఆతలను పింజతోపింజనాటిన బాణములవరుసచేత పుట్టచెండు వలెనే తీసికొనిపోయి అతఁడు ఏలునట్టిదైనకాశీపట్టణములో పడు నట్లు చేసెను ఈవిధముగా కృష్ణుఁడు తనపగవారిని గెలిచి మనసు నందు వేడుకమీఱఁగా ఆసమయమునందు అని తాత్పర్యము.

౫౮౯.—క॥ సురగంధర్వ నభశ్చర। గరుడోరగ సిద్ధసాధ్య ✽ గణము నుతింపన్
మరలి చనుదెంచి హరినిజ। పురమున సుఖముండె నతి వి ✽ భూతిఁ దలిర్పన్.

టీ॥ హరి=కృష్ణుఁడు. సుర...ణము—సుర=దేవతలయొక్కయు. గంధర్వ=గంధర్వులయొక్కయు. నభశ్చర=ఖేచరులయొక్కయు. గరుడ=గరుడులయొక్కయు. ఉరగ=సర్పములయొక్కయు. సిద్ధ= సిద్ధులయొక్కయు. సాధ్య=సాధ్యులయొక్కయు. గణము=సమూ హము. నుతింపన్=పొగడఁగా. మరలిచనుదెంచి=తిరిగివచ్చి. నిజ పురమునన్ = తనపట్టణమునందు. అతివిభూతి = అధికైశ్వర్యము. తలిర్పన్=ప్రకాశింపఁగా. సుఖముండెన్=సుఖముననుండెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి దేవతలుగరుడులుగంధర్వులు మొదలుగాఁ గల దేవతాభేదములును కొనియాడుచుండఁగా తిరుగా తనపట్టణ మునకువచ్చి మిక్కుటమగు ఐశ్వర్యముతోసుఖముగా నుండెననితా.

౫౯౦.—క॥ వనజోదరు చిహ్నంబులు। గొనకొని ధరియించి పౌండ్ర ✽ కుఁడు మచ్చరియై
యనవరతము హరి దనతలఁ। పునఁ దగులుటఁజేసి ముక్తిఁ ✽ బొందె నరేంద్రా.

టీ॥ నరేంద్రా=రాజా. వనజోదరుచిహ్నంబులు=కృష్ణునిగుఱు తులు. గొనకొనిధరియించి=పూనిధరించి. మచ్చరియై=మాత్సర్యము గలవాఁడై. అనవరతము=సర్వదా. హరి=కృష్ణుఁడు. తనతలఁపునన్= తనమనసులో. తగులుటఁజేసి = అంటుటచేత. పౌండ్రకుఁడు = పౌండ్రకవాసుదేవుఁడు. ముక్తిఁబొందెన్=మోక్షమును పొందెను.

తా॥ ఓరాజా! కృష్ణుని గుఱుతులను ధరించి మాత్సర్యముతో వర్తించుచుండియు ఎల్లప్పుడు కృష్ణుఁడు తన మనసులో నంటి యున్నందున పౌండ్రకవాసుదేవుఁడు మోక్షమును పొందెననితా.

౫౯౧.—సీ॥ అక్కడఁ గాశిలో ✽ నారాజు మందిరాం - గణమునఁ గుండల ✽ కలితమగుచుఁ
బడియున్న తలఁజూచి ✽ పౌరులు మంత్రులు - దమరాజు తలయని ✽ దగ నెఱింగి
చెప్పిన నాన్నృపు ✽ జీవితేశ్వరలును - సుతులు బంధువులును ✽ హితులు గూడి
మొనసి హాహాకార ✽ మున నేడ్చి రత్తఱిఁ - దత్త నూభవుఁడు సు ✽ దక్షిణుండు

తే॥ వెలయఁ దండ్రికిఁ బరలోక ✽ విధులొనర్చి। జనకుననిలో వధించిన ✽ చక్రపాణి
నడరిమర్దింపఁ దగును పా ✽ యంబు దలఁచి। చతురుఁడగునట్టి దనపురో ✽ హితునిఁ బిలిచి.

టీ॥ (అక్కడ) కాశిలోన్=కాశీపట్టణమునందు, ఆరాజుమంది రాంగణమునన్ = ఆకాశిరాజుయొక్క యింటిముంగిటియందు. కుండలకలితమగుచున్ = చెవిపోఁగులతోఁగూడినదై. (పడియున్న తలనుచూచి) పౌరులును=పురజనులును. (మంత్రులును) తమరాజుతల

యని=తమరాజుయొక్కతలయని. తగన్=యుక్తముగా. ఎఱింగి=తెలిసికొని. చెప్పినన్=చెప్పఁగా. ఆనృపుజీవితేశ్వరులును=ఆరాజుభార్యలును. సుతులును=కొడుకులును. బంధువులును=చుట్టములును. హితులును=కావలసినవారును. కూడి=ఒకటిగాఁగూడుకొని. హాహాకారమునన్=హాహా అనుచప్పుడుకలుగునట్టుగా. మొనసి=పూని. (ఏడ్చిరి) ఆత్తఱిన్=ఆసమయమునందు. తత్తనూభవుఁడు=ఆరాజుకొడుకైన. సుదక్షిణుండు=సుదక్షిణుఁడుఅనువాఁడు. వెలయన్=విశదముగా. (తండ్రికి) పరలోకవిధులు=ఉత్తరక్రియలు. ఒనర్చి = చేసి. జనకున్=తనతండ్రిని. అనిలోన్=యుద్ధమునందు. వధించిన చక్రపాణిన్=చంపినకృష్ణుని. అడరి = ప్రయత్నించి. మర్దింపన్=చంపుటకు. తగునుపాయంబు = తగినయుపాయమును. తలఁచి = ఆలోచించి. చతురుఁడు=నేర్పరి. (అగునట్టి తనపురోహితునిపిలిచి)

తా॥ ఇక్కడకృష్ణుఁడు ఇట్లుండఁగా అక్కడ కాశిలోఆరాజుయొక్క తల అతని యింటిముంగిటియందు వచ్చి పడఁగా దానిని పట్టణమునందలి జనులు మంత్రులు మొదలగువారు చూచి తమరాజుతలయని తెలిసికొని రాజుభార్యలకుఁజెప్పఁగా ఆరాణులును వారిబిడ్డలును చుట్టములు మొదలయినవారును గుంపుగూడి యేడువసాగిరి అప్పుడు ఆరాజుకొడుకైన్న సుదక్షిణుఁడు అనువాఁడు తన తండ్రికి ఉత్తరక్రియలు యథావిధిగా నడపి పిమ్మట తమతండ్రిని జంపిన కృష్ణునిఁ జంపఁదలఁచి మిక్కిలినేర్పరియైన తనపురోహితుని పిలిచినవాఁడై అని తాత్పర్యము.




(*) కాశీరాజపుత్రుండగు సుదక్షిణుండు శివునిచేత వరంబు వడయుట. (*)

౪౭౨.—క॥ అతఁడునుదానును జనిపశు । పతి పదసరసిజములకును * బ్రమదముతో నా
నతుఁడై యద్దేవుని బహు । గతులం బూజింప నతఁడు * గరుణాన్వితుఁడై.

టీ॥ అతఁడును=ఆపురోహితుఁడును. (తానును చని) పశుపతిపదసరసిజములకున్=శివునిపాదకమలములకు. ప్రమదముతోన్ = సంతోషముతో. ఆనతుఁడై=మ్రొక్కినవాఁడై. (ఆద్దేవుని) బహుగతులన్ = అనేకవిధములచేత. పూజింపన్ = పూజచేయఁగా. అతఁడు=ఆశివుఁడు. కరుణాన్వితుఁడై=దయతోఁగూడుకొన్నవాఁడై.

తా॥ ఆపురోహితుఁడును తానును గూడిపోయి కాశిరాజుకొడుకు శివుని పాదకమలములకు భక్తితో నమస్కరించి అనేకవిధములఁబూజింపఁగా ఆశివుఁడును అనుగ్రహించినవాఁడైఅనితా.

౪౭౩.—క॥ మెచ్చితి వరమేమైనను । నిచ్చెద నను వేఁడుమనిన * నీశ్వర నన్నున్
మచ్చిక రక్షింతువు పార । పొచ్చెము సేయక మహేశ * పురహర యభవా.

టీ॥ మెచ్చితిన్=మెచ్చుకొన్నాను. (వరము) ఏమైనను = ఏదైనను. వేఁడుము = కోరుము. (ఇచ్చెదను) అనినన్ = అనఁగా. ఈశ్వర=సర్వనియామకుఁడవును. మహేశ = బ్రహ్మాదిదేవతలకు దేవుఁడవును. పురహర = త్రిపురములను హరించినవాఁడవునైన. అభవా=జన్మాదులులేనిశివుఁడా. (నన్ను) పారపొచ్చెముసేయక=ఉపేక్షింపక, మచ్చికన్=ప్రీతితో. రక్షింతువు=కాపాడుదువు.

తా॥ నిన్ను మెచ్చుకొన్నాను ఏవరము కోరినను ఇచ్చెదను కోరుము అనఁగా త్రిపురాసురులనుహరించినవాఁడవును,సర్వనియామకుఁడవును, మహాదేవుఁడవునైన ఓస్వామీ ! నీవు నన్ను ఏకాఁటలులేక కాపాడుచుందువు గదా అని తాత్పర్యము.

విశేషార్థము.

టీ॥ మహేశ = చతుర్దశేంద్రియాధి దేవతలైన బ్రహ్మ విష్ణు రుద్ర దేవేంద్రాదులకెల్ల దేవుఁడా. పురహర=స్థూల సూక్ష్మ కారణములనెడు త్రిదేహములనెడుత్రిపురములను నశింపఁజేసినవాఁడా-దేహత్రయాతీతుఁడా అనుట. శ్లో॥ ఉపాధిత్రితయాదన్య మాత్మానమవధారయేత్॥ అని ఆచార్యవాక్యము.

౫౭౪.—క॥ దేవా మజ్జనకుని వసు । దేవాత్మజుఁ డాజిలో వ * ధించెను నేనా
గోవిందుని ననిలోపల । నేవిధముగ గెల్తు నాన * తీవె పురారీ.

టీ॥ దేవా=స్వామీ. మజ్జనకునిన్=మాతండ్రిని. వసుదేవాత్మజుఁడు = కృష్ణుఁడు. ఆజిలోన్ = యుద్ధమునందు. వధించెన్ = చంపెను. పురారీ=ఓత్రిపురాసురులకు విరోధియగుస్వామీ. (నేను) ఆగోవిందునిన్=ఆకృష్ణుని. అనిలోపలన్ = యుద్ధమునందు. ఏవిధముగ గెల్తున్=ఏరీతిగా గెలుతును. ఆనతీవె = సెలవియ్యవయ్యా.

తా॥ ఓస్వామీ! మాతండ్రిని శ్రీకృష్ణుఁడు యుద్ధమునందుఁజంపినాఁడు అతనిని నేను యుద్ధములోనే చంపవలెను అందులకు ఉపాయము సెలవియ్యవయ్యా అని తాత్పర్యము.

౫౭౫.—తే॥ అనిన శంకరుఁ డతనికి * ననియె ననఘ । నీవు ఋత్విజులును భూసు * రావళియును
బ్రీతి నభిచార మొనరింప * భూతయుక్తుఁ । డగుచు ననలుండు దీర్చు నీ * యభిమతంబు.

టీ॥ అనినన్=అనియడుగఁగా. శంకరుఁడు = శివుఁడు. అతనికిన్=ఆకాశిరాజుకొడుకుతో. అనియెన్=ఇట్లుపలికెను. అనఘా= ఓరిపాపములేనివాఁడా. (నీవును) ఋత్విజులును=యాజ్ఞికులును. భూసురావళియును=బ్రాహ్మణసమూహమును. ప్రీతిన్=సంతోషముతో. అభిచారము=మారణహోమమును. ఒనరింపన్=చేయఁగా అనలుండు=అగ్నిహోత్రుఁడు. భూతయుక్తుఁడు=భూతములతోఁ గూడుకొన్నవాఁడు. (అగుచును) నీయభిమతంబు = నీకోరికను. తీర్చున్=నెఱవేర్చును.

తా॥ అని కాశిరాజుకొడుకు వేఁడుకొనఁగా శివుఁడు అబ్బీ! నీవును నీయాజ్ఞికులును తక్కినబ్రాహ్మణులును గూడుకొని అభిచారహోమమును చేసినపక్షమున అగ్నిహోత్రుఁడు బేతాళాది భూతములతోఁ గూడుకొన్నవాఁడై వచ్చి నీకోరిక నెఱవేర్చునని చెప్పెనని తాత్పర్యము.






(*) సుదక్షిణుఁడు హోమకుండంబునంబుట్టిన కృత్తి కృష్ణునిమీఁదికిఁ బంపుట. (*)

౫౭౬.—తే॥ అనిన నాచంద్రమౌళి వా * క్యముల భంగి । భూరినియమముతో నభి * చార హోమ
మొనరఁ గావింప నగ్ని య * థోచితముగఁ । జెలఁగి దక్షిణ వలమాన * శిఖల వెలిఁగె.

టీ॥ అనినన్ = అని శివుఁడు సెలవియ్యఁగా. ఆచంద్రమౌళి వాక్యములభంగిన్=ఆశివునిమాటలపద్ధతిని. భూరినియమముతోన్= అధికనిష్ఠతో. అభిచారహోమము=మారణహోమము. ఒనరన్= ఒప్పునట్లు. కావింపన్=చేయఁగా. (అగ్ని) యథోచితముగన్=

తగునట్లు. చెలఁగి=విజృంభించి. దక్షిణవలమానశిఖలన్=ప్రదక్షిణముగా తిరుగుచున్న మంటలచేత. వెలిఁగెన్=ప్రకాశించెను.

తా॥ అనిశివుఁడు అనతియ్యఁగా ఆయనమాటచొప్పునమిక్కిలి నియమముతో అభిచారహోమమును కాశిరాజుకొడుకు చేసెను అందువలన అగ్ని చక్కగా విజృంభించి ప్రదక్షిణముగా తిరుగుచున్న మంటలతో ప్రకాశించెను అని తాత్పర్యము.

వ॥ అందుఁ దామ్రశ్మశ్రుకేశకలాపంబు, నశని సంకాశంబులైన నిడుదకోఱలును,నిప్పులుప్పతిల్లు చూపులును, ముడివడుబొమలును, జేవురించుమొగంబును గలిగి, యతిరౌద్రాకారంబునం బ్రజ్వరిల్లుచుఁ, గుండంబు వెలువడి, దైనందిన నిహన్యమాన ప్రాణిరక్తారుణ మృత్యుకరవాలంబులీలం జూపట్టు నాలుక సెలవులనాకుచు, నగ్నికీలాభీలంబగు శూలంబు కేలందాల్చి,భువనకోలాహలంబుగా నార్చుచు, నుత్తాలతాలప్రమాణపాదద్వయహతులం దూలు పెంధూళి నింగిగ్రిమ్మఁగ,భూతంబులు సేవింప,నగ్నవేషయై నిజవిలోచనసంజాత సముద్ధూత నిఖిలభయంకర జ్వాలికాజాలంబుల స్వజాలంబులోలిం బ్రేల్చుచు, నుద్వేలగగనగమనంబున నగధరనగరంబున కరుగుదేరఁ, బౌరజనంబులు భయాకులమానసులై దావదహనునింగని పఱచు వనమృగంబులచాడ్పునంబఱచి,సుధర్మాభ్యంతరంబున జూదంబాడు దామోదరుంగని రక్షరక్షేత్యార్తరవంబులం గృష్ణకృష్ణ పెనుమంటలం బురంబుగాల్పం బ్రళయాగ్ని చనుదెంచె ననువారింజూచి, మీరోడకుండుఁడని భయంబు నివారించి, సర్వరక్షకుండైన పుండరీకాక్షుండు జగదంతరాత్ముండు గావునఁ దద్వృత్తాంతంబంతయుఁ దనచిత్తంబున నెఱింగి, కాశీరాజపుత్రప్రేరితమైన యమ్మహాకృత్తిని నిగ్రహింపందలంచి,నిజపార్శ్వవర్తియైయున్న యద్దివ్యసాధనంబుఁగనుంగొనియప్పుడు.

టీ॥ అందున్=ఆవెలుఁగుచున్నఅగ్నియందు. తామ్రశ్మశ్రుకేశకలాపంబును—తామ్ర=ఎఱ్ఱనైన. శ్మశ్రు=గడ్డమీసములును. కేశ=తలవెండ్రుకలయొక్క. కలాపంబును = సమూహమును. అశనిసంకాశంబులు = వజ్రాయుధమును బోలినవి. ఐననిడుదకోఱలును = అయిన నిడుపాటి వంకరప్రక్కపండ్లును. ( నిప్పులు ) ఉప్పతిల్లు= పుట్టుచున్న — రాలుచున్న. (చూపులును) ముడివడుబొమలును = ముడివేసినట్టు తోఁచుచున్న కనుబొమ్మలును. జేవురించుమొగంబును = ఎఱ్ఱవాఱినముఖమును. (కలిగి) అతిరౌద్రాకారంబునన్= మిక్కిలి ఉగ్రమయిన ఆకారముతో. ప్రజ్వరిల్లుచున్=వెలుఁగుచు. గుండంబువెలువడి=అగ్నికుండమునందుండి బయటికివచ్చి. దైనందిన ...లీలన్—దైనందిన=దినదినమునగుప్రళయసమయమునందు. నిహన్యమాన=చంపఁబడుచున్న. ప్రాణి=జీవులయొక్క. రక్త=నెత్తుటిచేత. అరుణ = ఎఱ్ఱనైన. మృత్యు = చంపెడుదేవతయొక్క. కరవాలంబులీలన్=కత్తివలె. చూపట్టునాలుకన్=కానవచ్చునట్టినాలుకతో. సెలవులన్=నోటిపార్శ్వభాగములను. నాకుచున్ = నాకుకొనుచు. అగ్నికీలాభీలంబు = నిప్పుమంటవలె భయంకరమయినది. అగుశూలంబు = అగునట్టిశూలాయుధము. కేలన్ = చేతియందు. తాల్చి=ధరించి. భువనకోలాహలంబుగాన్=లోకమునందెల్లను కలకలధ్వని కలుగునట్టుగా. ఆర్చుచున్=కేకలువేయుచు. ఉత్తాల...హతులన్—ఉత్తాల=మిక్కిలిపొడవైన. తాల=తాటిచెట్టుయొక్క. ప్రమాణ = కొలఁదిగల. పాదద్వయ = రెండుకాళ్లయొక్క. హతులన్=దెబ్బలచేత. తూలుపెంధూళి = ఎగయుచున్నమిక్కుటమగుదుమ్ము. నింగిన్=ఆకాశమును. క్రిమ్మఁగన్ = కమ్ముకొనఁగా. భూతంబులు=బేతాళాదిభూతములు. సేవింపన్=కొలువఁగా.నగ్నవేషయై=దిసమొలతోడి యలంకారముగలదై. నిజ...లంబులన్—నిజ=తనదైన. విలోచన = కన్నులందుండి. సంజాత=పుట్టి. సముద్ధూత=మీఁదికెగయుచున్న. నిఖిల = సమస్తలోకమునకు. భయంకర=భయమును కలుగఁజేయునట్టి. జ్వాలికా = మంటలయొక్క. జాలంబులన్=సముదాయములచేత. స్వజాలంబులు=తనమాయలను. ఓలిన్=క్రమముగా. ప్రేల్చుచున్ = ప్రేలఁజేయుచు—వ్యాపింపఁజేయుచు. ఉద్వేల...గమనంబునన్—ఉద్వేల=మిక్కిలి అధికమైన. గగన=ఆకాశమునందలి. గమనంబునన్=నడకచేత. నగధరనగరంబునకున్=శ్రీకృష్ణుని పట్టణమునకు. అరుగుదేరన్ = రాఁగా. పౌరజనంబులు = పట్టణములోనిమనుష్యులు. భయాకులమానసులై = భయముచేత కలఁతనొందిన మనసులుగలవారై. దావదహనునిన్= కార్చిచ్చును. కని = చూచి. పఱచువనమృగంబులచాడ్పునన్ = పాఱిపోవునట్టి అడవిమృగములవిధమున. పఱచి=పరుగెత్తి. సుధర్మాభ్యంతరంబునన్=సుధర్మయనుసభనడుమ. జూదంబాడుదామోదరున్=జూదమాడుచున్న శ్రీకృష్ణుని. (కని) రక్షరక్షేత్యార్తరవంబులన్=రక్షింపుము రక్షింపుము అను దుఃఖవచనధ్వనులతో. కృష్ణకృష్ణ=ఓయికృష్ణుఁడఓయికృష్ణుఁడ. పెనుమంటలన్=పెద్దమంటలచేత. పురంబు=పట్టణమును. కాల్పన్ = కాల్చుటకొఱకు. ప్రళయాగ్ని = ప్రళయకాలపునిప్పు. చనుదెంచెను = వచ్చెను. అనువారిన్=అనునట్టియాజనులను. (చూచి మీరు) ఓడక=భయపడక. ఉండుండని = ఉండుఁడు అనిచెప్పి. భయంబు=భయమును. నివారించి=పోఁగొట్టి. సర్వరక్షకుండు=సమస్తమును రక్షించువాఁడు. అయినపుండరీకాక్షుండు = అయినట్టి శ్రీకృష్ణుఁడు. జగదంతరాత్ముండు=లోకమునకులోపలనుండుపరమాత్ముఁడు. కావునన్= కనుక. తద్వృత్తాంతంబు = ఆవర్తమానము. అంతయున్=సమస్తమును. తనచిత్తంబునన్=తనమనసులో. ఎఱింగి=తెలిసికొని. కాశిరాజపుత్రప్రేరిత = కాశిరాజుకొడుకుచేత ప్రేరేపింపఁబడినది. అయినయమ్మహాకృత్తిని=ఆయినట్టి ఆగొప్పకృత్తిని. (కృత్తి)కృత్య=శత్రుసంహారార్థముగా అందులకుఁదగిన మంత్రములచేత హోమము వేల్వఁగా ఆహోమమువలనఁబుట్టు క్షుద్రదేవత. నిగ్రహింపన్=తిరస్కరింప—అణఁచివేయుటకు. తలంచి=ఎంచి. నిజపార్శ్వవర్తి=తనవెంబడినుండునది. (అయియున్న) అద్దివ్యసాధనంబున్=అప్రాకృతమయిన ఆయుత్తమసాధనమును — చక్రమును. కనుంగొని = చూచి. (అప్పుడు)

తా॥ అట్లు వెలుఁగుచున్న హోమకుండమునుండి ఎట్టనివెండ్రుకలుగలదై వజ్రాయుధమువలె వాఁడులైననిడుపాటికోఱపండ్లును, నిప్పులు కురియుచున్న యెఱ్ఱపాటిన కన్నులును, ముడి పెట్టినట్టు కానవచ్చు కనుబొమ్మలును, ఎఱ్ఱగా కనఁబడుచున్న మొగమును కలిగినదై మిక్కిలి ఉగ్రమయిన ఆకారముతో వెలుఁగుచు ఒకకృత్య పుట్టి దినప్రళయమప్పుడు చంపఁబడినప్రాణులనెత్తుటిచేత ఎఱ్ఱగానున్న మృత్యుదేవతయొక్క కత్తియో అనునట్లు కనఁబడు నాలుకను చాఁచి నోటిపార్శ్వభాగములను నాకుకొనుచు అగ్నిజ్వాలవలెనే వెలుఁగుచున్న శూలాయుధమును చేతఁబట్టుకొని అనేకములయిన భూతములు తన్ను కొలిచిరాఁగా తనకాలి తాఁకుడుచేత భూమియందుండియెగయుదుమ్ము ఆకాశమును ఆవరించుచుండఁగా తనకన్నులనుండి పుట్టుచున్న అగ్నిజ్వాలలు తనయొక్కజాలవిద్య మహిమను అతిశయింపఁజేయుచుండఁగా దిక్సమూలముతో ఆకాశమార్గమున బయలుదేఱి ద్వారకాపట్టణమునకు రాఁగా దానిని జూచి ఆపట్టణములోని జనులందఱు భయపడి కార్చిచ్చును జూచి పరుగెత్తిపోవునట్టి మృగములవలె మిగుల వడిగా పరుగెత్తిపోయి సుధర్మ అను పేరుగల సభా మండపమునందు జూదమాడుచుఁ గూర్చున్న శ్రీకృష్ణునిఁ జూచి ఓకృష్ణా! మమ్ము రక్షింపుము రక్షింపుము అనుచు స్వామీ! ప్రళయకాలపునిప్పు మమ్మెల్లను కాల్పవచ్చుచున్నది దీనినిచల్లార్ప జిత్తగింపుము అనుచు మొఱపెట్టుకొనఁగాఁ జూచి కృష్ణుఁడు లోకమునకు అంతరాత్మయైనపరమాత్ముఁడుకనుక అది కాశిరాజుకొడుకు పంపిన కృత్యయని తెలిసికొని దాని నణఁచి వేయఁదలఁచి తనప్రక్కను వెలుఁగుచున్న చక్రాయుధమునుజూచి అని తాత్పర్యము.

౪౭౮.—సీ॥ భీమమై బహుతీవ్ర * ధామమై హతరిపు - స్తోమమై సుమహితో * ద్దామమగుచుఁ
జండమై పిహితమా * ర్తాండమై పాలితా - జాండమై విజయప్ర * కాండమగుచు
దివ్యమై నిఖిలగం * తవ్యమై సుజన సం - భావ్యమై సద్భక్త * సేవ్యమగుచు
నిత్యమై నిగమ సం * స్తుత్యమై వినమితా - దిత్యమై నిర్జిత * దైత్య మగుచు
తే॥ విలయ సమయ సముద్ధూత * విపుల భాస్వ । దళికలోచన రోచనా * నల సహస్ర
ఘటిత పటుసటాజ్వాలికా * చటులసత్వ । భయదచక్రంబుఁ గృత్తిపైఁ * బంపె శౌరి.

టీ॥ భీమమై=భయంకరమై. బహుతీవ్రధామమై = మిక్కిలి వేండ్రమునకు ఉనికిపట్టై. హతరిపుస్తోమమై=చంపఁబడిన శత్రువుల గుంపులుగలదై. సుమహితోద్దామము = మంచిమహిమచేత అడ్డము లేనిది.(అగుచును)చండమై=కోపరూపమయి.పిహితమార్తాండమై= కమ్మఁబడిన సూర్యుఁడుగలదై. పాలితాజాండమై=రక్షింపఁబడిన బ్రహ్మాండముగలదై.విజయప్రకాండము=గెలుపుమేలిమిగలది.(అగుచును) దివ్యమై=అప్రాకృతమై. నిఖిలగంతవ్యమై = ఎల్లచోట్లకుఁ బోఁదగినదై. సుజనసంభావ్యమై=సజ్జనులచేత గౌరవింపఁదగినదై. సద్భక్తసేవ్యము=అనన్యభక్తిగలవారిచేత సేవింపఁబడునది. (అగుచును)నిత్యమై=శాశ్వతమై. నిగమసంస్తుత్యమై=వేదములందుఁగొనియాడఁదగినదై. వినమితాదిత్యమై=మ్రొక్కుచున్న దేవతలుగలదై. నిర్జితదైత్యము=జయింపఁబడినరాక్షసులుగలది. (అగుచును) విలయసమయ...చక్రంబు—విలయసమయ = ప్రళయకాలమునందు. సముద్ధూత=చక్కగాఎగయఁజేయఁబడిన. విపుల=విరివిగల.భాస్వత్= ప్రకాశించుచున్న. అళికలోచన=శివునినొసటికంటివలని.రోచన= మండుచున్న. అనల=అగ్నులయొక్క. సహస్ర = వేయింటిచేత. ఘటిత=కూర్పఁబడిన. పటు=దృఢమైన. సటా=జూలు ఆనెడు— జడలనెడు. జ్వాలికా = మంటలచేత. చటుల = క్రూరమలైన. సత్వ=ప్రాణులకు.భయద=భయమునిచ్చునట్టి.చక్రంబుఁ=చక్రాయుధమును.కృత్తిపైఁ=ఆకృత్తిమీఁదను.శౌరి=కృష్ణుఁడు(పంపెను)

తా॥ భయంకరమై మిక్కుటమగు తాపమునకు ఉనికిపట్టయి శత్రుసమూహమును చంపునదియు, మిక్కిలిమహిమగలదియు, కోపస్వరూపమయినదియు, సూర్యబింబమును క్రిందుపఱుచునట్టి తేజస్సు గలదియు, బ్రహ్మాండమునెల్ల రక్షించునదియు, గెలుపునుపొందుటచేత శ్లాఘ్యమయినదియు, అప్రాకృతమయినదియు, ఎల్లయెడలకుఁబోఁజాలినదియు, సజ్జనులచేత సేవింపఁదగినదియు, మంచి భక్తులచేత కొలువఁదగినదియు, శాశ్వతమైనదియు, వేదములందు కొనియాడఁదగినదియు, దేవతలచేత మ్రొక్కఁదగినదియు, ఎల్ల రాక్షసులను ఓడఁగొట్టినదియు, ప్రళయకాలమునందు మిక్కిలి వ్యాపింపఁజేయఁబడిన శివుని నొసటికంటిమంటలను మీఱిన జ్వాలలనెడు జడలచేత ఎల్లప్రాణులకు భయమును బుట్టించునదియునైన సుదర్శనచక్రమును ఆకృత్తిమీఁద ప్రయోగించెనని తాత్పర్యము.

వ॥ అదియును బ్రళయవేళా సంభూత జీమూత సంఘాత ప్రభూత ఘుమఘుమాటోప నినదాధరీకృతాతిదుస్సహ కహకహ నిబిడ నిస్వన నిర్ఘోష పరిపూరిత బ్రహ్మాండకుహరంబు, నభ్రంలిహ కీలాసముత్కట పటుచిటచిట స్ఫుటస్ఫుట స్ఫులింగ చటాభీలంబును, సకలదేవతాగణ జయ జయ శబ్ద కలితంబు, ననంత తేజోవిరాజితంబును, నగుచుఁ గదిసినం బంటింపక కంటగించు కృత్తిని వెంటి వెంట నంటిన నది తనతొంటిరౌద్రంబు విడిచి మగిడి కాశీపురంబు సొచ్చి పౌరలోకంబు భయాకులతం బొంది వాపోవ రోషభీషణాకారంబుతో నప్పుడు బుఱ్ఱిజ్ఞికాయ యుతంబుగా సుదక్షిణుని దహించె నత్తఱిఁజక్రంబును దన్నగర సౌధ ప్రాకార గోపురాట్టాలకాదివివిధ వస్తువాహన నికరంబులతో భస్మంబు గావించి మరలి యమరులు వెఱఁగందఁ గమలలోచను పార్శ్వవర్తియై నిజప్రభా పుంజంబు వెలుఁగొందఁ గొల్చి యుండెనని చెప్పి మఱియు నిట్లనియె.

టీ॥ అదియును=ఆచక్రమును. ప్రళయ...రంబును = ప్రళయ వేళా=ప్రళయకాలమునందు. సంభూత=పుట్టిన. జీమూత=మేఘములయొక్క. సంఘాత=సమూహమునందు. ప్రభూత=పుట్టినట్టి. ఘుమఘుమ = ఘుమఘుమయనెడు. ఆటోప = విజృంభణముగల. నినద=ధ్వనిని. అధరీకృత = క్రిందుపఱుచుచున్న. అతిదుస్సహ = మిక్కిలిసహింపరాని. కహకహ=కహకహయనెడు. నిబిడ=నిండుకొన్న. నిస్స్వన=ధ్వనియొక్క. నిర్ఘోష=మ్రోఁతచేత. పరిపూరిత=అంతటనిండింపఁబడిన. బ్రహ్మాండ = బ్రహ్మాండమనెడు. కుహరంబును=బిలముగలదియును. అభ్రంలిహ...భీలంబును=అభ్రంలిహ=ఆకాశమునారయుచున్న. కీలా=మంటలచేత. సముత్కట=అతిశయించిన. పటు=పరుషములైన—వేండ్రములైన. చిటచిట=చిటచిటయనునవియు. స్ఫుటస్ఫుట=స్ఫుటస్ఫుట యనునవియునైన. స్ఫులింగ=మిడుఁగుఱులయొక్క. ఛటా = సమూహముచేత. అభీలంబును=భయంకరమైనదియు. సకల...బును—సకల=సమస్తమైన. దేవతాగణ=దేవతలసమూహముయొక్క. జయజయ = జయింపుముజయింపుముఅనెడు. శబ్ద=ధ్వనులచేత. కలితంబును=కూడినదియు. అనంత తేజోవిరాజితంబును=కొలఁదిపెట్టఁగూడని తేజస్సుచేత ప్రకాశించునదియు. (ఆగుచు) కదిసినన్=మిక్కిలిదగ్గఱపోఁగా. పంటింపక=వెనుదీయక. కంటగించుకృత్తిన్=కోపముతో ఎదిరించునట్టికృత్తిని. గెంటి=లోలఁగఁద్రోసి. వెంటనంటినన్=వెంబడింపఁగా. (అది) తనలోంటిరౌద్రంబు = తనయొక్క మునుపటిభయంకరత్వమును. విడిచి=వదలి. మగిడి=మరలి. (కాశీపురంబుసొచ్చి) పౌరలోకంబు=పురజనులసమూహము. భయాకులతన్ = వెఱపువలని కలఁతపాటును. (పొంది) వాపోవన్ = మొఱపెట్టఁగా. రోషభీషణాకారంబులోన్=కోపముతోడిభయంకరస్వరూపముతో. (అప్పుడు) ఋత్విజ్నికాయయుతంబుగాన్=యజ్ఞము చేయించువారిగుంపుతోఁ గూడ. (సుదక్షిణుని) దహించెన్=కాల్చెను. అత్తఱిన్=ఆసమయమునందు. (చక్రంబును) తన్నగర...నికరంబులతోన్—తన్నగర=ఆపట్టణమునందలి. సౌధ = మేడలు. ప్రాకార = కోటలు. గోపుర = గోపురములు. అట్టాలక=బురుజులమీఁదియిండ్లు. ఆది = మొదలుగాఁగల. వివిధ=నానావిధములైన. వస్తు=పదార్థములయు. వాహన=రథములయు గుఱ్ఱములయు ఏనుఁగులయు. నికరంబులతోన్ = సమూహములతో. భస్మంబుగావించి=బూడిదచేసి. మరలి = తిరిగి. అమరులు=దేవతలు. వెఱఁగు=ఆశ్చర్యము. అందన్=పొందఁగా. క్షమలలోచనపార్శ్వవర్తియై=కృష్ణునిప్రక్కనుచేరివర్తించునదియై. నిజప్రభాపుంజంబు=తనకాంతిసమూహము. వెలుఁగొందన్=ప్రకాశింపఁగా. కొల్చియుండెన్=సేవించుచుండెను. (అనిచెప్పి మఱియు నిట్లనియె)

తా॥ ఆచక్రమును ప్రళయకాలమునందలి మేఘములు ఉఱుమునట్టిధ్వనిని మించినధ్వనితో భూమ్యాకాశముల ఆవరించుచు, ఆకాశమును ఒరయుమంటలవలననుండి చిట చిటధ్వనులతో ఎగయు మిడుఁగుఱులచేత భయంకరమయి ఎల్లదేవతలచేతనుకొనియాడఁబడునదియు అధిక తేజస్సుచేత వెలుఁగునదియునై ఆకృత్తిని అడ్డగించి అది యెదురుకొని పోరాడరాఁగా దాని వేండ్రము నణఁచి అదిమరలిపోఁగా దానివెంబడించి తఱుముకొనిపోయెను, ఆకృత్తియు చక్రము తన్నువెంబడించి తఱుముకొనిరాఁగా కాశీపట్టణమునకుఁబోయి అందు ఋత్విక్కులతోఁగూడ యజ్ఞవేదికయొద్ద కూర్చుండియున్నసుదక్షిణుని ఋత్విక్కులనుకాల్చి భస్మముచేసెను చక్రమును ఆపట్టణముయొక్క మేడలు కోటలు కొత్తళములు మొదలైనవానినన్నిటిని మొదలంటనాశముచేసి మరలవచ్చి శ్రీకృష్ణమూర్తిప్రక్కను మిక్కిలి తేజస్సులతో వెలుఁగొందుచుండెను అనిచెప్పి శుకమహర్షి మఱియు నేమోచెప్పెను అని తాత్పర్యము.

౫౪౦.—క॥ మురరిపు విజయాంకితమగు । చరితము సద్భక్తిఁ దగిలి ✻ చదివిన వినినన్
దురితములఁబాసి జనులిహ । పరసౌఖ్యము లతనిచేతఁ ✻ బడయుదు రధిపా.

టీ॥ అధిపా=రాజా, మురరిపువిజయాంకితము=కృష్ణునిజయముచేత గుఱుతిడఁబడినది. అగుచరితమున్=అగునట్టికథను. జనులు=మనుష్యులు. సద్భక్తిన్=మంచిప్రీతితో. తగిలి=ఆసక్తులై. (చదివినను వినినను) దురితములన్=పాపములను. పాసి=వదలి. ఇహపర సౌఖ్యములు=ఈలోకమునందలివి పరలోకమునందలివియునైనసుఖములను. అతనిచేతన్=ఆకృష్ణునివలన. పడయుదురు=పొందుదురు.

తా॥ ఓరాజా! కృష్ణునిజయములను దెలుపునట్టి యిట్టికథలను ఆసక్తితో వినువారును చదువువారునైన జనులకు ఆశ్రీకృష్ణమూర్తి అనుగ్రహమువలన ఇహపరములందు సౌఖ్యమును పొందుదురని తా.

వ॥ అనిన శుకయోగికి రాజయోగి యిట్లనియె.

టీ॥ అనినన్=అనఁగా, శుకయోగికిన్=శుకమహర్షితో. రాజయోగి=రాజర్షియైన పరీక్షిన్మహారాజు. (ఇట్లనియెను)

౫౪౧.—క॥ బలభద్రుఁ డప్రమేయుం । డలఘుఁ డనంతుండు నతని ✻ యద్భుత కర్మం
బులు వినియుఁ దనియ దింకను । దెలియఁగ నాకానతిమ్ము దివ్య మునీంద్రా.

టీ॥ దివ్యమునీంద్రా=ఓమునిశ్రేష్ఠుఁడా! బలభద్రుఁడు = బలరాముఁడు. అప్రమేయుండు=మిక్కిలి అధికుఁడు. అలఘుఁడు = గౌరవముగలవాఁడు. అనంతుఁడు = అంతములేనివాఁడు. అతని యద్భుతకర్మంబులు=ఆయనచేసిన అపురూపపుపనులు, (వినియును) తనియదు=తృప్తికలుగదు. (ఇంకను) తెలియఁగన్=విశదమగునట్లు. (నాకు) ఆనతిమ్ము=చెప్పుము.

తా॥ ఓశుకమహర్షీ! బలరాముఁడు మిక్కిలి గొప్పవాఁడు, అలక్ష్యము చేయఁదగనివాఁడు, అంతము లేనివాఁడును గనుక ఆయన చరిత్రములు వినియు నాకు తృప్తి కలుగకయున్నది కనుక ఆబలరాముని అపురూపములయిన పనులను కొన్నిటిని నాకు తెలియఁజేయుమని తాత్పర్యము.

వ॥ అనిన రాజునకు శుకుం డట్లనియె.

## (*) బలరాముఁడు ద్వివిదుఁడను వానరుని సంహరించుట. (*)

క॥ జననాయక విను సుగ్రీ
వుని సచివుఁడు మైందునకు స * హోదరుఁ డనఁగా
వినుతికి నెక్కిన ద్వివిదుం
డను ప్లవగుఁడు నరకసఖ్యుఁ * డతి దర్పితుఁడై.



టీ॥ జననాయక = రాజా. విను = నీవువినుము. సుగ్రీవునిసచివుఁడు=సుగ్రీవుఁడనువానికి మంత్రియైనవాఁడును. మైందునకున్=మైందుఁడు అనువానికి. సహోదరుఁడు=తోడఁబుట్టినవాఁడును. (అనఁగా) వినుతికెక్కిన=ప్రొగడ్తనువహించిన. (ద్వివిదుండు) అను ప్లవగుఁడు=అనుపేరుగలవానరుఁడు. నరకసఖ్యుఁడు=నరకాసురునికి చెలికాఁడు. అతిదర్పితుఁడై=మిక్కిలి మదించినవాఁడై.

తా॥ ఓరాజా! సుగ్రీవునికి మంత్రియు, మైందునికి తోడఁబుట్టినవాఁడునైన ద్వివిదుఁడు అనువానరుఁడు నరకాసురునికిచెలికాఁడు కనుక వాఁడు మిక్కిలి క్రొవ్వినవాఁడై అని తాత్పర్యము.

### వి శే షా ర్థ ము.

టీ॥ సుగ్రీవునకున్=మంచికంఠముగలవానికి. ని॥కంఠో వాచక శబ్దేస్యాత్సన్నిధానేగళేధ్వనా॥ అనునిఘంటువునుపట్టియిచ్చటకంఠ మనఁగా, కంఠధ్వనిగనుక (సర్వంఖల్విదంబ్రహ్మ, బ్రహ్మైవాహమిదం జగచ్చసకలం, చిదేవభువనత్రయం) అను మహావాక్యములు పలుకునప్పటి కంఠధ్వనిగలబ్రహ్మవేత్త – అట్టిబ్రహ్మవేత్తకు. సచివునకున్=మంత్రియైనవాఁడును–బ్రహ్మవేత్తమనస్సుసన్మార్గమునసే ప్రవర్తించుననుట. మైందునకున్=అహంకారునకు. నరకసఖ్యుఁడు= అధోగతిపాలగువానికి స్నేహితుఁడును. ద్వివిదుఁడు = జగత్తువేఱు బ్రహ్మమువేఱు అని రెండువిధములుగ తెలిసికొన్నవాఁడు. ప్లవగుఁడు = ప్లవోలంఘనంతేనగచ్ఛతిప్లవగః, గముల్ గతౌ, దాఁటునది–అనఁగా, శ్లో ॥ క్షణంవహతిపాతాళే క్షణంవహానభస్థలే। క్షణంవహతిదిక్చక్రే మనోచరతిమర్కటః॥ అను ప్రమాణముచేత ప్లవగమనఁగా విషయచాంచల్యములలోఁ జిక్కి అంతటఁదిరుగు మూఢమనస్సుఅదిగల అజ్ఞాని.

౫౮౩.—సీ॥ చెలికాని పగఁదీర్పఁ * దలఁచి కృష్ణుండేలు - పురములు జనపదం * బులు దహించి
సరి దుపవన సరో * వరములు గోరాడి - మందలఁ గొందల * మందఁ జేసి
ప్రాసాదములు ద్రొబ్బి * పరిఘలు మాయించి - చతురంగ బలముల * సమయఁజేసి
పురుషుల సతులను * భూధర గుహలలోఁ - బెట్టి వాకిలి గట్టి * బిట్టు నొంచి

తే॥ ఫలిత తరువులఁ ద్రుంచి సా * ధుల నలంచి। కోటలగలించి పడుచుల * నీటముంచి
ధరణి నిబ్బంగిఁ బెక్కుబా * ధల నలంచి। పఱవఁజేయుచు నొకనాఁడు * ప్లవగవరుఁడు.

టీ॥ చెలికానిపగన్ = స్నేహితుఁడైన నరకాసురుని పగను. తీర్పన్=తీర్చుటకు. తలఁచి=ఎంచి. (కృష్ణుండు) ఏలు = పాలించునట్టి. పురములు = పట్టణములును. జనపదంబులు = దేశములును. దహించి=కాల్చి. సరిదుపవనసరోవరములు=ఏళ్లుఉద్యానవనములు కొలఁకులును. కోరాడి=మట్టిత్రవ్వియొగఁజల్లి. మందలన్=ఆవుల గుంపులను. కొందలమందన్=బాధనుపొందునట్లు.(చేసి) ప్రాసాదములు=రాజగృహములను. ద్రొబ్బి=పడఁగొట్టి. పరిఘలు=అగడ్తలను. మాయించి=పూడ్చి. చతురంగబలములన్ = రథగజతురగపదాతులు అనెడునాలుగుఅంగముల సేనలను. సమయఁజేసి=చంపి. పురుషులన్=మగవారిని. సతులన్ = ఆఁడువారిని. భూధరగుహలలోన్=కొండగవులలో. పెట్టి=ఎత్తుకొనిపోయి ఉంచి. వాకిలి= ఆగుహలవాకిళ్లు. కట్టి=మూసి. బిట్టు=మిక్కిలి. నొంచి=బాధించి. ఫలితతరువులన్=పండినవృక్షములను. త్రుంచి=విఱిచి. సాధులన్= యోగ్యులగువారిని. అలంచి=శ్రమపెట్టి. కోటలు=ప్రాకారములను. అగలించి=పడఁగొట్టి. పడుచులన్=పసివారిని. నీటముంచి=నీళ్లలో ముంచి. ధరణిన్=భూమిని. ఇబ్బంగిన్ = ఈవిధముగా. పెక్కుబాధలన్=బహువిధబాధలచేత. అలంచి = శ్రమపెట్టి. పఱవఁజేయుచున్ = దుఃఖముపడునట్లుచేయుచు. (ఒకనాఁడు) ప్లవగవరుఁడు=ఆవానరశ్రేష్ఠుఁడు.

తా॥ అట్లుద్వివిదుఁడుతనస్నేహితుఁడైన నరకాసురునికృష్ణుఁడు చంపినందున వానిపగదీర్పఁదలఁచినవాఁడై కృష్ణుఁడు ఏలుచుండునట్టి దేశములలో ప్రవేశించి పట్టణములను పాడుచేయుచు రాజుల నగళ్లను పాడుచేసి కోటలను ఇడియఁగొట్టి అగడ్తలనుపూడ్చి ఏళ్లు కాలువలు ఉద్యానవనములు సరోవరములు కళఁతపెట్టి ఆఁడువారిని మగవారిని దీసికొనిపోయి కొండగుహలలోఁబెట్టి ఆగుహల వాకిళ్లుమూసి బాధించియు పండ్లుపండిన చెట్లనువిఱిచి యోగ్యులగు

వారిని మర్దించియు ఈవిధముగా భూమినంతయు బహుబాధలచేత శ్రమపెట్టుచు ఒకనాఁడు ఆవానరుఁడు ఏమిచేసెను అనఁగా అని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ కృష్ణుఁడు = బ్రహ్మవేత్త — అతనిచేత రక్షింపఁబడునట్టి విజ్ఞానభూమికలు మొదలగునవి. వానరుఁడు=మనస్సు.

౫౮౩.—క॥ చతుర మృదుగీత రవము । న్నతి వీతెంచినఁ జెలంగి * నగచరుఁ డారై
వతగిరి కందరమున కా । యతగతిఁ జని యందు నెత్త * మాడెడు వానిన్.

టీ॥ చతురమృదుగీతరవము=మనోజ్ఞమైన తిన్ననిపాటయొక్క ధ్వని. ఉన్నతిన్=మేలిమిగా. వీతెంచినన్ = వినఁబడఁగా. నగచరుఁడు=ఆవానరుఁడు. చెలంగి=సంతోషించి. (ఆరైవతగిరి) కందరమునన్=గుహకు. ఆయతగతిన్=వడిగలనడతో(చని)అందున్= ఆగుహయందు. నెత్తమాడెడువానిన్=సొగటాలాడుచున్నవానిని.

తా॥ మిక్కిలి మనోజ్ఞమయిన తిన్ననిపాట సవ్వడివినఁబడఁగా ఆపాట వినఁబడిన రైవత పర్వత గుహకు వడిగా పోయి అచ్చట సొగటాలాడుచున్న బలరాముని అని తాత్పర్యము.

౫౮౪.—చ॥ లలిత వినీలవస్త్రుని వి * లాసవతీయుతుఁ జంద్ర చంద్రికా
కలిత మహోన్నతాంగు మణి * కాంచన దివ్య విభూషణోన్నతున్
విలసిత వారుణీ సమద * విహ్వల లోచనుఁ గాంచె సీర ని
ర్దళిత రిపుక్షితీశ నిజ * ధాముని రామునిఁ గామపాలునిన్.

టీ॥ లలితవినీలవస్త్రునిన్=మనోజ్ఞమయిన నల్లని వస్త్రముగలవానిని. విలాసవతీయుతున్ = విలాసవతులయిన స్త్రీలతోఁ గూడుకొన్నవాని.చంద్ర...అంగున్—చంద్ర=చంద్రునియొక్క.చంద్రిక=వెన్నెలతోడ. కలిత = కూడిన. (అనఁగా తెల్లనైన) మహోన్నతాంగున్ = గొప్పదయిన దేహముగలవానిని. మణికాంచనదివ్యవిభూషణోన్నతున్—మణి=రత్నములచేతనైన. కాంచన=బంగారుమయములైన.దివ్య=అప్రాకృతములైన.విభూషణ=అభరణములచేత ఉన్నతున్=అధికుఁడైనవానిని.విల...చనున్—విలసిత=వికాసమును వహించిన. వారుణీ=మద్యమువలని. సమద=మదముతోఁగూడిన. విహ్వల=తిరుగుడుపడుచున్న. లోచనున్=కన్నులుగలవానిని. సీర...ధామునిన్—సీర=నాఁగేటిచేత. నిర్దళిత = పడఁగొట్టఁబడిన. రిపుక్షితీశ=శత్రురాజులయొక్క. నిజ=స్వకీయమైన. ధామునిన్= ఇండ్లుగలవానిని — పట్టణములుగలవానిననుట. కామపాలునిన్ = మన్మథుని రక్షించినవానిని. రామునిన్=బలరాముని. కాంచెన్= చూచెను.

తా॥ ఆద్వివిదుఁడు మనోజ్ఞమయిన నల్లనివస్త్రమును ధరించినవాఁడును,వేడుకకత్తెలయిన స్త్రీలతోఁగూడుకొనియున్నవాఁడును, తేటయైనవెన్నెలకాంతివంటికాంతిగల తెల్లనిదేహముగలవాఁడును, రత్నమయములయిన బంగారుసొమ్ములు ధరించినవాఁడును, మద్యపానముచేత తిరుగుడుపడుచున్న కన్నులుగలవాఁడును, నాఁగేటిచేత శత్రురాజులపట్టణములను పాడుచేసినవాఁడును, మన్మథునిఁ గాపాడినవాఁడునునైన బలరామునిఁ జూచెనని తాత్పర్యము.

౫౮౫.—సీ॥ కనుఁగొని తత్పురో * గమ భూమి రుహశాఖ - లెక్కియూఁచుచుఁ జాల * వెక్కిరించుఁ
గికురింత లిడుఁ బండ్లు * గీటుచు నవ్వుచుఁ - గొమ్మ కొమ్మకు నుఱుకు * కుచు నదల్చుఁ
దోఁక యూరక మేను * సోఁకఁగ నులివెట్టు - వెడవెడ నాలుక * వ్రేళ్లఁ బెట్టు
బరుల నఖంబుల * గిరగిరఁ గోఁకుచుఁ * బోరిఁబోరి ఫలములు * గఱచి వైచు

తే॥ గోళ్లు తెగఁగొరిక్క యుమియుచు * గుదముచూపు । బలిసి మర్కటజాతి యి * ప్పగిదిఁ జేయ
గోపమున హలధరుఁ డొక * గుండు వైవ । దానిఁ దప్పించుకొని ప్రల్ల * దమున నతని.

టీ॥ కనుఁగొని = చూచి. తత్పురోగమభూమిరుహశాఖలు — తత్=ఆబలరామునికి. పురోగమ=ఎదుటనుండెడు. భూమిరుహ = వృక్షములయొక్క. శాఖలు = కొమ్మలను. (ఎక్కి) ఊఁచుచున్= ఊఁగులాడించుచు. చాలన్ = మిక్కిలి. (వెక్కిరించుచును) కికురింతలు = ఏమరించుటలను. ఇడున్ = పెట్టును—చేయును. పండ్లు గీటుచున్ = పండ్లుకొఱుకుచు. (పండ్లిగిలించుచు నవ్వుచు) కొమ్మకొమ్మకునుఱుకుచున్=ఈకొమ్మనుండిఆకొమ్మమీఁదికినిఆకొమ్మనుండి యీకొమ్మమీఁదికినిదాఁటుచు. అదల్చున్=అదలించును. తోఁకన్= తోఁకను. ఊరక = విశేషముగా. మేనుసోఁకఁగన్ = దేహము సోఁకునట్లు, నులివెట్టును = మెలిపెట్టును. వెడవెడనాలుకవ్రేళ్లఁ బెట్టున్ = కొంచెముకొంచెము నాలుక వెలుపలికి చాఁచును. బరులన్=దేహముయొక్కప్రక్కలను. నఖంబులన్=గోళ్లతో. గిరగిరన్=గిరగిరయను ధ్వనిగలుగ. గోఁకుచున్ = గీఱుచు. పోరిఁబోరిన్=మాటిమాటికి. ఫలములు=పండ్లను.కఱచివైచున్=కొఱికి క్రిందఁబడవేయును. గోళ్లు=గోరులను. తెగఁగొరిక్క=తునుఁగునట్లు కొఱికి. (ఉమియుచు) గుదమున్ = ముడ్డిని. చూపున్=కనఁబఱచును.బలిసి=క్రొవ్వి.మర్కటజాతి=వానరుఁడు.ఇప్పగిదిఁ జేయన్= ఈరీతిగాఁ జేయఁగా. హలధరుఁడు=బలరాముఁడు.కోపమునన్= కోపముతో. (ఒకగుండు) వైవన్=వేయఁగా. దానిన్=ఆగుండు దెబ్బను. (తప్పించుకొని)ప్రల్లదమునన్=దుష్టత్వముతో. (అతనిని)

తా॥ ఆబలరాముని జూచి ఆయనకు ఎదుటనున్న మ్రాఁకులెక్కి అందలికొమ్మలను ఊఁగులాడించుట పండ్లిగిలించి యేమఱించియేదేని ఎత్తుకొని పోఁబోవుట ముడ్డిచూపుట పండ్లు కొఱికికొఱికి పాఱ వేయుట మొదలుగాఁగల కోఁతిచేష్టలు చేయసాఁగఁగా బలరాముఁడు కోపించి ఒకగుండురాయి యెత్తి ఆకోఁతిపైవేసెను కోతి ఆగుండుదెబ్బ తప్పించుకొని దుష్టత్వముతో బలరాముని అని తా.

౫౮౭.—క॥ నగి యాసవ కలశముఁ గొని । జగతీరుహ శాఖలెక్కి * చాపలమున న
జ్జగతిపయి వైచెఁ దద్ఘట । మగలఁగ నదిచూచి కోప * మగ్గల మొదవన్.

టీ॥ నగి=నవ్వి—పరిహాసముచేసి. ఆసవకలశమున్ = మద్యపు కుండను. కొని=తీసికొని. జగతీరుహశాఖలు=ఒకమ్రానికొమ్మలను. (ఎక్కి)చాపలమునన్=చపలత్వముతో. అజ్జగతిపయిన్=అచ్చటి భూమిమీఁద. తద్ఘటము=ఆకుండను. అగలఁగన్=పగులునట్లుగా. వైచెన్=పడవేసెను. అదిచూచి = ఆమద్యపుకుండను చెట్టుమీఁదికెత్తుకొనిపోయి క్రిందవేసి పగులఁగొట్టుటను చూచి. కోపము = అహంకారము. అగ్గలము = అధికముగా. ఒదవన్ = రాఁగా.

తా॥ బలరాముని పరిహాసముచేయుచున్న ఆవానరుఁడు అచ్చటనుండు బలరామునిదైన మద్యభాండమును ఎత్తుకొని ఒకచెట్టుకొమ్మల మీఁదికిఁబోయి అందుండి నేలఁబడవేసి పగులఁగొట్టెను ఆపగులఁగొట్టుటను జూచి బలరాముఁడు మిక్కిలి కోపమును పొందినవాఁడు కాఁగా అని తాత్పర్యము. (మఱియును)

౫౮౮.—క॥ సీరిని దనమనమున నొక । చీరికిఁ గైకొనక కదిసి * చీరలు చింపన్
వారక దా భువిజనములఁ । గారించుట మాన్పఁదలఁచి * ఘనకుపితుండై.

టీ॥ సీరిని=బలరాముని. తనమనమునన్=తనమనస్సులో. ఒక చీరికిఁ గైకొనక=ఒకపూరిపుడకకు సమానముగానైన నెంచక. కదిసి=దగ్గఱవచ్చి. (చీరలు చింప)వారక=తప్పక. (తాను)భువి=భూమిలోని. (జనములను) కారించుటన్ = బాధించుటను. మాన్పఁదలఁచి=పోఁగొట్టదలఁచి. ఘనకుపితుండై=మిక్కిలికోపించినవాఁడై.

తా॥ బలరాముని లక్ష్యముచేయక దగ్గఱవచ్చి ఆయనవస్త్రములను చించెను అంతట బలరాముఁడు కోపించి వానివలనిబాధలు భూమిలోని జనులకెవరికిని లేకుండఁ జేయఁదలఁచినవాఁడై అని తా.

౫౮౯.—వ॥ ఇట్లు కోపోద్దీపిత మానసుండై కనుంగొని హలాయుధుం డప్పుడు.

టీ॥ (ఇట్లు) కోపోద్దీపితమానసుండై = కోపముచేత వెలుఁగుచున్న మనసుగలవాఁడై. హలాయుధుండు=బలరాముఁడు. కనుంగొని=ఆకోఁతిని జూచి. (అప్పుడు)

తా॥ ఈప్రకారము కోపించినవాఁడై బలరాముఁడు ఆకోఁతిని జూచి ఆసమయమందు అని తాత్పర్యము.

౫౯౦.—చ॥ ముసలముఁ దీవ్రశాత హల * మున్ ధరియించి సమస్త చేతన
గ్రసనమునాఁడు పొంగు లయ * కాలుని భంగి నదల్చినిల్వ వాఁ
డసదృశ విక్రమక్రమ వి * హార మెలర్ప సమీప భూజమున్
వెసఁ బెకలించి మస్తకము * వ్రేసెఁ జలంబు బలంబు నేర్పడన్.

టీ॥ ముసలమున్=ముసలాయుధమును—రోఁకటిని. తీవ్రశాత హలమున్=క్రూరమయినదియు వాఁడియైనదియునైన హలాయుధమును—నాఁగేటిని. ధరియించి = తాల్చి—పూని. సమస్తచేతనగ్రసనమునాఁడు=ఎల్లప్రాణులను మ్రింగునట్టి కాలమునందు — చంపునట్టి కాలమునందు. పొంగు = విజృంభించునట్టి. లయకాలునిభంగిన్=ప్రళయకాలపు యమునివలె. అదల్చి = అదలించి. నిల్వన్ = నిలువఁగా. వాఁడు = ఆద్వివిదుఁడు. అసదృశవిక్రమక్రమవిహారము — అసదృశ=సాటిలేని. విక్రమ = శత్రువుల నాక్రమించుటయందలి. క్రమ=వ్యాపకముగల. విహారము = మెలఁకువ. ఎలర్పన్=ప్రకాశింపఁగా. సమీపభూజమున్=దాపుననున్న వృక్షమును. వెసన్=శీఘ్రముగ. పెకలించి = పెల్లగించి. చలంబు = మాత్సర్యమును. బలంబు=శక్తియును. ఏర్పడన్=తెలియఁబడునట్లు. మస్తకమున్=బలరాముని తలను. వ్రేసెన్=కొట్టెను.

తా॥ అంతట బలరాముఁడు ముసలాయుధమును హలాయుధమును ధరించి యెల్లప్రాణుల నశింపఁజేయునట్టిదయిన ప్రళయకాలమునందలి యమునివలె ఆవానరుని అదలించి నిలువఁబడఁగా వాఁడును ఆయనను లక్ష్యము చేయక పరాక్రమాతిశయముచేత తనకు దాపుననున్న ఒకవృక్షమును పెఱుకుకొని వచ్చి బలరాముని తలమీఁద మోఁదెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు వ్రేయ బలుం డప్పుడు.

౫౯౧.—చ॥ ఉరవడి దండతాడిత మ * హోరగు భంగిఁ గడంగి వీరసా
గరమున నేచి హేమ కట * కంబుల నొప్పు సునందనామ భీ
కర ముసలంబునన్ ద్వివిదు * కంఠము వ్రేసినఁ బొల్చెవాఁడు జే
గురుగల కొండచందమునఁ * గోయనియార్చి సురల్ నుతింపఁగన్.

టీ॥ ఉరవడిన్=మిక్కిలివేగముగా. దండతాడితమహోరగము భంగిన్=కఱ్ఱతోఁ గొట్టఁబడిన పెద్దపామువలెనే. కడంగి=పూని. క్షీరసాగరమునన్=క్షీరరసనముద్రముచేత–సముద్రమువలెవరిగాన రాకపొంగుచున్న వీరరసావేశముచేత. ఏచి=విజృంభించి. కోయని యార్చి=కోయనుధ్వనిగలుగ కేకవేసి. సురలు = దేవతలు. నుతింపఁగన్=పొగడఁగా. హేమకటకంబులన్=బంగారుకట్లతో. ఒప్పు=ఒప్పిదమగుచున్న. సునందనామ=సునందముఅనుపేరుగల. భీకరము సలంబునన్ = భయమును బుట్టించునట్టి రోఁకటితో. ద్వివిదు కంఠమున్=ద్వివిదునియొక్క మెడమీఁద. వ్రేసినన్ = కొట్టఁగా. వాఁడు=ఆద్వివిదుఁడనువానరుఁడు. జేగురుగలకొండచందమునన్=ఎఱ్ఱచాతికలుగలకొండవిధమున. పొల్చెన్=ఉండెను.

తా॥ మిక్కిలివడిగా కఱ్ఱతోఁగొట్టఁబడిన పెద్దపామువలె వీరరసము నవలంబించి విజృంభించి దేవతలు కేకలువేయుచు పొగడునట్లుగా ఆవానరుని మెడమీఁద బంగారు కట్టువేసి యొప్పుచున్న సునందము అనెడు తనముసలాయుధముతో కొట్టెను అంతటవాఁడు ఎఱ్ఱచాతికలుగల కొండవలెనే నెత్తురు దేహమునందు క్రమ్మఁగా నేలఁజదికిలఁబడి ఊరకుండెనని తాత్పర్యము.

౫౯౨.—మత్తకోకిల॥ అంత వాఁడొక యింతమూర్ఛిలి * యంతలోఁ దెలివొంది దు
ర్దాంత భూరిభుజా విజృంభణుఁ * డై మహీజము పూని దై
త్యాంత కాగ్రజు వ్రేసె వ్రేసిన * నాగ్రహంబున దాని నిం
తింతలై ధర రాలఁజేసె న * హీన విక్రమ శాలియై.

టీ॥ అంతన్ = అంతట. (వాఁడు) ఒకయింత = కొంచెము. మూర్ఛిలి=మూర్ఛపోయి. అంతలోన్=అంతలోపల–వెంటనే. తెలివొంది=మూర్ఛనుండి తేఱి. దుర్దాంత...జృంభణుఁడు. దుర్దాంత=అణఁపరాని. భూరి=అధికమయిన. భుజావిజృంభణుఁడు = భుజబలముయొక్క విజృంభణముగలవాఁడు. (అయి) మహీజమున్ = ఒకవ్రానిని. పూని=చేతఁబట్టుకొని. దైత్యాంతకాగ్రజున్=దైత్యులకు నాశకుఁడైన కృష్ణుని యన్నను – బలరాముని. వ్రేసెన్ = కొట్టెను. వ్రేసినన్=వాఁడుఅట్లుకొట్టఁగా. అహీనవిక్రమశాలియై=తక్కువకాని పరాక్రమముచేత ఒప్పినవాఁడై. దానిన్ = ఆవృక్షమును. ఇంతింతలై=చిన్నచిన్నతునుకలై. ధరన్=భూమియందు. రాలన్=రాలునట్లుగా. (చేసెను)

తా॥ అంతట ఆవానరుఁడు కొంచెము మూర్ఛనుపొంది వెంటనే తేఱుకొని అణఁపరాని ఆటోపమును వహించినవాఁడై తనభుజబలము మెఱయునట్లు ఒకవ్రాను పెఱికిబలరామునిపైవేసెను అంతట బలరాముఁడు ఆవ్రాను తనమీఁద పడుటకుముందే అది చిన్నచిన్న తునుకలై నేలఁబడునట్లుగాఁ గొట్టి తక్కువగాని తనపరాక్రమమును ప్రకాశింపఁజేసెనని తాత్పర్యము.

౫౯౩.—క॥ మఱియును చలముడుగక తరు । చరుఁడొక తరువెత్తివ్రేయఁ * దాలాంకుఁ డనా
దరమునఁ దునిమిన వెండియుఁ । దొరఁగించెఁ గుజంబు లతఁడు * దోడ్తో దునుమన్.

టీ॥ మఱియున్=ఇంకను. చలము=మాత్సర్యమును. ఉడుగక=మానక. తరుచరుఁడు=వానరుఁడు. ఒకతరువు=ఒకవ్రాను. ఎత్తి=ఎత్తుకొని. వ్రేయన్=వేయఁగా. తాలాంకుఁడు = బలరాముఁడు. అనాదరమునన్ = ఆదరములేమిచేత. తునిమినన్ = నఱకఁగా. వెండియున్=మఱియును. అతఁడు = బలరాముఁడు. దోడ్తోన్=వెంటవెంటనే. దునుమన్=నఱకుచుండఁగా. కుజంబులు = వృక్షములను. తొరఁగించెన్ = రాల్చెను – ఎడతెగక పెల్లగించి వేయసాగె ననుట.

తా॥ అంతటితో మానక వానరుఁడు ఒకవ్రానుపెఱికి తనపై వేయఁగా బలరాముఁడు దానిని అలక్ష్యముగాన ఱకివేసెను అంతట వాఁడు నిలువక బలరాముఁడు విఱుగఁగొట్టుచుండఁగా ఊరక వ్రాఁకులు పెల్లగించి వేయుచుండెనని తాత్పర్యము.

౫౯౪.—క॥ ఆచ్ఛందంబున వనచరుఁ । డేచి మహీరుహచయంబు * లెల్లను హలిపై
వైచి తరుశూన్యమగుటయుఁ । జూచి శిలావృష్టి గురిసె * సురలగ్గింపన్.

టీ॥ ఆచందంబునన్=ఆవిధమున. వనచరుఁడు = వానరుఁడు. ఏచి=విజృంభించి. మహీరుహచయంబులెల్లన్ = వృక్షసమూహమునంతయు. హలిపైన్=బలరామునిమీఁద. వైచి=వేసి. తరుశూన్యము=వృక్షములయొక్క లేమి. అగుటయున్=కాఁగా. (చూచి)సురలు=దేవతలు. అగ్గింపన్=శ్లాఘింపఁగా. శిలావృష్టి=రాళ్లవాన(కురిసెను)

తా॥ ఆవానరుఁడు ఆవిధముగా వృక్షములు పెఱికివేసివేసి అవియన్నియు అయిపోఁగా దేవతలుశ్లాఘించునట్లు రాళ్లను వానకురిసినట్లు ఎడ సందులేకుండ వేయసాగెనని తాత్పర్యము.

౫౯౫.—క॥ బలుఁడపుడు రాలు దుమురై । యిలరాలఁగఁజేసి యార్చె * నేపుడుగక యా
వలిముఖుఁడు తాలసన్నిభ । ములుగల బాహు యుగదండ * ముల నుగ్రుండై.

టీ॥ (అపుడు)బలుఁడు=బలరాముఁడు. రాలు=రాళ్లు. దుమురై=పొడియై. ఇలన్=భూమియందు. రాలఁగన్=రాలునట్లుగా. (చేసి) ఆర్చెన్=సింహనాదముచేసెను. ఆవలిముఖుఁడును = ఆవానరుఁడును. ఏపు=గర్వమును. ఉడుగక=మానక. తాలసన్నిభములు=తాటిచెట్లనుబోలినవియగుట. కలబాహుయుగదండములన్=కలిగినట్టి రెండుచేతులనెడు కఱ్ఱలతో. ఉగ్రుండై=భయంకరుఁడై.

తా॥ అప్పుడు బలరాముఁడు ఆరాళ్లన్ని పొడియయి నేలరాలునట్లు చేసి సింహనాదముచేసెను అంతట ఆవానరుఁడు వెనుదీయక తాటిమ్రాఁకులనుబోలిన నిడుపాటిచేతులు రెంటితోను భయంకరుఁడై అని తాత్పర్యము.

౫౯౬.—క॥ వడిఁబిడుగుఁబోలు పిడికిటఁ । బొడిచిన వడిసెడక బలుఁడు ❋ ముసలము హలముం
విడిచి ప్లవగుని మెడ గడు । వెడవెడ బిగియించె గ్రుడ్లు ❋ వెలికుఱుకంగన్.

టీ॥ వడిన్=వేగముతో. పిడుగుఁబోలుపిడికిటన్=పిడుగుతో సమానమయినపిడికిటితో. పొడిచినన్=పొడువఁగా. బలుఁడు=బలరాముఁడు. వడిసెడక=వేగమతగ్గక. ముసలమున్=రోఁకటిని. హలమున్=నాఁగేటిని. (విడిచి) ప్లవగుని=వానరుని. (మెడను) కడున్=మిక్కిలి. గ్రుడ్లు=కనుగ్రుడ్లు. వెలికుఱుకంగన్=బయటికుబుకునట్టుగా. వెడవెడన్=కొంచెముకొంచెముగా (బిగియించెను)

తా॥ ద్వివిదుఁడు పిడుగుతో సమానమయిన తనపిడికిటితో పొడువఁగా బలరాముఁడు భయపడక రోఁకటిని నాఁగేటినివదలి ఆవానరుని గొంతును పట్టుకొని కనుగ్రుడ్లు పిటుకుకొని వెలికివచ్చునట్టుగా మెల్లమెల్లఁగా బిగఁబట్టెనని తాత్పర్యము.

౫౯౭.—క॥ వదనమునఁ జెవుల రుధిరము । మెదడును దొరఁగంగ వాఁడు ❋ మేదినిమీఁదం
జదికిలఁబడి యొకయింతయు । మెదలఁగ మిడుకంగలేక ❋ మృతిఁబొందె నృపా.

టీ॥ నృపా=రాజా. వదనమునన్=నోటనుండియు. చెవులన్=చెవులనుండియు. రుధిరము=నెత్తురును. మెదడును=క్రొవ్వును. తొరఁగంగన్=కాఱుచుండఁగా. వాఁడు=ఆవానరుఁడు. మేదినిమీఁదన్=భూమిమీఁద. చదికిలఁబడి=పిట్టలు నేలమోవఁగా కూలఁబడి. ఒకయింతయున్=కొంచెమయినను. మెదలఁగన్=కదలుటకు. మిడుకంగన్=లేచుటకును. లేక=శక్తుఁడుకాక. మృతిఁబొందెన్=చచ్చెను.

తా॥ ఓరాజా! నోటనుండియు చెవులనుండియు నెత్తురు కారుచుండఁగా ఆవానరుఁడు నేలఁజదికిలఁబడి కొంచెమయిన కదలలేకయు లేవలేకయు చచ్చెనని తాత్పర్యము.

౫౯౮.—తే॥ వానిపాటున కప్పుడు ❋ వనసమేత । మగుచు నాశైల రాజ మ ❋ ల్లలఁగ నాడె
సురగణంబులు రాముపై ❋ సురభికుసుమ । వృష్టిగురియించి రతుల సం ❋ తుష్టిమెఱసి.

టీ॥ అప్పుడు=ఆసమయమునందు. వానిపాటునకున్=వానియొక్క పడుటకు. వనసమేతమగుచున్=అడవులతోఁగూడ. ఆశైలరాజము=ఆగొప్పకొండ. అల్లలఁగనాడెన్=అల్లాడెను-చలించెను. సురగణంబులు=దేవతాసమూహములు. అతులసంతుష్టి=అధికసంతోషమును. మెఱసి=ప్రకాశింపఁచేసి. రాముపైన్=బలరామునిమీఁద. సురభికుసుమవృష్టి=వాసనతోడిపువ్వులవాన. (కురియించిరి)

తా॥ ఆసమయమునందు వాఁడుపడినందున ఆకొండ తనమీఁది యడవులతోఁగూడ గడగడవడఁకెను దేవతలు మిక్కిలిసంతోషించి పువ్వులవాన కురియించిరని తాత్పర్యము.

౫౯౯.—వ॥ ఇవ్విధంబున భువనకంటకుండైన దుష్టశాఖామృగేంద్రు వసుంధరకుం బలిచేసిసకలజనంబులు పరమానంద కందళిత హృదయారవిందులై తన్నునందింప నయ్యాదు నందనుండు నిజ నగరంబున కరుగుదెంచెనని శుకుండు వెండియు నమ్మనుజ పతి కిట్లనియె.

టీ॥ ఇవ్విధంబునన్=ఈరీతిగా. భువనకంటకుండు=లోకమునకుబాధకుఁడు. (ఐన) దుష్టశాఖామృగేంద్రున్=చెడ్డవానరుని. వసుంధరకున్=భూమికి. (బలిచేసి) సకలజనంబులు=ఎల్లజనులును. పరమానందకందళితహృదయారవిందులై=అధికానందముకలుగుచున్న మనఃకమలములుగలవారలై. (తన్ను) నందింపన్=కొనియాడఁగా. అయ్యదునందనుండు=యాదవవంశమునందుఁ బుట్టినవాఁడైన ఆబలరాముఁడు. నిజనగరంబునకున్=తనపట్టణమునకు. అరుగుదెంచెన్=వచ్చెను. అని=చెప్పి (శుకుండు) వెండియున్=మఱియును. అమ్మనుజపతికిన్=ఆరాజుతో. ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

తా॥ ఈరీతిగా లోకములకెల్ల బాధచేయున్న ఆవానరుని భూమికి బలియిచ్చి సకలజనులును మిక్కిలి ఆనందముతో పొగడుచుండఁగా బలరాముఁడు తనపట్టణమునకు వచ్చెనని శుకమహర్షి చెప్పెననితా.

౬౦౦.—సీ॥ కోరి సుయోధను ❋ కూఁతురు సర్వల - క్షణములుగల్గి ల ❋ క్షణయనంగ
మహినొప్పు కన్యకా ❋ మణి వివాహంబునఁ - జక్రహస్తుని తనూ ❋ జాతుఁడైన
సాంబుఁడు బలసాహ ❋ సముల నెత్తుకపోవఁ - గౌరవులీక్షించి ❋ కడఁగిక్రొవ్వి
పడుచు వాఁడొకఁడదె ❋ బాలికఁ గొనిపోవు - చున్నాఁడుగైకొన ❋ కుక్కుమిగిలి

తే॥ యట్టిదుర్మదుఁ గయిముట్టి ❋ పట్టితెచ్చి । జనులు వెఱఁగందఁ జెఱఁబెట్టి ❋ యనుమతేమని
యాదవులుమీఱి యేమి సే ❋ యంగఁగలరొ । యనుచుఁ గురువృద్ధజనముల ❋ యనుమతమున.

టీ॥ చక్రహస్తునితనూజాతుఁడు = కృష్ణునికొడుకు, అయిన సాంబుఁడు=అయినట్టిసాంబుఁడు అనువాఁడు. కోరి=అపేక్షించి. సుయోధనుకూఁతురు = దుర్యోధనునికొమార్త. సర్వలక్షణములు గల్గి = అన్నిశుభలక్షణములునుగలిగి. లక్షణయనంగన్ = లక్షణ అనఁగా. మహిన్ = భూమియందు. ఒప్పు = ఒప్పునట్టి. కన్యకామణిన్=శ్రేష్ఠురాలైనకన్యకను. వివాహంబునన్ = పెండ్లిలో. బలసాహసములన్=బలముచేతను తెగువచేతను. ఎత్తుకపోవన్=ఎత్తుకొనిపోఁగా. కౌరవులు=దుర్యోధనుఁడుమొదలగువారు. ఈక్షించి=చూచి. కడఁగి = ప్రయత్నపడి. క్రొవ్వి = మదించి. పడుచువాఁడొకఁడు=ఒకపసిపిల్లకాయ. అదె=అదిగో. బాలికన్=కన్యకను. కైకొనక=లక్ష్యపెట్టక. ఉక్కుమిగిలి = బలము అతిశయింపఁగా. కొనిపోవుచున్నాఁడు=ఎత్తుకొనిపోవుచున్నాఁడు. ఇట్టిదుర్మదున్=ఇటువంటిచెడ్డక్రొవ్వుగలవాని. కయిముట్టిపట్టి=చేయియంటఁబట్టుకొని. తెచ్చి=తీసికొనివచ్చి. (జనులు) వెఱఁగందన్=ఆశ్చర్యపడునట్టుగా. చెఱఁబెట్టి=చెఱలోపెట్టి. ఉనుతుమేనిన్=మనమఉంచిన పక్షమున. యాదవులు = యదువంశస్థులు — కృష్ణుఁడు మొదలగువారు. ( మీఁతి ) ఏమిసేయంగఁగలరో = ఏమిచేయఁజాలుదురో. అనుచున్=అని. కురువృద్ధజనములయనుమతమునన్=వృద్ధులయిన కౌరవులయనుజ్ఞచేత.

తా॥ కృష్ణునికొమారుఁడైన సాంబుఁడు అనువాఁడు దుర్యోధనునికూఁతురైన లక్షణయనెడు శుభలక్షణములుగల కన్యకనుదాని పెండ్లిలో సాహసించి యెత్తుకొని పోఁగా దుర్యోధనుఁడుమొదలుగాఁగల కౌరవులందఱు ఒక్కపసిపిల్లకాయవచ్చి మనబిడ్డను ఎత్తుకొనిపోఁగా మనము చూచుచు ఊరకుండుటపౌరుషముకాదువీనిని ఇప్పుడుపట్టితీసికొనివచ్చి చెఱలోపెట్టుదముఅటుపిమ్మటకృష్ణుఁడు మొదలగువారుమనలను ఏమిచేయుదురో చూతము అని ఆలోచించి తమలో వృద్ధులయిన ధృతరాష్ట్రుఁడు మొదలగువారి యుత్తరువుపుచ్చుకొన్నవాఁడై అని తాత్పర్యము. సాంబుఁడు.



(*) సాంబుఁడు కౌరవులచేతఁ బట్టువడుట. (*)


లక్షణ.

౬౦౧.—వ॥ ఇట్లు గడంగి యుద్ధసన్నద్ధులై బల శౌర్యోపేతులగు కర్ణ శల్య భూరిశ్రవ యజ్ఞకేతు సుయోధనాదులు సమున్నత రథాధిరూఢులైకూడనరిగిన వారలంగనుంగొని జాంబవతీ నందనుండు మందస్మిత వదనార విందుం డగుచు సింగంబు భంగి గర్జించుచు మణి దీప్తంబైన చాపంబుఁ బూని నిల్చిన వారు నాసాంబుని నదల్చి నిలు నిలుమని పలికె.

టీ॥ (ఇట్లు) కడంగి=పూని. యుద్ధసన్నద్ధులై=యుద్ధమునకుసిద్ధపడినవారై. బలశౌర్యోపేతులు=బలముతోడనుశౌర్యముతోడనుగూడుకొన్నవారు. అగు...నాదులు—అగు=అగునట్టి. కర్ణ=కర్ణుఁడు. శల్య=శల్యుఁడు. భూరిశ్రవ=భూరిశ్రవుఁడు. యజ్ఞకేతు=యజ్ఞకేతుఁడు. సుయోధన=దుర్యోధనుఁడు. ఆదులు=మొదలగువారు. సమున్నతరథాధిరూఢులై=మిక్కిలిపొడవైనరథములను ఎక్కినవారై. కూడనరిగినన్=చేరఁబోయినంతట. వారలన్=ఆకర్ణదుర్యోధనాదులను. కనుంగొని=చూచి. జాంబవతీనందనుండు=జాంబవతికొడుకైనసాంబుఁడు. మందస్మితవదనారవిందుండు=చిఱునవ్వుతోడిముఖకమలముగలవాఁడు. అగుచున్=అవుచును. సింగంబుభంగిన్ = సింహమువలె. గర్జించుచున్=బొబ్బరించుచు. మణిదీప్తంబు = రత్నములచేతప్రకాశించునది. అయిన చాపంబున్ = అయినట్టిధనుస్సును. పూనినిల్చినన్ = చేతఁబట్టినిలువఁగా. (వారును ఆసాంబుని) అదల్చి=అదలించి. (నిలునిలుమనిపలికి)

తా॥ ఈవిధముగా ప్రయత్నపడి యుద్ధమునకు సిద్ధపడినవారై బలముతోడనుశౌర్యముతోడనుగూడుకొన్నవారైన కర్ణుఁడు శల్యుఁడు భూరిశ్రవసుఁడు యజ్ఞకేతుఁడు దుర్యోధనుఁడు మొదలుగాఁగల కౌరవులు మిక్కిలి యున్నతములైన రథముల నెక్కి సాంబుని కదియఁబోయి యదలించి నిలువు నిలువు మనిరి వాఁడును వీరినిఁ జూచి భయపడక రత్నమయమైన తనవింటిని చేతఁబూని యెదిరించి నిలిచెననితా.

౬౦౨.—తే॥ చండ కోదండ ముక్త ని * శాత విశిఖ । జాలమందందఁ బఱపి యా * భీలముగను
నందనందన నందన * స్యందనంబు । ముంచిరచలేంద్రమును మంచు * ముంచుపగిది.

టీ॥ చండ...జాలము—చండ=తీక్ష్ణమైన. కోదండ=వింటినుండి. ముక్త=విడువఁబడిన. నిశాత=వాఁడియైన. విశిఖ=బాణములయొక్క. జాలము=సమూహమును. అందందన్=మీఁదమీఁద. పఱపి=ప్రయోగించి. ఆభీలముగన్ = భయంకరముగా. నందనందన నందనస్యందనంబున్=కృష్ణుని కొడుకైన సాంబుని రథమును. అచలేంద్రమును=గొప్ప కొండను. మంచుపగిదిన్=మంచు ముంచినట్టుగా. ముంచిరి=మునుఁగఁజేసిరి.

తా॥ అట్లు ఎదిరింపఁగా కౌరవులు ఆసాంబునిపై తీక్ష్ణములైన బాణములను ఎడతెగక ప్రయోగించి కొండపైమంచుకమ్మిన విధముగా వానిరథముపై బాణములను కమ్ముకొనునట్లుచేసిరనితా. వ॥మఱియును.

౬౦౩.—శా॥ శౌర్యాటోప విజృంభణంబుల సరో * జాతాక్షసూనున్ సురా
హార్య స్థైర్యుని మీఱియేయ నతఁడు * ద్యద్భూరి బాహా బలా
వార్యుండై శిత సాయకాలి ననిమా * యంజేసినన్ దేవతా
తూర్యంబుల్ దివిమ్రోసె నంతనతఁడ * స్తోక ప్రతాపోన్నతిన్.

టీ॥ శౌర్యాటోపవిజృంభణంబులన్—శౌర్య=శూరత్వముచేతను. ఆటోప = ఉత్సాహముచేతను. విజృంభణంబులన్ = విజృంభించుటలచేతను. సరోజాతాక్షసూనున్ = కృష్ణుని కొడుకును. సురాహార్యస్థైర్యునిన్ = మేరుపర్వతమువలె చలింపక నిలిచిన వాఁడునైనసాంబుని. మీఱి = అతిక్రమించి. ఏయన్ = బాణములను ప్రయోగింపఁగా. అతఁడున్=ఆసాంబుఁడును. ఉద్య...వార్యుండై-ఉద్యత్=ప్రకాశించుచున్న. భూరి = అధికమయిన. బాహాబల = భుజబలముచేత. అవార్యుండై=అడ్డగింపఁ గూడనివాఁడై. శితసాయకాలిన్=వాఁడియైన బాణములచాలుచేత. అనిన్ = యుద్ధమునందు. మాయన్=నశించునట్లు. చేసినన్=చేయఁగా. దేవతాతూర్యంబులు = దేవతలసంబంధములయిన వాద్యములు. దివిన్ = ఆకాశమునందు. మ్రోసెన్=మ్రోఁగెను. అంతన్=అంతట. అతఁడు=సాంబుఁడు. అస్తోకప్రతాపోన్నతిన్ = తక్కువకాని ప్రతాపము యొక్క యతిశయము చేత.

తా॥ శూరత్వమును ఉత్సాహమును విజృంభణమును గలవారై మేరుపర్వతమో యనునట్లుచలింపక నిలువఁబడియున్న సాంబునిమీఁద మేరలేని బాణములను ప్రయోగింపఁగా అతఁడును అణఁపరాని పరాక్రమము చేత విజృంభించిన వాఁడై వాఁడియైన బాణ జాలములచేత ఆబాణములనన్నిటిని యుద్ధమునందున అణిచివేసెను అదిచూచిఆకాశమునందు వేడుకచూచుచున్న దేవతలు సంతోషించినానావిధములైనవాద్యములను వాయించిరి అంతటసాంబుఁడు మిక్కిలిరేఁగినవాఁడై యనితా.

౬౦౪.—వ॥ ఇట్లు గడంగి బాణ జాలంబులు పఱఁగించి యందఱకు నన్నిరూపులై రథ
రథ్యసూత ధ్వజాతపత్రంబులు చూర్ణంబులు గావించి విరథులంజేసి వారల
మెయిమఱువు లఱువుల్లు గావించి యొక్కొక్కనిఁ బెక్కు బాణంబులుచ్చిపో
నేసినవారలు శోణితదిగ్ధాంగులై కుసుమిత కింశుకంబులంబోలి యుండిరంత.

టీ॥ (ఇట్లు) కడంగి = ఉత్సాహపడి. బాణజాలంబులు = బాణసమూహములను, పఱఁగించి=ప్రయోగించి. అందఱకునన్నిరూపులై=అందఱకును అందఱు ఎదిరించి నిలిచినట్టు తానొకఁడేనిలిచినవాఁడై. రథ...పత్రంబులు—రథ=తేరులు. రథ్య=గుఱ్ఱములు. సూత=సారథులు. ధ్వజ=టెక్కెములు. ఆతపత్రంబులు=గొడుగులు. చూర్ణంబులు = పొడులు. కావించి = చేసి. విరథులంజేసి = రథములులేనివారినిఁగాఁజేసి. వారలమెయిమఱువులు=వారి కవచములను. అఱువుల్లగావించి=చిల్లులుపడిన వానిఁగాఁజేసి. ఒక్కొక్కనిన్ = ఒకనొకనిని. పెక్కుబాణంబులు=అనేకబాణములు. ఉచ్చిపోన్=దూసిపోవునట్లుగా. ఏసినన్ = ప్రయోగింపఁగా. వారలు=ఆకౌరవులు. శోణిత=నెత్తుటిచేత. దిగ్ధ=తడుపఁబడిన. అంగులై=దేహములుగలవారై. కుసుమితకింశుకంబులన్=పూచిన మోదుగులను. (పోలియుండిరి) అంతన్=అంతటను.

తా॥ ఈప్రకారము ఉత్సహించిబాణములనుప్రయోగించియొందఱు తన్నెదిరించినను అందఱకును తానొక్కఁడే యెదురై నిలిచి పోరాడి వారిరథములను గుఱ్ఱములను టెక్కెములను గొడుగులను పడఁగొట్టి పొడిచేసిపాదచారులనుగాఁజేసి వారుతొడిగిన కవచములనెల్లచిల్లులు పుచ్చి వారిదేహములందుండి బాణములు దూసిపోవునట్లు చేయఁగా వాఁ అందఱు నెత్తుటిచేత తడిసిన దేహములతో పూచిన మోదుగు మ్రాఁకులవలె కానవచ్చుచుండిరి అంతటనని తాత్పర్యము.

౬౦౫.—ఉ॥ వార లనేకు లయ్యు బల * వంతులు నయ్యు మహోగ్ర సంగరో
దార పరాక్రమ ప్రకట * దక్షులునయ్యుఁ గుమారకుం జగ
ద్వీరుని నొక్కనిం జెనకి * వ్రేలును వంపఁగలేక సిగ్గునం
గూరిన చింత నొందారులు * గూడుచు విచ్చుచు వెచ్చ నూర్చుచున్.

టీ॥ వారలు=ఆకౌరవులు. (అనేకులు) అయ్యున్ = అయియుండియు. బలవంతులునయ్యున్=బలముగలవారుగానుండియు. మహోగ్ర...నయ్యున్—మహోగ్ర = మిక్కిలిభయంకరమయిన. సంగర=యుద్ధమునందు. ఉదార=గంభీరమయిన. పరాక్రమ=శత్రువులనాక్ర

పింప శౌర్యవ్రతములు ... ప్రసిద్ధము చేయుటయందు. ప్రఖ్యాతి చెందిన వారు. వరయ్యాక = వాలినవారుగ్రామునందియు. జగద్వీరులక్ = లోకమునందు వీరుఁడైన — లోకమునందెల్ల వారిలోను వీఁడొక్కఁడే వీరుఁడు అనఁదగిన. కుమారకుక్ = చిన్నవానిని. చెనఁకి=ఎదిరించి. క్రేలుసువంపఁగలేక = వానిని కైవసము చేసికొనలేక, — వానిని కొంచమైనను భయము పొందింపలేకయనుట. సిగ్గునంగూరిక చింతక్ = లజ్జనొందినవిచారముతో ఒండొరులు=ఒకరితో నొకరు. కరాడించుచుక్ = కలిసికొనుచు. విచ్చుచుక్ = ఒకరి నొకరు వదలిపోవుచు. వెచ్చనూర్చుచుక్ = సంతాపము చేత నిట్టూర్పులు విడుచుచును — బలశౌర్యములుగల వారు నిట్టూర్చిరనుట.

తా॥ ఆకౌరవులు తాము అనేకులుగాను బలముగల వారుగాను అనేకయుద్ధములయందు గడిదేఱిన వారుగా నుండియు ఒంటివాఁడైన సాంబుని ఏమిచేయలేక వానికి వెఱచి సిగ్గుపడి మిక్కిలి విచారముతో ఒకరితో నొకరుచేరి యేమేమొ ఆలోచనలు చేయుచు ఇవియేమి యోచనలు మనవల్ల ఏమియు కానేరదని తొలఁగిపోవుచు మరల అందఱును ఒక్కటిగాఁ గూడి యుద్ధమునకు పూనుచు అబ్బా ఏమి చేయవచ్చునని నిట్టూర్పులు విడుచుచు చింతించిరని తాత్పర్యము.

౬౦౬.—వ॥ మగుడ సమర సన్నద్ధులై సంరంభించి.

టీ॥ మగుడక్ = మరల. సమరసన్నద్ధులయి=యుద్ధమునకుఆయిత్తపడినవారై. సంరంభించి=త్వరపాటులో పూనుకొని.

తా॥ మరల యుద్ధమునకు ఆయిత్తపడి బయలు వెడలినవారై యనితాత్పర్యము.

౬౦౭.—ఉ॥ అందఱు నొక్కపెట్ట దను * జాంతక నందనుఁ జుట్టుముట్టి యం
దంద నిశాతసాయక చ * యంబుల ముంచి రథంబు నుగ్ర లీ
లందునుమాడి చాపము ర * యంబునఁ ద్రుంచి హయాళిఁ జంపి సూ
తునిఁ దెగటార్చి యంత విర * థుం డగుటక్ వెసఁ జొచ్చి పట్టినక్.

టీ॥ (అందఱును) ఒక్కపెట్టక్ = ఒక్కసారిగా. దనుజాంతకనందనుక్ = సాంబుని. చుట్టుముట్టి = నలు ప్రక్కలను ముట్టుకొని. అందంద=మాటిమాటికి—విశేషముగా. నిశాతసాయకచయంబులక్ = వాఁడియైన బాణముల సమూహములచేత. ముంచి=కప్పి. రథంబుక్ = తేరును. ఉగ్రలీలక్ = భయంకరమయినరీతితో. తునుమాడి = తెగనఱకి. చాపముక్ = వింటిని. రయంబునక్ = శీఘ్రముగా. త్రుంచి= తెగనఱకి. హయాళిక్ = గుఱ్ఱములపఙ్క్తిని. (చంపి) సూతునిక్ = సారథిని. తెగటార్చి=చంపి. అంతక్ = ఆంతట. విరథుండగుటక్ = రథములేని వాఁడగుటచేత. వెసక్ = వడిగా. చొచ్చి=చేరఁబోయి. పట్టినక్ = పట్టుకొనఁగా.

తా॥ వారందఱును ఒక్కటిగాఁగూడి సాంబుని చుట్టుకొని వాఁడియైన బాణములను దట్టముగా ప్రయోగించి ముంచివెంటవెంట నేయుటకైన బాణములనేసి రథమును గుఱ్ఱములను సారథిని వింటిని తెగనఱకి అంతటవాఁడు రథము లేక నిలిచియుండఁగా కదిసిపట్టుకొనఁగా నని తా.

౬౦౮.—తే॥ బాలకుఁడు చేయునది లేక * పట్టువడియెఁ । గౌరవులుఁ దమ మనములఁ * గౌతుకంబు
లోలయ సాంబునిఁ గన్యకా * యుక్తముగను । బురమునకుఁ దెచ్చి రతులవి * భూతి మెఱసి.

టీ॥ బాలకుఁడు = అచిన్నవాఁడు—సాంబుఁడు. చేయునది లేక= తానేమి చేయుటకును వల్ల లేక. పట్టువడియెక్ = వారిచేత చిక్కుకొనెను. (కౌరవులును) తమమనములక్ = తమ మనసులలో. కౌతుకంబులు=వేడుకలు. ఒలయక్ = అతిశయింపఁగా. (సాంబుని) కన్యకాయుక్తముగక్ = తమ ఆఁడుపడుచుతోఁగూడ. అతులవిభూతిక్ = సాటిలేని కలిమిని. మెఱసి = ప్రకాశింపఁజేసి. పురమునకుక్ = తమదైనహస్తినాపట్టణమునకు. తెచ్చిరి = మహావైభవముతో తీసుకవచ్చిరి.

తా॥ అప్పుడు సాంబుఁడు తాను ఏమి చేయుటకును వల్ల లేకపోయినందున వారిచేత పట్టువడెను, అంతట కౌరవులు మిక్కిలి వేడుకతో తమవైభవమును ప్రకాశింపఁజేయుచు ఆఁడుపడుచుతోఁగూడిన యాసాంబుని తమపట్టణమునకుఁ దీసికొనిపోయిరని తాత్పర్యము.

వ॥ అంత ద్వారకానగరంబున.

౬౦౯.—ఉ॥ జాంబవతేయు వార్త యదు * జాతులు నారద యోగిచే సమ
స్తంబును విన్న వారగుచు * సంగర కౌతుక ముప్పతిల్లఁ జి
త్తంబులఁ గౌరవాన్వయ క * దంబము నొక్కట నుక్కడంచు గో
పంబుల నుగ్రసేన జన * పాలు ననుజ్ఞ సమస్త సైన్యముక్.

టీ॥ జాంబవతేయువార్త=జాంబవతి కొడుకైన సాంబుఁడు కౌరవులచేత పట్టువడిన వృత్తాంతమును. యదుజాతులు = యాదవులు. నారదయోగిచేక్ = నారదమహామునివలన. సమస్తంబును=అంతయు. (విన్నవారు) అగుచుక్ = అయి. చిత్తంబులక్ = మనస్సులందు. సంగరకౌతుకము = యుద్ధమునందలి వేడుక. ఉప్పతిల్లక్ = పుట్టుచుండఁగా. కౌరవాన్వయకదంబముక్ = కౌరవకులమువారి సమూహమును. ఒక్కటక్ = ఒక్కసారిగా. ఉక్కడంచు=చంపునట్టి. కోపంబులక్ = కోపములతో. ఉగ్రసేనజనపాలుననుజ్ఞక్ = ఉగ్రసేనమహారాజుయొక్క యుత్తరువుచేత. సమస్తసైన్యముక్ = సైన్యమంతయును.

తా॥ యాదవులు నారద మహాముని చెప్పఁగా సాంబుఁడు కౌరవులచేత పట్టుపడెనన్న వృత్తాంతమును విని మనస్సులయందు యుద్ధము చేయవలెనన్న వేడుక కలుగుచుండఁగా కౌరవులను అందఱను ఒక్కసారే చంపునంతటి కోపమును వహించిన వారై తమరాజైన యుగ్రసేనునియుత్తరువుపుచ్చుకొని తమదండును అంతను కూర్చుకొనియని తా.

తే|| కూడి నడవంగఁగని వారి * తోడఁబలుఁడు । ధార్తరాష్ట్రులు మనకునెం * తయును జాసి
నట్టి బంధులు వారిపై * నిట్టియలుక । నెత్తి చనుచుంట యిది నీతి * యే తలంప.

టీ|| కూడినడవంగన్ = దండంతయు చేరి తమతోడ నడవఁగా. కని=చూచి. బలుఁడు=బలరాముఁడు. వారితోడన్ =అనైనికులలో. ధార్తరాష్ట్రులు=ధృతరాష్ట్రుని కొడుకులు. (మనకు) ఎంతయున్ = మిక్కిలి. జాసినట్టి బంధులు = దగ్గఱచుట్టములు. (వారిపైని) ఇట్టి యలుకన్ = ఇటువంటి కోపముతో. ఎత్తిచనుచుంట = దండెత్తి పోవుచుండుట. (ఇది) తలంపన్ =విచారింపఁగా. నీతియే=న్యాయమా.

తా|| అట్లు దండును గూర్చుకొని తమవారందఱు పోవుటనుజూచి బలరాముఁడు వారితో మనకు మిక్కిలి దగ్గఱ చుట్టములయిన ధృతరాష్ట్రుని కొడుకుల మీఁద మీరు ఇట్లు దండెత్తి పోవుట న్యాయమా అని చెప్పెనని తాత్పర్యము.




(*) సాంబుని విడిపింప బలరాముఁడు హస్తినాపురమునకుఁ బోవుట. (*)

వ|| అని వారలవారించి తత్క్షణంబ బంధుప్రియుండైన బలరాముం డనలార్క సంకాశంబగు కాంచన రథం బెక్కి యనురక్తులైన భూసురులును యుద్ధవాదులగు కులవృద్ధులును సేవింపం గరి పురంబునకుం జని తత్పురోపకంఠ వనంబున సురభి కుసుమ ఫలభరిత తరుఛాయా విరచిత చంద్రకాంత శిలాతలంబు నందు వసియించి మహిత గ్రహమధ్యగతుండైన పూర్ణచంద్రు ననుకరించియుండె నంతఁ గార్యబోధ నంబు సేయుటకై కౌరవ్యులయొద్దకుం బ్రబుద్ధుండైన యుద్ధవునిం బనిచినం జని యతండాంబికేయునకు ధనురాచార్యాపగా తనూభవ సుయోధనులకుం బ్రణమిల్లి వారిచేత నభినందితుండై యిట్లనియె.

టీ|| (అని) వారలన్ = ఆయాదవులను. వారించి=నిలిపి. తత్క్షణంబ=అప్పుడే. బంధుప్రియుండైన బలరాముండు=చుట్టములయందు ప్రీతిగలవాఁడగుబలరాముఁడు. అనలార్క సంకాశంబు=అగ్నితోడను సూర్యునితోడను బోలినది. అగుకాంచనరథంబెక్కి=అగునట్టిబంగారు తేరెక్కి. అనురక్తులైన = ప్రీతిగలవారైన. భూసురులును=బ్రాహ్మణులును. ఉద్ధవాదులు=ఉద్ధవుఁడు మొదలగువారు. అగుకులవృద్ధులును= అగునట్టితమకులములోని పెద్దవారును. సేవింపన్ =తన్నుకొలువఁగా. కరిపురంబునకున్ =హస్తినాపట్టణమునకు. చని=పోయి. తత్పురోపకంఠవనంబునన్ = ఆపట్టణము వెంబడి తోపునందు. సురభి ... తలంబునన్ —సురభి=మంచివాసనగల. కుసుమ=పువ్వులచేతను. ఫల=పండ్లచేతను. భరిత=నిండిన. తరు=వృక్షములయొక్క. ఛాయా=నీడలయందు. విరచిత=చేయఁబడిన. చంద్రకాంత శిలాతలంబు నందున్ = చంద్రకాంతపురాళ్లుగల ప్రదేశములయందు — చంద్రకాంతపురాళ్లు పఱచిన ప్రదేశమునందనుట. వసియించి = ఉనికిచేసికొని. మహిత గ్రహమధ్యగతుండు — మహిత = మహిమగల. గ్రహ = శుక్రాది గ్రహములయొక్క. మధ్యగతుండు = నడుమనుండువాఁడు. అయిన పూర్ణచంద్రున్ = అయినట్టి నిండుచంద్రుని. అనుకరించి = పోలి. (ఉండెను) అంతన్ =అంతట. కార్యబోధనంబుసేయుటకై = తాము వచ్చిన కార్యమును తెలియఁజేయుట కొఱకు. ప్రబుద్ధుండు=మిక్కిలి బుద్ధిమంతుఁడు. (అయినయుద్ధవుని) కౌరవ్యులయొద్దకున్ =కురువంశమునందుఁబుట్టినదుర్యోధనుఁడు మొదలగువారియొద్దకు. పనిచినంజని= పంపఁగాఁబోయి. అతండు=ఆయుద్ధవుఁడు. ఆంబికేయునకున్ =ధృతరాష్ట్రునకును. ధనురాచార్యాపగా తనూభవ సుయోధనులకున్ = ద్రోణభీష్మదుర్యోధనులకును. ప్రణమిల్లి=నమస్కరించి. వారిచేతన్ = ఆధృతరాష్ట్రుఁడు మొదలగువారిచేత. అభినందితుండై=సమ్మానింపఁబడినవాఁడై. (ఇట్లనియెను)

తా|| బలరాముఁడు ఇట్లుచెప్పి తమవారిని దండెత్తి పోకుండనిలిపి బంధువులయందు ప్రీతిగలవాఁడు గనుక తాను అప్పుడే బయలుదేరి అగ్నివలెను సూర్యునివలెను వెలుఁగుచున్న బంగారుతేరెక్కి ఉద్ధవుఁడు మొదలయిన తమకులవృద్ధులు కొందఱు తనవెంట రాఁగా హస్తినా

పట్టణమునకుపోయి ఆపట్టణము వెంబడి నుండెడి యొకతోఁపులో దిగి అందలి చెట్లనీడలయందు చంద్రకాంతపురాళ్లు పఱచిననిర్మలప్రదేశమునందు ఉండి తమవచ్చిన పనిని కౌరవులకు తెలియఁజేయుటకై మిక్కిలి బుద్ధిమంతుఁడైనయుద్ధవుని(బం)పెను, అతఁడును అచ్చటికిపోయి తొలుత ధృతరాష్ట్రునకు నమస్కరించి పిమ్మట ద్రోణభీష్ములకును దుర్యోధనునకు మ్రొక్కి వారిచేత సన్మానింపఁబడిన వాఁడై యిట్లుపలికెననిరి బ్రాహ్మణులు.




(*) బలరాముఁడు దుర్యోధనునితో సంభాషించుట. (*)

౭౧౭.—సీ॥ భూరి యశోధను * లార తాలాంకుండు - చనుదెంచి నగరోప * వనమునందు
నున్నవాఁడనిన వా * రుత్సాహమున బలుఁ - బొడగను వేడుక * బుద్ధిఁదోఁపఁ
దనరారఁ గానుక * ల్గొనిచని యర్ఘ్యపా - ద్యాదిసత్కృతులు నె * య్యమునఁజేసి
ధేనువునిచ్చి స * న్మానించి యందఱు - నందంద వందనం * బాచరించి
తే॥ యుచితభంగిని యచటఁగూ * ర్చున్నయెడను । గుశలమే మీకు మాకును * గుశలమనుచుఁ
బలికె రాముఁడు కురునర * పాలుఁజూచి । యచటి జనములువినఁగ ని * ట్లనియెఁ దెలియ.

టీ॥ భూరియశోధనులార=అధిక మైన కీర్తియే ధనముగాఁగలిగిన యోప్రభువులారా. తాలాంకుండు=బలరాముఁడు. చనుదెంచి=వచ్చి. నగరోప వనమునందున్=పట్టణము వెంబడితోఁపులో. ఉన్నవాఁడు=ఉన్నాఁడు. అనినన్=అనఁగా (వారు) ఉత్సాహమునన్=పూనికతో. బలున్=బలరాముని. పొడగను వేడుక=చూచుటయందలి కుతూహలము. బుద్ధిన్=బుద్ధియందు. తోఁపన్=కనఁబడఁగా. తనరారన్=ఒప్పిదముగా. (కానుకలు) కొని=తీసికొని. చని=పోయి. అర్ఘ్యపాద్యాదిసత్కృతులు=అర్ఘ్యము పాద్యము మొదలగుమర్యాదలు. నెయ్యమునన్=ప్రీతితో. (చేసి) ధేనువునిచ్చి=ఆవునిచ్చి. సన్మానించి=గౌరవించి. (అందఱును) అందందన్=పునః పునః. వందనంబు=నమస్కారము. ఆచరించి=చేసి. ఉచితభంగిని=తగినరీతితో. అచటన్=అక్కడ. కూర్చున్నయెడన్=కూర్చుండినప్పుడు. కురునరపాలున్=దుర్యోధనుని. (చూచి) రాముఁడు=బలరాముఁడు. మీకున్=మీకు. కుశలమే=క్షేమమా. మాకున్=మాకు. కుశలము=క్షేమము. అనుచుఁబలికి=అనిచెప్పి. అచటిజనములు=అక్కడనున్నజనులు. వినఁగన్=వినునట్లుగాను. తెలియన్=స్పష్టముగాను. ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

తా॥ అధికమయిన కీర్తియే ధనముగాఁగల ప్రభువులారా! బలరాముఁడు మీపట్టణము నొద్దనుండు తోఁపులో వచ్చి దిగియున్నాఁడు అనఁగా వారు మిక్కిలి యుత్సాహముతో బలరామునిఁ జూడవలెనను కుతూహలము గలవారయి ఆయనకుఁదగినకానుకలను ఎత్తుకొనిపోయి అర్ఘ్యము పాద్యము మొదలగు ఉపచారముల చేత ఆబలరాముని

పూజించి అర్ఘ్యనిచ్చి మర్యాదచేసి పలుమారు మ్రొక్కి తగిన విధమున అక్కడ కూర్చుండిరి అప్పుడు బలరాముఁడు దుర్యోధనుని జూచి మీకు మేలా మూకమేలేయని చెప్పుచు అక్కడనున్న జనులందఱు వినునట్లు విశదముగా నొకమాట చెప్పెనని తాత్పర్యము.

౬౧౩.—ఉ॥ మానరనాథు నాజ్ఞ నిజ * మస్తములన్ ధరియించి కౌరవుల్
మానుగఁ జేయు టొప్పుగుఁ గు * మారకు నొక్కనిఁ బెక్కు యాధవుల్
పూనిన లావుమై నెదిరి * పోర జయించుట మీఁది తప్పు త
ప్పైనను గాచె బాంధవ హి * తాత్మకుఁడై మనుజాధి నాథుఁడున్.

టీ॥ మానరనాథు నాజ్ఞన్=మా రాజైన ఉగ్రసేనునియుత్తరువును. నిజమస్తములన్ ధరియించి=శిరసావహించి. కౌరవులు=కురువంశస్థులు మానుగన్=ఒప్పునట్లుగా. చేయుట=నడపుట. ఒప్పుగున్=యుక్తమగును. కుమారకు నొక్కనిన్=ఒక్క చిన్నవానిని. పెక్కు యాధవులు=అనేకులు యోధులు. పూనినలావుమైన్=తాముపూనుకొన్న బలముతో. ఎదిరి=ఎదిరించి. పోరన్=యుద్ధమునందు. (జయించుట) మీఁది తప్పు=మీ నేరము. మనుజాధినాథుఁడు=రాజు. తప్పైనను=అది తప్పుగానున్నను. బాంధవహితాత్మకుఁడై=చుట్టములకు మేలు గోరినమనస్సు గలవాఁడై. కాచెన్=మన్నించెను.

తా॥ మీరు మా రాజు యుత్తరువును తప్పక నడప వలయును మీరు అనేకులు ఒకటిగాఁగూడి ఒంటరివాఁడైన పిల్లకాయను నిర్బంధ పెట్టినందున తప్పు మీయందే కలదు ఐన మా రాజు మీ తప్పును సహించినాఁడని తా.

౬౧౪.—క॥ అనుమాటలువిని కౌరవ । జననాయకుఁ డాత్మఁగలఁగి * చాలుఁ బురే యే
మనఁగలదు కాలగతి చ । క్కనఁ గాలందొడుగుపాదు * కలు దలకెక్కెన్.

టీ॥ (అనుమాటలువిని) కౌరవజననాయకుఁడు=దుర్యోధనుఁడు. ఆత్మన్=మనసులో. కలఁగి=కలవరమునొంది. చాలున్=నీమర్యాద చాలును. పురే=ఔరా? కాలగతిచక్కనన్=కాలముపోవు చక్కఁదనమును. ఏమనఁగలదు = ఏమి చెప్పవచ్చును. కాలన్=కాలిలో. తొడుగుపాదుకలు = పెట్టుకొనునట్టి పావకోళ్లు. (తలకెక్కెను)

తా॥ అని బలరాముఁడు చెప్పిన మాటలను విని దుర్యోధనుఁడు కోపించినవాఁడై తమవారినిఁ జూచి చాలును నీమర్యాద ఔరా? ఈ కాలమునకు వచ్చిన విపరీతత్వమును ఏమనవచ్చును కాలికి తగిలించుకొను పావకోళ్లు తమంతట తలకు వచ్చి మన సేవకులుగానుండఁదగిన యాదవులకు ఎంతగొప్పఁదనము కలిగెను అనిపలికెనని తా.

౬౧౫.—ఆ॥ మనము బంధువరుస * మన్నించు మన్ననఁ । గాదె రాజ్యభోగ * గరిమఁ బొదలి
వసుధఁ బేరుగలిగి * వాసికి నెక్కుట । దమకు ననుభవింపఁ * దగినయట్టి.

టీ॥ (మనము) బంధువరుసన్ = చుట్టపుమేరచేత. మన్నించు మన్ననన్=గౌరవించుగౌరవముచేతనే. కాదె=కదా. రాజ్యభోగ గరిమన్ = దొరతనపు సౌఖ్యముయొక్క మేలిమిచేత. పొదలి=అతిశయించి. వసుధన్=భూమియందు. పేరుగలిగి = వీరు ఇట్టివారు అను పేరుకలవారై. వాసికినెక్కుట = ప్రసిద్ధినొందుట. (తమకు) అనుభవింపఁదగినయట్టి = అనుభవించుటకుఁ దగినటువంటి.

వ॥ సితచ్ఛత్ర చామరశంఖ కిరీటచిత్రశయ్యా సౌధసింహాసనంబులు గైకొనుట మనమందె మేలంబునఁగాదె యట్టిచో సరివారునుంబోలె నూరక గర్వించు యదుకులులతోడి సంబంధసఖ్యంబులు చాలుఁ బాములకుఁ బాలుపోసి పెంచినను విషంబుదప్పునే మమ్ముఁ దమపనుపు సేయుమనుట సిగ్గులేకుంటగాదె యది యునుంగాక దివ్యాస్త్రకోవిదులగు గంగానందనగురు కృపాశ్వత్థామ కర్ణాదియోధవీరులకు లోఁబడ్డ వానిని మహేంద్రునకైనను విడిపింపవచ్చునే యహహ వృధాజల్పంబుల కేమిపనియని దుర్భాషలాడుచు దిగ్గనలేచి నిజ మందిరంబునకుం జనియె నప్పుడు హలాయుధుం డమ్మాటల కదరిపడి.

టీ॥ సితచ్ఛత్ర...బులు—సితచ్ఛత్ర = తెల్లగొడుగు. చామర=వింజామరలు. శంఖ=శంఖము. కిరీట = కిరీటము. చిత్రశయ్యా=చిత్తరువులతోడి పఱుపులు. సౌధ=మేడలు. సింహాసనంబులు=సింహాసనములు. కైకొనుట = అంగీకరించుట—కలుగఁజేసికొనుట. మనమందె మేలంబునంగాదె=మనయుపేక్ష చేతనే కదా — మనము ఆక్షేపింపక పోనిమ్మని యూరకుండుటచేతనే కదా. అట్టిచోన్=అట్లుండఁగా. సరివారునుంబోలెన్ = మనతో సమానులవలెనే. ఊరక=మిక్కిలి. గర్వించు=గర్వమును పొందునట్టి. యదుకులులతోడి సంబంధసఖ్యంబులు = యాదవులతోడి పైన యిచ్చి పుచ్చుకోళ్లును—స్నేహమును. చాలున్ = ఇంతమట్టుకు చాలును. (పాములకుఁ బాలుపోసి పెంచినను) విషంబుదప్పునే=వానికిఁగలవిషముపోవునా. మమ్మున్=మమ్మును. తమపనుపుసేయుమనుట=తమయుత్తరువుచొప్పున నడుచుకొనుమనుట. సిగ్గులేకుంట=సిగ్గులేకయుండుట. కాదె=కదా. (అది యనుంగాక) దివ్యాస్త్రకోవిదులు=దివ్యములైన అస్త్రవిద్యలందు పండితులు. అగుగంగానందనగురు...వీరులకున్—అగు=అగునట్టి. గంగానందన=భీష్ముఁడు. గురు=ద్రోణాచార్యులు. కృప=కృపాచార్యులు. (అశ్వత్థామ) కర్ణ=కర్ణుఁడు. ఆది = మొదలుగాఁగల. యోధవీరులకున్ = శూరులయిన యోధులకు. లోఁబడ్డవానిన్ = చిక్కినవానిని. మహేంద్రునకైనన్ = దేవేంద్రునికైనను. విడిపింపవచ్చునే = విడుదలచేయశక్యమగునా. అహహా = ఔరా. వృథా

ల్పంబులకున్ = వట్టిపనికిమాటలకు. ఏమిపని = ప్రయోజనమేమి. (అని) దుర్భాషలాడుచున్ = చెడ్డపలుకులుపలుకుచు. దిగ్గనన్ = తటాలున. (లేచి) నిజమందిరంబునకున్ = తనయింటికి. చనియెన్ = పోయెను. (అప్పుడు) హలాయుధుండు = బలరాముఁడు. అమ్మాటలకున్ = ఆదుర్యోధనుఁడాడినమాటలకు. అదిరిపడి = కోపించి.

తా॥ మనము చుట్టములనెడు మర్యాద ఒకటిపెట్టుకొని గౌరవించునట్టి గౌరవముచేతనేకదా వీరు రాజ్యసౌఖ్యమును అనుభవించుటకును లోకములో తమపేరు ప్రసిద్ధికెక్కుటకును ఇంకను తమ అనుభవమునకు తగిన తెల్లగొడుగులు వింజామరములు శంఖములు కిరీటములు పానుపులు నగళ్లు సింహాసనములు మొదలగువానిని పొంది సుఖించుటకు తగినవారైరి అట్లుగాక మనమునాడే అణఁగఁద్రొక్కియున్న అణఁగిపోయియుండువారే అగుదురుకదా అట్లుండఁగా మిక్కిలిగర్వించి తమపరువు తెలియక మనతో సమానులైనవారివలెనే మాటలాడునట్టి యాదవులతోడి బంధుత్వమును స్నేహమును ఇంతమట్టుకు చాలును ఎక్కడనైన పాములకు పాలుపోసి పెంచిన విషము పెరుగునుగాని పాలగుణము వానియందుకలుగునా కాఁబట్టి యిప్పుడు తమయాజ్ఞను మనము నడపవలెనని యితఁడు పలుకుచున్నాఁడు ఇట్లు పలుకుట సిగ్గులేకయేకదా అదియట్లుండఁగా అస్త్రవిద్యలందు మిక్కిలిపండితులైను ప్రసిద్ధివహించినభీష్మద్రోణ కృపా శ్వత్థామ కర్ణులు మొదలుగాఁగల గొప్పయోధులచేత చిక్కిన మనుష్యుని విడిపించుటకు దేవేంద్రునకైన శక్యమా శక్యముకాదు కాఁబట్టి యీపనికిమాలినమాటలవల్ల ప్రయోజనము లేదు అని అనేకములయిన అక్రమపుమాటలాడుచు దుర్యోధనుఁడు ఆతావువిడిచి తనయింటికిఁ బోయిచేరెను అంతట బలరాముఁడు కోపించినవాఁడై అని తాత్పర్యము.

౬౧౭.—ఉ॥ కౌరవు లాడిపోయిన య * గౌరవ భాషల కాత్మఁ గిన్కయే
పారఁగ నుల్ల సత్ప్రళయ * భానుని కైవడి మండి చండ రో
షారుణ తాంబకుండగుచు * యాదవ వృద్ధులఁ జూచి పల్కెఁ బెం
పారిన రాజ్యవైభవ మ * దాంధుల మాటలు మీరు వింటిరే.

టీ॥ కౌరవులు = దుర్యోధనుఁడు మొదలగువారు. ఆడిపోయిన యగౌరవభాషలకున్ = చెప్పిపోయినచిన్నతనపుమాటలకు. ఆత్మన్ = తనలో. కిన్క = కోపము. ఏపారఁగన్ = అతిశయింపఁగా. ఉల్లసత్ప్రళయభానునికైవడిన్ = మిక్కిలి వెలుఁగునట్టి ప్రళయకాలపు సూర్యునివలె. మండి = వేండ్రమును కనఁబఱచి. చండరోషారుణితాంబకుండు = మిక్కుటమగు కోపముచేత ఎఱ్ఱవాఱిన కన్నులుగలవాఁడు. (అగుచును) యాదవవృద్ధులన్ = యదువంశస్థులలో పెద్దలగువారిని. (చూచి) పల్కెన్ = ఇట్లుచెప్పెను. పెంపారిన ... మాటలు—పెంపు = వృద్ధి. ఆరిన = అతిశయించిన. రాజ్య = దొరతనము యొక్క. వైభవ = సుఖానుభవమువలని. మద = క్రొవ్వుచేత. అంధుల = కన్నుగాననివారైన కౌరవులయొక్క. మాటలు = పలుకులను. మీరువింటిరే = మీరువిన్నారుగదా.

తా॥ అప్పుడు దుర్యోధనుఁడు మొదలగువారు అని పోయిన చిన్నతనపుమాటలను విని బలరాముఁడు తనమనసున కోపము హెచ్చఁగా ప్రళయకాలపు సూర్యునివలె మండిపడి తనకోపవేగమును కనఁబఱచుచు కన్నులు ఎఱ్ఱవాఱఁగా తమవారైనయాదవులలో వృద్ధులుగా నుండువారిని జూచి మించిన రాజ్యగర్వముచేత కన్నుగానక యీకౌరవులు చెప్పిపోయినమాటలను మీరుచక్కగా వింటిరిగదా అని అడిగెనని తాత్పర్యము.

౬౧౮.—తే॥ శ్రీమదాంధులు సామంబు * చేతఁ జక్కఁ । బడుదురే యెందుబోయఁడు * పసులఁదోలు
పగిది నుగ్రభుజా విజృం * భణ సమగ్ర । సుమహితాటోపమని లోనఁ * జూపకున్న.

టీ॥ ఎందున్ = ఎచ్చటను. శ్రీమదాంధులు = సంపదవలని క్రొవ్వుచేత కన్నుగాననివారు. బోయఁడు = బోయవాఁడు. పసులన్ = పశువులను — మృగములను. తోలుపగిదిన్ = తఱుమునట్లు. ఉగ్ర ... టోపము—ఉగ్ర = భయంకరమయిన. భుజా = చేతులయొక్క. విజృంభణ = రేఁగుటతోడి. సమగ్ర = పూర్ణమయిన. సుమహిత = మిక్కిలిఅధికమయిన. ఆటోపము = పరాక్రమమును. అనిలోనన్ = యుద్ధమునందు. చూపకున్నన్ = కనఁబఱుపకయుండినను. సామంబు చేతన్ = మంచితనముచేత. చక్కఁబడుదురే = బాగుపడుదురా.

తా॥ ఎక్కడనైనను సరే కలిమివలని క్రొవ్వుచేత కన్నుగానని దుష్టులు మృగములను వేఁటాడునట్టి బోయవానివలె యుద్ధమునందు కొఱఁతలేని భుజబలము కనఁబడ మిక్కిలి గౌరవమును జూపునట్టి పరాక్రమమునుచూపక మంచిమాటలతో అనుకూలించివత్తురా అని తా.

౬౧౯.—క॥ కౌరవుల సమయఁజేయ ను । దారతయదువీరవరులు * దామోదరుఁడున్
రా రావలదని యచ్చట । వారించితిఁగాదె బంధు * వత్సల యుక్తిన్.

టీ॥ బంధువత్సలయుక్తిన్ = చుట్టములందలి వాత్సల్యముతోడి కూడికతో. కౌరవులన్ = కురువంశస్థులను. సమయఁజేయన్ = చంపుటకు. ఉదారతన్ = ఉత్సాహముతో. యదువీరవరులును = యాదవవీరులలో గొప్పవారగువారును. దామోదరుఁడును = కృష్ణుఁడును. రాన్ = రాఁగా. రావలదని = మీరురావద్దనిచెప్పి. అచ్చటన్ = అక్కడ—ద్వారకలో. వారించితిఁగాదె = నిలిపితినిగదా.

తా॥ కౌరవులను చంపవలెనని యాదవయోధులును కృష్ణుఁడును బయలుదేఱఁగా కౌరవులు మనకు చుట్టములే వారిని చంపవచ్చునాయని వీరియందలి వాత్సల్యముచేత అందఱిని ద్వారకలోనే నిలిపివచ్చితినిగదా అని తాత్పర్యము. వ॥ అదియునుంగాక.

౬౨౦.—సీ॥ ఏదేవు భృత్యులై * యింద్రాది దిక్పాల - వరులు భజింతురు * వరుసతోడ
నేదేవు మందిరం * బేపారి దేవతా - తరుసభా విభవ సుం * దరతఁ జెందు
నేదేవు పదయుగం * బేప్రొద్దు సేవించు - నఖిల లోకైక మా * తైనలక్ష్మి
యేదేవు చారుస * మిద్ధ కళాంశ సం - భవులము పద్మజ * భవులు నేము

తే॥ నట్టిదేవుండు దుష్టసం * హారకుండు। హరి ముకుందుఁడు పంపు సే * యంగనొప్పు
నుగ్రసేనుని రాజ్య స * మగ్ర గరిమ। యంతయును దార యిచ్చిన * దఁట తలంప.

టీ॥ తలంపన్=విచారింపఁగా. ఏదేవుభృత్యులై = ఏదేవునికి బంటులై. ఇంద్రాదిదిక్పాలవరులు = ఇంద్రుఁడు మొదలుగాఁగల దిక్పాలకశ్రేష్ఠులు. వరుసతోడన్=క్రమముగా. భజింతురు=సేవింతురో. ఏదేవుమందిరంబు=ఏదేవునియొక్కయిల్లు. ఏపారి=అతిశయించి. దేవతాతరుసభావిభవసుందరతన్—దేవతా=దేవతలదైన. తరు=వృక్షముయొక్కయు. సభా=సభయొక్కయు. విభవ=ఐశ్వర్యముతోడి. సుందరతన్=సౌందర్యమును. చెందున్=పొందునో. ఏదేవుపదయుగంబు = ఏదేవునియొక్క యడుగులజంటను. అఖిలలోకైకమాత=ఎల్లలోకములకు నొకటియైనతల్లి. ఐనలక్ష్మి=అయినట్టిలక్ష్మీదేవి. ఏప్రొద్దున్=సర్వదా. సేవించున్=కొలుచునో. పద్మజభవులును = బ్రహ్మరుద్రులును. ఏమును = మేమును. ఏదేవుచారుసమిద్ధకళాంశసంభవులము=ఏదేవునియొక్క మనోజ్ఞమై వెలుఁగునట్టికళాభాగమునందు అవతరించినవారమో. అట్టిదేవుండు=అటువంటిదేవుఁడైన. దుష్టసంహారకుండు=దుష్టులను చంపువాఁడును. హరి=ఎల్లపాపములనుహరించువాఁడునైన. ముకుందుఁడు=ఇహపరసుఖములనిచ్చునట్టిశ్రీకృష్ణమూర్తి. పంపుసేయంగన్=చెప్పినపనులు చేయుచుండఁగా. ఒప్పునుగ్రసేనునిరాజ్యసమగ్రగరిమ — ఒప్పు = ఒప్పుచుండునట్టి. ఉగ్రసేనుని=ఉగ్రసేనమహారాజుయొక్క. రాజ్య=దొరతనముయొక్క. సమగ్ర=పూర్ణమైన—కొఱఁతలేని. గరిమ=గౌరవము. (అంతయును) తారయిచ్చినదఁట=తామేయిచ్చినదఁట.

తా॥ ఏదేవునికి ఇంద్రుఁడు మొదలగు దిక్పాలకులు సైతము సేవకులై వరుసగానిలిచి కొలుచుచుందురో, దేవతలవైనకల్పవృక్షమును సుధర్మయను సభయును ఏదేవునియింటిలో అందగిల్లుచుండునో, ఎల్లలోకములకు తల్లియైన లక్ష్మీదేవి యేదేవుని అడుగులను ఎల్లప్పుడుఆశ్రయించియుండునో, బ్రహ్మరుద్రాదులును మేమును ఏదేవునియొక్క వెలుఁగొందునట్టి తేజస్సు నంశమువలన జనించినవారమో, అటువంటి దుష్టసంహారము చేయువాఁడును, ఎల్లపాపములనుహరించువాఁడునైనదేవుఁడుచెప్పినపనులు చేయుచుండఁగా జరగుచున్న ఉగ్రసేనమహారాజు రాజ్యసంపదయంతయు ఈకౌరవులు దయచేసి యిచ్చినదఁట వింటిరా అని తాత్పర్యము.

౬౨౧.—చ॥ అదియునుగాక యెవ్వని ప * దాంబుజ చారు రజోవితాన మా
త్రిదివ వరాది దిక్పతి కి * రీటములందు నలంకరించు భూ
విదితముఁ దీర్థతీర్థముఁ బ * విత్రము నయ్యెడు నట్టి కృష్ణుచేఁ
బొదలిన రాజ్యచిహ్నములఁ * బొందఁగ రాదఁట యేమిచోద్యమో.

టీ॥ అదియునుగాక=అదిమాత్రముగాక. ఎవ్వని...వితానము—ఎవ్వని=ఏదేవునియొక్క. పదాంబుజ=పాదకమలములవలని. చారు=ఒప్పిదమయిన. రజః=దుమ్ముయొక్క. వితానము=సమూహము. ఆత్రిదివ...లందున్—ఆ = ప్రసిద్ధులైన. త్రిదివవరాది = దేవేంద్రుఁడు మొదలుగాఁగల. దిక్పతి=దిక్పాలకులయొక్క. (కిరీటములందును) అలంకరించున్=అలంకారముచేయునో. భూవిదితమున్ = భూలోకమునందు ప్రసిద్ధమును. తీర్థతీర్థమున్=గురువునకు గురువును. ని॥ నిపానాగమయోస్తీర్థ మృషిజుష్టజలేగురౌ ॥ అని అమరము. తీర్థం శాస్త్రాధ్వరక్షేత్రో పాయోపాధ్యాయమంత్రిషు। అవతారర్షిజుష్టాంభస్త్రీరజస్సుచ॥అనివిశ్వము. పవిత్రము=పావనమును. అయ్యెడునట్టి=అగునట్టి. కృష్ణుచేన్=శ్రీకృష్ణమూర్తిచేత. పొదలిన = వృద్ధిపొందిన. రాజ్యచిహ్నములన్ = దొరతనపుబిరుదులను. పొందఁగరాదఁట = మేముపొందఁగూడదట. ఏమిచోద్యమో = ఇదియేమి వింతయో.

తా॥ అంతేగాక యెవనియొక్క పాదధూళిని యింద్రుఁడు మొదలగుదిక్పాలకులు తమకిరీటములకు అలంకారముగా గ్రహించుచున్నారో లోకమునందు ప్రసిద్ధికెక్కినవాఁడును, గురువులకెల్ల గురువును పరిశుద్ధుఁడును ఎవఁడో అటువంటి శ్రీకృష్ణమూర్తి అనుగ్రహమువలన పొందఁబడి వర్ధిల్లుచున్న రాజ్యచిహ్నములను మేము వహింపఁగూడదఁటఇదియెంతవింతగానున్నదో చూచితిరాయనితా.

౬౨౨.—క॥ తామఁట తలఁపఁగఁ దలలఁట। యేమఁట పాదుకలమఁట గ * ణింపఁగ రాజ్య
శ్రీమదమున నిట్లాడిన। యీమనుజాధముల మాట * లేమన వచ్చున్.

టీ॥ తలఁపఁగన్=విచారింపఁగా. (తామఁటతలలఁట)—అంగములలో శిరస్సువలెశ్రేష్ఠులఁట. (ఏమఁట పాదుకలమట)—కాళ్లకుఁ దొడుగుకొను పావకోళ్లవలె నికృష్టులమఁట. గణింపఁగన్ = ఎంచఁగా. రాజ్యశ్రీమదమునన్ = దొరతనపు కలిమివలని క్రొవ్వుచేత. (ఇట్లాడిన) ఈమనుజాధముల = క్షుద్రులైన మానవులయొక్క. (మాటలు) ఏమనవచ్చున్=ఏమియుత్తరము లనవచ్చును.

తా॥ ఈ నికృష్టులగు దుష్టులు ఆడినమాటలు ఎట్లున్నవో చూడుఁడు తాముతలలవంటివారని మేము పావకోళ్లవంటివారమని పలికిరి తాము రాజ్యాధిపతులు అను మదముచేత దేహములు తెలియక ఆడినమాటలకు బదులుమనము ఏమిచెప్పవచ్చునని తాత్పర్యము.

౬౨౩.—వ॥ అని క్రోధ మానసుండై యప్పుడు.

తా॥ అని యిట్లు పలికి ఆసమయమందు కోపమునొందిన మనసుగలవాఁడై అని తాత్పర్యము.

౬౨౪.—క॥ ధారుణి నిటమీఁదట ని । ష్కౌరవముగఁ జేయకున్నఁ * గాదని యుగ్రా
కారుండై బలభద్రుఁడు । సీరము వెసఁబూన్చి లావుఁ * జేవయు నెసఁగన్.

టీ॥ (బలభద్రుఁడు) ఇటమీఁదటన్=ఇఁకమీఁదను. ధారుణిన్=భూమియందు. నిష్కౌరవముగన్=కౌరవులను పేరు లేకుండునట్లుగా చేయకున్నన్=చేయక యూరకున్న పక్షమున. కాదు = సరి పడదు. (అని) ఉగ్రాకారుండై=ఉగ్రమయిన ఆకారము గలవాఁడై. సీరమున్=నాఁగేటిని. వెసన్=వడితో. పూన్చి=మొనయించి. లావున్=బలమును. చేవయున్=ధైర్యమును. ఎసఁగన్=అతిశయింపఁగా.

తా॥ బలరాముఁడు ఇఁకమీఁద భూమిలో కౌరవులు అను పేరు లేకుండఁ జేయక సరిపడదని భయంకరమైన ఆకారము కలవాఁడు అయి సాహసము అతిశయింపఁగా తన ఆయుధమయిన నాఁగేటిని వడిగా మొనయించి అని తాత్పర్యము.



(*) బలరాముఁడు హస్తినాపురమును గంగలోఁ ద్రోయఁ బూనుట. (*)

వ॥ ఇట్లు పూన్చి కౌరవరాజధానియైన కరినగరంబు కడతల గరతల హలాగ్రంబున జొనిపి పూని యప్పుటభేదన విస్తారంబగు నాభూఖండంబు భుజాబలగర్వ దుర్వారుండై తిగిచి గంగాప్రవాహంబునం బడఁద్రోయ గమకించిన నప్పుడు మహాజల మధ్యవిలోలంబగు నావచందంబున నన్నగరంబు వడంకుచు గోపుర వప్ర ప్రాకార సౌధాట్టాలక తోరణధ్వజ ద్వార కవాట కుడ్య వీథీయుతంబుగా నొడ్డగిలిపడం బౌరజనంబులకుఁ బుడమినడుగు లిడంగరాక వడవడ వడంకుచు నార్తులై కుయ్యిడుచున్నట్టియెడ నమ్మహోత్పాతంబు గనుంగొని తాలాంకుండు కినుక వాడమి కావించిన యుపద్రవంబుగా నెఱింగి దానికిఁ బ్రతీకారంబు లేమిని గళవళంబున భయాకులమానసులై పుత్ర మిత్ర కళత్ర బంధు భృత్య పౌరజన సమేతంబుగా భీష్మ సుయోధనాది కౌరవ్యులు వేగంబున నతని చరణంబులు శరణంబులుగాఁ దలంచి సాంబునిం గన్యకాయుక్తంబుగా ననేక మణిమయ భూషణాంబర జాలంబులతోఁ దోడుకవచ్చి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మోడ్చి యిట్లనిరి.

టీ॥ (ఇట్లుపూన్చి) కౌరవరాజధాని = కురువంశస్థుల పట్టణము. అయిన కరినగరంబు కడతల=అయినట్టి హస్తినాపట్టణము యొక్క కొన తట్టు. కరతలహలాగ్రంబును=చేతియందలి నాఁగేటికొనను=జొనిపి=చొప్పించి. (పూని) అప్పుటభేదనవిస్తారంబు = ఆపట్టణపు విరివిగలది. అగు నాభూఖండంబున్=అగునట్టి యాభూఖండమును. భుజాబలగర్వదుర్వారుండై = భుజబల గర్వముచేత అడ్డగింపరాని వాఁడై. తిగిచి=లాఁగి. గంగాప్రవాహంబునన్=ప్రవాహరూపమైన గంగలో. పడఁద్రోయన్=పడఁద్రోయుటకు. గమకించినన్ = ప్రయత్నింపఁగా. అప్పుడు=ఆసమయమునందు. మహాజలమధ్య విలోలంబు=అయధికజలమునందుమతిరుగునది—అనఁగా సముద్రమునందుమత్తతిల్లుచునది. (అగు) నావచందంబునన్=ఓడవలె. అన్నగరంబు=ఆపట్టణము. వడంకుచున్=అల్లాడుచును. గోపుర...యుతంబుగాన్—గోపుర = గోపురములు. వప్ర=కోటప్రక్కనుండు కొరళ్లు మొదలగునవి. ప్రాకార=కోటలు. సౌధ=నగళ్లు. అట్టాలక = కోటకొత్తళముమీఁదియిండ్లు. తోరణ=తలవాకిళ్లు. ధ్వజ = ధ్వజస్తంభములు. ద్వార = దారబంధములు. కవాట = తలుపులు. కుడ్య = గోడలు. వీథీ = ఇండ్లవరుసలనడిమి దారులు. యుతంబుగాన్ = వీనితోఁగూడ. ఒడ్డగిలి = ఒకప్రక్కకు ప్రమొగ్గి. పడన్=పడఁగా. పౌరజనంబులకున్. పట్టణములోనివసనుష్యులకు. పుడమిన్=భూమియందు. అడుగులిడంగరాక=అడుగులు పెట్టుటకుసరిపడక. వడవడవడంకుచున్=గడగడవణఁకుచు. ఆర్తులై=దుఃఖము నొందినవారై. కుయ్యిడుచున్నట్టియెడన్ = మొఱపెట్టుచుండఁగా. అమ్మహోత్పాతంబు=అగొప్పయుపద్రవమును. కనుంగొని=

చూచి. తాలాంకుండు=బలరాముఁడు. కినుక=కోపము. పొడమి=కలిగి. కావించినయుపద్రవంబుగాన్=చేసినబాధగా. ఎఱింగి=తెలిసికొని. దానికిన్ = ఆయుపద్రవమునకు. ప్రతీకారంబు = ప్రతిక్రియ. లేమిని=లేకుండుటచేత. కళవళంబునన్=సంకటపాటుతో. భయాకులమానసులై=భయముచేత కలవరము నొందిన మనసులు గలవారై. పుత్ర...సమేతంబుగాన్ — పుత్ర=కొడుకులతోడను. మిత్ర=స్నేహితులతోడను. కళత్ర=పెండ్లాలతోడను. బంధు = చుట్టములతోడను. భృత్య = సేవకులతోడను. పౌరజన = పురజనులతోడను. సమేతంబుగాన్=కూడుకొన్న వారై. భీష్మసుయోధనాది=భీష్ముఁడు దుర్యోధనుఁడు మొదలుగాఁగల. కౌరవ్యులు = కురువంశస్థులు = వేగంబునన్ = వడితో. అతనిచరణంబులు = ఆబలరాముని పాదములు. శరణంబులుగాన్ = రక్షకములు అగునట్లుగా. తలంచి = ఎంచి. (సాంబుని) కన్యకా యుక్తంబుగాన్ = పెండ్లికూఁతుతోఁగూడ. అనేక...జాలంబులతోన్—అనేక=పెక్కులయిన. మణిమయ=రత్నమయములయిన. భూషణ = ఆభరణములయు. అంబర = వస్త్రములయు. జాలంబులతోన్=సముదాయములతో. తోడుకవచ్చి=పిలుచుకొనివచ్చి. దండప్రణామంబులాచరించి=సాగిలఁబడిమ్రొక్కి. కరకమలంబులు మోడ్చి=హస్తకమలములనుముకుళించుకొని. (ఇట్లనిరి)

తా॥ ఈవిధముగా బలరాముఁడు తన హలాయుధమును మోపియుంచి హస్తినాపట్టణము యొక్క ఒక వోరను అడుగుతట్టుగా చొప్పించి ప్రయత్నపూర్వకముగా ఆపట్టణము కట్టఁబడి యుండునంతనేలయు పెల్లగించి గంగలోఁ ద్రోయువాఁడైలాఁగి యెత్తఁగా అప్పుడు ఆపట్టణము సముద్రమునందుఁ జిక్కుకొన్న ఓడవలె అల్లాడుచు గోపురములు ప్రాకారములు కోటలు కొత్తళములమీఁది యిండ్లు రాజ్యులనగల్లు మేడలు వీధులు గోడలు తలుపులు ద్వారబంధములు మొదలుగాఁగల వానితోడ ఒకప్రక్కకు ఒరగఁగా పట్టణములోని జనులకు కాలు ఊని నిలుచుటకుశక్యము గాక ఎల్లవారును దుఃఖము నొందినవారయి మొఱ్ఱో యని మొఱపెట్టుచుండిరి ఆసమయమునందు ఆయుపద్రవము బలరాముఁడు మిక్కిలికోపించి చేసిన ఉపద్రవముగాఁ దెలిసికొని భీష్ముఁడు దుర్యోధనుఁడు మొదలుగాఁగల కురువంశస్థులందఱు అందులకు ప్రతిక్రియ ఆయనపాదములేతమకు ఆశ్రయింపఁ దగినవిగా నెంచి సాంబుని తీసికొనిపోయి సమర్పించుటయే మంచిదని నిశ్చయించి ఆచిన్నవానిని కన్యకతోఁగూడ అనేకవస్త్రాభరణముల తోడను తీసికొని బలరాముని సన్నిధికిఁ బోయి ఆయనకు సాగిలబడి పలుమారు మ్రొక్కి చేతులు జోడించుకొని యీమీఁద చెప్పఁబోవునట్లు చెప్పిరియని తాత్పర్యము.

౬౨౬.—క॥ రామ సమంచిత ముక్తా । దామ యశస్కామ ఘన సు * ధాధామ రుచి
స్తోమ జయసీమ జగదభి । రామ గుణోద్దామ నిఖిల * రాజలలామా.

టీ॥ సమంచి ... కామ—సమంచిత = మిక్కిలి మనోజ్ఞమయిన. ముక్తాదామ = ముత్యాల పేరునుబోలిన. యశఃకామ = యశస్సును కోరినవాఁడా. ఘన...స్తోమ—ఘన = అధికమయిన. సుధాధామ=చంద్రునియొక్క. రుచి=కాంతివంటి దేహకాంతులయొక్క. స్తోమ=సముదాయము గలవాఁడా. జయసీమ = జయమునకు మేరయయినవాఁడా. జగదభిరామ=లోకమునందుఒప్పిదములైన. గుణ=సర్వజ్ఞత్వాదిగుణములచేత. ఉద్దామ=అధికుఁడగువాఁడా. నిఖిలరాజలలామా=ఎల్లరాజులకు భూషణమయినవాఁడా. రామ=ఓబలరాముఁడా.

తా॥ మేలైనముత్యాలపేరులనుబోలిన కీర్తిగలవాఁడవును, చంద్రునిదైన స్వచ్ఛకాంతివంటి దేహకాంతి గలవాఁడవును, గెలుపునకు ఎల్లయైనవాఁడవును, లోకమునందు ఒప్పిదము లనఁబడిన సద్గుణములుగలవాఁడవును రాజశ్రేష్ఠుఁడవునైన ఓబలరాముఁడాయని తాత్పర్యము.

౬౨౭.—క॥ నీమహిమ లెఱిఁగి పొగడఁగ । నేమెంతటివార మఖిల * నేతవు త్రిజగ
త్క్షేమంకరుఁడవు సుమతివి । తామసులము మమ్ముఁ గావఁ * దగు హలపాణీ.

టీ॥ హలపాణీ=హలాయుధమును చేతఁబట్టినయోబలరాముఁడా నీమహిమలు=నీప్రభావములు. ఎఱిఁగి= తెలిసి. పొగడఁగన్=కొనియాడుటకు. ఏము=మేము. ఎంతటివారము=ఎంతమాత్రపువారము. అఖిలనేతవు = సర్వనియామకుఁడవు. త్రిజగత్క్షేమంకరుఁడవు=స్వర్గమర్త్య పాతాళ లోకములకుమేలుగలుగఁజేయువాఁడవు. సుమతివి= మంచిబుద్ధిగలవాఁడవు. తామసులము = మేముఅజ్ఞానులము. (మమ్ము) కావఁదగున్ = ఈ యాపదను తొలఁగించి కాపాడ వలయును.

తా॥ ఓబలరామా! నీవుసర్వ నియామకుఁడవును, మూడులోకములకు మేలు చేయు వాఁడవును, రాగద్వేషాదులు లేనిబుద్ధిగల వాఁడవును, కాఁబట్టినీమహిమలు తెలిసి పొగడుటకు మేము శక్తులము కాము అజ్ఞానులమయిన మమ్మును ఈయాపద వలన తొలగించి కాపాడ వలయునని ప్రార్థించిరని తాత్పర్యము.

౬౨౮.—క॥ భూచక్రమెల్లఁ దాల్చిన । యాచక్రీశ్వరుఁడు నావ * కాంశుఁడు బలదే
వా చక్రికి నగ్రజుఁడవు । నీచక్రియ లుడుపందగు * నీకు జితారీ.

టీ॥ జితారీ = జయింపఁబడిన అంతరబాహ్యశత్రువులుగలవాఁడవగు. బలదేవా=బలరాముఁడా. భూచక్రమెల్లన్ = ఈభూమండలమునెల్లను. తాల్చినయాచక్రీశ్వరుఁడు=ధరించిన ప్రసిద్ధుఁడగు సర్పరాజు — ఆదిశేషుఁడు. తావకాంశుఁడు = నీయంశము గలవాఁడు. చక్రికిన్ = కృష్ణునికి. అగ్రజుఁడవు=అన్నవు. (నీకు) నీచక్రియలు=అల్పకార్యములను. ఉడుపందగున్ = మాన్పుట యుక్త మగును.

తా॥ వెలుపలిలోపలిశత్రువులనుజయించినఓబలరామా! నీవు ఈభూమండలము నెల్లను మోయుచుండు ఆదిశేషుని యంశము గలవాఁడవు శ్రీవిష్ణుమూర్తియైనకృష్ణునికి అన్నవు కాఁబట్టి మాబోఁటి తెలివిమాలినవారుచేయు నీచ కార్యములను మాన్పుట నీకు యుక్తమే యని తా.

౬౨౯.—క॥ రక్షింపుము రక్షింపు ము । పేక్షింపక నమిత నిఖిల * బృందారక ఘో
రక్షణదాచరరణ నిట । లాక్ష భయాతురుల మమ్ము * నరయు మనంతా.

టీ॥ అనంతా=ఓశేషావతారుఁడా ! ఉపేక్షింపక = అనాదరము చేయక. రక్షింపుమ రక్షింపుము=మమ్మును తప్పక కాపాడుము. నమిత నిఖిలబృందారక=మ్రొక్కఁబడిన యెల్ల దేవతలు గలవాఁడా. ఘోర క్షణదాచర రణనిటలాక్ష—ఘోర = భయంకరులైన. క్షణదాచర=రాక్షసులయొక్క. రణ=యుద్ధములయందు. నిటలాక్ష=నొసటికన్ను గలరుద్రుఁడా. భయాతురులక్ = భయముచేత పీడింపఁబడిన వారమగు. (మమ్ము) అరయుము=విచారింపుము—ఆదరించి రక్షింపుమనుట.

తా॥ ఆదిశేషావతారుఁడవును, ఎల్ల దేవతలచేతను మ్రొక్కించుకొనఁబడిన వాఁడవును, మహాయుద్ధములందు నొసటి కన్ను దెఱచిన రుద్రునివలె రాక్షసులను భస్మీభూతులనుగాఁ జేయువాఁడవునైనయో బలరామా! నీవలని భయముచేత పీడింపఁబడినవారమగు మమ్మును అనాదరింపక కనికరించి రక్షింపుము ముమ్మాటికి రక్షింపుమని తాత్పర్యము.

వ॥ మఱియును దేవా యీ సచరాచరంబులైన జగంబులు నీలీలావినోదంబులం జేసి దుష్టమర్దనంబును, శిష్ట జనరక్షణంబును జేయుచు జగదుత్పత్తి స్థితిలయ హేతువైన నీకు నమస్కరింతుమని వెండియు నిట్లనిరి.

టీ॥ (మఱియును) దేవా=ఓస్వామీ. ఈ సచరాచరంబులైన జగంబులు=చరములును అచరములును అయిన ప్రాణులతోడివైన యీలోకములు. నీలీలావినోదంబులం జేసి=నీవు వేడుకగా చేయునట్టి వినోదములచేత. దుష్టమర్దనంబును=దుష్టులను దండించుటయును. శిష్టజనరక్షణంబును=పూజ్యులగు జనులను రక్షించుటయును. (చేయుచు) జగదుత్పత్తిస్థితిలయహేతువు=ప్రపంచమును పుట్టింప పెంప త్రుంపకారణుఁడవును. అయిన నీకుక్ = అయినట్టి నీకొఱకు. నమస్కరింతుము=మ్రొక్కుదుము. (అని) వెండియుక్=మఱియును. ఇట్లనిరి=ఇట్లు పలికిరి.

తా॥ ఓస్వామీ ! ఇదిగాక చరాచర జంతువులతోఁ గూడినయీ లోకములను నీవు వేడుకగా కలుగఁజేసి వీనియందు క్రీడించుచుందువు ఆవినోదమునందే దుష్టజనులను శిక్షించుచు సజ్జనులను రక్షించుచుందువు లోకముల కలిమికిని ఉనికికిని నాశమునకును నీవే హేతువైన వాఁడవు అటువంటి నీకు మేము మ్రొక్కుచున్నాము మమ్ము కాపాడుము అని ఇంకనేమో చెప్పిరి అని తాత్పర్యము.

౬౩౧.—తే॥ అవ్యయుండవు సర్వ భూ * తాత్మకుఁడవు । సర్వశక్తి ధరుండవు * శాశ్వతుఁడవు
విశ్వకరుఁడవు గురుఁడవు * విపులకీర్తి । వయిన నిన్ను నుతింప బ్ర * హ్మకును దరమె.

టీ॥ అవ్యయుండవు=నాశము లేనివాఁడవు. సర్వభూతాత్మకుఁడవు=సర్వప్రాణులే స్వరూపముగాఁ గలవాఁడవు. సర్వశక్తి ధరుండవు=సర్వజ్ఞత్వాదిమహాశక్తులను తాల్చినవాఁడవు. శాశ్వతుఁడవు=ఎప్పుడునుండువాఁడవు. విశ్వకరుఁడవు=అన్నిటిని చేయువాఁడవు. గురుఁడవు=భక్తుల అజ్ఞానమును నివారించువాఁడవు. విపులకీర్తివి=విశేషమైనకీర్తి గలవాఁడవు. అయిన = ఇట్టివాఁడవైన. (నిన్ను) నుతింపక్=పొగడుటకు. బ్రహ్మకును=బ్రహ్మదేవునకైనను. తగమె=శక్యమా.

తా॥ ఓస్వామీ ! నీవు నాశము లేనివాఁడవును, సకలజీవులే స్వరూపముగాఁ గలవాఁడవును, సర్వజ్ఞత్వశక్తి సర్వేశ్వరత్వశక్తి అనాదిబోధశక్తి మొదలైన సర్వశక్తులను ధరించినవాఁడవును, భూత భవిష్యద్వర్తమానకాలములయందు ఎప్పుడునుండువాఁడవును, సృష్టిస్థితిలయముతిరోధానము అనుగ్రహము అనెడు పనులను చేయు వాఁడవును, భక్తుల యజ్ఞానమును పోఁగొట్టువాఁడవును, అధికకీర్తిగలవాఁడవును, అయిన నిన్నుఁ బొగడుటకు బ్రహ్మకూడ సమర్థుఁడు కాడు అని తాత్పర్యము.

౬౩౨.—చ॥ అని వినుతించినక్ బ్రముది * తాత్మకుఁడై హలపాణి వారలం
గనుఁగొని యోడకోడకుఁడు * కార్యగతిం దగి లిట్లు మీరు చే
సిన యవినీతిచేత నిటు * చేసితి నింక భయంబు దక్కి పొం
డనిన సుయోధనుండు విన * యంబున నల్లునిఁ గూఁతురిం దగక్.

టీ॥ (అని) వినుతించినక్ = పొగడఁగా. హలపాణి = బలరాముఁడు. ప్రముదితాత్మకుఁడై = సంతోషించిన మనసు గలవాఁడై. వారలక్=ఆకౌరవులను. కనుఁగొని = చూచి. ఓడకోడకుఁడు=కొంచెమయిన భయపడకుఁడు. కార్యగతిక్=కార్యవశమున. తగిలి=పట్టుదలఁ గలిగి. (ఇట్లు) మీరుచేసిన యవినీతిచేతక్=మీరుచేసిన అవజ్ఞతచేత. ఇట్లుచేసితిక్ = ఈవిధముగా చేసితిని. ఇంకక్=ఇఁకను. భయంబు=భీతిని. తక్కి = విడిచి. (పొండు) అనినక్ = అనఁగా. సుయోధనుండు = దుర్యోధనుఁడు. వినయంబునక్ = అడఁకువతో. అల్లునిక్=తనకు అల్లుఁడైన సాంబుని. కూఁతురిక్=తనకొమార్తయైన లక్షణను. తగక్=ఒప్పునట్లు. (అని దీనికిక్రియ పైపద్యమునందున్నది.

తా॥ అని యీవిధముగా కౌరవులు ప్రార్థింపఁగా బలరాముఁడు సంతోషించి ఆకౌరవులను చూచి మీరు ఇఁక భయపడకుఁడు మీరు మీపనియందు పట్టుగలవారై చేసిన అవజ్ఞతకు తగినట్లు ఇట్టి కార్యమును నేను చేసినాను కాని ఇతరము కాదు ఇఁక భయపడ నక్కఱలేదు అనఁగా దుర్యోధనుఁడు తనకొమార్తను అల్లునిని ఒప్పుగా దీసికొనివచ్చెననితా.

౬౩౩.—క॥ అనుచుచు నరణము దాసీ । జనముల వేయింటి లక్ష * సైంధవముల దా
నినుమడి యేనుంగులఁ గాం । చన రథముల నాఱువేల * సమ్మతి నిచ్చెక్.

టీ॥ అనుచుచుక్=పంపుచు. దాసీజనములక్ = ఊడిగకత్తెలను. వేయింటిక్=వేయిమందిని. సైంధవములక్=గుఱ్ఱములను. (లక్షను) దానినుమడి=అంతకు రెండంతలు—(రెండులక్షలు) ఏనుంగులక్=ఏనుఁగులను. కాంచనరథంబులక్ = బంగారు తేరులను. (ఆఱువేలను) అరణము=అరణముగా. సమ్మతిక్ = ఇష్టముతో. ఇచ్చెను = ఒసఁగెను.

తా॥ ఆటుతీసికొనివచ్చి బలరామునివెంటఁ బంపుచును వేవురు పరిచారికలును లక్ష గుఱ్ఱములును రెండు లక్షల యేనుఁగులును ఆఱువేల బంగారు తేరులను వారికి అరణముగా నిచ్చెనని తాత్పర్యము.

వ॥ ఇట్లిచ్చి యనిచినం బలభద్రుండు గొడుకును గోడలినిం దోడ్కొనుచుఁ బరమానందంబు నొందుచు నక్కడి జనంబులు పదివేలవిధంబులఁ బొగడ నిజపురంబునకరిగి యచ్చటి యాదవులతోడఁ దాఁగరిపురంబునకుం బోయిన విధంబును, వారలాడిన దురాలాపంబులు నెఱింగించి సుఖంబున నుండె వారణపురంబు నేడును దక్షిణంబెగసి యుత్తరభాగం బొకించుక గంగకై క్రుంగి బలభద్రు మాహాత్మ్యంబుఁ దెలుపుచున్న యది యని యమ్మహాత్ముని భుజవీర్యం బవార్యంబని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

టీ॥ (ఇట్లు) ఇచ్చి = అరణమిచ్చి. అనిచినన్ = పంపఁగా. బలభద్రుండు = బలరాముఁడు. (కొడుకునుగోడలిని) తోడ్కొనుచున్ = పిలుచుకొని. పరమానందంబునొందుచున్ = మిక్కిలిసంతోషమును పొందుచు. అక్కడిజనంబులు = అచ్చటనుండుజనులు. పదివేలవిధంబులన్. అనేకవిధములతో. పొగడన్ = స్తోత్రముచేయఁగా. నిజపురంబునకున్ = హస్తినాపట్టణమునకు. అరిగి = పోయి. అచ్చటి యాదవులతోడన్ = అక్కడనుండు యాదవులతో. తాన్ = తాను. కరిపురంబునకున్ = హస్తినాపట్టణమునకు. పోయినవిధంబును = పోయినట్టిరీతియు. వారలు = కౌరవులు. ఆడిన = చెప్పిన. దురాలాపంబులును = చెడ్డమాటలును. ఎఱింగించి = తెలియపఱిచి. సుఖంబునన్ = సుఖముతో. (ఉండెను) వారణపురంబు = హస్తినాపట్టణము. నేడును = ఇప్పుడును. దక్షిణంబెగసి = దక్షిణపుతట్టు ఎత్తుగాలేచిపోయి. ఉత్తరభాగంబు = ఉత్తరపుతట్టు. ఒకించుక = కొంచెము. గంగకై = గంగతట్టునకు. క్రుంగి = క్రుంగి. బలభద్రుమాహాత్మ్యంబున్ = బలరాముని మహిమను. తెలుపుచున్నయది = తెలియచేయుచున్నది. (అని) అమ్మహాత్ముని భుజవీర్యంబు = ఆగొప్పవాఁడైన బలరాముని భుజబలము. అవార్యంబు = నిలుపఁగూడనిది. (అనిచెప్పి) శుకయోగీంద్రుండు = శుకమహర్షి. పరీక్షిన్నరేంద్రునకున్ = పరీక్షిన్మహారాజునకు. (ఇట్లు) అనియెన్ = చెప్పెను.

తా॥ ఈప్రకారము దుర్యోధనుఁడు అరణమిచ్చి పంపఁగా బలరాముఁడు కొడుకును కోడలిని పిలుచుకొని ద్వారకాపట్టణమునకుఁ బోయి అచ్చట తమవారితో తానుహస్తినాపట్టణమునకుపోయివచ్చిన వర్తమానమును అచ్చటదుర్యోధనాదులు ఆడిననీచపుమాటలును చెప్పి తాను సుఖముగ నుండెను హస్తినాపట్టణము అది మొదలు ఇప్పటికిని దక్షిణపుతట్టు ఎత్తుగాను ఉత్తరపుతట్టు గంగలోనికి క్రుంగి తగ్గుగాను కనఁబడుచు బలరాముని మహిమను తెలియ చేయుచున్నది. అనఁగా అచ్చటి జనులు బలరాముని మహిమను పొగడిరి అంతట శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో మరలనిట్లుపలికెననితాత్పర్యము.

౬౩౫.—చ॥ నరవర యొక్కనాడు విను * నారద సంయమి మాధవుండు దా
నరకునిఁ ద్రుంచి వాని భవ * నంబున నున్న పదాఱువేల సుం
దరులను నొక్కనాడె ప్రమ * దంబున నందఱ కన్నిరూపులై
పరిణయమయ్యె నావిని శు * భస్థితిఁ దద్విభవంబుఁ జూడఁగన్.

టీ॥ నరవర = రాజా. (వినుము) ఒక్కనాడు = ఒకదినము. నారదసంయమి = నారదమహాముని. మాధవుండు = కృష్ణుఁడు. తాన్ = తాను. నరకునిన్ = నరకాసురుని. త్రుంచి = చంపి. వానిభవనంబునన్ = ఆనరకాసురునియింటిలో. (ఉన్న) పదాఱువేలసుందరులను = పదియాఱువేలమంది స్త్రీలను. (ఒక్కనాడె) ప్రమదంబునన్ = సంతోషముతో. అందఱకున్ = అంతమందికిని. అన్నిరూపులై = అన్ని రూపములను ధరించినవాఁడై. పరిణయమయ్యెన్ = పెండ్లియాడెను. నాన్ = అనఁగా. (విని) శుభస్థితిన్ = మేలైన రీతితో. తద్విభవంబున్ = ఆకృష్ణమూర్తి పెండ్లాడిన వేడుకను. చూడఁగన్ = చూచుటకొఱకు.

తా॥ ఓరాజా! ఒకనాడు నారదమహాముని శ్రీకృష్ణుఁడు నరకాసురునిఁజంపి వాని యింటనున్న రాజస్త్రీలు పదియాఱు వేల మందిని ఒక్కనాడే అందఱికిని అన్ని రూపములు వహించి పెండ్లియాడెను అనువృత్తాంతమును విని ఆవేడుకను జూచుటకైయని తాత్పర్యము.

౬౩౬.—వ॥ అట్లు తలంచి కృష్ణ పరిపాలితంబైన ద్వారకానగరంబు డాయంజని ముందట.

తా॥ ఆవిధముగా వేడుక చూడఁగోరి కృష్ణుఁడు ఏలుచుండెడు ద్వారకాపట్టణము దగ్గఱఁబోయి అని తాత్పర్యము.

౬౩౭.—సీ॥ శుక శారికా శిఖి * పిక కూజిత ప్రస - వాంచితోద్యాన వ * నౌఘములును
గలహంస సారస * కమల కైరవసు క - ల్హార శోభిత కమ * లాకరములుఁ
గలమాది సస్య సం * కుల వరేక్షు క్షేత్ర - భూరి లసన్నదీ * తీరములును
గిరిసాను పతిత ని * ర్ఝర శరసందోహ - సంకత హేమంత * సమయములును

తే॥ గమల సంభవ కాంచన * కార రచిత । చిరతరైశ్వర్య నగర ల * క్ష్మీ కరాబ్జ
ఘటిత నవరత్నమయ హేమ * కటకమనఁగ । సొబగు మీఱిన కోటయుఁ * జూచి మౌని.

టీ॥ శుక...ఘములును—శుక = చిలుకలు. శారికా = గోరువంకలు. శిఖి = నెమళ్లు. పిక = కోయిలలు. కూజిత = వీనియొక్క కూఁతలచేతను. ప్రసవ = పుష్పములచేత. అంచిత = ఒప్పిదములయిన. ఉద్యానవనౌఘములును = ఉద్యానవనసమూహములును. కల...లును—కలహంస = ఉత్తమజాతిహంసలచేతను. సారస = బెగ్గురుపక్షులచేతను. కమల = తామరపుష్పములచేతను, కైరవ = తెల్లగలువలచేతను. సుకల్హార = మంచి

టీ॥ అనంతా=ఓశేషావతారుఁడా! ఉపేక్షింపక = అనాదరము చేయక. రక్షింపుము రక్షింపుము=మమ్మును తప్పక కాపాడుము. నమిత నిఖిలబృందారక=మ్రొక్కఁబడిన యెల్ల దేవతలు గలవాఁడా. ఘోర తీవ్ర దానవ రణనిటలాక్ష—ఘోర = భయంకరులైన. క్షణదాచర=రాక్షసులయొక్క. రణ=యుద్ధములయందు. నిటలాక్ష=నొసటికన్ను గలరుద్రుఁడా. భయాతురులన్ = భయముచేత పీడింపఁబడిన వారమగు. (మమ్ము) అరయుము=విచారింపుము—ఆదరించి రక్షింపుమనుట.

తా॥ ఆదిశేషావతారుఁడవును, ఎల్ల దేవతలచేతను మ్రొక్కించు కొనఁబడిన వాఁడవును, మహాయుద్ధములందు నొసటి కన్ను దెఱచిన రుద్రునివలె రాక్షసులను భస్మీభూతులనుగాఁ జేయువాఁడవునైనయో బలరామా! నీవలని భయముచేత పీడింపఁబడినవారమగు మమ్మును అనాదరింపక కనికరించి రక్షింపుము మమ్మాటికి రక్షింపుమని తాత్పర్యము.

వ॥ మఱియును దేవా యీ సచరాచరంబులైన జగంబులు నీలీలావినోదంబులం జేసి దుష్టమర్దనంబును, శిష్ట
జనరక్షణంబును జేయుచు జగదుత్పత్తి స్థితిలయ హేతువైన నీకు నమస్కరింతుమని వెండియు నిట్లనిరి.

టీ॥ (మఱియును) దేవా=ఓస్వామీ. ఈసచరాచరంబులైనజగంబులు=చరములును అచరములును అయిన ప్రాణులతోఁ గూడినయీలోకములు. నీలీలావినోదంబులం జేసి=నీవు వేడుకఁగా చేయునట్టి వినోదములచేత. దుష్టమర్దనంబును=దుష్టులను దండించుట యును. శిష్టజనరక్షణంబును=పూజ్యులగు జనులను రక్షించుటయును. (చేయుచు) జగదుత్పత్తిస్థితిలయహేతువు=ప్రపంచమును పుట్టింప పెంప త్రుంపకారణుఁడవును. అయిననీకున్ = అయినట్టి నీకొఱకు. నమస్కరింతుము=మ్రొక్కుదుము. (అని) వెండియున్=మఱియును. ఇట్లనిరి=ఇట్లు పలికిరి.

తా॥ ఓస్వామీ! ఇదిగాక చరాచర జంతువులతోఁ గూడినయీ లోకములను నీవు వేడుకగా కలుగఁజేసి వీనియందు క్రీడించుచుందువు ఆవినోదము నందే దుష్టజనులను శిక్షించుచు సజ్జనులను రక్షించుచు నుందువు లోకముల కలిమికిని ఉనికికిని నాశమునకును నీవే హేతువైన వాఁడవు అటువంటి నీకు మేము మ్రొక్కుచున్నాము మమ్ము కాపాడుము అని ఇంకనేమో చెప్పిరి అని తాత్పర్యము.

౬౩౧.—తే॥ అవ్యయుండవు సర్వ భూ * తాత్మకుఁడవు। సర్వశక్తి ధరుండవు * శాశ్వతుఁడవు
విశ్వకరుఁడవు గురుఁడవు * విపులకీర్తి। వయిన నిన్ను నుతింప బ్ర * హ్మకును దరమె.

టీ॥ అవ్యయుండవు=నాశములేనివాఁడవు. సర్వభూతాత్మకుఁడవు=సర్వప్రాణులే స్వరూపముగాఁ గలవాఁడవు. సర్వశక్తి ధరుండవు=సర్వజ్ఞత్వాదిమహాశక్తులను దాల్చినవాఁడవు. శాశ్వతుఁడవు=ఎప్పుడు నుండువాఁడవు. విశ్వకరుఁడవు=అన్నిటిని చేయువాఁడవు. గురుఁడవు=భక్తుల అజ్ఞానమును నివారించువాఁడవు. విపులకీర్తివి=విశేషమైనకీర్తి గలవాఁడవు. అయిన = ఇట్టివాఁడవైన. (నిన్ను) నుతింపన్=పొగడుటకు. బ్రహ్మకును=బ్రహ్మదేవునికైనను. తరమె=శక్యమా.

తా॥ ఓస్వామీ! నీవు నాశములేనివాఁడవును, సకలజీవులే స్వరూపముగాఁ గలవాఁడవును, సర్వజ్ఞత్వశక్తి సర్వేశ్వరత్వశక్తి అనాదిబోధశక్తి మొదలైన సర్వశక్తులను ధరించినవాఁడవును, భూత భవిష్యద్వర్తమానకాలములయందు ఎప్పుడునుండువాఁడవును, సృష్టిస్థితిలయ ముతిరోధానము అనుగ్రహము అనెడు పనులనుచేయు వాఁడవును, భక్తుల యజ్ఞానమును పోఁగొట్టువాఁడవును, అధికకీర్తిగలవాఁడవును, అయిన నిన్నుఁ బొగడుటకు బ్రహ్మకూడ సమర్థుఁడు కాడు అని తాత్పర్యము.

౬౩౨.—చ॥ అని వినుతించినన్ బ్రముది * తాత్మకుఁడై హలపాణి వారలం
గనుఁగొని యోడకోడకుఁడు * కార్యగతిం దగి లిట్లు మీరు చే
సిన యవినీతిచేత నిటు * చేసితి నింక భయంబు దక్కి పొం
డనిన సుయోధనుండు విన * యంబున నల్లునిఁ గూఁతురిం దగన్.

టీ॥ (అని) వినుతించినన్ = పొగడఁగా. హలపాణి = బలరాముఁడు. ప్రముదితాత్మకుఁడై = సంతోషించిన మనసు గలవాఁడై. వారలన్=ఆకౌరవులను. కనుఁగొని = చూచి. ఓడకోడకుఁడు=కొంచెమయినభయపడకుఁడు. కార్యగతిన్=కార్యవశమున. తగిలి=పట్టుదలఁ గలిగి. (ఇట్లు) మీరుచేసిన యవినీతిచేతన్=మీరుచేసిన అవజ్ఞతచేత. ఇట్లుచేసితిన్ = ఈవిధముగా చేసితిని. ఇంకన్=ఇఁకను. భయంబు=భీతిని. తక్కి = విడిచి. (పొండు) అనినన్ = అనఁగా. సుయోధనుండు = దుర్యోధనుఁడు. వినయంబునన్ = అడఁకువతో. అల్లునిన్=తనకు అల్లుఁడైనసాంబుని. కూఁతురిన్=తనకొమార్తయైన లక్షణను. తగన్=ఒప్పునట్లు. (అని దీనికిక్రియ పైపద్యమునందున్నది.

తా॥ అని యీవిధముగా కౌరవులు ప్రార్థింపఁగా బలరాముఁడు సంతోషించి ఆకౌరవులను చూచి మీరు ఇఁక భయపడకుఁడు మీరు మీపనియందు పట్టుగలవారై చేసిన అవజ్ఞతకు తగినట్లు ఇట్టికార్యమును నేను చేసినాను కాని ఇతరము కాదు ఇఁక భయపడ నక్కఱ లేదు అనఁగా దుర్యోధనుఁడు తనకొమార్తను అల్లునిని ఒప్పగాదీసికొనివచ్చెనని తా.

౬౩౩.—క॥ అనుచుచు నరణము దాసీ। జనముల వేయింటి లక్ష * సైంధవముల దా
నినుమడి యేనుంగులఁ గాం। చన రథముల నాఱువేల * సమ్మతి నిచ్చెన్.

టీ॥ అనుచుచున్=పంపుచు. దాసీజనములన్ = ఊడిగకత్తెలను. వేయింటిన్=వేయిమందిని. సైంధవములన్=గుఱ్ఱములను. (లక్షను) దానినుమడి=అంతకురెండంతలు—(రెండులక్షలు) ఏనుంగులన్=ఏనుఁగులను. కాంచనరథంబులన్ = బంగారుతేరులను. (ఆఱువేలను) అరణము=అరణముగా. సమ్మతిన్ = ఇష్టముతో. ఇచ్చెను = ఒసఁగెను.

తా॥ అట్లు తీసికొనివచ్చి బలరామునివెంటఁ బంపుచును వేవురు పరిచారికలును లక్ష గుఱ్ఱములును రెండు లక్షల యేనుఁగులును ఆఱువేల బంగారు తేరులను వారికి అరణముగా నిచ్చెనని తాత్పర్యము.

వ॥ ఇట్లిచ్చి యనిచినం బలభద్రుండు గొడుకును గోడలినిం దోడ్కొనుచుఁ బరమానందంబు నొందుచు నక్కడి జనంబులు పదివేలవిధంబులఁ బొగడ నిజపురంబునకరిగి యచ్చటి యాదవులతోడఁ దాఁగరిపురంబునకుం బోయిన విధంబును, వారలాడిన దురాలాపంబులు నెఱింగించి సుఖంబున నుండె వారణపురంబు నేడును దక్షిణంబెగసి యుత్తరభాగం బొకించుక గంగకై క్రుంగి బలభద్రు మాహాత్మ్యంబుఁ దెలుపుచున్న యది యని యమ్మహాత్ముని భుజవీర్యం బవార్యంబని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

టీ॥ (ఇట్లు) ఇచ్చి = అరణమిచ్చి. అనిచినన్ = పంపఁగా. బలభద్రుండు = బలరాముఁడు. (కొడుకునుగోడలిని) తోడ్కొనుచున్ = పిలుచుకొని. పరమానందంబునొందుచున్ = మిక్కిలిసంతోషమును పొందుచు. అక్కడిజనంబులు = అచ్చటనుండుజనులు. పదివేలవిధంబులన్. అనేకవిధములతో. పొగడన్ = స్తోత్రముచేయఁగా. నిజపురంబునకున్ = హస్తినాపట్టణమునకు. అరిగి = పోయి. అచ్చటి యాదవులతోడన్ = అక్కడనుండు యాదవులతో. తాన్ = తాను. కరిపురంబునకున్ = హస్తినాపట్టణమునకు. పోయినవిధంబును = పోయినట్టిరీతియు. వారలు = కౌరవులు. ఆడిన = చెప్పిన. దురాలాపంబులును = చెడ్డమాటలును. ఎఱింగించి = తెలియపఱచి. సుఖంబునన్ = సుఖముతో. (ఉండెను) వారణపురంబు = హస్తినాపట్టణము. నేడును = ఇప్పుడును. దక్షిణంబెగసి = దక్షిణపుతట్టు ఎత్తుగాలేచిపోయి. ఉత్తరభాగంబు = ఉత్తరపుతట్టు. ఒకించుక = కొంచెము. గంగకై = గంగతట్టునకు. క్రుంగి = మ్రొగ్గి. బలభద్రుమాహాత్మ్యంబున్ = బలరామునిమహిమను. తెలుపుచున్నయది = తెలియచేయుచున్నది. (అని) అమ్మహాత్మునిభుజవీర్యంబు = ఆగొప్పవాఁడైన బలరాముని భుజబలము. అవార్యంబు = నిలుపఁగూడనిది. (అనిచెప్పి) శుకయోగీంద్రుండు = శుకమహర్షి. పరీక్షిన్నరేంద్రునకున్ = పరీక్షిన్మహారాజునకు. (ఇట్లు) అనియెన్ = చెప్పెను.

తా॥ ఈప్రకారము దుర్యోధనుఁడు అరణమిచ్చి పంపఁగా బలరాముఁడు కొడుకును కోడలిని పిలుచుకొని ద్వారకా పట్టణమునకుఁ బోయి అచ్చట తనవారితో తానుహస్తినాపట్టణమునకుపోయివచ్చిన వర్తమానమును అచ్చటదుర్యోధనాదులు ఆడిననీచపుమాటలును చెప్పి తాను సుఖముగ నుండెను హస్తినా పట్టణము అది మొదలు ఇప్పటికిని దక్షిణపుతట్టు ఎత్తుగాను ఉత్తరపుతట్టు గంగలోనికి మ్రొగ్గి తగ్గగాను కనఁబడుచు బలరాముని మహిమను తెలియ చేయుచున్నది. అనఁగా అచ్చటి జనులు బలరాముని మహిమను పొగడిరి అంతట శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో మరలనిట్లుపలికెననితాత్పర్యము.

౬౩౫.—చ॥ నరవర యొక్కనాఁడు విను ✱ నారద సంయమి మాధవుండు దా
నరకునిఁ ద్రుంచి వాని భవ ✱ నంబున నున్న పదాఱువేల సుం
దరులను నొక్కనాఁడె ప్రమ ✱ దంబున నందఱ కన్నిరూపులై
పరిణయమయ్యె నావిని శు ✱ భస్థితిఁ దద్విభవంబుఁ జూడఁగన్.

టీ॥ నరవర = రాజా. (వినుము) ఒక్కనాఁడు = ఒకదినము. నారదసంయమి = నారదమహాముని. మాధవుండు = కృష్ణుఁడు. తాన్ = తాను. నరకునిన్ = నరకాసురుని. త్రుంచి = చంపి. వానిభవనంబునన్ = ఆనరకాసురునియింటిలో. (ఉన్న) పదాఱువేలసుందరులను = పదియాఱువేలమంది స్త్రీలను. (ఒక్కనాఁడె) ప్రమదంబునన్ = సంతోషముతో. అందఱకున్ = అంతమందికిని. అన్నిరూపులై = అన్ని రూపములను ధరించినవాఁడై. పరిణయమయ్యెన్ = పెండ్లియాడెను. నాన్ = అనఁగా. (విని) శుభస్థితిన్ = మేలైన రీతితో. తద్విభవంబున్ = ఆకృష్ణమూర్తి పెండ్లాడినవేడుకను. చూడఁగన్ = చూచుటకొఱకు.

తా॥ ఓరాజా ! ఒకనాఁడు నారదమహాముని శ్రీకృష్ణుఁడు నరకాసురునిఁజంపి వాని యింటనున్న రాజస్త్రీలు పదియాఱు వేల మందిని ఒక్కనాఁడే అందఱికిని అన్ని రూపములు వహించి పెండ్లియాడెను అనువృత్తాంతమును విని ఆవేడుకను జూచుటకైయని తాత్పర్యము.

౬౩౬.—వ॥ అట్లు తలంచి కృష్ణ పరిపాలితంబైన ద్వారకానగరంబు డాయంజని ముందట.

తా॥ ఆవిధముగా వేడుక చూడఁగోరి కృష్ణుఁడు ఏలుచుండెడు ద్వారకాపట్టణము దగ్గఱఁబోయి అని తాత్పర్యము.

౬౩౭.—సీ॥ శుక శారికా శిఖి ✱ పిక కూజిత ప్రస - వాంచితోద్యాన వ ✱ నౌఘములును
గలహంస సారస ✱ కమల కైరవసు క - ల్హార శోభిత కమ ✱ లాకరములుఁ
గలమాది సస్య సం ✱ కుల వరేక్షు క్షేత్ర - భూరి లసన్నదీ ✱ తీరములును
గిరిసాను పతిత ని ✱ ర్ఝర శరసందోహ - సంతత హేమంత ✱ సమయములును

తే॥ గమల సంభవ కాంచన ✱ కార రచిత । చిరతరైశ్వర్య నగర ల ✱ క్ష్మీ కరాబ్జ
ఘటిత నవరత్నమయ హేమ ✱ కటకమనఁగ । సొబగు మీఱిన కోటయుఁ ✱ జూచి మౌని.

టీ॥ శుక...ఘములును = శుక = చిలుకలు. శారికా = గోరువంకలు. శిఖి = నెమళ్లు. పిక = కోయిలలు. కూజిత = వీనియొక్క కూఁతలచేతను. ప్రసవ = పుష్పములచేత. అంచిత = ఒప్పిదములయిన. ఉద్యానవనౌఘములును = ఉద్యానవనసమూహములును. కల...లును = కలహంస = ఉత్తమజాతిహంసలచేతను. సారస = బెగ్గురుపక్షులచేతను. కమల = తామరపుష్పములచేతను. కైరవ = తెల్లగలువలచేతను. సుకల్హార = మంచి

ఎఱ్ఱకలువలచేతను. శోభిత=ప్రకాశించునట్టి. కమలాకరములును=సరస్సులును. కలమాది...ఖును—కలమ=వరి. ఆది=మొదలుగాఁగల. సస్య=పైరులయొక్క. సంకుల = నింపుచేత. వర=శ్రేష్ఠములయిన. ఇక్షుక్షేత్ర=చెఱకుచేలచేతను. భూరి=మిక్కిలి. లసత్=ప్రకాశించెడు. నదీతీరములును=ఏటిగట్లును. గిరిసాను...సమయములును—గిరి=కొండలయొక్క. సాను = చఱియలనుండి. పతిత=పడుచున్న. నిర్ఝర=సెలయేళ్లయందలి. శర=నీళ్లయొక్క. సందోహ=ప్రవాహములచేత. సంతత=ఎడతెగని. హేమంత సమయములును=హేమంతఋతువులును. కమల...కటకము—కమలసంభవ=బ్రహ్మయనెడు. కాంచనకార=అగసాలెవానిచేత. రచిత=చేయఁబడిన. చిరతర=మిక్కిలితడవుగల. ఐశ్వర్య = కలిమితోఁగూడిన. నగరలక్ష్మీ=పురలక్ష్మియొక్క. కరాబ్జ=హస్తకమలమునందు. ఘటిత = కూర్పఁబడిన. నవరత్నమయ = తొమ్మిదివిధములయిన రత్నములు పొదిఁగిన. హేమకటకము=బంగారుకడియము. అనఁగ = అననట్టుగా. సొబగుమీఱిన = అందమతిశయించిన. కోటయున్ = కోటను. (చూచి) మౌని=నారదమహాముని.

తా॥ చిలుకలు గోరువంకలు నెమళ్లు కోయిలలు అనువానికూఁతలచేతను పువ్వులచేతను ఒప్పిదములయిన ఉద్యానవనముల సమూహములును, హంసలు బెగ్గురుపక్షులు తామరలు ఎఱ్ఱదావరలు తెల్లగలువలు మొదలగువానిచేత ప్రకాశించునట్టి కొలఁకులును, వరి మొదలగు పైరులనింపుచేతను చెఱకుతోఁటలచేతను,మనోజ్ఞములయిన యేటిదరులును, కొండచఱియలందుండి పడునట్టి సెలయేళ్ల నీళ్లతుంపురులచేత మంచుకురియుకాలమును తోఁపించుప్రదేశములును,బ్రహ్మయనెడిఅగసాలెవానిచేత చేయఁబడినపురలక్ష్మి చేతియందుండెడిరత్నములుచెక్కినబంగారుకడియమోయనునట్లుఒప్పెడు కోటగల ద్వారకాపట్టణమును నారదుఁడుచూచినవాఁడై అని తా.





నారదుఁడు.



ఉద్ధవుఁడు.

(*) నారదుండు షోడశ సహస్ర స్త్రీసంగతుండైన శ్రీకృష్ణుని మహిమఁ దెలిసికొనుట. (*)

వ॥ మఱియు సముత్తుంగ మణిసౌధ గవాక్ష రంధ్ర నిర్గత ఘనసార చందనాగురుధూప ధూమపటల విలోకన సంజ

సిత పయోధరాభి శంకాంగీకృత తాండవ కేళీ విలోల పురకామినీ జనోపలాలిత నీలకంఠ సముదయంబులును, చంద్రకాంతమణి స్ఫటిక స్తంభ సంభృత మరకత పద్మరాగ ఘటిత నవరత్న కాంచన ప్రాసాద శిఖరాగ్ర విన్యస్త బహుసూర్య విభ్రమ కృదంచిత శాతకుంభ కుంభనిచయంబును, సమస్తవస్తు విస్తార సమర్పిత వైశ్యాగార వీథీ వేదికాకలితంబును, మహిత తాపనివారణ తరళ విచిత్ర కేతనాబద్ధ మయూర శింజినీ నినదపూరితాశాంతరిక్షంబును, సరోజనాభ పూతనాచేతన ప్రహరాది నూతనవిజయ సందేశ లిఖిత స్వర్ణవర్ణావళి విభాసిత గోపురమణి విటంక ప్రదేశంబులును, యాదవేంద్ర దర్శనోత్సవాహూయమాన సమాగత నానాదేశాధీశ భూరి వారణ దానజల ప్రభూత పంకనిరసనైక గతాగత జనసమ్మర్ద కరకంకణ నికర్షణ వికీర్యమాణ రజఃపుంజంబును, వినూత్నరత్నమయ మంగళరంగవల్లీ విరాజిత ప్రతిగృహప్రాంగణంబును, గుంకుమ సలిలసిక్త విపణిమార్గంబును, వంది మాగధ సంగీత మంగళారావ విలసితంబును, భేరీ మృదంగ కాహళ శంఖ తూర్య రవాధరీకృత సాగర ఘోషంబును నై, యమరావతీపురంబునుంబోలె వసుదేవ నందన నివాసంబై, యనల పుటభేదనంబునుంబోలెఁ గృష్ణమార్గ సంచారపూతంబై, సంయమనీనగరంబునుంబోలె హరితనూభవాభిరామంబై, నైరృతి నిలయంబునుంబోలెఁ బుణ్యజనాకీర్ణంబై, వరుణనివాసంబునుంబోలె గోత్ర రక్షణ భువన ప్రశస్తంబై, ప్రభంజన పట్టణంబునుంబోలె మహాబలసమృద్ధంబై, యలకాపురంబునుంబోలె ముకుంద వర శంఖ మకరాంక కలితంబై, రజతాచలంబునుంబోలె నుగ్రసేనాధిపార్శ్వాలంకృతంబై, నిగమంబునుంబోలె వివిధ వర్ణక్రమ వివిక్త సంచారంబై, గ్రహమండలంబునుంబోలె గురు బుధ కవి రాజ మిత్ర విరాజితంబై, సంతత కల్యాణవేదియుంబోలె వైవాహికోపేతంబై, బలిదానవ కరతలంబునుంబోలె సంతత దానవారి యుక్తంబై, యొప్పు నప్పురంబుఁ బ్రవేశించి యందు విశ్వకర్మ నిర్మితంబైన యంతఃపురంబుననుండు షోడశసహస్ర హర్మ్యంబు లందు.

టీ॥ (మఱియు) సముత్తుంగ... సముదయంబులును—సముత్తుంగ=మిక్కిలిపొడుగువైన. మణిసౌధ=రత్నాల మేడలయందలి. గవాక్ష=కిటికీలయొక్క. రంధ్రి=సందులనుండి. నిర్గత=వెడలిన. ఘనసార=కర్పూరములయు. చందనాగురుధూప=గందముచేతను అగురుచేతను వేయఁబడిన ధూపములయు. ధూమ=పొగయొక్క. పటల=సముదాయమును. విలోకన=చూచుటచేత. సంజనిత=పుట్టిన. పయోధరాభిశంకా=మేఘము లేమోయను సందేహమును. అంగీకృత=పొందినవగుటచేత. తాండవకేళీ=నాట్యమాడుటయందు. విలోల=మిక్కిలి ఆసక్తములయిన. పురకామినీజన=పట్టణములోనుండెడి స్త్రీలచేత. ఉపలాలిత=మిగులలాలింపఁబడిన. నీలకంఠ=నెమళ్లయొక్క. సముదయంబులును=గుంపులును. చంద్రకాంత...నిచయంబును—చంద్రకాంతమణి=చంద్రకాంతపురాళ్లచేతను. స్ఫటిక=పటికపురాళ్లచేతను జేయఁబడిన. స్తంభ=కూచములచేత. సంభృత=చక్కగాభరింపఁడిన. మరకత=పచ్చలు. పద్మరాగ=కెంపులు. ఘటిత=కూర్పఁబడిన. నవరత్న=తొమ్మిది విధముల రత్నములుగల. కాంచన=బంగారుమయములయిన. ప్రాసాద=నగళ్లయొక్క. శిఖర=పైయంతస్తులయొక్క. అగ్ర=మీఁదిభాగములయందు. విన్యస్త=ఉంచఁబడిన. బహుసూర్య=పెక్కండ్రుసూర్యులనునట్లు. విభ్రమకృత్=భ్రమమును కలుగఁజేయుచున్న. అంచిత=ఒప్పిదములయిన. శాతకుంభకుంభ=బంగారుకుండలయొక్క. నిచయంబును=సమూహమును. సమస్త...కలితంబును—సమస్త=సకలమయిన. వస్తు=పదార్థములను. విస్తార=విశేషముగా. సమర్పిత=ఉంచఁబడిన. వైశ్య=కోమట్లయొక్క. ఆగార=ఇండ్లుగల. వీథి=వీథులయందలి. వేదికా=అరుఁగులతోడ. కలితంబును=కూడుకొన్నదియు. మహిత...రిక్షంబును—మహిత=అధికమయిన. తాప=కాఁకయొక్క. నివారణ=పోఁగొట్టుటగల. తరళ=చలించుచున్న. విచిత్ర=నానావర్ణమయిన. కేతన=టెక్కెములయందు. ఆబద్ధ=అంతటకట్టఁబడిన. మయూర=నెమళ్లయు. శింజినీ=వింటినారులయు. నినద=ధ్వనిచేత. పూరిత=నిండిన. ఆశా=దిక్కులును. అంతరిక్షంబును=ఆకాశమును గలిగినదియు. సరోజ...ప్రదేశంబును—సరోజనాభ=కృష్ణునివైన. పూతనా=పూతనయనురాక్షసియొక్క. చేతన=ప్రాణములను. ప్రహరాది=చక్కగా అపహరించుట మొదలగు. నూతన=క్రొత్తలైన. విజయ=గెలుపులయొక్క. సందేశ=గుఱుతులను. లిఖిత=వ్రాయఁబడిన. స్వర్ణవర్ణావళి=బంగారు అక్షరముల వరుసలచేత. విభాసిత=వెలుఁగఁజేయఁబడిన. గోపుర=పురద్వారమునందలి. మణివిటంక=రత్నాలవాచూరుపట్టెల. ప్రదేశంబులును=చోట్లును. యాదవ ... పుంజంబును—యాదవేంద్ర=కృష్ణుని. దర్శన=చూచుటయనెడు. ఉత్సవ=వేడుకకొఱకు. ఆహూయమాన=పిలువఁబడుచున్నవారై. సమాగత=వచ్చిన. నానాదేశ=బహుదేశములకు. అధీశ=ప్రభువులయినరాజులయొక్క. భూరి=విశేషమయిన. వారణ=ఏనుఁగులయొక్క. దానజల=మదజలముచేత. ప్రభూత=పుట్టిన. పంక=బురదను. నిరసన=అణఁచుటయందు. ఏక=ముఖ్యమయిన. గతాగత=పోకరాకలుచేయునట్టి. జన=జనులయొక్క. సమ్మర్ద=ఒరపిడిచేత. కరకంకణ=చేతికడియములయొక్క. నికర్షణ=రాపిడివలన. వికీర్యమాణ=రాలుచున్న. రజఃపుంజంబును=ధూళిరాసులుగలదియును. వినూత్న...ప్రాంగణంబును—వినూత్న=క్రొత్తలైన. రత్నమయ=రత్నవికారమయిన. మంగళ=శుభసూచకములయిన. రంగవల్లీ=ముగ్గులచేత. విరాజిత=ప్రకాశించునట్టి. ప్రతిగృహ=ఇంటింటియొక్క. ప్రాంగణంబును=ముంగిళ్లుగలిగినదియు. కుంకుమ ...

మార్గంబును—కుంకుమ = కుంకుమపువ్వు మొదలగువస్తువులుచేర్చిన. సలిల=నీళ్లచేత. సిక్త=తడుపఁబడిన. విపణిమార్గంబును=అంగళ్లవీథులుగలిగినదియు. వంది ... విలసితంబును — వంది = స్తుతిపాఠకులయు. మాగధ=బిరుదులుగ్గడించువారలయు. సంగీత = పాటలవలని. మంగళ=మేలయిన. ఆరావ = ధ్వనిచేత. విలసితంబును = ప్రకాశించునదియు. భేరీ... ఘోషంబును—భేరీ = పెద్దనగారాలు. మృదంగ=మద్దెలలు. కాహళ=తుతారలు. శంఖ=శంఖములు మొదలగు. తూర్య=వాద్యములయొక్క. రవ=ధ్వనిచేత. అధరీకృత = క్రిందుపఱుపఁబడిన. సాగరఘోషంబును=సముద్రధ్వనిగలదియు. (ఐయి) అమరావతీపురంబునుంబోలెన్ = ఇంద్రునిపట్టణమువలెనే. వసుదేవనందననివాసంబై = వసువులకును దేవతలకును నందనవనమునకును ఉనికిపట్టై—వసుదేవునికొడుకైన కృష్ణుని ఉనికిపట్టైయని భావము. అనలపుటభేదనంబునుంబోలెన్=అగ్నిదేవునిపట్టణమువలె. కృష్ణమార్గసంచారపూతంబై = నల్లనిమార్గముగల అగ్నియొక్క వ్యాప్తిచేత పరిశుద్ధమయి—కృష్ణమూర్తియొక్క దారి నడచుటవలన పావనమైయనిభావము. సంయమనీనగరంబునుంబోలెన్=యమునిపట్టణమువలె. హరితనూభవాభిరామంబై = సూర్యునికొడుకైన యమునివలన ఒప్పిదమయి—కృష్ణునికొడుకులవలన మనోజ్ఞమైనదై అనిభావము. నైరృతినిలయంబునుంబోలెన్ = నిరృతిపట్టణమువలె. పుణ్యజనాకీర్ణంబై=రాక్షసులచేత నిండుకొన్నదై — పుణ్యపురుషులచేత నిండుకొన్నదైయనిభావము. వరుణనివాసంబునుంబోలెన్ = వరుణునిపట్టణమువలె. గోత్రరక్షణభువనప్రశస్తంబై = కొండలను రక్షించునట్టి నీళ్లచేత శ్లాఘింపఁబడినదై — వరుణుని యునికిపట్టు సముద్రముగనుక సముద్రజలమునందు ఇంద్రునికివెఱచివచ్చిన మైనాకము మొదలగు కొండలు దాఁగి రక్షింపఁబడెననుట పురాణప్రసిద్ధము — స్వవంశరక్షకులయిన లోకులచేత శ్లాఘింపఁబడినదైయని భావము. ప్రభంజనపట్టణంబునుంబోలెన్=వాయువుపట్టణమువలె. మహాబలసమృద్ధంబై = గాలియొక్క సమృద్ధికలదై — గొప్పసేనలయొక్క సమృద్ధిగలదైయనిభావము. అలకాపురంబునుంబోలెన్ = కుబేరునిపట్టణమువలె. ముకుందవరశంఖమకరాంకకలితంబై=ముకుందము వరము శంఖము మకరము అను నిధులగుఱుతులతోడ కూడినదై—కృష్ణునిదయిన ఉత్తమ శంఖముతోడను మొసలిటెక్కెముగలవాఁడైన ప్రద్యుమ్నునితోడను కూడుకొన్నదైయనిభావము. రజతాచలంబునుంబోలెన్ = వెండికొండవలె. ఉగ్రసేనాధిపార్యాలంకృతంబై = శివునిచేతను కుమారస్వామిచేతను పార్వతీదేవిచేతను అలంకరింపఁబడినదై — ఉగ్రసేనమహారాజుచేతను యోగ్యులయిన పెద్దలచేతను అలంకరింపఁబడినదై యని భావము. నిగమంబునుంబోలెన్=వేదమువలె. వివిధవర్ణక్రమవివిక్తసంచారంబై=నానావిధములయిన అక్షరములయు పదక్రమములయు పదవిభాగములయు తిరుగుటలుగలదై—బహువిధములైన బ్రాహ్మణాదివర్ణములయొక్క క్రమమయిన సంచారములు గలదైయని భావము. గ్రహమండలంబునుంబోలెన్ = గ్రహములుండు మండలమువలె. గురుబుధకవిరాజమిత్రవిరాజితంబై = బృహస్పతి బుధుఁడు శుక్రుఁడు చంద్రుఁడు సూర్యుఁడు వీరిచేత ప్రకాశించునదియై — పూజ్యులయిన పండితులచేతను కవిశ్రేష్ఠులచేతను స్నేహితులచేతను ప్రకాశించునదియైయని భావము. సంతతకల్యాణవేదియుంబోలెన్ = శాశ్వతమయినపెండ్లియరుఁగువలె. వైవాహికోపేతంబై = పెండ్లిండ్లతోఁగూడినదై. బలిదానవకరతలంబునుంబోలెన్=బలిచక్రవర్తి అఱచేతివలె. సంతతదానవారియుక్తంబై = ఎడతెగనిదానోదకముతోఁ గూడినదై—ఎల్లప్పుడు దానవులకు శత్రువైన కృష్ణునితోఁ గూడినదైయని భావము. ఒప్పునప్పురంబున్=ఒప్పునట్టిఆపట్టణమునందు. ప్రవేశించి=చొచ్చి. అందున్=ఆపట్టణమునందు. విశ్వకర్మనిర్మితంబు = విశ్వకర్మచేతఁ జేయఁబడినది. అయినయంతఃపురంబునన్ = అయినట్టి పట్టణపులోపలిభాగమునందు. (ఉండు) షోడశసహస్రహర్మ్యంబులందున్ = పదియాఱువేలమేడలయందును.

తా॥ అదిగాక మిక్కిలి యెత్తుగాఁ గట్టఁబడిన రత్నాలమేడల కిటికీలనుండి బయలువెడలు కర్పూరహారతులయు ధూపములయు పొగల సముదాయమును జూచి మబ్బనిభ్రమసి నృత్యముచేయుటకు ఆరంభించునట్టి పురస్త్రీలచేతఁ బెంపఁబడిన నెమళ్లగుంపులుగలిగినదియు, చంద్రకాంతమణులచేతను పటికపురాళ్లచేతను చేయఁబడిన కూచములచేత వహింపఁబడిన పద్మరాగములు వజ్రములు మొదలగు తొమ్మిది విధములరత్నములను పొదిఁగి కట్టఁబడిన బంగారు నగళ్ల పైయంతస్తుల మీఁదిభాగములయం దుంచఁబడి. అనేకసూర్యబింబములనునిలిపినట్టు కానవచ్చునట్టి బంగారుకలశములతోఁగూడినదియు, ఎల్లవస్తువులను విరివిగా పఱపఁబడిన పంచటరుఁగులుగల వైశ్యులయిండ్ల వాడలుగలదియును, మిక్కుటమయిన యుక్కను అణఁపఁజాలినవై పటపటలాడుచున్న పలువన్నెలుగల టెక్కెపుగుడ్డలయం దంతట కట్టఁబడిన అనఁగా చిత్రింపఁబడిన. నెమళ్లయొక్కయు వింటినారులయొక్కయు ధ్వనిచేత నిండింపఁబడిన దిక్కులును ఆకాశమును గలిగినదియు, పూతనను జంపుట మొదలుగాఁగల శ్రీకృష్ణుని గెలుపు గుఱుతులు తెలియఁబడ బంగారుతేకులచేత చెక్కఁబడిన అక్షరముల పఙ్క్తులచేత వెలుఁగుచున్న పురద్వారపు వాచూరుపట్టెల పార్శ్వభాగములు గలిగినదియు, కృష్ణుని దర్శనమునకై పిలిపింపఁబడి వచ్చిన రాజులయేనుఁగుల మదజలముచేతనైన బురదను బిగిసికొనఁజేయఁజాలి అట్టిగాజులచేతి కడియముల యొరపిడిచేత రాలిన ధూళి రాసులు గలిగినదియు, క్రొత్త రత్నములచేత పెట్టఁబడిన శుభసూచకములయిన ముగ్గులచేత అందగించునట్టి ప్రతియింటి ముంగిళ్లుగలిగినదియు, కుంకుమపువ్వు మొదలగు పరిమళద్రవ్యములు కలిపిన నీళ్లు చల్లుటచేత తడిసిన అంగళ్ల వీథులు గలదియును, స్తుతిపాఠకులయు బిరుదు లుగ్గడించువారలయు పాటలవలని మేలైనధ్వనులచేత ఒప్పిదమయినదియు, సముద్రధ్వనిని అణఁచివేయునట్టి పెద్దనగారాలు మద్దెలలు తుతారలు శంఖములు మొదలగు వాద్యములధ్వనులు గలదియునునై, ఇంద్రుఁడు మొదలగు దిక్పాలకుల పట్టణములవలె ఆయాగుఱుతులను తోఁపించునట్టి విశేషచిహ్నములు గలిగి ఉగ్రసేనునిచేత పాలింపఁబడుచు వేదమును గ్రహమండలమును మించినదై పెండ్లియరుఁగునుబోలి బలిచక్రవర్తి చేతివలె దానధారలతోఁ గూడినదై ఒప్పుచున్న ఆద్వారకాపట్టణమును ప్రవేశించి ఆపట్టణమునందు విశ్వకర్మచేత నిర్మింపఁబడిన అంతఃపురములో పదియాఱువేల కన్యకల మేడలయందు నని తా.

౬౩౯.—సీ॥ పటికంపుఁ గంబముల్ * పవడంపుఁ బట్టెలు - మరకత రచితముల్ * మదిర లమర
వైడూర్య మణిగణా * వలుల సుపద్మ రా - గంబుల మొగడల * కాంతులొలయ
సజ్జాతి వజ్రాల * సజ్జాత రుచులతో - భాసిల్లు నీల సో * పానములును
గరుడపచ్చల విటం * కములును ఘనరుచి - వెలసిన శశికాంత * వేదికలును

తే॥ వఱలు మౌక్తిక ఘటిత క * వాటములును । బ్రవిమల స్వర్ణమయ సాల * భంజికలును
మించు కలరవ మెసఁగఁ గ్రీ * డించు మిథున । లీల నొప్పు కపోత పా * లికలు గలిగి.

టీ॥ పటికంపుఁగంబములు = పటికపురాళ్లతోఁ జేయఁబడిన కంబములును—కోళ్లును. పవడంపుఁబట్టెలు = పగడములపట్టెలును. మరకతరచితములు = పచ్చలతోఁ జేయఁబడినవైన. మదిరలు = మంచములు. అమరన్ = ఒప్పఁగా. వైడూర్యమణిగణావలుల = వైడూర్యముల నెడు రత్నములయు. సుపద్మరాగంబుల=మంచి కెంపులయు. మొగడల = గుబ్బలయొక్క. కాంతులు = వెలుఁగులు. ఒలయన్=వ్యాపింపఁగా. సజ్జాతి...రుచులతోన్—సజ్జాతి=ఉత్తమ జాతిగల — శ్రేష్ఠములయిన; వజ్రాల = రవలయొక్క. సజ్జాత=లెస్సగాఁబుట్టుచున్న. రుచులతోన్=కాంతులతో. భాసిల్లు=ప్రకాశించునట్టి. నీలసోపానములును = నీలాలమెట్లును. గరుడపచ్చల విటంకములును = గరుడపచ్చలచేతఁ జేయఁబడిన వాచూరులును. ఘనరుచిన్ = అధికప్రకాశముచేత. వెలసినశశికాంతవేదికలును= అందములయిన చంద్రకాంతమణుల యరుఁగులును. వఱలు ... ములును—వఱలు=ఒప్పునట్టి. మౌక్తిక=ముత్యాలచేత. ఘటిత= కూర్పఁబడిన. కవాటములును=తలుపులును. ప్రవిమల...కలును—ప్రవిమల = మిక్కిలినిర్మలములయిన. స్వర్ణమయ=బంగారువికారమయిన. సాలభంజికలును=కీలుబొమ్మలును. మించుకలరవము= అతిశయించునట్టియవ్యక్తమధురధ్వని. ఎసఁగన్=అతిశయింపఁగా. క్రీడించు=క్రీడలుచేయునట్టి. మిథునలీలన్ = ఆలుమగలవిలాసము చేత. ఒప్పు=ఒప్పునట్టి. కపోతపాలికలు=పావురపుగూండ్లును(కలిగి)

తా॥ స్ఫటికపుకోళ్లును పగడపు పట్టెలును గలిగి పచ్చలచేతఁ జేయఁబడిన మంచములు ఒప్పఁగా, వైడూర్యమణులయు పద్మరాగమణులయు గుబ్బలకాంతులు వ్యాపింపఁగా, మంచి జాతివజ్రములయొక్క మేలైనకాంతులతో ప్రకాశించునట్టి నీలాలమెట్లు గరుడపచ్చలచేతఁ జేయఁబడిన వాచూరులును, అధిక కాంతిచేత వెలుఁగునట్టి చంద్రకాంతమణుల యరుఁగులును, ముత్యాలతలుపులును, మిక్కిలి నిర్మలమైన బంగారుకీలుబొమ్మలును, అవ్యక్తమధురమయిన ధ్వనులతో క్రీడించునట్టి పావురములుగల గూండ్లును గలిగి అని తాత్పర్యము.

౬౪౦.—తే॥ చేటికానీక పదతులా * కోటి మధుర । నినదభరితంబు రుచిర మా * ణిక్యదీప
మాలికలు గల్గి చూపట్టు * లీల నొక్క । జలజలోచన నిజసౌధ * తలమునందు.

టీ॥ చేటికా ... భరితంబు—చేటికా = పరిచారికలయొక్క. అనీక=సమూహముయొక్క. పద=పాదములయందలి. తులాకోటి= అందెలయొక్క. మధుర=ఇంపైన. నినద=ధ్వనిచేత. భరితంబు= నిండినదియు. రుచిర...మాలికలు—రుచిర=కాంతిగల. మాణిక్య= రత్నములనెడు. దీపమాలికలు=దీపములవరుసలును. కల్గి=కలిగి. చూపట్టన్=కనఁబడుచుండఁగా. లీలన్ = విలాసముగా. ఒక్క జలజలోచననిజసౌధతలమునందు=ఒకస్త్రీయొక్కయింటిలో.

తా॥ పరిచారికల సమూహముయొక్క కాలియందెల చప్పుళ్లు నిండుకొనుచున్నదియు, రత్నములనెడుదీపములచేత వెలుఁగుచుండునదియునైన ఒక మేడయందు విలాసముగా అని తాత్పర్యము.

౬౪౧.—తే॥ కనక కంకణ ఝుణఝుణ * త్కారకలిత । చంద్రబింబాననా హస్త * జలజ ఘటిత
చామరోద్ధూత మారుత * చలిత చికుర । పల్లవునిఁ గృష్ణు వల్ల వీ * పల్లవునిని.

టీ॥ కనక...పల్లవునిన్—కనక=బంగారు వికారమైన. కంకణ= కడియములయొక్క. ఝుణఝుణత్కార=ఝుణఝుణయని మ్రోఁగునట్టి మ్రోఁతతోడ. కలిత=కూడిన. చంద్రబింబాననా=చంద్రబింబమును బోలిన ముఖములుగల స్త్రీలయొక్క. హస్తజలజ = తామరల వంటి చేతులయందు. ఘటిత = కూర్పఁబడిన. చామర = వింజామరలచేత. ఉద్ధూత=ఎగయుచున్న. మారుత=గాలిచేత. చలిత=కదలింపఁబడిన. చికురపల్లవునిన్ = చిఱుతెంట్రుకలు గలవానిని. వల్లవీపల్లవునిన్= గోపికలకువిటుఁడైనవానిని. కృష్ణుని=కృష్ణమూర్తిని.

తా॥ పరిచారికలు తమచేతులయందలి బంగారుగాజులు ఝుణఝుణ యని మ్రోఁగుచుండఁగా వేయు వింజామరలవలనఁ బుట్టిన గాలిచేత కదలాడుచున్న ముంగురులు గలవాఁడును గోపికలకు విటుఁడునైన శ్రీకృష్ణమూర్తిని అని తాత్పర్యము.

వ॥ మఱియు హాటక నిష్కంబు లట్టులందు వెలుంగొందఁ గంచుకంబులు శిరోవేష్టనంబులుఁ గనక కుండలంబులు ధరియించి సంచరించు కంచుకులును, సమాన వయో రూప గుణ విలాసవిభ్రమ కలితలయినవిలాసినీ సహస్రంబులుఁ గొలువఁ గొలువున్న యప్పద్మలోచనుం గాంచన సింహాసనాసీనుం గాంచె నప్పుండరీకాక్షుండును నారదునింగనుంగొని ప్రత్యుత్థానంబుసేసి యప్పుడు.

టీ॥ (మఱియు) హాటకనిష్కంబులు = బంగారుమాడలు. అట్టి అందుఁ = మెడలయందు. వెలుఁగొందఁ = ప్రకాశింపఁగా. కంచుకంబులు = కుబుసములును. శిరోవేష్టనంబులును = తలచుట్లును—తలపాగాలును. కనకకుండలంబులు = బంగారుచెవిపోఁగులును. (ధరియించి) సంచరించు = మెలఁగునట్టి. కంచుకులును = వాగ్గల్లును. సమానవయోరూపగుణవిలాసవిభ్రమకలితలు = ఈడైనవయస్సు చక్కఁదనమును సుగుణములునువినోదచేష్టలును కలవారు. అయినవిలాసినీసహస్రంబులును = అయినట్టి అనేకులు వేడుకకత్తెలును. కొలువఁ = సేవింపఁగా. కొలువున్నయప్పద్మలోచనుఁ = కొలువుదీరియున్న యాకృష్ణమూర్తిని. కాంచనసింహాసనాసీనుఁ = బంగారు సింహాసనమునందుఁ గూర్చున్నవానిని. కాంచెఁ = చూచెను. అప్పుండరీకాక్షుండును = అకృష్ణుఁడును. (నారదుని) కనుంగొని = చూచి. ప్రత్యుత్థానంబుసేసి. = ఎదురుకొని లేచి. అప్పుడు = ఆసమయమునందు.

తా॥ ఇదిగాక బంగారు మాడలు మెడలలో వెలుఁగు చుండఁగా కుబుసములును తలచుట్లును బంగారుపోఁగులును ధరించి మెలఁగునట్టి అంతఃపురపుకావలివాండ్రును తగినవయసుచక్కఁదనము సుగుణములు వినోదచేష్టలు గలిగి మెలఁగునట్టి వేడుకకత్తెలును కొలువుచేయఁగా బంగారు సింహాసనమునందుఁ గూర్చుండి కచ్చేరి చేయుచున్న శ్రీకృష్ణమూర్తిని నారదుఁడుచూచెను అకృష్ణుఁడు తన్నుఁజూడవచ్చిన నారదుని జూచి యెదురుకొని లేచినవాఁడై యని తాత్పర్యము.

౬౪౩.—క॥ మునివరు పాదాంబుజములు । తనచారు కిరీటమణివి * తానము సోఁకఁ
వినమితుఁడై నిజసింహా । సనమునఁ గూర్చుండఁబెట్టి * సద్వినయమునన్.

టీ॥ మునివరుపాదాంబుజములు = నారదమహామునియొక్కపాదకమలములను. తనచారుకిరీటమణివితానము = అందమైన తనకిరీటమునందలిమణులసమూహము. సోఁకఁ = తాఁకునట్టుగా. వినమితుఁడై = మ్రొక్కినవాఁడై. నిజసింహాసనమునన్ = తనయొక్క సింహాసనమునందు. (కూర్చుండఁబెట్టి) సద్వినయమునన్ = మంచి యడఁకువతో.

తా॥ అప్పుడు ఆనారదమహాముని పాదములు తనయొక్కకిరీటమునందు పొదుఁగఁబడిన రత్నములు సోఁకునట్టుగా సాగిలఁబడి మ్రొక్కి తానుగూర్చుండు సింహాసనముమీఁద ఆయనను గూర్చుండఁబెట్టి మిక్కిలి వినయముగలవాఁడైయని తాత్పర్యము.

౬౪౪.—క॥ తనపాద కమల తీర్థ । మ్మున లోకములం బవిత్ర * ముగఁజేయు పురా
తన మౌని లోకగురుఁడ । మ్ముని పదతీర్థంబు మస్త * మున ధరియించెన్.

టీ॥ తనపాదకమలతీర్థమ్మునన్ = తనయడుగుఁదామరలజలముచేతను లోకములన్ = పదునాలుగు లోకములను. పవిత్రముగన్ = పావనముగా. చేయుపురాతనమౌని = చేయునట్టి ప్రాఁతమునియైన—నారాయణఋషియైన. లోకగురుఁడు = లోకములకు తండ్రియైనకృష్ణుఁడు. అమ్ముని పదతీర్థంబున్ = ఆనారదమహామునియొక్క అడుగులనంటినయుదకమును. మస్తమునన్ = తలలో. ధరించెను = తాల్చెను.

తా॥ ఎల్లలోకములను తనయడుగులందుఁ బుట్టిన గంగ నీటిచేత పావనములను గాఁజేయునట్టి నారాయణఋషియగువాఁడును ఎల్లలోకులకు తండ్రియయిన వాఁడును నైన శ్రీకృష్ణమూర్తి ఆనారద మహాముని యొక్క కాళ్లుకడిగిన నీళ్లను తనతలయందు చల్లుకొనెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు బ్రహ్మణ్యదేవుండును, నరసఖుండును నైన నారాయణుం డశేషతీర్థోపమానంబయిన మునీంద్ర
పాదతీర్థంబు ధరియించిన వాఁడై సుధాసారంబులైన మితభాషణంబుల నారదున కిట్లనియె.

టీ॥ (ఇట్లు) బ్రహ్మణ్యదేవుండును = వేదోక్తధర్మమును నడపునట్టి దేవుఁడును. నరసఖుండును = అర్జునునకు స్నేహితుఁడును. అయిన నారాయణుండు = అయినట్టి కృష్ణుఁడు. అశేషతీర్థోపమానంబు = ఎల్లతీర్థములకును ఉపమాన మయినది. అయిన మునీంద్ర పాద తీర్థంబు = అయినట్టి నారదమహాముని యొక్క కాళ్లు కడిగిన పరిశుద్ధ జలమును. (ధరియించినవాఁడై) సుధాసారంబులు = అమృత రసమువంటి రసము గలవి. అయినమితభాషణంబులన్ = అయినట్టి కొలఁదిమాటలచేతను. నారదునకున్ = నారదునితో. (ఇట్లనియెను)

తా॥ ఈవిధముగా వేదోక్తాచారమును తప్పక నడపువాఁడైన యేలినవాఁడును అగునట్టి శ్రీకృష్ణమూర్తి ఎల్ల తీర్థములకంటె పావనమని చెప్పఁదగిన నారదమహాముని పాదతీర్థమును పరిగ్రహించినవాఁడై అమృతసారము వలె ఇంపులైనమాటలతో నారదునిఁగూర్చి పలికెనని తా.

౬౪౫.—క॥ ఏపనిపంచినఁ జేయుదుఁ । దాపసవర యనుఁడునతఁడు * దామోదర చి
ద్రూపక భవదవతార । వ్యాపారము దుష్ట నిగ్ర * హార్థము గాదే.

టీ॥ తాపసవర = ఓఋషి శ్రేష్ఠుఁడా! ఏపనిపంచినన్ = ఏపని చేయుమని ఆజ్ఞాపించినను. (చేయుదును) అనుఁడున్ = అనఁగా. అతఁడు = ఆనారదుఁడు. దామోదర = కృష్ణా. చిద్రూపక = జ్ఞానస్వరూపుఁడా. భవదవతారవ్యాపారము = నీవు అవతారమెత్తినపని. దుష్టనిగ్రహార్థము = చెడ్డవారిని శిక్షించుటకొఱకు. కాదే = కదా.

తా॥ ఓమునిశ్రేష్ఠా! మీరు ఏపనిచేయుమని ఆజ్ఞాపించినను చేసెదను అని శ్రీకృష్ణమూర్తి చెప్పఁగా ఆయన జ్ఞానస్వరూపుఁడవైన ఓకృష్ణమూర్తీ! నీవు అవతారమెత్తుట దుష్టులను శిక్షించు నిమిత్తమే కదా అనెనని తా.

౬౪౬.—తే॥ అఖిలలోకైక పతివి ద * యార్ద్రమతివి । విశ్వ సంరక్షకుండవు * శాశ్వతుఁడవు
వెలయ నేపనియైనఁ గా * వింతు ననుట । యార్తబంధుండ విది నీకు * నద్భుతంబె.

టీ॥ అఖిలలోకైకపతివి = బ్రహ్మాదిసమస్తలోకములకుముఖ్యుఁడవగు నాయకుఁడవు. దయార్ద్రమతివి = దయారసముచేత తడిసినబుద్ధి గలవాఁడవు. విశ్వసంరక్షకుండవు = సర్వమును రక్షించువాఁడవు. శాశ్వతుఁడవు = ఎప్పుడునుండువాఁడవు. ఆర్తబంధుఁడవు = దుఃఖమునొందిన

వారికి చుట్టమైన వాఁడవు. ఇలయం = ప్రసిద్ధముగా. (ఏకని దైనను) కావింతుననుట = చేయుదుననుట. (ఇదినీకు) అద్భుతంబె = ఆశ్చర్యమా.

తా॥ ఎల్ల లోకములకుముఖ్యప్రభుఁడవును, మిక్కిలిదయగలవాఁడవును సర్వమును కాపాడువాఁడవును, ఎల్లప్పుడునుండువాఁడవును, దుఃఖించు వారిదుఃఖమును పోఁగొట్టునట్టిచుట్టమయినవాఁడవును అగునీకు నేను ఏపనిచేయుమన్నను చేసెదననిచెప్పుట యొకయాశ్చర్యమా అనితా.

౭౪౯.—తే॥ అబ్జసంభవ హర దేవ * తార్చనీయ । భూరి సంసార సాగరో * త్తారకంబు
నవ్యయానంద మోక్ష దా * యకమునైన । నీపదధ్యాన మాత్మలో * నిలువ నీవె.

టీ॥ అబ్జ...నీయ—అబ్జసంభవ=బ్రహ్మచేతను. హర=శివునిచేతను. దేవత=ఇంద్రుఁడు మొదలుగాఁగల దేవతలచేత. అర్చనీయ=అర్చింపఁ దగినవాఁడా. భూరి...త్తారకంబును — భూరి=అధికమయిన — లేక గొప్పదైన. సంసార=సంసారము అనెడు. సాగర=సముద్రమును. ఉత్తారకంబును=దాఁటించునదియును. అవ్యయానంద మోక్షదాయక మును—అవ్యయ=చెడని. ఆనంద=సంతోషమును. మోక్ష=ముక్తిని. దాయకమును=ఇచ్చునదియును. అయిన నీపద ధ్యానము=అయినట్టి నీపాదములయొక్క ధ్యానమును. ఆత్మలోన్ = నామనస్సునందు. నిలువనీవె=నిలుచునట్లుచేయవయ్యా.

తా॥ బ్రహ్మ రుద్రుఁడు మొదలగు దేవతలుపూజింపఁదగిన వాఁడ వైన ఓకృష్ణా! సంసారమనెడుమహాసముద్రమును దాఁటించునదియు చెడనిసంతోషమును ముక్తిని ఇచ్చునదియునైన నీపాదముల ధ్యానము నామనసునందు ఎల్లప్పుడు నిలుచునట్లుగా అనుగ్రహింపుము అనితా.

వ॥ అనియభ్యర్థించి యద్దేవునివలనఁ బ్రసన్నతఁబడసి తన్మందిరంబు వెడలి మునివరుం డమ్మహాత్ముని యోగమాయా ప్రభావంబు దెలియం గోరి వేఱొక చంద్రబింబాననా గేహంబునకుం జని యందు నెత్తమాడుచున్న పురుషోత్తము నుద్ధవసహితుంగని యద్భుతంబునొందుచు నచ్చట నతనిచేత సత్కృతుండై యచ్చోటు వాసి చని.

టీ॥ (అని) అభ్యర్థించి=వేఁడుకొని. అద్దేవునివలనన్ = ఆకృష్ణ మూర్తివలన. ప్రసన్నతన్=అనుగ్రహమును. పడసి=పొంది. తన్మందిరంబు వెడలి=ఆయింటనుండిబయలువెడలి. మునివరుండు=మునిశ్రేష్ఠుఁ డైననారదుఁడు. అమ్మహాత్ముని యోగమాయా ప్రభావంబు = ఆగొప్ప మహిమగలవాఁడైనకృష్ణునియోగమాయామహిమను. తెలియంగోరి= తెలిసికొనవలెననితలఁచి. వేఱొకచంద్రబింబాననా గేహంబునకున్ = చంద్రునివంటి మొగముగల మఱియొక స్త్రీయింటికి. చని = పోయి. అందున్ =ఆయింటిలో. నెత్తమాడుచున్నపురుషోత్తమున్=సొగటా లాడుచున్నకృష్ణుని. ఉద్ధవసహితున్=ఉద్ధవునితోఁగూడుకొన్నవానిని. కని = చూచి. అద్భుతంబునొందుచున్ = ఆశ్చర్యమును పొందుచు. అచ్చటన్=ఆయింటిలో. అతనిచేతన్=ఆకృష్ణునిచేత. సత్కృతుండై= సన్మానింపఁబడినవాఁడై. అచ్చోటు=అతావును. వాసి=విడిచి—చని.

తా॥ అని యీవిధముగా కృష్ణుని వేఁడుకొని ఆయన యనుగ్రహమునుపొంది ఆయిల్లువిడిచి బయలుదేఱి కృష్ణునియొక్క యోగమాయ మహిమను తెలిసికోఁ గోరినవాఁడై మఱియొక్క యిల్లాలి యింటికి పోయి అక్కడ ఉద్ధవుఁడు సేవింపఁబడినుండఁగాఁ జూదమాడుచున్న కృష్ణ మూర్తినిజూచి అక్కడ ఆయనచేత సన్మానమునుపొందినవాఁడైఅందుండి బయలుదేఱి యనితాత్పర్యము.

౭౫౦.—క॥ మునివరుఁడు గాంచె నొండొక । వనజాయత నేత్ర నిజని * వాసంబున నం
దనయుతుఁ జిష్ణు సహిష్ణున్ । వినుతగుణా లంకరిష్ణు * విష్ణుం గృష్ణున్.

టీ॥ మునివరుఁడు = నారదుఁడు. ఒండొక వనజాయత నేత్రనిజనివాసంబునన్ = మఱియొక తామర రేకులవంటి విశాల మయిన కన్నులుగల ప్రియురాలి యింటిలో. నందనయుతున్=కొడుకులతోఁ గూడుకొన్నవానిని. జిష్ణున్ = జయ శీలుఁడైన వానిని. సహిష్ణున్= సర్వవిషయములనుఓర్చుస్వభావముగలవానిని. వినుతగుణాలంకరిష్ణున్= కొనియాడఁ దగినగుణములచేత అలంకరింపఁబడినవానిని. విష్ణున్= సర్వవ్యాపకుఁడైనవానిని. కృష్ణున్ = శ్రీకృష్ణమూర్తిని. కాంచెన్= చూచెను.

తా॥ అట్లుబయలుదేఱిమఱియొక్కస్త్రీయింటికిపోయి అచ్చటజయ శీలుఁడును సర్వవిషయ సహన శీలుఁడును కొనియాడ బడిన గుణములుగల వాఁడును సర్వ వ్యాపకుఁడు నైన శ్రీకృష్ణుని కొడుకులతోఁ గూడుకొనివేడుకఁగానుండఁగా నారదుఁడుచూచెనుఅనితాత్పర్యము.

౭౫౧.—క॥ నారదుఁ డటఁజని కనె నొక । వారిజముఖియింట నున్న * వాని మురారిన్
హారిన్ దానవకుల సం । హారిన్ గమలామనో వి * హారిన్ శౌరిన్.

టీ॥ (నారదుఁడు) అటఁజని = అవలపోయి. ఒకవారిజముఖి యింటన్=ఒకస్త్రీయింటిలో. హారిన్=ముత్యాలహారములు ధరించిన వాఁడును. దానవకులసంహారిన్=రాక్షస కులమును నాశనము చేసిన వాఁడును. కమలామనోవిహారిన్ = శ్రీలక్ష్మీదేవియొక్క మనస్సునందు విహరించువాఁడునునై. ఉన్నవానిన్=ఉండునట్టి. మురారిన్ = మురాసురునిసంహరించినవాఁడైన. శౌరిన్=శూరునివంశమునఁబుట్టిన శ్రీకృష్ణుని. కనెన్=చూచెను.

తా॥ నారదుఁడు అందుండి మఱియొక యింటికి పోయి అచ్చట ముత్యాలహారములు ధరించి రాక్షస సమూహమును నాశముచేసి లక్ష్మీదేవిమనసునకెక్కువర్తించునట్టివాఁడైన శ్రీకృష్ణునిజూచెననితాత్పర్యము.

వ॥ ఇట్లు కనుంగొనుచు నుండ నొక్కయెడ నమ్మునీంద్రునకు ముకుందుండు ప్రత్యుత్థానంబు చేసి మునీంద్రా సంపూర్ణకాములైన మిమ్ము నపూర్ణులమైన యేమేమిటఁ బరితృప్తి నొందంజేయఁ గలవారము భవదీయ దర్శ

నంబున నీఖిలశోభనంబుల నందెదమని ప్రియపూర్వకంబుగాఁ బలికిన నానందనందను మాటలకు నానందకందళిత హృదయారవిందుండును, మందస్మిత సుందర వదనారవిందుండును నగుచు నారదుండు వెండియుం జని.

టీ॥ (ఇట్లు) కనుంగొనుచునుండఁగ = ఈప్రకారము చూచుచుండఁగా. ఒక్కయెడఁ = ఒకచోట. అమ్మునీంద్రునకు = అమునిశ్రేష్ఠునికి. ముకుందుండు = కృష్ణుఁడు. ప్రత్యుత్థానంబుచేసి = ఎదురుకొనిలేచిపోయి. మునీంద్రా = ఓమునిశ్రేష్ఠుఁడా. సంపూర్ణకాములు = నిండినకోరికలుగలవారు — ఎల్లకోరికలునెఱవేర్చుకొన్నవారు. అయిన మిమ్ము = అయినట్టిమిమ్మును. అపూర్ణులమైనయేము = కొఱఁతలు గలవారమైనమేము. ఏమిటను = దేనిచేత. పరితృప్తిని = పూర్ణతృప్తిని. పొందంజేయఁగలవారము = పొందింపఁగలవారము. భవదీయదర్శనంబునను = మీదైనదర్శనముచేత. నిఖిలశోభనంబులు = ఎల్లశుభములను. అందెదము = మేముపొందుచున్నాము. (అని) ప్రియపూర్వకంబుగాను = ప్రియము ముందుగలుగునట్లుగా — ప్రీతికనఁబడునట్లు. పలికినను = చెప్పఁగా. ఆనందనందనుమాటలకు = ఆకృష్ణునిపలుకులకు. ఆనందకందళితహృదయారవిందుండును = సంతోషము మొలకలెత్తుచున్న మనఃకమలముగలవాఁడును. మందస్మితసుందరవదనారవిందుండును = చిఱునవ్వుచేత అందగిల్లుచున్న ముఖకమలము గలవాఁడును. (అగుచును నారదుండు) వెండియును = మఱియు. చని = పోయి.

తా॥ ఈవిధముగాఁజూచుచుపోవుచుండఁగా ఆనారదమహామునికి ఒకచోటకృష్ణుఁడుఎదురుగావచ్చి ఓమహామునీ! కొఱఁతలేనిమీకుఎల్ల కొఱఁతలుగలమేము ఏక్రియచేత తృప్తిపొందింపఁ గలము మీదర్శనముచేత మేముమాత్రము సకలశుభములనుపొందుచున్నాము అనిప్రియముకనఁబడఁబలికిన కృష్ణమూర్తిమాటలువిని నారదుఁడు మనసున సంతోషించుచు చిఱునవ్వునవ్వుచు ఇంకను కొన్ని యిండ్లకు పోయియని తా.

౬౪౩.—క॥ అనఘాత్ముఁడు గనుఁగొనె నొక । వనితామణి మందిరమున ❋ వనకేళీ సం
జనితానందుని ననిమిష । వినమిత చరణారవిందు ❋ విభు గోవిందున్.

టీ॥ అనఘాత్ముఁడు = పాపములేని మనసుగలవాఁడైన నారదుఁడు. ఒకవనితామణిమందిరమునను = ఒకయుత్తమస్త్రీయింటను. వనకేళీసంజనితానందునిని = వనవిహారమువలనఁగలిగినసంతోషముగలవాఁడును. అనిమిష వినమితచరణారవిందున్ — అనిమిష = దేవతలచేత. వినమిత = మ్రొక్కఁబడిన. చరణారవిందున్ = పాదకమలములు గలవాఁడును. విభున్ = సర్వప్రభువును నైన. గోవిందున్ = కృష్ణుని. కనుఁగొనెన్ = చూచెను.

తా॥ నారద మహాముని మఱియొక స్త్రీయింట వనవిహారముచేసి సంతోషించుచుండఁగా దేవతలచేత మ్రొక్కించుకొనువాఁడును ప్రభువునునైన శ్రీకృష్ణమూర్తిని జూచెనని తాత్పర్యము.

౬౪౪.—క॥ పరమేష్ఠి సుతుఁడు గనె నొక । తరుణీ భవనంబునందుఁ ❋ దనుఁ దాన మహోం
బురుహమునఁ దలఁచుచుండెడి । నరకాసురదమను శూరు ❋ నందకుమారున్.

టీ॥ పరమేష్ఠిసుతుఁడు = బ్రహ్మకొడుకు — నారదుఁడు. ఒకతరుణీభవనంబునందున్ = మఱియొకప్రియురాలియింటిలో. తనున్ = అహంపదలక్ష్యార్థపరబ్రహ్మమైనతన్ను. తాన = తానే. మనోంబురుహమునన్ = మనఃకమలమునందు — హృదయాకాశమునందు. తలఁచుచున్ = ధ్యానించుచు. ఉండెడినరకాసురదమనున్ = ఉండునట్టి నరకాసురసంహారముచేసినవాఁడును. శూరున్ = శూరత్వముగలవాఁడును. నందకుమారున్ = నందునికొడుకునైన శ్రీకృష్ణమూర్తిని. కనెన్ = చూచెను.

తా॥ నారదమహాముని మఱియొకస్త్రీగృహమునందు పరబ్రహ్మమైన తన్ను తానే తనహృదయకమలమునందు ధ్యానము చేయుచున్నవాఁడును, నరకాసురుని సంహారముచేసినవాఁడును, మిగులశూరత్వము గలవాఁడును, నందుని కుమారుఁడును నైన శ్రీకృష్ణమూర్తిని చూచెనని తాత్పర్యము. వ॥ మఱియునుంజనిచని.

౬౪౫.—సీ॥ ఒకచోట నుచిత సం ❋ ధ్యోపాసనాసక్తు - నొకచోటఁ బౌరాణి ❋ కోక్తి కలితు
నొకచోటఁ బంచ య ❋ జ్ఞోచిత కర్ముని - నొకచోట నమృతోప ❋ యోగలోలు
నొకచోట మజ్జనో ❋ ద్యోగానుషక్తుని - నొకచోట దివ్యభూ ❋ షోజ్జ్వలాంగు
నొకచోట ధేను దా ❋ నోత్కలితాత్ముని - నొకచోట నిజసుత ❋ ప్రకరయుక్తు
తే॥ నొక్కచోటను గాన వి ❋ నోదచిత్తు । నొక్కచోటను జలకేళి ❋ యుతవిహారు
నొక్కచోటను సన్మంచ ❋ కోపయుక్తు । నొక్కచో బలభద్రుతోఁ ❋ జొక్కువాని.

టీ॥ ఒకచోటన్ = ఒకతావునందు. ఉచితసంధ్యోపాసనాసక్తున్ = తగినసంధ్యావందనమునందు ఆసక్తుఁడై నడపువానిని. ఒకచోటన్ = మఱియొకతావున. పౌరాణికోక్తికలితున్ = పురాణముచెప్పునట్టివారిమాటలచేతకూడుకొన్నవానిని. ఒకచోటన్ = ఇంకొకచోట. పంచయజ్ఞోచితకర్మునిన్ = పంచయజ్ఞములనెడితగినకర్మములనునడపువానిని ఒకచోటన్ = మఱియొకచోట. అమృతోపయోగలోలున్ = అమృతమును త్రాగుటయందు దాసక్తునిని. (ఒకచోటను) మజ్జనోద్యోగానుషక్తునిన్ = స్నానప్రయత్నముచేయుటయందాసక్తునిని. (ఒకచోటను) దివ్యభూషోజ్జ్వలాంగున్ = అప్రాకృతములయిన యాభరణములచేత వెలుఁగునట్టిఅవయవములుగలవానిని. (ఒకచోటను) ధేనుదానోత్కలితాత్మునిన్ = లేఁగటావులను దానముచేయ నుత్సాహము గలవానిని. (ఒకచోటను) నిజసుతప్రకరయుక్తున్ = తనకొడుకుల గుమిలో కూడుకొన్నవానిని. (ఒక్కచోటను) గానవినోదచిత్తున్ = పాట వినుటయందు వేడుకగల మనసు గలవానిని. (ఒక్కచోటను) జలకేళియుతవిహారున్ = జలక్రీడతోఁగూడిన విహారము గలవానిని. (ఒక్కచోటను) సన్మంచకోపయుక్తున్ = మంచి మంచెయందున్నవానిని. ఒక్కచోన్ =

ఒకచోటను. బలభద్రుతోన్ = బలరామునితోఁగూడ. చొక్కు వానిన్=పరవశత్వము నొందువానినిగాను చూచెనని యర్థము.

తా॥ ఒకచోట సంధ్యవార్చుచును,ఒకతావున పురాణము వినుచును, ఒకచోటను పంచ మహాయజ్ఞ కర్మలను చేయుచును, మఱియొకచోట అమృతము త్రాగుచును, ఇంకొకచోట స్నానముచేయుచును, ఇంకనొకచోట ఆభరణములు తొడుగుకొనుచును, మఱియొకతావున లేఁగటావులను దానమిచ్చుచును, మఱియునొకయెడ కొడుకులతో కూడుకొనియును, మఱియొక్కచోట పాట వినుచును, ఇంకొక్కచోట మంచెలెక్కి ఆడుచును, ఇంకొక్కతావున బలరామునితోఁ గూడుకొనియు నుండునట్టి శ్రీకృష్ణమూర్తిని నారదుఁడు చూచెనని తాత్పర్యము.

౬౫౬.—సీ॥ సకలార్థ సంవేది * యొకయింటిలోపలఁ - జెలువతో ముచ్చట * లెప్పుచుండు
విపుల యశోనిధి * వేఱొక్క యింటిలో - సరసిజాననఁ గూడి * సరసమాడుఁ
బుండరీకాక్షుండు * నొండొకయింటిలోఁ - దరుణికి హారవ * ల్లరులు గ్రుచ్చుఁ
గరుణాపయోనిధి * మఱియొక యింటిలోఁ - జెలిఁగూడి విడియము * సేయుచుండు

ఆ॥ వికచ కమల నయనుఁ * డొకయింటిలో నవ్వుఁ । బ్రవిమలాత్ముఁ డొకట * బాడుచుండు
యోగి జనవిధేయుఁ * డొకయింట సుఖగోష్ఠి । సలుపు ననఘుఁ డొకటఁ * జెలఁగుచుండు.

టీ॥ సకలార్థసంవేది = సర్వవిషయములు తెలిసిన వాఁడైన కృష్ణుడు. ఒకయింటిలోపలన్=ఒకానొకయింటిలో. చెలువతోన్= ప్రియురాలితో. ముచ్చటలు=గోష్ఠీవాక్యములను. (చెప్పుచుండును) విపులయశోనిధి = అధికకీర్తికి ఉనికిపట్టయినకృష్ణుఁడు. వేఱొక్కయింటిలోన్=ఇంకొకయింటిలో. సరసిజాననన్=కమలమువంటి ముఖముగల ప్రియురాలితో. కూడి=కూడుకొని. సరసమాడున్= సరసపుమాటలాడుచుండును. పుండరీకాక్షుండు=తెల్లదామరల వంటి కన్నులుగల కృష్ణుఁడు. ఒండొకయింటిలోన్ = ఇంకొకయింటిలో. తరుణికిన్=యౌవనవతియైన ప్రియురాలికి. హారవల్లరులు=పూవులసరములుచెండ్లును. గ్రుచ్చున్=కొప్పునఁదుఱుమును. కరుణాపయోనిధి = దయాసముద్రుఁడైన కృష్ణుఁడు. (మఱియొకయింటిలో) చెలిన్=ప్రియురాలిని. కూడి=చేరి. విడియముసేయుచుండున్ = తాంబూలము వేసికొనుచుండును. వికచకమలనయనుఁడు=వికసించిన కమలమునుబోలిన కన్నులుగలకృష్ణుఁడు. (ఒకయింటిలో) నవ్వున్=నవ్వుచుండును. ప్రవిమలాత్ముఁడు = నిర్మలమయిన మనసుగలవాఁడు. (అగుకృష్ణుఁడు) ఒకటన్=ఒకచోట. (పాడుచుండును) యోగిజనవిధేయుఁడు=యోగీశ్వరులకులోఁబడియుండువాఁడు. (అగుకృష్ణుఁడు) ఒకయింటన్=ఇంకొకయింటిలో. సుఖగోష్ఠిసలుపున్=సుఖసల్లాపము చేయుచుండును. అనఘుఁడు= పాపములేనివాఁడైనకృష్ణుఁడు. ఒకటన్=ఇంకొకచోట. చెలఁగుచుండున్=సంతోషించుచుండును.

తా॥ సర్వవిషయములు తెలిసినవాఁడును, మిక్కుటమయినకీర్తిగలవాఁడును, కరుణాసముద్రుఁడును, వికసించిన తెల్లదామరలవంటి కన్నులుగలవాఁడును, నిర్మలమయిన మనసుగలవాఁడును, యోగీశ్వరులకు లోఁబడినవాఁడును, పాపము లేనివాఁడును అగు శ్రీకృష్ణమూర్తి ఆయాగృహములలో నుండు ప్రియురాండ్ర ఇష్టము ననుసరించి ఒకచోట ముచ్చటలాడుచును, ఒకచోట సరసాలాడుచును, ఒకచోట కొప్పున పూవులు దుఱుముచును, ఒకతావున విడెము చేయుచును ఒకచోట నవ్వుకొనుచును, ఒకచోట పాడుచును, ఒకచోట సుఖముగా ప్రొద్దుపుచ్చుచును, ఒకచోట ఊరక సంతోషించుచును ఉండునని తాత్పర్యము.

వ॥ ఇట్లు చూచుచుం జనిచని.

౬౫౭.—క॥ చతురానన నందనుఁ డం । చితమతిఁ జనికాంచె నొక్క * చెలిగేహమునన్
గ్రతుకర్మాచరణుని నా । శ్రిత భయహరణుని సురేంద్ర * సేవితచరణున్.

టీ॥ చతురాననందనుఁడు = నారదుఁడు. అంచితమతిన్ = ఒప్పిదమైనబుద్ధితో. చని=పోయి. ఒక్కచెలిగేహమునన్=ఒకస్త్రీయింటిలో. క్రతుకర్మాచరణునిన్ = యజ్ఞకర్మలుచేయువాఁడును. ఆశ్రితభయహరణునిన్ = ఆశ్రయించినవారిభయమును పోఁగొట్టువాఁడును. సురేంద్రసేవితచరణున్=దేవేంద్రునిచేత సేవింపఁబడిన పాదములు గలవాఁడునునైన శ్రీకృష్ణుని. కాంచెన్ = చూచెను.

తా॥ బ్రహ్మకొడుకైన నారదుఁడు సెమ్మదితోడి బుద్ధితో ఒకస్త్రీయింటికిపోయి అచ్చట యజ్ఞకర్మములను నడపుచును, ఆశ్రయించినవారిని కాపాడుచును నుండునట్టి ఇంద్రునిచేత సేవింపఁబడినపాదములుగలవాఁడైనశ్రీకృష్ణమూర్తిని చూచెననితాత్పర్యము.

౬౫౮.—క॥ వృత్రారినుతుసఁ బరమ ప । విత్రుని నారదుఁడు గాంచె * వేఱొకయింటం
బుత్రక పౌత్రక దుహితృ క । ళత్ర సమేతుని ననంతు * లక్షణవంతున్.

టీ॥ (నారదుఁడు) వృత్రారినుతునిన్ = దేవేంద్రునిచేత కొనియాడఁబడువాఁడును. పరమపవిత్రునిన్=మిక్కిలిపరిశుద్ధుఁడును. అనంతున్=అంతములేనివాఁడును. లక్షణవంతున్=శుభలక్షణములు గలవాఁడును. (అయినకృష్ణుని) పుత్రక...సమేతునిన్—పుత్రక= కొడుకులతోడను. పౌత్రక=మనుమలతోడను. దుహితృ=కొమార్తలతోడను. కళత్ర = భార్యతోడను. సమేతున్ = కూడుకొన్నవానిని. కాంచెన్=చూచెను.

తా॥ నారదుఁడు దేవేంద్రునిచేత కొనియాడఁబడువాఁడును,

మిగుల పరిశుద్ధుఁడును, అంతము లేనివాఁడును, ఎల్ల శుభ లక్షణములు గలవాఁడును నైన శ్రీకృష్ణుని కొడుకులు మనుమలు కొమార్తలు భార్య వీరందఱితోను గూడుకొనియున్న వానినిగాఁ జూచెనని తాత్పర్యము.

౮౫౯.—క॥ సుందరమగు నొకసుందరి । మందిరమునఁ బద్మభవ కు ✻ మారుఁడు గాంచెన్
నందిత నందున్ సుజనా । నందున్ గోవిందు నుతస ✻ నందు ముకుందున్.

టీ॥ సుందరమగు = సౌందర్యముగలదైన. (ఒకసుందరిమందిరమున) పద్మభవకుమారుఁడు=నారదుఁడు. సుజనానందున్=సజ్జనులనుసంతోషింపఁజేయువాఁడును. గోవిందున్=వేదములందు తెలియఁబడువాఁడును. నుతసనందున్=కొనియాడఁబడిన సనందనుఁడు గలవాఁడునునైన. ముకుందున్ = కృష్ణమూర్తిని. నందితనందున్=సంతోషింపఁజేయఁబడుచున్ననందుఁడుగలవానిఁగా. (కాంచెను)

తా॥ అందమగు మఱియొకస్త్రీయింటిలో సజ్జనులకు సంతోషము కలుగఁజేయువాఁడును, వేదములందు తెలియఁబడువాఁడును, సనందునిచేత కొనియాడఁబడువాఁడును నైన శ్రీకృష్ణమూర్తిని నందుని సంతోషింపఁజేయుచుండఁగా నారదుఁడు చూచెనని తా.

౮౬౦.—క॥ జలజభవ భవుఁడు గనె నొక । నలినాక్షి నివాసమందు ✻ నతభద్రేభున్
జలదాభున్ గతలోభున్ । నలకాళి జితద్విరేఫు ✻ నంబుజ నాభున్.

టీ॥ జలజభవభవుఁడు = బ్రహ్మకొడుకు. ఒకనలినాక్షినివాసమందున్=ఒకస్త్రీయింటిలో. నతభద్రేభున్=మ్రొక్కఁబడినభద్రజాతి యేనుఁగుగలవాఁడును. జలదాభున్ = మేఘమునుబోలిన దేహకాంతిగలవాఁడును. గతలోభున్=పోయినలోభగుణముగలవాఁడునైన. అంబుజనాభున్=శ్రీకృష్ణుని. అలకాళిజితద్విరేఫున్=తుమ్మెదలను జయింపఁజాలిన ముంగురులుగలవానిఁగా. (కనెను)

తా॥ నారదుఁడు మఱియొకస్త్రీయింటిలోతుమ్మెదలను గెలువఁజాలిన ముంగురులు చలించుచుండఁగాఁ గూర్చుండియున్న గజేంద్రునిచేత మ్రొక్కఁబడినవాఁడును, మేఘకాంతి వంటి దేహకాంతి గలవాఁడును, లోభ గుణము లేనివాఁడును, నాభియందు కమలము గలవాఁడునైన శ్రీకృష్ణమూర్తిని జూచెనని తాత్పర్యము.

౮౬౧.—మ॥ ఒకయింటన్ గజవాజి రోహకుఁడునై ✻ యొక్కింట భుంజానుఁడై
సకలాత్ముండు పరుండు షోడశ సహ ✻ స్ర స్త్రీనివాసంబులన్
నొకబోఁటింటను దప్పకుండ నిజ మా ✻ యోత్సాహుఁడై యుండ న
య్యకలంకుం బరమున్ మహాపురుష బ్ర ✻ హ్మణ్యున్నతాజ్ఞాసనున్.

టీ॥ ఒకయింటన్=ఒకయింటిలో. గజవాజిరోహకుఁడునై = ఏనుఁగులను గుఱ్ఱములను ఎక్కెడువాఁడై. ఒక్కింటన్ = ఇంకొకయింటిలో. భుంజానుఁడై=భోజనముచేయువాఁడై. సకలాత్ముండు= సర్వము తనయందుఁగలవాఁడైన. పరుండు=సర్వోత్కృష్టుఁడైన. షోడశసహస్రస్త్రీనివాసంబులన్ = పదియాఱువేల స్త్రీలయిండ్లయందును. ఒకబోఁటింటన్=ఒకస్త్రీయింటనయినను. (తప్పకుండ) నిజమాయోత్సాహుఁడై=తనమాయవలని యుత్సాహముకలవాఁడై. ఉండన్ = ఉండఁగా. అయ్యకలంకున్=ఆకలంకములేనివాఁడైన. పరమున్=సర్వోత్కృష్టుఁడైన. మహాపురుషున్ = విరాట్పురుషుఁడైన. బ్రహ్మణ్యున్=వేదోక్తధర్మప్రవర్తకుఁడైన. నతాజ్ఞాసనున్=సేవింపఁబడిన బ్రహ్మగలవాఁడునైన శ్రీకృష్ణమూర్తిని. (చూచెను)

తా॥ మఱియు నారదుఁడు ఒకయింటిలో ఏనుఁగులను గుఱ్ఱములను ఎక్కుచు, ఒకయింటిలో భోజనముచేయుచు, ఈవిధముగా ఒక్కొక్కయింటిలో ఒక్కొకవిధముగా పదియాఱువేల రాజస్త్రీల యిండ్లయందును తనమాయను ప్రకాశింపఁజేయుచు మెలఁగుచున్న కలంకము లేనివాఁడును, సర్వోత్కృష్టుఁడును, మహాపురుషుఁడును, వేదోక్త ధర్మప్రవర్తకుఁడును, బ్రహ్మచేత సేవింపఁబడువాఁడునైన శ్రీకృష్ణమూర్తిని జూచెనని తాత్పర్యము.

౮౬౨.—క॥ అస్తోక చరితు నమిత స । మస్త సుధాహారు వేద ✻ మస్తక తల వి
న్యస్త పదాంబుజయుగళు న । పాస్తాశ్రిత నిఖిలపాపుఁ ✻ బరము ననంతున్.

టీ॥ అస్తోకచరితున్=ఘనమైన నడవడి గలవాఁడును. నమితసమస్తసుధాహారున్=నమస్కరించిన సర్వదేవతలు గలవాఁడును, వేదమస్తక...యుగళున్—వేదమస్తక=వేదాంతములనెడు. తల=ప్రదేశములయందు. విన్యస్త=ఉంచఁబడిన. పదాంబుజయుగళున్=పాదకమలములు రెండును గలవాఁడును. అపాస్తాశ్రితనిఖిలపాపున్=తొలఁగింపఁబడిన యాశ్రితులయొక్క సమస్తపాపములు గలవాఁడును. పరమున్=సర్వోత్తముఁడునైన. అనంతున్=కృష్ణుని కనియెనను క్రియ యధ్యాహార్యము.

తా॥ ఘనమైన ప్రవర్తనము గలవాఁడును, ఎల్లదేవతలచేతను మ్రొక్కించుకొనువాఁడును, వేదాంతములయందు ప్రతిపాదింపఁబడిన పాదకమలములు గలవాఁడును, ఎల్లయాశ్రితులపాపములను తొలఁగించువాఁడునునైన శ్రీకృష్ణమూర్తిని నారదుఁడుచూచెననితా.

౮౬౩.—ఆ॥ పరమ భాగవతుఁడు ✻ పరమేష్ఠి తనయుండు । మనుజ లీలఁ జెంది ✻ మహిత సౌఖ్య
చిత్తుఁడైన యాహృ ✻ షీకేశు యోగ మా । యా ప్రభావమునకు ✻ నాత్మ నలరి.

టీ॥ పరమభాగవతుఁడు = భగవద్భక్తులలో నుత్తముఁడయిన. పరమేష్ఠితనయుండు=నారదుఁడు. మనుజలీలన్=సామాన్యమనుష్యుని. (విధమును) చెంది=పొంది. మహితసౌఖ్యచిత్తుఁడు=గొప్ప సుఖములందుఁదగిలిన మనస్సుగలవాఁడు. (ఐన) అహృషీకేశుయోగమాయాప్రభావమునకున్ — అహృషీకేశ = సర్వేంద్రియములను విషయములయందు ప్రవర్తింపఁజేయు కృష్ణునియొక్క. యోగ = కూడికగల. మాయా=సామర్థ్యముయొక్క. ప్రభావమున = మహిమకు. ఆత్మన్=మనసునందు. అలరి=సంతోషించి.

తా॥ భగవద్భక్తులలో నుత్తముఁడైన నారదమహాముని మనుష్యత్వముచేత మెలఁగఁదలఁచి మహత్తరములగు సుఖములను పొందుచున్న కృష్ణమూర్తియొక్క మాయామహిమనుఁజూచి మిక్కిలి ఆశ్చర్యము నొందినవాఁడై మనసున ఆనందించెనని తాత్పర్యము.

౬౬౪.—క॥ మాయురె హరిహరి వరద య । మేయగుణా యనుచునాత్మ * మెచ్చి మునీంద్రుం
డాయదు నాయకు సుజన వి । ధేయున కిట్లనియె దేవ * త్రిజగము లందున్.

టీ॥ మాయురె=ఔరా. హరి = నిద్రయనెడు ప్రళయమందు సర్వమును నీయందు లీనము చేసికొనువాఁడా. హరి=భక్తులపాపములను హరించువాఁడా. వరద = అనన్యభక్తితో నిన్నారాధించువారికి నిన్నెఱుఁగఁదగిన సర్వోత్తమమైన విజ్ఞానము నిచ్చువాఁడా. అమేయగుణా = మేర తెలియరాని సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వాది కల్యాణగుణములు గలవాఁడా. అనుచున్=అని. ఆత్మన్=మనసునందు. మెచ్చి = మెచ్చుకొని. మునీంద్రుండు=నారదమహాముని. ఆయదునాయకున్ = యదువంశమునకు ప్రభువైన. సుజనవిధేయునకున్=సత్పురుషులకు విధేయుఁడైన కృష్ణుని. ఇట్లనియెన్=ఇట్లు పలికెను. దేవ=ఓస్వయంప్రకాశుఁడా. త్రిజగములందున్ = విషయేంద్రియాధి దేవతామయములయిన స్వర్గ మర్త్య పాతాళములనెడు మూఁడులోకములందును.

తా॥ ఔ శ్రీహరీ ఔరా వరద ఔరా అమేయగుణాకరా! అని తనమనసులో మెచ్చుకొనుచును నారదమహాముని సజ్జనులకు విధేయుఁడైన శ్రీకృష్ణమూర్తినిఁజూచి ఓయేలినవాఁడా! మూఁడులోకములందును నీమాయ తెలిసినవారు గలరాయని యడిగెననితాత్పర్యము

౬౬౫.—క॥ నీమాయఁ దెలియువారలె । తామరసాసన సురేంద్ర * తాపసులైనన్
ధీమంతులు నిజభక్తిసు । ధామాధుర్యమునఁ బొదలు * ధన్యులు దక్కన్.

టీ॥ ధీమంతులు = బుద్ధిమంతులగువారును-ఆత్మానాత్మజ్ఞానము గలవారును. నిజభక్తిసుధామాధుర్యమునన్=స్వకీయమయినభక్తియను అమృతముయొక్క కమ్మఁదనముచేత. పొదలు=వృద్ధిపొందునట్టి. ధన్యులు = కృతార్థులు. తక్కన్ = తప్ప. తామరసాసన సురేంద్రతాపసులైనన్=బ్రహ్మ యింద్రుఁడు తపస్సంపన్నులయిన మహాఋషులు నైనను. నీమాయన్=నీయొక్కమాయను. తెలియువారలె = తెలిసికోఁజాలినవారా — తెలిసికోఁజాలరనిభావము.

తా॥ స్వర్గ మర్త్య పాతాళములనెడు మూఁడులోకములందును బుద్ధిమంతులై నీయందలి భక్తియనెడి అమృతమును అనుభవించివృద్ధి పొందునట్టి కృతార్థులు తప్ప తక్కినవారు బ్రహ్మ యింద్రుఁడు తపస్సుచేయు ఋషులునైనను నీమాయాప్రభావమును తెలిసికోఁగలరా అని తాత్పర్యము.

౬౬౬.—క॥ అని హర్షించుచు నిఁకనే । బని వినియెద నిఖిలలోక * పావనమును స
జ్జనహితమైచను మీ కీ । ర్తన మఖిల జగంబులందుఁ * దగ నెఱిఁగింతున్.

టీ॥ (అని) హర్షించుచున్=సంతోషించుచు. (ఇఁకను) (నేను) పనివినియెదను=పోయెదను. నిఖిలలోకపావనమును=ఎల్లలోకములందు పరిశుద్ధమును. సజ్జనహితము=సత్పురుషులకు మేలుచేయునదియును. ఐచనునీకీర్తనమున్=ఐయొప్పునట్టినీఖ్యాతిని. అఖిలజగంబులందున్= ఎల్లలోకములందును. తగన్=ఒప్పునట్లు. (ఎఱిఁగింతును)

తా॥ ఇట్లు పలికి సంతోషించుచు స్వామీ! నేనిఁక సెలవు పుచ్చుకొనెదను ఎల్లలోకములను పావనములనుగాఁ జేయునట్టి నీఖ్యాతి అన్నిలోకములందును ప్రసిద్ధపఱిచెదను అనిచెప్పెనని తా.

౬౬౭.—క॥ అని తద్వచనసుధా సే । చనమున ముదితాత్ముఁడగుచు * సంయమి చిత్తం
బునఁ దన్మూర్తిం దగనిడు । కొని చనియెను హరిను తైక * గుణయుతుఁ డగుచున్.

టీ॥ (అని) తద్వచనసుధాసేచనమునన్=ఆకృష్ణమూర్తియొక్క మాటలనెడు అమృతమునందు తడియుటచేత. ముదితాత్ముఁడు = సంతోషించిన మనసుగలవాఁడు. (అగుచును) సంయమి = నారదుఁడు. చిత్తంబునన్=మనసునందు. తన్మూర్తిన్=ఆకృష్ణునిస్వరూపమును. తగన్=ఒప్పునట్లు. ఇడుకొని=ఉంచుకొని. హరినుతైకగుణయుతుఁడు = కృష్ణుని పొగడుటయనెడి యొకగుణముతోఁ గూడుకొన్నవాఁడు. (అగుచు) చనియెన్=పోయెను.

తా॥ అని చెప్పి కృష్ణునియొక్క అమృతమునుబోలినమాటలను విని సంతోషించుచు ఆకృష్ణమూర్తియొక్క స్వస్వరూపమును తన మనసులో తలఁచుకొనుచు పోయెనని తాత్పర్యము.

౬౬౮.—క॥ ఈపగిది లోకహితమతి । నాపరమేశ్వరుఁడు మాన * వాకృతిఁ ద్రిజగ
ద్దీపిత చారిత్రుఁడు బహు । రూపములం బొందె సుంద * రుల నరనాథా.

టీ॥ నరనాథా=రాజా. ఈపగిదిన్=ఈవిధముగా. లోకహితమతిన్=లోకములకు మేలుకలుగఁజేయుబుద్ధిచేత. త్రిజగద్దీపితచారిత్రుఁడు=మూఁడులోకములయందు మిక్కిలిప్రకాశమగు నడవడిగలవాఁడగు. ఆపరమేశ్వరుఁడు = ఆకృష్ణమూర్తి. మానవాకృతిన్=

మనుష్యరూపములో. సుందరులన్ = స్త్రీలవిషయమునందు. బహురూపములన్ = అనేకస్వరూపములను. (పొందెను)

తా॥ ఓరాజా! మిక్కిలి వింతగా ప్రకాశించునట్టి నడవడిగల ఆకృష్ణమూర్తి లోకములకు మేలుచేయుతలంపుచేత మానవుని ఆకృతితో స్త్రీలవిషయమునందు అనేకరూపములనుధరించివర్తించెననితా.

౬౬౯.—చ॥ అని హరి యిట్లు షోడశ స ✻ హస్ర వధూమణులం బ్రియంబునన్
మనసిజ కేళిఁ దేల్చిన య ✻ మానుషలీల సమగ్ర భక్తితో
వినినఁ బఠించినం గలుగు ✻ విష్ణు పదాంబుజ భక్తియు న్మహా
ధనపశు పుత్రమిత్ర వని ✻ తా ముఖ సౌఖ్యములు న్నరేశ్వరా.

టీ॥ నరేశ్వరా=రాజా. అని=ఇట్లని. హరి=కృష్ణుఁడు. ఇట్లు=ఈవిధముగా. షోడశసహస్రవధూమణులన్ = పదియాఱువేల స్త్రీలను. ప్రియంబునన్=ఇష్టములో. మనసిజకేళిన్ = మన్మథక్రీడయందు. తేల్చినయమానుషలీలన్=సంతోషింపఁజేసినమనుష్యులకు విషయముగాని విలాసమును. సమగ్రభక్తితోన్ = కొఱఁతలేని భక్తితో. వినినన్=విన్నను. పఠించినన్ = చదివినను. విష్ణుపదాంబుజభక్తియున్ = శ్రీవిష్ణుమూర్తియొక్క పాదకమలములయందలి భక్తియును. మహా...లును—మహాధన=అధికధనమును. పశు=గోవులును. పుత్ర=కొడుకులును. మిత్ర=స్నేహితులు. వనితా=స్త్రీలును. ముఖ=మొదలగువారివలని. సౌఖ్యములును=సుఖములును(కలుగును)

తా॥ ఓరాజా! ఈవిధముగా కృష్ణమూర్తి పదియాఱువేల స్త్రీలను మన్మథలీలయందు సంతోషపెట్టునని మనుష్యమాత్రులకు అలవిగానిలీలలనుకొఱఁతలేనిభక్తితో ఎవరువిందురో ఎవరుచదువుదురో వారికి శ్రీవిష్ణుపాదభక్తియు అధికధనము గోవులుకొడుకులు కొమార్తలు చెలికాండ్రు పెండ్లాలు మొదలగువారివలన నగుసుఖములును లభించునని తాత్పర్యము.

వ॥ అనిచెప్పి యప్పారాశర్యనందనుం డభిమన్యునందనునకిట్లనియె నాఁడివసాగమ సమయంబునఁ బద్మబాంధవాగమనంబుఁ గమలినీలోకంబునకు మును కలుగనెఱింగించు చందంబునం గలహంస సారస రథాంగ ముఖజలవిహంగంబులరవంబులుచెలంగ నరుణోదయంబున మంగళపాఠక సంగీత మృదుమధురగాన నినదంబును,లలితమృదంగ వీణా వేణు నినాదంబును, వీతేర మేలుకొని తనచిత్తంబునఁ జిదానందమయుం బరమాత్ము నవ్యయు నవికారు నద్వితీయు నజితు ననంతు నచ్యుతు నమేయు నాద్యంతవిహీనుఁ బరమబ్రహ్మంబునైన తన్నుఁ దానొకయించుక చింతించి యనంతరంబ విరోధిరాజన్యనయనకల్హారంబులుముకుళింప భక్తజన నయనకమలంబులు వికసింప నిరస్తనిఖిలదోషాంధకారుండైనగోవిందుండు మొగిచిన లోచనసరోజంబులువికసింపంజేయుచుఁ దల్పంబుడిగ్గిచనుదెంచియంత.

టీ॥ (అనిచెప్పి) అప్పారాశర్యనందనుండు=వ్యాసునికొడుకైన ఆశుకమహర్షి. అభిమన్యునందనునకున్=అభిమన్యునికొడుకైన పరీక్షిన్మహారాజుతో. ఇట్లనియెన్ = ఇట్లుపలికెను. ఆదివసాగమసమయంబునన్ = ఆనారదుఁడు వెడలిపోయినపిమ్మటినాటితెల్లవాఱి. పద్మబాంధవాగమనంబున్ = సూర్యునిరాకను. కమలినీలోకంబునకున్ = తామరతీఁగలసమూహమునకు. మునుకలుగనెఱిఁగించుచందంబునన్=ముందుగా తెలియఁజేయువిధమున. కల...బులు—కలహంస=ఉత్తమజాతిహంసలు. సారస=బెగ్గురుపక్షులు. రథాంగ=చక్రవాకములు. ముఖ = మొదలుగాఁగల. జలవిహంగంబులరవంబులు=జలపక్షులకూఁతలు. చెలంగన్ = ధ్వనింపఁగా. అరుణోదయంబునన్=అరుణుఁడుదయించుసమయమునందు. మంగళ...బును—మంగళ=మంగళహారతులు. పాఠక=పాడువారియొక్క. సంగీత=పాడునట్టి. మృదు=తిన్నఁదనముతోడిదియు. మధుర=చెవులకింపైనదియునగు. గాన=పాటలయొక్క. నినదంబును = ధ్వనియును. లలిత...నాదంబును—లలిత=మనోజ్ఞమైన. మృదంగ=మద్దెలలయు. వీణా=వీణెలయు. వేణు=పిల్లఁగ్రోవులయు. నినాదంబును=ధ్వనియు వీతేరన్ = వినఁబడఁగా. మేలుకొని = నిద్రవిడిచిలేచి. తనచిత్తంబునన్=తనమనసునందు. చిదానందమయున్ = జ్ఞానము ఆనందము నే స్వరూపమయినవాఁడును. పరమాత్మున్=సర్వోత్కృష్టమైన విరాట్స్వరూపుఁడును. అవ్యయున్ = నాశములేనివాఁడును. అవికారున్=షడ్భావవికారములులేనివాఁడును. అద్వితీయున్=తనకు రెండవదిలేనివాఁడును. అజితున్ = దేనిచేతను జయింపఁబడనివాఁడును. అనంతున్=దేశ కాల వస్తుపరిచ్ఛేదములు లేనివాఁడును. అచ్యుతున్=చ్యుతిలేనివాఁడును — జ్ఞానమార్గమునుండిజాఱుటలేనివాఁడనుట. అమేయున్ = కొలఁదిపెట్టరానివాఁడును. ఆద్యంతవిహీనున్ = మొదలు తుదలు లేనివాఁడును — పుట్టుటయు చచ్చుటయు లేనివాఁడనుట. పరమబ్రహ్మంబున్ = పరబ్రహ్మమును. (అయిన తన్ను తాను) ఒకయించుక=కొంచెముసేపు. చింతించి = ధ్యానించి. అనంతరంబ=పిమ్మట. విరోధి...ముకుళింపన్—విరోధి=శత్రువులైన. రాజన్య = రాజులయొక్క. నయన = కన్నులనెడు. కల్హారంబులు = ఎఱ్ఱగలువలు. ముకుళింపన్=ముడుఁచుకొనఁగా. భక్తజన...వికసింపన్—భక్తజన = సేవకజనులయొక్క. నయన=కన్నులనెడు. కమలంబులు=తామరలు. వికసింపన్=వికాసమును వహింపఁగాను. నిరస్త ... కారుండు — నిరస్త = తొలఁగింపఁబడిన. నిఖిల=సమస్తమయిన. దోష = పాపములనెడు. అంధకారుండు=చీఁకట్లుగలవాఁడు. అయిన = అగునట్టి. గోవిందుండు=కృష్ణుఁడు. మొగిచినలోచనసరోజంబులు=మూసికొన్న కన్నుదామరలు. వికసింపఁజేయుచున్=వికాసమునొందించుచు—తెఱచుచు. తల్పంబు=పానుపునుండి. డిగ్గి=దిగి. చనుదెంచి=వచ్చి. అంతన్=అనంతరము.

తా॥ అని యీవిధముగా చెప్పి శుకమహాముని పరీక్షిన్మహారాజుతో మఱియు నిట్లు చెప్ప నారంభించెను ఆనారదుఁడు వచ్చి పోయిన మఱునాటి తెల్లవాఱి తామరతీఁగలసమూహములకు ముందు ముందుగా సూర్యుఁడు వచ్చుచున్నాఁడు అను వర్తమానమును తెలియఁజేయుచున్నవో అనునట్లు హంసలు బెగ్గురుపక్షులు చక్రవాకములు మొదలుగాఁగల జలపక్షుల కలకలధ్వనులువినఁబడఁగా అరుణోదయమునందు మేలుకొలుపులు పాడువాఱిపాటలు చెవుల కింపైన తిన్ననిపాటలయొక్కధ్వనులు మద్దెల వీణె పిల్లఁగ్రోవి మొదలగు వాద్యముల మనోజ్ఞములైన ధ్వనులును వినఁబడఁగాను శ్రీకృష్ణమూర్తి నిద్రలేచి జ్ఞానానందస్వరూపుఁడును, పరమాత్ముఁడును, నాశములేనివాఁడును, షడ్భావవికారములు లేనివాఁడును, తన వంటిది మఱియొకటి లేనివాఁడును, దేనిచేతను గెలువఁబడని వాఁడును, తుదిలేనివాఁడును, జ్ఞానమువలననుండిజాఱనివాఁడును, కొలఁదియిడరానివాఁడును, పుట్టుచావులులేనివాఁడును, పరబ్రహ్మమయినవాఁడును అగు తన్నుఁదాను ధ్యానించుకొనుచు కొంతసేపు కడపి పిమ్మట శత్రువులకు సంకోచమును భక్తులకు వికాసమును కలుగునట్టుగా ఎల్లదోషములనెడు చీఁకట్లను తొలఁగింప సూర్యుఁడైన శ్రీకృష్ణమూర్తి మూసినకన్నులు తెఱచి పానుపునుండిదిగి బయటికివచ్చి అటుపిమ్మటనని తాత్పర్యము.

౮౭౧.—సీ॥ మలయజ కర్పూర ✻ మహితవాసిత హేమ - కలశోదకంబుల ✻ జలకమాడి
నవ్య లసన్మృదు ✻ దివ్య వస్త్రంబులు - వలనొప్ప రింగులు ✻ వారఁ గట్టి
మకరకుండల హార ✻ మంజీర కేయూర - వలయాది భూషణా ✻ వలులుదాల్చి
ఘనసార కస్తూరి ✻ కా హరిచందన - మిళిత పంకము మేన ✻ నలర నలఁది

తే॥ మహిత సౌరభయుత కుసు ✻ మములు దుఱిమి । పొసఁగ రూపైన శృంగార ✻ రసమనంగ
మూర్తిఁ గైకొన్న కరుణాస ✻ ముద్రమనఁగ । రమణ నొప్పుచు లలిత ద ✻ ర్పణముఁజూచి.

టీ॥ మలయజ...కంబులన్—మలయజ = మంచిగంధముచేతను. కర్పూర=పచ్చకర్పూరముచేతను. మహిత=మహిమగలుగఁజేయఁబడినదై. వాసిత = పరిమళించుచున్న. హేమకలశోదకంబులన్= బంగారుగిండిలోని యుదకములచేత. జలకమాడి = స్నానముచేసి. నవ్యలసన్మృదుదివ్యవస్త్రంబులు—నవ్య=క్రొత్తలైన. లసత్=ప్రకాశించుచున్న. మృదు=నయమైన. దివ్య = మేలిమైన. వస్త్రంబులు= కోకలు. వలనొప్పన్=నేర్పు అతిశయింపఁగా. ఱింగులువాఱన్= చెఱఁగులుప్రేలునట్లుగా. కట్టి=కట్టుకొని. మకర...ములు—మకరకుండల = మొసలియాకృతిగల చెవిపోఁగులును. హార=ముత్యాల పేరులును.మంజీర=అందెలును. కేయూర=భుజకీర్తులును.వలయ= కంకణములును. ఆది=మొదలుగాఁగల. భూషణావలులు=ఆభరణపట్టులు. తాల్చి = ధరించి. ఘనసార...పంకము—ఘనసార = పచ్చకర్పూరముతోడను. కస్తూరికా=కస్తూరితోడను.హరిచందన= పచ్చగందముతోడను. మిళిత=కూర్పఁబడిన. పంకము = పూఁతచందనమును. మేనన్=దేహమునందు. అలరన్ = ప్రకాశముగా. అలఁది=పూసికొని. మహిత=శ్లాఘ్యములైన. సౌరభ=పరిమళముతోడ. యుత=కూడిన. కుసుమములు=పువ్వులను. దుఱిమి=తలను చెక్కుకొని. పొసఁగన్=సరిపడునట్లు.రూపైన=ఆకృతినిపొందిన. (శృంగారరసము) అనంగన్=అనునట్టుగా. మూర్తిన్=ఆకృతిని. కైకొన్న=పరిగ్రహించిన. కరుణాసముద్రము = దయాసముద్రము. అనఁగన్ = అనునట్టుగాను. రమణన్ = మనోజ్ఞత్వముచేత. ఒప్పుచున్=అందగించుచు. లలిత=ఒప్పిదమయిన. దర్పణమున్= అద్దమును. చూచి=చూచుకొని.

తా॥ మంచిగంధము మొదలగువానిచేత పరిమళించునట్టిబంగారు కలశములోని జలములందు స్నానముచేసి క్రొత్తవియు నయముగా నుండునవియునైన మంచివస్త్రములు కట్టుకొని మకరకుండలములు మొదలగు ఆభరణములు తొడుగుకొని పచ్చకర్పూరము మొదలగు వానిచేత పరిమళించుచున్న దివ్యచందనమునుపూసికొని మంచివాసనగల పువ్వులు ధరించి ఆకృతినిపొందిన శృంగార రసమో దయారస సముద్రమో అనునట్లు అందగించుచు నిలువుటద్దమును జూచుకొని అని తాత్పర్యము.

౮౭౨.—తే॥ కడఁగి సారథి దెచ్చిన ✻ కనకరథము । సాత్యకి హితప్రియోద్ధవ ✻ సహితుఁ డగుచు
నెక్కి నిజకాంతి దిక్కులఁ ✻ బిక్కటిల్లఁ । బూర్వ గిరిఁ దోఁచు భానునిఁ ✻ బోలె వెలిఁగె.

టీ॥ కడఁగి=పూని. సారథి=రథముతోలువాఁడు. తెచ్చిన = తోలుకొనివచ్చిన. కనకరథమున్ = బంగారుతేరును. సాత్యకి... సహితుఁడు—సాత్యకి = సాత్యకితోడను. హిత = తనమేలుగోరు వాఁడును.ప్రియ=ఇష్టుఁడునైన.ఉద్ధవ=ఉద్ధవునితోడను.సహితుఁడు =కూడినవాఁడు. అగుచున్=అవుచును. (ఎక్కి) నిజకాంతి=తన దేహకాంతి. దిక్కులన్=దిక్కులయందు. పిక్కటిల్లన్ = వ్యాపింపఁగా. పూర్వగిరిన్=తూర్పుకొండయందు.తోఁచు=కనఁబడునట్టి. భానునిఁబోలెన్=సూర్యునివలెనే. వెలిఁగెన్ = ప్రకాశించెను.

తా॥ ప్రయత్నపూర్వకముగా సారథి తీసికొనివచ్చిన బంగారు తేరిమీఁద శ్రీకృష్ణమూర్తి సాత్యకితోడను ఆప్తుఁడును ఇష్టుఁడునైన యుద్ధవునితోడను ఎక్కినవాఁడై తన దేహకాంతి నాలుగుదిక్కులందును వ్యాపించి వెలుఁగఁగా ఉదయపర్వతముపైనుండు సూర్యుని వలెనే ప్రకాశించెనని తాత్పర్యము.

౮౨౩.—సీ॥ అభినవ నిజమూర్తి * యంతర్గపురాంగనా - నయనాబ్జములకు నా * నందమొసఁగ
సలలిత ముఖచంద్ర * చంద్రికాతతి పౌర - జన చకోరముల కు * త్సవముసేయ
మహనీయ కాంచన * మణిమయ భూషణ - దీప్తులు దిక్కులఁ * దేజరిల్ల
నల్లనల్లన వచ్చి * యరదంబు వెసడిగ్గి - హల కులిశాంకుశ * జలజ కలశ

తే॥ లలిత రేఖలు ధరణి న * లంకరింప । నుద్ధవుని హస్తతలమూని * యొయ్యనఁజని
మహితగతి దేవతాసభా * మధ్యమమున । రుచిర సింహాసనమునఁ గూ * ర్చుండెనెలమి.

టీ॥ అభినవ...మొసఁగ—అభినవ=క్రొత్తయైన-క్రొత్త అలంకారముగల. నిజమూర్తి = తనయాకృతి. అంతర్గపురాంగనా = అంతర్గపురస్త్రీలయొక్క. నయన = కన్నులనెడు. అబ్జములకున్ = తామరలకు. ఆనందము=సంతోషము. ఒసఁగన్=కలుగఁజేయఁగా సలలిత...తతి—సలలిత = మిక్కిలిమనోజ్ఞమయిన. ముఖచంద్ర = చంద్రునివంటిముఖముయొక్క. చంద్రికా=వెన్నెలలవంటికాంతుల యొక్క. తతి=సమూహము. పౌరజనచకోరములకున్ = పురజనులనెడు చకోరపక్షులకు. ఉత్సవముసేయన్=సంతోషము కలుగఁజేయఁగా. మహ...దీప్తులు—మహనీయ=ఘనములైన. కాంచన = బంగారువియు. మణిమయ=రత్నములు పొదుఁగఁబడినవియునైన. భూషణ=ఆభరణములయొక్క. దీప్తులు=వెలుఁగులు. దిక్కులన్= ఎల్లదిక్కులయందును. తేజరిల్లన్=ప్రకాశింపఁగా. అల్లనల్లనన్= మెల్లమెల్లఁగా. (వచ్చి) అరదంబు=రథమునుండి. వెసన్ = శీఘ్రముగా. డిగ్గి=దిగి. హల...రేఖలు—హల = నాఁగేటివంటిదియు. కులిశ=వజ్రాయుధమువంటిదియు. అంకుశ=అంకుశమువంటిదియు. జలజ=తామరవంటిదియు. కలశ=కలశమువంటిదియునైన. లలిత= మనోజ్ఞములైన. రేఖలు = గీఱలు. ధరణిన్ = భూమిని. అలంకరింపన్=అలంకారమునొందింపఁగా. (ఉద్ధవుని) హస్తతలము=అరచేతిభాగమును. ఊని=పట్టుకొని. ఒయ్యనన్ = మెల్లఁగా. చని=పోయి. మహితగతిన్=గంభీరమయినరీతితో. దేవతాసభామధ్యమమునన్ = దేవతలదైన సుధర్మయనుసభనడుమ. రుచిరసింహాసనమునన్=వెలుఁగుచున్న సింహాసనమునందు. ఎలమిన్ = సంతోషముతో. (కూర్చుండెను)

తా॥ క్రొత్తఅలంకారముతోఁగూడిన తనదేహకాంతులుఅంతర్గపురస్త్రీల కన్నులనెడు తామరలకు వికాసమును కలుగఁజేయుచుండఁగాను, మిక్కిలి తేటయయిన ముఖమనెడు చంద్రునివలని వెన్నెలలనుబోలిన వెలుఁగులు పురజనులనెడు చకోరపక్షులకు సంతోషము పుట్టించుచుండఁగాను, మిగుల తేజరిల్లు రత్నాభరణములకాంతులు దిక్కులను ప్రకాశింపఁజేయుచుండఁగాను, మెల్లమెల్లగా రథమునందుండిదిగి ఉద్ధవునిచేయిపట్టుకొని తనపాదములయందలి హలరేఖ కులిశరేఖ అంకుశరేఖ జలజరేఖ కలశరేఖ మొదలగు శుభరేఖలు భూమికి అలంకారములై కనఁబడఁగా శ్రీకృష్ణమూర్తి దేవేంద్రునివల్ల తాను పొందిన సుధర్మయను సభామండపమునకుఁబోయి సింహాసనముపైనెక్కి కూర్చుండెనని తాత్పర్యము.

౮౨౪.—చ॥ అతివిభవంబునం దనరి * యాత్మ తనుద్యుతి దేజరిల్లఁగా
హితులు పురోహితు ల్వసుమ * తీశులు మిత్రులు బాంధవుల్ బుధుల్
సుతులును మాగధుల్కవులు * సూతులు మంత్రులు భృత్యులు న్శుభ
స్థితిఁ గొలువంగ నొప్పె నుడు * సేవితుఁడైన సుధాంశుఁ డోయనన్.

టీ॥ అతివిభవంబునన్ = అధికమయినవైభవముతో. తనరి= ఒప్పి. ఆత్మతనుద్యుతి = తనదేహకాంతి. తేజరిల్లఁగాన్ = వెలుఁగఁగా. హితులు = ఆప్తులును. (పురోహితులును) వసుమతీశులు = రాజులును. మిత్రులు=స్నేహితులును. బాంధవులు = చుట్టములును. బుధులు=పండితులును. సుతులు=కొడుకులును. మాగధులు = స్తుతిపాఠకులును. కవులు = కవీశ్వరులును. సూతులు = సారథులును. (మంత్రులును) భృత్యులును=సేవకులును. శుభస్థితిన్ = మేలయిన యునికితో. (కొలువంగ) ఉడుసేవితుఁడైనసుధాంశుఁడో = నక్షత్రములచేతకొలువఁబడినచంద్రుఁడో. అనన్=అనునట్లుగా. (ఒప్పెను)

తా॥ అధికవైభవముతో ఒప్పి తనదేహకాంతులు వెలుఁగఁగా ఆప్తులును, రాజులును, స్నేహితులును, చుట్టములును, పండితులును, కొడుకులును, స్తుతిపాఠకులును, మంత్రులును, సారథులును భక్తితో సేవింపఁగా అశ్విని మొదలైన నక్షత్రములచేత సేవింపఁబడుచున్న చంద్రుఁడో అనునట్లుశ్రీకృష్ణమూర్తివెలుఁగుచుండెననితాత్పర్యము.

౮౨౫.—క॥ కరుణార్ద్రదృష్టిఁ బ్రజలం । బరిరక్షించుచు వివేక * భావకళా చా
తురి మెఱసి యిష్టగోష్ఠిం । బరమానందమున రాజ్య * భారకుఁ డగుచున్.

టీ॥ కరుణార్ద్రదృష్టిన్=దయతోడిచల్లనిచూపుతో. ప్రజలన్= జనులను. పరిరక్షించుచున్=చక్కఁగాఁ గాపాడుచు. వివేకభావకళాచాతురి = తెలివితో తాత్పర్యముగల విద్యయందలి నేర్పును. మెఱసి=మెఱయించి. ఇష్టగోష్ఠిన్=ఇష్టమువచ్చిన ముచ్చటలాడుచును. పరమానందమునన్ = అధికసంతోషముతో. రాజ్యభారకుఁడు = రాజ్యభారమును వహించినవాఁడు. (అగుచును)

తా॥ ఎల్లప్రజలను దయతోడి చల్లనిచూపులతోఁజూచి లెస్సగా నేలుచు తనతెలివితోడి వ్యాపారములు నడపు సామర్థ్యమును కనఁబఱచుచు ఇచ్ఛవచ్చిన ముచ్చట లాడుచు మిక్కిలి సంతోషముతో రాజ్యభారమును వహించినవాఁడై అని తాత్పర్యము.



(*) జరాసంధభీతులైన రాజులపంపున విప్రుండు కృష్ణసన్నిధికివచ్చుట. (*)

వ॥ ఇవ్విధంబునంబ్రతిదివసంబునుండనొక్కనాఁ డపూర్వదర్శనుండైన భూసురుండొక్కరుండుచనుదెంచిసభాస్థానం
బునంగొలువున్న ముకుందునింబొడగని దండప్రణామం బాచరించి వినయంబునఁ గరంబులు మొగిచియిట్లనియె.

టీ॥ ఇవ్విధంబునన్ = ఈరీతిగా. ప్రతిదివసంబును = దినదినమును. ఉండన్=ఉండఁగా. (ఒక్కనాఁడు) అపూర్వదర్శనుండు = మునుపెన్నఁడును జూడనివాఁడు. అయినభూసురుండు=అయినట్టి బ్రాహ్మణుఁడు. ఒక్కరుండు=ఒకఁడు. చనుదెంచి=వచ్చి. సభాస్థానంబునన్ = కొలువుకూటమునందు. కొలువున్న = కొలువుదీరియున్న. ముకుందునిన్=శ్రీకృష్ణమూర్తిని. పొడగని=చూచి. దండప్రణామంబాచరించి = సాగిలఁబడినమస్కరించి. వినయంబునన్= మిక్కిలి అడఁకువతో. కరంబులుమొగిచి = చేతులుజోడించుకొని. (ఇట్లనియెను)

తా॥ ఈప్రకారము ప్రతిదినము చేయుచునుండఁగా ఒకనాఁడు మునుపెన్నఁడునుజూచి యెఱుఁగని ఒకబ్రాహ్మణుఁడువచ్చి కొలువుకూటమునందు కొలువుదీరియున్న శ్రీకృష్ణమూర్తిని జూచి మిక్కిలి వినయముతో సాగిలఁబడి మ్రొక్కి చేతులు జోడించుకొని యిట్లు పలికెనని తాత్పర్యము.

౬౭౭.—క॥ కంజ విలోచన దానవ । భంజన యోగీంద్రవిమల * భావన సద్బో
ధాంజన దృష్టి నిదర్శన । రంజితశుభమూర్తి కృష్ణ రామా వరజా.

టీ॥ కంజవిలోచన = తామరలవంటి కన్నులు గలవాఁడవును. దానవభంజన=రాక్షసులను భంగపెట్టువాఁడవును. యోగీంద్ర... దర్శన—యోగీంద్ర=యోగీశ్వరులయొక్క. విమల=నిర్మలమయిన. భావన=మనస్సునందలి. సద్బోధ = మంచితెలివియనెడు. అంజన= అంజనమువేసిచూడఁబడిన. దృష్టి=చూపునకు. నిదర్శన=దృష్టాంతమయినవాఁడా. రంజితశుభమూర్తి=వెలుఁగుచున్న మేలయిన ఆకృతి గలవాఁడవును. రామావరజా = రామునితమ్ముఁడవునైన. (కృష్ణ)

తా॥ తామరలవంటికన్నులుగలిగి రాక్షసులనునాశముచేయుచు యోగీశ్వరులు జ్ఞానాంజనమువేసిచూడఁగాఁగనఁబడు నిధానమయి ఒప్పునట్టి బలరామునితమ్ముఁడవైన ఓశ్రీకృష్ణాయని తాత్పర్యము.

౬౭౮.—తే॥ అవధరింపు జరాసంధుఁ * డతులబలులఁ । దనకు మ్రొక్కని ధారుణీ * ధవులనెల్ల
వెదకి తెప్పించి యిరువది * వేల నాఁకఁ । బెట్టినాఁడు గిరివ్రజ * పట్టణమున.

టీ॥ అవధరింపుము=చిత్తగింపుము—వినుము. (జరాసంధుఁడు) అతులబలులన్ = ఈడులేని బలము గలవారైన. తనకుమ్రొక్కని ధారుణీధవులనెల్లన్=తనకుమ్రొక్కకయుండునట్టి రాజులను అందఱను. (వెదకితెప్పించి ఇరువదివేలను) గిరివ్రజపట్టణమునన్ = గిరివ్రజముఅనుపట్టణమునందు. ఆఁకఁబెట్టినాఁడు=చెఱఁబెట్టినాఁడు.

తా॥ ఓస్వామీ! వినుము జరాసంధుఁడు అనేకులను రాజులను తనకు అణఁగియుండనివారిని తీసికొనివచ్చి గిరివ్రజమనెడు తనపట్టణములో చెఱలోఁబెట్టి నిర్బంధించుచున్నాఁడు అని తాత్పర్యము.

౭౭౯.—తే॥ వారు పుత్తేరవచ్చిన * వాఁడ నేను । నరవరోత్తమ నృపుల వి * న్నపము గాఁగ
విన్నవించెద నామాట * వినినమీఁద । ననఘ నీదయ వారి భా * గ్యంబుకొలఁది.

టీ॥ వారు=ఆరాజులు. పుత్తేరన్=పంపఁగా. (నేను వచ్చిన వాఁడను) నరవరోత్తమ=రాజశ్రేష్ఠుఁడవైన ఓకృష్ణా. నృపులవిన్నపముగాఁగన్=ఆరాజులయొక్క మనవిగా. విన్నవించెదన్=విన్నపముచేసికొనెదను. (నామాట వినినమీఁద) అనఘ = పాపములేనివాఁడవైన. (ఓకృష్ణా) నీదయ = నీకు వారిపై కలుగునట్టి దయ. వారిభాగ్యంబుకొలఁది = వారియదృష్టము ఎంతో అంతే యగును.

తా॥ పాపములేనివాఁడవును, రాజశ్రేష్ఠుఁడవునైన ఓశ్రీకృష్ణా! ఆరాజులు పంపఁగా నేను వచ్చినవాఁడను గనుక వారిమాటుగా వారు మనవిచేయుమన్న విషయమును మనవిచేసెదను ఆమనవిని నీవు విన్నపిమ్మటవారిభాగ్యమునకుతగినట్టునీకువారిపైదయపుట్టనిమ్మనితా

౭౮౦.—వ॥ అని ధరాధిపుల విన్నపంబుగా నిట్లనియె.

టీ॥ (అని) ధరాధిపులవిన్నపంబుగాన్ = రాజుల మనవిగా. (ఇట్లనియెను)

తా॥ అని చెప్పి రాజులు ఎదుటవచ్చి మనవిచేసికొన్నరీతిగానే ఆబ్రాహ్మణుఁడు మనవిచేసెనని తాత్పర్యము.

౭౮౧.—ఉ॥ వారిజనాభ భక్తజన * వత్సల దుష్టమదాసురేంద్ర సం
హార సరోరుహానన పు * రారి ముఖామర వంద్య పాద పం
కేరుహ సర్వలోక పరి * కీర్తిత దివ్య మహాప్రభావ సం
సార విదూర నంద తను * జాత రమాహృదయేశ మాధవా.

టీ॥ వారిజనాభ = బొడ్డునందు తామరగలవాఁడా. భక్తజనవత్సల = భక్తులయినజనులయందు ప్రేమగలవాఁడా. దుష్టమదాసురేంద్రసంహార=చెడ్డక్రొవ్వుగల రాక్షసరాజులను చంపినవాఁడా. సరోరుహానన=తామరవలె వికాసమువహించియుండు ముఖముగలవాఁడా. పురారిముఖామరవంద్యపాదపంకేరుహ=శివుఁడు మొదలుగాఁగలదేవతలచేత మ్రొక్కఁదగిన అడుగుదామరలుగలవాఁడా. సర్వ...ప్రభావ—సర్వలోక = ఎల్లలోకములందును. పరికీర్తిత=మిక్కిలిశ్లాఘింపఁబడిన. దివ్య=అప్రాకృతమైన. మహాప్రభావ=గొప్పమహిమగలవాఁడా. సంసారవిదూర=సంసారమునకుమిక్కిలి దూరమైనవాఁడా. నందతనుజాత=నందునికొడుకా. రమాహృదయేశ=లక్ష్మీదేవికిప్రాణనాయకుఁడా. మాధవా=ఓ కృష్ణమూర్తీ.

తా॥ బ్రహ్మజన్మమునకు కారణమయిన కమలము నాభియందుఁ గలవాఁడవును, సేవకజనులయందు వాత్సల్యము గలవాఁడవును, దుష్టులయిన రాక్షసులను సంహరించువాఁడవును, తామరవంటి మొగము గలవాఁడవును, శివుఁడు మొదలుగాఁగల దేవతలకు సేవింపఁదగిన పాదకమలములు గలవాఁడవును, ఎల్లలోకములందు శ్లాఘ్యమును పొందిన ప్రభావము గలవాఁడవును, సంసారసంగము లేనివాఁడవును, నందునికుమారుఁడవును, లక్ష్మీదేవికిప్రాణనాయకుఁడవునైన ఓశ్రీకృష్ణమూర్తీయని తాత్పర్యము.

౭౮౨.—ఆ॥ ఆర్తజనుల మమ్ము * నరసి రక్షింపు మ । హాత్మ భక్తజన భ * యాపహరణ
నిన్ను మదినుతించి * నీకు మ్రొక్కెదము నీ । చరణయుగము మాకు * శరణమనఘ.

టీ॥ మహాత్మ=గొప్పమహిమగలవాఁడా. భక్తజనభయాపహరణ=సేవకజనుల భయమునుపోఁగొట్టువాఁడా. అనఘ=పాపములేనివాఁడా. ఆర్తజనులన్=పీడితులైనజనులను. (మమ్ము) అరసి=విచారించి. రక్షింపు=కాపాడుము. నిన్నుమదిన్=మనసునందు. నుతించి=పొగడి. (నీకు) మ్రొక్కెదము = నమస్కరించెదము. నీచరణయుగము=నీయడుగులజంట. మాకుశరణము = మాకురక్షకము.

తా॥ గొప్పమహిమగలిగి భక్తులభయమునుతొలఁగించువాఁడవై పాపములులేనివాఁడవై ఒప్పునట్టి ఓస్వామీ! పగవానిచేత పీడింపఁబడుచున్న మమ్మును రక్షింపుము నిన్ను మనసులలోతలఁచుచు నీకు మ్రొక్కుచున్నాము నీరెండుపాదములేమాకుదిక్కు అనితాత్పర్యము.

౭౮౩.—క॥ బలియుర దండింపఁగ దు । ర్బలులను రక్షింప జగతి * పై నిజలీలా
కలితుఁడవై యుగయుగమున । నలవడ నుదయింతుగాదె * యభవ యనంతా.

టీ॥ అభవ=పుట్టుకలేనివాఁడవును, అనంతా = అంతము లేనివాఁడవైనఓస్వామీ, బలియురన్=బలవంతులను. దండింపఁగన్=శిక్షింపను. దుర్బలులన్=బలములేనివారిని. రక్షింపన్=కాపాడుటకును. (జగతిపైని) నిజలీలాకలితుఁడవై=స్వకీయమైన లీలతోఁగూడుకొన్నవాఁడవై. యుగయుగమునన్=ప్రతియుగమందును. అలవడన్=యుక్తముచొప్పున. ఉదయింతుగాదె=నీవు పుట్టుచుందువుగదా.

తా॥ పుట్టు చావులు లేని ఓయేలినవాఁడా! నీవు దుష్టులగు బలవంతులను శిక్షింపను సాధువులగు బలహీనులను రక్షింపను ఈ భూమిలో నీకుఁ దగిన లీలతో ప్రతియుగమునందును యుక్తము చొప్పున పుట్టుచుందువు గదా అని తాత్పర్యము.

౭౮౪.—క॥ నీమదిఁదోఁపనియర్థం । బీమేదినియందుఁ గలదె * యీశ్వర భక్త
స్తోమ సురభూజ త్రిజగ । త్క్షేమంకర దీనరక్ష * చేయు మురారీ.

టీ॥ ఈశ్వర=ఓసర్వనియామకుఁడా. భక్తస్తోమసురభూజ= సేవకసమూహమునకు కల్పవృక్షమా. త్రిజగత్క్షేమంకర = మూడు లోకములకు మేలుచేయువాఁడా. మురారీ = మురాసురునికి పగవాఁడా. నీమదిక్=నీమనసునందు. తోఁపని=తోఁచని. అర్థంబు= విషయము—పని. ఈమేదినియందుక్ = ఈభూమియందు. కలదె= ఉన్నదా. దీనరక్షచేయుము = దీనులను రక్షించుటనుచేయుము.

తా॥ సర్వనియామకుఁడవును, సేవకులకు కల్పవృక్షమయినవాఁడవును, మూడులోకములకు మేలుగలుగఁజేయువాఁడవునునైన ఓశ్రీకృష్ణా! నీకు తెలియనివిషయము ఈభూమండలములో ఏదియు లేదుకాఁబట్టిదీనులమైనమమ్ము ఎట్లయిననురక్షింపుమనితాత్పర్యము.

౬౮౫.—క॥ నీపంపు సేయకుండఁగ । నాపద్మభవాదిసురుల ✽ కైనను వశమే
శ్రీపతి శరణాగతులం । జేపట్టి నిరోధముడుగఁ ✽ జేయుము కృష్ణా.

టీ॥ శ్రీపతి = లక్ష్మీదేవికిభర్తవైన. (కృష్ణా) నీపంపు=నీయాజ్ఞను. చేయకుండఁగక్=నడపకయుండుటకు. ఆపద్మభవాదిసురలకైనక్ = ప్రసిద్ధులగు బ్రహ్మ మొదలగుదేవతలకైనను. వశమే = శక్యమా. శరణాగతులక్ = నీరక్షణమును పొందఁగోరినవారిని. చేపట్టి=పరిగ్రహించి.నిరోధముక్=నిర్బంధమును.ఉడుగఁజేయుము=మానునట్లుగాఁజేయుము — మానిర్బంధమును నివారింపుము.

తా॥ శ్రీలక్ష్మీప్రియుఁడవైన ఓకృష్ణమూర్తీ! నీవు చెప్పినపనిని చేయకుండుటకు బ్రహ్మ మొదలగు దేవతలకుఁగూడ శక్యముకాదు కనుక ఎవరిగుండనైనను నీరక్షణము నపేక్షించిన దీనులమగుమమ్ము ఈనిర్బంధమునుండి వెడలించి, కాపాడుము అని తాత్పర్యము.

౬౮౬.—క॥ అభవుఁడ వయ్యును జగతిం । బ్రభవించుట లీలగాక ✽ భవమొందుటయే
ప్రభువులకును బ్రభుఁడవుమము । సభయాత్ముల నరసికావఁ ✽ జను నార్తిహరా.

టీ॥ ఆర్తిహరా = పీడాపరిహారకుఁడవైనశ్రీకృష్ణా. అభవుఁడవయ్యుక్=పుట్టనివాఁడవుగనుండియు.జగతిక్=భూమియందు.ప్రభవించుట=పుట్టుట.లీలగాక=వేడుకగాక.భవము=పుట్టుకను.ఒందుటయే=పొందుటయా.ప్రభువులకుక్=దేవతాప్రభువులకు. ప్రభుఁడవు=దొరవు. (మము) సభయాత్ములక్ = భీతితోఁగూడినమనసుగలవారిని.అరసి=విచారించి.కావక్=రక్షించుట.చనుక్=తగును.

తా॥ ఎల్లవారిదుఃఖములను పోఁగొట్టునట్టివాఁడవగు కృష్ణా! నీవు జన్మములు లేనివాఁడవుగా నుండియు భూమియందు జన్మమును పొందుట వేడుక కొఱకుఁ గాక యిది జన్మించుటయాకాదు కాఁబట్టి బ్రహ్మ మొదలైన దేవతాప్రభువులకెల్లను రాజవగు నీకు భయముతోఁ గూడుకొన్నవారమగు మమ్ము విచారించి మాభయమును పోఁగొట్టి రక్షించుట తగును అని తాత్పర్యము.

౬౮౭.—క॥ కదనమున నీభుజావలి । కెదిరింపఁగ లేక పాఱఁ ✽ డే విక్రమ సం
పద చెడఁగ జరాసంధుఁడు । పదునెనిమిదిమార్లు ధరణి ✽ పాలురు నవ్వక్.

టీ॥ కదనమునక్ = యుద్ధమునందు. నీభుజావలికిక్ = నీభుజపఙ్క్తికి. ఎదిరింపఁగలేక = ఎదిరించిపోరాడఁజాలక. విక్రమసంపద = పరాక్రమముకలిమి. చెడఁగక్ = చెడిపోఁగా.(జరాసంధుఁడు) పదునెనిమిదిమార్లు = పదునెనిమిదితడవలు. ధరణిపాలురు=రాజులు. నవ్వక్=నవ్వఁగా. పాఱఁడే = పరుగెత్తలేదా.

తా॥ ముందు జరాసంధుఁడు యుద్ధమునందు నీభుజబలమునకెదిరించి పోరాడఁజాలక తన పరాక్రమము చెడిపోఁగా రాజులందఱు చూచినవ్వుచుండఁగా భయపడి పరుగెత్తిపోలేదాఅనితాత్పర్యము.

వ॥ ఇట్లుతనపడిన బన్నంబులందలంపక సింహంబు సమద దంతావళంబుల నరికట్టి కాఱించు
చందంబున మమ్ముం జెఱఁబెట్టి బాధించుచున్న యిప్పాపాత్ము మర్దించి కారాగృహావాస
బద్ధులమగు మానిర్బంధంబులఁబాఁపి సుత దార మిత్రవర్గంబులంగూర్చి యనన్యశరణ్యుల
మైనమమ్ము రక్షింపుమనివిన్నవించిరని బ్రాహ్మణుండు విన్నపంబుసేయు నవసరంబున.

టీ॥ (ఇట్లు) తనపడినబన్నంబులక్=తానుపడినభంగములను. (తలంపక) సింహంబు=సింహము. సమదదంతావళంబులక్=మదపుటేనుఁగులను. అరికట్టి = అడ్డగించి. కాఱించుచందంబునక్ = బాధించువిధమున. (మమ్ము) చెఱఁబెట్టి=చెఱలోఁబెట్టి. బాధించుచున్నయిప్పాపాత్ముక్ = బాధపెట్టుచున్న పాపాత్ముఁడగు నీజరాసంధుని. మర్దించి=నలియఁగొట్టిచంపి. కారాగృహావాసబద్ధులము= చెఱసాలయందుండి కట్టువడినవారము. అగుమానిర్బంధంబులక్= అగునట్టిమాసంకటములను. పాఁపి = పోఁగొట్టి. సుతదారమిత్రవర్గంబులక్ = కొడుకులయు పెండ్లాలయు చెలికాండ్రయు సమూహములను. కూర్చి=కూడఁబెట్టి. అనన్యశరణ్యులము = నీవుతప్ప ఇతరులురక్షకులులేనివారము. అయినమమ్ముక్=అయినట్టిమమ్మును. (రక్షింపుము) అనివిన్నవించిరి = అనిమనవిచేసిరి. ( అని ) బ్రాహ్మణుండు=ఆరాజులచేతఁ బంపఁబడిన బ్రాహ్మణుఁడు. విన్నపంబుసేయనవసరంబునక్=మనవిచేయు సమయమునందు.

తా॥ ఈవిధముగా తానుపొందిన అవమానమును తలఁపక ఆజరాసంధుఁడు మదించిన యేనుఁగులను నిర్బంధించి బాధించు సింహమువలె మమ్ము చెఱలోఁబెట్టి బాధించుచున్నాఁడు ఈపాపాత్మునిఁజంపి నీకంటె ఇతరులు రక్షకులు లేనివారమైన మమ్ము రక్షించి మాపెండ్లాలుబిడ్డలుచెలికాండ్రుమొదలగువారితోమమ్ముఁజేర్పుమని ఆరాజులుచెప్పిరనిబ్రాహ్మణుఁడుచెప్పుచుండుసమయమునందనితా.










(*) నారదుఁడు శ్రీకృష్ణునివద్దకువచ్చి ధర్మరాజుయజ్ఞము నెరవేర్పుమనుట. (*)

౬౮౯.—సీ॥ శారద చంద్రికా * సారంగ రుచితోడ - జడముడి కెంపుఁజేఁ * జఱచి నవ్వ
శరదంబుదావృత * సౌదామనీలతా - శోభఁగాంచన కటి * సూత్ర మలర
లలిత పూర్ణేందు మం * డల కలంకముగతి - మృదుమృగాజినరుచి * మించుఁ జూపఁ
గల్పశాఖాగ్ర సం * గత పుష్ప గుచ్ఛంబు - లీలఁ గేలను నక్ష * మాలికమర
తే॥ భూరి పుణ్యనదీతోయ * పూరణమునఁ । దగుకమండలువొక్క హ * స్తమునఁ దనర
వెల్ల జన్నిద మఱుత శో * భిల్ల వచ్చె । నారదుండు వివేక వి * శారదుండు.

టీ॥ వివేకవిశారదుండు=మంచిసెబ్బరల నెఱుఁగు తెలివియందు నేర్పరియైన. (నారదుండు) శారదచంద్రికాసారంగరుచితోడన్— శారద=శరత్కాలమునందలి. చంద్రికా=చంద్రకిరణములతోడి. సారంగ=జింకయొక్క. రుచితోడన్=కాంతితో. జడముడి=జడల యొక్కముడి; కెంపున్=పద్మరాగమణిని. చేఁజఱచి = చేతితోఁ దట్టి. నవ్వన్ = పరిహాసము చేయుచుండఁగా. శర...శోభన్— శరత్=శరత్కాలమునందలి. అంబుద=మేఘములచేత. ఆవృత= ఆవరింపఁబడిన. సౌదామనీ=మెఱపుయొక్క. లతా=తీఁగయొక్క. శోభన్=కాంతివంటికాంతితో. కాంచనకటిసూత్రము=బంగారు మొలత్రాడు. అలరన్=ప్రకాశింపఁగా. లలిత...గతిన్—లలిత= మనోజ్ఞమైన. పూర్ణేందుమండల=నిండుచంద్రబింబములోని. కలంకముగతిన్=మృగచిహ్నమువలెనే. మృదు...రుచి—మృదు=మెత్తనైన మృగాజిన=జింకతోలుయొక్క. రుచి=ప్రకాశము. మించుఁజూపన్ =ప్రకాశమునుకనఁబఱపఁగా—వెలుగఁగాననుట. కల్ప...లీలన్— కల్ప=కల్పవృక్షముయొక్క. శాఖ=కొమ్మలయొక్క. అగ్ర=కొనయందు. సంగత=కూడియుండెడి — పూఁచివేలుచుండెడి. పుష్ప గుచ్ఛంబులీలన్ = పువ్వులగుత్తివలెనే. కేలన్ = చేతిలో. అక్ష మాలిక=జపమాలిక. అమరన్ = ఒప్పఁగా. భూరి...మునన్— భూరి=అనేకమైన. పుణ్యనదీ = పరిశుద్ధములయిన గంగాదినదుల యొక్క. తోయ=నీళ్లయొక్క. పూరణమునన్=నిండుకొనుటచేత. తగు=ఒప్పనట్టి. (కమండలువు) ఒక్కహస్తమునన్=ఒకచేతిలో. తనరన్ = ఒప్పుచుండఁగా. వెల్లజన్నిదము = తెల్లనిజందెము. ఱుతన్=మెడలో. శోభిల్లన్=ప్రకాశింపఁగా. (వచ్చెను)

తా॥ వివేకముచేత గొప్పవాఁడు అగు నారదమహాముని శరత్కాలపు వెన్నెలలో మెలఁగు జింకయో అనునట్లు ఎఱ్ఱని జడల ముడియును, శరత్కాలమేఘములచేత నావరింపఁబడిన మెఱపు తీఁగయో అనునట్లు బంగారు మొలత్రాడును, మనోజ్ఞమైన పూర్ణచంద్రబింబమునందలి మృగచిహ్నమో అనునట్లు మెత్తనైన జింక తోలును,కల్పవృక్షపుకొమ్మలోని పువ్వులగుత్తియో అనునట్లు చేతిలో జపమాలయు వెలుఁగఁగా ఒకచేత ఎల్లపుణ్యనదులలోనిజలములను నిండించిన కమండలువు ఒప్పఁగాను వచ్చెనని తాత్పర్యము.

౬౯౦.—క॥ చనుదేర నట్లు మునినిజ । తనుకాంతుల నఖిలదిగ్వి * తానము వెలుఁగన్
వనజాప్తుఁబోలె నయ్యెడు । జనములు గృష్ణుండు లేచి * సంప్రీతి మెయిన్.

టీ॥అట్లు=ఆవిధముగా. ముని=నారదుఁడు. నిజతనుకాంతులన్= తనదేహకాంతులచేత. అఖిలదిగ్వితానము = ఎల్లదిక్కులసమూహము. వెలుఁగన్=ప్రకాశింపఁగా. వనజాప్తుఁబోలెన్=తామరలకు స్నేహితుఁడయిన సూర్యుఁడో యనునట్టుగా. చనుదేరన్ = రాఁగా. అయ్యెడుజనములును=అక్కడనుండునట్టి యాదవులును. (కృష్ణుండును లేచి) సంప్రీతి మెయిన్ = సంతోషముతో.

తా॥ ఆవిధముగానారదమహామునిఇతఁడేసూర్యుఁడుకాఁబోలునని జనులు భ్రమించునట్లు తన దేహకాంతులచేత దిక్కులనెల్లను ప్రకాశింపఁజేయుచురాఁగా అప్పుడు అందున్న యాదవులునుకృష్ణమూర్తియుమిక్కిలిసంతోషముతో పీఠములనుండి లేచినవారైయనితా

౬౯౧.—క॥ వినయమున మ్రొక్కి కనకా । సనమునఁ గూర్చుండఁ బెట్టి * సముచిత వివిధా
ర్చనములఁ దనిపి మురాంతకుఁ । డనియెన్ వినయంబు దోఁప * నమ్మునితోడన్.

టీ॥ వినయమునన్=అడఁకువతో. మ్రొక్కి = నమస్కరించి. కనకాసనమునన్=బంగారుపీఁటయందు. (కూర్చుండఁబెట్టి) సముచితవివిధార్చనములన్=తగిన నానావిధములైనపూజలచేత. తనిపి=తృప్తిపొందించి. మురాంతకుఁడు = కృష్ణుఁడు. అమ్మునితోడన్= ఆనారదమహామునితో. వినయంబు=అడఁకువ.తోఁపన్=కనఁబడునట్లు. అనియెన్ = ముందుఁ జెప్పఁబోవు తీరునఁ బలికెను.

తా॥ అడఁకువగలవాఁడై మ్రొక్కి బంగారుపీఁటపైఁ గూర్చుండఁబెట్టి నానావిధములైన తగిన పూజలు చేసి తృప్తిపొందించి మిక్కిలి అడఁకువతో శ్రీకృష్ణుఁడు, ఆనారదమహామునితో ఈవిధముగా పలికెనని తాత్పర్యము.

౯౯౨.—తే॥ ఎచ్చటన యుండి వచ్చితి * రిచ్చోటునకు । నఖిల లోకైక సంచారు * లగుటఁ జేసి
యీరెఱుంగని యర్థంబు * లెందు నేని । యరయ లేదండ్రు మిమ్మొకఁ * డడుగవలయు.

టీ॥ ఎచ్చటనయుండి=ఎక్కడనుండి. ఇచ్చోటునకున్=ఇచ్చటికి. వచ్చితిరి = మీరువచ్చినారు. అఖిలలోకైకసంచారులు = ఎల్ల లోకములందు ఒక్కరేతిరుగువారు. అగుటఁజేసి = అగుటచేత. ఈరు=మీరు. ఎఱుంగనియర్థంబులు=ఎఱుఁగని విషయములు. ఎందునేని=ఎందైనను. అరయన్ = విచారింపఁగా. లేదండ్రు = లేదని పెద్దలుచెప్పుదురు.(కనుకమిమ్ము)ఒకఁడు=ఒకటి.అడుగవలయును.

తా॥ ఓమునీశ్వరా ! మీరు ఎక్కడనుండి యిక్కడికి ఇప్పుడు వచ్చినారు మీరు ఒక్కరే మూడులోకములందు తిరుగువారు అగుటచేత మీరెఱుఁగని వృత్తాంతములు ఏలోకములోనునుండవని పెద్దలు చెప్పుదురుకాఁబట్టి మిమ్మొక వృత్తాంత మడుగవలసియున్నదని తా.

౯౯౩.—తే॥ పాండునందను లిప్పుడే * పగిది నెచట । నున్నవారలొ యెఱిఁగింపుఁ * డన్న మౌని
గరసరోజాతములు మోడ్చి * కడఁకతోడఁ । బలికెఁ గమలాక్షుఁ జూచి స * ద్భక్తి మెఱసి.

టీ॥ పాండునందనులు = పాండురాజుకొడుకులు. (ఇప్పుడు) ఏపగిదిన్=ఏవిధముగా. ఎచటనున్నవారలొ=ఎక్కడనున్నారో. ఎఱిఁగింపుఁడు=తెలియఁజేయుఁడు. అన్నన్=అనఁగా. మౌని= నారదుఁడు. కరసరోజాతములు = హస్తకమలములను–కమలములవంటిచేతులను. మోడ్చి=ముకుళించి. కడఁకతోడన్ = ఉత్సాహముతో. కమలాక్షున్=కృష్ణుని. (చూచి) సద్భక్తిమెఱసి = అనన్యభక్తిని ప్రకాశింపఁ జేసి. పలికెన్ = ప్రత్యుత్తరము చెప్పెను.

తా॥ పాండుమహారాజు కొడుకులు ఇప్పుడు ఎక్కడ ఏవిధముగా నున్నారో నాకు తెలియఁజేయవలెనని అడుగఁగా నారదుఁడు చేతులు కట్టుకొన్నవాఁడై కపటములేని భక్తితో కృష్ణమూర్తిని జూచి చేతులు జోడించుకొని బదులు ఉత్తరము చెప్పెను అని తాత్పర్యము.

వ॥ దేవా నీవు విశ్వనిర్మాణకర్తవై మాయివై సకలకార్యోత్పాదనాది శక్తియుక్తుండవై పావనుండవై పావకుండు దారువులందు నంతర్హిత ప్రకాశుండై యున్నచందంబున వర్తించుచున్న నీదు దురత్యయంబులైన మాయాశతంబులఁ బెక్కుమార్లు పొడగంటి నదియు నాకద్భుతంబుగా దదియునుంగాక నీసంకల్పంబున జగంబుద్భవంబై భవత్పరతంత్రంబగునట్టి నీకిష్టంబైనవస్తువు సాధుతరంబుగాఁ దెలియ నెవ్వండు సమర్థుం డేపదార్థంబు ప్రమాణమూలంబునం దోఁచు నదియును లోకవిచక్షణుండవైన నీదురూపంబు మఱియును ముక్తిమార్గంబు నెఱుంగక సంసారపరవశులైనజీవుల మాయాంధకారంబు నివర్తింపఁజేయ సమర్థంబగు నీదివ్య లీలావతారంబులంగలుగు కీర్తియనుప్రదీపంబు ప్రజ్వలింపంజేసి కృపసేయునట్టి నీకు నమస్కరించెద నదిగావున నీప్రపంచంబున నీవెఱుంగని యర్థంబు గలదే యని కృష్ణునకు నారదుం డిట్లనియె.

టీ॥ దేవా=ఓస్వామీ.నీవు=సచ్చిదానందస్వరూపుఁడవైననీవు. విశ్వనిర్మాణకర్తవై–విశ్వ=ప్రపంచముయొక్క.నిర్మాణ=ఉత్పత్తిని. కర్తవై=చేయువాఁడవై. మాయివై=ఈశ్వరోత్పత్తికి కారణమైన మాయగలవాఁడవై–శ్లో॥ కార్యోపాధిరయంజీవః కారణోపాధిరీశ్వరః॥ అని, సకలకార్యోత్పాదనాదిశక్తియుక్తుండవై – సకల= సమస్తమయిన. కార్య = జగజ్జీవపరములయొక్క. ఉత్పాదన = కలుగఁజేయుట. ఆది = మొదలుగాఁగల. శక్తి=సామర్థ్యములతోడ.యుక్తుండవై=కూడుకొన్నవాఁడవై. పావనుండవై=పరిశుద్ధుఁడవై–అణవాదిమలములులేనివాఁడవై అనుట. పావకుండు=అగ్ని. దారువులందున్=మ్రాకులందు. అంతర్హితప్రకాశుండై=కనఁబడని ప్రకాశముగలవాఁడై. ఉన్నచందంబునన్ = ఉండునట్టివిధమున. వర్తించుచున్=ప్రవర్తించుచు. ఉన్న=ఉండునట్టి.నీదు=నీసంబంధమగు. దురత్యయంబులు=ఎంచుననుచెడనివి. అయిన = అయినట్టి. మాయాశతంబులన్=అనేకమాయలను–చిద్విలాసములను అనుట. పెక్కుమార్లు=పలుతడవలు. పొడగంటిన్=చూచితిని. అదియు= అట్లుచూచుటయు. (నాకు) అద్భుతంబుగాదు=వింత కాదు. (అదియునుంగాక) నీసంకల్పంబునన్=నీతలఁపుచేత. జగంబు=లోకము. ఉద్భవంబై=పుట్టినదై. భవత్పరతంత్రంబు = నీయధీనమయినతంత్రములుగలది. అగున్=అగును. అట్టినీకున్=అటువంటినీకు. ఇష్టంబైనవస్తువు = ప్రియమైనవస్తువు. సాధుతరంబుగాన్ = మిక్కిలి చక్కగా. తెలియన్ = తెలిసికొనను. (ఎవ్వండు) సమర్థుండు= శక్తుఁడు. ఏపదార్థంబు=ఏవస్తువు. ప్రమాణమూలంబునన్ = వేదశాస్త్రప్రమాణముతోడ. తోఁచున్ = కనఁబడునో. (అదియును) లోకవిచక్షణుండవు=లోకమునందు నేర్పరివి.అయిననీదురూపంబు= అయినట్టినీస్వరూపము. మఱియును=ఇదిగాక.ముక్తిమార్గంబున్= మోక్షముదారిని. ఎఱుంగక=తెలియక. సంసారపరవశులైనజీవుల

మాయాంధకారంబుల్ =సంసారమునందుమిక్కిలిఆసక్తులైయుండు ప్రాణులయొక్క అజ్ఞానమనెడు చీఁకటిని. నివర్తింపఁజేయన్ = విడిచిపోవునట్లుచేయను. సమర్థంబగు = చాలినదైన. నీదివ్యలీలావతారంబులన్=అప్రాకృతములైన నీవిలాసరూపములైనశ్రీరామకృష్ణాద్యవతారములందు. (కలుగు)కీర్తియనుప్రదీపంబు=యశస్సనెడుదీపమును. ప్రజ్వలింపంజేసి=వెలిఁగించి—నీచరిత్రపఠనముజీవులకు మోక్షప్రదము గనుక వానిని పఠింపవలెనను బుద్ధిపుట్టించి. కృపసేయునట్టి=అనుగ్రహించునట్టి. (నీకు) నమస్కరించెదన్=మ్రొక్కెదను. అదిగావునన్=అట్లు కాఁబట్టి. ఈప్రపంచంబునన్ = ఈలోకమునందు. నీవెఱుంగనియర్థంబు=నీవు తెలిసికొననివిషయము—నీకు తెలియనివిషయము.కలదే=కలదా. (అని కృష్ణునకు నారదుండిట్లనియె)

తా॥ ఓస్వామీ! నీవు సర్వమునుకలుగఁజేయువాఁడవు, మాయగలవాఁడవును, జగజ్జీవపరములను కలుగఁజేయ నేర్పుగలవాఁడవును, పరిశుద్ధుఁడవునునై అగ్నిప్రముఖులలో నడఁగి వెలుఁగుచుండునట్లు సర్వప్రాణులతోనుండునట్టి మీరశానినీమాయల నేకములుకలవు ఆమాయలను నేనుబహుపర్యాయములు చూచితిని అదియును నాకు ఆశ్చర్యముగా తోఁచలేదు నీసంకల్పముచేత కలిగినదై నీకు అధీనమయివర్తించునట్టి వానిలో నీకు ప్రియమైనవస్తువు ఇట్టిదని స్పష్టముగాఁ దెలిసికొనఁజాలినవాఁడెవఁడు ఏపదార్థము ప్రమాణమూలముగాఁ దోఁచునో అది సర్వలోకములందును సమర్థుఁడవనఁదగిన నీరూపముగానే యున్నది ఇదిగాక ముక్తిమార్గమునెఱుఁగక సంసారసముద్రమున మునిఁగిన జీవుల అజ్ఞానమనెడి చీఁకటిని నశింపఁజేయ శక్తిగలదై నానావిధములైన వినోదములను జూపునట్టి నీయవతారములందు నీకుఁ గలుగు కీర్తియనెడుదీపమును వెలిఁగించి అనఁగా, నీచరిత్రములను పఠింపవలెననెడి జ్ఞానమును కలిగించి లోకుల యజ్ఞానమును నివారించి అనుగ్రహించునట్టి నీకు నమస్కరించెదను అంతేగాని యీలోకమునందునీవెఱుఁగనివిషయమొకటి కలదని నేనుచెప్పఁగలవాఁడనా అని నారదుఁడుమఱియునుచెప్పను ఆరంభించెనని తాత్పర్యము.

౬౫౫.—సీ॥ అయినను వినిపింతు * నవధరింపుము దేవ - పాండుతనూజుండు * పారమేష్ఠ్య
కామాను మోదియై * కావింపఁగలఁడు స - ద్రాజసూయ మహాధ్వ * రంబు వేడ్క—
రవణింప లోక వి * డంబనార్థముగాక - పరికింపఁ దనకాత్మ * బాంధవుఁడవు
భక్తవత్సలుఁడవు * పరమ పూరుషుఁడవు - యజ్ఞరక్షకుఁడవు * యజ్ఞభోక్త
తే॥ వగు భవత్సేవ చాలదే * సుగతివడయ। నైన నీమేనబావ ధ * ర్మాత్మజుండు
నతనియజ్ఞంబు రక్షింప * నంబుజాక్ష। వలయు విచ్చేయ నచటికి * వలనుమెఱసి.

టీ॥ దేవ=ఓకృష్ణా. అయినను=ఎల్లవిషయములు నీకు తెలిసినవే అయినను. వినిపింతున్ = చెప్పెదను. అవధరింపుము = వినుము. పాండుతనూజుండు=పాండుకొడుకైన ధర్మరాజు. పారమేష్ఠ్యకామానుమోదియై — పారమేష్ఠ్య = బ్రహ్మసంబంధమైన లోకమును పొందుటవలని. కామ=కోరికయందు. అనుమోదియై=ఇష్టముగలవాఁడయి. సద్రాజసూయమహాధ్వరంబున్ = రాజసూయమనెడి యుత్తమమైనగొప్పయజ్ఞమును. వేడ్కన్=సంతోషముతో. కావింపఁగలఁడు = చేయఁగలవాఁడైయున్నాఁడు. రవణింపన్ = అట్లు యజ్ఞముచేయుట. లోకవిడంబనార్థము = లోకమునందలి ప్రసిద్ధికొఱకు. కాక=అంతేకాని. పరికింపన్=విచారింపఁగా. తనకున్= అతనికి. సుగతి=సద్గతిని. వడయన్=పొందుటకు. ఆత్మబాంధవుఁడవు=సొంతపుచుట్టమవు. భక్తవత్సలుఁడవు=సేవకులయందుప్రేమగలవాఁడవు. పరమపూరుషుఁడవు=సర్వోత్కృష్టుఁడవైనపురుషుఁడవు. యజ్ఞరక్షకుఁడవు = యజ్ఞమును రక్షించువాఁడవు. యజ్ఞభోక్తవు = యజ్ఞమునందలి హవిర్భాగములను పరిగ్రహించువాఁడవును. (అగు) భవత్సేవ = నీయందలిభక్తి. చాలదే = చాలదా. అయినన్=నీయందలిభక్తియేచాలియున్ననను. ధర్మాత్మజుండు= ధర్మరాజు. నీమేనబావ=మీమేనత్తకొమారుఁడు. అతనియజ్ఞంబున్= ఆధర్మరాజు చేయు యజ్ఞమును. రక్షింపన్=కాపాడుటకు. అంబుజాక్ష = ఓకృష్ణా. అచటికిన్ = ఆయజ్ఞశాలకు. వలనుమెఱసి= వైభవముప్రకాశింపఁజేసి. విచ్చేయవలయున్ = పోవలయు. శ్రు॥ యజ్ఞోవైవిష్ణుః, అని శ్రుతి.

తా॥ నీకు సర్వము తెలిసియున్నను నన్ను అడిగితివి కాఁబట్టి నేను చెప్పెదను వినుము పాండురాజుకొడుకైన ధర్మరాజు యజ్ఞముచేసి బ్రహ్మలోకమును పొందఁగోరినవాఁడై రాజసూయమహాయజ్ఞమును చేయఁబోవుచున్నాఁడు అట్లు యజ్ఞముచేయుట లోకమునందలిప్రసిద్ధికొఱకేగాని సద్గతినిపొందుటకునీసేవయొకటిచాలదా? నీవు భక్తవత్సలుఁడవు అతనికి కావలసిన బంధుఁడవును, సర్వోత్తముఁడవును, యజ్ఞమును రక్షింపను యజ్ఞమువలని హవిర్భాగములు గ్రహింపను కర్తవు కనుక నీమేనత్తకొమారుఁడయిన ఆధర్మరాజు చేయునట్టి యజ్ఞమునకు ఎల్లవైభవములతో నీవు పోవలసినది అని తాత్పర్యము.

౬౫౬.—క॥ నీపేరు వినిన నొడివినఁ। బాపంబులు మాసిపోవుఁ * బద్మాక్ష జగ
ద్దీపక నీదర్శనమున। నేపారవె భక్తజనుల * కిహపర సుఖముల్.

టీ॥ పద్మాక్ష = తామరలవంటి కన్నులుగలవాఁడవును. జగద్దీపక=లోకమునుప్రకాశింపఁజేయువాఁడవునైన ఓస్వామీ. (నీపేరు) వినినన్=విన్నను, నొడివినన్=నోటచెప్పినను. పాపంబులు=బ్రహ్మహత్యాదిదోషములు. మాసిపోవున్=నశించిపోవును. శ్లో॥ కృష్ణేతి మంగళంనామ యస్యవాచప్రవర్తతే। భస్మీభవంతురాజేంద్ర మహాపాతకకోటయః ॥ అని శ్రీవిష్ణు సహస్రనామ భాష్యము. నీదర్శన

మునన్=నిన్నుఁజూచుటచేత. భక్తజనులకున్=సేవకులైనజనులకు. ఇహపరసుఖములు = ఈలోకమునందలివి పరలోకమునందలివియు నైన సుఖములు. ఏపారవె=అతిశయింపవా.

తా॥ ఓశ్రీకృష్ణా! లోకమును ప్రకాశింపఁ జేయువాఁడవును, తామరలవంటి కన్నులుగలవాఁడవునైన నీపేరు విన్నను నోటచెప్పినను పాపములన్ని పరిహారములు అగుచుండఁగా భక్తులై నిన్ను చూచి సేవించినవారికి ఇహపరములందు సుఖములు గలుగుట అరుదా అని తాత్పర్యము.

౭౯౭.—మ॥ భవదీయోజ్జ్వల కీర్తి దిగ్వితతులన్ * భాసిల్లు యుష్మత్పదో
ద్భవ నైర్మల్య జలంబు లుత్కలికఁ బా * తాళంబునం బాఱు భో
గవతీ నామమునం దనర్చి ధరణిం * గంగానదీ రూపమై
దివి మందాకినియై జగత్త్రయమునం * దీపించు గాదే హరీ.

టీ॥ హరీ=ఓకృష్ణా. భవదీయోజ్జ్వలకీర్తి=నీదైన వెలుఁగునట్టికీర్తి. దిగ్వితతులన్ = దిక్కుల సమూహములందు.— పది దిక్కులందనుట. భాసిల్లున్ = ప్రకాశించును. యుష్మత్పదోద్భవనైర్మల్యజలంబులు— యుష్మత్=నీయొక్క. పద=పాదములందు. ఉద్భవ=పుట్టిన. నైర్మల్య=నిర్మలత్వముగల. జలంబులు=నీళ్లు. ఉత్కలికన్=తహతహతో. పాతాళంబునన్=పాతాళలోకమునందు. భోగవతీనామమునన్=భోగవతి యనుపేరితో. తనర్చి = ప్రసిద్ధినొంది. పాఱున్ = ప్రవహించును. ధరణిన్=భూమియందు. గంగానదీరూపమై = గంగానదీస్వరూపము గాను. దివిన్=ఆకాశమునందు. మందాకినియై=మందాకినిఅనఁగాను. జగత్త్రయమునన్ = స్వర్గ మర్త్య పాతాళములు అను మూఁడులోకములందును. దీపించుఁగాదే=ప్రకాశించునుగదా.

తా॥ ఓశ్రీకృష్ణా! నీనిర్మలమయినకీర్తి యెల్లదిక్కులందును వెలుఁగునట్లుగా నీపాదములయందుఁ బుట్టిన నీళ్లు మిక్కిలి పరిశుద్ధత్వముతో పాతాళమునందు భోగవతియనియు భూమియందు భాగీరథియనియు స్వర్గమునందు మందాకినియనియు చెప్పఁబడుచు మూఁడులోకములను పావనములనుగాఁ జేయుచు ప్రవహించుచుండును గదా అని తా.

౭౯౮.—క॥ ఆమఖవేళ సమస్తధ । రామండలి గల్గుమేటి * రాజులు మౌని
స్తోమంబును భవదీయ మ । హా మహిమముఁ జూచి సత్కృ * తార్థతఁ బొందన్.

టీ॥ ఆమఖవేళన్=ఆరాజసూయయజ్ఞము నడచుసమయమునందు. సమస్తధరామండలిన్ = ఈభూమండలమునం దంతటను. కల్గుమేటి రాజులు = ఉండునట్టి గొప్పరాజులును. మౌనిస్తోమంబును=మునుల సమూహమును. భవదీయమహామహిమమున్=నీదైనగొప్పమహిమను. (చూచి) సత్కృతార్థతన్=మిక్కిలిధన్యత్వమును. పొందన్=చెందఁగా.

తా॥ ఆరాజసూయ యజ్ఞము నడచునప్పుడు భూమండలములోని గొప్పరాజు లందఱును మునుల సమూహమును నీప్రభావమును జూచి కృతార్థులుకాఁగలరు అనితాత్పర్యము

౭౯౯.—క॥ కలరని చెప్పిన నమ్ముని । పలుకులకున్ ముదము నొంది * పంకజనాభుం
డెలనవ్వు మొగమునకుఁ జెలు । వొలయఁగఁ జాటించి యుద్ధ * వునకిట్లనియెన్.

టీ॥ (కలరు) అనిచెప్పిననమ్మునిపలుకులకున్ = అని యిట్లుచెప్పిన యానారద మహామునిమాటలకు. పంకజనాభుండు = కృష్ణుఁడు. ముదమునొంది=సంతోషమునుపొంది. ఎలనవ్వు=చిఱునవ్వు. మొగమునకున్ = ముఖమునకు. చెలువు=అందము. ఒలయఁగన్=వ్యాపింపఁగా. పాటించి=పొంది. ఉద్ధవునకున్=ఉద్ధవునితో. (ఇట్లనియెను)

తా॥ అనినారదమహాముని చెప్పఁగా శ్రీకృష్ణమూర్తి సంతోషించినవాఁడై చిఱునవ్వు నవ్వుచు వికాసమువహించిన ముఖముతో ఉద్ధవుని జూచి యేమో చెప్పెనని తాత్పర్యము.

౮౦౦.—క॥ ఉద్ధవ మహిత వివేక స । మిద్ధ వచో విభవ కార్య * మేగతి నడచున్
వృద్ధవరాను మతంబుగ । బోద్ధవ్యముగాఁగఁ జెప్పు * పురుషనిధానా.

టీ॥ పురుషనిధానా = పురుషులలో శ్రేష్ఠుఁడవును. మహిత... విభవ—మహిత=పూజ్యమైన. వివేక = తెలివిచేత. సమిద్ధ=మిక్కిలి శ్లాఘ్యములయిన. వచః = మాటలయొక్క. విభవ = కలిమిగల. ఉద్ధవ=ఓయుద్ధవుఁడా. కార్యము = ఇప్పుడు మనము చేయగలపని. ఏగతిన్=ఏవిధముగా. నడచున్=నడవవలసినది. వృద్ధవరానుమతంబుగన్ = పెద్దలందఱుసరియనువిధముగ. బోద్ధవ్యము = బోధింపఁదగినది. కాఁగన్=అగునట్టుగా. చెప్పుము=నీప్రతిభ తేటపడఁబలుకుము.

తా॥ పురుష శ్రేష్ఠుఁడవును, మేలైన తెలివిచేత ఒప్పునట్టి యుక్తమయినమాటలసంపత్తికలవాఁడవునైన ఓయుద్ధవా! మిక్కిలిపెద్దలగువారందఱు వినిశ్లాఘించునట్టుగా నడవగల కార్యమునకుఁ దగిన యోచన చెప్పుమనెనని తాత్పర్యము.

౮౦౧.—తే॥ అనఘ చారిత్ర నీవు నా * యక్షి యుగము । వంటివాఁడవు మనకు న * వశ్య మగుచు
జేయఁ దగినట్టి కార్యంబుఁ * జెప్పు నీవు । నేమి పంచినఁ గావింతు * నిద్ధచరిత.

టీ॥ అనఘచారిత్ర=దోషరహితమైన నడవడిగలిగినయుద్ధవా. (నీవు) నాయక్షియుగమువంటివాఁడ రెండుకన్నులవంటి వాఁడవు. (మనకు) అవశ్యమగుచున్=అగత్యముగా. చేయఁదగినట్టికార్యంబున్=చేయవలసినపనిని. (చెప్పుము) ఇద్ధచరిత = శ్లాఘ్యమయిన నడవడిగల

వాఁడా. (నీవు) ఏమిపంచినన్ = ఏమిచేయుమని యాజ్ఞాపించినను. కావింతున్ = చేయుదును.

తా॥ శ్లాఘ్యమయినదియు దోషము లేనిదియూనైన నడవడిగల శ్రీయుద్ధవా! నీవు జ్ఞానసంపన్నులవంటి వాఁడవు కాఁబట్టి నీవేది చేయుమందువో అట్లనిని చేయుటకు సిద్ధముగనున్నాను మనకిప్పుడు తప్పక చేయఁదగిన పని యేదియో దానిని చెప్పుము అని తాత్పర్యము.

వ॥ అనిసర్వజ్ఞుండైనహరి యజ్ఞుండువోలెఁదన్నునడిగినఁ బురుషోత్తముని భాషణంబులకు మనంబున సంతసిల్లి యతని పాదాంబుజంబులు దనమనంబుననిడుకొని వృద్ధానుమతంబుగానే నెఱింగిన తెఱంగువవిన్నవించెదనవధరింపుము, దేవా దేవముని చెప్పినట్లు భవదీయభక్తుండైన యుధిష్ఠిరు యాగపాలనంబుసేయఁ గైకొనుట కార్యంబదియునుం గాకనిఖిలదిగ్విజయమూలంబగు రాజసూయ కృత్యంబునంద జరాసంధమర్దనంబు నతనిచేత బద్ధులైన రాజులం గారాగృహ విముక్తులం గావించుటయుం జేకూఱు నదియునుంగాక నాగాయుతసత్త్వుండును, శతాక్షౌహిణీ బలాన్వితుండునగు మాగధునివధియింప మనప్రభంజన నందనుండుగాని యొండొరులు సమర్థులుగా రట్లగుట నతండు భూసురు లేమిగోరిన నయ్యర్థంబు వృథాకరింపక యిచ్చుంగావునఁ గపటవిప్రవేషంబునం జని యాజరాసంధుని నాహవభిక్ష వేఁడిన భవత్సన్నిధానంబున నప్పవమాన తనయుం డతని వధియించు నట్టి కార్యంబు చేత బహుకార్యసాధనంబగు నని పలికిన నారదుండును యాదవ జనంబులును సభికులునుం బొగడిరంత.

టీ॥ (అని) సర్వజ్ఞుండైనహరి=అన్నియు తెలిసినవాఁడైనకృష్ణుఁడు. అజ్ఞుండువోలెన్=ఏమియు తెలియనివాని విధమున. తన్నునడిగినన్= తన్ను అడుగఁగా. పురుషోత్తమునిభాషణంబులకున్ = పురుషశ్రేష్ఠుఁడైనయాకృష్ణమూర్తిమాటలకు. మనంబునన్=మనస్సులో. సంతసిల్లి= సంతోషించి. అతనిపాదాంబుజంబులు=ఆకృష్ణునిపాదకమలములను. తనమనంబునన్=తనమనస్సులో. ఇడుకొని = ఉంచుకొని. వృద్ధానుమతంబుగాన్=పెద్దలు సరియనునట్లుగా. నే నెఱింగిన తెఱంగునన్= నాకు తెలిసినవిధమున. విన్నవించెదన్=విజ్ఞాపనము చేసెదను—మనవి చేసెదను. అవధరింపుము=చిత్తగింపుము — వినుము. దేవా=స్వామీ. దేవముని = నారదుఁడు. చెప్పినట్లు = చెప్పినట్లుగానే. భవదీయ భక్తుండు=నీసేవకుఁడు. అయినయుధిష్ఠిరుయాగపాలనంబుసేయన్= అయినట్టిధర్మరాజుయొక్క యజ్ఞమును పాలించుటకు. కైకొనుట= అంగీకరించుట. కార్యంబు = యుక్తము. (అదియునుంగాక) నిఖిల దిగ్విజయమూలంబు = ఎల్ల దిక్కులను గెలుచుటముఖ్యముగాఁ గలది. అగు రాజసూయకృత్యంబునంద=అగునట్టి రాజసూయ కార్యమునందే. జరాసంధమర్దనంబును=జరాసంధుని చంపుటయు. అతనిచేతబద్ధులైన రాజులన్=ఆజరాసంధునిచేతచెఱనుంచఁబడినరాజులను. కారాగృహ విముక్తులన్=ఆచెఱసాలయందుండి విడువఁబడినవారినిగా. కావించు టయున్=చేయుటయును. చేకూఱున్=సిద్ధించును (అదియునుంగాక) నాగాయుతసత్త్వుండును = పదివేలయేనుఁగుల బలముగలవాఁడును. శతాక్షౌహిణీబలాన్వితుండును=నూఱు అక్షౌహిణులసేనలతోఁగూడు కొన్నవాఁడును. అగుమాగధునిన్=అగునట్టిజరాసంధుని. వధియింపన్ =చంపను. మనప్రభంజననందనుఁడుగాని = మనభీమసేనుఁడేగాని. ఒండొరులు=మఱియొకరు. సమర్థులుఁగారు = శక్తులుఁగారు. అట్లగుటన్=అట్లగుటచేత. అతండు = ఆజరాసంధుఁడు. భూసురులు= బ్రాహ్మణులు. ఏమికోరినన్=ఏమియడిగినను. అయ్యర్థంబున్=ఆయడిగినవస్తువును. వృథాకరింపక=వ్యర్థముచేయక. (ఇచ్చును) కావునన్= కనుక. కపటవిప్రవేషంబునన్ = కపటమైనబ్రాహ్మణవేషముతో. చని=పోయి. (ఆజరాసంధుని) ఆహవభిక్ష=యుద్ధభిక్షను. వేఁడినన్= కోరినపక్షమున. భవత్సన్నిధానంబునన్ = నీదగ్గఱ—నీవు ఎదుటనుండఁగా. అప్పవమానతనయుండు=ఆభీమసేనుఁడు. అతనిన్=జరాసంధుని. వధియించును=చంపును. అట్టికార్యంబుచేతన్ = ఆపనిచేత. బహుకార్యసాధనంబు = విశేషకార్యసాధకము. (అగును) అనిపలికినన్=అనిచెప్పఁగా. (నారదుండును) యాదవజనంబులును=యదువంశస్థులగుపరిజనులును. సభికులును=సభయందున్నపెద్దలును; పొగడిరి= ఉద్ధవుని యాలోచనను శ్లాఘించిరి. అంతన్ = అటుపిమ్మట.

తా॥ అని యీవిధముగా శ్రీకృష్ణుఁడు అన్నియు తెలిసినవాఁడైయుండియు తెలియని వానివలెనే అడుగఁగా అందులకు ఉద్ధవుఁడు సంతోషించి ఆకృష్ణుని పాదకమలములను మనసులో తలఁచుకొనుచు పెద్దలందఱు సరియనునట్లుగా నాకుతోఁచిన యాలోచన చెప్పెదను వినుము, ఓకృష్ణా! నారదుఁడు చెప్పినచొప్పున నీకుభక్తుఁడైన ధర్మరాజుచేయుయజ్ఞమును కాపాడునట్టిపనిని అంగీకరింపవలసినది ముఖ్యకార్యము ఎల్ల దిక్కులను జయించుటయే ముఖ్యముగాఁగల ఆరాజసూయకార్యమునందే జరాసంధునిచంపుటయు వాఁడుచెఱలోనుంచియుండురాజులను విడుదలచేయుటయు సిద్ధించును పదివేలయేనుఁగుల బలముగల వాఁడును నూఱు అక్షౌహిణుల సేనగలవాఁడునైన జరాసంధుని జయింపను మన భీమసేనుఁడుతప్ప ఇతరుఁ డెవఁడును తగినవాఁడు కాఁడు కాఁబట్టి బ్రాహ్మణులు ఏమియడిగినను ఇచ్చునట్టి నియమము గలవాఁడైన ఆజరాసంధుని బ్రాహ్మణ వేషము వేసికొనిపోయి యుద్ధభిక్షయడిగినపక్షమున నిన్ను దగ్గఱనుంచుకొని భీమసేనుఁడుజరాసంధునిఁజంపును వానిచంపుట ఎల్లకార్యములు నెఱవేఱుటకు సాధకము అగును అనియుద్ధవుఁడు చెప్పఁగా ఆయన బుద్ధి కుశలత్వమునకు నారదుఁడును యాదవసైనికులును సభలోనున్న పెద్దలును మెచ్చుకొని కొనియాడిరి అని తాత్పర్యము.

203.—సీ॥ తరల విచిత్రక * స్థగితప్రభావలిఁ - దనరారు గరుడకే * తనము వెలుఁగఁ
గాంచనచక్రసం * గత ఘంటికాఘణ - ఘణనినాదమున ది * క్కరులుబెదర
సలలిత మేఘ పు * ష్పక వలాహక సైన్య - సుగ్రీవ తురగ వి * స్ఫురణ దనర
బాలసూర్య ప్రభా * భాసమాన ద్యుతి - దిగ్వితానంబుల * దీటుకొనఁగ

తే॥ ప్రకటరుచినొప్పు తేరు దా * రకుఁడు దేర । నెక్కి వెడలెడునపుడు పెం * పెనయఁ జెలఁగె
శంఖ కాహళ పటహ ని * స్సాణ డిండి । మాది రవములు భరిత ది * గంతములుగ.

టీ॥ తరల...వలిన్—తరల=చలించుచున్న. విచిత్రక=చిత్తరువుల చేత. స్థగిత=కూర్పఁబడిన. ప్రభావలిన్=కాంతిసమూహములచేత. తనరారు = ఒప్పునట్టి. గరుడకేతనము=గరుడధ్వజము. వెలుఁగన్= ప్రకాశింపఁగా. కాంచన...నినాదమునన్—కాంచన=బంగారుచేతఁ జేయఁబడిన. చక్ర=గాల్లయందు. సంగత=కూర్పఁబడిన. ఘంటికా= గంటలయొక్క. ఘణఘణనినాదమునన్ = గణగణయనుధ్వనిచేత. దిక్కరులు = దిగ్గజములు. బెదరన్ = భయపడఁగా. సలలిత ... విస్ఫురణ—సలలిత = మిక్కిలిమనోజ్ఞములయిన. మేఘపుష్పక వలాహక సైన్య సుగ్రీవ = మేఘపుష్పకము వలాహకము సైన్యము సుగ్రీవము అనఁబడునట్టి. తురఁగ = గుఱ్ఱములయొక్క. విస్ఫుర్ణ = విశేషప్రకాశము. తనరన్=ఒప్పఁగాను. బాలసూర్య ... ద్యుతి— బాల్యసూర్య = ప్రాతఃకాలపు సూర్యునియొక్క. ప్రభా = వెలుఁగు వలె. భాసమాన=వెలుఁగుచున్న. ద్యుతి=కాంతి. దిగ్వ్రాతానంబులన్= దిక్కులసమూహములందు. దీటుకొనఁగన్=వ్యాపింపఁగా. ప్రకట రుచిన్=ప్రసిద్ధమయిన—అనఁగా, మిక్కిలి అతిశయించిన కాంతిచేత. ఒప్పు=ఒప్పునట్టి. తేరు=రథమును. (దారకుఁడు) తేరన్=తీసికొని రాఁగా. ఎక్కి = ఆరథమునం దెక్కి. వెడలెడునపుడు=కృష్ణుఁడు బయలుదేఱునపుడు. పెంపు=గౌరవము. ఎనయన్=కూడుకొనునట్లు. శంఖ...రవములు—శంఖ=శంఖములు. కాహళ=తుతారలు. పటహ= తప్పెటలు. నిస్సాణ=డవిణ. డిండిమ=రాయడిగిడి. ఆది=మొదలగు వాద్యముల యొక్క. రవములు=ధ్వనులు. భరితదిగంతములుగన్= నిండినదిక్కులకొనలు కలుగునట్లుగా. చెలఁగెన్=మ్రోఁగెను.

తా॥ చలించుచున్నదియు నానావర్ణములుగలుగ చిత్రించినదియునై వెలుఁగుచున్న గరుడధ్వజమును, దిగ్గజములు బెదరునంతటి ధ్వనుల మ్రోఁగుచున్న రథచక్రములయందలి ఘంటలును, మిక్కిలి మనోజ్ఞము లయియొప్పునట్టి సైన్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకముల నెడు గుఱ్ఱములును ఉదయకాలపు లేయెండవలె మెఱయుచున్న కాంతులును గలిగి యొప్పునట్టి బంగారు రథమును దారకుఁడు తీసికొనిరాఁగా శ్రీకృష్ణమూర్తి యారథమునెక్కి బయలువెడలునపుడు ఆయనయొక్క గౌరవమునకు తగినట్లు శంఖములు తుతారలు తప్పెటలు డవిణలు రాయడిగిడిగిళ్లు మొదలుగాఁగల వాద్యములు వాయింపఁబడెననియు ఆధ్వనులు దిగంతముల వఱకు వ్యాపించెననియు తాత్పర్యము.



(*) శ్రీకృష్ణుండు ధర్మరాజు నొద్దకుఁబోవుట. (*)

౨౦౪.—క॥ మనుజేశ్వరునకుఁ దాలాం । కునకును గురువృద్ధజనుల * కును మ్రొక్కి ప్రియం
బున ననుపఁ గాంచన స్యం । దన సామజ వాజి భట క * దంబము గొలువన్.

టీ॥ మనుజేశ్వరునకున్ = ఉగ్రసేనమహారాజునకును. తాలాంకునకున్=బలరామునికిని. గురువృద్ధజనులకును=పూజ్యులకును ముసలివారికిని. (మ్రొక్కి) ప్రియంబునన్=ప్రీతితో. అనుపన్=వారు పంపఁగా. కాంచన స్యందన...కదంబము — కాంచన=బంగారువైన. స్యందన=

రథములయు. సామజ=ఏనుఁగులయు. వాజి=గుఱ్ఱములయు. భట=బంట్లయు. కదంబము=సమూహము. కొలువఁగ=సేవింపఁగా.

తా॥ శ్రీకృష్ణమూర్తి ఉగ్రసేన మహారాజునకును బలరామునికిని ఇంకను గల పూజ్యులకును మ్రొక్కి వారియనుమతి పుచ్చుకొని బంగారు తేరులు మొదలగు చతురంగ బలములను సేవింపఁగా ననితాత్పర్యము.

౨౦౫.—తే॥ వందిమాగధ సూత కై * వార రవము । వసుమతీ సురకోటి దీ * వనల మ్రోఁత
లనుగమింపంగ సతులుసౌ * ధాగ్రశిఖర । జాలములనుండి ముత్యాల * శాసలొలుక.

టీ॥ వందిమాగధసూతకైవారరవము—వంది=స్తుతి పాఠకులయు. మాగధ = వంశావళి చదువువారలయు. సూత= భట్రాజులయు. కైవార=స్తోత్రములయొక్క. రవము=ధ్వనియును. వసుమతీసురకోటి దీవనల మ్రోఁతలు—వసుమతీసుర=బ్రాహ్మణులయొక్క. కోటి=సమూహముయొక్క. దీవనల=ఆశీర్వచనములయొక్క. మ్రోఁతలు=ధ్వనులును. అనుగమింపంగన్=వెంబడింపఁగా. సతులు=స్త్రీలు. సౌధాగ్ర శిఖరజాలములనుండి = మేడలశిఖరముల సమూహముల యందుండి. ముత్యాలశాసలు = ముత్యాలతలఁబ్రాలు. ఒలుకన్=రాల్పఁగా—చల్లఁగానను.

తా॥ స్తుతిపాఠకులు మొదలగువారి స్తోత్రధ్వనులును బ్రాహ్మణుల యాశీర్వచనధ్వనులును బోరుకలగఁగా మేడలమీఁదనుండి పురస్త్రీలందఱు ముత్యాలతలఁబ్రాలుపోయఁగా ననితాత్పర్యము.

౨౦౬.—క॥ లీలంజని కృష్ణుఁడు వా । హ్యాళిన్ నవకుసుమ ఫలభ * రానతశాఖా
లోల ఘనసారసాల ర । సాల వన స్థలమునందుఁ * జతురత విడిసెన్.

టీ॥ (కృష్ణుఁడు) లీలన్=విలాసముగా. చని=పోయి. వాహ్యాళిన్=సికారుచేత. నవకుసుమ...వనస్థలమునందున్ — నవ = క్రొత్తలైన. కుసుమ=పుష్పములయు. ఫల=పండ్లయు. భర = బరువుచేత. ఆనత=వంగిన. శాఖా=కొమ్మలచేత. లోల = చలించుచున్న. ఘనసార=కర్పూరపుఁజెట్లు. సాల=ఏపెచెట్లు. రసాల=తియ్యమామిడి చెట్లును గల. వనస్థలమునందున్=తోపునందు. చతురతన్=చాతుర్యముతో. విడిసెన్=దిగెను.

తా॥ కృష్ణుఁడు వినోదముగా సికారు పోయినట్టు పోయి క్రొత్త పువ్వులు పండ్లు మొదలగువాని బరువుచేత వంగిన కర్పూరపుఁజెట్లు తియ్యమామిడిచెట్లు మొదలగునవిగల ఒకానొకతోపునందుదిగెననితా.

౨౦౭.—వ॥ అట్టియెడ సరోజనాభు శుద్ధాంత కాంతా జనంబులు.

టీ॥ అట్టియెడన్ = ఆసమయమునందు. సరోజ...జనంబులు— సరోజనాభు=కృష్ణునియొక్క. శుద్ధాంత=అంతఃపురమువారు—రాణివాసమువారగు. కాంతాజనంబులు = స్త్రీలు—అంతఃపురస్త్రీలనుట.

తా॥ ఆసమయమునందుకృష్ణునిరాణివాసపుస్త్రీలుఅనితాత్పర్యము.

౨౦౮.—సీ॥ వికచ మరంద న * వీనసౌరభ లస - న్మందారకుసుమ దా * మములుదుఱిమి.
చారు సుగంధ క * స్తూరికా ఘనసార - మిళిత చందనపంక * మెలమినలఁది
కనకకుండలకన * త్కంకణనూపుర - ముద్రికాభూషణ * ములు ధరించి
యంచిత ముక్తాఫ * లాంచల మృదుల ది - వ్యాంబరములు చెలు * వారఁగట్టి
తే॥ యర్ధచంద్రుని నెకసక్కె * మాడునట్టి । యలిక ఫలికలఁ దిలకము * లలరఁదీర్చి
పెంపు దీపింపనుడురాజ * బింబముఖులు । నవచతుర్విధశృంగార * మవధరించి.

టీ॥ వికచ...దామములు — వికచ=పూచిన. మరంద=పూఁదేనెలయొక్క. నవీన = నూతనములయిన. సౌరభ=పరిమళముల చేత. లసత్ = ఒప్పుచున్న. మందారకుసుమ = కల్పవృక్షపుపువ్వుల యొక్క. దామములు=దండలు. తుఱిమి=కొప్పులయందుచెరువుకొని. చారు...పంకము—చారు=ఒప్పిదములైన. సుగంధ=మంచిపరిమళము గల. కస్తూరికా = కస్తురితోడను. ఘనసార = కర్పూరముతోడను. మిళిత = కలుపఁబడిన. చందనపంకము = గుజ్జువంటి గంధమును. ఎలమిన్=సంతోషముతో. అలఁది=పూసి. కనక...భూషణములు—కనక=బంగారువైన. కుండల=చెవిపోఁగులును. కనత్ = వెలుఁగుచున్న. కంకణ = ముంజేతికడియములును. నూపుర = అందెలును. ముద్రికా=ఉంగరములునైన. భూషణములు=ఆభరణములు. ధరించి=తాల్చి. అంచిత...దివ్యాంబరములు—అంచిత=మనోజ్ఞములయిన. ముక్తాఫల=ముత్యాలపూసలుగ్రుచ్చిన. అంచల=చెరఁగులుగల. మృదుల = మిక్కిలినయమైన. దివ్య = సర్వోత్కృష్టములయిన. అంబరములు= వస్త్రములు. చెలువారన్=అంద మతిశయించునట్లుగా. కట్టి=కట్టుకొని. అర్ధచంద్రునిన్=అర్ధచంద్రబింబమును. ఎకసక్కెమాడునట్టి= పరిహాసముచేయునట్టి. అలికఫలికలన్ = నొసటిపలకలందు. తిలకములు=బొట్లు. అలరన్=ఒప్పిదముగ. తీర్చి=దిద్ది. పెంపు=ఘనత. దీపింపన్=ప్రకాశింపఁగా. ఉడురాజబింబముఖులు=చంద్రబింబముల వంటిముఖముగలయాస్త్రీలు. నవ...శృంగారము—నవ=క్రొత్తగనైన. చతుర్విధ = వస్త్రభూషణ చందనపుష్పములని నాలుగువిధములైన. శృంగారము = అలంకారమును. అవధరించి=పూనినవారై.

తా॥ విరిసిపూఁదేనెల పరిమళములను వెదచల్లుచున్న కల్పవృక్షపు పువ్వులను కొప్పులందుఁజెరువుకొని, కస్తూరిపచ్చకర్పూరము మొదలగు ద్రవ్యములు చేర్చి మేళవించిన మంచి పరిమళ చందనమును పూసికొని, బంగారుమయములైన చెవికమ్మలు మొదలైన ఆభరణములు ధరించి, మిక్కిలి ఒప్పిదములై ముత్యాలపూసలు గ్రుచ్చిన చెఱఁగులుగల నయతరమయిన దివ్య వస్త్రములను గట్టుకొని, అర్ధచంద్ర బింబములను బోలిననొసళ్ల యందుకస్తూరితిలకములను దీర్చి, చంద్రునిఁబోలినముఖముగల యాస్త్రీలందఱు నాలుగువిధములైన అలంకారములతోను ఒప్పినవారైయని తా.

౨౦౯.—తే॥ జలజలోచనుకడకును * త్కలికతోడఁ । దనరు శిబికంబులెక్కి నం * దనులుఁ దాముఁ
సరగ నేతేర పడిహార * జనులు వేత్ర । కలితులై పౌరులను నెడ * గలుగ జడియ.

టీ॥ జలజలోచనుకడకున్ = కృష్ణునొద్దకు. ఉత్కలికతోడన్ = తహతహతో. తనరుశిబికంబులు = ఒప్పునట్టిపల్లకీలు. (ఎక్కి) నందనులును = కొడుకులును. (తామును) పడిహారజనులు = ద్వారపాలకులు. వేత్రకలితులై = బెత్తములుపూనినవారై. పౌరులను = వారినిచూడవచ్చు పురజనులను. ఎడగలుగన్ = ఎడముగాతొలఁగునట్లు. జడియన్ = త్రోయఁగా. సరగన్ = వడిగా. ఏతేరన్ = వచ్చుచుండఁగా.

తా॥ కృష్ణునివెంట పోవలెనను తహతహతో ఒప్పిదమ్మైన పల్లకీ లెక్కి ద్వారపాలకులు చేతబెత్తములు పూని దారికి అడ్డముగా చూడ వచ్చు పురజనులను తొలఁగఁ దఱుమఁగా ఒప్పిదమైన పల్లకీలెక్కి కొడుకులును తామును కృష్ణునొద్దకురాఁగా అనితాత్పర్యము.

౨౧౦.—క॥ అసమాస్త్రుఁడు పులుగడిగిన । కుసుమాస్త్రములన్ హసించు * కోమలతనువుల్
మిసమిస మెఱవఁగ వేశ్యా । విసరము దాసీజనంబు * విభవ మెలర్పన్.

టీ॥ అసమాస్త్రుఁడు = మన్మథుఁడు. పులుగడిగిన = మఱికిపోఁగడిగిన. కుసుమాస్త్రములన్ = పూవుటమ్ములను. హసించు = నవ్వునట్టి. కోమలతనువులు = మృదువులైన దేహములు. మిసమిసన్ = మిసమిసయను కాంతిచేత. మెఱవఁగన్ = వెలుఁగఁగా. వేశ్యావిసరమును = భోగము వారిగుంపును. (దాసీజనంబు) విభవమెలర్పన్ = ఐశ్వర్యమతిశయింపఁగా

తా॥ మన్మథుఁడు మఱికి పోఁదోమి కడిగిన పూవుల బాణములను మీఱిమృదువులై తళతళలాడుచున్న దేహములుగలవేశ్యలగుంపును, పరిచారికల గుంపును, తమవైభవము హెచ్చరాఁగానని తాత్పర్యము.

౨౧౧.—ఆ॥ హరుల వేసడములఁ * గరులను నెక్కి తో । నరుగుదేర బహువి * ధాయుధములు
దాల్చి సుభటకోటి * తగిలి రా నంతఃపు । రాంగనలు సితాంబు * జాక్షుకడకు.

టీ॥ హరులన్ = గుఱ్ఱములను. వేసడములన్ = కంచరగాడిదలను. కరులన్ = ఏనుఁగులను. (ఎక్కి) తోన్ = తమవెంట. అరుగుదేరన్ = రాఁగా. బహువిధాయుధములు = అనేకవిధములయిన యాయుధములను. దాల్చి = ధరించి. సుభటకోటి = మంచిబంట్లగుంపు. తగిలి రాన్ = వెంబడించిరాఁగా. అంతఃపురాంగనలు = అంతఃపురస్త్రీలు. సితాంబుజాక్షుకడకున్ = తెల్లదామరలవంటికన్నులుగల శ్రీకృష్ణుని వద్దకు.

తా॥ గుఱ్ఱములను కంచరగాడిదలను ఏనుఁగులను ఎక్కి వేశ్యలు మొదలగువారు రాఁగా అనేకవిధములయిన ఆయుధములను బూని భటులు వెంబడించి రాఁగా అంతఃపురస్త్రీలు శ్రీకృష్ణమూర్తియొద్దకు వచ్చిరని తాత్పర్యము.

౨౧౨.—క॥ నారదుని మాధవుఁడు స । త్కారంబున వీడుకొలుప * నతఁడును హృదయాం
భోరుహమునఁ గృష్ణునకును । వారక మ్రొక్కుచును వెస ది * వంబున కరిగెన్.

టీ॥ మాధవుఁడు = కృష్ణుఁడు. నారదునిన్ = నారదమహామునిని. సత్కారంబునన్ = గౌరవముతో. వీడుకొలుపన్ = పంపఁగా. అతఁడును = ఆనారదుఁడును. హృదయాంభోరుహమునన్ = మనఃకమలమునందు. (కృష్ణునకు) వారక = నిలువక. (మ్రొక్కుచును) దివంబునకున్ = స్వర్గమునకు. వెసన్ = వడిగా. అరిగెన్ = పోయెను.

తా॥ అప్పుడు శ్రీకృష్ణమూర్తి నారద మహామునిని సన్మానించి సెలవిచ్చి పంపఁగా అతఁడును తనమనసునందు శ్రీకృష్ణునిఁదలఁచి నమస్కరించుచు దేవలోకమునకుఁబోయెనుఅనితాత్పర్యము. వ॥ అంత.

౨౧౩.—క॥ నరవరుల దూతయును ముర । హరుచే నభయప్రదాన * మంది ధరిత్రీ
వరులకడ కేగి పద్మో । దరువచనము సెప్పి సమ్మ * దంబునఁ దేల్చెన్.

టీ॥ నరవరులదూతయున్ = రాజులుపంపినదూతయు. మురహరుచేన్ = శ్రీకృష్ణునిచేత. అభయప్రదానము = భయములేదనుమాట యొక్కయీవిని. అంది = పొంది. ధరిత్రీవరులకడకున్ = రాజులవద్దకు. ఏగి = పోయి. పద్మోదరువచనము = కృష్ణునిమాటను. (చెప్పి) సమ్మదంబునన్ = సంతోషమునందు. తేల్చెన్ = తేలునట్లు చేసెను.

తా॥ జరాసంధుని చెఱలోఁదగులుకొన్న రాజులచేత పంపఁబడిన దూత కృష్ణునివలనభయపడవలదనునమ్మకపుమాటనుపుచ్చుకొని ఆరాజులవద్దకుపోయికృష్ణుఁడిట్లుచెప్పెననిచెప్పి వారినిసంతోషపెట్టెననితా.

౨౧౪.—వ॥ అంతఁ గృష్ణుండు నిజకాంతాతనయ బంధు సుహృజ్జనసహితుండై కదలిచను నెడ.

టీ॥ అంతన్ = అంతట. (కృష్ణుండు) నిజకాంతా...తుండై— నిజ = తనయొక్క. కాంతా = భార్యలతోడను. తనయ = కొడుకులతోడను. బంధు = చుట్టములతోడను. సుహృజ్జన = స్నేహితులతోడను. సహితుండై = కూడుకొన్నవాఁడై (కదలి) చనునెడన్ = పోవునప్పుడు.

తా॥ అంతట శ్రీకృష్ణమూర్తి తనభార్యలుకొమాళ్లుచుట్టములుచెలికాండ్రు మొదలగువారితోఁగూడ బయలుదేఱిపోవునప్పుడనితా.

౨౧౫.—చ॥ కటపట రత్నకంబళ ని * కాయ కుటీరము లుల్లసిల్ల ను
త్కటపటు చామరధ్వజ ప * తాక కిరీట సితాతపత్ర వి
స్ఫుట ఘన హేతి దీధితి న * భోమణిఁ గప్పఁగఁ దూర్య ఘోషముల్
చటుల తిమింగిలోర్మిరవ * సాగర ఘోషము నాక్రమింపఁగన్.

౨౦౯.—తే॥ జలజలోచనుకడకును * నుత్కలికతోడఁ । దనరు శిబికంబులెక్కి నం * దనులుఁ దాముఁ
సరగ నేతేర పణిహార * జనులు వేత్ర । కలితులై పౌరులను నెడ * గలుగ జడియ.

టీ॥ జలజలోచనుకడకున్ = కృష్ణునొద్దకు. ఉత్కలికతోడన్ = తహతహతో. తనరుశిబికంబులు = ఒప్పునట్టిపల్లకీలు. (ఎక్కి) నందనులును = కొడుకులును. (తామును) పణిహారజనులు = ద్వారపాలకులు. వేత్రకలితులై = బెత్తములుపూనినవారై. పౌరులను = వారినిచూడవచ్చు పురజనులను. ఎడగలుగన్ = ఎడముగాతొలఁగునట్లు. జడియన్ = త్రోయఁగా. సరగన్ = వడిగా. ఏతేరన్ = వచ్చుచుండఁగా.
తా॥ కృష్ణునివెంట పోవలెనను తహతహతో ఒప్పిదమైన పల్లకి లెక్కి ద్వారపాలకులు చేతబెత్తములు పూని దారికి అడ్డముగా చూడ వచ్చు పురజనులను తొలఁగఁ దఱుమఁగా ఒప్పిదమైన పల్లకీలెక్కి కొడుకులును తామును కృష్ణునొద్దకురాఁగా అనితాత్పర్యము.

౨౧౦.—క॥ అసమాస్త్రుఁడు పులుగడిగిన । కుసుమాస్త్రములన్ హసించు * కోమలతనువుల్
మిసమిస మెఱవఁగ వేశ్యా । విసరము దాసీజనంబు * విభవ మెలర్పన్.

టీ॥ అసమాస్త్రుఁడు = మన్మథుఁడు. పులుగడిగిన = మెఱికిపోఁగడిగిన. కుసుమాస్త్రములన్ = పూవుటమ్ములను. హసించు = నవ్వునట్టి. కోమలతనువులు = మృదువులైన దేహములు. మిసమిసన్ = మిసమిసయను కాంతిచేత. మెఱవఁగన్ = వెలుఁగఁగా. వేశ్యావిసరమును = భోగమువారిగుంపును. (దాసీజనంబు) విభవ మెలర్పన్ = ఐశ్వర్యమతిశయింపఁగా
తా॥ మన్మథుఁడు మెఱికి పోఁదోమి కడిగిన పూవుల బాణములను మీఱిమృదువులై తళతళలాడుచున్న దేహములుగలవేశ్యలగుంపును, పరిచారికల గుంపును, తమవైభవము హెచ్చరాఁగానని తాత్పర్యము.

౨౧౧.—ఆ॥ హారుల వేసడములఁ * గరులను నెక్కితో । నరుగుదేర బహువి * ధాయుధములు
దాల్చి సుభటకోటి * తగిలి రా నంతఃపు । రాంగనలు సితాంబు * జాక్షుకడకు.

టీ॥ హారులన్ = గుఱ్ఱములను. వేసడములన్ = కంచరగాడిదలను. కరులన్ = ఏనుఁగులను. (ఎక్కి) తోన్ = తమవెంట. అరుగుదేరన్ = రాఁగా. బహువిధాయుధములు = అనేకవిధములయిన యాయుధములను. తాల్చి = ధరించి. సుభటకోటి = మంచిబంట్లగుంపు. తగిలి రాన్ = వెంబడించిరాఁగా. అంతఃపురాంగనలు = అంతఃపురస్త్రీలు. సితాంబుజాక్షుకడకున్ = తెల్లదామరలవంటికన్నులుగల శ్రీకృష్ణుని వద్దకు.
తా॥ గుఱ్ఱములను కంచరగాడిదలను ఏనుఁగులను ఎక్కి వేశ్యలు మొదలగువారు రాఁగా అనేకవిధములయిన ఆయుధములను బూని భటులు వెంబడించి రాఁగా అంతఃపురస్త్రీలు శ్రీకృష్ణమూర్తియొద్దకు వచ్చిరని తాత్పర్యము.

౨౧౨.—క॥ నారదుని మాధవుఁడు స । త్కారంబున వీడుకొలుప * నతఁడును హృదయాం
భోరుహమునఁ గృష్ణునకును । వారక మ్రొక్కుచును వెస ది * వంబున కరిగెన్.

టీ॥ మాధవుఁడు = కృష్ణుఁడు. నారదునిన్ = నారదమహామునిని. సత్కారంబునన్ = గౌరవముతో. వీడుకొలుపన్ = పంపఁగా. అతఁడును = ఆనారదుఁడును. హృదయాంభోరుహమునన్ = మనఃకమలమునందు. (కృష్ణునకు) వారక = నిలువక. (మ్రొక్కుచును) దివంబునకున్ = స్వర్గమునకు. వెసన్ = వడిగా. అరిగెన్ = పోయెను.
తా॥ అప్పుడు శ్రీకృష్ణమూర్తి నారద మహామునిని సన్మానించి సెలవిచ్చి పంపఁగా అతఁడును తనమనసునందు శ్రీకృష్ణునిఁదలఁచి నమస్కరించుచు దేవలోకమునకుఁబోయెనుఅనితాత్పర్యము. వ॥ అంత.

౨౧౩.—క॥ నరవరుల దూతయును ముర । హరుచే నభయప్రదాన * మంది ధరిత్రీ
వరులకడ కేగి పద్మో । దరువచనము సెప్పి సమ్మ * దంబునఁ దేల్చెన్.

టీ॥ నరవరులదూతయున్ = రాజులుపంపినదూతయు. మురహరుచేన్ = శ్రీకృష్ణునిచేత. అభయప్రదానము = భయములేదనుమాట యొక్కయీవిని. అంది = పొంది. ధరిత్రీవరులకడకున్ = రాజులవద్దకు. ఏగి = పోయి. పద్మోదరువచనము = కృష్ణునిమాటను. (చెప్పి) సమ్మదంబునన్ = సంతోషమునందు. తేల్చెన్ = తేలునట్లు చేసెను.
తా॥ జరాసంధుని చెఱలోఁదగులుకొన్న రాజులచేత పంపఁబడిన దూత కృష్ణునివలనభయపడవలదనునమ్మకపుమాటనుపుచ్చుకొని ఆరాజులవద్దకుపోయికృష్ణుఁడిట్లుచెప్పెననిచెప్పి వారినిసంతోషపెట్టెననితా.

౨౧౪.—వ॥ అంతఁ గృష్ణుండు నిజకాంతాతనయ బంధు సుహృజ్జనసహితుండై కదలిచను నెడ.

టీ॥ అంతన్ = అంతట. (కృష్ణుండు) నిజకాంతా...తుండై— నిజ = తనయొక్క. కాంతా = భార్యలతోడను. తనయ = కొడుకులతోడను. బంధు = చుట్టములతోడను. సుహృజ్జన = స్నేహితులతోడను. సహితుండై = కూడుకొన్నవాఁడై (కదలి) చనునెడన్ = పోవునప్పుడు.
తా॥ అంతట శ్రీకృష్ణమూర్తి తనభార్యలుకొమాళ్లుచుట్టములుచెలికాండ్రు మొదలగువారితోఁగూడ బయలుదేఱిపోవునప్పుడనితా.

౨౧౫.—చ॥ కటపట రత్నకంబళ ని * కాయ కుటీరము లుల్లసిల్ల ను
త్కటపటు చామరధ్వజ ప * తాక కిరీట సితాతపత్ర వి
స్ఫుట ఘనహేతి దీధితి న * భోమణిఁ గప్పఁగఁ దూర్య ఘోషముల్
చటుల తిమింగిలోర్మిరవ * సాగర ఘోషము నాక్రమింపఁగన్.

తా॥ శంఖములు మ్రోఁగఁగాను, పాఠకులు కీర్తనలు పాడి పొగడఁగాను వినుచు కృష్ణుని సేవింపవలెనను తలఁపుతో మిక్కిలి సంతోషించుచు ఆకృష్ణునికి ఎదుర్కోలుచేయవచ్చెనని తాత్పర్యము.

వ॥ అట్లుచనుదెంచి ధర్మనందనుండు సమాగతుండైన సరోజనాభునిం బెద్దతడవు గాఢాలింగనంబుచేసి రోమాంచ కంచుకిత శరీరుండై యానందబాష్ప ధారాసిక్త కపోలుండై నిర్భరానంద కందళిత హృదయారవిందుండై బాహ్యంబు మఱచియుండె నప్పుడు హరివాయునందనవాసవతనూభవులం గౌఁగిటంజేర్చి సమ్మదంబంది మాద్రే యులు దండప్రణామంబు లాచరించిన సత్కరించి యప్పుండరీకాక్షుండు విప్ర వృద్ధ జనంబుల నమస్కారం బులుసేసి వారలుగావించు వివిధార్చనలంబరితుష్టుండై కేకయసృంజయాది భూవిభులమన్నించి సూతమాగధా దుల కనేక పదార్థంబు లొసంగి చతురంగ బల సమేతుండై వివిధ మణి తోరణాది విచిత్రా లంకృతంబు నతి వైభవో పేతంబు నైన పురంబు ప్రవేశించి రాజమార్గంబునం జనుచుండఁ బౌరకామిను లట్టియెడ.

టీ॥ అట్లు=ఆవిధముగా. చనుదెంచి=వచ్చి. ధర్మనందనుండు= ధర్మరాజు. సమాగతుండైన=వచ్చిన. సరోజనాభునిన్ = శ్రీకృష్ణ మూర్తిని. పెద్దతడవు=చాలసేపు. గాఢాలింగనంబుచేసి=బిగ్గరఁ గౌఁగిలించుకొని. రోమాంచకంచుకితశరీరుండై—రోమాంచ=గగు ర్పాటుచేత. కంచుకిత = కవచముగాఁ జేయఁబడిన. శరీరుండై= దేహముగలవాఁడై. ఆనందబాష్ప ధారాసిక్తకపోలుండై—ఆనంద= సంతోషమువల్లనైన. బాష్ప=కన్నీళ్లయొక్క. ధారా=దారలచేత. సిక్త=తడుపఁబడిన. కపోలుండై = చెక్కిళ్లుగలవాఁడై. నిర్భ ... విందుండై—నిర్భర=భరింపరాని. ఆనంద=సంతోషముచేత. కంద ళిత=వికాసమునొందిన. హృదయారవిందుండై=మనఃకమలముగల వాఁడై. బాహ్యంబు = బయటివిషయములను — ప్రపంచవ్యాపార ములను. (మఱచియుండెను అప్పుడు) హరి = కృష్ణుఁడు. వాయు నందనవాసవతనూభవులన్ = భీముని అర్జునుని. కౌఁగిటంజేర్చి= కౌఁగిలించుకొని. సమ్మదంబంది = సంతోషమునుపొంది. మాద్రే యులు=మాద్రికొడుకులు — నకులసహదేవులు. దండప్రణామంబు లాచరించినన్=సాగిలఁబడిమ్రొక్కఁగా. సత్కరించి=సన్మానించి. అప్పుండరీకాక్షుండు=ఆకృష్ణుఁడు. విప్రవృద్ధజనంబులన్=బ్రాహ్మ ణులకునుపెద్దవారికిని. (నమస్కారంబులుచేసి) వారలు=ఆబ్రాహ్మ ణులును ముసలివాండ్రును. కావించువివిధార్చనలన్ = చేయునట్టి బహువిధములయిన మర్యాదలచేత. పరితుష్టుండై = సంతోషించిన వాఁడై. కేకయసృంజయాదిభూవిభులన్ = కేకయుఁడు సృంజ యుఁడుమొదలగురాజులను. (మన్నించి) సూతమాగధాదులకున్= సూతులు మాగధులు మొదలగువారికి. అనేకపదార్థంబులు=పెక్కు వస్తువులు. ఒసంగి=ఇచ్చి. చతురంగబలసమేతుండై = నాలుగంగ ములుగల బలములతోఁ గూడుకొన్నవాఁడై. వివిధమణితోరణాది విచిత్రాలంకృతంబును—వివిధ = నానావిధములయిన. మణి=రత్న మయములైన. తోరణ = తోరణములు. ఆది = మొదలుగాఁగల. విచిత్ర=వింతవింతలైన. అలంకృతంబును = అలంకారములఁ జేయఁ బడినదియు. అతివైభవోపేతంబును=మిక్కిలివైభవముతోఁ గూడు కొన్నదియు. ఐనపురంబు=అయినట్టియింద్రప్రస్థపట్టణమును. ప్రవే శించి = చొచ్చి. రాజమార్గంబునన్ = పెద్దబాటయందు. చను చుండన్ = పోవుచుండఁగా. పౌరకామినులు=పురస్త్రీలు. అట్టి యెడన్=ఆసమయమునందు.

తా॥ ఆవిధముగా ధర్మరాజు ఎదుర్కోలుచేసి తమ్ముచూడ వచ్చిన శ్రీకృష్ణమూర్తిని చాలసేపు బిగ్గరఁగౌఁగిలించుకొని దేహ మంతయు గగుర్పాటుచేత నిండుకొనఁగా ఆనందబాష్పములచేత చెక్కిళ్లుతడియఁగా మిక్కిలి సంతోషించిన మనస్సుగలవాఁడై బయటివ్యాపారములన్ని తోఁచని స్థితిలోనుండెను, అప్పుడుశ్రీకృష్ణ మూర్తి భీమార్జులను కౌఁగిలించుకొని, నకుల సహదేవులు సాగిలఁ బడిమ్రొక్కఁగా వారినిసన్మానించి, తక్కినబ్రాహ్మణులకునుముసలి వాండ్రగు పెద్దలకును తాను మ్రొక్కి, వారిచేత దీవనలుపడసి, కేక యుఁడు సృంజయుఁడు మొదలుగాఁగల రాజులను తగురీతినిసన్మా నించి, తన్ను పొగడుచున్న సూతులు మాగధులు మొదలగువారికి కోరినవస్తువు లిచ్చి సంతోషపెట్టి, నాలుగంగములుగల సేనలతోడ కదలి, నానావిధములయినరత్నములతోరణములు కట్టుటమొదలగు వింతవింతలైన అలంకారములు చేయఁబడియున్న ఆయింద్రప్రస్థపట్ట ణమునందుప్రవేశించి అందలి పెద్దబాటనుపోవుచుండఁగా పట్టణము నందలి స్త్రీలు అప్పుడు ఏమిచేసిరనఁగా నని తాత్పర్యము.

౭౨౧.—సీ॥ కొలనెలపైఁ దోఁచు * నిరులునాఁ జెలువొంది - నాసలిపై గురులు తుం * పెసలు గునియ
హాటక మణిమయ * తాటంక రోచులు - గండభాగంబున * గంతులిడఁగ
స్ఫురిత విద్రుమ నిభా * ధర బింబ రుచితోడ - దరహాస చంద్రిక * సరసమాడ
నొండొంటి తోరాయు * నుత్తుంగ కుచకుంభ - ములు మొగంబులకును * బుటములెగయ

తే॥ బడుగు నడుములు వడఁకంగ * నడుగులిడుచు । రమణ మట్టెలుమణి నూపు * రములు మొరయఁ
బొల్చు కచబంధములు భుజం * బుల నటింపఁ । బయ్యెదలు వీడియాడ సం * భ్రమముతోడ.

టీ॥ కొలనెలపైన్ = అర్ధచంద్రబింబముమీఁద. తోఁచునిరు లునాన్ = కానవచ్చునట్టి చీఁకట్లో అనునట్టుగా. చెలువొంది= అందగించి. నాసలిపైన్ = నాసటిమీఁద. కురులు = ముందటిపాడె వెండ్రుకలు. తుంపెసలుగునియన్=కదలియాడుచుండఁగా. హాటక

మణిమయతాటంకరోచులు = రత్నములుపొదిఁగిన బంగారుకమ్మల కాంతులు. గండభాగంబునన్ = చెక్కిటిప్రదేశమునందు. గంతులిడఁగన్ = తళతళలాడుచుండఁగా. స్ఫురితవిద్రుమనిభాధరబింబరుచితోడన్=ప్రకాశించునట్టి పగడమునుబోలినదొండపండువంటి పెదవులకాంతితో. దరహాసచంద్రిక=చిఱునవ్వు అనెడువెన్నెల. సరసమాడన్ = వినోదింపఁగా. ఒండొంటితోన్ = ఒకదానితోనొకటి. రాయు=ఒరసికొనునట్టి. ఉత్తుంగకుచకుంభములు=మిక్కిలి ఉబ్బుగా నుండు స్తనకలశములు. మొగంబులకున్=ముఖములతట్టునకు. పుటము లెగయన్=పుట్టచెండ్లవలెఎగయుచుండఁగా. బడుగునడుములు=బలహీనములయిననడుములు. వడఁకంగన్ = అల్లలాడఁగా. అడుగులిడుచున్=అడుగులెత్తిపెట్టుచు. రమణన్=మనోజ్ఞముగా. మట్టెలు=మెట్టెలును. మణినూపురములును=రత్నమయములయిన అందెలును. మొరయన్=మ్రోఁగఁగా. పొల్చు=ఒప్పునట్టి. కచబంధములు=తలవెంట్రుకల కీలుగంట్లు. భుజంబులన్=బుజముల మీఁద. నటింపన్ = నాట్యమాడుచుండఁగా — అంటిచలించుచుండఁగా. పయ్యెదలు = పైఁటలు. వీడియాడన్ = జాఱిప్రేలాడఁగా. సంభ్రమముతోడన్=త్వరతో.

తా॥ అర్ధచంద్రబింబమును ఆవరించిన చీఁకట్లవలెనాసల్లయందు ముంగురులు చలింపఁగాను, రత్నములు పొదిఁగిన బంగారుకమ్మల కాంతులు చెక్కిళ్లపై వ్యాపింపఁగాను, ప్రకాశించునట్టి పగడముల వలెను దొండపండ్లవలెను ఒప్పునట్టి పెదవులకాంతులు వెన్నెలలను బోలిన చిఱునవ్వులతో కలిసికొని యొప్పఁగా, పుట్టచెండ్లవలె స్తనకలశములు మొగముతట్టునకు నిక్కుచుండఁగాను, సన్ననినడుములు చలింపఁగాను, కాలిమెట్టెలును అందెలును మనోజ్ఞముగాధ్వనింపఁగాను, పైఁటలు జాఱి ప్రేలాడఁగాను, తిన్నతినడలతో త్వరపడుచున్నవారలైయని తాత్పర్యము.

౭౨౨.—వ॥ అట్లు కృష్ణ సందర్శన కుతూహల పరస్పరాహూయమానలై గురుపతిసుత బంధుజనంబులు
వారింప నతిక్రమించి సమున్నతభర్మహర్మ్యశిఖరాగ్రంబు లెక్కి-కృష్ణుంజూచి తమలోనిట్లనిరి.

టీ॥ (అట్లు) కృష్ణ...మానలై — కృష్ణసందర్శన = కృష్ణునిఁ జూచుటయందలి. కుతూహల=వేడుకచేత. పరస్పర = ఒండొరులచేత. ఆహూయమానలై = పిలువఁబడుచున్నవారై. గురుపతిసుతబంధుజనంబులు—గురు = తల్లిదండ్రులు. పతి=పెనిమిట్లు. సుత = కొడుకులు. బంధు=చుట్టములునైన. జనంబులు=జనులు. వారింపన్=నిలువరింపఁగాను. అతిక్రమించి = వారిమాటలనుమీఱి. సమున్నతభర్మహర్మ్యశిఖరాగ్రంబులు—సమున్నత = మిక్కిలి పొడవులయిన. భర్మ=బంగారుమయములయిన. హర్మ్య=మేడలయొక్క. శిఖర=శిఖరములయొక్క. అగ్రంబులు=మీఁదిభాగములను. (ఎక్కి కృష్ణుం జూచి) తమలోన్=తమలోఁదాము. ఇట్లనిరి=ఇట్లుపలికిరి.

తా॥ ఆవిధముగా కృష్ణునిఁ జూచుటయందలి వేడుకచేత ఒకరినొకరు పిలుచుకొనుచు కదలి తల్లిదండ్రులు మగలు కొడుకులు చుట్టములు నగు తమవారందఱు పోవలదని నిలువరించినను నిలువక మిగుల పొడుగులయిన మేడలమీఁది భాగములపైకి యెక్కి కృష్ణమూర్తినిఁ జూచి తమలోఁదాము ఇట్లు చెప్పుకొనసాగిరి అని తా.

౭౨౩.—సీ॥ విశ్వగర్భుండు నా ✻ వెలయు వేల్పిల యశో - దానందులకుఁ బ్రియ ✻ సూనుఁడయ్యె
బ్రహ్మాదిసురులకు ✻ భావింపఁగారాని - బ్రహ్మంబు గోపాల ✻ బాలుఁడయ్యె
వేదశాస్త్రంబులు ✻ వెదకి కానఁగ లేని - గట్టి వ్రేతలఱోలఁ ✻ గట్టువడియె
దివిజుల కమృతంబు ✻ దివిరియిచ్చిన భక్త - సులభుండు నవనీత ✻ చోరుఁడయ్యె

తే॥ నెనయఁ గమలాసతికిఁ జిత్త ✻ మీనివేల్పు । గొల్లయిల్లాండ్ర యుల్లము ✻ ల్పల్లవింపఁ
జేసె నని కామినులు సౌధ ✻ శిఖరములను । గూడి తమలోన ముచ్చట ✻ లాడి రధిప.

టీ॥ అధిప=రాజా. విశ్వగర్భుండు నాన్=ప్రపంచము కడుపునందుఁగలవాఁడుఅనఁగా. వెలయువేల్పు=ప్రసిద్ధినొందుదేవుఁడు. ఇలన్=భూమియందు. యశోదానందులకున్=యశోదకును నందునికిని. ప్రియసూనుఁడయ్యెన్=ప్రియమయినకొడుకయ్యెను. బ్రహ్మాదిసురులకున్=బ్రహ్మ మొదలగు దేవతలకు. భావింపఁగాన్=తెలిసికొనను. రాని=శక్యముగాని. బ్రహ్మంబు=పరబ్రహ్మము. గోపాలబాలుఁడు=గొల్లచిన్నవాఁడు. అయ్యెన్=ఆయెను. వేదశాస్త్రంబులు=వేదములునుశాస్త్రములును. వెదకి=విమర్శముగాపరీక్షించి. కానఁగలేనిగట్టి = తెలిసికోఁజాలని దృఢస్వరూపుఁడు. వ్రేతలఱోలన్ = గొల్లయిల్లాండ్ర ఱోటియందు. కట్టువడియెన్ = కట్టివేయఁబడెను. దివిజులకున్=దేవతలకు. అమృతంబు=అమృతమును. తివిరి=ప్రయత్నపడి. ఇచ్చిన=ఇచ్చినట్టి. భక్తసులభుండు = సేవకులకు తేలికగా లభించువాఁడు, నవనీతచోరుఁడయ్యెన్ = వెన్నదొంగయయ్యెను. ఎనయన్=కూడఁగా. కమలాసతికిన్ = లక్ష్మీదేవికి. చిత్తము=మనస్సును. ఈనివేల్పు = ఇయ్యనిదేవుఁడు. గొల్లయిల్లాండ్రయుల్లములు=గోపికాస్త్రీలమనసులు. పల్లవింపఁజేసెన్=వికాసము నొందునట్లుగాఁజేసెను. (అని) కాములు=పురస్త్రీలు. సౌధశిఖరములను=మేడలమీఁద. కూడి=గుంపులుగూడుకొని. తమలోనన్=తమలోతాము. ముచ్చటలాడిరి=వినోదముగ మాటలాడిరి.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! ఇతఁడు సమస్తప్రపంచమును కడుపునం దుంచుకొనువాఁడు యశోదకు నందునకును కొడుకై మెలఁగెను, బ్రహ్మ మొదలుగాఁగల దేవతలకుఁగూడ ఇట్టివాఁడని తెలిసికోఁగూడనివాఁడై యుండియు గొల్లపిల్లకాయయై యుండెను, వేదములు శాస్త్రములును చక్కగా విచారించియుఁ గానలేని దృఢస్వరూపము గలవాఁడుగానుండియు గొల్లవారియింటిఱోటయశోదచేత కట్టుపడెను, అసురులు అపహరించి పుచ్చుకోఁదలఁచిన అమృ

తమను దేవతలకు ఇప్పించినవాఁడైయుండియు వెన్నసుదొంగిలించు వాఁడయ్యెను, తనతోఁ గూడునపుడు శ్రీలక్ష్మీదేవికైన మనసియ్యక మెలఁగు మహాత్ముఁడు గోపికాస్త్రీలమనసులకెక్క నడచుకొనెను అని యీవిధముగా ఆపురస్త్రీలందఱు మేడలమీఁదఁజేరి కృష్ణమూర్తిని జూచి ఒకరితోనొకరు చెప్పుకోసాగిరి అని తాత్పర్యము.

వ॥ మఱియును.

౨౨౮.—సీ॥ గోపాల బాలురఁ * గూడి యాడెడి నాడు - వ్రేపల్లె లోపల * నేపు రేఁగి
చల్లలమ్మఁగఁబోవు * సతులకొంగులుపట్టి - మెఱుఁగుఁ జెక్కిళ్లపై * మీఁటిమీఁటి
కలికియై ముద్దాడఁ * గౌఁగిటఁ జేర్చిన - పూఁబోఁడి కుచములు * పుడికి పుడికి
పాయని యనురక్తి * డాయఁజీరిన యింతి - యధరసుధారసం * బానియాని
తే॥ యురుసమాధి పరాష్టాంగ * యోగయుక్తు । లైనయోగీశ్వరులు గాన * నట్టిజెట్టి
వల్లవీజన నవకల్ప * వల్లియయ్యె । ననుచుఁ బొగడిరి కృష్ణు న * య్యబ్జముఖులు.

టీ॥ గోపాలబాలురన్=గొల్లపిల్లకాయలను. (కూడి) ఆడెడునాడు=క్రీడించునప్పుడు. వ్రేపల్లెలోపలన్ = గొల్లపల్లెలో. ఏపురేఁగి=మిక్కిలివిజృంభించి. చల్లలు=మజ్జిగ. అమ్మఁగఁబోవు = విక్రయింపఁబోవునట్టి. సతుల=స్త్రీలయొక్క. కొంగులు=పైఁటచెఱఁగులను. (పట్టి) మెఱుఁగుఁజెక్కిళ్లపైన్=తళతళలాడునట్టి చెక్కిళ్లయందు. మీఁటిమీఁటి=చెనకిచెనకి. కలికియై = మనోజ్ఞురాలయి. ముద్దాడన్ = ముద్దులాడుటకు. కౌఁగిటఁజేర్చిన పూఁబోఁడికుచములు = కౌఁగిలించుకొన్న స్త్రీయొక్క స్తనములను. పుడికిపుడికి=పట్టిపట్టిచూచి. పాయనియనురక్తిన్ = తొలఁగని యనురాగముచేత. డాయన్=సమీపింపఁగా. చీరినయింతి=పిలిచిన స్త్రీయొక్క. అధరసుధారసంబు=మోవిపానకమును. ఆనియాని=త్రాగిత్రాగి. ఉరుసమాధిపరాష్టాంగ యోగయుక్తులు—ఉరు=గొప్పలైన. సమాధి=నిర్వికల్పము మొదలైన షడ్విధసమాధులతోడను. పర=యోగాభ్యాసులకుముఖ్యములైన. అష్టాంగయోగ=యమనియమాద్యష్టాంగయోగములతోడను. యుక్తులు = కూడుకొన్నవారు. ఐనయోగీశ్వరులు=అయినట్టియోగులలో శ్రేష్ఠులు—బ్రహ్మనిష్ఠులు అనుట. కాన నట్టిజెట్టి=చూడఁజాలనిఘనుఁడు. వల్లవీజననవకల్పవల్లియయ్యెన్=గోపికాస్త్రీలకుక్రొత్తదైన కల్పవృక్షమయ్యెను. అనుచున్ = అని. అయ్యబ్జముఖులు = ఆపురస్త్రీలు. (కృష్ణుని పొగడిరి)

తా॥ వ్రేపల్లెలో గొల్లపిల్లకాయలతోఁగూడి ఆటలాడుచున్న కాలమునందు మజ్జిగ అమ్మఁబోవుచున్న గొల్లపడుచుల పైటలు పట్టి లాగి వారిచెక్కిళ్లను నొక్కియు, మిక్కిలిమనోజ్ఞురాలైన ఒకతె తన్నుముద్దులాడఁజేరఁబిలిచి కౌఁగిలించుకొనఁగా దాని స్తనములను పట్టి చూచియు, మిక్కిలి ప్రేమచేత దగ్గఱ రమ్మని పిలిచిన మఱియొకగోపిక మోవినొక్కియు, బహుకాలము శ్రమపడి అష్టాంగయోగము లభ్యసించి సమాధినిష్ఠులైయుండు యోగీశ్వరులకుఁ గూడచిక్కనిపరబ్రహ్మము గోపికాస్త్రీలపాలికి క్రొత్తకల్పవృక్షమో అనునట్లు వర్తించెనని ఆపురస్త్రీలు కృష్ణుని పొగడిరనితాత్పర్యము.

౨౨౯.—మ॥ అని యిబ్భంగి సరోజలోచనలు సౌ * ధాగ్రంబులందుండి య
వ్వనజాతాక్షుని దివ్యమూర్తిఁ దమభా * వాలందు గీలించి సం
జనితానంద రసాబ్ధిమగ్ను లగుచున్ * సంప్రీతిఁ దద్భవ్య కీ
ర్తనలై చల్లిరి నవ్యలాజములు మం * దార ప్రసూనావలుల్.

టీ॥ (అని)ఇబ్భంగిన్=ఈవిధముగా. సరోజలోచనలు=స్త్రీలు. సౌధాగ్రంబులందుండి=మేడలమీఁదనుండి. అవ్వనజాతాక్షునిదివ్యమూర్తిన్=అప్రాకృతమయినఆకృష్ణుని ఆకృతిని. తమభావాలందుఁ గీలించి=తమమనసులలోఁజేర్చి. సంజనితానందరసాబ్ధిమగ్నులు = పుట్టిన సంతోషరససముద్రమునందు మునిఁగినవారు. అగుచున్= అవుచును. సంప్రీతిన్=మిక్కిలిఅనురాగముతో. తద్భవ్యకీర్తనలై= ఆతనిసంబంధమయిన శ్లాఘ్యములయిన కీర్తనలు పాడుచున్నవారై. నవ్యలాజములు = క్రొత్తవరిపేలాలను. మందారప్రసూనావలులు= కల్పవృక్షపు పువ్వులను. (చల్లిరి)

తా॥ అని యీవిధముగా ఆస్త్రీలు మేడలమీఁదనుండి శ్రీకృష్ణమూర్తియొక్క అప్రాకృతమైన ఆకారమునుజూచి తమమనసులలో ఆమూర్తినినిలుపుకొని సంతోషమనుసముద్రమునందుమునిఁగితేలుచు మిక్కిలిప్రీతితోఆయనచరిత్రములను దెలుపునట్టికీర్తనములుపాడుచు క్రొత్తలైన వరిపేరుగులను, కల్పవృక్షపు పువ్వులనుచల్లిరి అని తా.

వ॥ తదనంతరంబున శోభనపదార్థంబులు గొనివచ్చి ధరామర ధరావర వణిక్పుంగవులు దామోదరునకుఁ గానుకలు సమర్పించిరి పుణ్యాంగనాజనంబులు పసిండిపళ్లెరంబులఁ గర్పూరనీరాజనంబులు నివాళింప నంతఃపురంబు సొత్తెంచె నంతఁ గుంతిభోజనందనయుం గృష్ణునింగని పర్యంకంబుడిగ్గి కౌఁగిలింప నాయదువల్లభుండు మేనత్తకు దండప్రణామంబాచరించెఁ బాంచాలియుముకుందునకు నభివందనంబొనరించె నంతఁ గుంతిపంపున ద్రౌపదిగోవిందు భామినులగు రుక్మిణి మొదలగువారికి గంధాక్షత కుసుమతాంబూలంబులిడి లలితదుకూల మణిభూషణంబులం బూజించె యుధిష్ఠిరుండును గమలనయనునివధూజనుల ననుగతబంధుమిత్రపుత్ర సచివ పురోహిత పరిచారికానికరంబుల నుచితస్థలంబులవిడియింపనియమించి దినదినప్రవర్ధమానాభినవ వివిధోపచారంబులు గావించె నంత.

టీ॥ తదనంతరంబునన్ = అటుపిమ్మట. ధరామర...వులు — ధరామర=బ్రా[redacted]ణులును. ధరావర=రాజులును. వణిక్=వైశ్యులు నైన. పుంగవులు=పురుషశ్రేష్ఠులు. శోభనపదార్థంబులు=మంగళద్రవ్యములను. కొనివచ్చి=తీసికొనివచ్చి. దామోదరునకున్=శ్రీకృష్ణునకు. (కానుకలుసమర్పించిరి) పుణ్యాంగనాజనంబులు=ముత్తైదువలు. పసిండిపళ్లెరంబులన్ = బంగారుపళ్లెములందు. కర్పూరనీరాజనంబులు=కర్పూరపుహారతులు. నివాళింపన్=దిగదుడువఁగా. అంతఃపురంబు=లోపలిగృహమును. చొత్తెంచెన్=ప్రవేశించెను. అంతన్=అప్పుడు. కుంతిభోజనందనయు=కుంతీదేవియు. కృష్ణునింగని=కృష్ణమూర్తినిజూచి. పర్యంకంబుడిగ్గి=పానుపునుండిదిగి. కౌఁగిలింపన్=ఆలింగనముచేసికొనఁగా. ఆయదుపుల్లభుండు=ఆయదువంశశ్రేష్ఠుఁడయినకృష్ణుఁడు. మేనత్తకున్=తనతండ్రితోడఁబుట్టినదైనకుంతికి. దండప్రణామంబు = చాఁగిలఁబడి మ్రొక్కుటను. ఆచరించెన్ = చేసెను. పాంచాలియున్=ద్రౌపదియు. ముకుందునకున్=కృష్ణునకు. అభివందనంబొనరించెన్=నమస్కరించెను. అంతన్=అటుపిమ్మట. కుంతిపంపునన్=కుంతీదేవియొక్క ఉత్తరువుచేత. (ద్రౌపతి) గోవిందుభామినులు=కృష్ణునిభార్యలు. (అగురుక్మిణిమొదలగువారికి) గంధాక్షతకుసుమతాంబూలంబులు = చందనము మొదలగు పరిమళద్రవ్యములు అక్షతలుపువ్వులుతాంబూలములను. ఇడి=ఉంచి—ఇచ్చి. లలితదుకూలమణిభూషణంబులన్ = ఒప్పిదములయిన నిర్మలవస్త్రములచేతను, రత్నమయములైన ఆభరణములచేతను. (పూజించెను) యుధిష్ఠిరుండును = ధర్మరాజును. కమలనయనునివధూజనులన్= కృష్ణునిభార్యలను. అనుగత...నికరంబులను—అనుగత=ఆకృష్ణుని ననుసరించివచ్చిన. బంధు=చుట్టములు. మిత్ర=చెలికాండ్రు. పుత్ర=కొడుకులు. సచివ = మంత్రులు. పురోహిత = పురోహితులు. పరిచారికా=దాసీజనులునైన. నికరంబులన్=సమూహములను. ఉచితస్థలంబులన్=తగినతావులందు. విడియింపన్ = నిలుపునట్లు. నియమించి=ఆజ్ఞాపించి. దినదినప్రవర్ధమానాభినవవివిధోపచారంబులు=నానాటవృద్ధిపొందుచున్న క్రొత్తలైన నానావిధములయిన ఉపచారములను. కావించెన్=చేయించెను. అంతన్=అంతట.

తా॥ పిమ్మట బ్రాహ్మణులును, రాచవారును, వైశ్యులును, తమతమకుఁదగిన మంగళవస్తువులను తీసికొనివచ్చి శ్రీకృష్ణమూర్తికి కానుకలిచ్చిరి ముత్తైదువలు బంగారుపళ్లెరములలోకర్పూరపుహారతులిచ్చిరి, కృష్ణుఁడు వానినెల్లను అంగీకరించుచును అంతఃపురము ప్రవేశించి అచ్చట కుంతీదేవి పానుపునందుండి లేచివచ్చి కౌఁగిలించుకొని ఆదరింపఁగా ఆమెకు చాఁగిలఁబడి మ్రొక్కి అట్లు తనకు మ్రొక్కిన ద్రౌపదిని ఆదరించెను, అంతట ద్రౌపది తనయత్తగారి ఉత్తరువుచొప్పున రుక్మిణి మొదలగు కృష్ణునిభార్యలకు గంధపుష్పాదులు ఇచ్చి నిర్మలవస్త్రములచేత రత్నమయములైన ఆభరణములచేతను అర్చించెను, ధర్మరాజును కృష్ణునిభార్యలను అతనివెంటవచ్చిన చుట్టములు మొదలగువారిని వారివారికి తగిన విడుదులలో విడియునట్లుగాఁ జేసి నానాట వారికందఱికి విశేషములయిన ఉపచారములను మిక్కిలిగాఁ జేయించుచుండెననితాత్పర్యము.

౭౨౭.—క॥ హరియు యుధిష్ఠిరు సముచిత । పరిచర్యల కాత్మనలరి ✻ పార్థుఁడు దానున్
సరసవిహార క్రియలను । సురుచిరగతిఁ గొన్ని నెలలు ✻ సుఖముండె నృపా

టీ॥ నృపా=రాజా. హరియున్=కృష్ణుఁడును. యుధిష్ఠిరుసముచితపరిచర్యలకున్ = ధర్మరాజుయొక్క తగిన ఉపచారములకు. ఆత్మన్=మనసునందు. అలరి=సంతోషించి. పార్థుఁడును=అర్జునుఁడును. (తానును) సరసవిహారక్రియలను = సరసములయిన వినోదసంచారకార్యములచేత. సురుచిరగతిన్=మనోజ్ఞమయినవిధమున. (కొన్ని నెలలు) సుఖముండెన్ = సుఖముగ వసించి యుండెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణమూర్తియుధర్మరాజునానాటచేయునట్టి విశేషములయిన ఉపచారములకు మనసునందు ఆనందించి అర్జునునితోఁ గూడుకొని వినోదముగా సంచరించుచు కొన్ని నెలలు ఇంద్రప్రస్థ పట్టణములో జరపెనని తాత్పర్యము.

౭౨౮.—సీ॥ ధరణీశ యొకనాఁడు ✻ ధర్మతనూజుండు - ప్రవిమల నిజసభా ✻ భవనమందు
హితులు మంత్రులు పురో ✻ హితులును సుతులును - మిత్రులు బంధువుల్ ✻ క్షత్రవరులు
పరిచారకులు సూత ✻ పాఠక కవి బుధ - వరులును మునులును ✻ వరుసఁ గొలువఁ
జిరలీల నవరత్న ✻ సింహాసనస్థుఁడై - కొలువుండి వినతుఁడై ✻ నలిననాభు
తే॥ భువన రక్షణదక్షు న ✻ ద్భుతచరిత్రు । యదుకులేశ్వరు మురదైత్య ✻ మదవిభేది
నాప్తునయవేదిఁ జతురుపా ✻ య ప్రవీణుఁ । జూచి యిట్లని పలికె న ✻ స్తోకచరిత.

టీ॥ ధరణీశ = ఓరాజా. ఒకనాడు = ఒకదినము. ధర్మతనూజుండు=ధర్మరాజు. ప్రవిమలనిజసభాభవనమందున్ = నిర్మలమైన తనసభామండపమునందు. హితులు = ఆప్తులును. (మంత్రులు పురోహితులును) సుతులును=కొడుకులును. మిత్రులును=స్నేహితులును. బంధువులు = చుట్టములును. క్షత్రవరులును=రాజశ్రేష్ఠులును. పరిచారకులును=సేవకులును. సూతపాఠకకవిబుధవరులును = వంశావళియుగ్గడించువారు పాటలుపాడువారుకవులు పండితశ్రేష్ఠులును. (మునులును) వరుసన్ = క్రమముగా. కొలువన్ = సేవింపఁగా. చిరలీలన్=శాశ్వతమైనవిలాసముతో. నవరత్నసింహాసనస్థుఁడై = తొమ్మిదివిధములరత్నములనుపొదిఁగినసింహాసనమునందుఁగూర్చున్నవాఁడై. కొలువుండి = కచ్చేరిచేయుచుండి. వినతుఁడై = మిక్కిలి వంగినవాఁడై—మిక్కిలి యడఁకువతోననుట. నలిననాభున్=నాభియందు కమలముగలవాఁడును. భువనరక్షణదక్షున్ = లోకమును రక్షించుటకు చాలినవాఁడును. అద్భుతచరిత్రున్=ఆశ్చర్యకరమైన

నడవళ్లుగలవాఁడును. యదుకులేశ్వరుఁ=యాదవవంశప్రభువును. మురదైత్యమదవిభేదిఁ = మురాసురుని మదమును అణఁగఁగొట్టినవాఁడును. ఆప్తుఁ=తనకుమిక్కిలికావలసినవాఁడును. నయవేదిఁ=నీతి తెలిసినవాఁడును. చతురుపాయప్రవీణుఁ = సామదాన భేద దండములనెడు నాలుగు ఉపాయములందును సమర్థుఁడునునైన. (శ్రీకృష్ణుని చూచి) అస్తోకచరితఁ=గొప్పనడవడితో. (ఇట్లని) పలికెఁ=ఈమీఁదఁ జెప్పఁబోవువిధమునఁ జెప్పెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! అంతట ఒకనాడు ధర్మరాజు నిర్మలమయిన తన సభామండపమునందు ఆప్తులు పురోహితులు మంత్రులు చుట్టములుమనులుమొదలుగాఁగలవారుఅందఱునువచ్చియుండఁగా కొలువుదీరి పద్మనాభుఁడును, వింతలైన చరిత్రములుగలవాఁడును, యదువంశశ్రేష్ఠుఁడును, మురాసురుని జంపినవాఁడును, నీతిమంతుఁడును, సామభేదాదులయిన ఉపాయములను ప్రయోగించురీతి తెలిసినవాఁడును, తనకు అప్తుఁడునైన శ్రీకృష్ణునిజూచి మిక్కిలి వినయముతో గొప్పనడవడిగలవాఁడగుచు ఇట్లు పలికెనని తాత్పర్యము.



(*) ధర్మరాజు శ్రీకృష్ణునితో రాజసూయ యజ్ఞంబుచేయ నాలోచించుట. (*)

౭౨౯.—తే॥ అనఘ చారిత్ర, రాజ సూ * యాధ్వరంబు । నెమ్మిఁగావించు వేడుక * నెమ్మనమున
నెనయుచున్నది యదినిర్వ * హింప నీవ । కాక నాకాత్మబంధువు * లగలరె యొరులు.

టీ॥ అనఘచారిత్ర = పాపములేని నడవడిగల ఓకృష్ణా. రాజసూయాధ్వరంబు = రాజసూయయజ్ఞము. నెమ్మిఁ = ప్రీతితో. కావించువేడుక = చేయవలెననుకోరిక. నెమ్మనమునఁ = మనసునందు. ఎనయుచున్నది = పొందుచున్నది-కలుగుచున్నది. అది

దానిని—ఆయజ్ఞమును. నిర్వహింపన్=నెఱవేర్చుటకు. నీవకాక = నీవేకాని. ఆత్మబంధువులు=సొంతపుచుట్టములు. (నాకు) ఒరులు= ఇతరులు. కలరె=కలరా.

తా॥ పరిశుద్ధమయిన నడవడిగల ఓకృష్ణా! నాకు రాజసూయయాగముచేయవలెనను తలఁపుకలదు దానిని నెఱవేర్చుటకు నీకంటె కావలసినచుట్టములు మఱియెవరును లేరు గదాయని తాత్పర్యము.

౨౩౦.—ఉ॥ ఎవ్వరు నీపదాంబుజము * లెప్పుడుఁ గొల్తురు భక్తినిష్ఠులై
యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతి * యింతురు భూరి వివేకశాలులై
యవ్విమలాత్ము లందుదురు * దంచిత శోభన నిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగఁ గృష్ణ నిను * నేర్చి భజించిన జీ ర్ణవోవునే.

టీ॥ (కృష్ణ) ఎవ్వరు = ఏజనులు. భక్తినిష్ఠులై=అనన్యభక్తిగలవారై. నీపదాంబుజములు = నీపాదకమలములను. ఎప్పుడును=ఎల్లప్పుడును. కొల్తురు = సేవింతురో. ఎవ్వరు=ఏజనులు. భూరివివేకశాలులై=అధికమైనవివేకముచేత ఒప్పినవారై. (నిన్ను) ప్రేమన్= ప్రీతితో. నుతియింతురు=పొగడుదురో. ఆవ్విమలాత్ములు = అటువంటి పరిశుద్ధమయిన మనసుగలవారు. ఉదంచితశోభననిత్యసౌఖ్యములు = మిక్కిలి ఒప్పిదములైనమేలులను — శాశ్వతములైన సుఖములను. నివ్వటిలంగన్ = అతిశయించునట్లుగా. అందుదురు = పొందుదురు. నినున్=నిన్ను. నేర్చి = కొలువఁదగినవిధము నెఱిఁగి. భజించినన్=కొలిచినపక్షమున. జీర్ణవోవునే=వ్యర్థమవునా.

తా॥ ఓశ్రీకృష్ణా! ఏమానవులు నీపాదసేవ సదాచేయుచుందురో ఏమనుష్యులు నిన్ను సదా కొనియాడుచుందురో అట్టి పరిశుద్ధమానసముగలమనుష్యులు మిక్కిలి యెక్కువలయిన మేలులను సుఖములను కొఱఁతలేక పొందుదురు నీతత్వము తెలిసి నిన్ను సేవించువారికి అందులఫలముకలుగక వ్యర్థమయిపోవునా అనితాత్పర్యము.

వ॥ అనినఁ గృష్ణుండు ధర్మనందనున కిట్లనియె.

౨౩౧.—చ॥ నయగుణశాలి పాండునృప * నందన నీతలఁపొప్పు నీక్రతు
క్రియ ముని దేవతా పితృ సు * కృత్యమునై నిఖిలోగ్రశాత్రవ
క్షయమును బాంధవప్రియము * సంచితపుణ్యము నిత్యకీర్తియున్
జయమును గల్గుదీనఁ గురు * సత్తమ వేగ ముపక్రమింపుమా.

టీ॥ నయగుణశాలి=నీతిగుణముచేత ఒప్పినవాఁడవు. పాండునృపనందన = పాండుమహారాజు కొడుకవునైన ఓధర్మరాజా. నీతలఁపు=నీవుతలఁచినపని. ఒప్పున్ = తగును. నీక్రతుక్రియ...కృత్యమునై—నీక్రతుక్రియ=నీవుచేయుయజ్ఞకార్యము. ముని=మునులకును. దేవతా=దేవతలకును. పితృ=పితృదేవతలకును. సుకృత్యమునై= మంచిపనియై. నిఖిలోగ్రశాత్రవక్షయమును=భయంకరులైనయెల్లపగవారియొక్కనాశమును. బాంధవప్రియమును=చుట్టములకుప్రీతియును. సంచితపుణ్యము=కూర్పఁబడినధర్మమును. నిత్యకీర్తియున్= శాశ్వతమయినయశస్సును. జయమున్=గెలుపును. దీనన్=ఈయజ్ఞకార్యముచేత. (కల్గును) కురుసత్తమ=కురువంశశ్రేష్ఠుఁడవైనఓధర్మరాజా. వేగము=శీఘ్రముగా. ఉపక్రమింపుమా=ఆరంభింపుమా.

తా॥ మేలైన నీతిగుణముచేత ఒప్పినవాఁడవును, పాండుమహారాజుకొడుకవునైనధర్మరాజా! నీవు తలఁచినపని మంచిది, ఈపనిచేత ఎల్లశత్రువులును నశింతురు, బంధువులందఱు సంతోషింతురు, మునులు దేవతలు పితృదేవతలును తృప్తినొందుదురు, మేలైన పుణ్యమును కీర్తియును దీనిచేతనే కలుగును, లోకమునందు జయమును గలుగును కాఁబట్టి ఓకురువంశశ్రేష్ఠుఁడవగు ధర్మరాజా నీవు దీనిని శీఘ్రముగ ఆరంభింపుమని తాత్పర్యము.

౨౩౨.—క॥ మనుచరిత నీసహోదరు । లనుపమ దివ్యాస్త్రవేదు * లాహవ భూమిన్
జెనకిన వైరి నృపాలురఁ । దునుమఁగఁ జాలుదురు శౌర్య * దుర్దమభంగిన్.

టీ॥ మనుచరిత = మనువుయొక్క నడవడివంటి నడవడిగలవాఁడా. నీసహోదరులు=నీతోడఁబుట్టువులు. అనుపమదివ్యాస్త్రవేదులు = ఈడులేని దివ్యములయిన అస్త్రముల నెఱిఁగినవారు. ఆహవభూమిన్ = యుద్ధభూమియందు. చెనకినవైరినృపాలురన్= ఎదిరించిన శత్రురాజులను. శౌర్యదుర్దమభంగిన్ = శూరత్వమును అణఁపరానిరీతితో. తునుమఁగన్=చంప. చాలుదురు=శక్తులగుదురు

తా॥ ఓధర్మరాజా! నీతమ్ములు ఈడులేని దివ్యములైన అస్త్రములన్ని అభ్యసించినవారుగనుక యుద్ధభూమియందు ఎదిరించిన పగ రాజులనందఱను అనాయాసముగాచంపి నీకు జయముకలుగఁ జేయఁజాలుదురని తాత్పర్యము.

౨౩౩.—క॥ గెలువుము విమతనృపాలుర । వెలయుము బుధవినుతమైన * విశ్రుత కీర్తిన్
నిలుపుము నిఖిలధరా మం । డలిని భవచ్ఛాసనము దృ * ఢంబుగఁ జెల్లన్.

టీ॥ విమతనృపాలురన్=శత్రురాజులను. గెలువుము = జయింపుము. బుధవినుతమైనవిశ్రుతకీర్తిన్—బుధ=దేవతలచేత. వినుతమైన =కొనియాడఁబడినదైన. విశ్రుత=ప్రసిద్ధికెక్కిన. కీర్తిన్=యశస్సుచేత. వెలయుము = ప్రసిద్ధినివహింపుము. నిఖిలధరామండలిన్ = ఎల్లభూమండలమునందును. భవచ్ఛాసనమున్=నీయాజ్ఞను. దృఢంబుగన్=గట్టిగా. చెల్లన్=సాగునట్లు. నిలుపుము = స్థాపింపుము.

తా॥ ఓధర్మరాజా ! నీవు నీశత్రువులయినరాజుల నందఱను జయించి దేవతలుగూడ కొనియాడఁదగిన స్వచ్ఛమయిన కీర్తిని లోకమునందు వ్యాపింపఁజేసి యీ భూలోకమునందు అంతటను నీయాజ్ఞ చెల్లుబడి యగునట్లుగా చేయుమని తాత్పర్యము.

౭౩౪.—క॥ నీపంపుకార్య మొరులం । జూపక నేఁజేయ నిన్ను ❋ జుట్టన వ్రేలన్
జూపఁగ వచ్చునె సకల ధ । రాపతులకు నీకుఁజేయ ❋ రానిది గలదే.

టీ॥ నీపంపుకార్యము=నీవుచేయుమన్నపనిని. ఒరులన్=ఇతరులను. చూపక—మీరుచేయుదురు వారుచేయుదురు అనియితరులమీఁదఁ బెట్టి యూరకుండకయనుట. నేన్=నేను. చేయన్ = చేయుచుండఁగా. సకలధరాపతులకున్ = ఎల్లరాజులకును. (నిన్ను) జుట్టన వ్రేలన్=చూపుడువ్రేలితో. చూపఁగవచ్చునె=ఇతఁడిట్టివాఁడని చూపి చెప్పశక్యమగునా. (నీకు) చేయరానిదిగలదే=చేయశక్యముకానిపని కలదా—తలఁచినపనిని నెఱవేర్పశక్తిగలవాఁడవనిభావము.

తా॥ ఓధర్మరాజా ! నీవు చేయుమన్నపనిని ఇతరులపైఁబెట్టక నేనుచేయుచుండఁగా, లోకములోనిరాజులెవ్వరు నిన్ను అలక్ష్యము చేయుదురు,నీకుచేయుటకు అలవిగానిపని యేదియుండును,అందఱు నీకు అధీనులైయుందురు,నీవుతలఁచినపని యెంతకష్టతరమైనదైనను నెఱవేరును అని తాత్పర్యము. వ॥ కావున.

౭౩౫.—క॥ విమలమతి నిట్టిమఖరా । జమునకుఁ దెప్పింపవలయు ❋ సంభారంబుల్
సమకూర్పుము నీయనుజుల । సమదగతిం బంపు నిఖిల ❋ శత్రుల గెల్వన్.

టీ॥ విమలమతిన్=నిర్మలమైనబుద్ధితో. ఇట్టిమఖరాజమునకున్= ఇటువంటిశ్రేష్ఠమైనయజ్ఞమునకు. తెప్పింపవలయుసంభారంబులు= తెప్పింపవలసినవస్తువులను. సమకూర్పుము=తెప్పించిచేర్పుము. నీయనుజులన్=నీతమ్ములను. సమదగతిన్=మదముతోఁగూడుకొన్నవిధమున. నిఖిలశత్రులన్=ఎల్లపగవారిని. గెల్వన్=జయింప. (పంపుము)

తా॥ నిర్మలమయిన బుద్ధితో ఈగొప్ప యజ్ఞమును చేయుటకు కావలసిన వస్తువులనెల్లను తెప్పింపుము, నీతమ్ములను లోకములోని శత్రురాజుల నందఱను తమదర్పము మెఱయఁగా జయించి రమ్మని పంపుము అని తాత్పర్యము.

౭౩౬.—క॥ అనుమాటలు విని కుంతీ । తనయుఁడు మోదమును బొంది ❋ తామర సాక్షున్.
వినుతించి శౌర్యకలితుల । ననుజుల దెసఁ జూచి పలికె ❋ హర్షముతోడన్.

టీ॥ అనుమాటలు=అని కృష్ణుఁడు చెప్పినమాటలను. కుంతీతనయుఁడు = ధర్మరాజు. (విని) మోదమునుబొంది = సంతోషించి. తామరసాక్షున్=కృష్ణుని. వినుతించి=పొగడి. హర్షముతోడన్= సంతోషముతో. శౌర్యకలితులన్=శూరత్వముతోఁగూడుకొన్నవారైన. అనుజులదెసన్=తమ్ములతట్టు. (చూచి) పలికెన్=చెప్పెను.

తా॥ అని శ్రీకృష్ణమూర్తి చెప్పినమాటలను ధర్మరాజువిన్నవాఁడై సంతోషించి కృష్ణుని కొనియాడి సంతోషముతో మిక్కిలి శూరులయిన తనతమ్ములను జూచి ఒకమాట చెప్పెనని తాత్పర్యము.



(❋) ధర్మరాజు సహదేవుని దక్షిణపు దిక్కు జయింపఁ బంపుట. (❋)

౭౩౭.—క॥ సృంజయ భూపాలకులును । గుంజర రథవాజిసుభట ❋ కోటులు నినుఁగొ
ల్వం జనుమని సహదేవుని । నంజక పొమ్మనియె దక్షి ❋ ణాశ జయింపన్.

టీ॥ సృంజయభూపాలకులును = సృంజయదేశపు రాజులును. కుంజరరథవాజిసుభటకోటులును=ఏనుఁగులు రథములు గుఱ్ఱములు కాలిబంట్లును. నినున్ = నిన్ను. కొల్వన్ = సేవింపఁగా. చనుమని = పొమ్మని. (సహదేవుని) అంజక = వెనుదీయక. దక్షిణాశ

జయింపన్ = దక్షిణపుదిక్కును గెలువను. పొమ్మనియెన్ = పంపెను.

తా॥ సృంజయదేశపు రాజులను తగిన చతురంగ బలములతోడ తోడుచేసికొని నీవు దక్షిణదిక్కును గెలిచి రమ్మని చిన్నతమ్ముఁడైన సహదేవుని బంపెనని తాత్పర్యము.




(*) ధర్మరాజు నకులుని పడమటి దిక్కు జయింపఁ బంపుట. (*)

౭౩౮.—క॥ ప్రకట చతుర్విధ సేనా । ప్రకరంబులు గొలువఁబంచెఁ * బడమటి దిశకున్
నకులున్ విదళిత రిపు భూ । పకులున్ శౌర్యంబు మెఱసి * పార్థివముఖ్యా.

టీ॥ పార్థివముఖ్యా = ఓరాజశ్రేష్ఠుఁడా. ప్రకట...గొలువన్ — ప్రకట = ప్రసిద్ధములయిన. చతుర్విధ = నాలుగువిధములయిన. సేనా ప్రకరంబులు = సైన్యసమూహములు. గొలువన్ = సేవింపఁగా. విదళితరిపుభూపకులున్ = నఱకఁబడిన శత్రురాజులసమూహములుగలవానిని. (నకులుని) పడమటిదిశకున్ = పడమటిదిక్కునకు. శౌర్యంబు = శూరత్వము. మెఱసి = ప్రకాశింపఁజేసి. పంచెన్ = పంపెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! ధర్మరాజు ఏనుఁగులురథములుగుఱ్ఱములు కాలిబంట్లు అనెడు నాలుగువిధములయిన సేనలతో శత్రువులనెల్లను నఱికి చంపఁగలవాఁడైన నకులుని శూరత్వము మెఱయునట్లుగా పడమటి దిక్కును గెలువుమని పంపెనని తాత్పర్యము.




(*) ధర్మరాజు అర్జునుని ఉత్తరపు దిక్కు గెలువఁ బంపుట. (*)

౭౩౯.—క॥ దుర్జనభంజను శౌర్యో । పార్జిత విజయప్రకాండు * నాహవ నిపుణున్
నర్జున మహితయశోనిధి । నర్జును నుత్తరపు దిశకు * ననిపె నరేంద్రా.

టీ॥ నరేంద్రా=రాజా. దుర్జనభంజనుఁడు = చెడ్డజనులనుభంగపెట్టువాఁడైన. శౌర్యోపార్జితవిజయప్రకాండుఁడు=శూరత్వముచేత సంపాదింపఁబడినగెలుపు సముదాయములుగలవాఁడైన. ఆహవనిపుణుఁడు=యుద్ధముననేర్పుగలవాఁడైన. అర్జునమహితయశోనిధిఁ=తెల్లగా వెలుఁగునదియు విశేషమైనదియునైన యశస్సునకు స్థానమయినవాఁడైన. (అర్జునుని ఉత్తరపుదిశకు) అనిపెన్=పంపెను.

తా॥ ఓరాజా! ధర్మరాజు చెడ్డవారిని భంగపెట్టువాఁడును, శూరత్వముచేత సంపాదింపఁబడిన గెలుపులుగలవాఁడును, యుద్ధమునందు నేర్పరియు స్వచ్ఛమయిన గొప్పకీర్తిగలవాఁడునైన అర్జునుని ఉత్తరపుదిక్కును జయింపఁ బంపెనని తాత్పర్యము.




(*) ధర్మరాజు భీముని తూర్పు దిక్కు గెలువఁ బంపుట. (*)

౭౮౦.—ఆ॥ మహిత శౌర్యనిధులు * మత్స్య కేకయ భద్ర । భూతలేంద్ర బలస * మేతముగను
దర్ప మొప్పఁబంపెఁ * దూర్పు దిక్కునకు ను । ద్దామ నిహతవైరి * ధాము భీము.

టీ॥ మహితశౌర్యనిధులు=అధికమయిన శూరత్వమునకు ఉనికిపట్టయినవారగు. మత్స్య కేకయ భద్ర భూతలేంద్ర బలసమేతముగన్—మత్స్య=మత్స్యదేశపురాజులయు. కేకయ=కేకయదేశపురాజులయు. భద్రభూతలేంద్ర=భద్రదేశపురాజులయు. బలసమేతముగన్=సేనతోఁగూడ. దర్పము=అహంకారము. ఒప్పన్=ఒప్పునట్లుగా. ఉద్దామనిహతవైరిధామున్—ఉద్దామ=అధికులైన. నిహత=చంపఁబడిన. వైరి=శత్రువులయొక్క. ధామున్=ఇండ్లుగలవానిని. (లేక) తేజస్సులుగలవానిని. (భీముని తూర్పుదిక్కునకు పంపెను)

తా॥ మిక్కిలి శూరులయిన మత్స్య కేకయ భద్ర దేశముల రాజులసేనలతోడ తన యహంకారము ఒప్పఁగా అధికులైన శత్రువులను నాశముచేసినవాఁడైన భీమసేనుని తూర్పుదిక్కునుజయింపఁ బంపెనని తాత్పర్యము.

౭౮౧.—చ॥ పనిచిన వారలేగి ఘన * బాహు పరాక్రమ విక్రమంబులన్
ననుపమ శౌర్యులైన చతు * రంత మహీశుల నోర్చి కప్పముల్
గనక వినూత్న రత్న తుర * గ ప్రముఖాఖిల వస్తుజాతముల్
గొని చనుదెంచి ధర్మజున * కుం బ్రణమిల్లి రుదాత్తచిత్తులై.

టీ॥ పనిచినన్=పంపఁగా. వారలు=ఆభీమార్జున నకుల సహదేవులు. ఏగి=పోయి. ఘనబాహుపరాక్రమవిక్రమంబులన్—ఘన=అధికమైన. బాహుపరాక్రమ=భుజబలముచేతను. విక్రమంబులన్=విశేషప్రతాపముచేతను. అనుపమశౌర్యులు=ఈడులేని శూరత్వముగలవారు. అయినచతురంతమహీశులన్=అయినట్టి నాలుగుదిక్కులందలిరాజులను. ఓర్చి=ఓడించి. కప్పములు=కప్పములుగా. కనక ...వస్తుజాతములు—కనక = బంగారు. వినూత్న = క్రొత్తలయిన. రత్న=మణులు. తురగ=గుఱ్ఱములు. ప్రముఖ = మొదలుగాఁగల. అఖిల=సమస్తమయిన. వస్తుజాతములు=వస్తువులసమూహములను. కొని=తీసికొని. ఉదాత్తచిత్తులై=గంభీరమయినమనసులుగలవారై. చనుదెంచి=వచ్చి. ధర్మజునకున్ = ధర్మరాజునకు. ప్రణమిల్లిరి=నమస్కరించిరి.

తా॥ అట్లు పంపఁగా ఆభీమార్జున నకులసహదేవులు పోయినవారై తమ భుజబలమును ప్రతాపమును ప్రకాశింపఁజేసి మిక్కిలి శూరులయిన నాలుగుదిక్కులయందుఁగల రాజులను గెలిచి వారివల్ల ధనము రత్నములు గుఱ్ఱములు మొదలుగాఁగల సకలవస్తువుల సమూహములను పుచ్చుకొని మిక్కిలిగాంభీర్యముతోడి మనసులతో వచ్చి ధర్మరాజునకు మ్రొక్కిరి అని తాత్పర్యము.







(*) శ్రీకృష్ణ భీమార్జునులు విప్రవేషములతో జరాసంధునివద్దకుఁ బోవుట. (*)

౭౮౬.—వ॥ అట్లు కృష్ణ భీమార్జునులు బ్రాహ్మణ వేషంబులు దాల్చి త్రేతాగ్నులుంబోలెఁ దమ
శరీర తేజోవిశేషంబులు వెలుంగ నతిత్వరితగతింజని గిరివ్రజంబుఁజొచ్చి యందు నతిథి
పూజలు శ్రద్ధాగరిష్ఠచిత్తుండై కావించుచున్న జరాసంధునిం గనుంగొని యిట్లనిరి.

టీ॥ అట్లు=ఆవిధముగా. (కృష్ణభీమార్జునులు) బ్రాహ్మణవేషంబులు=బ్రాహ్మణులవేషములను. తాల్చి = ధరించి. త్రేతాగ్నులుంబోలెన్=మూడగ్నులవలెనే. తమశరీరతేజోవిశేషంబులు = తమదేహములయందలి తేజస్సులయొక్క అతిశయములు. వెలుంగన్ = ప్రకాశింపఁగా. అతిత్వరితగతిన్=మిక్కిలివడిగలనడతో. చని=పోయి. గిరివ్రజంబున్ = గిరివ్రజమను పట్టణమునందు. (చొచ్చి) అందున్=ఆపట్టణమునందు. (అతిథిపూజలు) శ్రద్ధాగరిష్ఠచిత్తుండై=అక్కఱచేత మిక్కిలిగొప్పదైనమనసుగలవాఁడై. కావించుచున్న=చేయుచున్న. (జరాసంధుని) కనుంగొని=చూచి. (ఇట్లనిరి)

తా॥ కృష్ణభీమార్జునులు ఆవిధముగా బ్రాహ్మణవేషములుధరించి తమ ముగ్గురిదేహములును తేజస్సుచేత మూడగ్నులవలెనే వెలుఁగుచుండఁగా మిక్కిలి వడిగలనడతో గిరివ్రజపట్టణమునకుపోయి ఆపట్టణమునందు మిక్కిలి అక్కఱతో అతిథులను పూజించుచున్న జరాసంధునిఁజూచి యిట్లు పలికిరి అని తాత్పర్యము.

౭౮౭.—క॥ ధరణీశ యతిథి పూజా । పరుఁడవు నీవనుచు దిశలఁ ❋ బలుకఁగ విని మే
మరుదెంచితిమి మదీప్సిత । మఱసేయక యిమ్ము సువ్ర ❋ తాచార నిధీ.

టీ॥ ధరణీశ=ఓరాజా. (నీవు) అతిథిపూజాపరుఁడవు=అతిథులను అర్చించుటయందాసక్తుఁడవు. అనుచున్=అని. దిశలన్=ఎల్లదిక్కులయందును. పలుకఁగన్=జనులుచెప్పఁగా. (వినిమేము) అరుదెంచితిమి=వచ్చితిమి. సువ్రతాచారనిధీ = మంచివ్రతములను నడపుటకుస్థానమయినవాఁడా. మదీప్సితము=మామనస్సులయందుఁగలకోరికను. అఱసేయక=తక్కువపఱుపక. ఇమ్ము=ఒసఁగుము.

తా॥ ఓరాజా! నీవు అతిథిపూజలు అక్కఱతోచేయువాఁడవని ఎల్లదిక్కులయందు నుండు సత్పురుషులెల్ల చెప్పఁగా విని మేమును వచ్చితిమి, మంచివ్రతములను నడపువాఁడవైన ఓరాజా, మాకోరికను ఉపేక్షింపక ఇమ్మని పలికిరని తాత్పర్యము.

౭౮౮.—క॥ అతిథి జనంబుల భక్తిన్ । సతతము పూజించి యుచిత ❋ సత్కారములు
న్నతి నడపు సుజనులును శా । శ్వతకీర్తులు ధరణిఁబడయఁ ❋ జాలుదురనఘా.

టీ॥ అనఘా=పాపములేనివాఁడా. సతతము = ఎల్లప్పుడు. (అతిథిజనంబులను) భక్తిన్=భక్తితో (పూజించి) ఉచితసత్కారములు = తగినసన్మానములను. ఉన్నతిన్ = గౌరవముతో. (నడపు సుజనులు) ధరణిన్=భూమియందు. శాశ్వతకీర్తులు = ఎన్నఁడును చెడని యశస్సులను. పడయఁజాలుదురు = పొందఁగలుగుదురు.

తా॥ ఓపుణ్యపురుషా! ఎల్లప్పుడు అతిథులను తగినరీతినిభక్తితో సన్మానించుచు వర్తించునట్టి పుణ్యాత్ములు శాశ్వతమయినకీర్తిని పొందుదురు అని తాత్పర్యము.

౭౮౯.—క॥ పరికింపఁగ దేహం బ । స్థిరమని నిజబుద్ధిఁ దలఁచి ❋ చిరతర కీర్తి
స్ఫురణన్ బ్రస్తుతి కెక్కని । పురుషుఁడు జీవన్మృతుండు ❋ భూరివివేకా.

టీ॥ భూరివివేకా=చాలతెలివిగలఓజరాసంధా. పరికింపఁగన్=విచారింపఁగా. దేహంబు=పంచకోశాత్మకమయిన యీశరీరము. అస్థిరము=నిలుకడలేనిది. (అని) నిజబుద్ధిన్=తనబుద్ధిలో. తలఁచి=ఎంచి. చిరతరకీర్తిస్ఫురణన్=మిక్కిలి శాశ్వతమయినకీర్తియొక్క ప్రకాశముచేత. ప్రస్తుతికెక్కని పురుషుఁడు = పొగడ్తనొందని మనుష్యుఁడు. జీవన్మృతుండు = బ్రతికియును చచ్చినవాఁడు.

తా॥ మహాబుద్ధిమంతుఁడవగు ఓజరాసంధమహారాజా! చక్కగా ఆలోచింపఁగా ఈశరీరము స్థిరముకానిదేయని తెలిసి శాశ్వతమైన కీర్తిని పడయుటకు ప్రయత్నముచేయని మానవుఁడు బ్రతికియు చచ్చినవాఁడే అగునని తాత్పర్యము.

౭౫౦.—క॥ ధారుణిలోన వదాన్యుల । కీరాని పదార్థమొకటి * యెందును గలదే
కోరినఁ దనమేనెముకలు । ధీరుండై యిచ్చె మును ద * ధీచన వినమే.

టీ॥ ధారుణిలోనన్=భూమిలో. వదాన్యులకున్ = దాతలకు. ఈరానిపదార్థమొకటి=ఇయ్యతగనిదిఒకవస్తువు.ఎందున్=ఎక్కడ నైన.కలదే=ఉన్నదా.మును=పూర్వము.కోరినన్=అపేక్షింపఁగా. (దధీచితన) మేను=దేహములోని. (యెముకలు)ధీరుండై=ధైర్యము గలవాఁడై. (ఇచ్చెను) అనవినమె=అని చెప్పఁగా మనమువినలేదా.

తా॥ లోకములో దాతలగువారలు ఇది ఇయ్యఁదగినపదార్థము ఇది ఇయ్యఁదగని పదార్థము అని ఆలోచింపక యాచకులగువారు ఏదియడిగినను ఇత్తురు, మునుపు దేవతలు అడుగఁగా దధీచిమహా ముని తనదేహములోనియెముకలను తెగువతో ఇచ్చెను అని మనము మునుపటివారు చెప్పఁగా వినుచున్నాము గదా అని తాత్పర్యము.

౭౫౧.—క॥ అడిగిన వృథసేయక తన । యొడలాఁకలిగొన్న యెఱుకు * కోగిరముగ నే
ర్పడనిచ్చి కీర్తిఁగనెనని । పుడమిన్ మునువినమె యలక * పోతము ననఘా.

టీ॥ అనఘా=పాపములేనివాఁడా. పుడమిన్=భూమియందు. మును=పూర్వకాలమునందు. అడిగినన్=తన్ను అడుగఁగా. వృథ సేయక=వ్యర్థముచేయక.తనయొడలు=తనదేహమును.ఆఁకలిగొన్న యెఱుకున్ = ఆఁకలిగలవాఁడైన బోయవానికి. ఓగిరముగన్= అన్నముగా – ఆహారముగా. ఏర్పడన్ = ప్రసిద్ధముగా. (ఇచ్చి) కీర్తిన్=కీర్తిని. కనెనని=పొందెనని. అలకపోతమున్ = ఆప్రసిద్ధ మయినకపోతపక్షికథను. వినమె = మనమువిన్నవారముకామా.

తా॥ ఓపుణ్యపురుషా! పూర్వకాలమునందు ఈభూమిలో ఒక కపోతము తన్ను యాచించిన బోయవాని కోరికను వ్యర్థముచేయక వాని యాఁకటికి తనదేహమును ఆహారముగా నిచ్చి శాశ్వతమైన కీర్తిని పొందెనను కథను పెద్దలు చెప్పఁగా మనము వినుచున్నాము గదాయని తాత్పర్యము.

౭౫౨.—క॥ ఆయింద్రాగ్నులు శ్యేనక । వాయస రూపములఁ దన్ను * వలఁతిగ వేఁడన్
ధీయుతుఁడై మును శిబి తన । కాయము ఛేదించి యిచ్చెఁ * గడువడి వినమే.

టీ॥ మును=పూర్వకాలమునందు. ఆయింద్రాగ్నులు = ప్రసిద్ధ లయిన యింద్రుఁడును అగ్నిదేవుఁడును. శ్యేనకవాయసరూప ములన్=డేగరూపమును కాకిరూపమును పొందినవారై. (తన్ను) వలఁతిగన్ = నేర్పుగా. వేఁడన్ = ప్రార్థింపఁగా–అడుగఁగా. శిబి=శిబిచక్రవర్తి.ధీయుతుఁడై=గొప్పబుద్ధిగలవాఁడై.కడువడిన్= అతిశీఘ్రముగ. తనకాయము=తనదేహమును. ఛేదించి = కోసి. ఇచ్చెన్=ఇచ్చెను. వినమె=ఈకథనుమనము వినలేదా.

తా॥ పూర్వకాలమునందు శిబియనుచక్రవర్తి తన్ను పరీక్షింపఁ గోరి డేగయు కాకియునైవచ్చి అడిగిన యింద్రాగ్నులకు తెగువతో తనదేహమునుకోసియిచ్చెనుఅనఁగామనమువినియుండలేదాఅనితా.

౭౫౩.—ఆ॥ ధీరమతులు రంతి * దేవ హరిశ్చంద్ర । బలుల నుంఛవృత్తి * బ్రాహ్మణునిని
మున్ను చెప్ప వినమె * సన్నుత చరితులు । సన్న నైన నేడు * నున్నవారు.

టీ॥ ధీరమతులు=ధైర్యముతోడిబుద్ధిగలవారైన. రంతి...లన్= రంతిదేవుని హరిశ్చంద్రుని బలిచక్రవర్తిని. ఉంఛవృత్తి=తిరిపమెత్తి జీవించుచున్న.(బ్రాహ్మణుని)మున్ను=మునుపు. చెప్పన్=చెప్పఁగా వినమె=మనము వినలేదా. సన్నుతచరితులు = కొనియాడఁదగిన నడవళ్లుగల ఆసత్పురుషులు. సన్ననైనన్ = చనిపోయియున్నను. నేడునున్నవారు = ఇప్పుడునుఉండువారుగానే యున్నారు.

తా॥ ధీరబుద్ధిగలరంతిదేవుఁడు హరిశ్చంద్రుఁడు బలి అనుచక్ర వర్తులును బిచ్చమెత్తుకొనిబ్రదుకుచున్న ఒకబ్రాహ్మణుఁడునుపూర్వ కాలమునందుచేసిన మహాదాతృత్వములను మనము విని యున్నాము గదా వారు ఇప్పుడు చనిపోయినవారుగానుండియు ప్రాణముతో నుండువారివలెనే వ్యవహరింపఁ బడుచున్నారు అని తాత్పర్యము.

తే॥ పాడి గలిగిన నిహలోక ఫలము లెల్లఁ । జేరుటయ కాదు కీర్తియుఁజెందుఁబురుషు। ధరణిఁబరఁగుఁ బొగడ్తయెందాఁకనంత। కాలమును బుణ్యలోకంబు గలుగునంద్రు॥ అనిభారతము.

వ॥ అనిన విని జరాసంధుండు వారలరూపంబులును మేఘగంభీరభాషణంబులును గుణకిణాంకంబులును మహాప్రభా వంబులునుజూచి తనమనంబున వీరలు బ్రాహ్మణవేషధారులైన రాజేంద్రులుగానోపుదురనితలంచి యిమ్మహా త్ములు గోరిన పదార్థంబ కాదు ప్రాణంబులేనియునిత్తు నదియునుంగాక తొల్లి బలీంద్రుండు విప్రవ్యాజంబున నడిగిన విష్ణుదేవునకు నాత్మపదభ్రష్టత్వం బెఱింగియు విచారింపక జగత్త్రయంబునిచ్చి కీర్తిపరుండయ్యె క్షత్ర బంధుండనువాఁడుబ్రాహ్మణార్థంబు ప్రాణపరిత్యాగంబుచేసి నిర్మలంబగుయశంబువడసెనదిగావుననని త్యంబైన కాయంబువిచారణీయంబుగాదుకీర్తివడయుట లెస్సయనివిచారించియుదారుండైకృష్ణార్జునభీములంగనియిట్లనియె.

టీ॥ అనినన్ = అనియిట్లుపలుకఁగా. (విని జరాసంధుండు) వారలరూపంబులును = వారియాకారములును. మేఘగంభీరభాష ణంబులును = మబ్బు ఉఱిమినట్టు గంభీరముగా ఆడునట్టి మాటలును. గుణకిణాంకంబులును = వింటి అల్లెత్రాటి ఒరయికచేత నేర్పడిన

కాయలగుబ్బతులును. మహాప్రభావంబులును = గొప్పమహిమలును. (చూచి) తనమనంబునన్ = తన మనస్సులో. (వీరలు) బ్రాహ్మణవేషధారులయిన రాజేంద్రులు = బ్రాహ్మణవేషములు వేసికొన్న రాజశ్రేష్ఠులు. కానోపుదురు = అగుదురు. అనితలంచి = అనియెంచి. ఇమ్మహాత్ములు = ఈఘనులు. కోరినపదార్థంబ కాదు = అపేక్షించిన వస్తువే కాదు. ప్రాణంబులేనియున్ = నాప్రాణములైనను. ఇత్తును = ఇయ్యఁగలను (అదియునుంగాక) తొల్లి = పూర్వకాలమునందు. బలీంద్రుండు = బలిచక్రవర్తి. విప్రవ్యాజంబునన్ = బ్రాహ్మణుఁడనునెపముతో. (అడిగినవిష్ణుదేవునకు) ఆత్మపదభ్రష్టత్వంబు = తానుపదభ్రష్టుఁడగుటను. ఎఱింగియున్ = తెలిసియు. విచారింపక = ఆలోచింపక. జగత్త్రయంబు నిచ్చి = మూడులోకములను ఇచ్చి. కీర్తిపరుండయ్యెన్ = కీర్తిచేత గొప్పవాఁడయ్యెను. (క్షత్రబంధుండనువాఁడు) బ్రాహ్మణార్థంబు = బ్రాహ్మణుని కొఱకు. ప్రాణపరిత్యాగంబుచేసి = ప్రాణములనువిడిచి. నిర్మలంబు = స్వచ్ఛము. అగుయశంబు = అగునట్టికీర్తిని. పడసెన్ = పొందెను. అదిగావునన్ = కాఁబట్టి. అనిత్యంబైన కాయంబు = అశాశ్వతమయిన దేహము. విచారణీయంబు = విచారింపఁదగినది. (కాదు) కీర్తివడయుట = యశస్సునుపొందుట. లెస్స = మేలు. అనివిచారించి = అని యాలోచనచేసి. ఉదారుండై = ఈవియందు వెనుదీయనివాఁడై. కృష్ణార్జునభీములన్ = కృష్ణుని అర్జునుని భీముని. కని = చూచి - ఇట్లనియెను.

తా॥ అనఁగావిని వారి ఆకారములను, మబ్బు ఉఱిమినట్టు గంభీరముగా మాటలాడుటను, వింటినారి ఒరసిడిచేత కాయలుగాచిన గుబ్బతులను, గొప్పతనములను చూచి తనమనస్సులో వీరు బ్రాహ్మణవేషమును ధరించిన మహారాజులుగాని యితరులు కారని యెంచి, యిట్టివారు ఏమి అడిగినను ఇయ్యవలసినదేగాక ఒకవేళ ప్రాణములను అపేక్షించినను ఇయ్యఁదగును అనియు, పూర్వకాలమునందు బలిచక్రవర్తి వామనుఁడై తన్ను యాచింపవచ్చిన విష్ణునికి తనచెఱుపు తెలిసియు మూడులోకములను ఇచ్చెను, క్షత్రబంధుఁడనువాఁడు బ్రాహ్మణునికొఱకు తనప్రాణమునువిడిచి కీర్తినిపొందెనుకాఁబట్టి, అనిత్యమైన యీదేహమునందు మమతమాని యశస్సునుపొందుట మంచిదనియెంచి కృష్ణభీమార్జునులను జూచి యిట్లు పలికెనని తాత్పర్యము.

౭౫౫.—క॥ భూరి గుణులార మీమది । కోరిక లెఱిఁగింపుఁ డేమి * గోరిన నైనన్
ధీరత నొసఁగుటయే కా । దారయ నాశిరముఁ ద్రుంచి * యైనను నిత్తున్.

టీ॥ భూరిగుణులార = గొప్పగుణములుగల ఓసత్పురుషులారా. మీమదికోరికలు = మీమనసులందలికోరికలను. ఎఱిఁగింపుఁడు = తెలియఁజేయుఁడు. ఏమికోరిననైనన్ = మీరుఏమికోరినప్పటికిని. ధీరతన్ = ధైర్యముతో. ఒసఁగుటయే కాదు = ఇచ్చుటమాత్రమే కాదు. ఆరయన్ = విచారింపఁగా. నాశిరమున్ = నాతలను. త్రుంచియైనన్ = కోసియైనను (ఇత్తును)

తా॥ గొప్పగుణములుగల ఓపుణ్యపురుషులారా ! మీకోరికలు ఏమో చెప్పుఁడు, మీరు ఏమికోరినను తప్పక ఇత్తును, అంతేకాక ఒకవేళ కావలసినయెడల నాతలను కోసియైనను ఇచ్చుటకు సందేహము లేదని తా.

౭౫౬.—ఉ॥ నావుడుఁ గృష్ణుఁ డమ్మగధ * నాథున కిట్లను భూవరేణ్యా నీ
భావము సూనృతవ్రత శు * భస్థితిఁ జెందు టెఱుంగవచ్చె మా
కీవలె నాజిభిక్ష యితఁ * డింద్ర తనూభవుఁ డేనుపేంద్రుఁడన్
బావని వీఁడె యిందొకనిఁ * బైకొని యొక్కటి పోరఁగాఁదగున్.

టీ॥ నావుడును = అనఁగా. (కృష్ణుఁడు) అమ్మగధనాథునకున్ = ఆజరాసంధునితో. ఇట్లనున్ = ఇట్లుపలికెను. భూవరేణ్యా = ఓరాజశ్రేష్ఠుఁడా. నీభావము = నీమనస్సు. సూనృతవ్రతశుభస్థితిన్ = నిజము మాటలాడుటయనెడువ్రతముచేత మేలిమినివహించుచునికిని. చెందుట = పొందుట. ఎఱుంగవచ్చెన్ = తెలియవచ్చెను. (మాకు) ఆజిభిక్ష = యుద్ధమనెడిభిక్ష. ఈవలెన్ = ఇయ్యవలెను. (ఇతఁడు) ఇంద్రతనూభవుఁడు = దేవేంద్రుని కుమారుఁడైన అర్జునుఁడు, ఏను = నేను. ఉపేంద్రుఁడన్ = కృష్ణుఁడను. వీఁడె = ఈతఁడే. పావని = భీముఁడు. ఇందున్ = ఈమూలోపల. (ఒకనిని) పైకొని = ఎదిరించి. ఒక్కటి = ఒంటిగా. పోరఁగాన్ = యుద్ధముచేయుట. (తగును)

తా॥ అనఁగా, శ్రీకృష్ణమూర్తి ఆజరాసంధునిఁ జూచి ఓరాజశ్రేష్ఠుఁడా ! నీవు నిజము మాటలాడునట్టి వ్రతమునందుపూనికగలవాఁడవగుట ఇప్పుడు మాకు చక్కఁగా తెలియఁబడెను, మాకు కావలసినది యుద్ధభిక్ష దానిని యిమ్ము, నేను కృష్ణుఁడను వీరు పాండుకుమారులైన భీమార్జునులు మాముగ్గురిలోను ఎవనితోనైనను ఒకనితో ఇతరుల సహాయము లేక పోరాడవలెనని చెప్పెనని తాత్పర్యము.

౭౫౭.—చ॥ అనవిని వాఁడు నవ్వి యహ * హా విన వింతలు పుట్టె మున్ను న
న్నని మొన నోర్వఁజాలక భ * యంబునఁ బాఱితి పెక్కుమార్లు వం
చన మధురాపురిన్ విడిచి * సాగర మధ్యమునందు డాఁగవే
వనరుహనాభ నీబిరుదు * వాఁడితనంబును నాకు వింతలే.

టీ॥ అనన్ = అనికృష్ణుఁడుచెప్పఁగానే. (విని) వాఁడు = ఆజరాసంధుఁడు. (నవ్వి) అహహా = ఔరా. వినన్ = వినుటకు. వింతలు = ఆశ్చర్యకరములైనమాటలు. (పుట్టెను) మున్ను = మునుపు. (నన్ను) అనిమొనన్ = యుద్ధముఖమునందు. ఓర్వఁజాలక = ఓడింపలేక. పెక్కుమార్లు = బహుపర్యాయములు. భయంబునన్ = వెఱపుతో. పాఱితి = పరుగెత్తిపోతివి. వనరుహనాభ = ఓకృష్ణా. వంచనన్ = మోసముతో. మధురాపురిన్ = మధురాపట్టణమును. విడిచి = వదలి. సాగరమధ్యమునందున్ = సముద్రమనడుమను. డాఁగవే = నీవుదాఁగలేదా. నీబిరుదు = నీశూరత్వమును. వాఁడితనంబును = పరాక్రమమును. (నాకు) వింతలే = క్రొత్తలా.

తా॥ అనికృష్ణుఁడుచెప్పఁగా జరాసంధుఁడు వినినవ్వుచు ఔరా?

౨౪౨.—చ॥ తమతమ పోయివచ్చిన వి * ధంబులు భూపతులన్ జయించుటల్
క్రమమునఁ జెప్పి యందుల జ * రాతనయుం డరివెట్టఁడయ్యె నం
చమర వరేణ్య నందనుఁ డ * హంకృతి దక్కఁగ విన్నవించినన్
యమసుతుఁ డూరకుండె విక * లాత్ముఁడై విని యంతఁ గృష్ణుఁడున్.

టీ॥ తమతమపోయివచ్చినవిధంబులు = తాము తాము పోయి వచ్చినరీతులను. భూపతులన్=రాజులను. జయించుటలు=గెలుచుటలను. క్రమమునన్=వరుసగా. (చెప్పి) అందులన్=ఆరాజులలో. జరాతనయుండు=జరాసంధుఁడు. అరివెట్టఁడయ్యెన్ = కప్పము కట్టినవాఁడుకాఁడయ్యెను. అంచున్ = అని. అమరవరేణ్యనందనుఁడు=అర్జునుఁడు. అహంకృతి=గర్వము. తక్కఁగన్ = అణఁగి పోఁగా. విన్నవించినన్=మనవిచేయఁగా. యమసుతుఁడు = ధర్మరాజు. వికలాత్ముఁడై = ఏమితోఁచని మనసుగలవాఁడై. (ఊరకుండెను) అంతన్=అంతట. (కృష్ణుఁడును) విని = విన్నవాఁడై.

తా॥ మేము ఈదిక్కునకు పోయితిమి వీరిని జయించితిమి అని తమతమ పోయివచ్చిన విధములను ఆయాదిక్కులరాజులను జయించుటయు క్రమముగా చెప్పి ఆనాలుగుదిక్కులరాజులలోను జరాసంధుఁడుమాత్రము కప్పము కట్టకపోయెను అని అర్జునుఁడు తన గర్వము అణఁగి పోఁగా మనవిచేసెను అది విని ధర్మరాజు ఏమి తోఁచక ఊరకయుండెను అంతటకృష్ణుఁడు వినినవాఁడైయని తా.

౨౪౩.—తే॥ ధర్మనందనుఁ జూచి యు * త్కలికతోడఁ । బలికె మాగధుఁ బోరఁ జం * పఁగ నుపాయ
మొకటి గలదెఱిఁగించెద * నుద్ధవుండు । నాకుఁ జెప్పిన చందంబు * నయ చరిత్ర.

టీ॥ ధర్మనందనున్=ధర్మరాజును. (చూచి) ఉత్కలికతోడన్= కుతూహలముతో. పలికెన్=చెప్పెను. మాగధున్=జరాసంధుని. పోరన్ = యుద్ధమునందు. చంపఁగన్ = చంపుటకు. ఉపాయమొకటి=ఒకయుపాయము. (కలదు) నయచరిత్ర=నీతినడవడిగల ధర్మరాజా. (నాకు ఉద్ధవుండు) చెప్పినచందంబు=చెప్పినవిధముగా. ఎఱిఁగించెదన్=నీకువిశదముగ తెలియునట్టుగా తెలియచేసెదను.

తా॥ ధర్మరాజును జూచి ఓరాజా జరాసంధుని యుద్ధమునందు చంపుటకు ఉపాయ మొకటిగలదు అది నాకు ఉద్ధవుఁడు చెప్పినది దానిని నీకు విశదముగా తెలియఁజెప్పెదను వినుమని కుతూహలముతో ఇట్లు పలికెనని తాత్పర్యము.

౨౪౪.—చ॥ విను మగధేశ్వరుం డెపుడు * విప్రజనావళియందు భక్తియున్
వినయము గల్గియుండియును * వేడినచో వృథసేయ కిచ్చు నే
పున విజయుండునుం బవన * పుత్త్రుఁడు నేనును బ్రాహ్మణాకృతిన్
జని రణభిక్ష వేఁడిన వ * శంవదుఁడై యతఁడిచ్చు కోరికల్.

టీ॥ (విను) మగధేశ్వరుండు=జరాసంధుఁడు. ఎపుడున్=ఎల్లప్పుడును. విప్రజనావళియందున్=బ్రాహ్మణజనసమూహమునందు. భక్తియున్=ప్రీతియు. వినయమున్=అడఁకువయు. (కల్గియుండియును) వేడినచోన్=అడిగినయెడ. వృథసేయక=వ్యర్థపుచ్చక. (ఇచ్చును) ఏపునన్=గర్వముతో. విజయుండును=అర్జునుఁడును. పవనపుత్త్రుఁడును=భీమసేనుఁడును. (నేనును) బ్రాహ్మణాకృతిన్= బ్రాహ్మణవేషముతో. చని=పోయి. రణభిక్షవేఁడినన్=యుద్ధభిక్ష కోరినయెడ. వశంవదుఁడై = అనుకూలుఁడై. అతఁడు = ఆజరాసంధుఁడు. కోరికలు=కోరినవానిని. ఇచ్చును=లేదనకయొసఁగును.

తా॥ వినుము చెప్పెదనని కృష్ణుఁడు ధర్మరాజుతో జరాసంధుఁడు సర్వదా బ్రాహ్మణులయందు భక్తియు అడఁకువయు కలిగి యుండుటయేగాక బ్రాహ్మణులు ఏది అడిగినను లేదనక యిచ్చుచుండునుగనుక నేను అర్జునుఁడు భీముఁడును బ్రాహ్మణవేషములతో పోయి యుద్ధరూపమైన భిక్షను కోరుదుము, అతఁడు అందుకు ఒప్పుకొనిమాకోరినకోరికను ఇచ్చును, అనఁగా మేముఅడిగినదానిని ఒప్పుకొని యుద్ధమునకు వచ్చునని తాత్పర్యము. వ॥ అట్టియెడ.

౨౪౫.—తే॥ తగిలి యప్పుడు మల్లయు * ద్ధమున వానిఁ । బిలుకు మార్పింపవచ్చును * భీముచేత
ననిన ధర్మజుఁ డిది లెస్స * యనిన విప్ర । వేషములు దాల్చి యరిగిరి * విశదయశులు.

టీ॥ (అప్పుడు) తగిలి=పూని. భీముచేతన్=భీమునిచేత. మల్లయుద్ధమునన్=జెట్టిపోట్లాటయందు. వానిన్=ఆజరాసంధుని. పిలుకుమార్పింపవచ్చును=చంపవచ్చును. అనినన్=అనఁగా. ధర్మజుఁడు = ధర్మరాజు. ఇదిలెస్స=ఈయాలోచనమంచిది. అనినన్=అనఁగా. విశదయశులు=నిర్మలమయినకీర్తిగల ఆకృష్ణభీమార్జునులు. విప్రవేషములు=బ్రాహ్మణవేషములను. తాల్చి=ధరించి. అరిగిరి=పోయిరి.

తా॥ అప్పుడు మేము పూనికతో జెట్టిపోట్లాటయందు జరాసంధుని భీమునిచేత చంపింపఁగలము అని చెప్పఁగా ధర్మరాజు ఈయాలోచన బాగుగానున్నదియని ఒప్పుకొనెను, అంతట కృష్ణభీమార్జునులు ముగ్గురు బ్రాహ్మణవేషములు వేసికొని జరాసంధుని పట్టణమునకుఁ బోయిరని తాత్పర్యము.






(*) శ్రీకృష్ణ భీమార్జునులు విప్రవేషములతో జరాసంధునివద్దకుఁ బోవుట. (*)

౨౪౬.—వ॥ అట్లు కృష్ణభీమార్జునులు బ్రాహ్మణవేషంబులు దాల్చి త్రేతాగ్నులుంబోలెఁ దమ శరీరతేజోవిశేషంబులు వెలుంగ నతిత్వరితగతిం జని గిరివ్రజంబుఁ జొచ్చి యందు నతిథిపూజలు శ్రద్ధాగరిష్ఠచిత్తుండై కావించుచున్న జరాసంధునిం గనుంగొని యిట్లనిరి.

టీ॥ అట్లు=ఆవిధముగా. (కృష్ణభీమార్జునులు) బ్రాహ్మణవేషంబులు=బ్రాహ్మణులవేషములను. తాల్చి = ధరించి. త్రేతాగ్నులుం బోలెన్=మూఁడగ్నులవలెనే. తమశరీరతేజోవిశేషంబులు = తమదేహములయందలి తేజస్సులయొక్క అతిశయములు. వెలుంగన్ = ప్రకాశింపఁగా. అతిత్వరితగతిన్=మిక్కిలివడిగలనడతో. చని=పోయి. గిరివ్రజంబున్ = గిరివ్రజమను పట్టణమునందు. (చొచ్చి) అందున్=ఆపట్టణమునందు. (అతిథిపూజలు) శ్రద్ధాగరిష్ఠచిత్తుండై=అక్కఱచేత మిక్కిలిగొప్పదైనమనసుగలవాఁడై. కావించుచున్న=చేయుచున్న. (జరాసంధుని) కనుంగొని=చూచి. (ఇట్లనిరి)

తా॥ కృష్ణభీమార్జునులు ఆవిధముగా బ్రాహ్మణవేషములుధరించి తమ ముగ్గురిదేహములును తేజస్సుచేత మూఁడగ్నులవలెనే వెలుఁగుచుండఁగా మిక్కిలి వడిగలనడతో గిరివ్రజపట్టణమునకుపోయి ఆపట్టణమునందు మిక్కిలి అక్కఱతో అతిథులను పూజించుచున్న జరాసంధునిఁజూచి యిట్లు పలికిరి అని తాత్పర్యము.

౨౪౭.—క॥ ధరణీశ యతిథి పూజా । పరుఁడవు నీవనుచు దిశలఁ ✻ బలుకఁగ విని మే
మరుదెంచితిమి మదీప్సిత । మఱసేయక యిమ్ము సువ్ర ✻ తాచార నిధీ.

టీ॥ ధరణీశ=ఓరాజా. (నీవు) అతిథిపూజాపరుఁడవు=అతిథులను అర్చించుటయందాసక్తుఁడవు. అనుచున్=అని. దిశలన్=ఎల్లదిక్కులయందును. పలుకఁగన్=జనులుచెప్పఁగా. (వినిమేము) అరుదెంచితిమి=వచ్చితిమి. సువ్రతాచారనిధీ = మంచివ్రతములను నడపుటకుస్థానమయినవాఁడా. మదీప్సితము=మామనస్సులయందుఁగలకోరికను. అఱసేయక=తక్కువపఱుపక. ఇమ్ము=ఒసఁగుము.

తా॥ ఓరాజా! నీవు అతిథిపూజలు అక్కఱతోచేయువాఁడవని ఎల్లదిక్కులయందు నుండు సత్పురుషులెల్ల చెప్పఁగా విని మేమును వచ్చితిమి, మంచివ్రతములను నడపువాఁడవైన ఓరాజా, మాకోరికను ఉపేక్షింపక ఇమ్మని పలికిరని తాత్పర్యము.

౨౪౮.—క॥ అతిథి జనంబుల భక్తిన్ । సతతము పూజించి యుచిత ✻ సత్కారములు
న్నతి నడపు సుజనులును శా । శ్వతకీర్తులు ధరణిఁబడయఁ ✻ జాలుదు రనఘా.

టీ॥ అనఘా=పాపములేనివాఁడా. సతతము = ఎల్లప్పుడు. (అతిథిజనంబులను) భక్తిన్=భక్తితో (పూజించి) ఉచితసత్కారములు = తగినసన్మానములను. ఉన్నతిన్ = గౌరవముతో. (నడపుసుజనులు) ధరణిన్=భూమియందు. శాశ్వతకీర్తులు = ఎన్నఁడును చెడని యశస్సులను. పడయఁజాలుదురు = పొందఁగలుగుదురు.

తా॥ ఓపుణ్యపురుషా! ఎల్లప్పుడు అతిథులను తగినరీతినిభక్తితో సన్మానించుచు వర్తించునట్టి పుణ్యాత్ములు శాశ్వతమయినకీర్తిని పొందుదురు అని తాత్పర్యము.

౨౪౯.—క॥ పరికింపఁగ దేహం బ । స్థిరమని నిజబుద్ధిఁ దలఁచి ✻ చిరతర కీర్తి
స్ఫురణన్ బ్రస్తుతి కెక్కని । పురుషుఁడు జీవన్మృతుండు ✻ భూరివివేకా.

టీ॥ భూరివివేకా=చాలతెలివిగలఓజరాసంధా. పరికింపఁగన్=విచారింపఁగా. దేహంబు=పంచకోశాత్మకమయిన యీశరీరము. అస్థిరము=నిలుకడలేనిది. (అని) నిజబుద్ధిన్=తనబుద్ధిలో. తలఁచి=ఎంచి. చిరతరకీర్తిస్ఫురణన్=మిక్కిలి శాశ్వతమయినకీర్తియొక్క ప్రకాశముచేత. ప్రస్తుతికెక్కని పురుషుఁడు = పొగడ్తనొందని మనుష్యుఁడు. జీవన్మృతుండు = బ్రతికియును చచ్చినవాఁడు.

తా॥ మహాబుద్ధిమంతుఁడవగు ఓజరాసంధమహారాజా! చక్కగా ఆలోచింపఁగా ఈశరీరము స్థిరముకానిదేయని తెలిసి శాశ్వతమైన కీర్తిని పడయుటకు ప్రయత్నముచేయని మానవుఁడు బ్రతికియు చచ్చినవాఁడే అగునని తాత్పర్యము.

కృష్ణ! నేడు నీవల్ల క్రొత్తమాటలు వినవచ్చెను మును పుసీవు యుద్ధమునందు నాతో పోరాడలేక పెక్కుమారులు పాఱిపోలేదా, కపటమార్గమున మథురాపట్టణమును విడిచి సముద్రమునడుమ దాఁగలేదా నీమగతనము నీపరాక్రమమును నేనెఱుఁగనివా అని పరిహాసము చేసెనని తాత్పర్యము.

౭౫౮.—క॥ ఇన్నేల చెప్ప మాయలు । పన్నినఁ బోవిడువ గోప ✽ బాలక బలసం
పన్నుని మాగధ భూవరు । నన్నెఱుఁగవె తొల్లి నంద ✽ నందన పోరన్.

టీ॥ గోపబాలక=ఓరిగొల్లచిన్నవాఁడా. ఇన్ని=ఇన్ని మాటలు. ఏల చెప్పన్=చెప్పనేల. మాయలుపన్నినన్ = కపటవేషములు వేసినను. పోవిడువను = తొలఁగవిడువను. నందనందన = నందునికొడుకైన ఓకృష్ణా. బలసంపన్నునిన్ = బలముకలిమిగలవాఁడును. మాగధభూవరున్=మగధదేశపురాజునైన (నన్ను) తొల్లి=మునుపు. పోరన్=యుద్ధమునందు. ఎఱుఁగవె = ఎట్టివాఁడను అయినది నీవు యెఱుఁగవా.

తా॥ నందునికొడుకవైన ఓరిగొల్లపిల్లకాయా! నీతో ఇన్నిమాటలు చెప్పనక్కఱలేదు, నీవెన్ని కపటవేషములు వేసినను నిన్ను విడిచిపెట్టుదునని యెంచవద్దు, బలసంపదగల మగధరాజనైన నన్ను మునుపు గూడ ఇట్టివాఁడనని నీవు తెలిసికొని యుద్ధమునందు ఓడిపోయియున్నావు గదా అని తా.

౭౫౯.—ఉ॥ కాన రణోర్విఁ నన్నెదురఁ ✽ గష్టముగాని తలంగు గోత్రభి
త్సూనుఁడు భూరిబాహుబల ✽ దుర్దముఁడయ్యును బిన్న యీమరు
త్సూనుఁడు మామకప్రకట ✽ దోర్బలశక్తికిఁ జూడఁ దుల్యుఁడౌ
వీని నెదుర్తునంచుఁ జెయి ✽ వీచె జరాసుతుఁ డుగ్రమూర్తియై.

టీ॥ కానన్=కనుక. రణోర్విన్ = యుద్ధభూమియందు. నన్నెదురన్=నన్నెదిరించుట. (కష్టముకాని) తలంగు=తొలఁగుము. గోత్రభిత్సూనుఁడు=అర్జునుఁడు. భూరిబాహుబలదుర్దముఁడు = అధికమైన భుజబలముచేత అణఁపరానివాఁడు. అయ్యున్ = అయియుండియు. పిన్న=పసివాఁడు = ఈమరుత్సూనుఁడు = ఈభీముఁడు. చూడన్=యోచించిచూడఁగా. మామకప్రకటదోర్బలశక్తికిన్=నాదైన ప్రసిద్ధమయిన భుజబల సామర్థ్యమునకు. తుల్యుఁడౌ = సమానమగును వీనిన్=ఈభీముని. ఎదుర్తున్ = ఎదిరింతును. అంచున్=అని. జరాసుతుఁడు=జరాసంధుఁడు. ఉగ్రమూర్తియై=భయంకరమైనయాకృతిగలవాఁడై. చెయివీచెన్=ఇటురమ్మని చెయివిసరెను.

తా॥ పలుమారు నీవు నాతో పోరాడలేక ఓడిపోయిన వాఁడవు కాఁబట్టి నీకు నన్నెదిరించుట కష్టము నీవు తొలఁగియుండుము. అర్జునుఁడు భుజబలముచేత అధికుఁడుగానున్నను పసివాఁడుగనుక నాతో పోరాడఁజాలఁడు చూడఁగా భీముఁడు నాభుజబలమును సహించుటకు తగినవాఁడని తోఁచుచున్నది కనుక వీనితో పోరాడెదను అని జరాసంధుఁడు భయంకరరూపముతో భీముని ఇటు రమ్మని చేయివీచెనని తా.

౭౬౦.—క॥ కరువలి సుతునకు నొక భీ । కరగద నిప్పించి యొక్క ✽ గదఁ దనకేలన్
ధరియించి నలువురును మ । త్సరమున వెలికేగి యచట ✽ సమతల భూమిన్.

టీ॥ కరువలిసుతునకున్=భీమునికి. ఒకభీకరగదన్ = భయంకరమయిన యొకగదను. (ఇప్పించి) ఒక్కగదన్=ఒకగదను. తనకేలన్=తనచేత. ధరియించి=పూని. నలువురును=కృష్ణుఁడును భీముఁడును అర్జునుఁడును జరాసంధుఁడును. వెలికేగి=పట్టణము వెలుపలికిపోయి. (అచట) సమతలభూమిన్=మిట్టపల్లములులేని ప్రదేశమందు. మత్సరమునన్ = అరణి వైరము గలవారగుటచేత మిగుల చలముతో.

తా॥ అప్పుడు జరాసంధుఁడు ఒక భయంకరమైన గదను భీమునికిప్పించి తానును అట్టిగదను ఒకదానినిపుచ్చుకొని కృష్ణార్జునులు వెంటరాఁగా భీముని పిలుచుకొని పట్టణము బయటికిపోయి అచ్చట ఒక్క చదునుగానుండు ప్రదేశము చేరి చలముతో నని తాత్పర్యము.

## (✽) భీముఁడు జరాసంధునితో యుద్ధము సేయుట. (✽)



జరాసంధుఁడు. భీముఁడు.

సీ॥ పర్వతద్వంద్వంబు ✽ పాథోధియుగళంబు - మృగపతిద్వితయంబు ✽ వృషభయుగము
పావకద్వయము దం ✽ తావళయుగళంబు - దలపడు పోఁక ను ✽ ద్దండలీలఁ
గదిసి యన్యోన్య భీ ✽ కర గదాహతుల ను - గ్రంబుగ విస్ఫులిం ✽ గములు చెదరఁ
గెరలుచు సవ్య ద ✽ క్షిణ మండలభ్రమ - ణములను సింహ చం ✽ క్రమణములను
తే॥ గదిసి పాయుచు పాసి డ ✽ గ్గఱుచు మింటి । కెగసి గ్రుంగుచుఁ గ్రుంగి వే ✽ యెగసి భూమి
పగుల నార్చి చటచ్ఛటో ✽ ద్భట మహోగ్ర । ఘనగదా ఘట్టనధ్వని ✽ గగనమగల.

టీ॥ పర్వతద్వంద్వంబు=కొండలజతయు. పాథోధియుగళంబు = సముద్రములజంటయు. మృగపతిద్వితయంబు = సింహములరెండును. వృషభయుగము=ఆఁబోతులజతయు. పావకద్వయము=ఇరువురుఅగ్నులును. దంతావళయుగళంబు = రెండుఏనుఁగులును. తలపడుపోకన్=పోరాడువిధమున. ఉద్దండలీలన్ = నిక్కుగలవిధమున. కదిసి=చేరి. అన్యోన్యభీకరగదాహతులన్ = ఒకరొకరిగదలపెట్టులచేత. ఉగ్రంబుగన్=భయంకరముగ. విస్ఫులింగములు=మిడుఁగుఱులు. చెదరన్=రాలఁగా. కెరలుచున్=రేఁగుచు. సవ్యదక్షిణమండలభ్రమ

ణములన్ = ఎడమనుండి కుడికి కుడినుండి ఎడమకును గుడిదిరుగుటల చేతను. సింహచంక్రమణములన్ = సింహము దాఁటినట్లు దాఁటుటల చేతను. కదిసి=దగ్గఱవచ్చి. పాయుచున్=తొలఁగిపోవుచు. పాసి= తొలఁగి. డగ్గఱుచున్=కదియవచ్చుచును. మింటికెగసి=ఆకాశమునకు ఎగిరి. క్రుంగుచున్ = నేలతో సమముగా అణఁగిపోవుచు. క్రుంగి=అణఁగి. వే=శీఘ్రముగ. ఎగసి = మీఁదికెగిరి. భూమిపగులన్ = నేలబద్దలగు నట్లుగా. ఆర్చి=కేకవేసి. ఘటచ్ఛటోద్భట ... ధ్వనిన్—ఘటచ్ఛట= ఘటఘట అనెడు. ఉద్భట = అధికమయిన. మహోగ్ర=మిక్కిలి భయంకరమయిన. ఘన = గొప్పదియైన. గదా = గదలయొక్క. ఘట్టన=తాఁకుటలచేత నైన. ధ్వని=మ్రోఁతచేత. గగనము=ఆకాశము. అగలన్ = భేదిల్లఁగా—కదలనియాకాశము కదలఁగాననుట.

తా॥ రెండుపర్వతములు రెండుసముద్రములు రెండుసింహములు రెండు ఆఁబోతులు రెండుఅగ్నులు రెండుఏనుఁగులును ఒకటితో నొకటి తలపడిపోరాడునట్లు మిక్కిలియుద్ధముతో ఒకరొకరి గదల పెట్టులచేత మిడుఁగుఱులు రాలుచుండఁగా కేఁగి కుడియెడమలకు గుడిదిరుగుచు సింహములవలె చెంగలించి దాఁటుచు, దగ్గఱఁబోయి వెనుకకువచ్చుచు వెనుకకుబోయి దగ్గఱవచ్చుచు మిక్కిలిపొడవున కెగసి నేలకు క్రుంగుచు నేలకు క్రుంగి మింటికెగయుచు భూమి అదురునట్టుగా కేకలు వేయుచు భయంకరమయిన గదల తాఁకుడువల్ల నైనధ్వని ఆకాశమును భేదిల్లఁ జేయుచుండఁగా జరాసంధుఁడును భీముఁడును పోరాడిరని తాత్పర్యము.

౭౬౨. మ॥ గదసారించి బృహద్రథాత్మజుఁడు హుం * కార ప్రఘోషంబునన్
జదలల్లాడఁగఁ బాదఘట్టనమునన్ * సర్వంసహా భాగమున్
గదలన్ వాయుజు వ్రేసె వ్రేయ నతఁడు * గ్రక్రోధ దీప్తాత్ముఁడై
యది దప్పించి విరోధిమస్తకము వ్రే * యన్ వాఁడు పోఁదట్టుచున్.

టీ॥ బృహద్రథాత్మజుఁడు=జరాసంధుఁడు. గదసారించి=గదను విసరి. హుంకారప్రఘోషంబునన్ = హుం అనునట్టిమహాధ్వనిచేత. చదలు=ఆకాశము. అల్లాడఁగన్=చలింపఁగా. పాదఘట్టనమునన్= కాలి అదుముడుచేత. సర్వంసహాభాగమున్ = భూప్రదేశమును. కదలన్=అదురఁగాను. వాయుజున్=భీముని. వ్రేసెన్=కొట్టెను. వ్రేయన్=అట్లుకొట్టఁగా. అతఁడును=ఆభీముఁడును. ఉగ్రక్రోధదీప్తాత్ముఁడై=భయంకరకోపముచేత ఎఱ్ఱగా వెలుఁగుచున్న కన్నులుగలవాఁడై అది=ఆదెబ్బను. తప్పించి=తప్పించుకొని. విరోధిమస్తకమున్=పగవాఁడైనజరాసంధునినెత్తిని. వ్రేయన్=కొట్టఁగా. వాఁడును=ఆజరాసంధుఁడును. పోఁదట్టుచున్=దానిఁదప్పించుకొనుచు.

తా॥ జరాసంధుఁడు గదను పూన్చి భీముని తలమీఁద మిక్కిలి పూనికతో కొట్టఁగా అతఁడు ఆదెబ్బను తప్పించుకొని జరాసంధునితల మీఁద అట్లేమగలఁ గొట్టెను ఆదెబ్బనువాఁడును తప్పించుకొన్నవాఁడై యనితాత్పర్యము.

౭౬౩.—చ॥ మడపక భీమసేనుఁడును * మాగధ రాజుఁ గడంగి దెబ్బలుల్
విడివడులీల నొండొరుల * వీఁపులు మూఁపులునుం బ్రకోష్ఠముల్
నడుతల లూరుజాను జఘ * న ప్రకరంబులు బిట్టు వ్రయ్యఁగాఁ
బిడుగులఁబోలు పెన్గదల * బెట్టుగ వ్రేయుచుఁ బాయుచున్వెసన్.

టీ॥ మడపక=వెనుదీయక. (భీమసేనుఁడును) మాగధరాజును= జరాసంధుఁడును. కడంగి=పూని. దెబ్బలులు=పెద్దపులులు. విడివడు లీలన్ = అడ్డములేక మెలఁగునట్లు. ఒండొరుల = ఒకరొకరియొక్క. (వీఁపులు) మూఁపులు = భుజములమీఁదిభాగములు. ప్రకోష్ఠములు= ముంజేతులును. నడుతలలు=తలలనడిమి చోట్లు—మాడుపట్లును. ఊరు జానుజఘనప్రకరంబులు=తొడలు మోకాళ్లు గజ్జలు వీని సముదాయము లను. బిట్టు=మిక్కిలి. వ్రయ్యఁగాన్=పగులఁగా. పిడుగులఁబోలు= పిడుగులవంటి. పెన్గదలన్=పెద్దగదలతో. బెట్టుగన్=గట్టిగా. వ్రేయుచున్=కొట్టుచును. వెసన్=శీఘ్రముగ. పాయుచున్ = ఆదెబ్బలు తమ్ముతగులకుండఁదొలఁగిపోవుచును.

తా॥ ఈవిధముగా భీమజరాసంధులిద్దఱును పూనికతో పెద్దపులులు విడివడి పోరాడునట్లు ఒకరొకరి వీఁపులు మూఁపులు తొడలు గజ్జలు మోఁకాళ్లు మోచేతులు ముంజేతులు మొదలగు నవయవములు పగిలి బద్దలగునట్లుగా కొట్టుకొనుచు పిడుగులవంటి ఆగదల దెబ్బలు ఒకరి వలనివి వేఱొకరికి తగులకుండ తొలఁగి తప్పించుకొనుచు పోరాడిరని తాత్పర్యము.

లయవిభాతి॥ బెడఁగడరఁ బెన్గదలు * పొడిపొడిగఁ దాఁకఁ జెను * పిడుగులవనిం దొరఁగ * నుడుగణము రాలన్
మిడుఁగుఱులు చెదర నభ * మడల హరిదంతములు * వెడల జడధుల్గలఁగఁ * బుడమి చలియింపన్
వెడచఱువ మొత్తియును * దడఁబడఁగ నొత్తియును * నెడమకుడులొంచి తిరు * గుడువడఁగ వ్రేయన్
వడవడ వడంకుచును * సుడివడక డాసి చల * ముడుగక వు డొండొరులు * వడిచెడక పోరన్.

టీ॥ బెడఁగు=బాగు. అడరన్=అతిశయింపఁగాఁ. పెన్గదలు= పెద్దగదలు. పొడిపొడిగన్=పొడిపొడియగునట్టుగా — మిక్కిలిపొడి యగునట్టుగా. తాఁకన్=తగులఁగా. పెనుపిడుగులు=పెద్దపిడుగులు. అవనిన్=భూమియందు. తొరఁగన్=పడఁగా. ఉడుగణము=నక్షత్ర సమూహము. రాలన్=రాలఁగా. మిడుఁగుఱులు చెదరన్=నిప్పురవ లెగురఁగా. నభము=ఆకాశము. అడలన్=చలింపఁగాను. హరిదంత ములు=దిక్కులకొనలు. వెడలన్ = మీఱిపోవునట్లు. జడధులు=సము ద్రములు. కలఁగన్=కలఁక నొందఁగా. పుడమి=భూమి. చలియింపన్= అదురఁగా. వెడచఱువన్ = సారహీనత నొందునట్లు. మొత్తియును= కొట్టియును. తడఁబడఁగన్=తత్తఱపడునట్లు. ఒత్తియున్=తొలఁగఁ

దతిమియు. ఎడమకుడులు = ఎడమ పార్శ్వమును కుడి పార్శ్వమును. ఒంచి=నొప్పించి. తిరుగుడువడఁగక=వెనుకకు ముందఱికి తిరుగుడు పాటు నొందునట్లు. వ్రేయక్=మోఁదగాను. (వడవడవడఁకుచును) సుడివడక=స్రుక్కిపడక. డాసి=సమీపించి. చలముడుగక=మాత్సర్యమును విడువక. (అపుడు) ఒండొరులు = పరస్పరము. వడిచెడక = ఉత్సాహముచెడకుండునట్లు. పోరక్=పోరాడఁగా.

తా॥ నేర్పుమీఱ పెద్దగదలు పొడిపొడి అగునట్లుగా తాడించుచు, ఆకాశమునుండి పిడుగులుపడునట్టుగాను నక్షత్రములు రాలునట్టుగాను మిన్ను చలించునట్టుగాను దిక్కులనుమీఱునట్లు సముద్రములు పొంగి పొరలి పాఱునట్టుగాను భూమి యదురునట్టుగాను ఒకరొకరి సత్తువలుచెడ తత్తఱములు కలుగ కుడినుండి యెడమ తట్టును ఎడమనుండి కుడితట్టును నొప్పించి మాఱుపడఁగొట్టియు వడవడ వణఁకుచు స్రుక్కిపడక ఓకరినొకరు గదియఁబడి చలము మానక మిక్కిలి ఉత్సాహముతో ఆయిద్దఱును పోరాడఁగాఅనితా.

వ॥ ఇవ్విధంబునం బోరుచుండ నొండొరుల గదాదండంబులు తుమురులైనం బెండువడక సమద దిగ్వేదండశుండాదండ మండిత ప్రచండంబులగు బాహుదండంబు లప్పళించి ముష్టియుద్ధంబునకు డగ్గఱి.

టీ॥ ఇవ్విధంబునక్ = ఈతీరుగా. పోరుచుండక్ = యుద్ధము చేయుచుండఁగా. ఒండొరులగదాదండంబులు = ఇరువురిగదలును. తుమురులైనక్=పొడిపొడియైపోఁగా. బెండువడక=నిస్సారత్వము నొందక. సమద...బులు—సమద=మదముతోఁగూడిన. దిగ్వేదండ=దిగ్గజములయొక్క. శుండాదండ=చాపుకఱ్ఱలవంటితొండములను. మండిత=అలంకరించునవియై. ప్రచండంబులు=మిక్కిలి భయమును పుట్టించునట్టివి. (అగు) బాహుదండంబులు = భుజములను. అప్పళించి=చఱచి. ముష్టియుద్ధంబునకుక్=పిడికిటిపోట్లాటకు. డగ్గఱి=కదియఁబడి.

తా॥ ఈవిధముగా యుద్ధముచేయునపుడు ఇరువురిగదలును ఒకటినొకటి తాఁకి విఱిగి పొడిపొడియైపోఁగా అంతటితో దిగులుపడి నిలువక మదించిన దిగ్గజములయొక్క తొండములను బోలిన నిడుపాటి గడుసైన భుజములను చఱచుకొనుచు పిడికిటిపోట్లతో పోరాడుటకై కదియఁబడినవారైయని తాత్పర్యము.

లయగ్రాహి॥ కాలవెస తాఁచియును * గీలెడలఁ ద్రోచియును * దాలములుదూలఁ బెడ * కేల వడి వ్రేయక్
ఫాలములు గక్షములు * దాలువులు వక్షములు * లీలనెముక ల్మెదడు * నేలనుమురై వే
రాలవిపులక్షతవి * లోలమగు నెత్తురిలఁ * జాలుగొనియోలిఁ బెను * గాలువలుగాన బే
తాల మదభూతములు * ఖేలనలఁ జేతులను * దాళములు దట్టుచును * లీల వడి నాడక్.

టీ॥ కాలక్=కాలితో. వెసక్ = వడిగా. తాఁచియును=తన్నియును. కీలెడలక్ = కీళ్లువదలునట్లు. (త్రోచియును) తాలములు = తాళము అను మల్లవిజ్ఞానభేదములు. తూలక్ = చలింపఁగాను. పెడకేలక్=చేతిపెడవైపున. వడివ్రేయక్=వడిగాకొట్టఁగా ఫాలములు=నొసళ్లును. కక్షములు=చంకలును. తాలువులు=దవుడలును. వక్షములు=ఱొమ్ములును. లీలక్=వినోదముగా—అనాయాసముగా. (ఎముకలు) మెదడు=తలపుఱ్ఱెలోనిమాంసమును. నేలక్=భూమియందు. తుమురై=పొడియై. వే=శీఘ్రముగ. రాలక్=రాలఁగాను. విపులక్షతవిలోలము=పెద్దగాయములచేత మిక్కిలి చలించునది. అగునెత్తురు=అగునట్టిరక్తము. ఇలక్=భూమియందు. జాలుగొని=వెల్లువయై. ఓలిక్ = క్రమముగా. పెనుగాలువలు = పెద్దకాలువలు. కానక్=ఏర్పడఁగా. బేతాళమదభూతములు=బేతాళములు మొదలగు మదించినపిశాచములు. ఖేలనలక్=వేడుకలతో. చేతులక్ = చేతులతో. తాళములుతట్టుచుక్ = తాళములువేయుచును. లీలక్=విలాసముగా. వడిక్=వడితో. ఆడక్=ఆడఁగా.

తా॥ కాళ్లతోతన్నియును, కీళ్లు సడల పడఁద్రోసియును, తాళములు అను మల్లవిజ్ఞానభేదములు క్రమము తప్పిపోవునట్లు చేతివెనుకటివైపుతగుల మోఁదియును, నొసళ్లుచంకలు దవుడలు ఱొమ్ములు మొదలగు అవయములందుండి నెత్తురు క్రొవ్వు బయలువెడలను అవయవములసంధులు విఱిగిపొడిపొడిగాను, నెత్తురువెల్లువలుగట్టి కాలువలైపాఱఁగాను, భూతబేతాళములు చేతులతో తాళములుతట్టుచు వేడుకగా నాట్యముచేయఁగాను, భీమజరాసంధులుపోరాడిరనితా.

౭౬౭.—ఉ॥ ప్రక్కలుఁ జెక్కులున్మెడలు * పాణి తలంబులచేఁ బగుల్చుచుక్
ముక్కులు నక్కులుం జెవులు * ముష్టిహతిన్నలియంగ గ్రుద్దుచుక్
డొక్కలుఁ బిక్కలున్ఘనక * ఘోరపదాహతి నొంచుచున్నెఱుల్
దక్కక స్రుక్కకొండొరులఁ * దార్కొని పేర్కొని పోరిరుగ్రతక్.

టీ॥ ప్రక్కలును=పార్శ్వభాగములును. చెక్కులును=చెక్కిళ్లను. (మెడలును) పాణితలంబులచేక్=అఱచేతిచఱపులచేత. పగుల్చుచుక్=బద్దలుగాపగులఁగొట్టుచు. (ముక్కులును) అక్కులును=ఱొమ్ములును. (చెవులును) ముష్టిహతిక్=పిడికిటిపోటులచేత. నలియంగక్=నలఁగునట్లు. గ్రుద్దుచుక్=మోఁదుచును. డొక్కలు=కడుపుప్రక్కభాగములను. పిక్కలును = జంఘలును. ఘనకఘోరపదాహతిక్=గొప్పదైన కఠినమైన కాలితన్నుచేత. నొంచుచుక్=నొప్పించుచు. నెఱులు=క్రమములు. తక్కక=మానక. స్రుక్కక=అలయక. ఒండొరులక్=ఒకరొకరిని. దార్కొని=దారసిల్లి. పేర్కొని=పేరులుచెప్పుకొని. ఉగ్రతక్ = భయంకరత్వముతో. (పోరిరి)

తా॥ ప్రక్కలు చెక్కిళ్లు ముక్కులుడొక్కలుపిక్కలుఱొమ్ములు మెడలు చెవులు మొదలగు అవయవములను పిడికిళ్లతో నలియ గ్రుద్దుచు, కాళ్లతో నొవ్వతన్నుచు, ఒకరికొకరు తగ్గక తారసిల్లి తమ పేరులుచెప్పి చెప్పికొట్టుచుభీమజరాసంధులిరువురునుపోరాడిరనితా.

౭౬౮.—ఉ॥ హుమ్మని మ్రోఁగుచుం బెలుచ * హుంకృతు లిచ్చుచుఁ బాసి డాసి కో-
కొమ్మనుచు న్నొడల్లగిలి * గుల్లల తిత్తులుగాఁ బదంబులన్
గ్రుమ్ముచు ముష్టిఘట్టనల * గ్రుక్కుచు నూర్పులు దండడింపఁగా
సొమ్మలు వోవుచున్ దెలియు * చున్ మదిఁజేవయు లావుఁజూపుచున్.

టీ॥ హుమ్మని మ్రోఁగుచున్ = హుం అని చప్పుడించుచు. పెలుచన్ = గట్టిగా. హుంకృతులిచ్చుచున్ = హుంకారములు చేయుచు. పాసి=దూరముగా తొలఁగిపోయి. డాసి=మరలసమీపించి. కోకొమ్ము=ఇదిగో తీసికొమ్ము. అనుచున్ = అని. ఒడళ్లు= దేహములు. అగిలి = భేదిల్లి. గుల్లలతిత్తులుకాన్ = గుల్లలుపోసిన సంచులవలెకాఁగా. పదంబులన్=కాళ్లతో. క్రుమ్ముచున్=అణఁగ మోఁదుచు. ముష్టిఘట్టనలన్=పిడికిటిపోటులచేత. గ్రుక్కుచున్= అలఁతనొందుచు. ఊర్పులుదండడింపఁగాన్ = శ్వాసములు అతిశయింపఁగా. సొమ్మలువోవుచున్ = మూర్ఛిల్లుచు. తెలియుచున్= అంతలో మూర్ఛలవలన తెలివినొందుచు. మదిన్ = మనసునఁగల. చేవయున్=శూరత్వమును. లావున్ = బలమును. చూపుచున్= కనఁబఱుచుచును.

తా॥ హుంకారధ్వనులుచేయుచు, దూరముగా తొలఁగిపోయి మరలచేరవచ్చుచు, ఇదిగో ఈదెబ్బ పుచ్చుకొమ్మని దేహములు నలియునట్లు మోఁకాళ్లతో క్రుమ్ముచు, పిడికిళ్లతో దేహములోని యెముకలన్ని విఱుగునట్లు పొడుచుచు, నిట్టూర్పులు విడుచుచు, మూర్ఛలు పోయి తేఱుకొనుచు, తమశూరత్వమును బలమును కనఁబఱుచుచు పోరాడిరని తాత్పర్యము.







(*) భీముఁడు జరాసంధునిఁజంపుట. (*) అర్జునుఁడు.

వ॥ ఇవ్విధంబున వజ్రివజ్ర సన్నిభంబులగు నితరేతర ముష్టిఘట్టనల భిన్నాంగులై రక్తసిక్త శరీరంబులతోడఁ బుష్పితాశోకంబుల వీఁకను జేగురుఁగొండల చందంబునం జూపట్టి పోరుచుండఁ గృష్ణుండు జరాసంధుని జన్మ మరణ ప్రకారంబు లాత్మ నెఱుంగుటంజేసి వాయుతనూభవున కలయిక లేక లావును జేవయుఁ గల్గునట్లుగాఁ దద్గాత్రంబునందుఁ దనదివ్యతేజంబు నిల్పి విరోధి నిరసనోపాయం బూహించి సమీరణ నందనుండు సూచుచుండ నొక్క శాఖాగ్రంబు రెండుగాఁజీల్చి వానినిట్లు చీరిచంపుమని సంజ్ఞగాఁ జూపిచెప్పిన నతండు నాకీలు దెలిసి యవక్ర విక్రమ పరాక్రముండై మాగధుం బడఁద్రోచి వానిపదంబు పదంబునఁ ద్రొక్కి బాహుయుగళంబున రెండవపదంబు గదలకుండం బట్టి మస్తక పర్యంతంబుఁ బెళపెళయను చప్పుళ్లుప్పతిల్ల మత్తదంతావళంబు దాళవృక్షంబుఁ జీరుచందంబునఁ బాదజాను జంఘోరు కటి మధ్యోదరాంస కర్ణ నయనంబులు వేఱువేఱుభాగంబులుగా వ్రయ్యలువాపి యార్చినఁ బౌరజనంబులు గనుంగొని భయాకులులై హాహాకారంబులు సేసిరంత.

టీ॥ ఇవ్విధంబునన్ = ఈరీతిగా. వజ్రివజ్రసన్నిభంబులు= ఇంద్రునివజ్రాయుధమునుబోలినవి. అగునితరేతరముష్టిఘట్టనలన్= అయినట్టి ఒకరొకరి పిడికిళ్లపోట్లచేత. భిన్నాంగులై = భేదింపఁబడిన అవయవములుగలవారై. రక్తసిక్తశరీరంబులతోడన్=నెత్తుట తడిసిన దేహములతో. పుష్పితాశోకంబులవీఁకను=పూచిన అశోకపు మ్రాఁకులవలెను. జేగురుఁగొండలచందంబునన్=ఎఱ్ఱనికొండలవిధమునను. చూపట్టి = కనఁబడి. పోరుచుండన్ = యుద్ధముచేయుచుండఁగా. (కృష్ణుండు) జరాసంధునిజన్మమరణప్రకారంబులు = జరాసంధునియొక్క పుట్టినవిధమును చచ్చువిధమును. ఆత్మన్= తనలో. ఎఱుఁగుటంజేసి = తెలిసినవాఁడు అగుటచేత. వాయుతనూభవునకున్=భీమునికి. అలయిక=శ్రమము–బడలిక. లేక= లేకుండునట్టుగాను. లావును=బలమును. చేవయున్=ధైర్యమును. (కల్గునట్టుగా) తద్గాత్రంబునందున్=అతనిదేహమునందు. తనదివ్యతేజంబున్=అప్రాకృతమయిన తనతేజస్సును. నిలిపి = ఉంచి. విరో

ధినిరసనోపాయంబు = పగవాని నణఁచు విధమును. ఊహించి = ఆలోచించి. సమీరణనందనుండు = భీముఁడు. చూచుచుండఁ = చూచుచునుండఁగా. ఒకశాఖాగ్రంబు = ఒకరెమ్మను. (రెండుగా) చీల్చి = చీలఁదీసి. వానిని = జరాసంధుని. ఇట్ల = ఈవిధముగానే. చీరి = చీల్చి. (చంపుమని) సంజ్ఞగాఁ = సైఁగఁగా. (చూపిచెప్పిన) ఆతండును = ఆభీముఁడును. ఆకీలు = ఆమర్మము. (తెలిసి) అవక్రవిక్రమపరాక్రముండై = వంకరగాని శౌర్యముచేత పగవాని ఆక్రమించువాఁడై. మాగధుఁ = జరాసంధుని. (పడఁద్రోచి) వాని పదంబు = వానికాలు. పదంబునఁ = తనకాలిచేత. త్రొక్కి = త్రొక్కిపట్టి. బాహుయుగళంబునఁ = తనరెండుచేతులతోను. రెండవపదంబు = వానిరెండవకాలిని. కదలకుండఁ = చలింపకుండ. (పట్టి) మస్తకపర్యంతంబు = తలదాఁక. (పెళపెళయనుచప్పుళ్లు) ఉప్పతిల్లఁ = పుట్టఁగా. మత్తదంతావళంబు = మదపుటేనుఁగు. తాళవృక్షంబుఁ = తాటిచెట్టును. చీరుచందంబునఁ = చీల్చువిధమున. పాదజానుజంఘోరుకటిమధ్యోదరాంసకర్ణనయనంబులు — పాద = కాళ్లు. జాను = మోఁకాళ్లు. జంఘ = పిక్కలు. కటి = పిఱుఁదులు. మధ్య = నడుము. ఉదర = కడుపు. అంస = మూఁపులు. కర్ణ = చెవులు. నయనంబులు = కన్నులును. వేఱువేఱుభాగంబులుగాఁ = వేఱువేఱుగా పంచి వేసినట్టుకాఁగా. వ్రయ్యలువాపి = చీలికలుచేసి. ఆర్చినఁ = సింహనాదముచేయఁగా. పౌరజనంబులు = పట్టణప్రజనులు. కనుంగొని = చూచి. భయాకులురై = భయముచేత కలఁతనొందినవారై. హాహాకారంబులు = హాహా అను ధ్వనులను — అయ్యో అయ్యో అను చప్పుళ్లను. చేసిరి = కలుగఁజేసిరి. అంతఁ = అనంతరము.

తా॥ ఈమేరకు భీమజరాసంధు లిరువురును వజ్రాయుధప్రపోట్లవంటి పిడికిటిపోట్లచేత ఒకరొకరిదేహములు నలియునట్లు కొట్టుకొని నెత్తుటిచేత తడిసిన దేహములుగలవారై పూచినయశోకవృక్షములను ఎఱ్ఱని కొండలను బోలినవారు అగుచు పోరాడుచుండఁగా శ్రీకృష్ణమూర్తి జరాసంధునిపుట్టుకయు వాఁడు చచ్చురీతియు నెఱిఁగినవాఁడుగనుక భీమునికి బడలిక కలుగక యుండను బలమును శౌర్యమును తగ్గకయుండను దివ్యమయిన తనతేజస్సును అతనిదేహమునందు చొప్పించి ఒకమెల్లచేత పుచ్చుకొని రెండుగా చీల్చి యిట్లు నీపగవానిని చీల్చి చంపుమని సైఁగఁగా భీమునికిఁ జూపఁగా అతఁడు ఆజాడతెలిసికొని జరాసంధుని నేలఁబడవేసి తనరెండుకాళ్లతోను వాని ఒక కాలిని అణఁగఁద్రొక్కి రెండు చేతులతోనువానిరెండవకాలినికదలకుండబిగఁబట్టికాలుచేయికన్నుముక్కుమొదలుగాఁగల అవయవములన్ని పంచివేసినట్లేర్పడరెండు చీలికలుగా వానిదేహమునుచీల్చి పడవైచి సింహనాదముచేయఁగా పురజనులుచూచి భయపడి హాహాయని అఱచిరంగలార్చిరని తా.

౨౨౦.—క॥ అనిలజుని దేవపతి నం । దనుఁడును బద్మాక్షుఁడును ను * దారత నాలిం
గనములు సేసి పరాక్రమ । మున కద్భుత మంది మోద * మునఁ బొగడి రొగిఁ.

టీ॥ అనిలజుఁ = భీముని. దేవపతినందనుఁడును = అర్జునుఁడును. పద్మాక్షుఁడును = శ్రీకృష్ణుఁడును. ఉదారతఁ = గౌరవముతో. ఆలింగనములుచేసి = కౌఁగిలించుకొని. పరాక్రమమునకుఁ = భీముని యొక్క పరాక్రమమునకు. అద్భుతమంది = ఆశ్చర్యమునుపొంది. మోదమునఁ = సంతోషముతో. ఒగిఁ = క్రమముగా. (పొగడిరి)

తా॥ అటుపిమ్మట అర్జునుఁడును శ్రీకృష్ణమూర్తియు సంతోషించినవారై భీముని కౌఁగిలించుకొని అతనిపరాక్రమ విశేషమునకు మెచ్చుకొనుచు మిక్కిలి పొగడిరని తాత్పర్యము.

౨౨౧.—క॥ వనజాక్షుఁ డంతఁ గరుణా । వననిధియును భక్తలోక * వత్సలుఁడును గా
వున మాగధసుతు సహదే । వునిఁ బట్టముగట్టెఁ దన్మ * హోన్నత పదవిఁ.

టీ॥ అంతఁ = అంతట. వనజాక్షుఁడు = కృష్ణుఁడు. కరుణావననిధియును = దయాసముద్రుఁడును. భక్తలోకవత్సలుఁడును = భక్తజనసమూహమునందు వాత్సల్యముగలవాఁడును. కావునఁ = కనుక. మాగధసుతుఁ = జరాసంధునికొడుకైన. సహదేవునిఁ = సహదేవుఁడనువానిని. తన్మహోన్నతపదవిఁ = ఆజరాసంధునిమహారాజ్యాధిపత్యమునందు. పట్టముగట్టెను = పట్టాభిషేకముచేసెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి మిక్కిలి దయగలవాఁడును, సేవకజనులయందు ప్రేమగలవాఁడును గనుక అప్పుడు జరాసంధునికొడుకైన సహదేవుఁడు అనువానిని ఆదరించి వానిరాజ్యాధిపత్యమును వానికిచ్చి పట్టముగట్టించెనని తాత్పర్యము.

౨౨౨.—క॥ మగధాధి నాధునకు ము । న్నగపడి చెఱసాలలను మ * హాదుఃఖములఁ
నొగులుచుఁ దనపాదాంబుజ । యుగళము జింతించుచున్న * యుర్వీశ్వరులఁ.

టీ॥ మగధాధినాధునకుఁ = జరాసంధునికి. మున్ను = మునుపు. అగపడి = చిక్కి. చెఱసాలలను = చెఱసాలలయందు. మహాదుఃఖములఁ = అధికదుఃఖములచేత. నొగులుచుఁ = బాధనొందుచు. తనపాదాంబుజయుగళముఁ = తనఅడుగుఁదామరలజంటను. చింతించుచున్న = తలఁచుచున్న. ఉర్వీశ్వరులఁ = భూమికిదొరలైనరాజులను.

తా॥ జరాసంధునిచేత చిక్కి చెఱసాలలలోఁబడి చిరకాలము మేరలేని దుఃఖములను అనుభవించుచు శ్రీకృష్ణమూర్తి పాదకమలములను ధ్యానించుచున్న రాజులనందఱను అని తాత్పర్యము.

వ॥ అయ్యవసరంబునఁ గృష్ణుండు దనదివ్యచిత్తమ్మున మఱవ నవధరింపక మగధరాజనిరుద్ధుల చెఱలు విడిపించిన వారలు పెద్దకాలంబు కారాగృహంబులఁ బెక్కుబాధలం బడి కృశీభూత శరీరులగుటంజేసి రక్తమాంస శూన్యంబులై త్వగస్థి మాత్రావశిష్టంబులును, ధూళి ధూసరంబులు నైన దేహంబులును, గేశ పాశంబులు మాసి జటా బంధంబులైన శిరోజంబులును, మలిన వస్త్రంబులునుం గలిగి చను దెంచి రప్పుడు.

టీ॥ అయ్యవసరంబునన్ = ఆసమయమునందు. (కృష్ణుండు) తన దివ్యచిత్తమ్మునన్ = దివ్యమైన తన అంతరంగమందు. మఱవనభరింపక = బాహ్మణునిమాటనుమఱచిపోక. మగధరాజనిరుద్ధులచెఱలు = జరాసంధునిచేత నిర్బంధింపఁబడినవారి చెఱలను. విడిపించినన్ = వదలింపఁగా. వారలు = ఆరాజులు. పెద్దకాలంబు = బహుకాలము. కారాగృహంబులన్ = చెఱసాలలయందు. పెక్కుబాధలన్ = అనేకబాధలను. పడి = అనుభవించి. కృశీభూతశరీరులు = చిక్కిపోయిన దేహములుగలవారు. అగుటం జేసి = అగుటచేత. రక్తమాంసశూన్యంబులై = నెత్తురునుమాంసమునులేనివై. త్వగస్థిమాత్రావశిష్టంబులును = తోలు ఎముకలుమాత్రము మిగిలినవియు. ధూళిధూసరంబులును = దుమ్ము కమ్ము కొనుటచేత ఇంచుక తెల్లఁబాఱినవియు. (అయిన దేహంబులును) కేశపాశంబులు = సిగముళ్లు. మాసి = మయిలపడి - వన్నెమాఱి. జటాబంధంబులైన = జడముళ్లయిన. శిరోజంబులును = తలవెండ్రుకలును. మలినవస్త్రంబులును = ముఱికిబట్టలును. (కలిగి) చనుదెంచిరి = వచ్చిరి. (అప్పుడు)

తా॥ అప్పుడు కృష్ణుఁడు తనమనసున జరాసంధునిచేత పట్టుపడిన రాజులనెల్ల చెఱలలోనుండి విడిపింపవలెనను తలఁపుగలవాఁడై విడువను త్తరవుచేయఁగా ఆరాజులందఱు చెఱసాలలోనుండి బయలువెడలి నెత్తురు మాంసములు ఎండిపోఁగా తోలును ఎముకలును మాత్రము గలిగి దుమ్ముచేత తెల్లఁబాఱిన దేహములతోను సిగముళ్లన్నియు జడముళ్లు కాఁగా మాసిపోయినతలవెండ్రుకలతోను ముఱికిబట్టలతోను శ్రీకృష్ణుని సన్నిధానమునకువచ్చిరిఅనితాత్పర్యము.




(*) కారాగృహ విముక్తులగు రాజులు శ్రీకృష్ణుని స్తుతించుట. (*)

౨౨౮.—సీ॥ నవపద్మలోచను * భవబంధమోచను - భరితశుభాకారు * దురితదూరుఁ
గంకణకేయూరుఁ * గాంచనమంజీరు - వివిధశోభితభూషు * విగతదోషుఁ
బన్నగాంతకవాహు * భక్తమహోత్సాహు - నతచంద్రజూటు ను * న్నతకిరీటు
హరినీల నిభకాయు * వరపీత కౌశేయుఁ - గటిసూత్రధారు జ * గద్విహారు
తే॥ హార వనమాలికా మహి * తోరు వక్షు । శంఖ చక్ర గదా పద్మ * శార్ఙ్గహస్తు
లలితశ్రీవత్స శోభిత * లక్షణాంగు । సుభగచారిత్రు దేవకీ * సుతునిఁ గాంచి.

టీ॥ నవపద్మలోచనున్ = క్రొత్తగాఁ పూచిన కమలములవంటి కన్నులుగలవాఁడును. భవబంధమోచనున్ = జన్మబంధములనుతొలఁగించువాఁడును. భరితశుభాకారున్ = నిండిన మేలే ఆకృతియైనవాఁడును. దురితదూరున్ = పాపమునకు ఎడమయినవాఁడును. కంకణకేయూరున్ = కడియములుభుజకీర్తులుగలవాఁడును. కాంచనమంజీరున్ = బంగారుఅందెలుగలవాఁడును. వివిధశోభితభూషున్ = నానావిధములై ప్రకాశించునట్టి ఆభరణములుగలవాఁడును. విగతదోషున్ = పోయినపాపములు గలవాఁడును. పన్నగాంతకవాహున్ = పాములకు యముఁడైనగరుత్మంతుఁడు వాహనముగాఁ గలవాఁడును. భక్తమహోత్సాహున్ = సేవకులకు మిక్కిలి ఉత్సాహమును గలుగఁజేయువాఁడును. నతచంద్రజూటున్ = నమస్కరించిన శివుఁడుగలవాఁడును. ఉన్నతకిరీటున్ = ఉన్నతమయిన కిరీటముగలవాఁడును. హరినీల నిభకాయున్ = ఇంద్రనీల మణులను బోలిన దేహముగలవాఁడును. వరపీతకౌశేయున్ = శ్రేష్ఠమయిన పచ్చపట్టువస్త్రము గలవాఁడును. కటిసూత్రధారున్ = మొలనూలునుదాల్చినవాఁడును. జగద్విహారున్ = లోకమునందెల్లయెడల విహరించువాఁడును. హారవనమాలికామహితోరువక్షున్ = ముత్యాలపేరులచేతను వనమాలచేతను ఘనతనువహించిన విశాలమయిన ఱొమ్ముగలవాఁడును. శంఖ చక్ర గదా పద్మశార్ఙ్గహస్తున్ = శంఖము చక్రము గద పద్మము శార్ఙ్గము అనువానిని బూనిన చేతులు గలవాఁడును. లలిత శ్రీవత్స శోభిత లక్షణాంగున్ = మనోజ్ఞమయిన శ్రీవత్సమనెడి ప్రకాశించునట్టిమచ్చగుఱుతుగలదేహముగలవాఁడును సుభగచారిత్రున్ = కోరఁదగిన నడవడిక గలవాఁడును. దేవకీసుతునిన్ = దేవకీదేవి కొడుకైన శ్రీకృష్ణమూర్తిని. కాంచి = చూచి.

తా॥ అప్పుడు ఆరాజులు అప్పుడు వికసించిన తామరలవంటి కన్నులు గలవాఁడును, సంసారబంధమువలన విడిపించువాఁడును, మంచి ఆకారముగలవాఁడును, పాపములకు ఎడమయినవాఁడును,

కంకణములు బాహుపురులు గలవాఁడును, బంగారు అందెలు గల వాఁడును, నానావిధముల వెలుఁగునట్టి ఆభరణములుగలవాఁడును, ఏదోషములును లేనివాఁడును, గరుడవాహనము గలవాఁడును, భక్తులకు మేలయిన ఉత్సాహమునిచ్చువాఁడును, శివునిచేతనమస్కరింపఁబడువాఁడును, మేలయినకిరీటముగలవాఁడును,ఇంద్రనీలవర్ణమయిన దేహము గలవాఁడును, మేలయిన పచ్చపట్టువస్త్రముగల వాఁడును, మొలనూలు తాల్చినవాఁడును, జగత్తునం దెల్లయెడల వెలఁగువాఁడును, హారములు వనమాల మొదలగువానిచేత వెలుఁగొందునట్టి వక్షస్థ్సలముగలవాఁడును, శంఖచక్రాదులైన ఆయుధములతోడి హస్తములుగల వాఁడును, ఱొమ్మునందు శ్రీవత్సమనెడి మచ్చగుఱుతు గలవాఁడును, మంచి నడవడిగలవాఁడును, దేవకీదేవికొడుకునైన శ్రీకృష్ణమూర్తిని జూచినవారై అని తాత్పర్యము.

౭౭౫.—చ॥ భరిత ముదాత్ములై విగత ✻ బంధనులై నిజమస్తము ల్మురా
సురరిపు పాదపద్మములు ✻ సోఁకఁగఁ జాఁగిలి మ్రొక్కి నమ్రులై
కరములు మోడ్చి యోపరమ ✻ కారుణికోత్తమ సజ్జనార్తి సం
హరణ వివేకశీల మహి ✻ తాశ్రితపోషణ పాపశోషణా.

టీ॥ భరితముదాత్ములై=నిండినసంతోషముతోడి మనసులుగల వారై. విగతబంధనులై = పోయిననిర్బంధములుగలవారై. నిజమస్తములు=తమతలలు. మురాసురరిపుపాదపద్మములు = శ్రీకృష్ణమూర్తి యొక్క పాదకమలములను. సోఁకఁగన్ = తాఁకునట్టుగా. చాఁగిలి=చాఁగిలఁబడి. మ్రొక్కి=నమస్కరించి. నమ్రులై=వంగినవారై. కరములు=చేతులను. మోడ్చి = ముకుళించుకొని. ఓపరమకారుణికోత్తమ = ఓమేలయిన కరుణగలవారిలో శ్రేష్ఠుఁడా. సజ్జనార్తిసంహరణ=సత్పురుషులదుఃఖములను పోఁగొట్టునట్టివాఁడా. వివేకశీలమహితా = ఉచితానుచిత పరిజ్ఞానముచేతను మంచినడవడిచేతనుగొప్పవాఁడా. ఆశ్రితపోషణ = ఆశ్రయించినవారినిప్రోచువాఁడా. పాపశోషణా=పాపులను అణఁచివేయువాఁడా.

తా॥ మిక్కిలి సంతోషించిన మనసులుగలవారై అన్ని నిర్బంధములను తొలఁగించుకొని తమతలలు శ్రీకృష్ణుని పాదకమలములు సోఁకునట్లు సాగిలఁబడి మ్రొక్కి వినయముచేత వంపఁబడిన దేహములుగలవారై చేతులు జోడించుకొని మంచి కరుణగల వాఁడవును, సజ్జనులదుఃఖములను పోఁగొట్టువాఁడవును, ఉచితానుచిత పరిజ్ఞానమును మంచినడవడియుఁ గలవాఁడవును, ఆశ్రయించిన వారి నేలువాఁడవును,పాపములనుపోఁగొట్టువాఁడవునైనఓస్వామీ!అనిరనితా.

౭౭౬.—ఆ॥ వరద పద్మనాభ ✻ హరి కృష్ణ గోవింద । దాసదుఃఖనాశ ✻ వాసుదేవ
యవ్యయాప్రమేయ ✻ యనిశంబు గావింతు । మిందిరేశ నీకు ✻ వందనములు

టీ॥ వరద=కోరినకోరికల నిచ్చువాఁడా. పద్మనాభ = నాభియందు కమలముగలవాఁడా. హరి=పాపములనుహరించువాఁడా. కృష్ణ=సర్వమునుచేయువాఁడా. గోవింద=వేదములచేత నెఱుఁగఁబడువాఁడా. దాసదుఃఖనాశ = సేవకులదుఃఖములను పోఁగొట్టువాఁడా. వాసుదేవ = సర్వప్రాణులకును ఉనికిపట్టై సర్వప్రాణులందును వసించువాఁడా. అవ్యయ = నాశములేనివాఁడా. అప్రమేయ = ఇంతటివాఁడని చెప్పశక్యముగానివాఁడా. ఇందిరేశ=లక్ష్మీపతీ. అనిశంబు=ఎల్లప్పుడు. (నీకు) వందనములు=నమస్కారములను. కావింతుము=చేయుదుము.

తా॥ కోరినకోరికలనిచ్చునట్టియు, బ్రహ్మజన్మమునకుకారణమైన తామరబొడ్డునందుఁగలిగినట్టియు,పాపములనుహరించునట్టియుసర్వమునుకలుగఁజేయునట్టియు,వేదములచేతఁజెప్పఁబడునట్టియు, సర్వమునకునివాసభూతుఁడైనట్టియు,నశింపనట్టియు,మేరలేనట్టియు, శ్రీలక్ష్మీనాథుఁడైనట్టియు, నీకుమేముసదా నమస్కరించుచున్నామనితా.

౭౭౭.—ఉ॥ ధీరవిచార మమ్ము భవ ✻ దీయ పదాశ్రయులన్ జరా సుతో
దార నిబంధనోగ్ర పరి ✻ తాపముపోఁ గరుణావ లోకనా
సారముచేత నార్చితివి ✻ సజ్జనరక్షయు దుష్టశిక్షయు
న్నారయ నీకుఁ గార్యములు ✻ యాదవ వంశ పయోధిచంద్రమా.

టీ॥ ధీరవిచార=ధైర్యముతోడి విచారముగల. యాదవవంశపయోధిచంద్రమా=యదువంశమనెడు సముద్రమునకు చంద్రుఁడవైన ఓశ్రీకృష్ణా. భవదీయపదాశ్రయులన్ = మీపాదము లాశ్రయించినవారమయిన. (మమ్ము)జరాసుతో...తాపము—జరాసుత=జరాసంధునివల్లనైన. ఉదార=అధికమైన. నిబంధన=నిర్బంధమువలని. ఉగ్ర=భయంకరమయిన. లేక, వేంద్రమైన. పరితాపము=సంతాపమును. పోన్=అణఁగిపోవునట్టుగా. కరుణావలోకనాసారముచేతన్=దయతోడి చూపనెడువానచేత. ఆర్చితివి=ఊరార్చితివి. ఆరయన్ =విచారింపఁగా. సజ్జనరక్షయున్ = మంచివారిని రక్షించుటయును. దుష్టశిక్షయున్ = చెడ్డవారిని శిక్షించుటయును. (నీకు) కార్యములు=పనులు.

తా॥ మంచి ఆలోచనగలవాఁడవును, యాదవవంశశ్రేష్ఠుఁడవునైన ఓశ్రీకృష్ణమూర్తీ! క్రూరుఁడైన జరాసంధుని నిర్బంధమువలన మేము పొందుచున్న పరితాపమును పోఁగొట్టి మమ్ము ఆదరించితివి, విచారింపఁగా సాధువులను కాపాడుటయు, అసాధువులనుబాధించుటయు నీపనులేకదాయనిరి అని తాత్పర్యము.

౭౭౮.—సీ॥ అవధరింపుము మాగ * ధా ధీశ్వరుఁడు మాకుఁ - బరమ బంధుఁడుగాని * పగఱగాఁడు
ప్రకటిత రాజ్య వై * భవ మదాంధీభూత - చేతస్కులము మమ్ముఁ * జెప్ప నేల
గమనీయ జలతరం * గములకై వడి దీప - శిఖవోలెఁ జూడ న * స్థిరములైన
గురుసంపదలు నమ్మి * పరసాధన క్రియా - గమమేది తద్బాధ * కంబునైన
తే॥ బలసి యన్యోన్య వైరాను * బంధ ములను । బ్రజలఁ గాఱించుచును దుష్ట * భావచిత్తు
లగుచు నాసన్న మృత్యు భ * యంబుఁ దక్కి । మత్తులై తిరుగుదురు దు * ర్మనుజు లధిప.

టీ॥ అధిప = ప్రభుఁడవైన శ్రీకృష్ణా. అవధరింపుము=మేము చేయుమనవినిచిత్తగింపుము. మాగధాధీశ్వరుఁడు=జరాసంధుఁడు. (మాకు) పరమబంధుఁడు = మిక్కిలి ఆప్తుఁడైనచుట్టము. (కాని) పగఱగాఁడు = పగవాఁడుకాఁడు. ప్రకటిత...చేతస్కులము—ప్రకటిత=ప్రసిద్ధమయిన. రాజ్యవైభవ=దొరతనపుకలిమిచేతనైన. మద=క్రొవ్వుచేత. అంధీభూత=గ్రుడ్డిదిగాచేయఁబడిన. చేతస్కులము=మనసులుగలవారము. మమ్మున్=మావృత్తాంతమును. చెప్ప నేల=చెప్పవలసినపనియేమి. కమనీయజలతరంగములకైవడిన్=మనోజ్ఞములైన నీటియలలవలెను. దీపశిఖవోలెన్ = దీపపుజ్వాలవలెను. చూడన్=విచారింపఁగా. అస్థిరములు=నిలుకడలేనివి. అయినగురుసంపదలు=అయినట్టి గొప్పకలుములు. (నమ్మి) పరసాధనక్రియాగమము=పరలోకమునకు సాధనములయినపనులరాక — అట్టిపనులను చేయుటయనుట. ఏది=పోయి. తద్బాధకంబు = ఆపరలోకమునకు బాధకములు. అయినన్=అయినను. బలసి = గుమికూడి. అన్యోన్యవైరానుబంధములను = ఒకరొకరితోడిపగయొక్కకూడికలచేత. ప్రజలన్=జనులను. కాఱించుచున్=బాధించుచు. దుష్టభావచిత్తులగుచున్=చెడ్డతలఁపుగల మనసులుగలవారు అగుచును. ఆసన్నమృత్యుభయంబున్ = తమవెంబడినుండు చావువలని భయమును. తక్కి=మాని. దుర్మనుజులు = చెడ్డమానవులు. మత్తులై=ఒళ్లుతెలియనివారై. (తిరుగుదురు)

తా॥ శ్రీకృష్ణా! మామనవినిచిత్తగింపుము, జరాసంధుఁడు మాకు ప్రియబంధువుగాని పగవాఁడు గాఁడు, మేమన్నో రాజ్యమదముచేతకన్నుగానక యున్నవారము, ఇటువంటిమావృత్తాంతమునుచెప్పవలసిన పనియేమి, లోకమునందు దుష్టులగు జనులునీటియలలవలెను దీపపుజ్వాలవలెను క్షణకాలములో నశించెడు సంపదలనుగొప్పగానెంచి ఆసంపదలవలనినమ్మికచేత పరలోకసాధకములైనపనులుచేయ యత్నింపక పరలోకబాధకములైననుఒకరితోనొకరు విరోధించిప్రజలనుబాధించు తలఁపుగల మనసులతో సంచరించుచుందురు అని తా.

౭౭౯.—చ॥ కడపటిసేఁత నైహిక సు * ఖంబులఁ గోల్పడి జిత్తకోర్కి వెం
బడిఁబడి యెండమావులఁ బి * పాసలమై సలిలాస డాయుచున్
జెడుమనుజు ల్భవాబ్ధి దరిఁ * జేరఁగలేక నశింతు రట్టి యీ
యిడుములఁ బొందఁజాలము ర * మేశ త్రిలోకశరణ్య మాధవా.

టీ॥ రమేశ = సంపదకు ప్రభుఁడవును. త్రిలోకశరణ్య = మూఁడులోకములకు ప్రాపైనవాఁడవునైన. మాధవా=కృష్ణా. కడపటిసేఁతన్=ఎల్ల పనులకును కడపటిదైన చావుచేత. ఐహికసుఖంబులన్=ఈలోకమునందలి సుఖములను. కోల్పడి=పోఁగొట్టుకొని. జిత్తకోర్కివెంబడిన్=వ్యర్థపుకోరికలవెంట. పడి=చిక్కి. పిపాసలమై=దాహములతో. (ఎండమావులను) సలిలాసన్ = నీళ్లనెడు భ్రాంతివలనియాశచేత. డాయుచున్=సమీపించుచు. చెడుమనుజులు=చెడిపోవునట్టి మనుష్యులు. భవాబ్ధిదరిన్ = జన్మసముద్రముయొక్కగట్టును. (చేరఁగలేకనశింతురు) అట్టియీయిడుమలన్ = అటువంటి యీసంసార బాధలను. పొందఁజాలము=పొందలేము.

తా॥ ఎల్లకలుములకునాయకుఁడవైనయోకృష్ణమూర్తీ! ఈలోకములోని జనులు వ్యర్థములైన కోరికలుగలవారై దప్పిగొన్నవాఁడు ఎండమావులను నీళ్లని భ్రమసి త్రాగవచ్చునను నాశచేతపోవునట్లు మెలఁగుచు ఈజన్మసముద్రపుగట్టును పొందనేరక నశించుచుందురు కాఁబట్టి చచ్చియీలోకపుసుఖములేవియు పొందనేరని యీయిడుములను మేము అనుభవింపనేరము మమ్మురక్షింపుమని తాత్పర్యము.

౭౮౦.—ఉ॥ వేదవధూ శిరోమహిత * వీధులఁ జాల నలంకరించు నీ
పాద సరోజ యుగ్మము శు * భస్థితి మాహృదయంబులందు ని
త్యోదిత భక్తిమైఁ దగిలి * యుండునుపాయ మెఱుఁగఁబల్కు దా
మోదర భక్త దుర్భవ మ * హోదధి తారణ సృష్టి కారణా.

టీ॥ దామోదర=తులసిపేరులు కడుపుపైవ్రేలునట్టివాఁడవును. భక్త...తారణ—భక్త=సేవకులను. దుర్భవ=చెడ్డజన్మములనెడు. మహోదధి = గొప్ప సముద్రమునుండి. తారణ = దాఁటించువాఁడవును. సృష్టికారణా = ప్రపంచసృష్టికి హేతువైన వాఁడవునైన స్వామీ. వేదవధూశిరోమహిత వీధులన్ = వేదము లనెడు స్త్రీల శిరస్సులయందలి పెద్దపాపట దారులను—వేదాంత మార్గములనుట. చాలన్=మిక్కిలిచక్కగా. అలంకరించు = అలంకారము చేయునట్టి. నీపాదసరోజయుగ్మమున్=నీయడుగుఁదామరలజతను. శుభస్థితిన్=మంచియునికితో. మాహృదయంబులందున్ = మామనస్సులలో. నిత్యోదితభక్తిమైన్ = ఎడతెగకపుట్టుచున్న భక్తితో.

తగిలి=ఆసక్తులమై. ఉండునుపాయము=ఉండునట్టియుపాయమును. ఎఱుంగఁబల్కు = మాకు తెలియఁజెప్పుము.

తా॥ సేవక జనులను జన్మములనెడు సముద్రముల వలననుండి దాఁటించునట్టియు, కడుపుపై తొళసిపూసల పేరులు వ్రేలుచుండు నట్టియు, ప్రపంచసృష్టికి కారణభూతుఁడైనట్టియు సామీ ! వేదాంత మార్గములనుచక్కఁగా అలంకరించువాఁడవైన నీయడుగుఁదామరలు మామనసులందుమంచియునికితో నుండునట్లుచేసి ఎడతెగనిభక్తితో నీపాదములను సేవించు నుపాయము మాకు తెలియఁజేయుమని తా.

౨౮౧.—క॥ అనితను శరణము వేఁడిన । జననాథులవలను జూచి ✽ సదమల భక్తా
వన చరితుఁడు పంకజలో । చనుఁడిట్లను వారితోడ ✽ సదయామతియై.

టీ॥ (అని)తనుఁ=తన్ను. శరణము=రక్షించుటను. వేఁడినఁ= కోరఁగా. జననాథులవలను=రాజులతట్టు. (చూచి)సదమలభక్తావన చరితుఁడు=మిక్కిలినిర్మలులైనభక్తులను రక్షించు చరిత్రముగలవాఁడైన. పంకజలోచనుఁడు=కృష్ణుఁడు. సదయామతియై=దయతోడి బుద్ధిగలవాఁడై. వారితోడఁ=ఆరాజులతో. ఇట్లనుఁ=ఇట్లుపలికెను.

తా॥ అని ఈవిధముగా రక్షింపుమని తన్ను ప్రార్థించిన రాజులను జూచి సేవకులను రక్షించుటయే పనిగాఁగలవాఁడైన శ్రీకృష్ణుఁడు దయతోడి మనసుగలవాఁడై వారితో ఇట్లుపలికె నని తా.

౨౮౨.—చ॥ జనపతులార మీపలుకు ✽ సత్యము రాజ్యమదాంధ చిత్తులై
ఘనముగ విప్రులం బ్రజలఁ ✽ గాఱియ పెట్టుటఁజేసి కాదె వే
గనహుష రావణార్జునులు ✽ గాలము నొందిరి గాన ధర్మపా
లనమునఁగాక నిల్చునె కు ✽ లంబు బలంబుఁ జిరాయు రున్నతుల్.

టీ॥ జనపతులార = ఓరాజులారా. మీపలుకు = మీమాట. సత్యము=నిజము. రాజ్యమదాంధచిత్తులై = దొరతనపుక్రొవ్వుచేత ఏమియుఁ దెలియనిదిగాఁ జేయఁబడిన మనసుగలవాఁరై. ఘనముగన్ = అధికముగా. విప్రులన్ = బ్రాహ్మణులను. ప్రజలన్= తక్కినజనులను. కాఱియపెట్టుటఁజేసి=బాధపెట్టుటచేత. కాదె= కదా. వేగ=శీఘ్రముగ. నహుషరావణార్జునులు=నహుషుఁడును రావణుఁడును కార్తవీర్యార్జునుఁడును. కాలమునొందిరి=నశించిరి. కానన్=కాఁబట్టి. ధర్మపాలనమునఁగాక=ధర్మపరిపాలనముచేత నేగాని. కులంబున్=వంశమును. బలంబున్=సేనయు. చిరాయురున్నతులు = దీర్ఘాయుస్సును గౌరవమును. నిల్చునె=చెడకయుండునా.

తా॥ ఓరాజులారా ! మీరు చెప్పినమాటలు నిజములు, రాజ్యమదముచేత మంచి సెబ్బరలు విచారింపక మూఢబుద్ధులై బ్రాహ్మణులను తక్కినజనులను మిక్కిలి బాధపెట్టుట చేతనేకదా నహుషుఁడు రావణుఁడు కార్తవీర్యార్జునుఁడు అనువారు మునుపు తడయకనశించిరి కాఁబట్టి ధర్మసంరక్షణము చేయనియెడల కులము బలము ఆయుస్సు గౌరవము చెడకయుండవు అని తాత్పర్యము.

౨౮౩.—వ॥ అదిగావున మీమనంబుల దేహం బనిత్యంబకాఁ దెలిసి.

టీ॥ అదిగావునన్=అట్లగుటచేత. మీమనంబులన్=మీమనసులలో (దేహంబు)అనిత్యంబకాన్=అశాశ్వతమేయని. తెలిసి=తెలిసికొని.

తా॥ కాఁబట్టి మీరు మీమనసులలో దేహము సుస్థిరముకాదు అని తెలిసికొన్నవారై యని తాత్పర్యము.

౨౮౪.—ఉ॥ మీరును ధర్మముం దగవు ✽ మేరయుఁ దప్పక భూజనాళిఁ బెం
పారఁగ సౌఖ్యసంపదల ✽ నందఁగఁ బ్రోచుచు భూరియజ్ఞముల్
గౌరవవృత్తి మత్పరము ✽ గా నొనరించుచు మామకాంఘ్రి పం
కేరుహము ల్భజించుచు న ✽ కిల్బిషులై చరియింపుఁ డిమ్ములన్.

టీ॥ (మీరును) ధర్మమున్ = పుణ్యమును. తగవుమేరయున్= నీతిమర్యాదయు. తప్పక=మానక. భూజనాళిన్=భూమిలోనిజనులను. పెంపారఁగన్ = వృద్ధియతిశయించునట్టుగా. సౌఖ్యసంపదలన్ = సుఖమును కలిమిని. అందఁగన్ = పొందునట్టుగాను. ప్రోచుచున్ = కాపాడుచు. భూరియజ్ఞములు = గొప్పయజ్ఞములను. గౌరవవృత్తిన్ = గురుత్వముతోడి వ్యాపారముతో. మత్పరముగాన్=నాకు అర్పితముగా. ఒనరించుచున్=చేయుచు. మామకాంఘ్రిపంకేరుహములు=నాపాద కమలములను. భజించుచున్= సేవించుచు. అకిల్బిషులై = పాపములులేనివారలై. ఇమ్ములన్= లెస్సగా. చరియింపుఁడు=వర్తింపుఁడు.

తా॥ ఓరాజులారా ! మీరు పుణ్యము నీతిమర్యాదను తెలిసినడపుచు, మీభూములలోని జనులనెల్లను సుఖమును కలిమియుఁగలిగి వృద్ధి పొందునట్టుగా కాపాడుచు, విశేషములయిన యజ్ఞములను గురుత్వముతోడి వ్యాపారముతో నడపి నాకు సమర్పణ చేయుచు, నాయడుగుఁదామరలను సేవించుచు పాపమునొందక నెమ్మదిగా వర్తింపుఁడు అని శ్రీకృష్ణమూర్తి చెప్పెనని తాత్పర్యము.

౨౮౫.—వ॥ అట్లైనమీరలు బ్రహ్మసాయుజ్య ప్రాప్తులయ్యెదరు మదీయ పాదారవిందంబులందుఁ జలింపని భక్తియుఁ గలుగునని యానతిచ్చి యారాజవరుల మంగళ స్నానంబులు సేయించి వివిధమణి భూషణ మృదులాంబర మాల్యానులేపనంబులొసంగి భోజన తాంబూలంబులం బరితృప్తులంజేసి యున్నతరథాశ్వ సామజాది రూఢులం గావించి నిజరాజ్యంబులకుఁ బూజ్యులంజేసి యనిచిన.

టీ॥ అట్లైనన్=ఆవిధముగావర్తించినపక్షమున. మీరలు=మీరు. బ్రహ్మసాయుజ్య ప్రాప్తులు = పరబ్రహ్మమును పొందఁగలవారు. అయ్యెదరు = కాఁగలరు. మదీయపాదారవిందంబు లందున్ = నాపాదకమలములయందును. చలింపని భక్తియున్ = వదలనిభక్తియును. (కలుగును) అనియానతిచ్చి=అనిచెప్పి. ఆరాజవరులన్= ఆరాజశ్రేష్ఠులను. మంగళస్నానంబులు = పరిశుద్ధ స్నానములను. (చేయించి) వివిధ... లేపనంబులు—వివిధ=నానావిధములైన. మణి భూషణ=రత్నములసొమ్ములను. మృదుల = మెత్తనైన. అంబర = వస్త్రములను. మాల్య=పూలదండలను. అనులేపనంబులు=చందనములను. ఒసంగి=ఇచ్చి. భోజన తాంబూలంబులన్=భోజనముచేతను తాంబూలముచేతను. పరితృప్తులన్ = చక్కగా తృప్తి పొందిన వారినిఁగా. (చేసి) ఉన్నతరథాశ్వసామజాధి రూఢులన్=పొడవులైన రథములను గుఱ్ఱములను ఏనుఁగులను ఎక్కిన వారినిఁగా. కావించి=చేసి. నిజరాజ్యంబులకున్ = తమయేలుబడి దేశములకు. పూజ్యులన్=పూజనొందఁదగినవారినిఁగా — ఎప్పటివలె రాజులగునట్లుగా. (చేసి) అనిచినన్=అంపఁగా.

తా॥ అట్లువర్తించినపక్షమున మీరు మోక్షమునొందుటయేగాక నాపాదములందు భక్తిగలవారును అగుదురు అనిచెప్పి శ్రీకృష్ణమూర్తి ఆరాజులనందఱిని పరిశుద్ధికొఱకైన స్నానములు చేయించి వారికి మంచిమంచి రత్నాభరణములు నయముమీఱిన వస్త్రములు పూవుదండలు గందమును ఇప్పించి అలంకరింపఁజేసి వారివారికి తగిన రథములను గుఱ్ఱములను ఏనుఁగులను వాహనములుగానిచ్చి యెవరిదేశములనువారు మునుపటివలెనే యేలుకొనునట్లు సెలవిచ్చి పంపె నని తాత్పర్యము.

౨౮౬.—క॥ నరవరులీ చందంబున । మురసంహరుచేత బంధ * మోక్షణులై సు
స్థిర హర్షంబులతో నిజ । పురములకుంజనిరి శుభవి * భూతి దలిర్పన్.

టీ॥ నరవరులు=రాజులు. ఈచందంబునన్=ఈవిధముగా. మురసంహరుచేతన్=కృష్ణునిచేత. బంధమోక్షణులై=చెఱసాలలయందుండి విడుదలనుపొందినవారై. సుస్థిరహర్షంబులతోన్=కొంచమైనచలింపనిసంతోషములతో. శుభవిభూతి=మంచికలిమి. తలిర్పన్=అంకురింపఁగా. నిజపురములకున్=తమపట్టణములకు. చనిరి=పోయిరి.

తా॥ ఈవిధముగాఆరాజులుశ్రీకృష్ణమూర్తిచేత చెఱలలోనుండి విడువఁబడినవారై మిక్కిలి సంతోషములో తమతమ పట్టణములకు పోయి చేరిరని తాత్పర్యము.

౨౮౭.—క॥ హరిమంగళ గుణకీర్తన । నిరతము గావించుచును వి * నిర్మల మతులై
గురుబంధు పుత్రజాయా । పరిజనములలరంగఁ గృష్ణుఁ * బద్మదళాక్షున్.

టీ॥ హరిమంగళగుణకీర్తనన్=శ్రీకృష్ణమూర్తియొక్క కల్యాణ గుణస్తవమును. నిరతము=ఎల్లప్పుడు. కావించుచున్=చేయుచు. వినిర్మలమతులై=మిక్కిలి నిర్మలములైన మనసులుగలవారై. గురు... పరిజనము—గురు=తల్లితండ్రులు మొదలగువారును. బంధు=చుట్టములును. పుత్ర = కొడుకులును. జాయా = పెండ్లాలునైన. పరిజనము=పరివారజనము. అలరంగన్ = సంతోషింపఁగా. పద్మదళాక్షున్=కమలములవంటికన్నులుగలవాఁడైన. (కృష్ణునిపొగడుచు)

తా॥ శ్రీకృష్ణమూర్తియొక్క కల్యాణ గుణములను సదాకీర్తించుచు మిక్కిలి నిర్మలములయిన మనసులుగలవారై తల్లిదండ్రులు మొదలుగాఁగల పూజ్యులయిన చుట్టములు పెండ్లాము బిడ్డలునగు పరివారజనమంతయు సంతోషింపఁగా కమలములవంటి కన్నులుగల శ్రీకృష్ణమూర్తిని పొగడుచునని తాత్పర్యము.

౨౮౮.—వ॥ బహుప్రకారంబులం బొగడుచుఁ దమతమ దేశంబులకుం జని.

టీ॥ బహుప్రకారంబులన్=అనేకవిధములచేత. పొగడుచున్= స్తోత్రముచేయుచు. (తమతమదేశంబులకు) చని = పోయి.

తా॥ అనేకవిధములచేత కొనియాడుచు ఎవరిదేశములకువారు పోయి యని తాత్పర్యము.

౨౮౯.—క॥ నళినదళ లోచనుఁడు దముఁ । దెలిపిన సద్ధర్మ పద్ధ * తిని దగవరులై
యిలఁ బరిపాలించుచు సుఖ । ముల నుండిరి మహితనిజ వి * భుత్వములలరన్.

టీ॥ నళినదళలోచనుఁడు = తామరతేకులవంటి కన్నులుగల శ్రీకృష్ణుఁడు. తమున్=తమ్ముఁగూర్చి. తెలిపిన = బోధించిన. సద్ధర్మపద్ధతిన్ = మేలైన ధర్మమార్గమున. తగవరులై = న్యాయమును అవలంబించినవారై. ఇలన్=భూమిని. పరిపాలించుచున్=ఏలుచు. మహిత నిజవిభుత్వములు = గౌరవముతోడి తమ ప్రభుత్వములు. అలరన్=ప్రకాశింపఁగా. సుఖములన్=సౌఖ్యములతో. (ఉండిరి)

తా॥ తామరతేకులవంటి కన్నులు గలవాఁడైన శ్రీకృష్ణమూర్తి తమకు బోధించిన ధర్మమార్గమునందు క్రమము తప్పక వర్తించుచు తమయొక్క మేలైన ప్రభుత్వములు ప్రకాశింపఁగా భూమిని ఏలుచును సుఖముల ననుభవించు చుండిరని తాత్పర్యము.

౨౯౦.—వ॥ ఇట్లు కృష్ణుండు జరాసంధ వధంబును రాజ లోకంబునకు బంధ మోక్షణంబును గావించి వాయునందన వాసవ నందనులుం దానును జరాసంధ తనయుండగు సహదేవుండు సేయు వివిధంబులగు పూజలు గైకొని యతని నుండనియమించి యచ్చోటఁ గదలి కతిపయప్రయాణంబుల నింద్రప్రస్థ పురంబునకుం జనుదెంచి తద్ద్వార ప్రదేశంబున విజయ శంఖంబులు

పూరించినఁ బ్రతిపక్ష భయదంబును బాంధవ ప్రమోదంబును నగు నమ్మహాఘోషంబు విని పౌరజనంబులు జరాతనయు మరణంబు నిశ్చయించి సంతసిల్లిరి వారిజాక్షుండును భీమసేన పార్థులతోఁ బురంబు ప్రవేశించి ధర్మనందనునకు వందనంబాచరించి తాముపోయిన తెఱంగు నచ్చట జరాసంధుని వధించిన ప్రకారంబును సవిస్తరంబుగా నెఱింగించిన నతండు విస్మయ వికచలోచనంబుల నానందబాష్పంబులుగురియ నమ్మాధవు మాహాత్మ్యంబునకుం దనయందలి భక్తి స్నేహ దయాది గుణంబులకుం బరితోషంబు నొందుచుఁ గృష్ణునింజూచి యిట్లనియె.

టీ॥ (ఇట్లుకృష్ణుండు) జరాసంధవధంబును=జరాసంధునిచంపుటను. రాజలోకంబునకున్=రాజుల సమూహమునకు. బంధమోక్షణంబును = చెఱలనుండివిడుదలయును. కావించి = చేసి. వాయునందనవాసవనందనులును=భీమార్జునులును. (తానును) జరాసంధతనయుండగుసహదేవుండు=జరాసంధునికొడుకైన సహదేవుఁడు. చేయు = చేయునట్టి. వివిధంబులగుపూజలు = నానావిధములయిన అర్చనలు. కైకొని=అంగీకరించి. అతనిన్=ఆసహదేవుని. ఉండన్=నిలువ. నియమించి=ఆజ్ఞాపించి. అచ్చోటన్=అందుండి. కదలి=బయలుదేఱి. కతిపయప్రయాణంబులన్=కొన్నిప్రయాణములచేత—కొన్నిదినములు ప్రయాణములు చేయుటలచేత. ఇంద్రప్రస్థపురంబునకున్=ఇంద్రప్రస్థపట్టణమునకు. చనుదెంచి=వచ్చి. తద్ద్వారప్రదేశంబునన్=ఆయింద్రప్రస్థముయొక్కవాకిటిముందఱిచోట. విజయశంఖంబులు = తమగెలుపును దెలుపునట్టి శంఖములను. పూరించినన్=ఊఁదఁగా. ప్రతిపక్షభయదంబును = పగవారికి భయమునిచ్చునదియు. బాంధవప్రమోదంబును=చుట్టములకుసంతోషమును. అగునమ్మహాఘోషంబున్ = అగునట్టి ఆమహాధ్వనిని. (విని) పౌరజనంబులు=పురజనులు. జరాతనయు మరణంబున్=జరాసంధుఁడు చచ్చుటను. నిశ్చయించి=నిజమని యెంచి. సంతసిల్లిరి=సంతోషించిరి. వారిజాక్షుండును = కృష్ణుఁడును. భీమసేనపార్థులతోన్ = భీమార్జునులతోఁగూడ. పురంబుప్రవేశించి=పట్టణముచొచ్చి. ధర్మనందనునకున్=ధర్మరాజునకు. వందనంబున్ = నమస్కారమును. ఆచరించి=చేసి.(తాముపోయిన)తెఱంగు=విధమును. (అచ్చటజరాసంధుని) వధించినప్రకారంబును = చంపినవిధమును. సవిస్తరంబుగాన్=పూర్తిగా – విశదముగా. ఎఱింగించినన్ = తెలియఁజేయఁగా. అతండు = ధర్మరాజు. విస్మయవికచలోచనంబులన్=ఆశ్చర్యమువలన వికాసమునొందిన కన్నులయందు. ఆనంద బాష్పంబులు=సంతోషమువలని కన్నీళ్లు. కురియన్=వర్షింపఁగా. అమ్మాధవు మాహాత్మ్యంబునకున్=ఆకృష్ణునిమహిమకు. తనయందలి భక్తి స్నేహ దయాది గుణంబులకున్=తనయందుగల భక్తి చెలిమిదయ మొదలుగాఁగల్గ గుణములకు. పరితోషంబునొందుచున్=సంతోషమును పొందుచు. (కృష్ణునింజూచి) ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

తా॥ ఈవిధముగా శ్రీకృష్ణుఁడు జరాసంధుని చంపి వానిచేత చెఱఁబెట్టఁబడినరాజులను చెఱలలోనుండివిడుదలచేసి భీమార్జునులును తానును జరాసంధునికొడుకైన సహదేవునిచేత అనేకమర్యాదలనుపొంది వానిని వానిరాజ్యమునందునిలువరించి అందుండిబయలుదేఱి కొన్నాళ్లకు ఇంద్రప్రస్థపట్టణమునకు వచ్చి ఆపట్టణపు వాకారమునందు నిలిచి తాము జయమునుపొంది వచ్చినసంగతిని తెలియఁజేయునట్టి ధ్వనితో శంఖములను ఊఁదఁగా ఆపట్టణము నందలి జనులు జరాసంధుఁడు చచ్చెననినిశ్చయించి సంతోషించిరి. కృష్ణుఁడును భీమార్జునులతోడ పట్టణముచొచ్చి ధర్మరాజునకు మ్రొక్కి ఆయనకుతాముపోయినవిధమును జరాసంధుని చంపినరీతిని అచ్చటి చెఱలలోనిరాజులను విడుదలచేసినవిధమును విశదముగా తెలియఁజేసెను అప్పుడు ధర్మరాజు కృష్ణుని మహిమకును తనయందు ఆయనకుఁగల భక్తి స్నేహము దయ మొదలగు గుణములకును సంతోషించుచు ఆకృష్ణమూర్తిని జూచి ఇట్లు పలికెనని తాత్పర్యము.

౭౯౧.—సీ॥ కమలాక్ష సర్వలో * కములకు గురుఁడవై - తేజరిల్లెడు భవ * దీయ మూర్తి
యంశాంశ సంభవు * లగు లోకపాలురు - నీయాజ్ఞఁ దలమోచి * నిఖిల భువన
పరిపాల నిపుణులై * భాసిల్లు చున్నార - లట్టి నీకొక నృపు * నాజ్ఞ సేయు
టరయ నీమాయగా * కదినిక్కమే యేక - మై యద్వితీయమై * యవ్యయంబు
తే॥ నైననీతేజమున కొక * హానిగలదె। చిన్మయాకార నీపాద * సేవకులకు
నాత్మపర భేదబుద్ధి యెం * దైనఁ గలదె। పుండరీకాక్ష గోవింద * భువనరక్ష.

టీ॥ కమలాక్ష=ఓశ్రీకృష్ణమూర్తీ. సర్వలోకములకున్=అన్నిలోకములకును. గురుఁడవై = తండ్రివై–ఉత్పత్తికారకుఁడవై. తేజరిల్లెడు = వెలుఁగుచుండెడు భవదీయమూర్తి యంశాంశసంభవులు = నీదైన యాకృతియొక్క కళాంశమునఁబుట్టినవారు. అగు లోకపాలురు=అగునట్టి దిక్పాలకులు. నీయాజ్ఞన్ = నీయుత్తరువును. తలమోచి=శిరసావహించి. నిఖిలభువనపరిపాలనిపుణులై=ఎల్లకలోముల నేలఁజాలినవారై. భాసిల్లుచున్నారలు=ప్రకాశించుచున్నారు. అట్టినీకున్=అటువంటినీకు. ఒకనృపునాజ్ఞసేయుట = ఒక రాజుయొక్క ఆజ్ఞనునడపుట. అరయన్ = విచారింపఁగా. (నీమాయగాక)అదినిక్కమె=అదినిజమా. ఏకమై=ఒక్కటై. అద్వితీయమై=తనవంటిది మఱియొకటిలేనిదై. అవ్యయంబునైన = నశింపనిదైన. నీతేజమునకున్=నీయొక్క తేజస్సునకు. ఒకహానిగలదె=ఏవిధమైనదైన నొకచెఱుపుగలదా. చిన్మయాకార=జ్ఞానస్వరూపమైన ఆకృతిగల యోస్వామీ. పుండరీకాక్ష = తెల్లదామరల

వంటి కన్నులుగలవాఁడా. గోవింద = వేదములచేత తెలియఁబడు వాఁడా. భువనరక్ష = లోకరక్షకుఁడా. నీపాదసేవకులకున్ = నీపాదములయందలి భక్తిగలవారికి. ఎందైనన్ = ఎక్కడనైనను. ఆత్మపరభేదబుద్ధి = తానుఅన్యుఁడు అనుభేదబుద్ధి. కలదె=కలదా.

తా॥ ఓశ్రీకృష్ణా! నీయంశాంశములందుఁ బుట్టినవారైన దిక్పాలకులు నీయాజ్ఞను తలలందుధరించి యెల్లలోకములనేలుటకు శక్తులై యున్నారుఅట్టిదిక్పాలకులకుజన్మస్థానమైననీవు ఒకరాజుచెప్పినపను లనుచేయుచు వర్తించుటయనునదిమాయగాక నిజమానా? ఒక్కఁడై తనకు రెండవదిలేనిదై నాశములేనిదైయొప్పునట్టినీతేజస్సునకుఎన్నటి కైన హానికలదా? లేదుకాఁబట్టి జ్ఞానస్వరూపుఁడవును, తెల్లదామరలవంటికన్నులుగలవాఁడవును, వేదములచేత తెలియఁబడువాఁడవును, లోకరక్షకుఁడవునైన నీఅడుగులను గొలుచువారికి తానుఇతరుఁడు అనుభేదబుద్ధి యెట్లుపుట్టును అనితాత్పర్యము.


కశ్యపుఁడు.


విశ్వామిత్రుఁడు.


భరద్వాజుఁడు. పరాశరుఁడు.


వ్యాసుఁడు.


ద్రౌపది.


ధర్మరాజు.


వసిష్ఠుఁడు.


ధౌమ్యుఁడు.


గౌతముఁడు.

భీష్ముఁడు.









అర్జునుఁడు.



(*) ధర్మరాజు రాజసూయ యాగంబు చేయనారంభించుట. (*)

౭౯౨.—వ॥ అని గోవిందుం బొగడి యద్దేవుని యనుమతంబునం గుంతీసుతాగ్రజుండు పరతత్త్వవిజ్ఞానులైన ధరణీసురులను ఋత్విక్కులుగ వరియించి.

టీ॥ (అని) గోవిందుఁ = శ్రీకృష్ణుని. (పొగడి) ఆద్దేవునియనుమతంబునఁ=ఆకృష్ణదేవుని యుత్తరువు చొప్పున. కుంతీసుతాగ్రజుండు=ధర్మరాజు. పరతత్త్వవిజ్ఞానులు = పరబ్రహ్మ స్వరూపము నెఱిఁగినవారు. ఐనధరణీసురులను = అయినట్టి బ్రాహ్మణులను. ఋత్విక్కులుగాఁ=ఋత్విజులు అగునట్టుగా. వరియించి=కోరి.

తా॥ అని శ్రీకృష్ణునిపొగడి అతనియుత్తరువుచొప్పున ధర్మరాజు పరబ్రహ్మము నెఱిఁగినవారైన యుత్తమ బ్రాహ్మణులను ఋత్విజులనుగా వరించినవాఁడై యని తాత్పర్యము.

౨౯౩.—సీ॥ సాత్యవతేయ క * శ్యప భరద్వాజో ప - హూతి విశ్వామిత్ర * వీతిహోత్ర
మైత్రేయ పైల సు * మంతు మధుచ్ఛంద - గౌతమ సుమతి భా * ర్గవ వసిష్ఠ
వామదేవా కృత * వ్రణ కణ్వ జైమిని - ధౌమ్య పరాశరా * ధర్వకషవు
లసిత వైశంపాయ * నాసురి దుర్వాస - క్రతువీరసేన గ * ర్గ త్రికవ్య
ఆ॥ ముఖ్యులైన ఋషుల * మునులను గృపుని గాం । గేయ కుంభ జాంబి * కేయ విదుర
కురుకుమార బంధు * కులవృద్ధ ధారుణీ । సుర నరేంద్ర వైశ్య * శూద్ర వరుల.

టీ॥ సాత్యవతేయ...ముఖ్యులు—సాత్యవతేయ = వ్యాసుఁడు. కశ్యపుఁడు భరద్వాజుఁడు ఉపహూతి విశ్వామిత్రుఁడు వీతిహోత్రుఁడు మైత్రేయుఁడు పైలుఁడు సుమంతుఁడు మధుచ్ఛందుఁడు గౌతముఁడు సుమతి భార్గవుఁడు వసిష్ఠుఁడు వామదేవుఁడు అకృతవ్రణుఁడు కణ్వుఁడు జైమిని ధౌమ్యుఁడు పరాశరుఁడు అథర్వుఁడు కషవుఁడు లసితుఁడు వైశంపాయనుఁడు ఆసురి దుర్వాసుఁడు క్రతువు వీరసేనుఁడు గర్గుఁడు త్రికవ్యుఁడు. ముఖ్యులు = మొదలుగాఁగల వారు. అయినఋషులఁ=అయినట్టి ఋషులను. మునులఁ=మునులను. (ఋషి=జ్ఞానముచేత తుదముట్టినవాఁడు. ముని = జ్ఞానముచేత మౌనము వహించినవాఁడు) కృపునిఁ = కృపాచార్యుని. గాంగేయ...వరులఁ—గాంగేయ = భీష్ముఁడు. కుంభజ = ద్రోణుఁడు. ఆంబికేయ=ధృతరాష్ట్రుఁడు. విదుర = విదురుఁడు. కురుకుమార = దుర్యోధనుఁడుమొదలుగాఁగల ధృతరాష్ట్రుని కొడుకులు. బంధు=చుట్టములు. కులవృద్ధ=తమకులమునందు ముసలివాండ్రైన బాహ్లికుఁడు మొదలగువారు. ధారుణీసుర=బ్రాహ్మణులు. నరేంద్ర=రాజులు. వైశ్య = కోమట్లు. శూద్ర = శూద్రులు. వరులఁ=వీరిలో శ్రేష్ఠులగువారిని.

తా॥ వ్యాసుఁడు కశ్యపుఁడు భరద్వాజుఁడు ఉపహూతి విశ్వామిత్రుఁడు వీతిహోత్రుఁడు మైత్రేయుఁడు పైలుఁడు సుమంతుఁడు మధుచ్ఛందుఁడు గౌతముఁడు సుమతి భార్గవుఁడు వసిష్ఠుఁడువామదేవుఁడు అకృతవ్రణుఁడు కణ్వుఁడు జైమిని ధౌమ్యుఁడు పరాశరుఁడు అథర్వుఁడు కషవుఁడు లసితుఁడు వైశంపాయనుఁడు ఆసురి దుర్వాసుఁడు క్రతువు వీరసేనుఁడు గర్గుఁడు త్రికవ్యుఁడు మొదలైనఋషులను,కృపాచార్యునిభీష్మునిద్రోణాచార్యునిధృతరాష్ట్రుని విదురుని దుర్యోధనుఁడు మొదలుగాఁగల ధృతరాష్ట్రుని కొడుకులను, చుట్టములనుతమకులములో వృద్ధులైన బాహ్లికుఁడు మొదలగువారిని, బ్రాహ్మణులు రాజులు కోమట్లు శూద్రులు వీరిలో శ్రేష్ఠులను రప్పించె నని తాత్పర్యము.

౨౯౪.—క॥ రప్పింప వారు హర్షము । లుప్పతిలఁగ నేగుదెంచి * యుచితక్రియలం
దప్పక గనుఁగొను చుండఁగ । నప్పుడు విధ్యుక్త నియతు * లై భూమిసురుల్.

టీ॥ రప్పింపఁ=రావింపఁగా. వారు = ఈచెప్పఁబడినవారు. హర్షములు = సంతోషములు. ఉప్పతిలఁగఁ = పుట్టఁగా. ఏగుదెంచి=వచ్చి. ఉచితక్రియలఁ=తగిన వ్యాపారములతో. (తప్పక కనుఁగొనుచుండఁగ అప్పుడు) భూమిసురులు = బ్రాహ్మణులు. విధ్యుక్తనియతులై = శాస్త్రమునచెప్పఁబడిననియమములుకలవారై.

తా॥ పైఁజెప్పఁబడినవారందఱిని రప్పింపఁగా వారువచ్చితగిన రీతిని చూచుచుండఁగా బ్రాహ్మణులు శాస్త్రమునందుఁ జెప్పఁబడిన నియమముగలవారైయని తాత్పర్యము.

౨౯౫.—ఆ॥ కడఁగి సవనభూమిఁ * గనక లాంగలముల । నర్థిదున్నఁ బాండ * వాగ్రజునకు
నచటఁ దీక్షచేసి * యంచిత స్వర్ణ మ । యోపకరణములన * లోపముగను.

టీ॥ కడఁగి=ప్రారంభించి. సవనభూమిఁ = యజ్ఞభూమిని. కనకలాంగలములఁ=బంగారునాఁగేళ్లతో. అర్థిఁ=అక్కఱతో. దున్నఁ=దున్నఁగా. పాండవాగ్రజునకుఁ=ధర్మరాజునకు. (అచట దీక్షచేసి) అంచితస్వర్ణమయోపకరణములఁ = ఒప్పిదములయిన బంగారుసాధనములచేత. అలోపముగఁ=తక్కువ లేకుండునట్లు.

తా॥ యజ్ఞమునకు మొదలుపెట్టినవారై యజ్ఞభూమిని బంగారు నాఁగేళ్లతోదున్నించి ఆదున్నినచోటధర్మరాజునకుదీక్షచేసిబంగారు మయములైన ఉపకరణములతో లోపము లేకుండనని తాత్పర్యము.

౨౯౬.—వ॥ ఇట్లు నియమంబున సముచిత క్రియా కలాపంబులు నడపుచుండి రప్పుడు.

టీ॥ (ఇట్లు) నియమంబునఁ = నియతితో. సముచితక్రియాకలాపంబులు = చేయఁదగినపనులను. (నడపుచుండిరి అప్పుడు)

తా॥ ఇట్లు నియమము తప్పక యజ్ఞకార్యములను నడపుచుండఁగా నని తాత్పర్యము.

౭౯౭.—క॥ సకలావనీశు లిచ్చిన । యకలంక సువర్ణ రత్న * హయ ధన వస్త్ర
ప్రకరంబులు మొదలగు కా । నుక లందుకొన సుయోధ * నుని నియమించెన్.

టీ॥ సకలావనీశులు=ఎల్లరాజులును. (ఇచ్చిన) అక...బులు—అకలంక=కలంకములేని. సువర్ణ=బంగారు. రత్న=రత్నములు. హయ=గుఱ్ఱములు. ధన=ధనము. వస్త్ర=కోకలు. ప్రకరంబులు=వీనియొక్క సముదాయములు. (మొదలగుకానుకలు) అందుకొనన్ = పుచ్చుకొనను. సుయోధనునిన్=దుర్యోధనుని. నియమించెన్=ఏర్పఱిచెను.

తా॥ లోకములోని రాజులందఱును తెచ్చియిచ్చినబంగారురత్నములు మొదలుగాఁగల వస్తువులను పుచ్చుకొనుటకు దుర్యోధనుని ధర్మరాజునియమించెనని తాత్పర్యము.

౭౯౮.—సీ॥ అర్థిజాతము గోరి * నట్టి వస్తువులెల్లఁ - దగఁబంచి యిడఁగ రా * ధా తనూజు
సరసాన్న పానాది * సకల పదార్థము - ల్పాకము ల్సేయింపఁ * బవనతనయుఁ
బంకజోదరు నొద్దఁ * బాయక పరిచర్య - దవిలి కావింప వా * సవతనూజు
సవన నిమిత్తమై * సంచిత ద్రవ్యము - ల్తెంపుతో వేగఁ దె * ప్పింప నకులు
ఆ॥ దేవ గురు వృద్ధ ధాత్రీసు * రావలులను । నరసి పూజింప సహదేవు * నఖిలజనులఁ
బోలుచు మృష్టాన్న తతులఁ దృ * ప్తులను జేయ । ద్రౌపదిఁ దగనియోగించె * ధర్మసుతుఁడు.

టీ॥ అర్థిజాతము = యాచకుల సమూహము. కోరినట్టివస్తువులెల్లన్=అడిగినవస్తువులన్నియు. తగన్=తగినట్టు. పంచియిడఁగన్=పంచిపెట్టుటకు. రాధా తనూజున్ = కర్ణుని. సరసాన్న పానాది సకల పదార్థములు = రసవంతములైన భోజన పదార్థములు త్రాగునట్టివస్తువులు మొదలగువానినెల్లను. పాకముల్సేయింపన్=వంటలుచేయింపను. పవనతనయున్=భీముని. పంకజోదరునొద్దన్=కృష్ణునియొద్ద. పాయక=ఎడఁబాయక. పరిచర్య = ఉపచారము. తవిలి=ఆసక్తి కలిగి. కావింపన్ = చేయను. వాసవతనూజున్ = అర్జునుని. సవననిమిత్తమై = యజ్ఞమునకుఁగాను. సంచితద్రవ్యములు=చేర్చినవస్తువులను. తెంపుతోన్=తెగువతో. వేగన్=శీఘ్రముగా. తెప్పింపన్=తెప్పించుటకు. (నకులుని) దేవగురువృద్ధధాత్రీసురావలులను=దేవతలు గురువులు పెద్దలు బ్రాహ్మణులు మొదలగువారిసమూహములను. అరసి=విచారించి. పూజింపన్=అర్చించుటకు. (సహదేవుని) అఖిలజనులన్=ఎల్లజనులను. పోలుచు=ఒప్పునట్టి. మృష్టాన్నతతులన్=పరిశుద్ధములయిన అన్నరాసులచేత. తృప్తులను జేయన్=తనియఁజేయను. ద్రౌపదిన్=ద్రౌపదిని. తగన్=తగునట్లుగా. ధర్మసుతుఁడు=ధర్మరాజు. నియోగించెన్=నియమించెను.

తా॥ ధర్మరాజుయాచకులు కోరినవస్తువులనుకోరినట్టు ఇయ్యను కర్ణుని నియమించెను, రసవంతములయిన భోజన పదార్థములను యుక్తముగావండించుటకు భీముని నియమించెను, కృష్ణుని నెడఁబాయక సేవించుచుండను అర్జునుని నియమించెను, యజ్ఞమునకై తెచ్చియుంచియున్న వస్తువులను అందిచ్చుటకు నకులుని నియమించెను, యజ్ఞమునకువచ్చిన చిన్నలను పెద్దలను తారతమ్యము విచారించి మర్యాదలుచేయుటకు సహదేవుని నియమించెను, వచ్చినవారినెల్ల తగినట్టు విచారించి భోజనముచేయించి తృప్తిపొందింపను ద్రౌపదిని నియమించెను అని తాత్పర్యము. వ॥ అయ్యవసరంబున.

౭౯౯.—చ॥ హరి శిఖి దండపాణి నిక * షాత్మజ పాశి సమీర గుహ్యకే
శ్వర శశిమౌళి పంకరుహ * సంభవ చారణ సిద్ధసాధ్య కి
న్నర గరుడోరగామర గ * ణంబులు వచ్చి మఖంబుఁజూచి య
చ్చెరువడి తొల్లి యెవ్వరును * జేయు మఖంబులు నింత యొప్పునే.

టీ॥ హరిశిఖి...గణంబులు—హరి=ఇంద్రుఁడు. శిఖి=అగ్ని. దండపాణి=యముఁడు. నికషాత్మజ=నైరృతి. పాశి=వరుణుఁడు. సమీర=వాయువు. గుహ్యకేశ్వర. కుబేరుఁడు. శశిమౌళి = ఈశానుఁడు. పంకరుహసంభవ=బ్రహ్మ. చారణ=చారణులను దేవతలు. సిద్ధ=సిద్ధులనెడిదేవతలు. సాధ్య=సాధ్యులనెడిదేవతలు. కిన్నర=కిన్నరులు. గరుడ=ఖేచరులు. ఉరగ=సర్పములు. అమర = దేవతలు. గణంబులు = వీరియొక్క సమూహములును. (వచ్చి) మఖంబున్=యజ్ఞమును. (చూచి) అచ్చెరువడి=ఆశ్చర్యపడి. తొల్లి=పూర్వము. ఎవ్వరును=ఎవ్వరైనను. చేయుమఖంబులును=చేయునట్టి యజ్ఞములును. ఇంతయొప్పునే = ఇంతయొప్పిదముగానుండునా.

తా॥ ఆయజ్ఞమును జూడవలెనని ఇంద్రుఁడు అగ్ని యముఁడు నైరృతి వరుణుఁడు వాయువు కుబేరుఁడు ఈశానుఁడు అనెడి అష్టదిక్పాలకులు బ్రహ్మ సిద్ధులు సాధ్యులు మొదలుగాఁగల దేవయోనివిశేషములతోడ ఎల్లదేవతలునువచ్చిచూచి ఆశ్చర్యపడి మునెవ్వరైనను ఇంతయొప్పిదముగా ఇట్టియజ్ఞమును చేసినవారుగలరాయని శ్లాఘించిరని తాత్పర్యము.

౮౦౦.—క॥ అదిగాక యిందిరావిభు । పదములు సేవించునట్టి * భాగ్యము గలుగన్
దుదిఁబడయరాని బహు సం । పద లెవ్వియుఁ గలవె యనుచుఁ * బ్రస్తుతి సేయన్.

టీ॥ అదిగాక=యజ్ఞము ఒప్పిదముగా చేయఁబడుటయే గాక. ఇందిరావిభు పదములు = శ్రీకృష్ణమూర్తియొక్క పాదములను. సేవించునట్టి భాగ్యము = కొలుచునట్టియదృష్టము. కలుగన్=కలుగఁగా. తుదిన్=కడపట. పడయరానిబహుసంపదలు=పొందరాని పెక్కువిధములైన కలుములు. ఎవ్వియున్=ఏవియయినను. కలవె= కలవా. అనుచున్ = అని. ప్రస్తుతిసేయన్=మిక్కిలి పొగడఁగా.

తా॥ అంతేగాక శ్రీవిష్ణ్వవతారమైన కృష్ణమూర్తియొక్కపాద సేవ చేయునట్టి అదృష్టము గలవారికి కడపట పొందరానిసంపదలు ఏవియైనఁ గలవాయని పొగడఁగా ననితాత్పర్యము. వ॥ అప్పుడు.

౮౦౧.—చ॥ అమర సమానులై తనరు * యాజక వర్గములోలి రాజసూ
యమఖ విధాన మంత్రముల * నగ్ని ముఖంబుగఁజేసి ధర్మజుం
గ్రమమున వేలిపింపఁ గ్రతు * రాజసమాప్తి దినంబునన్ నృపో
త్తముఁడు గడంగి యాజక స * దస్య గురు ద్విజకోటిఁ బెంపునన్.

టీ॥ అమరసమానులై=దేవతలతోసమానులై. తనరు = ఒప్పునట్టి. యాజకవర్గములు=యజ్ఞముచేయించువారిగుంపులు. ఓలిన్= క్రమముగా. రాజసూయమఖవిధానమంత్రములన్ = రాజసూయ యజ్ఞము చేయుటకు విధించినమంత్రములచేత. అగ్నిముఖంబుగన్= అగ్నిముఖముకలుగునట్లుగా—ఆహుతులననుట. (చేసి) ధర్మజున్= ధర్మరాజును. క్రమమునన్=క్రమముగా. వేలిపింపన్=హోమము చేయింపఁగా. క్రతురాజసమాప్తిదినంబునన్ = శ్రేష్ఠమయిన ఆయజ్ఞముయొక్క ముగియునట్టి దినమునందు. నృపోత్తముఁడు = రాజశ్రేష్ఠుఁడయినధర్మరాజు. కడంగి=పూని. యాజకసదస్యగురుద్విజకోటిన్=ఋత్విక్కులయు సభికులయు పెద్దలయు బ్రాహ్మణులయు సమూహమును. పెంపునన్=గౌరవముతో.

తా॥ దేవతలను బోలినఋత్విక్కులు క్రమముతప్పక రాజసూయ యజ్ఞమునకు విధింపఁబడిన మంత్రములచేత ఆహుతులు చేయుచు ధర్మరాజుచేత హోమము చేయింపఁగా ఆయజ్ఞము ముగియునట్టి దినమునందు ధర్మరాజు ఋత్విక్కులను సదస్యులను పెద్దలగువారిని బ్రాహ్మణసముదాయమును పూజింప యత్నించెనని తాత్పర్యము.

౮౦౨.—వ॥ పూజించునప్పు డందగ్రపూజార్హు లెవ్వరని యడిగిన సదస్యులు దమకుఁ దోఁచిన విధం
బులంబలుకవారి భాషణంబులు వారించి వివేకశీలుండును, జతురవచన కోవిదుండునునగు
సహదేవుఁడు భగవంతుండును, యదుకులసంభవుండునైన శ్రీకృష్ణునింజూపి యిమ్మహాత్ముని
సంతుష్టుంజేసినభువనంబులన్నియుం బరితుష్టింబొందుననిచెప్పి ధర్మజుంజూచి యిట్లనియె.

టీ॥ పూజించునప్పుడు=అర్చించుసమయమునందు. అందున్ = ఆపూజ చేయవలసినవారిలో. అగ్రపూజార్హులు = మొట్టమొదట పూజింపఁదగినవారు. (ఎవ్వరు) అనియడిగినన్=అనియడుగఁగా. సదస్యులు = సదస్సునందలి వారు. తమకుదోఁచిన విధంబులన్= తమతమకుతోఁచినట్టు. పలుకన్=చెప్పఁగా. వారిభాషణంబులు= ఆసదస్యులమాటలను. వారించి = నిలిపి. వివేకశీలుండును=యుక్తాయుక్తవివేకముగల స్వభావముగలవాఁడును. చతురవచన కోవిదుండును=చతురములైనమాటలయందు సమర్థుఁడును. (అగుసహదేవుండును) భగవంతుండును = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడును. యదుకులసంభవుండును=యాదవవంశమునందుఁబుట్టినవాఁడు. (అయిన శ్రీకృష్ణునింజూపి) ఇమ్మహాత్మునిన్=ఈవిరాట్స్వరూపుని. సంతుష్టుం జేసినన్=తృప్తినొందించినను. భువనంబులు = లోకములు. అన్నియును) పరితుష్టిన్ = పూర్ణతృప్తిని. (పొందును అనిచెప్పి) ధర్మజున్=ధర్మరాజును. (చూచి ఇట్లనియెను)

తా॥ పూజచేయునప్పుడు అగ్రపూజకుతగినవారు ఎవరని అడుగఁగా ఆసభలోని వారందఱును ఒకరొకరు ఒక్కొకరిని చూపి చెప్పఁగా వారినందఱిని ఊరకుండుఁడని వివేకియు మాటనేర్పుగలవాఁడునైన సహదేవుఁడు శ్రీకృష్ణమూర్తిని ధర్మరాజునకుఁ జూపి (పురుషఏవేదగ్ంసర్వంపురుషాన్న పరంకించిత్, ఏకోదేవోబహుధా నివిష్టః) అను శ్రుతి ప్రమాణములచేత చతుర్దశ భువన రూపుఁడైన యీమహాత్ముని తృప్తి పొందించిన పక్షమున ఎల్ల లోకులును తృప్తి పొందుదురు కాఁబట్టి యీయనను పూజింపుమని చెప్పె నని తా.

౮౦౩.—ఉ॥ కాలము దేశమున్ గ్రతువుఁ * గర్మముఁ గర్తయు భోక్తయున్ జగ
జ్జాలము దైవమున్ గురువు * సాంఖ్యము మంత్రము యజ్ఞియాహుతుల్
వేళలు విప్రులుం జనన * వృద్ధి లయంబులు హేతుభూతముల్
లీలలఁ దానయై తగ వె * లింగెడి యెక్కటితేజ మీతఁడున్.

టీ॥ కాలమును=యజ్ఞము చేయఁదగిన కాలమును. లేక, రేయి పగలు మొదలగు భేదములుగల కాలమును. దేశమును=యజ్ఞము చేయఁదగిన స్థలమును. లేక, కాశి గయ ప్రయాగము మొదలగుభేదములు గల పుణ్య దేశమును. క్రతువును=యజ్ఞమును. కర్మమును= ఆయజ్ఞము నందు చేయఁబడు పశువధ హోమాది క్రియలును. కర్తయున్=యజ్ఞముచేయువాఁడును. భోక్తయున్=ఆయజ్ఞఫలమును అనుభవించువాఁడును. జగజ్జాలమును=లోకసమూహమును. దైవమున్ = ఆరాధింపఁదగినదేవుఁడును. గురువును = కారణాచార్యుఁడును. సాంఖ్యమును=ఆకారణాచార్యునిచేత నుపదేశింపఁబడి ఆత్మ స్వరూపమును నిర్ణయించునట్టి సాంఖ్యయోగమును. అనఁగా, మంత్రలయ హఠ రాజయోగములుననుట. మంత్రమును= యజ్ఞమునందుపఠింపఁబడుచతుర్వేదమంత్రములును. యజ్ఞియాహు

తులును = యజ్ఞమునందు చేయఁబడిన వపాజ్యాద్యాహుతులును. వేళలును = ఆయాహుతులు చేయఁదగిన సమయ ములును. విప్రులును=ఆయజ్ఞమునునడపునట్టి బ్రాహ్మణులును. జననవృద్ధిలయంబులును=పుట్టు పెంపుచావులును. హేతుభూతములు=వానికికారణములును. లీలలన్=విలాసములతో. తానయై=తానే యీ చెప్పఁబడిన వన్నియునై. తగన్=తగునట్లు. వెలింగెడి=ప్రకాశించునట్టి. ఒక్కటి తేజము=ఒక్కటియైనమహాతేజస్సును. ఈశుఁడు=సర్వనియామకుఁడును. శ్రు॥ యజ్ఞోవైవిష్ణుః, బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం। బ్రహ్మైవ తేనగంతవ్యం బ్రహ్మకర్మసమాధినా॥ అని. శ్లో॥ అహంక్రతురహంయజ్ఞః స్వధాహమహమౌషధం, మంత్రోఽహమహమేవాజ్య మహమగ్నిరహంహుతం॥ అని భగవద్గీత॥

తా॥ యజ్ఞముచేయఁదగినకాలము దేశమును ఆయజ్ఞము చేయఁదగినస్థలమును యజ్ఞమునుయజ్ఞమునందుచేయఁబడుపశువధహోమాది క్రియలును యజ్ఞముచేయు వాఁడును ఆయజ్ఞఫలమును అనుభవించువాఁడునులోకసమూహమును ఆరాధింపఁదగిన దేవుఁడునుకారణాచార్యుఁడును ఆకారణాచార్యునిచేతనుపదేశింపఁబడి ఆత్మస్వరూపమునునిర్ణయించునట్టి సాంఖ్య యోగమును యజ్ఞమునందు పఠింపఁబడు చతుర్వేద మంత్రములును యజ్ఞమునందుచేయఁబడినవపాజ్యాద్యాహుతులును ఆయాహుతులు చేయఁదగిన సమయ ములును ఆయజ్ఞమునునడపునట్టి ఋత్విక్కులును పుట్టుట పెరుగుటనశించుటలును వానికికారణములును అందువలని వినోదములునుతానై యొప్పునట్టి అఖండతేజోరూపుఁడైనయీశ్వరుఁడును ఇతఁడేకదాయనితా.

౨౦౪.—చ॥ ఇతఁడె యితండు గన్నులొక * యించుక మోడ్చిన నీచరాచర
స్థిత భువనంబు లన్నియు న * శించు నితండవి విచ్చిచూచినన్
వితతములై జనించుఁ బ్రభ * విష్ణుఁడువిష్ణుఁడునైనయట్టి యీ
క్రతు ఫలదుండుగా కొరుఁడొ * కండెటులర్హుఁడు శిష్టపూజకున్.

టీ॥ ఇతఁడె = ఇప్పుడుచెప్పినవన్నియు నితఁడే. ఇతండు = ఈకృష్ణుఁడు. కన్నులు=తనకన్నులను. ఒకయించుక=కొంచెము. మోడ్చినన్=మూసినను. ఈచరాచరస్థిత భువనంబులు=ఈచరములును అచరములునైన ప్రాణులుగల లోకములన్నియు. (నశించును) ఇతండు=ఈయన. అవి=ఆకన్నులను. విచ్చిచూచినన్ = తెఱచి చూచినను. వితతములై=విశాలములై. జనించున్=లోకములుపుట్టును ప్రభవిష్ణుఁడున్=సర్వమునుజనింపఁజేయుస్వభావముగలవాఁడును విష్ణుఁడును=సర్వవ్యాపకుఁడును. (అయినట్టి) ఈక్రతుఫలదుండు= ఈయజ్ఞఫలము నిచ్చువాఁడైన కృష్ణుఁడు. శిష్టపూజకున్ = అగ్రపూజకు. అర్హుఁడుగాక=తగినవాఁడుగాని. ఒరుఁడొకండు=ఇతరుఁడొకఁడు. ఎటులు=ఏవిధముగా (అగ్రపూజకుతగినవాఁడుఅగును

తా॥ ఈచెప్పఁబడినకాలదేశాదులన్నియునితఁడేకాఁబట్టిఇతఁడు కొంచెముకన్నులుమూసిన ఈకానవచ్చు సర్వప్రపంచమునునశించును కన్నులనుతెఱచినమరలనీప్రపంచమంతయుజనించునుఇటువంటిసర్వసృష్టికర్తయు సర్వవ్యాపకుఁడును నైన, యీమహాత్ముఁ డుండఁగా ఇంకొకఁడు ఇక్కడ అగ్రపూజకుఁ దగినవాఁడున్నాఁడా అని తా.

౨౦౫.—ఉ॥ ఈపురుషోత్తమున్ జగద * ధీశు ననంతుని సర్వశక్తుఁ జి
ద్రూపకు నగ్రపూజఁ బరి * తోషముసేయ సమస్త లోకముల్
వేపరితుష్టిఁబొందుఁ బృథి * వీవర కావున నీవు కృష్ణునిన్
శ్రీపతిఁ బూజసేయు మెడ * సేయక మాటలు వేయునేటికిన్.

టీ॥ పృథివీవర=రాజా. ఈపురుషోత్తమున్=పురుషశ్రేష్ఠుఁడైన యీయనను. జగదధీశున్=లోకములకుప్రభువును. అనంతునిన్= మేరకానరానివాఁడును. సర్వశక్తున్=సృష్టిస్థితిలయ తిరోధానాది సర్వశక్తులుగలవాఁడును. చిద్రూపకున్ = జ్ఞానస్వరూపుఁడునైన వానిని. అగ్రపూజన్=మొట్టమొదటపూజించుటచేత. పరితోషము సేయన్=సంతోషపెట్టఁగా. సమస్తలోకములు=ఎల్లలోకములును. వే=శీఘ్రముగ. పరితుష్టిన్=పూర్ణతృప్తిని. (పొందును) కావునన్= కనుక. (నీవు) శ్రీపతిన్ = లక్ష్మీదేవికి భర్తయైన — విష్ణువైన. కృష్ణునిన్=శ్రీకృష్ణమూర్తిని. ఏడసేయక=ఆలస్యముచేయక. (పూజసేయుము) మాటలు వేయునేటికిన్ = వేయిమాటలుచెప్ప నేల.

తా॥ ఓరాజా! పురుషశ్రేష్ఠుఁడును, లోకములకెల్ల ప్రభువును మేరలేనివాఁడును ఎల్ల సామర్థ్యములు గలవాఁడును, జ్ఞానస్వరూపుఁడునైన యీకృష్ణమూర్తిని అగ్రపూజచేత తృప్తిపొందించినట్టయిన ఎల్లలోకములును తృప్తిపొందినవి యగును కాఁబట్టి శ్రీవిష్ణుస్వరూపుఁడగు కృష్ణమూర్తిని జాగుసేయక పూజింపుము ఊరక వేని పోనిమాటలు అనేకములు చెప్పుటచేత ప్రయోజనము లేదని తా.

౨౦౬.—క॥ అనిసహదేవుఁడు వలికిన। విని యచ్చటిజనులు మనుజ * విభులును ఋషులున్
మనుకొని మనముల మోదము। దనుకఁగ నిది లెస్సయనిరి * ధర్మజుఁ డంతన్.

టీ॥ (అనిసహదేవుఁడు) పలికినన్=చెప్పఁగా. (విని) అచ్చటి జనులు=అక్కడనున్న సామాన్య జనులును. మనుజవిభులు=రాజులును. ఋషులును=మునీశ్వరులును. మనుకొని=పూని — అంగీకరించి యనుట. మనములన్=మనస్సులయందు. మోదము = సంతోషము. తనుకఁగన్=కలుగఁగా. ఇది లెస్స = ఇదిబాగు. అనిరి= అనిచెప్పిరి. అంతన్ = అటుపిమ్మట. ధర్మజుఁడు = ధర్మరాజు.

తా॥ అని ఇట్లుసహదేవుఁడుచెప్పఁగా అక్కడనున్న రాజులు మునులు మొదలుగాఁగల జనులందఱును మనస్సులందు సంతోషించి ఈసహదేవుఁడుచెప్పినదే సరియని ఒప్పుకొని అతనినిగొనియాడిరి అంతట ధర్మరాజుమీఁదచెప్పినవిధమున కృష్ణుని పూజించె నని తా.

౮౦౭.—క॥ మునిజనమానస మధుకర । వనజాతము లైనయట్టి * వారిజదళ లో
చను పదపద్మ ప్రక్షా । ళన మొగిఁ గావించి తజ్జ * లంబులు భక్తిన్.

టీ॥ముని...ములు—మునిజన=బ్రహ్మనిష్ఠులయొక్క. మానస=అంతఃకరణములనెడు. మధుకర=తుమ్మెదలకు. వనజాతములు = తామరలు. (ఐనయట్టి) వారిజదళలోచను పదపద్మప్రక్షాళనము=శ్రీకృష్ణమూర్తియొక్క పాదకమలములను కడుగుటను. ఒగిన్ = క్రమముగా. కావించి=చేసి. తజ్జలంబులు=ఆకాళ్లుకడిగిన నీళ్లను. భక్తిన్=భక్తితో. తాత్పర్యము పైపద్యమునందు.

౮౦౮.—క॥ తానును గుంతియు ననుజులు । మానుగ ద్రుపదాత్మజయును * మస్తకములఁ బెం
పూనిన నియతి ధరించి మ । హానందముఁ బొంది రతిశ * యప్రీతి మెయిన్.

టీ॥ తానును=ధర్మరాజును. కుంతియున్=కుంతీదేవియు. అనుజులును=తమ్ములును. ద్రుపదాత్మజయున్=ద్రౌపదియును. మానుగన్=ఒప్పిదముగా. పెంపూనిననియతిన్=అధికనియమముతో. మస్తకములన్=తలలయందు. (ధరించి) అతిశయప్రీతిమెయిన్ = అత్యంతప్రీతితో. మహానందమున్=మిక్కుటమైనసంతోషమును. (పొందిరి)

తా॥ మునిశ్రేష్ఠుల మనస్సులనెడు తుమ్మెదలకు కమలములవలె నాచరించుచున్న శ్రీకృష్ణమూర్తి అడుగులను కడిగి ఆయడుగులు కడిగినయుదకమును ధర్మరాజు తానును తమతల్లియయిన కుంతియు తమ్ములును భార్యయగు ద్రౌపదియు మిక్కిలి భక్తితో తలలమీఁద చల్లుకొని సంతోషించిరి అని తాత్పర్యము.

౮౦౯.—క॥ చంచత్కాంచన రుచిరో । దంచిత వస్త్రముల నూత * నార్క ప్రభలన్
మించిన రత్నములం బూ । జించెన్ ధర్మజుఁడు కృష్ణు * జిష్ణు సహిష్ణున్.

టీ॥ ధర్మజుఁడు = ధర్మరాజు. చంచ...ములన్—చంచత్ = ప్రకాశమయిన-కాంచన=బంగారుచేత. రుచిర=ప్రకాశించుచున్న. ఉదంచిత = అందములయిన. వస్త్రములన్ = చేలముల చేతను. నూతనార్కప్రభలన్—నూతన = క్రొత్తయై. అర్కప్రభలన్ = సూర్యకాంతులచేత – ప్రాతఃకాలపు సూర్యునికాంతివంటికాంతులచేత. మించిన = అతిశయించిన. రత్నములన్=పద్మరాగమణులచేతను. జిష్ణున్ = జయశీలుఁడైన. సహిష్ణున్ = సర్వము నోర్చునట్టి స్వభావముగలవాఁడైన. కృష్ణున్=శ్రీకృష్ణుని. (పూజించెను)

తా॥ ధర్మరాజు మిక్కిలి ప్రకాశించునట్టి బంగారుకాంతులచేత వెలుఁగుచున్న మనోజ్ఞములైన వస్త్రములచేతను, ప్రాతఃకాలపు సూర్యుని వెలుఁగువలె వెలుఁగునట్టి మణులచేతను జయశీలుఁడును సహనశీలుఁడునునైన శ్రీకృష్ణుని పూజించెనని తాత్పర్యము.

౮౧౦.—వ॥ ఇట్లు పూజించి యానందబాష్ప జలబిందు సందోహ కందళిత నయనారవిందంబులం గోవిందుని
సుందరాకారంబు దర్శింపఁ జాలకుండె నట్లు పూజితుండై తేజరిల్లు పుండరీకాక్షు నిరీక్షించి
హస్తంబులు నిజమస్తకంబుల ధరించి వినుతిసేయుచు నఖిలజనంబులు జయజయశబ్దంబు లిచ్చిరి
దేవతలు వివిధ తూర్య ఘోషంబులతోడం బుష్ప వర్షంబులు గురియించి రయ్యవసరంబున.

టీ॥ (ఇట్లుపూజించి) ఆనంద...విందంబులన్—ఆనంద=సంతోషాతిశయమువలనఁబుట్టిన. బాష్పజల = కన్నీళ్లయొక్క. బిందు= బొట్లయొక్క. సందోహ=సమూహముచేత. కందళిత=వికాసము వహించిన. నయనారవిందంబులన్=కన్నుదామరలచేత. గోవిందుని సుందరాకారంబు = కృష్ణునియొక్క అందమయిన రూపమును. దర్శింపన్=చూడను. చాలకుండెన్ = శక్తుఁడుకాక యుండెను. (అట్లు) పూజితుండై = పూజింపఁబడినవాఁడై. తేజరిల్లు=వెలుఁగునట్టి. పుండరీకాక్షున్ = కృష్ణుని. నిరీక్షించి = చూచి. హస్తంబులు = చేతులు. నిజమస్తకంబులన్=తమతలలయందు. ధరించి= తాల్చి. వినుతిసేయుచున్=స్తోత్రముచేయుచు. అఖిలజనంబులున్= ఎల్లజనులును. జయజయశబ్దంబులు = జయజయ అను ధ్వనులను. ఇచ్చిరి = కలుగఁజేసిరి. (దేవతలు) వివిధతూర్య ఘోషంబులతోడన్=నానావిధములయిన వాద్యములతో. పుష్పవర్షంబులు = పూలవానలు. (గురియించిరి) అయ్యవసరంబునన్ = ఆసమయమునందు.

తా॥ ఈవిధముగాపూజించినందువలని సంతోషముచేత ఆనందబాష్పములు కారుట వలన విప్పజాలని కన్నులతో శ్రీకృష్ణమూర్తియొక్క సుందర విగ్రహమును చూడఁజాలక యుండెను ఆవిధముగా పూజింపఁబడి వెలుఁగుచున్న శ్రీకృష్ణునిఁజూచి చేతులు నొసళ్లలోఁ జేర్చుకొని పొగడుచు ఎల్లజనులును జయజయయనుశబ్దములు కలుగఁజేసిరి, దేవతలు వాద్యధ్వనులతోడ పుష్పవానలు కురియించిరి, ఆసమయమునందని తాత్పర్యము.

౮౧౧.—క॥ దమఘోషసుతుఁడు దద్విభ । వముఁ జూచి సహింప కలుక * వట్టిలఁగాఁ పీ
ఠము డిగ్గి నిలిచి నిజహ । స్తము లెత్తి మనోభయంబుఁ * దక్కినవాఁడై.

టీ॥ దమఘోషసుతుఁడు = దమఘోషునికొడుకైన శిశుపాలుఁడు. తద్విభవమున్=ఆవైభవమును. (చూచిసహింపక) అలుక= కోపము. వట్టిలఁగాన్ = ఆవరించుకొనఁగా, (పీఠముడిగ్గి నిలిచి (నిజహస్తములెత్తి మనోభయంబు) తక్కినవాఁడై=విడిచినవాఁడై.

తా॥ అప్పుడు శిశుపాలుఁడు ఆకృష్ణునియొక్క పూజావైభవమును జూచి ఓర్వలేనివాఁడై మిక్కిలి కోపమును వహించి తన కూర్చున్న పీఁటయందుండి దిగి నిలువఁబడి చేతులు పైకెత్తుకొని భయము కొంచమయిన మనసునందు లేనివాఁడైయని తాత్పర్యము.











(*) రాజసూయ యజ్ఞంబున నగ్రపూజగొన్న శ్రీకృష్ణుని శిశుపాలుఁడు దూషించిచచ్చుట. (*)

౮౧౨.—వ॥ అప్పుఁడప్పుండరీకాక్షుండు వినుచుండ సభాసదులంజూచి యిట్లనియె.

టీ॥ (అప్పుడు) అప్పుండరీకాక్షుండు=ఆకృష్ణుడు. (వినుచుండ) సభాసదులన్=సభయందుండు వారిని (జూచియిట్లనియెను)

తా॥ అప్పుడు కృష్ణుఁడు వినుచుండఁగా శిశుపాలుఁడు ఆసభికులను జూచి యిట్లుపలికె నని తాత్పర్యము.

౮౧౩.—క॥ చాలుఁబురేయహహా యీ । కాలముఁగడపంగ దురవ * గాహంబగు నీ
తేలా తప్పెను నేఁడీ । బాలకు వచనముల చేతఁ * బ్రాజ్ఞుల బుద్ధుల్.

టీ॥ చాలుఁబురే=ఔరాచాలునుచాలును. అహహా = అహహ బాగుగనున్నది. (ఈకాలమును) కడపంగన్=జరపుట. దురవగాహంబు=అశక్యము. (ఆగును నేడు) ప్రాజ్ఞులబుద్ధులు=మిక్కిలి తెలిసినవారి బుద్ధులన్నియు. ఈబాలకు వచనములచేతన్=ఈపిల్లకాయ మాటలచేత. నీతి=న్యాయమును. ఏలా=ఏమిటికి. (తప్పెను)

తా॥ ఔరౌర? బాగుబాగు మీవివేకముఇంతమాత్రముచాలును చాలును ఇటువంటి అక్రమపు కాలమును కడపుట దుర్లభము అగునని తోఁచుచున్నది, ఈగొప్పవారిబుద్ధులన్నియునుబాలకుఁడైన యీ సహదేవునిమాటలను విన్నమాత్రముచేతనే ఏల మాంద్యమునుపొంది నీతిని తప్పెను అని పలికెను అని తాత్పర్యము.

వ॥ తప్పిన తెఱం గెట్లనినఁ బాత్రాపాత్ర వివేకంబు సేయనేర్చిన విజ్ఞాన నిపుణులు, నున్నత సత్వగుణ గరిష్ఠులును బహువిధ తపోవ్రత నియమ నిష్ఠులు, ననల్ప తేజులు, మహదైశ్వర్య శక్తిధరులుఁ, బరతత్వ వేదులు, నఖిల లోక పూజ్యులు, విగత పాపులుఁ, బరమ యోగీంద్రులునుండ వీరిం గైకొనక వివేక రహితులై గోపాల బాలునిం బూజ సేయుటకు నెట్లు సమ్మతించితిరి, పురోడాశంబు సృగాలంబున కర్హం బగునే యదియునుం గాక.

టీ॥ తప్పిన తెఱంగు=క్రమముతప్పినవిధము. (ఎట్లు) అనినన్= అనియడిగెడు పక్షమున. పాత్రాపాత్రవివేకంబుసేయనేర్చిన విజ్ఞాన నిపుణులును = వీఁడుతగినవాఁడువీఁడుతగనివాఁడు అని తెలిసికొను నేర్పుగల విశేష జ్ఞానవంతులును. ఉన్నతసత్వగుణ గరిష్ఠులును = అధికమయిన సాత్త్విక గుణముచేత గొప్పవారును. బహువిధ ... నిష్ఠులును — బహువిధ = నానా విధములయిన. తపః = కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సుల యందును. వ్రత = ఏకాదశి శివరాత్రి మొదలగు వ్రతములయందును. లేక, గురు యజ్ఞ దీక్షల యందును. నియమ=నియమము మొదలైనఅష్టాంగ యోగముల యందును లేక, పంచదశ యోగాంగ ములయందును. నిష్ఠులును=నిష్ఠగలవారును— నిలుకడగలవారనుట. అనల్ప తేజులును=అధిక తేజస్సు గలవారును. మహదైశ్వర్యశక్తిధరులును—మహత్=గొప్పవైన. ఐశ్వర్య=అణిమాద్యష్టయిశ్వర్యములను. శక్తి=సర్వజ్ఞత్వాది శక్తులను. ధరులును= ధరించివారును. పరతత్వవేదులును=పరబ్రహ్మము నెఱిఁగినవారును. అఖిలలోకపూజ్యులును=పదునాలుగులోకములపూజకుతగినవారును విగతపాపులును = పోయిన అంహ ఆగ ఏనస్సులనెడు పాపములు గలవారును. పరమ యోగీంద్రులును = బ్రహ్మనిష్ఠులలో శ్రేష్ఠులును. ఉండన్=ఉండఁగా. వీరిన్=ఈచెప్పఁబడిన వారిని. కైకొనక=లక్ష్యముచేయక. వివేకరహితులై=పాత్రాపాత్రముల నెఱుఁగునట్టి తెలివిమాలినవారై. గోపాలబాలునిన్=గొల్లపిల్లకాయను. పూజ సేయుటకున్=పూజించుటకు. (ఎట్లు) సమ్మతించితిరి=ఒప్పుకొంటిరి. పురోడాశంబు=యజ్ఞశిష్టహవిస్సు. సృగాలంబునకున్=నక్కకు. అర్హంబగునే=తగునా. అదియునుంగాక=అంతమాత్రము గాక.

తా॥ నీతితప్పినవిధము ఎట్టిదియని ఆడిగెడు పక్షమున వినుఁడు చెప్పెదను, వీరుపూజార్హులు పూజకు అనర్హులువీరు అని ఆలోచింపఁదగినవారు ఇందు అనేకులున్నారు, శుద్ధసాత్త్వికగుణమును వహించుటచేతగొప్పవారును, నానావిధము లయిన తపస్సులను వ్రతములను అష్టాంగ పంచదశాంగ యోగములను, నడపుటయందు నిలుకడగలవారును, అధిక తేజస్సుగలవారును, అణిమాద్యష్టయిశ్వర్యములును సర్వజ్ఞత్వాదిశక్తులును గలవారును పరబ్రహ్మము నెఱిఁగినవారును, ఎల్ల లోకములందును పూజగొనఁ దగినవారును అయినపెద్దలు అనేకులు పాప రహితులు ఉండఁగా వారినెల్లను అలక్ష్యముచేసి తెలివిమాలినవారై యీగొల్ల పిల్లకాయను పూజించుటకు మీరెట్లుసమ్మతించిరి. దేవతాయోగ్యమైన పురోడాశమునక్కకుఇయ్యఁదగునా? ఇంతేగాక ఇంకనుకొన్నిలోపములువీనియందున్నవియని తాత్పర్యము.

౮౧౪.—సీ॥ గురుదేవ శూన్యుండు * కులగోత్ర రహితుండు - దలిదండ్రు లెవ్వరో * తడవఁగాన
మప్పులఁ బొరలెడు * నాది మధ్యావ సా - నంబు లందరయ మా * నంబు లేదు
బహు రూపియై పెక్కు * భంగుల వర్తించు - వావి వర్తనములు * వరుస లేవు
పరికింప విగత సం * బంధుండు దలపోయ - మా నిమిత్తంబున * మానిసయ్యెఁ
తే॥ బరఁగమున్ను యయాతి శా * పమునఁ జేసి । వాసికెక్కఁడు యాదవ * వంశ మెల్ల
బ్రహ్మ తేజంబునెల్లఁ గో * ల్పడిన యతఁడు । బ్రహ్మఋషి సేవ్యుఁడగునె గో * పాలకుండు.

టీ॥ గురుదేవశూన్యుండు—గురు = శ్రేష్ఠులైన శంకరాద్యాచార్యులును. దేవ=శ్రేష్ఠులైన శివకేశవాది దేవతలును. శూన్యుండు= లేనివాఁడు—సదాచార్యపరంపరలోఁ జేరనివాఁడును నీచదేవతలఁ గొల్చువాఁడునుఅనుట. కులగోత్రరహితుండు—కుల=శ్రేష్ఠములైన బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రకులములును. గోత్ర=వసిష్ఠవిశ్వామిత్ర కాశ్యపాదిగోత్రములును. రహితుండు=లేనివాఁడు-నీచకులమునునీచగోత్రమునుగలవాఁడనుట. తడవన్=విచారింపఁగా. తలిదండ్రులెవ్వరో కానము=దేవకీవసుదేవుల కొడుకో యశోదానందులకొడుకో తెలియదు. అప్పులఁబొరలెడున్=అప్పులలో మునిఁగి తేలుచుండును— తనకు సేవచేయువారికి అప్పులకాఁపై యుండుననుట. అరయన్= విచారింపఁగా. ఆదిమధ్యావసానంబులందున్—ఆది = మొదటను. మధ్య=నడుమను. అవసానంబులందున్=తుదయందును. మానంబు లేదు=గొప్పవాఁడను నభిమానము లేదు — పుట్టినది మొదలు ఒకప్పుడును గౌరవమునంపు ఇచ్ఛ లేదు. బహురూపియై = అనేకరూప

ములు గలవాఁడై. పెక్కుభంగులన్ = బహువిధముల చేత. వర్తించున్ = మెలఁగును — అనేకవిధములైన వేషములు వేసికొని ఆయావేషములకుతగినట్లు మెలఁగుననియర్థము. వావివర్తనములు= అన్నతమ్ముఁడుబావమఱఁది మొదలగుసంబధమర్యాదలనడవళ్లును. వరుస=ఇట్టిమర్యాదకు వీరు తగుదురు వీరుతగరు అను క్రమమును. (లేవు) పరికింపన్=చక్కగావిచారింపఁగా. విగతసంబంధుండు= పోయినసంబంధము గలవాఁడు—వీరు తనవారు వీరు అన్యులు అను సంబంధబాంధవ్యములను విచారించువాఁడుగాఁడు. తలపోయన్= ఆలోచింపఁగా. మానిమిత్తమునన్=మాబంధుత్వ నిమిత్తముచేత. మానిసయ్యెన్=వీఁడునుఒకమనుష్యుఁడాయెను—మాకుకావలసిన చుట్టమను నిమిత్తముచేతనలుగురును వీనినొకమనుష్యునిఁగాఁదలఁచి గౌరవించు చున్నారనుట. పరఁగన్ = ప్రసిద్ధముగా. మున్ను= మునుపు. యయాతి శాపమునఁజేసి=యయాతి మహారాజు ఇచ్చిన శాపముచేత. యాదవవంశమెల్లన్=యదువుయొక్కవంశమంతయు వాసికెక్కదు = గొప్పతనము కలదికాదు. బ్రహ్మతేజంబు నెల్లన్= బ్రాహ్మణతేజస్సునంతయు. కోల్పడినయతఁడు = పోఁగొట్టుకొన్న వాఁడగు. గోపాలకుండు = గొల్లపిల్లకాయ. బ్రహ్మర్షి సేవ్యుఁడగు నె=బ్రాహ్మణులైన ఋషులచేత సేవింపఁ దగినవాఁడు అగునా.

తా॥ ఓ సభికులారా! వినుఁడు ఈకృష్ణుఁడు శ్రేష్ఠులైన శంకరాద్యాచార్యులును శివ కేశవాది దేవతలును లేని వాఁడును, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర కులములును వసిష్ఠ కశ్యప విశ్వామిత్రాది గోత్రములును లేనివాఁడును, ఇదితల్లివీఁడుతండ్రి అనునియమము లేని వాఁడును, ఎల్లప్పుడు అప్పులుతీసి అప్పులవారివలనిబాధలనుపొందు చుండువాఁడును, ఎల్లప్పుడుమానమువిడిచివర్తించువాఁడును, నానావిధవేషములువేసికొనినానావిధములసంచరించువాఁడును, వావివరుసలు లేక ఘనత్తతోడి సంగమము కలిగి వర్తించువాఁడును, ఎవరితోడనుసంబంధింపని వాఁడునునై యున్నాఁడు, ఇదంతయు విచారించి చూడఁగా మాబంధుత్వముచేతనే వీనికి నలుగురిలోను గౌరవము కలుగుచున్నది, యయాతి మహారాజు మందిచ్చిన శాపముచేత యదువంశస్థు లందఱునునీచులేకనుక అందు వీఁడు మిక్కిలి నీచుఁడు అనవలసిన వాఁడు, శాపవశముచేత బ్రహ్మతేజస్సు గల క్షత్రియత్వమునుకోలుపోయినగొల్లపిల్లకాయబ్రహ్మర్షులచేతఅర్చింపఁ దగినవాఁడగునా? ఇదివిచారింపక వీనిని అగ్రపూజచేయుటకు మీరు ఒప్పుకొంటిరేయని తాత్పర్యము.

## వి శే షా ర్థ ము.

టీ॥ గురుదేవశూన్యుండు — గురు = శ్లో॥ గుకారోరంధకారస్స్యాద్రుకార స్తన్నివర్తకః । అంధకారనివర్తత్వాద్గురురిత్యభిధీయతే ॥ అనుప్రమాణమునుపట్టి తనకంటె నితరముగ జగత్తును జీవుఁడును పరబ్రహ్మమును గలదనెడి అజ్ఞానమును నశింపఁజేయు విజ్ఞానస్వరూపుఁడు తానే అయినందున తనకుజ్ఞానోపదేశముచేయు గురువు వేఱొకఁడు. శూన్యుండు=లేనివాఁడు. శ్లో॥ స్వంశిష్యగురురాత్మనా॥ అని. దేవ=శ్రు॥ ఏకోదేవో బహుధానివిష్టః, అజాయమానో బహుధావిజాయతే. అను ప్రమాణముచేత సకల దేవతాస్వరూపుఁడు తానగుటవలన తానారాధింపఁదగినదేవుఁడు వేఱొకఁడు లేఁడు. కులగోత్రరహితుండు = శ్రు॥ అనామగోత్రం, అని శ్రుతి. శ్లో॥ ఉపాధిత్రితయాదన్యమాత్మానమవధారయేత్॥ అనెడి ఆచార్యోక్తిని పట్టి పంచకోశాత్మక శరీరము లేనివాఁడగుట చేత బ్రహ్మక్షత్రియాదికులములును, వసిష్ఠాదిగోత్రములును లేనివాఁడును. తడవన్=శోధింపఁగా. తలిదండ్రు లెవ్వరో గానము=శ్లో॥ పితాహమస్యజగతో మాతాధాతాపితామహః। వేద్యంపవిత్రమోంకారం ఋక్సామయజురేవచ। గతిర్భర్తాప్రభుస్సాక్షీనివాసశ్శరణంసుహృత్। ప్రభవఃప్రలయస్థానం నిధానంబీజమవ్యయం । తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామిచ। అమృతంచైవమృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥ అని భగవద్గీతా నవమోధ్యాయమునందును, శ్లో॥ అహం కృత్స్నస్యజగతః ప్రభవః ప్రలయస్తథా । మత్తఃపరతరంనాన్యత్కించిదస్తిధనంజయ । మయిసర్వమిదంప్రోతం సూత్రేమణిగణా ఇవ॥ బీజంమాంసర్వభూతానాం విద్ధిపార్థసనాతనం॥ అని సప్తమోధ్యాయము నందును గలదు గనుక తనకు తల్లి తండ్రి తానే కాని స్వేరతమాతాపితలు లేరు—స్వయంజాతుఁడనిభావము. అప్పులఁబొరలెడున్ = ప్రళయకాలమునందు మహాసముద్ర జలములో వటపత్రశాయియై యుండును. శ్లో ॥ కరారవిందేనపదారవిందం ముఖారవిందే వినివేశయంతమ్ । వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మనసాస్మరామి ॥ అని శ్రీకృష్ణ కర్ణామృతము. లేక నిద్రయనెడు మహాప్రళయములో (కుక్షిస్సప్తసముద్రం) అను ప్రమాణమునుపట్టి సప్తధాతుమయసప్తసముద్రమునందు అంతఃకరణమనెడు వటపత్రముమీఁద పరుండియుండువాఁడు. అరయన్ = విచారింపఁగా. ఆదిమధ్యావసానంబులందుమానంబు లేదు=పుట్టుటపెరుగుటగిట్టుట అనునవి కలవనుటయందు ప్రమాణము లేదు—జన్మాదులు లేనివాఁడనిభావము. లేకతనరూపమునకు మొదలు నడుము తుదలు లేనివాఁడు — అఖండస్వరూపుఁడని భావము. బహురూపియై = ఏకోదేవోబహుధానివిష్టః, ఏకంరూపం బహుధాయఃకరోతి, ఏకోవశీ సర్వభూతాంతరాత్మా, ఈశ్వరస్సర్వభూతానాంహృద్దేశేర్జునతిష్ఠతి॥ అను ప్రమాణముల చేత స్థావర క్రిమి జలచర పక్షి పశు నర సుర రూపములనుధరించి. పెక్కుభంగులన్ = అనేక మార్గములచేత. వర్తించున్ = తిరుగుచుండును—స్థావరాది బహువిధరూపములను దాల్చి ఆయారూపములకుఁ దగిన ప్రవర్తనలు గలిగి మెలఁగు నని భావము. లేక ( భూభార హరణార్థాయ సంభవామి యుగేయుగే) అనుప్రమాణమునుపట్టి దుష్టసంహారము కొఱకు పరశురామ శ్రీరామ కృష్ణాద్యవతారములెత్తి ఆయా అవతారములకుతగిన నడువడిగలిగి యుండును. వావివర్తనములువరుసలేవు=శ్లో॥ సర్వతఃపాణిపాదంచ సర్వతోక్షిశిరోముఖం। సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి॥ అని భగవద్గీత గనుక సకలజీవ రూపములతో తానేయున్నాఁడు కాఁబట్టి అన్నదమ్ములుఅక్కసెల్లెండ్లు బావమఱఁదులుఅనునివిమొదలగువావులువరుసలును లేవు. పరికింపన్=మొదలంట విచారింపఁగా. విగతసంబంధుండు=శ్లో॥ నాహందేహోనేంద్రియాణ్యంతరంగః। నాహంకారః ప్రాణవర్గోనబుద్ధిః । దారాపత్యక్షేత్రవిత్తాదిదూరః। స్సాక్షీనిత్యఃప్రత్యగాత్మాశివోహం॥ మాతానాస్తి పితానాస్తి నాస్తి బంధుసహోదరాః। అర్థంనాస్తిగృహంనాస్తి తస్మాజ్జాగృతజాగృత॥ అను ప్రమాణములనుపట్టి ఆకాశమువలె వస్త్వంతర సంబంధము లేనివాఁడు—దేనితోను ఏలాటిసంబంధము లేకఉదాసీనుఁడై యుండు

వాఁడనిభావము. తలపోయఁగ = ఆలోచింపఁగా. మానిమిత్తంబునఁగ=సత్వరజస్తమో గుణాత్మికయైన మూలప్రకృతియగు లక్ష్మీదేవి సంబంధమువలన. మానిసయ్యెఁగ = మనుష్యుఁడయ్యెను — శ్లో॥ త్రిగుణాత్మికయగుప్రకృతిం । దగిలినచోసగుణుఁడంద్రు దాని విడుచుచో। నగుణుఁడనియంద్రునన్నతి । సుగుణులునీరెండుగాను జన్మవిశేషిఁగ॥ అని సీతారామాంజనేయ సంవాదము గనుకప్రకృతి సంబంధముచేత రూపము గలవానివలె తోఁచుచున్నాఁడు గాని విజ్ఞానదృష్టిచేతఁజూచిన రూపములేనివాఁడని భావము. పరఁగఁగ= ప్రసిద్ధముగ. మున్ను = పూర్వము. యయాతిశాపమునఁ జేసి = ని॥ యస్తార్యగేపిలయేవాయా యమేదాతరియాతరి॥ అను రత్నమాలనుపట్టి య అను శబ్దము యమునియందును, స్థానము నందును వర్తించుచున్నది.యాతిఅనఁగాపోవుటకాఁబట్టి యయాతిఅనఁగా యమునికి స్థానమైన నరకలోకమునకు పోవు ఆత్మజ్ఞానములేని కర్మనిష్ఠుఁడు. శాపమునఁజేసి=వానిదూషణమువలన — కర్మనిష్ఠులగు వారు, శ్లో॥ యామిమాంపుష్పితాంవాచం ప్రవదంత్యవిపశ్చితః। వేదవాదరతాఃపార్థ నాన్యదస్తీతివాదినః। కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదాం। క్రియావిశేషబహుళాంభోగైశ్వర్యగతింప్రతి। త్రైగుణ్యవిషయావేదా నిస్త్రైగుణ్యోభవార్జున॥ అని భగవద్గీతా ద్వితీయోధ్యాయముగనుక అజ్ఞానజనులు కర్మనిష్ఠులగువారి తియ్యని మాటలకు లోఁబడి కర్మకాండయే ముఖ్యమైనది అందున స్వర్గాది లోక భోగములు కలకాలమనుభవింప వచ్చును అనినమ్మి కామనా కర్మములుచేయుచుపునరావృత్తిరహితమైనజ్ఞాననిష్ఠనుజ్ఞానకాండను దూషించుచున్నారు గనుక. యాదవవంశమెల్లఁగ = బ్రహ్మనిష్ఠుల పరంపరయంతయు. వాసికెక్కఁడు=ప్రసిద్ధివహింపదు—కర్మకాండ యందు పట్టుగలవారేలోకమునందు తలుచుగ నున్నారువారికేగౌరవము పూజ్యత మిగులఁ గలిగి యున్నది గాన జ్ఞాన కాండ యందు పట్టుగలపెద్దలు(రమతేబాలోన్మత్తవదేవ, స్త్రీబాలాంధజడోపమా) అనుశాస్త్రపద్ధతినిపట్టి అజ్ఞానులకు బాలురు పిచ్చివారు స్త్రీలుగ్రుడ్డివారుమూఢులు అనునట్లుతోఁచుచుందురుగనుక అజ్ఞానులువారినిపరిహసించి, శ్లో॥పునరపిజననంపునరపిమరణంపునరపిజననీజఠరేశయనం॥ అను ఆచార్యవాక్యము చొప్పున పుట్టిపుట్టి గిట్టిగిట్టి దుఃఖములలో పొరలుచు ఎన్నటికిని తుదముట్టరు.విజ్ఞానులైనవారు, శ్లో॥అన్యవిద్యా పరిజ్ఞాన మవశ్యంనశ్వరంభవేత్। బ్రహ్మవిద్యాపరిజ్ఞానంబ్రహ్మప్రాప్తికరంపరం॥ అనుశాస్త్రమునుపట్టి బ్రహ్మజ్ఞానులనుభూషించిపూజించి వారిపాదములేతమకుప్రాపకమనినమ్మిపునరావృత్తిరహితపరమమోక్షమునుపొందుదురు. బ్రహ్మతేజంబునెల్లఁగోల్పడినయతఁడు=బ్రహ్మ— బృంహతీతి బ్రహ్మ, బృహబ్రహివృద్ధౌ అని ధాతువుగనుక అఖండ పరిపూర్ణ సచ్చిదానంద స్వరూపముతో తాను. నచాంతర్నబహిర్యస్య నపూర్వోనాపిచాపరం । పూర్వాపరంబహిశ్చాంతోజగతోయోజగచ్చయః॥ అనుప్రమాణముచేత జగత్తునకు వెలుపల లోపల సందులలోను నిండియుండియును, శ్లో॥ సర్వత్రావస్థితోప్యాత్మానసర్వత్రావభాసతే। బుద్ధావేవావభాసేతస్వచ్ఛేతుప్రతిబింబవత్॥ అని ఆచార్యవాక్యము గనుక అజ్ఞానులకు అంతటనున్నట్లుకనఁబడఁడు—గనుక, శ్రు॥ సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ, అనుశ్రుతిచేత పరబ్రహ్మ లక్షణములైన సచ్చిదానంతములులేనట్లుతోఁచుచుండును. గోపాలకుండు = గోశబ్దమునకు భూమి అర్థముగనుక భూమ్యాది పంచ భూతములను రక్షించువాఁడు—గోవులనఁగా ఇంద్రియములు గనుక అచేతనములైన యింద్రియముల యందు తెలివి రూపముతో తాను ప్రవేశించివానినన్నిటిని శబ్దాదివ్యాపారములయందు ప్రవర్తింపఁజేసి రక్షించునట్టిజ్ఞానరూపపరబ్రహ్మము.శ్లో॥ ఏనేక్షతేశ్రుణోతిదంజిఘ్రతివ్యాకరోతిచ।స్వాద్వస్వాదువిజానాతితత్ప్రజ్ఞానమితీరితం ॥ అని మహావాక్యము.క॥కనుఁగనైవినుఁజెవియై। గొనుఁజవిజిహ్వయయి మూరుకొనునాసికయై।తనువై స్పర్శముచేయును।అనవద్యాబుద్ధియాత్మయందనిలుచుచుఁగ॥ అనిభారతశాంతిపర్వము.బ్రహ్మఋషిసేవ్యుఁడగునె=శ్రు॥యతోవాచోనివర్తంతేఅప్రాప్యమనసాసహ,నతత్రచక్షుర్గచ్ఛతినవాగ్గచ్ఛతినోమనః॥ అనుశ్రుతులచేతవాక్కునకుమనస్సునకునుఅందనిబ్రహ్మముబ్రహ్మవిద్వరిష్ఠులచేతనైనపూజింపశక్య మగునా,

ఆ.వె.—క॥ జారుఁడు జన్మావధియును । చోరుఁడు ముప్పోకలాఁడు ✻ సుమహిత పూజా
చార క్రియలకు నర్హుఁడె । వారక నితఁడనుచుశశుభ ✻ వాక్యస్ఫూర్తిఁగ.

టీ॥ ఇతఁడు=ఈకృష్ణుఁడు. జన్మావధియును=పుట్టిన నాటనుండియు.జారుఁడు=ముండలమారి.చోరుఁడు-దొంగ.ముప్పోకలాఁడు =మూడుపోకలపోవువాఁడు — తాగుఁబోతుతనము, తోడుఁబోతుతనము,టుక్కులమారితనమునుగలవాఁడనుట. సుమహితపూజాచారక్రియలకుఁగ = మిక్కిలిగౌరవింపఁబడిన పూజనడపునట్టి పనులకు. అర్హుఁడె=తగినవాఁడా.(అనుచు)వారక = సంకోచింపక. అశుభవాక్యస్ఫూర్తిఁగ=చెడ్డమాటలయొక్క ప్రకాశముతో—నిందించెనని క్రియ తెచ్చుకోవలయును.

తా॥ ఓసభికులారా ! ఈకృష్ణుఁడు పుట్టిననాటనుండిముండలమారియు, దొంగయునై,తాగుఁబోతుతనమును, తోడుఁబోతు తనమునుటుక్కులమారితనమునుగలిగిమానమువమానమునిందకువెఱచుటయునవివేకవర్తించువాఁడై యుండును ఇటువంటినీచుఁడుపూజ్యులగుగొప్పవారికిచేయఁదగిన అగ్రపూజకుఁదగనవాఁడు అగునా అని కొంచమయిన వెనుదీయక దూఱనాడుచుండెను అని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ జన్మావధియుఁగ = నిద్రగడవఁగావచ్చిన తానసెడు జ్ఞప్తి రూపముతో పుట్టినతోడనే, జారుఁడు = ఇంద్రియములనెడు స్త్రీలతోఁగూడి విషయసుఖములను స్వేచ్ఛగ అనుభవించు వాఁడు. చోరుఁడు=తననామమును తలఁచవలెనన్నవృత్తి పుట్టి కృష్ణ నారాయణ మహాదేవశ్రీరామ అనిస్మరించినమాత్రముననే నామోచ్చారణ చేసినవారి జన్మాంతర ములయందలి పాపములనన్నిటిని అపహరించు వాఁడు—శ్లో॥కృష్ణేతిమంగళంనామయస్యవాచప్రవర్తతే। భస్మీభవంతురాజేంద్రమహాపాతకకోటయః ॥ ఏకోపికృష్ణస్యసకృత్ప్రణామో దశాశ్వమేధావభృథేనతుల్యః। దశాశ్వమేధీపునరేతిజన్మాకృష్ణప్రణామీనపునర్భవాయ॥ నారాయణోనామనరోనరాణాంప్రసహ్యచోరఃకథితఃపృథివ్యాం। అనేకజన్మార్జితపాపసంచితం హరత్య శేషంస్మర

మాత్రమేవ॥యస్యస్మరణమాత్రేణజన్మసంసారబంధనాత్ । విముచ్యతేనమస్తస్మై విష్ణవేప్రభవిష్ణవే॥ కోటయోబ్రహ్మహత్యానామగమ్యాగమకోటయః । సద్యః ప్రళయ మాయాంతి మహాదేవేతి కీర్తనాత్॥ తే॥ బ్రహ్మ హత్యా యుతము మద్యపానదశశ । తమును గుర్వంగనాకోటిగమనదురిత । మపరిమిత హేమ చౌర్యంబు లనవరతము । రామనామాభి హతములో రాజవదన॥ క॥ ఈరేడుజగములందును । నారీమణివిమలరామనామముచేతం।జీరcబడనిఘనదుర్భర। ఘోరమహాఘంబులేదుకోరివెదకినన్॥అనిసీతారామాంజనేయసంవాదము. ముప్పోకలాcడు=సురాపానముచేయుట, మంత్రానుష్ఠానముచేతశత్రువులcజంపుట, అబద్ధములాడుటఅనునట్టిమూడుమార్గములుగలవాcడు—సురాపానముచేయుట అనcగా, సుబ్రహ్మరాతిదదాతీతి సురాఅనువ్యుత్పత్తిచేతసురయనcగాబ్రహ్మవిద్య,శ్రు॥చిదేవదేహశ్చిదమేచలోకాః చిదేవభూతానిచిదింద్రియాణి । కర్తాచిదంతఃకరణంచిదేవచిదేవసర్వంపరమార్థరూపం।చిదేవాహంచిదేవత్వంసర్వమేతచ్చిదేవహి ॥ అను ప్రమాణముచేత. ఆబ్రహ్మ విద్యాభ్యాస జ్ఞానము వలనcగలిగిన ఆనందరసమును. శ్లో॥ పీత్వాపీత్వామహాపీత్వాయావత్పతతిభూతలే । ఉత్థాయచ పునఃపీత్వా పునర్జన్మ నవిద్యతే । కరేణఘటమాదాయ స్మరంచ గురుపాదుకాం । ఆగళాంతం పిబేన్మద్యం జీవన్ముక్తో నసంశయః ॥ అను క్రమముచేత పానము చేయువాcడని భావము, మంత్రాను ష్ఠానముచేత శత్రువులc జంపుట యనcగా, మంతారంత్రాయత ఇతిమంత్రః, అనువ్యుత్పత్తిచేత సంసారసముద్రమునుండితన్నుదాటించునది మంత్రముగనుక అహంబ్రహ్మాస్మియనెడి మంత్రానుష్ఠానముచేత స్వేతరము గాకయే ఆయినట్టులోcచుచున్న కామాది శత్రు వర్గమునణcచి యుపశాంతి గలిగియుండు వాcడని భావము. ఆబద్ధములాడుటయనcగా,శ్రు॥యద్యత్పశ్యతిచక్షుర్భ్యాం తత్తదాత్మేతిభావయేత్,సర్వంఖల్విదంబ్రహ్మ, ఏకోదేవో బహుధాని విష్టః, అను శ్రుతులనుపట్టి నానారూపములతోc గనcబడు జగత్తును ఇది జగత్తు గాదు బ్రహ్మమని స్థిరపఱచు వాcడని భావము. లేక, రజోగుణముచేత చతుర్ముఖ బ్రహ్మ రూపమును ధరించి ప్రపంచమును సృష్టించి, సత్వగుణముచేత విష్ణురూపమును ధరించి ప్రపంచమును రక్షించి, తమోగుణముచేత రుద్రరూపమునుధరించి ప్రపంచమును నాశముచేయువాcడు.

౨౧౭.—చ॥ అసితను దూఱనాడిన ము ❋ రాంతకుc డాశిశుపాలు వాక్యముల్
విని మదిc జీరికిం గొనcడు ❋ విశ్రుత భైరవరావ మాత్మc గై
కొనని మృగేంద్రురీతి ముని ❋ కోటియు రాజులుc బద్మనాభు నా
డిన యవి నీతిభాషలకు ❋ డెందములం గడు వంత నొందుచున్.

టీ॥ (అని) తనున్ = తన్ను. దూఱనాడినన్ = నిందించిపలుకcగా. మురాంతకుcడు = కృష్ణుcడు. ఆశిశుపాలు వాక్యములు= ఆశిశుపాలునియొక్కమాటలను. (విని)విశ్రుత...రావము—విశ్రుత= మిక్కిలి గట్టిగా వినcబడిన. భైరవ=కుక్కయొక్క. రావము = మొఱcగునట్టి ధ్వనిని. ఆత్మన్ = తనలో. కైకొనని = అలక్ష్యము చేయునట్టి. మృగేంద్రురీతిన్=సింహమువిధమున. మదిన్=తనమనసులో.చీరికింగొనcడు=లక్ష్యముచేయcడు—లక్ష్యముచేయలేదనుట. మునికోటియున్ = మునులసమూహమును. రాజులును=ఆయజ్ఞము చూడవచ్చిన రాజులును. పద్మనాభున్ = కృష్ణుని. ఆడినయవి నీతిభాషలకున్=చెప్పిన నీతిమాలిన మాటలకు. డెందములన్ = తమ మనసులలో.కడున్=మిక్కిలి.వంతనొందుచున్=సంతాపించుచును.

తా॥ అని ఈవిధముగా శిశుపాలుcడు దూషింపcగా శ్రీకృష్ణమూర్తి తన్నుcజూచి మొఱుగునట్టి కుక్కల మొఱుగులనువిని లక్ష్యముచేయక గంభీరముగా నుండునట్టిసింహమువలె ఆనిందావాక్యములనుచెవినిపెట్టక యూరకుండెను, అచ్చటనున్నమునీశ్వరులునురాజులునువానినీతిమాలినమాటలకుతమమనసులలోనొచ్చుకొనుచుననితా.

౨౧౮.—ఉ॥ వీనులు మూసికొంచు విన ❋ విస్మయమంచు ముకుంద మాధవ
శ్రీనిధి వీని నేగతికిc ❋ జేర్చెదొ యంచు దురాత్ముc దిట్టుచున్
నానరనాథులున్ మునులు ❋ నచ్చట నిల్వక పోవc బాండు సం
తానము లప్రమేయ బల ❋ దర్పమహోద్ధత రోషచిత్తులై.

టీ॥ వీనులు = చెవులు. (మూసికొంచును) వినన్ = వినుటకు. విస్మయమంచున్ = ఆశ్చర్యమనుచు. మాధవ=లక్ష్మీనాథుcడవును. శ్రీనిధి=మోక్షసంపదకు స్థానమైనవాcడవునైన. ముకుంద=ఓకృష్ణమూర్తీ. వీనిన్ = ఈశిశుపాలుని. ఏగతికిన్ = ఏమార్గమునకు. చేర్చెదొ=చేర్చెదవో. అంచున్=అనుచును, దురాత్మున్ = చెడ్డతలcపుగలవాcడైనయాశిశుపాలుని. తిట్టుచున్=తిట్టుచును. ఆనరనాథులును=ఆరాజులును. మునులును=ఋషులును. అచ్చటన్ = అక్కడ. నిల్వక=నిలువక. పోవన్=లేచిపోcగా. పాండుసంతానములు=పాండవులు. అప్రమేయ,...చిత్తులై—అప్రమేయ=మేరలేని. బల=బలముచేతను. దర్ప = అహంకారముచేతను. మహోద్ధత= మిక్కిలినిక్కిన — మిక్కిలియతిశయించిన. రోష = కోపముతోడి. చిత్తులై=మనసులు గలవారై.

తా॥ అందున్న రాజులు మునులు మొదలగువారు ఆకృష్ణుని దూషించుమాటలు వినలేక చెవులుమూసికొనుచును, ఓశ్రియఃపతీ! నీవు వీనికి ఏమిగతి కలుcగcజేసెదవో తెలియదు అనుచును, ఆశిశుపాలునితోcచినట్టు తిట్టుచును, అచ్చటఆదూషించుటనువినుచునుండలేక లేచియెడముగాcబోయిరి, అంతపాండవులుతమమేరలేని బలమును ఆటోపమునుఅతిశయింపcగామిక్కిలికోపించినవారై అనితా.

వ॥ కేకయ సృంజయ భూపతులుం దాము వివిధాయుధ పాణులై యదల్చినిల్చిన వాఁడునుం బిఱుతివకయదల్చి పలకయు వాలునుం గైకొని భుజాగర్వ దుర్వారుండై గోవిందునిం దదనువర్తనులైనవారలం గుపితుండై నిందింప ముకుందుం డాగ్రహంబున లేచి కట్టెదుర నెదిర్చియున్న శిశుపాలుని రూక్షేక్షణంబుల నిరీక్షించుచు నాక్షణంబ తన్మస్తకంబు ధారా కరాళంబైన చక్రంబున నవక్ర పరాక్రముండై రుధిరంబు దొరఁగం దునుమ నమ్మహా కలకలం బాకర్ణించి చైద్యబలంబులును దదీయపక్ష చరులైన భూపతులును భీతులై పఱచి రయ్యవసరంబున.

టీ॥ కేకయ సృంజయ భూపతులును = కేకయులును. సృంజయులునునైన రాజులును—తామును. వివిధాయుధ పాణులై=నానావిధములయిన యాయుధములను చేతులఁ బట్టుకొన్నవారై. అదల్చి = అదలించి. నిల్చినన్=నిలువఁబడఁగా. వాఁడును = ఆశిశుపాలుఁడును. పిఱుతివక=వెనుదీయక. అదల్చి=మరలవీరిని అదలించి. పలకయున్=కేడెమును. వాలును=కత్తియును. కైకొని=చేతఁబుచ్చుకొని. భుజాగర్వదుర్వారుండై = భుజబలముచేత అడ్డగింపరానివాఁడై. గోవిందునిన్=కృష్ణునిని. తదనువర్తనులైన వారలను=అతనిని అనుసరించి వర్తించువారైన పాండవులు మొదలగు వారిని. కుపితుండై = కోపించినవాఁడై. నిందింపన్ = దూషింపఁగా. ముకుందుండు = కృష్ణుఁడు. ఆగ్రహంబునన్ = కోపముతో. (లేచి) తన కట్టెదురన్ = తనకుసరియెదుట. ఎదిర్చి = ఎదిరించి. ఉన్నశిశుపాలునిన్ = ఉన్నట్టిశిశుపాలుని. రూక్షేక్షణంబులన్ = చుఱుకుఁ జూపులతో. నిరీక్షించుచున్ = చూచుచు. ఆక్షణంబ = అప్పుడే. తన్మస్తకంబున్ = వానితలను. ధారాకరాళంబైన చక్రంబునన్ = వాదరలచేత భయంకరమయినదయిన చక్రముతో. అవక్రపరాక్రముండై=వంకరలేని పరాక్రమము గలవాఁడై. రుధిరంబు=నెత్తురు. దొరఁగన్ = కాఱునట్లు. దునుమన్ = నఱకఁగా. అమ్మహాకలకలంబు=ఆగొప్ప కోలాహలమును. ఆకర్ణించి=విని. చైద్యబలంబులును=శిశుపాలుని సేనలును. తదీయపక్షచరులైన = వానిపక్షమున వర్తించువారైన. భూపతులును=రాజులును. భీతులై = భయపడినవారై. పఱచిరి. పాఱిపోయిరి. అయ్యవసరంబునన్=ఆసమయమందు.

తా॥ కేకయ వంశస్థులును సృంజయ వంశస్థులునైన రాజులును తామునై పాండవులు నానావిధములయిన ఆయుధములను చేతఁబుచ్చుకొని శిశుపాలుని అదలించి నిలువఁబడఁగా వాఁడు అందులకు వెఱవక కత్తి కేడెమును చేతఁబుచ్చుకొని వారిని మరల నదలించి మదముచేత కన్నుగాననివాఁడై కృష్ణునిని ఆతని పక్షమును అవలంబించిన రాజులను నానావిధముల తిట్టుచు యుద్ధమునకు ఆయిత్తపడి నిలువఁగా శ్రీకృష్ణమూర్తి వానినిజూచి మిక్కిలి కోపించినవాఁడై పెక్కు వాదరలచేత భయంకరమై యుండెడి చక్రాయుధమును ప్రయోగించి అప్పుడే వానితలతెగి నేలఁబడునట్టును నెత్తురు వెల్లువలై ప్రవహించునట్టును చేయఁగా అందువలని కలకలధ్వనిని విని ఆశిశుపాలుని సేనలును వానిపక్షమున నున్న రాజులును భయపడి తమయూళ్లకు పారిపోయిరి ఆసమయమునందని తాత్పర్యము.

౮౨౦.—క॥ మునివరులును జనపతులును । గనుఁగొని వెఱఁగందఁ జైద్యు ✻ గాత్రము నందున్
ననుపమ తేజము వెలువడి । వనజోదరు దేహమందు ✻ వడిఁ జొచ్చె నృపా.

టీ॥ నృపా=రాజా. మునివరులును=మునిశ్రేష్ఠులును. జనపతులును=రాజులును. కనుఁగొని=చూచి. వెఱఁగందన్=ఆశ్చర్యము నొందఁగా. చైద్యగాత్రమునందున్=శిశుపాలుని దేహమునందుండి. అనుపమతేజము = సూర్య చంద్రాగ్నులను మీఱిన మహా తేజస్సు. వెలువడి = బయలువెడలి. వనజోదరుదేహమందున్ = శ్రీకృష్ణుని దేహమునందు. వడిన్ = శీఘ్రముగా. చొచ్చెన్ = ప్రవేశించెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! మునిశ్రేష్ఠులును రాజులును జూచి యాశ్చర్యపడుచుండఁగా శిశుపాలుని దేహమునందుండి దేనితోడను పోల్పరాని యొకమహాతేజస్సు బయలువెడలి శ్రీకృష్ణమూర్తి దేహమునందుఁబ్రవేశించె నని తాత్పర్యము.

౮౨౧.—వ॥ అనిన మునివరునకు భూవరుం డిట్లనియె.

టీ॥ అనినన్=అనిచెప్పఁగా. మునివరునకున్ = మునిశ్రేష్ఠుఁడైన శుకునితో. భూవరుండు=రాజైన పరీక్షిత్తు. (ఇట్లనియెను)

తా॥ అని యిట్లుచెప్పఁగా శుకమహామునితో పరీక్షిన్మహారాజు ఇట్లు పలికె నని తాత్పర్యము.

౮౨౨.—క॥ కమలాక్షుని నిందించిన । దమఘోష తనూభవుండు ✻ దారుణ మల కూ
పమునం బొందక యేక్రియ । సుమహితమతిఁ గృష్ణునందుఁ ✻ జొచ్చె మునీంద్రా.

టీ॥ మునీంద్రా=ఓమునిశ్రేష్ఠుఁడా. కమలాక్షునిన్=కృష్ణుని. నిందించిన = దూషించిన. దమఘోషతనూభవుండు = దమఘోషునికొడుకు. దారుణమలకూపమునన్=భయంకరమయిన మలముగల నూతియందు. పొందక = కూలక. ఏక్రియన్ = ఏవిధముగా. సుమహితమతిన్=మిక్కిలిగొప్పబుద్ధితో. కృష్ణునందున్=పరబ్రహ్మమైన శ్రీకృష్ణమూర్తియొక్క దేహమునందు. చొచ్చెన్=ప్రవేశించెను.

తా॥ ఓశుకమహామునీ! శ్రీకృష్ణమూర్తిని నిందించిన పాపాత్ముఁడైన శిశుపాలుఁడు మలముచేత నిండుకొన్న నరక కూపమునందుఁ గూలక మంచితెలివితో ఆకృష్ణుని దేహమునందు ఎట్లుచొచ్చెనని అడిగెనని తాత్పర్యము.

౮౨౩.—వ॥ అనిన శుకయోగి రాజయోగి కిట్లనియె.

టీ॥ అనినన్=అనియడుగఁగా. శుకయోగి = శుకమహాముని. రాజయోగికిన్=రాజర్షియైన పరీక్షిత్తుతో. (ఇట్లనియెను)

తా॥ అనియిట్లు పరీక్షిన్మహారాజు అడుగఁగా శుకమహాముని ఆయనతో నిట్లుచెప్పెనని తాత్పర్యము.

౮౨౮.—మ॥ మధు దైత్యాంతకుమీఁది మత్సరమునన్ * మత్తిల్లి జన్మత్రయా
వధి నేప్రొద్దుఁ దదీయ రూపగుణ ది * వ్యధ్యాన పారీణ ధీ
నిధియౌటన్ శిశుపాల భూవిభుఁడు దా * నిర్ధూత సర్వాఘుఁడై
విధి రుద్రాదుల కందరాని పదవిన్ * వేనొందె నుర్వీశ్వరా.

టీ॥ ఉర్వీశ్వరా = రాజా. మధుదైత్యాంతకు మీఁది మత్సరమునన్=కృష్ణునిపైఁగల విరోధముచేత. మత్తిల్లి=మత్తుగొని. జన్మత్రయావధిన్ = మూడుజన్మములకాలఁదిని. ఏప్రొద్దున్=ఎల్లప్పుడును. తదీయ...ధీనిధి—తదీయ=ఆకృష్ణునిదైన. రూప = ఆకారమును. గుణ=శౌర్యధైర్యాది గుణములను. దివ్య=అప్రాకృతమైన. ధ్యాన=స్మరణచేయుటయందు. పారీణ = పారమునొందిన. ధీ=బుద్ధికి. నిధి=స్థానమయినవాఁడు. ఔటన్=అగుటచేత. శిశుపాల భూవిభుఁడు=శిశుపాలమహారాజు. తాన్ = తాను. నిర్ధూతసర్వాఘుఁడై = బొత్తిగాతొలఁగింపఁబడినయెల్లపాపములు గలవాఁడై. విధిరుద్రాదులకున్=బ్రహ్మ రుద్రుఁడు మొదలగువారికి. అందరాని పదవిన్=పొందరాని స్థానమును. వేన్ = శీఘ్రముగ. ఒందెన్=పొందెను.

తా॥ ఓరాజా! శ్రీకృష్ణమూర్తిపై విరోధము చేత ఒళ్లుతెలియనివాఁడై మూడు జన్మముల కాలఁదిని సర్వదా ఆదేవుని స్వరూపగుణగణములను స్మరించుచున్న మహా బుద్ధిమంతుఁడు కాఁబట్టి ఆశిశుపాలుఁడు సమస్తపాపములునుబొత్తిగాతన్నువదలి పోఁగా బ్రహ్మరుద్రుఁడు మొదలగువారికిఁగూడ పొందరాని మహోన్నత పదవిని పొందినాఁడని చెప్పెనని తాత్పర్యము.

౮౨౯.—వ॥ అంత ధర్మ నందనుండు ఋత్విగ్గణంబులను సదస్యులను బహువిధ దక్షిణలఁ
దనిపి వివిధార్చనలం బూజించి యవబృథ స్నాన క్రియా పరితోషంబున.

టీ॥ అంతన్=అటుపిమ్మట. ధర్మనందనుండు = ధర్మరాజు. ఋత్విగ్గణంబులను=ఋత్విజులసమూహములను. సదస్యులను=సభికులను. బహువిధదక్షిణలన్=అనేక దక్షిణలచేత. తనిపి = తృప్తినొందించి. వివిధార్చనలన్ = నానా విధములయిన పూజలచేత. పూజించి=పూజచేసి. అవభృథస్నాన క్రియాపరితోషంబునన్ = అవభృథమను యాగపరిపూర్తి స్నానపు పనివలని సంతోషముతో.

తా॥ అంతటధర్మరాజు యజ్ఞమునడపువారి సంఘములను సభికులను అనేకములయిన దక్షిణలిచ్చి తృప్తినొందించి నానావిధముల చేత పూజించి యాగ పరిపూర్తియందుచేయు దివ్యమంత్రోదక స్నానమును చేసి అందువలనియానందముతోనని తాత్పర్యము.

౮౩౦.—సీ॥ మురజ మృదంగ గో * ముఖ శంఖ డిండిమ - పణవాది రవములం * బరము నిండఁ
గవి సూత మాగధ * గాయక వంది వై - తాళిక వినుతులం * దంద బెరయ
వితత మర్దళ వేణు * వీణా రవంబుల - గతులకు నర్తకీ * గతులు సెలఁగఁ
దరళ విచిత్రక * ధ్వజ పతాకాంకిత - స్యందన గజ వాజి * చయము లెక్కి
తే॥ సుత సహోదర హిత పురో * హిత జనంబు । గటకకేయూరహార కం * కణ కిరీట
వస్త్రమాల్యానులేపన * వ్రాతములను । విభవ మొప్పారఁ గైచేసి * వెడలి రంత.

టీ॥ మురజ...రవములు — మురజ=డోలు. మృదంగ=మద్దెల. గోముఖ=ఆవుమోరవంటియాకృతిగలచర్మవాద్యవిశేషము. శంఖ=శంఖము. డిండిమ=గుమ్మెటము. పణవ=ఉడుక. ఆది=మొదలైన వాద్యముల. రవములు=ధ్వనులు. అంబరము=ఆకాశము. నిండన్=నిండుకొనఁగా. కవి...వినుతులు—కవి=కవులు. సూత=బట్రాజులు. మాగధ=వంశావళిచదువువారు. గాయక=పాటపాడువారు. వంది=స్తుతిపాఠకులు. వైతాళిక=మేలుకొలుపులుపాడువారు. (వీరియొక్క) వినుతులు = స్తోత్రములు. అందంద = మాటిమాటికి. బెరయన్=వ్యాపింపఁగా. విత...లకున్ — వితత = విశేషమైన. మర్దళ=మద్దెలలయు. వేణు=పిల్లనగ్రోవులయు. వీణా=వీణెలయు. రవంబుల గతులకున్=ధ్వనులవిధములకు. నర్తకీ=నాట్యమాడుస్త్రీలయొక్క. గతులు=నడకలు. చెలఁగన్=తగినట్లు ఒప్పఁగా. తరళ...చయములు—తరళ=చలించునట్టి. విచిత్రక=చిత్రవర్ణములుగల. ధ్వజ=ధ్వజస్తంభములు. పతాక=టెక్కెపుగుడ్డలు. (వీనిచేత)అంకితగుఱుతిడఁబడిన. స్యందన=రథములయు. గజ=ఏనుఁగులయు. వాజి=గుఱ్ఱములయు. చయములు = సమూహములను. (ఎక్కి) సుత...జనంబులు—సుత=కొడుకులు. సహోదర=తోడఁబుట్టువులు. హిత=ఆప్తులు పురోహిత=పురోహితులునైన. జనంబు=జనసమూహము. కటక....వ్రాతములను—కటక=అందెలు. కేయూర=బాహుపురులు. హార=ముత్యాలపేరులు. కంకణ = కడియములు. కిరీట=ముకుటములు. వస్త్ర=కోకలు. మాల్య=పూలదండలు. అనులేపన=పూసికొనెడు వాసనద్రవ్యములు. వ్రాతములను=వీనియొక్క సమూహములచేత. విభవము=ఐశ్వర్యచిహ్నము. ఒప్పారన్ = ఒప్పిదమైమించఁగా. కైచేసి=అలంకరించుకొని. వెడలిరి=బయలుదేఱిరి. అంతన్=అంతట.

తా॥ డోలు మద్దెల మొదలగువాద్యములు మ్రోఁగఁగా, కవులు గాయకులు మొదలగువారిపొగడ్తలధ్వనులు అతిశయింపఁగా, మద్దెలలోనగు వాద్యములననుసరించి వేశ్యల యాటలు జరగఁగా, నానావిధములయిన బిరుదులను తెలుపునట్టి టెక్కెపుగుడ్డలు చలించుచుండఁగా ఒప్పునట్టి ధ్వజస్తంభములతోడి రథములందును, ఏనుఁగులు గుఱ్ఱములు మొదలగువాహనముల మీఁదను ఎక్కి, అన్ని అలంకారములతోడను బిడ్డలు పెండ్లాలు అన్నలు తమ్ములు కావలసినవారును బయలుదేఱిరి అనితాత్పర్యము.

వ॥ యదుసృంజయ కాంభోజ కేకయ కుకుర కోసల భూపాలముఖ్యులు చతుర్విధ సేనా సమేతులై ధరణి కంపింప వెన్నంటినడతేర ఋత్విజ్నికాయంబులను సదస్యులను బ్రహ్మఘోషంబు లొలయ మున్నిడుకొని శోభమానానూన ప్రభాభాసమాన సువర్ణమయ మాలికా మధ్యగత దివ్యమణిహారంబులు కంఠంబులం దేజరిల్ల నున్నతజవాశ్వంబులం బూన్చిన పుష్పరథంబు కళత్రసమేతుండై యెక్కి యతి మనోహర విభవాభి రాముండయి చనుదెంచు చుండె నప్పుడు వారాంగనా జనంబులు తమతమ వారలం గూడుకొని.

టీ॥ (యదుసృంజయ కాంభోజ కేకయ కుకురకోసల భూపాల ముఖ్యులు) చతుర్విధసేనాసమేతులయి=నాలుగువిధములయిన సేనలతోఁగూడుకొన్నవారయి. ధరణి = భూమి. కంపింపన్ = అదురఁగా. వెన్నంటి=వెంబడించి. నడతేరన్=నడువఁగా. ఋత్విజ్నికాయంబులను=ఋత్విజులయొక్క సమూహములను. సదస్యులను=సభికులను. బ్రహ్మఘోషంబులు = వేదపాఠధ్వనులు. ఒలయన్=వ్యాపింపఁగా. మున్నిడుకొని=ముందుఁబెట్టుకొని. శోభమాన ... హారంబులు–శోభమాన=వెలుఁగుచున్న. అనూన = తక్కువకాని ప్రభా=కాంతులచేత. భాసమాన=తేజరిల్లుచున్న. సువర్ణమయ = బంగారువికారమయిన. మాలికా=సరములయొక్క. మధ్యగత= నడుమను బొందిన. దివ్య=అప్రాకృతములయిన. మణిహారంబులు= రత్నాలపేరులు. కంఠంబులన్=మెడలయందు. తేజరిల్లన్=వెలుఁగఁగా. ఉన్నతజవాశ్వంబులన్ = పొడువులును వేగముగలవియునైన గుఱ్ఱములను. పూన్చిన=కట్టిన. పుష్పరథంబు=పూలతేరును. కళత్రసమేతుండై = భార్యతోఁగూడుకొనినవాఁడై. (ఎక్కి) అతి మనోహర విభవాభిరాముండయి = మిక్కిలి మనోజ్ఞమయిన వైభవముచేత నొప్పినవాఁడయి. చనుదెంచుచుండెన్=వచ్చుచుండెను. (అప్పుడు) వారాంగనాజనంబులు = బోగమువారు. తమతమవారలంగూడుకొని = తమకుఁ దమకుఁగావలసినవాంతోఁ జేరుకొని.

తా॥ యదువంశస్థులును సృంజయవంశస్థులును కాంభోజ వంశస్థులును కేకయవంశస్థులును కుకురవంశస్థులును కోసల వంశస్థులునైన రాజశ్రేష్ఠులు రథ గజ తురగ పదాతులనెడు నాలుగు విధములైన సేనలతోఁ గూడుకొన్న వారై వెంట రాఁగా ఋత్విజుల సమూహమును సభికులును వేదఘోషములతో ముందు నడవఁగా మిక్కిలి మెఱయుచున్న మణులుచెక్కిన బంగారు కంఠహారములను మెడలలో ధరించి ఉన్నతములును వడిగలవియునైన గుఱ్ఱములను గట్టిన పూలతేరిపై నెక్కి భార్యతోఁ గూర్చుండి వచ్చునప్పుడు బోగమువారు తమతమమేళగాండ్రతోఁగూడుకొన్నవారై యనితా.

౮౩౮.—సీ॥ కనకాద్రిసాను సం * గత కేకినులభాతిఁ - గ్రొమ్ముళ్లు వీఁపుల * గునిసి యాడఁ
దరల తాటంక ము * క్తాఫలాంశు ద్యుతు - ల్చెక్కుటద్దములతోఁ * జెలిమిసేయఁ
బొలసి యదృశ్యమై * పోని క్రొమ్మెఱుఁగుల - గతులఁ గటాక్ష దీ * ధితులు దనర
మంచుపై నెగయ నుం * కించు జక్కవలనఁ - జన్నులు జిలుఁగు కం * చలలనమర

తే॥ మహితకుచ భారకంపిత * మధ్యలగుచు । నర్థి మొలనూళ్లు మెఱయఁ బ * య్యదలుజాఱఁ
గరసరోజాత కంకణ * క్వణన ములును । జరణ నూపుర ఘోషము * ల్సందడింప.

టీ॥ కనకాద్రిసానుసంగత కేకినులభాతిన్ — కనకాద్రి = బంగారుకొండయొక్క. సాను=చఱులయందు. సంగత = కూడియున్న కేకినులభాతిన్=ఆఁడునెమళ్లవలె. క్రొమ్ముళ్లు=క్రొత్తకీలుగంట్లు. వీఁపులన్=వీఁపులమీఁద. గునిసియాడన్=త్రుళ్లియాడుచుండఁగాను. తరలతాటంక ముక్తాఫలాంశు ద్యుతులు–తరల=చలించుచున్న. తాటంక = కమ్మలయందలి. ముక్తాఫల=ముత్తెపు పూసలయొక్క. అంశుద్యుతులు=ప్రకాశకాంతులు. చెక్కుటద్దములతోన్= అద్దములవంటి చెక్కిళ్లతో. చెలిమిసేయన్ = స్నేహింపఁగా. పొలసి=వ్యాపించి — కనఁబడి. అదృశ్యమైపోని క్రొమ్మెఱుఁగుల గతులన్ = కనఁబడకపోకుండునట్టి క్రొత్తమెఱపుల విధములచేత. కటాక్షదీధితులు=చూపులకాంతులు. తనరన్=ఒప్పఁగా. మంచుపై నెగయనుంకించు జక్కవలనన్ = మంచుమీఁదికి ఎగయయత్నించునట్టి చక్రవాకములనునట్లు. చన్నులు= స్తనములు. జిలుఁగుకంచలన్=సన్నపుఱవికలయందు. అమరన్=ఒప్పఁగా. మహితకుచ భారకంపితమధ్యలు=గొప్పవైన స్తనముల బరువుచేత వడఁకుచున్న నడుములు గలవారు. (అగుచును) అర్థిన్ = ఇష్టములో. (మొలనూళ్లు) మెఱయన్ = ప్రకాశింపఁగా. పయ్యదలు = పైఁటలు. జాఱన్=జాఱఁగాను. కరసరోజాతకంకణక్వణనములును=హస్తకమలములయందలి కడియములగల్లుగల్లనుచప్పళ్లును. చరణనూపుర ఘోషములును=కాలియందెలచప్పళ్లను. సందడింపన్=హెచ్చఁగా.

తా॥ బంగారుకొండచఱులయందాడుచున్న నెమళ్లవలె మూఁపులపై కీలుగంట్లుత్రుళ్లియాడుచుండఁగాను, తళతళలాడునట్టికమ్మలయందలిముత్తెపు పూసలకాంతులు చెక్కిళ్లయందువ్యాపింపఁగాను, కన్నులకుఁ గనఁబడి మఱిఁగిపోని క్రొత్త మెఱపులవలె చూపుల మెఱుఁగులు అతిశయింపఁగాను, తమపైకమ్ముకొన్న మంచుమీఁదికి ఎగయ యత్నించునట్టి చక్రవాక పక్షులవలె సన్నపు ఱవికలలో నిక్కుచు స్తనములు ఒప్పఁగాను, ఇచ్చవచ్చినట్లు మొలనూళ్లు ప్రకాశించుచుండఁగాను, పైఁటలుజాఱి వ్రేలాడఁగాను, కమలములవంటి హస్తములయందుకడియములు మ్రోఁగఁగాను, కాళ్లయందుఅందెలు మ్రోయఁగాను, వచ్చుచున్నవారై యని తాత్పర్యము.

వ॥ మఱియు నయ్యిందు వదన లందంద మంద గమనంబునం జెందు ఘర్మజల బిందు సందోహ కంఠళిత మందహాస చంద్రికా సుందర వదనార విందంబుల నిందిందిర రుచిర చికుర బృందంబులు చిందఱ వందఱలై సందడిఁ గొన

నమందానంద హృదయలై సువర్ణ శృంగ సంగతంబులైన సంకుమద మలయజ ముఖ సురభి తోయంబులు పలు
త్రోయంబుల సముదాయంబులై తమతోయంబుల వారింజల్లుచుఁ జెందొవల కెందమ్మివిరుల రచియించినచిమ్మనఁ
గ్రోవులం దావులుగల పూఁదేనియలు నించి వావులు దెలిపి తేవలుమీఱఁ గ్రేవలనుండి యిమ్ములంగవిసి చిమ్ముచు
మృగమద కర్దమంబును గుంకుమ పంకంబును గొంకక బింకంబుల జంకెలొలయం బంకజ సన్నిభంబులగు మొగం
బుల నేమఱించి చమురుచు నుల్లంబులు పల్లవింపం బెల్లడరి యందియలు గల్లుగల్లని మొఱయఁ గ్రేళ్లు దాఁటుచుం
బాఱుచుం జారుచంద్రికా ధవళ ఘనసార ధూళీమిళిత రజనీ పరాగంబు రంజిల్లం గరంబులం బుచ్చుకొని శిరం
బులఁజల్లుచుఁ జిత్తంబుల నమ్మత్తకాశినులు వృత్తంబులగు కుచంబుల కెత్తువత్తురే యని బిత్తరించి పువ్వు గుత్తులం
దత్తఱంబున వ్రేయుచుఁబరిహసించుచునన్యోన్యకరకిసలయకనకకరండంబులభరితంబులగుపన్నీళ్లంజెంగావిజిలుఁగు
పుట్టంబులుదట్టంబుగఁదోఁగినమర్మంబులుబయలుపడిననగ్గలంబులగుసిగ్గులకునొప్పిదంబులగుతమకనురెప్పలడ్డంబు
సేయుచుఁ బురుషులుం దాము నారామలభిరామ లీలారసోక్తులైనయ నంతరంగంబుల సంతసంబునంబంతంబు
లిచ్చుచు వసంతంబులాడిరవ్వేళనతుల విమానారూఢులై యింద్రపురంధ్రీ జనంబులుంబోలె హాటకశిబికలెక్కి నిజ
చేటికాజనంబులుసేవింపంజనుదెంచు భూకాంతకాంతాజనంబులు తమకుసరసంబులకునర్హంబులైనధరణీపాల
వధూ లక్షామంబు లాదరించు చెలులప్పైఁ దమసఖీ జనంబులం బురికొల్పి చల్లించుచు భావగర్భితంబులగు వారి
చతుర సరసోక్తుల మందహాస చంద్రికలు ముఖకమల లీలావిలోకన లక్ష్మిం బ్రోదిసేయం జెలువలరంజని దివ్వి
ధంబుననిజసాంమ్రాజ్య విభవంబు పూజ్యంబుగా నజాతశత్రుండు గంగాప్రవాహంబున కరిగి యందు నిజవధూ
యుక్తుండై శాస్త్రోక్త ప్రకారంబున వేదఘోషంబు లెసఁగ నవభృథ స్నానం బాచరించె నాసమయంబున.

టీ॥ మఱియును=ఇంకను. అయ్యిందువదనలు = చంద్రునివంటి మొగములుగల యాభోగమువారు. అందంద = మాటిమాటికి. మందగమనంబునన్=తిన్నని నడచేత. చెందు=పొందునట్టి. ఘర్మ జల=చెమటనీటియొక్క. బిందు = చుక్కలయొక్క. సందోహ= సమూహములతోడ. కందళిత = మొలకెత్తుచున్న. మందహాస = చిఱునవ్వులనెడు. చంద్రికా=వెన్నెలలచేత. సుందర=అందగించుచున్న. వదనారవిందంబులన్=ముఖకమలములందు. ఇందిందిర = తుమ్మెదలవలె. రుచిర=ప్రకాశించునట్టి. చికుర=ముంగురులయొక్క. బృందంబులు = సమూదాయములు. చిందఱవందఱలై = చెదరినవై. సందడిగొనన్ = చిక్కుపడఁగాను. అమందానందహృదయలై = తక్కువగాని సంతోషముతోడి మనసులు గలవారై. సువర్ణ శృంగ సంగతంబులు = బంగారు బుఱ్ఱటకొమ్ములతోఁగూడినవి. (అయిన) సంకుమద=జవ్వాజి. మలయజ=మంచిగందము. ముఖ=మొదలగు వానిచేత. సురభి=పరిమళించుచున్న. తోయంబులు=నీళ్లను. పలు తోయంబుల=పలుతెగల. సముదాయంబులై=గుంపులై. తమతోయం బులవారింజల్లుచు = తమతెగవారిమీఁదఁజల్లుచు. చెందొవలన్=ఎఱ్ఱ గలువల చేతను. కెందమ్మివిరులన్=ఎఱ్ఱదామరలచేతను. రచియిం చిన=చేసిన. చిమ్మనఁగ్రోవులన్=బుఱ్ఱట కొమ్ములవలన. తావులు గల=వాసనలుగల. పూఁదేనియలు=పువ్వుల రసములను. నించి= నిండించి. వావులు = మామబావయను సంబంధములను. తెలిపి= తెలియఁజేసి. తేవలు=ఒయ్యారములు. మీఱన్=అతిశయింపఁగా. క్రేవలనుండి=పార్శ్వములందుండి. ఇమ్ములన్=బాగుగా. కవిసి= కమ్ముకొని. చిమ్ముచున్=చిమ్మనఁగ్రోవులలోనినీళ్లను ఎగఁజిమ్ముచు. మృగమదకర్దమంబును=కస్తూరిబురదయు—బురదవలెగుజ్జుగా కలిపిన కస్తూరితోడిచందనమును. కొంకక=సంకోచింపక. బింకంబులన్= బిగువుమాటలతో. జంకెలు = బెదరింపులు. ఒలయన్ = వ్యాపిం పఁగా—అతిశయింపఁగాననుట. పంకజసన్నిభంబులు = కమలము లను బోలినవి. అగుమొగంబులన్=అగునట్టి ముఖములయందు. (ఏమ ఱించి) చమురుచున్ = పూయుచు. ఉల్లంబులు = మనసులు. పల్ల వింపన్=చిగుర్పఁగా. వికాసము వహింపఁగా. పెల్లు = మిక్కిలి. అడరి=విజృంభించి. అందియలు=అందెలు. (గల్లుగల్లని) మొరయన్= మ్రోఁగఁగా. క్రేళ్లుదాఁటుచున్ = కుప్పించికుప్పించి దాఁటుచు. పాఱుచున్=పరుగెత్తుచు. చారు...పరాగంబు — చారు=మనోజ్ఞ మయిన. చంద్రికా=వెన్నెలయొక్క. ధవళ = తెల్లఁదనమువంటి తెల్లఁదనముగలదైన. ఘనసార=కర్పూరముయొక్క. ధూళీ=దుమ్ము తోడ. మిళిత=కలసిన. రజనీపరాగంబు=పసుపుపొడి. రంజిల్లన్= అనురాగమునొందునట్లు. కరంబులన్ = చేతులలో. పుచ్చుకొని= తీసికొని. శిరంబులన్=తలలలో. (చల్లుచు) చిత్తంబులన్=మనసు లందు=అమ్మత్తకాశినుల. ఆస్త్రీలయొక్క. వృత్తంబులగు=గుండ్రని వైన. కుచంబులకున్= స్తనములకు. ఎత్తువత్తురే=సరితూఁగుదురా. (అని) బిత్తరించి = ఒయ్యారముతోఁజూచి. పువ్వుగుత్తులన్= పువ్వులగుత్తులతో. తత్తఱంబునన్=తత్తఱపాటుతో. వ్రేయుచున్= కొట్టుచు. పరిహసించుచున్=ఎగతాళిచేయుచు. అన్యోన్య...భరితం బులు—అన్యోన్య=ఒండొరులయొక్క. కరకిసలయ=చిగుళ్లవంటిహస్త ములయందలి. కనకకరండంబులన్=బంగారుబరణులయందు. భరితం బులు=నిండింపఁబడినవి. (అగు) పన్నీళ్లన్=పన్నీరులచేత. చెంగావి జిలుఁగుపుట్టంబులు=చెంగావి సన్ననివస్త్రములు. దట్టంబుగన్= అధికముగా. తోఁగనన్=తడియఁగా. మర్మంబులు=మర్మస్థానములు —దాఁచఁదగిన అవయవములు. బయలుపడిన=బయటికిచక్కగా కనఁబడఁగా. అగ్గలంబులగు = అధికములగుచున్న. సిగ్గులకున్= లజ్జలకు. ఒప్పిదంబులగు=మనోజ్ఞములయిన. తమకనురెప్పలు=తమ కన్నులరెప్పలను. (అడ్డంబుసేయుచు) పురుషులును=మగవారును.

(తామును) ఆరామలు=ఆస్త్రీలు. అభిరామలీలారసోక్తులు=మనోజ్ఞములై పేడుకైన సరసపుమాటలు. ఎనయన్=పొందుపడఁగా. అంతరంగంబులన్=తమమనసులలో. సంతసంబునన్=సంతోషముతో. పంతంబులిచ్చుచున్=పంతములాడుచు. వసంతంబులాడిరి=వసంతములుపోసికొనుచునాడిరి. అప్పుడు=ఆసమయమునందు. అతుల విమానారూఢులై = ఈడులేనివిమానముల నెక్కినవారై. ఇంద్ర పురంధ్రీజనంబులుంబోలెన్=ఇంద్రునియంతఃపుర స్త్రీలవలె. హాటక శిబికలెక్కి=బంగారందలములెక్కి. నిజచేటికాజనంబులు=తమచెలికత్తెలు. సేవింపన్=కొలువఁగా. చనుదెంచు=వచ్చునట్టి. భూకాంత కాంతాజనంబులు=రాజులభార్యలు. తమకున్=తమతోడి. సరసంబులకున్=సరసములాడుటకు. అర్హంబులైన=తగిన. ధరణీపాల వధూలలామంబులు=రాజభార్యశిరోమణులు. ఆదరించుచెలులపైన్= ఆదరణచేయుచెలికత్తెలమీఁద. తమసఖీజనంబులన్=తమ చెలికత్తెలను. పురికొల్పి=ప్రేరేపించి. చల్లించుచున్=వసంతములుచల్లించుచు భావగర్భితంబులు=వేఱుభావమునుతోపించునట్టివి. (అగువారి) చతుర సరసోక్తులన్=చాతుర్యముగలసరసపుమాటలచేత. మందహాసచంద్రికలు=చిఱునవ్వువెన్నెలలు. ముఖకమల=కమలములవంటిముఖములందలి. లీలా=వినోదములయిన. విలోకన=చూపులయొక్క. లక్ష్మిన్=కలిమిని. ప్రోదిసేయన్ = వృద్ధిపొందింపఁగా. చెలువు=అందము. అలరన్=ప్రకాశింపఁగా. చనిరి=పోయిరి. ఇవ్విధంబునన్=ఈరీతిగా. నిజసామ్రాజ్యవిభవంబు = తనదొరతనపుకలిమిమేలిమి. పూజ్యంబుగాన్=ఆదరింపఁదగినదియగునట్టుగా. అజాతశత్రుండు= ధర్మరాజు. గంగాప్రవాహంబునకున్=గంగవెల్లువకు. అరిగి=పోయి అందున్ = ఆగంగాప్రవాహమునందు. నిజవధూయుక్తుండై = తన భార్యతోఁ గూడుకొన్నవాఁడై. శాస్త్రోక్త ప్రకారంబునన్ = శాస్త్రమునందు చెప్పఁబడినచొప్పున. వేదఘోషంబులు=వేదము చదువునట్టి ధ్వనులు. ఎసఁగన్ = అతిశయింపఁగా. అవభృథ (స్నానంబులు) ఆచరించెన్=చేసెను. ఆసమయంబునన్=అప్పుడు.

తా॥ ఇట్లు ఆభోగమువారు తమతమ పరిజనులతోఁ గూడుకొన్నవారై తిన్ననినడలతో నడచుచు మాటిమాటికి పుట్టుచున్న చెమటబొట్లనుగోళ్లతో ఎగమీటిచిఱునవ్వులు నవ్వుకొనుచు చిమ్మనఁగ్రోవులు చేతులలోఁ బట్టుకొని తమకు పరిహాస యోగ్యులయినవారిపై పరిమళ యుక్తమైన పన్నీటిని వసంతమును చల్లుకొనుచు పువ్వుల చెండ్లతో వేట్లాడుచు కస్తూరికుంకుమపువ్వు మొదలగు పరిమళవస్తువులు చేర్చిన చందనమును పరస్పరము ముఖములందుఁ బూసికొనుచు కాళ్లయందెలు గల్లుగల్లని మ్రోఁగఁగా కుప్పించి కుప్పించి దాఁటి తప్పించుకొని పోవు వారిని తఱుముకొనిపోయి వసంతములచేత ముంచఁగా ఒండొరులు కట్టుకొన్న సన్నపుచెంగావివస్త్రములు తడిసి దేహములలో మర్మములయిన అవయవములు బయలుపడుచుండఁగా సిగ్గులచేత తలలు వంచుకొని కన్నులు అరమూసి నవ్వుకొనుచు మనోజ్ఞములయిన సరసపు మాటలాడు తమకు ప్రియులైన పురుషులును తామును మెలఁగసాగిరి అట్టియెడల దేవేంద్రుని అంతఃపుర స్త్రీలను బోలిన రాజుల అంతఃపుర స్త్రీలు బంగారు అందలములపై ఎక్కి వచ్చుచు తమకు పరిహాసమునకు తగిన రాజకాంతల చెలికత్తెలపై తమ చెలికత్తెలను పురికొలిపి వసంతములు చల్లింపఁగా వారు చెప్పునట్టి మర్మభేదకములయిన సరసపు మాటలను విని సంతోషించుచు నడచిరి ఆసమయమునందు ధర్మరాజు తనభార్యతోడ గంగా ప్రవాహమునకుఁ బోయి బ్రాహ్మణుల వేదముచదువు ధ్వనులు చెవులకింపుగా నొప్పుచుండఁగా అందు శాస్త్రమునందు విధింపఁబడినచొప్పున అవభృథస్నానము అనఁగా దీక్షాంతస్నానమును చేసెనని తాత్పర్యము.

౨౩౦.—క॥ అనిమిష దుందుభి శుంభ । త్స్వనములు వీతెంచెఁ బుష్ప * వర్షము గురిసెన్
మునిదేవ పితృ మహీవర । వినుతుల రవ మెసఁగె నపుడు * విమల చరిత్రా.

టీ॥ విమలచరిత్రా=నిర్మలమయిననడవడిగలపరీక్షిన్మహారాజా. అనిమిషదుందుభి శుంభత్స్వనములు — అనిమిష = దేవతలదైన. దుందుభి=భేరులయొక్క శుంభత్=ఎచ్చైన. స్వనములు=ధ్వనులు. వీతెంచెన్=వినఁబడెను. పుష్పవర్షము = పువ్వులవాన. (కురిసెను)ముని...రవము — ముని = మునులయొక్కయు. దేవ = దేవతుల యొక్కయు. పితృ=పితృదేవతలయొక్కయు. మహీవర = రాజుల యొక్కయు. వినుతులరవము=స్తోత్రములుచేయుధ్వని. ఎసఁగెన్= అతిశయించెను. అప్పుడు=ఆసమయమునందు.

తా॥ నిర్మలమయిన నడవడిగల యోపరీక్షిన్మహారాజా! ఆసమయమునందు దేవతలు భేరులు మ్రోఁగించి పువ్వులవానను కురియించిరి మునులు దేవతలు పితృదేవతలును రాజులును గొప్పధ్వని కలుగునట్టుగా స్తోత్రము చేసిరి అని తాత్పర్యము.

౨౩౧.—క॥ నరులెట్టి పాపులైనను । గరమర్థిని నెద్దిచేసి * గత కల్మషులై
చరియింతురట్టి యవభృథ । మరుదుగఁ గావించి రెలమి * నఖిలజనంబుల్.

టీ॥ (నరులు) ఎట్టిపాపులైనను=ఎటువంటిపాపముచేసినవారైనను కరము=మిక్కిలి. అర్థిన్=ప్రీతితో. ఎద్ది=దేనిని (చేసి) గతకల్మషులై= పోయినపాపములుగలవారై. చరియింతురు=వర్తింతురో. అట్టియవభృథము=అట్టువంటియవభృథస్నానమును అఖిలజనంబులు=ఎల్లజనులును. అరుదుగన్=వింతగా. ఎలమిన్=ఇష్టముతో. కావించిరి=చేసిరి

తా॥ ఆసమయమునందు దేనిని చేసి జనులు ఎల్ల పాపములు పోయినవారు అగుదురో ఆయవభృథ స్నానమును అచ్చటిజనులందఱును వింతగా చేసి సంతోషించిరి అని తాత్పర్యము.

౨౩౨.—ఆ॥ అంత ధర్మతనయుఁ * డభినవమృదుల దు । కూలసురభి కుసుమ * మాలికాను
లేపనములు రత్న * దీపిత భూషణా । వళులు దాల్చి వైభ * వమున నొప్పె.

టీ॥ అంతన్=అంతట. ధర్మతనయుఁడు=ధర్మరాజు. అభినవ...లేపనములు — అభినవ = క్రొత్తలైన. మృదుల = నయమైన. దుకూల=పరిశుద్ధ వస్త్రములను. సురభి=పరిమళముగల. కుసుమ= పువ్వులయొక్క. మాలిక = దండలును. అనులేపనములు = పూసి

కొను గంధము మొదలగు నవియును. రత్నదీపితభూషణావలులు = రత్నములచేత వెలుఁగునట్టిఆభరణములపఙ్క్తులును. తాల్చి=ధరించి. వైభవమ్మునన్=విభవముతో. (ఒప్పెను)

తా॥ అంతటధర్మరాజునానాకుమై పరిశుద్ధములైనక్రొత్తవస్త్రములను పరిమళముగలపుష్పములనుగంధమును రత్నములు చెక్కిన నగలను ధరించితనయైశ్వర్యము మెఱయఁగా ఒప్పియుండెనని తాత్పర్యము.

౮౩౩.—వ॥ అట్లవభృథ స్నానా నంతరంబున మరలి చనుదెంచి.

తా॥ ఆవిధముగా అలంకరించుకొని యజ్ఞదీక్షాంతమున అవభృథస్నానముచేసి పిమ్మటతిరుగాపట్టణమునకు వచ్చెనని తాత్పర్యము.

౮౩౪.—ఉ॥ పాండు తనూభ వాగ్రజుఁడు * పాండు యశోనిధి భాస మాన మా
ర్తాండ నిభుండు యాజక స * దస్య మహీసుర యోగి బంధు రా
ణ్మండలిఁ బూజచేసి బుధ * మాన్య చరిత్రుఁడు వారికిచ్చె నొం
డొండ దుకూల రత్న కన * కోజ్జ్వల భూషణ ముఖ్య వస్తువుల్.

టీ॥ పాండుతనూభవాగ్రజుఁడు=పాండురాజు కొడుకులలో పెద్దవాఁడగు ధర్మరాజు. పాండు యశోనిధి = స్వచ్ఛ మయిన కీర్తికిస్థానమయిన వాఁడు. భాసమాన మార్తాండ నిభుండు = ప్రకాశించుచున్న సూర్యునితో సమానుఁడు. యాజక సదస్య మహీసుర యోగి బంధు రాణ్మండలిన్ — యాజక = యజ్ఞము చేయించువారలయు. సదస్య=సభికులయు. మహీసుర=బ్రాహ్మణులయు. యోగి=యోగీశ్వరులయు. బంధు=చుట్టములయిన. రాట్=రాజులయు. మండలిన్ = సమూహమును. (పూజచేసి) బుధమాన్య చరిత్రుఁడు=పెద్దలచేత గౌరవింపఁ బడఁదగిన నడవడిగలవాఁడు. వారికి = పైఁజెప్పఁబడినవారికి. ఒండొండ = ఒక్కటొకటిగా. దుకూల=నిర్మలవస్త్రములు. రత్న=మణులుచెక్కినదియగు. కనక=బంగారుపైన. ఉజ్జ్వల=మిక్కిలివెలుఁగునట్టి. భూషణ = ఆభరణములు. ముఖ్య=మొదలుగాఁగల. వస్తువులు=వస్తువులును. (ఇచ్చెను)

తా॥ అప్పుడుధర్మరాజు తనకీర్తి స్వచ్ఛముగవెలుఁగుచుండఁగా ఎల్లరాజులలోను ప్రతాపశాలియై సూర్యుని వలెనే ప్రకాశించుచు యజ్ఞముచేయించినవారు తక్కినబ్రాహ్మణులు యతీశ్వరులు చుట్టములగురాజులు మొదలగువారిని సన్మానించి మంచినిర్మలమయినవస్త్రములు రత్నములుచెక్కిన బంగారు సొమ్ములు మొదలుగాఁగలవాని నిచ్చి సంతోషపెట్టెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు నారాయణపరాయణులై దేవసమాన ప్రకాశప్రభావంబులసకల నరనారీలోకంబులనర్ఘ్య
రత్నమయభూషణమాల్యానులేపనంబులుధరియించిపరమానందభరితాత్ములైయొప్పియుండిరంత.

టీ॥ (ఇట్లు) నారాయణపరాయణులై = శ్రీకృష్ణమూర్తియందు ప్రియమయినబుద్ధులుగలవారై. దేవసమానప్రకాశ ప్రభావంబులన్=దేవతలతో సమానమైన తేజస్సుచేతను మహిమచేతను. సకలనర నారీలోకంబులు=ఎల్లస్త్రీపురుషసమూహములు. అనర్ఘ్య... బులు— అనర్ఘ్య=వెలలేని. రత్నమయ=రత్నవికారమైన. భూషణ=ఆభరణములను. మాల్య=పూలదండలను. అనులేపనంబులు=గంధములును. (ధరియించి)పరమానంద భరితాత్ములై=అధికమైన సంతోషముచేత నిండుకొన్నమనసులుగలవారై. (ఒప్పియుండిరి) అంతన్=అంతటను.

తా॥ ఈవిధముగా కృష్ణునియందు భక్తిగలవారై దేవతలను బోలిన తేజస్సులును మహిమలును గలిగి యచ్చటిస్త్రీలు పురుషులునైనజనులందఱును వెలలేని రత్నాభరణములను పూలదండలనుచందనద్రవ్యములును ధరించి మిక్కిలిసంతోషముతో ఒప్పియుండిరని తా.

౮౩౫.—చ॥ సునిశిత భక్తిఁ దన్మఖముఁ * జూడఁగ వచ్చిన యట్టి దేవతా
ముని ధరణీసుర ప్రవర * భూవర విడ్జన శూద్ర కోటి య
జ్జనపతి చంద్రుచే నుచిత * సత్కృతులం బరితోష చిత్తులై
వినయముతోడ ధర్మజుని * వీడ్కొని పోవుచుఁ బెక్కుభంగులన్.

టీ॥ సునిశితభక్తిన్ = మిక్కిలి నిర్మలమయిన భక్తితో. తన్మఖమున్=ఆరాజసూయయజ్ఞమును. (చూడఁగవచ్చినయట్టి) దేవతా... కోటి—దేవతా=దేవతలయు. ముని=ఋషులయు. ధరణీసురప్రవర=బ్రాహ్మణశ్రేష్ఠులయు. భూవర=రాజులయు. విడ్జన=కోమటులయు. శూద్ర=శూద్రులయు. కోటి=సమూహము. అజ్జనపతిచంద్రుచేన్=ఆధర్మజురాచేత. ఉచితసత్కృతులన్=తగినసన్మానములచేత. పరితోషచిత్తులై=సంతోషించినమనసులుగలవారై. వినయముతోడన్=అడఁకువతో. ధర్మజునిన్=ధర్మరాజును. వీడ్కొని=వదలుకొని. (పోవుచు) పెక్కుభంగులన్=బహువిధములచేత.

తా॥ కపటములేని భక్తితో ఆరాజసూయయాగమును చూడవచ్చినదేవతలు మునులు బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు మొదలగువారు ఆధర్మరాజుచేత సన్మానములను పొంది సంతోషించినవారై ఆతనివలనసెలవుపుచ్చుకొనిబయలుదేఱిపోవుచునుబహువిధములచేతధర్మరాజుయొక్కయజ్ఞవైభవమునుకొనియాడిరనితా.

౮౩౬.—చ॥ హరి చరణాంబు జాత యుగ * ళార్చకులై పెనుపొందు పాండు భూ
వరసుతు రాజసూయ మఖ * వైభవము న్నుతియించుచున్ సమా
దరమున నాత్మ భూముల కు * దారత నేగిరి ధర్మ సూనుఁడున్
సరసిజ నేత్రుని న్ననుపఁ * జాలక నుండు మటంచు వేఁడినన్.

టీ॥ హరి ... ర్చకులై — హరి = శ్రీకృష్ణునియొక్క. చరణ= పాదములనెడు. అంబుజాత=కమలములయొక్క. యుగళ=జతను. అర్చకులై=అర్చించువారై. పెనుపొందు ... వైభవమున్ — పెను పొందు=వర్ధిల్లునట్టి. పాండుభూవరసుతు = పాండురాజుకొడుకైన ధర్మరాజుయొక్క. రాజసూయమఖ=రాజసూయ యాగముయొక్క. వైభవమున్=సంపత్సమృద్ధిని. నుతియించుచున్=కొనియాడుచు. సమాదరమునన్ = మిక్కిలి యాదరణతో. ఆత్మభూములకున్ = తమదేశములకు. ఉదారతన్ = కొఱంతలేని మనసులుగలవారై— గౌరవముతో. ఏగిరి=పోయిరి. ధర్మసూనుఁడును=ధర్మరాజును. సరసిజనేత్రునిన్ = శ్రీకృష్ణమూర్తిని. అనుపఁజాలక = పంపలేక. (ఉండుము) అటంచున్=అని. వేఁడినన్=ప్రార్థింపఁగా.

తా॥ శ్రీకృష్ణుని పాదసేవ చేసి వృద్ధిపొందుచున్న ధర్మరాజు యొక్క రాజసూయయాగముయొక్క వైభవమును కొనియాడుచు మిక్కిలి ఆదరమును గౌరవమును గలవారగుచు తమ తమదేశ ములకుఁబోయిరి అప్పుడుధర్మరాజు శ్రీకృష్ణమూర్తిని పంపలేక స్వామీ మాయింటనేనీవు ఉండుమని ప్రార్థించెను అట్లుప్రార్థింపఁగానని తా.

వ॥ ఇట్లు పాండవాగ్రజు ప్రార్థనం గైకొని దామోదరుండు సర్వయాదవులను గుశస్థలికిం బోవంబనిచి కతిపయ పరిజనంబులుం దానును నతనికింబ్రియంబుగా దన్నగరంబునఁ బ్రమోదంబున నుండెనని చెప్పి మఱియు నిట్లనియె.

టీ॥ (ఇట్లు) పాండవాగ్రజు ప్రార్థనన్=ధర్మరాజు వేఁడుకోలును. గైకొని=అంగీకరించి. దామోదరుండు=శ్రీకృష్ణుఁడు. సర్వయాద వులను=యాదవులనందఱను. (కుశస్థలికి) పోవంబనిచి=పొమ్మని యంపి. కతిపయపరిజనంబులును=కొందఱు పరిజనులును. (తానును) అతనికిన్=ధర్మరాజునకు. ప్రియంబుగాన్=ఇష్టముగా. తన్నగరం బునన్=అతనిదైన యింద్రప్రస్థపట్టణమునందు. ప్రమోదంబునన్= సంతోషముతో. (ఉండెననిచెప్పి) మఱియున్=ఇంకను. (ఇట్లనియెను)

తా॥ ఈవిధముగా ధర్మరాజు ప్రార్థించిన ప్రార్థనను అంగీక రించి శ్రీకృష్ణుఁడు తనవెంట వచ్చియున్న యాదవులను అందఱను కుశస్థలపట్టణమునకు అంపి కొందఱు పరిజనులతో తానుమాత్రము నిలిచి ధర్మరాజు ఇష్టముచొప్పున ఇంద్రప్రస్థపట్టణమునందే మఱి కొన్నాళ్లు ఉండెను అనిచెప్పి శుకమహర్షి పరీక్షిత్తుతో మఱియును చెప్పనారంభించెనని తాత్పర్యము.

౮౩౯.—చ॥ జనవర పాండుభూప తను * జాతుఁడు దుస్తర తన్మనోరథా
బ్ధిని సరసీరుహాక్షుఁ డను * తెప్ప కతంబున దాఁటి భూరి శో
భనయుతుఁడై మనోరుజలఁ * బాసి ముదాత్మకుఁడై వెలింగె న
వ్వనరుహనాభ దాసజన * వర్యులకుం గలవే యసాధ్యముల్.

టీ॥ జనవర = ఓరాజా. పాండుభూపతనుజాతుఁడు = ధర్మ రాజు. దుస్తర...బ్ధిని—దుస్తర=దాఁటరాని. తన్మనోరథాబ్ధిన్ = ఆకోరికయనెడుసముద్రమును. సరసీరుహాక్షుఁడు=కృష్ణుఁడు. అను తెప్పకతంబునన్ = అనునట్టి తెప్పయొక్క కారణముచేత. (దాఁటి) భూరిశోభనయుతుఁడై = అధికశుభములతోఁ గూడుకొన్నవాఁడై. మనోరుజలన్=మనోవ్యాధులను. పాసి=విడిచి. ముదాత్మకుఁడై=సం తోషముతోఁగూడుకొన్నవాఁడై. వెలింగెన్=ప్రకాశించెను. అవ్వ నరుహనాభదాసజనవర్యులకున్=ఆకృష్ణుని సేవక జనులలో శ్రేష్ఠులై నవారికి. (అసాధ్యములు) కలవే=ఉన్నవా.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! ధర్మరాజు సముద్రమువలె దాఁట రానిదైన తనకోరికను శ్రీకృష్ణుఁడు అను తెప్పయొక్క సహాయము చేత దాఁటి అనఁగా నెఱవేర్చుకొని మేరలేని శుభములతోఁగూడు కొన్నవాఁడై మనోవ్యాధులెల్లనుమానఁగా సుఖముగానుండెను కాఁబట్టి శ్రీకృష్ణుని నమ్మిన సేవకులకు అసాధ్యము లేనియు నుండవు అని తా.

౮౪౦.—ఆ॥ రాజసూయ కాధ్వ * రప్రభావమునకు । నఖిల జనులు మోద * మంది రపుడు
కలుషమానసుండు * కులపాంసనుఁడు సుయో । ధనుఁ డొకండు దక్క * ధరణినాథ.

టీ॥ ధరణినాథ = ఓరాజా. రాజసూయ కాధ్వర ప్రభావ మునకున్=రాజసూయయాగముయొక్క వైభవమునకు. (అపుడు) కలుషమానసుండు=పాపచిత్తము గలవాఁడు. కులపాంసనుఁడు= వంశమునకునాశకుఁడు. సుయోధనుఁడు=దుర్యోధనుఁడు. (ఒకఁడు తక్కన్=తప్ప. (అఖిల జనులును) మోదమందిరి=సంతోషించిరి.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! రాజసూయయాగముయొక్క వైభవ మునుజూచి యెల్ల ప్రజలును సంతోషించిరి వంశమును చెఱుపఁ బుట్టిన వాఁడైన పాపబుద్ధిగల దుర్యోధనుఁడుమాత్రము సంతోషిం చినవాఁడు కాకపోయెనని తాత్పర్యము.

వ॥ అనిన శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

౮౪౧.—ఆ॥ అఖిలజనులకెల్ల * నానందజనకమై । యెనయుమఖముకురుకు * లేశ్వరునకుఁ
గరమసహ్యమైన * కారణమెట్లది । యెఱుఁగఁ బలుకు దీని * నిద్ధచరిత.

టీ॥ ఇద్ధచరిత = శ్లాఘ్యమయిన నడవడిగల యోశుకమహర్షీ. అఖిలజనులకెల్లన్=ఎల్లజనులకును. ఆనందజనకమై=సంతోషమును బుట్టించునదియై. ఎనయు=సరిపడియుండునట్టి. మఖము=యజ్ఞము. కురుకులేశ్వరునకున్ = కురువంశస్థులకు రాజైన దుర్యోధనునకు. కరము=మిక్కిలి. అసహ్యమైనకారణము = సహింపరానిదైన నిమి త్తము. ఎట్లది=ఎట్లు. దీనిన్=ఈవిషయమును. (ఎఱుఁగఁబలుకుము)

తా॥ ఓశుకమహర్షీ! లోకములోనిజనులకెల్లరకుఁ సంతోషమును కలుగఁ జేయునదియైన రాజసూయ యాగము దుర్యోధనునకు మాత్రము అసూయను కలుగఁజేయుటకు కారణ మేమో నాకు తెలియఁజెప్పుము అనియడిగెనని తాత్పర్యము.

౮౪౨.—చ॥ అనిన మునీంద్రుఁ డిట్లను ధ * రాధిపుతోఁ గురురాజు పాండునం
దనులదెసన్ ననేక దురి * తంబులు నిచ్చలు సేయుచుండు నై
నను నొకనాడు పంకరుహ * నాభ దయా పరిలబ్ధ సర్వ శో
భనజిత దేవ దైత్య నర * పాలక రాజ్య రమా మహత్త్వమై.

టీ॥ అనినన్=అనఁగా. మునీంద్రుఁడు = మునిశ్రేష్ఠుఁడయిన శుకుఁడు. ధరాధిపుతోన్=పరీక్షిన్మహారాజుతో. ఇట్లనున్=ఇట్లు పలికెను. కురురాజు=దుర్యోధనుఁడు. పాండునందనులదెసన్ = పాండవులయెడల. నిచ్చలు=ఎల్లప్పుడు. అనేకదురితంబులు=అనేకములైన పాపకృత్యములను. చేయుచుండున్=చేయుచునుండును. ఐనను = అట్లు అతఁడు చేయుచు నుండినను. ఒకనాడు = ఒక దినమునందు. పంకరుహ...మహత్త్వమై—పంకరుహనాభ = కృష్ణుని యొక్క. దయా=కృతచేత. పరిలబ్ధ=లెస్సగాపొందఁబడిన. సర్వశోభన=అన్నిశుభములును. జిత=జయింపఁబడిన. దేవ=దేవతలయు. దైత్య=రాక్షసులయు. నరపాలక=రాజులయు. రాజ్యరమా=దొరతనపు కలిమిచేత. మహత్త్వమై=మహిమగలదై—గొప్పదై.

తా॥ అని పరీక్షిత్తు అడుగఁగా శుకమహర్షి ఇట్లు చెప్పెను ఓరాజా ! దుర్యోధనుఁడు పాండవులయెడల సర్వదా చెఱుపులు చేయుచు నేయుండునుఅట్లుచేయుచుండినను ఒకనాడుశ్రీకృష్ణునికరుణావిశేషముచేత అనేకశుభకార్యములు జరగుచుండఁగా దేవదానవులనురాజులను మించినరాజ్యసంపదను అనుభవించుచుండెనని తా.

౮౪౩.—చ॥ వెలయ ననూన సంపదల * విశ్రుత కీర్తుల మిన్నుముట్టఁ బెం
పలరిన పాండుభూవర సు * తాగ్రజుఁ డంతి పురంబులోన ను
జ్జ్వలమణి భూషణాంశు రుచి * జాలముపర్వఁ బయోజనాభు ను
త్కలిక భజించుచున్ ఘన సు * ఖస్థితి భూరి మనోహరాకృతిన్.

టీ॥ వెలయన్=ప్రసిద్ధముగా. అనూనసంపదలన్ = కొఱఁతలేనికలుములచేతను. విశ్రుతకీర్తులన్=ప్రసిద్ధములయినకీర్తుల చేతను. మిన్నుముట్టన్=ఆకాశము నొరయునట్లు. పెంపు=వృద్ధి. అలరిన=అతిశయించిన. పాండుభూవరసుతాగ్రజుఁడు = ధర్మరాజు. అంతిపురంబులోనన్=అంతఃపురములో. ఉజ్జ్వల...జాలము—ఉజ్జ్వల=వెలుఁగునట్టి. మణి=రత్నమయములయిన. భూషణ=ఆభరణముల యొక్క. అంశు=కాంతులయొక్క. రుచి = ప్రకాశముయొక్క. జాలము=సమూహము. పర్వన్=వ్యాపింపఁగా. పయోజనాభున్=శ్రీకృష్ణుని. ఉత్కలికన్ = తహతహతో. భజించుచున్ = సేవించుచు. ఘనసుఖస్థితిన్ = అధికమయిన సుఖముతోడి యునికితో. భూరిమనోహరాకృతిన్=మిక్కిలిమనోజ్ఞమైన ఆకారముతో.

తా॥ మిక్కిలియైన కలుములచేతను ప్రసిద్ధమయిన కీర్తిచేతను ఆకాశమువఱకు వ్యాపించివెలయుచు వర్ధిల్లుచున్నధర్మరాజు అంతఃపురమునందు వెలుఁగునట్టి మణులు చెక్కిన ఆభరణముల యొక్క కాంతుల వెలుఁగుల సముదాయము వ్యాపింపఁగా శ్రీకృష్ణమూర్తిని తహతహతో కొలుచుచు అధికమయిన సుఖము గలవాఁడై మిక్కిలి మనోజ్ఞమయిన ఆకారముతో నని తాత్పర్యము.

వ॥ ఉండం గనుంగొని యదియునుంగాక లలితాష్టమీ శశాంక బింబంబుల విడంబించుచు నింద్రనీల రుచినిచయంబు నపహసించు కుటిల కుంతలంబులు నటనంబుసలుపం దనరు నిటలఫలకంబులును, పుష్పచాప చాపప్రచారమ్ముల యేపుచూపు భ్రూయుగోపాంతమ్ములై సౌదామనీదామ రుచిస్తోమంబులై కర్ణాంతసీమంబులై యంజనంబుల తోడ రంజిల్లునేత్రకంజంబులును, నవమల్లికాముకుళవిభాసిత దంతమరీచికా నిచయోద్దీపిత మందహాసచంద్రికా ధవళితంబులును, ముకురోపమితంబులును, గర్ణకుండలమణి మరీచిజాలంబులుబెరసి బహుప్రకారంబులం బర్వం బొలుచు కపోలపాలికలును, విలసిత గ్రైవేయక ముక్తాఫల హారనిచయమ్ముల కిమ్ముచూపక మిసమిసని పసగల మెఱుంగులు గిఱిగొని మీటినం బగులవనం బొగడందగి మొగంబులకుం బుటంబు లెగయు నుత్తుంగ పీన కుచ భారంబు లాఁగలేక దూఁగాడుచుం గరతల పరిమేయంబులగు మధ్య భాగంబులును, ఘనజఘన మండలావతీర్ణ కాంచన కాంచీకలాప కింకిణీకలనినదోల్లసితంబులుంగల కటిప్రదేశంబులును, సల్లలిత హల్లక పల్లవ కాంతుల మొల్లంబులఁ గొల్లలుగొని యభిరామంబులైశోభిల్లు పదపాణితలంబులును, అలసగతులం బదంబులందనరు మణి నూపురంబులు గోపురంబులఁ బ్రతిస్వనంబులొలయ మొరయనలరుచరణారవిందంబులును, రత్నవలయ కంకణాఙ్గుళీయకాది వివిధభూషణ మణిద్యుతి నిచయంబు లుష్ణమరీచి కరనిచయంబులధిక్కరింప వెలుంగు కరకంజంబులును, మృగమద ఘనసార హరిచందనాగురు కుంకుమపంకంబుల భాసురంబులగు వాసనలు నాసారంధ్రంబులకు వెక్కసంబులై పొలయ సౌభాగ్యంబులుంగలిగి చైతన్యంబునొందినమాణిక్యంపుబొమ్మలవిధంబులగగనమండలంబు నిర్గమించివసుధాతలంబున సంచరించుచంద్రరేఖలచెలువున శృంగారరసంబునమూర్తీభవించి జగంబులమోహ

పరచుమోహినీదేవతలచందంబున విలసించుమాధవవధూసహస్రంబులసంగతిసౌదామనీలతయునుంబోలె నొప్పుచుండెడుద్రుపదరాజనందనవిభవంబును, రాజసూయమహాధ్వరోత్సవంబునుం జూచి చిత్తంబు త్తలపెట్టసుయోధనుండుసంతాపానలంబునం గ్రాఁగుచుండెనంతనొక్కనాఁడుధర్మనందనుండునిర్మలంబగుసభాభవనంబునకుం జని.

టీ॥ ఉండన్ = ఉండఁగా. కనుంగొని = చూచి. అదియునుంగాక = అట్లుండఁగాఁ జూచుటయేగాక. లలితా...బులన్ - లలిత = ఒప్పిదములైన. అష్టమీ = అష్టమినాటి. శశాంకబింబంబులన్ = చంద్రబింబములను. విడంబించుచున్ = సరిపోలుచు. ఇంద్రనీలరుచి నిచయంబున్ = ఇంద్రనీలమణులకాంతిసముదాయమును. అపహసించు = ఎగతాళి చేయునట్టి. కుటిలకుంతలంబులు = వంకరపాడి వెండ్రుకలు. నటనంబుసలుపన్ = కదలాడుచుండఁగా. తనరు = ఒప్పునట్టి. నిటలఫలకంబులును = పలకలవంటినొసళ్లును. పుష్పచాప ... పాంతమ్ములై - పుష్పచాప = మన్మథునియొక్క. చాప = ధనుస్సుయొక్క. ప్రచారమ్ముల = మెలఁగుటలయొక్క. ఏపు = అతిశయము. చూపు = కనఁబఱుచునట్టి. భ్రూయుగ = కనుబొమ్మలయొక్క. ఉపాంతమ్ములై = పార్శ్వభాగములుగలవై. సౌదామనీ ... బులై - సౌదామనీ = మెఱపులయొక్క. దామ = వరుసలయొక్క. రుచి = ప్రకాశముయొక్క. స్తోమంబులై = సముదాయములు గలవై. కర్ణాంతసీమంబులై = చెవులతుదలు మేరలుగాఁగలవై. అంజనంబులతోడన్ = కాటుకలతోడ. రంజిల్లు = ప్రకాశించునట్టి. నేత్రకంజంబులును = కన్నుదామరలును. నవమల్లికా...ధవళితంబులును - నవమల్లికా = జాజిపువ్వుల. ముకుళ = మొగ్గలవలె. విభాసిత = వెలిఁగెడి. దంతమరీచికా = పల్లుకాంతులయొక్క. నిచయ = సమూహముచేత. ఉద్దీపిత = ప్రకాశించునట్టి. మందహాస = చిఱునవ్వులనెడి. చంద్రికా = వెన్నెలలచేత. ధవళితంబులును = తెల్లగాఁజేయఁబడినవియు. ముకురోపమితంబులును = అద్దములను బోలినవియు. కర్ణకుండల...జాలంబులు - కర్ణ = చెవులయందలి. కుండల = పోఁగులయందలి. మణి = రత్నములయొక్క. మరీచి = వెలుఁగులయొక్క. జాలంబులు = సమూహములు. బెరసి = ఆవరించి = బహుప్రకారంబులన్ = నానావిధములచేత. పర్వన్ = వ్యాపింపఁగా. పొలుచు - ఒప్పునట్టి. కపోలపాలికలును = చెక్కిలి ప్రదేశములును. విలసిత...నిచయమ్ములకున్ - విలసిత = ప్రకాశించునట్టి. గ్రైవేయక = కంఠాభరణములయందలి. ముక్తాఫల = ముత్తెపు పూసలయొక్క. హార = సరములయొక్క. నిచయమ్ములకున్ = సమూహములకు. ఇమ్ముచూపక = చోటియ్యక. మిసమిసని = మిసమిసయనునట్టు. పసగల = మేలిమిగల. మెఱుంగులు = కాంతులు. గిఱికొని = ఆవరించుకొని. మీటినన్ = ఎగఁజిమ్మినను. (పగులవు) అనన్ = అనునట్లు. పొగడందగి = శ్లాఘింపఁదగి. మొగంబులకున్ = మొగములతట్టునకు. ప్రుటంబులెగయు = నిక్కునట్టి. ఉత్తుంగపీనకుచభారంబులు = ఎత్తుగానుండు బలసిన స్తనముల బరువులను. ఆఁగలేక = వహింపలేక. తూఁగాడుచున్ = ఊఁగులాడుచు. కరతలపరిమేయంబులు = పిడికిళ్లకొలఁదులు. (అగు) మధ్యభాగంబులును = అగునట్టి నడుములును. ఘన...ల్లసితంబులును - ఘన = బరువులైన. జఘనమండల = గుండ్రనైనపొత్తికడుపులనుండి. అవతీర్ణ = దిగఁబాఱిన. కాంచన = బంగారుదైన. కాంచీకలాప = మొలనూలనెడి యాభరణము యొక్క. కింకిణి = చిఱుగంటలయొక్క. కలనినద = అవ్యక్తమధురధ్వనులచేత. ఉల్లసితంబులును = మెఱయుటలును. కలకటిప్రదేశంబులును = కలిగిన పిఱుఁదులును. సల్లలిత...మొల్లంబులన్ - సల్లలిత = చక్కగావికసించిన. హల్లక = ఎఱ్ఱగలువలయు. పల్లవ = చిగుళ్లయు. కాంతులమొల్లంబులన్ = వెలుఁగుల సముదాయములను. కొల్లలుగొని = కొల్లపెట్టి. అభిరామంబులై = మనోజ్ఞములయి. శోభిల్లు = వెలుఁగొందునట్టి. పదపాణితలంబులును = అడుగులును అఱచేతులును. అలసగతులన్ = మెల్లనినడలచేత. పదంబులన్ = పాదములయందు. తనరు = ఒప్పునట్టి. మణినూపురంబులు = రత్నాలయందెలు. గోపురంబులన్ = గోపురములయందు. ప్రతిస్వనంబులు = మాఱుమ్రోఁతలు. ఒలయన్ = వ్యాపింప. మొరయన్ = ధ్వనింపఁగా. అలరు = ఒప్పునట్టి. చరణారవిందంబులును = పాదకమలములును. రత్నవలయ... నిచయంబులు - రత్నవలయ = రత్నాలకడియములు. కంకణ = గాజులు. అంగుళీయక = ఉంగరములు. ఆది = మొదలుగాఁగల. వివిధభూషణ = నానావిధములైనయాభరణములయందలి. మణి = రత్నములయొక్క. ద్యుతినిచయంబులు = కాంతిసమూహములు. ఉష్ణమరీచికరనిచయంచయంబులన్ = సూర్యకిరణములసముదాయములను. ధిక్కరింపన్ = తిరస్కరించునట్లు. వెలుంగు = ప్రకాశించునట్టి. కరకంజంబులును = హస్తకమలములును. మృగమద...పంకంబులన్ - మృగమద = కస్తూరి. ఘనసార = కర్పూరము. హరిచందన = పచ్చగందము. అగురు = నల్లగందము. కుంకుమ = కుంకుమపువ్వు. పంకంబులన్ = వీనినిచేర్చి మేళవించిన కలపములచేత. భాసురంబులు = ప్రకాశించునవి. (అగువాసనలు) నాసారంధ్రంబులకున్ = ముక్కురంధ్రములకు. వెక్కసంబులై = సహింపనశక్యములై పొలయన్ = వ్యాపింపఁగాను. సౌభాగ్యంబులును = కోరఁదగియుండుటలును. (కలిగి) చైతన్యంబునొందిన = ప్రాణమునుపొందిన. మాణిక్యంపు బొమ్మలవిధంబులన్ = రత్నాలబొమ్మలరీతులతో. గగనమండలంబున్ = మండలాకారమయిన ఆకాశము వలననుండి. నిర్గమించి = బయలువెడలి. వసుధాతలంబునన్ = భూప్రదేశమునందు. సంచరించు = తిరుగునట్టి. చంద్రరేఖలచెలువునన్ = చంద్రకళలయందమున. శృంగారరసంబునన్ = శృంగారమనెడిరసమువలన. మూర్తీభవించి = ఆకృతిని పొందినదై. జగంబులన్ = లోకములను. మోహపరచు = మోహింపఁజేయునట్టి. మోహినీదేవతలచందంబునన్ = మోహినీదేవతలవిధమునను. విలసించు = ప్రకాశించునట్టి. మాధవ వధూ సహస్రంబుల సంగతిన్ = కృష్ణుని పెక్కండ్రు భార్యలయొక్క కూడికచేత. సౌదామనీలతయునుంబోలెన్ = మెఱపుతీఁగవలెనే ఒప్పుచుండెడు ద్రుపదరాజనందనవిభవంబును = ద్రౌపది వైభవమును. రాజసూయమహాధ్వరోత్సవంబును = రాజసూయమనెడిగొప్పయాగముయొక్క వేడుకను. (చూచి) చిత్తంబు = మనస్సు. ఉత్తలపెట్టన్ = సంకటపెట్టఁగా. సుయోధనుండు = దుర్యోధనుఁడు. సంతాపానలంబునన్ = పరితాపాగ్నిచేత. క్రాఁగుచుండెన్ = తపించుచుండెను. అంతన్ = అప్పుడు. (ఒక్కనాఁడు) ధర్మనందనుండు = ధర్మరాజు. నిర్మలంబు = పరిశుద్ధము. (అగు) సభాభవనంబునకున్ = సభయను నింటికి. (చని)

తా॥ అట్లుండఁగాఁ జూచుటయేగాక అష్టమినాటిచంద్రబింబము సాటిగలిగి తుమ్మెదలనుబోలి యింద్రనీలమణులకాంతులను లోఁగొనుచున్న ముంగురులు కమ్ముకొనఁగా వెలుఁగొందునట్టి నొసళ్లును, మన్మథునివింట్లో అనఁదగినకనుబొమ్మలును, చెవులవఱకువ్యాపించిన విశాలములైనకన్నులును, జాజిమొగ్గలనుబోలిన పలువరుసయొక్క కాంతులును, చిఱునవ్వులచాయలు వెన్నెలలుకాయునట్లుతోఁచఁగా అద్దములనుబోలిన చెక్కిళ్లకాంతులు చెవిపోఁగులలోని రవలకాంతులతోఁగలసి తళతళలాడుచుండుటయును, మెడనూళ్లు ముత్యాలహారములు వ్రేలాడఁగా వానికి చోటియ్యక మొగముల తట్టుకు నిక్కుచున్న వట్రువలగుబిగిమీఱిన స్తనములును, అట్టి స్తనముల బరువును వహింపఁజాలక ఆసియాడుచు పిడికిళ్లకొలఁదులై యొప్పు నడుములును, గొప్పలైన లేక బరువులై పొత్తికడుపులపైకి దిగఁజాఱిన మొలనూళ్ల చిఱుగంటల అవ్యక్తమధురములైన మ్రోఁతలచేత ఒప్పునట్టి పిఱుఁదులును మనోజ్ఞములై యెఱ్ఱ గలువలను చిగుళ్లను బోలి వెలుఁగుచున్న అడుగులునుహస్తములును, మెల్లనినడలచేత మణులు చెక్కినయందెలుగలగల మ్రోఁగుచప్పుళ్లకుగోపురములసందులనుండి ప్రతిధ్వనులుగలుగుచుండఁగా ఒప్పునట్టి పాదములును కడియములు గాజులుమొదలగునాభరణములయందలిరత్నములకాంతులుసూర్యుని కిరణముల కాంతులు మీఱివెలుఁగునట్టి హస్తములును, కస్తూరిపచ్చకర్పూరము కుంకుమపువ్వు మొదలగు పరిమళద్రవ్యములు చేర్చి మెదిపిన కలపములపూఁతలవాసనలు ముక్కు రంధ్రములందు వ్యాపించి వెక్కసములుకాఁగా ఒప్పునట్టిచక్కఁదనములునుగలిగి ప్రాణములు పొందిన బంగారుబొమ్మలవలెను, ఆకాశమునుండి దిగివచ్చి భూమియందుసంచరించుచున్నచంద్రకళలవలెనుశృంగారరసమే ఆకృతిగా కలుగఁజేసికొని లోకములనుమోహింపఁజేయవచ్చిన మోహినీ దేవతలవలెను ఒప్పునట్టిశ్రీకృష్ణమూర్తియొక్క పెక్కండ్రుభార్యలనడుమ మెఱపుతీఁగవలెనేప్రకాశించుచున్నద్రౌపదినిజూచియు రాజసూయయాగముయొక్క గొప్ప వేడుకను జూచియు మనస్సు ఉడుకఁగా దుర్యోధనుఁడుసహింపలేకతపించుచుండెనుఅట్టియెడఒకనాడుధర్మరాజునిర్మలమయిసభయనఁబరఁగినయింటికిపోయినవాఁడై అనితా.

౨౮౫.—సీ॥ సుతసహోదర పురో * హితబాంధవామాత్య - పరిచార భటకోటి * బలసికొలువఁ
గలిత మాగధ మంజు * గానంబుఁ బాఠక - పఠన రవంబులుఁ * బ్రమద మెసఁగఁ
గంకణ ఝణఝణ * త్కారంబు శోభిల్ల - సరసిజాననలు చా * మరము లిడఁగ
మయవినిర్మిత సభా * మధ్యంబునను భాస - మాన సింహాసనా * సీనుఁడగుచు
ఆ॥ నమరగణములు గొలువఁబెం * పారు ననిమి । షేంద్రుకైవడి మెఱసి యు * పేంద్రుఁడలర
వరుసఁగొలువున్న యత్తఱి * దురభిమాన । క్రోధమాత్సర్యధనుఁడు సు * యోధనుండు.

టీ॥ సుత...కోటి—సుత=కొడుకులు. సహోదర=తోడఁబుట్టువులు. పురోహిత=పురోహితులు. బాంధవ=చుట్టములు. అమాత్య=మంత్రులు. పరిచార=పరిచర్యచేయువారు. భట=బంట్లు. కోటి=వీరియొక్కసమూహము. బలసి=చుట్టుకొని. కొలువన్=సేవింపఁగా కలితమాగధమంజుగానంబున్=ఒప్పిదమైన వంశావళి చదువువారి పాటలును. పాఠకపఠన రవంబులు = పాటలుపాడువారియొక్క పాటలధ్వనులును. ప్రమదము=సంతోషమును. ఎసఁగన్=అతిశయింపఁజేయఁగా. కంకణఝణఝణ త్కారంబు=ముంజేతికడియములయొక్క ఝణఝణయనుధ్వనులు. శోభిల్లన్=ఒప్పిదమగుచుండఁగా. సరసిజాననలు=పరిచారికలైనస్త్రీలు. చామరములు=వింజామరలు. ఇడఁగన్=వేయుచుండఁగా. మయవినిర్మితసభామధ్యంబునన్=మయునిచేఁజేయఁబడినసభనడుమ. భాసమానసింహాసనాసీనుఁడు=ప్రకాశించుచున్నసింహాసనముపైఁగూర్చున్నవాఁడు (అగుచు) అమరగణములు = దేవతా సమూహములు. కొలువన్ = సేవింపఁగా. పెంపారు=గౌరవముచేతఒప్పునట్టి. అనిమిషేంద్రుకైవడిన్=ఇంద్రునివిధమున. మెఱసి=ప్రకాశించి. ఉపేంద్రుఁడు=కృష్ణుఁడు. అలరన్=ఉల్లసిల్లఁగా. వరుసన్ = క్రమముగా. కొలువున్న యత్తఱిన్ = కొలువుచేయుచున్నసమయమునందు. దురభిమానక్రోధమాత్సర్యధనుఁడు=చెడ్డయహంకారమునుకోపమునువిరోధమునుధనముగాఁగలవాఁడైన. సుయోధనుండు=దుర్యోధనుఁడు. క్రియపైపద్యమున.

తా॥ కొడుకులు తోడఁబుట్టినవారు పురోహితులు చుట్టములు మంత్రులు పరిచారకులుమొదలగువారు చుట్టుకొనికొలువుచేయఁగా మనోజ్ఞములయి వందిమాగధులు పాటలు పాడుధ్వనులు సంతోషమును పుట్టింపఁగా చేతులగాజుల ఝణ ఝణయను ధ్వనులు అతిశయింపఁగా పరిచారికలు వింజామరలువేయఁగా మయునిచేఁజేయఁబడిన సభనడుమ సింహాసనమునందుఁ గూర్చున్నవాఁడై దేవతాసమూహము కొలువఁగా కొలువుచేయు దేవేంద్రునివలె ప్రకాశించుచు శ్రీకృష్ణమూర్తి కొలువున వెలుఁగొందుచుండఁగా క్రమముగా కొలువు దీరియున్న ధర్మరాజునుజూచి చెడ్డ గర్వమును మత్సరమును గలదుర్యోధనుఁడు వచ్చెనని తాత్పర్యము.

౨౮౬.—ఉ॥ కాంచన రత్న భూషణ ని * కాయముఁదాల్చి సముజ్జ్వలప్రభో
దంచితమూర్తి నొప్పి పణి * హారులుముందటఁ గ్రందువాయ వా
రింప సహోదరుల్ నృప వ * రేణ్యులుఁ బార్శ్వముల న్భజింపనే
తెంచెను రాజసంబున య * ధిష్ఠిరుపాలికి వైభవోన్నతిన్.

టీ॥ కాంచనరత్నభూషణనికాయమున్ = బంగారువియురత్నములవియునైన యాభరణముల సముదాయమును. తాల్చి=ధరించి. సముజ్జ్వలప్రభోదంచితమూర్తిన్=మిక్కిలి వెలుఁగుచున్న తేజస్సుచేత ఒప్పినయాకృతితో. (ఒప్పి) పణిహారులు = ద్వారపాలకులు. ముందట=ఎదుట. క్రందు = సందడి. వాయన్ = తొలఁగునట్లు. వారింపన్ = చూడవచ్చుజనులను రానీక నిలుపఁగా. సహోద

రులు = తోఁడఁబుట్టువులును. నృపవరేణ్యులు = రాజశ్రేష్ఠులును. పార్శ్వములన్ = రెండుప్రక్కలను. భజింపన్ = సేవింపఁగా. రాజసంబునన్ = రాచఠీవితో. వైభవోన్నతిన్ = విభవాతిశయముతో. యుధిష్ఠిరుపాలికిన్ = ధర్మరాజునొద్దకు. ఏతెంచెను = వచ్చెను.

తా॥ బంగారువియు రత్నములవియు నైన అనేకాభరణములు ధరించి మిక్కిలి తేజస్సుచేత వెలుఁగుచున్నయాకారముతో ఒప్పుచు ద్వారపాలకులు ఎదుటవచ్చు జనులసందడిని తొలఁగఁద్రోయుచుండఁగా తమ్ములును తక్కినరాజులు తనయిరు ప్రక్కలందును సేవించుచు రాఁగా రాచఠీవితోడి వైభవముతో ధర్మరాజునొద్దకుదుర్యోధనుఁడు వచ్చెనని తాత్పర్యము.

౮౪౭.—వ॥ అట్లు చనుదెంచి మయమాయా మోహకం బైన సభాస్థలంబు నందు.

టీ॥ (అట్లు) చనుదెంచి = వచ్చి. మయమాయామోహకంబైన = మయునిమాయచేత మోహింపఁజేయునదియైన. (సభాస్థలంబునందు)

తా॥ ఆవిధముగా వచ్చిన దుర్యోధనుఁడు మయుని మాయచేత మోహమును బుట్టించు నదియైన సభయందని తాత్పర్యము.

౮౪౮.—క॥ సలిలములు లేనితావున । వలువలు వెస నెగయఁ దిగిచి * వారక తోయం
బులు గలచోటను జేలం । బులు దడియఁగఁ బడియె నిజవి * భుత్వము దఱఁగన్.

టీ॥ సలిలములు = నీళ్లు. లేనితావునన్ = లేకుండుతావునందు. వలువలు = కట్టుకొన్నబట్టలను. వెసన్ = శీఘ్రముగ. ఎగయఁదిగిచి = ఎగఁదీసికొని. వారక = తప్పక. తోయంబులుగలచోటన్ = నీళ్లున్నతావున. చేలంబులు = కట్టుబట్టలు. తడియఁగన్ = తడియఁగా. నిజవిభుత్వము = తనరాజసము. తఱఁగన్ = తగ్గఁగా. పడియెన్ = పడెను.

తా॥ నీళ్లులేనిచోట నీళ్లున్నవనిభ్రమసికట్టుబట్టలు ఎగఁదీసికొని నీళ్లున్నతావున వట్టినేలయని చొచ్చి కట్టుకొన్నబట్టలు తడియునట్టుగాను తనరాజసమునకుభంగమువచ్చునట్టుగాను దిగఁబడెనని తా.

౮౪౯.—క॥ ఆవిధమంతయుఁ గనుఁగొని । పావని నవ్వఁటయు నచటి * పార్థివులును గాం
తావలియును యమతనయుఁడు । వావిరిఁ జే సన్నఁ దమ్ము * వారింపంగన్.

టీ॥ ఆవిధమంతయున్ = ఆరీతియంతయు. (కనుఁగొని) పావని = భీమసేనుఁడు. నవ్వుటయును = నవ్వఁగా. అచటి పార్థివులును = అచ్చటనున్నరాజులును. కాంతావలియును = స్త్రీలగుంపును. వావిరి = క్రమముగా. యమతనయుఁడు = ధర్మరాజు. చేసన్నన్ = చేతిసైఁగచేత తమ్ము వారింపంగన్ = తమ్మునునవ్వవలదని చెప్పుచుండఁగా. (నవ్విరి)

తా॥ అట్లు దుర్యోధనుఁడు నీళ్లలోఁ దిగఁబడుటను జూచి భీముఁడు నవ్వఁగా అచటనున్నరాజులును ఆఁడువారును ధర్మరాజు వలదు వలదని ఆఁపుచుచుండఁగాను గొల్లుననవ్విరని తాత్పర్యము.

వ॥ ఇట్లు దామోదరానుమోదితులై మహారావంబుగాఁ బరిహాసంబులు చేసిన సుయోధనుండు చిత్తంబు చిన్నవోయి లజ్జావనతవదనుండై కుపితమానసుండగుచు నయ్యెడ నిలువక వెలువడి నిజగజపురంబునకరిగె నయ్యవసరంబున ధీవిశాలురైనసభాసదులగు నచ్చటిజనంబుల కోలాహలంబు సంకులంబైన నజాతశత్రుండు చిత్తంబున విన్ననై యుండె నప్పుండరీకాక్షుండు భూభారనివారణకారణుండగుటం జేసి దుర్యోధనునపయశంబునకుం గాదనండయ్యె నయ్యెడ.

టీ॥ (ఇట్లు) దామోదరానుమోదితులై = కృష్ణునిచేత అంగీకరింపఁబడినవారలై. మహారావంబుగాన్ = గొప్పధ్వనికలుఁగునట్లు. పరిహాసంబులు చేసినన్ = ఎగతాళిచేయఁగా. సుయోధనుండు = దుర్యోధనుఁడు. చిత్తంబు = మనసు. చిన్నవోయి = వికాసముతప్పి. లజ్జావనత వదనుండై = సిగ్గుచేత వంపఁబడిన ముఖముగలవాఁడై. కుపిత మానసుండు = కోపము నొందిన మనసు గలవాఁడు. (అగుచు) ఆయ్యెడన్ = అచ్చట. నిలువక = ఉండక. వెలువడి = బయలుదేఱి. నిజగజపురంబునకున్ = తనదైన హస్తినాపట్టణమునకు. అరిగెన్ = పోయెను. అయ్యవసరంబునన్ = ఆసమయమునందు. ధీవిశాలురు = బుద్ధిచేత గొప్పవారు — విశేషబుద్ధిమంతులు. అయినసభాసదులు = అగునట్టిసభయందుండువారు. అగునచ్చటిజనంబులకోలాహలంబు = అయినట్టి యచ్చటి జనులయొక్క కలకలధ్వని. సంకులంబైనన్ = కలఁతనొందినదికాఁగా. అజాతశత్రుండు = ధర్మరాజు. చిత్తంబునన్ = మనసునందు. విన్ననైయుండెన్ = ఉత్సాహములేనివాఁడై ఉండెను. అప్పుండరీకాక్షుండు = ఆకృష్ణుఁడు. భూభారనివారణకారణుండగుటంజేసి = భూమిబరువునుపోఁగొట్టుటకు హేతువైనవాఁడగుటచేత దుర్యోధనునపయశంబునకున్ = దుర్యోధనునిఅవమానమునకు. కాదనండయ్యెన్ = ఇది మేలుకాదని చెప్పకపోయెను. అయ్యెడన్ = అప్పుడు

తా॥ ఈవిధముగా కృష్ణుని ప్రేరేపణచేత గొప్ప ధ్వని కలుగునట్టుగా నవ్వి యెగతాళి చేయఁగా దుర్యోధనుఁడు మనస్సు నందు నొచ్చుకొన్నవాఁడై సిగ్గుపడి తలవంచుకొని మనసునకోపముపుట్టఁగా అందుండి అప్పుడే బయలుదేఱి తన రాజధానియైన హస్తినాపట్టణమునకుఁ బోయెను అప్పుడు ఆసభ యందున్న బుద్ధిమంతులగు పెద్దమనుష్యులందఱు ఇట్లు అవమానపఱుపవచ్చునాయనిగలగలమాటలాడ సాగిరి ధర్మరాజు మనసు చిన్నపుచ్చుకొని యూరకుండెను కృష్ణుఁడు భూభారము నణఁచుటకై అవతరించిన వాఁడు గనుక ఇట్టి భేదము పుట్టుట మంచిదేయని దుర్యోధనుని అవమాన మునకు సమ్మతించినవాఁడైయుండెను అట్టిసమయమునందని తాత్పర్యము.

౮౫౧.—క॥ హరి ధర్మసుతుని వీడ్కొని । తరుణీ హితబంధు జనక * దంబము గొలువన్
బరితోషమునఁ గుశస్థల । పురమునకుం జనియె మోద * మున నరనాథా.

టీ॥ నరనాథా=ఓరాజా. హరి=కృష్ణుఁడు. ధర్మసుతునివీడ్కొని= ధర్మరాజుచేత సెలవుపుచ్చుకొని. తరుణీహితబంధుజన కదంబము= పెండ్లాలు కావలసినచుట్టములగుంపును. పరితోషమునన్=తృప్తితో. కొలువన్=సేవింపఁగా. మోదమునన్=సంతోషముతో. కుశస్థల పురమునకున్=కుశస్థలమనుతనపట్టణమునకు. చనియెన్=పోయెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! కృష్ణుఁడు ధర్మరాజుచేత సెలవుపుచ్చుకొని తన పెండ్లాలును కావలసినచుట్టములును వెంబడించిరాఁగా సంతోషములో తనయునికిపట్టయినకుశస్థలపట్టణమునకుపోయెను అనితా.

౮౫౨.—చ॥ జనవర బంధ మోక్షణము ✽ చైద్యవధంబును పాండురాజ నం
దను మఖ రక్షణంబును సు ✽ దారతఁ జేసినయట్టి దేవకీ
తనయు చరిత్ర భాషణ క ✽ థా పఠనాత్ములు గాంతు రిష్టశో
భన బహుపుత్ర కీర్తులును ✽ భవ్య వివేకము విష్ణులోకమున్.

టీ॥ జనవరబంధమోక్షణము=రాజులచెఱవిడుదలయు. చైద్యవధంబును=శిశుపాలునిఁజంపుటయు. పాండురాజనందనుమఖరక్షణంబును=ధర్మరాజుచేయురాజసూయయజ్ఞమును చెడకుండ నెఱవేర్చుటయు. ఉదారతన్=గంభీరస్వభావముతో. చేసినయట్టిదేవకీతనయుచరిత్ర=చేసినట్టి కృష్ణునిచరిత్రము. భాషణ కథాపఠనాత్ములు=చెప్పకొనునట్టి చదువునట్టియు మనసులుగలవారు. ఇష్టశోభనబహుపుత్రకీర్తులును=కోరిన శుభములను అనేకులుకొడుకులను కీర్తిని. భవ్యవివేకమును=విజ్ఞానమును. (విష్ణులోకమును) కాంతురు=పొందుదురు.

తా॥ ఎవరు శ్రీకృష్ణమూర్తి జరాసంధుని వలన చెఱఁబెట్టఁబడిన రాజులను విడిపించుటయు, శిశుపాలునిఁ జంపుటయు, ధర్మరాజు రాజసూయ యాగమును నెఱవేర్చుటయును అను కథలను చెప్పకొనుట యందును చదువుట యందును ఆసక్తులై యందురో ఆట్టివారికి కోరిన శుభములును అనేకులు కొడుకులును శాశ్వతమైన కీర్తియుమంచితెలివియుఃవిష్ణులోకప్రాప్తియును అగుననితాత్పర్యము.

౮౫౩.—క॥ అని శుకయోగీంద్రుం డ । మ్మనుజేంద్రునిఁ జూచిపలికె ✽ మఱియును శ్రీకృ
ష్ణుని యద్భుత కర్మంబులు । వినిపింతున్ జిత్తగింపు ✽ విమల చరిత్రా.

టీ॥ (అనిశుకయోగీంద్రుండు) అమ్మనుజేంద్రునిన్=ఆపరీక్షిన్మహారాజును. (చూచిమఱియును శ్రీకృష్ణుని) అద్భుతకర్మంబులు=ఆశ్చర్యకార్యములను. (వినిపింతును) విమలచరిత్రా=మంచి నడతగలవాఁడా. చిత్తగింపు=వినుము. (అని) పలికెన్=చెప్పెను.

తా॥ అని యీవిధముగా చెప్పి శుకమహర్షి ఆపరీక్షిన్మహారాజుతో ఓనిర్మలమయిన నడవడిగలరాజా! ఇంకను శ్రీకృష్ణమూర్తి యొక్క వింతలైన చరిత్రములను చెప్పెదను అక్కఱతో వినుమని చెప్పనారంభించెనని తాత్పర్యము.

౮౫౪.—సీ॥ వసుధేశ వినవయ్య ✽ వైదర్భి పరిణయ - వేళ దుర్మద శిశు ✽ పాల భూమి
వరునకుఁ దోడ్పడ ✽ నరుదెంచి సైనికా - వళితోడఁ దొడరి దో ✽ ర్బలముదూలి
హరిచేత నిర్జితు ✽ లైన రాజులలోనఁ - జైద్యుని చెలికాఁడు ✽ సాల్వ ధరణి
పతి జరాసంధాది ✽ పార్థివ ప్రకరంబు - విన మత్సరానల ✽ విపుల శిఖల
తే॥ ధాత్రినిటమీఁద వీతయా ✽ దవము గాఁగఁ । గడఁగిసేయుదుననిదురా ✽ గ్రహముతోడఁ
బంతములు వల్కి యటఁజని ✽ భరితనిష్ఠఁ । దపము గావింపఁ బూని సు ✽ స్థలమునందు.

టీ॥ వసుధేశ = రాజా. వినవయ్య = వినుము. వైదర్భిపరిణయవేళన్=రుక్మిణీ వివాహకాలమునందు. దుర్మదశిశుపాల భూమివరునకున్=చెడ్డక్రొవ్వు గలవాఁడైన శిశుపాలరాజునకు. తోడ్పడన్=సహాయపడుటకు. అరుదెంచి=వచ్చి. సైనికావళితోడన్ = సేనాసంఘముతోఁగూడ. తొడరి=ఎదిరించి. దోర్బలము=భుజబలము. తూలి=పోయి. హరిచేత=కృష్ణునిచేత. నిర్జితులైనరాజులలోనన్=ఓడఁగొట్టఁబడిన రాజులలో. చైద్యునిచెలికాఁడు = శిశుపాలుని స్నేహితుఁడు. సాల్వధరణిపతి=సాల్వుఁడనురాజు. జరాసంధాది పార్థివప్రకరంబు = జరాసంధుఁడు మొదలగు రాజుల కూటము. వినన్=వినునట్టుగా. మత్సరానలవిపులశిఖలన్=దీర్ఘక్రోధమనెడు గొప్పనిప్పుమంటలచేత. ధాత్రిన్=భూమిని. ఇటమీఁదన్ = ఇఁకమీఁదట. వీతయాదవముగాఁగన్=పోయినయాదవులుగలదియగునట్టుగా. కడఁగి=పూని. చేయుదును=చేయఁగలను. (అని) దురాగ్రహముతోడన్=చెడ్డకోపముతో. పంతములుపల్కి = ప్రతిజ్ఞలు చేసి. అటన్=అవల. చని=పోయి. భరితనిష్ఠన్ = పూర్ణ నియమముతో. తపము=తపస్సును. కావింపఁబూని = చేయ యత్నించి. సుస్థలమునందున్=ఒకమంచిచోటును.

తా॥ ఓరాజా! వినుముమునుపు రుక్మిణిపెండ్లికి వచ్చినప్పడు శిశుపాలునికితోడువచ్చి కృష్ణునిచేత ఓడఁగొట్టఁబడినరాజులలో ఒకఁడైనసాల్వుఁడు అనువాఁడుచెడ్డక్రొవ్వులో జరాసంధుఁడు మొదలుగాఁగల రాజులలోనేను నావిడువని కోపమనెడు నిప్పుమంటలచేత ఈభూమిలోయాదవులుఅనుపేరులేకుండకాల్చివేసెదనుచూడుఁడు అని అధికకోపముతో బయలుదేఱిపోయి తపస్సుచేయువాఁడైయొకయేకాంతస్థలమునందుఁ జేరియని తాత్పర్యము.

౮౫౫.—క॥ ధృతివదలక యుగ్రస్థితిఁ । బ్రతిదినమును బిడికెఁ డవని ✽ రజ మశనముగా
నతి నియమముతో నాపశు । పతి శంకరు ఫాల నయను ✽ భర్గు నుమేశున్.

టీ॥ ధృతి=ధైర్యమును. వదలక=విడువక. ఉగ్రస్థితిన్=భయంకరమైనయునికితో. (ప్రతిదినమును పిడికెఁడు) అవనిరజము=నేలలోనిదుమ్ము. అశనముగాన్=ఆహారముగా. అతినియమముతోన్=అత్యంతమైననిష్ఠతో. ఆపశుపతిన్=పశువు లనఁబడుజీవులనుయేలిన

వాఁడును. శంకరుఁడు=లోకములకు మేలుకలుగఁజేయు వాఁడును. ఫాలనయనుఁడు=నొసట కన్నుగలవాఁడును. భర్గుఁడు = మన్మథుఁడు మొదలగు వారిని నశింపఁ జేసిన వాఁడును. ఉమేశుఁడు = శివుని.

తా॥ తాలిమివదలక భయంకరమైనయునికితో ప్రతిదినము నుపిడికెఁడుదుమ్ము ఆహారము చేసికొని మిక్కిలినియమముతో ఎల్లప్రాణుల నేలువాఁడును, ఎల్లలోకములకు మేలుకలుగఁజేయువాఁడును, మన్మథుఁడు మొదలగువారిని నశింపఁజేసిన వాఁడును, నొసట కన్నుగల వాఁడును, పార్వతికి పెనిమిటియు నైనశివునిఁగూర్చి సాల్వుఁడు. అనితాత్పర్యము.

## (*)సాల్వుఁడు శివునిఁగూర్చి తపస్సు చేయుట.(*)



౮౫౬.—క॥ చెదరని నిజభక్తిని ద
త్పదపద్మములాత్మనిలిపి * పాయక నొకయేఁ
డుదితక్రియ భజియించిన
మదనారియు వానిభక్తి * మహిమకు వశుఁడై.

టీ॥ చెదరనినిజభక్తిన్=చలింపనితనభక్తిచేత. తత్పదపద్మములు=ఆశివునిపాదపద్మములను. ఆత్మన్=మనసునందు. (నిలిపి) పాయక=ఎడతెగక. (ఒకయేఁడు) ఉదితక్రియన్=పూనికతో. భజియించినన్=ఉపాసనచేయఁగా. మదనారియున్=శివుఁడును. (వాని) భక్తిమహిమకున్=భక్తిగౌరవమునకు. వశుఁడై=అధీనుఁడై.

తా॥ చలింపనిభక్తితో ఆశివునియొక్క పాద కమలములను మనసుననిలిపి ఒక సంవత్సర కాలముతప్పకపూనికతో ఉపాసన చేయఁగా శివుఁడునువానిసేవాగౌరవమునకులోఁబడిన వాఁడై యని తాత్పర్యము.

౮౫౭.—క॥ బోరునఁ బ్రత్యక్షుండై । గోరినవర మేమియైనఁ * గొసరక యిత్తున్
వారక వేఁడు మటన్నను । నారాజతపోధనుండు * హరునకుఁ బ్రీతిన్.

టీ॥ బోరునన్=శీఘ్రముగా. (ప్రత్యక్షుండై) కోరినవరము=నీవు కోరినకోరిక. ఏమియైనన్=ఏదియైనను. కొసరక=ఔనుగాదనక. ఇత్తున్=ఇచ్చెదను. వారక=సంకోచింపక. వేఁడుమటన్నన్=అడుగుమనఁగా. ఆరాజతపోధనుండు = తపస్సుచేయుచున్న వాఁడయిన యారాజు. హరునకున్=శివునిఁగూర్చి. ప్రీతిన్=అనన్యప్రీతితో.

తా॥ శీఘ్రముగ ప్రత్యక్షమై ఓరాజా! నీకేవరము కావలెనో జంకక అడుగుము అదియెటువంటిదైనను నేను ఔనుగాదనక యిచ్చెదను అనిసెలవియ్యఁగా ఆరాజునుశివునిఁగూర్చి ప్రీతితో ఇట్లనియెననితా.

౮౫౮.—తే॥ వందనంబాచరించి యా * నందవికచ । వదనుఁడై కేలుదోయి ఫా * లమునఁ జేర్చి
శ్రితదయాకార నన్నుర * క్షించెదేని । నెఱుఁగ వినిపింతు వినుము మ * దీప్సితంబు.

టీ॥ వందనంబు=నమస్కారమును. ఆచరించి = చేసి. ఆనందవికచవదనుఁడై=సంతోషముచేత తేటపాఱిన మొగముగలవాఁడై. కేలుదోయి=రెండుచేతులును. ఫాలమునన్ = నొసటను. (చేర్చి) శ్రితదయాకార=ఆశ్రయించినవారియందలిదయయే ఆకృతిగాఁగల వాఁడా. (నన్ను) రక్షించెదేనిన్=కాపాడెడుపక్షమున. మదీప్సితంబు=నాకోరికను. ఎఱుఁగవినిపింతున్=తెలియఁజెప్పెదను. (వినుము)

తా॥ నమస్కరించినవాఁడై సంతోషముచేతముఖము తేటగిలఁగా రెండుచేతులును నొసటఁ జేర్చుకొని ఆశ్రయించిన వారియందలి దయయే స్వరూపముగాఁగల యోస్వామీ! నన్ను రక్షించెడుపక్షమున నాకోరికను చెప్పెదనువినుమని తాత్పర్యము.

౮౫౯.—తే॥ గరుడగంధర్వ యక్షరా * క్షససురేంద్ర । వరులచే సాధ్యపడక నా * వలయు నెడల
నభ్రపథమున నరిగెడు * నట్టిమహిత । వాహనము నాకు దయచేయు * వరద యీశ.

టీ॥ వరద=కోరినకోరికలనిచ్చువాఁడవైన. ఈశ = ఓస్వామీ. గరుడ...వరులచేన్—గరుడ=గరుడులును. గంధర్వ=గంధర్వులును. యక్ష=యక్షులును. రాక్షస=రాక్షసులును. సుర=దేవతలును. ఇంద్ర=దేవేంద్రుఁడును. వరులచేన్=వీరు మొదలైనగొప్పవారి చేత నైనను. సాధ్యపడక=సాధింపఁబడక. నావలయునెడలన్ = నేనుకావలెనన్నచోట్లలో. అభ్రపథమునన్ = ఆకాశమార్గమున. అరిగెడునట్టి=పోవునట్టి. మహిత వాహనమున్ = ప్రభావముగల వాహనమును. నాకుదయచేయుము=నాకులభించునట్టుగాననుగ్రహింపుము.

తా॥ ఓస్వామీ! గరుడులు గంధర్వులు యక్షులు రాక్షసులు దేవతలు ఇంద్రుఁడు మొదలైన గొప్పవారిచేతనైతముసాధింప రాక నేనుపోవలెనన్నచోటికి ఆకాశ మార్గమున పోవునట్టి మహిమగల వాహనము నాకుఁగలుగననుగ్రహింపుమని అడిగెనని తాత్పర్యము.

౮౬౦.—వ॥ అనియభ్యర్థించినం బ్రసన్నుండై హరుండు వానికోర్కి కనురూపంబైన విమానంబు నిర్మింప
మయుని నప్పగించిన నతండు నట్లచేసి కామగమనంబును నతివిస్తృతంబుగా లోహం

బునిర్మించి సౌభకంబను నామంబిడి సాల్వున కిచ్చిన వాఁడును బరమానందంబునం
బొంది తద్విమానా రూఢుండై యాదవులవలని పూర్వవైరంబుఁదలంచి దర్పాంధ చేత
స్కుండై ద్వారకా నగరంబుపైఁ జని నిజ సేనా సమేతంబుగాఁ దత్పురంబు వేధించి.

టీ॥ (అని) అభ్యర్థించినన్=కోరఁగా. హరుండు = శివుఁడు. ప్రసన్నుండై=అనుగ్రహము గలవాఁడై. వానికోర్కికిన్=వానికోరికకు. అనురూపంబైన=తగిన. విమానంబున్ = ఆకాశమున నడచు వాహనమును. నిర్మింపన్ = చేయను. మయునిన్ = దానవ విశ్వకర్మను. అప్పగించినన్=అప్పగింపఁగా. అతండును = ఆమయుఁడును. అట్లచేసి = అట్లేచేసి. కామగమనంబును=ఇచ్చవచ్చినట్టు పోవుటగలదియు. అతివిస్తృతంబుగాన్=మిక్కిలివిరివిగా. లోహంబునన్=ఇనుముచేత. నిర్మించి=చేసి. సౌభకంబు=సౌభకము. అనునామంబిడి=అనుపేరుపెట్టి. సాల్వునకిచ్చినన్=సాల్వునకు ఇయ్యఁగా. వాఁడును = ఆసాల్వుఁడును. పరమానందంబునంబొంది = అధిక సంతోషమును పొంది. తద్విమానారూఢుండై=ఆవిమానమునెక్కిన వాఁడై. యాదవులవలని పూర్వవైరంబున్=యాదవులయెడలఁగల మునుపటి విరోధమును. తలంచి = తలఁచుకొని. దర్పాంధచేతస్కుండై=మదముచేత తెలివిమాలినమనసుగలవాఁడై. ద్వారకానగరంబుపైన్=ద్వారకాపట్టణముమీఁద. చని = దండెత్తిపోయి. నిజసేనాసమేతంబుగాన్=తనసేనతోడ. తత్పురంబున్=ఆపట్టణమును. వేధించి=ముట్టడించి.

తా॥ అని వేఁడఁగా శివుఁడు అనుగ్రహముగలవాఁడై వానికోరికకుతగినట్టు ఒకవిమానమును చేసియిమ్మని దానవవిశ్వకర్మయయిన మయునికి ఆజ్ఞాపింపఁగా వాఁడును అట్లే చేయువాఁడై ఇచ్చవచ్చినట్టు పోవునదియు మిక్కిలి విశాల మయినదియునుగా ఇనుముతో ఒక విమానమునుచేసి సాల్వునికిచ్చెను దానిని సాల్వుఁడుపుచ్చుకొని మిక్కిలి సంతోషించిన వాఁడై యాదవులయెడలఁ గల మునుపటి విరోధమును తలఁచుకొని మదాధిక్యముచేత ముందువెనుక విచారింపనివాఁడై ద్వారకాపట్టణముమీఁద దండెత్తిపోయి ఆపట్టణమును సేనలును తానునుముట్టడింపఁగా నని తాత్పర్యము.







(*) సాల్వుఁడుశివునిచేతసౌభకవిమానంబువడసి ద్వారకాపురవాసులబాధించుట. (*)

౬౬౧.—సీ॥ సరిదుపవనసరో * వరములు మాయించి - బావులు గలచి కూ * పములు చెఱిచి
కోటలు వెసవీట * తాటముల్ గావించి - పరిఖలు పూడ్చివ * ప్రములు ద్రొబ్బి
యట్టళ్లుధరఁగూల్చి * యంత్రముల్ దునుమాడి - కాంచనధ్వజపతా * కములు నఱకి
భాసురగోపుర * ప్రాసాదహర్మ్యేందు - శాలాంగణములు భ * స్మములుచేసి
తే॥ విమల కాంచన రత్నాది * వివిధవస్తు । కోటి నెల్లనునందందఁ * గొల్లఁ బుచ్చి
ప్రజలఁ జెఱఁబెట్టి దొరలను * భంగపెట్టి । తఱిమియుబ్భంగిఁ బెక్కుబా * ధలనలంచి.

టీ॥ సరిదుపవనసరోవరములు—సరిత్=ఏళ్లను. ఉపవన=స్త్రీలు విహరింపఁదగిన యుద్యానవనములను. సరోవరములు = మేలైన కొలఁకులను. మాయించి=పాడుచేసి. బావులు = నడబావులను. కలఁచి=కలయఁబెట్టి. కూపములు=నూతులను. చెఱిచి=చెడఁగొట్టి. కోటలు=ప్రాకారములను. వెసన్=శీఘ్రముగ. వీటతాటములు=చిన్నభిన్నములుగా. కావించి = చేసి. పరిఖలు = అగడ్తలను. (పూడ్చి) వప్రములు = కోటకొఱళ్లను. ద్రొబ్బి = పడఁగొట్టి. అట్టళ్లు = కోటబురుజులమీఁది యిండ్లను. ధరన్ = భూమియందు. కూల్చి=పడఁద్రోసి. యంత్రములు=కీలుగల సాధనములను. తునుమాడి=విఱుగఁగొట్టి. కాంచన ధ్వజపతాకములు = బంగారుధ్వజస్తంభములను టెక్కెములను. (నఱకి) భాసుర...ములు—భాసుర=ప్రకాశించునట్టి. గోపుర = పట్టణపువాకిళ్లు. ప్రాసాద = నగళ్లు. హర్మ్య = మేడలు. ఇందుశాల = చంద్రశాలలు. అంగణములు=ముంగిళ్లు. భస్మములుచేసి = బూడిదగాఁజేసి. విమల...కోటిన్—విమల=నిర్మలమయిన. కాంచన=బంగారు. రత్న = రత్నములు. ఆది=మొదలుగాఁగల. వివిధ=నానావిధములయిన. వస్తుకోటిన్=

వస్త్రముల సమూహమును. ఎల్లన్ = అంతయు. అందందన్ = అక్కడ క్కడను. కొల్లలుపుచ్చి = కొల్లఁబోవునట్లుచేసి. ప్రజలన్ = జనులను. (చెఱఁబెట్టి) దొరలను = ప్రభువులను. భంగపెట్టి = అవమానపెట్టి. (తఱిమి) ఇబ్భంగిన్ = ఈవిధముగా. పెక్కుబాధలన్ = బహు విధములైనబాధలచేత. అలంచి = శ్రమపెట్టి.

తా॥ వీళ్లను అడ్డగట్టి, శృంగారపుఁ దోఁటలను పడఁగొట్టి, మేలైనకొలఁకులనుపూడ్చి, బావులనుకలయఁబెట్టి, నూతులనుచెడఁ గొట్టి, కోటలు ఛిన్నభిన్నములుగా ఇడియఁగొట్టి, కోటమీఁది యిండ్లను కోటగోడలను నేలఁబడఁగొట్టి, కిల్లగల సాధనముల నెల్ల విఱుగఁగొట్టి, బంగారుధ్వజస్తంభములను పెక్కుమాఱులను తెగనఱికి గోపురములలోపలి కోటలు మేడలు చంద్రశాలలు ముంగిళ్లు మొద లగువానిని కాల్చి బూడిదచేసి, నిర్మలమయిన బంగారు రత్నములు మొదలగు వెలగల బహువిధ పదార్థములనెల్లను ఎక్కడివానిన క్కడనేకొల్లఁబెట్టి, సాధారణజనులను చెఱఁబెట్టి, గొప్పవారిని అవ మానపెట్టి తఱుమఁగొట్టి, యీవిధముగా పట్టణమును పాడుచేసి అని తాత్పర్యము.

౯౬౨.—చ॥ మదమున నంతఁ బోవక వి ✽ మాన యుతంబుగ నభ్ర వీధికిన్
గొఁదకొని యేపుమై నెగసి ✽ కొంకక శక్తి శిలా మహీరుహ
ప్రదరము లోలిమైఁగురిసి ✽ బంధుర భూమిఁబరాగ శర్కరల్
వదలక చల్లుచున్ వలయ ✽ వాయువుచే దిశలావరించుచున్.

టీ॥ మదమునన్ = క్రొవ్వుచేత. అంతన్ = అంతటితో. పోవక = పోక. విమానయుతంబుగన్ = విమానముతోడ. అభ్రవీధికిన్ = ఆకాశ మునకు. గొఁదకొని = విజృంభించి. ఏపుమైన్ = అహంకారముతో. (ఎగసి) కొంకక = సంకోచింపక. శక్తి...ములు — శక్తి = శక్తియను ఆయుధములు. శిలా = రాళ్లు. మహీరుహ = వృక్షములు. ప్రదరములు = బాణములు. ఓలిమైన్ = క్రమముగా. కురిసి = వానకురిసినట్లుకురియించి. బంధురభూమిన్ = ఉన్నతమైనగట్టినేలయందు. పరాగశర్కరలు = దుమ్మును గులకరాళ్లను. (వదలకచల్లుచును) వలయవాయువుచేన్ = సుడిగాలిచేత. దిశలు = దిక్కులను. ఆవరించుచున్ = కప్పుచును.

తా॥ అంతటితోపోకుండ మదముచేత విజృంభించి విమానముతోడ ఆకాశమునకు ఎగసినవాఁడై గర్వముతో శక్తులు రాళ్లు వృక్షములు బాణములు మొదలగువానిని వానగాకురియించుచు ఉన్నతమైనరాతి కట్టడపు నేలలయందు దుమ్ము మొరపుమట్టిని చల్లుచు సుడిగాలిచేత దిక్కులను కప్పుచును అని తాత్పర్యము. వ॥ అట్టియెడ.

౯౬౩.—క॥ చటులపురత్రయ దనుజో । త్కట దుస్తరబాధ్యమాన ✽ ధారుణిగతిన
ప్పుటభేదన మంతయతి । స్ఫుట పీడం జెంది వగల ✽ సుడివడుచుండన్.

టీ॥ చటుల...గతిన్ — చటుల = క్రూరులైన. పురత్రయదనుజ = త్రిపురాసురులయొక్క. ఉత్కట = అణఁపరానిదియై. దుస్తర = దాఁటరానిదియై. బాధ్యమాన = బాధింపఁబడుచున్న. ధారుణిగతిన్ = భూమివిధమున. అప్పుటభేదనము = ఆపట్టణము. అంత = అంతయు. అతిస్ఫుటపీడన్ = మిక్కిలి యధికమయినబాధను. చెంది = పొంది. వగలన్ = విచారములచేత. సుడివడుచుండన్ = ప్రుక్కిపడుచుండఁగా.

తా॥ క్రూరులైనత్రిపురాసురులదైనమిక్కుటమును దాఁటరానిదియు నగు బాధచేత తల్లడించునట్టి భూమివలెనే సాల్వునిబాధచేత ఆపట్ట ణము బాధింపఁబడుచున్నది కాఁగా అందలి జనులందఱు విచారము నొందినవారై ప్రుక్కిపడుచుండిరనితాత్పర్యము.

౯౬౪.—చ॥ కని భగవంతుఁడున్ రథిశి ✽ ఖామణియున్నగు రౌక్మిణేయుఁడ
జ్జనముల నోడకుండుఁడని ✽ సంగర కౌతుక మొప్ప దివ్య సా
ధనములఁబూని సైనిక క ✽ దంబము గొల్వ ననూన మీనకే
తన రుచిరాల నున్నతర ✽ థస్థితుఁడై వెడలెన్ రణోర్వికిన్.

టీ॥ కని = చూచి. భగవంతుఁడును = షడ్గుణైశ్వర్య సంపత్తిగల వాఁడును. రథిశిఖామణియును = రథికశ్రేష్ఠుఁడును. అగురౌక్మిణే యుఁడు = అగునట్టి ప్రద్యుమ్నుఁడు. అజ్జనములన్ = ఆపట్టణములోని జనులను. ఓడకుండుఁడని = భయపడక యుండుఁడు అని. సంగర కౌతుకము = యుద్ధోత్సాహము. ఒప్పన్ = ఒప్పఁగా. దివ్యసాధనములన్ = దివ్యములైన యుద్ధసాధనములను. పూని = ధరించి. సైనికకదంబము = సేనాజనసమూహము. కొల్వన్ = సేవింపఁగా. అనూనమీనకేతనరుచి = తక్కువకాని చేఁపటెక్కెముయొక్క ప్రకాశము. రాలన్ = ప్రకా శింపఁగా. ఉన్నతరథస్థితుఁడై = గొప్పతేరుపై నెక్కినవాఁడై. రణో ర్వికిన్ = యుద్ధభూమికి. వెడలెన్ = బయలుదేఱెను.

తా॥ ఆసాల్వుని వలని బాధలను జూచి షడ్గుణైశ్వర్య సంపద గల వాఁడును రథికశ్రేష్ఠుఁడును అయిన ప్రద్యుమ్నుఁడు పురజనులనెల్ల భయపడ వలదని చెప్పి యుద్ధోత్సాహము గలవాఁడై మేలైన అస్త్ర శస్త్రములను ధరించిన వాఁడై సేనాజనులు కొలిచి రాఁగాతన చేఁప టెక్కెపు కాంతులు అతిశయించి వెలుఁగుచుండఁగా ఒక గొప్పరథ ముపై నెక్కియుద్ధభూమికిపోయెననితాత్పర్యము. వ॥ అయ్యవసరంబున.

౯౬౫.—చ॥ సమధిక బాహు శౌర్యజిత ✽ చండ విరోధులు సాఱ సున్నత
క్షమ గద భానువింద శుక ✽ సాత్యకి సారణ చారుదేష్ణసాం
బమకరకేత నాత్మజ శ్వ ✽ ఫల్క తనూభవ తత్సహోదర
ప్రముఖయుధూత్తములుద్వమత ✽ భంజకులై కృతవర్మ మున్నుగన్.

[illegible] రోధులు—సమధిక=మిక్కిలియెక్కువైన. బాహు శౌర్య=భుజబలముచేత. జిత=జయింపఁబడిన. చండ=ఉగ్రులైన. విరోధులు=శత్రువులుగలవారైనశూరులు. పాఱన్=పరుగెత్తిపోవునట్టుగా ఉన్నతతురన్=అధికమైన తాలిమితో. గద=గదుఁడు. భానువింద=భానువిందుఁడు. శుక=శుకుఁడు. (సాత్యకి) సారణ=సారణుఁడు. చారుదేష్ణ=చారుదేష్ణుఁడు. సాంబ=సాంబుఁడు. మకరకేతనాత్మజ=అనిరుద్ధుఁడు. శ్వఫల్గతనూభవ=అక్రూరుఁడు. తత్సహోదర=అతనితోడఁబుట్టువులు. ప్రముఖ=మొదలుగాఁగల. యదూత్తములు=యదువంశశ్రేష్ఠులు. విహతభంజకులై=శత్రువులనుభంగపెట్టువారై. కృతవర్మ=కృతవర్మ యనునతఁడు. మున్ను గన్=ముందుగాఁగా. ముందునవఁగా

తా॥ అత్యంతమయిన భుజబలము చేత శత్రువులనెల్ల ఓడఁగొట్టిన శూరులైనను భయపడిపాఱిపోవునట్టి రీతిని అత్యంత గాంభీర్యము గలవారై గదుఁడు భానువిందుఁడు శుకుఁడు సాంబుఁడు సాత్యకి సారణుఁడు చారుదేష్ణుఁడు అక్రూరుఁడు అతనితమ్ములు మొదలుగాఁగల యాదవ వీరులందఱు తమలో పెద్దవాఁడైన కృతవర్మను ముందు పెట్టుకొన్నవారై బయలుదేఱిరని తాత్పర్యము.




## (*) సాల్వునితో ప్రద్యుమ్నాదులు యుద్ధము చేయుట. (*)

౮౬౬.—క॥ వారణ వాజి స్యందన । వీరభటు ల్వేగఁ జనిరి * విశ్వము వడఁకన్
ఘోరాకృతి వివిధాయుధ । భూరిద్యుతు లర్కబింబ * ముంగబళింపన్.

టీ॥ వారణవాజిస్యందనవీరభటులు=ఏనుఁగులుగుఱ్ఱములురథములు కాలుబలములును. విశ్వము=భూమి. వడఁకన్=అదరఁగా. ఘోరాకృతిన్=భయంకరాకారముతో. వివిధాయుధ భూరిద్యుతులు=నానావిధములైన ఆయుధముల అధికకాంతులు. అర్కబింబమున్ = సూర్యబింబమును. కబళింపన్=మ్రింగఁగా. వేగఁజనిరి=శీఘ్రముగ పోయిరి.

తా॥ అట్లుబయలు దేఱినవారితోడ రథగజతురగ పదాతులనెడు చతురంగసైన్యములు బహువిధములయిన ఆయుధముల కాంతులు సూర్యబింబమును మ్రుఁగుపఱుపఁగా భూమిచలింపఁగాను పోయెనని తా.

వ॥ చని యాగోవింద నందన స్యందనంబునుం బల సందోహంబునుం దలకడచి యదు సైన్యంబులు సాల్వబలం బులతోడం దార్కొని పెరయునప్పుడు దేవ దానవ సంకుల సమర విధంబునం దుములం బయ్యె నివ్విధంబున.

టీ॥ చని=పోయి. ఆగోవిందనందనస్యందనంబును = ఆముందు పోయిన ప్రద్యుమ్నునిరథమును. బలసందోహంబును=సేనాసమూహమును. తలకడచి=అతిక్రమించి — ముందుమించి. యదుసైన్యంబులు=యాదవుల సేనలు. సాల్వ బలంబుల తోడన్ = సాల్వుని దండుతో. తార్కొని=తారసించి. పెరయునప్పుడు=కలయ నప్పుడు—యుద్ధము చేయనప్పుడుఅనుట. దేవ దానవ సంకుల సమరవిధంబునన్=దేవతలయు దానవులయు యుద్ధము రీతిని. తుములంబయ్యెన్ = దొమ్మి యయ్యెను. ఇవ్విధంబునన్=ఈప్రకారముగా.

తా॥ అట్లు ముందుమించిపోయిప్రద్యుమ్నుని రథమును అతనితోడి సేనను వెనుక ద్రోసి ఆయాదవ సేనలు సాల్వుని సేనలను తారసించి పోరాడు నప్పుడు పూర్వము దేవతలకు దానవులకు నైన దొమ్మియుద్ధమువోలి యుండెనని తాత్పర్యము.

౮౭౭.—మ॥ వితతజ్యాచయ టంకృతుల్ మదజలా * విర్భూత ఘుండాల ఘీం
కృతు లుద్యద్భట హుంకృతుల్ మహిత భే * రీభాంకృతుల్ భీషణో
ద్ధత నిస్సాణ ధణంకృతుల్ ప్రకట యో * ధవ్రాత సాహంకృతుల్
కుతలంబున్ దివినిండ మ్రోసె రిపు సం * క్షోభంబుగా భూవరా.

టీ॥ భూవరా=రాజా. వితతజ్యాచయటంకృతులు=నిడుపులైనఅల్లెత్రాళ్ల సమూహములటంకారములును. మదజలావిర్భూతఘుండాలఘీంకృతులు=మదజలముతోడవట్టుచున్న ఏనుఁగులయొక్క ఘీంకారములును. ఉద్యద్భటహుంకృతులు=ఉత్సాహముగలకాలిబంటులయొక్క హుంకారములును. మహితభేరీభాంకృతులు=గొప్పలైననగారాలయొక్క భాంకారములును. భీషణోద్ధతనిస్సాణధణంకృతులు=భయంకరమై మీఁదికి వ్యాపించుచున్న డంకాలదణదణయనుధ్వనులును. ప్రకటయోధవ్రాతసాహంకృతులు=ప్రసిద్ధులైనయోధులగుమియొక్క అహంకారముతోడి మాటలును. రిపుసంక్షోభంబుగాన్ = శత్రువులు కలతపడు నట్లుగా. కుతలంబున్=భూప్రదేశమును. దివి=ఆకాశమును. నిండన్=నిండుకొనునట్లుగా. మ్రోసెన్=ధ్వనించెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా ! అప్పుడు ఆసేనల యందు నిడుపులైన వింటినారులచప్పుళ్లును, ఏనుఁగులఘీంకలచప్పుళ్లును, యుద్ధోత్సాహము గలబంటులహుంకారముల చప్పుళ్లును, గొప్పలైనభేరులమ్రోఁతలును, భయంకరమయినడంకాలమ్రోఁతలును, ప్రసిద్ధులైన యోధులయొక్క హూరాలాపములధ్వనులును, ఒక్కటై భూమియు నాకాశమును నిండి శత్రువులకుభయమును పుట్టించునట్టిదయ్యెనని తాత్పర్యము.

౮౭౮.—మ॥ హరి రింఖారథనేమి సద్భటపద * వ్యాఘట్టనోద్ధూత దు
స్తర ధూళీపటల ప్రభూత నిబిడ * ధ్వాంత ప్రవిధ్వంస కృ
త్కరశాతాసి గదాది హేతిరుచులా * కాశంబునిండన్ వియ
చ్చరదృక్కు ల్మిఱుమిట్లుగొల్ప సమరో * త్సాహంబు సంధిల్లఁగన్.

టీ॥ హరిరింఖా ... రుచులు — హరి = గుఱ్ఱములయొక్క. రింఖా=గిట్టలయు. రథ=తేరులయొక్క. నేమి=కడకమ్ములయు. సద్భట=మంచిబంటులయొక్క. పద=అడుగులయు. వ్యాఘట్టన=విశేషమైన అదుముడులచేత. ఉద్ధూత = మీఁదికెగసిన. దుస్తర=మీఱరాని. ధూళీ = దుమ్ముయొక్క. పటల = సముదాయము చేత. ప్రభూత=పుట్టిన. నిబిడ=దట్టమయిన. ధ్వాంత=చీఁకటిని. ప్రవిధ్వంసకృత్=అణఁచివేయుచున్న. కర=చేతులయందలి. శాత=వాఁడులైన. అసి=కత్తులు. గదా = గదలు. ఆది = మొదలుగాఁగల. హేతి = ఆయుధములయొక్క. రుచులు = కాంతులు. ఆకాశంబు నిండన్ = ఆకాశమునందు వ్యాపింపఁగా. వియచ్చరదృక్కులు = దేవతల చూపులను. మిఱుమిట్లుగొల్పన్ = చెదరునట్లుచేయఁగా. సమరోత్సాహంబు = యుద్ధమునందలి యాటోపమును. సంధిల్లఁగన్=అతిశయింపఁగా.

తా॥ గుఱ్ఱములగిట్టల త్రొక్కుడులచేతను, రథ చక్రములకడకమ్ముల యొరపిడిచేతను, శూరులైనబంట్ల అడుగుల అదుముడులచేతను, మీఁదికెగసిన మిక్కుటమయినదుమ్ముయొక్క కమ్ముదలచేత పుట్టినచీఁకటిని పోఁగొట్టుచున్నవాఁడులైన కత్తులు గదలు మొదలు గాఁగల ఆయుధముల కాంతులు ఆకాశమెల్లనిండి యుద్ధపు వేడుక చూడ వచ్చిన దేవతల చూపులను చెదరునట్లు చేయు చుండఁగా యుద్ధమునందలి యుత్సాహము అప్పటప్పటికి హెచ్చఁగా ననితా.

౮౭౯.—చ॥ తలకొని సైనికు ల్కడచి * తార్కొని పేర్కొని డాసి పాసి యం
కిలిగొన కిమ్ము లమ్ములఁ బ * గిల్చి నొగిల్చి తరేతరు ల్తలల్
నలియఁగనొత్తి మొత్తి నయ * నంబుల నంబులురాల లీల నా
దలలు లలాటమున్నున గ * దాహతి నొంచి కలంచి పాఱఁగన్.

టీ॥ తలకొని=పూని. సైనికులు = సేనాజనులు. కడచి=మీఱి. తార్కొని=తారసించి. పేర్కొని=తమపేరులుచెప్పి. డాసి=చేరఁబోయి. పాసి = వెనుకకుతొలఁగి. అంకిలిగొనక = వెనుదీయక. ఇమ్ములు=మర్మములు. అమ్ములన్=బాణములచేత. పగిల్చి=భేదించి.

నొగిల్చి=నొప్పించి. ఇతరేతరులు=ఒండొరులు. (తలలు)నలియఁగన్=నలఁగునట్లు గా. ఒత్తి=నొక్కి. మొత్తి=మోఁది—కొట్టి. నయనంబులన్=కన్నులందు. అంబులు=నీళ్లు. రాలన్=రాలఁగా. లీలన్=అనాయాసముగా. ఔదలలు=నడితలలు. లలాటములు=నొసళ్లు. ఘనగదాహతిన్=పెద్దగదపెట్టుచేత. ఒంచి = పగులునట్లు కొట్టి. కలంచి=కలఁతనొందించి. పాఱఁగన్=పరుగెత్తఁగా.

తా॥ పూన్కిగలవారై సైనికులందఱు ఒకరినొకరుమీఱితారసించి తమతమపేరులు చెప్పి కదియఁబడి తొలఁగి వెనుదీయక మర్మములు భేదించి నొప్పించి ఒకరొకరి తలలు నలియునట్లుగట్టిగాకొట్టికన్నుల నీళ్లువచ్చునట్లు అనాయాసముగ నడితలలు నొసళ్లుపగుల పెద్దగదలతో మోఁది కలఁతనొందించి పరుగెత్తిపోఁగా నని తాత్పర్యము.

వ॥ ప్రద్యుమ్నుండుకనుంగొని. టీ॥ ప్రద్యుమ్నుఁడు చూచి.

౮౭౧.—మ॥ అనయంబుం గలుషించి సౌభపతి మా * యాకోట్లు చంచచ్ఛరా
సన నిర్ముక్త నిశాతదివ్య మహితా * స్త్ర శ్రేణిచేఁ దత్క్షణం
బున లీలాగతి నభ్ర గుల్మనములన్ * భూషింప మాయించె న
వ్వనజాతాప్తుఁడు భూరిసంతమసమున్ * వారించు చందంబునన్.

టీ॥ అనయంబున్=మిక్కిలి. కలుషించి=కోపించి. సౌభపతి మాయాకోట్లు = సాల్వునివైన యనేక మాయలను. చంచ... శ్రేణిచేన్—చంచత్ = ఒప్పుచున్న. శరాసన = వింటివలననుండి. నిర్ముక్త=విడువఁబడిన. నిశాత=మిక్కిలి వాఁడియైన. దివ్య=దేవ సంబంధమయిన. మహిత = మహిమగల. అస్త్రశ్రేణిచేన్ = బాణ పఙ్క్తిచేత. తత్క్షణంబునన్ = ఆక్షణముననే — అప్పుడే. లీలాగతిన్=వినోదవిధమున—అనాయాసముగ. అభ్రగులు=ఆకాశమునందుతిరుగువారు—దేవతలు. మనములన్ = మనసులలో. భూషింపన్=మెచ్చుకొనఁగా. అవ్వనజాతాప్తుఁడు = ప్రసిద్ధుఁడైనసూర్యుఁడు. భూరిసంతమసమున్=అధికమైనచీఁకటిని. వారించుచందంబునన్=పోఁగొట్టువిధమున. మాయించెన్=అణఁగిపోవునట్లు చేసెను.

తా॥ మిక్కిలికోపించినవాఁడైఒప్పిదములైతనవింటినుండివిడువఁబడుచున్న తీక్ష్ణములైన దేవసంబంధములైన బాణ సమూహముల చేత అనాయాసముగా అప్పుడే ఆకాశమునందుండిచూచునట్టిదేవతలు మెచ్చునట్లు సూర్యుఁడు చీఁకట్లను తొలఁగించు విధమున సాల్వుని మాయలనన్నిటిని తొలఁగించె నని తాత్పర్యము.

౧౭౨.—చ॥ అతి రథికోత్తముండతఁడు * దంచిత కాంచనపుంఖ పంచవిం
శతి విశిఖంబుల న్నతని * సైనికపాలుని నొంచి యుగ్రుఁడై
శతశత కోటికోటి నిభ * సాయకము ల్వరఁగించి సాల్వ భూ
పతి కకుదంబునొంచి లయ * భైరవుకైవడిఁ బేర్చి వెండియున్.

టీ॥ అతిరథికోత్తముండు=అతిరథులలోశ్రేష్ఠుఁడైన. అతఁడు=ఆప్రద్యుమ్నుఁడు. ఉదంచిత...విశిఖంబులన్—ఉదంచిత = మిక్కిలి యొప్పిదములయిన. కాంచనపుంఖ = బంగారు పింజలుగల. పంచవింశతివిశిఖంబులన్=ఇరువదియైదు బాణముల చేత. అతనిసైనికపాలునిన్=ఆసాల్వునిసేనానాయకుని. నొంచి=నొప్పించి. ఉగ్రుఁడై=భయంకరుఁడై. శతశత కోటికోటి నిభసాయకములు — శత = నూఱైన. శతకోటి=వజ్రాయుధములయొక్క. కోటి=నూఱులక్షల తోడ. నిభ=సమానములయిన. సాయకములు=బాణములను. పరఁగించి = ప్రయోగించి. సాల్వభూపతి కకుదంబున్ = సాల్వరాజుయొక్క మూఁపును. నొంచి = నొప్పించి. లయభైరవుకైవడిన్ = ప్రళయకాలపుభైరవునివలె. పేర్చి=రేఁగి. వెండియున్=మఱియును.

తా॥ అతిరథులలో ఉత్తముఁడైన యాప్రద్యుమ్నుఁడు మిక్కిలి యొప్పుచున్న బంగారు పింజలుగల యిరువదియైదు బాణములచేత సాల్వునిసేనానాయకుని నొప్పించి కోటి వజ్రాయుధములను బోలిన నూఱు బాణములను ప్రయోగించి సాల్వుని మూఁపును నొప్పించి అంతట ప్రళయకాలపు భైరవదేవునివలెనే రేఁగినవాఁడై యనితా.

౮౭౩.—చ॥ పదిపదియమ్ముల న్మనుజ * పాలవరేణ్యుల నొంచి రోషముం
గదురఁగ మూఁడుమూఁడు శిత * కాండములన్ రథదంతి వాజులన్
జదియఁగ జేసి యొక్కొక ని * శాత శరంబున సైనికావలిన్
మదము లడంచి యిట్లతఁడ * మానుషలీలఁ బరాక్రమించినన్.

టీ॥ పదిపదియమ్ములన్=పదేసిబాణములచేత. మనుజపాలవరేణ్యులన్=సాల్వునికితోడువచ్చినరాజశ్రేష్ఠులను. నొంచి=నొప్పించి. రోషమున్=కోపమును. కదురఁగన్=అతిశయింపఁగా. మూఁడు మూఁడుశిత కాండములన్ = మూఁడేసి బాణములచేత. రథదంతి వాజులన్ = తేరులను ఏనుఁగులను గుఱ్ఱములను. చదియఁగన్ = నేలతోనేలగాపడినలఁగి పోవునట్లు. (చేసి) ఒక్కొకనిశాతశరంబునన్=ఒక్కొక్క వాఁడిబాణముచేత. సైనికావలిన్=కాలిబంట్లగుంపును. మదములడంచి=క్రొవ్వులుఅణఁగునట్లుచేసి. (ఇట్లు)అతఁడు=ఆప్రద్యుమ్నుఁడు. అమానుషలీలన్ = మనుష్యులు చేయునట్టి విధముకానియట్లు. పరాక్రమించినన్=శత్రువులనుఆక్రమింపఁగా.

తా॥ పదేసి బాణములచేత సాల్వునికి సహాయులగు రాజులను, మూఁడేసి బాణములచేత రథ గజ తురగములను, ఒక్కొక్క వాఁడి బాణముచేత కాలిబంట్లను నొప్పించి ప్రద్యుమ్నుఁడు మనుష్యులకు అలవిగాని విధమున పరాక్రమమును జూపఁగానని తాత్పర్యము.

౮౭౪.—క॥ దుర్మానవ హరణాద్భుత । కర్మమునకు నుభయసైని * క ప్రకరంబుల్
నిర్మలమతి నుతియించిరి । ధర్మాచలధైర్యు విగత * భయుఁ బ్రద్యుమ్నున్.

టీ॥ దుర్మా...మునకున్ — దుర్మానవ = దుష్టజనులయొక్క. హరణ=నాశము చేయుటయనెడు. అద్భుతకర్మమునకున్=ఆశ్చర్యమైనపనికి, ఉభయసైనిక ప్రకరంబులు=ఇరుతెగ సేనయందలిజనుల గుంపులు. ధర్మాచలధైర్యున్=మేరుపర్వతమువలెచలింపనిధైర్యము గల, విగతభయున్=పోయినభయముగల. ప్రద్యుమ్నున్=ప్రద్యుమ్నుని. నిర్మలమతిన్=కపటములేనిబుద్ధితో. నుతియించిరి=పొగడిరి.

తా॥ దుష్టజనులను నాశము చేయునట్టిపనికై రెండు పక్షముల సైనికులును ఆశ్చర్యము నొందినవారై మేరుపర్వతమువలె చలింపని ధైర్యముగలవాఁడును, భయములేనివాఁడునైన ప్రద్యుమ్నుని నిర్మలమయినచిత్తముతో కొనియాడిరని తాత్పర్యము.

౮౭౫.—ఉ॥ సాంబుని సాల్వభూవిభుఁడు * సాయక జాలములేసి నొంచినన్.
జాంబవతీ తనూభవుఁడు * చాపము సజ్యముచేసి డాసి సా
ల్వుం బదియేను తూపుల న * వోన్నత వక్షము గాడనేసి తీ
క్ష్ణాంబక వింశతి న్నతని * సౌభక మల్లల నాడ నేసినన్.

టీ॥ సాల్వభూవిభుఁడు = సాల్వరాజు. (సాంబుని) సాయక జాలములు=బాణసమూహములు, ఏసి=ప్రయోగించి, నొంచినన్=నొప్పింపఁగా. జాంబవతీ తనూభవుఁడు = జాంబవతి కొడుకైన సాంబుఁడు. చాపమున్=వింటిని, సజ్యముచేసి=ఎక్కుపెట్టి. డాసి=కదియఁబడి, (సాల్వుని) ఉన్నతవక్షము= ఉబ్బికిల్లియున్న రొమ్మును. గాఁడన్=నాటునట్లు. పదియేనుతూపులన్=పదియేనుబాణములను. ఏసి=ప్రయోగించి. తీక్ష్ణాంబకవింశతిన్=వాఁడియైనయిరువదిబాణములను, అతనిసౌభకమున్ = సౌభకమనెడు వానివిమానమును. అల్లలనాడన్ = తల్లడిల్లునట్లుగా. ఏసినన్ = ప్రయోగింపఁగా.

తా॥ అప్పుడుసాల్వరాజు జాంబవతికొడుకైన సాంబుని అనేక బాణములు ప్రయోగించి నొప్పింపఁగా ఆసాంబుఁడును సాల్వుని యొక్కరొమ్మున నాటునట్లుగా పదియేనుబాణములను ప్రయోగించి వెంటనే యిరువదిబాణములు ప్రయోగించి వాని విమానమును ఉఱ్ఱూఁగునట్లు చేయఁగా నని తాత్పర్యము.

౮౭౬.—చ॥ గదుఁడు మహోగ్రవృత్తి నిజ * కార్ముక నిర్గతవిస్ఫుర ద్విధుం
తుద వదనాభ బాణ విత * తు ల్వరఁగించి విరోధి మస్తముల్
గుదులుగ గ్రుచ్చియెత్తుచు న * కుంఠిత విక్రమకేళి లోలుఁడై
చదల సురల్నుతింప రథి * సత్తముఁడొప్పె నరేంద్రచంద్రమా.

టీ॥ నరేంద్ర చంద్రమా = ఓరాజశ్రేష్ఠుఁడా. (గదుఁడు) మహోగ్రవృత్తిన్ = మిక్కిలిభయంకరమైన వ్యాపారముతో. నిజ ...వితతులు—నిజ=తనదైన. కార్ముక = వింటివలననుండి. నిర్గత = వెలువడిన. విస్ఫురత్=విశేషించి ప్రకాశించుచున్న. విధుంతుద = రాహువుయొక్క, వదనాభ=ముఖమునుబోలిన. బాణవితతులు= బాణముల సమూహములను. పరఁగించి=ప్రయోగించి. విరోధిమస్తములు=శత్రువులతలలను. గుదులుగన్=గుదులుగుదులుగా. (గ్రుచ్చియెత్తుచును) అకుంఠితవిక్రమకేళిలోలుఁడై=మొక్కపోని పరాక్రమ క్రీడయందు ఆసక్తుఁడై. రథిసత్తముఁడు=రథికులలో శ్రేష్ఠుఁడయిన ఆగదుఁడు. చదలన్ = ఆకాశమునందు. సురలు = దేవతలు. నుతింపన్=పొగడఁగా. ఒప్పెను=ప్రకాశించెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! రథికులలో నుత్తముఁడైన గదుఁడు అనువాఁడు భయంకరమయిన వ్యాపారముతో తనవింటివలననుండి వెడలుచున్న రాహువుపడగలవంటి బాణసమూహములచేత శత్రువుల తలలను గుదులుగా గ్రుచ్చియెత్తుచు మొక్కపోని పరాక్రమ క్రీడయందు ఆసక్తుఁడగుచు ఆకాశమునందుండి వేడుక చూచెడు దేవతలు పొగడఁగా వెలయుచుండెను అని తాత్పర్యము.

౮౭౭.—ఉ॥ సాత్యకి చండరోషమున * సాల్వమహీవరు భూరిసౌభ సాం
గత్య చతుర్విధోగ్ర బల * గాఢతమగ్గి పటలంబు భాసురా
దిత్య మయూఖ పుంజ రుచి * తీవ్ర శరంబుల మాపి సైనిక
స్తుత్యపరాక్రమ ప్రకట * దోర్బలుఁడై విలసిల్లె భూవరా.

టీ॥ భూవరా=రాజా, (సాత్యకి) చండరోషమునన్ = తీక్ష్ణమైన కోపముతో. సాల్వ...పటలంబున్—సాల్వమహీవరు=సాల్వరాజుయొక్క, భూరి = గొప్పదైన. సౌభ=సౌభకమనెడి విమానముయొక్క, సాంగత్య=కూడికగల. చతుర్విధ=నాలుగువిధములైన. ఉగ్ర=భయంకరమైన, బల=సేనయనెడు, గాఢ=దట్టమైన. తమః పటలంబున్=చీఁకటి సముదాయమును, భాసురా... శరంబులన్—భాసుర = వెలుఁగుచున్న. ఆదిత్య = సూర్యునియొక్క. మయూఖ = కిరణములయొక్క. పుంజ = సముదాయమునుయొక్క. రుచి=ప్రకాశముగల. తీవ్ర=వాఁడులైన. శరంబులన్=బాణముల చేత. మాపి=పోఁగొట్టి. సైనిక...దోర్బలుఁడై — సైనిక = సేనాజనులచేత. స్తుత్య=కొనియాడఁదగిన. పరాక్రమ=శత్రువులనాక్రమించుటచేత. ప్రకట=ప్రసిద్ధమైన. దోర్బలుఁడై=భుజబలము గల

వాఁడై. విలసిల్లెన్=యుద్ధ భూమియందు నెదురులేక ప్రకాశించెను.

తా॥ ఓరాజా! అప్పుడుసాత్యకి వేంద్రమైనకోపముతోసాల్వుని గొప్ప సౌభకవిమాన సంబంధముచేతనిక్కుచున్న చతురంగబలము లనెడు చీఁకటిని ప్రకాశించునట్టి తన బాణములనెడు సూర్యకిరణములచేతతొలఁగించినవాఁడైఉభయసేనలజనులునుకొనియాడఁదగిన పరాక్రమాతిశయములోడిభుజబలమువెలయఁగాప్రకాశించెననితా.

౮౭౮.—ఉత్సాహ॥ భానువిందుఁ డుద్ధతిన్ వి * పక్షపక్ష సైన్య దు
ర్మాన కాననానలోప * మాన చండకాండ సం
తాన మూననేసి చూర్ణి * తంబుచేసెఁ జాప వి
ద్యానిరూఢి దేవతా వి * తాన మిచ్చమెచ్చఁగాన్.

టీ॥ (భానువిందుఁడు) ఉద్ధతిన్ = నిక్కుతో. విపక్ష ... నము —విపక్షపక్ష = శత్రుపక్షమైన. సైన్య = సేనలయొక్క. దుర్మాన= చెడ్డగర్వమనెడు. కానన=అడవిని. అనల=అగ్నితోడ. ఉపమాన= పోల్పఁదగిన. చండ=వాఁడియైన. కాండ=అమ్ములయొక్క. సంతానము=గుంపు. ఊనన్=నాటునట్లుగా. ఏసి=ప్రయోగించి. చాప విద్యానిరూఢి=విలువిద్యయందలినేర్పు. దేవతా వితానము. దేవతల గుంపు. ఇచ్చన్=మనసునందు. మెచ్చఁగాన్=మెచ్చుకొనునట్టుగా. చూర్ణితంబుచేసెన్=పొడియైనదానిఁగాఁ జేసెను.

తా॥ భానువిందుఁడు అనువాఁడు గర్వించిన శత్రుసైన్యమనెడి అడవిని వేంద్రమయిననిప్పుతోఁ బోల్పఁదగిన బాణములను ప్రయోగించి తన విలువిద్యయందలి సామర్థ్యమును దేవతలుకూడ మెచ్చుకొనునట్లుగా ఆశత్రుసేనలనెల్లనుపొడిపొడిగాచేసెననితాత్పర్యము.

౮౭౯.—ఉత్సాహ॥ చారుధేష్ణుఁ డాగ్రహించి * శత్రు భీషణోగ్ర దో
స్సార దర్ప మేర్పడన్ ని * శాత బాణ కోటిచే
దారుణ ప్రతాప సాల్వ * దండనాథ మండలిన్
మారి రేఁగినట్లు పిల్కు * మార్చి పేర్చి యార్చినన్.

టీ॥ (చారుధేష్ణుఁడు) ఆగ్రహించి = కోపించి. శత్రు ... దర్పము—శత్రు=పగవారికి. భీషణ=భయంకరమైన. ఉగ్ర =తీక్ష్ణమైన. దోస్సార=భుజబలమువలని. దర్పము=మదము. ఏర్పడన్= తెలియఁబడునట్లుగా. నిశాతబాణ కోటిచేన్ = వాఁడిబాణముల సమూహముచేత. దారుణ...మండలిన్ — దారుణ = వేంద్రమైన. ప్రతాప=తేజస్సుగల. సాల్వ=సాల్వునివారైన. దండనాథ=సేనానాయకులయొక్క. మండలిన్=సమూహమును. మారిరేఁగినట్లు= మారియను దేవత విజృంభించినట్లు. పిల్కుమార్చి=చంపి. పేర్చి= విజృంభించి. ఆర్చినన్=సింహనాదము సేయఁగా.

తా॥ చారుధేష్ణుఁడు అనువాఁడుకోపించినవాఁడైపగవారికిభయమును గలుగఁజేయునట్టి ఓర్వరాని భుజబలమువలనిమదము తెలియఁబడునట్టుగావాఁడియైనబాణములసమూహములనుప్రయోగించితీక్ష్ణమైన తేజస్సుగలసాల్వుని సేనానాయకులను మారియను దేవత రేఁగి చంపునట్టుగా చంపి విజృంభించి సింహనాదము చేయఁగా నని తా.

౮౮౦.—క॥ శుకుఁ డాయోధన విజయో । త్సుకమతి బాహాబలంబు * చొప్పడ విశిఖ
ప్రకరంబుల దను శౌర్యా । ధికుఁడన విద్వేష బల త * తిం బరిమార్చెన్.

టీ॥ (శుకుఁడు) ఆయోధనవిజయోత్సుకమతిన్=యుద్ధమందలిగెల్పు తమకము తోడి బుద్ధితో. బాహాబలంబు=భుజబలము. చొప్పడన్= విశదపడునట్లు. విశిఖప్రకరంబులన్=బాణసమూహములచేత. తనున్ =తన్ను. శౌర్యాధికుఁడు=శూరత్వముచేతగొప్పవాఁడు. (అనన్) విద్వేషబలతతిన్ = శత్రుసేనలగుంపును. పరిమార్చెన్=చంపెను.

తా॥ శుకుఁడుతన్నందఱునుమిక్కిలిశూరుఁడనిమెచ్చుకొనునట్లుగా వాఁడిబాణములనుతఱుచుగా ప్రయోగించి యుద్ధమునందు గెలుపును పొందవలెననుతమకముతో శత్రువులసేనను చంపెనని తాత్పర్యము.

౮౮౧.—ఉ॥ సారణుఁ డేపుమైఁ గదిసి * శాత్రవ వీరులు సందడింప దో
స్సారమెలర్పఁ గుంత శర * శక్తి గదా క్షురికాది హేతులన్
వారక వాజి దంతి రథ * వర్గములం దునుమాడి కాల్వురన్
వేరముతోడఁ బంపె జము * వీటికిఁ గాఁపుర ముగ్రమూర్తియై.

టీ॥ (సారణుఁడు) ఏపుమైన్=గర్వముతో. కదిసి=చేరి. శాత్రవ వీరులు=వీరులైనశత్రువులు. సందడింపన్=సందడికలుగఁజేయఁగా —ఆవరింపఁగా. దోస్సారము=భుజబలము. ఎలర్పన్=అతిశయింపఁగా. కుంత... హేతులన్—కుంత=ఈఁటె. శర=బాణము. (శక్తి) గదా=గుదియ. క్షురిక=చూరుకత్తి. ఆది=మొదలగు. హేతులన్= ఆయుధములచేత. వారక=వెనుదీయక. వాజిదంతిరథవర్గములన్= గుఱ్ఱములయుఏనుఁగులయురథములయుగుంపును. తునుమాడి=చంపి. ఉగ్రమూర్తియై=రుద్రస్వరూపముగలవాఁడై. కాల్వురన్=కాలిబలమును. వేరములోడన్=విరోధముతో. జమువీటికిన్=యమునిపట్టణమునకు. కాఁపురము=నివాసముగా. పంపెన్=అంపెను.

తా॥ సారణుఁడనువాఁడు శత్రువులు మిక్కిలి అహంకరించి ఆక్రమింపఁగా తన భుజబలము వెలుఁగొందునట్లు ఈఁటె గుదియ శక్తి చురకత్తి మొదలుగాఁగల ఆయుధముల చేత గుఱ్ఱములను ఏనుఁగులను రథములను తునుకతునుకలుగా నఱకివేసి ప్రళయకాల రుద్రునివలె భయంకర స్వరూపుఁడై కాలుబలమునెల్లను యముని పట్టణమున వాసముచేయఁబంపెను అనఁగాచంపెననితాత్పర్యము.

౮౮౨.—క॥ అక్రూరుఁడు దదనుజులు న । వక్రపరాక్రమము మెఱసి ✱ వైరుల బాహా
విక్రమమున వధియించిరి । చక్రప్రాసాది వివిధ ✱ సాధనములచేన్.

టీ॥ (అక్రూరుఁడును) తదనుజులును=అతనితమ్ములును. అవక్రపరాక్రమము=కొఱఁతలేని పరాక్రమమును. మెఱసి = మెఱయింపఁజేసి. వైరులన్=శత్రువులను. బాహావిక్రమమునన్ = తమభుజబలముచేత. చక్రప్రాసాది=చక్రము ఈఁటె మొదలగు. వివిధసాధనములచేన్ = నానా విధములయిన యాయుధముల చేత. వధియించిరి = చంపిరి.

తా॥ అక్రూరుఁడు అతనితమ్ములును కొఱఁతలేని పరాక్రమముగల వారైతమభుజబలముకొలఁదిని నానావిధములైన ఆయుధములను ప్రయోగించి శత్రుసమూహములను చంపినవారలైరని తాత్పర్యము.

౮౮౩.—మ॥ కృతవర్మ క్షితి నాయకుండు విశిఖ ✱ శ్రేణిం బ్రమత్తార్యధి
శ్రితవర్మంబులఁ జించి. మేనుల శత ✱ చ్ఛిద్రంబులం జేయ న
ద్భుత కర్మంబని సైనికు ల్పొగడ శ ✱ త్రుల్తాఱుచో సంగర
క్షితి ధర్మంబు దలంచి కాచె రథిక ✱ శ్రేష్ఠుండు భూమీశ్వరా.

టీ॥ భూమీశ్వరా=రాజా. రథికశ్రేష్ఠుండు = రథికులలో శ్రేష్ఠుఁడైన. కృతవర్మక్షితినాయకుఁడు=కృతవర్మయనురాజు. విశిఖశ్రేణిన్=బాణపఙ్క్తులచేత. ప్రమత్తార్యధిశ్రితవర్మంబులన్=పరాకుపడినశత్రువులు తొడుగుకొన్న కవచములను. (చించి) మేనులన్=వారిదేహములను. శతచ్ఛిద్రంబులన్=నూఱురంధ్రములుకలవానిఁగా—అనేకములు చిల్లులుపడునట్లుగా. చేయన్=చేయఁగా. అద్భుతకర్మంబు=వింతపని. (అని సైనికులు) పొగడన్ = కొనియాడఁగా. శత్రులు=పగవారు. తాఱుచోన్ = వెఱచిదాఁగునప్పుడు. సంగరక్షితిన్ = యుద్ధభూమియందు. ధర్మంబు=యుద్ధధర్మమును. (తలంచి) కాచెన్=రక్షించెను.

తా॥ ఓరాజా! రథమునందుండి యుద్ధముచేయువారిలో శ్రేష్ఠుఁడయిన కృతవర్మ మహారాజు వాఁడులైన బాణపఙ్క్తులచేత మదించిన శత్రువులుతొడుగుకొన్న కవచములుచినుఁగఁగొట్టివారిదేహములందెల్ల యెడలచిల్లులు అగునట్లు చేసి ఇదివింతపనియనియెల్లవారు మెచ్చుకొనునట్లు యుద్ధమునందు వెనుదీసిపోవువారిని రక్షించెనని తాత్పర్యము.

౮౮౪.—వ॥ అత్తఱి సాల్వుండు కోపోద్దీపిత మానసుండైయుండ మాయావిడంబకంబైనసౌభకంబప్పుడు.

టీ॥ అత్తఱిన్=ఆసమయమునందు. సాల్వుఁడు=సాల్వుఁడు. కోపోద్దీపితమానసుండై=కోపముచేతవెలుఁగఁజేయఁబడిన మనసుగలవాఁడై. ఉండన్=ఉండఁగా. మాయావిడంబకంబు = మాయను వ్యాపింపఁజేయునది. అయినసౌభకంబు = ఐనట్టిసౌభకవిమానము. (అప్పుడు)

తా॥ అప్పుడుసాల్వుఁడుకోపించినవాఁడుకాఁగామాయను వ్యాపింపఁజేయునదియైనసౌభకవిమానము అప్పుడు ఏమిచేసెననఁగా ననితా.

౮౮౫.—సీ॥ ఒకమాటు నభమునఁ ✱ బ్రకటంబుగాఁదోఁచు - నొకమాటుధరణిపై ✱ నొనరనిలుచు
నొకమాటు శైలమ ✱ స్తకమున వర్తించు - నొక మరి చరియించు ✱ నుదధి నడుమ
నొక్క తోయంబున ✱ నొక్కటియై యుండు - నొక్కెడఁ గనుఁగొనఁ ✱ బెక్కు లగును
నొకమాటు సాల్వ సం ✱ యుక్తమై పొడసూపు - నొకతోయ మన్నియు ✱ నుడిగితోఁచు
ఆ॥ నొక్క తేప కొఱవి ✱ యుడుగక త్రిప్పిన । గతి మహోగ్ర వృత్తిఁ ✱ గానవచ్చు
మఱియుఁ బెక్కు గతుల ✱ నరివరు ల్గలఁగంగఁ । దిరిగె సౌభకంబు ✱ ధీవరేణ్య.

టీ॥ ధీవరేణ్యా=జ్ఞానముచేతనుత్తముఁడా. ఒకమాటు=ఒకసారి. నభమునన్=ఆకాశమునందు. ప్రకటంబుగాన్=ప్రసిద్ధముగా-స్పష్టముగా. తోఁచున్=కనఁబడును. (ఒకమాటు) ధరణిపైన్ = భూమిమీఁద. ఒనరన్=ఒప్పునట్లు. నిలుచున్=ఉండును. (ఒకమాటు) శైలమస్తకమునన్=కొండకొమ్మునందు. వర్తించున్=ఉండును. ఒకమరి=ఒకసారి. ఉదధినడుమన్=సముద్రమునడుమ. చరియించున్=మెలఁగును. ఒక్కతోయంబునన్=ఒకసారి. (ఒక్కటియై యుండును) ఒక్కెడన్=ఒకసమయమునందు. కనుఁగొనన్=చూచుటకు. పెక్కులు=అనేకములు. (అగును ఒకమాటు) సాల్వసంయుక్తమై=సాల్వునితోఁగూడుకొన్నదై. పొడసూపున్=కనఁబడును. ఒకతోయము=ఒక్కసారి. (అన్నియు) ఉడిగి=వదలి. ఏదియు లేకయనుట. తోఁచున్=కానఁబడును. ఒక్కతేప=ఒకసారి. కొఱవియుడుగక త్రిప్పినగతిన్=ఎడతెగక కొఱవిత్రిప్పినట్లు. మహోగ్రవృత్తిన్=అతిభయంకరమయినవ్యాపారముగలదిగా. కానవచ్చున్=కనఁబడును. మఱియున్=ఇంకను. పెక్కుగతులన్=బహువిధములచేత. అరివరులు=శత్రుశ్రేష్ఠులు. కలఁగంగన్=కలఁతనొందఁగా. సౌభకంబు=సౌభకవిమానము. (తిరిగెను)

తా॥ ఓజ్ఞానవంతుఁడవగు పరీక్షిన్మహారాజా! సౌభకవిమానము ఒకసారి ఆకాశమునందును, ఒకసారిభూమియందును, ఒకసారికొండమీఁదను, ఒకసారి సముద్రము నడుమను, మఱియొక సారి ఒకటిగాను, ఇంకొకసారి అనేకముగాను, మఱియొకసారి సాల్వునితోడను, ఇంకనొకసారి వట్టిదిగాను, ఒకసారి కొఱవి త్రిప్పినట్టుగాను, ఒకసారిభయంకరమయినరీతితోను, కానవచ్చుచు మెలఁగసాగెననితా.

౮౮౬.—వ॥ ఇవ్విధంబున సౌభకంబు వర్తించుటం జేసి యదు సైన్యంబులచే దైన్యంబు
నొందిన నిజ సైన్యంబుల మరలం బురికొల్పి కొని సాల్వుం డప్పుడు.

టీ॥ ఇవ్విధంబునన్=ఈరీతిగా. సౌభకంబు=సౌభక విమానము. వర్తించుటంజేసి=మెలఁగుటచేత. యదుసైన్యంబులచేన్=యాదవుల దండుచేత. దైన్యంబునొందిననిజసైన్యంబులన్=దీనత్వమునుపొందినతన సేనలను. మరలన్=తిరుగునట్లు. పురికొల్పికొని = ప్రేరేపించుకొని.

అప్పుడు = ఆసమయము నందు. సాల్వుఁడు = సాల్వమహారాజు.
తా॥ ఈరీతిగా సాల్వుఁడు సౌభక విమానము మెలఁగుటచేత యాదవులచేతదీనదశనుపొందిన తనదండునంతయు మరలఁబురికొలుపుకొన్నవాఁడైయనితాత్పర్యము.

౮౮౭.—క॥ స్ఫురదనలాభ శరంబులు । పొరిఁబొరిఁ బుంఖానుపుంఖ ✽ ములుగా నేయన్
దెరలియు మరలియు మురిసియు । విరిసియుఁ బిఱుతివకపోరె ✽ వెసయదుబలముల్.

టీ॥ స్ఫుర...బులు—స్ఫురత్ = గనగనమండుచున్న. అనల = అగ్నిని. ఆభ = పోలిన. శరంబులు = బాణములను. పొరిఁబొరిన్ = అధికముగా. పుంఖానుపుంఖములుగాన్ = పింజపింజతాఁకునట్లు. ఏయన్ = ప్రయోగింపఁగా. తెరలియున్ = చలించియు. మరలియున్ = వెనుకకుతిరిగియు. మురిసియున్ = విఱిగియు. విరిసియున్ = చెదరియు. పిఱుతివక = వెనుదీయక. యదుబలములు = యాదవసేనలు. వెసన్ = వడితో. పోరెన్ = పోరాడెను.

తా॥ గనగనలాడుచున్న అగ్నివలె మెఱయుచున్న బాణములను అపరిమితము గాను పింజపింజ గ్రుచ్చుకొను నట్లుగాను సాల్వుఁడు ప్రయోగింపఁగా యాదవ సేనలును చలించియు వెనుకకు తిరిగియు అపజయమునొందియు వెనుకతీయక వడిగలిగి పోరాడెను అని తా.

౮౮౮.—క॥ అయ్యెడ మానము వదలక । డయ్యక మగపాడితో దృ ✽ ఢంబుగఁ బోరన్
దయ్యము మెఱుంగును నెక్కటి । కయ్యం బపుడయ్యెఁ బేరు ✽ గల యోధులకున్.

టీ॥ అయ్యెడన్ = ఆసమయమునందు. మానము = గౌరవబుద్ధిని. వదలక = మానక. డయ్యక = అలయక. మగపాడితోన్ = పురుషధర్మముతో. దృఢంబుగన్ = చలనము లేకుండ. పోరన్ = పోరాడఁగా. దయ్యము మెఱుంగును = ఆయద్భుతము దైవమే యెఱుఁగును. అపుడు = ఆసమయమునందు. పేరుగల యోధులకున్ = ప్రసిద్ధులయిన యుద్ధశూరులకు. ఎక్కటికయ్యంబు = ఒంటరిజగడము. అయ్యెన్ = అయెను.

తా॥ ఆసమయమునందు యాదవసేనలు మానముమీఁద దృష్టినిలిపి కొంచెమయిన విసుగుకొనక పౌరుషముతో పోరాడఁగా ఆపోరాటము యొక్క రీతి దైవమునకే తెలియ వలసినదిగా నుండెను ఆట్టి స్థితిలో ప్రసిద్ధులైనయోధులకెల్ల ఒంటిపోరాటమును సంభవించెనని తాత్పర్యము.

౮౮౯.—క॥ మునుప్రద్యుమ్న కుమారుని । ఘననిశితా స్త్రములచేతఁ ✽ గడునొచ్చినసా
ల్వుని మంత్రి ద్యుమనాముఁడు । సునిశితగదఁ జేనమర్చి ✽ సుమహితశక్తిన్.

టీ॥ మును = మునుపు. ప్రద్యు...చేతన్ — ప్రద్యుమ్నకుమారుని = ప్రద్యుమ్నునియొక్క. ఘన = గొప్పలైన. నిశిత = వాఁడులైన. అస్త్రములచేతన్ = మంత్రప్రయోగముగలబాణములచేత. కడున్ = మిక్కిలి. నొచ్చినసాల్వునిమంత్రి = బాధనొందిన సాల్వుని మంత్రియైన. ద్యుమనాముఁడు, ద్యుమఁడు అనుపేరుగలవాఁడు. సునిశితగద = మంచివాఁడిగలగదయును. చేనమర్చి = చేతఁబూని. సుమహితశక్తిన్ = మంచిగొప్పను వహించిన సామర్థ్యముతో.

తా॥ మునుపు ప్రద్యుమ్నుని బాణపరంపరలచేత నొచ్చినవాఁడైన ద్యుమఁడను పేరుగల సాల్వునిమంత్రి మిక్కిలివాఁడియైన గదనుచేత పట్టినవాఁడై అధికసామర్థ్యముతోననితాత్పర్యము.

౮౯౦.—చ॥ వెరవును లావుఁ జేవయును ✽ వీరము బీరము గల్గి డాసియా
సరసిజ నాభనందను వి ✽ శాల భుజాంతరమున్ బగిల్చినన్
విరవిర వోయి మేన నిడు ✽ వెండ్రుక వెట్టఁగఁ జేతి సాధనో
త్కరములు దేరిపైవదలిఁ ✽ గన్నులు మూయుచుమూర్ఛనొందినన్.

టీ॥ వెరవును = ఉపాయమును. లావును = బలమును. చేవయును = స్థిరాంశమును—స్థిరత్వముగానిలుచుటయు. వీరమును = శూరత్వమును. బీరమును = పరాక్రమమును. కల్గి = కలవాఁడై. డాసి = కదిసి. ఆసరసిజనాభనందను విశాలభుజాంతరమున్ = ఆప్రద్యుమ్నునిదైన వెడలుపాటి ఱొమ్మును. పగిల్చినన్ = పగులఁగఁగొట్టఁగా. విరవిరవోయి = విగ్రహము నొంది. మేనన్ = దేహమునందు. నిడువెండ్రుకవెట్టఁగన్ = గగుర్పొడువఁగా. చేతిసాధనోత్కరములు = చేతనున్న ఆయుధములసమూదాయములును. తేరిపైవదలి = రథముమీఁదజాఱవిడిచి. కన్నులుమూయుచున్ = కన్నులుమూసికొనుచును. మూర్ఛనొందినన్ = మూర్ఛపోఁగా.

తా॥ ఉపాయమును బలమును చలింపమియును శూరత్వమును పరాక్రమమును గలవాఁడై ద్యుమఁడు అనువాఁడు ప్రద్యుమ్నుని ఱొమ్ముపగులఁగొట్టఁగా అతఁడు దిగ్భ్రమనొంది దేహమునందు గగుర్పాటు కలుగుటయు చేతనున్న ఆయుధములనెల్ల రథముమీఁద జాఱవిడిచి కన్నులు తేలవేయుచు రథముమీఁదఁబడి మూర్ఛపోఁగా ననితా.

౮౯౧.—ఆ॥ సమరధర్మవేది ✽ సమధిక నయవాది । దారుకుని సుతుండు ✽ ధైర్య యుతుఁడు
రథము దోలుకొనుచు ✽ రణభూమి వెడలి పే । చని యెమూర్ఛదేఱె ✽ శంబరారి.

టీ॥ సమరధర్మవేది = యుద్ధధర్మము తెలిసినవాఁడు. సమధికనయవాది = మిక్కిలిశ్లాఘ్యమైననీతిని చెప్పునట్టివాఁడు. దారుకుని సుతుండు = కృష్ణుని సారథియైన దారుకుని కొడుకు. ధైర్యయుతుఁడు = ధైర్యముతోఁ గూడుకొన్నవాఁడు. (రథముదోలుకొనుచును) రణభూమి = యుద్ధభూమినుండి. వెడలి = బయలుదేఱి. పేచనియెన్ = శీఘ్రము గాపోయెను. మూర్ఛదేఱె = అంతటమూర్ఛతెలిసినవాఁడై. శంబరారి = ప్రద్యుమ్నుఁడు.

తా॥ యుద్ధధర్మము తెలిసినవాఁడును, మేలైన న్యాయము చెప్పునట్టి వాఁడును, ధైర్యము గలవాఁడును నైన ప్రద్యుమ్నుని సారథి దారుకుని కొడుకు ఆరథమును తోలుకొని యుద్ధభూమినుండి తొలఁగి పోయెను అంతలో ప్రద్యుమ్నుఁడు మూర్ఛనుండి తేఱుకొన్న వాఁడై యని తా.

[illegible] — ఉ॥ సారథిఁ జూచి యిట్లనియె * శాత్రవవీరులు సూచినవ్వఁగాఁ
దేరు రణక్షితిన్ వెడలఁ * దెచ్చితి దెచ్చితి దుర్యశంబు పం
కేరుహనాభుఁడున్ హలియుఁ * గేలిగొనన్ యదువంశసంభవుల్
వీరముతప్పి యిప్పగిదిఁ * బెల్కుతి పోవుదురే రణంబునన్.

టీ॥ సారథిన్ = తనరథముతోలువానిని. (చూచి యిట్లనియెను) శాత్రవవీరులు = వీరులైనపగవారు. (చూచి) నవ్వఁగాన్ = పరిహాసము చేయునట్లుగా. తేరు = రథమును. రణక్షితిన్ = యుద్ధభూమినుండి. వెడలఁదెచ్చితి = బయటకుతీసికొని వచ్చితివి. తెచ్చితిదుర్యశంబు = అపకీర్తిని తెచ్చితివి. పంకేరుహనాభుఁడున్ = కృష్ణుఁడును. హలియున్ = బలరాముఁడును. గేలిగొనన్ = ఎగతాళిచేయునట్లుగా. యదువంశసంభవులు = యాదవవంశము నందుఁ బుట్టినవారు. ఇప్పగిదిన్ = ఈవిధముగా. వీరముతప్పి = పరాక్రమహీనులై. రణంబునన్ = యుద్ధమునందు. పెల్కుతి = నిశ్చేష్టులయి. పోవుదురే = పోదురా.

తా॥ ప్రద్యుమ్నుఁడు తన సారథినిఁ జూచి శత్రువులు పరిహాసము చేయునట్లుగా రథమును యుద్ధభూమినుండి యేల తొలఁగఁ దెచ్చితివి ఇందువల్ల అపకీర్తి వచ్చెనే ఎప్పుడైనను కృష్ణుఁడు బలరాముఁడు ఎగతాళి చేయునట్లుగా యాదవవంశమునందుఁ బుట్టినవారెవరైనను ఈవిధముగా పరాక్రమము లేనివారై యుద్ధభూమినుండి నిశ్చేష్టులై యిట్లు తొలఁగిపోయియుందురా యని యడిగెనని తాత్పర్యము.

వ॥ అనిన నతం డతని కిట్లనియె.

[illegible] — క॥ రథి రిపుచే నొచ్చిన సా । రథియును సారథియు నొవ్వ * రథియును గావన్
బృథుసమరధర్మ మిఁక న । వ్యథచిత్తుఁడ వగుచుఁ గడఁగు * వైరుల గెలువన్.

టీ॥ రథి = రథికుఁడు. రిపుచేన్ = పగవానిచేత. నొచ్చినన్ = నొప్పిని పొందినపక్షమున. (సారథియును) సారథియు నొవ్వన్ = సారథి నొచ్చినపక్షమున. రథియున్ = రథికుఁడును. కావన్ = కాపాడుట. పృథుసమరధర్మము = గొప్పయుద్ధధర్మము. ఇఁకన్ = ఇఁకను, అవ్యథచిత్తుఁడవు = నిర్వికారమయినమనసుగలవాఁడవు. (అగుచును) వైరులన్ = శత్రువులను. గెలువన్ = జయించుటకు. కడఁగుము = యత్నింపుము.

తా॥ రథికుఁడు నొచ్చినప్పుడు సారథియు సారథి నొచ్చినప్పుడు రథికుఁడును పరస్పరము కాపాడుకొనుట యుద్ధధర్మములలో ముఖ్యధర్మము గనుక నేను ఇట్లు చేసితిని ఇఁకను నిర్వికారమయిన మనసుతో నీవు శత్రువులను జయింప యత్నింపుము అని చెప్పెనని తాత్పర్యము.

[illegible] — ఉ॥ సంచిత భూరి బాహుబల * శౌర్యుఁడు సారథి మాటకాత్మ మో
దించి యుదాత్తకాండరుచి * దీపిత చాపముఁ దాల్చి మౌర్వి సా
రించి గుణధ్వనిన్ మహద * రిప్రకరంబుల భీతి ముంచి తో
లించె రథంబు మేదిని చ * లింపఁగ నాద్యుముమీఁద నేర్పునన్.

టీ॥ సంచిత...శౌర్యుఁడు — సంచిత = కూర్పఁబడిన, భూరి = అధికమయిన, బాహుబల = భుజబలముతోడి. శౌర్యుఁడు = శూరత్వము గలవాఁడు. సారథిమాటకున్ = తనసారథి చెప్పినమాటకు. ఆత్మన్ = మనసునందు. మోదించి = సంతోషించి. ఉదాత్త...శరాసనమున్ — ఉదాత్త = ఘనములైన, కాండ = బాణముల యొక్క. రుచి = కాంతిచేత. దీపిత = వెలిఁగింపఁబడిన, చాపమున్ = వింటిని. తాల్చి = ధరించి. మౌర్వి = అల్లెత్రాటిని. సారించి = తీటి. గుణధ్వనిన్ = అల్లెత్రాటి చప్పుడుచేత. మహదరిప్రకరంబులన్ = గొప్పశత్రువులసమూహములను. భీతిన్ = భయమునందు. ముంచి = మునుఁగునట్లు చేసి — మిక్కిలి భయమునొందించి యనుట. ఆద్యుముమీఁదన్ = ఆద్యుమునిమీఁదికి. నేర్పునన్ = నేర్పరితనముతో. మేదిని = భూమి. చలింపఁగన్ = అదరఁగా, రథంబు తోలించెను = తేరును తోలించెను.

తా॥ అధికముగా కూర్పఁబడిన బలముగలవాఁడైన ప్రద్యుమ్నుఁడు తనసారథి చెప్పినమాటవిని సంతోషించి అధికములైన బాణసమూహముల మెఱుఁగులచేత వెలుఁగఁ జేయఁబడిన విల్లుగలవాఁడు అగుచును అల్లెత్రాటిని ఎక్కుపెట్టి తీటి మ్రోఁగించి ఆమ్రోఁతచేత శత్రువులందఱు మిగులభయపడునట్లు చేసి తన్ను మూర్ఛపోఁగొట్టిన ద్యుమునిమీఁదికి రథమును వడిగాఁ దోలించెనని తాత్పర్యము.

[illegible] — చ॥ అరితను వష్ట బాణముల * నాగ్రహవృత్తిఁ బగిల్చి నాల్గిటన్
దురగముల న్వధించి యొక * తూపున సారథిఁ ద్రుంచి రెంటని
ష్ఠురతర కేతు చాపములు * చూర్ణము చేసి యొకమ్మున న్భయం
కరముగఁ ద్రుంచె నాద్యుముని * కంఠ మకుంఠిత విక్రమోద్ధతిన్.

టీ॥ ఆగ్రహవృత్తిన్ = కోపవ్యాపారముతో. అరితనువు = పగవానిదేహమును అష్టబాణములన్ = ఎనిమిదిబాణములచేత. పగిల్చి = చీలఁగొట్టి, నాల్గిటన్ = నాలుగు బాణములచేత. తురగములన్ = గుఱ్ఱములను. వధించి = చంపి. ఒకతూపునన్ = ఒకబాణముచేత, సారథిన్ = సారథిని. త్రుంచి = నఱికిచంపి. రెంటన్ = రెండుబాణములచేత. నిష్ఠు... — నిష్ఠురతర = మిక్కిలి పరుషములైన. కేతు = ధ్వజమును. చాపములు = విల్లును. చూర్ణముచేసి = పొడిచేసి. అకుంఠిత = మొక్కపోని. విక్రమోద్ధతిన్ = పరాక్రమాతిశయముచేత. ఒకమ్మునన్ = ఒకబాణముచేత. భయంకరముగన్ = భయము కలుఁగఁజేయునట్లుగా. ఆద్యుముని కంఠమున్ = ఆద్యుముని యొక్క మెడను. త్రుంచెన్ = నఱికెను.

తా॥ ప్రద్యుమ్నుఁడు మిక్కిలి కోపించినవాఁడై ఆద్యుముని దేహమును ఎనిమిదిబాణములచేత చీలఁగొట్టి నాలుగుబాణములచేత వానిరథపు

[illegible] చేత సారథిని జంపి రెండు బాణముల చేతధ్వజమును విఱిచి నఱికివేసి అంతటపరాక్రమమును మిక్కిలి పెంచి ఒక్క బాణముచేత వానితల నఱికినవాఁడై వానిసేనలకు భయమును పుట్టించెనని తాత్పర్యము.

[illegible] — మ॥ కని సాంబ ప్రముఖాది యోధవరులు * త్కంఠాత్ములై మీన కే
తను నగ్గించి సువర్ణపుంఖ నిశితా * స్త్ర శ్రేణి సంధించి సా
ల్వుని సైన్యావలి మస్తము ల్వెరవుతా * వుల్వేర్పడ నొక్కయె
త్తున వేత్రుంచిరి తాటిపండ్లుధర దో * ర్త్రోరాల్చుచందంబునన్.

టీ॥ కని=ఆప్రద్యుమ్నుఁడు చేసినపని చూచి. సాంబప్రముఖాదియోధవరులు=సాంబుఁడు మొదలగు ద్యుమనిశత్రువులైన యోధశ్రేష్ఠులు. ఉత్కంఠాత్ములై=తహతహతోడి మనసులు గలవారై. మీనకేతనున్=ప్రద్యుమ్నుని. అగ్గించి=పొగడి. సువర్ణపుంఖనిశితాస్త్రశ్రేణిన్=బంగారు పింజలుగలవాఁడి బాణములపఙ్క్తిని. సంధించి=వింటియందుఁగూర్చి. సాల్వుని సైన్యావలిన్=సాల్వుని సేనలబారును. మస్తములు=తలలును. వెరవు తావులు=అనువైనచోట్లును. వేర్పడన్=వేఱగునట్లుగా. ఒక్కయెత్తునన్=ఒక్కతీరున (తాటిపండ్లు) ధరన్=భూమియందు. త్రోత్రోన్=వెంటవెంట. రాల్చుచందంబునన్=రాలఁగొట్టువిధమున. (వేత్రుంచిరి)

తా॥ అట్లు ప్రద్యుమ్నుఁడు పరాక్రమించుటను జూచి సాల్వునికి శత్రువులైన సాంబుఁడు మొదలగు యాదవకుమారులు మిక్కిలి తహతహతోడి మనసులతో ప్రద్యుమ్నుని శ్లాఘించుచు శత్రువుల పైఁబడి తలలు మొండెములు వేఱుపడునట్లుగా తాటిపండ్లురాల్చినట్లు ఒక్కసారిగా తలలునఱికి నేలరాలునట్లు చేసిరని తాత్పర్యము.

౮౯౭. — స్రగ్ధర॥ కూలున్ గుఱ్ఱంబు లేనుం * గులు ధరఁదొరఁగున్ * గుప్పలై నుగ్గు నూచై
వ్రాలున్ దేరుల్ హతంబై * వడిఁబడు సుభట * వ్రాతముల్ శోణితంబుల్
గ్రోలున్ మాంసంబు నంజున్ * గొఱుకు నెముకలన్ * గుంపులై సోలుచున్ బే
తాళ క్రవ్యాద భూతో * త్కరములు జతలై * తాళము ల్దట్టి యాడున్.

టీ॥ గుఱ్ఱంబులు=గుఱ్ఱములు. కూలున్=పడును. ఏనుంగులు=ఏనుఁగులు. ధరన్=భూమియందు. కుప్పలై=ప్రోగులై. తొరఁగున్=పడును. తేరులు=రథములు. నుగ్గునూచై=మిక్కిలిపొడియై. వ్రాలున్=పడును. సుభటవ్రాతములు=మంచిబంటులసమూహములు. హతంబై=చంపఁబడినదై. వడిన్ = వేగముగా. (పడును) బేతాళ... ములు—బేతాళ=బేతాళములు. క్రవ్యాద=పిశాచములు. భూత=భూతములు. ఉత్కరములు=వీనియొక్కసమూహములు. (గుంపులై) సోలుచున్=సొక్కిపడుచు. శోణితంబులు = నెత్తురులను. గ్రోలున్=త్రాగును. మాంసంబు=మాంసమును. నంజున్=నంజుకొనును. ఎముకలన్=ఎముకలను. (కొఱుకును) జతలై=మేళముగాఁగూడినవై. తాళముల్దట్టి=తాళము వేసి. ఆడున్=నాట్యముచేయును.

తా॥ ఆట్టియాయుద్ధరంగమునందు గుఱ్ఱములు నేలఁగూలుచుండెను, ఏనుఁగులు ప్రోగులు ప్రోగులుగాఁబడుచుండెను, రథములు పొడిపొడియై పోవుచుండెను, కాలుబంట్లు అవయవములు తెగఁగా నేలఁగూలసాగిరి, బేతాళభూత పిశాచములు గుంపులు గుంపులుగాఁ గూడుకొని నెత్తురు త్రాగుచు మాంసము నంజుకొనుచు ఎముకలను కొఱుకుచు ఒళ్లు తెలియక సొలిపడుచు మేళములు మేళములుగాఁగూడి తాళములు [illegible] నాట్యములు చేయసాగెనని తాత్పర్యము. వ॥ మఱియు నొక్కక్కయెడ.

౮౯౮. — సీ॥ ఖండిత శుండాల * గండము ల్నక్రముల్ - భూరి తుండంబులు * భుజగసమితి
పదతలంబులు గచ్ఛ * పంబులు దంతముల్ - శుక్తులు గుంభ ని * ర్ముక్త మౌక్తి
కములు రత్నములు వా * లములు జలూకముల్ - మెడలు భేకంబులు * మెదడు రొంపి
ప్రేవులు పవడంపు * దీవలు నరములు - నాఁచు మజ్జంబు ఫే * నంబు లస్థి
ఆ॥ సైకతములు రక్త * చయము తోయంబులు। వారలు నెడల నొరలు * మొఱలు ఘనత
రంగ రవముగా మ * తంగజా యోధన। స్థలము జలధిఁ బోల్పఁ * దగె నరేంద్ర.

టీ॥ నరేంద్ర=రాజా. ఖండితశుండాలగండములు=నఱకఁబడిన యేనుఁగుల చెక్కిళ్లు. నక్రములు=మొసళ్లును. భూరితుండంబులు. పెద్ద తొండములు. భుజగసమితి=పాములసమూహములును. పదతలంబులు=కాలియడుగులు. కచ్ఛపంబులు=తాఁబేళ్లును. దంతములు = పండ్లు. శుక్తులు=ముత్తెపుఁజిప్పలును. కుంభనిర్ముక్తమౌక్తికములు = ఏనుఁగుల కుంభస్థలములనుండి రాలినముత్యములు. రత్నములు=మణులును. వాలములు=తోఁకలు. జలూకములు=జలగలును. (మెడలు) భేకంబులు=కప్పలును. మెదడు = తలలోనిమాంసవిశేషము. రొంపి=బురదయును. ప్రేవులు=ప్రేగులు. పవడంపుదీవలు=పగడపుదీఁగెలు. నరములు=నాడులు. నాఁచు=తీఁగపాఁచియు. మజ్జంబు=క్రొవ్వు. ఫేనంబులు=నురుఁగులును. అస్థి = ఎముకలు. సైకతములు=ఇసుక దిబ్బలును. రక్తచయము=నెత్తురుసముదాయము. తోయంబులు=నీళ్లు. వారలు నెడలన్=పొర్లునట్టి సమయములందు. ఒఱలు మొఱలు=కూయునట్టి దుఃఖధ్వనులు ఘనతరంగరవము=గొప్పయలలచప్పుడును. కాన్=కాఁగా. మతంగజాయోధనస్థలము=ఏనుఁగుల పోరాటపుఁజోటు. జలధిన్=సముద్రమును. పోల్పఁదగెన్=సరిచేయఁదగియుండెను.

తా. ఓ రాజా! నఱకఁబడిన యేనుఁగుల చెక్కిళ్లు మొసళ్లును, పెద్ద పెద్ద తొండములు పాములును, అడుగుకాళ్లు తాఁబేళ్లును, వానిదంతములు ముత్తెపుఁజిప్పలును, వానికుంభములనుండి రాలినముత్యములు రత్నములును, తోఁకలు జలగలును మెడలు కప్పలును, తలలోని మాంసవిశేషము బురద

యును, ప్రేఁగులుపడవ్రుచ్చీగలును, నరములుతీఁగపాఁచియు, క్రొవ్వు నురుఁగును, ఎముకలు ఇసుకదిబ్బలును, నెత్తురునీళ్లును, పొర్లుచుకూయ నట్టి వానిధ్వనులు అలలచప్పుళ్లును, కాఁగా ఏనుఁగులపోరాటపుచోటు ఒకసముద్రమునుపోల్పఁదగియుండెనని తాత్పర్యము.

వ॥ ఇవ్విధంబున యదుసాల్వబలంబులు చలంబునం బరస్పర జయకాంక్షలఁ దలపడి పోరు పూర్వపశ్చిమ సముద్రంబులసరణి నిరువది యేడుదినంబు లతి ఘోరంబుగాఁ బోరునెడ నింద్రప్రస్థంబుననుండి ద్వారకా నగరంబునకు నగధరుండు చనుదేర ముందరం గానవచ్చు దుర్నిమిత్తంబులు గైకొని కృష్ణుండు దారకునిం జూచి యిట్లనియె.

టీ॥ ఇవ్విధంబునన్=ఈరీతిగా. యదుసాల్వబలంబులు=యాదవులయు సాల్వునివియు నైనసేనలు. చలంబునన్ = పట్టుదలతో. పరస్పరజయకాంక్షలన్=ఒండొరులగెలువఁ గోరికలచేత. తలపడి=మార్కొని. పోరు పూర్వపశ్చిమ సముద్రంబులసరణిన్=పోరాడు నట్టితూర్పుపడమరసముద్రములవలె. (ఇరువదియేడుదినంబులు) అతి ఘోరంబుగాన్=మిక్కిలిభయంకరముగా. పోరునెడన్=పోరాడు నప్పుడు. నగధరుండు=కృష్ణుఁడు. (ఇంద్రప్రస్థంబుననుండి ద్వారకా నగరంబునకు) చనుదేరన్=రాఁగా. (ముందరను) కానవచ్చు దుర్నిమిత్తంబులు=కనఁబడుచున్న అవశకునములను. కైకొని=అంగీకరించి-చూచి (కృష్ణుండు దారకునిం జూచి ఇట్లనియెను)

తా॥ ఈప్రకారము యాదవ సేనలును సాల్వ సేనలును పట్టుదలతో ఎదిరించి పోరాడు నప్పుడు తూర్పుసముద్రమును పడమటి సముద్రమును ఎదిరించిపోరాడునట్లు ఇరువదియేడుదినములు పోరాటము జరగెను. ఆసమయమునందు కృష్ణుఁడు ఇంద్రప్రస్థమునుండి బయలుదేఱి ద్వారకా పట్టణమునకు వచ్చుచు దారిలో కొన్ని అవశకునములనుజూచి తనసారథియైన దారకునితో ఇట్లు పలికెనని తాత్పర్యము.

౨౦౦.—శా॥ కంటే దారక దుర్నిమిత్తము లనే ✱ కంబుల్ మహాభీలముల్
మింటన్ మేదినిఁ దోఁచు చున్నయవి నె ✱ మ్మిం గాండవప్రస్థ మే
నుంటన్ జైద్య హిత క్షితీశ్వరులు మా ✱ యోపాయులై మత్పురిన్
గెంటింపన్ జనుదేరఁ బోలుదురు పో ✱ నీ తేరు వేగంబునన్.

టీ॥ దారక=ఓరి దారకుఁడా. కంటే=చూచితివా. మహాభీలములు=మిక్కిలిభయమును పుట్టించునవియైన. దుర్నిమిత్తములు = చెడ్డశకునములు. అనేకంబులు=పెక్కులు. మింటన్ = ఆకాశమునందును. మేదినిన్=భూమియందును. తోఁచుచున్నయవి = కానఁబడుచున్నవి. నెమ్మిన్=ప్రీతిచేత. కాండవప్రస్థము=ఇంద్రప్రస్థమునందు. ఏనుంటన్=నేనుండుటచేత. చైద్యహితక్షితీశ్వరులు = శిశుపాలునికి ఆప్తులైన రాజులు. మాయోపాయులై=కపటోపాయము గలవారై. మత్పురిన్=నాపట్టణమును—ద్వారకను. గెంటింపన్ = ఛేదించుటకు. చనుదేరఁ బోలుదురు = వచ్చినారు కాఁబోలును. (ఇఁకను) వేగంబుగన్ = శీఘ్రముగా. తేరు = రథమును. పోనీ=పోనిమ్ము.

తా॥ ఓరిదారకా! చూచితివా మిక్కిలి భయమును పుట్టించునట్టి చెడ్డశకునములు భూమియందును ఆకాశమునందును అనేకములు తోఁచుచున్నవి నేను పాండవులయందలి ప్రీతిచేత ఇంద్రప్రస్థములో నున్నందున నేను పట్టణములో లేనివృత్తాంతము తెలిసి శిశుపాలునికి ఆప్తులయిన దుష్టరాజులు ఎవరో కపటోపాయములచేత ద్వారకా పట్టణమును ఆక్రమింపవచ్చినారని తోఁచుచున్నది నీవు శీఘ్రముగా రథమును తోలుము ద్వారకకు పోవలయునని తాత్పర్యము.

వ॥ అనియతిత్వరితగతిం జనుదెంచి తత్పురంబు డగ్గఱి మహా బలపరాక్రమంబులం బ్రతిపక్ష బలంబులతోడం దలపడిపోరుయదుబలంబులును నభోవీధి నభేద్యమాయావిడంబనంబునఁ బ్రతివీరు లెంత కాలంబున కేయుపాయంబున సాధింపరాని సౌభక విమానంబునం దున్నసాల్వునిం గని తద్విమానంబు డాయం దన తేరు దోలసారథిని నియమించి కదియం జనుమురాంతకుని వీక్షించి యదుబలప్రకరంబులు పరమానందంబునం బొందిరి మృతప్రాయంబై యున్న సైన్యంబుం గనుంగొని సౌభకపతి విక్రమక్రియాకలాపుండగుచు నురువడించి.

టీ॥ (అని) అతిత్వరితగతిన్ = మిక్కిలి వడిగల నడతో. చనుదెంచి=వచ్చి. తత్పురంబున్=ఆపట్టణమును. డగ్గఱి = సమీపించి. మహాబలపరాక్రమంబులన్ = అధికమయిన బలముచేతను పరాక్రమముచేతను. ప్రతిపక్షబలంబులతోడన్ = శత్రుసేనలతో. తలఁపడి = మార్కొని. పోరుయదుబలంబును = యుద్ధము చేయునట్టి యాదవసేనను. నభోవీధిన్ = ఆకాశమార్గమునందు. అభేద్యమాయావిడంబనంబునన్=భేదింపరాని మాయయొక్క వ్యాపనముచేత. ప్రతివీరులు = శత్రుభటులు. ఎంతకాలంబునకున్ = ఎంతసేపటికిని. యేయుపాయంబునన్ = ఏవిధమయిన యుక్తిచేతను. (సాధింపరానిసౌభకవిమానంబునందు) ఉన్నసాల్వునిన్ = ఉన్నట్టి. సాల్వరాజును. కని=చూచి. తద్విమానంబున్ = ఆవిమానమును. డాయన్ = సమీపింప. తనతేరు = తనరథమును. తోలన్=తోలునట్లు. సారథినినియమించి=సారథినిగూర్చియుత్తరువుచేసి. కదియం జనుమురాంతకునిన్ = మిక్కిలిచేరవచ్చునట్టి కృష్ణుని. వీక్షించి = చూచి. యదుబలప్రకరంబులు = యదువులబలసమూహములు. పరమానందంబునం బొందిరి = అత్యంతసంతోషమును పొందిరి. మృతప్రాయంబై = చచ్చినదానివంటిదై. ఉన్నసైన్యంబున్ = ఉన్నట్టి దండును. కనుంగొని=చూచి. సౌభకపతి = సాల్వుఁడు. విక్రమక్రియాకలాపుండు = పరాక్రమ వ్యాపార సముదాయములు గలవాఁడు. (అగుచును) ఉరవడించి=ఉత్సాహమును పొంది.

తా॥ అని దారకునితో చెప్పి మిక్కిలి వడిగావచ్చి పగవారి దండుతో నెదిరించి పోరాడునట్టి తమసేనను ఆకాశమార్గమునందు

...తిరపరాని మాయలను వ్యాపింపఁజేయుచు ఎంతసేపటికిని ఏయుపాయము చేతను గెలువరాక సౌభకవిమానము పైనున్న సాల్వరాజును చూచినవాఁడై తనరథమును ఆసౌభకవిమానము దగ్గఱకుఁ దోలింపఁగా ఆశ్రీకృష్ణమూర్తిని యాదవులందఱు జూచి సంతోషించిరి వారిచేత కొంచెము తక్కువగా నాశము నొందినదైన తన దండును జూచి సాల్వుఁడు పరాక్రమముతో పురికొన్న వాఁడై యని తాత్పర్యము.

శ్రీకృష్ణమూర్తి.





సాల్వుఁడు.

(*) శ్రీకృష్ణమూర్తి సాల్వునిం జంపుట. (*)

౯౦౨.—చ॥ మిణుఁగురులు వెల్లెడం జెదర * మింటను మంటలు పర్వ ఘంటికా
ఘణఘణ భూరినిస్వన ని * కాయమునన్ హరిదంత రాళముల్
వణఁక మహోగ్ర శక్తిఁ గొని * వారక దారకు మీఁద వైవ దా
రుణగతి నింగి నిండు నిజ * రోచులతోఁ బడు చుక్క కైవడిన్.

టీ॥ మిణుఁగురులు = నిప్పురవలు. ఎల్లెడన్ = అంతటను. చెదరన్ = రాలఁగా. మింటను = అకాశమునందు. (మంటలు) పర్వన్ = వ్యాపింపఁగా. ఘంటికా...మునన్ — ఘంటికా = గంటలయొక్క. ఘణఘణ = గణగణయనెడు. భూరి = అధికమైన. నిస్వన = ధ్వనులయొక్క. నికాయమునన్ = సముదాయముచేత. హరిదంతరాళములు = దిక్కుల నడిమిచోట్లు. వణఁకన్ = వణఁకఁగా. మహోగ్రశక్తిన్ = మిగుల భయంకరమయిన శక్తియను నాయుధమును. కొని = ఎత్తుకొని. వారక = వెనుదీయక. (దారకు మీఁదను) వైవన్ = వేయఁగా. దారుణగతిన్ = భయంకర మయిన విధముతో నింగిన్ = ఆకాశమునందు. నిండు = నిండుకొనునట్టి. నిజరోచులతోన్ = తనకాంతులతో. (పడు) చుక్క కైవడిన్ = నక్షత్రము విధమున.

తా॥ నిప్పురవలు ఎల్లెడలను రాలుచుండఁగా, మంటలు ఆకాశమునందంతటను నిండుకొనఁగా, గంటలచప్పళ్లచేత దిక్కులనడిమిచోట్లు వడఁకఁగా, మిక్కిలిభయంకరమయిన శక్తియను నాయుధమును దారకునిపై వేయఁగా అది ఆకాశమునందు స్వకీయకాంతులు నిండుకొనఁగా భూమిపైఁబడునట్టి నక్షత్రము వలెనే అని తాత్పర్యము.

౯౦౩.—క॥ వడిఁ జనుదేరఁగఁ గని య । ప్పుడ నగధరుఁడతుల లీల * వోలెన్ దానిన్.
బొడిపొడియై ధరఁ దొరఁగఁగ । నడుమన వెసఁ ద్రుంచె నొక్క * నారాచమునన్.

టీ॥ వడిన్ = వేగముతో. చనుదేరఁగన్ = రాఁగా. కని = చూచి. అప్పుడ = అప్పుడే. నగధరుఁడు = కృష్ణుఁడు. అతులలీలవోలెన్ = ఈడులేని వేడుకవలెనే. దానిన్ = ఆశక్తిని. (పొడిపొడియై) ధరన్ = భూమియందు. తొరఁగఁగన్ = రాలునట్టుగా. నడుమన = మధ్యముననే. ఒక్క నారాచమునన్ = ఒకనారసముచేత. వెసన్ = శీఘ్రముగా. త్రుంచెన్ = నఱికెను.

తా॥ వేగముతో శక్తిరాఁగాఁజూచి అప్పుడే కృష్ణుఁడు దానిని నడుమనే పొడిపొడియై రాలునట్లు ఒకబాణముతో నఱికెనని తా.

౯౦౪.—చ॥ గురుభుజుఁడంతఁ బోవక య * కుంఠిత శూరత శత్రు సైన్యముల్
చెరలఁగ నుగ్రతన్ గొఱవి * ద్రిప్పిన కైవడి మింట దిర్దిరన్
దిరుగుచు దుర్నిరీక్ష్యమగు * దీపిత సౌభకు సాల్వుఁ జండ భా
స్కర కిరణాభ షోడశ ని * శాత శరంబులఁ గాఁడ నేసినన్.

టీ॥ [illegible]—బలగౌరవముగలభుజబలముగలవాఁడైన [illegible]మూర్తి. అంతఁబోక=అంతటితో ఊరకయుండఁబోక. అకుంఠితశూరతన్=మొక్కపోని శూరత్వముతో. శత్రుసైన్యములు=పగవారిసేనలు. తలఁగన్=చలింపఁగా. ఉగ్రతన్ = భయంకరత్వముతో. కొఱవిద్రిప్పిన కైవడిన్ = కొఱవికట్టెను త్రిప్పినట్టుగా. మింటన్=ఆకాశమునందు. దిర్దిరన్=దిరదిరయని. (తిరుగుచును) దుర్నిరీక్ష్యము=చూడశక్యముగానిది. అగుదీపిత సౌభకున్=అగు నట్టివెలుఁగుచున్న సౌభకవిమానముగలవానిని. (సాల్వుని) చండ... బులన్—చండ=వేండ్రమైన. భాస్కరకిరణ=సూర్యకిరణములతోడ. అభ—సరిపోలిన. షోడశ=పదియాఱు. నిశాతశరంబులన్=వాఁడి బాణములను. కాఁడన్=నాటునట్లు. ఏసినన్=ప్రయోగింపఁగా.

తా॥ శ్రీకృష్ణమూర్తి ఆసాల్వుఁడు ప్రయోగించిన శక్తిని నఱకుటతో ఊరకయుండక మొక్కపోని శౌర్యముతో సాల్వునిదండు బెదరిపరుగెత్తునట్టుగా కొఱవినిత్రిప్పునట్లు ఆకాశమునందుభయంకరత్వముతో గిరగిరదిరుగుచు-చూపులు మిఱుమిట్లుగొల్పుచు వెలుఁగుచున్న సౌభకవిమానమునందున్న సాల్వునిదేహమునందునాటుకొనునట్టుగా సూర్యకిరణములవలె వేండ్రమును జూపునట్టి వాఁడులైన బాణములను ప్రయోగింపఁగా నని తాత్పర్యము.

౯౦౫.—చ॥ కడువడి నల్గి వాఁడు నిజ ❋ కార్ముకమున్ జలదస్వనంబు కై
వడి మొరయించుచున్ వెడఁద ❋ వాతిశరంబులఁ బద్మలోచనున్
నెడమ భుజంబుగాఁడ వడి ❋ నేసినఁ దెంపతి చేతి శార్ఙ్గమున్
విడిచె రథంబుపై గగన ❋ వీధి సుర ల్భయమంది చూడఁగన్.

టీ॥ వాఁడు=సాల్వుఁడు. అల్గి=కోపించి. కడున్=మిక్కిలి. వడిన్=వేగముతో. నిజ కార్ముకమున్=తనవింటిని. జలదస్వనంబు కైవడిన్=మేఘధ్వనివిధమున. మొరయించుచున్=మ్రోఁగించుచు. వెడఁదవాతిశరంబులన్=విశాలములైన వాధరలుగల బాణములను. పద్మలోచనున్=కృష్ణుని. ఎడమభుజంబుగాఁడన్ = ఎడమబుజమునందు నాఁటునట్లుగా. వడిన్=వేగముతో. ఏసినన్=ప్రయోగింపఁగా. తెంపతి=గౌరవముచెడి—పౌరుషము చెడియనుట. గగనవీథిన్ = ఆకాశమార్గమునందు. సురలు=దేవతలు. భయమంది=వెఱచి. చూడఁగన్=తన్నుఁజూడఁగా. చేతిశార్ఙ్గమున్=చేతిలోనున్నశార్ఙ్గమనుధనస్సును. రథంబుపైన్=రథముమీఁద. (విడిచెను)

తా॥ ఆసాల్వుఁడునుమిక్కిలికోపించినవాఁడై వడిగాతనవింటిని ఉఱుముఉఱిమినట్టుమ్రోఁగించి విశాలమయినముఖభాగముగలబాణములను ఎడమ భుజమునందు నాటునట్టుగా ప్రయోగించి కృష్ణుని నొప్పింపఁగా. అతఁడు తనపౌరుషము చెడునట్లు ఆకాశమునందు దేవతలు దిగులుపడి చూచుచుండఁగాచేతిలోనున్న శార్ఙ్గమనెడు ధనస్సును రథముపై జాఱవిడిచె ననితాత్పర్యము.

౯౦౬.—క॥ ఓహోయని భూతావలు । లాహాకారములు సేయ ❋ నంతటఁ దేరన్
నాహరిఁ గనుఁగొని యతఁడు । త్సాహంబునఁ బల్కెఁ బాహు ❋ శౌర్య స్ఫూర్తిన్.

టీ॥ భూతావలులు = ప్రాణుల సముదాయములు. ఆహాకారములుసేయన్=ఆహాఆహా అనిమొఱలుపెట్టఁగా. అంతటన్=అట్టిసమ్మట. తేరన్=తేరునందు. ఆహరిన్=ఆకృష్ణుని. కనుఁగొని=చూచి. అతఁడు=ఆసాల్వుఁడు. ఉత్సాహంబునన్ = ఆటోపముతోను. బాహుశౌర్య స్ఫూర్తిన్ = భుజబలముయొక్క వికాసముతోను. ఓహోయని=ఓహో ఇంతేనా అని. పల్కెన్=చెప్పెను.

తా॥ ఎల్లప్రాణులు ఆహా ఆహా అని మొఱలు పెట్టుచుండఁగా రథమునందుండెడికృష్ణునిఁజూచిసాల్వుఁడు అత్యంతమయిన ఉత్సాహమును భుజగర్వమునుగలవాఁడు అగుచు ఓహోహో ఇంతేనా నీశౌర్యము అని పరిహసించి యొకమాట చెప్పెనని తాత్పర్యము.

౯౦౭.—చ॥ నలిన దళాక్ష మత్సఖుఁడు ❋ నాఁడగు చైద్యుఁడు గోరినట్టి కో
మలి నవినీతివై తగవు ❋ మాలి వరించితి వంతఁ బోక దో
ర్బలమున ధర్మనందను స ❋ భాస్థలి నేమఱి యున్న వాని న
చ్చలమునఁ జంపితట్టి కలు ❋ షంబులు నేడు రణాంగణంబునన్.

టీ॥ నలినదళాక్ష=కృష్ణా. మత్సఖుఁడునాన్=నాస్నేహితుఁడు అనఁగా. తగు=తగిన. చైద్యుఁడు=శిశుపాలుఁడు. కోరినట్టికోమలిన్=వరించినకన్యకను. అవినీతివై = నీతితప్పినవాఁడవై. తగవుమాలి=న్యాయముతప్పి. వరించితివి=కోరితివి—పెండ్లాడితివి.. అంతఁబోక=అంతటితోపోక. దోర్బలమునన్ = భుజ బలముచేత. ధర్మనందనుసభాస్థలిన్=ధర్మరాజుయొక్కసభాప్రదేశమునందు. ఏమఱియున్నవానిన్ = పరాకుపడియున్న యాశిశుపాలుని. ఆచ్చలమునన్ = మత్సరముచేత. చంపితి=చంపితివి. అట్టికలుషంబులు=అకృత్యముల వల్లనైనపాపములు. (నేడు) రణాంగణంబునన్=యుద్ధభూమియందు.

తా॥ ఓకృష్ణా! నీవునాచెలికాఁడైన శిశుపాలుఁడుకోరినకన్యకను కోరితీసికొనిపోతివిఅంతటితో ఊరకుండకధర్మరాజుసభలోవాఁడు ఏమఱిఉండఁగాచంపితివిఆదోషములిప్పుడునిన్నువలచుచున్నవనితా

౯౦౮.—క॥ తలచెడి పాఱక బాహా । బలమొప్పఁగ నాదు దృష్టి ❋ పథమున ధృతితో
నిలిచిన నిష్ఠుర విశిఖా । ర్చులముంచి మదీయ సఖుని ❋ సూడిటు దీర్తున్.

టీ॥ తలచెడి=తలఁపుచెడి — కలవరపడి. పోటిక=పరుగెత్తి పోక. చాహాబలము=భుజబలము. ఒప్పఁగన్ = ఒప్పియుండఁగా. నాదుదృష్టిపథమునన్=నాకంటియెదుట. ధృతితోన్=ధైర్యముతో. నిలిచినన్=నీవునిలిచిన పక్షమున. నిష్ఠురవిశిఖార్చులన్=కఠినములైన బాణములనెడు మంటలచేత. మంచి = మనిఁగించి. మదీయసఖుని సూడు=నాచెలికాని పగను. ఇటు=ఈవిధముగా. తీర్తున్ = మగియింతును.

తా॥ నీవుమాత్రము కలఁతపడి పాఱిపోకుండ నాయెదుట భుజబలముచూపువాఁడవైనిలిచినపక్షమున కఠినములైననాబాణములనెడు మంటలలోనిన్నుముంచినాచెలికానిపగతీర్చుకొనెదననిపలికెననితా.

౨౦౯.—చ॥ అనిన మురాంతకుండు దర ✽ హాసము మోమునఁ దొంగలింప సా
ల్వునిఁ గని యోరి లావు లగు ✽ వుంగల పోటరి వోలెఁ బ్రేలెదే
మనినను పాటు సన్నిహిత ✽ మాట యెఱుంగవు మూఢచిత్త పొ
మ్మని గదఁ గేలఁ ద్రిప్పి యభి ✽ యాతిని శత్రుని వ్రేసె నుద్ధతిన్.

టీ॥ అనినన్=అనిసాల్వుఁడు పలుకఁగా. మురాంతకుండు = కృష్ణుఁడు. దరహాసము=చిఱునవ్వు. మోమునన్=ముఖమునందు. తొంగలింపన్=ప్రకాశింపఁగా. (సాల్వుని) కని=చూచి. ఓరి = ఓరినీచుఁడా. లావును=బలమును. లగువును=లాఘవమును.కల=కలిగిన. పోటరివోలెన్=శూరునివలె. ప్రేలెదు=వదరెదవు. ఏమనినను=నీవు ఏమిచెప్పినను. పాటు = పడుట — చావు. సన్నిహితమాట=సమీపించినదగుటను. ఎఱుంగవు=నీవు తెలిసికొన్నవాఁడవు కావు.మూఢచిత్త=తెలివిమాలినమనసుగలవాఁడా.(పొమ్మనిగదను) కేలన్=చేతితో. (త్రిప్పి) అభియాతిని=ఎదురుకొనివచ్చు వాఁడైన. శత్రునిన్=పగవానిని. ఉద్ధతిన్=నిక్కుతో. వ్రేసెన్=కొట్టెను.

తా॥ అని సాల్వుఁడు చెప్పఁగానే శ్రీకృష్ణమూర్తి చిఱునవ్వు నవ్వుచు ఓరి నీచుఁడా ! నీవు బలమును యుద్ధపునేర్పును గలవాని వలెనే నోటికివచ్చినట్టు వదరెదవుగాని నీకు చావు సమీపించినదని యెఱుఁగవు ఓరి మూఢచిత్తుఁడా! ఇంతేగదానీశూరత్వము అనిచేతి గదను గిరగిరఁద్రిప్పి యెదురుకొని వచ్చుచున్న ఆసాల్వునిఁ గొట్టెనని తాత్పర్యము. వ॥ అట్లువ్రేసిన

౨౧౦.—క॥ పెనుమూర్ఛ నొంది వేస ము। క్కున వాతను నెత్తురొల్కఁ ✽ గొంత వడికి నొ
య్యనఁ దెలిసి నిలువ రింపక । చనెవాఁడు నదృశ్యమయ్యె ✽ సౌభము దానన్.

టీ॥ వెసన్=శీఘ్రముగా. ముక్కునన్=ముక్కునందుండియు. వాతన్ = నోటియందుండియు. (నెత్తురు) ఒల్కన్ = కాఱఁగా. పెనుమూర్ఛనొంది=పెద్దమూర్ఛనుపొంది. కొంతవడికిన్ = కొంత సేపటికి. ఒయ్యనన్ = క్రమముగా. తెలిసి=తేఱుకొని. నిలువరింపక=నిలువక. వాఁడు=సాల్వుఁడు.చనెన్=పోయెను.సౌభము= సౌభకవిమానము(తానును) అదృశ్యమయ్యెన్=కానరాకపోయెను.

తా॥ ఆదెబ్బచేత వెంటనేవాఁడు ముక్కున నోటనెత్తురుకాఱుచుండఁగా గాఢమైన మూర్ఛను పొందికొంతసేపటికి మూర్ఛవలన నుండి తేఱుకొని నిలువక పాఱిపోయెను అంతటసౌభకవిమానమును కానరాకపోయెను అనితాత్పర్యము. వ॥ అయ్యవసరంబున.

౨౧౧.—తే॥ గగనమందుండి యొకఁడార్తుఁ ✽ డగుచు వచ్చి । నందనందను పాదార ✽ విందములకు
వందనముచేసి యానక ✽ దుందుభిని మ । హోగ్రుఁడై పట్టితెచ్చెసా ✽ ల్వుండుగడఁగి.

టీ॥ ఒకఁడు=ఒకసేవకుఁడు.గగనమందుండి=మింటియందుండి. ఆర్తుఁడగుచున్=దుఃఖమునొందినవాఁడగుచు. (వచ్చి) నందనందను పాదారవిందములకున్ = శ్రీకృష్ణుని పాదకమలములకు. వందనము చేసి=మ్రొక్కి. ఆనకదుందుభిని=వసుదేవుని. (సాల్వుండు)మహోగ్రుఁడై = మిక్కిలిభయంకరుఁడై. కడఁగి=పూని. (పట్టితెచ్చెను)

తా॥ ఒకసేవకుఁడు ఆకాశమునందుండి సంకటపాటుతోవచ్చి శ్రీకృష్ణునిపాదకమలములకుమ్రొక్కి ఓస్వామీ! సాల్వుఁడు మిక్కిలి భయంకరుఁడైవచ్చివసుదేవునిఁబట్టితీసుకవచ్చెను అనిచెప్పెననితా.

౨౧౨.—తే॥ దేవ మీకెఱిఁగింపఁగాఁ ✽ దివిరి యిటకు । దేవకీదేవి నన్నుఁ బు ✽ త్తెంచె ననఁగ
వినిసరోరుహనాభుండు ✽ ఘనవిషాదమగ్నుఁడయ్యెను గురుమీఁది ✽ మమతఁజేసి.

టీ॥ దేవ=స్వామీ. మీకెఱిఁగింపఁగాన్=మీకుఁదెలియఁజేయుటకై. తివిరి=యత్నించి. ఇటకున్=ఇచ్చటికి. ( దేవకీదేవి నన్ను ) పుత్తెంచెన్ = పంపెను. అనఁగన్ = అనిచెప్పఁగా. (విని) గురుమీఁదిమమతఁజేసి=తండ్రియందలి ప్రీతిచేత. సరోరుహనాభుండు= కృష్ణుఁడు. ఘనవిషాదమగ్నుఁడు = అధికమైన మనోవేదనయందు మునిఁగినవాఁడు — మిక్కిలి విచారమునొందినవాఁడు. (అయ్యెను)

తా॥ స్వామీ! ఆవృత్తాంతముమీవద్దకునన్నుదేవకీదేవిపంపఁగా మీకు తెలియఁజేయవలె నని నేనువచ్చినానని చెప్పఁగా కృష్ణుఁడు తన తండ్రియందలి ప్రీతిచేత మిక్కిలి విచారము నొందినవాఁడయ్యెనని తాత్పర్యము.

౨౧౩.—క॥ నర గంధర్వ సురాసుర । వరులకు నిర్జింపరాని ✽ వాఁడు బలుండే
మఱికయు హీనబలునిచేఁ । బరికింపఁగ నెట్లుపట్టు ✽ పడెనొకొ యనుచున్.

టీ॥ నరగంధర్వసురాసురవరులకున్ = రాజులకును గంధర్వరాజులకును దేవరాజులకును రాక్షసరాజులకును. నిర్జింపరానివాఁడు = జయింప శక్యముకానివాఁడు. బలుండు = బలరాముఁడు. ఏమఱికయ = ఏమఱక యుండఁగానే. పరికింపఁగన్ = విచారింపఁగా. హీన బలునిచేన్ = తక్కువైన బలము గలవాఁడైన సాల్వునిచేత. ఎట్లు పట్టు పడెనొకో = ఏవిధముగా పట్టుపడి నాఁడో యేమో.

తా॥ దేవదానవులచేతనైననుమఱియితరులైనరాజులచేతనైనను జయింపరాని వాఁడైన బలరాముఁడుండఁగా ఆయనకు తెలియకుండ బలహీనుఁడైన సాల్వునిచేత వసుదేవుఁడు ఎట్లుపట్టుపడెనో కదా అని యాలోచించె నని తాత్పర్యము.

౯౧౪.—క॥ భావంబుగలఁగ నహహా। దైవకృతం బెవ్వనికినిఁ * దప్పింపఁగరా
దేవిధినైనను నని శో। కావిలమతిఁ బలుకుచున్న * యత్తఱి వాఁడున్.

టీ॥ భావంబు = మనసు. కలఁగన్ = కలవరము నొందఁగా. అహహా = ఔరా. దైవకృతంబు = దైవయత్నము. ఎవ్వరికిని = ఎంతటి బ్రహ్మ విద్వరిష్ఠుల కైనను. ఏవిధినైనన్ = ఏవిధముచేతనైనను. తప్పింపఁగరాదు = తప్పిపోవునట్లు చేయశక్యముగాదు. (అని) శోకావిలమతిన్ = శోకముచేతకలఁతనొందినబుద్ధితో. పలుకుచున్నయత్తఱిన్ = చెప్పుచున్న యాసమయము నందు. వాఁడున్ = ఆసాల్వుఁడును.

తా॥ మనసు తత్తఱిల్లఁగా ఔరా! దైవకృతము ఎవరికైనను ఏవిధముచేతనైనను దైవయత్నమువల్లవచ్చునట్టియాపదలనుతప్పించుకొన శక్యముకాదు అనిదుఃఖముచేత కలఁతపడినబుద్ధితో కృష్ణుఁడు మాటలాడుచుండఁగా సాల్వుఁడును అని తా. వ॥ మఱియును.

వ॥ అప్పుడుదనమాయాబలంబునం గ్రమ్మఱం దోఁచికృతకవసుదేవునింగల్పించి యతనింబంధించికొని తెచ్చి పుండరీకాక్ష నిరీక్షింపు భవజ్జనకుండు వీఁడె యిప్పుడు నీవు గనుంగొన వీనితలఁద్రుంతు నింక నెవ్వనికింగా మనియెదు కావఁగల శక్తి గలదేనియుం గావుమని దురాలాపంబులాడుచు మృత్యుజిహ్వాకరాళంబైన కరవాలంబు గేలంబూని జళిపించుచు నమ్మాయావసుదేవునిశిరంబు దునిమి తన్మస్తకంబుఁ గొని వియద్వర్తియై చరియించు సౌభకవిమానంబుఁ జొచ్చె నంత గోవిందుండు గొంతదడవు మనంబున ఘనంబగు శోకంబునం గుందుచుండి యాత్మసైనికులు దెలుపం దెలివొందియది మాయోద్దీపితంబైన సాల్వుని యుపాయంబని యెఱింగియుండె నంతఁ దనకు వసుదేవుండు పట్టుపడెనని చెప్పిన దూతయు నమ్మాయా కళేబరంబు నాక్షణంబ విచిత్రంబుగా మాయంబై పోయెఁ దదనంతరంబ.

టీ॥ (అప్పుడు) తనమాయాభలంబునన్ = తనమాయవలని సామర్థ్యముచేత. క్రమ్మఱన్ = మరల. తోఁచి = కనఁబడి. కృతకవసుదేవునిన్ = కపటపువసుదేవునొకని. కల్పించి = కలుగఁజేసి. ఆతనిం బంధించి = ఆతనిని కట్టివేసి. కొనితెచ్చి = తీసికొనివచ్చి. పుండరీకాక్ష = కృష్ణుఁడా. నిరీక్షింపు = చూడుము. భవజ్జనకుండు = నీతండ్రి. వీఁడె = వీఁడుగో. (ఇప్పుడు నీవు) కనుంగొనన్ = చూచుచుండఁగా. వీనితలఁద్రుంతును = వీనితల తెగఁగొట్టెదను. ఇంకన్ = ఇఁకను. ఎవ్వనికింగాన్ = ఎవనికొఱకై. మనియెదు = బ్రతికెదవు. కావంగల శక్తి = కాపాడఁజాలునట్టి సామర్థ్యము. కలదేనియున్ = కలిగిన పక్షమున. కావుము = కాపాడుము. (అని) దురాలాపంబులు = చెడ్డమాటలు. ఆడుచున్ = చెప్పుచు. మృత్యుజిహ్వాకరాళంబు = మృత్యుదేవత నాలుకవలెభయంకరము. ఐనకరవాలంబు = అయినట్టికత్తిని. కేలంబూని = చేతఁబట్టి. జళిపించుచున్ = ఆడించుచు. అమ్మాయావసుదేవునిశిరంబు = ఆకృత్రిమపు వసుదేవుని తలను. తునిమి = నఱకి. తన్మస్తకంబున్ = ఆతలను. కొని = తీసికొని. వియద్వర్తియై = ఆకాశమునందు వర్తించునదియై. చరియించు = తిరుగునట్టి. సౌభక విమానంబున్ = సౌభకమనెడివిమానమునందు. చొచ్చెన్ = ప్రవేశించెను. అంతన్ = అంతట. గోవిందుండు = కృష్ణుఁడు. కొంతఁదడవు = కొంతసేపు. మనంబునన్ = మనసునందు. ఘనంబగుశోకంబునన్ = అధికదుఃఖముచేత. కుందుచుండి = దుఃఖపడుచుండి. ఆత్మసైనికులు = తనసేనాజనులు. తెలుపన్ = ఓఅటు మాటలు చెప్పి బోధింపఁగా. తెలివొంది = వికాసమును వహించినవాఁడై. అది = ఆవసుదేవుని చావు. మాయోద్దీపితంబైన = మాయచేత ప్రకాశింపఁజేయఁబడినదైన (సాల్వుని యుపాయంబని) ఎఱింగియుండెన్ = తెలిసికొనియుండెను. అంతన్ = అటుపిమ్మట. తనకున్ = తనతో. (వసుదేవుండుపట్టుపడెనని చెప్పినదూతయు) అమ్మాయా కళేబరంబును = కృత్రిమ మయిన ఆవసుదేవుని దేహమును. ఆక్షణంబ = అప్పుడే. విచిత్రంబుగాన్ = వింతఁగా. మాయంబయిపోయెన్ = కనఁబడకపోయెను. తదనంతరంబ = తోడుతనే.

తా॥ అప్పుడు తనమాయవలని బలముచేత కృత్రిమమయినవసుదేవునికల్పించి కృష్ణునియెదుటికి తెచ్చి ఓకృష్ణా! నీతండ్రియిదుగో కట్టితెచ్చినాను నీవు చూచుచుండఁగానే ఇప్పుడు వీనితల నఱకెద నీచేతనైనపక్షమున వీనినిప్పుడు కాపాడుకో అనియావసుదేవునితల నఱికిచేతఁబట్టుకొని ఆకాశమునందుండునదియైనసౌభకవిమానము నందు ప్రవేశించెను అంతట కృష్ణమూర్తి కొంతసేపు మనసున విచారపడుచుండి తనసేనాజనులు బోధింపఁగా దుఃఖమును మానికళ దెలుపు కొన్నవాఁడై ఇదియంతయు సాల్వుని మాయచేతనైన కృత్యముగాని యితరముకాదని నిశ్చయించియుండెను అంతలో వసుదేవుఁడు పట్టుపడెనన్న వృత్తాంతము చెప్పవచ్చినదూతయు అచ్చటుపడియున్న వసుదేవుని దేహపు మొండెమును కానఁబడకపోయెను అని తాత్పర్యము.

౯౧౬.—క॥ మును లపుడు గొంద ఱచటికిఁ। జను దెంచి విమోహియైన * జలజాతాక్షున్
గనుఁగొని సమధిక భక్తిన్। వినయంబునఁ బలికి రంత * విష్ణున్ జిష్ణున్.

టీ॥ అపుడు = కృష్ణుఁడు మోహపడియున్నసమయమందు. మునులు = బ్రహ్మవేత్తలు. కొందఱు = కొంతమంది. అచటికిన్ = ఆకృష్ణుఁడున్నచోటికి. చనుదెంచి = వచ్చి. విమోహి = విశేష మోహము నొందినవాఁడు. అయిన జలజాతాక్షున్ = అయినట్టికృష్ణుని. కనుఁగొని =

చూచి. అంతన్ = అంతట. సమధిక భక్తిన్ = మిక్కుటమయిన భక్తితో. వినయంబునన్ = అడఁకువతో. విష్ణున్ = సర్వవ్యాపకుఁడైన. జిష్ణున్=జయశీలుఁడైన కృష్ణమూర్తితో. పలికిరి=చెప్పిరి.

తా॥ ఆసమయమునందుకొందఱుమునీశ్వరులు ఆకృష్ణునియొద్దకు వచ్చిజయశీలుఁడును సర్వవ్యాపకుఁడునైయుండియువిశేషమోహము నొందియున్నయతనితోమిక్కిలివినయముతోనీవిధముగాచెప్పిరనితా.

౯౧౭.—సీ॥ కమలాక్ష సర్వ లో * కములందు సర్వ మా - నవులు సంసార నా * నావిధైక
దుఃఖాబ్ధి మగ్నులై * తుదిఁజేర నేరక - వికలత్వమునఁ బొందు * వేళ నిన్నుఁ
దలఁచి దుఃఖంబులు * దరియింతు రట్టి స - ద్గుణనిధివై దేవ * కోటికెల్లఁ
బట్టుకొమ్మై పర * బ్రహ్మాఖ్యఁ బొగడొంది - పరమ యోగీశ్వర * ప్రకర గూఢ

తే॥ పరచిదానంద దివ్య రూ * పమున వెలుఁగు । దనఘ నీవేడ నీచ జ * న్మాత్మ జనిత
ఘనభయ స్నేహ మోహ శో * కంబులేడ । ననుచు సంస్తుతిఁ జేసి వా * రరిగిరంత.

టీ॥ కమలాక్ష=కృష్ణా. సర్వలోకములందున్ = ఎల్లలోకములయందును. సర్వమానవులును = ఎల్లమనుష్యులును. సంసార... మగ్నులై—సంసార=సంసార సంబంధమయిన. నానావిధ=బహువిధములైన. ఏక=ముఖ్యమైన. దుఃఖ=దుఃఖములనెడి. అబ్ధి=సముద్రమునందు. మగ్నులై=మునిఁగినవారై. తుదిఁజేరనేరక=కడముట్టఁజాలక. వికలత్వమునఁ బొందువేళన్ = మనశ్చలనమునుపొందునట్టి సమయమునందు. (నిన్ను) తలఁచి=తలఁచుకొని. దుఃఖంబులు=దుఃఖములను. తరియింతురు=దాఁటుదురు. అట్టిసద్గుణనిధివై=అట్టిమంచి గుణములకుఉనికిపట్టయి. దేవకోటికెల్లన్=దేవతలకందఱకు. పట్టుకొమ్మై=పట్టుకొనుటకునాదరువైనకొమ్మయై. పరబ్రహ్మాఖ్యన్=పరబ్రహ్మమనుపేర. పొగడొంది=పొగడ్తనుపొంది. పరమ...మునన్—పరమ = సర్వోత్కృష్టులయిన. యోగీశ్వర = బ్రహ్మవిద్వరిష్ఠులయొక్క. ప్రకర=సమూహమునకు. గూఢ=రహస్యమును. పర=ఉత్తమమును. చిదానంద=జ్ఞానానందమును. దివ్య=అప్రాకృతమునైన. రూపమునన్=స్వరూపముతో. వెలుఁగుదు=ప్రకాశింతువు. అనఘ=పాపములేనివాఁడవైనకృష్ణా. నీవేడ = నీవెక్కడ. నీచ...బులు—నీచ=తక్కువైన. జన్మ=పుట్టుకగలవారియొక్క. ఆత్మ=మనస్సులయందు. జనిత=పుట్టిన. ఘన=అధికమయిన. భయ=వెఱపును. స్నేహ=చెలిమియు. మోహ=అజ్ఞానమును. శోకంబులు = క్లేశములును. ఏడన్=ఎక్కడ. అనుచున్=అని. సంస్తుతిఁ జేసి=కొనియాడి. వారు=ఆమునులు. అరిగిరి=పోయిరి. అంతన్=అటుపిమ్మట.

తా॥ ఓశ్రీకృష్ణా ! ఎల్లలోకములందు నుండెడి ఎల్లమానవులును సంసార సంబంధమయిన బహువిధ దుఃఖములనెడు సముద్రమునందు మునిఁగి చిత్తస్వాస్థ్యము తప్పినప్పుడు నిన్ను ధ్యానించి ఆదుఃఖములను తొలఁగించుకొందురు అట్టికల్యాణగుణపరిపూర్ణుఁడవై దేవతాసమూహములకు నుచితము ఆధారమయి పరబ్రహ్మ మనుపేర ప్రసిద్ధి వహించి సర్వోత్తములయిన మునిశ్రేష్ఠులకు రహస్యమును ఉత్తమమును అప్రాకృతమునైన జ్ఞానానంద స్వరూపముచేత కానఁబడుచు వెలుఁగు నట్టి నిన్ను సామాన్యులైన నీచ మానవులను పొందునట్టి భయము స్నేహము మోహము శోకము అనునవి యెట్లు పొందును అని యీఁవిధముగా వినుతించి ఆమునులు తమ నివాస ములకు పోయిరని తాత్పర్యము.

౯౧౮.—చ॥ హరి తనమీఁద ఘోర నిశి * తాశుగ జాలములేయు సాల్వ భూ
వరు వధి యింపఁ గోరి బహు * వారిద నిర్గత భూరి వృష్టి వి
స్ఫురణ ననూన తీవ్ర శర * పుంజములన్ గగనంబుఁ గప్పి క్ర
చ్చర రిపుమౌళి రత్నమును * జాపము వర్మముఁ ద్రుంచి వెండియున్.

టీ॥ హరి=కృష్ణుఁడు. (తనమీఁద) ఘోరనిశితాశుగజాలములు. భయంకరములైవాఁడులైనబాణములసమూహములను. ఏయు=ప్రయోగించునట్టి. సాల్వభూవరున్=సాల్వరాజును. వధియింపన్=చంపను. కోరి=తలఁచి. బహు...విస్ఫురణన్—బహు=అనేకములైన. వారిద=మేఘములవలననుండి. నిర్గత=బయలువెడలునట్టి. భూరి=అధికమైన. వృష్టి=వానయొక్క. విస్ఫురణన్=ప్రకాశముచేత. అనూన=తక్కువకాని. తీవ్ర=చులుకులైన. శర=బాణములయొక్క. పుంజములన్=సముదాయములచేత. గగనంబున్ = ఆకాశమును. కప్పి=ఆవరించి. క్రచ్చఱన్=శీఘ్రముగ. రిపుమౌళిరత్నమును—రిపు=శత్రువైన సాల్వునియొక్క. మౌళిరత్నమును = కిరీటమును. చాపమును=విల్లును. వర్మమును=కవచమును. త్రుంచి=తెగనఱకి. వెండియున్=మఱియును.

తా॥ అంతట కృష్ణమూర్తి ఎచ్చరికను పొందినవాఁడై తనపై క్రూరములును వాఁడులును నైన బాణములను ప్రయోగించుచున్న సాల్వరాజును చంపఁదలఁచిన వాఁడగుచు, అనేకములయిన మేఘములయందుండి వెడలి తెగక కురియునట్టి వానను తలపించునట్లు అధికములును చులుకులైన బాణ సముదాయములను ప్రయోగించి ఆకాశమును కప్పివేసి, అతిశీఘ్రముగ సాల్వుని కిరీటమును కవచమును ధనస్సును తెగనఱకి మఱియు నేమి చేసెననఁగా నని తాత్పర్యము.

౯౧౯.—మ॥ వితత క్రోధముతోడఁ గృష్ణుఁడు జగ * ద్విఖ్యాత శౌర్య క్రియో
ద్ధత శక్తిన్ వడిఁ ద్రిప్పి మింట మెఱుఁగుల్ * దట్టంబుగాఁ బర్వ ను
గ్రత చంచద్గద వైచి త్రుంచె వెసఁ జూ * ర్ణంబై ధరన్ రాల నా
యత భూరి త్రిపురాభమున్ మహిత మా * యా శోభమున్ సౌభమున్.

టీ॥ (కృష్ణుఁడు) వితతక్రోధముతోడన్=అధికమైనకోపముతో. జగద్విఖ్యాత...శక్తిన్—జగత్=లోకమునందు. విఖ్యాత=ప్రసిద్ధమైన. శౌర్యక్రియా=శూరత్వవ్యాపారమునందలి.ఉద్ధత=అణఁగని.శక్తిన్=బలముతో. వడిన్=వేగముగా. (త్రిప్పి) మింటన్=ఆకాశమునందు. మెఱుఁగులు=కాంతులు. దట్టంబుగాన్=దళముగా. పర్వన్=వ్యాపింపఁగా.ఉగ్రతన్=భయంకరత్వముతో. చంచత్=ఒప్పిదమైన. గద=గదాయుధమును.వైచి=వేసి. ఆయతభూరిత్రిపురాభమున్=విశాలములును గొప్పవియునయిన త్రిపురములనుబోలినదియు. మహితమాయాశోభమున్ =.పూజ్యమయిన మాయచేత ప్రకాశించు నదియు నైన. సౌభమున్=సౌభకవిమానమును.ధరన్=భూమియందు.చూర్ణంబై=పొడియై. రాలన్=పడునట్లుగా. (వేసన్)త్రుంచెన్=నఱికివేసెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి మిక్కుటమయిన కోపముగలవాఁడై లోకమునందు ప్రసిద్ధమయినశూర వ్యాపారముచేతఅతిశయించినదయిన బలముతో తనగదాయుధమునుత్రిప్పి దానికాంతులు ఆకాశమునందు దళముగాప్రసరించునట్లు ప్రయోగించివిశాలములయిగొప్పవైయొప్పునట్టి త్రిపురములనుబోలినదియుమాయచేతగౌరవమునువహించిప్రకాశించునదియునైన సౌభకవిమానమునుపొడిపొడియై నేలరాలునట్లుగాపడఁగొట్టెనని తాత్పర్యము.

౯౨౮.—వ॥ ఇట్లు కృష్ణుండమ్మాయావిమానంబగు మయనిర్మిత మాయా విమానంబు నిజ
గదాహతినింతింతలుతునియలై సముద్రమధ్యంబునం దొరంగఁజేసిన సాల్వుండు
కోఱలు వెఱికిన భుజంగంబు భంగి గఁడడంగి విన్ననై విగత మాయా బలుం
డయ్యును బొలివోవని బీరంబున వసుధా తలంబునకు డిగ్గి యాగ్రహంబున.

టీ॥ (ఇట్లు కృష్ణుండు) అమ్మాయావిమానంబగు=అమాయగలవానికొలఁదియైన.మయ...నంబున్—మయ=మయునిచేత. నిర్మిత=చేయఁబడిన.మాయావిమానంబున్=కృత్రిమవిమానమును,నిజగదాహతిన్=తనగదదెబ్బచేత. ఇంతింతలుతునియలై=మిక్కిలి చిన్నచిన్న తునుకలై. సముద్రమధ్యంబునన్=సముద్రమునడుమ. దొరంగఁజేసినన్ = పడునట్లుచేయఁగా. (సాల్వుండు) కోఱలు వెఱికిన భుజంగంబు భంగిన్=కోఱలు పెఱికివేసిన పామువలెనే. గండు=పొగరు. అడంగి=అణఁగి. విన్ననై = చిన్నవోయి. విగత మాయా బలుండయ్యును = పోయిన మాయాబలము గలవాఁడయ్యును. పొలివోవని=వ్యర్థముగాని. బీరంబునన్=పరాక్రమముతో. వసుధాతలంబునకున్=భూప్రదేశమునకు. డిగ్గి=దిగి. ఆగ్రహంబునన్=కోపముతో.

తా॥ ఈవిధముగామాయామారియైనయాసాల్వునిమహిమనుదెలుపునదియైనమయునిచేతఁజేయఁబడినమాయావిమానమునుపొడిపొడియై సముద్రమునడుమరాలునట్లుచేయఁగాసాల్వుఁడుకోఱలుపెఱికినపామువలెమదమణఁగి చిన్నవోయిపోయినమాయాబలము గలవాఁడయ్యును తనపౌరుషమును విడువకభూమిమీఁదికిదిగి అత్యంతకోపముతోననితా.

౯౨౯.—క॥ కరమునఁ బవినిభమగు భీ । కర గద ధరియించి కదియఁ * గాఁ జనుదేరన్
మురహరుఁ డుద్ధతి సాల్వుని । కరము గదాయుక్తముగను * ఖండించెన్నృపా.

టీ॥నృపా=రాజా.కరమునన్=చేతిలో. పవినిభమగు=వజ్రాయుధమునుపోలినదైన. భీకరగదన్=భయంకరమైనగదాయుధమును. (ధరియించి)కదియఁగాన్=చేరునట్లు.చనుదేరన్=రాఁగా.మురహరుఁడు=కృష్ణుఁడు. ఉద్ధతిన్ = ఉత్సాహాతిశయముతో. సాల్వునికరమున్=సాల్వునిచేతిని. గదాయుక్తముగన్=గదతోడ. ఖండించెన్=నఱికెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా ! సాల్వుఁడు వజ్రాయుధమును బోలినయొకగదను చేతఁబూని కృష్ణునిపైఁబడ రాఁగా అతఁడు ఆగదతోఁగూడ తెగిపడునట్లు వాని చెయి నఱికెనని తాత్పర్యము.

౯౩౦.—క॥ అంతం బోవని కినుక న । నంతుఁడు విలయార్క మండ * లాయత రుచి దు
ర్దాంతం బగు చక్రంబు ని । తాంతంబుగఁ బూన్చి సాల్వ * ధరణిపు మీఁదన్.

టీ॥ అంతన్ = అంతటితో, పోవనికినుకన్ = పోనికోపముతో. అనంతుఁడు=కృష్ణుఁడు. విలయార్కమండలాయతరుచిన్ = ప్రళయకాలపుసూర్యమండలముయొక్క విశేషమయిన ప్రకాశముచేత.దుర్దాంతంబు=అణఁపరానిది.(అగుచక్రంబును)నితాంతంబుగన్=తీవ్రముగ. పూన్చి=గుఱిపెట్టి. సాల్వధరణిపుమీఁదన్=సాల్వరాజుమీఁద. (వైచి)

తా॥ కృష్ణుఁడు అంతటితోకోపముచల్లారక ప్రళయకాల సూర్యబింబమునుమీఱిన ప్రకాశముతో వెలుఁగుచున్న తనచక్రమునుసాల్వునిమీఁదప్రయోగించినవాఁడైయనితాత్పర్యము.

౯౩౧.—క॥ గురుశక్తి వైచి వెస భా । సుర కుండల మకుట రత్న * శోభిత మగు త
చ్ఛిరము వడిఁ ద్రుంచె నింద్రుఁడు । వరకులిశముచేత వృత్రు * వధియించుక్రియన్.

టీ॥ గురుశక్తిన్=అధిక బలముతో. వైచి = వేసి—ప్రయోగించి. వెసన్=శీఘ్రముగ. భాసురకుండలమకుటరత్నశోభితము=ప్రకాశించుచున్నచెవిపోఁగులయొక్కకిరీటముయొక్కయురత్నములచేతఅందగించునది. అగుతచ్ఛిరమున్=అగునట్టియాసాల్వునితలను. (ఇంద్రుఁడు) వరకులిశముచేతన్=శ్రేష్ఠమయినవజ్రాయుధముచేత, (వృత్రుని) వధియించుక్రియన్=నఱికిచంపునట్లు.వడిన్=వేగముగా.త్రుంచెన్=నఱికిచంపెను.

తా॥ అధిక బలముతో అట్లు చక్రాయుధమును ప్రయోగించి యింద్రుఁడు వృత్రాసురుని తన వజ్రాయుధముతో నఱికి చంపినట్లు కృష్ణుఁడు సాల్వునిదైన కిరీటమణులచేతను కుండలముల మణులచేతను అందగించునట్టి తలను నఱికిచంపెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు మాయావియైన సాల్వుండును సౌభకంబును గృష్ణుచేతం బొలియుటం గనుంగొని నిజసఖులగు సాల్వ పౌండ్రక శిశుపాలభూపాలకులకుఁ బరలోకమైత్రి పాటించి దంతవక్త్రుండతిభీకరాకారంబుతో నప్పుడు,

టీ॥ (ఇట్లు) మాయావియైన=మాయలమారియైన. (సాల్వుండును) సౌభకంబును=సౌభకవిమానమును. కృష్ణుచేతన్=కృష్ణునిచేత. పొలియుటన్=నశించుటను. కనుంగొని=చూచి. నిజసఖులగు=తన చెలికాండ్రయిన. సాల్వపౌండ్రకశిశుపాలభూపాలకులకున్=సాల్వునకును శిశుపాలునకును పౌండ్రకవాసుదేవునకును. పరలోకమైత్రి=పరలోకమునఁదలి చెలిమిని. పాటించి=ఆదరించి. (దంతవక్త్రుండు) అతిభీకరాకారంబుతోన్=మిక్కిలి భయంకరమయిన యాకృతిలో. (అప్పుడు)

తా॥ ఈవిధముగా మాయల మారియయిన సాల్వుఁడును వాని విమానమయిన సౌభకమును నశించుటను జూచి దంతవక్త్రుఁడు తన చెలికాండ్రయిన సాల్వరాజుతోడను, పౌండ్రకవాసుదేవునితోడను, శిశుపాలునితోడను పరలోకమునందును స్నేహము చేయవలెనను కోరికగలవాఁడై మిక్కిలి భయంకరమయిన యాకారముతో నని తాత్పర్యము.




(*) శ్రీకృష్ణమూర్తి దంతవక్త్ర విదూరులను సంహరించుట. (*)

౯౫౫.—చ॥ పెటపెట పండ్లు గీటుచును * బెట్టుగ మ్రోయుచుఁ గన్నుఁ గ్రేవలన్
జిటచిట విస్ఫులింగములు * చింద మహోద్ధతిఁ బాద ఘట్టనన్
నటునిటునై ధరిత్రి వడఁ * గాఁడ వడిన్ గదఁ గేలఁ ద్రిప్పుచున్
మిటమిట మండు వేసవిని * మించు దివాకరుఁ బోలె నుగ్రతన్.

టీ॥ పెటపెటపండ్లుగీటుచును=పెటపెటమని పండ్లు కొఱుకుచును. బెట్టుగన్=అధికముగా. మ్రోయుచున్=ధ్వని కలుగఁజేయుచు. కన్నుఁగ్రేవలన్=కనుఁగొలుకులయందు. చిటచిట=చిటచిటమని. విస్ఫులింగములు=నిప్పురవలు. చిందన్=రాలఁగా. మహోద్ధతిన్=అధికమైన నిక్కుతో. పాదఘట్టనన్=కాలియదుముడుచేత. అటునిటునై=అటునట్టు నకు ఈతట్టునకు మ్రొగ్గినదై. ధరిత్రి=భూమి. వడఁకాఁడన్=అదురఁగా. వడిన్=వేగముగా. గదన్=గదాయుధమును. కేలన్=చేతితో. (త్రిప్పుచును) మిటమిట=మిటమిటమని. మండు=మండునట్టి—తాపమును గలుగఁజేయునట్టి. వేసవిని=గ్రీష్మఋతువున. మించు=అతిశయించి వెలుఁగునట్టి. దివాకరుఁబోలెన్=సూర్యునివలెనే. ఉగ్రతన్=భయంకరత్వముతో.

తా॥ అప్పుడు దంతవక్త్రుఁడు పండ్లు పెట పెటమని కొఱుకుచు కేకలు వేయుచు కన్నులందు నిప్పురవలు చిటచిట ధ్వనులతో రాలఁగా మిక్కిలి నిక్కుచు కాలి యదుముడుచేత భూమిని చలింపఁ జేయుచు ఒక గదను చేతఁబట్టి వడిగా త్రిప్పుచు వేసంగికాలమునందు వేండ్రమును జూపునట్టి సూర్యబింబమువలెనే వేండ్రమును జూపుచునని తాత్పర్యము.

౯౫౬.—చ॥ వడిఁ జనుదేరఁ జూచి యదు * వల్లభుఁ డుల్లము పల్లవింప న
ప్పుడు గదఁ గేలఁ బూని రథ * ము న్రయ మొప్పఁగ డిగ్గి యుగ్రతన్
గడఁగి విరోధి కిన్నెదురు * గాఁ జన వాఁడతి నీచవర్తియై
యడరుచు నట్టహాస ముఖుఁ * డై వలచేఁ గదఁ ద్రిప్పుచున్ హరిన్.

టీ॥ వడిన్ = వేగముగా. చనుదేరన్ = రాఁగా. (చూచి) యదువల్లభుఁడు=కృష్ణుఁడు. ఉల్లముపల్లవింపన్ = మనసు వికాసమును వహింపఁగా. (అప్పుడు గదను) కేలన్=చేతిలో. పూని = పట్టుకొని. రథమున్=రథమునుండి. రయమొప్పఁగన్=వడియొప్ప

చుండఁగా. డిగ్గి=దిగి. ఉగ్రతన్=భయంకరత్వముతో. కదఁగి=పూని. విరోధికిన్ = పగవానికి. (ఎదురుగా) చనన్ = పోఁగా. వాఁడు=ఆదంతవక్త్రుఁడు. అతినీచవర్తియై = మిక్కిలితక్కువైన నడవడిగలవాఁడై. అదరుచున్=అదిరిపడుచు. అట్టహాసముఖుఁడై=గొప్పధ్వనితోఁడి నవ్వుమొగముగలవాఁడై. వలచేన్=కుడిచేతితో. (గదను త్రిప్పుచు) హరిన్=కృష్ణుని. (కనుఁగొని క్రియ)

తా॥ దంతవక్త్రుఁడు వడిగారాఁగాఁజూచి శ్రీకృష్ణుఁడునువమనసున ఉత్సాహము అతిశయింపఁగా తనగదను చేతపట్టుకొనిరథము నుండి తటాలునదిగి పగవానికి ఎదురుగాపోఁగా వాఁడు మిక్కిలి తక్కువైన నడతగలవాఁడై గట్టిగానవ్వుచు గంతులువేయుచు, కుడిచేతగదనుత్రిప్పుచు, కృష్ణునిఁజూచి యని తాత్పర్యము.

వ॥ కనుంగొనిపరిహాసోక్తులు గానిట్లనియెనీవుమదీయభాగ్యంబుకతంబునంజేసినేడునాదృష్టిపథంబునకుగోచరుండవైతివి మిత్రద్రోహివైననిన్ను మాతులేయుండవనిమన్నింపక దేహంబునందు వర్తించు నుగ్రవ్యాధిని నౌషధాదిక్రియల నివర్తింపఁజేయుచికిత్సకునిచందంబునబంధురూపశాత్రవుండవు గావునదంభోళిసంరంభగంభీరంబైనమదీయగదాదండహతింబరేతనివాసంబునకనిచియున్నునీచేతనిహతులైననాదుసఖులఋణంబుఁదీర్తుననిదుర్భాషలాడుచుడగ్గఱె.

టీ॥ కనుంగొని=చూచి. పరిహాసోక్తులుగాన్=ఎగతాళిమాటలుగా. (ఇట్లనియెను నీవు) మదీయభాగ్యంబుకతంబునంజేసి=నాదైనయదృష్టకారణముచేత. (నేడు) నాదృష్టిపథంబునకున్=నాచూపుత్రోవకు. గోచరుండవైతివి=అగపడితివి. మిత్రద్రోహివి=చెలికాండ్రకు చెఱుపుచేయువాఁడవు. అయిననిన్నున్ = అయినట్టినిన్ను. మాతులేయుండవని=మేనమామకొడుకవు అని. (మన్నింపక దేహంబునందు)వర్తించు=ఉండునట్టి. ఉగ్రవ్యాధిన్=క్రూరమైనవ్యాధిని. ఔషధాదిక్రియలన్ = మందులు మొదలగుపనులచేత. నివర్తింపఁజేయు=పోఁగొట్టునట్టి. చికిత్సకుని చందంబునన్ = వైద్యునివలె. బంధురూపశాత్రవుండవు=చుట్టముమేరపగవాఁడవు. కావునన్=కనుక. దంభోళిసంరంభగంభీరంబు=వజ్రాయుధముయొక్క ఆటోపమువంటి ఆటోపముచేత గొప్పనువహించినది. (అయిన) మదీయగదాదండహతిన్ = నాగదాయుధముదెబ్బచేత. పరేతనివాసంబునకున్=చచ్చినవారుండు లోకమునకు. అనిచి = పంపి. మున్ను=మునుపు. (నీచేత) నిహతులైన=కొట్టఁబడినవారైన — చంపఁబడినవారైన. నాదుసఖులఋణంబున్=నాచెలికాండ్రఅప్పును. తీర్తును=చెల్లింతును. (అని) దుర్భాషలు=చెడ్డమాటలను. ఆడుచున్=చెప్పుచును. డగ్గఱె=సమీపించె.

తా॥ కృష్ణునిఁజూచి దంతవక్త్రుఁడు ఎగతాళిమాటలుగా నిట్లు పలికెను, ఓరి కృష్ణా ! నీవు నేడునాయదృష్టవశముచేత నాయెదుటికివచ్చితివి, మిత్రులకుద్రోహముచేయువాఁడవైననిన్ను మేనమామకొడుకని తలఁపరాదు కాఁబట్టి నీయందలి ప్రీతిని వదలి క్రూరమైన వ్యాధిని తగినయౌషధముచేతమాన్పునట్టి వైద్యునివలెనేనును నాకు చుట్టఱికముగల పగవాఁడవైన నిన్ను వజ్రాయుధమును బోలిన నాగదాయుధముచేతకొట్టి యమలోకమునకుపంపి నామిత్రుల అప్పును చెల్లించెదను అని నీచపుమాటలాడుచు సమీపించినవాఁడై యనితా.

౧౦౭౮.—చ॥ పెనుగదఁ బూన్చి కృష్ణుతల * బెట్టుగమొత్తిన నంకుశాహతిం
గనలెడిగంధ సింధురము * కైవడి దానవభంజనుండు పెం
పున నిజభాసమానగదఁ * బూని బలంబునఁ ద్రిప్పి దంతవ
క్త్రునియురముం బగిల్చిన గు * దుల్కొనుచున్ రుధిరంబు గ్రక్కుచున్.

టీ॥ పెనుగదన్=పెద్దగదతో. పూన్చి = పూనికచేసి. కృష్ణుతల=కృష్ణునియొక్కతలను. బెట్టుగన్ = గట్టిగా. మొత్తినన్ = కొట్టఁగా. అంకుశాహతిన్ = అంకుశపుపోటుచేత. కనలెడి=కోపించునట్టి. గంధసింధురము కైవడిన్ = మదపుటేనుఁగువలె. దానవభంజనుండు=కృష్ణుఁడు. పెంపునన్=ఆధిక్యముతో. నిజభాసమానగదన్=తనదైనప్రకాశించునట్టిగదను. పూని=గ్రహించి. బలంబునన్=బలముతో. (త్రిప్పి)దంతవక్త్రునియురమున్=దంతవక్త్రునిఱొమ్మును. పగిల్చినన్ = పగులఁగొట్టఁగా. గుదుల్కొనుచున్=ముడుఁగుకొనిపడుచు. రుధిరంబుగ్రక్కుచున్=నెత్తురుగ్రక్కుచును.

తా॥ పెద్ద గదతో గుఱిపెట్టి కృష్ణుని తలమీఁద మోపుగా కొట్టఁగా అతఁడు అంకుశముతో పొడువఁబడిన మదపుటేనుఁగువలె అట్టెరేఁగిప్రకాశించుచున్నతనగదను చేతఁబట్టి గిరగిరఁద్రిప్పి దంతవక్త్రునిఱొమ్ము పగులఁ గొట్టఁగా వాఁడు చుట్టుకపడుచును నెత్తురుగ్రక్కుచును అని తాత్పర్యము.

వ॥ తత్క్షణంబ పర్వతాకారంబగు దేహంబుతో నొఱలుచు నేలంగూలి కేశపాశంబులు చిక్కుపడం దన్నుకొనుచుఁ బ్రాణంబులువిడిచె నప్పుడునిఖిలభూతంబులాశ్చర్యంబునొందం దద్గాత్రంబుననుండి యొక్కయతి సూక్ష్మతేజంబు వెలువడి గోవిందునిదేహంబు ప్రవేశించె నయ్యవసరంబున నగ్రజుమరణంబుగనుంగొని కుపితుండై కనుంగవలనిప్పులుప్పతిల్ల విదూరుండు గాలానలజ్వాలాభీలకరాళుండై క్రాలు కరవాలంబును బలుకయుం గేలం దాల్చి దామోదరుదెసకుం గవియుటయుం గనుంగొని.

టీ॥ తత్క్షణంబ=అప్పుడే. పర్వతాకారంబగు దేహంబుతోన్=కొండవలె మిక్కిలిగొప్పదైన దేహముతో. ఒఱలుచున్ = మొఱపెట్టుచు. నేలన్=భూమియందు. కూలి=పడి. కేశపాశంబులు = తలవెండ్రుకల మొత్తములు. చిక్కుపడన్ = చిక్కుపడునట్టుగా.

(తన్నుకొనుచు) ప్రాణంబులువిడిచెన్=చచ్చెను. (అప్పుడు) నిఖిల భూతంబులు=ఎల్లప్రాణులును. ఆశ్చర్యంబునొందన్=ఆశ్చర్య పడు చుండగా, తద్గాత్రంబుననుండి=అతనిదేహమునందుండి. ఒక్కయతి సూక్ష్మతేజంబు = సాటిలేనిదై మిక్కిలి సూక్ష్మమైన తేజస్సు. వెలువడి = బయలువెడలి. గోవిందునిదేహంబు=కృష్ణునిదేహమునందు. ప్రవేశించెన్=చొచ్చెను. అయ్యవసరంబునన్=ఆసమయమునందు. అగ్రజుమరణంబున్=అన్నయొక్కచావును. కనుంగొని = చూచి. కుపితుండై=కోపించినవాఁడై. కనుంగవలన్=రెండుకన్నులందును. (నిప్పులు). ఉప్పతిల్లన్ = పుట్టఁగా. విదూరుండు = విదూరకుఁడు. కాలా...శంబై – కాల=ప్రళయకాలమునందలి. అనలజ్వాలా=నిప్పు మంటవలె. ఆభీల=భయంకరమును. కరాళంబై=వంకరై. ప్రకాశించునట్టి. కరవాలంబును=కత్తిని. పలకయున్=కేడెమును. కేలన్=చేతిలో. తాల్చి=ధరించి. దామోదరు దెసకున్=కృష్ణుని తట్టునకు. కవియుటయున్=సమీపించిరాఁగా. కనుంగొని=చూచి.

తా॥ అప్పుడే కొండనుబోలిన పెద్దదేహముతో దంతవక్త్రుఁడు మొఱపెట్టుచు నేలఁబడి తలవెంట్రుకలు కాళ్లు పెనఁచుకొని చిక్కుపడఁగా గిరగిర తన్నుకొనుచు చచ్చెను, అంతట ఎల్లప్రాణులును వింతపడి చూచుచుండఁగా వానిదేహము నందుండి సూక్ష్మమయిన యొక తేజస్సువచ్చి కృష్ణుని దేహమునందుఁజొచ్చెను అట్లు చచ్చిన దంతవక్త్రునిఁజూచి వానితమ్ముఁడైన విదూరకుఁడు కోపించినవాఁడై ప్రళయకాలపునిప్పుమంటలవలె చలించుచు భయంకరమయియొప్పునట్టి కత్తిని కేడెమును చేతఁబట్టుకొని కృష్ణునిపైకి రాఁగా ననితా.

౯౩౦.—చ॥ జలరుహలోచనుండు నిజ * సాధనమై తనరారు చక్రమున్
వలనుగఁ బూన్చి వైవ నది * వారక వాని శిరంబుఁద్రుంచె న
బ్బలియుఁడు సౌభసాల్వ శిశు * పాల సహోదర తత్సహోదరా
వలుల వధించి తత్కులము * వారి ననేకులఁద్రుంచె నీగతిన్.

టీ॥ జలరుహలోచనుండు =తామరలవంటికన్నులుగలకృష్ణుఁడు. నిజసాధనమై=తనసాధనమై. తనరారు= ఒప్పుపట్టి. (చక్రమును) వలనుగన్=యుక్తముగ. పూన్చి - గుఱిచేసి. వైవన్ = వేయఁగా. అది=ఆచక్రము. వారక=వెనుకకురాక. వానిశిరంబున్ = ఆవిదూరుని తలను. త్రుంచెన్=నఱకెను. అబ్బలియుఁడు = ఆబలవంతుఁడైన కృష్ణుఁడు. సౌభసాల్వ శిశుపాల సహోదర తత్సహోదరావలులన్=సౌభక విమానమును సాల్వుని దంతవక్త్రుని వానితమ్ముఁడైనవిదూరునిని. వధించి =చంపి. తత్కులమువారిన్=వారివంశమున పుట్టినవారిని. ఈగతిన్=ఈచెప్పిన విధమున. అనేకులన్=పెక్కండ్రను. త్రుంచెన్=నఱికి చంపెను.

తా॥ శ్రీకృష్ణుఁడు తనకుముఖ్యసాధనమైనచక్రమును గుఱిచేసి వేయఁగా ఆచక్రము అడ్డులేక పోయి వానితలను నఱకెను, ఈవిధముగా బలవంతుఁడైన కృష్ణుఁడు సౌభక విమానమును సాల్వుని దంతవక్త్రుని విదూరునిని జంపి వారి వంశస్థులను అనేకులను ఆవిధముగానే చంపెను అని తాత్పర్యము.

వి శే షా ర్థ ము.

టీ॥ దంతవక్త్రుఁడు=నోటసత్వగుణముగలవాఁడు—శ్లో॥ మనస్యేకంవచస్యేకం కార్యమేకంమహాత్మనాం। మనస్యన్యద్వచస్యన్యత్కార్యమన్యద్దురాత్మనాం॥ అను ప్రమాణముచేత మాటలయందు చల్లఁదనమును మనసున కఱకుఁదనమునుగల దుర్మార్గుఁడు—అహంకారుఁడు. విదూరుఁడు=బ్రహ్మవేత్తలకు మిగుల దూరమున నుండువాఁడు—మదము.

వ॥ అయ్యవసరంబున.

౯౩౧.—క॥ నర ముని యోగి సురాసుర । గరుడోరగ సిద్ధసాధ్య * గంధర్వ నభ
శ్చర కిన్నర కింపురుషులు । హరిమహిమ నుతించి రద్భు * తానందములన్.

టీ॥ నర...కింపురుషులు—నర=మనుష్యులును. ముని = మునులును. యోగి = యోగసిద్ధిగల ఋషులును. సుర = దేవతలును. అసుర=రాక్షసులును. గరుడ=గరుడులును. ఉరగ=సర్పములును. సిద్ధ=సిద్ధులును. సాధ్య=సాధ్యులును. గంధర్వ = గంధర్వులును. నభశ్చర = ఖచరులును. కిన్నర = కిన్నరులును. (కింపురుషులును) అద్భుతానందములన్ = ఆశ్చర్యముతోను సంతోషముతోను. హరిమహిమన్=కృష్ణుని ప్రభావమును. నుతించిరి=పొగడిరి.

తా॥ మనుష్యులు దేవతలు నాగులు మొదలు గాఁగల మూడు లోకములలోని జనులును కృష్ణుని మహిమను కొనియాడి రని తా.

౯౩౨.—వ॥ మఱియునప్సరోజనంబులునృత్యంబులుసలుపవేల్పులుగుసుమవర్షంబులుగురియ దేవతూర్యంబు
లవార్యంబులై మొరయ యదువృష్ణిప్రవరులు సేవింపఁబరమానందంబునంబొంది నిజవిజయాం
కితంబులైనగీతంబులువందిజనంబులుసంకీర్తనంబులు సేయనతిమనోహర విభవాభిరామంబును
నూతనాలంకారయుక్తంబునైనద్వారకానగరంబుశుభముహూర్తంబునంబ్రవేశించిచనునెడ.

టీ॥ మఱియున్=ఇదిగాక. అప్సరోజనంబులు=అప్సరస్త్రీలు. నృత్యంబులుసలుపన్=నాట్యములుచేయఁగా. వేల్పులు=దేవతలు. కుసుమవర్షంబులు=పువ్వులవానలు. కురియన్ = కురియింపఁగా. దేవతూర్యంబులు=దేవతల వాద్యములు. అవార్యంబులై=నిలుపఁజాలనివై. మొరయన్=మ్రోఁగఁగా. యదువృష్ణిప్రవరులు=యదువంశస్థులును వృష్ణివంశస్థులునైన యుత్తములు. సేవింపన్=కొలువఁగా. పరమానందంబునంబొంది = అధికసంతోషమును పొంది. నిజవిజయాంకితంబులు=తనగెలుపునకు గుఱుతులైనవి. అయినగీతంబులు=

అయినట్టి పాటలు. వందిజనంబులు=స్తుతిపాఠకులు. సంకీర్తనంబులు సేయన్=పాడఁగా. అతిమనోహర విభవాభిరామంబును=మిక్కిలి మనోజ్ఞమయిన వైభవముచేత ఒప్పినదియు. నూతనాలంకారయుక్తంబును=క్రొత్తయలంకారముతోఁ గూడినదియు. (అయినద్వారకానగరంబును) శుభముహూర్తంబునన్=మంచిలగ్నమునందు. ప్రవేశించి=చొచ్చి. చనునెడన్=పోవునప్పుడు.

తా॥ అంతేగాక అప్సరసలు ఆడఁగా, దేవతలు పువ్వులవానలు కురియింపఁగా, దేవతలవాద్యములు మ్రోఁగఁగా, యాదవులును వృష్ణులునైనతమచుట్టములు చుట్టుకొని కొలుచుచుండఁగా, అత్యంత సంతోషముతో తనగెలుపును దెలుపునట్టికీర్తనలను స్తుతిపాఠకులు పాడుచుండఁగా, మిక్కిలి వైభవముతోఁ గూడుకొన్నదియు క్రొత్తగా అలంకరింపఁబడినదియునైన ద్వారకాపట్టణమునందు చొచ్చి పోవుచుండఁగా నని తాత్పర్యము.

౩౩.—క॥ పురసతులు విరులు లాజలు। గురుసౌధాగ్రములనుండి ❋ గురియఁగ వికచాం
బురుహాక్షుం డంతఃపుర। వర మర్థిం జొచ్చె వైభ ❋ వం బలరారన్.

టీ॥ పురసతులు=పట్టణపుస్త్రీలు. విరులు=పువ్వులను. లాజలు=ప్రేలాలును. గురుసౌధాగ్రములనుండి=పెద్ద మేడలమీఁదనుండి. కురియఁగన్=చల్లఁగా. వికచాంబురుహాక్షుండు=కృష్ణుఁడు. అంతఃపురవరము=శ్రేష్ఠమైన అంతఃపురమును. అర్థిన్=సంతోషముతో. (వైభవంబు) అలరారన్=ఒప్పఁగా. (చొచ్చెను)

తా॥ పట్టణములోని స్త్రీలందఱును పొడువులైన మేడలమీఁదనుండి పువ్వులు ప్రేలాలుకలిపి చల్లుచుండఁగా కృష్ణమూర్తియుత్తమమయిన తనయంతఃపురమునందు ప్రవేశించెనని తాత్పర్యము.

౩౪.—వ॥ అట్లు యోగీశ్వరేశ్వరుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును,
నఖిల జగదీశ్వరుండునైన పురుషోత్తముఁడు సుఖంబుండె నంత.

టీ॥ (అట్లు) యోగీశ్వరేశ్వరుండును=యోగిశ్రేష్ఠులకునీశ్వరుఁడును షడ్గుణైశ్వర్యసంపన్నుండును=మాహాత్మ్యము ధైర్యము యశస్సు సంపద జ్ఞానము వైరాగ్యము అను ఆఱుగుణములుగలవాఁడును. అఖిలజగదీశ్వరుండును=అన్నిలోకములనేలినవాఁడును. ఐనపురుషోత్తముండు=ఐనట్టి శ్రీకృష్ణమూర్తి. సుఖంబుండెన్=సుఖముగానుండెను. అంతన్=అప్పుడు.

తా॥ ఆవిధముగా అంతఃపురముప్రవేశించి యెల్ల యోగీశ్వరులను పాలించువాఁడును, భగవంతుఁడును, ఎల్లజగములను, ఏలువాఁడును, నైన శ్రీకృష్ణమూర్తి సుఖముగానుండెను అట్లుండఁగా నని తాత్పర్యము.

## (❋) బలరాముఁడు తీర్థయాత్రకుఁబోవుట. (❋)

౩౫.—క॥ కౌరవ పాండవ పృథుసమ
రారంభ మెఱింగి తీర్థ ❋ యాత్ర నెపముగా
సీరాంకుఁ డుభయ కులులకు
నారయ సముఁడగుటఁ జేసి ❋ యరిగె నరేంద్రా.

టీ॥ నరేంద్రా=రాజా. కౌరవపాండవపృథుసమరారంభము—కౌరవ=కురువంశస్థులయిన దుర్యోధనాదులయు. పాండవ=పాండురాజు కొడుకులైన ధర్మరాజాదులయు. పృథు=గొప్పదైన. సమర=యుద్ధముయొక్క. ఆరంభము=మొదలుపెట్టుటను. ఎఱిఁగి=తెలిసి. సీరాంకుఁడు=బలరాముఁడు. ఉభయకులులకున్=ఇరుదెగలవారికిని. ఆరయన్=విచారింపఁగా. సముఁడగుటఁజేసి=సమానుఁడగుటచేత. తీర్థయాత్ర నెపముగాన్=తీర్థయాత్ర చేయుటయనునది వ్యాజముగా. అరిగెన్=పోయెను.



తా॥ ఓపరీక్షిన్మహారాజా! పాండవులకును ధార్తరాష్ట్రులకును గొప్పయుద్ధమారంభమగుట తెలిసి బలరాముఁడు తాను ఇరుదెగలవారికి బంధుత్వముచేత సమానుఁడు కాఁబట్టి తీర్థయాత్ర చేయఁబోవుటయను నెపముచేత పోయెనని తాత్పర్యము.

వ॥ అట్లు చని మొదలం బ్రభాసతీర్థంబున నవగాహనంబుచేసి యందు దేవర్షి పితృతర్పణంబులు సంప్రీతిం గావించి విమల తేజోధనులగు భూసురప్రవరులు దనతోనరుగుదేరంగ దలిచని క్రమంబున సరస్వతియు బిందుసరంబును, వజ్రతీర్థంబును, విశాలానదియు, సరయువు, యమునయు, జాహ్నవియునుం గనుంగొనుచు, నచట నచట నవగాహనంబులును, దేవర్షి పితృతర్పణంబులును, బ్రాహ్మణ సంతర్పణంబులును, భూసుర యుక్తుండై నడపుచుం జని సకలలోక స్తుత్యంబును, నిఖిల మునిశరణ్యంబునగు నైమిశారణ్యంబు చొచ్చి యందు దీర్ఘసత్త్రంబు నడుపుచున్న మునిజనంబులం గనుంగొని, వారు ప్రత్యుత్థానంబుచేసి వినతులై యాసనార్ఘ్యాది పూజావిధానంబులు గావించిన నతండును బ్రముదిత మానసుండగుచు సపరివారంబుగాఁ గూర్చున్న యెడ.

టీ॥ (అట్లు) చని=పోయి. మొదలన్ = తొలుత. ప్రభాసతీర్థంబునన్=ప్రభాసమను తీర్థమునందు. అవగాహనంబుచేసి = స్నానము చేసి. (అందున్=ఆతీర్థమునందు. దేవర్షి పితృతర్పణంబులు=దేవతలకొఱకును ఋషుల కొఱకును పితృదేవతల కొఱకును నైన తర్పణములను. సంప్రీతిన్=మంచిప్రీతితో. కావించి=చేసి.విమలతేజోధనులు=నిర్మలమైన తేజస్సే ధనముగాఁగలవారు—చాలతేజస్సుగలవారు. అగుభూసురప్రవరులు=అగునట్టిబ్రాహ్మణ శ్రేష్ఠులు. తనతోన్=తనవెంట. అరుగుదేరన్=రాఁగా. కదలిచని=బయలుదేఱిపోయి. క్రమంబునన్=వరుసఁగా. (సరస్వతియు బిందుసరంబును వజ్రతీర్థంబును విశాలానదియు సరయువును యమునయు) జాహ్నవియును=గంగను.కనుంగొనుచు=చూచుచు. అచ్చటనచటన్=అక్కడనక్కడ. అవగాహనంబులును=స్నానములును. దేవర్షి పితృతర్పణంబులును=దేవతలయు ఋషులయు పితరులయు తర్పణములును. బ్రాహ్మణసంతర్పణంబులును=బ్రాహ్మణుల సమారాధనములును. భూసురయుక్తుండు = బ్రాహ్మణులతోఁగూడుకొన్నవాఁడై.నడపుచున్=జరపుచును.చని=పోయి.సకలలోకస్తుత్యంబును=ఎల్లలోకములచేఁగొనియాడఁదగినదియు. నిఖిలమునిశరణ్యంబును=ఎల్ల మునులకు నివాసయోగ్య మయినదియు. (అగు నైమిశారణ్యంబుచొచ్చి) అందున్=ఆనైమిశారణ్యమునందు.దీర్ఘసత్రంబు=చిరకాలముచేయుయాగమును.నడపుచున్న=చేయుచున్న.మునిజనంబులన్=మునులను. కనుంగొని=చూచి. వారు=ఆమునులు. ప్రత్యుత్థానంబుచేసి=ఎదురుకొనిలేచివచ్చి. వినతులై = నమస్కరించినవారై. ఆసనార్ఘ్యాదిపూజావిధానంబులు=ఆసనము అర్ఘ్యము మొదలుగాఁగలపూజచేయుక్రియలను. కావించినన్=చేయఁగా. అతండును = బలరాముఁడును. ప్రముదితమానసుండు = మిక్కిలి సంతోషించినమనస్సుగలవాఁడు. (అగుచును) సపరివారంబుగాన్ = పరిజనములతోఁ గూడుకొన్నట్టుగా. కూర్చున్నయెడన్=కూర్చుండినసమయమునందు.

తా॥ ఆవిధముగాతీర్థయాత్రకుపోయి ముందుప్రభాసతీర్థమునందు స్నానముచేసి అచ్చట దేవతర్పణములు ఋషితర్పణములు పితృ తర్పణములుచేసి నిర్మలమైన తేజస్సుగలవారైన బ్రాహ్మణశ్రేష్ఠులనువెంటఁదీసికొని బయలువెడలి క్రమముగా సరస్వతీనదిని బిందుసరమును వజ్రతీర్థమునను విశాలయను నదిని సరయువునను యమునానదిని గంగానదిని స్నానములుచేయుచు అచ్చటచ్చట దేవఋషిపితృతర్పణములుచేయుచు బ్రాహ్మణసమారాధనములుచేయుచుపోయి బ్రాహ్మణసమూహములతో గూడఎల్లలోకములందునుపొగడ్తకెక్కినదియుఎల్లమునులయునికికిఁదగినదియునైన నైమిశారణ్యమునకుపోయి అందుచిరకాలమునకుసాగియునట్టియొకయజ్ఞమును చేయుచున్న మునులను జూచి వారు తన్ను ఎదుర్కొని లేచివచ్చి అర్ఘ్యము పాద్యము మొదలగు నుపచారములతో పూజచేయఁగా సంతోషించినవాఁడై తనకు యుక్తమయిన చోట పరివార జనులతోడఁ గూర్చుండియుండఁగా ననితాత్పర్యము.

౯౩౭.—క॥ ఆనెఱిఁదనుఁగని ప్రత్యు। త్థాన నమస్కార విధులు ✻ తగనడపక పెం
పూనిన పీఠముపై నా। సీనుండగు సూతు శేము ✻ షీ విఖ్యాతున్.

టీ॥ ఆనెతిన్=ఆక్రమమున—ఆఋషులుచేసినక్రమమున.తనున్=తన్ను. కని=చూచి. ప్రత్యుత్థాననమస్కారవిధుబు=ఎదురుకొనిలేచుట నమస్కారము చేయుట మొదలగు క్రియలను. తగన్ = యుక్తముచొప్పున. నడపక=చేయక. పెంపు=గౌరవము.ఊనిన=అవలంబించిన. పీఠముపైన్=పీఁటమీఁద. ఆసీనుండు=కూర్చున్న వాఁడు. అగుశేముషీవిఖ్యాతున్ = బుద్ధిబలముచేత ప్రసిద్ధుఁడైన. సూతున్=సూతుని చూచియని క్రియపైపద్యమునన్నది.

తా॥ ఆఋషుల వలెనే ప్రత్యుత్థానము నమస్కారము మొదలగు మర్యాదలుచేయకగౌరవసూచకమయినయొకపీఠమునందుఁగూర్చుండియున్నబుద్ధిమంతుఁడగుసూతునిఁ బలరాముఁడుచూచియనితాత్పర్యము




(✻) బలరాముఁడు సూతునిఁజంపి బ్రతికించుట. (✻)

వ॥ అతనిసమీపంబుననున్న విప్రవరులంజూచి రాముండు రోషించి, వీఁడునన్నుంగని లేవకుండుటకు హేతువెయ్యదియొకో,యీప్రతిలోమజాతుండు మునిగణసభాస్థలంబునం దానొక ముఖ్యుండువోలెదురభిమానంబున శక్తిమనుమనివలనం గొన్నికథలుగాథలుగానభ్యసించివిద్వద్గణ్యునివిధంబునఁబెట్టువీఁగెడునిట్టిసీచాత్ముండభ్యసించువిద్యలెల్లను మనంబునవిచారించిచూచినమదకారణంబులుఁగానిసత్వగుణగరిష్ఠంబుగావు ధర్మసంరక్షణంబు సేయ నవతరించినమాకు నిట్టిదుష్టమర్దనం బవశ్యకర్తవ్యంబని తలంచి హస్తంబునధరించిన కుశాగ్రంబున నాసూతునివధించిననక్కడిమునీంద్రులెల్ల హాహాకారంబులతోడం దాలాంకునింజూచియిట్లనిరి.

టీ॥ అతనిసమీపంబునన్ = అతనిదాపున. ఉన్న విప్రవరులన్=ఉండినబ్రాహ్మణులను. (చూచి) రోషించి=కోపించి. రాముండు=బలరాముఁడు. వీఁడు = ఈమనుష్యుఁడు. (నన్నుంగని లేవకుండుటకు హేతువెయ్యదియొకో = కారణమేమొ. ఈప్రతిలోమ జాతుండు=

తఁ సంకర జాతియందుఁ బుట్టినవాఁడు. మునిగణ సభా స్థలంబునన్ = మునులుకూడియుండుసభాప్రదేశమునందు. (తాను) ఒక్కముఖ్యుండు భో లెన్ = ఒకశ్రేష్ఠునివలెనే. మరభిమానంబునన్ = పెద్ద గర్వముచేత. శక్తిమనుమనివలనన్ = వ్యాసునివలన. (కొన్నికథలు) గాథలుగాన్ = విశేషముగా. అభ్యసించి = నేర్చి. విద్వద్గణ్యునివిధంబునన్ = విద్వాంసులలోఁ జెన్నఁదగినవానివలె. విఱ్ఱవీఁగెడున్ = నిక్కుచున్న వాఁడు. ఇట్టినీచాత్ముండు = ఇటువంటిఅల్పబుద్ధిగలవాఁడు. అభ్యసించువిద్యలెల్లన్ = నేర్చుచదువులన్నియు. మనంబునన్ = మనసునందు. వీచారించిచూచినన్ = ఆలోచించిచూడఁగా. మదకారణంబులుఁగాని = క్రొవ్వునకుఁ గారణములుగాని. సత్వగుణగరిష్ఠంబు = సాత్వికగుణముచేతగౌరవింపఁదగినవి. (కావు) ధర్మసంరక్షణంబుసేయన్ = ధర్మమునుకాపాడుటకు. అవతరించిన = పుట్టిన. (మాకు) ఇట్టిదుష్టమర్దనంబు = ఇటువంటి దుష్టుని చంపుట. అవశ్యకర్తవ్యంబు = తప్పకచేయఁదగినది. అనితలంచి = అనియెంచి. హస్తంబునన్ = చేతిలో. ధరించిన = తాల్చిన. కుశాగ్రంబునన్ = దర్భకొనతో. (ఆసూతుని) వధించినన్ = చంపఁగా. అక్కడిమునీంద్రులెల్లన్ = అక్కడనున్నమునిశ్రేష్ఠులందఱును. హాహాకారంబులతోడన్ = హాహాయనుటలతోడ. తాలాంకునిన్ = బలరాముని. (చూచి ంట్లనిరి)

తా॥ ఆసూతుని సమీపమునందున్న బ్రాహ్మణులను జూచి కోపించి బలరాముఁడు వీఁడునన్నుఁజూచి లేవకయుండుటకుఁ గారణమేమియో తెలియదు సంకర జాతి యందుఁ బుట్టిన యీదుష్టుఁడు మహాత్ములైన మునుల సభయందుశ్రేష్ఠుఁడైన యొక యుత్తమునివలె, వ్యాసుని వలన కొన్నికథలు నేర్చుకొనిగర్వించి విద్వాంసులలోఁ గణనచేయఁదగినవానివలెనే నిక్కుచున్నాఁడు వీఁడు నేర్చినవిద్యలన్నియు వీనికిక్రొవ్వును కలిగించునవిగానున్నవిగాని అణఁకువనిచ్చునవిగానుండలేదుఅని యాలోచించి లోకమునందు ధర్మమును రక్షింపఁబుట్టినమేము ఇటువంటిదుష్టులను దండింపక మానరాదు అని తనచేతనున్న దర్భకఱ్ఱతో ఆసూతుని కొట్టిచంపఁగా అచటనున్న మునులందఱు హాహాకారములు చేయుచు బలరామునిఁ జూచి యీవిధముగా పలికిరని తాత్పర్యము.

౯౩౯.—క॥ అనఘా యితనికి బ్రహ్మా । సన మిచ్చుటఁజేసి నీవు * చనుదే నితఁడా
సనముడిగఁడయ్యె నింతియ । మునునీమతి నెఱుఁగ నర్థ * ముంగలదె హలీ.

టీ॥ అనఘా = పాపములేనివాఁడైన. హలీ = బలరామా. ఇతనికిన్ = ఈసూతునికి. (బ్రహ్మాసనము) ఇచ్చుటఁజేసి = ఇచ్చినందుచేత. (నీవు) చనుదేన్ = రాఁగా. (ఇతఁడు) ఆసనము = పీఁటయందుండి. డిగఁడయ్యెన్ = దిగని వాఁడయ్యెను. ఇంతియ = ఇంతే. మును = మునుపు. నీమతిన్ = నీబుద్ధియందు. (ఎఱుఁగని) అర్థముంగలదె = విషయముఁగూడ గలదా.

తా॥ పాపము లేనివాఁడవైన యోబలరామా ! మేమితనికి బ్రహ్మాసనమిచ్చి యున్నాము కాఁబట్టి నీవు రాఁగానే యితఁడు లేవకయుండెను ఇంతేగాని ఇతనివల్లనేమియుఁ దప్పులేదు ఈవిషయము నీవు మందు ఎఱిఁగి యుండలేదా ? లోకములో నీవెఱుఁగని విషయ మేది యున్నది అనిరని తాత్పర్యము.

౯౪౦.—క॥ ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యా । దురితంబున నీమనంబు * దూఁకొనెఁ బాపో
త్తరణ ప్రాయశ్చిత్తముఁ । దొరఁకొనికావింపుమయ్య * దుర్జన హరణా.

టీ॥ దుర్జనహరణా = చెడ్డవారినినశింపఁజేయువాఁడా. ఎఱిఁగెఱిఁగి = తెలిసితెలిసీ. బ్రహ్మహత్యాదురితంబునన్ = బ్రహ్మహత్య పాపమునందు. నీమనంబు = నీమనస్సు. దూఁకొనెన్ = పొందెను. పాపోత్తరణ ప్రాయశ్చిత్తమున్ = ఈపాపమునుండి తొలఁగునట్టి పాప పరిహార కర్మను. దొరఁకొని = పూని. కావింపుమయ్య = చేయవయ్య.

తా॥ దుష్టులనునాశముచేయునట్టి యోబలరామా! తెలిసితెలిసి నీవు ఈబ్రహ్మహత్యను జేసితివి ఇఁకను ఈపాపము తొలఁగునట్టి ప్రాయశ్చిత్తమును చేసుకొనవయ్యా యనితాత్పర్యము.

వ॥ అదియునుంగాక పరమపావనుండవైననీవుధర్మంబుదప్పిననెవ్వరుమాన్పంగలరుకావునఁ బ్రాయశ్చిత్తంబుగైకొని నడపకున్నధర్మంబునిలువదుగావున దీనికిం బ్రతీకారంబు పుట్టింపుమనిన నతండువారలం గనుంగొని తామసంబున నిట్టిపాపంబు సేయంబడియె దీనికిముఖ్యపక్షంబైన ప్రకృతి యెఱింగింపుండు వీనికి నాయువును బహుసత్వంబు నొసంగిన మీకిష్టంబగునేని నాయోగ మహిమచేఁ బునర్జీవితుం గావింతునన నమ్మునులు నీయోగ మాహాత్మ్యంబున మాకెవ్విధంబుననైన నితండుమృత్యుగతుండు గాకుండునట్లు గావింపుమనిన నతండందఱంజూచి యప్పుడు.

టీ॥ (అదియునుంగాక) పరమపావనుండవు = మిక్కిలిపరిశుద్ధుఁడవు. ఐననీవు = అయినట్టి నీవు. ధర్మంబుదప్పినన్ = ధర్మమార్గమును తప్పినపక్షమున. (ఎవ్వరు) మాన్పంగలరు = పోఁగొట్టఁగలరు—వద్దనఁగలరు అనుట. కావునన్ = కనుక. ప్రాయశ్చిత్తంబు = పాపపరిహార కర్మను. కైకొని = అంగీకరించి. నడపకున్నన్ = జరపని పక్షమున. (ధర్మంబునిలువదుకావున) దీనికిన్ = ఈనీవుచేసినపనికి. ప్రతీకారంబు = ప్రతిక్రియను. పుట్టింపుము = కలుగఁజేయుము. అనినన్ = అని మునులుచెప్పఁగా. అతండు = బలరాముఁడు. వారలన్ = ఆమునులను కనుంగొని = చూచి. తామసంబునన్ = కోపముచేత. (ఇట్టిపాపంబు చేయంబడియెను) దీనికిన్ = ఈపాపకృత్యమునకు. ముఖ్యపక్షంబైన = మిక్కిలి ముఖ్యమైన. ప్రతికృతి = ప్రతిక్రియను—ప్రాయశ్చిత్తమును. ఎఱింగింపుండు = తెలియఁజేయుఁడు. వీనికిన్ = ఈసూతునికి. ఆయువును = ఆయుస్సును. బహుసత్వంబును = అధికబలమును. ఒసంగినన్ = ఇచ్చిన. మీకిష్టంబగునేని = మీకుసమ్మతియయ్యెడుపక్షమున. నాయోగమహిమచేన్ = నాదైన యోగ ప్రభావముచేత. పునర్జీవితుంగావింతును = మరలబ్రతికినవానిఁగాఁజేయుదును. అనన్ = అనఁగా. అమ్మునులు = ఆఋషులు. మాకున్ = మాకొఱకు. నీయోగమాహాత్మ్యంబునన్ = నీయోగమహిమచేతనైనను. ఎవ్విధంబుననైనన్ = మఱియేవిధముచేతనైనను. ఇతండు = ఈసూతుఁడు. మృత్యుగతుండు = మృత్యువును పొందిన వాఁడు — చచ్చినవాఁడు. (కాకుండునట్లు) కావింపుము = చేయుము. అనినన్ = అనఁగా. అతఁడు = బలరాముఁడు. అందఱన్ = ఎల్లవారిని. (చూచి) అప్పుడు = ఆసమయమునందు.

తా॥ అదిగాక చాలపరిశుద్ధుఁడవైన నీవుధర్మమందప్పినట్టియిన నదియుక్తముకాదని చెప్పఁగలవారు ఇచట నెవరున్నారు కాఁబట్టి తగినప్రాయశ్చిత్తమును అంగీకరించి చేసికొనుము అట్లు చేసికొనని పక్షమున ధర్మమునిలువదు అనఁగా బలరాముఁడు మునులనుజూచి ఈపాపము అజ్ఞానవశముననాచేతఁ జేయఁబడెను దీనికిఁగలప్రాయశ్చిత్తములలో మిక్కిలి ముఖ్యమయినదానినిచెప్పుఁడు నేనుచేసికొనెదను ఇప్పుడు ఈసూతునికిఆయుస్సుబలమునుగావలెనన్నను నాయోగబలముచేతఁ గలుగఁ జేసెదను అనఁగావారు నీయోగ బలముచేతనైనను మఱియేవిధముచేతనైనను ఇతఁడుచావక బ్రతికియుండుట మాకుముఖ్యము కాఁబట్టి యితనిబ్రతికింపు మనఁగా బలరాముఁడు వారినందఱను జూచి యని తాత్పర్యము.

౯౪౨.—క॥ ధాత్రీవర సమధిక చా । రిత్రుఁడు హలపాణి వలికె * ధృతి నాత్మావై
పుత్రనామాసి యనెడు ప । విత్ర శ్రుతివాక్యసరణి * విశదంబగుటన్.

టీ॥ ధాత్రీవర = ఓరాజా. సమధికచారిత్రుఁడు = మిక్కిలి యెచ్చైనసడవడిగలవాఁడైన. హలపాణి=బలరాముఁడు. ధృతిన్ = ధైర్యముతో. ఆత్మావైపుత్రనామాసి=తానేపుత్రుఁడను వాఁడవైతివి. (అనెడి) పవిత్రశ్రుతివాక్యసరణి=పరిశుద్ధమైనవేదవాక్యమువిధము. విశదంబగుటన్=స్పష్టమగుటచేత. పలికెన్=వారితోనిట్లుపలికెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా ! మిక్కిలి మేలైన నడవడిగల బలరాముఁడు ధైర్యముతో తానేకొడుకు అగును అను వేదవాక్యార్థము స్పష్టమగుటచేత ఆమునులనుజూచి యీవిధముగా పలికెనని తా.

౯౪౩.—క॥ ఈసూత సుతున కిపుడు మ । హాసత్వము నాయువును న * నామయమును వి
ద్యాసామర్థ్యముఁ గలిగి సు । ధీ సత్తములార యీక్షితిన్ * విలసిల్లున్.

టీ॥ సుధీసత్తములార = విజ్ఞానవంతులలోనుత్తములగుమునులారా. (ఈసూతసుతునకు) ఇపుడు=ఇప్పుడు. మహాసత్వమున్= అధికబలమును. ఆయువున్=ఆయుస్సును. అనామయమున్=వ్యాధిలేమిని. విద్యాసామర్థ్యమున్=చదువునందలిసమర్థతయును. కలిగి= కలుగఁగా. ఈక్షితిన్=ఈభూమియందు. విలసిల్లున్=వెలయును.

తా॥ ఓమునీశ్వరులారా ! ఈసూతుఁడు అధిక బలమును దీర్ఘాయుస్సును వ్యాధిలేమియు విద్యయందలినేర్పునుగలవాఁడై ఈభూలోకమునందు ప్రసిద్ధి వహించును అని తాత్పర్యము.

౯౪౪.—వ॥ అని సూతుం బునర్జీవితుంగాఁ జేసి మునులంజూచి యిట్లనియె.

టీ॥ (అని) సూతున్ = సూతుని. పునర్జీవితుంగాఁజేసి=మరల బ్రతికించినవానిఁగాఁజేసి. (మునులంజూచియిట్లనియెను)

తా॥ అనిచెప్పి సూతునిమరలబ్రతికించి ఆమునులతోనిట్లు పలికెననితాత్పర్యము.

౯౪౫.—తే॥ ఏనెఱుంగక చేసిన * యీయవజ్ఞ । శాంతి వొందంగ నేమభీ * ష్టంబు మీకు
దానిఁగావింతుననిన మో * దంబునొంది । పలికిరత్తాపసులుహల * పాణిఁజూచి.

టీ॥ ఏను=నేను. (ఎఱుంగక)చేసినయీయవజ్ఞ=చేసినట్టియీతప్పు. శాంతివొందంగన్=శమించునట్లు. (మీకు) ఏమభీష్టంబు = కోరికయేమో. దానిన్=ఆపనిని. కావింతున్=చేయుదును. అనినన్= అనఁగా. మోదంబున్=సంతోషమును. ఒంది = పొంది. అత్తపసులు = ఆమునులు. హలపాణిన్=బలరాముని. (చూచిపలికిరి)

తా॥ నేను తెలియకచేసిన యీతప్పును మన్నింపఁ గలందులకై మీకు ఏదియిష్టమోదానినిచేసెదను అనఁగా వారుసంతోషించి బలరామునితో ఇట్లుపలికిరి అని తాత్పర్యము.

౯౪౬.—చ॥ హలధర యిల్వలుండను సు * రారి తనూజుఁడు పల్వలుండునాఁ
గలఁడొక దానవుండు బల * గర్వములం బ్రతిపర్వమందు నుం
జలమున వచ్చి మాసవన * శాలల మూత్ర సురాస్ర పూయ వి
ట్పలలము లోలిమైఁగురిసి * పాడఱఁజేయును యజ్ఞ వాటముల్.

టీ॥ హలధర=ఓబలరాముఁడా. (ఇల్వలుండు) అనుసురారితనూజుఁడు=అనునట్టి రాక్షసునికొడుకు. పల్వలుండునాన్ = పల్వలుఁడు అనఁగా. ఒకదానవుండు = ఒకరాక్షసుఁడు. (కలఁడు) బలగర్వములన్=బలముచేతను గర్వముచేతను. ప్రతిపర్వమందునున్=ప్రతిపర్వదినమునందును. చలమునన్=మాత్సర్యముతో. (వచ్చి) మాసవనశాలలన్=మాయజ్ఞశాలలయందు. మూత్రసురాస్రపూయవిట్పలలములు=ఉచ్చకల్లునెత్తురుచీముమలముమాంసములను. ఓలిమైన్= ఒకటినొకటిగాక్రమముతో. కురిసి=వానగాకురియించి. యజ్ఞవాటములు=యజ్ఞశాలలను. పాడఱఁజేయున్=పాడైపోవునట్లుచేయును.

తా॥ ఓబలరామా ! ఇల్వలుఁడు అనురాక్షసునికొడుకైన పల్వలుఁడు అనువాఁడు బలముగలవాఁడగుటచేత మిగులక్రొవ్వినవాఁడై ప్రతిపర్వ దినమునందును మాయజ్ఞశాలలలో ఉచ్చ నెత్తురు చీము మలము మాంసము కల్లు మొదలగు రోఁత వస్తువులను వానగా కురియించిఅన్నియజ్ఞశాలలనుపాడుచేయుచున్నాఁడు అనితాత్పర్యము.

౯౪౭.—వ॥ కావున నాదుష్టదానవుం ద్రుంచుటయ మాకుంగరంబు సంతసంబంతమీఁద నీవు
విమలచిత్తుండవై భారతవర్షంబునంగలతీర్థంబుల ద్వాదశమాసంబు లవగాహంబు
సేయు మట్లైన సర్వపాపనిష్కృతి యగునని పలికిరంతం బర్వసమాగమంబైన.

టీ॥ కావునన్ = కనుక. ఆదుష్టదానవున్ = దుష్టుఁడైనయారాక్షసుని. త్రుంచుటయు = చంపుటయే. మాకున్ = మాకు. కరంబు = మిక్కిలి. సంతసంబు = సంతోషము. అంతమీఁదన్ = అట్లువానిఁజంపినపిమ్మట. (నీవు) విమలచిత్తుండవై = నిర్మలమైనమనసుగలవాఁడవై. భారతవర్షంబునన్ = భరతునిచేత నేలఁబడినదైన యీభరతఖండమునందు. కల తీర్థంబులన్ = ఉండునట్టిపుణ్యనదీసరోవరములందు. ద్వాదశమాసంబులు = పండ్రెండు నెలలు. అవగాహంబుసేయుట = స్నానము చేయుట. అట్లయినన్ = అట్లునీవుచేసినట్టయిన. సర్వపాపనిష్కృతి = ఎల్లపాపములయొక్క తొలఁగుట. (అగునని) పలికిరి = చెప్పిరి. అంతన్ = పిమ్మట. పర్వసమాగమంబైనన్ = పర్వదినము రాఁగా.

తా॥ కాఁబట్టి ఆదుష్టుఁడయిన రాక్షసునిఁ జంపుట మాకోరిక అందువలన మేము చాల సంతోషింతుము అట్లువానినిజంపి మమ్మును సంతోషపెట్టి పిమ్మటనీవు ఈభరతఖండమునందుఁగల పుణ్యతీర్థములన్నిటియందును పండ్రెండు నెలలు తిరిగి స్నానముచేసితివేని అంతటితో ఎల్లపాపములు తొలఁగిపోవును అనిచెప్పిరి అంతట పర్వదినము వచ్చెనని తాత్పర్యము.



(*) బలరాముఁడు పల్వలుఁడను రాక్షసునిఁ జంపుట. (*)

సీ॥ మునులుయజ్ఞక్రియో * న్ముఖులౌటఁగనుఁగొని - పఱతెంచియసురత * ద్భవనములను
రక్తవిణ్మూత్రసు * రామాంస జాలంబు - నించి హేయంబుగా * వించిపెలుచఁ
బెంధూళి రాలును * బెల్లలు నురవెడి - చక్రానిలము వీచి * చదల నపుడు
కాటుకకొండసం * గతిఁబొల్చుమేను తా - మ్రశ్మశ్రుకేశస * మాజములును
తే॥ నవ్యచర్మాంబరముభూరి * నాసికయును। గఱకుమిడిగ్రుడ్లు నిప్పులు * గ్రక్కుదృష్టి
వ్రేలుపెదవులుదీర్ఘక * రాళజిహ్వ। కయును ముడివడ్డబొమలును * గలుగువాని.

టీ॥ (మునులు) యజ్ఞక్రియోన్ముఖులు = యజ్ఞకార్యములుచేయుటకుపూనినవారు. ఔటన్ = అగుటను. కనుఁగొని = చూచి. పఱతెంచి = పరుగెత్తివచ్చి. అసుర = రాక్షసుఁడు. తద్భవనములన్ = ఆయజ్ఞశాలల యందు. రక్తవిణ్మూత్రసురా మాంస జాలంబున్ = నెత్తురుమలము మూత్రము కల్లు మాంసములసముదాయమును. నించి = నిండించి. హేయంబుగావించి = రోఁతచేసి. పెలుచన్ = భయంకరముగా. పెంధూళి = అధికమయినదుమ్మును. రాలును = రాళ్లును. పెల్లలును = మట్టిచెక్కలును. ఉరవెడి = పడునట్టి. చక్రానిలము = సుడిగాలి. వీచి = విసరునట్లుచేసి. (అపుడు) చదలన్ = ఆకాశమునందు. కాటుకకొండసంగతిన్ = కాటుకకొండవలె. పొల్చు = ఒప్పునట్టి. మేను = దేహమును. తామ్రశ్మశ్రుకేశ సమాజములును = ఎఱ్ఱని గడ్డము మీసము తలవెండ్రుకల సముదాయములును. నవ్య చర్మాంబరమున్ = క్రొత్తతోలుబట్టయు. భూరినాసికయున్ = పెద్దముక్కును. కఱకుమిడిగ్రుడ్లున్ = గడుసులై మీఁదికుబికినట్లు కానవచ్చు కనుగ్రుడ్లును. నిప్పులుగ్రక్కుదృష్టిన్ = నిప్పులనుఉమియుచున్న చూపులును — ఎఱ్ఱగాను వెండ్రముగాను దోఁచునట్టి చూపులును అనుట. వ్రేలు = వ్రేలాడునట్టి. (పెదవులును) దీర్ఘకరాళజిహ్వకయును = నిడుపును భయంకరమునైన నాలుకయును. ముడివడ్డబొమలును = ముడివేసినట్టుకనఁబడుకనుబొమలును. కలుగువానిన్ = కలుగునట్టి వానిని.

తా॥ మునులందఱుయజ్ఞములుచేయనారంభింపఁగా చూచిపల్వలుఁడువచ్చి ఆయజ్ఞ శాలలయందు నెత్తురు మాంసము మలము మూత్రము కల్లు వీని నిండించి రోఁతచేసి వారెల్లను భయముఁపుట్టునట్టు సుడిగాలికొట్టునట్టుచేసి ఆసుడిగాలివలన అధికమయినదుమ్ము రాళ్లు మట్టిపెల్లలును ఆవరింపఁగా ఆకాశమునందు కాటుక కొండవలె నల్లని పెద్దదేహమును ఎఱ్ఱనిగడ్డము మీసము తలవెండ్రుకలును క్రొత్త తోలువస్త్రమును, పెద్దముక్కును, మిడిగ్రుడ్లును, చుఱుకు చూపులును, నిడుపాటిదియు భయమును పుట్టించు నట్టిదియునైన నాలుకయు, ముడివేసినట్టుకదియఁబడినకనుబొమలునుఁ కలిగినవాఁడై కానఁబడెనని తాత్పర్యము.

మహాస్రగ్ధర॥ కనిమెన్ దాలాంకుఁడుద్య * త్కటచటులనట * త్కాలదండాభ శూలున్
జనరక్తాసిక్తతాలున్ * సమధిక సమరో * త్సాహ లోలున్ గఠోరా
శని తుల్యోదగ్రదంష్ట్రా * జనిత శిఖికణా * చ్ఛాదితాశాంత రాళున్
హనన వ్యాపార శీలున్ * నతిదృఢ ఘనమ * స్థ్యాస్థిమాలున్ గరాళున్.

టీ॥ ఉద్య...శూలున్ — ఉద్యత్ = ఎత్తఁబడిన. కట = కణఁతల యొక్క. చటుల = తత్తఱముతోడ. నటత్ = చలించుచున్న. కాలదండ = యమునిదండాయుధముతోడ. ఆభ = సమానమయిన. శూలున్ = శూలముగలవానిని. జనరక్తాసిక్తతాలున్ — జన = జనుల యొక్క. రక్త = నెత్తుటిచేత. ఆసిక్త = అంతట తడుపఁబడిన. తాలున్ = దవుడలు గలవానిని. సమధికసమరోత్సాహలోలున్ = హెచ్చైనయుద్ధోత్సాహమునందాసక్తుఁడైనవానిని. కఠోర...రాళున్ — కఠోర = కఠినమయిన. అశని = వజ్రాయుధముతోడ. తుల్య = సమానమయిన. ఉదగ్ర = మొనలుమీఁదికి నిక్కిన. దంష్ట్రా = కోఱలయందు. జనిత = పుట్టిన. శిఖికణ = నిప్పురవలచేత. ఆచ్ఛాదిత = కప్పఁబడిన. ఆశా = దిక్కులయొక్క. అంతరాళున్ = మధ్యభాగము గలవానిని. హననవ్యాపారశీలున్ = చంపునట్టిపనియేతననడవడిగాఁగలవానిని.

అతిదృఢఘనమస్తాస్థిమాలున్ = మిక్కిలిగట్టివియు,బరువైనవియునైన తలపుత్తె యెముకలచేనైనసరములుగలవానిని. కరాళున్ = క్రూరుని. తాలాంకుఁడు = బలరాముఁడు. కనియెన్ = చూచెను.

తా॥ నిక్కిచలించుచున్న కణఁతలతో యమునిదండమును బోలిన శూలమును చేతఁబట్టి త్రిప్పుచు మనుష్యుల నెత్తురు ప్రక్కిలించుచు, యుద్ధము నందలి యుత్సాహముతో వజ్రాయుధము వలె కఠినమైై మీఁదికినిక్కిన మొనలుగల కోఱల యొరపిడిచేత నిప్పురవలు రాలుచుండఁగా ప్రాణులను హింసించుటయే నడవడిగాఁగలిగి తలపుత్తె యెముకలను సరములుసరములుగా గ్రుచ్చి మెడనువేసికొని భయమునుతోఁపించుచున్న పల్వలునిబలరాముఁడుచూచెననితాత్పర్యము.

౯౫౦.—ఉ॥ వెండియుఁ గ్రొమ్మెఱుంగు లుడు * వీధి వెలుంగఁగ నుల్లసద్గదా
దండముఁ గేలఁ ద్రిప్పుచు ను * దారతరా బలభద్రుఁ డాసురో
ద్దండ విఘాతకుల్ ముసల * దారుణ లాంగలముల్ దలంపమా
ర్తాండ నిభంబులై యెదురఁ * దత్క్షణమాత్రనఁ దోఁచినన్ వెసన్.

టీ॥ వెండియున్ = మఱియును. ఉడువీధిన్ = ఆకాశమునందు. క్రొమ్మెఱుంగులు = క్రొత్తమెఱపులు. వెలుంగఁగన్ = ప్రకాశింపఁగా. ఉల్లసద్గదాదండమున్ = మెఱయుచున్న గుదియకఱ్ఱను. కేలన్ = చేతితో. (త్రిప్పుచును) ఉదారతన్ = దిట్టతనముతో. రాన్ = రాఁగా. బలభద్రుఁడు = బలరాముఁడు. అసురోద్దండవిఘాతకుల్ = అసురుఁడైన పల్వలునియొక్కనిక్కును అణఁగఁగొట్టుటకు. ముసలదారుణ లాంగలములు = రోఁకటిని క్రూరమయిన నాఁగేటిని. తలంపన్ = తలఁచుకొనఁగా, మార్తాండనిభంబులై = సూర్యునివలె వెలుఁగుచున్నవై. తత్క్షణమాత్రన = ఆక్షణమాత్రముననే. ఎదురన్ = తనయెదుట. తోఁచినన్ = కానఁబడఁగా. వెసన్ = శీఘ్రముగా.

తా॥ ఇదిగాకవాఁడుమింటను క్రొత్తమెఱపులు మెఱసినట్లు తనచేతి గదాయుధమును త్రిప్పిచు దిట్టతనముతో పైఁబడి రాఁగాచూచి బలరాముఁడుతన ముసలాయుధమును హలాయుధమును దలఁపఁగా అవి అప్పుడే సూర్యునితేజస్సుతో వచ్చి ఎదుటనిల్చెనని తాత్పర్యము.

౯౫౧.—వ॥ అట్లు సన్నిహితంబులైన తనకార్య సాధనంబులగు నిజ సాధనంబులు ధరియించి యప్పుడు.

టీ॥ అట్లు = ఆతీరున. సన్నిహితంబులైన = దగ్గఱకువచ్చినవైన. తనకార్యసాధనంబులగు = తానుచేయఁదలఁచిన పనికి ఉపకరించునవియైన. నిజసాధనంబులు = తనయాయుధములను. (ధరియించిఅప్పుడు)

తా॥ ఆవిధముగా దగ్గఱకువచ్చినవియుతానుచేయఁబూనుకొన్న పనికినుపకరించునవియునైన తనయాయుధములను శీఘ్రముగపుచ్చుకొని ధరించినవాఁడై ఆసమయమునందని తాత్పర్యము.

౯౫౨.—చ॥ గగనమునం జరించు సుర * కంటకు కంఠము చేతినాఁగటన్
దగిలిచి రోఁకలెత్తి జెడి * దంబడరన్ నడునెత్తి మొత్తినన్
భుగభుగ నెత్తురొల్క నిల * బోరగిలంబడె వజ్ర ధారచేఁ
దెగి ధరఁగూలు భూరి జగ * తీధరముల్ బురుడింపఁ జెట్టుగాన్.

టీ॥ గగనమునన్ = ఆకాశమునందు. చరించు సురకంటకు కంఠమున్ = మెలఁగుచున్న రాక్షసుని మెడను. చేతినాఁగటన్ = తనచేతనున్న నాఁగేటితో. తగిలిచి = తగిలించి. (రోఁకలెత్తి) జెడిదంబు = కఠినత్వము. అడరన్ = అతిశయింపఁగా, నడునెత్తిన్ = నడితలను. మొత్తినన్ = మోఁదఁగా. వజ్రధారచేన్ = వజ్రాయుధపు మొనవ్రేటుచేత. (తెగి) ధరన్ = భూమియందు. కూలు = పడునట్టి. భూరిజగతీధరమున్ = పెద్దకొండను. పురుడింపన్ = పోలునట్లు. జెట్టుగాన్ = భయంకరముగా. భుగభుగ = భుగభుగయని. (నెత్తురు ఒల్క) ఇలన్ = నేలమీఁద. (బోరగిలం బడెను)

తా॥ ఆకాశమునందుతిరుగుచున్న ఆపల్వలునిమెడను తననాఁగేటిని తగిలించి దగ్గఱనీడ్చుకొని రోఁకటితో వానినెత్తిపై నాకకెట్టు పెట్టఁగా వాఁడు వజ్రాయుధము దెబ్బచేత తెగినేలఁబడెడు పర్వతమువలెనే నెత్తురుక్రక్కుకొనుచు నేలను బోరఁగిలఁబడె నని తా.

టీ॥ (ఇట్లుపల్వలుఁడు) మడిసినన్ = చావఁగా.

౯౫౩.—క॥ మునివరులు గామపాలుని । వినుతించిరి వేయువేల * విధముల వృత్రున్
దునిమిన యింద్రుని నమరులు । వినుతించిన రీతి నపుడు * విమల చరిత్రా.

టీ॥ విమలచరిత్రా = నిర్మలమయిననడవడిగలపరీక్షిన్మహారాజా. మునివరులు = మునిశ్రేష్ఠులు. కామపాలునిన్ = బలరాముని. వృత్రున్ = వృత్రాసురుని. తునిమినయింద్రునిన్ = చంపినట్టి దేవేంద్రుని. అమరులు = దేవతలు. వినుతించినరీతిన్ = పొగడిన విధమున. (అపుడు) వేయువేలవిధములన్ = బహువిధములచేత. వినుతించిరి = పొగడిరి.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! మునుపువృత్రాసురునిఁ జంపినదేవేంద్రుని దేవతలు కొనియాడినట్లు అప్పుడు మునిశ్రేష్ఠులు బలరాముని బహువిధములఁ గొనియాడిరని తాత్పర్యము.

౯౫౪.—తే॥ అంత నభిషిక్తుఁ జేసి య * త్యంత సురభి । మంజులామ్లాన కంజాత * మాలిక యను
నంచితవిభూష మృదుల ది * వ్యాంబరములు । నర్థినిచ్చినఁ దాల్చియా * హాలధరుండు.

టీ॥ అంతన్ = అంతట. అభిషిక్తుఁజేసి = అభిషేకింపఁబడిన వానిఁగాఁజేసి. అత్యంత ... మాలికయును-అత్యంత = మిక్కుటమయిన. సురభి = పరిమళముగల. మంజుల = మనోజ్ఞమయిన. అమ్లాన=వాడని. కంజాతమాలికయును=తామరపువ్వులసరమును. అంచిత...ములు-అంచిత = ఒప్పిదములయిన. విభూష = సొమ్ములను. మృదుల=నయతరమయిన. దివ్య=అప్రాకృతమయిన. అంబరములు = వస్త్రములను. అర్థిన్ = ప్రీతితో. ఇచ్చినన్=ఇయ్యఁగా. ఆహలధరుండు=ఆబలరాముఁడు. తాల్చి = ధరించినవాఁడై.

తా॥ అంతట ఆమునులు బలరాముని స్నానముచేయించి మంచి పరిమళము గల మనోజ్ఞమయి వాడనిదయిన తామర పువ్వుల సరమును వెలలేని యాభరణములను మంచి నయముమీరినవస్త్రములను ఇయ్యఁగాబలరాముఁడు వానిని ధరించినవాఁడై యని తాత్పర్యము.

౯౫౫.—క॥ దేవేంద్రుఁబోలె నొప్పెసు । ధీవిలసితుఁడగుచు ముని త ✻ తిన్ వీడ్కొని తన్
సేవించుచుఁ గతిపయ వి । ప్రావలి చనుదేరఁ గౌశి ✻ కాఖ్యంబునకున్.

టీ॥ దేవేంద్రుఁబోలెన్=ఇంద్రునివలెనే. (ఒప్పెను) సుధీవిలసితుఁడగుచున్ = మునులచేత ప్రకాశింపఁజేయఁబడిన వాఁడగుచు. మునితతిన్=ఆమునులను.వీడ్కొని=వదలుకొని. తన్ = తన్ను. (సేవించుచు) కతిపయవిప్రావలి=కొంత బ్రాహ్మణ సంఘము. చనుదేరన్=రాఁగా. కౌశికాఖ్యంబునకున్ = కౌశికయను పేరుగల తీర్థమునకు. (చనియెను)

తా॥ అప్పుడుబలరాముఁడు ఇంద్రునివలెనేశ్లాఘింపఁబడిన వాఁడగుచు ఆమునులవలన సెలవుపుచ్చుకొని బయలుదేఱి తనవెంటకొందఱు బ్రాహ్మణులుకొలిచిరాఁగా కౌశికయను తీర్థమునకు పోయెను అని తా.

౯౫౬.—వ॥ చని యమ్మహానదిం గృతస్నానుండై యచ్చోటువాసి సరయువునందుఁగ్రుంకులిడి ప్రయాగ
నవగాహనంబుచేసి దేవర్షి పితృ తర్పణంబులాచరించి పులస్త్యాశ్రమంబుసొచ్చి గోమతిం
దర్శించిగండకీనదిను త్తరించి విదళితభవపాశయగు విపాశయందుఁదోఁగి శోణనదంబున
నాప్లావితుండై గయనాడిగంగాసాగరసంగమంబు దర్శించి మహేంద్ర నగంబునకరిగి.

టీ॥ చని = ఇట్లుపోయి. అమ్మహానదిన్=ఆగొప్ప యేటియందు. కృతస్నానుండై=స్నానముచేసినవాఁడై. ఆచ్చోటువాసి = ఆప్రదేశమునువదలి. సరయువునందున్=సరయూనదియందు. క్రుంకులిడి=స్నానములుచేసి. ప్రయాగన్=ప్రయాగయందు. అవగాహనంబుచేసి=స్నానముచేసి. (దేవర్షి పితృతర్పణంబులు) ఆచరించి=చేసి. పులస్త్యాశ్రమంబు = పులస్త్యునియొక్క యాశ్రమమును. చొచ్చి = ప్రవేశించి. గోమతిన్=గోమతీనదిని. దర్శించి=చూచి. (గండకీనదిని) ఉత్తరించి=దాఁటి. విదళితభవపాశ=త్రెంపఁబడిన జన్మపాశములు గలది. అగు విపాశయందున్ = అగునట్టి విపాశయనునదియందు. తోఁగి=స్నానముచేసి. శోణనదంబునన్=శోణము అనునట్టి పడమరఁగా పాఱు నేటియందు. ఆప్లావితుండై = స్నానముచేసిన వాఁడై. గయన్ = గయాక్షేత్రమునందు. ఆడి=స్నానముచేసి. గంగాసాగరసంగమంబుదర్శించి= గంగసముద్రమునఁ జేరుతావునుచూచి. మహేంద్రనగంబునకున్ = మహేంద్రమనుకొండకు. అరిగి=పోయి.

తా॥ అంతట బలరాముఁడు ఆకౌశికా నదియందు స్నానము చేసి అందుండికదలి సరయువునకుఁబోయి ఆపుణ్యనదియందును స్నానముచేసి గంగా యమునలు సంగమమగు చోటయిన ప్రయాగకు పోయి స్నానతర్పణములుచేసికొని అక్కడనుండిపులస్త్యాశ్రమమునకుఁబోయి గోమతీనదిలో స్నానముచేసి అందుండి గండకీవిపాశానదులకుఁబోయి స్నానములుచేసిశోణనదమునకుఁబోయిఅందును స్నానముచేసిగయకుఁబోయిఅచ్చటిపుణ్యతీర్థమున స్నానముచేసిగంగసముద్రముచేరుచోటికిఁబోయి అందుస్నానదర్శనములను జేసిఅందుండిమహేంద్రపర్వతమునకు పోయియని తాత్పర్యము.

౯౫౭.—క॥ రాముఁడు గనుఁగొనె భార్గవ । రామున్ రజనీశకుల ధ ✻ రావరనగ సు
త్రాముఁ సన్నుత సుగుణ । స్తోమున్ గారుణ్యసీమ ✻ సుజనలలామున్.

టీ॥ రాముఁడు=బలరాముఁడు. రజ...త్రామున్-రజనీశకుల=చంద్ర వంశస్థులయిన. ధరావర = రాజులకెల్ల. నగ=కొండలకు. సుత్రామున్=ఇంద్రుఁడయినవానిని. సన్నుతసుగుణస్తోమున్ = కొనియాడఁబడిన మంచిగుణములగుంపులు గలవానిని. కారుణ్యసీమున్=దయకుమేరయయినవానిని. సుజనలలామున్=సజ్జనులకు ఆభరణమైన వానిని. భార్గవరామున్=పరశురాముని. కనుఁగొనెన్ = చూచెను.

తా॥ ఆమహేంద్ర పర్వతమునందు బలరాముఁడు చంద్ర వంశపు రాజులనందఱను చంపిన వాఁడును, మంచి గుణములన్నియును గల వాఁడును, దయకు ఉనికిపట్టయినవాఁడును, మంచివారికెల్ల ఆభరణమయినవాఁడునైనపరశురామునిఁజూచెనని తాత్పర్యము,

౯౫౮.—ఆ॥ కనినమస్కరించి ✻ కౌతుకంబలరార । నతనివీడుకొని హ ✻ లాయుధుండు
గొమరుమిగులు సప్త ✻ గోదావరికి నేగి । యందుఁ దీర్థమాడి ✻ యచటుఁగదలి.

టీ॥ కని=చూచి. నమస్కరించి=మ్రొక్కి. కౌతుకంబు=కుతూహలము. అలరారన్=ఒప్పఁగా. అతనివీడుకొని. ఆయనవద్దనుండిసెలవుపుచ్చుకొని. హలాయుధుండు=బలరాముఁడు. కొమరుమిగులు=అందమతిశయించునటి. సప్తగోదావరికిన్=సప్త గోదావరము అనుపుణ్యతీర్థమునకు-గోదావరి సప్తఋషినామములతో చీలియున్న యేడుప్రవాహములకును. ఏగి=పోయి. అందున్=ఆసప్తగోదావరమునందు. తీర్థమాడి=స్నానముచేసి. అచటు=ఆతావునుండి. కదలి=బయలుదేఱి.

తా॥ పరశురామునిఁజూచి ఆయనకుమ్రొక్కి ఆయనచేత సెలవుపుచ్చుకొని అందుండి బలరాముఁడుసప్తగోదావరము అను పుణ్యతీర్థమునకుఁబోయి అందు స్నానముచేసి అచ్చటినుండి వెడలినవాఁడై యని తా.

వ॥ వేణాపంపా సరస్సులంజూచి భీమరథికేగి యందుఁగుమారస్వామినిదర్శించి శ్రీశైలంబునకుంజని వేంకటాచలంబు దర్శించి కామకోటిశక్తి నిరీక్షించి కాంచీపురంబుఁగాంచి కావేరికింజని యమ్మహావాహిని నవగాహనంబు చేసి.

టీ॥ వేణాపంపాసరస్సులన్=వేణాసరస్సునుపంపాసరస్సును(చూచి) భీమరథికిన్=భీమరథియను నేటికి. ఏగి=పోయి. అందున్=అచ్చట. (కుమారస్వామిని) దర్శించి=చూచి. (శ్రీశైలంబునకు) చని=పోయి. (వేంకటాచలంబును) దర్శించి=చూచి. కామకోటిశక్తిని=నిరీక్షించి=చూచి.(కాంచీపురంబును) కాంచి=చూచి(కావేరికి)చని=పోయి.అమ్మహావాహినిన్=అగొప్పనదియందు.అవగాహనంబుచేసి=స్నానముచేసి.

తా॥ వేణ పంప అను సరస్సు లను జూచి భీమరథీ నదికిఁ బోయి అచ్చట కుమారస్వామినిజూచి శ్రీశైలమునకుఁబోయి అందుండి వెడలి వేంకటేశ్వరులకొండను జూచి కామకోటిశక్తిందర్శించి కంచినిఁజూచి కావేరికిపోయి అపుణ్యనదిలో స్నానముచేసియనితాత్పర్యము.

(*) బలరాముఁడు రంగనాథుని దర్శించుట (*)



స్రగ్ధర॥ సేవించెన్ రంగధామున్ * శ్రితనివహ
పయ * స్సింధు సంపూర్ణసోమున్
గావేరీ మధ్య సీమున్ * ఘన కలుష
మహా * కాలకూటోగ్ర భీమున్
దేవారి శ్రీవిరామున్ * దివిజ వినుత
సం * దీపితా నంత నామున్
ధీ విజ్ఞానాభి రామున్ * త్రిభు వన
విలస * ద్దేవతా సార్వ భౌమున్.

టీ॥ శ్రిత ... సోమున్ — శ్రిత = ఆశ్రయించినవారి యొక్క. నివహ=సమూహమనెడు. పయస్సింధు=పాలసముద్రమునకు. సంపూర్ణ సోమున్=నిండుచంద్రుఁడైనవాఁడును, కావేరిమధ్యసీమున్=కావేరినడిమిచోటుగలవాఁడును. ఘన...భీమున్ — ఘన = అధికములయిన. కలుష=పాపములనెడు. మహాకాలకూట=అధికమయిన కాలకూటమనెడు విషమునకు. ఉగ్ర=భయంకరుఁడైన, భీమున్ = శివుఁడైన వాఁడును. దేవారి శ్రీవిరామున్=రాక్షసులకలిమిని అణఁచినవాఁడును.దివిజ... నామున్— దివిజ=దేవతలచేత. వినుత = కొనియాడఁబడుటవలన. సందీపిత=వెలుఁగునట్టి. అనంతనామున్=మితిలేని పేళ్లుగలవాఁడును. ధీవిజ్ఞానాభి రామున్=శాస్త్రజ్ఞాన అనుభవ జ్ఞానముల చేతను ఒప్పినవాఁడును. త్రిభువన ... భౌమున్—త్రిభువన=మూఁడులోకము లందును.విలసత్=వెలుఁగుచున్న. దేవతా సార్వభౌమున్=దేవతలకు చక్రవర్తియునైన.రంగధామున్—రంగ=శ్రీరంగమే.ధామున్=నివాసస్థలము గాఁగల శ్రీరంగనాయకుని. (సేవించెను)

తా॥ తన్నాశ్రయించిన వారి సమూహమనెడు పాలసముద్రమును పూర్ణచంద్రునివలె ఉప్పొంగఁజేయువాఁడును, కావేరినడుమ వసించిన వాఁడును, మహాపాతకములనెడు విషమును శివునివలె మ్రింగివేయు వాఁడును, రాక్షసుల సంపదను పోఁగొట్టువాఁడును, దేవతలు కొనియాడఁగా ప్రసిద్ధివహించిన అనేక నామములుగల వాఁడును, జ్ఞాన విజ్ఞానములను అనుగ్రహించుటచేత ఒప్పిన వాఁడును, మూఁడులోకములయందు వన్నెకెక్కిన దేవతా చక్రవర్తియు నైన శ్రీరంగనాథ స్వామిని బలరాముఁడు సేవించెనని తాత్పర్యము.

## విశేషార్థము.

శ్లో॥ సప్తప్రాకార మధ్యే సరసిజముకుళో ద్భాసమానే విమానే
కావేరీ మధ్యదేశే మృదుతర ఫణిరాడ్భోగ పర్యంకమధ్యే
నిద్రాముద్రాభిరామం కటినికట శిరఃపార్శ్వ విన్యస్తహస్తం
పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణౌ రంగనాథం భజామి.

టీ॥ సప్తప్రాకారమధ్యే = భూజలాగ్ని వాయ్వాకాశాహంకార మహత్తత్త్వములనెడు సప్తావరణముల రూపములైన రెండు నేత్రములు చెవులుముక్కు వాక్కు బ్రహ్మరంధ్రయులనెడువీనియొక్క. మధ్యే=నడుమను—ఊర్ధ్వకుండలి అనుపేరుగల చిదాకాశమందు. సరసిజముకుళోద్భాసమానే విమానే = పద్మకోశప్రతీకాశగం హృదయంచాప్యధోముఖం అధోనిష్ట్యావితస్త్యాంతే నాభ్యాముపరితిష్ఠతి, అను శ్రుతిప్రమాణముచేత తామరమొగ్గవలెనున్న హృదయ స్థానమందు. కావేరీమధ్యదేశే = నదీమధ్యస్థానమందు — ఇడాపింగళాసుషుమ్నా రూపములైన గంగా యమునా సరస్వతీ సంగమస్థానమందనిభావము. మృదుతరఫణిరాడ్భోగపర్యంకమధ్యే = ప్రాణాపాన వ్యానోదాన సమాన నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయములనెడు దశవిధవాయురూపమైన ప్రాణవాయువనునట్టి శేషునియొక్క దేహమనెడు శయ్యనడుమను — ఇచ్చట దశవిధప్రాణవాయువు లనునవియే చెప్పఁబడగలు, వాని వృత్తే

తక్కిన చిన్నపడగలుగా ౼ యుపడగలు గల ఆదిశేషునిమీఁద ననుట. నిద్రాముద్రాభిరామం = నిశ్శేషం ద్రావయతి నాశయతీతి నిద్రా, సుషుప్తికాలే సకలేపలీనే తమోభిభూత స్సుఖరూపమేతి, అని ప్రమాణముగలదుగనుక నిద్రయనెడు ప్రళయమునందు సకల ప్రపంచమును తనయందు లీనము చేసికొని ఒప్పిదమగుచున్నవాఁడును. కటినికటశిరగ్గ పార్శ్వవిన్యస్తహస్తః=జ్ఞానకాండయనెడుకుడిచేతిని శిరస్సుక్రిందను,కర్మకాండయనెడియెడమచేతిని ఎడమతొడమీఁదను ఉంచుకొన్నవాఁడును. పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణౌ=సత్వగుణ రూపయైన లక్ష్మీదేవియును రజోగుణరూపయైన భూదేవియు జ్ఞానవిజ్ఞానములనెడితమ చేతులతో ఒత్తఁబడినతత్పదత్వంపదరూపములైనపాదములుగల. ఇచట సత్వగుణ రజోగుణస్వరూపలైన శ్రీభూదేవులను చెప్పుట వలన తమోగుణస్వరూపిణియైన నీళాదేవిని సహితము గ్రహింపవలయును—అనఁగా త్రిగుణాత్మికయైన మూలప్రకృతిన్ను సేవింపఁగా ననుట. రంగనాథం= రంగనాథస్వామిని. భజామి=నేనని సేవించుచున్నాను. శ్లో॥ దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః। త్యజేదజ్ఞాననిర్మాల్యం సోహం భావేనపూజయేత్॥ అను ప్రమాణముచేత మనుష్యదేహమనెడు శ్రీరంగదేవాలయమందు జీవరూపముతో నున్న పరబ్రహ్మమును, జీవుఁడు వేఱు దేవుఁడు వేఱు అనెడు మర్పుద్ధిని వదలి సచ్చిదానంద పరబ్రహ్మము నేనను వ్యక్తిచేత నిర్వికల్ప నిష్ఠతో నున్నవాఁడే ముక్తుఁడు. మఱి బ్రహ్మాండం దేహమాశ్రితం॥ అనియుత్తరగీతగనుక అయోధ్య మధుర కాశి కాంచి ద్వారకాపురి రామేశ్వరము వేంకటాద్రి భద్రాద్రి పక్షితీర్థము అనునవి మొదలైన నామములన్ని మనుష్య దేహమునకే అగును. ససర్వనామసచవిశ్వరూప, సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్యనామధేయాని, ప్రజ్ఞానం బ్రహ్మ ఏకోదేవోబహుధానివిష్టః, అను శ్రుతిప్రమాణములను బట్టి సర్వరూప సర్వనామములును జీవరూపముతో సకలశరీరము లోనున్న పరబ్రహ్మమునకే పేళ్లు గనుక బుద్ధిమంతులైన వారీగుట్టును పట్టుతోఁ దెలిసికొని సద్గురు బోధ గలిగి భేదవాదములు వదలి కనఁబడునది ఊహింపఁబడునది వినఁబడునది అంతయు తానే అని ఆనందించుచుండ వలయును.

వ॥ అచ్చోటువాసి వృషభాద్రి నెక్కి, హరిక్షేత్రంబుఁ ద్రొక్కి, మధురాపురంబునకరిగి, సేతుబంధనంబు మెట్టి, యచటం బదివేలపాఁడిమొదవుల భూసురులకిచ్చి, రామేశ్వరుని దర్శించి, తామ్రపర్ణికెంజని మలయాచలం బెక్కి యగస్త్యునింగని నమస్కరించి, దక్షిణసముద్రంబు దర్శించి, కన్యాఖ్యదుర్గాదేవి నుపాసించి, పంచాప్సరంబను తీర్థంబున నుపప్లావ్యంబాచరించి, గోకర్ణంబున నిందుమౌళిని దర్శించి, ద్వీపవతియైన కామదేవి నిరీక్షించి దాఁటి, పయోష్ణిని దర్శించి, నిర్వింధ్యఁగడచి, దండకావనంబునకరిగి, మాహిష్మతీపురంబున వసియించి, మనుతీర్థంబునం దాడి, క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి, యచ్చటి బ్రాహ్మణ జనంబుల వలనం బాండవ ధార్తరాష్ట్రుల భండనంబు నందు సకల రాజ లోకంబును బరలోక గతు లగుటయు వాయునందన సుయోధనులు గదా యుద్ధ సన్నద్ధు లగుటయు నెఱింగి వారల వారించు తలంపున నచ్చటికిం జని.

టీ॥ (అచ్చోటు) వాసి=వదలి. వృషభాద్రినెక్కి = వృషభాద్రి యనుకొండను ఎక్కి. హరిక్షేత్రంబుఁద్రొక్కి=హరిక్షేత్రమునకుఁబోయి. (మధురాపురంబునకు) అరిగి=పోయి. సేతుబంధనంబుమెట్టి=సేతువు కట్టఁబడినచోటికిపోయి, (అచట పదివేల) పాఁడిమొదవులన్ = పాఁడియావులను. భూసురులకిచ్చి=బ్రాహ్మణులకిచ్చి. (రామేశ్వరుని) దర్శించి= చూచి. (తామ్రపర్ణికిం జని) మలయాచలంబు=మలయము అనుకొండను. (ఎక్కి అగస్త్యునిఁగని) నమస్కరించి=మ్రొక్కి. (దక్షిణసముద్రంబు) దర్శించి=చూచి. కన్యాఖ్యదుర్గాదేవిన్ = కన్యయను పేరుగల కాళికాదేవిని. ఉపాసించి=పూజించి. (పంచాప్సరంబను తీర్థంబున) ఉపప్లావ్యంబు=మీఁదమీఁద స్నానము చేయుటను. ఆచరించి=చేసి. గోకర్ణంబునన్=గోకర్ణమను పుణ్యక్షేత్రమందు. ఇందుమౌళిన్ = చంద్రశేఖరుఁడైన శివుని. దర్శించి=చూచి. ద్వీపవతియైన=నదియైన. కామదేవిన్= కామదేవియనుదానిని. నిరీక్షించి=చూచి. (దాఁటి) పయోష్ణిని= పయోష్ణియనునదిని. దర్శించి=చూచి. నిర్వింధ్యన్ = నిర్వింధ్యయను పుణ్యనదిని. కడచి=దాఁటి. (దండకావనంబునకు) అరిగి=పోయి, మాహిష్మతీపురంబునన్ = మాహిష్మతియను పట్టణమునందు. వసియించి = ఉండి. (మనుతీర్థంబునందు) ఆడి=స్నానముచేసి, క్రమ్మఱన్=మరల. (ప్రభాసతీర్థంబునకు వచ్చి అచ్చటిబ్రాహ్మణ జనంబులవలన) పాండవ ధార్తరాష్ట్రుల భండనంబునందున్=పాండురాజు కొడుకులయు ధృతరాష్ట్రుని కొడుకులయు యుద్ధమునందు. సకలరాజ లోకంబును=ఎల్ల రాజులగుంపును. పరలోక గతులగుటయు = పరలోకమును పొందిన వారగుట—చచ్చుటయు. వాయునందనసుయోధనులు = భీముఁడును దుర్యోధనుఁడును. గదాయుద్ధసన్నద్ధులు=గదలతో యుద్ధము చేయుటకు సిద్ధపడినవారు. (అగుటయు ఎఱింగి) వారలన్ = ఆభీమదుర్యోధనులను. వారించుతలఁపునన్=యుద్ధము చేయకుండ నిలుపవలెనను తలఁపున. అచ్చటికిన్=ఆభీమదుర్యోధనులు యుద్ధము చేయుచోటికి. చని = పోయి.

తా॥ అచ్చటినుండి వృషభమను కొండకును హరిక్షేత్రమునకును మధురాపట్టణమునకును పోయి సేతువును జూచి అచ్చట పదివేల పాఁడియావులను బ్రాహ్మణులకు దానమిచ్చి రామేశ్వరునిఁ జూచి తామ్రపర్ణికిఁ బోయి మలయమను కొండ యెక్కి అందున్న యగస్త్య మహామునిని జూచి ఆవల కన్యకయను పేరుగల పార్వతిని సేవించి పంచాప్సరమను తీర్థమునకుఁబోయి అందు స్నానములు చేసి గోకర్ణమునకు పోయి చంద్రశేఖరుని దర్శనము చేసి కామకోటి తీర్థమును జూచి పయోష్ణినిఁ జూచి నిర్వింధ్యను దాఁటి దండకావనము చొచ్చి పోయి మాహిష్మతియను పట్టణమునందు కొన్నాళ్లుండి అందుండి మనుతీర్థమునకు పోయి స్నానము చేసి మరల ప్రభాసతీర్థమునకు వచ్చి అచ్చటి బ్రాహ్మణులు చెప్పఁగా పాండవులును ధార్తరాష్ట్రులును చేసిన యుద్ధమునందు లోకములోని రాజులందఱును చచ్చుటయు భీముఁడును దుర్యోధనుఁడును గదాయుద్ధము చేయ సిద్ధపడియుండుటయు విని వారి యుద్ధమును నిలుపవలెనను తలంపున కురుక్షేత్రమునకు పోయి అని తాత్పర్యము.

౯౬౨.—తే॥ ధర్మనందనుఁ దనకు వం * దనము సేయ । కృష్ణులను మాద్రిసుతుల నీ * క్షించి యేమి
వలుక కుగ్ర గదాదండ * పాణు లగుచుఁ । గ్రోధమునఁ బొంగు భీమదు * ర్యోధనులను,

టీ॥ ధర్మనందనుఁ=ధర్మరాజును. తనకువందనముచేయుకృష్ణులఁ=తనకుమ్రొక్కినకృష్ణుని అర్జునుని. మాద్రిసుతులఁ=నకుల సహదేవులను. ఈక్షించి=చూచి. ఏమివలుకక=ఏమియుఁజెప్పక. ఉగ్రగదాదండపాణులు=భయంకరములైన గుదియకఱ్ఱలతోడిచేతులుగల వారు. (అగుచు) క్రోధమునఁ=కోపముచేత. పొంగు=విజృంభించునట్టి. భీమదుర్యోధనులను=భీముని దుర్యోధనుని.

తా॥ ముందుధర్మరాజునుజూచి పిమ్మట కృష్ణుఁడు అర్జునుఁడు నకులుఁడు సహదేవుఁడు ఈనలుగురు వచ్చి తనకు మ్రొక్కఁగా వారిఁ జూచి ఏమిచెప్పక భయంకరములయిన గదాయుధములను చేతఁబుచ్చుకొని కోపాతిశయముచేత రేఁగియుండునట్టిభీముని దుర్యోధనునిఁజూచి యనితాత్పర్యము.

టీ॥ డాయంజని=చూచివారిదగ్గఱకుఁబోయి.



(*) శ్రీబలరాముఁడు భీమదుర్యోధనులను యుద్ధము చేయవలదనుట. (*)

౯౬౩.—సీ॥ వీర పుంగవు లార * వినుఁడు మీలోపల - భూరి భుజాసత్వ * మున నొకండుఁ
ప్రకటితా భ్యాస సం * పద్విశేషంబున - నొక్కఁడు నధికులై * యుంటఁజేసి
సమబలు లటుగానఁ * జర్చింపఁగా నిందు * జయమొక్కనికిలేదు * సమరమందుఁ
గాన నూరక పోరఁ * గానేల మీకని - వారింప నన్యోన్య * వైర ములను
తే॥ నడరితొల్లింటి దుర్భాష * లాత్మలందుఁ । దలఁచి తద్భాషణములు ప * థ్యములుగాక
మొక్కలంబునఁ బోరనా * ముష్టికాసు । రారి వీక్షించి వీరిశు * భా శుభములు.

టీ॥ వీరపుంగవులార=వీరులలోనుత్తములారా. (వినుఁడు) మీలోపలఁ=మీయిద్దఱిలోను. భూరిభుజాసత్వమునఁ=అధికమయిన భుజబలముచేత. ఒకండును=ఒకఁడును. ప్రకటితాభ్యాస సంపద్విశేషంబునఁ = ప్రసిద్ధమైన అభ్యాసము కలిమియొక్క అతిశయముచేత. ఒక్కఁడుఁ = ఒకఁడును. అధికులై యుంటఁజేసి = గొప్పవారై యుండుటచేత. సమబలులు=మీరు ఇరువురును సమానబలముగలవారు. అటుగానఁ = అట్లుండుటచేత. చర్చింపఁగాఁ = ఆలోచింపఁగా. ఇందుఁ=ఇచ్చట. సమరమందుఁ=యుద్ధమునందు. జయము=గెలుపు. ఒక్కనికిఁ=ఒకనికిని. లేదు = కలుగదు. కానఁ=కనుక. (మీకు) ఊరక=వ్యర్థముగా. పోరఁగానేల=పోరాడనేల. (అని) వారింపఁ=నిలుపఁగా. అన్యోన్యవైరములఁ=భీమ దుర్యోధనులకు పరస్పరము గలవిరోధములచేత. అడరి=విజృంభించి. తొల్లింటిదుర్భాషలు=మును పటిచెడ్డమాటలు. ఆత్మలందుఁ=మనసులలో. (తలఁచి) తద్భాషణములు =ఆమాటలు. పథ్యములుగాక=తమకుసరిపడక. మొక్కలంబునఁ = మూర్ఖత్వములో. పోరఁ=పోరాడఁగా. ఆముష్టికాసురారి=ఆబలరాముఁడు. (వీక్షించి) వీరిశుభాశుభములు = వీరికయ్యేదుమేలుకీళ్లు.

తా॥ వీరశ్రేష్ఠులయిన ఓభీమ దుర్యోధను లారా ! యోచింపఁగా మీయిరువురిలో ఒకరు అధికమయిన భుజబలము చేతను ఒకరు సాధనచేయుటచేతను అధికులైయున్నారు కనుకమీరు సమానబలము గలవారు అగుచున్నారు అందువల్ల మీయిరువురిలోను ఒకనికయినను ఈయుద్ధమునందు గెలుపుకలుగదు అట్లుప్రయోజనములేని ఈయుద్ధము వ్యర్థముగాచేయనేల ఊరకుండుఁడు అనిచెప్పఁగా ఆమాటలు వారికి పరస్పరము గల విరోధము చేతను మునుపు ఒకరినొకరు అనియున్న నీచపుమాటలుమనసులలో మెదలుటచేతను సరిపడక మూర్ఖత్వముతో ఎప్పటివలెపోరాడనారంభించిరి అదిచూచి బలరాముఁడు వీరికి ఇందువల్లవచ్చు మేలుకీళ్లు ఎట్టివైన కానీయని యెంచెననితాత్పర్యము.

వ॥ ఎట్లుగావలయు నట్లయ్యెడుంగాకయని యచ్చోటనిలువక యుగ్రసేనాది బంధు ప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన ద్వారకాపురంబుసొచ్చి యందుండిమగిడి నైమిశారణ్యంబున కుం జని యమ్మునిపుంగవులనుమతింపనచ్చోట నొక్కమఖంబు గావించి బహుదక్షిణలొసంగి యంచితజ్ఞాన పరిపూర్ణులగునట్లుగా వరంబిచ్చి రేవతియుం దానును బంధు జ్ఞాతి యుతంబుగా నవబృథ స్నానం బాచరించి యనంతరంబ.

టీ॥ ఎట్లు గావలయు నట్లయ్యెడుం గాక = ఎట్లుకావలెనో అట్లు అగునుగాక. (అని) అచ్చోటఁ=అక్కడ. నిలువక=ఉండక. ఉగ్రసేనాది బంధు ప్రకరంబులు=ఉగ్రసేనుఁడు మొదలుగాఁగల చుట్టముల సమూహములు. పరితోషంబునఁ=సంతోషములో. ఎదుర్కొనఁ=

ఎదురుగ రాగా. (ద్వారకాపురంబు సొచ్చి అందుండి) మగిడి=మరలి. (నైమిశారణ్యంబునకు) చని=పోయి. అమ్మునిపుంగవులు=ఆనైమిశారణ్యవాసులగు మునిశ్రేష్ఠులు. అనుమతింపగ=అనుజ్ఞ యియ్యఁగా. (అచ్చోట) ఒక్కమఖంబు=ఒకయజ్ఞమును. (కావించి) బహుదక్షిణలు=అధిక దక్షిణలు. ఒసంగి = ఇచ్చి. అంచితజ్ఞాన పరిపూర్ణులగునట్లుగా = ఒప్పిదమయిన తెలివిచేతనిండినవారు అగునట్టుగా-వరంబిచ్చి=వారికి వరమిచ్చి. (రేవతియుం దానును) బంధుజ్ఞాతి యుతంబుగాఁగ=చుట్టములతోను దాయాదులతోను. అవబృథ స్నానం బాచరించి = దీక్షాంతస్నానమునుచేసి. అనంతరంబ=అటుపిమ్మట.

తా॥ ఆవిధముగా వీరికి అగునట్టి మేలు కీళ్లు ఎట్లయిన కానిమ్మని యందుండక బయలుదేఱి ద్వారకాపట్టణమునకుపోయి ఉగ్రసేనుఁడు మొదలు గాఁగల తమవారందఱు సంతోషముతో ఎదురుకోలు చేయఁగా పట్టణమునందుఁ ప్రవేశించి, అచ్చటనుండి మరలబయలు దేఱి నైమిశారణ్యమునకుఁ బోయి అచ్చటి మునుల యనుజ్ఞ వలన ఒక యజ్ఞమును చేసి అమితములయిన దక్షిణలనిచ్చి, ఆమునులకు మిక్కిలిజ్ఞానాధికులు అగునట్టుగా వరములిచ్చి తనభార్యయగు రేవతీదేవితోను బంధువులతోను దాయాదులతోను దీక్షాంత స్నానమును చేసి పిమ్మట నని తాత్పర్యము.

౯౬౫.—చ॥ విలసిత మాల్యచందన న ✱ వీనవిభూషణ రత్నవస్త్రముల్
పొలుపుగఁ దాల్చి యంచితవి ✱ భూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా
కలిత సుధాంశురేఖ యెస ✱ కంబెసఁగ న్నిజబంధులోచనో
త్పలచయముల్లసిల్లఁ బరి ✱ పాండురచారు యశోవిలాసుఁడై.

టీ॥ విలసిత...వస్త్రములు—విలసిత=పరిమళముచేత ప్రకాశించునట్టి. మాల్య=పూలదండలను. చందన=గంధమును. నవీన=క్రొత్తవైన. విభూషణ=సొమ్ములను. రత్న=మణులను. వస్త్రములు = కోకలను. పొలుపుగఁగ=ఒప్పిదముగా. తాల్చి=ధరించి. పూర్ణచంద్రికాకలిత సుధాంశురేఖ యెసకంబు = నిండువెన్నెలతోఁగూడుకొన్న చంద్రుని విధముయొక్క అతిశయము. ఎసఁగఁగ = అతిశయింపఁగా. నిజ బంధులోచనోత్పలచయము = తనచుట్టములకన్నులనెడు కలువల సమూహము. ఉల్లసిల్లఁగ=వికసిల్లఁగా. పరిపాండురచారుయశో విలాసుఁడై = మిక్కిలి తెల్లనై యొప్పిదమయిన యశస్సుయొక్క విలాసము గలవాఁడై. అంచితవిభూతిఁగ=ఒప్పిదమయిన యైశ్వర్యముతో. తలిర్చెఁగ = అతిశయించి యుండెను.

తా॥ పరిమళమును వహించిన పూవుదండలు గంధము క్రొత్తవైన ఆభరణములు మణులు వస్త్రములు మొదలగువానిచేత అలంకరింపఁబడినవాఁడై నిండువెన్నెలచేత వెలుఁగొందునట్టి చంద్రునివలె తమ చుట్టములకన్నులనెడు కలువలు వికసించునట్టుగా అంతట వ్యాపించిన స్వచ్ఛమైన కీర్తితో ఒప్పిద మయిన ఆయిశ్వర్యము అనుభవించుచు సుఖముగా నుండెనని తాత్పర్యము.

౯౬౬.—వ॥ ఇవ్విధంబున ననంతుండు, నప్రమేయుండు, మాయామానుషవిగ్రహుండు, ననంత బలశాలియు నైన బలదేవుం డతివిభవంబున నిజ పురంబు ప్రవేశించి సుఖంబుండేనని చెప్పి వెండియు నిట్లనియె.

టీ॥ ఇవ్విధంబునఁగ=ఈరీతిగా. అనంతుండును = అంతములేనివాఁడును—దేశకాలవస్తుపరిచ్ఛేద శూన్యుఁడని భావము. లేక అంత మనఁగా మరణముగనుక మరణాదులు లేనివాఁడును. (లేక) ఆదిశేషుఁడును. అప్రమేయుండును. ఇంతటివాఁడని చెప్ప నలవికానివాఁడును—అష్టప్రమాణాతీతుఁడనుట. మాయామానుషవిగ్రహుండును=మాయచేత మనుష్యరూపమును పొందినవాఁడును. అనంతబలశాలియు=అంతములేని బలముగలవాఁడును. అయినబలదేవుండు= అయినట్టిబలరాముఁడు. అతివిభవంబునఁగ=అత్యంతవైభవముతో. నిజపురంబు=ద్వారకను. (ప్రవేశించి) సుఖంబుండెఁగ = సుఖముగ నుండెను. (అనిచెప్పి) వెండియుఁగ=మఱియును. (ఇట్లనియెను)

తా॥ ఈప్రకారము దేశకాల వస్తుపరిచ్ఛేదములు లేనివాఁడును, ఇంతటివాఁడని మేరయేర్పఱుపరానివాఁడును, మాయచేత మనుష్య శరీరమును ధరించిన వాఁడును, అంతములేని బలము గలవాఁడు నైన బలరాముఁడు అత్యంతవైభవముతో తనపట్టణముచొచ్చి సుఖముగనుండెను అని చెప్పి శుకమహాముని పరీక్షిన్మహారాజుతో మఱియు నిట్లని చెప్పెనని తాత్పర్యము.

౯౬౭.—క॥ హలధరుఁ డమర్త్యచరితుం । డలఘు భుజాబలుఁ డొనర్చు ✱ నద్భుత కర్మం
బులు పెక్కు నాల్గుమొగములు । గలమేటియు లెక్కపెట్టఁ ✱ గలఁడె నరేంద్రా.

టీ॥ నరేంద్రా=రాజా. హలధరుఁడు=బలరాముఁడు. అమర్త్యచరితుండు=దేవతల నడువడిగలవాఁడు. అలఘుభుజాబలుఁడు = హెచ్చైన భుజబలముగలవాఁడు. ఒనర్చునద్భుతకర్మంబులు=చేయునట్టివింతపనులు. పెక్కు=అనేకము. నాల్గుమొగములుగలమేటియుఁగ =చతుర్ముఖుఁడైనబ్రహ్మయు. లెక్కపెట్టఁగలఁడె=ఎంచఁగలఁడా.

తా॥ ఓరాజా! బలరాముఁడు దేవతలవంటి నడువడిగలవాఁడు మిక్కుటమైనభుజబలముగలవాఁడు అతఁడుచేయువింతపనులు అనేకములు అవియిట్టివి అని చెప్పను బ్రహ్మగూడ సమర్థుఁడు గాఁడని తా.

౯౬౮.—చ॥ అనిన మునీంద్రుఁ గన్గొని ధ ✱ రాధిపుఁ డిట్లను బద్మపత్రలో
చనుని యనంతవీర్య గుణ ✱ సంపద వేమఱు విన్ననైన ను
న్ననియదు చిత్త మచ్యుతక ✱ థా విభవం బొకమాటు వీనులన్
వినిన మనోజ పుష్పశర ✱ విద్ధుఁడు నైన విరాళినొందఁడే.

టీ॥ అనినన్=అని చెప్పఁగా. మునీంద్రున్ = శుకమహర్షిని. కన్గొని=చూచి=ధరాధిపుఁడు=రాజు. ఇట్లనున్ = ఇట్లు పలికెను. పద్మపత్ర...సంపద—పద్మపత్రలోచనుని=కృష్ణునియొక్క. అనంత=మితములేని. వీర్యగుణ=శౌర్యగుణములయొక్క. సంపద=కలిమిని. పేమఱున్=పలుమాఱును. విన్ననైనన్=వినినప్పటికిని. చిత్తము=మనసు. తనియదు=తృప్తిపొందదు. అచ్యుతకథావిభవంబు=శ్రీకృష్ణమూర్తికథయొక్క వైభవమును. ఒకమాఱు=ఒకసారి. వీనులన్=చెవులతో. వినినన్ = విన్నపక్షమున. మనోజపుష్ప శరవిద్ధుఁడు నైనన్ = మన్మథునియొక్క పుష్పబాణములచేత గ్రుచ్చుకోఁబడినవాఁడైనను—విషయచాంచల్యము గలవాఁడైనను. విరాళిన్—అత్యంతాసక్తిని. ఒందఁడే = పొందఁడా.

తా॥ అని యీవిధముగా శుకమహర్షి చెప్పిన కథనువిని పరీక్షిన్మహారాజు ఆయనతో శ్రీకృష్ణమూర్తియొక్క మేరలేని వీర్యాదిగుణములను పలుమాఱువిన్నను నామనసునకు తృప్తికలుగలేదు, నేనేకాదు మన్మథవశుఁడై వర్తించునట్టి కాముకునకైనను ఒకసారి ఆకృష్ణమూర్తికథలను విన్నపక్షమున మఱియు మఱియు నాకథలనువినవలెననునపేక్ష హెచ్చుచుండునుగాని హెచ్చకపోదని తాత్పర్యము.

వ॥ అదియునుంగాక. టీ॥ ఇంతేగాక.

౯౭౯.—చ॥ హరి భజియించు హస్తములు * హస్తము లచ్యుతుఁగోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ * జేరిన చిత్తము చిత్త మిందిరా
వరుఁ గనుదృష్టి దృష్టి ముర * వైరి నుతించినవాణి వాణి య
క్షరుకథ లానుకర్ణములు * గర్ణములై విలసిల్లుఁబో భువిన్.

టీ॥ భువిన్=భూలోకమందు. హరిన్=ప్రళయకాలమున రుద్రరూపముచేత సర్వప్రపంచమును లయింపఁ జేయునట్టి శ్రీకృష్ణుని. భజియించుహస్తములు=పూజించునట్టిచేతులు. హస్తములు=చేతులు అనఁదగినవి. అచ్యుతున్=నాశరహితుఁడైనశ్రీవిష్ణుని. కోరి=అపేక్షించి. మ్రొక్కు=నమస్కరించునట్టి. తచ్ఛిరము=ఆతల. శిరంబు=తలఅనఁదగినది. చక్రధరున్ = శ్రీవిష్ణుమూర్తిని. చేరినచిత్తము = పొందిన మనసు. చిత్తము=మనసు అనఁదగినది. ఇందిరావరున్ = శ్రీలక్ష్మీపతిని. కనుదృష్టి=చూచునట్టిచూపు. దృష్టి=చూపు అనఁదగినది. మురవైరిన్=శ్రీకృష్ణమూర్తిని. నుతించినవాణి=పొగడిననోరు. వాణి=నోరు అనఁదగినది. అక్షరుకథలు = నశింపనివాఁడైన శ్రీమన్నారాయణుని కథలను. ఆనుకర్ణములు=వినియానందించుచెవులు. కర్ణములై = చెవులుఅనఁదగినవై. విలసిల్లుఁబో = ప్రకాశించును. ఇందలిపో అనునది నిశ్చయార్థకము అనుట.

తా॥ ఈభూలోకమునందు శ్రీకృష్ణమూర్తిని అర్చించునట్టి చేతులును, మ్రొక్కునట్టి తలయును, ధ్యానించునట్టిమనస్సును, దర్శనము చేయునట్టి చూపును, పొగడునట్టి వాక్కును, ఆపరమపురుషునికథలను విని యానందించునట్టి చెవులును సార్థకములుగాని తక్కినవి ఉండియు వ్యర్థములేయని తాత్పర్యము.

౯౮౦.—క॥ హరిపాద తీర్థ సేవా । పరుఁడై విలసిల్లునట్టి * భాగవతుని వి
స్ఫురితాంగము లంగము లా । పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ * బలుకుమునీంద్రా.

టీ॥ మునీంద్రా=మునిశ్రేష్ఠుఁడా. హరిపాదతీర్థసేవాపరుఁడై=శ్రీకృష్ణమూర్తిపాదములుకడిగిన పావనోదకములనుపానముచేయుటయందాసక్తుఁడై. విలసిల్లునట్టి=ప్రకాశించునట్టి. భాగవతుని=భగవత్సేవకునియొక్క. విస్ఫురితాంగములు = ప్రకాశించునట్టి అవయవములు. అంగములు = అవయవములనిపించుకొనునవి. ఆపరమేశ్వరున్=సర్వోత్కృష్టుఁడైన యాదేవుని—స్వరూప స్వభావములననుట. ఎఱుఁగ నాకుఁ బలుకుము = నాకుఁ దెలియఁ జెప్పుము.

తా॥ ఓముని శ్రేష్ఠుఁడా! శ్రీకృష్ణపాద సంబంధ మయిన తీర్థమును పానము చేయుటయందాసక్తుఁడై ఆభగవంతుని సేవించుచు వర్తించునట్టిభాగవతోత్తముని అవయవములుకృతార్థములు కాఁబట్టి అట్టిభగవంతునితత్వమును నాకుఁదెలియఁజేయుము అనిపరీక్షిన్మహారాజు శుకమహర్షిని అడిగెనని తాత్పర్యము.

## (*) కుచేలోపాఖ్యానము. (*)

౯౮౧.—సీ॥ అనుడు వేదవ్యాస * తనయుఁడాయభిమన్యు
తనయునిఁజూచి యి * ట్లనియెఁ బ్రీతి
జనవర గోవింద * సఖుఁడు గుచేలుండు
నానొప్పు విప్రుండు * మానధనుఁడు
విజ్ఞానరాగాది * విరహిత స్వాంతుండు
శాంతుండు ధర్మవ * త్సలుఁడు ఘనుఁడు
విజితేంద్రియుఁడు బ్రహ్మ * వేత్త దారిద్ర్యంబు
బాధింప నొరులఁగా * ర్పణ్య వృత్తి






తే॥ నడుగఁబోవక తనకుఁ దా * నబ్బినట్టి । కాసు పదివేలనిష్కము * ల్గాఁ దలంచి
యాత్మ మోదించి పుత్రదా * రాభిరక్ష । యొక విధంబున నడపుచు * నుండు నంత.

టీ॥ అనుడును=అనియిట్లు అడుగఁగా. వేదవ్యాసతనయుఁడు=వ్యాసమహర్షి కొడుకైన శుకమహర్షి. ఆయభిమన్యు తనయునిక్ = ఆపరీక్షిన్మహారాజును. (చూచి) ప్రీతిక్=ప్రేమతో. ఇట్లనియెక్=ఇట్లు పలికెను. జనవర = ఓరాజా. గోవిందసఖుఁడు=కృష్ణుని చెలికాఁడు. కుచేలుండునానొప్పు విప్రుండు=కుచేలుఁడు అనుపేరుగల బ్రాహ్మణుఁడు. మానధనుఁడు=గొప్పయే ధనముగాఁగలవాఁడు. విజ్ఞానరాగాది విరహితస్వాంతుండు — విజ్ఞాన = లోకవ్యవహారశాస్త్రములైన జ్యోతిషము వైద్యము మాంత్రికము సాముద్రికము రసవాదముచేయుట మొదలైనశాస్త్రములయందు విశేషజ్ఞానమును. రాగ=కామము. ఆది=మొదలగువానియందు. విరహిత = లేనట్టి. స్వాంతుండు=మనస్సుగలవాఁడు, శాంతుండు = ఓర్పుగలవాఁడు—సుఖదుఃఖములను సమానముగఁ జూచువాఁడు. ధర్మవత్సలుఁడు = వర్ణాశ్రమ ములకుఁ దగిన ఆచారముల యందు ప్రీతి గల వాఁడు, ఘనుఁడు = శమదమోపరతి తితీక్షాశ్రద్ధా సమాధానాది సుగుణములచేత గొప్ప వాఁడు. విజితేంద్రియుఁడు = జయింపఁబడిన యింద్రియములుగలవాఁడు. బ్రహ్మవేత్త = వేదార్థములనెఱిఁగిన వాఁడు — లేక జగత్కారణమైన పరబ్రహ్మమును తెలిసిన వాఁడు. దారిద్ర్యంబు=పేదఱికము. బాధింపక్=బాధపెట్టఁగా. ఒరులక్=ఇతరులను, కార్పణ్యవృత్తిక్ = కృపణత్వముతో — దీనత్వముతో. అడుగఁబోవక = యాచింపఁబోక. శ్లో॥ యద్ధాత్రానిజఫాలపట్టలిఖితం స్తోకంమహద్వాధనం। తత్ప్రాప్నోతిమరుస్థలేపి నితరాంమేరౌచనాతోధికం। తద్ధీరోభవవిత్తవత్సు కృపణావృత్తిం వృథామాకృథా కూపేపశ్యపయోనిధావపిఘటో గృహ్ణాతి తుల్యంజలం॥ అను ప్రమాణమును పట్టి తనకష్టమొకరితోఁ జెప్పకొనక. తనకుఁదాను=తనంతట. అబ్బినట్టికాసు=దొరకినకాసైనను. పదివేలనిష్కముల్గాక్ = పదివేలవరహాలుగా. తలంచి=ఎంచి. ఆత్మక్=మనసునందు. మోదించి=సంతోషించి. శ్లో॥ అసంతుష్టో ద్విజోనష్టః సంతుష్టఇవ పార్థివః । సలజ్జా గణికానారీ నిర్లజ్జేవకులాంగనా॥ అనుశాస్త్రమును పట్టి దొరకినంతటితో తనివిపొందినవాఁడై. పుత్రదారాభిరక్ష = కొడుకులను పెండ్లామును కాపాడుటను. ఒకవిధంబునక్=ఏదో యొకవిధముగా. నడపుచుక్=జరుపుచు. ఉండునంతక్=ఉండఁగా.

తా॥ అని యీవిధముగా పరీక్షిన్మహారాజు అడుగఁగా, శుకమహర్షి యాపరీక్షిత్తుతో ఇట్లు చెప్పెను, ఓరాజా ! కృష్ణునికి చెలికాఁడైన కుచేలుఁడు అనుబ్రాహ్మణుఁడు ఒకఁడుకలఁడు అతఁడు మాన వంతుఁడును, భగవద్విషయికములు కాని శాస్త్రములయందు ప్రీతియు, కామము క్రోధము మొదలగు సామాన్య గుణములును లేనివాఁడును, తిన్ననివాఁడును, వర్ణాశ్రమధర్మమునందు అపేక్ష గలవాఁడును, సుగుణములు గలవాఁడును, ఇంద్రియ నిగ్రహము చేసినవాఁడును నైయుండును మఱియు అతఁడు మిక్కిలి పేదవాఁడుగా నుండియు ఒకరిని దీనత్వముతో యాచించునట్టి వృత్తికిఁబోక తనంతట లభించిన కాసును పదివేలవరహాలుగాఁదలఁచి సంతోషించుచు ఎట్లో భార్యను బిడ్డలను కాపాడు కొనుచుండును అట్లుండఁగా నని తా.

౯౭౨.—సీ॥ లలితపతివ్రతా * తిలకంబు వంశాభి - జాత్య తద్భార్య దు * స్సహదరిద్ర
పీడఁజేఁ గడునొచ్చి * పెదవులు దడుపుచు - శిశువు లాఁకటిచిచ్చు * చేఁ గృశించి
మలమల మాఁడు చు * మానసంబెరియంగఁ - బట్టెఁడోరెము మాకుఁ * బెట్టుమనుచుఁ
బత్రభాజనధృత * పాణులై తనుఁజేరి . వేఁడిన వీనులు * చూఁడినట్ల
తే॥ దైన నొకనాఁడు వగచి ని * జాధినాథుఁ । జేరి యిట్లనిపలికె నో * జీవితేశ
తట్టుముట్టాడు నిట్టిపే * దఱిక మిట్టు । నొంప దీనికుపాయ మూ * హింపవైతి.

టీ॥ లలితపతివ్రతా తిలకంబు=మనోహరమైన పతివ్రతాధర్మము గలవారిలో ముఖ్యురాలు. వంశాభిజాత్య = మంచి వంశమునందుఁ బుట్టినది. తద్భార్య = అగునట్టి యతని పెండ్లాము. దుస్సహదరిద్రపీడచేక్=సహింపరానిదైన పేదలుపడునట్టిబాధచేత. కడునొచ్చి=మిక్కిలిబాధనొందినదై. పెదవులుదడుపుచుక్=తడియాఱిన పెదవులకు నాలుకచాఁచి తడికలుగఁ జేసికొనుచు, శిశువులు = బిడ్డలు. ఆఁకటిచిచ్చుచేక్ = ఆఁకటివలని తాపముచేత. కృశించి=చిక్కి. మలమలమాఁడుచుక్=చాలఁదపించుచు. మానసంబు=మనసు. ఎరియంగక్=మండఁగా. పట్టెఁడోరెము=పట్టెఁడుఅన్నము, (మాకుఁ బెట్టుము అనుచును) పత్రభాజనధృతపాణులై = విస్తరాకులనుధరించిన చేతులుగలవారై—విస్తరాకులు చేతఁబట్టుకొన్నవారై, తనుక్=తన్ను. చేరి=దగ్గఱి. వేఁడినక్=దీనత్వముతో అడుగఁగా. వీనులు=చెవులను. చూఁడినట్ల = చుఱుచుఱు కాల్చినట్లు. అయినక్ = కాఁగా, వగచి = విచారపడి. ఒకనాఁడు = ఒకదినము. నిజాధినాథుక్ = తనపెనిమిటిని. ( చేరి ఇట్లని పలికెను ) ఓజీవితేశ = ఓప్రాణనాయకా. తట్టుముట్టాడు=ఎడతెగక పొందియుండు. (ఇట్టి పేదఱికము) ఇట్టునొంపక్=ఈవిధముగా బాధింపఁగా. దీనికిక్=ఈదారిద్ర్య బాధకు. ఉపాయము=తొలఁగునట్టి యుపాయమును. ఊహింపవైతి = విచారింపకయున్నావు,

తా॥ ఎల్ల పతివ్రతాలక్షణముల చేత ఒప్పినదై యుత్తమవంశమునందుఁ బుట్టినదై యుండెడి ఆకుచేలుని పెండ్లాము సహింపరాని పేదఱికము వలన పీడింపఁ బడుచున్నదై బిడ్డలు చేతులలో విస్తరాకులు పట్టుకొని అమ్మా! మాకుపట్టెఁడు అన్నము పెట్టుము అనిపలుమాఱు దీనత్వముతో అడుగుచుండఁగా ఆమాటలు చెవులలో కొఱవి పెట్టి కాల్చినట్టై విచారపడుచు నుండి ఒకనాఁడు తన పెనిమిటిని జూచి ఓప్రాణనాయకా! మనలను వదలలేక బాధించుచున్న యీపేదఱికము తొలఁగుటకు ఉపాయమేమియు విచారింపకయున్నావు అని తా.

వ॥ అని మఱియు నిట్లనియె. టీ॥ అనిచెప్పి మరల నిట్లు పలికెను.

౯౭౩.—తే॥ బాలసఖుఁడైన యప్పద్మ * పత్ర నేత్రుఁ । గాననేగి దరిద్రాంధ * కార మగ్ను
లైన మమునుద్ధరింపుము * హరికృపాక । టాక్ష రవిదీప్తి వడసీ మ * హాత్మనీవు.

టీ॥ మహాత్మ = ఓగొప్పబుద్ధిగల ప్రాణనాథా. (నీవు) బాలసఖుఁడు=పిన్ననాటి చెలికాఁడు. అయిన యప్పద్మపత్రనేత్రుక= అయినట్టి యాకృష్ణమూర్తిని. కానక = చూడను. ఏగి=పోయి. హరికృపాకటాక్షరవిదీప్తిక = శ్రీకృష్ణమూర్తిదయతోడి కడకంటి చూపనెడు సూర్యకాంతిని. వడసి = పొంది. దరిద్రాంధకార మగ్నులు= పేదఱికమనెడుచీఁకటియందుమునిఁగినవారము. అయిన మముక=అయినట్టిమమ్మును. ఉద్ధరింపుము=లేవనెత్తికాపాడుము.

తా॥ ఓమహాత్మా నీవు నీకుపిన్ననాటిచెలికాఁడైన శ్రీకృష్ణమూర్తి యొద్దకుఁబోయి ఆయన కృపాకటాక్షమనెడు సూర్యునివెలుఁగును పడసినవాఁడవైతెవెలుఁగుచేతదారిద్ర్యమనెడుచీఁకటిలోదరిగానక చిక్కులపడెడు మమ్మునుదరిఁజేర్చి కాపాడుము అని తాత్పర్యము.

వ॥ మఱియును.

౯౭౪.—చ॥ వరదుఁడు సాధుభక్తజన * వత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగ * వంతుఁడుఁగృష్ణుఁడు దాఁగుశస్థలీ
పురమున యాదవ ప్రకర * ముల్ భజియింపఁగ నున్న వాఁడ యి
ట్లరిగిన నిన్నుఁజూచి విభుఁ * డప్పుడయిచ్చు ననూన సంపదల్.

టీ॥ వరదుఁడు=కోరిన కోరికలనిచ్చువాఁడు. సాధుభక్త జన వత్సలుఁడు=సాధువులైనసేవకజనులయందువాత్సల్యముగలవాఁడు. ఆర్తశరణ్యుఁడు = పీడితులైనవారికిరక్షకుఁడు. ఇందిరావరుఁడు= లక్ష్మీదేవికిభర్త. దయాపయోధి=దయారసమునకు సముద్రుఁడైన వాఁడు. భగవంతుఁడు = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు—కృష్ణుఁడు. తాక=తాను. కుశస్థలీపురమునక=కుశస్థలియను పట్టణమునందు. యాదవప్రకరములు = యదువంశస్థులగుంపులు. భజియింపఁగక= సేవింపఁగా. ఉన్నవాఁడ=ఉండనేఉన్నాఁడు. ఇట్లరిగినక=ఈవిధముగా పోయినట్టయిన..(నిన్నుఁజూచి) విభుఁడు=నిగ్రహానుగ్రహ సమర్థుఁడైనకృష్ణుఁడు. అప్పుడ = నిన్నుఁజూచినప్పుడే. అనూన సంపదలు=తక్కువగాని కలుములు. (ఇచ్చును)

తా॥ కోరినకోరికలను ఇచ్చువాఁడును, సాధువులయందుప్రేమ గలవాఁడును,దుఃఖముఁబొందినవారికిదిక్కగువాఁడును, లక్ష్మీనాయకుఁడును, మిక్కిలిదయగలవాఁడును షడ్గుణైశ్వర్య సంపన్నుఁడును ఐనశ్రీకృష్ణమూర్తి ఇప్పుడుకుశస్థలియనుపట్టణములోనే యున్నాఁడు ఆయననునీవుఈపేదఱికముతోపోయిచూచినట్టయినచూచినతోడనే కొఱఁతలేనికలుములను ఇచ్చునుకనుకపొమ్మనెనని తాత్పర్యము.

౯౭౫.—మ॥ కలలోనం దనుమున్నెఱుంగని మహా * కష్టాత్ముఁ డైనట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునక నిజపదా * బ్జాతంబు లుల్లంబులోఁ
దలఁపోయంగను మెచ్చి యార్తిహరుఁడై * తన్నైన నిచ్చుక సుని
శ్చలభక్తిక భజియించువారి కిడఁడే * సంపద్విశేషోన్నతుల్.

టీ॥ కలలోనక = స్వప్నమునందైనను. తనుక = తన్ను. మున్ను = అంతకుముందు. (ఎఱుంగని) మహాకష్టాత్ముఁడు=మిక్కిలి నీచమనసు గలవాఁడు. ఐనట్టి దుర్బలుఁడు = అయినటువంటి బలహీనుఁడు. ఆపత్సమయంబునక = వానికి ఆపదవచ్చినప్పుడు. నిజ పదాబ్జాతంబులు = తన పాద కమలములను. ఉల్లంబులోక= మనసులో. తలపోయంగను=తలఁచఁగానే. మెచ్చి=మెచ్చుకొని. ఆర్తిహరుఁడై = వానిదుఃఖమును పోఁగొట్టు వాఁడై. (తన్నైనను ఇచ్చును) సునిశ్చల భక్తిక = చలింపని భక్తిచేత. భజియించు వారికిక = సేవించునట్టివారికి. సంపద్విశేషోన్నతులు = కలిమియ విశేషమైనగౌరవమును. ఇడఁడే = పెట్టఁడా—ఇయ్యఁడాయనుట.

తా॥ కలలోనుగూడ తన్నుఁదలఁచి యెఱుఁగని పాఁబుద్ధి గల యొక బలహీనుఁడైన మనుష్యుఁడు తనకేదైన నొకయిక్కట్టు వచ్చినప్పుడు శ్రీకృష్ణునిపాదకమలములను మనసులోతలఁచిన మాత్రముచేతనే ఆమనుష్యునిదుఃఖమునుపోఁగొట్టుటయేకాక ఒకవేళవాఁడు తన్నేకావలెనని కోరినను వానికి తానువశుఁడైవర్తించువాఁడుశ్రీకృష్ణుఁడు అటువంటిదయాపరుఁడుచలింపనిభక్తితోతన్ను ఎల్లప్పుడు సేవించువారికి భాగ్యమును విశేషగౌరవమును ఇయ్యఁడా ఇచ్చును గనుక పోయిరమ్మని చెప్పెనని తాత్పర్యము.

౯౭౬.—క॥ అని పలికిన నమ్మానిని । సునయోక్తులకలరిభూమి * సురుఁడాకృష్ణుక
గననేగుట యిహపర సా । ధనమగునని మదిఁదలంచి * తనసతితోడక.

టీ॥ అనిపలికినక=అని చెప్పఁగా. అమ్మానిని=ఆయుత్తమస్త్రీ యొక్క. సునయోక్తులకుక=మంచినీతిమాటలకు. అలరి = సంతోషించి. భూమిసురుఁడు=బ్రాహ్మణుఁడు—కుచేలుఁడు. కృష్ణుక= కృష్ణమూర్తిని. కననేగుట. చూడఁబోవుట. ఇహపరసాధనము = ఈలోకసుఖములకును పరలోకసుఖములకును సాధనము.(అగునని) మదిక = మనసులో. (తలంచి) తనసతితోడక = తనభార్యతో.

తా॥అనితనభార్యచెప్పిననీతియుక్తములునులిన్ననివియునైనమాటలనువిని సంతోషించి శ్రీకృష్ణదర్శనము ఇహపరసుఖములకుసాధనమై యొప్పును అనితలఁచినవాఁడై కుచేలుఁడు తనభార్యతోనిట్లుపలికెనని తాత్పర్యము.

౯౭౭.—తే॥ నీవు సెప్పినయట్ల రా * జీవనేత్రు । పాదపద్మంబు లాశ్రయిం * పంగ జనుట
పరమశోభన మాచక్రి * పాణికిపుడు । గానుకేమైనఁ గొంపోవఁ * గలదెమనకు.

టీ॥ నీవు సెప్పినయట్ల=నీవు చెప్పినవిధముగానే. రాజీవనేత్రు పాదపద్మంబులు=శ్రీకృష్ణుని పాదకమలములను. ఆశ్రయింపంగన్ = చేరుటకు. చనుట=పోవుట. పరమశోభనము = మిక్కిలిమంచిది. ఆచక్రిపాణికిన్=శ్రీకృష్ణమూర్తికి. (ఇపుడు)కొంపోవన్=తీసికొనిపోవుటకు. (ఏమైనను కానుక)కలదెమనకున్=మనకుఁగలదా. శ్లో॥ అగ్నిహోత్రం గృహం క్షేత్రం గర్భిణీం వృద్ధబాలయోః । రిక్తహస్తేన నోపేయా ద్రాజానం దైవతం గురుం॥ అని.

తా॥ నీవిప్పుడు చెప్పిన చొప్పున శ్రీకృష్ణమూర్తిని చూడఁబోవుట మంచిదే ఆయనపాదములను జేరఁబోవుటకు కానుకయేమైన కావలెనే ఏమియున్నది చెప్పుమని యడిగెననితాత్పర్యము.

౯౭౮.—తే॥ అనిన నయ్యింతి యాఁగాక * యనుచు విభుని । శిథిలవస్త్రంబు కొంగున * బృథుకతండు
లమ్ము లొకకొన్ని ముడిచి నె * య్యమున ననుపఁ । జనియె గోవింద దర్శనో * త్సాహియగుచు.

టీ॥ అనినన్=అని చెప్పఁగా. అయ్యింతి=ఆవనిత. ఔఁగాకయనుచున్=ఆవును కావలసిన దేయని. విభుని శిథిలవస్త్రంబు కొంగునన్=తన పెనిమిటియైనకుచేలుని యొక్క చింపిగుడ్డకొంగునందు. పృథుకతండులమ్ములు=అటుకులు. ఒకకొన్ని=కొంచెము. ముడిచి=కట్టి. నెయ్యమునన్=ప్రీతితో. అనుపన్=పంపఁగా. గోవిందసందర్శనోత్సాహి=కృష్ణుని జూచుటయందలి యుత్సాహముగలవాఁడు. (అగుచును చనియెను)

తా॥ అని పెనిమిటి యడుగఁగా ఆమె అవును కావలసినదే యని చెప్పితమయింటనున్న అటుకులుకొన్ని ఆయన చింపిగుడ్డ కొంగునఁగట్టి పంపఁగా అతఁడుకృష్ణునిఁ జూచుటయందలి యుత్సాహము గలవాఁడై బయలుదేరెనని తాత్పర్యము. వ॥ అట్లుచనుచుండ సమయంబున.

౯౭౯.—సీ॥ ద్వారకానగరంబు * నేరీతిఁ జొత్తును - భాసురాంతఃపుర * వాసియైన
యప్పుండరీకాక్షు * నఖిలేశు నెబ్భంగి - దర్శింపఁగలనొ త * ద్ద్వారపాలు
రెక్కడి విప్రుఁడ * విందేల వచ్చెద - వనియడ్డపెట్టిరే * నపుడు వారి
కేమైనఁ బరిదాన * మిచ్చి చొచ్చెదనన్న - నూహింప నర్థశూ * న్యుండ నేను
తే॥ నైన నాభాగ్య మతని ద * యార్ద్రదృష్టి । గాక తలపోయఁగా నొండు * గలదెయాతఁ
డేల నన్నుపేక్షించు * నేటిమాట । లనుచు నాద్వారకాపుర * మపుడుసొచ్చి.

టీ॥ ద్వారకానగరంబున్=ద్వారకాపట్టణమును. ఏరీతిన్=ఏవిధముగా. చొత్తున్=ప్రవేశింతును. భాసురాంతఃపురవాసి — భాసుర=ప్రకాశించునట్టి — చిత్తరువులు మొదలగు వానిచేత ప్రకాశించునట్టి. అంతఃపుర = లోపలి పట్టణమునందు—స్త్రీలునివసించునట్టి పట్టణము లోపలిగదులయందు, వాసి = ఉండునట్టివాఁడు. అయిన యప్పుండరీకాక్షున్=అయినట్టి యాకృష్ణమూర్తిని. అఖిలేశున్=సమస్తమునకు ప్రభువును. ఎబ్భంగిన్=ఏరీతిగా. దర్శింపఁగలనొ=చూతునో. తద్ద్వారపాలురు=ఆపట్టణపువాకిలి కావలివారు. ఎక్కడివిప్రుఁడవు=ఎక్కడి బ్రాహ్మణుఁడవు. ఇందేలవచ్చెదవు = ఇచ్చటికి ఏలవచ్చెదవు. (అని) అడ్డపెట్టిరేని = అడ్డగించినపక్షమున. (అపుడు) వారికిన్ = ఆద్వారపాలకులకు. (ఏమైనను) పరిదానము=లంచము. (ఇచ్చి) చొచ్చెదనన్నన్=లోపలఁజొత్తునని తలఁచెదుపక్షమున. ఊహింపన్=విచారింపఁగా. (నేను) అర్థశూన్యుండను=ధనముచేతశూన్యుఁడను—ధనములేనివాఁడను. అయినన్=అట్లయినను. నాభాగ్యము=నాయదృష్టమును. అతనిదయార్ద్రదృష్టి=ఆశ్రీకృష్ణమూర్తియొక్క దయతోడి చూపును. (కాక) తలపోయఁగాన్=ఆలోచింపఁగా. ఒండుగలదే = వేఱొకటి కలదా. అతఁడు=కృష్ణుఁడు. ఏల=ఏమిటికి. (నన్ను) ఉపేక్షించును=అనాదరముచేయును. ఏటిమాటలు = ఇప్పుడు నేమిటిమాటలు అనుకొంటిని — ఇప్పుడు నేనిట్లు తలఁచుట సరికాదు అనుట. అనుచున్=అని విచారించుచు. (అపుడు ఆద్వారకాపురము) చొచ్చి=ప్రవేశించి.

తా॥ కుచేలుఁడు అట్లుబయలుదేరినవాఁడై నేను ద్వారకా పట్టణమును ఎట్లు ప్రవేశింతును, లోపలిగదులలోనుండు శ్రీకృష్ణమూర్తి నెట్లు చూతును, ఆసర్వేశ్వరుని ద్వారపాలకులు ఒకవేళనీవు ఎవఁడవులోపల పోఁగూడదన్న వారికేమైన లంచమిచ్చిపోవుటకు నేను బొత్తిగా ధనము లేనివాఁడను అయినను ఇవియన్నియు కారణములుగావు నాయదృష్టమును ఆయనదయయే కారణములు, అట్లుండ ఈవట్టియాలోచనలేల? ఆయనయే నన్ను అనాదరముచేయును, అనుకొనుచుపోయి ద్వారకాపట్టణమునందు బ్రవేశించెనని తాత్పర్యము.

౯౮౦.—వ॥ అట్లుప్రవేశించి రాజమార్గంబునం జనిచని కక్ష్యాంతరంబులు గడచిచని ముందట.

టీ॥ (అట్లు) ప్రవేశించి=చొచ్చి. రాజమార్గంబునన్=పెద్దబాటయందు. చనిచని=పోయిపోయి. కక్ష్యాంతరంబులు=కొన్నితొట్టికట్లు. గడచి=దాఁటి. చని=పోయి. ముందటన్=ఎదుటను.

తా॥ ఈమీఁదఁ జెప్పిన చొప్పున పట్టణమునందుఁ బ్రవేశించి బహుదూరము రాజమార్గమునఁబోయి కృష్ణుని నగరుచొచ్చి అందుకొన్ని తొట్టికట్లు దాఁటి పోయియెదుటను అని తాత్పర్యము.

౯౮౧.—సీ॥ విశదమై యొప్పు షో * డశ సహస్రాంగనా - కలిత విశాల సం * గతిఁ దనర్చి
మహనీయ తపనీయ * మణిమయ గోపుర - ప్రాసాద సౌధ హ * ర్మ్యములుసూచి
మనము బ్రహ్మానంద * మునఁబొందఁగడునుబ్బి - సంతోషబాష్పముల్ * జడికొనంగఁ
బ్రకటమై విలసిల్లు * నొక వధూమణి మంది - రమున నింతులు చామ * రములు వీవఁ

తే॥ తనరు మృదుహంసతూలికా * తల్పమందుఁ। దానుఁ బ్రియయును బహువినో * దములఁ దనరి
మహితలావణ్య మన్మథ * మన్మథుండు। ననఘుఁ జూపట్టు పుండరీ * కాయతాక్షు.

టీ॥ విశదములై=స్వచ్ఛమై. ఒప్పు=ఒప్పునట్టి. షోడశ... సంగతిన్—షోడశ సహస్రాంగనా=పదియాఱువేల స్త్రీలతోడ. కలిత=కూడు కొన్న. విశాలసంగతిన్ = విరివితోడి కూడికతో. తనర్చి = అతిశయించి. మహనీయ ... హర్మ్యములు—మహనీయ=మిగుల గొప్పవై. తపనీయ = బంగారువికారములును. మణిమయ = రత్నవికారములునైన. గోపుర=గోపురములును. ప్రాసాద=గుళ్లును. సౌధ=నగళ్లును. హర్మ్యములు=ధనికుల యిండ్లును. (చూచి) మనము=మనస్సు. ప్రహ్లాదంబు... పొందన్ = నిరతిశయానందమును పొందఁగా. ...ఉబ్బి=సంతోషించి. సంతోషబాష్పములు=సంతోషమువలన కన్నులనుండి వెడలునట్టి కన్నీళ్లు. జడికొనంగన్=అతిశయముగా. ప్రకటములై=స్పష్టమై. విలసిల్లు = ప్రకాశించునట్టి. ఒక... మందిరమునన్=శ్రేష్ఠురాలయిన యొక యిల్లాలియింటిలో. ...స్త్రీలు. చామరములు=వింజామరలు. వీవన్ = వీచుచుండఁగా. తనరు=ఒప్పునట్టి. మృదుహంసతూలికా తల్పమందున్=మెత్తనైన హంసతెక్కలపాన్పునందు. (తానును) ప్రియయును = ప్రియురాలును. బహువినోదములన్ = పెక్కువేడుకలతో. తనరి=ఒప్పి. మహితలావణ్యమన్మథమన్మథుండు=పూజ్యమైన దేహకాంతి విశేషముచేత మన్మథునకు మోహమును పుట్టించువాఁడు. అనఘన్ = అనఘుఁడు... చూపట్టు=కనఁబడునట్టి. పుండరీకాయతాక్షున్ = తెల్లదామరలవలె విశాలములైన కన్నులుగల కృష్ణమూర్తిని.

తా॥ నిర్మలములై పదియాఱువేల స్త్రీలయునికికిఁ దగినవిరివి గలిగి గొప్పలై బంగారుమయములును రత్నమయములునైన నగళ్లును, గుళ్లును, ధనికులయిండ్లును, గనఁబడఁగాఁ జూచి మనస్సు ప్రహ్లాదమును బోలిన యానందమును పొంది యొప్పఁగా నుప్పొంగుచు ఆనంద బాష్పములు వానకురిసినట్టు ఎడతెగక రాలుచుండఁగా మిక్కిలి తేటగా వెలుఁగు నట్టియొక వనితయింటిలో కొందఱు పరిచారికలు వింజామరలు వీచుచుండఁగా మెత్తనైనహంసతెక్కలపానుపునందు తన ప్రియురాలితోడ వేడుకగాఁ గూర్చున్నవాఁడును, అధికమయిన దేహకాంతివిశేషముచేత మన్మథుని మోహింపఁజేయువాఁడునైన శ్రీకృష్ణమూర్తిని అని తాత్పర్యము.

గార్వి.—సీ॥ ఇందీవరశ్యాము * వందితసుత్రాముఁ - గరుణాలవాలు భా * సురకపోలుఁ
కౌస్తుభాలంకారుఁ * గామితమందారు - సురుచిర లావణ్యు * సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు * నఖిల లోకారాధ్యు - ఘనచక్రహస్తు జ * గత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ * గౌశేయపరిధానుఁ - బన్నగశయను న * బ్జాతనయను
తే॥ మకరకుండల సద్భూషు * మంజుభాషు। నిరుపమాకారు దుగ్ధసా * గరవిహారు
భూరిగుణ సాంద్రు యదుకులాం * భోధిచంద్రు। విష్ణు రోచిష్ణు జిష్ణు స * హిష్ణుఁ గృష్ణు.

టీ॥ ఇందీవర శ్యామున్ = నల్లగలువలవంటి చామనచాయ గలవాఁడును. వందితసుత్రామున్=కొనియాడఁబడిన యింద్రుఁడు గలవాఁడును. కరుణాలవాలున్=దయకుపాదైనవాఁడును. భాసురకపోలున్=ప్రకాశించునట్టి చెక్కిళ్లుగలవాఁడును. కౌస్తుభాలంకారున్=కౌస్తుభమణి అలంకారముగాఁ గలవాఁడును. కామితమందారున్ = కోరికల నిచ్చుటయందు కల్పవృక్షమైనవాఁడును. సురుచిరలావణ్యున్=మిక్కిలి వెలుఁగునట్టి లావణ్యముగలవాఁడును. సురశరణ్యున్ = దేవతలరక్షకు స్థానమైనవాఁడును. హర్యక్షనిభమధ్యున్=సింహమునడుమునుబోలిన నడుముగలవాఁడును. అఖిలలోకారాధ్యున్=ఎల్లలోకులకు ఆరాధింపఁ దగినవాఁడును. ఘనచక్రహస్తున్=గొప్పదైన చక్రముతోడి చేయిగలవాఁడును. జగత్ప్రశస్తున్=లోకములందు శ్లాఘ్యమైనవాఁడును. ఖగకులాధిపయానున్=పక్షిరాజైన గరుత్మంతుఁడు వాహనముగాఁ గలవాఁడును. కౌశేయపరిధానున్ = పట్టుపచ్చడము కట్టుకొన్న వస్త్రముగాఁ గలవాఁడును. పన్నగశయనున్=పాముపైఁ బండుకొన్నవాఁడును. అబ్జాతనయనున్=కమలములవంటి కన్నులుగలవాఁడును. మకరకుండల సద్భూషున్=మొసలిరూపముగల చెవిపోఁగుల నెడుమంచి సొమ్ములుగలవాఁడును. మంజుభాషున్ = మనోజ్ఞములైన మాటలు గలవాఁడును. నిరుపమాకారున్ = ఈడులేని యాకృతి గలవాఁడును. దుగ్ధసాగరవిహారున్ = పాలసముద్రమునందు విహరించు వాఁడును. భూరిగుణసాంద్రున్=గొప్పలైన గుణములచేత అధికుఁడును. యదుకులాంభోధిచంద్రున్ = యాదవవంశమనెడు సముద్రమునకు చంద్రుఁడును—యాదవవంశశ్రేష్ఠుఁడును. విష్ణున్=సర్వవ్యాపకుఁడును. రోచిష్ణున్=సూర్యచంద్రాగ్నులతేజస్సు నుమీరిన తేజస్సుచేత వెలుఁగునట్టి స్వభావము గలవాఁడును. జిష్ణున్=జయించుస్వభావముగలవాఁడును. సహిష్ణున్=సహనశీలుఁడైన. కృష్ణున్=శ్రీకృష్ణమూర్తిని. (చూచి)

తా॥ నల్లగలువలచాయవంటి మేనిచాయగలవాఁడును, ఇంద్రునిచేత మ్రొక్కఁబడు వాఁడును, దయకుపాదైన వాఁడును, నిగనిగలాడు చెక్కిళ్లుగలవాఁడును, కౌస్తుభమణియనెడి యాభరణముగలవాఁడును, కల్పవృక్షమువలె కోరిన కోరికలనిచ్చు వాఁడును, వెలుఁగుచున్న దేహకాంతిగలవాఁడును, దేవతలకు రక్షకుఁడును, సింహము నడుమువలె సన్ననినడుముగలవాఁడును, ఎల్లలోకులకు ఆరాధింపఁదగినవాఁడును, గొప్పదైన సుదర్శన చక్రముచేతఁ బట్టిన వాఁడును, లోకమునందు ఖ్యాతివహించినవాఁడును, గరుడవాహనముగలవాఁడును, పట్టుపీతాంబరమును గట్టుకొను వాఁడును, శేషునిపైపరుండు వాఁడును, కమలములను బోలిన కన్నులుగలవాఁడును, మొసలివంటి చెవిపోఁగులుగలవాఁడును, మనోజ్ఞములైన మాటలుగలవాఁడును, ఈడులేనిరూపము గలవాఁడును, పాలసముద్రమునందువిహరించువాఁడును, సకలకల్యాణగుణములచేత అధికుఁడును, యదువంశశ్రేష్ఠుఁడును, సర్వ వ్యాపకుఁడును, సర్వతేజస్వియు జయశీలుఁడును, సహనశీలుఁడును నైన శ్రీకృష్ణుని జూచెనని తాత్పర్యము.

౯౮౪. — మ॥ కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళ * త్కంజాక్షుఁ డప్పేద వి
ప్రుని వక్రాంత దరిద్ర పీడితుఁ గృశీ * భూతాంగుఁ జీర్ణాంబరుౘ్
ఘన తృష్ణాతురచిత్తు హాస్య నిలయుౘ్ * ఖండోత్తరీయుౘ్ గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమ విలో * లుండై దిగెౘ్ దల్పముౘ్.

టీ॥ కని=చూచి. డాయంజనునంతౘ్ = దగ్గఱపోవు నంతలో. దళత్కంజాక్షుఁడు=వికసించిన తామరలవంటికన్నులుగల, (కృష్ణుఁడు) అప్పేద విప్రుని = దరిద్రుఁడైన యాబ్రాహ్మణుని. ఆక్రాంత దరిద్ర పీడితుౘ్=ఎడతెగని పేదఱికముచేత బాధపడువానిని. కృశీభూతాంగుౘ్= చిక్కిపోయిన దేహముగలవానిని. జీర్ణాంబరుౘ్ = ప్రాఁత పేలికలుగల వానిని. ఘనతృష్ణాతురచిత్తుౘ్ = అధికమయినదప్పిచేత పీడింపఁబడిన మనసుగలవానిని. హాస్యనిలయుౘ్=పరిహాసమునకు చోటయిన వానిని. ఖండోత్తరీయుౘ్=చింపులైనయుత్తరీయముగలవాఁడును. (కుచేలుని) అల్లంతనె = కొంతదూరమునందే. (చూచి) సంభ్రమ విలోలుండై= తొట్రుపాటుచేత చలించువాఁడై. తల్పముౘ్=పానుపును. (దిగెను)

తా॥ కుచేలుఁడు పైనిచెప్పిన చొప్పున హంసతూలికా తల్పముపై నున్న శ్రీకృష్ణమూర్తినిఁజూచి దగ్గఱపోఁగా ఆకృష్ణమూర్తియు మిక్కిలి పేదఱికముచేతపీడింపఁబడు వాఁడును, మిక్కిలి చిక్కిన దేహముగల వాఁడును, చినిఁగినవస్త్రము కట్టుకొన్న వాఁడును, అధికమైనదప్పిచేత డస్సినవాఁడును, పరిహాసము చేయుటకుతగినవిధముననుండువాఁడును, చింపి పేలిక పైన వేసికొన్నవాఁడును నైన కుచేలుని కొంతదూరమున రాఁగానేచూచి శ్రీకృష్ణమూర్తిత్వరతో పాన్పునుండి దిగినవాఁడాయనితా.



(*) శ్రీకృష్ణమూర్తి కుచేలుని గౌరవించుట. (*)

క॥ కరమర్థి నెదురుగాఁజని । పరిరంభణ మాచరించి * బంధుస్నేహ
స్ఫురణన్దోడ్తెచ్చి సమా । దరమునఁగూర్చుండఁబెట్టి * దనతల్పమునౘ్.

టీ॥ కరము=మిక్కిలి. అర్థిౘ్=ప్రీతితో. ఎదురుగాఁజని=ఎదురుకొనిపోయి. పరిరంభణమాచరించి=కౌఁగిలించుకొని. బంధుస్నేహస్ఫురణౘ్ = చుట్టఱికపు చెలిమికనఁబడుచుటచేత. తోడ్తెచ్చి=పిలుచుకవచ్చి. సమాదరమునౘ్ = అధికమైన యాదరణతో. తనతల్పమునౘ్ = తనపానుపునందు. (కూర్చుండఁబెట్టెను)

తా॥ మిక్కిలి ప్రీతితో కుచేలునికెదురుగాఁబోయి ఆయనను కౌఁగిలించుకొని చుట్టఱికపు చెలిమి కనఁబడుచుచు పిలుచుకొని వచ్చి చాల మక్కువతో తన పానుపుపైఁ గూర్చుండఁబెట్టి యాదరించెనని తాత్పర్యము.

౯౮౫. — తే॥ అట్లు కూర్చుండఁ బెట్టి నె * య్యమునఁ గనక
కలశ సలిలంబుచేఁ గాళ్లు * గడిగి భక్తిఁ
దజ్జలంబులు దనదు మ * స్తమునఁ దాల్చి
లలిత మృగమద ఘనసార * మిళితమైన.

టీ॥ (అట్లుకూర్చుండఁబెట్టి) నెయ్యమునౘ్=ప్రీతితో. కనకకలశసలిలంబుచేౘ్= బంగారు గిండిలోని నీళ్లచేత. (కాళ్లుఁగడిగి) భక్తిౘ్=భక్తితో. తజ్జలంబులు= ఆనీళ్లు. తనదుమస్తమునౘ్=తన తలయందు. తాల్చి=ధరించి. లలితమృగమదఘనసారమిళితమైన = ఒప్పిదమైన కస్తూరితోను పచ్చకప్పురముతోను కూడినదైన.

౯౮౬. — తే॥ మలయజము మేనఁజొబ్బిల * నలఁదియంత । శ్రమముఁవాయంగఁ దాళవృం * తమున విసరి
బంధురామోద కలిత ధూ * పంబులొసఁగి । మించు మణి దీపముల నివా * ళించి మఱియు.

టీ॥ మలయజము = మంచిగంధము. మేనౘ్ = దేహము నందు. జొబ్బిలౘ్=నిండుకొనఁగా. అలఁది=పూసి. అంతౘ్=అంతట. శ్రమము వాయంగౘ్=బడలిక తీఱునట్లు. తాళవృంతమునౘ్ = విసనకఱ్ఱతో. (విసరి) బంధురా...ధూపంబులు—బంధుర=అధికమయిన. ఆమోద= పరిమళముతోడ. కలిత=కూడుకొన్న. ధూపంబులు=ధూపపుపొగలు. ఒసఁగి=ఇచ్చి. మించు=అతిశయించునట్టి. మణిదీపములౘ్=రత్నము లనెడుదీపములను, నివాళించి=ఆరతిచ్చి, మఱియుౘ్=ఇంతేగాకుండ.

రెండుపద్యములకుఁదాత్పర్యము. తా॥ ఆవిధముగాకుచేలునితనపానుపుపైఁగూర్చుండఁబెట్టి శ్రీకృష్ణమూర్తి యతనికి బంగారుగిండిలో నీళ్లు తెప్పించికాళ్లుగడిగి ఆ కాళ్లుగడిగిననీళ్లనుప్రీతితోతలపైఁజల్లుకొనిమంచి కస్తూరి పచ్చకప్పురము చేర్చిన పరిమళము తోడి గంధమును దేహము నిండఁబూసిదారినడచిన బడలికయంతయు తీరునట్లు విసనకఱ్ఱతో విసరి పరిమళ యుక్తమయిన దూపమును రత్నముల తోడి దీపమును ఇచ్చిన వాఁడాయనితాత్పర్యము.

వ॥ సురభి కుసుమ మాలికలు సిగముడిం దుఱిమి కర్పూర మిళిత తాంబూలంబు లిడి ధేనువ్వొసంగి సాదరంబుగా స్వాగతంబడిగిన నప్పుడవ్విప్రు మేనం బులకాంకురంబు లంకురింప నానంద బాష్ప జలబిందు సందోహుండయ్యె.

నట్టియెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణియగు రుక్మిణి కరకంకణంబులు మొరయఁ జామరలువీవం దజ్జాత వాతంబున ఘర్మసలిలంబు నివారించుచుండం జూచి శుద్ధాంత కాంతాజనంబులు మనంబుల నద్భుతంబంది యిట్లనిరి.

టీ॥ సురభికుసుమమాలికలు=పరిమళముగలపువ్వులదండలు. సిగ ముడిందుఱిమి=జుట్టుముడిలోఁ జెరివి. కర్పూరమిళిత తాంబూల బిడి=పచ్చకప్పురముతోడి తాంబూలములిచ్చి. ధేనువునొసంగి=లేఁగటావు నిచ్చి. సాదరంబుగాన్ = ఆదరముతోఁ గూడుకొనునట్లుగా. స్వాగతంబడిగినన్ = కుశలము అడుగఁగా. (అప్పుడు) అవ్విప్రు మేనన్=ఆబ్రాహ్మణుని దేహమునందు. పులకాంకురంబు లంకురింపన్=గగ్గురు పొడువఁగా. ఆనందబాష్పజలబిందు సందోహుండయ్యెన్ = సంతోషాతిశయమువలనఁ బుట్టిన కన్నీటిబొట్లసముదాయముగలవాఁడయ్యెను అట్టియెడన్=ఆసమయమునందు. పద్మలోచనుండు = శ్రీకృష్ణుఁడు. మన్నించునంగనామణియగు=గౌరవించునిల్లాలగు. రుక్మిణి=రుక్మిణీదేవి. కరకంకణంబులు=ముంజేతికడియములు. మొరయన్=మ్రోఁగఁగా. చామరలువీవన్=వింజామరలువీవఁగా. తజ్జాతవాతంబునన్=ఆవింజామరలవలనఁ బుట్టినగాలిచేత. ఘర్మసలిలంబు=చెమటనీరు. నివారించుచుండన్=అణఁగిపోవుచుండఁగా. (చూచి) శుద్ధాంత కాంతా జనంబులు=అంతఃపురస్త్రీలు. మనంబులన్=తమమనసులలో. అద్భుతంబు=ఆశ్చర్యము. అంది=పొంది. (ఇట్లనిరి)

తా॥ మంచివాసనగల పూలదండలు సిగనుముడిచి పచ్చకప్పురముతోడి తాంబూలమిచ్చి లేఁగటావునిచ్చి మిక్కిలియాదరముతో కుశలమడిగినంతట ఆబ్రాహ్మణుఁడు దేహము గగుర్పొడువఁగా కన్నులయం దానందబాష్పములురాలఁగా పరవశుఁడైయుండెను ఆసమయమునందు శ్రీకృష్ణుని పట్టపుదేవియైన రుక్మిణివింజామరలు వేయఁగా అందువలనఁ బుట్టినగాలిచేత అతని దేహమునందలి చెమట యాఱుచుండెను అది చూచి అంతఃపురమునందున్న స్త్రీలందఱు ఆశ్చర్యము నొందినవారై తమలోనిట్లు అనుకొనిరని తాత్పర్యము.

౯౮౮.—ఉ॥ ఏమితపంబు చేసెనొకొ * యీధరణీదివిజోత్తముండు తొ
ల్లా మునయోగి విస్ఫురదు * పాస్యకుఁడై తనరారు నీజగ
త్స్వామి రమాధినాథు నిజ * తల్పమునన్ వసియించి యున్నవాఁ
డీమహనీయమూర్తి కెన * యే మునిపుంగవు లెంతవారలున్.

టీ॥ ఈధరణీదివిజోత్తముండు=ఈబ్రాహ్మణశ్రేష్ఠుఁడు. తొల్లామునన్=పూర్వజన్మమునందు. ఏమితపంబుచేసెనొకొ = ఎటువంటి తపస్సుచేసినాఁడో. యోగివిస్ఫురదుపాస్యకుఁడు = యోగులచేత చక్కఁగా ఉపాసింపఁదగినవాఁడు. ఐతనరారు=అయి యొప్పునట్టి. ఈజగత్స్వామి = ఈలోక నాయకుఁడైన. రమాధినాథు = లక్ష్మీపతి యొక్క. నిజతల్పమునన్=సొంతపుపాన్పునందు. వసియించియున్నవాఁడు = కూర్చుండియున్నాఁడు. మునిపుంగవులు = మునిశ్రేష్ఠులు. ఎంతవారలున్ = ఎంతటివారైనను. ఈమహనీయ మూర్తికిన్ = ఈపూజ్యునకు. ఎనయే=సమానులా. వ॥ (ఇదియనుంగాక)

తా॥ ఈబ్రాహ్మణోత్తముఁడు పూర్వజన్మమునందు ఎటువంటి తపస్సు చేసినాఁడో కాని యిప్పుడు ఎల్లయోగులకును పూజ్యుఁడును సర్వలోకస్వామియు శ్రీలక్ష్మీప్రియుఁడునైన యీకృష్ణమూర్తియొక్క పాన్పుపైఁ గూర్చున్నాఁడు పూజ్యుఁడై మహానుభావుఁడైనయీబ్రాహ్మణునితో ఎంతటిగొప్పమును లైనను సమానులగుదురా అనుకొనిరని తా.

౯౮౯.—చ॥ తనమృదుతల్పమందు వని * తామణియైన రమాలలామ పొం
దును నెడగాఁ దలంపక య * దుప్రవరుం డెదురేగి మోదమున్
దనుకఁగఁ గౌఁగిలించి యుచి * తక్రియలం బరితుష్టుఁ జేయుచు
న్వినయమునన్ భజించె ధర * ణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో.

టీ॥ యదుప్రవరుండు = యదువంశశ్రేష్ఠుఁడైన కృష్ణుఁడు. తనమృదుతల్పమందున్ = తనమైన మెత్తని పాన్పునందు. వనితామణియైన=స్త్రీలలో శ్రేష్ఠురాలైన. రమాలలామ పొందును=లక్ష్మీస్వరూపురాలైనరుక్మిణితోడికూటమియు. ఎడగాన్=ఎడమగుటయు. తలంపక=ఎంచక. ఎదురేగి=ఎదురుగాపోయి. మోదమున్ = సంతోషమును. తనుకఁగన్=కలుగఁగా. కౌఁగిలించి = ఆలింగనముచేసికొని. ఉచితక్రియలన్=తగినపరిచర్యలచేత. పరితుష్టుఁజేయుచున్=సంతోషించినవానిఁగాఁజేయుచు. వినయమునన్=అడఁకువతో. భజించెన్=సేవించెను. ధరణీసురుఁడు=ఈబ్రాహ్మణుఁడు. ఎంతటిభాగ్యవంతుఁడో=ఎంతటియదృష్టముగలవాఁడో.

తా॥ శ్రీకృష్ణమూర్తి లక్ష్మీస్వరూపురాలైన రుక్మిణితోడి కూటమి యెడయగుటనుమనసునవిచారింపక యెదురుగాఁబోయి ప్రీతితో పిలుచుకొనివచ్చి మెత్తనిదైన తనపాన్పునందుఁ గూర్చుండఁబెట్టి కౌఁగిలించుకొని తగుపాటి పరిచర్యలుచేసి సంతోషపెట్టుచు వినయముతో సేవించుచున్నాఁడు ఈబ్రాహ్మణుఁడు ఎంతటియదృష్టముగలవాఁడోయని అనుకొనిరని తాత్పర్యము. వ॥ అయ్యవసరంబున. టీ॥ అప్పుడు.

౯౯౦.—క॥ మురసంహరుఁడు గుచేలుని । కరము గరంబునఁ దెమల్చి * కడకన్మన మా
గురు గృహమున వర్తించిన । చరితములని కొన్నినుడివి * చతురత మఱియున్.

టీ॥ మురసంహరుఁడు=కృష్ణుఁడు. కుచేలునికరము = కుచేలుని చేతిని. కరంబునన్=చేతితో. తెమల్చి=ఒడిసిపట్టి. కడఁకన్=పూనికతో. (మనము) ఆగురు గృహమునన్=మనువు చదువుకొన్న గురుని యింటిలో. వర్తించిన చరితములు=జరిగినకొన్ననడవడులు. (అని) కొన్ని నుడివి=కొన్ని చెప్పి. చతురతన్=చాతుర్యముతో. మఱియున్=ఇంకను.

తా॥ అప్పుడు శ్రీకృష్ణుఁడు ఆకుచేలుని చెయి పట్టుకొని మనువు మనముచదువుకొన్న గురువునింటిలో మనము చేసినపనులు అని కొన్నిటిని చెప్పి మఱియును చతురత్వముతో కొన్ని మాటలడిగెనని తాత్పర్యము.

౯౯౧.—సీ॥ బ్రాహ్మణోత్తమ వేద ✱ పాఠనలబ్ధ ద - క్షత గల చారువం ✱ శంబువలనఁ
బరిణయంబైనట్టి ✱ భార్య సుశీల వ - ర్తనములఁ దగ భవ ✱ త్సదృశ యగునె
తలఁప గృహక్షేత్ర ✱ ధనదార పుత్రాదు - లందు నీచిత్తంబు ✱ చెందకుంట.
తోఁచుచున్నది యేను ✱ దుది లోకసంగ్రహా - ర్థంబు కర్మాచర ✱ ణంబు సేయ
తే॥ గతిమనంబునఁ గామమో ✱ హితులుగాక। నర్థిమై విహిత కర్మంబు ✱ లాచరించి
ప్రకృతి సంబంధమునఁ బాసి ✱ భవ్యనిష్ఠఁ - దవిలియుందురు గొందఱు ✱ త్తములుభువిని.

టీ॥ బ్రాహ్మణోత్తమ=ఓబ్రాహ్మణ శ్రేష్ఠుఁడా. వేద...వలనన్— వేదపాఠన=వేదముచదువుటచేత. లబ్ధ=పొందఁబడిన. దక్షత=సామర్థ్యము. కల=కలిగిన. చారు=ఒప్పిదమైన. వంశంబు వలనన్=వంశమువలననుండి. పరిణయంబైనట్టిభార్య = పెండ్లిచేసికొన్న పెండ్లాము. సుశీలవర్తనములన్=మంచి స్వభావముచేతను మంచి నడవడిచేతను. తగన్=ఒప్పునట్లు. భవత్సదృశయగునె=నీకుసరియైనదగునా. తలఁపన్=విచారింపఁగా. గృహక్షేత్రధనదారపుత్రాదులందున్ = ఇల్లు మడి ధనము పెండ్లాముబిడ్డలు మొదలగువారియందు. నీచిత్తంబు=నీమనసు. చెందకుంట=పొందకయుండుట. తోఁచుచున్నది=కనఁబడుచున్నది. ఏనుదుది = నేనుకడఁగా. లోక సంగ్రహార్థంబు = లోకాచారమును సంగ్రహించుటకొఱకు. కర్మాచరణంబు = పనులునడపుటను. చేయుగతిన్=చేయువిధమున. మనంబునన్=మనసునందు. కామమోహితులుగాక = కోరికలచేత భ్రమపడినవారు గాక. అర్థిమైన్ = ప్రీతితో విహితకర్మంబులు = విధింపఁబడినకర్మములను. ఆచరించి=చేసి. ప్రకృతి సంబంధమునన్=మాయాసంబంధమును. పాసి=విడిచి. భవ్యనిష్ఠన్=మేలయిన నియమమునందు. తవిలియుందురు = ఆసక్తులై యుందురు. భువిన్=భూమియందు. (కొందఱు) ఉత్తములు=శ్రేష్ఠులు.

తా॥ ఓబ్రాహ్మణోత్తముఁడా! నీవు వేదమును చదువుటవలన కీర్తిని వహించిన యుత్తమ కులము నందుండి పరిగ్రహించి పెండ్లాడిన నీయిల్లాలు మంచిస్వభావముచేతను, మంచినడవడిచేతను, నిన్నుఁబోలి యుండును గదా, ఆలోచించి చూడఁగా నీవు ఇల్లు వాకిలి పెండ్లాము బిడ్డలు మొదలగువారియందు ఆసక్తిలేనివాఁడవైయున్నట్లుతోఁచుచున్నది ఈలోకమునందు నేనుతుదగాఁగల కొందఱుగొప్పవారు లోకము మేలుకొఱకు మనసున నే కోరికయును లేక కర్మములను చేయుచు అందులఫలము నపేక్షించక అజ్ఞానావరణములో మునిఁగిపోక శాస్త్రమునందు విధింపఁబడిన నియతకర్మములను ప్రీతితో చేయుచు మాయాసంబంధమును విడిచి మేలయిననియమముతో వర్తించుచుందురు అని తాత్పర్యము.

వ॥ అనిమఱియునిట్లనియె. టీ॥ అని మఱల నిట్లు చెప్పెను.

౯౯౨.—క॥ ఎఱుఁగుదె గురుమందిరమున। వెరవొప్పఁగ మనకునతఁడు ✱ వెలయఁగఁ దెలుపన్
నెఱుఁగఁగ వలసిన యర్థము। లెఱిఁగి పరిజ్ఞాన మహిమ ✱ లెఱుఁగుట లెల్లన్.

టీ॥ గురుమందిరమునన్ = గురువునింటిలో. వెరవొప్పఁగన్= నేర్పుఒప్పఁగా. (మనకు) అతఁడు=గురువు. వెలయఁగన్=విశదముగా. తెలుపన్=తెలియఁజేయఁగా. ఎఱుఁగఁగ వలసిన యర్థములు = తెలిసికొనవలసిన విషయములను. ఎఱిఁగి=తెలిసికొని. పరిజ్ఞానమహిమలు= యుక్తాయుక్తముల నెఱుఁగునట్టిమహిమలను. ఎఱుఁగుటలెల్లన్ = తెలిసికొనుటయంతయు. ఎఱుఁగుదె=నీవు ఎఱుఁగుదువా—నీకు జ్ఞాపకమున్నదాయనుట.

తా॥ మనము గురువునింట చదువునప్పుడు ఆమహాత్ముఁడు మనకు తెలియవలసిన విషయముల నెల్లను ఉపమతో తెలియఁజేయఁగా తెలిసికొని కృతార్థులమగుట నీవు మఱవక యున్నావా యని అడిగెను అని తా.

వ॥ అని మఱియు గురుప్రశంస సేయందలంచి యిట్లనియె.

టీ॥ (అని) మఱియున్=ఇంకను. గురుప్రశంస=గురువుయొక్క స్తోత్రమును. చేయందలంచి=చేయఁగోరి. ఇట్లనియెన్=ఈవిధముగఁబలికెను.

౯౯౩.—తే॥ తివిరి యజ్ఞాన తిమిరప్ర ✱ దీప మగుచు। నవ్యయంబైన బ్రహ్మంబు ✱ ననుభవించు
భరితసత్వుండు సత్కర్మ ✱ నిరతుఁ డతుల। భూసురశ్రేష్ఠుఁ డనఘుండు ✱ బుధనుతుండు.

టీ॥ తివిరి=పూని. అజ్ఞానతిమిరప్రదీపము=అజ్ఞానమనెడుచీఁకటికి దీపము. (అగుచును) అవ్యయంబైన = నాశనరహితమయిన. బ్రహ్మంబున్ = పరబ్రహ్మమును. అనుభవించు భరితసత్వుండు = అనుభవముచేత తెలిసికొనునట్టి మేలైన సామర్థ్యము గలవాఁడు. సత్కర్మనిరతుఁడు=మంచికర్మములను నడపుటయందు ఆసక్తుఁడు. అతులభూసుర శ్రేష్ఠుఁడు = సాటిలేనిబ్రాహ్మణులలో శ్రేష్ఠుఁడు. అనఘుండు=పాపము లేనివాఁడు. బుధనుతుండు=పండితులచేతకొనియాడఁబడువాఁడు.

తా॥ మనగురువు ప్రయత్నముచేత అజ్ఞానమనెడిచీఁకటికిదీపము వంటివాఁడైన పరబ్రహ్మమును, అనుభవముచేత తెలిసికోఁజాలినవాఁడును, మంచిపనులను జేయువాఁడును, ఉత్తమబ్రాహ్మణులలో నుత్తముఁడును, పాపము లేనివాఁడును, పండితులచేతఁ గొనియాడఁబడువాఁడును కాదా అని తాత్పర్యము.

౯౯౪.—వ॥ అమ్మహాత్మునివలన సకల వర్ణాశ్రమంబులవారికి నేను విజ్ఞానప్రదుండనగు గురుండనై యుండియు గురు భజనంబు పరమ ధర్మంబని యాచరించితి నది గావున.

టీ॥ అమ్మహాత్మునివలనన్=మహాత్ముఁడైనయాగురువువలన. సకలవర్ణాశ్రమంబులవారికిన్ = ఎల్లవర్ణములవారికిని ఎల్లయాశ్రమముల వారికిని. (నేను) విజ్ఞానప్రదుండను = విశేషజ్ఞానము నిచ్చునట్టి వాఁడను. అగుగురుండనై=అగునట్టిగురుఁడనై. (ఉండియును) గురు

భజనంబు=గురువునుగొలుచుట. పరమధర్మంబు = ఉత్తమధర్మము. (అని) ఆచరించితిర్=చేసితిని. అదిగావునన్ = కాఁబట్టి.

తా॥ నేను బ్రహ్మక్షత్రియాది వర్ణములవారును బ్రహ్మచర్యాదులైన యాశ్రమములవారునైన యెల్లవారికిని మేలయిన తెలివిని కలుగఁజేయువాఁడనుగానుండియు గొప్పవాఁడైన యాగురువువలన గురుసేవచేయుట యుత్తమ ధర్మమనుటను లోకులకుఁ దెలుపుటకై విద్యాభ్యాసముచేసితిని అనితాత్పర్యము.

౯౯౫.—క॥ భూసురులకెల్ల ముఖ్యుఁడ । నై సకల కులాశ్రమంబు * లందుల నెపుడున్
ధీసుజ్ఞాన ప్రదుఁడన । దేశికుఁడన నొప్పుచుందు * ధృతి నెల్లెడలన్.

టీ॥ భూసురులకెల్లన్=బ్రాహ్మణులకెల్లవారికిని. ముఖ్యుఁడనై=ప్రధానుఁడనై. సకలకులాశ్రమంబులందులన్=ఎల్లకులము లందును ఆశ్రమములందును. ఎపుడున్=ఎల్లప్పుడును. ధీసుజ్ఞానప్రదుఁడనన్—ధీ=శాస్త్రజ్ఞానమును. సుజ్ఞాన=బ్రహ్మజ్ఞానమును. ప్రదుఁడనన్=ఇచ్చువాఁడు అనఁగాను. దేశికుఁడనన్=ఉపదేశగురువు అనునట్టుగాను. ధృతిన్=నిలుకడతో. ఎల్లెడలన్=అన్ని చోటులను. ఒప్పుచుందున్=ఒప్పుచునుండుదును.

తా॥ కాఁబట్టి నేనుబ్రాహ్మణులకంటె అందరికన్నను ముఖ్యుఁడనై తక్కిన కులములవారికిని ఎల్లయాశ్రమముల వారికిని శాస్త్రజ్ఞానము, బ్రహ్మజ్ఞానమును ఇచ్చుచు ఉపదేశగురువువలె వర్తించుచుందును అనితా.

౯౯౬.—తే॥ అట్టివర్ణాశ్రమంబుల * యందు నర్థ । కుశలులగువారు నిఖిలైక * గురుఁడనైన
నాదు వాక్యంబుచే భవా * ర్ణవముఁ బెలుచ । దాఁటుదురు మత్పదాంబుజ * ధ్యాన పరులు.

టీ॥ అట్టివర్ణాశ్రమంబులయందున్ = అటువంటివైన వర్ణములయందును ఆశ్రమములయందును. అర్థకుశలులగువారు = విషయము తెలుఁగుటయందు నేర్పరులైనవారు. నిఖిలైకగురుఁడను = సర్వమునకు నొకఁడనైన గురువను. అయిననాదువాక్యంబుచేన్=అయినట్టి నామాటచేత. మత్పదాంబుజధ్యానపరులు = నాపాదకమలములను ధ్యానింపనాసక్తులగువారు. భవార్ణవమున్ = జన్మసముద్రమును. పెలుచన్ = శీఘ్రముగా. దాఁటుదురు = దాఁటిపోఁగలరు.

తా॥ అటువంటి వర్ణాశ్రమములందు విషయము తెలుఁగు నేర్పుగల వారైన నాపాదముల ధ్యానించు నిష్ఠగలవారు సర్వమునకు నొక్కఁడనైనగురువనగు నామాటచేత జన్మసముద్రమును శీఘ్రముగ దాఁటుదురు అనితాత్పర్యము.

౯౯౭.—వ॥ అదియునుం గాక సకల భూతాత్మకుండనైన యేను తపోవ్రత యజ్ఞదాన శమదమాదుల
చేతసంత సింపను గురుజనంబులఁ బరమభక్తి సేవించు వారలంబరిణమింతు నని చెప్పి మఱియు
మనము గురుమందిరంబుననున్న యెడ గురుపత్నీనియుక్తులమైయింధనార్థంబడవికిం జనిన యెడ.

టీ॥ అదియునుంగాక=అదిమాత్రమే కాకుండ. సర్వభూతాత్మకుండను = ఎల్లప్రాణులును స్వరూపముగఁగలవాఁడను. అయిన యేను=అయినట్టి నేను. తపో...చేత—తపః = కృచ్ఛ్ర చాంద్రాయణాదితపస్సు. వ్రత=ఏకాదశి శివరాత్రి మొదలైనవ్రతములు. యజ్ఞ=జ్యోతిష్టోమాదియజ్ఞములు. దాన=ఈవులు. శమ=బహిరింద్రియనిగ్రహము. దమ=అంతరింద్రియ నిగ్రహము. ఆదులచేతన్=మొదలగువానిచేత. సంతసింపను = సంతోషమునొందను. గురుజనంబులన్=పూజ్యులగువారిని. పరమభక్తిన్ = మేలయినభక్తితో. సేవించువారలన్=కొలుచునట్టివారిని. పరిణమింతును=హర్షింతును—మెచ్చుకొందును. (అనిచెప్పి) మఱియును=ఇదిగాక. (మనము) గురుమందిరంబునన్=గురువునింట. ఉన్నయెడన్ = ఉండునప్పుడు. గురుపత్నీనియుక్తులమై = గురువుభార్యచేత పంపఁబడినవారమై. ఇంధనార్థంబు = సమిధలకొఱకు — చిదుగుల కొఱకు. (అడవికి) చనినయెడన్=పోయినప్పుడు.

తా॥ అదిగాక ఎల్లభూతములరూపములను వహించినవాఁడనైన నేను తపస్సువ్రతములు యజ్ఞములు దానములు అంతర్బాహ్యేంద్రియముల నిగ్రహించుట మొదలగువానిచేత సంతోషించువాఁడనుకాను చలింపనిభక్తితో గురువులను కొలుచువారియెడల ప్రీతిగలవాఁడనై అట్టివారిని మెచ్చుకొనుచుందును అనిచెప్పి ఆప్రసంగమును చాలించి ఓకుచేలుఁడా! మనము గురువునింటిలో చదువుకొనుచుండిగురువు పెండ్లాము పంపఁగా వంట చెఱకులకై అడవికి పోయినప్పుడు అనియెనని తాత్పర్యము.

౯౯౮.—సీ॥ ఘుమఘుమారావ సం * కుల ఘోర జీమూత - పటల సంఛన్నాభ్ర * భాగ మగుచుఁ
జటుల ఝుంఝూనిలో * త్కట సముద్ధూత నా - నావిధ జంతు సం * తాన మగుచుఁ
జండ దిగ్వేదండ * తుండ నిభాఖండ - వారిధారా పూర్ణ * వసుధ యగుచు
విద్యోతమానోగ్ర * ఖద్యోత కిరణ జి - ద్విద్యుద్ద్యుతిచ్ఛటా * విభవమగుచు
తే॥ నడరిజడిగురియ నినుఁడు * నస్తమింప । భూరి నీరంధ్ర నిబిడాంధ * కార మేచి
సూచికాభేద్యమై వస్తు * గోచరంబు । గానియట్లుండె మనము న * వ్వాన దడిసి.

టీ॥ ఘుమఘుమా ... అగుచున్ — ఘుమఘుమ = ఘుమఘుమయనెడు. ఆరావ=ధ్వనిచేత. సంకుల=సందడించుచున్న. ఘోర=భయంకరమైన. జీమూత = మేఘములయొక్క. పటల - సమూదాయముచేత. సంఛన్న = చక్కఁగా కప్పఁబడిన. అభ్రభాగము=

ఆకాశప్రదేశముగలది. (అగుచును) చటుల...మగుచున్ = చటుల = వడిచేత అతిశయించిన, ఝంఝానిల = వానతోడి గాలిచేత. ఉత్కట = పరవశత్వమునొంది. సముద్ధూత = ఎగురఁగొట్టఁబడిన. నానావిధ = బహువిధములయిన. జంతు = ప్రాణులయొక్క. సంతానము = సమూహములుగలది. (అగుచును) చండ...యగుచున్ — చండ = కోపించిన. దిగ్వేదండ = దిగ్గజములయొక్క. తుండ = తొండముల తోడ. నిభ = పోలిన. అఖండ = కొఱఁతలేని. వారిధారా = నీటిదారల చేత. పూర్ణ = నిండిన. వసుధయగుచున్ = భూమిగలది యగుచును. విద్యోత...విభవమగుచున్ — విద్యోతమాన = మిక్కిలి వెలుఁగుచున్న. ఉగ్ర = తీవ్రమైన, ఖద్యోతకిరణ = సూర్యునికిరణములను, జిత్ = జయించుచున్న. విద్యుద్ద్యుతి = మెఱపులకాంతులయొక్క. ఛటా = సముదయముయొక్క. విభవమగుచున్ = సంపదగలదియగుచును. ఆడరి = విజృంభించి. జడి = ఎడతెగనివాన. కురియన్ = కురియఁగా, ఇనుఁడును = సూర్యుఁడును. అస్తమింపన్ = క్రుంకఁగా, భూరిని రంధ్రనిబిడాంధకారము = అధికమును సందులేక దట్టమయిన చీఁకటి. పెరిగి. సూచికాభేద్యమై = సూదిచేతను భేదింపరానిదై. వస్తుగోచరంబుగానియట్లు = వస్తువులుకంటికిఁగానరానివిధమున. (ఉండెను మనమును) అవ్వానన్ = ఆవానయందు. తడిసి = తడిసినవారమై.

తా॥ ఘుమఘుమయని ఉఱుమునట్టి చప్పుళ్లతో భయంకరమైన మేఘములుదట్టముగా ఆకాశమున ఆవరింపఁగాను, మిక్కిలివడిగా వీఁచునట్టి వానతోడి గాలిచేత నానావిధములైన జంతువులు దేహములుతెలియక మీఁది కెగురఁ గొట్టఁబడినవి కాఁగాను, క్రోధించిన దిగ్గజముల తొండములు చాఁచినరీతిని సందులేక జలధారలు భూమియందు పడుచుండఁగాను, తీవ్రముగా వెలుఁగుచున్న సూర్యుని ప్రకాశమును అణఁచివేసి వెలుఁగునట్టి మెఱపులకాంతిసముదాయము హెచ్చఁగాను, ఎడతెగని వాన విజృంభించి కురియఁగా ప్రొద్దును గ్రుంకెను, సూదిగ్రుచ్చుటకుసైతము ఎడములేక దట్టముగా చీఁకటి కమ్ముకొనెను, ఏవస్తువునుకంటికి కానరాకపోయెను, మనముఅప్పుడు అట్టివంటి ఆవానయందు తడిసినవారమై యని తాత్పర్యము.

౯౯౯.—తే॥ బయలు గొందియుఁ బెనుమిట్టు * పల్లములును । రహితసహితస్థలంబు లే * ర్పఱుపరాక
యున్న యత్తఱి మనమొక * రొకరిచేతు । లూఁతగాఁగొని నడచుచు * నుండ నంత.

టీ॥ (బయలును) గొందియున్ = చీఁకటిసందును, పెనుమిట్టు = పెద్దమిట్టయు. (పల్లములును) రహిత = లేనివియు, సహిత = కలవియు నైన. స్థలంబులు = చోట్లు, ఏర్పఱుపరాక = ఇవియివియని తెలిసికొనశక్యముగాక, ఉన్నయత్తఱిన్ = ఉండునట్టి యాసమయమునందు. (మనము) ఒకరొకరిచేతులు = ఒకరిచేతులొకరు, ఊఁతగాన్ = చేయూసరాఁగా. కొని = పట్టుకొని. (నడచుచుండ) అంతన్ = అప్పుడు.

తా॥ ఇదిబయలుచోటు ఇది చీఁకటిసందైనచోటు ఇదిమిట్ట ఇది పల్లము అని తెలిసికొనుటకు శక్యముగాకయుండిన యాసమయమునందు మనము ఒకరిచేతులొకరు ఆసరాఁగా పట్టుకొనివచ్చుచుండు నప్పుడు అని తాత్పర్యము.

౧౦౦౦.—క॥ బిసబిస వప్పుడు నుడుగక । విసరెడి వలిచేత వడఁకు * విడువక మనముం
బసచెడి మార్గముఁ గానక । మసలితి మంతటను నంశు * మంతుఁడు వొడమెన్.

టీ॥ (అప్పుడు) ఉడుగక = ఎడతెగక, బిసబిసన్ = బిస్సుబిస్సుమని. విసరెడి = వీఁచునట్టి, వలిచేతన్ = చలిగాలిచేత, వడఁకు = వణఁకు. విడువక = మానక. మనమున్ = మనమును. పసచెడి = శక్తిలేనివారమై. మార్గమున్ = త్రోవను, కానక = తెలిసికోలేక. మసలితిమి = ఆలస్యము చేసితిమి — ఆయడవిలోనే నిలిచితిమి. అంతటను = అటుపిమ్మటను, అంశుమంతుఁడు = సూర్యుఁడు. పొడమెన్ = ఉదయించెను.

తా॥ ఆసమయమునందు బిస్సుబిస్సను ధ్వనితో వేగముగా వీచునట్టి చలిగాలిచేత వణఁకుపట్టి అందుండి దారితెలిసికొని వచ్చుటకు శక్తిలేనివారమై ఆయడవియందే మనము నిలిచితిమి అంతలో సూర్యోదయమును ఆయెను అని తాత్పర్యము.

౧౦౦౧.—క॥ తెలతెల వాఱెడి వేళన్ । గలకలమని పలికెఁ బక్షి * గణ మెల్లెడలన్
ఖిలఖిలని ప్రొద్దుపొడుపున । ధళధళయను మెఱుఁగు దిగ్వి * తానము నిండెన్.

టీ॥ తెలతెలవాఱెడి వేళన్ = తెల్లవారునట్టిసమయమునందు, పక్షిగణము = పక్షులగుంపు, ఎల్లెడలన్ = ఎల్లచోటులను, కలకలమని = కలకలయనుధ్వనితో, పలికెన్ = కూసెను. ఖిలఖిలని ప్రొద్దుపొడుపునన్ = ఖిలఖిలయనుకాంతితోడి సూర్యోదయసమయమునందు. ధళధళయను మెఱుఁగు = తళతళలాడునట్టి వెలుఁగు. దిగ్వితానమున = దిక్కులసమూహమునందు. నిండెన్ = నిండుకొనెను.

తా॥ తెల్లఁగా తెల్లవాఱునప్పుడు ఎల్లయెడలందును పక్షులు కలకలకూయసాగెను ప్రొద్దుపొడుచుటతోడనే తళతళనియెండయొక్క వెలుఁగుదిక్కులయందంతట వ్యాపించెను అని తాత్పర్యము.

౧౦౦౨.—క॥ అప్పుడు సాందీపుఁడు మన । చొప్పరయుచు వచ్చి వాన * సోఁకునను వలిన్
దెప్పిర్లుటఁ గని ఖేదం । బుప్పతిలం బలికె నకట * యోవటులారా.

టీ॥ (అప్పుడు) సాందీపుఁడు = మనగురువైనసాందీపుఁడు, మన చొప్పు = మనజాడ, అరయుచున్ = వెదకుచు, (వచ్చి) వాన సోఁకునన్ = వానయొక్క సోఁకుడుచేతను, వలిన్ = చలిచేతను. తెప్పిర్లుటన్ = తేఱుకొనుటను, కని = చూచి, ఖేదంబు = దుఃఖము, ఉప్పతిల్లన్ = పుట్టఁగా, అకట = అయ్యో, ఓవటులారా = ఓబ్రహ్మచారులారా — బిడ్డలారాయనుట. పలికెన్ = అనిపలికెను.

తా॥ ఆసమయమునందు మన గురువైన సాందీపుఁడు మనలను వెదకుకొనివచ్చి అడవిలో వానచేత తడిసి చలిగాలిచేత వడఁకుపట్టి కొంచెము తేఱుకొని వచ్చుచున్న మనలను జూచి విచారము నొందినవాఁడై ఓబిడ్డలారా! అనిపిలిచి యిట్లు పలికెనని తాత్పర్యము.

౧౦౦౩.—చ॥ కటకట యిట్లు మాకొఱకుఁ * గాఁ జనుదెంచి మహాటవిన్ సము
త్కట పరిపీడ నొందితిరి * గావున శిష్యులు మాఋణంబు నీఁ
గుటకిది కారణంబు సమ * కూడెడిఁబో యిటమీఁద మీకు వి
స్ఫుటధన బంధు దార బహు * పుత్త్ర విభూతి జయాయురున్నతుల్.

టీ॥ కటకట=అయ్యయ్యో. మాకొఱకుఁగాన్=మాకై. ఇట్లు=ఈవిధముగా. చనుదెంచి=వచ్చి. మహాటవిన్=గొప్పయడవియందు. సముత్కట=మిక్కిలియెచ్చైన. పరిపీడన్=శ్రమమును. ఒందితిరి=పొందితిరి. కావునన్=కనుక. శిష్యులు = ఓశిష్యులారా. మాఋణంబు=మాయప్పును. ఈఁగుటకున్ = తీర్చుటకు. ఇది=ఇట్లు శ్రమపడుట. కారణంబు=నిమిత్తము. ఇటమీఁదన్=ఇఁకమీఁదను. (మీకు) విస్ఫుట = మిక్కిలిప్రకాశించునట్టి. ధన ... ఉన్నతులు—ధన=ధనములును. బంధు=చుట్టములును. దార=పెండ్లాలును. బహు పుత్త్ర=అనేకులు కొడుకులును. విభూతి = ఐశ్వర్యమును. జయ = గెలుపును. ఆయురున్నతులు = ఆయుస్సును గౌరవమును. సమకూడెడిఁబో=తప్పక కలుగును సుమీ.

తా॥ ఓశిష్యులారా! మీరుమానిమిత్తమయివచ్చియీగొప్పయడవిలోఇటువంటిబాధలనుపొందితిరే అయ్యో! ఇట్టిశ్రమపడుటమాయప్పునుతీర్చుటకు కారణమయ్యెను విచారపడకుఁడుమీకు ఇఁకమీఁద ధనములుచుట్టములుపెండ్లాలు కొడుకులు ఐశ్వర్యము యుద్ధములందు జయము దీర్ఘాయస్సును గౌరవమును కలుగునుగాక అనియెననితా.

౧౦౦౪.—క॥ అని గారవించి యాయన । మనలం దోడ్కొనుచు నాత్మ * మందిర మునకున్
జనుదెంచుట లెల్లను నీ । మనమునఁ దలఁతే యటంచు * మఱియుం బలికెన్.

టీ॥ (అని) గారవించి=మన్నించి. ఆయన = ఆగురువు. (మనలను) తోడ్కొనుచున్=పిలుచుకొని. ఆత్మమందిరమునకున్=తమయింటికి. చనుదెంచుటలెల్లను = వచ్చుట మొదలగు వృత్తాంతములన్నియు. నీమనమునన్ = నీమనస్సునందు. తలఁతే = తలఁతువా. అటంచున్=అనుచు. మఱియున్=ఇంకను. పలికెన్ = చెప్పెను.

తా॥ అనియిట్లుదీవించి మన్నించి మనలను తమయింటికి పిలుచుకొనివచ్చుట మొదలగు వృత్తాంతములన్నియు ఎప్పుడయిన తలఁచుకొందువా అని యింకను మాటాడనారంభించెనని తాత్పర్యము.

వ॥ అనఘా మనమధ్యయనంబుసేయుచు నన్యోన్యస్నేహవాత్సల్యంబులం జేయు కృత్యంబులు మఱవవుగదా యనియవియెల్లం దలంచియాడు మాధవునిమధురాలాపంబులువిని యతనిం గనుంగొని కుచేలుండిట్లనియె.

టీ॥ అనఘా=పాపములేనివాఁడవైన కుచేలుఁడా. (మనము) అధ్యయనంబుసేయుచున్ = చదువుచు. అన్యోన్యస్నేహవాత్సల్యంబులన్=ఒకరొకరియందుచెలిమిచేతను—ప్రీతిచేతను. చేయుకృత్యంబులు=చేయునట్టిపనులు. మఱవవుగదా=మఱచిపోవుగదా. (అని) అవియెల్లన్=ఆపనులన్నియు. తలంచియాడు = తలఁచిచెప్పునట్టి. మాధవుని మధురాలాపంబులు=కృష్ణుని యింపైనమాటలు. (విని) అతనిన్ = అకృష్ణుని. కనుంగొని = చూచి. (కుచేలుఁడు) ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

తా॥ ఓపుణ్యాత్ముఁడా! మనముగురువునొద్ద చదువునపుడు ఒకరొకరియందలి ప్రీతితోచేయుచున్నకృత్యములన్ని మఱవకయున్నావుగదా అనితాము మునుపుచేసిన పనులన్ని తలఁచిచెప్పునట్టి కృష్ణునిఁ జూచి కుచేలుఁడు ఇట్లు పలికెనని తాత్పర్యము.

౧౦౦౫.—క॥ వనజోదర గురుమందిర । మున మనము వసించునాడు * ముదమునఁ గావిం
పనిపను లెవ్వియుఁ గలవే । వినుమవి యట్లుండ నిమ్ము * విమల చరిత్రా.

టీ॥ వనజోదర=కృష్ణా. గురుమందిరమునన్=గురువునింటిలో. (మనము)వసించునాడు=ఉన్నప్పుడు. ముదమునన్=సంతోషముతో కావింపనిపనులు=చేయనిపనులు. ఎవ్వియుఁగలవే=ఏవియైనఁగలవా-ఇవి అవి యనక ఎల్లపనులు చేసినవారమే యనుట. అవి యట్లుండనిమ్ము=ఆపనులుచేయుటలుఇప్పుడుచెప్పనక్కఱలేదు. విమలచరిత్రా = నిర్మలమైన నడవడిగల యోకృష్ణా. వినుము=నామనవి వినుము.

తా॥ ఓకృష్ణమూర్తీ! మనము గురువునింట సంతోషముతో వర్తించు నప్పుడు చేయని పనులేవియు లేవు అన్ని పనులు చేసియే యున్నాము ఆప్రశంస యిప్పుడేల నామనవిని చిత్తగింపుమని కుచేలుఁడు పలికెనని తాత్పర్యము.

౧౦౦౬.—క॥ గురుమతిఁ దలఁపఁగఁ ద్రిజగ । ద్గురుఁడ వనందగిననీకు * గురుఁడనఁ దానొం
డొరుఁ డెవ్వఁ డింతయును నీ । కరయంగ విడంబనంబు * లగుఁ గాదె హరీ.

టీ॥ హరీ=ఓకృష్ణా. గురుమతిన్=గొప్పబుద్ధితో. తలఁపఁగన్=విచారింపఁగా. త్రిజగద్గురుఁడవనందగిననీకున్=మూఁడులోకములకు గురువు అనిచెప్పఁదగిననీకుఁగూడ. గురుఁడనన్=గురువుఅనుటకు. (తాను)ఒండొరుఁడు=ఇంకొకఁడు. (ఎవ్వఁడు)ఇంతయున్=ఈగురుశిష్యులనుమర్యాదయంతయు. అరయంగన్=విచారింపఁగా. (నీకు)విడంబనంబులగుఁగాదె=లోకమర్యాదనుప్రకటించుటేగదా.

తా॥ ఓస్వామీ! గొప్పబుద్ధితో విచారించునపుడు నీవే మూఁడు లోకములకును ఆచార్యుఁడవు, అట్లుండఁగా నీకు ఆచార్యుఁడని యొకఁడుగలఁడా లేకున్నను లోకమర్యాదనుప్రకటించుటకైయిట్లు గురువునాశ్రయించినవాఁడవైతివి అని తాత్పర్యము.

వ॥ అని సాభిప్రాయంబుగాఁ బలికినపలుకులువిని సమస్తభావాభిజ్ఞుండైన పుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుండగుచు నతనిం జూచి నీవిచ్చటికివచ్చునప్పుడు నాయందులభక్తిం జేసి నాకునుపాయనంబుగా నేమిపదార్థంబు దెచ్చితి వప్పదార్థంబు లేశమాత్రంబైనఁ బదివేలుగా నంగీకరింతు నట్లుగాక నీచవర్తనుండై మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచలతుల్యంబైన పదార్థంబు నొసంగిన నది నామనంబునకు సమ్మతంబుగాదు కావున.

టీ॥ (అని) సాభిప్రాయంబుగాన్=అభిప్రాయానుసారముగా. పలికినపలుకులు = చెప్పినమాటలు. (విని) సమస్తభావాభిజ్ఞుండు= ఎల్లవారి యభిప్రాయముల నెఱిఁగిన వాఁడు. అయిన పుండరీకాక్షుండు=అయినట్టికృష్ణుఁడు. మందస్మితసుందరవదనారవిందుండు= చిఱునవ్వుచేత అందగించుచున్న ముఖకమలము గలవాఁడు. (అగుచును) అతనింజూచి=ఆకుచేలునిఁజూచి. (నీవిచ్చటికివచ్చునప్పుడు) నాయందులభక్తిం జేసి=నాయెడలగల భక్తిచేత. (నాకు) ఉపాయనంబుగాన్=కానుకగా. ఏమిపదార్థంబు = ఏవస్తువు. (తెచ్చితివి) అప్పదార్థంబు=ఆవస్తువు. లేశమాత్రంబైనన్=రవంతయైనను. పదివేలుగాన్=అంతకు పదివేలంతలుగా. అంగీకరింతును=పుచ్చుకొందును. అట్లుగాక = అట్లు అంగీకరించుటయేగాక. నీచవర్తనుండై = అల్పమైన నడవడిగలవాఁడై. మద్భక్తిన్ = నాసేవయందు. తగులని = ఆసక్తినొందని. దుష్టాత్ముండు = చెడ్డమనసుగలవాఁడు — దుష్టుఁడు. హేమాచలతుల్యంబు = మేరుపర్వతముతో సమానము. అయినపదార్థంబున్=అయినట్టి వస్తువును. ఒసంగినన్=ఇచ్చినను. (అది) నామనంబునకున్=నామనసునకు. సమ్మతంబుగాదు=ఇష్టము గాదు. కావునన్=కనుక.

తా॥ అని యీవిధముగా కుచేలుఁడు తన మనసులోని అభిప్రాయము తేటపడఁబలుకఁగా కృష్ణుఁడువిని ఎల్లవారియభిప్రాయములు నెఱిఁగినవాఁడుకాఁబట్టి యందులకు సంతోషించి చిఱునవ్వు నవ్వుచు నీవు నాయందలిభక్తిచేత నాకు ఏమివస్తువు కానుక తెచ్చినావు ఆతెచ్చినది అల్పమయినను మిగులగొప్పగా నెంచి నేనుపుచ్చుకొందును ఇదిగాక ద్యూతవేశ్యా సురాపాన నిద్రాహారసంగమాదులైన అల్పపు పనులయందు వర్తించుచు నాసేవఁ జేయక వర్తించు దుష్టుఁడు మేరుపర్వతమంతగొప్పవస్తువును తెచ్చి యిచ్చినను దానిని నేను ప్రియముతో పుచ్చుకొనను కాఁబట్టి అని యనియె నని తా.

౧౦౦౯.—క॥ దళమైనఁ బుష్పమైనను। ఫలమైనను సలిలమైనఁ * బాయని భక్తిన్
గొలిచినజను లర్పించిన। నెలమిన్ రుచిరాన్నముగనె * యేనుభుజింతున్.

టీ॥ దళమైనన్ = పత్రియైనను. పుష్పమైనన్ = పువ్వైనను. ఫలమైనన్=పండయినను. సలిలమైనన్=జలమయినను. పాయని భక్తిన్=తొలఁగని భక్తితో. కొలిచినజనులు=సేవించినట్టి జనులు. అర్పించినన్=ఇచ్చినను. ఎలమిన్=ప్రీతితో. రుచిరాన్నముగనె = పరిశుద్ధమైనఅన్నమునువలెనే. ఏను=నేను. భుజింతున్=ఆరగింతును.

తా॥ నాయందుతొలఁగనిభక్తిగలసేవకులు ఆకుగాని పువ్వుగాని పండుగాని నీళ్లుగాని అనఁగావీనిలో నేవిసమర్పించినను ఆసమర్పించినదానినే పరిశుద్ధమైన అన్నమునుగా నెంచి నేనారగింతునుఅని తా.

శ్లో॥ పత్రంపుష్పంఫలంతోయం యోమేభక్త్యాప్రయచ్ఛతి।తదహం భక్త్యుపహృత మశ్నామిప్రయతాత్మనః॥ అని భగవద్గీత.

౧౦౧౦.—క॥ అని పద్మోదరుఁ డాడిన। వినయోక్తుల కాత్మ నలరి * విప్రుఁడు దాఁదె
చ్చినయడుకులు దగనర్పిం। పను నేరక మోము వాంచి * పలుకకయున్నన్.

టీ॥ (అని)పద్మోదరుఁడు=కృష్ణుఁడు. ఆడినవినయోక్తులకున్= చెప్పిన వినయముతోడిమాటలకు. ఆత్మన్=మనసునందు. అలరి = సంతోషించి. విప్రుఁడు = బ్రాహ్మణుఁడు—కుచేలుఁడు. తాన్= తాను. (తెచ్చినయడుకులు) తగన్=తగునట్లు. అర్పింపను నేరక= సమర్పింపలేక. మోమువాంచి = మొగమును వంచి — తలవంచుకొని. పలుకక యున్నన్ = మాటలాడక యూరక యుండఁగా.

తా॥ అని శ్రీకృష్ణమూర్తి వినయముతో ఆడినమాటలువిని సంతోషించి కుచేలుఁడు తాను తెచ్చిన అటుకులను ఆయనకు సమర్పింపలేక అనఁగా ఈయల్ప పదార్థమును ఇంత గొప్పవానికి ఎట్లుసమర్పింపవచ్చునని సిగ్గుపడితలవంచుకొని యూరకయుండఁగానని తా.

వ॥ అవ్విప్రుండు చనుదెంచినకార్యంబు గృష్ణుండు దనదివ్య చిత్తంబున నెఱింగి యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపండైనను నిజకాంతాముఖోల్లాసంబునకై నాయొద్దకుం జనుదెంచినవాఁ డితనికి నింద్రాదులకుం బడయరానిబహువిధంబులైన సంపద్విశేషంబు లీక్షణంబ యొడఁగూర్పవలయునని తలంచి యతండు జీర్ణవస్త్రంబుకొన ముడిచి తెచ్చిన యయ్యడుకుల ముడియఁగని యిదియేడదని యొయ్యన నమ్ముడియఁ దనకరకమలంబుల విడిచి యయ్యడుకులుగొన్ని పుచ్చుకొని యివియనేకలోకంబుల నన్నుఁ బరితృప్తిం బొందింపఁ జాలుననియప్పుడు.

టీ॥ అవ్విప్రుండు=అబ్రాహ్మణుఁడు. చనుదెంచినకార్యంబు= వచ్చినపని. (కృష్ణుండు) తనదివ్యచిత్తంబునన్ = దివ్యమయినతన మనసునందు. ఎఱింగి=తెలిసికొని. (ఇతండు) పూర్వభవంబునన్= మునుపటిజన్మమునందు. ఐశ్వర్యకాముండై = ఐశ్వర్యమును గోరినవాఁడై. నన్ను సేవింపండు=నన్నుఁగొలిచినవాఁడుకాఁడు(అయినను) నిజకాంతాముఖోల్లాసంబునకై = తనపెండ్లామునొక్క మొగము వికసించుటకై—తనపెండ్లాము సంతోషించుటకై. నాయొద్దకుంజనుదెంచినవాఁడు = నాదగ్గఱకు వచ్చినాఁడు. (ఇతనికి) ఇంద్రాదులకున్=ఇంద్రుఁడు మొదలగువారికి. పడయరాని = పొందరాని. బహువిధంబులైనసంపద్విశేషంబులు=నానావిధములైన మేలిమికలు

మాటు. ఈక్షణంబ=ఇప్పుడే. ఒడఁగూర్పవలయుక్=కలుగఁజేయ వలయు. (అనితలంచి) అతండు=కుచేలుఁడు. జీర్ణవస్త్రంబుకొనక్= ప్రాంతగుడ్డకొంగునందు. (ముడిచితెచ్చిన) అయ్యడుకులముడియక్= ఆయటుకులమూటను. (కని) ఇదియేడది=ఈమూటయెక్కడిది. (అని) ఒయ్యనక్=తిన్నగా. అమ్ముడియక్ = ఆమూటను. తనకరకమలంబులక్ = తామరలవంటితనచేతులతో. విడిచి = విప్పి. అయ్యడుకులు = ఆయటుకులను. కొన్నిపుచ్చుకొని = కొన్నిటినిపుచ్చుకొని. (ఇవి) అనేకలోకంబులక్ = పెక్కులోకములను. (నన్నును) పరితృప్తింబొందింపఁజాలుక్=చక్కగా తృప్తిపొందునట్లు చేయఁజాలును. (అని యప్పుడు)

తా॥ ఆబ్రాహ్మణుఁడు తనయొద్దకు వచ్చినపని యిదియని తన మనసులో తెలిసికొని యితఁడు పూర్వ జన్మమునందు సంపదగోరి నన్నుసేవించినవాఁడుగాఁడు అయినను ఇప్పుడు తనభార్యనుతృప్తి పఱుచుటకై యిప్పుడు నాయొద్దకు వచ్చినాఁడు కాఁబట్టి యితనికి ఇంద్రుఁడుమొదలగు దేవతలకు సయితముపొందరాని నానావిధములయిన విశేష సంపదలను ఇయ్యవలసినది అని తనలో నిశ్చయించుకొని అతఁడుమైనిఁ గప్పుకొన్న పేలికలో ముడిచితెచ్చిన అటుకుల మూటనుజూచి యిదియేమిటిమూటయని దానిని తనచేతులలో విప్పి కొన్ని అటుకులు పుచ్చుకొని యీయటుకులు నన్నును సమస్తలోకములనుతృప్తి పొందింపఁగలవుఅని అప్పుడుతలఁచెనని తాత్పర్యము.

౧౦౧౨.—క॥ మురహరుఁడు పిడికెఁడడుకులు । గరమొప్పఁగ నారగించి ✻ కౌతుక మతియై
మఱియును బిడికెఁడుగొనఁ ద । త్కర మప్పుడువట్టెఁ గమల ✻ కరకమలములక్.

టీ॥ మురహరుఁడు = కృష్ణుఁడు. (పిడికెఁడడుకులు) కరమొప్పఁగక్=మిక్కిలియుక్తముగా. ఆరగించి=భక్షించి. మఱియును= ఇంకను. కౌతుకమతియై=వేడుకపడిన బుద్ధి గలవాఁడై. పిడికెఁడు గొనక్=పిడికెఁడు అటుకులుపుచ్చుకొనఁగా. తత్కరము=ఆతని చేతిని. (అప్పుడు) కమల=లక్ష్మీస్వరూపురాలయినరుక్మిణి. కరకమలములక్ = తనహస్తకమలములతో. పట్టెక్ = పట్టుకొనెను.

తా॥ అప్పుడు శ్రీకృష్ణమూర్తి పిడికెఁడు అటుకులు పుచ్చుకొని భక్షించి యింకను పిడికెఁడు అటుకులు భక్షింపనపేక్షించి పుచ్చుకొనఁగా ఆయటుకులను భక్షింపనియ్యక లక్ష్మియగు రుక్మిణీదేవి ఆచేతిని పట్టుకొనెనని తాత్పర్యము.

౧౦౧౩.—క॥ సొంపారఁగ నితనికి బహు । సంపద లందింప నివియ ✻ చాలునునిఁక భ
క్షింపఁగ వలవదు త్రిజగ । త్సంపత్కర దేవదేవ ✻ సర్వాత్మ హరీ.

టీ॥ త్రిజగత్సంపత్కర = మూడులోకములకు కలిమికలుగఁజేయునట్టివాఁడవును. దేవదేవ=దేవతలకుదేవుఁడవును. సర్వాత్మ= సర్వశబ్దమునకు ప్రపంచమును ప్రణవమును అర్థము గనుక ప్రణవరూపప్రపంచ స్వరూపుఁడునైన. హరీ = కృష్ణమూర్తీ. సొంపారఁగక్=మేలిమి అతిశయించునట్టుగా. ఇతనికిక్=ఈకుచేలునకు. బహుసంపదలు = అధిక సంపదలు. అందింపక్ = పొందింపను. ఇవియచాలును = ఈపిడికెఁడు అటుకులే చాలును. ఇఁకక్ = ఇంకను. భక్షింపఁగవలవదు=మీరు ఆయటుకులను భక్షింపవలదు.

తా॥ అట్లు చెయిపట్టుకొని మూడులోకములకువలయు కలుములనుకలుగఁజేయునట్టివాఁడవును, దేవతలకుదేవుఁడవును, ప్రపంచ స్వరూపుఁడవునైన యోస్వామీ ! ఇతనిని ఎల్ల కలుములనుపొందఁజేయుటకు ఇప్పుడు మీరారగించిన పిడికెఁడు అటుకులే చాలును ఇఁకనుఆయటుకులనుభక్షింపఁబోకుఁడు అనిచెప్పెనని తాత్పర్యము.

వ॥ అనియిట్లు వారించిన నక్కుచేలుండు నా రాత్రి గోవిందుమందిరంబునఁ దనకు హృదయానందకరంబులగు వివిధ
పదార్థంబులననుభవించి మృదులశయ్యాతలంబున నిద్రించి తనమనంబునందన్ను సమధికస్వర్గ భోగానుభవుంగాఁ
దలంచుచు మఱునాఁ డరుణోదయంబున మేల్కని కాలోచిత కృత్యంబులు దీర్చి యిందిరా రమణుఁడు దన్నుఁ
గొంతదవ్వనిపి యామంత్రితుం జేయఁ జనుచు నందనందన సందర్శనానందలోలాత్ముండై తనమనంబున నిట్లనియె.

టీ॥ (అనియిట్లు) వారించినక్=ఆయటుకులను భక్షింపనియ్యకపోఁగా. (అక్కుచేలుండును) ఆరాత్రి = ఆదినమురాత్రి. గోవిందుమందిరంబునక్=శ్రీకృష్ణమూర్తిగృహమునందు. (తనకు) హృదయానంద కరంబులు=మనసునకు ఆనందమును కలుగఁ జేయునవి. అగు వివిధపదార్థంబులక్=అగునట్టి నానావిధవస్తువులను. అనుభవించి= భుజించి. మృదుల శయ్యాతలంబునక్ = మెత్తని పానుపునందు. నిద్రించి=నిద్రపోయి. తనమనంబునక్ = తనమనసులో. (తన్ను) సమధిక...భవుంగాక్—సమధిక = మిక్కిలి అధికమయిన. స్వర్గ భోగ=స్వర్గలోక భోగములను. అనుభవుంగాక్ = అనుభవించువానిఁగా. (తలంచుచును) మఱునాఁడు = మఱుసటిదినము. అరుణోదయంబునక్=అరుణుఁడుదయించునప్పుడు. (మేల్కని) కాలోచితకృత్యంబులు = ఆకాలమునకుఁ దగినపనులను — అనఁగా దంతధావన స్నాన సంధ్యాదులయిన అనుష్ఠానములను. తీర్చి = జరపి. ఇందిరారమణుండు = లక్ష్మీభర్తయైన కృష్ణుఁడు. (తన్ను) కొంత దవ్వు=కొంతదూరము. అనిపి=అంపుదోడుగావచ్చి. ఆమంత్రితుంజేయక్=సెలవిచ్చిపంపఁగా. చనుచుక్=పోవుచు. నంద...త్ముండై— నందనందన=కృష్ణుని. సందర్శన=చూచుటయందలి. ఆనంద=సంతోషముచేత. లోల=చలించుచున్న. ఆత్ముండై=మనసుగలవాఁడై. తన మనంబునక్=తనమనసులో. (ఇట్లనియెను)

తా॥ అనియీవిధముగారుక్మిణీదేవి అటుకులనుఆరగింపవలదని నిలుపఁగా ఆకుచేలుఁడును నాటిరాత్రి ఆకృష్ణమూర్తి యింటిలో తనమనసునకుప్రియములైన మంచిమంచిపదార్థములను భుజించిమెత్తని పానుపునందు పండుకొని తానప్పుడు ఇంద్రభోగమునకంటె అధికమయిన భోగమును అనుభవించుచు ఉన్నట్టు తలఁచుకొనుచు సుఖ

ముగా నిద్రపోయి తెల్లవాఱి లేచి ఉదయకాలానుష్ఠానములు అన్నితీర్చు కొని కృష్ణుఁడు కొంతదూరము తన వెంటవచ్చి సాగనంపఁగా బయలు దేఱి తన పల్లెకు పోవుచు శ్రీకృష్ణమూర్తిని సేవించితినను ఆనందమునందు మునిఁగిన మనసుగలవాఁడగుచు తనలో తానిట్లని చింతించెనని తా.

౧౦౧౫.—క॥ నాపుణ్య మరయ నెట్టిదొ । యాపుణ్యనిధిం బ్రశాంతు * నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి । ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బ * రుం గనుఁగొంటిన్.

టీ॥ అరయన్=విచారింపఁగా. నాపుణ్యము = నాయదృష్టము. ఎట్టిదొ=ఎటువంటిదో. ఆపుణ్యనిధిన్=ప్రసిద్ధమయినపుణ్యమునకు స్థానమయినవాఁడును. ప్రశాంతున్=మిక్కిలి శాంతిగలవాఁడును. అచ్యుతున్ = నాశములేనివాఁడును. అఖిలవ్యాపకున్ = సర్వము నందు వ్యాపించువాఁడును. బ్రహ్మణ్యునిన్=వేద ప్రతిపాదకుఁడైన వాఁడును. చిద్రూపకున్=జ్ఞానస్వరూపుఁడైన వాఁడును. పురుషోత్తమునిన్=ఉత్తమపురుషునిని. పరున్ = ప్రపంచమునకువెలుపలి వాఁడునైన శ్రీకృష్ణమూర్తిని. కనుఁగొంటిన్=చూచితిని.

తా॥ విచారింపఁగా నాయదృష్టము ఎటువంటిదోకాని పుణ్యస్థానమయి శాంతమూర్తియై నాశములేక సర్వవ్యాపకుఁడై వేదమునందుఁ బ్రతిపాదింపఁ బడినవాఁడై జ్ఞానస్వరూపుఁడై ప్రపంచాతీతుఁడైవెంచేసియుండుపురుషోత్తమునిఁజూచితిని అనుకొనెనని తా.

౧౦౧౬.—సీ॥ పరికింపఁ గృపణస్వ * భావుండ నైనట్టి - నేనేడ నిఖిలావ * నీశుఁడైన
యిందిరాదేవికి * నెనయంగ నిత్యని - వాసుఁడైయొప్పు న * వ్వాసుదేవుఁ
డేడ సన్నర్థిమైఁ * దోడఁబుట్టిన వాని - కైవడిఁ గౌఁగిటఁ * గదియఁజేర్చి
దైవంబుగా నన్ను * భావించి నిజతల్ప - ముననుంచి సత్క్రియ * లొప్పనిడపి

తే॥ చారు నిజవధూకర సరో * జాత కలిత । చామరానిల విగత వి * శ్రమునిఁజేసి
శ్రీకుచాలిప్త చందనాం * చిత కరాబ్జ । తలములను నంజలొత్తి వ * త్సలత మెఱసి.

టీ॥ పరికింపన్=విచారంపఁగా. కృపణస్వభావుండను=లోభగుణము గలవాఁడను. (అయినట్టినేనేడ) నిఖిలావనీశుఁడు=సమస్తభూమికి ప్రభువైనవాఁడు. (అయిన) ఇందిరాదేవికిన్=లక్ష్మీదేవికి. ఎనయంగన్ = కూడుకొనుటకు — ఉండుటకు. నిత్యనివాసుఁడై= శాశ్వతమయిన యునికిపట్టయినవాఁడై. ఒప్పునవ్వాసుదేవుఁడు = ఒప్పునట్టి యాకృష్ణమూర్తి. ఏడ = ఎక్కడ. (నన్ను) అర్థిమైన్ = ప్రీతితో. తోడఁబుట్టినవాని కైవడిన్ = సహోదరుని విధమున. కౌఁగిటన్ = భుజాంతరమునందు. కదియఁజేర్చి = అంటఁజేర్చి. దైవంబుగాన్=దేవునిఁగా. (నన్ను) భావించి = తలఁచి. నిజతల్పమునన్=తనపానుపునందు. ఉంచి=ఉండునట్లుచేసి. సత్క్రియలు= సన్మానములను. పూని=యత్నించి. నడపి=జరపి. చారు...శ్రమునిన్- చారు=మనోజ్ఞమయిన. నిజవధూ = తనభార్యయొక్క. కరసరోజాత=హస్తకమలములయందు. కలిత=ఒప్పినట్టి. చామర = వింజామరలవలని. అనిల=గాలిచేత. విగత = పోయిన. విశ్రమునిన్ = మిక్కుటమయిన బడలిక గలవానిఁగా. (చేసి) శ్రీ...తలములన్— శ్రీ=లక్ష్మీదేవియొక్క. కుచ=లొమ్ములయందు. ఆలిప్త=అంతటను పూయఁబడిన. చందన=గంధముచేత. అంచిత = ఒప్పిదమయిన. కరాబ్జతలములన్ = తామరలవంటి అఱచేతులతో. వత్సలత = ప్రేమము. మెఱసి = ప్రకాశింపఁజేసి. అంజలొత్తి=నాకాళ్లుపిసికి.

తా॥ ఆలోచించి చూడఁగా నేను కేవలము లోభస్వభావము గలవాఁడను, ఎల్లనేలకును ఏలికయై శ్రీలక్ష్మీదేవికి ఉనికిపట్టయి ఒప్పునట్టివాఁడు శ్రీకృష్ణమూర్తి అతఁడక్కడ నేనెక్కడ అతనికినినాకును ఎంతో తారతమ్యము గలదు అట్లుండఁగా ఆమహానుభావుఁడు నన్ను తోడఁబుట్టిన వానివలె ఎంచి తన పానుపు నందుఁ గూర్చుండఁబెట్టి తగినమర్యాదలతోపూజించి తనభార్యలచేత వింజామరలు వేయించి నాబడలికను పోఁగొట్టి లక్ష్మీదేవి లొమ్ములందు పూయఁబడిన మంచిగందపు పరిమళముతోకూడిన తన మృదుహస్తములతో నాకాళ్లను పిసికెనుగదా అనితా. టీ॥ కావున=గనుక.

౧౦౧౭.—ఉ॥ శ్రీనిధి యిట్లునన్నుఁ బచ * రించి ఘనంబుగ విత్తమేమియు
న్నీని తెఱంగు గానఁబడె * నెన్న దరిద్రుఁడు సంపదస్థుఁడై
కానక తన్నుఁజేరఁడని * కాక శ్రితార్తి హరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరి * పూర్ణునిఁగా ననుఁ జేయకుండునే.

టీ॥ శ్రీనిధి=సంపదకుగని—శ్రీకృష్ణమూర్తి. ఇట్లు=ఈవిధముగా. (నన్ను) ఘనంబుగన్=గొప్పగా. పచరించి=గౌరవించి. విత్తము= ధనమును. ఏమియున్=కొంచెమయినను. ఈనితెఱంగు = ఇయ్యని విధము. కానఁబడెన్=అగుపడెను. ఎన్నన్=ఆలోచింపఁగా. దరిద్రుఁడు = పేదవాఁడు. సంపదస్థుఁడై=కలిమియందున్నవాఁడై. కానక = అహంకారముచేత కన్నుగానక. (తన్ను) చేరఁడు= పొందఁడు. అనికాక=అనియెంచియేకాని. శ్రితార్తిహరుండును = ఆశ్రయించినవారి దుఃఖమును అణఁచు వాఁడును. సత్కృపాంభోనిధి=మంచిదయకుసముద్రుఁడునైనయీపురుషోత్తముఁడు. ననున్= నన్ను. సర్వవస్తుపరిపూర్ణునిఁగాన్=ఎల్లవస్తువులచేతనునిండుకొన్న వానిఁగా. చేయకుండునే=చేయకయుండునా—చేయుననిభావము,

తా॥ ఎల్లకలుములకునుఉనికిపట్టయినశ్రీకృష్ణమూర్తియీచొప్పున నన్ను గొప్పగా మన్నించియు కొంచమైన ధనమియ్యక పొమ్మనుట చూడఁగాదరిద్రుఁడుగానుండితన్ను ఆశ్రయించునట్లుధనవంతుఁడు ఆశ్రయింపఁడు ధనమదముచేతకన్నుగాననివాఁడై తన్నుఁగానలేక

పోవును అనితలంచినట్లున్నదిగాని అట్లు కానిపక్షమున ఆశ్రయించిన వారి దుఃఖములనెల్లను అణంచునట్టి స్వభావముగల ఆదయా సముద్రుఁడు నాకు సమస్త పదార్థములు కొఱఁతలేక యిచ్చి మన్నింపక పోవునా అని తలఁచె ననని తాత్పర్యము.

౧౦౧౮.—వ॥ అని తనమనంబున వితర్కించుచు నిజపురంబునకుం జనిచని ముందట.

టీ॥ (అని) తనమనంబునన్=తనమనసులో. వితర్కించుచున్=తలపోసికొనుచు. నిజపురంబునకున్=తనపట్టణమునకు. చనిచని=పోయిపోయి — బహుదూరముపోయి. ముందటన్=ఎదుటను.

తా॥ అని యీవిధముగా తనలో తాననుకొనుచు తన పట్టణమునుగూర్చి బహుదూరముపోయి యెదుటను తనయింటిని జూచెనని తాత్పర్యము.

౧౦౧౯.—సీ॥ భానుచంద్ర ప్రభా * భాసమాన స్వర్ణ - చంద్రకాంతోపల * సౌధములును
గలకంఠ శుక నీల * కంఠ సముత్కంఠ - మానిత కూజితో * ద్యానములును
ఫుల్ల సితాంభోజ * హల్లక కల్హార - కైరవోల్లసిత కా * సారములును
మణిమయ కనక కం * కణ ముఖాభరణవి - భ్రాజిత దాసదా * సీజనంబు

తే॥ గలిగి చెలువొందు సదనంబుఁ * గాంచి విస్మ । యమునుబొందుచు నెట్టిపు * ణ్యాత్ముఁడుండు
నిలయమొక్కొ యపూర్వమై * నెగడె మహిత । వైభవోన్నతి లక్ష్మీని * వాసమగుచు.

టీ॥ భాను...సౌధములును — భాను = సూర్యునియొక్కయు. చంద్ర=చంద్రునియొక్కయు. ప్రభా=ప్రకాశమువంటిప్రకాశముచేతను. భాసమాన=ప్రకాశించుచున్న. స్వర్ణ = బంగారుమయమునైన. చంద్రకాంతోపల = చంద్రకాంత మణులుచెక్కిన. సౌధములును=మేడలును. కలకంఠ... ద్యానములును—కలకంఠ=పావురములయు. శుక=చిలుకలయు. నీలకంఠ=నెమళ్లయు. సముత్కంఠ=ఉత్కంఠవలుకఁబడిన. మానిత=గౌరవింపఁబడిన. కూజిత=రుతములు గలిగిన. ఉద్యానములును=శృంగారపుతోఁటలును. ఫుల్ల...ములును—ఫుల్ల=వికసించిన. సితాంభోజ=తెల్లదామరల చేతను. హల్లక=ఎఱ్ఱగలువలచేతను. కల్హార = ఇంచుక యెఱుపును తెలుపును గలసినపరిమళముతోడి కలువలచేతను. కైరవ=తెల్లగలువలచేతను. ఉల్లసిత=ప్రకాశించునట్టి. కాసారములును=కొలఁకులును. మణి ... దాసీజనంబు—మణిమయ=రత్నవికారమయిన. కనకకంకణ = బంగారుకడియములు. ముఖ = మొదలుగాఁగల. ఆభరణ=సొమ్ములచేత. విభ్రాజిత=ప్రకాశించునట్టి. దాసదాసీజనంబు=పరిచారకులునుపరిచారికలును (కలిగి) చెలువొందు = అందగించునట్టి. సదనంబున్=ఇంటిని. కాంచి=చూచి. విస్మయమును బొందుచున్=ఆశ్చర్యమును పొందుచు. ఎట్టిపుణ్యాత్ముఁడు=ఎటువంటిపుణ్యపురుషుఁడు. ఉండు నిలయమొక్కొ=ఉండునట్టియిల్లోయిది. అపూర్వమై = క్రొత్తదై. మహిత వైభవోన్నతిన్=పూజ్యమయిన వైభవముయొక్క మేలిమిచేత. లక్ష్మీనివాసమగుచున్=లక్ష్మీదేవికినునికిపట్టగుచు. నెగడెన్=అతిశయించెను.

తా॥ సూర్యచంద్రులు వెలుఁగునట్లు వెలుఁగుచున్న బంగారుమయములై చంద్రకాంత మణులుచెక్కినవైన మేడలును, పావురములు చిలుకలు నెమళ్లు మొదలగుపక్షులు గట్టిగా కూయునట్టి మనోజ్ఞములయిన కూఁతలతోఁగూడిన శృంగారంపు తోఁటలును, వికసించిన తెల్లదామరలు ఎఱ్ఱదామరలు తెల్లకలువలు ఎఱ్ఱగలువలు మొదలగువానిచేత అందగించుచున్న సరోవరములును, రత్నములు చెక్కిన బంగారుకడియములు మొదలగు ఆభరణములచేత అలంకరింపఁ బడిన పరిచారకులయు పరిచారికలయు సమూహములను గలిగి యొప్పునట్టి ఒకయిల్లు కానరాఁగా కుచేలుఁడు చూచి ఆశ్చర్యపడుచు ఇట్టిసౌఖ్యమునకు ఉనికిపట్టయిన యిల్లు ఏపుణ్యాత్మునికినివాసమో ఇది అధికమయిన వైభవముచేత శ్రీలక్ష్మీ నివాసస్థానమై క్రొత్తదై యొప్పుచున్నది అని యనుకొనెననితాత్పర్యము.

౧౦౨౦.—వ॥ అని తలపోయుచున్న యవసరంబున.

టీ॥ (అని)తలపోయుచున్నయవసరంబునన్=ఆలోచించుచున్న సమయమునందు.

తా॥ అనియీవిధముగా ఆశ్చర్యపడి తనలోతాను ఆలోచించుకొనుచుండఁగా నని తాత్పర్యము.

౧౦౨౧.—తే॥ దివిజవనితలఁ బోలెడు * తెఱవలపుడు । డాయనేతెంచి యిందు వి * చ్చేయుఁడనుచు
విమలసంగీత నృత్య * వాద్యములు చెలఁగ । గరిమఁ దోడ్కొనిచని రంతి * పురమునకును.

టీ॥ దివిజవనితలన్=దేవతా స్త్రీలను. పోలెడు తెఱవలు=సరిపోలుచున్నస్త్రీలు. అపుడు = ఆసమయమునందు. డాయన్=సమీపింప. ఏతెంచి=వచ్చి. ఇందువిచ్చేయుఁడు=ఇచ్చటికిదయచేయుఁడు. (అనుచు) విమల...ద్యములు — విమల = నిర్మలమయిన. సంగీత=పాటలు. నృత్య=ఆటలు. వాద్యములు=వాద్యములును. చెలఁగన్=మ్రోఁగఁగా. గరిమన్ = గౌరవముతో. అంతిపురమునకున్=అంతఃపురమునకు. తోడ్కొనిచనిరి=పిలుచుకొనిపోయిరి.

తా॥ దేవతాస్త్రీలవంటిస్త్రీలుకొందఱువచ్చి, స్వామీ ! యిటు రండియనిచెప్పి తేటమీరు పాటలు ఆటలు వాద్యములుమ్రోఁగఁగా గౌరవముతోఅంతఃపురమునకుపిలుచుకొనిపోయిరి అనితాత్పర్యము.

౧౦౨౨.—వ॥ ఇట్లు చనుదేర నతనిభార్యయైనసతీలలామంబు దనమనంబున నానందరసమగ్నయగుచు.

టీ॥ (ఇట్లు) చనుదేరన్=రాఁగా. (ఆతనిభార్యయైన)సతీలలామంబు = ఉత్తమస్త్రీ. (తనమనంబు) ఆనందరసమగ్న=సంతోషమునందు మునిఁగినది. ( అగుచును )

తా॥ ఈవిధముగా రాఁగా పతివ్రతాశిరోమణియయిన ఆయన పెండ్లాము తన మనసులో మిక్కిలి సంతోషించుచును అని తాత్పర్యము.

౧౦.౨౩.—సీ॥ తనవిభురాక ముం * దటఁ గనిమనమున - హర్షించి వైభవం * బలర మనుజ
కామినీ రూపంబు * గైకొన్న యిందిరా - వనిత చందంబునఁ * దనరుచున్న
కలకంఠి తనవాలు * కన్నుల క్రేవల - నానంద బాష్పంబు * లంకురింప
నతని పాదంబుల * కాత్మలో మ్రొక్కి భా - వంబున నాలింగ * నంబుచేసె
తే॥ నాధరాదేవుఁ డతుల ది * వ్యాంబరా భ । రణ విభూషితయై రతి * రాజుసాయ
కముల గతినొప్పు పరిచారి * కలు భజింప । లలితసౌభాగ్యయగు నిజ * లలనఁజూచి.

టీ॥ తనవిభురాక = తనపెనిమిటి వచ్చుటను. ముందటన్ = ఎదుట. కని=చూచి. మనమునన్ = మనసులో. హర్షించి=ఆనందము నొంది. వైభవంబు = విభవము. అలరన్ = ఒప్పఁగా. మనుజకామినీరూపంబు=మనుష్య స్త్రీరూపమును. కైకొన్న=వహించిన. ఇందిరావనితచందంబునన్=లక్ష్మీదేవివిధమున. తనరుచున్న=ఒప్పుచున్న. కలకంఠి = కోవెలకంఠస్వరమువంటి కంఠస్వరముగల ఆయిల్లాలు. తనవాలుకన్నులక్రేవలన్=తనవైన నిడుపాటికన్నుల పార్శ్వములందు — కడగన్నులయందనుట. ఆనందబాష్పంబులు= సంతోషమువలనఁ బుట్టిన కన్నీళ్లు. అంకురింపన్ = మొలవఁగా — పుట్టఁగాననుట. అతనిపాదంబులకున్ = ఆకుచేలుని యడుగులకు. ఆత్మలోన్=తనమనసులో. మ్రొక్కి=నమస్కరించి. భావంబునన్= మనసునందు. ఆలింగనంబుచేసెన్ = కౌఁగిలించుకొనెను. ఆధరాదేవుఁడు=ఆబ్రాహ్మణుఁడును. అతుల...యై—అతుల=ఈడులేని. దివ్య=అప్రాకృతమయిన. అంబర = వస్త్రములచేతను. ఆభరణ= సొమ్ములచేతను. విభూషితయై = అలంకరింపఁబడినదై. రతిరాజసాయకములగతిన్=మన్మథునిబాణములవలె. ఒప్పు=ఒప్పునట్టి. పరిచారికలు=ఊడిగముచేయుస్త్రీలు. భజింపన్=కొలువఁగా. లలితసౌభాగ్య=కోమలమయినసుభగత్వముగలది. (అగు) నిజలలనన్= తనభార్యను. (చూచి)

తా॥ ఎదుట తనపెనిమిటి వచ్చుచుండురీతినిఁ జూచి సంతోషించుచు తనవైభవము ఒప్పునట్టుగా మనుష్యస్త్రీరూపమును పొందిన లక్ష్మీదేవివలెనే ఒప్పుచు దీర్ఘములైన తనకన్నులనుండి ఆనందబాష్పములురాలుచుండఁగా ఆతని అడుగులకు తనమనసులోనే మ్రొక్కుచు మనసులోనే ఆలింగనము చేసికొనుచు ఎదురుకొనిరాఁగా కుచేలుఁడును ఈడులేనివైన అప్రాకృతములైనవస్త్రములను ఆభరణములను ధరించి మన్మథుని బాణములోయేమో అనఁదగిన చక్కనియాఁడిగత్తెలుకొలువఁగా ఒప్పిదమయిన సుభగత్వముతో వెలుఁగుచున్న నతపెండ్లాము నుచూచెను అనితాత్పర్యము.

౧౦.౨౪.—క॥ ఆనారీ రత్నంబును । దానును ననురాగ రసము * దళుకొత్తఁగ ని
త్యానందము నొందుచుఁ బెం । పూనిన హరిలబ్ధ వైభ * వోన్నతి మెఱయన్.

టీ॥ ఆనారీరత్నంబును=ఆస్త్రీశ్రేష్ఠమును. (తానును) అనురాగరసము=ప్రీతిరసము. తళుకొత్తఁగన్=అంకురింపఁగా. నిత్యానందము నొందుచున్=ఎప్పుడును చెడనియానందమునుపొందుచు. పెంపు=అభివృద్ధిని. ఊనిన=పొందిన. హరిలబ్ధవైభవోన్నతి=కృష్ణునివలనపొందఁబడినవైభవముయొక్క యున్నతి. మెఱయన్=ప్రకాశింపఁగాను.

తా॥ ఆయుత్తమ స్త్రీయును తానును అనురాగము అతిశయింపఁగా సంతోషించుచు అభివృద్ధినొందుచున్న కృష్ణునివలన పొందఁబడిన అధికైశ్వర్యము వెలయఁగా నని తాత్పర్యము.

౧౦.౨౫.—సీ॥ కమనీయ పద్మరా * గస్తంభకంబులుఁ - గొమరారు పటికంపు * కుడ్యములును
మరకత వరరత్న * మయ కవాటంబులుఁ - గీలిత హరినీల * జాలములును
దీపిత చంద్రకాం * తోపల వేదులు - నంచిత వివిధ ప * దార్థములును
దగుహంస తూలికా * తల్పంబులును హేమ - లాలిత శయనస్థ * లములుఁ దనరు
తే॥ సమధికోత్తుంగ భద్రపీ * ఠములు సిరులు । మానితోన్నత చతురంత * యానములును
వలయు సద్వస్తు పరిపూర్ణ * వాటికలును । గలిగి చెలువొందు మందిరం * బెలమిఁజొచ్చి.

టీ॥ కమనీయ...కంబులు—కమనీయ=మనోజ్ఞములయిన. పద్మరాగ=కెంపులుచెక్కిన. స్తంభకంబులును=కంబములును. కొమరా... ములును=కొమరారు=ఒప్పిదమగుచున్న. పటికంపు =స్ఫటికములచేతనైన. కుడ్యములును=గోడలును. మర...బులును—మరకత= పచ్చలైన. వర=శ్రేష్ఠములయిన. రత్నమయ=రత్నవికారమయిన. కవాటంబులును=తలుపులును. కీలిత...ములును—కీలిత = పొదుగఁబడిన—చెక్కఁబడిన. హరినీల=ఇంద్రనీలమణుల. జాలములును=కిటికీలును. దీపిత...వేదులు—దీపిత=వెలుగఁజేయఁబడిన. చంద్రకాంతోపల=చంద్రకాంతమణులచేతనైన. వేదులును = అరుఁగులును. అంచిత=...ములును—అంచిత = ఒప్పిదము లయిన. వివిధ=నానావిధములైన. పదార్థములును=వస్తువులును. తగు=ఒప్పునట్టి. హంసతూలికాతల్పంబులును=హంసతెక్కల పానుపులును. హేమ...స్థలములును—హేమ=బంగారుచేత. లాలిత=మనోజ్ఞములయిన. శయనస్థలములును = పండుకొను చోట్లును. తనరు = శ్లాఘ్యములయిన. సమధికోత్తుంగభద్రపీఠములును = మిక్కిలి పొడువులైన సింహాసనములును. సిరులు=ఇంకనువలయు కలుములును. మానితోన్నతచతురంతయానములును—మానిత=గౌరవింపఁదగిన. ఉన్నత=పొడువులైన. చతురంతయానములును=పల్లకీలును. వలయు...వాటికలును—వలయు=కావలసిన. సద్వస్తు=మంచివస్తువులచేత. పరిపూర్ణ=నిండిన. వాటికలును = ఇండ్లవరుసలును. (కలిగి) చెలువొందు=అందగించు

నట్టి. మందిరంబు=ఇంటిని. ఎలమిక=ప్రీతితో. చొచ్చి=ప్రవేశించి.

తా॥ మనోజ్ఞములయిన కెంపులకంబములును, ఒప్పిదములైన పటికపు రాలగోడలును, శ్రేష్ఠములయిన పచ్చలతఱపులును, నీలములు చెక్కిన కిటికీలును, చంద్రకాంతపు రాలచేత కట్టఁబడిన అరుఁగులును, ఒప్పిదములు నానావిధములునైనవస్తువులును, మనోజ్ఞములైన హంసతూలికా తల్పములును, మఱియు బంగారుమయములైన పడుకచోట్లును, మిక్కిలియున్నతములయిన సింహాసనములును, ఇంకను వలయుకలుములును, గౌరవింపఁబడి పొడవులైన పల్లకీలును, ఇవిగాక కావలసిన యెల్లమంచివస్తువులచేతనునిండుకొన్న యిండ్లవరుసలునుగలిగి అందగించునట్టితమయింటిలోఁజొచ్చియని తాత్పర్యము.

తే॥ సుఖంబుగనుండునట్టియెడందనకుమనోవికారంబులు వొడమకుండవర్తించుచు నిర్మలంబగుతనమనంబుననిట్లనునింత
గాలంబత్యంతదుస్తరంబగు దారిద్ర్యదుఃఖార్ణవంబున మునింగియున్న నాకుంగడపటంగలిగిన విధంబుననిప్పుడు.

టీ॥ సుఖంబుగన్ = ఆనందముగా. ఉండునట్టియెడన్=ఉండునప్పుడు. (తనకు) మనోవికారంబులు = మనస్సునందుసంకల్పములు. పొడమకుండన్=పుట్టకుండ. వర్తించుచున్ = మెలఁగుచు. నిర్మలంబు = కామక్రోధలోభములు లేనిది. శ్లో॥ త్రివిధంనరకస్యేదం ద్వారంనాశనమాత్మనః । కామఃక్రోధ స్తథాలోభ స్తస్మాదేతత్త్రయంత్యజేత్ ॥ ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః । ఆచరత్యాత్మనఃశ్రేయ స్తతోయాతిపరాంగతిమ్ ॥ అని భగవద్గీతగనుకతన్ను అధోగతిపాలుచేయు కామక్రోధలోభాదులులేనిది. అగు తనమనంబునన్=అగునట్టి తనమనసులో. ఇట్లనున్=ఈవిధముగా అనుకొనెను. ఇంతగాలంబు=ఇన్నాళ్లును. అత్యంత దుస్తరంబగు = మిక్కిలిదాఁటరానిదైన. దారిద్ర్యదుఃఖార్ణవంబునన్ = పేదఱికము వలని దుఃఖమనెడి సముద్రమునందు. మునింగి = మునిఁగి. ఉన్న నాకున్=ఉండినట్టినాకు. కడపటన్=తుదను. కలిగినవిధంబునన్=లభించినరీతిని. (ఇప్పుడు)

తా॥ సుఖముగా నుండునప్పుడు తనకుమనస్సునందుసంకల్పాదివికారములుపుట్టకుండ మెలఁగుచు నరకమును పొందించునవియయిన కామక్రోధలోభాదులులేనిదైన తనమనసునందు ఇట్లుతలఁచెను నేను ఇనాళ్లదాఁక కొంచెమైన దాఁట శక్యముగాని పేదఱికము వలని దుఃఖమనెడు సముద్రమునందు మునిఁగియుంటిని అటువంటి నాకు కడపట ఇప్పుడు కలిగినట్టిరీతిని అని తాత్పర్యము.

౧౦౭౭.—ఆ॥ ఎన్నఁగ్రొత్తలైన ✱ యిట్టిసంపదలు నా । కబ్బుటెల్ల హరిద ✱ యావలోక
నమునఁ జేసికాదె ✱ నలినాక్షు సన్నిధి । కర్థినగుచు నేను ✱ నరుగుటయును.

టీ॥ ఎన్నన్=యోచింపఁగా. క్రొత్తలైన=నూతనములైన. ఇట్టి సంపదలు=ఇటువంటికలుములు. (నాకు) అబ్బుటెల్లన్=కలుగుటంతయు. హరిదయావలోకనమునఁ జేసికాదె = కృష్ణుని దయతోఁడిచూపుచేత నేకదా. నలినాక్షుసన్నిధికిన్=కృష్ణునొద్దకు. అర్థినగుచున్ = యాచకుఁడనగుచు. (నేనును) అరుగుటయును = పోఁగానే.

తా॥ ఆలోచింపఁగా నేనుయాచకుఁడనై కృష్ణునొద్దకుఁబోఁగానే అపురూపములైన యీకలుములు నాకుఁ గలుగుటంతయు కృష్ణుని దయతోఁడిచూపుచేత నేకదా అని తాత్పర్యము.

౧౦౭౮.—క॥ ననునావృత్తాంతంబును । దనమనమునఁ గనియు నేమి ✱ దడవక ననుఁ బొ
మ్మని యీసంపద లెల్లను । నొనరఁగ నొడఁగూర్చినన్ను ✱ నొడయనిఁ జేసెన్.

టీ॥ ననున్=నన్నును. నావృత్తాంతంబును=నాసమాచారమును. తనమనమునన్=తనమనసులో. కనియున్=తెలిసికొనియు. ఏమి=ఏమియును. తడవక=విచారింపక. ననుఁబొమ్మని = నన్నుఁబొమ్మని చెప్పి. (ఈసంపదలెల్లను) ఒనరఁగన్=ఒప్పిదముగా. ఒడఁగూర్చి=పొందించి. (నన్ను) ఒడయనిఁజేసెన్ = ప్రభువునుగాఁ జేసెను.

తా॥ నన్నును నాసమాచారమును తన మనసునఁ దెలిసికొని అప్పుడు ఏమియువిచారింపక యియ్యకపంపి యింటికివచ్చునంతలో ఇట్టికలుములనెల్లనుపొందించినన్ను రాజునుగాఁ జేసెనని తాత్పర్యము.

వ॥ అట్టి పురుషోత్తముండు భక్తినిష్ఠులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకునిది దృష్టాంతంబుగాదే మలినదేహుండును జీర్ణాంబరుండునని చిత్తంబున హేయంబుగాఁ జూటింపక నాచేనున్న యడుకులాదరంబున నారగించి నన్నుఁగృతార్థునింజేయుటయతని నిర్హేతుక దయయకాదె యట్టి కారుణ్యసాగరుండైన గోవిందుని చరణారవిందంబులయందు భక్తిప్రాభవంబు లగుంగాకయని యప్పుండరీకాక్షునియందుఁ బూర్వభక్తి తాత్పర్యంబునం దగిలి పత్నీసమేతుండై నిఖిల భోగంబులయందు నాసక్తింబొరయక రాగాదివిరహితుండును నిర్వికారుండునునై యఖిలక్రియలయందు ననంతుని యనంత ధ్యానసుధారసంబునం జొక్కుచు విగతబంధనుండై యపవర్గప్రాప్తినొందె మఱియును.

టీ॥ (అట్టి) పురుషోత్తముండు=పురుషశ్రేష్ఠుఁడైనశ్రీకృష్ణుఁడు. భక్తినిష్ఠులైన = సేవానిష్ఠగలిగిన. సజ్జనులు = సత్పురుషులు. లేశమాత్రంబగుపదార్థంబయినన్=రవంతవస్తువునైనను—మిక్కిలియల్పవస్తువునైనను. భక్తిపూర్వకంబుగాన్=భక్తిముందుగలుగునట్టుగా—భక్తితో. (సమర్పించినను) అది=ఆవస్తువును. కోటిగుణితంబుగాన్=అంతకు కోటియంతలుగా. కైకొని=పరిగ్రహించి. మన్నించుటకు=మన్ననచేయుటకు. ఇదిదృష్టాంతంబుగాదె=ఈనాకు సంపదలిచ్చుట తార్కాణము కాదా. మలినదేహుండును = మఱికియైనమేనుగలవాఁడును. జీర్ణాంబరుండును=చినిఁగిపోయిన బట్టలుగలవాఁడును. (అని) చిత్తంబునన్=మనసునందు. హేయంబుగాన్ = రోఁతగా.

పాటింపక = తలఁపక, (నాచేనున్న యడుకులు) అధరంబునన్ = అధరముతో, అరగించి = భక్షించి. (నన్ను) కృతార్థునిం జేయుట = ధన్యునిఁగాఁ జేయుట. ఆతని నిర్హేతుకదయయె కాదె = ఆకృష్ణుని దైన కారణములేని దయయేకదా—అతఁడు కారణము లేకయే భక్తులను కాపాడునట్టి దయాస్వరూపుఁడు అగుటచేత నేకదా యనుట. (అట్టి) కారుణ్యసాగరుండు = దయాసముద్రుఁడు. (అయిన) గోవిందుని చరణారవిందంబుల యందున్ = శ్రీకృష్ణుని పాద కమలముల యందు. భక్తిప్రాభవంబులు = భక్తియు ప్రభుత్వమును. అగుంగాక = కానిమ్ము. (అని) అప్పుండరీకాక్షునియందున్ = ఆకృష్ణమూర్తియందు, పూర్వభక్తి తాత్పర్యంబునన్ = మునుపటి సేవా తత్పరత్వమునందే, తగిలి = ఆసక్తుఁడై. పత్నీసమేతుండై = పెండ్లాముతోఁ గూడుకొన్నవాఁడై. నిఖిలభోగంబులయందున్ = ఎల్లసుఖానుభవములందును. ఆసక్తిన్ = అపేక్షను. పోగయక = పొందక, రాగాదివిరహితుండును = కామక్రోధాదులు లేనివాఁడును. నిర్వికారుండును = అశన పిపాస శోక మోహ జరామరణముల నెడువికారములు లేనివాఁడును. (అయి) అఖిలక్రియలయందున్ = చతుర్దశేంద్రియ వ్యవహారములయందును. అనంతుని యనంతధ్యానసుధారసంబునన్ = దేశకాల వస్తుభేదములు లేనివాఁడైన శ్రీకృష్ణమూర్తియొక్క తుదలేని ధ్యానమనెడి యమృత రసముచేత. చొక్కుచున్ = పరవశుఁడగుచు. విగతబంధనుండై = పోయిన అష్టపాశ బంధములు గలవాఁడై. అపవర్గప్రాప్తిన్ = మోక్షముఁబొందుటను. ఒందెన్ = పొందెను. మఱియును = ఇదిగాక.

తా॥ అటువంటి పురుషశ్రేష్ఠుఁడైన శ్రీకృష్ణమూర్తి తన కొలువునందు నిష్ఠగలిగిన సత్పురుషులు ఎంతయల్ప పదార్థమును సమర్పించినను అది యంతకుకోటియంతలుగా గ్రహించి వారినిమన్నించు ననుటకు ఇదియొకదృష్టాంతముకాదా? మఱికితోడి దేహము చింపిపేలికలునుగల నన్నుఁజూచి రోఁతపడక నాచేతనున్న అయటుకులను పుచ్చుకొని ప్రీతితో ఆరగించినన్ను ధన్యునిగాఁ జేయుటకు ఆతనినిర్హేతుక జాయమాన కటాక్షమేకదా కారణము. ఆదయాసముద్రుఁడైన శ్రీకృష్ణమూర్తియొక్క పాదకమలములయందు భక్తియు ప్రపత్తియు నాకునబ్బుంగాకయని ఆశ్రీకృష్ణమూర్తియందు మునుపుగలిగియున్న భక్తి తత్పరత్వముచేత ఆధ్యానమునందే తగిలినమనసు గలవాఁడై పెండ్లాముతోడ తానును సకలసుఖానుభవముల యందును ఆసక్తిమాని కామక్రోధాదులు లేనివాఁడును అశన పిపాస శోక మోహ జరామరణములనెడు వికారములు లేనివాఁడునై ఎల్లపనుల యందును ఆయనంతమూర్తి దైన మేరలేని ధ్యానమనెడి అమృత రసమునను భవించుటచేత పరవశత్వమునొందినవాఁడగుచు సంసార బంధమునందు తగులుకొనక మోక్షము నొందెనని తాత్పర్యము.

౧౦౩౦.—ఆ॥ దేవదేవుఁ డఖిల * భావజ్ఞుఁ డాశ్రిత । వరదుఁడైన హరికి * ధరణిసురులు
దైవతములుగాన * ధారుణీ దివిజుల । కంటె దైవమొకఁడు * గలదె భువిని.

టీ॥ దేవదేవుఁడు = దేవతలకు దేవుఁడును, అఖిలభావజ్ఞుఁడు = ఎల్లవారితాత్పర్యములు నెఱిఁగినవాఁడును. ఆశ్రితవరదుఁడు = ఆశ్రయించినవారికోరికలనిచ్చువాఁడును. అయినహరికిన్ = ఐనట్టిశ్రీకృష్ణమూర్తికి. ధరణిసురులు = బ్రాహ్మణులు. దైవతములు = దేవతలు. కానన్ = కనుక. భువినిన్ = భూలోకమునందు, ధారుణీదివిజులకంటెన్ = బ్రాహ్మణులకంటెను. (దైవము) ఒకఁడు = ఇతరము. (కలదె)

తా॥ దేవతలకు దేవుఁడై యెల్లవారి అభిప్రాయములు నెఱిఁగి ఆశ్రయించువారి కోరికలనిచ్చుచుండు శ్రీకృష్ణమూర్తికి బ్రాహ్మణులే దైవములు గనుక భూలోకము నందు బ్రాహ్మణులకంటె ఇతరము దైవము కలదా అని తాత్పర్యము.

౧౦౩౧.—క॥ మురహరుఁ డిట్లు కుచేలునిఁ । జరితార్థునిఁ జేసినట్టి * చరితము విను స
త్పురుషుల కిహపర సుఖములు । హరిభక్తియు యశము గలుగు * నవనీనాథా.

టీ॥ అవనీనాథా = రాజా. ఇట్లు = ఈవిధముగా. మురహరుఁడు = కృష్ణుఁడు. కుచేలునిన్ = కుచేలుఁడను బ్రాహ్మణుని. చరితార్థునిన్ = నడపఁబడిన ప్రయోజనముగలవానిఁగా—సంపన్నునిఁగా. చేసినట్టి చరితమున్ = చేసిన చరిత్రమును. వినుసత్పురుషులకున్ = వినునట్టి సజ్జనులకు. ఇహపరసుఖములును = ఈలోకమునందలివియు పరలోకమునందలివియు నైనసౌఖ్యములును. హరిభక్తియున్ = విష్ణుభక్తియు. యశమును = కీర్తియు. (కలుగును)

తా॥ ఓపరీక్షిన్మహారాజా! ఈవిధముగా శ్రీకృష్ణమూర్తి కుచేలుని కృతార్థునిఁగాజేసిన యీకథను ఏసత్పురుషులువిందురో వారు ఇహలోక సుఖములను పరలోక సుఖములును పొందుటయే గాక శ్రీవిష్ణుసేవయుఁ జెడనికీర్తియుఁగలవారును అగుదురని శుకుఁడుచెప్పెనని తాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ కుచేలుఁడు = చేలమనఁగా వస్త్రము గనుక వస్త్రమువలె శ్రుతియుక్త్యనుభవములు లేనిమూఢులను ఆవరించియున్న అజ్ఞానావరణమును తూంట్లుతూంట్లుగఁ జేసినవాఁడు—బ్రహ్మవేత్త. (అతఁడు) గోవిందసఖుఁడు = గో అనఁగా భూమిగనుక భూమిమొదలగుపంచభూతములయొక్క. విందు = ఉత్పత్తిస్థితిలయముల నెఱుఁగునట్టిజ్ఞానరూప పరబ్రహ్మమునకు. సఖుఁడు = చెలికాఁడు—పరబ్రహ్మమునందే తనమనస్సును లయింపఁజేసి యుండువాఁడనుట, లేక గోవులనఁగా ఇంద్రియములుగనుక, శ్లో॥ మనసావచసాదృష్ట్యా గృహ్యతేన్యైరపీంద్రియైః । అహమేవమత్తోన్య దితిబుద్ధ్యధ్వమంజసా॥ అనుప్రమాణముచేత చతుర్దశేంద్రియములును చతుర్దశేంద్రియ విషయములైన శబ్దాదులను గ్రహించు వాఁడును, చతుర్దశేంద్రియ ములను విషయములయందు ప్రేరేపించు వాఁడును నేనేగాని నాకంటె అన్యుఁడొకఁడు లేఁడనెడు దృఢాపరోక్ష జ్ఞానముగల బ్రహ్మవిద్వరిష్ఠులకు స్నేహితుఁడు. అతనిభార్య బ్రహ్మవిద్య వీరిరువురును సకలదుఃఖరూపమైన సంసారచక్రములో చిక్కినవారైనను ఆసంసార దుఃఖములను మనసున ఊననీయక ప్రవర్తించుచుండిరి. ఇట్లుండఁగా ఒక్కనాఁడు ఆకుచేలుని భార్యయైన బ్రహ్మవిద్య తనభర్తతో, స్వామీ! సంసార

తాపము మనలను అప్పుడప్పుడు సోఁకుచుండ మనమా తాపమును విజ్ఞానామృత వర్షము చేత చల్లార్చుచుందుము గనుక యిఁక మీఁదమనలను సంసారతాప మెప్పుడుసోఁకకయుండునట్లు. బాలసఖుఁడైన యప్పద్మపత్రనేత్రుఁ గాననేగి=శరీరజ్ఞప్తి పుట్టినది మొదలుకొని నీకు అతిప్రియముగానున్న పరిపూర్ణ పరబ్రహ్మనిష్ఠ చేసి. దరిద్రాంధకారమగ్నుఁడైననన్నునుద్ధరింపుము=సత్యజ్ఞానానంద పరిపూర్ణబ్రహ్మము నేననెడు దృఢవ్యక్తినిమఱచి కులగోత్రనామరూపాశ్రమములును, బాల్యయౌవనకౌమార వార్ధకములును, కించిద్‌జ్ఞత్వ సర్వజ్ఞత్వాది గుణములును, దరిద్రుఁడను ధనికుఁడను అనునివిమొదలైనవిగలవాఁడననుటయే దరిద్రము, ఆదరిద్రమునే మునిఁగినమమ్ము చు లేవఁదీయుము. అట్టివారమనెడు జ్ఞప్తి లేకుండఁ జేయుము అనుట. అని ప్రార్థించి. ఓప్రాణనాయకుఁడా! శ్రీకృష్ణమూర్తి. యాదవప్రకరము భజియింపఁగన్ = బ్రహ్మవేత్తల సంఘము సేవింపఁగా—బ్రహ్మవేత్తలు పరబ్రహ్మమునే శ్రవణమనన నిదిధ్యాసముల చేత సేవించుచుందురనుట. కుశస్థలీపురమున నున్నవాఁడు=కుశమనఁగా జలము గనుక గంగాయమునా సరస్వతీ నదులలోని జలమునడుమ నున్న హృదయకమలమనెడుమిట్టనేలమీఁదనున్నాఁడు ద్వారకాపురముననున్నవాఁడనుట. అధిపవినుమర్మమిదియం। గధరాగ్రమధ్యసీమ కృష్ణాశ్రయద్వారవతిని ఆత్ముఁడున్నాఁడు అతనినిధ్యానించితేని అప్పుడయిచ్చెననూని సంపదలు=పునరావృత్తిరహితమైనసర్వదుఃఖశూన్యమైన మోక్షసంపదను ఇచ్చును. శ్రు॥ బ్రహ్మవిదాప్నోతిపరం తరతిశోకమాత్మవిత్ అను శ్రుతి ప్రమాణముల చేత జననమరణాదిదుఃఖములు లేక ప్రకాశింతువనుట. అని చెప్పినకుచేలుఁడు. ద్వారకానగరం జేరితిఁజొత్తురు=సూర్యసోమాగ్ని మండలత్రయమధ్యమున వెలుఁగునట్టి హృదయ కమలమునందు యేవిధమున నామనోవృత్తిని కదలకుండ నిలుపుదును. భాసురాంతఃపుర వాసియైన=ప్రకాశించుచున్న అంతరహృదయాకాశమున వసించునట్టి. అప్పుండరీకాక్షున్ = శ్రు॥ హృత్పుండరీకంపురమధ్యసగ్గస్థం, తత్రాపిదహరం పరమం విశోకం, అను శ్రుతి చేత హృదయకమలమున వసించునట్టి పరబ్రహ్మమును. (ఏవిధముగ నేననిజొాసగలనో) తద్వారపాలురు=అంతరత్రిపుటియనెడు మేడయొక్క వాకిటనుండెడు లయవిక్షేపకషాయరసాస్వాదములనెడు వాకిటి కావలివారు(అడ్డగించిన యెడల వారికి లంచమియ్యఁజాలఁదననియెంచినపక్షమున)అర్థశూన్యుండనేను=ప్రపంచాకారవృత్తులనెడు ధనము లేనివాఁడను. అనితలఁచుచు నిరంతరనిర్వికల్ప నిష్ఠ చేత బ్రహ్మావాహామనెడు స్థిరత్వమును పొందివైరాగ్య బోధోపరతులు ప్రబలఁగా మహాకర్త మహాభోక్త మహాత్యాగి యనఁగా ప్రసిద్ధికెక్కి యుండెను.

౧౦౩౨.—వ॥ అనిన విని పరాశర పౌత్రున కర్జున పౌత్రుం డిట్లనియె.

టీ॥ అనినవిని=అనిచెప్పఁగావిని. పరాశరపౌత్రునకున్=పరాశరుని మనుమఁడైన శుకమహర్షితో. అర్జునపౌత్రుండు = అర్జునుని మనుమఁడైన పరీక్షిత్తు. (ఇట్లనియెను)

తా॥ అని యిట్లు చెప్పఁగావిని పరీక్షిన్మహారాజు శుకమహర్షితో నిట్లు పలికెనని తాత్పర్యము.

౧౦౩౩.—తే॥ దుష్టశిక్షణంబు * దురిత సంహరణంబు । శిష్టరక్షణంబుఁ * జేయఁ దలఁచి
భువిని మనుజుఁ డగుచుఁ * బుట్టిన శ్రీకృష్ణు । విమల చరితమెల్ల * విస్తరింపు.

టీ॥ దుష్టశిక్షణంబును=చెడ్డవారిని దండించుటయు. దురితసంహరణంబును=పాపమును నశింపఁజేయుటయు. శిష్టరక్షణంబును=యోగ్యులను రక్షించుటయు. (చేయఁదలఁచి) భువిని = భూలోకమునందు. మనుజుఁ డగుచున్ = మనుష్యుఁడగుచు. పుట్టిన శ్రీకృష్ణుని విమలచరితము = పుట్టినట్టి శ్రీకృష్ణమూర్తియొక్క పావనమైన చరిత్రమును. ఎల్లన్ = అంతయు. విస్తరింపుము = విశదముగాఁ జెప్పుము.

తా॥ దుష్టులను శిక్షింపను, యోగ్యులను రక్షింపను, పాపములను నశింపఁ జేయను, భూలోకమునందు మనుష్యుఁడై పుట్టినట్టి శ్రీకృష్ణమూర్తియొక్క చరిత్రమును ఇంకను విశదముగాఁ జెప్పుము అనెను.

వ॥ అనిన శుకుం డిట్లనియె.

(*) శ్రీకృష్ణమూర్తి సకుటుంబముగా గ్రహణస్నానమునకుఁ బోవుట. (*)

సీ॥ ధరణీశ బలుఁడును * సరసిజోదరుఁడు న
వోన్నత సుఖలీల * నుండు నంతఁ
జటులోగ్రకల్పాంత * సమయమందును బోలె
దృగసహ్యమైన సము * ద్దీప్తమగుచు
రాజిల్లు సూర్యోప * రాగంబు చనుదెంచు
టెఱిఁగి భూసురులెల్ల * వరుసఁ గదలి
మనుజమదగ్నిరా * ముఁడుపూని మున్నేడు
మారుఖఘనబలో * దారుఁడగుచు



తే॥ నిజభుజాదండ మండిత * నిశితనిశిత । చటుల దంభోళి రుచిర భా * స్వత్కుఠార
మహిత నారాచ నిర్భిన్న * మనుజపాల । దేహనిర్ముక్త రుధిర ప్ర * వాహములను.

టీ॥ ధరణీశ=రాజా. బలుఁడును=బలరాముఁడును. సరసిజోదరుఁడును=కృష్ణుఁడును. నవ=క్రొత్తయైన. ఉన్నతసుఖలీలన్=అధికమైన సుఖవిలాసముతో. ఉండునంతన్=ఉండఁగా. చటుల...మందున్—చటుల=గొప్పనైనదియు. ఉగ్ర=భయంకరమైనదియునైన. కల్పాంత సమయమందున్=ప్రళయసమయమునందు. పోలెన్=వలెనే. దృగసహ్యమై=చూపులకుసహింపరానిదై. సముద్దీప్తము=మిక్కిలి వెలుఁగునది. (అగుచును) రాజిల్లు=ప్రకాశించునట్టి. సూర్యోపరాగంబు=సూర్యగ్రహణము. చనుదెంచుట=వచ్చుట. ఎఱిఁగి=తెలిసి. భూసురులెల్లన్=బ్రాహ్మణులందఱును. వరుసన్=వరుసతో. కదలి=వెడలి. మును=మునుపు. జమదగ్నిరాముఁడు=పరశురాముఁడు. పూని=యత్నించి. మూఁడేడు మాఱులు=ఇరువదియొక్కమాఱు. ఘనబలోదారుఁడు=అధికబలముచేతగొప్పవాఁడు. (అగుచును) నిజ...ములను — నిజ=తనదైన. భుజాదండ=కఱ్ఱలవంటిభుజములయందు. మండిత=అలంకరింపఁబడినదైన. నిబిడ=దట్టమైన—అనఁగాదృఢమయిన. నిశిత=వాఁడియైన. చటుల=భయంకరమైన. దంభోళి=వజ్రాయుధమువలె. రుచిర=తేజస్సుగలదై. భాస్వత్=వెలుఁగుచున్న. కుఠార=గండ్రగొడ్డలిచేతను. [illegible] గొప్పవైన. నారాచ=నారసముల చేతను. నిర్భిన్న=మిక్కిలిభిన్నఁజేయఁబడిన—చీలఁగొట్టఁబడిన. మనుజపాల=రాజులయొక్క. దేహ=శరీరములందుండి. నిర్ముక్త=విడువఁబడిన—స్రవించునట్టి. రుధిరప్రవాహములను=నెత్తురుకాల్వలచేతను.

తా॥ ఓరాజా! బలరాముఁడును కృష్ణుఁడును మిక్కిలి సుఖముతోడ వినోదములతో ప్రొద్దులుపుచ్చుచుండఁగా మిక్కిలి భయంకరమైన ప్రళయకాలమునందు వలెనే సహింప శక్యముగాని యొక సూర్య గ్రహణము వచ్చెను, అది తెలిసి యెల్లబ్రాహ్మణులును ఇండ్లనుండిబయలుదేఱి పూర్వకాలమునందుమిక్కుటమైనబలముచేత అధికుఁడైన పరశురాముఁడు ఇరువదియొక్కమాఱు రాజులపైదండెత్తి నిడుదలైనతనచేతులకు అలంకారముగా నొప్పునట్టిదియు, మిక్కిలివాఁడిగలయు వజ్రాయుధమువలె అప్రతిహతమయినదియునైన గండ్రగొడ్డలి చేతను, వాఁడులైన నారసముల చేతను ఎల్ల రాజుల దేహములను చినుఁగఁగొట్టి వారిదేహముల నుండి వెడలునట్టి నెత్తుటి కాల్వల చేతను అనితాత్పర్యము.

౧౦౩౫.— తే॥ ఏను మడువులు గావించె * నెచట నేని । నట్టి పావన సుక్షేత్ర * మగు శమంత
పంచకంబున కపుడు సం * భ్రమముతోడఁ । జనిరి బలకృష్ణులును సంత * సం బెలర్ప.

టీ॥ ఎచటనేని=ఏతావున. ఏనుమడువులుగావించెన్ = అయిదు మడుఁగులను జేసెనో. అట్టిపావన సుక్షేత్రము = అట్టిపరిశుద్ధమైన మంచిభూమి. అగు = అగునట్టి. శమంతపంచకంబునకున్=శమంత పంచకమునకు. అపుడు = ఆసమయమునందు. సంభ్రమముతోడన్ = వేగిరపాటుతో. బలకృష్ణులును = బలరామ కృష్ణులును. సంతసంబు= సంతోషము. ఎలర్పన్ = అతిశయింపఁగా. చనిరి = పోయిరి.

తా॥ ఏప్రదేశమునందు అయిదు మడుఁగులు చేసెనో అట్టిపరమ పావనమయిన శమంతపంచకము అనఁబరఁగిన యుత్తమ క్షేత్రమునకు బలరామ కృష్ణులును తత్తఱపడుచు సంతోషము హెచ్చఁగాఁబోయిరి అనితాత్పర్యము.

వ॥ ఇట్లు నిష్కర్ములైన రామకృష్ణులు లోకధర్మానుపాలన వర్తనులై ద్వారకానగర రక్షణంబునకుఁ బ్రద్యుమ్న గద సాంబ సుచంద్ర శుక సారణానిరుద్ధ కృతవర్మాదియోధవరుల నియమించి యక్రూర వసుదేవోగ్రసేనాది సకల యాదవులుం గాంతాసమేతులై స్రక్చందనాభరణవస్త్రాదులు ధరియించి శోభనాకారంబులతోడం బుష్పకవిమానంబుల నంబోలుచు నరదంబులను మేఘంబుల ననుకరించు గజంబులను మనోవేగంబులైన తురంగంబులను నెక్కి వియచ్చరులం బురుడించుచు వర్షధరులు దమ్ము సేవింపం జని యప్పుణ్యతీర్థంబున నవగాహనంబులు చేసి యుపవసించి యనంతరంబ.

టీ॥ (ఇట్లు) నిష్కర్ములు=ఏకర్మలును లేనివారు. అయినరామకృష్ణులు= అయినట్టి బలరాముఁడును కృష్ణుఁడును. లోకధర్మానుపాలనవర్తనులై= లోకాచారమును కాపాడుటను అనుసరించి వర్తించునట్టివారై. ద్వారకానగర రక్షణంబునకున్ = ద్వారకాపట్టణమును కాచుట కొఱకు. ప్రద్యుమ్న...యోధవరులన్=ప్రద్యుమ్నుఁడు గదుఁడు సాంబుఁడు సుచంద్రుఁడు శుకుఁడు సారణుఁడు అనిరుద్ధుఁడు కృతవర్మ మొదలుగాఁగలయోధశ్రేష్ఠులను. నియమించి=ఆజ్ఞాపించి నిలిపి. అక్రూర...యాదవులును = అక్రూరుఁడు వసుదేవుఁడు ఉగ్రసేనుఁడు మొదలుగాఁగలయెల్ల యాదవులును. కాంతాసమేతులై=భార్యలతోఁ గూడుకొన్నవారై. స్రక్చందనాభరణ వస్త్రాదులు — స్రక్ = పూలదండలు. చందన=గంధము. ఆభరణ=సొమ్ములు. వస్త్రాదులు=కోకలు మొదలగునవి. (ధరియించి) శోభనాకారంబులతోడన్ = మంచియాకృతులతో. (పుష్పకవిమానంబులు) అనంబోలుచు=అనునట్లు ఉండునట్టి. అరదంబులను=రథములను. మేఘంబులన్=మబ్బులను. అనుకరించు=పోలునట్టి. గజంబులను=ఏనుఁగులను. మనోవేగంబులు = మనసుయొక్క వేగమువంటివేగముగలవి. ఐనతురంగంబులను=అగునట్టిగుఱ్ఱములను. (ఎక్కి) వియచ్చరులన్=దేవతలను. పురుడించుచున్=సరిపోలుచు. వర్షధరులు తమ్ము సేవింపన్=కొజ్జాలు తమ్ముకొలువఁగా. చని=పోయి. అప్పుణ్యతీర్థంబులన్=ఆపరిశుద్ధసరస్సులందు. అవగాహనంబుచేసి = స్నానము చేసి. ఉపవసించి=ఒక్కప్రొద్దులుండి. అనంతరంబ=అటుపిమ్మటనే.

తా॥ ఈవిధముగా బలరామ కృష్ణులు తాము ఏకర్మములను జేయవలసిన వారుకాకుండియు లోకాచారమును అనుసరించి వర్తించువారై ద్వారకాపట్టణమునకు కావలిగా ప్రద్యుమ్నుఁడు సాంబుఁడు సుచంద్రుఁడు శుకుఁడు సారణుఁడు అనిరుద్ధుఁడు మొదలగు యాదవకుమారులను కృతవర్మను నిలిపి అక్రూరుఁడు వసుదేవుఁడు ఉగ్రసేనుఁడు మొదలుగాఁగల తక్కిన యాదవులనందఱను పెండ్లాలతోడ వెంటఁబెట్టుకొని పుష్పకవిమానములో అనునట్లు మిక్కిలి మనోజ్ఞములై కానఁబడుచున్న రథములను మబ్బులవలె ఉన్నతములై యొప్పునట్టి యేనుఁగులను మనసు ఎంతవడిగాఁబోవునో అంతవడిగాఁ బోఁగలగుఱ్ఱములను ఎక్కినవారై కంచుకులు తమ్ము సేవింపఁగా దేవతలను సరిపోలుచు మొదఁ జెప్పిన శమంత పంచకమునకుఁ బోయి ఆమడుఁగులలో యథావిధిగా స్నానములుచేసి ఒక్కప్రొద్దులను చెల్లించుకొని వెంట సేయని తాత్పర్యము.

౧౦౩౭.—క॥ భూసురవరులకు ననుపమ । వాసోలంకార ధేను * వసురత్నధరి
త్రీసుమహిత వస్తువులు । ల్లాసంబునదానమిచ్చి * లాలితులగుచున్.

టీ॥ భూసురవరులకున్=బ్రాహ్మణ శ్రేష్ఠులకు. అనుపమ...వస్తువులు—అనుపమ=ఈడులేని. వాసః=వస్త్రములు. అలంకార=ఆభరణములు. ధేను=లేఁగటావులు. వసు=బంగారు. రత్న = రత్నములు. ధరిత్రీ = భూమియునను. సుమహిత వస్తువులు = మిక్కిలి పూజ్యములయినవస్తువులను. ఉల్లాసంబునన్ = సంతోషముతో. (దానమిచ్చి) లాలితులగుచున్ = ఆబ్రాహ్మణులచేత శ్లాఘింపఁబడిన వారగుచును.

తా॥ బ్రాహ్మణులకుమిగులమేలైనవస్త్రములు, ఆభరణములు, లేఁగటావులు బంగారు రత్నములు భూమియు ననునివి మొదలు గాఁగం షోడశమహా దానములుచేసి వారిచేత దీవనలు పడసిన వారగుచును అని తాత్పర్యము.

౧౦౩౮.—క॥ పున రవగాహనములు పెం । పొనరం గావించి బంధు * బుధ యుతులై భో
జనకృత్యంబులుదీర్చి స । దనురాగము లుల్లసిల్ల * నచ్చోటఁ దగన్.

టీ॥ పునరవగాహనములు = మరలస్నానములు. పెంపొనరన్=గౌరవమొప్పఁగా. (కావించి) బంధుబుధయుతులై=చుట్టములతోను పెద్దలతోనుఁ గూడినవారై. భోజనకృత్యంబులు = భోజన కార్యములను. తీర్చి=జరపి. సదనురాగములు = మంచియనురాగములు. ఉల్లసిల్లన్ = వెలుఁగొందఁగా. అచ్చోటన్ = ఆపుణ్యక్షేత్రమందు. తగన్ = ఒప్పునట్లు.

తా॥ మరల గౌరవము ఒప్పునట్లుగా స్నానములు చేసి చుట్టములతోను పెద్దలగువారితోనుగూడిభోజనములుచేసికొనిమిక్కిలి యనురాగములుగలవారై యాప్రదేశమునందు అనితాత్పర్యము.

౧౦౩౯.—క॥ ఘన శాఖా కీర్ణములై । యినరశ్మలు గానరాక * యెసకం బెసఁగన్
ననిచిన పొన్నల నీడల । ననిచిన వేడుకల నంద * నందన ముఖ్యుల్.

టీ॥ ఘనశాఖాకీర్ణములై = గొప్ప కొమ్మలచేత వ్యాపించినవై. ఇనరశ్మలు = సూర్య కిరణములు. కానరాక = కనఁబడక. ఎసకం బెసఁగన్ = మేలిమియతిశయింపఁగా. ననిచిన=పుష్పించిన. పొన్నలనీడలన్ = పొన్నచెట్లనీడలయందు. ననిచినవేడుకలన్ = విశేషించిన వినోదములతో. నందనందనముఖ్యులు = కృష్ణుఁడు మొదలగువారు.

తా॥ చాలపొడవునకువ్యాపించినపెద్దపెద్దకొమ్మలుగలిగి ఎండసోఁకకుండునట్టినీడలతోఁ జిగిర్చి పూచి యొప్పుచున్న పొన్నమ్రాఁకుల నీడలయందుమిక్కిలివేడుకలతో కృష్ణుఁడుమొదలగువారు విశ్రమించిరని తా.

౧౦౪౦.—క॥ తనరిన పల్లవరుచిరా । సనముల నాసీనులగుచుఁ * దత్సుఖగోష్ఠిన్
ఘనుపొందఁగనట వసియిం । చినచోఁదత్పుణ్యతీర్థ * సేవాపరులై.

టీ॥ తనరిన...ములన్—తనరిన=ఒప్పిన. పల్లవ=చిగుళ్లచేనైన. రుచిర=అందమైన. ఆసనములన్=పీఠములయందు. ఆసీనులగుచున్=కూర్చున్నవారగుచు. తత్సుఖగోష్ఠిన్=ఆసుఖమయినగోష్ఠియందు. ఘనుపొందఁగన్=గంభీరముగా. అటన్=అచ్చట. వసియించినచోన్=ఉండునప్పుడు. తత్పుణ్యతీర్థసేవాపరులై—ఆపుణ్యతీర్థములను సేవింప నిచ్ఛగలవారై.

తా॥ అట్లు ఒప్పిదములైన చిగురుటాకులను సేలఁబఱుచుకొని సుఖముగాఁ గూర్చుండి యప్పటికిఁదగిన ముచ్చటలు చెప్పుకొనుచు నచ్చట నుండఁగా ఆపుణ్యతీర్థములను సేవింప నిచ్ఛగలవారై అని తాత్పర్యము.

వ॥ మున్నచనుదెంచియున్న యౌశీనర మత్స్య కురు కోసల విదర్భ సృంజయ కాంభోజ కేకయ మద్ర కుంత్యారట్ట కేరళాదిభూపతులును, మఱియుం దక్కిన రాజవరులును హితులగు నందగోపాది గోపాలురును, గోపికా జనంబులును, ధర్మరాజానుగతులై వచ్చిన భీష్మ ద్రోణ ధృతరాష్ట్ర గాంధారీ కుంతీ పాండవ తద్దార నివహ సంజయ విదుర కృప కుంతిభోజ విరాట భీష్మక నగ్నజిత్ త్ద్రుపద శైబ్య ధృష్టకేతు కాశీరాజ రాజరాజ దమఘోష విశాలాక్ష మైథిల యుధామన్యు సుశర్మలును, సపుత్రకుండైనబాహ్లీకుండును, మొదలుగా ననేకులు నుగ్రసేనప్రముఖులం బూజలం దృప్తులంజేసినవారునుం బ్రముదితాత్ములైరయ్యెడ.

టీ॥ మున్న = మునుపే. చనుదెంచియున్న = వచ్చియున్న. ఔశీనర...పతులును=ఔశీనరము మత్స్యము కురువు కోసలము విదర్భము సృంజయము కాంభోజము కేకయము మద్రము కుంతి ఆరట్టము కేరళము మొదలగు దేశములరాజులును. (మఱియును) తక్కినరాజవరులును=ఇతరులైన రాజశ్రేష్ఠులును. హితులగు=కృష్ణునకాప్తులైన. నందగోపాది=నందుఁడు మొదలగు. గోపాలురును=గొల్లలును. (గోపికాజనంబులును) ధర్మరాజానుగతులై=ధర్మరాజు ననుసరించివచ్చిన. భీష్మ...సుశర్మలును=భీష్ముఁడు ద్రోణుఁడు ధృతరాష్ట్రుఁడు గాంధారి కుంతి పాండవులువారిభార్యలసముదాయము సంజయుఁడు విదురుఁడుకృపుఁడు కుంతిభోజుఁడు విరాటుఁడు భీష్మకుఁడునగ్నజిత్తు ద్రుపదుఁడుశైబ్యుఁడు ధృష్టకేతుఁడు కాశీరాజు దుర్యోధనుఁడు దమఘోషుఁడు విశాలాక్షుఁడు మైథిలుఁడు యుధామన్యుఁడు సుశర్మయును. సపుత్రకుండైన=కొడుకులతోఁగూడుకొన్నవాఁడైన. (బాహ్లీకుఁడును) మొదలుగా=మొదలుచేసికొని. అనేకులు = పెక్కండ్రు. ఉగ్రసేనప్రముఖులన్=ఉగ్రసేనుఁడు మొదలగువారిని. పూజలన్ = అర్చనలచేత. తృప్తులం జేసినన్=తృప్తినొందినవారిఁగాఁజేయఁగా. వారును=ఆయుగ్రసేనాదులును. ప్రముదితాత్ములైరి=సంతోషించినమనసులుగలవారైరి. (అయ్యెడ)

తా॥ ఆపుణ్యతీర్థములనుసేవింపఁగోరి అంతకుముందే వచ్చియున్న ఔశీనర మత్స్యకురుకోసలాదిదేశములరాజులును, తక్కినరాజులును, నందుఁడు మొదలగు గొల్లలును, గోపికలును, ధర్మరాజు ననుసరించి

వచ్చిన భీష్ముఁడు ధృతరాష్ట్రుఁడు మొదలగువారును, పాండవులును వారిభార్యలును, మొదలుగాఁగలవారందఱును, ఉగ్రసేనుఁడు మొదలగు యాదవులనెల్లను, సన్మానములచేత సంతోషపెట్టఁగావారునువారికి ప్రతిసన్మానములు చేయుటచేత సంతోషించినవారైరి అని తాత్పర్యము.



(✻) ఋషులు రాజులు మొదలయినవారు శ్రీకృష్ణునిదర్శించిపొగడుట. (✻)

౧౦౪౨.—క॥ ఆరాజులు గాంచిరి నిజ । నారీ యుతులగుచు నంగ ✻ నా పరివారుఁ
ధీరుఁ దానవకులసం । హారుఁ గోపీమనోవి ✻ హారు నుదారుఁ.

టీ॥ ఆరాజులు = ఆవచ్చినరాజులు. నిజనారీ యుతులగుచుఁ = తమపెండ్లాలతోఁగూడినవారగుచు. అంగనాపరివారుఁ = భార్యలును పరిజనములు గలవాఁడును. ధీరుఁ = ధైర్యవంతుఁడును. దానవకుల సంహారుఁ = రాక్షస సమూహములను చంపువాఁడును. గోపీమనో విహారుఁ = గోపికాస్త్రీల మనసులయందు విహరించు వాఁడును. ఉదారుఁ = గొప్పవాఁడునైన శ్రీకృష్ణమూర్తిని. కాంచిరి = చూచిరి.

తా॥ అప్పుడుఆరాజులను వారిభార్యలును పెక్కండ్రు పెండ్లాలతోఁ గూడుకొనియుండునట్టియు ధైర్యము గలిగినట్టియు రాక్షసవంశనాశము చేయునట్టియు గోపికాస్త్రీలమనసులకు ప్రియముగాసంచరించునట్టియు చాల గొప్పవాఁడైనట్టియు శ్రీకృష్ణమూర్తినిఁ జూచిరి అని తాత్పర్యము.

౧౦౪౩.—వ॥ కని యమ్మాధవబలదేవులు సేయుసముచిత పూజా విధానంబులం బరితృప్తులై యమ్ము
కుందు సాన్నిధ్యంబుగలిగి తదీయసంపద్విభవాభిరామంబుల నభిరాములై విలసిల్లుచున్న
యుగ్రసేనాదియదువృష్ణిపుంగవులంజూచివారలతోడనారాజవరులుమాధవుండువిననిట్లనిరి,

టీ॥ కని=చూచి. అమ్మాధవ బలదేవులు = ఆకృష్ణ బలరాములు. చేయు సముచితపూజావిధానంబులన్ = చేయునట్టియుక్తములైన పూజా కార్యములచేత. పరితృప్తులై = చక్కగా తృప్తిఁబొందినవారై. అమ్మకుందు సాన్నిధ్యంబు = ఆకృష్ణుని సన్నిధానము. (కలిగి) తదీయ సంపద్విభవాభిరామంబులన్ = ఆయన సంపద యొక్కయు వైభవము యొక్కయు ఒప్పిదములచేతను. అభిరాములై = ఒప్పినవారై. విలసిల్లుచున్న = ప్రకాశించుచున్న. ఉగ్రసేనాదియదువృష్ణిపుంగవులన్ = ఉగ్రసేనుఁడు మొదలగు యదువులు వృష్ణులునైనపురుషశ్రేష్ఠులను. (చూచి) వారలతోడన్ = వారితో. ఆరాజవరులు = ఆరాజశ్రేష్ఠులు. మాధవుండు = కృష్ణుఁడు. వినన్ = వినునట్లుగా. ఇట్లనిరి = ఇట్లు పలికిరి.

తా॥ ఆరాజులు కృష్ణమూర్తిని జూచినవారై యాకృష్ణుఁడును బలరాముఁడును చేయుమర్యాదలచేత మిక్కిలితృప్తినొంది ఆకృష్ణమూర్తికైన కలిమియు మహిమచేత ఒప్పినవారై వెలుఁగుచున్న ఉగ్రసేనుఁడు మొదలగు వారిని జూచి వారితో కృష్ణుఁడు వినుచుండఁగా నిట్లు పలికిరని తాత్పర్యము.

౧౦౪౪.—మ॥ మనశాస్త్రంబులు వాక్కులున్ మనములున్ * మాంగల్యముం బొంది పా
వనమై యొప్పెడు నేరమావిభుని భా * స్వత్పాద పంకేజ సే
చనతోయంబుల నేమహాత్ముని పదా * బ్జాతంబు లెందేని సోఁ
కినచో నెల్లను ముక్తిహేతువగు నీ * కృష్ణుండె పో చూడఁగన్.

టీ॥ ఏరమా...తోయంబులన్ — ఏరమావిభుని = ఏలక్ష్మీభర్తయైన విష్ణుమూర్తియొక్క. భాస్వత్ = ప్రకాశించుచున్న. పాదపంకేజ = పాదకమలములయొక్క. సేచన = తడుపుటవలని. తోయంబులన్ = జలములచేత. మనశాస్త్రంబులు = మనము పఠించు శాస్త్రములును. వాక్కులును = మన మాటలును. మనములును = మనసులును. మాంగల్యముం బొంది = మేలిమిని పొంది. పావనమై = పరిశుద్ధమై. ఒప్పెడున్ = ఒప్పునో. ఏమహాత్ముని పదాబ్జాతంబులు = ఏగొప్పమనసుగలవాని పాదకమలములు. ఎందేని = ఎక్కడనైనను. సోఁకినచో నెల్లన్ = తాఁకిన ప్రదేశమంతయు. ముక్తిహేతువగున్ = మోక్షమునకు కారణమగునో. (అట్టిదేవుఁడు) చూడఁగన్ = విచారింపఁగా. ఈకృష్ణుండె పో = ఈ కృష్ణుఁడే సుమీ.

తా॥ విచారింపఁగా లక్ష్మీభర్తయైనయే దేవుని పాదకమలములు కడిగిన నీళ్లు మనశాస్త్రములను మనమాటలను మనమనసులను శుభకరములై పరిశుద్ధములై యొప్పునట్లుగాఁ జేయునో ఏపరమపురుషుని పాదకమలములు ఎక్కడనైనయేమాత్రమైనసోఁకిన ఆచోటెల్లను మోక్షము నియ్య సమర్థమగునో అట్టిసర్వేశ్వరుఁడు శ్రీకృష్ణుఁడేగాని యితరులు కారనితా.

౧౦౪౫.—చ॥ సనక సనందనాది ముని * సత్తములంచిత యోగదృష్టిచేఁ
బనివడి యాత్మలన్ వెదకి * పట్ట నగోచరమైన మూర్తి యి
ట్లనవరతంబు మాంసనయ * నాంచల గోచరుఁడయ్యె నట్టె యే
మననగు వీరి పుణ్యమున కాదట * నెట్టి తపంబు చేసిరో.

టీ॥ సనకసనందనాది మునిసత్తములు = సనకుఁడు సనందనుఁడు మొదలుగాఁగల మునిశ్రేష్ఠులు. అంచితయోగదృష్టిచేన్ = ఒప్పిదమైన యమాది యోగనిష్ఠవలన లభించిన దివ్యదృష్టిచేత. పనివడి = పూని. ఆత్మలన్ = తమ మనసులయందు. వెదకిపట్టన్ = వెదకి పట్టఁగా. అగోచరము = కనఁబడనిది. ఐనమూర్తి = అయినట్టి యాకారముగలవాఁడు. ఇట్లు = ఈవిధముగా. అనవరతంబు = ఎల్లప్పుడు. మాంసనయనాంచలగోచరుఁడు = మాంసపుకనులకొనలకుఁ గనఁబడినవాఁడు. అయ్యెనట్టె = ఆయెనఁట. వీరిపుణ్యమునకున్ = ఈయాదవులయదృష్టమునకు. ఏమననగున్ = ఏమియని చెప్పవచ్చును. ఆదటన్ = అక్కటకటా. ఎట్టితపంబు చేసిరో = వీరుమునుపు ఎటువంటి తపస్సుచేసిరో.

తా॥ సనకుఁడు సనందనుఁడు మొదలయిన దేవమునులు కూడ మిక్కిలి శ్లాఘ్యమయిన యోగాభ్యాసమువల్ల లభించిన దివ్యదృష్టిచేత మనసులలో ప్రయత్నపూర్వకముగా వెదకిచూచియుఁ గానఁ జేరనిదైన దివ్యస్వరూపముగల యీకృష్ణమూర్తి యీవిధముగా నెల్లప్పుడు వీరిదైన మాంసపుకన్నులకు సదా కనఁబడుచుండునఁట వీరిభాగ్యమేమనవచ్చును ఇందులకై పూర్వజన్మమునందు వీరు ఎటువంటి తపస్సు చేసియుందురో అని తా.

౧౦౪౬.—మ॥ నిరయస్వర్గము లాత్మఁగైకొనక దా * నిర్వాణ సన్మూర్తియా
హరిఁజూడన్ హరితోడఁబల్క హరిమే నంటన్ * హరింబాడఁగా
హరితో నేఁగ సహాసనాస్తరణ శయ్యా * వాసులై యుంటకున్
హరిబంధుత్వ సఖిత్వముల్ గలుగ భా * గ్యం బెట్లు సిద్ధించెనో.

టీ॥ నిరయస్వర్గములు = నరకమును స్వర్గమును. ఆత్మన్ = తనలో. కైకొనక = లక్ష్యపెట్టక. తాన్ = తాను. నిర్వాణసన్మూర్తి = మోక్షమనెడి మంచిరూపముగలవాఁడు. ఆహరిన్ = ఆనట్టి శ్రీకృష్ణమూర్తిని చూడన్ = చూచుటకును. హరితోడన్ = ఆకృష్ణమూర్తితో. పల్కన్ = మాటలాడను. హరిమేనంటన్ = కృష్ణుని దేహమునంటను. హరింబాడఁగాన్ = ఆకృష్ణుని కొనియాడను. హరితో నేఁగన్ = కృష్ణునితోడ పోవుటకును. సహాస...యుంటకున్ — సహ = కూడ. ఆసన = పీఠముల [illegible] లందును. ఆస్తరణ = చాపమొదలగువానియందును. శయ్యా = పాన్పులందును. వాసులై = వాసముచేయువారై. ఉంటకున్ = ఉండుటకును. హరిబంధుత్వసఖిత్వములు = కృష్ణుని చుట్టరికమును చెలిమియు. కలుగన్ = లభింపను. భాగ్యంబు = అదృష్టము. ఎట్లు సిద్ధించెనో = వీరికే విధముగా కలిగెనో.

తా॥ స్వర్గనరకములను త్రిందుపఱచి కేవల మోక్షము స్వరూపముగాఁ [illegible]గల శ్రీకృష్ణమూర్తిని చూడను, ఆయనతో మాటలాడను, ఆయన దేహ

మను అంటను, ఈయననుకీర్తనరూపముగాస్తోత్రముచేయను, ఈయన వెంటఁ దిరుగను, ఈయనతోఁగూడ పీఁటలయందును చాఁపలు మొద లగువానియందుఁగూర్చుండను, పాన్పులందుఁ బరుండను, ఈయనబంధుత్వమును చెలికానిపొందును, ఇట్టియదృష్టమువీరికి ఎట్లువచ్చెనోయనితా.

౧౦౪౭.—తే॥ అనుచుయాదవ వృష్ణిభో * జాంధకులను । హరిదయాలబ్ధ నిఖిలార్థు * లగుచు నున్న
మనికిఁదమచిత్తములఁబలు * మాఱుఁబొగడి । పరిచరించిరియంతన * పాండు మహిషి.

టీ॥ అనుచున్=అని. యాదవవృష్ణి భోజాంధకులను=యదువంశస్థులును వృష్ణి వంశస్థులును భోజ వంశస్థులును అంధక వంశస్థులు నైన వారిని. హరిదయాలబ్ధనిఖిలార్థులు=శ్రీకృష్ణమూర్తి దయచేత లభించిన యెల్లయర్థములునుగలవారు. అగుచున్న మనికిన్=అగుచుండునట్టి వారి స్థితిని. తమ చిత్తములన్=తమ మనసులలో. పలుమాఱున్=మాటిమాటికి. పొగడి=కొనియాడి. పరిచరించిరి=పూజించిరి. అంతన్=అటు పిమ్మట. అప్పాండుమహిషి=పాండురాజు భార్యయైనయాకుంతీదేవి.

తా॥ అనియా రాజులందఱు యాదవులును వృష్ణులును భోజులును అంధకులును నైన కృష్ణుని సంబంధులెల్లను కృష్ణుని దయవలన లభించిన యెల్లకోరికలును గలవారై యుండుటను గూర్చి తమలో తాము బహు పర్యాయములు కొనియాడి అంతట ఊరక యుండిరి పిమ్మట కుంతీదేవి వసుదేవునిఁజూచెనని తాత్పర్యము.

౧౦౪౮.—క॥ తనసుతులకు గాంధారీ । తనయులుగావించు నపకృ * తంబులకుఁగడున్
మనమెఱియంగా నచ్చటఁ । గనుఁగొనె వసుదేవు విగత * కల్మష భావున్.

టీ॥ తనసుతులకున్=తనకొడుకులకు. గాంధారీతనయులు=గాంధారి కొడుకులైనదుర్యోధనుఁడు మొదలగువారు. కావించు=చేయునట్టి. అపకృతంబులకున్=అపకారములకు. కడున్=మిక్కిలి. మనము=మనస్సు ఎరియంగాన్=మండఁగా. అచ్చటన్=అక్కడ. విగతకల్మషభావున్=పోయినకపటముగలమనసు గలవాఁడైన. (వసుదేవుని కనుఁగొనెను)

తా॥ కుంతీదేవి తనకొడుకులకు ధృతరాష్ట్రునికొడుకులు చేయునపకారములనుగూర్చి తనమనసులో తపించుచు వివిధమైన కపటమును లేని మనసుగలవాఁడైనవసుదేవునినచ్చటఁజూచెనని తాత్పర్యము.

౧౦౪౯.—వ॥ అట్లుగనుంగొని యతనితో నిట్లనియె.

టీ॥ (అట్లు) కనుంగొని=చూచి. అతనితోన్=ఆవసుదేవునితో. (ఇట్లనియెను)

౧౦౫౦.—క॥ ఓయన్న పాండుతనయులు । నీయల్లుండ్రడవులందు * నెఱి మృగములలో
బాయని యిడుమలఁ బడఁగరు । ణాయత్తుల రగుచుమీర * లరయఁగఁవలదే.

టీ॥ (ఓయన్నా) నీయల్లుండ్రు=నీయల్లురైన. పాండుతనయులు=పాండుమహారాజుకొడుకులు. అడవులందున్=అడవులలో. నెఱిన్=వక్రతతో—అక్రమముగా. మృగములలో=మృగములయందు. పాయని యిడుమలన్=తొలఁగనియాపదలను. పడన్=పొందఁగా. మీరలు=మీరు. కరుణాయత్తులరగుచున్=దయకు అధీనులగుచు—దయగలవారై. అరయఁగవలదే=విచారింప నక్కఱలేదా — విచారింపవలెననుట.

తా॥ ఓఅన్నా! నీమేనల్లురును పాండుమహారాజు కొడుకులునైన నాబిడ్డలు అక్రమముగా అడవులలోఁబడి మృగములతో పాటుతిరుగుచు శ్రమపడుచుండఁగా మీరుదయతోవిచారించుకోనక్కఱలేదా అనియడిగెనుఅని తాత్పర్యము.

౧౦౫౧.—వ॥ అనిపెక్కుప్రకారంబుల సంతాపించుచు మఱియునిట్లనియె.

టీ॥ (అని) బహుప్రకారంబులన్=బహువిధములచేత. సంతాపించుచున్=తొట్రుపడుచు. మఱియున్=ఇంకను. (ఇట్లనియెను)

౧౦౫౨.—క॥ అతిబలవంతపు విధిదాఁ । బ్రతికూలంబైనఁ గలరె * బంధువులనుచున్
ధృతిగలఁగి బాష్పజలపూ । రితలోచనయగు సహోద * రిఁజూచియనెన్.

టీ॥ అతిబలవంతపువిధి=మిక్కిలిబలముగలదైన దైవము. తాన్=తాను. ప్రతికూలంబైనన్=అనుకూలము కానిదైనయెడ. బంధువులు=చుట్టములు కలరె=కలరా—దైవానుకూల్యమతప్పినప్పుడే బంధువుల యానుకూల్యమును తప్పుననుట. అనుచున్=అని. ధృతి=ధైర్యము. కలఁగి=కలఁతనొంది—చలించియనుట. బాష్పజలపూరితలోచన=కన్నీళ్లచేతనిండింపఁబడినకన్నులుగలది. అగుసహోదరిన్=అగునట్టి తోడఁబుట్టువును—కుంతిని. (చూచి) అనెన్=వసుదేవుఁడు పలికెను.

తా॥ మిక్కిలిబలముగలదయినదైవము అనుకూలము కానియప్పుడు చుట్టములు మాత్రమెట్లు అనుకూలు రగుదురు కాఁబట్టి మీరు నాకుఁగల వారయ్యు లేనివారివలెనుపేక్షించియున్నారు అనికన్నులనిండ నీళ్లుకట్టుకొన్నతోడఁబుట్టువయిన కుంతినిజూచివసుదేవుఁడిట్లుపలికెను అని తా.

౧౦౫౩.—సీ॥ తల్లి నీకేల సం * తాపింప మనమునఁ - దలఁపక విధినేల * సొలసెదింత
యఖిల నియామకుం * డగు నీశ్వరుఁడు మాయ - జవని కాంతరుఁడైన * యవనిసూత్ర
ధారుని కైవడిఁ * దగిలి నటింపంగ - మనుజులు కీలుబొ * మ్మలు దలంపఁ
గావున విధిసేతఁ * గడచి వ [illegible] దేవతలకునైనఁ * దీరునెట్లు

తే॥ క్రోధచిత్తుఁడు కంసుండు * బాధ పఱుప । నిలయములుదప్పి నేము * డవులఁ జరింప
ఘనకృపానిధి యాహరి * గలుఁగఁబట్టి । కోరిమాయిండ్లు గ్రమ్మఱఁ * జేరఁగలిగె.

టీ॥ తల్లి=ఓయమ్మా. (నీకు) సంతాపింపనేల=వగచుటయెందుకు. మనమునన్=మనస్సునందు. తలఁపన్=యుక్తాయుక్తములనువిచారింపన్. ఇంత=ఇంతవిశేషముగా. విధిన్=దైవమును. ఏలసొలసెదు=ఎందుకునిందించెదవు. అఖిలనియామకుండు=సర్వమునునియమించువాఁడు. అగునీశ్వరుఁడు = అగునట్టి భగవంతుఁడు. అవనిన్ = భూమియందు. తలంపన్=విచారింపఁగా. మాయన్=మాయచేత. జవనికాంతరుఁడు = తెరలోనుండువాఁడు. అయిన = అయినట్టి. సూత్రధారునికైవడిన్ = సూత్రమును ధరించినవానివలెనే. తగిలి= పూని. నటింపంగన్=ఆడింపఁగా. మనుజులు=మనుష్యులు. కీలుబొమ్మలు — కీలుబొమ్మలవలె నాడుచుండు దురనుట. కావునన్= కనుక. విధిసేఁతన్=దైవకృత్యమును. కడచి=మీఱి.వర్తింపంగన్= మెలఁగను. దేవతలకునైనన్=దేవతలకైనను. తీరునెట్లు=ఎట్లుసరిపడును. క్రోధచిత్తుఁడు = కోపమనస్సుకలవాఁడైన. (కంసుండు) బాధపఱుపన్=బాధింపఁగా. ఏము=మేము. నిలయములు=ఇండ్లు. తప్పి=వదలి. అడవులన్ = అడవులయందు. చరింపన్ = తిరుగుచుండఁగా. ఘనకృపానిధి=అధికమయినదయకుస్థానమైనవాఁడైన. ఆహరి = ఆకృష్ణమూర్తి. కలుగఁబట్టి = కలిగిన కారణముచేత. క్రమ్మఱన్ = మరల. కోరి=అపేక్షించి. మాయిండ్లు=మాయిండ్లయందు. చేరఁగలిగెన్ = చేరునంతటి యదృష్టము మాకుకలిగెను.

తా॥ అమ్మా ! నీవు ఏలవిచారపడెదవు మంచిచెడ్డలు విచారింపక దైవమునేలనిందించెదవు ఆలోచించి చూడఁగా భూమియందు సర్వమునకు నియామకుఁడైన యీశ్వరుఁడు మాయచేత తెరలోనుండు సూత్రధారునివలె పూని యాడింపఁగా మనుష్యులు కీలుబొమ్మలవలె నాడుచుందురు కనుక దైవము చేయుపనిని తప్పించుకొనను దేవతలకైననుశక్యముకాదు వచ్చినసుఖదుఃఖములను అనుభవించియేతీరవలెను మేము మనుపుక్రూరుఁడైన కంసుఁడు పెట్టునట్టి బాధలకు తాళలేక అడవులలోఁబడి యలాడుచుండి మిక్కుటమైన దయయే స్వరూపముగాఁగల ఈకృష్ణుఁడు పుట్టుట కారణముగా వాఁడునశింపనుమేముమరలమాయిండ్లువచ్చిచేరను అనుకూలించెను అట్లుదైవము అనుకూలించివచ్చునపుడు నీకొడుకులును సుఖములను పొందుదురు అందులకైనీవువిశేషించి చింతింపవలదు ఊఱటగలుగఁజేసికొని యూరకుండుము అనిచెప్పె నని తాత్పర్యము.

౧౦౫౪.—వ॥ అని యూఱడిలం బలుకు నవసరంబున.

టీ॥ (అని) ఊఱడిలన్=సమాధానపడునట్లు. పలుకునవసరంబునన్=చెప్పునప్పుడు.

తా॥ అని వసుదేవుఁడు కుంతీదేవిని ఊఱడించుచుండఁగా నని తాత్పర్యము.

౧౦౫౫.—క॥ నందయశోదలు గోపక । బృందంబులు గోపికలును * బిరిగొని పరమా
నందంబులఁ జనుదెంచిరి । మందరధరుఁ జూచువేడ్క * మనములఁ బొదలన్.

టీ॥ నందయశోదలును = నందుఁడును యశోదయును. గోపకబృందంబులును=గొల్లలగుంపులును. గోపికలును=గొల్లతలును. పిరిగొని = పెనవేసికొని—జతగూడి. పరమానందంబులన్=అత్యంతసంతోషములతో. మందరధరున్=కృష్ణమూర్తిని. చూచువేడ్క = చూడవలెననుకుతూహలము. మనములన్=మనసులందు. పొదలన్= వర్ధిల్లఁగా — అతిశయింపఁగా ననుట. చనుదెంచిరి = వచ్చిరి.

తా॥ నందుఁడును యశోదయును తమవారైనగోపకులును గోపికలును జతగూడిరాఁగా శ్రీకృష్ణమూర్తినిఁ జూచుటయందలి కుతూహలము మనసులందు హెచ్చఁగా అత్యంతసంతోషముతో వచ్చిరని తాత్పర్యము. వ॥ అట్లుచనుదెంచిన=అవిధముచేరరాఁగా.

౧౦౫౬.—క॥ అతిచిరకాల సమాగతు । నతని నిరీక్షించి వృష్ణి * యాదవభోజ
ప్రతతులు నెదురేగి సము । న్నతితో నాలింగనములు * నడపిరి వరుసన్.

టీ॥ అతిచిరకాలసమాగతున్=మిక్కిలిదడవైనకాలమునకువచ్చినవాఁడైన. అతనిన్=ఆనందుని. నిరీక్షించి=చూచి. వృష్ణియాదవభోజప్రతతులును=వృష్ణులునుయాదవులునుభోజులునైనరాజులగుంపులు. ఎదురేగి=ఎదురుగాపోయి. సమున్నతితోన్=చాల గౌరవముతో. ఆలింగనములు=కౌఁగిలింతలు. వరుసన్=క్రమముగా. నడపిరి=జరపిరి.

తా॥ చాలకాలమునకు పిమ్మట వచ్చినవాఁడైన నందునిఁ జూచి యదువృష్ణి భోజవంశస్థులయిన కృష్ణుని బంధువులందఱును ఆతనికి ఎదురుగాఁబోయిమిక్కిలి గౌరవముతో కౌఁగిలించు కొనిరని తా.

౧౦౫౭.—క॥ వసుదేవుఁడు వారికిసం । తసమునఁ గావించె సముచి * త క్రియలంతన్
ముసలియు హరియున్ మ్రొక్కిరి । వెస నందయశోదలకును * వినయంబెసఁగన్.

టీ॥ వారికిన్=ఆనందయశోదలకు. (వసుదేవుఁడు) సంతసమునన్= సంతోషముతో. సముచితక్రియలు = తగిన సన్మాన కార్యములు. కావించెన్=చేసెను. అంతన్ = ఆటుపిమ్మట. ముసలియున్=బలరాముఁడును. హరియున్=శ్రీకృష్ణుఁడును. వెసన్=వడితో. వినయంబు = అడఁకువ. ఎసఁగన్=అతిశయింపఁగా. నందయశోదలకున్=నందునకును యశోదాదేవికిని. మ్రొక్కిరి=నమస్కరించిరి.

తా॥ అప్పుడు వసుదేవుఁడు నందుఁడు మొదలగువారికి సంతోషముతో తగినసన్మానములుచేయఁగా బలరాముఁడును కృష్ణుఁడును నందయశోదలకు వినయముతో మ్రొక్కిరని తాత్పర్యము.

వ॥ అట్లునమస్కృతులుసేసిన నాలింగనంబులు గావించి నయనారవిందంబుల నానందబాష్పంబులు దొరఁగ నలఁతలేని స్నేహంబులఁ జిత్తంబులు న త్తమిల్ల నేమియుం బలుకకుండిరంత నయ్యశోదాదేవి రామకృష్ణుల నిజాంక పీఠంబున నునిచి యక్కునం గదియం దిగిచి చెక్కులు ముద్దులుగొని శిరంబులు మూర్కొని చిబుకంబులు పుడుకుచుఁ బునఃపునరాలింగనంబులు గావించి పరమానందంబునం బొంచుచు న్నంత.

టీ॥ (అట్లు) నమస్కృతులుచేసినన్=నమస్కారములుచేయఁగా ఆలింగనంబులుగావించి=కౌఁగిలించుకొని. నయనారవిందంబులన్=నేత్రకమలములందు. ఆనందబాష్పంబులు=సంతోషమువలనఁబుట్టిన కన్నీళ్లు. తొరఁగన్=రాలఁగా. అలఁతలేని = లోపములేని. స్నేహంబులన్=చెలుములచేత. చిత్తంబులు = మనసులు. అత్తమిల్లన్ = కందుకొనఁగా–పరవశములుకాఁగా. ఏమియుంబలుకక = ఏమాటయుఁ జెప్పక. (ఉండిరి) అంతన్ = అంతట. (ఆయ్యశోదాదేవి) రామకృష్ణులన్=బలరాముని కృష్ణునిని, నిజాంక పీఠంబునన్=తన యొడి యనెడు పీఁటయందు. ఉనిచి = కూర్చుండఁ బెట్టుకొని. అక్కునన్ = రొమ్మునందు. కదియన్ = చేర. తిగిచి=తీసుకొని. చెక్కులు=చెక్కిళ్లు. ముద్దులుగొని=ముద్దులు పెట్టుకొని, శిరంబులు మూర్కొని=తలలు మూఁచూచి, చిబుకంబులు=గడ్డములు. పుడుకుచున్=పుణికిపుణికిపట్టుచు. పునఃపునరాలింగనంబులు=మరలమరల కౌఁగిలింతలు. కావించి=చేసి. (పరమానందంబునంబొందుచున్నంత)

తా॥ ఆవిధముగా బలరామకృష్ణులు నమస్కారములుచేయఁగా నందయశోదలు వారిని కౌఁగిలించుకొని కన్నులయందుండి యానందబాష్పములు రాలుచుండఁగా కొఱతలేని చెలుములచేత మనసులు పరవశములై యేమితోఁచకయూరకుండిరి, అప్పుడు యశోదాదేవి మాత్రము బలరామకృష్ణులను ఎత్తి ఒడిలోఁగూర్చుండఁ బెట్టుకొని రొమ్మునకొత్తుకొని చెక్కిళ్లుముద్దులుపెట్టితలలుమూఁచూచి గడ్డములు పుణికి పుణికిపట్టి మాటిమాటికి కౌఁగిలించుకొనుచు అత్యంతానందమును బొందియుండెనని తాత్పర్యము.

౧౨౫౯.—చ॥ స్థిరమతితోడ రోహిణియు * దేవకియుం దగ నందగోప సుం
దరిఁ గని కౌఁగిలించుకొని త * త్కృతులెల్లఁ దలఁచి యింతి నీ
వరుఁడును నీవు బంధుజన * వత్సలతన్మును చేయు సత్కృతు
ల్మఱవఁగవచ్చునే తలఁప * మాకిఁక నెన్నటికిం దలోదరీ.

టీ॥ స్థిరమతితోడన్ = చలింపని బుద్ధితో. రోహిణియున్ = రోహిణీదేవియును. దేవకియున్=దేవకీదేవియును. తగన్=తగునట్లు. నందగోపసుందరిన్=గొల్లలరాజైన నందునిభార్యను–యశోదను. కని = చూచి. కౌఁగిలించుకొని = ఆలింగనము చేసికొని. తత్కృతులెల్లన్ = ఆమెచేసిన యుపకారముల నెల్లను. తలంచి=ఎంచి. ఇంతి=ఓయశోదా, నీవరుఁడును=నీపెనిమిటియు. (నీవును) బంధుజనవత్సలతన్=చుట్టఱికపుప్రేమచేత, మును=మునుపు. చేయు సత్కృతులు=చేసినమేలిపనులు. తలఁపన్=విచారింపఁగా, తలోదరీ=ఓయశోదా. (మాకు) ఇఁకనెన్నటికిన్ = ఇఁకనెప్పటికైనను. మఱవఁగవచ్చునే = మఱచిపోవచ్చునా.

తా॥ అప్పుడురోహిణియు దేవకియునందు నిభార్యయైనయశోదను జూచి చలింపని బుద్ధిగలవారగుచు ఆలింగనముచేసికొని సన్మానించి మునుపు ఆమెతమకుచేసిన రామకృష్ణపోషణాదులైనయుపకారములను తలఁచుకొని ఓయశోదా! నీవును నీపెనిమిటియు మాయందు చుట్టఱికపుప్రేమయుంచి మునుపు చేసినమేలులు ఎన్నటికైనను మఱవఁదగినవియగునా కావుగనుక మేము సదామిమ్ము తలఁచుకొనుచుందుమని తా.

౧౨౬౦.—క॥ జననంబందిన మొదలుగ । ఘనమోహముతోడఁ బెంచు * కతమునఁ దమకున్
జననీ జనకులు వీరని । మనములఁ దలపోయ లేరు * మము నీతనయుల్.

టీ॥ జననంబందిన మొదలుగన్ = పుట్టినది మొదలుకొని. ఘనమోహముతోడన్=మిక్కుటమైన మచ్చికతో. పెంచుకతమునన్=పెంచినకారణముచేత. ఈతనయులు = కొడుకులైన యీరామకృష్ణులు. (తమకు) జననీజనకులు=తల్లిదండ్రులు, వీరు అని=ఇట్టివారు అని, మనములన్=మనసులలో. (మము) తలపోయలేరు=తలఁపరు.

తా॥ మీరు పుట్టిననాటనుండి మిక్కిలిమచ్చికతో తమ్ము పెంచుటచేత మాకొమారులయిన రామకృష్ణులు మేముతల్లిదండ్రులము అను వర్తమానమే తెలియక పెరిగిరి అని తాత్పర్యము.

౧౨౬౧—క॥ అంటినప్రేమను వీరి । నంటికి ఱెప్పడ్డమైన * గతిఁ బెంపఁగ మా
కంటె నెనరాటను మీ । యింట న్వసియించి * యుండి రిన్నిదినంబుల్.

టీ॥ అంటినప్రేమన్=కొఱతలేని ప్రేమతో. వీరిన్=ఈకుమారులను. (కంటికిఱెప్ప) అడ్డమైనగతిన్ = అడ్డమయిన విధముగా. పెంపఁగన్=వర్ధిల్లఁజేయఁగాను. మాకంటెన్=మాకంటెను. నెనరాటన్=దయ యెక్కువగుటచేతను. (ఇన్నిదినంబులు) మీయింటన్ = మీయింటిలో. వసియించి యుండిరి = వాసము చేయుచుండిరి.

తా॥ మీరుమిక్కిలిప్రేమతో కంటిఱెప్ప కప్పగానున్నట్టు కనిపెట్టి పెంచఁగా పెఱిగి మీయందు మాకంటె అధికమైన ప్రీతికలిగియుండుటచేత ఇన్నాళ్లదాఁక బలరామకృష్ణులిద్దఱును మీయింట నుండిరని తా.

వ॥ అనియిట్లు ప్రియాలాపంబులువలుకుచుండు నవసరంబున గోపాలసుందరులమందానందకందళిత హృదయలయి హృదయేశ్వరుండైనగోవిందునిఁ జిరకాలసమాగతుండగుటం జేసి యతనిం జూచుతలంపు లుల్లంబుల వెల్లిగొనం జేరి.

టీ॥ (అని) ఇట్లు=ఈవిధముగా. ప్రియాలాపంబులు=ప్రియమలైనమాటలు. పలుకుచుండు నవసరంబునన్ = చెప్పుచుండు సమయమునందు. గోపాలసుందరులు = గోపికాస్త్రీలు. అమందానందకందళితహృదయలై = అధికమయిన సంతోషము మొలకెత్తుచున్న మనసులుగలవారై. హృదయేశ్వరుండు=మనోనాయకుఁడు. అయిన గోవిందునిన్=అయినట్టి కృష్ణమూర్తిని. చిరకాలసమాగతుండు = బహుకాలమునకు వచ్చిన వాఁడు. అగుటంజేసి = అగుటచేత. అతనిన్=ఆకృష్ణుని. (చూచుతలంపులు) ఉల్లంబులన్=మనసులలో. వెల్లిగొనన్=ప్రవాహరూపమునొందఁగా. చేరి=ఆయనను సమీపించి

తా॥ అని యీవిధముగా దేవకీ రోహిణులు యశోదకు ప్రియములు పలుకుచుండఁగా గోపికాస్త్రీలు మిక్కిలిసంతోషమునొందిన మనసులుగలవారగుచు తమకు ప్రియుఁడైన శ్రీకృష్ణుఁడు చాలకాలమునకువచ్చినందున ఆయనను చూడవలెననుతమకము లుహెచ్చఁగా మెల్లమెల్లఁగా ఆయనను చేరవచ్చి యని తాత్పర్యము.

౧౦౬౨.—చ॥ నలినదళాక్షుఁజూచి నయ * నంబులు మోడ్వఁగఁజాల కాత్మలన్
వలచి తదీయ మూర్తి విభ * వంబుఁ దలంచుచుఁ గౌఁగిలించుచున్
బులకలు మేన జాదుకొన * బోటులు చొక్కిరి బ్రహ్మమున్మనం
బులఁగని చొక్కుయోగిజన * మున్పురుడింపఁగ మానవేశ్వరా.

టీ॥ మానవేశ్వరా=రాజా. నలినదళాక్షున్ = తామరరేకులవంటి కన్నులుగల శ్రీకృష్ణుని. (చూచి) నయనంబులు = కన్నులు. మోడ్వఁగఁజాలక=మూయనేరక. ఆత్మలన్=మనసులలో. వలచి=కోరి. తదీయమూర్తివిభవంబున్ = అతనిదైన యాకారసంపత్తిని. (తలంచుచును) కౌఁగలించుచున్ = ఆలింగనము చేసికొనుచును. పులకలు = గగ్గురుపాట్లు. మేనన్ = దేహమునందు. జాదుకొనన్=మొలకలెత్తఁగా. బోటులు=గోపికాస్త్రీలు. బ్రహ్మమున్=పరబ్రహ్మమును. మనంబులన్=మనసులయందు. కని=చూచి. చొక్కు=పరవశత్వమునుపొందునట్టి. యోగిజనమున్ = యోగీశ్వరులను. పురుడింపఁగన్=సరిపోలఁగా. చొక్కిరి = పరవశత్వమునొందిరి.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణమూర్తినిఁజూచి తెఱచినకన్నులను మూయనేరనివారై గోపికాస్త్రీలు తమమనసులందు ఆమూర్తినే ధ్యానించుచు, అట్లు ధ్యానించినమూర్తినే ఆలింగనము చేసికొనుచు, దేహములందు రోమాంచములు నిండుకొనఁగా పరబ్రహ్మస్వరూపమును తమ మనస్సులలో తెలిసికొని పరవశులగునట్టి యోగీశ్వరులవలెనే పరవశలై యుండిరని తాత్పర్యము.

౧౦౬౩.—చ॥ పొలఁతులభావ మాత్మఁగని * ఫుల్లసరోరుహ లోచనుండు వా
రల నపుడే కతంబునకు * రమ్మని తోకొనిపోయి యందున
ర్మిలిఁ బరిరంభణంబు లొన * రించి లసద్దరహాస చంద్రికా
కలిత కపోలుఁడై పలికెఁ * గాంతల భక్తినితాంత చిత్తలన్.

టీ॥ ఫుల్లసరోరుహలోచనుండు = వికసించిన కమలములవలె మనోజ్ఞములయిన కన్నులుగల శ్రీకృష్ణమూర్తి. పొలఁతులభావము=ఆగోపికలయొక్క యభిప్రాయము. ఆత్మన్=తనమనసులో. కని=తెలిసికొని. వారలన్=ఆగోపికలను. అపుడు=ఆసమయమునందు. ఏకతంబునకున్ = రహస్య ప్రదేశమునకు. ( రమ్మని ) తోకొనిపోయి=పిలుచుకొనిపోయి. అందున్=ఆరహస్య ప్రదేశము నందు. అర్మిలిన్=ప్రీతితో. పరిరంభణంబులు=ఆలింగనములు. ఒనరించి=చేసి. లసద్దరహాస చంద్రికాకలిత కపోలుఁడై=ఒప్పిదమయిన చిఱునవ్వనెడు వెన్నెలతోఁగూడిన చెక్కిళ్లు గలవాఁడై—చెక్కిళ్లయందు చిఱునవ్వు వ్యాపింపఁగా ననుట. భక్తినితాంతచిత్తలన్=అత్యంత భక్తితోఁగూడిన మనసులుగల. కాంతలన్ = గోపికలనుగూర్చి. పలికెన్=ఒకమాట చెప్పెను.

తా॥ అప్పుడు శ్రీకృష్ణమూర్తి ఆగోపికాస్త్రీల యభిప్రాయము తెలిసికొన్నవాఁడై వారినొక్క రహస్యప్రదేశమునకు రమ్మని చెప్పి పిలుచుకొనిపోయి అచ్చటప్రీతితో వారికి ఆలింగనసుఖమునుకలుగఁజేసి చిఱునవ్వునవ్వుచు నొకమాటచెప్పెనని తాత్పర్యము.

౧౦౬౪.—చ॥ వనజదళాక్షులార బల * వద్రిపువర్గములం జయింపఁగాఁ
జని తడవయ్యెదీనికి భృ * శంబుగ మీమది నల్గకుండుఁడీ
యనయము దైవమిట్లుగఁ జ * రాచరజాలము నొక్కవేళఁ గూ
ర్చును నొకవేళఁ బాపును మ * రుద్ధత తూల తృణంబులంబలెన్.

టీ॥ వనజదళాక్షులార = తామరరేకుల వంటి కన్నులు గల యోగోపికలారా. బలవద్రిపువర్గములన్=బలవంతులైన పగవారి సమూహములను. జయింపఁగాన్ = గెలుచుటకు. చని=పోయి. తడవయ్యెన్=మరలరాను ఆలస్యమాయెను. దీనికిన్=ఈయాలస్యమునకుఁగాను. మీమదిన్=మీమనసులలో. భృశంబుగన్ = అధికముగా. అల్గకుండుఁడీ=కోపించుకోకుఁడు. అనయము=ఎల్లప్పుడు. దైవము=దేవుఁడు. ఇట్లుగన్=ఈవిధముగా. మరుద్ధత...బలెన్—మరుత్=గాలిచేత. హత = కొట్టఁబడిన. తూలతృణంబులంబలెన్=దూదిలోని నలుసులవలెనే. చరాచరజాలమున్ = చరములును అచరములునయిన ప్రాణిసమూహమును. ఒక్కవేళన్ = ఒకసమయమునందు. కూర్చున్=కూడఁజేయును. ఒకవేళన్=మఱియొకసమయమునందు. పాపున్=ఎడఁబాయఁజేయును.

తా॥ ఓగోపికలారా ! బలవంతులయిన పగవారిని జయింపఁబోయినందున వారిని జయించి వచ్చుటకు తడవాయెను ఇట్లుతడవై

నరదులకు మీరు నాపైకోపించుకోవలదు ఈశ్వరుఁడు లోకములోని చరములును అచరములునైన యెల్లప్రాణులను ఇట్లు ఒకప్పుడు కలగూర్చుచు ఒకప్పుడు ఎడఁబాపుచున్నాఁడు ఈప్రాణులును గాలిచేత దూదిలోనుండి కొంగయు నలుసులవలె ఒకప్పుడు కూడుచు, ఒకప్పుడు ఎడఁబాయుచు నున్నవి యిందులకై మీకువిచారము అక్కఱలేదు అని తాత్పర్యము.

౧౦౬౫.—సీ॥ తరలాక్షులారమ ✻ ద్భక్తి చేతనులకుఁ - దనరు మోక్షానంద ✻ దాయకంబు
జపతపోవ్రతదాన ✻ సత్కర్మముల భక్తి - కలుగంగనేరదు ✻ గానఁ దలఁప
విధిశివ సనకాది ✻ విమలచిత్తంబులఁ - బొడమనిభక్తి మీ ✻ బుద్ధులందు
జనియించె మీపూర్వ ✻ సంచిత సౌభాగ్య - మెట్టిదో యదితుద ✻ ముట్టె నింక

తే॥ నటమటముగాదు మీకునె ✻ న్నటికినైనఁ। గలుగనేరవు నిరయసం ✻ గతములైన
జన్మకర్మము లిటమీఁద ✻ మన్మనీష । సుమహిత ధ్యానలారయో ✻ రమణులార.

టీ॥ తరలాక్షులార=చలించునట్టి కన్నులుగల. సుమహితధ్యానలార = మిక్కిలి యధికమయిన ధ్యాననిష్ఠగల. ఓరమణులార = ఓప్రియురాండ్రారా. మద్భక్తి=నాయందలిభక్తి. చేతనులకుఁ = ప్రాణులకు. తనరు=ఒప్పునట్టి. మోక్ష=దుఃఖరహితమైన. ఆనంద=సంతోషమును. దాయకంబు=ఇచ్చునది. జప...సత్కర్మములఁ—జప=జపములు. తపః=తపస్సులు. వ్రత=నోములు. దాన=ఈవులు అనెడు. సత్కర్మములఁ=మంచికార్యములచేత.(భక్తి) కలుగంగనేరదు=కలుగఁజాలదు. కానఁ=కనుక. తలఁపఁ=విచారింపఁగా. విధిశివసనకాదివిమలచిత్తంబులఁ—విధి = బ్రహ్మ. శివ=శివుఁడు. సనక=సనకుఁడు. ఆది=మొదలుగాఁగల వారియొక్క. విమల=నిర్మలమయిన. చిత్తంబులఁ = మనసులందు. పొడమని = పుట్టని. (భక్తి) మీబుద్ధులందుఁ = మీబుద్ధులలో. జనియించెఁ = పుట్టెను. మీపూర్వసంచిత సౌభాగ్యము=మీయొక్క మునుపటి జన్మములందు కూడిన సుభగత్వము. ఎట్టిదో = ఎటువంటిదో. అది=ఆసుభగత్వము. తుదముట్టెఁ=నెఱవేఱెను. ఇంకఁ=ఇఁకను. అటమటము కాదు=వ్యర్థముకాదు. (మీకు)ఎన్నటికినైనఁ=ఎప్పటికైనను. నిరయసంగతములు=నరకసంబంధముగలవి. ఐనజన్మకర్మములు=అయినట్టి పుట్టుకలును ఆగామి సంచిత ప్రారబ్ధకర్మలును. ఇటమీఁదఁ=ఇంకమీఁద. మన్మనీషఁ=నాయందలి బుద్ధిచేత—నన్ను ధ్యానించుటచేత. కలుగనేరవు=కలుగనే కలుగవు.

తా॥ ఓప్రియురాండ్రారా ! నాయందలిభక్తి ప్రాణులకెల్లను మోక్షమునిచ్చునది, ఆభక్తి జపము తపస్సు వ్రతము దానము మొదలగు సత్కర్మములచేత కలుగునదికాదు, బ్రహ్మ శివుఁడు సనకసనందనాదులు మొదలగువారి నిర్మలమయినమనసులయందుఁగూడఁ గలుగుట అరుదు, అట్టినిర్మలభక్తి మీకుఁ గలిగెను, ఇఁక మీపూర్వపుణ్యము ఎటువంటిదోగాని అదియిప్పుడు నెఱవేఱినదయ్యెను ఇఁకనది వ్యర్థము కానేరదు ఇఁకమీఁదనాయందలి బుద్ధికలిమిచేత మీకు నరకసంబంధముగలజన్మములును కర్మములును గలుగనేరవు అనితా.

౧౦౬౬.—సీ॥ అఖిల భూతములకు ✻ ననయంబు నాదిమ - ధ్యాంత కాంతర్బహి ✻ ర్వ్యాప్తినేన
ఘటపటాదిక భూత ✻ కార్యంబులకును బ్ర - ధాన కారణములై ✻ తనరునట్టి
గగనానిలానల ✻ కతోయంబులను భూత - పంచకంబైక్యతఁ ✻ బడయుఁగాదె
లోకంబులందుఁ బం ✻ చీకరణ వ్యవ - స్థలచేతనట్టి భూ ✻ తములరీతి

తే॥ గగనముఖభూత తత్కార్య ✻ కారణములఁ । దగిలియాధార హేతుభూ ✻ తంబనైన
నాకుఁ బరమన్య మొకఁడునె ✻ న్నంగలేదు । విమలమతులార మాటలు ✻ వేయునేల.

టీ॥ విమలమతులార = కామక్రోధాదులులేని పరిశుద్ధమయినబుద్ధిగల గోపికలారా. అఖిలభూతములకుఁ = ఎల్ల ప్రాణులకును. (అనఁగా, జరాయుజములు అండజములు స్వేదజములు ఉద్భిజ్జములును అయిన నాలుగు విధముల ప్రాణులకును — అందు, జరాయుజములు(మావివలనఁబుట్టినవి.)ఇరువదియొకలక్ష. అండజములు(గ్రుడ్డువలనఁబుట్టినపక్షులు మొదలగునవి) ఇరువదియొకలక్ష. స్వేదజములు (చెమటువలన ఁబుట్టిన దోమలు మొదలగునవి) ఇరువదియొక లక్ష. ఉద్భిజ్జములు(భూమిని ఛేదించుకొనిపుట్టునవియైన వృక్షములు లతలు మొదలగునవి ఇరువదియొకలక్ష. ఇట్టియీయెనుబదినాలుగు లక్షల ప్రాణులకును) అనయంబు =అవశ్యము — తప్పకయనుట. ఆది... వ్యాప్తిఁ—ఆది=మొదలును—ఏప్రాణులనుపుట్టుటకుకారణమైవాని పుట్టుకకు మొదలును. మధ్య=నడుమను—ఎల్లప్రాణులుపుట్టి వర్ధిల్లుటకుకారణమై అవి వర్ధిల్లునప్పుడును. అంతక=కడపటయు—ఆప్రాణులన్నిలయించుటకు కారణమై ఆ లయమునకుపిమ్మటను. అంతః=ఆప్రాణులకులోపలను. బహిః=ఆప్రాణులకువెలుపలను. వ్యాప్తిఁ=వ్యాపించుటకలవాఁడను. ఏన=నేనే. (అయి) లోకంబులందుఁ=భూర్భువాది లోకములయందు. పంచీకరణవ్యవస్థలచేతఁ = అయిదుగాఁ జేయునట్టి భాగనిర్ణయములచేత. (అనఁగా, పృథివ్యప్తేజో వాయు రాకాశము లనెడు పంచ మహాభూతములలో ఒకటొకటిని రెండురెండు భాగములుగా భాగించి అందందు మొదటి భాగమును నిలిపి తక్కిన ప్రతిభూతభాగమును నాలుగు,నాలుగు భాగములుగా విభాగించి అందు ఒక్కొక్క భాగమును గ్రహింపఁగా అది అయిదుగాఁ జేయఁబడిన భాగముగా నేర్పడుచున్నది. అట్టి ప్రతి భాగమును పృథివ్యాదిగా ఒక్కొక్కదాని భాగముతోఁ జేర్చుట పంచీకరణము అనఁబడును . ఇట్టి పంచీకరణ వ్యవస్థలచేతననియర్థము.) ఘట...కార్యంబులకుఁ—ఘట=కుండ. పట=వస్త్రము. ఆదిక=

[illegible] భూతకార్యంబులకుఁ బంచమహాభూతముల వ్యాపారములకు. ప్రధానకారణము లై=ముఖ్యకారణము లై. తనరు నట్టి=ఒప్పునట్టి. గగనా... క్షోణులు—గగన=ఆకాశము. అనిల=వాయువు. అనల=తేజస్సు. (అగ్ని) క=అప్పు. (ఉదకము) క్షోణులు=భూమి. (పృథివి) అను భూతపంచకంబు=అనఁబడిన మహాభూతము లైదును. ఐక్యతన్=ఏకీభావమును—ఒక్కటియగుటను. పడయున్=పొందును. కాదె = కదా. అట్టిభూతములరీతిన్ = అటువంటి యాపంచమహాభూతములవిధమున. గగన... ములన్—గగన=ఆకాశము. ముఖ=మొదలయిన. భూత=పంచమహా భూతములందును. తత్=ఆపంచమహాభూతములయొక్క. కార్య=వ్యాపారము లైన ఘట పటాదులందునూ. కారణములన్=ఆఘటపటాదులకు కారణము లైన మృత్తంత్వాదులయందును. తగిలి=అంటి—చేరియనుట. ఆధారహేతు భూతుంబను = సర్వమునకు ఆధారమును హేతువు నైనవాఁడను. ఐన నాకున్=ఐనట్టినాకంటెను. పరము=మీఁదిదియు—మీఁదైసర్వోత్కృష్టముగా వ్యాపించునదియును. అన్యము=ఇతరమును-నాచేరికలేక వేఱై యుండునదియు. ఒకఁడున్=ఒక్కటియు—ఏదియును. ఎన్నంగన్=విచారింపఁగా. లేదు=కలుగదు. మాటలు వేయునేల = పలుమాటలుచెప్ప నేల—ఎన్ని చెప్పినను ఇప్పుడు చెప్పినయర్థము నే బోధించును కాఁబట్టి ఇఁక నేమి చెప్పిన ప్రయోజనము లేదనుట.

తా॥ ఓగోపికలారా! మీరు కామము క్రోధము మొదలగుదుర్గుణము లేవియు లేని బుద్ధి గలవా రైనందున నేను చెప్పునట్టి యర్థమును గ్రహింపఁగలరుగనుక చెప్పెదవినుఁడు లోకమునందుఁ గానవచ్చెడి జరాయుజములయిన మనుష్యాదులును, అండజము లైనపక్ష్యాదులును, స్వేదజము లైనమశకాదులును, ఉద్భిజ్జము లైన వృక్షలతాదులు నగియిన చరాచరభూతములకులోపలను వెలుపలను వానిపుట్టుకకుమునుపును వెనుకను అవిలయించినకపిమ్మటను వ్యాపించి వర్తించువాఁడను నేనే గాని యితర మేదియుఁ గాదు లోకమునందు పంచీకరణ వ్యవస్థలచేత ఘట పటాదు లైన భూత వ్యాపారములకు ముఖ్య కారణము లయిన ఆకాశము వాయువు తేజస్సు జలము భూమియు ననెడు మహాభూతములయిదును ఏకీభావమును పొందును విచారించి చూడఁగా అట్టి యామహాభూతముల వలెనే అభూతములందును వానికార్యము లైన ఘట పటాదులందును ఆఘటపటాదులకు కారణము లైన మృత్తంత్వాదులందునునుండి వానికి ఆధారమును అవి కలుగుటకు కారణమును అయిన నాకంటెను మించినదియు నాకంటె ఇతరమయినదియు నైన వస్తువు ఎక్కడను లేనేలేదు కనుక ఈవిషయమును మీకు సంగ్రహముగా తెలియపఱచితిని ఇఁక ఏమిచెప్పినను ఇందులో నంతర్భూతమే కాని వేఱైనది లేదుకనుక ఇంతటితో విరమించితినని తాత్పర్యము.

## వి శే షా ర్థ ము.

తా॥ అన్నిటికిని ఆధారభూత మైన నాకు అనఁగా అహమ్మనెడి తెలివి కలిగిన తర్వాతనే సమస్తము కలుగుటకాని అంతకు ముందు ఏదియు లేదుగనుక ఆతెలివికే బ్రహ్మమని పేరు అదియే ప్రపంచరూపముగాను పంచభూతములుగాను పంచతన్మాత్రములుగానుజగత్తునందంతట వ్యాపించి యున్నది కాఁబట్టి బ్రహ్మణోన్యం నకించన పురుషాన్నపరంకించిత్, విశ్వమే వేదంపురుషః అనెడి శ్రుత్యర్థప్రకారము సర్వము నేనే అహమనెడు తెలివియే తప్ప మఱియేదియు లేదని శ్రీకృష్ణపరబ్రహ్మము గోపికలకు ఉపదేశించెనని ఫలితార్థము.

౧౦౭౭—. తే॥ అనినఁ దెలివొంది వారు దే * హాభిమాన | ములు సమస్తంబు విడిచిరో * నలిననాభ
నిఖిల జగదంతరాత్మ మా * నిత చరిత్ర | భక్తజన మందిరాంగణ * పారిజాత.

టీ॥ అనినన్=అనికృష్ణుఁడు చెప్పఁగా. వారు=ఆగోపికలు. తెలివొంది=దివ్యజ్ఞానమును పొందినవా రై. దేహాభిమానములు=నాదేహము నాయిల్లు అనునిట్టి మమకారములను. సమస్తంబు=అన్నిటిని. (విడిచి) నిఖిలజగదంతరాత్మ = ఎల్లజగములలోను వర్తించునట్టిపరమాత్ముఁడవును. మానితచరిత్ర=శ్లాఘింపఁబడిన నడవడిగలవాఁడవును. భక్తజనమందిరాంగణపారిజాత=భక్తు లైనజనులయొక్కయిండ్లముంగిళ్లయందుండుకల్పవృక్ష మైన. ఓనలిననాభ=ఓశ్రీకృష్ణమూర్తీ.

తా॥ అని కృష్ణమూర్తిబోధింపఁగా ఆగోపికలు దివ్యజ్ఞానమును పొందిన వా రై దేహాభిమానము మొదలగు నభిమానము లన్నియు వదలి సర్వ లోకముల యందు వర్తించు నట్టియు శ్లాఘ్య మయిన నడవడిగలిగినట్టియు భక్తజనులగు వారియిండ్ల ముంగిళ్ల యందుండు కల్పవృక్షమువలె కోరినకోరికలనిచ్చువాఁడైనట్టియు ఓశ్రీకృష్ణమూర్తి యని సంబోధించి మీఁద నేమో చెప్పఁబోవుచున్నారని తాత్పర్యము.

## వి శే షా ర్థ ము.

టీ॥ అనినన్=శ్రీకృష్ణమూర్తియనెడు బ్రహ్మవేత్త గోపికలనెడు బ్రహ్మ విద్యాభ్యాసులతో పదునాలుగు లోకములును, ఆలోకములోని నాలుగువిధము లైన జీవసంఘమును, ఆజీవసంఘమునకుఁదగిన నాలుగు విధము లైన ఆహారములును, మఱితక్కినవన్నియు నేనే కాని నాకంటె ఇతరము ఏదియు లేదని నొక్కిచెప్పఁగా నే. వారు=గోపికలనెడి ఆబ్రహ్మ విద్యాభ్యాసులు. తెలివొంది=శ్రు॥ ఏకోదేవస్సర్వభూతేషుగూఢ స్సర్వవ్యాపీ సర్వ భూతాంత రాత్మా । ధర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీచేతో కేవలో నిర్గుణశ్చ॥ ఏకోదేవో బహుధానివిష్టః, ఏకోవశీసర్వ భూతాంతరాత్మా, ఏకంరూపం బహుధా యఃకరోతి, ఏకఏవహిభూతాత్మా భూతేభూతే వ్యవస్థితః । ఏకధా బహుధాచైవదృశ్యతే జలచంద్రవత్ ॥ ఈశ్వరస్సర్వభూతానాంహృద్దేశేర్జునతిష్ఠతి ॥ అను ప్రమాణములనుపట్టి సర్వము పరబ్రహ్మమే కాని స్వేతర మేదియు లేదనెడు దృఢాపరోక్షజ్ఞానమును పొందినవా రై. మ॥ గరిమన్ స్వర్ణ మనేక భూషణము లై కన్పట్టు చందంబునన్ । బరమాత్ముండఖిల ప్రపంచ మయుఁడై భాసిల్లు నట్లౌటచే ॥ అని సీతా రామాంజనేయము. దేహాభిమానములు=శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరా యాసంవిదుజ్జృంభతే యాబ్రహ్మాదిపిపీలికాంతతనుషు ప్రోతాజగత్సాక్షిణీ । సైవాహం నచదృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తిచే చండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ ॥ బ్రహ్మైవాహమిదం జగచ్చసకలం చిన్మాత్రవిస్తారితం సర్వంచైతదవిద్యయా త్రిగుణయా సేశర్ష్యాకల్పితం । ఇత్థంయస్య దృఢామతి స్సుఖతరే నిత్యేపరేనిర్మలే చండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ ॥ యా తిర్య ఙ్నరదేవతాభి రహమి త్యంత స్ఫుటా గృహ్యతే । యద్భాసా హృదయాక్ష దేహ విషయా భాంతి స్వతో చేతనాః । తాంభాస్యైః పిహితార్క మండల నిభాం స్ఫూర్తింసదా

భావయస్యోగినిర్వృతమానసోహి గురురిత్యేషా మనీషామమ ॥ అను ప్రమాణములమపట్టి శరీరేంద్రియాదులు నేను కాను వీనికి విలక్షణ సాక్షిచైతన్యకన్యము లేక వెలుఁగునట్టి పరబ్రహ్మము తాననెడు దృఢ ప్రజ్ఞగలవారై. క॥ ప్రజ్ఞయ ప్రతిష్ఠ లాభము । ప్రజ్ఞయ నాశంబు నాఁగఁ బ్రజ్ఞయచూవే । ప్రజ్ఞయ కైవల్యంబును బ్రజ్ఞాసాధ్యములు గానిపనులుంగలవే.

౧౦౬౮.—తే॥ ఘోర సంసార సాగరో * త్తారకంబు । ధీయుత జ్ఞాన యోగహృ * ద్ధ్యేయ వస్తు
వగుచుఁజెలువొందు నీచర * ణాంబుజాత । యుగళమునుమామనంబులఁ * దగులనీవె.

టీ॥ ఘోర ... త్తారకంబును—ఘోర = భయంకర మయిన. సంసార = సంసారమనెడు, సాగర = సముద్రమును. ఉత్తారకంబును = దాఁటించునదియు. ధీయుత ... వస్తువు—ధీ = అపరోక్షజ్ఞానముతోడ, యుత = కూడిన శుకవామదేవాదిబ్రహ్మవేత్తలయొక్క. జ్ఞానయోగ = నిర్వికల్పనిష్ఠతోఁగూడిన. హృత్ = అంతరంగములయందు, ధ్యేయ = ధ్యానింపఁదగిన. వస్తువు = అపురూపపువస్తువును, (అగుచును) చెలువొందు = అందగించునట్టి — ఒప్పునట్టి. నీచరణాంబుజాత యుగళమును = నీపాదకమలము జంటను. మామనంబులన్ = మామనసుల యందు. తగులనీవె - అంటనిమ్ము.

తా॥ భయంకరమయినసంసారమనెడుసముద్రమును దాఁటించునదియు, అపరోక్షజ్ఞానముతోఁగూడిన శుకవామదేవాదిబ్రహ్మవేత్తల అంతఃకరణముల యందు జ్ఞానయోగముచేత ధ్యానించుట కనువైన దియునైన నీపాదకమలద్వయమును మామనసులందు పొందియుండు నట్టుగా ననుగ్రహింపుము అనితాత్పర్యము.

౧౦౬౯.—క॥ అనివేఁడినఁగృష్ణుఁడుముని । వినుతుఁడు కరుణించివల్ల * వీజనములుగో
రినయట్లయిచ్చెఁగరుణా । వననిధి సద్భక్తలోక * వత్సలుఁ డంతన్.

టీ॥ అనివేఁడినన్ = అనితన్నుఁబ్రార్థింపఁగా, మునివినుతుఁడు = మునులచేఁగొనియాడఁబడువాఁడును, కరుణావననిధి = దయాసముద్రుఁడును, సద్భక్తలోకవత్సలుఁడు = మంచిసేవకుల సమూహమునందు ప్రేమగలవాఁడునైన. (కృష్ణుఁడు) కరుణించి = దయచేసి. వల్లవీజనములు = గోపికాస్త్రీలు. కోరినయట్లు = కోరినవిధముగానే. ఇచ్చెన్ = వరము నిచ్చెను. అంతన్ = అనంతరము నందు.

తా॥ అనిగోపికాస్త్రీలు తన్నువేఁడుకొనఁగా మునులచేతఁగొనియాడఁబడువాఁడును దయాసముద్రుఁడును అనన్యభక్తిగల సేవకుల సమూహమునందు ప్రేమ గలవాఁడునైన శ్రీకృష్ణమూర్తి వారు కోరినవరమునిచ్చెననితాత్పర్యము.

౧౦౭౦.—చ॥ ధర్మతనూభవుంగని ప * దంబులకున్నతుఁడై సపర్యలన్
నిర్మల భక్తిమై నడపి * నీవును దమ్ములు బంధుకోటి స
త్కర్మచరిత్రులై తగుసు * ఖంబులనొప్పుచు నున్నవారెనా
నర్మిలిఁబాండవాగ్రజుఁడు * నమ్మధుసూదనుతోడ నిట్లనున్.

టీ॥ ధర్మతనూభవున్ = ధర్మరాజును. కని = చూచి. పదంబులకున్ = ఆయన పాదములకు. నతుఁడై = నమస్కారము చేసినవాఁడై. సపర్యలన్ = పూజలను. నిర్మలభక్తిమైన్ = కపటములేని భక్తితో. నడపి = చేసి. (నీవును) తమ్ములు = నీతమ్ములును, బంధుకోటి = నీచుట్టములసమూదాయమును, సత్కర్మచరిత్రులై = మంచిపనులతోఁడినడవడికగలవారై. తగుసుఖంబులన్ = తగిన సౌఖ్యములతో. ఒప్పుచునున్నవారె = ఒప్పుచునున్నారా. నాన్ = అనఁగా. అర్మిలిన్ = ప్రీతితో. పాండవాగ్రజుఁడును = ధర్మరాజును. అమ్మధుసూదనుతోడన్ = ఆకృష్ణమూర్తితో. ఇట్లనున్ = ఇట్లుపలికెను.

తా॥ అంతటకృష్ణుఁడు ధర్మరాజును జూచి ఆయన పాదకమలములకు నమస్కారములుచేసి స్వచ్ఛమయిన భక్తితో పూజలు చేసి బావా నీతమ్ములు చుట్టములును నీవును మంచికార్యములనునడపుచు సుఖముగ నున్నారా? అని యడుగఁగా ధర్మరాజు కృష్ణమూర్తినిఁ జూచియిట్లు పలికెనని తాత్పర్యము.

౧౦౭౧.—క॥ సరసిజనాభ భవత్పద । సరసీరుహ మాశ్రయించు * జనులతి సౌఖ్య
స్ఫురణం బాలుపారుచుభువిఁ । జరియింపరె భక్తపారి * జాతమురారీ.

టీ॥ సరసిజనాభ = కమలముబొడ్డునందుఁగలవాఁడవును, భక్తపారిజాత = భక్తులపాలిటికి కల్పవృక్షమవును, మురారీ = మురాసురునికిశత్రువునైన యోశ్రీకృష్ణా. భవత్పదసరసీరుహము = నీపాదకమలమును. ఆశ్రయించుజనులు = ఆశ్రయించునట్టిజనులు. అతిసౌఖ్యస్ఫురణన్ = అధికమైనసౌఖ్యముయొక్కప్రకాశముచేత, పాలుపారుచున్ = ఒప్పుచు. భువిన్ = భూలోకమునందు, చరియింపరె = వర్తింపరా.

తా॥ భక్తులపాలిటికి కల్పవృక్షమై మురాసురునికి శత్రువై నాభియందు తామరగలిగివర్తించునట్టి యోకృష్ణమూర్తీ! నీపాదకమలములను ఆశ్రయించినమానవులు మిక్కుటమయినసౌఖ్యములతోనొప్పుచు భూలోకమునందు వర్తింపరావర్తింతురు గనుక మాకు ఎల్లవిధముల చేతనుసౌఖ్యమేకలిగియున్నదని తాత్పర్యము.

వ॥ అదియునుంగాక.

౧౦౭౨.—సీ॥ సుమహితస్వప్న సు * షుప్తిజాగ్రతలను - మూడవస్థలఁబాసి * వాఁడిమిఁగిలి
వెలినుండు లోనుండు * విశ్వమైయుందువు - విశ్వంబు నీయందు * వెలుఁగుచుండు
భవదీయమహిమచేఁ * బాటిల్లుభువనంబు - లుదయించునొకవేళ * నుడిగిమడఁగు
సంచితాఖండ స * జ్ఞానివైయొప్పుచు - నవహితయోగ మా * యాశ,ఁదనగి

తే॥ దురిత దూరులు నిత్యము * క్తులకుఁజెంద । నలవియై పెంపు దీపింతు * వంబుజాక్ష
ఘనకృపాకర నిఖిల వి * కార దూర । నీకు మ్రొక్కెద సర్వ లో * కైకనాథ.

టీ॥ ఘనకృపాకర=అధికమయినదయకు నిధియైనవాఁడవును. నిఖిల వికారదూర=ఆఁకలి దప్పులు శోక మోహములు జరామరణములనెడు వికారములు లేనివాఁడవును. సర్వలోకైకనాథ=అధిదేవతలు ఇంద్రియములు ఇంద్రియవిషయములును అనెడి త్రిలోకములకునొక్కఁడవైన ప్రభుఁడవునైన. అంబుజాక్ష=సకలజీవులహృదయకమలములయందు వ్యాపించియున్నకృష్ణా. సుమహిత...జాగ్రతలు—సుమహిత = అజ్ఞానులకు మిక్కిలి రమణీయములుగఁ దోఁచునట్టి. స్వప్న=కల. సుషుప్తి=నిద్ర. జాగ్రతలు=మేలుకొని యుండుట. అనుమూఁడవస్థలన్=అనునట్టిమూఁడు అవస్థలను. పాసి=వదలి—అవస్థాత్రయమునుమీఱి అనుట. వాఁడి=ప్రతాపము. మిగిలి=అతిశయించి. వెలిన్ = ప్రపంచమునకు వెలుపలను. ఉందు = ఉందువు. లోనుందువు=ప్రపంచమునకులోపలనుందువు. విశ్వమైయుందువు=ప్రపంచమే అయియుందువు. శ్లో॥ అనుప్రవేశా దావేశా త్తస్మా ద్విశ్వ ఇతీరితః ॥ అని. విశ్వంబు=ప్రపంచము. నీయందున్=నీలోపల. (వెలుఁగుచుండును) భవదీయమహిమచేన్=నీదైనప్రభావముచేత. పాటిల్లు=కలుగునట్టి. భువనంబులు=లోకములు. ఒకవేళన్=ఒకసమయమునందు. ఉదయించున్=నీయందేపుట్టును. ఒకవేళన్=మఱియొకసమయమునందు. ఉడిగి=నశించి. మడఁగున్=కానరాకపోవును—నీయందేలయించుననుట. సంచితా...వై—సంచిత=కూర్పఁబడిన. అఖండ=తక్కువగాని. సజ్జ్ఞానివై=త్రికాలములయందునునశింపనిజ్ఞానముగలవాఁడవై. (ఒప్పుచును) అవ...త్మన్—అవహిత=ఎచ్చరికగలదైన. యోగమాయాత్మన్=యోగమాయకలిమిని. తనరి=ఒప్పి. దురితదూరులు = పాపమునకుదూరమైనవారగు. నిత్యముక్తులకున్=శాశ్వతమైనమోక్షమును పొందనిచ్చగలవారికి. చెందన్=పొందను. అలవియై=సాధ్యమై. పెంపు=గౌరవమును. దీపింతువు=ప్రకాశింపఁ జేయుదువు. నీకున్=ఇటువంటినీకు. (మ్రొక్కెదను)

తా॥ మేరమీరినదయగలిగిఆఁకలిదప్పి మొదలైనవికారములు లేక అన్నిలోకములకునొక్కఁడవైన ప్రభువవై యొప్పునట్టి యోస్వామీ! మూఢులకు మనోహరము లయిన జాగ్రత్త స్వప్నము నిద్ర అనుమూఁడవస్థలను పొందక మిక్కుటమైన ప్రతాపముతో ప్రపంచమునకులోపలను వెలుపలను వెలుఁగొందుచు నీలోపలసర్వ ప్రపంచమునణఁగి వెలుఁగొందఁగా నీప్రభావముచేత నీయందే కలుగుచు నశించుచునుండునట్టియీలోకములనునీవేకలిగించుచు నడఁగించుచు చిరకాలాభ్యాసవశమున పొందఁదగినమేలైన అపరోక్షజ్ఞానముగలవాఁడవగుచు యోగమాయతోఁగూడుకొన్నవాఁడవై యొప్పుచును పాపరహితులై శాశ్వతమోక్షమునుపొందువారికిపొందఁదగినవాఁడవై నీమహిమను ప్రకాశింపఁ జేయుచుండునట్టి నీకు మ్రొక్కెదననితా.

౧౦౯౧.—క॥ అని వినుతించిన నచ్చటి । జనపాలక బంధు మిత్ర * సకల జనంబుల్
వినియనురాగిల్లిరి నె । మ్మనముల నానంద జలధి * మగ్నులు నగుచున్.

టీ॥ (అని) వినుతించినన్=పొగడఁగా. అచ్చటి...జనంబులు—అచ్చటి=అక్కడనుండునట్టి. జనపాలక=రాజులును. బంధు=చుట్టములును. మిత్ర=చెలికాండ్రునునైన. సకలజనంబులు=ఎల్లజనులును. (విని) నెమ్మనములన్ = నిండుమనసులందు. ఆనందజలధిమగ్నులు=సంతోషసముద్రమునందుమునిఁగినవారు. (అగుచును అనురాగిల్లిరి)

తా॥ అని యీవిధముగా ధర్మరాజు స్తోత్రము చేయఁగానే అక్కడనున్న రాజులును చుట్టములు స్నేహితులునైన యెల్ల జనులును మిక్కిలిసంతోషముతో మెచ్చుకొనిరి అని తాత్పర్యము.

౧౦౯౨.—తే॥ అట్టియొప్పగువేళ నె * య్యంబు మెఱసి । యొక్కచోటను సంతోష * యుక్తలగుచు
దానవాంతకుసతులును * ద్రౌపదియును । గూడి తమలోన ముచ్చట * లాడుచుండి.

టీ॥ అట్టి యొప్పగు వేళన్ = ఒప్పిదమయిన యట్టివేళయందు. నెయ్యంబు=స్నేహము. మెఱసి=ప్రకాశింపఁజేసి. ఒక్కచోటను=ఒకతావున. సంతోషయుక్తలు=సంతోషముతోఁగూడుకొన్నవారు. (అగుచును) దానవాంతకుసతులును=కృష్ణునిభార్యలును. (ద్రౌపదియును) కూడి=కూడుకొని. తమలోనన్=తమలోఁదాము. ముచ్చటలాడుచున్=వినోదముగామాటలాడుచును. ఉండి=ఉన్నవారయి.

తా॥ అటువంటియొప్పిదమయిన కాలమునందుమిక్కిలిచెలిమిని కనఁబఱచుచు కృష్ణుని భార్యలును ద్రౌపదియును చాల సంతోషముతో నొక్కచోటఁ గూడుకొని వినోదముగా మాటలాడుచుండియని తాత్పర్యము.

వ॥ అట్టియెడఁ గృష్ణకథా విశేషంబులుపరితోషంబున నుగ్గడించుచుఁ బ్రసంగవశంబున రుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణభార్యలంగనుంగొనిపాంచాలియిట్లనియె, మిమ్ముసమ్మతితోఁ బుండరీకాక్షుండు వివాహంబులుచేసికొనిన తెఱంగులుతిరంబుగవినిపింపుఁడనిన వారుదమపరిణయంబుల తెఱంగులు మున్ను నేనీకుంజెప్పినవిధంబున వినిపించిరందు సవిస్తరంబుగాఁదెలియఁబలుకనీమద్రరాజకన్యకావృత్తాంతం బామానిని పాంచాలికిం జెప్పినవిధంబు వినుమని శుకుండు పరీక్షిన్నరేంద్రునకిట్లనియె.

టీ॥ అట్టియెడన్ = ఆమాటలాడుచుండునట్టిసమయమునందు. కృష్ణకథావిశేషంబులు=కృష్ణునియొక్కవిశేషించినవైనకథలను. పరితోషంబునన్=సంతోషముతో. ఉగ్గడించుచున్=చెప్పుచు. ప్రసంగవశంబునన్=ప్రస్తావవశముచేత. రుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణ

[illegible] = రుక్మిణీదేవి మొదలుగాఁగల శ్రీకృష్ణుని పెండ్లాలను. [illegible] = చూచి. పాంచాలి = ద్రౌపది. (ఇట్లనియెను మిమ్మును) సమ్మతితోన్ = ప్రీతితో. పుండరీకాక్షుండు = శ్రీకృష్ణుఁడు. వివాహంబులుచేసికొనిన తెఱంగులు = పెండ్లాడినవిధములు. తిరంబుగన్ = స్థిరముగా — విశదముగా. వినిపింపుఁడు = తెలియఁ జేయుఁడు. అనినన్ = అనఁగా. వారు = ఆకృష్ణభార్యలు. తమపరిణయంబుల తెఱంగులు = తమ పెండ్లిండ్లరీతులు. మున్ను = మునుపు. నేన్ = నేను. నీకున్ = నీతో. చెప్పినవిధంబునన్ = చెప్పినరీతిని. వినిపించిరి = చెప్పిరి. అందున్ = ఆ పెండ్లిండ్లకథలలో. సవిస్తరంబుగాన్ = విశదముగా. తెలియఁబలుకని = తెలియఁజెప్పని. మద్రరాజ కన్యకా వృత్తాంతంబు = మద్రదేశపురాజుకూఁతురైనలక్షణయొక్క పెండ్లివర్తమానము. ఆమానిని = ఆలక్షణ. పాంచాలికిన్ = ద్రౌపదితో. చెప్పినవిధంబు = చెప్పినట్టిరీతి. (వినుము అని) శుకుండు = శుకమహర్షి. పరీక్షిన్నరేంద్రునకున్ = పరీక్షిన్మహారాజునకు. ఇట్లనియెన్ = ఇట్లు చెప్పెను.

తా॥ అట్లు ముచ్చటలాడుచుండునపుడు కృష్ణునివిశేషకథలను సంతోషముగాఁజెప్పుకొనుచుండి, ప్రస్తావవశమున ద్రౌపదిరుక్మిణి మొదలుగాఁగల శ్రీకృష్ణుని భార్యలనుజూచి మీరు మిమ్మును శ్రీకృష్ణమూర్తి పెండ్లాడినవృత్తాంతముఁనునాకుఁజెప్పుఁడు అనియడుగఁగా వారుక్రమముగా తమతమ పెండ్లి వృత్తాంతములు ముందు నీకు నేను జెప్పినవిధమునవిశదముగాఁజెప్పిరి అందుముందునాచేతవిశదముగాఁ జెప్పఁబడనిలక్షణవివాహకథను ఆమె ద్రౌపదితోఁ జెప్పనచొప్పన నీకునేనిప్పుడు చెప్పెదను వినుమని శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో ఇట్లుచెప్పనారంభించెను అని తాత్పర్యము.

(✲) లక్షణయను శ్రీకృష్ణుని యష్టమభార్య ద్రౌపదికిఁ దనవివాహవృత్తాంతంబుఁ దెల్పుట. (✲)



ద్రౌపది. లక్షణ.

౧౦౯౪.—సీ॥ పాంచాలితో మద్ర ✲ పతిసుత యిట్లను
సంగీత విద్యా వి ✲ శారదుండు
నారదు చేతి వీ ✲ ణాస్వన కలితమై
నట్టి గోవింద క ✲ థామృతంబు
దవిలి యేఁ గ్రోలి చి ✲ త్తముఁదన్మయత్వంబు
నొంది మోదించుచు ✲ నుండు నంత
దుహితృవత్సలుఁడు మ ✲ ద్గురుఁడు దానదివిని
సదుపాయమొక్కటి ✲ మదిఁదలంచి

తే॥ చదల నెబ్భంగినైన గో ✲ చరముగాక । వారిమధ్యములో నభి ✲ వ్యాప్తిదోఁచుఁ
మత్స్యయంత్రంబుఁ గల్పించి ✲ మనుజులెంత । వారికైననుదివ్వ మో ✲ వంగరాని.

టీ॥ పాంచాలితోన్ = ద్రౌపదితో. మద్రపతిసుత = మద్రదేశపురాజుకూఁతురయిన లక్షణ. ఇట్లనున్ = ఇట్లు చెప్పెను. సంగీత విద్యా విశారదుండు = సంగీతవిద్యయందు నేర్పుగలవాఁడైన. నారదుచేతివీణాస్వనకలితము = నారదమహాముని చేతనుండుమహతియను వీణయొక్క ధ్వనితోఁగూడినది. (ఐనట్టి) గోవిందకథామృతంబు — గోవింద = చతుర్దశేంద్రియవిషయములను సాక్షియై యెఱుఁగుచున్న కృష్ణపరబ్రహ్మము యొక్క. కథామృతంబు = కథయనెడియమృతము. తవిలి = ఆసక్తిగలదాననై. ఏన్ = నేను. క్రోలి = త్రాగి— అమృతమువలె ఇంపైన శ్రీకృష్ణునికథనువినియనుట. చిత్తము = మనస్సు. తన్మయత్వంబు = దానివికారముగలదియగుటను. ఒంది = పొంది. మోదించుచున్ = సంతోషించుచు. ఉండునంతన్ = ఉండునప్పుడు. దుహితృవత్సలుఁడు = కూఁతురియందుప్రేమగలవాఁడైన. మద్గురుఁడు = మాతండ్రి. (తాను) అదివిని = అవృత్తాంతమువిని. సదుపాయమొక్కటి = ఒకమంచియుపాయమును. మదిన్ = మనసునందు. తలంచి = యోచించి. చదలన్ = ఆకాశమునందు. ఎబ్భంగినైనన్ = ఏవిధముచేతనైనను. గోచరముగాక = కానరాక. వారిమధ్యములోన్ = నీటినడుమ. అభివ్యాప్తిన్ = ప్రతిఫలించుటచేత. తోఁచుమత్స్యయంత్రంబున్ = కానవచ్చునట్టి యంత్రమత్స్యమును. కల్పించి = కలుగఁజేసి. మనుజులు = మనుష్యులు. ఎంతవారికైనను = ఎంతగొప్పవారికైనను. తివ్వన్ = ఈవలికితీయుటకును. మోవంగన్ = మోచుటకును. రాని = శక్యముగాని.

తా॥ ద్రౌపదితో లక్షణ యీవిధముగాఁ జెప్పనారంభించెను సంగీతవిద్యయందునేర్పరియైన నారదునివీణవాయించుటనువిని అందు వినఁబడునట్టియమృతతుల్యమయిన శ్రీకృష్ణమూర్తి కథయందు ఆసక్తురాలనైన నేను అదియే జ్ఞాపకముగా వర్తించుచుండఁగా విద్వాంసుడైన నాయందు మిక్కిలి ప్రీతిగల మాతండ్రి ఆవృత్తాంతమును విని ఆకృష్ణుఁడు నన్నుపెండ్లాడుటకుఁ దగిన మంచి యుపాయ మొకటి మనసులో యోచించి నిశ్చయించుకొని ఏవిధముచేతను ఎవరికిని కానరాకుండునట్లు జలమునందు నీడయై కనఁబడు నట్లును ఆకాశమునందు ఒకయంత్రమత్స్యమును కలుగఁజేసి ఎంత బలవంతులకైనను ఎత్తను పట్టను శక్యముగాని ధనుస్సును అనితాత్పర్యము.

౧౦౯౫.—తే॥ ధనువుఁ బవిచండనిష్ఠురా ✲ స్త్రంబు నచట । నంచితంబుగ గంధ పు ✲ ష్పాక్షతములఁ
బూజగావించి యునిచి యే ✲ పురుషుఁడేని । నిద్ధబలమున నీచాప ✲ మెక్కువెట్టి.

టీ॥ ధనువుక్=వింటిని. పవిఘంధనిష్ఠురాస్త్రంబుక్ = వజ్రాయుధమువలె భయంకరమయినదియు క్రూరమయినదియునైనబాణమును. అంచితంబుగక్=ఒప్పిదముగా. గంధపుష్పాక్షతములక్=పరిమళయుక్తములయిన పువ్వులచేతను అక్షతలచేతను. పూజగానించి=పూజచేసి. అచటక్=అక్కడ. ఉనిచి=పెట్టి, ఏపురుషుండేనిక్=ఏమనుష్యుండైనను.ఇద్ధబలమునక్=శ్లాఘ్యమైన బలముచేత. ఈచాపము = ఈవింటిని. ఎక్కుపెట్టి = అల్లెత్రాడెక్కించి.

తా॥ ఎంతబలవంతులకైనను ఎత్తను పట్టను శక్యముగాని వింటిని వజ్రాయుధమువలె భయంకరమును క్రూరమునైన బాణమును ఒప్పిదముగా పువ్వులచేతను అక్షింతల చేతను అర్చించి అచ్చట నుంచి యేమానవుండైననుసరే శ్లాఘ్యమైన తనబలముచేత ఈవింటి నెక్కుపెట్టి యనితాత్పర్యము.

౧౦౯౫.—క॥ ఈసాయకంబు నారిం । బోసి వెసన్మత్స్యయంత్ర * ముక్ ధరంగూలక్
నేసిన శౌర్యధురీణుండు । నాసుత వరియించునని జ * నంబులు వినంగక్.

టీ॥ ఈసాయకంబుక్ = ఈబాణమును. నారిక్=అల్లెత్రాటియందు. పోసి = కూర్చి. వెసక్=వడితో. (మత్స్యయంత్రమును) ధరక్=భూమియందు. కూలక్=పడునట్లు. ఏసినశౌర్యధురీణుండు=ప్రయోగించి శూరత్వభారమును వహించినవాడు — ప్రయోగించిన శూరుండు. నాసుతక్=నాకొమార్తను. వరియించుక్=కోరును—పెండ్లాడును. (అని) జనంబులువినంగక్=ప్రజలందఱువినునట్టుగా.

తా॥ ఈబాణమునుఅల్లెత్రాటియందుంగూర్చిఆమత్స్యయంత్రము భూమియందుం బడునట్టుగా ప్రయోగించునట్టి శూరుండు ఎవండో వాండు నాకొమార్తను పెండ్లాడందగిన వాండు అని యెల్ల జనులు వినునట్టుగా చాటించెనని తాత్పర్యము.

౧౦౯౬.—క॥ చాటించిన నవ్వార్తకుం । బాటించిన సంభ్రమముల * బాణాసన మౌ
ర్వీటంకార మహారవ । పాటితశాత్రవులు బాహు * బల సామగ్రుల్.

టీ॥ చాటించినక్ = చాటపెట్టి ప్రసిద్ధము చేయంగా. అవ్వార్తకుక్=అవృత్తాంతమునకు. పాటించినసంభ్రమములక్=ఆదరించిన సంభ్రమములతో—త్వరగలవారై. బాణాసన...శాత్రవులు—బాణాసన=విండ్లయొక్క. మౌర్వీ=అల్లెత్రాటియొక్క. టంకార=టం అనునట్టి. మహారవ=గొప్పధ్వనిచేత. పాటిత=పడంగొట్టం బడిన. శాత్రవులు=పగవారు గలవారు. బాహుబల సామగ్రులు=భుజబల మనెడుసామగ్రిగలవారు.

తా॥ చాటించిన యావృత్తాంతమును విని తమవిండ్ల అల్లెత్రాళ్ల చప్పుళ్ల చేతనే శత్రువులను బడంగొట్టునట్టి భుజబల సామగ్రి గల రాజు లనేకులు త్వరగలవారై యని తాత్పర్యము.

౧౦౯౭.—క॥ సుందరతనులు దదుత్సవ । సందర్శనకుతుకు లమిత * సైన్యులుభూభృ
న్నందనులేతెంచిరి జన । నందితయశులగుచు మద్ర * నగరంబునకుక్.

టీ॥ సుందరతనులు=అందమైన దేహము గలవారును. తదు...కులు—తదుత్సవ=ఆవేడుకను. సందర్శన=చూచుట యందలి. కుతుకులు=కుతూహలముగలవారును. అమితసైన్యులు=మితిలేని సేన గలవారునైన.భూభృన్నందనులు=రాజకుమారులు. జననందితయశులు=జనులచేతకొనియాడంబడినకీర్తిగలవారు.(అగుచును)మద్రనగరంబునకుక్=మద్రరాజపట్టణమునకు. ఏతెంచిరి=రాజులందఱునువచ్చిరి

తా॥ చక్కందనముగలయాకారములును, ఆమత్స్యయంత్రము వేయునట్టి వేడుకను చూచుటయందు కుతూహలమును, మితిలేనిసేనలును గలవారై యెల్ల జనులచేతను కొనియాడం బడునట్టి కీర్తిగల రాజకుమారులు మద్రరాజ పట్టణమునకు వచ్చిరని తాత్పర్యము.

౧౦౯౮.—క॥ చనుదెంచిన వారికి మ । జ్జనకుండు వివిధార్చనములు * సమ్మతింగావిం
చిన నాబాహు బలాఢ్యులు । ధనువుం జేరంగనరిగి * ధైర్యస్ఫూర్తిక్.

టీ॥ చనుదెంచినవారికిక్=అట్లువచ్చినవారికి. మజ్జనకుండు=మాతండ్రి. వివిధార్చనములు=నానావిధములైనపూజలు. సమ్మతిక్=ఇష్టముతో. కావించినక్=చేయంగా. ఆబాహు బలాఢ్యులు=భుజబలముగలయారాజకుమారులు. ధనువుక్=వింటిని. చేరంగనరిగి=దగ్గఱంబోయి. ధైర్యస్ఫూర్తిక్=ధైర్యముయొక్క ప్రకాశముతో.

తా॥ అట్లువచ్చిన యారాజకుమారులకు అంతఱకునుమాతండ్రి నానావిధములయినమర్యాదలుచేయంగా వారును ధనుస్సుదగ్గఱకుం బోయి ధైర్యముతో ననితాత్పర్యము.

౧౦౯౯.—వ॥ డగ్గఱి యద్ధనువుం గనుంగొని.

టీ॥ డగ్గఱి = మిక్కిలిసమీపించి. అద్ధనువుక్ = ఆధనుస్సును. కనుంగొని=చూచి.

తా॥ మిక్కిలి సమీపించిన వారై యా ధనుస్సును జూచి యని తాత్పర్యము.

౧౧౦౦.—ఉ॥ కొందఱు పూనలేక చనం * గొందఱు పూని కదల్పలేక పోం
గొందఱొకింత యెత్త నొక * కొందఱు మోపిడలేక దక్కంగాం
గొందఱొకింతయెక్కిడుచుం * గోరిన్నపాలకులిట్లుసిగ్గునుం
జెంది తలంగి పోవుచును * జీ యిట కేగుట నీతి తప్పనక్.

టీ॥ కొందఱు = కొంతమంది. పూనలేక = ప్రయత్నపడలేక. తరలక = పోఁగాను. కొందఱు = కొంతమంది. పూని = ప్రయత్నపడి. కదల్పలేక = కదలింపలేక. పోక = పోఁగాను. (కొందఱు) ఒకింత = కొంచెము. ఎత్తక = ఎత్తగాను. ఒకకొందఱు = మఱికొందఱు. మోపిడలేక = ఎక్కుపెట్టలేక. తక్కఁగాక = వెనుదీయఁగాను. (కొందఱు) ఒకింత = కొంచెము. ఎక్కిడుచుఁ = ఎక్కుపెట్టుచును. నృపాంకులు = రాజులు. కోరి = పెండ్లినపేక్షించి. ఇట్లు = ఈవిధముగా. సిగ్గునం బెండి = సిగ్గుపడి. తలంగిపోవుచును = తొలఁగిపోవుచును. (చీ) ఇటకుఁ = ఇక్కడికి. ఏగుట = పోవుట — వ్యతిరేకలక్షణచే వచ్చుటయనియర్థము. నీతితప్పు = అక్రమము. అనక = అనఁగా.

తా॥ కొందఱు వింటిని ఎత్తుటకు ప్రయత్న పడకయు, కొందఱు ప్రయత్నపడి కదలింపలేకయు, కొందఱు కొంచెము ఎత్తియు, మఱి కొందఱు ఎత్తి యెక్కుపెట్టలేకయు, కొందఱు ఎక్కుపెట్టి బాణము సంధింప లేకయు, ఈవిధముగా వచ్చిన రాజకుమారు లందఱు చీ ఇక్కడికి వచ్చుటతప్పు అని అనుకొనుచు సిగ్గుపడిపోఁగానని తా.

౧౧౦౧.—క॥ భీముఁడు రాధేయుఁడు ను । ద్దామగతి న్నెక్కుద్రోచి ✱ తగ నమ్మీనం
బేమఱక తిరుగుచుంటయుఁ । దా మేమియు నెఱుఁగలేక ✱ తలఁగిన పిదపన్.

టీ॥ భీముఁడు = భీమసేనుఁడును. రాధేయుఁడును = కర్ణుఁడును. ఉద్దామగతిన్ = అడ్డములేనిరీతితో. తగన్ = తగునట్లు. ఎక్కుద్రోచి = విల్లెక్కుపెట్టి. అమ్మీనంబు = ఆయంత్ర మత్స్యము. ఏమఱక = తప్పక — ఎడతెగక. తిరుగుచుంటయున్ = తిరుగుచునుండఁగా. (తాము) ఏమియున్ = ఏయుపాయమును. ఎఱుఁగలేక = తెలిసికొనజాలక. తలఁగిన పిదపన్ = రాజులందఱును తొలఁగిన పిమ్మట.

తా॥ అప్పుడు భీమసేనుఁడును కర్ణుఁడును వచ్చి అడ్డములేక తగునట్లువిల్లెక్కుపెట్టి ఆయంత్రమత్స్యము ఎడతెగక తిరుగుచుండుటనుజూచి దానిని పడనేయనుపాయములోఁచక వెనుకకు పోయిరి ఆటుపిమ్మటనని తాత్పర్యము.

౧౧౦౨.—క॥ అమరేంద్రతనయుఁడమ్మ । త్స్యముఁ నేయునుపాయ మెఱిఁగి ✱ తగ నేసియు మీ
నముఁ ద్రుంపలేక సిగ్గున । విముఖుండై చనియె నంత ✱ వికలుం డగుచున్.

టీ॥ అమరేంద్రతనయుఁడు = అర్జునుఁడు. అమ్మత్స్యము నేయనుపాయము = ఆయంత్రమత్స్యమును పడనేయుటకుఁదగిన యుపాయమును. ఎఱిఁగి = తెలిసి. ఏసియున్ = బాణమునుప్రయోగించియు. మీనమున్ = ఆమత్స్యమును. త్రుంపలేక = తెగనేయలేక. అంతన్ = అంతట. సిగ్గునన్ = సిగ్గుచేత. వికలుండగుచున్ = అవయవముల స్వాధీనతతప్పినవాఁడగుచును. విముఖుండై = మాఱు మొగముపెట్టుకొన్నవాఁడై. చనియెన్ = పోయెను.

తా॥ అంతట అర్జునుఁడువచ్చి ఆచేఁపనుపడనేయ నుపాయము తెలిసిబాణప్రయోగముచేసియుదాని తెగిపడునట్లు ఏయలేక సిగ్గుపడి తలవంచుకొని ఆవలికి పోయెను అని తాత్పర్యము.

౧౧౦౩.—వ॥ ఇట్లు సకల రాజకుమారులుం దమతమప్రయత్నంబులు విఫలంబులైన
ముఖారవిందంబులు ముకుళించి దైన్యంబున విన్ననై చూచుచున్నయెడ.

టీ॥ (ఇట్లు) సకలరాజకుమారులును = ఎల్ల రాచకొడుకులును. తమతమప్రయత్నంబులు = తాము తాముచేసిన ప్రయత్నములు. విఫలంబులయినన్ = వ్యర్థములుకాఁగా. ముఖారవిందంబులు = ముఖకమలములను. ముకుళించి = చిన్నవుచ్చుకొని. దైన్యంబునన్ = దీనత్వముతో. విన్ననై = చిన్నవోయి. చూచుచున్నయెడన్ = చూచుచునుండఁగా.

తా॥ ఈవిధముగా ఎల్ల రాచకొమారులును తమతమ ప్రయత్నములువ్యర్థములైపోఁగా కళతప్పిన ముఖములతో దీనత్వమునుపొంది చిన్నపోయినవారై చూచుచుండఁగానని తాత్పర్యము.

౧౧౦౪.—చ॥ సరసిజపత్ర లోచనుఁడు ✱ చాపము సజ్యముచేసి యుల్లస
చ్ఛరమటఁ బోసి కార్ముక వి ✱ శారదుఁడై యలవోకవోలె ఖే
చరమగు మీనముం దునుమ ✱ సత్వరతన్ సుర సిద్ధ సాధ్య ఖే
చరజయశబ్దమొప్పఁ జెలు ✱ చన్ గురిసెం దివిఁబుష్పవర్షముల్.

టీ॥ సరసిజపత్రలోచనుఁడు = తామరరేకులవంటి కన్నులుగలవాఁడైనకృష్ణుఁడు. చాపము = విల్లు. సజ్యముచేసి = ఎక్కుపెట్టి. ఉల్లసచ్ఛరమున్ = ప్రకాశించుచున్న బాణమును. అటఁబోసి = సంధించి. కార్ముకవిశారదుఁడై = వింటినేర్పుగలవాఁడై. అలవోకవోలెన్ = విలాసముగా. ఖేచరము = ఆకాశమునందు చరించునది. అగుమీనమున్ = అగునట్టి మత్స్యమును. సత్వరతన్ = వేగముతో. దునుమన్ = తెగనేయఁగా. సుర...శబ్దము — సుర = దేవతలయు, సిద్ధ = సిద్ధులయు. సాధ్య = సాధ్యులయు. ఖేచర = గరుడులయు. జయశబ్దము = జయజయయను శబ్దము. ఒప్పన్ = ఒప్పఁగా. దివిన్ = ఆకాశమునందుండి. పుష్పవర్షములు = పువ్వులవానలు. చెలువన్ = విశేషముగా. కురిసెన్ = వర్షించెను.

తా॥ అంతట శ్రీకృష్ణమూర్తి విల్లెక్కుపెట్టితళతళ మెఱుఁగుచున్న బాణమును నారియందుఁగూర్చి విలువిద్య యందుఁదనకుఁగల నేర్పు తెలియఁబడునట్లుగా వినోదముగా ఆకాశమునందు వెలుఁగుచున్న యంత్రమత్స్యమును అతి త్వరితముగా దేవతలు సిద్ధులు సాధ్యులు మొదలుగాఁగలవారు జయ జయ యను శబ్దము అతిశయింపఁగా ఆకాశమునుండి పువ్వులవాన కురిసెను అనితాత్పర్యము.

విశేషార్థము.

టీ॥ నీరజపత్రలోచనుఁడు=హృదయకమలమునందలివిజ్ఞానమే నేత్రముగాఁగలకృష్ణుఁడనెడి ఆరూఢబ్రహ్మవేత్త. చాపముఙ=అంతర్బాహ్యనిర్వికల్పక సమాధియనెడువిల్లును. సజ్యనుచేసి=అహమస్మి బ్రహ్మాహమస్మి, అహంబ్రహ్మాస్మి అనువాక్యార్థములను ప్రకటించునట్టి శుద్ధసాత్వికవృత్తియనెడుఅల్లెత్రాటిని మ్రోయించి. ఉల్లసచ్ఛరమతిఁ బోసి—ఉల్లసత్=మిక్కిలి ప్రకాశించుచున్న. శరము=ప్రత్యగభిన్న పరబ్రహ్మమనను అపరోక్షజ్ఞానమనెడిదివ్యబాణమును. అతిఁబోసి=కూర్చి. కార్ముకవిశారదుఁడై=షడ్విధసమాధులలో నేర్పరులైనబ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుఁడై. ఎలరేఖవోలెఙ=చంద్రమామనసోజాతః, అను శ్రుతినిపట్టి మనోరూపుఁడైన చంద్రకళవలె. ఖేచరమగు = అంతర హృదయాకాశమునఁ దిరుగుచున్న. మీనముఙ=భేదజ్ఞానముతోడ విషయచాంచల్యములలోఁ జిక్కి తిరుగునట్టి మూఢమనస్సును. శ్రు॥ ఏషోంతరహృదయ ఆకాశః తస్మిన్నయంపురుషో మనోమయః॥ అని యుపనిషత్తు. సురసిద్ధసాధ్య ఖేచరజయశబ్దము ఒప్పఙ=ఇంద్రియాధిదేవతలుమహానందముచేతజయమూజయముఅనుచుండఁగా. తునిమెఙ=మూఢ మనస్సును నఱకెను.

తా॥ శ్రీకృష్ణపరబ్రహ్మమనెడు బ్రహ్మవేత్తఅంతరబాహ్యనిర్వికల్ప సమాధియనెడువిల్లునుకర్మకాండముజ్ఞానకాండములనెడుతనహస్తములయందుధరించి, శుద్ధసాత్వికవృత్తియనెడు అల్లెత్రాటినిగూర్చి, అహమస్మిబ్రహ్మాహమస్మి అహం బ్రహ్మాస్మి, అనువాక్యములచేత అల్లెత్రాటిని మ్రోయించి, ప్రత్యగభిన్న పరబ్రహ్మాహమనెడి అపరోక్షజ్ఞానమను దివ్యబాణమును గూర్చి, ఓమితిబ్రహ్మ ఓమితీదగ్ంసర్వం అను మంత్రములనుమంత్రించి, తననిశ్చలాంతఃకరణమున వెలుఁగువిజ్ఞానజలమున నిదానించి చూచి, సకల మంత్ర యంత్ర తంత్రములకు మూలమంత్రమైనమూఢమనస్సనెడుమత్స్యయంత్రమునునఱకి వేదశాస్త్రపురాణేతి హాసములనెడు గొప్ప సేనలుగల బృహత్సేనుఁడనెడు బ్రహ్మవేత్తయందుఁబుట్టి, నారదుఁడనెడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు తన మహతి యనెడు వీణ మీటుచు ప్రసంగించునట్టి కృష్ణ పరబ్రహ్మము యొక్కచరిత్రమునువినిచొక్కుచు సర్వశుభలక్షణములుగలిగిలక్షణ యనుపేర ప్రసిద్ధికెక్కిన ముక్తి కాంతను సంశయము అసంభావన విపరీతభావన సలయ విక్షేప కషాయ రసాస్వాద అజ్ఞాన ఆవరణాదులనెడు శత్రువులను నశింపఁజేసి పెండ్లియాడి, వైరాగ్యము బోధము ఉపరతి మొదలైనవాని సుఖముల ననుభవించుచు ద్వారకయనెడునరశరీరమందు వసించెనని తాత్పర్యము.

వ॥ అయ్యవసరంబున నేనుబరితుష్టాంతరంగనై పరమానందవికచ వదనారవిందంబున నిందిందిరసన్నిభంబులగుచికురబృందంబులువిలసదలికఫలకంబునందళుకులొలుకుఘర్మజలకణంబులంగరంగుమృగమదతిలకంపుటసలుమసలకొనినం గరకిసలయంబున మోసరించుచుమిసమిసనుమెఱుంగుగములుగిఱికొనగొనువడవడవడంకనప్పుడుమందగమనంబున.

టీ॥ అయ్యవసరంబునఙ = ఆసమయమునందు. (నేను) పరితుష్టాంతరంగనై=సంతోషించినమనసుగలదాననై. పరమా...విందంబునఙ—పరమానంద=మిక్కుటమయిన సంతోషముచేత. వికచ=వికాసమునొందిన. వదన=ముఖమనెడు. అరవిందంబునఙ=కమలమునందు. ఇందిందిరసన్నిభంబులు = తుమ్మెదలను బోలినవి. అగు చికురబృందంబులు=అగునట్టిముంగురుల సమూహములు. విలసదలికఫలకంబునఙ=ప్రకాశించునట్టినొసటిపట్టెయందు. తళుకులొలుకు=తళతళలాడునట్టి. ఘర్మజలకణంబులఙ = చెమటనీళ్ల బొట్లచేతను. కరంగు=కరఁగునట్టి. మృగమదతిలకంపుటసలు = కస్తూరితిలకపు రొంపి. మసలుకొనినఙ = ఆవరింపఁగా. కరకిసలయంబునఙ=చిగురువంటిచేతియందు. మోసరించుచుఙ=ప్రకాశించుచు. మిసమిసను=మిసమిసయనునట్టి. మెఱుంగుగములు=కాంతులసమూహములు. గిఱికొనఙ = ఆవరింపఁగా. కౌను = నడుము. వడవడవడంకఙ=మిక్కిలివణఁకఁగా. (అప్పుడు) మందగమనంబునఙ=తిన్ననినడతో.

తా॥ ఆసమయమునందు నేను మిక్కిలిసంతోషించిన మనసుగలదాననై, మిక్కుటమయిన సంతోషముచేత వికాసమును వహించిన ముఖకమలమునందు తుమ్మెదలో అనునట్లు ముంగురులు చలించుచుండఁగా మెఱయుచున్న నొసటియందు తళతళలాడునట్టి చెమటనీటి బొట్లచేత కస్తూరితిలకముకరఁగి అడుసువలెనావరింపఁగా, చిగురువంటిచేతియందు మిసమిసనినూతనప్రకాశములు అతిశయింపఁగా, నడుము మిక్కిలి వడఁకుచుండఁగా మెల్లనినడతో అప్పుడు అనితా.

౧౧౦౬.—చ॥ లలితపదాబ్జ నూపుర క ❋ ల ధ్వనితో దరహాస చంద్రికా
కలిత కపోల పాలికలఁ ❋ గప్పు సువర్ణ వినూత్న రత్నకుం
డల రుచులొప్పఁ గంకణ ఝు ❋ ణంకృతు లింపెసలార రంగభూ
తలమున కేగుదెంచి ముఖ ❋ తామరసం బపుడెత్తి చూచుచుఙ.

టీ॥ లలిత...తోఙ—లలిత=మనోహరమయిన. పదాబ్జ=పాదకమలములయందలి. నూపుర = అందెలయొక్క. కలధ్వనితోఙ=అవ్యక్తమధురధ్వనితోను. దరహాస...పాలికలఙ—దరహాస=చిఱునవ్వనెడు. చంద్రికా=వెన్నెలతోడ. కలిత=కూడుకొన్న. కపోలపాలికలఙ=చెక్కిళ్ల ప్రదేశములను. కప్పు...రుచులు—కప్పు=ఆవరించుకొనుచున్న. సువర్ణ=బంగారువికారమైనవియు. వినూత్న = క్రొత్తలైన. రత్న=రత్నవికారమైనట్టియు. కుండల=చెవిపోఁగులయొక్క. రుచులు=కాంతులు. ఒప్పఙ=ఒప్పఁగాను. కంకణఝుణంకృతులు = మూంజేతికడియములయొక్క ఝుణఝుణయను ధ్వనులు. ఇంపెసలారఙ = మనోహరములై వినఁబడఁగాను. రంగభూతలమునకుఙ=మండపప్రదేశమునకు. ఏగుదెంచి=వచ్చి. అపుడు=ఆసమయమందు. ముఖతామరసంబు = ముఖపద్మమును. (ఎత్తిచూచుచును)

తా॥ మనోజ్ఞమయిన పాదకమలమునందలి అందెల యొక్క అవ్యక్తమధురధ్వనితో చిఱునవ్వుఅనెడు వెన్నెలలతోఁగూడుకొన్న

చెక్కిళ్లను బంగారుమయమైనట్టియు క్రొత్తరత్నములు చెక్కినట్టియు చెవిపోగులకాంతులు కమ్ముకొనఁగా ముంజేతికడియములు ఝుణఝుణ యని మ్రోఁగఁగా మత్స్య యంత్రము సేసిన ప్రదేశమునకు వచ్చి అప్పుడు తలయెత్తిచూచుచును అని తాత్పర్యము.

౧౧౦౭.—చ॥ నరపతులం గనుంగొని మ * నంబున వారిఁ దృణీకరించి మ
త్కర జలజాతదివ్య మణి * కాంచనమాలిక నమ్మురారి కం
ధరమున లీలమై నిడి ప * దంపడి నవ్యమధూకదామ మా
హారికబరిం దగిల్చితి న * యంబునఁ గన్నుల లజ్జ దేఱఁగన్.

టీ॥ నరపతులన్=రాజులను. కనుంగొని=చూచి. మనంబునన్=మనసులో. వారిన్=ఆరాజులను. తృణీకరించి = అలక్ష్యముచేసి. నయంబునన్=తెలికగా. కన్నులన్=కన్నులయందు. లజ్జదేఱఁగన్=సిగ్గుకనఁబడఁగా. మత్ ... మాలికన్ — మత్=నాదైన. కరజలజాత=హస్తకమలమునందలి. దివ్య = అప్రాకృతమయిన. మణి=రత్నమయమయిన. కాంచనమాలికన్=బంగారు సరమును. అమ్మురారికంధరమునన్=ఆకృష్ణమూర్తికంఠమునందు. లీలమైన్=విలాసముతో. ఇడి=ఉంచి. పదంపడి=పిమ్మట. నవ్యమధూకదామము = క్రొత్తదైన యిప్పపువ్వులదండను. ఆహారికబరిన్=ఆకృష్ణుని కొప్పునందు. తగిల్చితిన్=చెరివితిని. వ॥ అపుడు=ఆసమయమునందు.

తా॥ రాజులనెల్లను జూచి అలక్ష్యముచేసి కన్నులయందు సిగ్గుగుఱుతులు మనోజ్ఞముగా కానఁబడఁగా నాచేతనున్న బంగారు రత్నాలహారమును శ్రీకృష్ణుని మెడనువేసి వెంటనే క్రొత్తదగు ఇప్పపువ్వులసరమును ఆయన శిఖయందుఁ జెరివితిని అని తాత్పర్యము.

౧౧౦౮.—చ॥ కొలఁదికి మీఱఁగా నమరు * గోముఖ డిండిమ మడ్డు శంఖ కా
హళ మురళీ మృదంగ పణ * వానకదుందుభి ఢక్క కాంస్య మ
ర్దళ మురజారజాది వివి * ధ ధ్వనులేపున భూన భోంతరం
బులఁ జెలఁగెన్ నటీనటన * ము ల్తనరారె మనోహరాకృతిన్.

టీ॥ కొలఁదికిమీఱఁగాన్=మేరమీఱునట్లు. అమరు=ఒప్పునట్టి. గోముఖ...వివిధధ్వనులు — గోముఖ = గోముఖమనెడువాద్యము. డిండిమ=రాయిడిగిడిగిల్లు. మడ్డు=గుమ్మెటము. శంఖ = శంఖము. కాహళ=తుతార. మురళీ=పిల్లఁగ్రోవి. మృదంగ = ఒకవిధమయిన మద్దెల. పణవ=ఉడుక. ఆనక=నిస్సాణము. దుందుభి=భేరి. ఢక్క=ఢక్కి. కాంస్య=తాళములు. మర్దళ=మద్దెల. మురజ=ఒకవిధమయిన మద్దెల. ఆరజ=ఆరజమనెడు వాద్యము. ఆది = మొదలుగాఁగల. వివిధధ్వనులు = నానావిధములైన వాద్యముల ధ్వనులు. ఏపునన్=విజృంభణముతో, భూనభోంతరంబులన్=భూమియందును ఆకాశమందును. చెలఁగెను = మ్రోసెను. మనోహరాకృతిన్ = మనోజ్ఞమయినవిధమున. నటీనటనములు = బోగమువారి యాటలు. తనరారెన్=ఒప్పిదముగా నడచెను.

తా॥ అప్పుడు రెండుమూడువిధములయిన మద్దెలలు గోముఖము డిండిమము మొదలుగాఁగల వాద్యములయొక్క నానావిధములయిన ధ్వనులు భూమ్యాకాశములయందు బోరు కలఁగఁగా బోగమువారి యాటలును జరగెను అని తాత్పర్యము. వ॥ అంతన్=తర్వాత.

౧౧౦౯.—చ॥ అమరగణంబుఁదోలి యుర * గారి సుధాకలశంబుఁగొన్న చం
దమున సమస్త శత్రు వసు * ధా వరకోటిఁ దృణీకరించి య
క్కమల విలోచనుండు ననుఁ * గౌఁగిట నొప్పఁగఁజేర్చి సింహచం
క్రమణ మెలర్పఁ గొంచుఁజనెఁ * గాంచనచారు రథంబు మీఁదికిన్.

టీ॥ అమరగణంబున్=దేవతా సమూహమును. తోలి=తఱిమి. ఉరగారి=పాములకుపగవాఁడైనగరుత్మంతుఁడు. సుధాకలశంబున్=అమృతకలశమును. కొన్నచందమునన్=తీసికొన్నవిధమున. సమస్తశత్రువసుధావరకోటిన్=ఎల్లపగరాజుల సమూహమును. తృణీకరించి=తృణముగానెంచి-అలక్ష్యము చేసి. అక్కమలవిలోచనుండు=ఆకృష్ణమూర్తి. ననున్=నన్ను. కౌఁగిటన్=భుజాంతరమునందు. ఒప్పఁగన్=ఒప్పునట్టుగా. (చేర్చి) సింహచంక్రమణము=సింహపుదాఁటు. ఎలర్పన్=ప్రకాశింపఁగా. కాంచనచారురథంబుమీఁదికిన్=ఒప్పిదమైనబంగారుతేరిమీఁదికి. కొంచుఁజనెన్=తీసికొనిపోయెను.

తా॥ శ్రీకృష్ణుఁడు దేవతలను తఱుముఁగొట్టి అమృతకలశమును దెచ్చిన గరుత్మంతునివలె పగవారైనరాజులనెల్లను అలక్ష్యముచేసి నన్నుఁ బొమ్మనఁగదియఁబట్టి యెత్తుకొని సింహముదాఁటుకొనిపోవునట్లు ఒకదాఁటున బంగారుమయమైన తన తేరిమీఁదికి నన్ను ఎత్తుకొని పోయెను అని చెప్పెనని తాత్పర్యము.

౧౧౧౦.—వ॥ అట్లు రథారోహణంబు చేసిన.

టీ॥ (అట్లు) రథారోహణంబుచేసినన్=రథము నెక్కఁగానే. తా॥ ఆవిధముగా నన్నెత్తుకొనిపోయిరథమెక్కఁగానేయని తాత్పర్యము.

౧౧౧౧.—చ॥ తురగ చతుష్కముఁ బ్రమత * దుర్దమశూరతఁ బూన్చి దారకుం
డరదముఁ దోప్ప శత్రు నికరాంధ తమస్ర పటల ప్రచండ భా
స్కరరుచి నొప్పునట్టి నిజ * కార్ముక యుక్త గుణ ప్రఘోష సం
భరిత దిగంతరుం డగుచుఁ * బద్మదళాక్షుఁడు వోవుచుండఁగన్.

టీ॥ తురగచతుష్కముఁ = గుఱ్ఱములు నాలుగింటిని. ప్రమత దుర్దమశూరతన్ = పగవారిని పట్టు పెట్టునట్టి మగతనముతో. పూన్చి = రథమునఁ గట్టి. దారకుండు = దారకుఁడు అను సారథి. అరదము = రథమును. దోప్పన్ = తోలఁగా. శత్రు...రుచిన్ — శత్రు = పగవారి యొక్క. నికర = సమూహమనెడు. అంధతమః = కటికిచీఁకటి యొక్క. పటల = సమూదాయమునకు. ప్రచండ భాస్కరరుచిన్ = తీండ్రమయిన సూర్యుని ప్రకాశమువలె. (ఒప్పునట్టి) నిజకార్ముక... దిగంతరుండు - నిజ = తనదైన. కార్ముక = వింటియందు. యుక్త = కూడిన - ఎక్కుపెట్టఁబడిన. గుణ = అల్లెత్రాటియొక్క. ప్రఘోష = ప్రకృష్టమయినధ్వనిచేత. సంభరిత = నిండింపఁబడిన. దిగంతరుండు = దిక్కులనడిమిభాగముగలవాఁడు. (అగుచును) పద్మదళాక్షుఁడు = కృష్ణుఁడు. పోవుచుండఁగన్ = పోవుచునుండఁగా.

తా॥ దారకుఁడు అను పేరుగల సారథి నాలుగు గుఱ్ఱములను గట్టిన రథమును తోలఁగా పగవారిసమూహము అనెడు కటికిచీఁకటికి తీండ్రముగల సూర్యుని వెలుఁగువలె వెలుఁగుచున్న తనధనుస్సునందుఁ గూర్పఁబడిన అల్లెత్రాటిచప్పుడు దిక్కులనడిమిభాగమంతయు నిండుకొని మ్రోఁగఁగా శ్రీకృష్ణమూర్తి బయలువెడలి పోవుచుండు నపుడు అని తాత్పర్యము.

౧౧౧౨.—వ॥ అట్టియెడ సకలరాజలోకంబుఁ గృష్ణుని విభవంబుఁ జూపోపక నసంఖ్యంబులగు మూఁకలుగట్టి యమ్మహాత్ముని మాహాత్మ్యంబుఁ దెలియలేక దర్పాంధులై కడంగి.

టీ॥ అట్టియెడన్ = ఆసమయమునందు. సకల రాజలోకంబును = ఎల్లరాజులసమూహమును. కృష్ణుని విభవంబున్ = కృష్ణునియొక్క భాగ్యమును. చూపోపక = చూచి సహింపలేక. అసంఖ్యంబులు = లెక్కపెట్టశక్యముగానివి. అగుమూఁకలు = అగునట్టి సేనలను. కట్టి = జతగూర్చి. అమ్మహాత్ముని మాహాత్మ్యంబున్ = ఆగొప్పవాఁడైన శ్రీకృష్ణుని యొక్క ప్రభావమును. తెలియలేక = తెలిసికోఁజాలక. దర్పాంధులై = అహంకారముచేత కన్నుఁగానని వారై. కడంగి = పూని.

తా॥ ఆసమయమునందు శ్రీకృష్ణుని వైభవమును జూచి ఓర్వఁజాలక తక్కిన రాజులందఱును లెక్కలేనిదండును గూర్చుకొని ఆకృష్ణమూర్తి మహిమను తెలియఁగక గర్వముచేత కన్నుఁగానని వారై పూనియనితా.

౧౧౧౩.—ఉ॥ భావభవ ప్రసూన శర * బాధిత మానసులై సమస్త ధా
త్రీవరనందను ల్బలుపుఁ * దెంపును బెంపును సొంపు నేర్పడన్
దేవ కిరీట రత్న రుచి * దీపిత పాద సరోజుఁడైన రా
జీవదళాక్షుఁ దాఁకిరి వి * శృంఖలవృత్తి నతిప్రయత్నులై.

టీ॥ సమస్తధాత్రీవరనందనులు = ఎల్లరాచకొమాళ్లును - భావభవప్రసూన శరబాధిత మానసులు — భావభవ = మన్మథునివైన. ప్రసూనశర = పువ్వుబాణములచేత. బాధిత = బాధింపఁబడిన. మానసులు = మనసులుగలవారు. ఐ = అయి. బలుపును = బలమును. తెంపును = సాహసమును. పెంపును = గౌరవమును. సొంపును = ఉత్సాహమును. ఏర్పడన్ = తెలియఁబడునట్లుగా. దేవ...జుఁడు — దేవ = దేవతలయొక్క. కిరీట = కిరీటముల యందలి. రత్న = మణుల యొక్క. రుచి = కాంతులచేత. దీపిత = ప్రకాశితములైన. పాదసరోజుఁడు = అడుగుతామరలుగలవాఁడు. ఐనరాజీవదళాక్షున్ = అయినట్టి శ్రీకృష్ణమూర్తిని. విశృంఖలవృత్తిన్ = అడ్డములేని వ్యాపారముతో. అతిప్రయత్నులై = మిక్కిలిపూనికగలవారై. తాఁకిరి = తలపడిరి.

తా॥ ఎల్లరాచకొమాళ్లును మన్మథుని పువ్వుబాణములచేత బాధింపఁబడినమనసులుగలవారై బలమును సాహసమును గౌరవమును ఉత్సాహమును తెలియఁబడునట్లు దేవతలకిరీటముల రత్నముల కాంతులచేత వెలుఁగునట్టి పాదకమలములుగల శ్రీకృష్ణమూర్తిని మిక్కిలి పూనికగలవారై అడ్డములేనిరీతిని యెదిరించి పోరాడనారంభించిరనితా. వ॥ అంత

౧౧౧౪.—చ॥ సరసిజ లోచనుండు నిజ * శార్ఙ్గ శరాసన ముక్త హేమ పుం
ఖ రుచిర శాతసాయక ని * కాయముల న్రిపుకోటి నేసి సిం
ధుర రిపు విక్రమ ప్రకట * దోర్బలుఁడై విలసిల్లి యొత్తె దు
స్తర చలితాన్య సైన్యమును * సజ్జనమాన్యముఁ బాంచజన్యమున్.

టీ॥ సరసిజలోచనుండు = శ్రీకృష్ణుఁడు. నిజ...ములన్ — నిజ = తనదైన. శార్ఙ్గశరాసన = శార్ఙ్గమనెడువింటినుండి. ముక్త = విడువఁబడిన. హేమపుంఖ = బంగారుపింజలుగల. రుచిర = వెలుఁగుచున్న. శాత = వాఁడులైన. సాయక = బాణములయొక్క. నికాయములన్ = సమూహములను. రిపుకోటిన్ = శత్రుసమూహమును. ఏసి = ప్రయోగించి నొప్పించి. సింధుర...దోర్బలుఁడై — సింధురరిపువిక్రమ = సింహపరాక్రమమును. ప్రకట = ప్రసిద్ధము చేయునట్టి. దోర్బలుఁడై = భుజబలముగలవాఁడై. విలసిల్లి = ప్రకాశించి. దుస్తరచలితాన్యసైన్యమున్

= దాఁటఁగూడమిచేత చలించినశత్రుసైన్యములు గలదానిని. సజ్జనమాన్యమున్ = సత్పురుషులచేత బహుమానింపఁదగినదానిని. పాంచజన్యమున్ = పాంచజన్యము అనుపేరుగల శంఖమును. ఒత్తెన్ = పూరించెను—ఊఁదెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి తన వింటినుండి విడువఁబడిన బంగారు పింజలుగలిగి వెలుఁగుచున్నవాఁడులైనబాణసమూహములను ప్రయోగించి శత్రుసమూహములనునొప్పించితానుసింహపరాక్రముఁడుఅను ప్రసిద్ధమగునట్లు శత్రుసేనలకు మీరరాని చలనమును కలుగఁజేయనదియు, సజ్జనులచేత సన్మానింపఁ దగినదియునైన పాంచజన్యమను పేరుగల తనశంఖమును ఊఁదెను అనితాత్పర్యము.

౧౧౧౫.—ఉ॥ అత్తఱి భూరిబాహుబలు * లైన విరోధి నరేశ్వరుల్మృగ
వ్రాతము లొక్కపెట్ట మృగ * రాజ కిశోరముపై నెదిర్చిన
ట్లాతురులై చతుర్విధ స * మగ్ర బలంబులతోడఁ గూడి ని
ర్ధూత కళంకుఁడైన నవ * తోయజనేత్రుని చుట్టు ముట్టినన్.

టీ॥ అత్తఱిన్ = ఆసమయమునందు. భూరిబాహుబలులు = అధికమయిన భుజబలముగలవారు. ఐనవిరోధి నరేశ్వరులు = అయినట్టిశత్రురాజులు. మృగవ్రాతములు = మృగములగుంపులు. ఒక్కపెట్టన్ = ఒక్కసారిగా. మృగరాజకిశోరముపైన్ = సింహపుపిల్లమీఁద. ఎదిర్చినట్లు = ఎదిరించినవిధమున. ఆతురులై = కోపముచేత పీడింపఁబడినవారై. చతుర్విధసమగ్రబలంబులతోడన్ = నాలుగువిధములైనకొఱఁతలేనిసేనలతో. కూడి = చేరి. నిర్ధూతకళంకుఁడు = ఎగఁజిమ్మఁబడినదోషములుగలవాఁడు. (ఐన) నవతోయజనేత్రునిచుట్టున్ = క్రొత్తగా వికసించినకమలములవంటికన్నులుగల కృష్ణునిచుట్టును. ముట్టినన్ = ఆవరించుకొనఁగా.

తా॥ ఆసమయమునందుమిక్కిలి భుజబలముగలశత్రురాజులు అందఱును మృగసమూహములన్ని ఒక్కసారిగా పోయి సింహపుపిల్లను చుట్టుకొన్నవిధముగా కోపముచేతపీడింపఁబడినవారగుచును రథగజతురగ పదాతులనెడు నాలుగువిధములు గల కొఱఁతలేని సేనలతో శ్రీకృష్ణమూర్తిని చుట్టుకొనఁగా అని తాత్పర్యము.

౧౧౧౬.—చ॥ అలిగి మురాంతకుండు కులి * శాభ శరంబుల నూత్న రత్నకుం
డలములతో శిరంబులు ర * ణన్మణి నూపుర రాజితోఁ బదం
బులుఁ గటకాంగుళీయక వి * భూషణ చాప శరాలితోడఁ జే
తులు నిలఁగూలఁగా విజయ * దోహలియై దునుమాడె వేండియున్.

టీ॥ మురాంతకుండు = కృష్ణుఁడు. అలిగి = కోపించి. కులిశాభశరంబులన్ = వజ్రాయుధమునుబోలిన బాణములచేత. నూత్నరత్నకుండలములతోన్ = క్రొత్తలైన రత్నములు చెక్కిన చెవిపోఁగులతోడ. శిరంబులు = తలలును. రణన్మణినూపురరాజితోన్—రణత్ = మ్రోఁగుచున్న. మణినూపుర = రత్నాలయందెలయొక్క. రాజితోన్ = పఙ్క్తితోడ. పదంబులును = కాళ్లను. కటక...తోడన్—కటక = ముంజేతికడియములయు. అంగుళీయక = ఉంగరములయు. విభూషణ = ఆభరణములయు. చాప = విండ్లయు. శర = బాణములయు. ఆలితోడన్ = పఙ్క్తితో. (చేతులును) ఇలన్ = భూమియందు. కూలఁగాన్ = పడునట్లు. విజయదోహలియై = జయోత్సాహము గలవాఁడై. దునుమాడెన్ = నఱికెను. వేండియున్ = అటుపిమ్మట.

తా॥ శ్రీకృష్ణమూర్తికోపించినవాఁడై వజ్రాయుధమునుబోలినవాఁడిబాణములుపెక్కులుప్రయోగించి రత్నములుచెక్కిన చెవిపోఁగులతోడి తలలును, మ్రోఁగుచున్నరత్నాలయందెలతోడి పాదములును, కడియములు ఉంగరములుమొదలుగాఁగల భూషణములతోడను విండ్లతోడను అమ్ములతోడనుగూడినచేతులును, నేలఁగూలునట్లుగాననఱికివేసెనని తా.

౧౧౧౭.—క॥ హతశేషులు చౌకాకుల । గతిఁ దూల నిశాతపవన * కాండములు సము
ద్ధతి నేసి తోలి విజయో । న్నతుఁడై నిజనగరి కేగె * నగధరుఁ డంతన్.

టీ॥ హతశేషులు = చావఁగా మిగిలినవారు. చౌకాకులగతిన్ = పండియెండిన యాకులవలె. తూలన్ = తూలిపోఁగా. అంతన్ = అప్పుడు. నగధరుఁడు = కృష్ణుఁడు. నిశాతపవన కాండములు = వాడులైనవాయవ్యాస్త్రములను. సముద్ధతిన్ = మిక్కిలి నాటుకొనునట్లుగా. ఏసి = ప్రయోగించి. తోలి = తఱిమి. విజయోన్నతుఁడై = గెలుపుచేత అధికుఁడై. నిజనగరికిన్ = తన పట్టణమునకు. ఏగెన్ = పోయెను.

తా॥ చావఁగామిగిలినసైనికులు పండియెండి రాలునట్టి చౌరుగాకులవలెనే. తూలిపోవునట్టుగా అప్పుడు శ్రీకృష్ణమూర్తి వేగముగల వాయవ్యాస్త్రములను ప్రయోగించి అందఱిను తఱుమఁగొట్టి గెలుపునొందినవాఁడై తనపట్టణమునకుపోయి చేరెనని తాత్పర్యము.

౧౧౧౮.—వ॥ అట్లు మహిత మంగళాలంకృతంబును, నతిమనోహర విభవాభి రామంబునగు ద్వారకానగరంబునకరుగుదెంచిన మజ్జనకుండు ప్రియంబునఁదోడన చనుదెంచి:

టీ॥ అట్లు = ఆవిధముగా. మహిత...బులు—మహిత = పూజ్యమైన. మంగళ = శుభసూచకముగా. అలంకృతంబును = అలంకరింపఁబడినదియు. అతి...బును—అతి = మిక్కిలి. మనోహర = మనోజ్ఞమైన. విభవ = ఐశ్వర్యముచేతను. అభిరామంబును = ఒప్పినదియు. (అగు) ద్వారకానగరంబునకున్ = ద్వారకాపట్టణమునకు. అరుగుదెంచినన్ = రాఁగా. మజ్జనకుండు = మాతండ్రి. ప్రియంబునన్ = ఇష్టముతో. తోడన = వెంటనే. (చనుదెంచి)

తా॥ ఆవిధముగా జయమునుపొందిమేమై శుభమునుసూచించునట్లు అలంకరింపఁబడినదియు మిక్కిలిమనోజ్ఞమయిన ఐశ్వర్యముచేతనొప్పినదియునైనద్వారకాపట్టణమునకువచ్చిచేరఁగా మాతండ్రియు ప్రీతితో వెంటనేవచ్చినవాఁడై యని తాత్పర్యము.

౧౧౧౯.—చ॥ రణితవినూత్న రత్న రుచి * ర స్ఫుటనూపురహార కర్ణ భూ
షణ కటకాంగుళీయక ల * సత్పరిధాన కిరీట తల్ప వా
రణ రథవాజిహేతి నిక * రంబులనుం బరిచారికాతతిన్
బ్రణుతగుణోత్తరుండు నవ * పద్మదళాక్షునకిచ్చె నెమ్మితోన్.

టీ॥ రణిత...నికరంబులన్—రణిత=మ్రోఁగుచున్న. వినూత్న = క్రొత్తలైన. రత్న=రత్నములచేత. రుచిర = వెలుఁగుచున్న. స్ఫుట = స్వచ్ఛములైన. నూపుర=అందెలయు. హార = ముత్యాలపేరులయు. కర్ణభూషణ = కమ్మలయు. కటక = ముంజేతికడియములయు. అంగుళీయక=ఉంగరములయు. లసత్ = ఒప్పునట్టి. పరిధాన = కట్టువస్త్రములయు. కిరీట=కిరీటములయు. తల్ప=పాన్పులయు. వారణ=ఏనుఁగులయు. రథ=తేరులయు. వాజి=గుఱ్ఱములయు. హేతి = ఆయుధములయు. నికరంబులన్=సమూహములను. పరిచారికాతతిన్=ఊడిగకత్తెలగుంపును, ప్రణుతగుణోత్తరుండు=కొనియాడఁబడినగుణములచేత శ్రేష్ఠుఁడైన. నవపద్మదళాక్షునకున్=క్రొత్తగావికసించిన తామరరేకులవంటికన్నులుగల శ్రీకృష్ణమూర్తికి. నెమ్మితోన్=ప్రీతితో. (ఇచ్చెను)

తా॥ గలగల మ్రోఁగుచున్న రత్నాల అందెలు ముత్యాలపేరులు కమ్మలు గాజులు మంచిమంచి వస్త్రములు కిరీటములు పానుపులు ఏనుఁగులు రథములు గుఱ్ఱములు కావలసిన ఆయుధములు పరిచారికలు మొదలుగాఁగలవానినెల్లను శ్లాఘ్యము లయిన గుణములుగల శ్రీకృష్ణమూర్తికి ప్రీతిపూర్వకముగా ఇచ్చెనని తాత్పర్యము.

వ॥ ఇట్లు మహనీయ తేజోనిధియైన మాధవదయాపరిలబ్ధనిఖిలవస్తువిస్తారుండయ్యును నిజాధికార శుద్ధికొఱకు మరలం గన్యారత్నంబును వినూత్న రత్నవ్రాతంబును సమర్పించె నని భూసుర విసరంబులు వినుతింప మాతండ్రియైనబృహత్సేనుండు నన్నును సమస్తవస్తువులను గృష్ణునకుసమర్పించి క్రమంబున సకలయాదవులను బూజించి మరలి నిజపురంబునకుం జనియెనని చెప్పినఁ గుంతియుఁ గాంధారియుఁ గృష్ణయునఖిల నృపాల కాంతాజనంబులును గోపికలుం దమ మనంబుల సర్వభూతాంత ర్యామియు, లీలామానుష విగ్రహుండును నైన పుండరీకాక్షు చరణారవింద స్మరణానంద పరవశలై కృష్ణుం బ్రశంసించి రంత.

టీ॥ (ఇట్లు) మహనీయతేజోనిధి = మిక్కిలియెచ్చైన తేజస్సునకు ఆకరమగునవాఁడు. (అయిన) మాధవ...విస్తారుండు — మాధవ=కృష్ణునియొక్క. దయా=కృపచేత. పరిలబ్ధ = అంతటపొందఁబడిన. నిఖిల=సమస్తమైన. వస్తు=పదార్థములయొక్క. విస్తారుండు=సమృద్ధిగలవాఁడు. (అయ్యును) నిజాధికారశుద్ధికొఱకున్=తనప్రభుత్వాధికారముయొక్కచక్కఁబాటుకై. మరలన్=తిరుగా. కన్యారత్నంబును=ఉత్తమకన్యకను. వినూత్నరత్న వ్రాతంబును = క్రొత్తలైన రత్నముల సమూహమును. సమర్పించెనని=కానికచేసెనని. భూసురవిసరంబులు=బ్రాహ్మణులగుంపులు. వినుతింపన్ = పొగడఁగా. (మాతండ్రియైన బృహత్సేనుండు నన్నును) సమస్తవస్తువులను = ఎల్లపదార్థములను. (కృష్ణునకు) సమర్పించి=కానుకపెట్టి. క్రమంబునన్=పిన్నపెద్దలవరుసను. (సకలయాదవులను) పూజించి=అర్చించి. (మరలి) నిజపురంబునకున్=తనపట్టణమునకు. చనియెన్=పోయెను. అనిచెప్పినన్=అనిలక్షణ చెప్పఁగా. (కుంతియు గాంధారియు) కృష్ణయు=ద్రౌపదియు. అఖిలనృపాలకాంతాజనంబులును = ఎల్లరాజులభార్యలును. (గోపికలును) తమ మనంబులన్=తమమనసులలో. సర్వభూతాంతర్యామియు=ఎల్లప్రాణులలోను నుండువాఁడును. లీలామానుషవిగ్రహుండును = వేడుకగా మానవదేహమును పొందినవాఁడును. (అయిన) పుండరీకాక్ష...వశలై—పుండరీకాక్ష=తెల్లదామరలవంటికన్నులుగల కృష్ణునియొక్క. చరణారవింద=పాదకమలములను. స్మరణ=తలఁచుటవలని. ఆనంద=సంతోషముచేత. పరవశలై=చొక్కినవారై. కృష్ణున్=కృష్ణమూర్తిని. ప్రశంసించిరి=శ్లాఘించిరి.

తా॥ ఈవిధముగా మాతండ్రి కృష్ణుని అనుగ్రహమున పొందఁబడిన యెల్లవస్తువులుగలవాఁడుగానుండి తనయధికారము మేలిమికై మరలఁగూఁతును రత్నరాసులను కానుకపెట్టెనని బ్రాహ్మణజనులందఱు చెప్పుకొని వినుతింపఁగా నన్నును సకలవస్తు సముదాయమును శ్రీకృష్ణమూర్తికిసమర్పించి తక్కినయాదవులను పెద్దపిన్నలవరుసను తగినరీతిని వస్త్రాభరణాదులచేత సన్మానించి వారివలన సెలవుపుచ్చుకొని తనపట్టణమునకుఁబోయెను అని లక్షణతన పెండ్లివృత్తాంతమును చెప్పఁగా కుంతి గాంధారి ద్రౌపది తక్కిన రాజుల భార్యలును గోపికలును విన్నవారై యెల్లజీవులందును అణఁగియుండువాఁడును, వేడుకకై మనుష్యావతారమెత్తినవాఁడును నైన శ్రీకృష్ణుని స్మరించుటవలనియానందముచేతచొక్కినవారగుచు ఆకృష్ణమూర్తిని చాలశ్లాఘించిరి అని తాత్పర్యము.

౧౧౨౧.—చ॥ బలవదరాతి మర్దనులఁ * బాండుర నీలనిభ ప్రభాంగులన్
గలిత నిజాననాంబుజ వి * కాస జితాంచితపూర్ణచంద్ర మం
డలులఁ బరేశుల న్నరవి * డంబనులం గరుణాపయోధుల
న్విలసదలంకరిష్ణుల న * హీన సహిష్ణుల రామకృష్ణులన్.

టీ॥ బలవదరాతి మర్దనులన్=బలవంతులైన శత్రువులను మర్దించువారును. పాండుర నీలనిభ ప్రభాంగులన్—పాండుర=తెల్లనిదియు. నీలనిభ=నీలములనుబోలిన. ప్రభా=వన్నెగలదియునైన. అంగులన్=దేహములుగలవారును. కలిత...మండలులన్—కలిత=మనోజ్ఞమైన. నిజ=తమవైన. ఆనన=మొగములనెడు. అంబుజ = తామరలయొక్క. వికాస=వికసించుటచేత. జిత=జయింపఁబడిన. అంచిత=ఒప్పిదమైన.

పూర్ణచంద్ర=నిండుచందమామ యొక్క. మండలులక్=బింబములుగల వారును. పరేశులక్-పర=పరావాక్కునకు, లేక పరాప్రకృతికి. ఈశులక్=ప్రభువులను. నరవిడంబనులక్=మనుష్యులవలె తోఁచునట్టి వారును. కరుణాపయోధులక్ = దయా సముద్రులగు వారును. విలసదలంకరిష్ణులక్=ప్రకాశముగానలంకరించుకొను స్వభావముగలవారును. అహీన సహిష్ణులక్=సర్పరాజైనయాదిశేషునివలెభూభారమునోర్చు స్వభావముగలవారునునయిన. రామకృష్ణులక్=బలరామునిశ్రీకృష్ణమూర్తిని.

తా॥ బలవంతులఖునశత్రువులను శిక్షించువారును, (పురుషంకృష్ణపింగలం) అనుశ్రుతిచేత తెల్లని నల్లని దేహములు గలవారును, తమ ముఖ వికాసములచేత పూర్ణచంద్రబింబమును గెలిచినవారును, సర్వోత్కృష్టులగునీశ్వరులును, మాయచేత మనుష్యులవలె తోఁచువారును, దయా సముద్రులును, చక్కఁగా నలంకరించుకొను స్వభావము గలవారును, సకల భూభారమును సహించునట్టి యాదిశేషునివలె సహనశీలముగలవారునైన బలరామకృష్ణులను అని తాత్పర్యము.

౧౧౨౨.—వ॥ సందర్శించు తలంపుల నందఱును దమహృదయారవిందంబులఁ బ్రేమంబు సందడిగొన నప్పుడు.

టీ॥ సందర్శించుతలంపులక్=చూడవలెనను తలఁపులతో. (అందఱును) తమహృదయారవిందంబులక్ = తమమనఃకమలముల యందు. ప్రేమంబు=ప్రీతి. సందడిగొనక్ = మిక్కిలియెచ్చఁగా. (అప్పుడు)

తా॥ చూడవలెనను కోరికగలవారై యెల్లవారును. తమ మనసుల యందుప్రీతి అతిశయింపఁగా ఆసమయమునందు అని తాత్పర్యము.






















(*) నారదాదిమహర్షులు శ్రీబలరామకృష్ణులను జూడవచ్చుట. (*)

౧౧౨౩.—ఉ॥ ధీరమతిక్ ద్వితత్రితక * దేవల సాత్యవతేయ కణ్వులక్
నారద గౌతమ చ్యవన * నాకుజ గార్గ్య వసిష్ఠ గాలవాం
గీరస కశ్యపాసిత సు * కీర్తి మృకండుజ కుంభ సంభవాం
గీరులు యాజ్ఞవల్క్య మృగ * శృంగ ముఖాఖిలతాపసోత్తముల్.

టీ॥ ధీరమతిక్=తాలిమితోడిబుద్ధితో. ద్విత...కణ్వులక్-ద్విత=ద్వితుఁడు. త్రితక=త్రితుఁడు. దేవల = దేవలుఁడు. సాత్యవతేయ=వ్యాసుఁడు. కణ్వులక్=కణ్వుఁడునను వారును. నారద...గీరులును—నారద=నారదుఁడు. గౌతమ=గౌతముఁడు. చ్యవన=చ్యవనుఁడు. నాకుజ=వాల్మీకి. గార్గ్య=గార్గ్యుఁడు. వసిష్ఠ=వసిష్ఠుఁడు. గాలవుఁడు. ఆంగిరస=బృహస్పతి. కశ్యప=కశ్యపుఁడు. అసిత=అసితుఁడు. (సుకీర్తి) మృకండుజ=మార్కండేయుఁడు. కుంభసంభవ=అగస్త్యుఁడు. ఆంగీరులు=అంగిరసుఁడునను వారును. యాజ్ఞ...ములు-యాజ్ఞవల్క్య=యాజ్ఞవల్క్యుఁడు. మృగశృంగ=మృగశృంగుఁడు. ముఖ=మొదలగువారునైన. అఖిలతాపసోత్తములు = ఎల్లమునిశ్రేష్ఠులును.

తా॥ ద్వైపాయన అత్రేయులు దేవలుఁడు వ్యాసుఁడు మొదలగు వారును, నారదుఁడు గౌతముఁడు బృహస్పతి అగస్త్యుఁడు మొదలగు వారును, యాజ్ఞవల్క్యుఁడు మృగశృంగుఁడు మొదలగువారు నైన మునులందఱు చాలిమితోడి బుద్ధితో రాఁగాననని తాత్పర్యము.

౧౧౫౪.—వ॥ చనుదెంచినఁ గృష్ణుండువారలకుఁ బ్రత్యుద్ధానంబులాచరించివివిధార్చనలుగావించియిట్లనియె.

టీ॥ చనుదెంచినన్=రాఁగా. (కృష్ణుండు) వారలకున్=ఆమును లకు, ప్రత్యుద్ధానంబులు=ఎదురుగానిలేచిపోవుటలను. ఆచరించి=చేసి. వివిధార్చనలు=నానావిధము లైనపూజలను. కావించి=చేసి (ఇట్లనియెను)

తా॥ అట్లుమునులందఱును రాఁగాకృష్ణుఁడు ఆమునులకు ఎదురు కొని లేచిపోవుట మొదలగు మర్యాదలతో నానావిధములయినపూజలు చేసి యిట్లు పలికెనని తాత్పర్యము.

౧౧౫౫.—సీ॥ సన్మునీశ్వరులార ✻ జన్మభాక్కులమైన - మాకు నిచ్చోట స ✻ న్మతిని దేవ

నికర దుష్ప్రాప్యులు ✻ నిరుపమ యోగీంద్రు - లైన మీదర్శనం ✻ బబ్బెఁగాదె

ధృతిమందభాగ్యు లిం ✻ ద్రియ పరతంత్రు లు - నైన మూఢాత్ముల ✻ కనఘులార

భవదీయ దర్శన ✻ స్పర్శన చింతన - పాదార్చనలు దుర్ల ✻ భంబులయ్యు

తే॥ నేడు మాకిటసులభమై ✻ నెగడెఁ గాదె । జగతిపైఁ దీర్థభూతులు ✻ సాధుమతులు

మిమ్ము సేవించుటయ చాలు ✻ నెమ్మితోడ । వేఱతీర్థంబు లవనిపై ✻ వెదుక నేల.

టీ॥ సన్మునీశ్వరులార=ప్రసిద్ధులైనఓమునిశ్రేష్ఠులారా. జన్మభాక్కులము=జన్మములను పొందువారము. ఐన మాకున్=అయినట్టి మాకు. ఇచ్చోటన్=ఈప్రదేశమందు. సన్మతిన్=మంచిబుద్ధితో — మంచియభిప్రాయముతో. దేవనికరదుష్ప్రాప్యులు = దేవతా సమూహముచేత పొందఁబడనట్టి స్వరూపములుగల వారు. నిరుపమ యోగీంద్రులు = ఈడులేని యోగనిష్ఠగలవారిలో శ్రేష్ఠులు. అయినమీదర్శనంబు=అయినట్టిమిమ్ముఁజూచుట. అబ్బెన్=లభించెను. కాదె=కదా. ధృతిన్ = చాలిమితో. మందభాగ్యులు = అదృష్టహీనులును. ఇంద్రియపరతంత్రులును = ఇంద్రియవ్యాపారములయందాసక్తులును. అయినమూఢాత్ములకున్=అయినట్టి తెలివిమాలినవారికి. అనఘులార = పాపములేని వారలారా. భవదీయ...పాదార్చనలు—భవదీయ=మీవైన. దర్శన=చూపును. స్పర్శన=తాఁకుటయు. చింతన=ఆలోచించుటయు. పాదార్చనలు=పాదపూజచేయుటయనునవి. దుర్లభంబులయ్యున్ = లభింపని వైనానుండియు. నేడు=ఈదినము. ఇటన్ = ఇక్కడ. (మాకు) సులభమై=అనాయాసముగా లభించునవియై. నెగడెఁగాదె = వెలసెను గదా. జగతిపైన్=భూమిమీఁద—ఈభూలోకమునందు. తీర్థభూతులు=గంగాదిపుణ్యతీర్థస్వరూపులును. సాధుమతులు=రాగద్వేషలోభములు లేనిబుద్ధిగలవారు. (మిమ్మును) నెమ్మితోడన్=ప్రీతితో. సేవించుటయ=కొలుచుటయే. (చాలును) అవనిపైన్ = భూమిమీఁద. వేఱ=వేఱే. తీర్థంబులు=పుణ్యనదులు మొదలగువానిని. వెదుకనేల = వెదకవలసిన యక్కఱయేమి.

తా॥ ఓమునిశ్రేష్ఠులారా! దేవతలకైనికనఁబడనివారును యోగసిద్ధగలవారిలో శ్రేష్ఠులునయిన మీదర్శనము ( శ్లో॥ పునరపిజననంపునరపి మరణం పునరపిజననీజఠరేశయనం॥ ) అని యున్నదిగనుక పుట్టిపుట్టి గిట్టుచుండు నట్టి వారమయిన మాకు ఇచ్చట లభించెను కదా అదృష్టహీనులును ఇంద్రియ వ్యాపారములయందాసక్తులును నైన మాబోఁటి మూఢబుద్ధులకు పాపములేనివారైన మీవంటి పరిశుద్ధులను జూచుటయు తాఁకుటయు మీతోయుక్తాయుక్తముల నాలోచించుటయు మీయడుగులను పూజించుటయు ననునవి పొందరాని వయ్యును ఇప్పుడు ఇక్కడ సులభముగా లభించునట్టివయ్యెనుగదా. ఇటువంటిపరిశుద్ధులైన పరమసాధువులను మిమ్ము సేవించిన పిమ్మట ఇతరములైన పుణ్యతీర్థములను వెదకఁబోవ నక్కఱలేదని తాత్పర్యము. శ్లో॥ నహ్యమ్మయానితీర్థానినదేవామృచ్ఛిలామయాః। తేపునంత్యురుకాలేన దర్శనాదేవసాధవః॥ అనియున్నదిగనుకసత్పురుషులదర్శనముచేతనే కృతార్థతగలుగునని భా.

౧౧౫౬.—వ॥ అదియునుంగాక యుదకమయంబులైన తీర్థంబులును, మృచ్ఛిలామయంబులైన దేవగణంబులును, దీర్ఘదేవతారూపంబులు గాకుండుట లేదైననవి చిరకాలసేవనార్చనలంగాని పావనంబు సేయవు సత్పురుషులు దర్శన మాత్రంబునం బావనంబు సేయుదు రని వెండియు.

టీ॥ అదియునుంగాక=అదిమాత్రమేగాకుండ. ఉదకమయంబులు=జలస్వరూపములు. అయినతీర్థంబులును=అయినట్టి పుణ్యనదులు మొదలగునవియు. మృచ్ఛిలామయంబులు = మట్టివికారములును రాతివికారములును. (అయిన) దేవగణంబులును=దేవతాసమూహములును. తీర్థదేవతారూపంబులు=తీర్థరూపములును దేవతా రూపములును. కాకుండుట లేదు-అగుననుట. అయినను=అవితీర్థదేవతారూపములు అయినను. అవి=ఆజలరూపములును మృచ్ఛిలారూపములునైన తీర్థదేవతాసమూహములు. చిరకాల సేవనార్చనలంగాని=బహుకాలము సేవించుటచేతను అర్చించుటచేతనుగాని. పావనంబు సేయవు=పరిశుద్ధిఁబొందింపవు. సత్పురుషులు = యోగ్యులయిన పెద్దలు. దర్శనమాత్రంబునన్ = చూపుమాత్రముచేతనే. పావనంబు సేయుదురు=పరిశుద్ధిఁబొందింపుదురు.(అని) వెండియున్=మఱియును.

తా॥ అంతమాత్రమేగాక జలమయములైన తీర్థములును, మృణ్మయములును శిలామయములునైన దేవతలును, తీర్థములును, దేవతలును కాదనరాదు అయినను ఆతీర్థదేవతారూపములు బహుకాలము సేవించుటచేతను అర్చించుటచేతనుగాని మానవుని పరిశుద్ధునిఁగాఁ జేయనేరవు. సజ్జనులగు పెద్దలుచూపుమాత్రముననే పరిశుద్ధునిఁగాఁ జేయుదురు. ఇదిగాక ఇంకొక విశేషమును గలదు అని తాత్పర్యము.

౧౧౩౭.—సీ॥ ఆదిత్యచంద్రాగ్ని * మేదినీ తారాంబు - మారుతాకాశ వా * జ్మనములోలిఁ
బరికింపఁ దత్తదు * పాసనంబులఁబూని - తపములచే సమ * ర్థములు గావు
సకలార్థ గోచర * జ్ఞానంబుగల మహా - త్మకులు ముహూర్తమా * త్రమున సేవ
సేసి పావనములు * సేయుదు రదియు న - ట్లుండె ధాతుత్రయ * యుక్తమైన

తే॥ కాయమం దాత్మ బుద్ధియుఁ * గామినీ కు । మారులందు స్వకీయాభి * మానములను
దివిరి జలమునఁ దీర్థబు * ద్ధియును జేయు । నట్టిమూఢుండు పశుమార్గుఁ * డనఁగఁబరఁగు.

టీ॥ పరికింపన్ = విచారింపఁగా. ఆదిత్య ... వాఙ్మనములు— ఆదిత్య=సూర్యుఁడు. చంద్ర=చంద్రుఁడు. అగ్ని=అగ్నిహోత్రుఁడు. మేదినీ=భూమి. తారా=ధ్రువాదినక్షత్రములు. అంబు=ఉదకములు. మారుత=గాలి. ఆకాశ=ఆకాశము. వాక్=వాక్కు. మనములు= మనసు, ఓలిన్ = క్రమముగా. తత్తదుపాసనంబులన్ = వానివానినుపాసించుటలచేతను. పూని=యత్నించి. తపములచేన్=తపస్సులు చేయుటలచేతను. సమర్థములు=చాలినవి. కావు=కానేరవు. సకలార్థగోచరజ్ఞానంబు—సకల=సమస్తమయిన. అర్థ=విషయములను. గోచర=తోఁపింపఁజేయునట్టి. జ్ఞానంబు=తెలివి. కలమహాత్మకులు= కలిగినగొప్పవారు. ముహూర్తమాత్రమునన్=రెండు గడియలకాలములో. సేవచేసి=కొలువుచేసి. పావనములు సేయుదురు=పరిశుద్ధములనుగాఁ జేయుదురు. (అదియు నట్లుండె) ధాతుత్రయయుక్తము= వాతపిత్తశ్లేష్మముల నెడుమూడునాడులతోఁగూడినది. అయినకాయమందున్ = అయినట్టిదేహమునందు. ఆత్మబుద్ధియున్ = పరమాత్మయను తలఁపును. కామినీకుమారులందున్ = పెండ్లాము బిడ్డలందు. స్వకీయాభిమానములును = తనవార నెడు మమతయును. తివిరి = పూని. జలమునన్=నీళ్లయందు. తీర్థబుద్ధియున్=పరిశుద్ధి చేయునవి యనుతలఁపును. చేయునట్టి మూఢుండు=కలిగించుకొనునట్టి తెలివి మాలినవాఁడు. పశుమార్గుఁడు=మృగపద్ధతిగలవాఁడు. అనఁగన్= అనఁగా. పరఁగున్=ప్రసిద్ధినొందును.

వాక్కును మనస్సును ఉపాసనచేయుటకు విషయములు కానివి గనుక వానిని పరబ్రహ్మ స్వరూపము లని తలఁచుటయే ఉపాసన చేయుట. శ్రు॥ యోవాచంబ్రహ్మేత్యుపాస్తే యోమనోబ్రహ్మేత్యుపాస్త ఇతి, అని శ్రుతి.

తా॥ విచారింపఁగా సూర్యుఁడు చంద్రుఁడు ధ్రువాదినక్షత్రములు నిప్పు నేల నీళ్లు గాలి ఆకాశము వాక్కు మనస్సు అనునవి క్రమముగా వానివాని నుపాసించుటలచేతను, ప్రయత్నపూర్వకముగా తపస్సులు చేయుటలచేతను, మానవుని పరిశుద్ధునిఁ జేయఁజాలినవి కావు ఎల్ల విషయములను ప్రత్యక్షముగాకనఁబడఁజాలిన వివేకులైన మహాత్ములు ముహూర్త కాలములోనే మానవుని పరిశుద్ధునిఁ జేయుదురు అది. యట్లుండఁగా మూడైన వాతపిత్తశ్లేష్మములతోఁగూడినయీదేహమునందు పరమాత్మయనుతలఁపును, పెండ్లాముబిడ్డలందు తనవారు అను మమతయు, నీళ్లయందు తీర్థముల నెడు తలఁపును, కలిగిన తెలివిమాలిన మానవుఁడు మృగముతో సమానుఁడు అనఁబడునని తాత్పర్యము.

వ॥ అని యివ్విధంబునం గృష్ణుండాడినసాభిప్రాయంబులగు వాక్యంబులువిని యమ్మునీంద్రులు విభ్రాంతహృదయులై యూరకుండి ముహూర్తమాత్రంబున కమ్మహాత్మునను గ్రహంబుఁబడసి మందస్మితముఖులై యప్పుండరీకాక్షునకిట్లనిరి దేవా నేమును దత్త్వవిదుత్తములయిన బ్రహ్మరుద్రాదులును భవదీయమాయావిమోహితులమయి యుందుము నిగూఢంబయిన నీయిచ్ఛ చేతమమ్మునను గ్రహించితివి భవదీయచరిత్రంబున నిమ్మేదినియొక్కటియయ్యును బహురూపంబులఁగానంబడువిధంబున నీవు మొదలఁ గారణరూపంబున నేకంబయ్యు ననేకరూపంబులు గైకొని జగదుత్పత్తిస్థితిలయంబులకు హేతుభూతంబన నద్భుతకర్మంబులందగిలి లీలావతారంబులు గైకొని దుష్టనిగ్రహంబును శిష్టరక్షణంబును గావించుచుందు వదియునుంగాక వర్ణాశ్రమధర్మంబు లంగీకరించి పురుషరూపంబున వేదమార్గంబువిదితంబు సేసిన బ్రహ్మరూపివి తపస్స్వాధ్యాయనియమంబులచేత హృదయంబు పరిశుద్ధంబుగావున బ్రహ్మస్వరూపంబులైన వేదంబులందు వ్యక్తావ్యక్తస్వరూపంబు లేర్పడఁగానుఁదువు కావున బ్రహ్మకులంబు నెల్ల బ్రహ్మకులాగ్రణివై రక్షించినమహానుభావుండవు మాయాతీతుండవైననిన్ను నీభూమిపాలవర్గంబును నేమునుదర్శింపఁ గంటిమి మాజన్మవిద్యా తపోవయోమహిమలు సాఫల్యంబులయ్యె నీకు నమస్కరించెద మని బహువిధంబులఁ గృష్ణ నభినందించి యమ్మురాంతకుని చేత నామంత్రణంబులువడసి తమతమనివాసంబులకుఁ బోవందలంచునవసరంబున.

టీ॥ (అని) ఇవ్విధంబునన్ = ఈప్రకారముగా. (కృష్ణుండు) ఆడినసాభిప్రాయంబులు=చెప్పినయభిప్రాయముతోడివి. అగువాక్యంబులు=అగునట్టిమాటలు. (విని) అమ్మునీంద్రులు = ఆమునిశ్రేష్ఠులు. విభ్రాంతహృదయులై=భ్రమనొందినమనసులుగలవారై. ఊరకుండి = ఏమియు బదులు చెప్పక యుండి. ముహూర్త మాత్రంబునకున్= ఒకముహూర్త కాలమునకు. అమ్మహాత్మునను గ్రహంబున్=మహిమ గలవాఁడైన యాశ్రీకృష్ణుని యనుగ్రహమును. పడసి=పొంది. మంద స్మితముఖులై=చిఱునవ్వుతోడి మొగముగలవారై. అప్పుండరీకాక్షునకున్=ఆకృష్ణమూర్తికి. ఇట్లనిరి=ఇట్లు పలికిరి. దేవా = స్వామీ. నేమును=మేమును, తత్త్వవిదుత్తములు=తత్త్వము తెలిసినవారిలో నుత్తములు. (అయిన) బ్రహ్మరుద్రాదులును=బ్రహ్మరుద్రుఁడు మొదలగువారును. భవదీయ... మోహితులము—భవదీయ=నీదైన. మాయ — శక్తిచేత. విమోహితులము = మిక్కిలి మోహము నొందినవారము. (అయియుందుము) నిగూఢంబు=తెలియరానిది. (అయిన) నీయిచ్ఛ

దీశ్వర = సకలలోకేశ. (మమ్ము) అనుగ్రహించితివి. భావవిచిత్రంబునన్ = నీనడవడిచేత. శాస్త్రదాని = ఈభూమి. ఒక్కటియయ్యును = ఒకటిగానుండియు. బహురూపంబులన్ = అనేకప్రకారములచేత. కానంబడువిధంబునన్ = అగుపడురీతిగా. అనఁగా మన్ను ఒక్కటే అయినను కుండలు మూకుళ్లు చట్లు మొదలగువాని రూపములతో బహువిధములుగా కనఁబడినట్లు, శ్రు॥ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమితి, అని శ్రుతి॥(నీవు) మొదలన్ = మొదట. కారణరూపంబునన్ = అవ్యక్తమహత్తత్వాది కార్యములకు కారణమైన పరబ్రహ్మమగుటచేత. ఏకంబయ్యును = ఒకటిగానుండియు. సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యుఁడవై అనుట. అనేకరూపంబులు = బహురూపములు. కైకొని = అవలంబించి. (ఏకోదేవోబహుధానివిష్టః॥ అని శ్రుతి) జగదుత్పత్తిస్థితిలయంబులకున్ = జగత్తుయొక్క పుట్టుకకును ఉనికికిని నాశమునకును. హేతుభూతంబు = బ్రహ్మవిష్ణు రుద్ర రూపములచేత హేతువైనది. అనన్ = అనునట్లు. అద్భుతకర్మంబులన్ = ఆశ్చర్య కార్యములను. తగిలి = ఆసక్తుఁడవై. లీలావతారంబులు = విలాస రూపములైన యవతారములను. కైకొని = అంగీకరించి – పొంది. దుష్టనిగ్రహంబును = దుర్మార్గులశిక్షించుటయు. శిష్టరక్షణంబును = యోగ్యులను రక్షించుటయును. కావించుచుందువు = చేయుచుందువు. (అదియునుం గాక) వర్ణాశ్రమధర్మంబులు = బ్రాహ్మణాది వర్ణములయు బ్రహ్మచర్యాదులైన యాశ్రమములయు ఆచారములను. అంగీకరించి = పరిగ్రహించి. పురుషరూపంబునన్ = మనుష్యరూపముతో. వేదమార్గంబు = వేదమునందుచెప్పఁబడినధర్మమార్గమును. విదితంబుచేసిన = తెలియఁబఱచిన. బ్రహ్మరూపివి = పరబ్రహ్మస్వరూపుఁడవు. తపస్స్వాధ్యాయనియమంబులచేతన్ = తపస్సు వేదాధ్యయనము అను నియమములచేత. హృదయంబు = మనస్సు. పరిశుద్ధంబు = నిర్మలము. కావునన్ = అగుటనుగనుక. బ్రహ్మస్వరూపంబులైన = పరబ్రహ్మాకారములైన. వేదంబులందున్ = వేదములయందు. వ్యక్తావ్యక్త రూపంబులు = తెలియఁబడినవియు తెలియఁబడనివియునైనరూపములు. (ఏర్పడఁగానుందువు) కావునన్ = కనుక. బ్రహ్మకులంబునెల్లన్ = బ్రాహ్మణకులమునెల్లను. బ్రహ్మకులాగ్రణివై = బ్రహ్మకులములోముఖ్యుఁడవై. రక్షించిన = కాపాడిన. మహానుభావుండవు = గొప్ప మహిమగలవాఁడవు. మాయాతీతుండవు = పర అపర అనుప్రకృతిని అతిక్రమించినవాఁడవు. (అయిన నిన్ను) ఈభూమిపాలవర్గంబును = ఈరాజసమూహమును. నేము = మేమును. దర్శింపంగంటిమి = చూచునంతటి భాగ్యము చేసితిమి. మాజన్మవిద్యా తపోమహిమలు = మావైనజన్మములయు విద్యలయు తపస్సులయు మాహాత్మ్యములు. సాఫల్యంబులు = ఫలముతోఁ గూడినవి. అయ్యెన్ = ఆయెను. (నీకునమస్కరించెదము అని) బహువిధంబులన్ = అనేకవిధములచేత. (కృష్ణుని) అభినందించి = పొగడి అమ్మురాంతకునిచేతన్ = ఆకృష్ణమూర్తిచేత. ఆమంత్రణంబులు = అనుజ్ఞలను. పడసి = పొంది. తమతమనివాసంబులకున్ = వారివారి యిండ్లకు. పోవందలంచునవసరంబునన్ = పోవుటకుఁ దలఁచునట్టి సమయమునందు.

తా॥ అనియీప్రకారముగా కృష్ణుఁడుచెప్పిన అభిప్రాయాను సారమైన మాటలనువిని ఆమునీశ్వరులందఱును భ్రమచెందినమనసులు గలవారై ఒక ముహూర్తకాలము ఏమియు మాటాడనేరక యూరకుండి పిమ్మట ఆకృష్ణమూర్తియొక్క అనుగ్రహము వలన భ్రమవదలి చిఱునవ్వులునవ్వుచుకృష్ణునితో స్వామీ! మేమును బ్రహ్మరుద్రుఁడుమొదలగువారును నీమాయవలన ఏమియు తెలియనివారమై యుందుము, అట్లు తెలియనేరనిమమ్మును తెలియరానిదైననీయిచ్ఛచేత అనుగ్రహించితివి. విచిత్రమయిన నీచరిత్రము చేతనే మన్ను యొకటిగానుండియు కుండలు చట్లు మూకుళ్లు మొదలగు రూపములచేత బహువిధములఁ గానవచ్చునట్లు మొట్టమొదట నీవుసర్వకారణమైన పరబ్రహ్మరూపముచేత ఒకరూపము గలవాఁడవై యుండియు పెక్కురూపములనుపొంది లోకముయొక్క ఉత్పత్తిస్థితినాశము అను కార్యములకు బ్రహ్మవిష్ణురుద్రరూపములతో కారణమైనట్లు ఆశ్చర్యకరములైన కార్యములను చేయుటయందిచ్ఛగల వాఁడవై మత్స్యకూర్మాదులైనవిలాసరూపములైన యవతారములెత్తి దుష్టులనుశిక్షించుచు శిష్టులను రక్షించుచునుందువు ఇదిగాక నీవు బ్రాహ్మణాదివర్ణములను బ్రహ్మచర్యాదులైన యాశ్రమములను మనుష్య రూపముచేత పొందినవాఁడవై వేదమునందు చెప్పఁబడిన ధర్మమార్గమును కనఁబఱచినట్టి బ్రహ్మమూర్తివి. తపస్సు వేదపఠనము మొదలగు నియమములచేత మనస్సు నిర్మలమగును కాఁబట్టి పరబ్రహ్మరూపములైన వేదములందు వ్యక్తరూపుఁడనియు అవ్యక్త రూపుఁడనియు చెప్పఁబడుచుందువుకనుక బ్రాహ్మణకులమునందు బ్రాహ్మణశ్రేష్ఠుఁడవై అవతరించి ఆబ్రాహ్మణకులమునురక్షించుచుందువు గొప్పమహిమగలవాఁడవు మాయను దాఁటిన వాఁడవునైన నిన్ను ఈరాచసమూహమును మేమును సేవించునంతటి యదృష్టముగలవారమైతిమి మాజన్మములయు విద్యలయు తపస్సులయు ప్రభావము ఫలవంతమాయెను ఇదిగో ఇప్పుడునీకునమస్కరించెదము అని బహువిధములుగా కొనియాడి వారందఱుఆకృష్ణమూర్తిచేత సెలవుపుచ్చుకొని తమతమఉనికిపట్టులకుపోనుప్రయత్నపడుచుండిరిఆసమయమునందని తాత్పర్యము.

౧౧౮౯.—సీ॥ అమ్మునీశ్వరులకు * నానక దుందుభి - యతిభక్తి వందనం * బాచరించి
తాపసోత్తములార * ధర్మతత్త్వజ్ఞులు - మన్నించి వినుఁడు నా * విన్నపంబు
సత్కర్మవితతిచే * సంచిత కర్మచ - యంబువాసెడు నుపా * యంబునాకు
ఘనదయామతిఁ జెప్పు * డనిన నమ్మునివరు - ల్భావరుల్వినవసు * దేవుఁజూచి
తే॥ యెలమిఁబలికిరి నిఖిలయ * జ్ఞేశుఁడైన । కమలలోచనుఁగూర్చి యా * గములుసేయు
కర్మమునఁబాయు నెట్టిదు * ష్కర్మమైన । నదియ ధర్మంబుగాఁగ నీ * మదిఁదలంపు.

టీ॥ ఆనకదుందుభి = వసుదేవుఁడు. అమ్మునీశ్వరులకున్ = ఆమునిశ్రేష్ఠులకు. అతిభక్తిన్ = మిక్కిలిభక్తితో. వందనంబు = నమస్కారము. ఆచరించి = చేసి. తాపసోత్తములార = ఓఋషిశ్రేష్ఠులారా. నావిన్నపంబు = నామనవిని. ధర్మతత్త్వజ్ఞులు = ధర్మస్వరూపము నెఱిఁగిన

నాతో. (అనుచును) పన్నించి=పన్ననచేసి. (వినుఁడు) సత్కర్మవితతిచేత=సత్=ఉత్తమములైన. కర్మ=యాగాదిక్రియలయొక్క. వితతిచేత=సముదాయముచేత. సంచిత కర్మచయంబు = మనుపు చేయుటచేతఁ గూడిన చెడ్డపనుల సముదాయము. పాసెడు నుపాయంబు = తొలఁగునట్టి యుపాయము — మనువుచేసిన దుష్కర్మలవలని పాపము తొలఁగునట్టివిధము అనుట. నకర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః ॥ అను శ్రుతిచేత త్యాగము వలన మోక్షము గలుగుచుండ కర్మము చేయుటవలన ప్రయోజనమేమి అనిన తొలుతనే త్యాగము గలుగుట కష్టము గనుక సత్కర్మములఁ జేయవలయును. శ్రు॥ జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభిరృణవా జాయతే బ్రహ్మచర్యేణర్షిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః అని శ్రుతి॥ శ్లో॥ ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్। అనపాకృత్య మోక్షంతు సేవమానో వ్రజత్యధః॥ అని మనుస్మృతిగనుక బ్రాహ్మణుఁడు బ్రహ్మచర్యముచేత ఋషుల ఋణమును, యజ్ఞములచేత దేవతా ఋణమును, సంతానముచేత పితృ ఋణమును తీర్పవలయును గావున సత్కర్మములనాచరింప వలయునని భావము. నాకున్=నాతో. ఘనదయాంతికన్=మిక్కుటమయిన దయతోడి బుద్ధితో. (చెప్పుఁడు) అనినన్=అనఁగా. ఆమ్మునివరులు=ఆమునిశ్రేష్ఠులును. భూవరులు=రాజులును. వినన్=వినుచుండఁగా. (వసుదేవుఁజూచి) ఎలమిన్=ప్రీతితో. పలికిరి=చెప్పిరి. నిఖిలయజ్ఞేశుఁడు=ఎల్లయజ్ఞములకు నేలిక. అయినకమలలోచనున్=అయినట్టి శ్రీకృష్ణమూర్తిని. కూర్చి=ఉద్దేశించి. యాగములు సేయు కర్మమునన్ = యజ్ఞములను జేయునట్టిపనిచేత. ఎట్టి దుష్కర్మమైనన్ = ఎటువంటి చెడ్డకార్యములైనను. పాయున్ = తొలఁగును. అదియ=అట్లు యజ్ఞము చేయుటయే. ధర్మంబు గాఁగన్=పుణ్యముగా. నీమదిన్ = నీమనసులో. తలంపు = ఎంచుకొనుము.

తా॥ వసుదేవుఁడు ఆమునిశ్రేష్ఠులకందఱకు భక్తితో నమస్కారముచేసి, ఓమునిశ్రేష్ఠులారా! ధర్మతత్వమును తెలిసిన మీరు నామనవినివిని ఏయుత్తమకర్మముచేత మనువు చేయఁబడిన దుష్కర్మముల వలని పాతకము తొలఁగునో ఆయుత్తమకర్మమును నాయందు దయచేసి సెలవిచ్చితిరేని మేలుగానుండునని ప్రార్థింపఁగా ఆమునులు తక్కిన రాజులందఱు వినుచుండఁగా వసుదేవునితో నిట్లుచెప్పిరి ఎల్ల యజ్ఞములఫలములను ఇచ్చుటకు కర్తయయిన శ్రీకృష్ణమూర్తి నుద్దేశించి యాగములను చేయుము అందువలన ఎటువంటి చెడ్డకర్మములవలని దోషమును తొలఁగును ఆకృష్ణమూర్తికి ప్రీతిగా చేయునట్టి యజ్ఞకర్మమే మిగుల పుణ్యముగా నీమనసులో తలఁచుకొనుము అని చెప్పిరని తాత్పర్యము.

౧౧౩౦.—క॥ దేవర్షి పితౄణంబులు । భూవర మఖ వేదపాఠ ✻ పుత్రులచేతన్
వావిరిఁ దీర్పఁగని పురుషుఁడు । పోవు నధోలోకమునకుఁ ✻ బుణ్యచ్యుతుఁడై.

టీ॥ భూవర=ఓవసుదేవ మహారాజా. దేవర్షి పితౄణంబులు = దేవతలయు ఋషులయు పితృదేవతలయు అప్పులను. మఖ వేదపాఠ పుత్రులచేతన్—మఖ=యజ్ఞములు. వేదపాఠ = వేదముచదువుటలు. పుత్రులచేతన్ = కొడుకులు అనువీనిచేత. వావిరిన్ = క్రమముగా. తీర్పఁగని పురుషుఁడు=తీర్పని మనుష్యుఁడు. పుణ్యచ్యుతుఁడై=పుణ్యము నుండి జాఱినవాఁడై. అధోలోకమునకున్=నరకమునకు. (పోవును)

తా॥ ఓవసుదేవుఁడా! ఏమనుష్యుఁడు యజ్ఞములుచేసి దేవతల ఋణమును, వేదము చదివి ఋషుల ఋణమును, కొడుకులనుగని పితృదేవతల ఋణమును, క్రమముగా తీర్పఁడో అట్టిమనుష్యుఁడు పుణ్యము నుండి తొలఁగినవాఁడై నరకలోకమును పొందును అని తాత్పర్యము.

౧౧౩౧.—క॥ వరతనయాధ్యయనంబులఁ । దరియించితి ఋణయుగంబుఁ ✻ దడయక ధరణీ
వర దేవఋణము సవనా । చరణుఁడవై యీఁగు టొప్పు ✻ సమ్మతి తోడన్.

టీ॥ ధరణీవర=రాజశ్రేష్ఠుఁడవైన వసుదేవుఁడా. వరతనయాధ్యయనంబులన్=శ్రేష్ఠములైన కొడుకులను కనుటచేతను వేదము చదువుటచేతను. ఋణయుగంబున్=రెండు అప్పులను. తరియించితి=దాఁటితివి—తీర్చితివనుట. తడయక=ఇఁక నాలస్యముచేయక. సవనాచరణుఁడవై=యజ్ఞము చేసినవాఁడవై. దేవఋణమున్=దేవతలయప్పును. సమ్మతితోడన్=ఇష్టముతో. ఈఁగుట=తీర్చుకొనుట. ఒప్పున్=తగును.

తా॥ ఓవసుదేవా! నీవు మంచి కొడుకులను గని పితృదేవతల ఋణమును, వేదమును చదివి ఋషుల ఋణమును తీర్చితివి, ఇఁక ఇష్టముతో ఆలస్యము చేయక యజ్ఞమును చేసి దేవతల ఋణమును తీర్పుము అనిరని తాత్పర్యము.

(✻) వసుదేవుఁడు యజ్ఞము చేయింపఁ ఋషుల వేఁడుట. (✻)



వసుదేవుఁడు





క॥ అనవుడు నవ్వసుదేవుఁడు
ముని వరులకు ననియె వినయ ✻ మున మీరలు చె
ప్పినయట్ల మఖము సేసెద
దినకర నిభులార మీరు ✻ దీర్పఁగ వలయున్.

టీ॥ అనవుడున్=అని వారుచెప్పఁగా. (అవ్వసుదేవుఁడు) మునివరులకున్=మునిశ్రేష్ఠులతో. వినయమునన్=అడఁకువతో. అనియెన్=ఇట్లు పలికెను. దినకరనిభులార=సూర్యునిఁబోలినవారలారా. మీరలు=మీరు. చెప్పినయట్ల=చెప్పిన విధముగానే. మఖము=యజ్ఞమును. చేసెదను. (మీరు) తీర్పఁగవలయున్ = ఆయజ్ఞమును నెఱవేర్పవలయును.

టీ॥ అనియిట్లుమునులుచెప్పఁగావసుదేవుఁడువినయముతో వారిని జూచి సూర్యునివలె మిక్కుటమయిన తేజస్సు గలిగి వెలుఁగుచున్న ఓమునీంద్రులారా! మీరుచెప్పినప్రకారమైన యజ్ఞముచేసెదను మీరుదగ్గఱ నుండి ఆయజ్ఞమును నెఱవేర్ప వలయునని పలికెనని తాత్పర్యము.


కశ్యపుఁడు.


గౌతముఁడు.




వ్యాసుఁడు.


దేవకీదేవి.


వసుదేవుఁడు.


ఉగ్రసేనుఁడు.


నందుఁడు.


బలరాముఁడు.









(*) వసుదేవుఁడు యజ్ఞముచేయుట. (*)

వ॥ అని యభ్యర్థించి యమ్మునీంద్రుల యాజకులంగా వరించి యప్పుణ్యతీర్థోపాంతంబున మహేంద్రామిత వైభవంబున నష్టాదశభార్యాసమేతుండై దీక్షగైకొని యమ్మహాధ్వరంబు వేదోపదిష్టవిధిం బరిసమాప్తిం బొందించి ఋత్విజ్నికాయంబుల బహుదక్షిణలం దనిపి భార్యాసమేతుండై యవభృథస్నానం బాచరించి వివిధ మణిమయ భూషణ విచిత్రాంబర సురభి కుసుమానులేపనంబులు ధరించి నిఖిల భూదేవ ముని బంధు రాజ లోకంబుల నుచిత సత్కారంబులఁ బ్రీతులం గావించిన వారు కృష్ణానుమతి నాత్మ నివాసంబులకుం జని రందు.

టీ॥ అని—అభ్యర్థించి=వేఁడుకొని. అమ్మునీంద్రులన్ = ఆముని శ్రేష్ఠులను. యాజకులంగాన్ =యజ్ఞముచేయించువారినిఁగా. వరించి= కోరి. అప్పుణ్యతీర్థోపాంతంబునన్ =ఆపుణ్యతీర్థముగట్టున. మహేంద్రామితవైభవంబునన్=ఇంద్రునివైభవమునుమించినవైభవముతో. అష్టాదశ భార్యాసమేతుండై=పదునెనమండ్రుభార్యలతోఁ గూడుకొన్నవాఁడై. దీక్షన్ =యజ్ఞముచేయునియమమును. కైకొని=పొంది. అమ్మహాధ్వరంబు =ఆగొప్పయజ్ఞమును. వేదోపదిష్టవిధిన్ = వేదమునం దుపదేశింపఁ బడినవిధమును-వేదమునందుచెప్పఁబడినట్లు. పరిసమాప్తిన్ =చక్కగా

ఋత్విక్సికాయంబులన్=ఋత్విక్కుల సమూహ ... అధికములయిన దక్షిణల చేత. తనిపి=తృప్తిపొందించి. భార్యాసమేతుండై=భార్యలతోఁ గూడుకొన్నవాఁడై. అవభృథస్నానంబు=దీక్షాంత స్నానమును. ఆచరించి=చేసి. వివిధ... కేసనంబులన్ విధ=నానావిధములయిన. మణిమయ=రత్నవికారము లయిన. ... =ఆభరణములను. చిత్ర=నానావర్ణములైన. అంబర=వస్త్రములను. సురభి=మంచివాసనగల. కుసుమ=పూవులను. అనులేపనం...=గంధము పూసికొనుటలను. ధరించి=తాల్చి నిఖిల... లోకతంబులన్=నిఖిల=సమస్తమైన. భూదేవ=బ్రాహ్మణులయు. ముని=ఋషులయు. బంధు=చుట్టములయు. రాజ=రాజులయు. లోకంబులన్=సమూహములను. ఉచితసత్కారంబులన్=తగినమర్యాదలచేత. ప్రీతులన్=సంతోషించినవారినిఁగా. కావించినన్=చేయఁగా. (వారు) కృష్ణానుమతిన్=కృష్ణుని యనుజ్ఞచేత. ఆత్మనివాసంబులకున్=తమయునికిపట్లకు. చనిరి=పోయిరి. అందున్=వారియందు.

తా॥ అని వసుదేవుఁడువారిని ప్రార్థించి ఆమునులచేయాజకులను గాను నియమించుకొని పుణ్యతీర్థమైన యాశమంతపంచకము నందే ఇంద్రుని వైభవమునుమించిన వైభవముతో తన భార్యలు పదునెనమండ్రతోను గూడుకొన్నవాఁడై యజ్ఞదీక్షనువహించి ఆగొప్పయజ్ఞమును వేదమునందుచెప్పఁబడినక్రమములో పూర్తిపొందించి ఋత్విక్కులకు శాస్త్రమునందు విధించినంతకంటె హెచ్చుగా దక్షిణలిచ్చి తృప్తిపఱిచి తనభార్యలును తానును దీక్షాంతమునందు చేయునట్టి అవభృథము అను స్నానమును చేసి నానావిధములయిన రత్నాల సొమ్ములచేతను మంచి మంచివస్త్రములచేతను మంచివాసనగల గంధము పువ్వులు మొదలగు వానిచేతను తగినట్లుఁదిని అర్చించి బ్రాహ్మణులను, రాజులను, మహర్షులను, చుట్టములను, సంతోషపెట్టెను, అంతట ఎల్లవారును కృష్ణునిచేత సెలవుపుచ్చుకొని తమ ఉనికిపట్లకుపోయిరి అప్పుడు అందులో ననితా.

౧౧౩౩.—ఉ॥ ఆతఱి నుగ్రసేన వసు * ధాధిప పంకజనాభ ముష్టికా
రాతులు దమ్మునర్థి మధు * రప్రియ భాషల నిల్వ వేఁడినన్
గౌతుక మాత్మల న్వెలయఁ * గా వసియించిరి గోప గోపికా
వ్రాతముతోడ నచ్చట ధ * రావర నందయశోద లిమ్ములన్.

టీ॥ ధరావర=ఓరాజా. నందయశోదలు=నందుఁడును యశోదయు. ఆతఱిన్=ఆసమయమునందు. ఉగ్రసేన ... రాతులు—ఉగ్రసేన వసుధాధిప=ఉగ్రసేన మహారాజును. పంకజనాభ=కృష్ణుఁడును. ముష్టికారాతులు=బలరాముఁడును. తమ్మున్=తమ్మును. అర్థిన్=ప్రీతితో. మధురప్రియ భాషలన్=ఇంపైనవియు ప్రియమయినవియునైనమాటలచేత, నిల్వన్=నిలువను. వేఁడినన్=అడుగుకొనఁగా. కౌతుకము=కుతూహలము. ఆత్మలన్=మనసులందు. వెలయఁగాన్=ఒప్పఁగా. గోపగోపికా వ్రాతముతోడన్=గోపకులయు గోపికలయుగుంపుతోఁగూడ. అచ్చటన్=అక్కడ. ఇమ్ములన్=సుఖముగా. వసియించిరి=ఉండిరి.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! నందుఁడును యశోదయు తమ్మును కొన్నాళ్లు అక్కడనే యుండవలయు నని ఉగ్రసేన మహారాజును కృష్ణుఁడు బలరాముఁడును ప్రీతితో ఆదరించి చెప్పఁగా గోపకులతోడను గోపికలతోడను అచ్చటసుఖముగానుండిరి అనితాత్పర్యము.

౧౧౩౪.—క॥ హరినయముల హరి ప్రియముల। హరిమధురాలాపములను * హరికథలమనో
హరలీలఁ దగిలి నందుఁడు। నిరుపమగతి నచట మూఁడు * నెలలుండె నృపా.

టీ॥ నృపా=రాజా. (నందుఁడు) హరినయములన్=కృష్ణుని యొక్కచిన్ననినడతలయందును. హరిప్రియములన్=కృష్ణునియొక్క ప్రియమును పుట్టించుపనులయందును, హరిమధురాలాపములన్=కృష్ణునియొక్క యింపైనమాటలయందును, హరికథలన్=కృష్ణునియొక్కమునుపటి చరిత్రములను చెప్పుకొనుటలయందును, మనోహరలీలన్=మనోజ్ఞమైనవిధముచేత, తగిలి=ఆసక్తుఁడై. నిరుపమగతిన్=ఈడులేని విధమున. అచ్చటన్=అక్కడ. (మూఁడు నెలలుండెను)

తా॥ ఓరాజా! కృష్ణుని చిన్ననినడతలయందును, అతఁడప్పుడు చేయుచున్న యిష్టములయిన పనులయందును, అతనియొక్క ప్రియమును పుట్టించుమాటలయందును, అతఁడుచిన్ననాటనుండి చేసినకార్యములను చెప్పుకొనుటల యందును, ఆసక్తిగలవాఁడై నందుఁడు సుఖముగా అచ్చట మూఁడునెలలకాలము ఉండెనని తాత్పర్యము.

౧౧౩౫.—చ॥ జలరుహలోచనాది యదు * సత్తములందఱు నన్నిభంగులన్
గలితవిభూషణాంబర ని * కాయములిచ్చి బహూకరించి వీ
డ్కొలిపిన నందముఖ్యులు ము * కుంద పదాబ్జమరందపాన స
ల్లలిత నిజాత్మ షట్పదము * లన్ మరలించుచు నెట్టకేలకున్.

టీ॥ జలరుహ... సత్తములు—జలరుహలోచన=కృష్ణుఁడు. ఆది=మొదలుగాఁగల. యదుసత్తములు=యదువంశశ్రేష్ఠులలో ముఖ్యులు, అందఱున్=ఎల్లవారును, అన్నిభంగులన్=ఎల్లవిధములచేతను, కలిత విభూషణాంబర నికాయములు=ఒప్పిదమయిన సొమ్ములయు కోకలయు సముదాయములను. (ఇచ్చి) బహూకరించి=సన్మానించి. వీడ్కొలిపినన్=సెలవిచ్చిపంపఁగా. నందముఖ్యులు=నందుఁడు మొదలగువారు. ముకుంద... ములన్—ముకుంద=కృష్ణుసింబైన. పద=అడుగులనెడు. అబ్జ=తామరలయందలి. మరంద=తేనెను. పాన=త్రాగుటచేత. సల్లలిత=మిక్కిలిమనోజ్ఞములయిన. నిజ=తమవియైన. ఆత్మ=మనస్సులనెడు. షట్పదములన్=తుమ్మెదలను. ఎట్టకేలకున్=బహుప్రయాసమున. మరలించుచున్=త్రిప్పుకొనుచు.

తా॥ కృష్ణుఁడు మొదలగువారు యాదవశ్రేష్ఠులలో ముఖ్యులందఱు

—ఆత్మవిధములచేతను నన్నానించి మంచిమంచి సొమ్ములు కోకలు బహుమానముగా శ్రీకృష్ణమూర్తియొక్క పాదకమలములయందలి తేనె త్రాగఁగోరిపోనేరనితుమ్మెదలనుబోలినతమమనసులను అతిప్రయాసముచేత వెనుకకుత్రిప్పుకొనినందుఁడు మొదలగువారు వెడలిరనితా.

౧౧౩౬.—ఆ॥ మరలి మరలి కృష్ణ ✻ మాధవ గోవింద । పద్మనాభ భక్త ✻ పారిజాత
దేవదేవ యనుచుఁ ✻ దివిరిచూచుచు మధు । రాభిముఖులు నగుచు ✻ నరిగిరంత.

టీ॥ మరలిమరలి=వెనుకకుతిరిగితిరిగి. (కృష్ణ, మాధవ, గోవింద, పద్మనాభ, భక్తపారిజాత, దేవదేవ) అనుచున్ = అని శ్రీకృష్ణుని నామములను ఉచ్చరించుచు. దివిరి = పూని. (చూచుచును) మధురాభిముఖులును = మధురాపట్టణముతట్టు తిరిగినవారును. (అగుచును) అరిగిరి = తమపల్లెలకుపోయిరి. అంతన్ = అటుపిమ్మట.

తా॥ అట్లు బయలుదేఱిన నందుఁడు మొదలగు గొల్లలు కృష్ణునియందలి మక్కువచేత ఆయనను విడిచిపోలేక మరలిమరలి చూచుచు ఆయననామస్మరణచేయుచు మధురాపట్టముతట్టు తిరిగిపోయిరనితా.

౧౧౩౭.—క॥ క్రమమున నచ్చటఁ బ్రావృ । ట్సమయంబగుటయును బంధు ✻ జనయాదవ వ
ర్గములోలిఁ గొలువ సురగణ । నమితులు బలకృష్ణులాత్మ ✻ నగరంబునకున్.

టీ॥ క్రమమునన్=కాలక్రమముచొప్పున. అచ్చటన్=అక్కడ. ప్రావృట్సమయంబు = వర్షాకాలము. అగుటయున్ = కాఁగా. బంధుజనయాదవవర్గములు = చుట్టములయిన యాదవ సమూహములు. ఓలిన్=వరుసగా. కొలువన్ = సేవింపఁగా. సురగణనమితులు = దేవతలచేత మ్రొక్కఁబడినవారు. బలకృష్ణులు = బలరాముఁడును కృష్ణుఁడును. ఆత్మనగరంబునకున్ = తమపట్టణమునకు.

వ॥ వచ్చిసుఖంబుండునంత. టీ॥ వచ్చి సుఖముగా నున్నపిమ్మట.

తా॥ అంతట కాలక్రమమున వర్షాకాలము రాఁగా బలరామకృష్ణులు తమచుట్టములైన యాదవు లందఱు వెంట రాఁగా ఆకురుక్షేత్రమునందుండి వెడలి తమపట్టమునకువచ్చి సుఖముగానుండిరని తాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ కురుక్షేత్రము=సకల సత్కర్మములును చేయఁదగినమనుష్యశరీరము—దీని క్షేత్రమంతపంచకమని పేరు. ని॥ క్షేత్రంపత్నీశరీరయోః॥ అని అమరము. శ్లో॥ ధర్మక్షేత్రేకురుక్షేత్రే సమవేతాయుయుత్సవః। మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥ అని భగవద్గీత. అయిదుమడుఁగులు=అన్నమయాదిపంచకోశములు. వానిలోమునుఁగుటయనఁగా—శ్రుతి॥ అన్నంబ్రహ్మేతివ్యజానాత్, ప్రాణోబ్రహ్మేతివ్యజానాత్, మనోబ్రహ్మేతివ్యజానాత్, విజ్ఞానంబ్రహ్మేతివ్యజానాత్ ఆనందోబ్రహ్మేతివ్యజానాత్, అని యుపనిషత్తుగనుక పంచకోశములను విచారించి పరబ్రహ్మమని తెలిసికొనుట. శ్రు॥ చిదేవదేహశ్చిదిమేచలోకాః చిదేవభూతాని చిదింద్రియాణి కర్తా చిదంతఃకరణం చిదేవ చిదేవ సర్వంపరమార్థరూపం చిదేవాహంచిదేవత్వం సర్వమేతచ్చిదేవహి॥ అని యుపనిషత్తు. పరశురాముఁడు—పరశు=దృఢవైరాగ్యమనెడుగండ్రగొడ్డలిచేత. రాముఁడు = క్రీడించువాఁడు—బ్రహ్మవేత్త. బ్రహ్మవేత్తయైనవాఁడు దృఢవైరాగ్యముచేత కామాది శత్రువర్గమనెడు రాజవర్గమును సంహరించి మనుష్యశరీరమనెడు కురుక్షేత్రమందే పంచకోశాదికము పరబ్రహ్మమని తెలిసికొన వలయును గాని యితరదేహములయందు తెలిసికొనరాదని బోధించువేదముఁగు లేర్పఱచుట. సూర్యగ్రహణము=శ్రు॥ చంద్రమామనసోజాతః, చక్షోస్సూర్యో అజాయత, అని శ్రుతిగనుక సూర్యుఁడనఁగా నేత్రమువలె ప్రకాశించుచున్న అపరోక్షజ్ఞానము, గ్రహణమనఁగా ఆట్టిజ్ఞానమును ఆవరణవిక్షేప శక్తులనెడు రాహుకేతువులు కమ్ముట, అనఁగా స్వేతరముకలదనెడి పరోక్షజ్ఞానముపుట్టుట, గ్రహణమువిడుచుట అనఁగా పరోక్షజ్ఞానము వదలుట, సర్వం ఖల్విదం బ్రహ్మ, బ్రహ్మైవాహం అను తన దృఢాపరోక్ష జ్ఞానము ఆవరణవిక్షేప శక్తుల వలన మఱుఁగుపడి నేనుజీవుఁడను, వర్ణాశ్రమ నామరూపములు గలవాఁడను, సుఖిని, దుఃఖిని, అజ్ఞానిని, పాపిని అనెడు పరోక్షజ్ఞానము కగిలినప్పుడు బ్రహ్మవిచారణచేసి బ్రహ్మైవాహమని దృఢపడి ఆనందింపవలయుననిభావము. బ్రహ్మవేత్తలైనవారు శ్రుతియుక్త్యనుభవములచేత బ్రహ్మవిచారణ చేయుచుందురు.

### (✻) దేవకీదేవిమృతులైన తనపుత్రులఁ దెమ్మనిబలరామకృష్ణుల వేఁడుట. (✻)

సీ॥ అవనీశ యొక్కనా ✻ డానక దుందుభి
 భార్య పద్మాక్షుఁడు ✻ బలుఁడు దోర్లి
శరధిలోఁ జచ్చిన ✻ గురుతనూభవునిని
 మరలంగఁ దెచ్చిన ✻ మహిమ యెల్ల
జనములు దమలోన ✻ సన్నుతుల్సేయంగ
 వినితనసుతులు దు ✻ ర్వృత్తుఁడైన
కంసుచే నిహతులై ✻ కాలుని పురినున్న
 వారినందఱఁ జూడఁ ✻ గోరి కృష్ణ



తే॥ బలులకడకేగి కన్నుల ✻ బాష్పకణము । లొలుక నోరామనామని ✻ తోయ్యనాత్మ
పరమపావన మూర్తియో ✻ మురవిభేది । యిందిరానాథ యోగీశ్వ ✻ రేశ కృష్ణ.

టీ॥ అవనీశ=రాజా. ఒక్కనాడు=ఒకదినము. ఆనకదుందుభిభార్య=వసుదేవుని పెండ్లాము—దేవకీదేవి. తొల్లి=మునుపు. పద్మాక్షుండు=కృష్ణుఁడును. బలుఁడు=బలరాముఁడును. శరధిలోన్ = సముద్రమునందు. చచ్చినగురుతనూభవునిన్=చనిపోయిన గురువు కొడుకును. మరలంగన్=తిరుగా. తెచ్చినమహిమలెల్లన్ = తీసుకవచ్చిన ప్రభావములన్నియు. (జనములు) తమలోనన్ = తమలోఁదాము. సన్నుతులేయంగన్=పొగడఁగా. (విని) తనసుతులు=తనకొడుకులు. దుర్వృత్తుఁడు = చెడ్డనడవడిగల వాఁడు. ఐనకంసునిచేన్ = అయినట్టికంసునిచేత. నిహతులై = చంపఁబడినవారై. కాలునిపురిన్=యమునిపట్టణమునందు. (ఉన్న వారినంద అను) చూడఁగోరి=చూడను అపేక్షించి. కృష్ణబలులకడకున్=కృష్ణ బలరాముల వద్దకు. ఏగి=పోయి. కన్నులన్ = కన్నులందు. బాష్పకణములు=కన్నీటిబొట్లు. ఒలుకన్ = రాలఁగా. ఓరామనామ = ఓబలరాముఁడా. నిత్యోన్నతాత్మ=ఎల్లప్పుడుగొప్ప మనసుగలవాఁడా. పరమపావనమూర్తి = మిక్కిలి పరిశుద్ధమయిన యాకృతిగల. ఓమురభేది = మురాసురునిజంపినవాఁడా. ఇందిరానాథ=లక్ష్మీనాయకుఁడా. యోగీశ్వరేశ=యోగీశ్వరులకుప్రభువా. కృష్ణ=కృష్ణుఁడా.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! అటుపిమ్మట ఒకనాడు దేవకీదేవి మునుపు బలరామకృష్ణులు సముద్రములో చనిపోయిన గురువుకొడుకును మరలబ్రతికించి తెచ్చియిచ్చిరి అనువృత్తాంతమును జనులవాడుకలవలనవిని మదముచేత నిక్కుచు చెడ్డపనులయందు వర్తించుచున్న కంసునిచేత చంపఁబడినతనకొడుకులను తలఁచుకొనివారిని చూడఁగోరినదై కన్నులందు నీళ్లుకాలుచుండఁగా దుఃఖించుచు కృష్ణబలరాములయొద్దకుఁబోయి గొప్పమనసుగల ఓబలరామా! మిక్కిలిపావనమైనమూర్తిగలవాఁడవును మురాసురునిఁ జంపిన వాఁడవును లక్ష్మీనాయకుఁడవునైన ఓకృష్ణాయని పిలిచి యని తాత్పర్యము.

౧౧౩౯.—క॥ మురకంస చైద్య పౌండ్రక । నరక జరాతనయ యవన * నరనాయకులం
దురితాత్ములఁ బొరిఁగొని భూ । భరముడిపిన యట్టిమేటి * బలులు దలంపన్.

టీ॥ తలంపన్=విచారింపఁగా. (మీరు) ముర...కులన్—ముర=మురాసురుఁడు. కంస=కంసుఁడు. చైద్య=శిశుపాలుఁడు. పౌండ్రక=పౌండ్రకవాసుదేవుఁడు. నరక=నరకాసురుఁడు. జరాతనయ=జరాసంధుఁడు. యవన=కాలయవనుఁడునైన. (నరనాయకులను) దురితాత్ములన్=పాపాత్ములను. పొరిగొని=చంపి. భూభరము=భూమిబరువును. ఉడిపినయట్టిమేటిబలులు=పోఁగొట్టిన అధిక బలముగలవారు.

తా॥ విచారింపఁగా మీరు మురాసురుఁడు, కంసుఁడు, శిశుపాలుఁడు, పౌండ్రకుఁడు, నరకాసురుఁడు, జరాసంధుఁడు, కాలయవనుఁడు నను పాపాత్ములగు రాజులను జంపి భూమి భారమును పోఁగొట్టిన మహాబలవంతులు అని తాత్పర్యము.

౧౧౪౦.—ఆ॥ జననవృద్ధి విలయ * సంగతి నిఖిలంబుఁ । బొందఁజేయు పరమ * పురుషులార
మీకు లీలలౌట * మీరని నమ్మిన । దాన నేను వినుఁడు * దారులార.

టీ॥ జనన...సంగతిన్ — జనన=పుట్టుకయొక్కయు. వృద్ధి = పెరుగుటయొక్కయు. విలయ=నశించుటయొక్కయు. సంగతిన్=కూడికను. నిఖిలంబున్ = సమస్తప్రాణులను. పొందఁజేయు పరమపురుషులార = పొందించునట్టి పురుషశ్రేష్ఠులారా. ఉదారులార = గొప్పమహిమగలవారలారా. (మీకు) లీలలౌటన్=ఈప్రపంచవ్యాపారము లన్నియు వినోద కార్యము లగుటచేత. (నేను) మీరనినమ్మిన దానన్=మీరేనాకుదిక్కు అనినమ్మియున్నాను. వినుఁడు = నాకోరికనువినుఁడు.

తా॥ ఎల్లప్రాణులను పుట్టించుచు పెంచుచు త్రుంచుచునుండునట్టి గొప్పమహిమగలవారలారా! మీకు ప్రపంచముపుట్టించుట మొదలగుకార్యములు వినోదములగుటచేత నేనుమీరేనాకుదేవతలని నమ్మియున్నాను నాకుఁగలకోరికనుజెప్పెదను వినుఁడు అనితాత్పర్యము.

కృష్ణబలరాములు తమతమ్ములఁ దేఁబోవుట.

వ॥ అని బహుభంగుల వినుతించుచు నిట్లనియె మీరలు
మహానుభావులరు మీరుతొల్లి యనేకకాలంబుచనిన
క్రిందట మృతుండయి దండధరుమందిరంబుననున్న
గురుకుమారుని మీమహాప్రభావంబులులోకంబులఁ
బరిపూర్ణంబులయి ప్రకాశింప నక్కాలుని చెంత
నుండి మగుడందెచ్చి గురుదక్షిణగానొసంగితి రవ్వి
ధంబునఁగంసునిచేతహతులైనమత్పుత్రులనందఱ
మరలం దెచ్చి నామనంబుననున్న దుఃఖంబు నివా
రింప వలయునని దేవకీదేవి ప్రార్థించినందమతల్లి
యాడిన మృదు వాక్యంబు లత్యాదరంబున నాద
రించి యప్పు డబ్బలకృష్ణులు దమయోగ మాయా
మాహాత్మ్యంబున సుతలంబునకుం జనిరట్టియెడ.



టీ॥ (అని) బహుభంగులన్ = అనేకవిధములచేత. వినుతించుచున్ = పొగడుచు. ఇట్లనియెన్ = ఇట్లుపలికెను. మీరలు = మీరు. మహానుభావులరు = గొప్పమహిమగలవారు. (మీరు) తొల్లి = మునుపు. అనేకకాలంబు = బహుకాలము. చనినక్రిందటన్ = పోయినదానికి ముందు. మృతుండయి = చచ్చి. దండధరుమందిరంబునన్ = యముని యింటను. ఉన్నగురుకుమారునిన్ = ఉండునట్టి గురువుకొడుకును. మీమహాప్రభావంబులు = మీగొప్పమహిమలు. లోకంబులన్ = లోకములయందు. పరిపూర్ణంబులై = నిండినవై. ప్రకాశింపన్ = వెలుఁగఁగా. ఆకాలుని చెంతనుండి = ఆయముని యొద్దనుండి. మగుడన్ = మరల. తెచ్చి = తీసికొనివచ్చి, గురుదక్షిణగాన్ = గురువునకునిచ్చునట్టిదక్షిణగా. ఒసంగితిరి = ఇచ్చితిరి. అవ్విధంబునన్ = ఆరీతిగా. (కంసునిచేత) హతులైన = చంపఁబడిన. మత్పుత్రులన్ = నాకొడుకులను. అందఱన్ = అంతమందిని. మరలన్ = తిరుగా. తెచ్చి = తీసికొని వచ్చి. నామనంబునన్ = నామనసులో. ఉన్నదుఃఖంబు = ఉన్నట్టిదుఃఖమును. నివారింపవలయున్ = పోఁగొట్టవలయును. (అని దేవకీదేవి) ప్రార్థించినన్ = వేఁడుకోనఁగా. (తమతల్లి) ఆడినమృదువాక్యంబులు = చెప్పినతిన్ననిమాటలను. అత్యాదరంబునన్ = మిక్కిలియాదరణతో. ఆదరించి = మన్నించి. (అప్పుడు) అబ్బలకృష్ణులు = ఆబలరాముఁడును కృష్ణుఁడును. తమయోగమాయామాహాత్మ్యంబునన్ = తమదైన యోగమాయయొక్క మహిమచేత. సుతలంబునకున్ = సుతలలోకమునకు. చనిరి = పోయిరి. అట్టియెడన్ = ఆసమయమునందు.

తా॥ అని యనేకవిధములుగా పొగడుచు దేవకీదేవి యిట్లుపలికెను, మీరుమిక్కిలి మహిమగలవారు మునుపు అనేకకాలము గడచినప్పుడు చనిపోయిన మీగురువు కొమారుని యమలోకమునందుండి తీసుకవచ్చిగురుదక్షిణగా ఇచ్చితిరి అందువలనమీకీర్తిలోకములో నిండి వెలుఁగుచున్నదికనుక ఇప్పుడును ఆవిధముగా నేకంసుఁడు చంపఁగా చచ్చిన నాకొడుకులను దెచ్చి నాకుఁగనఁబఱిచి నామనసులోనిదుఃఖమును పోఁగొట్టుఁడు అనివేఁడుకొనఁగా ఆతల్లిమాటలను పాటించి అప్పుడే బలరామకృష్ణులిద్దఱును తమయోగమాయా ప్రభావముచేత సుతలమనెడు పాతాళ లోకమునకు పోయిరి అనితాత్పర్యము.









మంత్రి. బలరాముఁడు. బలిచక్రవర్తి. భార్య.

### (*) బలిచక్రవర్తి బలరామకృష్ణులఁ బూజించుట. (*)

౧౧౮౨.—మ॥ కనియెన్ దానవుఁ డింద్ర సేనుఁడు దళ * త్కంజాక్షులన్ దక్షులన్
ఘనసారాంబుద వర్ణులన్ నిఖిలలో * కైక ప్రభా పూర్ణులన్
దనరారన్ హల చక్ర పాణులను భ * క్తత్రాణులన్ నిత్యశో
భన వర్ధిష్ణుల రామకృష్ణుల జయ * భ్రాజిష్ణులన్ జిష్ణులన్.

టీ॥ దళత్కంజాక్షులన్ = వికసించినతామరలవంటికన్నులుగలవారిని. దక్షులన్ = ఎల్లపనులకుఁ జాలినవారిని. ఘనసారాంబుదవర్ణులన్ = కర్పూరముయొక్కయు మేఘముయొక్కయు దేహవర్ణములు గలవారిని. నిఖిలలోకైకప్రభాపూర్ణులన్ = ఎల్లలోకములందును ఒక్కటై వెలుఁగుచున్న తేజస్సుచేత నిండుకొన్న వారిని. హలచక్రపాణులన్ = నాఁగేలును చక్రమునుగల చేతులుగలవారిని. భక్తత్రాణులన్ = సేవకులను రక్షించువారిని. నిత్యశోభనవర్ధిష్ణులన్ = శాశ్వతమైన మేలుచేవృద్ధిఁబొందు స్వభావము గలవారిని. జయభ్రాజిష్ణులన్ = గెలుపుచేత ప్రకాశించుస్వభావముగలవారిని. జిష్ణులన్ = జయించు స్వభావము గలవారిని. రామకృష్ణులన్ = బలరామకృష్ణులను. తనరారన్ = ఒప్పునట్లు. దానవుఁడు = దనుపుత్రుఁడైన. ఇంద్రసేనుఁడు = బలిచక్రవర్తి. కనియెన్ = చూచెను.

తా॥ అప్పుడువికసించినతామరలవంటికన్నులుగలవారును, ఎల్లపనులకుఁ జాలినవారును, కర్పూరమును నల్లమబ్బును బోలినమేనిచాయలుగలవారును, ఎల్లలోకములందు నిండివెలుఁగుచున్న తేజస్సుగలవారును, హలమును చక్రమును చేతులందుఁ బూనినవారును, సేవకులను కాపాడునట్టివారును, శాశ్వతమయిన శుభములచేత వర్ధిల్లునట్టియు, జయములచేత ప్రకాశించునట్టియు, స్వభావములుగలవారును జయించుస్వభావము గలవారునునయిన బలరామ కృష్ణులను, దానవులకు రాజయిన బలిచక్రవర్తి ఒప్పిదముగా దర్శనము చేసెననితా.

౧౧౪౩.—చ॥ కని హితకోటితో నెదురు * గాఁ జనుదెంచి మనోనురాగ సం
జనిత కుతూహలుం డగుచుఁ * జాఁగిలి మ్రొక్కి సమగ్ర కాంచనా
సనములు నుంచి తచ్చరణ * సారస సేచన సర్వలోక పా
వన సలిలంబు లౌదల ధ్రు * వంబుగఁదాల్చి సుభక్తియుక్తుఁడై.

టీ॥ కని = చూచి. హితకోటితోన్ = తనకు కావలసిన వారి సమూహముతో. (ఎదురుగా) చనుదెంచి = వచ్చి. మనో...హలుండు- మనః = మనస్సునందలి. అనురాగ = భక్తివిశేషమువలన. సంజనిత = పుట్టిన. కుతూహలుండు = వేడుకగలవాఁడు. (అగుచును) చాఁగిలి = చాఁగిలఁబడి. మ్రొక్కి = నమస్కరించి. సమగ్ర కాంచనాసనములన్ = అంతయు బంగారుతోనే చేయఁబడిన పీఠములయందు. ఉంచి = కూర్చుండఁబెట్టి. తచ్చరణ... సలిలంబులు—తత్ = వారివైన. చరణసారస = పాదకమలములు. సేచన = తడిపిన—కడిగిన యనుట. సర్వలోక = ఎల్ల లోకములను. పావన = పరిశుద్ధములయిన. సలిలంబులు = (నీళ్లు) ఔదలన్ = నడినెత్తియందు. ధ్రువంబుగన్ = స్థిరముగా, చక్కఁగా. తాల్చి = ధరించి. సుభక్తియుక్తుఁడై = మంచిభక్తితోఁ గూడుకొన్నవాఁడై.

తా॥ ఇట్లు చూచి బలిచక్రవర్తి తనకు కావలసినవారి నంటఁబెట్టుకొని బలరామకృష్ణులకు ఎదురుగాఁబోయి తనమనసు నందు భక్తివిశేషమువల్ల పుట్టిన వేడుకతో సాగిలఁబడి మ్రొక్కి కేవలము బంగారుతోనే చేయఁబడిన పీఠములయందు గూర్చుండఁబెట్టి వారి పాదములు కడిగిన పరిశుద్ధములయిన జలములను తనతలపైఁజల్లుకొని భక్తిచేసినవాఁడై యని తాత్పర్యము.

౧౧౪౪.—సీ॥ సురభి కాలాగరు * హరిచంద నేలాది - ధూపంబు లావిశ్వ * రూపకులకుఁ
గాంచన పాత్ర సం * గత రత్న కర్పూర - దీపంబు లాజగ * ద్దీప కులకుఁ
బాయసాపూపాన్న * పక్వ ఫలాది నై - వేద్యంబు లావేద * వేద్యులకును
దనరు వినూత్న ర * త్న ప్రభాభాసితా - భరణంబు లాదైత్య * హరణులకును

తే॥ మిలమిలని మించుతోఁబోలు * పలరు బహువి । ధాంబరమ్ములు నీలపీ * తాంబరులకు
సలలిత కుసుమమాలికా * మలయజాను । లేపనంబులు భూరిని * ర్లేపులకును.

టీ॥ ఆవిశ్వరూపకులకున్ = ఆప్రపంచస్వరూపము గలవారయిన బలరామకృష్ణులకు. సురభి...ధూపంబులు — సురభి = పరిమళముగల. కాలాగరు = నల్లయగరు. హరిచందన = పచ్చగంధము. ఏలా = ఏలకి. ఆది = మొదలగు. ధూపంబులు = వాసనతోడిపొగలు. ఆజగద్దీపకులకున్ = ఆలోకమును ప్రకాశింపఁజేయువారైన రామకృష్ణులకు. కాంచన...దీపంబులు—కాంచన = బంగారు మయములైన. పాత్ర = పళ్లెరముల యందు. సంగత = కూర్పఁబడిన. రత్న = మణులతోడి. కర్పూరదీపంబులు = కర్పూరపుదీపములును, ఆవేదవేద్యులకున్ = ఆవేదములందు తెలియఁదగినవారైన బలరామకృష్ణులకు. పాయసా...నైవేద్యంబులు- పాయస = పరమాన్నము. అపూప = అప్పములు. అన్న = అన్నము. పక్వ = మాఁగిన, ఫల = పండ్లు. ఆది = మొదలగు. (నైవేద్యంబులును) ఆదైత్యహరణులకున్ = ఆరాక్షసులను చంపువారైన బలరామకృష్ణులకు. తనరు...భరణంబులు—తనరు = ఒప్పునట్టి. వినూత్న = క్రొత్తలైన. రత్న = మణులయొక్క. ప్రభా = కాంతులచేత. భాసిత = ప్రకాశించునట్టి. ఆభరణంబులు = సొమ్ములును. నీలపీతాంబరులకున్ = నల్లనిపచ్చని వస్త్రములుగల ఆబలరామకృష్ణులకు, మిలమిలని మించుతోన్ = మిలమిల యనుమెఱుపుతో, పొలుపు = బాగు. అలరు = ఒప్పునట్టి. బహువిధాంబరమ్ములు = అనేకవిధములయిన వస్త్రములను. భూరినిర్లేపులకున్ = మిక్కిలి సంగము లేనివారికి—మింటివలె వేనితోడి సంబంధము లేనివారైన ఆరామకృష్ణులకు. సలలిత...లును-సలలిత = మనోహరములైన. కుసుమమాలికా = పూలదండలును. మలయజ = మలయపర్వతమునందుఁ బుట్టిన మంచి గంధముయొక్క. అనులేపనంబులును = పూఁతలును. (సమర్పించి)

తా॥ విశ్వరూపకులును, జగద్దీపకులును, వేదవేద్యులును, దైత్యహరులును, నీలపీతాంబరులును, నిర్లేపులును అగు ఆబలరామకృష్ణులకు బలిచక్రవర్తి ధూపదీప నైవేద్య వస్త్రాభరణ పుష్ప మాల్య చందనముల చేత పూజించి యని తాత్పర్యము.

వ॥ సమర్పించి యప్పుండరీక కాక్షుని చరణారవిందంబు లొత్తుచు నానంద బాష్ప పూరంబు తోరంబుగా రోమాంచ కంచుకితశరీరుండగుచుం దనకరకమలంబులు ఫాలభాగంబునం గదియించి యిట్లని స్తుతియించె.

టీ॥ సమర్పించి = భక్తిపూర్వకముగా నిచ్చి. అప్పుండరీకాక్షుని చరణారవిందంబులు = ఆతెల్లదామరలవంటి కన్నులుగల కృష్ణమూర్తియొక్క పాదకమలములను. ఒత్తుచున్ = పిసుకుచు. ఆనందబాష్ప పూరంబు = సంతోషాతిశయమువలనఁ బుట్టిన కన్నీళ్లవెల్లువ. తోరంబుగాన్ = అధికముకాఁగా. రోమాంచకంచుకితశరీరుండు = గగుర్పాటుచేత కప్పఁబడిన దేహముగలవాఁడు. (అగుచును) తనకరకమలంబులు = కమలములవంటి తన చేతులను. ఫాలభాగంబునన్ = నొసటియందు. కదియించి = చేర్చి. (ఇట్లని) స్తుతియించెన్ = పొగడెను.

తా॥ బలిచక్రవర్తి మీఁద చెప్పినచొప్పున పూజించినవాఁడై శ్రీకృష్ణమూర్తియొక్క పాదములను పిసుకుచు సంతోషాతిశయమువలన కన్నులనుండి వెడలుచున్న నీళ్లు వెల్లువయై ప్రవహింపఁగా దేహమునందంతటను వెండ్రుకలు నిక్కపొడుచుకొనఁగా, చేతులు జోడించి నొసటఁ జేర్చుకొని యీవిధముగా పొగడ నారంభించెనని తాత్పర్యము.

౧౧౪౬.—ఉ॥ ధీయుతుఁడై నమో భగవ * తే హరయే పరమాత్మనే ముకుం
దాయ సమస్త భక్తవర * దాయ నమస్త్రిపురుషోత్తమాయ కృ
ష్ణాయ మునీంద్ర వంద్యచర * ణాయ సురారి హరాయ సాంఖ్యయో
గాయ వినీల భాస్వ దల * కాయ రథాంగ ధరాయ వేధసే.

టీ॥ ధీయుతుఁడై=మంచిబుద్ధితోఁగూడుకొన్నవాఁడై. భగవతే=భగవంతునికొఱకు. హరయే=శ్రీహరికొఱకు. పరమాత్మనే=పరబ్రహ్మమైనవానికొఱకు. ముకుందాయ=ఇహపరసుఖములనిచ్చువానికొఱకు సమస్తభక్తవరదాయ=ఎల్లసేవకులకోరికలనిచ్చువానికొఱకు. పురుషోత్తమాయ=పురుషశ్రేష్ఠుఁడైన వానికొఱకు. మునీంద్రవంద్యచరణాయ=మునిశ్రేష్ఠులకు సేవింపఁదగిన పాదములుగలవానికొఱకు. సురారిహరాయ=దేవతలకుశత్రువులైన రాక్షసులననశింపఁజేయు వానికొఱకు. సాంఖ్యయోగాయ=సాంఖ్యయోగమైనవానికొఱకు. వినీల భాస్వదలకాయ=మిక్కిలినల్లగా ప్రకాశించుచున్న ముంగురులుగల వానికొఱకు. రథాంగధరాయ = చక్రమును ధరించినవానికొఱకు. వేధసే=బ్రహ్మయైనవానికొఱకు. కృష్ణాయ=శ్రీకృష్ణునికొఱకు. నమోనమః = మాటిమాటికి నమస్కారము (చేసెదను)

తా॥ మంచిబుద్ధితో ఆబలిచక్రవర్తిషడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, పాపములను అణఁచివేయు వాఁడును, పరబ్రహ్మ స్వరూపుఁడును, మిక్కిలియందమైనమూర్తిగలవాఁడును, ఎల్లసేవకులకునుకోరినకోరికలను ఇచ్చువాఁడును, మునిశ్రేష్ఠులకందఱకు మ్రొక్కఁదగిన పాదములుగలవాఁడును, పురుషులలోపల శ్రేష్ఠుఁడయినవాఁడును, దేవతలకు పగవారైన రాక్షసులను అణఁగఁగొట్టువాఁడును, సాంఖ్యయోగమే స్వరూపముయినవాఁడును, మిక్కిలి నల్లగా ప్రకాశించుచున్న ముంగురులు గలవాఁడును, సుదర్శన చక్రమును ధరించినవాఁడును, సృష్టికర్తయైన వాఁడునైన శ్రీకృష్ణమూర్తికి బహు నమస్కారములు చేసెదనని తాత్పర్యము.

వ॥ అనియభినుతించియిట్లనియె. టీ॥ అనికొనియాడిఇట్లనియెను.

౧౧౪౭.—ఉ॥ రాజస తామసాత్ములకు * రాదుగదా నినుఁగాన నవ్యపం
కేజ దళాయతాక్ష ముని * గేయ పవిత్ర చరిత్ర విస్ఫుర
ద్రాజకళాధరాజ సుర * రాజ ముఖామర మౌళిరత్న వి
భ్రాజిత పాదపీఠ భవ * బంధ విమోచనపద్మలోచనా.

టీ॥ పంకేజదళాయతాక్ష = తామరఱేకులవలె విశాలములైన కన్నులుగలవాఁడా. మునిగేయ=మునులచేతకీర్తింపఁబడువాఁడా. పవిత్రచరిత్ర = పరిశుద్ధమయిన నడవడిగలవాఁడా. విస్ఫుర ... ధర—విస్ఫురత్=మిక్కిలివెలుఁగుచున్న, రాజకళా = చంద్రకళను, ధర = ధరించినశివుఁడు. అజ=బ్రహ్మ. సురరాజ = దేవేంద్రుఁడు ముఖ=మొదలుగాఁగల. అమర=దేవతలయొక్క. మౌళి = తలల యందలి—తలలనుధరించిన కిరీటములయందలి, రత్న = మణులచేత. విభ్రాజిత=ప్రకాశింపఁజేయఁబడిన. పాదపీఠ=పీఁటవంటి పాదము గలవాఁడా. భవబంధవిమోచన=జన్మములవలననిర్బంధమునుతొలఁగించువాఁడా. పద్మలోచనా=కమలములవంటికన్నులుగల శ్రీకృష్ణా. రాజస తామసాత్ములకున్ = రాజసతామస గుణములు గలవారికి. నినున్=నిన్ను. కానన్=చూచుట. రాదుగదా=శక్యముకాదుగదా. నీస్వరూపము దెలిపెడుశుద్ధసత్వగుణము గలవారికికనఁబడుదుననుట.

తా॥ తామరఱేకులవలె విశాలములైనకన్నులుగలిగి మునులచేతఁ గీర్తింపఁబడుచు పవిత్రచరిత్రముతో శివుఁడు బ్రహ్మ యింద్రుఁడు మొదలుగాఁగల దేవతలచేత సేవింపఁబడుచు భక్తుల జన్మబంధములను తొలఁగించునట్టి యోకృష్ణా! నిన్ను రాజసగుణమును తామస గుణమును పొందినవారికిచూడ శక్యముకాదుగదా అనితాత్పర్యము.

౧౧౪౮.—మ॥ మదినూహింపఁగ యోగివర్యులు భవ * న్మాయాలతాబద్ధులై
యిదమిత్థంబననేరు తామసధృతి * న్నేపారు మాబోఁటిదు
ర్మదులేరీతి నెఱుంగఁ బోలుదురు స * మ్యగ్ధ్యాన ధీయుక్తినీ
పదము ల్సేరెడిత్రోవఁజూపి భవకూ * పం బుద్ధరింపింపవే.

టీ॥ మదిన్=మనసునందు. ఊహింపఁగన్=తలఁపఁగా. యోగివర్యులు=యోగీశ్వరులు. భవ...బద్ధులై—భవత్=నీదైన. మాయా=మాయయనెడు. లతా=తీఁగచేత. బద్ధులై=కట్టఁబడినవారై. ఇదమిత్థంబు=ఇదియిట్లు. అననేరు=అని చెప్పలేరు. తామసధృతిన్=తమోగుణధారణముచేత. ఏపారు=అతిశయించునట్టి. మాబోఁటి=మావంటి. దుర్మదులు=చెడ్డక్రొవ్వుగలవారు. ఏరీతిన్=ఏవిధముగా. ఎఱుంగఁబోలుదురు=నీమాయను తెలిసికోఁజాలుదురు. సమ్యగ్ధ్యాన ధీయుక్తిన్—సమ్యక్=మేలయిన. ధ్యాన=నిర్వికల్ప నిష్ఠగలిగినట్టి. ధీ=బుద్ధితోడి. యుక్తిన్=కూడికతో. నీపదములు=నీయడుగులు. చేరెడిత్రోవన్=పొందునట్టి మార్గమును. చూపి=కనఁబఱిచి. భవకూపంబున్=జన్మమనెడినూతివలననుండి. ఉద్ధరింపింపవే=మీఁదికిఎత్తునట్లు చేయవయ్యా.

తా॥ ఓస్వామీ! మనసునందు విచారింపఁగా యోగాభ్యాసము చేసినమునిశ్రేష్ఠులుకూడనీమాయయనెడుతీఁగచేత కట్టుపడియాకట్టువలనమార్గము ఇదియని తెలిసికోలేరు అనఁగా తామస గుణముగలవారమైనమాబోఁటివారు ఎట్లుతెలిసికోఁగలరు. తెలిసికోలేరుకాఁబట్టి నిర్వికల్ప నిష్ఠతోడి కూడికతో నీయడుగులను పొందునట్టి మార్గమును జూపి మమ్ము జన్మములనెడు నూతిలోనుండి పైకెత్తునట్లు అనుగ్రహింపుమనితాత్పర్యము.

౧౧౪౯.—ఉ॥ వైరముచేతఁ జేదినృప * వర్గము గామముచేత గోపికల్
మీఱినభక్తి నాశ్రితులు * మిమ్మునహర్నిశముఁ మనంబులం
దారఁగనేక రూపగుణ * తత్పరులై మిముఁబొందుకైవడిన్
భూరి వివేక సత్త్వగుణ * ముల్ గల దేవత లందనేర్తురే

టీ॥ వైరముచేతన్=విరోధముచేత. చేదినృపవర్గము=శిశుపాలుఁడు మొదలగురాజులసమూహమును. కామము చేతన్=అనురాగాతిశయము చేత. గోపికలు=గొల్లపడుచులును. మీఱినభక్తిన్=అతిశయించిన ప్రేమముచేత. ఆశ్రితులును=సేవకులును. (మిమ్మును) అహర్నిశమున్=పగల్లును రాత్రులును. మనంబులందున్=మనస్సులందు. ఆరఁగన్=పూర్ణముగ. నైకరూపగుణ తత్పరులై=అనేక రూపములు గుణములుగల మీయందు ఆసక్తులై. మిమున్=మిమ్ము. పొందుకైవడిన్=పొందునట్టిరీతిగా. భూరి... ములు—భూరి=గొప్పలైన. వివేక=దివ్యజ్ఞానమును. సత్త్వగుణములు=సాత్త్వికగుణమును. (కలదేవతలు) అందనేర్తురే=పొందఁజాలుదురా.

తా॥ ఓ స్వామీ! విరోధము చేత శిశుపాలుఁడు మొదలగు రాజులును, కామముచేత గోపికలును, మిక్కుటమయినభక్తిచేత ఆశ్రయించిన సేవకులును, మిమ్ము రేయింబగల్లు మనస్సులలో పూర్తిగా అనేక రూపములును అనేకగుణములునుగలమిమ్ము పొందునట్లు అధికమయినవివేకమును సాత్త్వికగుణమునుకలిగిన దేవతలయినను పొందనేర్తురా అని తాత్పర్యము.

౧౧౫౦.—క॥ కాన భవత్పద పద్మ । ధ్యానంబునఁ గాని శాస్త్ర * తత్త్వంబులచేఁ
గానరు శ్రుతిసంవేద్యము । నైన భవత్పదము చిన్మ * యాకారహరీ.

టీ॥ చిన్మయాకార = జ్ఞానస్వరూపుఁడవైన. హరీ = ఓకృష్ణా. కానన్ = కాఁబట్టి. భవత్పదపద్మధ్యానంబునన్=నీయొక్క పాదకమలముల యొక్క ధ్యానముచేత. కాని=కాక. శాస్త్రతత్త్వంబులచేన్=వేదాంతశాస్త్రస్వభావములచేత. శ్రుతిసంవేద్యమును = (పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి) అనెడు వేదములవల్ల తెలియఁదగినదియు. ఐనభవత్పదమున్=ఐనట్టి నీపాదమును. కానరు=కనఁజాలరు.

తా॥ జ్ఞానస్వరూపుఁడవైనయోకృష్ణమూర్తీ! దేవతలుకూడ నిన్ను పొందలేరు కాఁబట్టి నీపాద పద్మములయొక్క ధ్యానము చేతనే గాని వేదాంతశాస్త్రములచేతను వేదములవల్లను తెలియఁబడునట్టినీపాదపద్మములను తెలిసికోఁజాలరని తాత్పర్యము.

౧౧౫౧.—వ॥ దేవా యేనరుండైననేమి శ్రద్ధాగరిష్ఠ చిత్తుండై మిమ్ము సేవించునట్టి మహాత్ముండు విధి
చోదితంబైన ప్రమాణంబు వలన విముక్తుండై వర్తించు నట్లుగావున యోగీశ్వరుండ
వైన నీవీశితవ్యులమైన మమ్ము నిష్పాపులం జేయుమని నుతియించి మఱియు నిట్లనియె.

టీ॥ దేవా=ఓస్వామీ. ఏనరుండైననేమి=ఏమనుష్యుఁడైననేమి. శ్రద్ధాగరిష్ఠచిత్తుండై—శ్రద్ధా=అక్కఱచేత. గరిష్ఠ=మిక్కిలి గొప్పదైన. చిత్తుండై=మనసుగలవాఁడై. (మిమ్మను) సేవించునట్టిమహాత్ముండు=కొలుచునట్టిగొప్పవాఁడు. విధిచోదితంబు=దైవముచేత ప్రేరేపింపఁబడినది. అయిన ప్రమాణంబువలనన్=అయినట్టి నియమనమువలన. విముక్తుండై=విడువఁబడినవాఁడై. వర్తించున్ = ఉండును. అట్లుగావునన్=అటు కాఁబట్టి. యోగీశ్వరుండవైననీవు = యోగులకు ఏలినవాఁడవయిననీవు. ఈశితవ్యులము=శిక్షింపఁదగిన వారము. (అయిన మమ్మును) నిష్పాపులంజేయుము=అంహ అగ ఏనస్సులనెడు పాపములు లేనివారినిగాఁజేయుము. అనినుతియించి=అని పొగడి. మఱియున్=అటుపిమ్మట. ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

తా॥ స్వామీ! ఏమానవుఁడయినను శ్రద్ధగలవాఁడై చలింపనిమనస్సుతో మిమ్ము సేవించునట్టి గొప్పవాఁడు దైవముచేతనియమిత మయిన నియమమువలన విడువఁబడినవాఁడైయుండును. కాఁబట్టి యోగులకు ఏలినవాఁడవయిన నీవు శిక్షార్హుల మయినమమ్ము శిక్షించి పాపము లేనివారినిగాఁ జేయుము. అని కొనియాడి మరల యిట్లు పలికెనని తా.

౧౧౫౨.— మత్తకోకిల॥ కంటిఁగంటిభవాబ్ధిఁ దాఁటఁగఁ * గంటిముక్తినిధానమున్
గంటి నీకరుణావలోకముఁ * గంటి రూపమువీడ ము
క్కంటి తామరచూలులుంబొడఁ * గాననట్టి మహాత్మ నా
యింటికిం జనుదెంచితీశ్వర * యేఁగృతార్థతఁ బొందితిన్.

టీ॥ కంటిన్=నాయేలిన వానిని జూచితిని. భవాబ్ధిన్=జన్మసముద్రమును. దాఁటఁగన్=తరింపను. కంటిన్ = మార్గమును నెఱిఁగితిని. ముక్తినిధానమున్ = మోక్షనిక్షేపమును. (కంటిని) నీకరుణావలోకమున్=నీదైన దయతోడి చూపును. కంటిన్=పొందితిని. రూపమువీడన్=నీస్వరూపముచక్కఁగా తెలియఁబడునట్టుగా. ముక్కంటితామరచూలులు=శివుఁడును బ్రహ్మయు. పొడగాననట్టి=చూడనేరని. మహాత్మ=గొప్పమహిమగలవాఁడా. (నాయింటికిచనుదెంచితి) ఈశ్వర=ఓయేలినవాఁడా. ఏన్=నేను. కృతార్థతన్ = ధన్యత్వమును. (పొందితిని)

తా॥ స్వామీ! నాయేలినవానినినిన్నుఁజూచితిని. జన్మసముద్రమును దాఁటితిని, మోక్షమును పొందితిని. దయతోఁగూడిన నీచూపును పొందితిని నీస్వరూపము నాకుచక్కఁగాఁ దెలియునట్లు నాయింటికి వచ్చితివి, శివుఁడుబ్రహ్మయుఁగూడనిన్ను ప్రత్యక్షముగాఁ జూడనేరరు, అటువంటినీవు నాయింటికి రాఁగాఁజూచి నేనుకృతార్థుఁడనైతిని అని బలిచక్రవర్తి పలికెనని తాత్పర్యము.

వ॥ దేవా యేను భవద్దాసుండ నేదిపంచినం జేయుదు నిచ్చటికి మీరలు విజయంచేసిన కార్యం బానతీ వలయునని కరంబులుమొగిచి విన్నవించినం బుండరీకాక్షుండతనివాక్యంబులకు సంతసిల్లి యిట్లనియె.

టీ॥ దేవా=ఓస్వామీ. ఏను=నేను. భవద్దాసుండన్=నీసేవకుఁడను. ఏదిపంచినన్=ఏపనిచేయ నాజ్ఞాపించినను.(చేయుదును) మీరలు=మీరు. ఇచ్చటికిన్=ఈలోకమునకు. విజయంచేసినకార్యంబు=వచ్చినపనిని. ఆనతీవలయున్=సెలవియ్యవలెను. (అని) కరంబులు మొగిచి=చేతులుజోడించుకొని. విన్నవించినన్=మనవిచేయఁగా. పుండరీకాక్షుండు=కృష్ణుఁడు. అతనివాక్యంబులకున్=ఆబలిచక్రవర్తిమాటలకు. సంతసిల్లి = సంతోషించినవాఁడయి. ఇట్లనియెన్ = ముందుఁ జెప్పఁబోవునట్లు పలికెను.

తా॥ స్వామీ! నేనుమీసేవకుఁడను ఏపని నావలనఁగావలెనో ఆపనిని సెలవిచ్చినయెడల తప్పకచేసెదను. సెలవిండు మీరు ఇప్పడీలోకమునకు ఏమిపనికలిగి వచ్చినారు అనిచేతులుకట్టుకొని వినయముతోనడుగఁగా అతనిమాటలకు శ్రీకృష్ణమూర్తిసంతోషించి యిట్లుపలికెనని తాత్పర్యము.

౧౧౫౪.—సీ॥ బలిదైత్య వినుము మున్ను * ప్రథమ యుగంబున - నామరీచికి భార్య * యైన వర్ణ
యను నింతి వలన నం * దనులార్వు రుద్భవ - మైరి వారొక్కనా * డబ్జభవుఁడు
దనపుత్త్రిపై మోహ * మునఁగూడిరతికేళి - యొనరింపఁ గాంచి న * వ్వటయుఁ గ్రోధ
మంది యాసురయోని * యందుఁ బుట్టుండని - ఘనశాపమిచ్చె న * వ్వనజజుండు
తే॥ దన్నిమిత్తమునను వారు * దగిలి హేమ । కశిపునకుఁ బుట్టిరంత నా * కాకసార్థ
మొదవవీరలఁదెచ్చియ * య్యోగమాయ । యడరి దేవకీగర్భంబు * నందుఁజొనుప.

టీ॥ బలిదైత్య = దితిసంతతియందు జనించిన యో బలిచక్రవర్తీ. వినుము=మేమువచ్చినపనిని చెప్పెదను వినుము. మున్ను=మునుపు. ప్రథమయుగంబునన్=మొదటిదైన కృతయుగమునందు. ఆమరీచికిన్=ప్రసిద్ధుఁడైనమరీచిప్రజాపతికి. భార్యయైనవర్ణ యను నింతివలనన్=పెండ్లామయినవర్ణ అను స్త్రీవలన. నందనులు=కొడుకులు. ఆర్వురు=ఆఱుగురు. ఉద్భవమయిరి=పుట్టిరి. వారు=ఆకుమారులు. (ఒక్కనాడు) అబ్జభవుఁడు=బ్రహ్మ. తనపుత్త్రిపై మోహమునన్=తనకూఁతురైన సరస్వతిమీఁది మోహముచేత. కూడి=కలసి. రతికేళియొనరింపన్=క్రీడింపఁగా. కాంచి = చూచిన వ్వటయున్ = నవ్వఁగా. క్రోధమంది=కోపమునుపొంది. ఆసురయోనియందున్ = అసురుల వంశమునందు. (పుట్టుండని) అవ్వనజజుండు=ఆబ్రహ్మ. ఘనశాపమిచ్చెన్=గొప్పశాపమునిచ్చెను. తన్నిమిత్తమునన్=ఆకారణముచేత. వారు=ఆమరీచికొడుకులు. తగిలి=ఆసక్తులై. హేమకశిపునకున్=మీముత్తాతయైనహిరణ్యకశిపునికి. పుట్టిరి=కొడుకులై పుట్టిరి. అంతన్=అట్లుపుట్టఁగానే. అయ్యోగమాయ=ప్రసిద్ధమైనయోగమాయయైనది. నాకాకసార్థము=దేవతలనిమిత్తము. ఒదవన్=సహాయముకలుగునట్లు. అడరి=ప్రయత్నించి. వీరలన్=వీరిని. (తెచ్చి దేవకిగర్భంబునందు) చొనుపన్=ప్రవేశపెట్టఁగా

తా॥ ఓబలిచక్రవర్తీ ! మేము వచ్చినపని చెప్పెదను వినుము. పూర్వకాలమునందు కృతయుగములో మరీచి బ్రహ్మకు వర్ణయను భార్యవలన ఆరుగురుకొడుకులుపుట్టిరి వారు ఒకనాడు బ్రహ్మనుజూడఁబోయి ఆబ్రహ్మ తనకూఁతురయినసరస్వతిని మోహముచేతకలసి క్రీడించెనని యెగతాళిచేసిరి. అందులకు బ్రహ్మ కోపించి మీరు అసురులై పుట్టుఁడు అనిశపించెను. ఆశాపనిమిత్తముచేతవారు మీతాతకు తండ్రియైన హిరణ్యకశిపునికి కొడుకులైపుట్టిరి. అప్పుడుయోగమాయ దేవతలకు హితముచేయఁగోరి ఆయాఱుగురను గొనిపోయి దేవకీదేవి గర్భములోఁజొరఁబెట్టెను అనితాత్పర్యము.

౧౧౫౫.—క॥ దొరఁకొని కంసుఁడు దోడ్తోఁ । బొరిఁగొనెఁ దత్పుత్త్రశోక * మునఁ దనచిత్తం
బెరియఁగ దేవకి వారల । దర్శింపఁగఁ గోరెఁ బనుపఁ * దగు నసురేంద్రా.

టీ॥ అసురేంద్ర=ఓబలిచక్రవర్తీ. దొరఁకొని=పూని. కంసుఁడు=కంసమహారాజు. వారిన్=ఆదేవకికడుపునపుట్టిన బిడ్డలను. తోడ్తోన్=వెంటనే-పుట్టినప్పుడే. పొరిఁగొనెన్=చంపెను. తత్పుత్త్రశోకమునన్=ఆకొడుకులవలనిదుఃఖముచేత. తనచిత్తంబు=తనమనస్సు. ఎరియఁగన్=తపింపఁగా. దేవకి=దేవకీదేవి. వారలన్=ఆబిడ్డలను . దర్శింపఁగఁ గోరెన్=చూడఁగోరెను. పనుపఁదగున్=నావెంటఁబంపవలయును.

తా॥ ఓబలిచక్రవర్తీ! ఆకుమారులను దేవకికన్నప్పుడే పూనికతో కంసుఁడు పట్టిచంపెను. ఆకొడుకులవలని శోకముచేత దేవకి తపించుచుండి యిప్పుడు వారలను చూడఁగోరెను వారు నీయింటిలోనున్నారు గనుక నాతోఁగూడ వారినిబంపుము అనిపలికెను అని తాత్పర్యము.

౧౧౫౬.—క॥ వచ్చితిమి వారిఁ గ్రమ్మఱఁ । దెచ్చెదమని తల్లికోర్కిఁ * దీర్పఁగనిపుడే
యిచ్చటికి నీకడం బోర । పొచ్చము లేకున్నవారు * పో వీరనఘా.

టీ॥ అనఘా=పాపములేనివాఁడా. వారిన్ = ఆకుమారులను. క్రమ్మఱన్=మరల. తెచ్చెదమని = తీసుకవచ్చెదమని. తల్లికోర్కిన్=మాతల్లియైన దేవకీదేవియొక్కకోరికను. తీర్పఁగన్=నెఱవేర్చుటకై. (ఇపుడు) ఏము=మేము. ఇచ్చటికిన్=ఇక్కడికి. వచ్చితిమి=వచ్చినాము. నీకడన్ = నీయొద్ద. వీరు = ఈయార్గురు కుమారులును. పొరపొచ్చము=కొఱఁత. (లేక) ఉన్నవారుపో = ఉన్నారు సుమీ.

తా॥ పాపములేనివాఁడవయిన ఓబలిచక్రవర్తీ ! ఆకుమారులను మరలఁదీసికొనివచ్చెదమునీవువిచారపడవలదని మాతల్లికిచెప్పి ఆమెకోరికను తీర్చుటకై యిప్పుడు ఇచ్చటికి వచ్చితిమి. ఇదిగోవీరు ఆకుమారులే కదా ఏకొఱఁతయులేక సుఖముగానున్నారే అనికృష్ణుఁడుపలికెనని తా.

౧౧౪౭.—క॥ వీరలఁ దోకొని యిపుడే । ధారుణికిన్నేగి జనని ✽ తాపము వాపన్
వీరల శాపంబంతటఁ । దీరి మదీయ ప్రసాద ✽ ధీయుతు లగుచున్.

టీ॥ వీరలన్=ఈకుమారులను. తోకొని=పిలుచుకొని. (ఇపుడు) నేన్=నేను. ధారుణికిన్=భూలోకమునకు. ఏగి=పోయి. జననితాపమున్=తల్లియైన దేవకియొక్క సంతాపమును. వాపన్=పోఁగొట్టఁగా. అంతన్=అంతటితో. వీరలశాపంబు=వీరికి బ్రహ్మ యిచ్చిన శాపమును. తీఱి=పోయి. మదీయప్రసాద ధీయుతులు=నాయనుగ్రహమువలన దివ్యజ్ఞానముతోఁ గూడుకొన్న వారు. అగుచున్=అగుచును.

తా॥ ఇప్పుడు వీరిని పిలుచుకొని నేను భూలోకమునకుఁ బోయి మాతల్లి కోరికనుదీర్చి ఆమెచింతను పోఁగొట్టఁగానే వీరిశాపమును తీఱును. అంతట వీరికి నాయనుగ్రహమువలన దివ్యజ్ఞానము కలుగును. అట్లుదివ్యజ్ఞానముగలవారగుచు రనితాత్పర్యము.

౧౧౪౮.—క॥ పొలుపుగ సుగతిం బొందఁగఁ । గలరని హరి యానతిచ్చి ✽ కరుణాన్వితుఁడై
బలిచే ననుమతిఁ గొని వా । రలఁ దోకొనివచ్చె నిద్ధ ✽ రా మండలికిన్.

టీ॥ పొలుపుగన్=ఒప్పిదముగా. సుగతిన్=మంచిగతిని-మోక్షమును. పొందఁగఁగలరు=పొందఁగలరు. (అని) ఆనతిచ్చి=చెప్పి. హరి=శ్రీకృష్ణమూర్తి. కరుణాన్వితుఁడై=దయతోఁగూడుకొన్నవాఁడై. బలిచేన్=బలిచక్రవర్తిచేత. అనుమతిఁగొని=ఉత్తరువుతీసికొని. (వారలను) ఇద్ధరామండలికిన్=ఈభూమండలమునకు. తోకొనివచ్చెన్=పిలుచుకొనివచ్చెను.

తా॥ క్రమముగా మోక్షమునువీరు పొందఁగలరు అనిచెప్పిదయతోఁ గూడుకొన్నవాఁడైన శ్రీకృష్ణమూర్తి బలిచక్రవర్తితో పోయివచ్చెదనని చెప్పి ఆకుమారులను పిలుచుకొని భూలోకమునకువచ్చెననితాత్పర్యము.

వ॥ అట్లు వారలం దెచ్చి యిట్లనియె.

టీ॥ (అట్లు) వారలన్=ఆకుమారులను. తెచ్చి=పిలుచుకొనివచ్చి. (ఇట్లనియెను)

తా॥ ఆవిధముగా ఆకుమారులను పిలుచుకొనివచ్చి దేవకీదేవితో ఇట్లుపలికెనని తాత్పర్యము.



(✽) శ్రీకృష్ణబలభద్రులుమృతులైనతమసహోదరులఁదెచ్చితల్లికిఁ గనఁబఱచుట (✽)

౧౧౪౯.—క॥ కనుఁగొనుము వీరునీనం । దనులని జనయిత్రికడ ము ✽ దంబున వారి
న్ననిచిన నద్దేవకియును । ఘనపుత్రస్నేహ మోహ ✽ కలితాత్మకయై.

టీ॥ కనుఁగొనుము=చూడుము. (వీరు) నీనందనులు=నీకొడుకులు. (అని) జనయిత్రికడన్=తల్లివద్ద. ముదంబునన్=సంతోషముతో (వారిని) ఉనిచినన్=నిలుపఁగా. అద్దేవియున్=ఆదేవకీదేవియును. ఘన...కయై—ఘన=అధికమయిన. పుత్ర=కొడుకులయందలి. స్నేహ=ప్రీతియనెడు. మోహ=భ్రాంతితోడ. కలిత=కూడుకొన్న. ఆత్మకయై=మనసుగలదై.

తా॥ వీరునీకొడుకులుచూడుము అనిసంతోషములో చెప్పుచు దేవకీదేవియెదుటవారిని నిలుపఁగా ఆదేవకీదేవియు మిక్కుటమయినకొడుకులయందలి ప్రీతివలని అజ్ఞానమున పొందినమనసుగలదియై అని తాత్పర్యము.

౧౧౫౦.—క॥ చన్నులుదిగ్గనఁ జేఁపఁగఁ । గన్నుల నానందబాష్ప ✽ కణములు దొరఁగం
గ్రన్ననఁ గౌఁగిటనిడినను । గన్నన్నలు వచ్చిరనుచుఁ ✽ గౌతుక మొప్పన్.

టీ॥ (చన్నులు) దిగ్గనన్=తటాలున. చేఁపఁగన్=పాలచేతనిండుకొనఁగా. కన్నులన్=కన్నులయందుండి. ఆనందబాష్పకణములు=సంతోషమువలనికన్నీటిబొట్లు. దొరఁగన్=కాఱఁగా. క్రన్ననన్=శీఘ్రముగ. కౌఁగిటన్ఇడి=కౌఁగిలించుకొని. ననుఁగన్నన్నలు=నన్నుఁగన్నతండ్రులు. (వచ్చిరి) అనుచున్=అని. కౌతుకమొప్పన్=వేడుకయొప్పఁగా.

తా॥ దేవకీదేవి తన స్తనములయందు పాలుబ్బఁగాను కన్నులయందుండి ఆనందబాష్పములు రాలఁగాను వడిగా కౌఁగిలించుకొనినన్నుఁగన్నతండ్రులువచ్చిరి అనిపలుకుచుకుతూహలముతోననితాత్పర్యము.

వ॥ కౌఁగిటం జేర్చి నిజాంక పీఠంబున నునిచి శిరంబులు మూర్కొని చుబుకంబులు పుణుకుచుం బ్రేమాతిశయంబున మేనం బులకలు లోలయం జన్నిచ్చిన వారును వైష్ణవ మాయా మోహితులై స్తన్య పానంబు సేయుచు భగవంతుండైన రథాంగపాణి యంగ సంగంబున విగత కల్మషులై విరించి శాప సాగరంబు హరి దయా కటాక్షంబను నావచేతం దరియించి నిజస్వరూపంబులు ధరించి, కృష్ణునకుఁ దల్లి దండ్రులకు వందనం బాచరించి గగన పథంబున నిజ స్థానంబున కరిగి రంత దేవకీదేవి తన మనంబున.

టీ॥ కౌఁగిటం జేర్చి=కౌఁగిలించుకొని. నిజాంకపీఠంబునన్=పీఠము వంటి ఒడియందు. ఉనిచి=కూర్చుండఁ బెట్టుకొని; శిరంబులు=తలలు. మూర్కొని=మూచూచి. చుబుకంబులు=గడ్డములు. పుణుకుచున్=వేళ్లతో నొక్కిపట్టుచును. ప్రేమాతిశయంబునన్ = అతిశయించిన ప్రేమతో. మేనన్=దేహమునందు. పులకలు=గగుర్పాటులు. ఓలయన్=వ్యాపింపఁగా. చన్నిచ్చినన్=స్తన్యపానము చేయింపఁగా. వారును=ఆకుమారులును. వైష్ణవమాయామోహితులై=విష్ణు సంబంధమయిన మాయచేత మోహమునొందినవారై. స్తన్యపానంబు సేయుచున్=చనుఁబాలుత్రాగుచు. భగవంతుండైన = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన. రథాంగపాణియంగసంగంబునన్ = చక్రము చేతఁబట్టినకృష్ణుని దేహసంస్పర్శముచేత. విగతకల్మషులై=పోయినపాపముగలవారై. విరించి శాపసాగరంబున్=బ్రహ్మయొక్క శాపమనెడు సముద్రమును. హరి దయాకటాక్షంబు = కృష్ణునిదయినదయతోడి కడగంటి చూపు. అను నావచేతన్=అనునట్టి ఓడచేత. తరియించి=దాఁటి. నిజస్వరూపంబులు=తమయొప్పటిరూపములను. ధరించి=పొంది. (కృష్ణునకును) తల్లిదండ్రులకును = దేవకీవసుదేవులకును. వందనంబు = నమస్కారము. ఆచరించి = చేసి. గగనపథంబునన్ = ఆకాశమార్గమున. నిజస్థానంబునకున్ = తమనివాసస్థానమునకు. అరిగిరి = పోయిరి. అంతన్=అప్పుడు. (దేవకీదేవి) తనమనంబునన్=తనమనసులో.

తా॥ ఆకుమారులను దేవకీదేవి కౌఁగిలించుకొని ఒడిలో కూర్చుండఁబెట్టుకొని తలలు మూర్కొని గడ్డములు పుణికి ప్రేమయొక్క అతిశయముచేత దేహమునందు గగుర్పాటు కలుగఁగా స్తన్యపానము చేయించెను వారును విష్ణుసంబంధమయినమాయచేత మోహము నొందినవారై ఆ స్తన్యపానము చేసి భగవంతుఁడైన శ్రీకృష్ణమూర్తియొక్క అంగముల తాఁకుడుచేత ఎల్లపాపములవలన తొలఁగినవారై బ్రహ్మ శాపమనెడు సముద్రమును కృష్ణుని అనుగ్రహమనెడు ఓడచేత దాఁటి తమయొప్పటి రూపములను పొంది కృష్ణమూర్తికిని తల్లిదండ్రులైన దేవకీవసుదేవులకును నమస్కరించి ఆకాశమార్గమున తమయునికిపట్టునకు పోయిరి అప్పుడు దేవకీదేవి తనమనసులో తాను ఇట్లు ఆలోచించెనని తాత్పర్యము.

౧౧౬౨.—క॥ చచ్చిన బాలురఁ గ్రమ్మఱఁ । దెచ్చుట గడుఁజిత్ర మనుచు * దేవకి మదిలో
న చ్చెరువడి యదియంతయు । నచ్చపుహరిమాయ గాక * యనితలఁచె నృపా.

టీ॥ నృపా=రాజా. (దేవకి) మదిలోన్=తనమనసులో. చచ్చిన బాలురన్ = చచ్చిపోయిన పిల్లకాయలను. క్రమ్మఱన్ = మరల. తెచ్చుట = బ్రతికించి తీసికొనివచ్చుట. కడుఁజిత్రము=మిక్కిలివింత. అనుచున్=అని. అచ్చెరువడి=ఆశ్చర్యమును పొంది. అదియంతయున్=అట్లు చచ్చినవారిని మరల తీసికొనివచ్చుట మొదలగు కార్యమంతయు. అచ్చపుహరిమాయ గాక=స్పష్టమయిన శ్రీవిష్ణుమాయయే గాని. (అని తలఁచెను)

తా॥ ఓ రాజా! దేవకీదేవి తనమనసులో చచ్చిపోయిన పిల్లకాయలను మరల బ్రతికించి తెచ్చుట వింత అని యాశ్చర్యపడుటయే గాక ఇదియంతయు శ్రీవిష్ణుమాయయే గాని ఇతరము గాదని తలఁచెను అని తాత్పర్యము.

౧౧౬౩.—క॥ పరమాత్ముఁ డఖిలజగదీ । శ్వరుఁడగు కృష్ణుండు సేయు * సత్కృత్యంబుల్
పరికింప నెన్నఁ బెక్కులు । ధరణీవర యనిన రాజు * దా మునికని యెన్.

టీ॥ ధరణీవర=ఓ రాజా. పరమాత్ముఁడు=సర్వోత్కృష్టమైనరూపము గలవాఁడును. అఖిలజగదీశ్వరుఁడు=ఎల్లిలోకములకు ప్రభువును. (అగు కృష్ణుండు) చేయు సత్కృత్యంబులు=చేయునట్టి మంచిపనులు. పరికింపన్=విచారింపఁగాను. ఎన్నన్=లెక్కింపఁగాను. పెక్కులు=అనేకములు. అనినన్=అనఁగా. రాజు=పరీక్షిన్మహారాజు. తాన్=తాను. మునికిన్=శుకమహామునితో. అనియెన్=ఇట్లు చెప్పెను.

తా॥ ఓ పరీక్షిన్మహారాజా! సర్వోత్కృష్ట పరబ్రహ్మమును సర్వలోకములకు ప్రభువును నగు శ్రీకృష్ణమూర్తి చేయునట్టి మేలయిన కార్యములు ఎన్నో కలవు అవియెల్లను విచారింపను లెక్కింపను వల్లకావు అనఁగా పరీక్షిన్మహారాజు శుకమహామునితో మరల నిట్లు పలికెననితా.

౧౧౬౪.—సీ॥ మునినాథ పార్థుండు * వనజనాభుని సహో - దరి సుభద్రను నేవి * ధమమునఁ బెండ్లి
యయ్యె నావిధమంత * నొయ్యనఁ గ్రమముతోఁ - దెలియంగ నెఱిఁగింపు * ధీవిశాల
యనవుడు నవ్యాస * తనయుఁ డాతనిఁ జూచి - వినవయ్య నృపదేవ * విభుని సుతుండు
మును తీర్థయాత్రాప్ర * సక్తుఁడై చనుచును - రమణఁ బ్రభాస తీ * ర్థమున నుండె
తే॥ యాతలోఁ దరితోడి నె * య్యంబు కలిమిఁ । జూడఁ గోరుచు రాముండు * సుందరాంగిఁ
గౌరవేంద్రున కీసమ * కట్టె ననుచుఁ । దనమది నెఱింగి యాపురం * దర సుతుండు.

టీ॥ మునినాథ = ఓమునిశ్రేష్ఠుఁడా. పార్థుండు = అర్జునుఁడు. వనజనాభునిసహోదరిన్=కృష్ణునితోఁడఁబుట్టువైన. (సుభద్రను) ఏవిధమునన్=ఏరీతిగా. పెండ్లియయ్యెన్ = పెండ్లాడెను. ఆవిధమంతన్=ఆరీతి యంతయు. ఒయ్యనన్ = తిన్నగా. క్రమముతోన్=

వరుసగా, తెలియంగ నెఱిఁగింపు=విశదముగాఁ జెప్పుము. ధీవిశాలుఁ= బుద్ధివలన గొప్పవాఁడా. అనవృదుక్ = అనియెడుగఁగా, అవ్యాస తనయుఁడు=వ్యాసునికొడుకైన యాశుకమహాముని. ఆతనిక్=పరీక్షిత్తును. (చూచి) క్షితివయ్యా నృప=ఓ రాజా వినుము. మను=మనుపు. దేవవిభునిసుతుఁడు = ఇంద్రుని కొడుకైన యర్జునుఁడు. తీర్థయాత్రా సముత్సుకుండు = తీర్థయాత్ర చేయఁబూనినవాఁడు. (అగుచును) రమణక్=ఒప్పిదముగా. ప్రభాసతీర్థముననుండి=ప్రభాసతీర్థమునకు వచ్చియున్నవాఁడు. (అచ్చటనుండి) ఆతలోదరితోడి. నెయ్యంబు కలిమిన్=ఆచిన్నదానియందుఁ దనకుఁగలిగియున్న స్నేహవిశేషము చేత. చూడఁగోరుచున్=ఆమెనుచూడను అపేక్షించుచు. రాముండు =బలరాముఁడు. సుందరాంగిన్=చక్కనియవయవములుగల సుభద్రను. కౌరవేంద్రునకున్ = కురువంశమువారికి రాజైన దుర్యోధనునికి, ఈన్=ఇయ్యను. సమకట్టె ననుచున్ = యత్నపడెనని. తన మదిన్=తనమనసులో. ఎఱింగి=తెలిసికొని. ఆపురందరసుతుండు= ఆదేవేంద్రుని కొడుకైన అర్జునుఁడు.

తా॥ పరీక్షిన్మహారాజు బుద్ధిచేత అధికుఁడవైన యో శుకమహామునీ! మా తాతయయిన అర్జునుఁడు కృష్ణుని తోడఁబుట్టువైన సుభద్రను పెండ్లాడిన క్రమమంతయు విశదముగా నాకు తెలియఁజెప్పుము అనియడుగఁగా వ్యాసుని కొడుకైన శుకుఁడు పరీక్షిత్తునుజూచి ఓ రాజా అర్జునుఁడు తీర్థయాత్ర చేయఁగోరినవాఁడై ప్రభాసతీర్థమునకుఁ బోయియుండి అచ్చట తనమఱదలైన సుభద్రమిక్కిలి చక్కఁదనము గలదియు తనయందు ప్రీతిగలదియును కాఁబట్టి ఆమెను చూడఁదలఁచి అంతలో బలరాముఁడు ఆమెను దుర్యోధనునికిచ్చి పెండ్లిచేయఁదలఁచినాఁడు అను వర్తమానమును తెలియరాఁగా నని తాత్పర్యము.

## (*)సుభద్రాపరిణయము.(*)



వ॥ సుభద్రా దర్శనోత్సాహంబు దన మనంబున సందడి గొనం ద్రిదండి వేషంబు ధరియించి ద్వారకా పురంబునకుం జనుదెంచి యప్పౌర జనంబులు భక్తి స్నేహంబుల ననిశంబు పూజింపం దన మనోరథ సిద్ధియగునంతకు నప్పట్టణంబున నుండు సమయంబున.

టీ॥ సుభద్రాదర్శనోత్సాహంబు = సుభద్రను జూచుటయందలి యుత్సాహము. తనమనంబునన్=తన మనసులో. సందడిగొనన్ = నిండుకొనఁగా—అతిశయింపఁగా. త్రిదండివేషంబున్ = త్రిదండసన్యాసి వేషమును. (ధరియించి) ద్వారకాపురంబునకున్ = ద్వారకాపట్టణమునకు. చనుదెంచి=పోయి. అప్పౌర జనంబులు = ఆపట్టణపుజనులు. భక్తిస్నేహంబులన్ = భక్తిచేతను చెలిమిచేతను. అనిశంబు=ఎల్లప్పుడును. పూజింపన్=పూజచేయఁగా, తనమనోరథసిద్ధి యగునంతకున్=తనకోరిక నెఱవేఱు నంతవఱకు. అప్పట్టణంబునన్=ఆ ద్వారకయందు. ఉండు సమయంబునన్=ఉండునట్టి కాలమునందు.

తా॥ సుభద్రను జూచుటయందలి ఉత్సాహము తన మనసులో వృద్ధియగుచుండఁగా త్రిదండసన్యాసివేషము వేసికొని అచ్చటనుండి ద్వారకాపట్టణమునకుఁబోయి ఆపట్టణమునందలి జనులు తన్ను ప్రీతితో ఆదరించి సేవలుచేయఁగా తనకోరిక నెఱవేఱు నంతవఱకును అచ్చట నేయుండఁగా ఆసమయమునందు అని తాత్పర్యము.

### విశేషార్థము.

టీ॥ త్రిదండి=మనస్సును వాక్కును శరీరమును శిక్షించినవాఁడు గాని మూఁడు వెదురుకొయ్యలనొక్కటిగా నంటఁగట్టి చేతఁబట్టి కావిగుడ్డలను గట్టికొని తలనుబోడి చేసికొని మొలత్రాడు జందెమును త్రెంచి పారవేసి తిరుగువాఁడుగాఁడు. సన్యాసి=సర్వసంకల్పములను విడిచి యెల్లప్పుడు బ్రహ్మవిచారణ చేయుచు తనయిష్టము వచ్చిన ఆశ్రమమున నుండువాఁడు.

౧౧౬౬.—క॥ రాముఁడు దత్కపటాకృతిఁ । దామదిఁ దెలియంగలేక * దగనొకనాఁడా
భూమీవర తాపసుఁ బో । రామింగని యాత్మమంది * రమునకుఁ దెచ్చెన్.

టీ॥ రాముఁడు=బలరాముఁడు. తత్కపటాకృతిన్=అతని మోసముతోడి యాకారమును. (తాను) మదిన్=మనసునందు. తెలియంగ లేక=తెలిసికోలేక. తగన్ = ఒప్పునట్లు. ఒకనాఁడు = ఒకదినము. ఆభూమీవర తాపసున్=ఆరాజైన సన్యాసిని. పోరామిన్=ప్రీతితో. కని = చూచి. ఆత్మమందిరమునకున్ = తనయింటికి. (తెచ్చెను)

తా॥ బలరాముఁడు అతఁడు వేషకాఁడు అని తెలియక సన్యాసియే అని యెంచి ఒకనాఁడు తగిన మర్యాదతోను ప్రీతితోను అతనిని తన యింటికిఁ బిలుచుకొని వచ్చెను అని తాత్పర్యము.

౧౧౬౭.—ఆ॥ తెచ్చి భిక్ష సేయ * దేవేంద్రతనయుండు । గుడుచుచుండ నచటఁ * గోరి మెలఁగు
నసమబాణు మోహ * నాస్త్రంబు కైవడి । వీరమోహినన వి * హారలీల.

టీ॥ తెచ్చి=ఆవిధముగా పిలుచుకొనివచ్చి. భిక్షసేయన్=భిక్షారూప భోజనము పెట్టింపఁగా. దేవేంద్రతనయుండు = అర్జునుఁడు. కుడుచుచుండన్=భోజనము చేయుచుండఁగా. అచటన్=అక్కడ. అసమబాణు మోహనాస్త్రంబు కైవడిన్=మన్మథుని యొక్క మోహనము అను బాణము వలెనే. వీరమోహిని = వీరులను మోహింపఁజేయునది. అనన్=అనునట్లుగా. విహారలీలన్ = విహరించు వినోదముచేత. కోరి మెలఁగున్ = సుభద్ర ప్రియపడి మెలఁగెను.

తా॥ ఆవిధముగా పిలుచుకొని వచ్చి బలరాముఁడు భిక్షచేయింపఁగా సన్యాసియైన యర్జునుఁడు భోజనము చేయుచుండెను అప్పుడు అక్కడ వీరులను మోహింపఁజేయునదియైన సుభద్ర మన్మథునిదైన మోహనము అను బాణమో అనునట్లు క్రొత్తయగు విహారవినోదముచేత సంచరించుచుండెను.

౧౧౬౮.—వ॥ అట్లుసుభద్ర విహరించుచున్న సమయంబున.

టీ॥ (అట్లు సుభద్ర) విహరించుచున్న సమయంబునన్ = వేడుకగా సంచరించుచుండు నప్పుడు.

౧౧౬౯.—చ॥ జలరుహ పత్ర నేత్రు ననుసంభవ చారు వధూలలామ స
ల్లలిత విహార విభ్రమ వి * లాసము లాత్మకు విందు సేయ న
బ్బలరిపు నందనుండు గని * భావజ సాయక బాధ్యమాన వి
హ్వలహృద యాబ్జుఁడై నిలిపె * న త్తరుణీమణియందుఁ జిత్తమున్.

టీ॥ జల...భవ-జలరుహపత్ర = తామరరేకులవంటి. నేత్రు= కన్నులుగల కృష్ణునియొక్క. అనుసంభవ=చెల్లెలును. చారువధూలలామ = ఒప్పిదమయిన యాఁడువారికి భూషణమయినదియునగు సుభద్రయొక్క. సల్ల...ములు-సల్లలిత=మిక్కిలిమనోజ్ఞములయిన. విహార=విహరించుటవలని. విభ్రమ=అలంకారాదులయందుతడబడుచుండునట్టి. విలాసములు = వినోదములు. ఆత్మకున్ = తనమనసునకు. విందుసేయన్ = సంతోషమును కలుగఁజేయఁగా. అబ్బలరిపునందనుండు = ఇంద్రునికొడుకైన యాయర్జునుఁడు. కని=చూచి. భావజ...బ్జుఁడై-భావజ=మన్మథునివైన. సాయక=బాణములచేత. బాధ్యమాన=బాధింపఁబడుచున్న దగుటచేత. విహ్వల = కలఁతనొందిన. హృదయాబ్జుఁడై = మనఃకమలము కలవాఁడై-చలించిన మనసుగలవాఁడై. అత్త[illegible]ణీమణియందున్ = యౌవనవతులైన స్త్రీలలో శ్రేష్ఠురాలైన యాసుభద్రయందు. చిత్తమున్ = మనసును. నిలిపెన్=ఉంచెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి చెల్లెలైన ఆసుభద్రయొక్క మనోజ్ఞములైన విహరించుటలయందలి తత్తఱపాటుయొక్క వినోదము తనమనసునకు సంతోషమును కలుగఁజేయఁగా అర్జునుఁడు మన్మథబాణములచేత పీడింపఁబడినవాఁడై ఆమెయందుతనమనసునుఉంచెననితాత్పర్యము.

౧౧౭౦.—ఉ॥ ఆతరుణీ శిరోమణియు * నర్జును నర్జున చారు కీర్తి వి
ఖ్యాతుని నింద్రనందను న * కల్మష మానసుఁ గామినీమనో
జాతునిఁజూచి పుష్పశర * సాయక జర్జరితాంత రంగయై
భీతిలియుండె సిగ్గు మురి * పెంబున మోహముదేరు చూపులన్.

టీ॥ ఆతరుణీశిరోమణియున్=స్త్రీలలో శ్రేష్ఠురాలయిన యాసుభద్రయు. అర్జునచారుకీర్తివిఖ్యాతునిన్=తెల్లగామనోజ్ఞమగుచున్న కీర్తిచేత ప్రసిద్ధుఁడైనవాఁడును. ఇంద్రనందనున్ = ఇంద్రుని కొడుకును. అకల్మషమానసున్ = కపటములేని మనసుగల వాఁడును. కామినీమనోజాతునిన్=స్త్రీలకు మన్మథునివలె మోహమునుపుట్టించువాఁడునైన. (అర్జునుని చూచి) పుష్ప...రంగయై-పుష్పశర=మన్మథునియొక్క. సాయక=బాణములచేత. జర్జరిత=తూంట్లుచేయఁబడిన. అంతరంగయై = మనసుగలదై. సిగ్గుమురిపెంబునన్ = సిగ్గుయొక్క ఒఱిగిపడుటచేతను. మోహముదేరు చూపులన్=మోహమును గనఁబఱుచునట్టి చూపులచేతను. భీతిలియుండెన్=భయపడియుండెను.

తా॥ ఆసుభద్రయు మిక్కిలిస్వచ్ఛమయిమనోజ్ఞమయినకీర్తిచేత ప్రసిద్ధుఁడును ఇంద్రునికొడుకును, కపటములేనిమనసుగలవాఁడును తన్నుఁగోరు స్త్రీలకు మన్మథునివలె మోహమును పుట్టించువాఁడునగు అర్జునునిఁజూచి మన్మథుని బాణములచేత తూంట్లుచేయఁబడిన మనసుగలదగుచు సిగ్గుయొక్క అతిశయము చేతను మోహమును తోఁపింపఁజేయునట్టి చూపులచేతను భయపడి యుండెను అని తా

వ॥ అట్లాన్నృపసత్తను మత్తకాశినులొండొరుల చిత్తంబులు చిత్తజాయత్తంబులై కోర్కులు దత్తఱింపం దాల్మిలువీడి
సిగ్గునం జిట్టుముట్టాడుచున్నయంత నొక్కనాఁడు దేవతా మహోత్సవ నిమిత్తంబున నత్తలోదరి పురంబు వెలు
పలికి నరుగుదెంచిన నర్జునుండు కృష్ణవసుదేవ దేవకీదేవులయనుమతంబుఁబడసి తానునుం దోడనచని యప్పుడు.

టీ॥ (అట్లు) ఆన్నృపసత్తమమత్తకాశినులు=ఆరాజగు అర్జునుఁడును ఉత్తమస్త్రీయగు సుభద్రయు. ఒండొరులచిత్తంబులు=ఒకరొకరియొక్క మనసులు. చిత్తజాయత్తంబులై=మన్మథుని అధీనములై. కోర్కులు [illegible]కోరికలు. తత్తఱింపన్=తడఁబడఁగా-అతిశయింపఁగా. తాల్మిలు =ధైర్యములు. వీడి=వదలి. సిగ్గునన్ = సిగ్గుచేత. చిట్టుముట్టాడుచున్నయంతన్ = ఇటునటు మెలఁగుచుండఁగా- (ఒక్కనాఁడు) దేవతామహోత్సవనిమిత్తంబునన్=తిరుణాళ్ల చూచునిమిత్తమున. అత్తలోదరి=ఆచిన్నది-సుభద్ర. పురంబు వెలుపలికిన్= పట్టణముబయటికి. అరుగుదెంచినన్=రాఁగా. (అర్జునుండు) కృష్ణవసుదేవదేవకీదేవులయనుమతంబున్=కృష్ణునియొక్కయువసుదేవునియొక్కయు దేవకీదేవియొక్కయు అనుజ్ఞను. పడసి=పొంది. (తానును) తోడన=వెంటనే. చని=పోయి. అప్పుడు = ఆ సమయమునందు.

తా॥ ఆవిధముగా ఆయర్జునుఁడును సుభద్రయు ఒకరొకరి మనసులుమన్మథాధీనములయి ధైర్యముతొలఁగఁగా కోరికలు పెరుగఁగా సిగ్గుచేత ఇటునటు మెలఁగుచు నుండఁగా ఒక్కనాడు తిరుణాళ్ల వేడుక చూచుటకై సుభద్ర పట్టణము వెలుపలికి పోయెను అప్పుడు అర్జునుఁడును కృష్ణునివలనను వసుదేవుని వలనను దేవకీదేవివలనను సెలవుపొంది తానును ఆమెవెంటఁబోయినవాఁడై యనితాత్పర్యము.






అర్జునుడు.

(*) అర్జునుఁడు సుభద్ర నెత్తుకొనిపోవుట. (*)

౧౧౭౨.—సీ॥ సాంద్రశరచ్చంద్ర * చంద్రికాస్ఫూర్తిచే - రాజిల్లుపూర్ణిమా * రజనివోలెఁ
బూర్ణేందుబింబావ * తీర్ణమైయిలమీఁద - భాసిల్లు హరిణడిం * భంబుఁబోలె
సులలితమేఘమం * డలమునునెడఁబాసి - వసుధఁ గ్రుమ్మరుతటి * ద్వల్లివోలె
మాణిక్య రచిత స * న్మహిత చైతన్యంబు - పొందిన పుత్తడి * బొమ్మఁబోలె

తే॥ లలితవిభ్రమ రుచికళా * లక్షణములఁ । బొసఁగరూపైన శృంగార * రసమువోలె
నర్థిఁజరియించుచున్న ప * ద్మాయతాక్షిఁ । బ్రకటసద్గుణభద్ర సు * భద్రఁజూచి.

టీ॥ సాంద్ర...స్ఫూర్తిచేన్—సాంద్ర = దట్టమయిన. శరత్= శరత్కాలమునందలి. చంద్ర=చంద్రునియొక్క. చంద్రికా=వెన్నెల యొక్క. స్ఫూర్తిచేన్ = ప్రకాశము చేత, రాజిల్లు...పోలెన్ — రాజిల్లు=ప్రకాశించునట్టి. పూర్ణిమా=పున్నమనాటి=రజనివోలెన్= రాత్రివలెను. పూర్ణేందుబింబావతీర్ణమై=నిండుచంద్రుని వలననుండి దిగినదై. ఇలమీఁదన్=భూమిమీఁద. భాసిల్లు=ప్రకాశించునట్టి. హరిణ డింభంబుఁబోలెన్ = జింకపిల్లవలెను. సులలిత మేఘమండలమున్= మిక్కిలి యొప్పిదమయిన మేఘసమూహము నుండి. ఎడఁబాసి = తొలఁగి. వసుధన్=భూమియందు. క్రుమ్మరు=తిరుగునట్టి. తటిద్వల్లి వోలెన్=మెఱపుతీఁగవలెను. మాణిక్య..న్యంబు—మాణిక్య=రత్నముల చేత, రచిత=చేయఁబడిన. సన్మహిత=మిక్కిలిమేలైన. చైతన్యంబు= ప్రాణమును, పొందినపుత్తడి బొమ్మఁబోలెన్ = పొందినట్టి బంగారు

కీలుబొమ్మవలెను. లలిత ... ములన్-లలిత=మనోజ్ఞత్వముయొక్కయు. విభ్రమ=తత్తఱపాటుయొక్కయు. రుచి=ప్రకాశముయొక్కయు. కళా=తేజోవిశేషముయొక్కయు. లక్షణములన్=గుఱుతులచేతను. పొసఁగన్ = సరిపడునట్లు. రూపైన = ఆకారమును వహించిన. శృంగారరసమో యన్ వోలెన్ = శృంగార రసమును వలెనే. అర్థిన్= ప్రీతితో. చరియించుచున్న పద్మాయతాక్షిన్=తిరుగుచున్న తామరలవలె విశాలములైన కన్నులుగల. ప్రకటసద్గుణభద్రన్ = ప్రసిద్ధములయినమంచిగుణములచేత శుభకరురాలగు. (సుభద్రను చూచి)

తా॥ మిక్కిలిదట్టమయిన శరత్కాలపు నిండుపున్నమనాటివెన్నెలతోఁగూడిన రాత్రివలెను, చంద్రబింబమునందుండి జాఱిన జింకపిల్లవలెను, మేఘములందుండితొలఁగివచ్చిన మెఱపుతీఁగవలెను, రత్నములనుపొదిఁగిచేయఁబడిన బంగారుకీలుబొమ్మవలెను, మనోజ్ఞత్వముయొక్కయు, తత్తఱపాటుయొక్కయు, ప్రకాశముయొక్కయు, తేజోవిశేషము యొక్కయు గుఱుతులతో సరిపడిన రూపమును పొందిన శృంగారరసమోయే మోఅనునట్టుగా ప్రీతితో సంచారముచేయుచున్న కమలమువలె విశాలములైన కన్నులును, ప్రసిద్ధములయిన మంచిగుణములకలిమిచేత మేలయినదియునైనసుభద్రను జూచి అని తాత్పర్యము.

వ॥ డాయంజని యరదంబుపై నిడికొని పోవుచుండం గనుంగొని యదుబలంబులు మదంబున నంటం దాఁకిన నప్పుడయ్యాఖండలనందనుండు ప్రచండ గాండీవకోదండనిర్ముక్తకాండంబులన్ దూలించి యఖండబాహాదండ విజయప్రకాండుండై కాండవప్రస్థపురంబునకరిగెనట బలభద్రుండవ్వార్తవిని విలయసమయసమీరసఖునికైవడిం బటురోషభీషణాకారుండై క్రోధించినం గని కృష్ణుండాదిగాఁగల బంధుజనంబు లతనిచరణంబులకుం బ్రణమిల్లి మృదుమధురభాషణంబులననునయించియొడంబడునట్లుగా నాడిననతండునుసంతుష్టుండైమనంబునఁగలంక దేఱియప్పుడు.

టీ॥ డాయంజని=దగ్గఱపోయి. అరదంబుపైన్=రథముమీఁద. ఇడికొని = ఎత్తికూర్చుండఁబెట్టుకొని. పోవుచుండన్ = పోవుచుండఁగా. కనుంగొని=చూచి. యదుబలంబులు = యాదవసేనలు. మదంబునన్ = క్రొవ్వుతో. అంటందాఁకినన్ = వెంబడించిముట్టుకొనఁగా. (అప్పుడు) అయ్యాఖండల నందనుండు=అయర్జునుఁడు. ప్రచండ ... బులన్-ప్రచండ=మిక్కిలిచుఱుకులైన. గాండీవకోదండనిర్ముక్త=గాండీవమనెడి వింటినుండి విడువఁబడిన. కాండంబులన్ = బాణములచేత. తూలించి = చలింపఁజేసి-భయపడిపోవునట్లుచేసి. అఖండ ... ప్రకాండుండై-అఖండ=సంపూర్ణమయిన. బాహాదండ=కఱ్ఱలవంటిబాహువులబలమువలన. విజయప్రకాండుండై = మేలైనజయమును పొందినవాఁడై. కాండవప్రస్థ పురంబునకున్=ఇంద్రప్రస్థపట్టణమునకు. అరిగెన్=పోయెను. అట=అక్కడ. బలభద్రుండు=బలరాముఁడు. అవ్వార్తవిని = ఆవృత్తాంతమునువిని. విలయసమయసమీరసఖునికైవడిన్=ప్రళయకాలమునందలి యగ్నివలె. పటురోషభీషణాకారుండై = అధికకోపముచేత భయంకరమైనయాకారముగలవాఁడై. క్రోధించినన్=కోపించుకొనఁగా. కని=చూచి. కృష్ణుండాదిగాఁగలబంధుజనంబులు = కృష్ణుఁడు మొదలయినచుట్టములు. అతనిచరణంబులకున్=ఆబలరామునిపాదములకు. ప్రణమిల్లి = నమస్కరించి. మృదుమధుర భాషణంబులన్ = తిన్నని యింపైనమాటలచేత. అనునయించి=సమాధానపఱిచి. ఒడంబడు నట్లుగాన్=సమ్మతించునట్లుగా. ఆడినన్=చెప్పఁగా. అతండును=ఆబలరాముఁడును. సంతుష్టుండై=సంతోషించిన వాఁడై. మనంబునన్ = మనసునందు. కలంక=కలఁత. తేఱి=తేటపడిపోయి. అప్పుడు=ఆసమయమునందు.

తా॥ దగ్గఱపోయి సుభద్రను ఎత్తి రథముమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని పోవుచుండఁగాఁజూచి యాదవసేనలు అహంకారముతో అర్జునుని వెంబడించిపోయి ముట్టుకొనఁగా ఆతఁడుమిక్కిలితీక్ష్ణములయిన తనగాండీవమను వింటివలననుండి ప్రయోగింపఁబడిన బాణములచేత వారలను నొప్పించి తఱుమఁగొట్టి కొఱఁతలేని జయమును పొందినవాఁడై యింద్రప్రస్థపట్టణముపోయిచేరెను, ఆవృత్తాంతము అక్కడబలరాముఁడువిని మిక్కిలికోపించి ప్రళయకాలపు అగ్నిహోత్రుని వలెనే మండిపడఁగా కృష్ణుఁడుమొదలగు వారందఱు తగిన మాటలుచెప్పి ఆయన కోపమును పోఁగొట్టిరి. అంతటబలరాముఁడు మనసున కోపముచల్లారి సంతోషమునొందినవాఁడై ఆసమయమందు అని తాత్పర్యము.

౧౧౭౪.—క॥ కరులం దేరుల నుత్తమ । హరుల న్మణిహేమ భూష ✻ ణాంబర భృత్యో
త్కర దాసికాజనంబుల । నరణముఁగా నిచ్చి పంపె ✻ ననుజకుఁ బ్రీతిన్.

టీ॥ అనుజకున్=చెల్లెలికి. కరులన్=ఏనుఁగులను. తేరులన్=రథములను. ఉత్తమహరులన్ = శ్రేష్ఠములయిన గుఱ్ఱములను. మణి ... బులన్—మణి=రత్నములు. హేమ=బంగారు—ధనమును. భూషణ=సొమ్ములను. అంబర = వస్త్రములను. భృత్యోత్కర=పరిచారకుల సమూహములను. దాసికాజనంబులన్ = పరిచారికాజనులను. అరణముగాన్ = పెండ్లికాలమునందు ఇయ్యఁదగిన స్త్రీధనముగా. ప్రీతిన్=ప్రేమతో. (ఇచ్చిపంపెను)

తా॥ చెల్లెలయినసుభద్రకు బలరాముఁడు ఏనుఁగులు రథములు గుఱ్ఱములు ధనము ఆభరణములు వస్త్రములు చాకిరి చేయువారైన స్త్రీపురుషజనములు మొదలగువారితోడ అరణమిచ్చిపంపెను అనితా.

వ॥ ఇట్లుకృష్ణునకభిమతంబుగా సుభద్రార్జునులకునరణంబిచ్చి పంపెనని చెప్పి శుకయోగీంద్రుండుమఱియు నిట్లనియె.

టీ॥ (ఇట్లుకృష్ణునకు) అభిమతంబుగాన్=ఇష్టముగా. (సుభద్రార్జునులకు అరణంబిచ్చిపంపెను అనిచెప్పి) శుకయోగీంద్రుండు=శుకమహాముని. మఱియునిట్లనియెన్ = ఇంకను చెప్పనారంభించెను.

తా॥ ఈప్రకారము బలరాముఁడు కృష్ణునికిప్రియముగా సుభద్రకును అర్జునునకును అరణమిచ్చి పంపెను అనిచెప్పి శుకమహాముని మరల పరీక్షిన్మహారాజునుగూర్చి యిట్లుపలికెను అని తాత్పర్యము.

౧౧౭౬.—సీ॥ నరనాథవిను భువ * న ప్రసిద్ధంబుగ - దీపించునట్టి వి * దేహదేశ
మందు భూకాంతకు * నాననదర్పణం - బనఁ దనర్చినమిధి * లను పురమునఁ
గలఁడు శ్రీహరిపాద * కంజాతభక్తుండు - గళితరాగాది వి * కారుఁడమల
చరితుఁడక్రోధుండు * శాంతుండునిగమార్థ - కోవిదుండగుశ్రుత * దేవుఁడనెడి
తే॥ భూసురోత్తముఁడొకఁడని * చ్ఛాసమాగ । తంబుతుషమైనహేమశై * లంబుగాఁగఁ
దలఁచిపరితోషమందుచుఁ * దగగృహస్థ । ధర్మముననుండెసముచిత * కర్ముఁడగుచు.

టీ॥ నరనాథ = ఓరాజా. (వినుము) భువనప్రసిద్ధంబుగన్ = లోకమునందు ప్రసిద్ధముగా. దీపించునట్టి విదేహ దేశమందున్ = ప్రకాశించునట్టి విదేహమనెడు దేశమునందు. భూకాంతకున్ = భూవిదేకి. ఆననదర్పణంబనన్ = మొగముచూచుకొను నద్దమోయను నట్లు. తనర్చిన=ఒప్పిన. మిధిలను పురమునన్ = మిథిలయను పట్టణమునందు. శ్రీహరిపాదకంజాత భక్తుండు = శ్రీవిష్ణునిపాదకమలములందుభక్తిగలవాఁడు. గళితరాగాదివికారుఁడు=తొలఁగిన రాగము మొదలగువికారములు గలవాఁడు. అమలచరితుఁడు=నిర్మలమయిన నడవడిగలవాఁడు. అక్రోధుండు=కోపము లేనివాఁడు. శాంతుండు= ఓర్పుగలవాఁడు. నిగమార్థ కోవిదుండు=వేదార్థములను చక్కఁగా నెఱిఁగిన పండితుఁడు. అగుశ్రుతదేవుఁడనెడిభూసురోత్తముఁడు= అగునట్టి శ్రుతదేవుఁడనుపేరుగల బ్రాహ్మణశ్రేష్ఠుఁడు. (ఒకఁడు) కలఁడు=ఉండెను. (అతఁడు) అనిచ్ఛాసమాగతంబు = కోరకవచ్చినది. తుషమైనన్ = ఉముకయైనను. హేమశైలంబుగాఁగన్ = బంగారుకొండగా. తలఁచి=ఎంచి. పరితోషమందుచున్ = సంతోషమును బొందుచు. సముచితకర్ముఁడగుచున్ = యోగ్యములైననిత్యనైమిత్తిక కర్మములుకలవాఁడగుచు. తగన్ = తగునట్లు. గృహస్థధర్మమునన్ = గృహస్థాశ్రమమునందు. (ఉండెను)

తా॥ ఓరాజా! నేనుచెప్పెడి విషయమునువినుము లోకమునందు ప్రసిద్ధిఁబొంది ప్రకాశించునట్టి విదేహదేశమునందు భూదేవికిమొగము జూచుకొనెడి అద్దమో యనునట్లు మిథిలయను పట్టణము ఒకటి వెలుఁగు చుండును, ఆపట్టణమునందు శ్రీవిష్ణు పాదసేవకుఁడును, రాగాది వికారములు లేనివాఁడును, మంచి నడవడి గలవాఁడును, కోపములేనివాఁడును, ఓర్పుగలవాఁడును, వేదార్థములనుచక్కఁగా తెలిసికొన్న పండితుఁడు నైన శ్రుతదేవుఁడను బ్రాహ్మణ శ్రేష్ఠుఁడు గలఁడుఅతఁడుతానుకోరకదొరకినఅల్పద్రవ్యమునైనమహాధనముగా నెంచిసంతోషించుచుగృహస్థధర్మమునందున్నవాఁడైఅందులకుఁదగిన నిత్యనైమిత్తిక కర్మములనుతప్పక నడపుచుండెను అని తాత్పర్యము.

(*)రాగద్వేషాదులవివరణము.(*)

రాగము ద్వేషము కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము ఈర్ష్య అసూయ దంభము దర్పము అహంకారము అని పదుమూఁడువిధములు. అందురాగమనఁగా పరస్త్రీ విషయికముగఁ గలిగెడు చిత్తవృత్తి. ఇందువలన బహుబలశాలి యగు రావణుఁడు సీతాదేవిని చెఱఁబెట్టి పుత్ర మిత్ర భాతృ బంధు పరివారంబులతోడ మడిసెను.

ద్వేషమనఁగా ఒకఁడు అపకారముచేయఁగా వానికిమరల అపకారముచేయవలయుననెడి చిత్తవృత్తి. ఇందువలనహిరణ్యకశిపుఁడు దురాచారుఁడయిన తన యనుజుని వరాహరూపుఁడయిన హరి పొరిగొనెనని ద్వేషించి దూషించి ఆమాధవుని వధింప శపథంబు చేసిన ఆనారాయణుండు నరసింహరూపముచేత వానిని సంహరించెను.

కామమనఁగా ఇండ్లు తోఁటలుమాన్యములుధనములుధాన్యములు పశువులు స్త్రీలు మొదలగువానిని యెక్కువగ సంపాదింప వలయుననెడిచిత్తవృత్తి. దీనివలన నరకాసురుఁడు అనేకులు స్త్రీలనుదెచ్చి చెఱఁబెట్టినందున శ్రీకృష్ణమూర్తి వానినిజంపెను.

క్రోధమనఁగా తానుచేయునట్టి పనులకు విఘ్నముచేయువానిని శిక్షింపవలయునని ఉగ్రముగఁగలిగెడుచిత్తవృత్తి. ఇందువలన బకాసురుఁడు ఏకచక్ర పురనివాసులగు బ్రాహ్మణులను బాధించుచుండ వారలప్రేరేపణంబున భీముఁడారక్కసుని చక్కాడెను.

లోభమనఁగా తనకు లభించినపదార్థంబుల నితరుల కివ్వఁగూడదనుచిత్తవృత్తి. ఇందువలన రాజరాజగు దుర్యోధనుఁడు తనజ్ఞాతులగు పాండవుల కివ్వవలసిన సగభాగము నివ్వనందున పుత్ర మిత్ర సహోదర బంధువులతోడ వారిచేత మడిసెను.

మోహమనఁగా పుత్ర కళత్ర ధనాదులయందు మిక్కుటపు ప్రేమ గలిగి యుక్తాయుక్తముల నెఱుఁగనిచిత్తవృత్తి. ఇందువలన దశరథ మహారాజు తనభార్యయగు కైకయందలిప్రీతిచేత సత్యశీలాది సద్గుణ నిధియైనశ్రీరాముని అడవులకుఁబంపి అందునతానుమృతినొందెను.

మదమనఁగా సకలసంపదలుగలిగి గర్వాంధుఁడై నేనేమిచేసినను చెల్లునని తోఁచెడుచిత్తవృత్తి. ఇందువల్ల జమదగ్ని మహర్షియొక్క హోమధేనువును కార్తవీర్యార్జునునిపుత్రులు క్రొవ్వుచేతనపహరించి పరశురాముని నెదిరించినందున యుద్ధమందతనిచేత తామును తమ తండ్రియగు కార్తవీర్యుఁడును సీల్గిరి.

మాత్సర్యమనఁగా ఇతరులు తనకంటె నెక్కుడగు విద్యయును ఐశ్వర్యమును చక్కఁదనమునుభోగమును వర్చస్సునుశరీరబలమును పరాక్రమమును గలవారైయుండఁగాఁజూచి యోర్వఁజాలక మండిపడు చిత్తవృత్తి. ఇందువలన శిశుపాలుఁడు ధర్మరాజుచేయు రాజసూయ యాగమందు కృష్ణునివైభవమునుజూచి యోర్వకతిట్టి చక్రాయుధముచేత గట్టెను.

ఈర్ష్యయనఁగా నాకువచ్చినకష్టములు ఇతరులకు రావలయునను చిత్తవృత్తి. ఇందువల్ల అరుణాత్ముఁడనువాఁడు తనతోసమానుఁడగు బాణునకుదుఃఖములు గాఁగోరి అతనిచేత ప్రాణములుగోలుపోయెను.

అసూయయనఁగా తనకుఁగలిగిన సుఖములు ఇతరులకుఁ గలుగరాదను చిత్తవృత్తి. ఇందువలనపుండ్రకదేశపురాజగువాసుదేవుఁడు వాసుదేవుఁడనుపేరు నాకుఁదగునుగాని మఱియొకనికిఁ దగునాయనెడువిరోధముచేత వాసుదేవుఁడైన శ్రీకృష్ణమూర్తితో మచ్చరించి చచ్చెను.

దంభమనఁగా తానుచేసినపనులు పరులెఱిఁగి హెచ్చుగ మెచ్చవలయునను చిత్తవృత్తి. ఇందువల్ల అపూర్వుఁడు తన యాగమును జూడుమని దుర్వాసునితోఁ బలికిన అతఁడు ఇది దంభమనఁగా అందుకు అపూర్వుఁడలిగి దూర్వాసునిదూషించి విఫలమునొందెను.

దర్పమనఁగా నేనుసర్వవిషయములయందుసమర్థుఁడనునాకుసాటియైనమేటియేచోట లేఁడనుచిత్తవృత్తి. ఇందువల్ల త్రిలోకకంటకుఁడైన దశకంఠుఁడు గ్రొవ్వి యెవ్వరిని చవ్వచేసి నాకెవ్వరీడనితిరుగుచుండ విష్ణుదేవుఁడు శ్రీరాముఁడైయుదయించి కదనంబునవానిని వధించెను.

అహంకార మనఁగా ఓరీ నిన్ను శిక్షించువాఁడనని యొఱుఁగవాసేపట్టినపట్టును తుదముట్టింపక నట్టనడుమ విడిచిపెట్టునట్టి వాఁడను గాను అని యితరుల నదలించు చిత్తవృత్తి. దీనివలన మధుఁడు కైటభుఁడు అనెడు టక్కరి రక్కసులు అహంకరించి విష్ణుదేవునితోకలహించి కాలముచేసిరి కనుకబుద్ధిమంతులును భగవత్సేవా పరులును ముముక్షువులును నైనవారు ఈదుర్గుణములను వద్దచేరనియ్యక పెద్దల సేవించుచు నుండవలయును.

౧౧౫౭.—ఉ॥ ఆపురి నేలువాఁడు బహు ❋ ళాశ్వుఁడునా నుతికెక్కునట్టిధా
త్రీపతి యాధరామరుని ❋ రీతిని నిష్కలుషాంత రంగుఁడై
యేపనులందు ధర్మగతి ❋ నేమఱకర్థిఁ జరించుచుండె ల
క్ష్మీపతి వారిపైఁ గరుణ ❋ చేసి ప్రసన్నముఖాంబు జాతుఁడై.

టీ॥ ఆపురిన్ = ఆమిధిలాపట్టణమును. ఏలువాఁడు=పాలించునట్టివాఁడు. బహుళాశ్వుఁడునాన్=బహుళాశ్వుఁడు అనఁగా. నుతికెక్కునట్టిధాత్రీపతి=పొగడ్తనుపొందినరాజు. ఆధరామరునిరీతిన్=ఆశ్రుతదేవుఁడను బ్రాహ్మణుని విధమున. నిష్కలుషాంతరంగుఁడై=కపటములేని మనసుగలవాఁడై. ఏపనులందున్=ఏపనులయందైనను. ధర్మగతిన్=ధర్మమార్గమును. ఏమఱక=తప్పక. అర్థిన్=ప్రీతితో. చరించుచుండెన్=మెలఁగుచుండెను. లక్ష్మీపతి=శ్రీలక్ష్మీదేవికి పెనిమిటియైనశ్రీకృష్ణమూర్తి. వారిపైన్=ఆయిద్దఱిమీఁదను. (కరుణచేసి) ప్రసన్నముఖాంబుజాతుఁడై = తేటపాఱినముఖకమలముగలవాఁడై.

తా॥ ఆమిధిలా పట్టణమును బహుళాశ్వుఁడు అను రాజు ఏలుచుండెను అతఁడునుమందుచెప్పినశ్రుతదేవుఁడను,బ్రాహ్మణునివలెనే నిష్కపటచిత్తముతో ఏపనిచేయునప్పుడును ధర్మమార్గము తప్పక ప్రవర్తించుచు నుండెను, అటువంటి నడతలుగల ఆయిద్దఱియందును ప్రీతిగలవాఁడైశ్రీకృష్ణమూర్తి వికాసమువహించినముఖముతో ననితా.




(❋) శ్రీకృష్ణుండు ఋషిసమేతుండై మిధిలానగరమునకుఁ బోవుట. (❋)

వ॥ అట్లుకృష్ణుండు వారలంజూచు వేడ్క నిజస్యందనారూఢుండై నారద వామదేవాత్రి కృష్ణ ద్వైపాయనాసిత రోమశారుణ దివిజగురు కణ్వ మైత్రేయ చ్యవనులును నేనును మొదలైనమునులనుగమింపంజనుచుఁ దత్తద్దేశనివాసులగు నానర్తక ధన్వ కురుజాంగల కంకణ మత్స్య పాంచాల కుంతల మధు కేకయ కోసలాది ఘూవరులు వివిధవస్తు ప్రచయంబులు గానుకలిచ్చి సేవింప గ్రహమధ్య గతుండై దీపించు సూర్యుండునుంబోలె నప్పుండరీకాక్షుండు మందస్మిత సుందరవదనారవిందుండగుచువారలంగరుణార్ద్ర దృష్టిం జూచి యోగ క్షేమంబు లరసి సాదరంబగు భాషణంబుల నాదరించుచుం గతిపయ ప్రయాణంబులం జని విదేహ నగరంబు డాయుటయు నాబహుళాశ్వుం డమ్మాధవురాక విని మనంబున హర్షించుచు వివిధపదార్థంబులు గానుకలుగాఁగొని తానును శ్రుతదేవుండును నెదురుగాఁజనుదెంచి యప్పుడు.

టీ॥ (అట్లు కృష్ణుండు) వారలంజూచువేడ్కన్ = ఆయిద్దఱిని జూడవలెనను కుతూహలముతో. నిజస్యందనారూఢుండై=తన తేరు నందెక్కినవాఁడై. నారద...లును — (నారదుఁడు వామదేవుఁడు అత్రి) కృష్ణద్వైపాయన=వ్యాసుఁడు.(అసితుఁడు రోమశుఁడు అరుణుఁడు) దివిజగురు=బృహస్పతి. (కణ్వుఁడు మైత్రేయుఁడు చ్యవనుఁడు అనువారు) శుకుడు=శుకుఁడు తాను అనుట. (మొదలయిన మునులు)అనుగమింపన్=వెంబడించినడవఁగా. చనుచున్=పోవుచు. తత్తద్దేశ నివాసులు = ఆయా దేశములయందుండువారు. (అగు ఆనర్తకధన్వ కురుజాంగల కంకణ మత్స్య పాంచాల కుంతల మధు కేకయ కోసల) ఆది=మొదలుగాఁగల. భూవరులు=రాజులు. వివిధ వస్తుప్రచయంబులు=నానావిధవస్తువులసమూహములు.(కానుకలిచ్చి) సేవింపన్=కొలువఁగా. గ్రహమధ్యగతుండై = శుక్రాంగారకాది గ్రహములనడుమనుండువాఁడై. దీపించు=ప్రకాశించునట్టి- సూర్యుండునుంబోలెన్=సూర్యునివలెనే. అప్పుండరీకాక్షుండు=ఆకృష్ణుఁడు. మందస్మితసుందరవదనారవిందుండగుచున్ = చిఱునవ్వుచేత అందగించుచున్న ముఖకమలముగలవాఁడగుచు. వారలన్=ఆరాజులను. కరుణాదృష్టిన్=దయతోడిచూపుతో. (చూచి) యోగక్షేమంబులు= ఆప్తులతోడికూడికను మేలును. అరసి = విచారించి. సాదరంబు= ఆదరముతోఁగూడినది. అగుభాషణంబులన్=అగునట్టిమాటలచేత. ఆదరించుచున్ = ఆదరణచేయుచు. కతిపయ ప్రయాణంబులన్ = కొన్నిప్రయాణములలో. చని=పోయి. విదేహనగరంబున్=మిథిలాపట్టణమును. డాయుటయున్=సమీపింపఁగా. (ఆబహుళాశ్వుండు) అమ్మాధవురాకవిని = ఆకృష్ణుఁడు వచ్చుటను విని. మనంబునన్= మనసునందు. హర్షించుచున్=సంతోషించుచు. వివిధపదార్థంబులు= బహువిధములయినవస్తువులను. (కానుకలుగా) కొని = తీసికొని. ( తానును శ్రుతదేవుండును ఎదురుగా ) చనుదెంచి = వచ్చి. అప్పుడు=ఆసమయమునందు.

తా॥ ఆవిధముగా కృష్ణుఁడు బహుళాశ్వుని శ్రుతదేవునినిజూడవలెనను కుతూహలముతో ద్వారకనుండిబయలుదేఱి తనవెంట నారదుఁడు మొదలు గాఁగల ఋషులును సేనను నడవఁగా పోవుచు త్రోవలో నడుమనడుమ ఆనర్తక కురుజాంగల దేశములు మొదలు గాఁగల దేశముల రాజులు తమతమ దేశములనుండి కానుకలు తెచ్చి యిచ్చి సేవింపఁగా శుక్రుఁడు మొదలగు గ్రహములనడుమ వెలుఁగుచుండు సూర్యునివలె వెలుఁగుచు చిఱునవ్వుతోడి ముఖముతో ఆరాజులనెల్లను దయతోఁజూచి యాదరించి యోగక్షేమములువిచారించి పంపుచు కొన్నిదినములు ప్రయాణముచేసి మిథిలాపట్టణము చేరఁబోఁగా ఆపట్టణపు రాజైన బహుళాశ్వుఁడు శ్రుతదేవుఁడు అను బ్రాహ్మణునితోఁ గూడుకొని ఎదురుగా వచ్చి బహువిధము లయిన పదార్థములు కానికపెట్టి ఆసమయమునందు మీఁదచెప్పఁబోవువిధమున ప్రవర్తించెను అని శుకుఁడు పరీక్షిన్మహారాజుతోచెప్పెననితా.

౧౧౪౯.—ఉ॥ ఆమునికోటికిన్ వినయ * మారఁగ వందన మాచరించి యా
తామరసాభ లోచనుఁ డు * దారచరిత్రుఁడు పాపగోత్ర సు
త్రాముఁడు భక్తలోక శుభ * దాయకుఁడైన రమేశు సద్గుణ
స్తోముని పాదపద్మములు * సోఁకగ మ్రొక్కి వినమ్రుఁడై తగన్.

టీ॥ ఆమునికోటికిన్ = ఆకృష్ణునివెంటవచ్చిన నారదుఁడుమొదలగు మునులసమూహమునకు. వినయము=అడఁకువ. ఆరఁగన్ = పూర్ణముగా. వందనము=నమస్కారము. ఆచరించి = చేసి. ఆ = ప్రసిద్ధుఁడైన. తామరసాభలోచనుఁడు = తామరలవంటి కన్నులు గలవాఁడు. ఉదారచరిత్రుఁడు=గంభీరమయిననడవడిగలవాఁడును. పాపగోత్రసుత్రాముఁడు=పాపములు అనుకొండలను పడఁగొట్టుటకు ఇంద్రుఁడును. భక్తలోకశుభదాయకుఁడు=సేవకులసమూహమునకు మేలు కలుగఁజేయువాఁడును. అయినరమేశు = అయినట్టి లక్ష్మీభర్తయైన. సద్గుణస్తోముని పాదపద్మములు=సర్వజ్ఞత్వము మొదలగు మంచిగుణముల సమూహములుగల శ్రీకృష్ణమూర్తియొక్క పాదకమలములు. సోఁకఁగన్=తాఁకునట్లుగా. (మ్రొక్కి) తగన్=ఉచితరీతిని. వినమ్రుఁడై=మిక్కిలి వంగినవాఁడై.

తా॥ ఆశ్రీకృష్ణునివెంట వచ్చిన మునిశ్రేష్ఠుల కందఱికి ముందు మ్రొక్కి పిమ్మట తామరలవంటి కన్నులుగలవాఁడై, గంభీరమయిన నడవడిగలవాఁడై, పాపములనెడు కొండలకు ఇంద్రుఁడై, సేవకుల సమూహమునకు మేలుకలుగఁజేయువాఁడై, శ్రీలక్ష్మికి భర్తయై, ఎల్ల సద్గుణములును గలవాఁడై యొప్పునట్టి ఆశ్రీకృష్ణమూర్తి యొక్క పాదకమలములుసోఁక మ్రొక్కిమిక్కిలివినయముతో ననితాత్పర్యము.

౧౧౫౦.—చ॥ కరములుమోడ్చి యోపరమ * కారుణికోత్తమ నీవు నీముని
శ్వరులును మద్గృహంబునకు * వచ్చి మముం గృపచేసి యిచ్చటన్
గరమనురక్తిఁ బూజనలు * గైకొనుడంచు నుతించి వేఁడ నా
హరి మనమందు వారివిన * యంబులకెంతఁ బ్రమోదమందుచున్.

టీ॥ కరములు=చేతులు. మోడ్చి=ముకుళించి. ఓపరమకారుణికోత్తమ=మేలైనదయగలవారిలో ఉత్తముఁడవైన ఓస్వామీ(నీవును) ( ఈమునీశ్వరులును ) మద్గృహంబునకున్ = నాయింటికి. (వచ్చి) మమున్=మమ్మును. కృపచేసి = దయచేసి. ఇచ్చటన్=ఇక్కడ. కరము=మిక్కిలి. అనురక్తిన్=ప్రేమతో. పూజనలు = పూజలను. గైకొనుఁడు=గ్రహింపుఁడు. అంచున్=అని. నుతించి = స్తోత్రముచేసి. వేఁడన్=ప్రార్థింపఁగా. ఆహరి=ఆకృష్ణుఁడు. మనమందున్= మనసులో. వారివినయంబులకున్=ఆబహుళాశ్వశ్రుతదేవులవినయములకు. ఎంతన్=మిక్కిలి. ప్రమోదమందుచున్=సంతోషించుచు.

తా॥ చేతులు జోడించుకొని దయగలవారిలో నుత్తముఁడవైన

ఓస్వామీ ! నీవును నీవెంటవచ్చిన యీమునిశ్రేష్ఠులును నాయింటికి వచ్చువున్నను అనుగ్రహించి మిక్కిలిప్రేమతో మావలనిపూజలనుపరిగ్రహింపుఁడు అని ప్రార్థింపఁగా శ్రీకృష్ణమూర్తి వారి వినయమునకు మనసునందు మిక్కిలి సంతోషించినవాఁడై అని తాత్పర్యము.

౧౧౮౧.—చ॥ తిరముగ వారియిష్టమును * దీర్పఁదలంచి మురాసురారి యొం
డొరువులెఱుంగకుండ ముని * యూథముఁదానును నేగె వారి మం
దిరముల కేక కాలమున * ధీరత నాధరణీ వరుండు వా
రిరుహ దళాయతాక్షు ముని * బృందములం గనకాసనంబులన్.

టీ॥ తిరముగన్=స్థిరముగా—తప్పకయనుట. వారియిష్టమును=ఆబహుళాశ్వశ్రుతదేవులకోరికను. తీర్పన్=నెఱవేర్పను. (తలంచి) మురాసురారి=కృష్ణుఁడు. ఒండొరువులు = పరస్పరము. ఎఱుంగకుండన్=తెలియకుండునట్లు. వారిమందిరములకున్=వారియిండ్లకు. ఏకకాలమునన్=ఒకకాలమునందే. మునియూథమున్ = ఋషుల సమూహమును. (తానునుఏగెను) ధీరతన్=ధైర్యముతో-తాలిమితో. ఆధరణీవరుండు=ఆరాజు. వారిరుహదళాయతాక్షున్ = తామరతేకువలె విశాలములైన కన్నులుగల కృష్ణుని. మునిబృందములన్=మునులసమూహములను. కనకాసనంబులన్=బంగారు పీఁటలయందు.

తా॥ అంతట ఆయిరువురి ప్రార్థనను అంగీకరించి ఒకరియింటికి పోవుటఒకరికితెలియకుండునట్లుగాఒకకాలమునందేఆయిద్దఱియిండ్లకును మునులసమూహముతోడఁబోయెను అప్పుడు బహుళాశ్వుఁడు తనయింటికివచ్చిన కృష్ణుని మునులను మిక్కిలి తాలిమితో బంగారు పీఁటలయందు అనితాత్పర్యము.




(*) బహుళాశ్వ జనకుఁడు కృష్ణుని మునులనుబూజించుట. (*)

౧౧౮౨.—సీ॥ కూర్చుండ నియమించి * కోమరారుకాంచన - కలధౌత కలశోద * కములచేతఁ
బాదముల్గడిగి త * త్పావనజలములు - దాను సతియు బాం * ధవ జనంబుఁ
గరమర్థి నిజమస్త * కంబుల ధరియించి - వివిధార్చనములు స * ద్విధి నొనర్చి
మణి భూషణాంబర * మాల్యానులేపన - రాజిత ధూప నీ * రాజనములు

తే॥ భక్తిఁగావించి పరిమృష్ట * బహువిధాన్న । పాయసాపూప పరిపక్వ * ఫలములోలి
నారగింపంగఁజేసి క * ర్పూరమిళిత । లలిత తాంబూలములు నెయ్య * మలరనొసఁగి.

టీ॥ కూర్చుండ నియమించి = కూర్చుండుఁడు అనిచెప్పి. కోమరారు ... చేతన్ — కోమరారు=ఒప్పునట్టి. కాంచన = బంగారువియు. కలధౌత=వెండివియునైన. కలశ=కలశములయందలి. ఉదకములచేతన్=నీళ్లచేత. పాదములు = కాళ్లు. (కడిగి) తత్పావనజలములు=ఆకాళ్లుగడిగిన పరిశుద్ధమయిననీళ్లు. (తానును) సతియున్=పెండ్లామును. బాంధవజనంబును=చుట్టములును. కరము=మిక్కిలి. అర్థిన్=ప్రీతితో. నిజమస్తకంబులన్=తమతలఁయందు. (ధరియించి) సద్విధిన్=క్రమమైనవిధమున. వివిధార్చనములు=నానావిధములైన పూజలను. ఒనర్చి=చేసి. మణి...ములు—మణి=రత్నములు చెక్కిన. భూషణ=ఆభరణములును. అంబర=వస్త్రములును. మాల్య=పువ్వుదండలును. అనులేపన=పూసికొనెడు మంచిగంధమును. రాజిత = ప్రకాశించునట్టి. ధూప = పరిమళములుగల పొగలను. నీరాజనములు=ఆరతులను. భక్తిన్ = అనన్యభక్తితో. కావించి = చేసి—సమర్పించి యనుట. పరిమృష్ట...ములు — పరిమృష్ట = మిక్కిలిపరిశుద్ధమయిన. బహువిధ = అనేక విధములయిన. అన్న=అన్నము. పాయస=పరమాన్నము. అపూప=అప్పములు. పరిపక్వ=మాఁగిన. ఫలములు=పండ్లు. ఓలిన్=క్రమముగా. ఆరగింపంగఁజేసి=భుజించునట్లుచేసి. కర్పూర ... ములు — కర్పూర = పచ్చకప్పురముతో. మిళిత=కూడిన. లలిత=మనోజ్ఞమైన. తాంబూలములు=విడెములు. నెయ్యము=స్నేహము—ప్రీతి. అలరన్=ఒప్పునట్లు. ఒసంగి=ఇచ్చి.

తా॥ కూర్చుండఁబెట్టి అందమైనబంగారుకలశములందును వెండికలశములందును నీళ్లుతెప్పించి పాదములు గడిగి ఆకాళ్లు కడిగిన పరి

శుద్ధములైననీళ్లను తానునుభార్యయుచుట్టములును మిక్కిలిప్రీతితో తమ తలలయందుచల్లుకొని శాస్త్రవిధిప్రకారము నానావిధముల పూజలు చేసి రత్నములు చెక్కిన సొమ్ములను, వస్త్రములను, పువ్వుదండలను, మంచిగంధమును అగరులను సమర్పించిమిక్కిలిపరిశుద్ధమైన అన్నము పరమాన్నము అప్పములు చక్కఁగా మాఁగినపండ్లు వీనినిక్రమముగా భుజింపనిచ్చి పచ్చకర్పూరముతోడి విడెమును ప్రీతితోనిచ్చి యనితా.

౧౧౭౩.—వ॥ అట్లు సమర్పించిన యనంతరమ్మున నమ్మిధిలేశ్వరుండైన జనకుండు పరమానందంబు నొందె.

టీ॥ (అట్లు) సమర్పించిన యనంతరమ్మునన్ = సమర్పణచేసిన పిమ్మట. అమ్మిథిలేశ్వరుండైనజనకుండు = ఆమిథిలా పట్టణమునకు రాజైన బహుళాశ్వుఁడు అనుజనకుఁడు. పరమానందంబునొందె = అష్టవిధానందములను మీఱిన నిరతిశయానందమును పొందె.

తా॥ ఈవిధముగా ఆరాధించిన పిమ్మట ఆమిథిలాపట్టణపురాజైన బహుళాశ్వజనకుఁడుమిక్కిలిసంతోషించినవాఁడైయని తాత్పర్యము.

౧౧౭౪.—చ॥ హరిపదపద్మ యుగ్మము ని * జాంక తలంబునఁజేర్చి యొత్తుచుం
బురుషవరేణ్య యీనిఖిల * భూత గణావలి యాత్మలందు సు
స్థిరమతిఁ గర్మసాక్షివి సు * ధీవర నీపద భక్త కోటితో
సరయనుమాధినాథ చతు * రాస్యులుఁ బోలరటందు వెప్పుడున్.

టీ॥ హరిపదపద్మయుగ్మమున్=కృష్ణునియొక్క పాదకమలముల జంటను. నిజాంకతలంబునన్=తనయొడియందు.(చేర్చి) ఒత్తుచున్= పిసుకుచు. పురుషవరేణ్యా = ఓపురుషశ్రేష్ఠుఁడా. ఈనిఖిల భూత గణావలియాత్మలందున్=ఈసమస్తప్రాణుల సమూహముయొక్క మనసులయందు. సుస్థిరమతిన్ = మిక్కిలి నిలుకడగలబుద్ధితో. కర్మసాక్షివి=వారువారుచేయుపనులకు సాక్షివై యుండువాఁడవు. సుధీవర = పండితోత్తముఁడగు కృష్ణా. ఎప్పుడున్ = ఏకాలమందును. నీపదభక్తకోటితోన్=నీపాదసేవకులసమూహముతోడ అరయన్= విచారింపఁగా. ఉమాధినాథ చతురాస్యులు=శివుఁడును బ్రహ్మయు. పోలరు=సరికారు. అటందువు=అని చెప్పుదువు.

తా॥ శ్రీకృష్ణుని పాదములను తన ఒడిలోఁజేర్చుకొని పిసుకుచు ఓస్వామీ ! నీవు ఈలోకములోని ప్రాణుల మనసులయందు వారు చేయుపనులకెల్లసాక్షివైయుండుదువు, ఎల్లప్పుడునీపాదసేవకులతో శివుఁడునుబ్రహ్మయునైననుసమానులుకారని చెప్పుదువనిపలికెననితా.

వ॥ అట్టి లోకవిదితంబైన భవద్వాక్యంబునిక్కంబుగా భవదీయ పాదారవిందంబులందునొకానొక వేళ లేశమాత్ర
ధ్యానంబుగల నాగృహంబున కకించనుండని చిత్తంబునం దలంపక భక్త వత్సలుండ వగుటంజేసి విజయముచేసి
తివి భవత్పాదపంకేరుహ ధ్యాన సేవారతిందగిలినమహాత్ములు త్వద్ధ్యానంబు వదలుదురే నిరంతరంబును శాంత
చిత్తులై నిష్కించనులై యోగీంద్రులై నీవలనంగోరికగలవారలకునిన్నైనన నిత్తువుగదా యని వెండియు నిట్లనియె.

టీ॥ అట్టి=అటువంటి. లోకవిదితంబు=లోకమందుప్రసిద్ధమయినది. అయిన భవద్వాక్యంబు=అయినట్టి నీమాట. నిక్కంబుగాన్= నిజముగా. భవదీయపాదారవిందంబులందున్ = నీవైన పాదకమలములయందు. ఒకానొకవేళన్ = ఏదేనియొక సమయమున. లేశమాత్ర ధ్యానంబుగల నాగృహమునకున్ = కొంచెము తలఁచుటగల నాయింటికి. అకించనుండు = ఏమియులేనివాఁడు. (అని) చిత్తంబునన్=మనసునందు. తలంపక=ఎంచక. భక్తవత్సలుండవు=భక్తులయందు ప్రేమగలవాఁడవు. అగుటంజేసి. అవుటచేత. విజయముచేసితివి=వచ్చితివి. భవ...రతిన్ — భవత్=నీదైన. పాదపంకేరుహ= పాదకమలములయొక్క. ధ్యాన=తలఁచుటయందును. సేవా=కొలుచుటయందును. రతిన్=ఆసక్తిని. తగిలిన=పొందిన. మహాత్ములు = పెద్దలు. త్వద్ధ్యానంబున్ = నీధ్యానమును. వదలుదురే = మానుదురా. నిరంతరంబును=ఎల్లప్పుడును. శాంతచిత్తులై=శాంతినొందిన మనసుగలవారలై. నిష్కించనులై=ఏకోరికలు లేనివారలై. యోగీంద్రులై=యోగులలో శ్రేష్ఠులై. నీవలనన్=నీయందు. కోరికగలవారలకున్=ఇచ్ఛగలవారికి. (నిన్నైనను) ఇత్తువుగదా = ఇయ్యఁగలవుగదా. (అని) వెండియున్=మఱియును. ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

తా॥ అటువంటి లోకప్రసిద్ధమైననీమాటతప్పకుండునట్లుఎప్పుడో ఒకసమయమున నీపాదములను కొంచెము తలఁచుచుండు నాయందు దయచేసిభక్తులయందుప్రేమగలవాఁడవు అగుటచేతనీఁడుఅల్పుఁడు అనితలఁపక నాయింటికి వేంచేసితివినీపాదములనుధ్యానించుటయందు ఆసక్తిగలిగినపెద్దలు నీధ్యానమును వదలరు ఎల్లప్పుడుశాంతచిత్తము గలవారై ఏకోరికలును లేనివారై యోగిశ్రేష్ఠులైనీయందు భక్తిగల వారికినిన్నైననునీవుఇత్తువుగదా అని మఱియునిట్లుపలికెను అనితా.

౧౧౭౫.—తే॥ కృష్ణ పరమాత్మ యదుకుల * క్షీరవార్ధి । పూర్ణచంద్రమ దేవకీ * పుత్త్ర సుజన
వినుత నారాయణాచ్యుత * వేదవేద్య । భక్తజనపోష పరితోష * పరమపురుష.

టీ॥ కృష్ణ=ఇహపరసుఖములనిచ్చువాఁడా. పరమాత్మ=పరబ్రహ్మస్వరూపుఁడా. యదుకుల క్షీరవార్ధిపూర్ణచంద్రమ = యాదవకులమనెడుసముద్రమునకునిండుచంద్రుఁడా. దేవకీపుత్త్ర=దేవకికొడుకా. సుజనవినుత. మంచివారిచేతకొనియాడఁబడువాఁడా. నారాయణ= వటపత్త్రశాయియైనారాయణుఁడు అనఁబడువాఁడా. అచ్యుత = సుఖమునుండిజాఱనివాఁడా. వేదవేద్య=వేదములచేత నెఱుఁగఁదగినవాఁడా. భక్తజనపోష = సేవకజనులను పోషించువాఁడా. పరితోష=ఆనందస్వరూపుఁడా. పరమపురుష = పురుషోత్తముఁడా.

తా॥ పరమాత్ముఁడవును సముద్రమువంటియాదవవంశమునందు నిండుచంద్రునివలెపుట్టినవాఁడవును, దేవకికికొమారుఁడవును, మంచివారిచేతకొనియాడఁబడువాఁడవును, ప్రళయసముద్రమునందుమఱ్ఱాకుమీఁదపవ్వళించియున్నవాఁడవును, ఎల్లసుఖములు గలవాఁడవును, వేదములచేతఁ దెలియఁదగినవాఁడవును, భక్తులను పోషించువాఁడవును, ఆనంద స్వరూపుఁడవునుపురుషశ్రేష్ఠుఁడవునైన ఓశ్రీకృష్ణా అని తా

౧౧౮౮.—ఉ॥ శ్రీపురుషోత్త మాఖ్య యదు * సింహ కిశోరక భక్తలోక ర
క్షాపరతంత్ర నీవు ముని * సంఘముఁ గొన్ని దినంబు లుండవే
నీపద పద్మ రేణువులు * నెమ్మి మదీయ గృహంబు సోఁకినన్
దాపసవంద్య యేనిపుడ * ధన్యుఁడ నయ్యెదఁ గాదె మాధవా.

టీ॥ శ్రీపురుషోత్తమాఖ్య=బ్రహ్మవిద్యయనెడులక్ష్మీదేవితోఁగూడిన పురుషోత్తముడనుపేరుగలవాఁడా. యదుసింహకిశోరక=యాదవులలోసింహపుపిల్లవలెశ్రేష్ఠుఁడగువాఁడా. భక్తలోకరక్షాపరతంత్ర=భక్తులసమూహమునురక్షించుటయందు ఆసక్తుఁడా. తాపసవంద్య=తపస్సుచేయువారికినమస్కరింపఁదగినవాఁడా. మాధవా=లక్ష్మీపతీ. (నీవు) మునిసంఘమున్=మునుల సమూహమును. కొన్నిదినంబులు=కొన్నాళ్లు. ఉండవే=ఇక్కడనుండవయ్యా. నీపదపద్మరేణువులు = నీయడుగుఁదమ్ములవలనిదుమ్ము. నెమ్మిన్=ప్రీతితో. మదీయగృహంబు సోఁకినన్=నాయిల్లుతగిలినను. ఏన్ = నేను. ఇపుడ = ఇపుడే. ధన్యుఁడనయ్యెదఁగాదె=కృతార్థుఁడనౌదునుగదా.

తా॥ పురుషోత్తముఁడనఁబడువాఁడవును, యాదవవంశమునందు శ్రేష్ఠుఁడవును, సేవకులను కాపాడుటయందు అక్కఱ గలవాఁడవును, తపస్సుచేయువారిచేత సేవింపఁబడువాఁడవును, శ్రీలక్ష్మీభర్తవునైన కృష్ణా నీవు ఈమునులసమూహముతోఁగూడ ఇక్కడకొన్నాళ్లు ఉండుము నీపాదకమలములయందలిదుమ్ము సోఁకి నాయిల్లు పావనమౌను నేను ధన్యుఁడనౌదును అని పలికెనని తాత్పర్యము.

వ॥ అనియభ్యర్థించినఁ బ్రసన్నుండై యప్పుండరీకాక్షుండు నిమికులప్రదీపకుండైన జనక చక్రవర్తిం గరుణించి యమ్మిథిలానగరంబునం బౌరజనంబులకు నున్నతశోభనంబులు గావించుచుం గొన్నిదినంబులుండె నంత.

టీ॥ (అని) అభ్యర్థించినన్=కోరఁగా. ప్రసన్నుండై = అతనియందు అనుగ్రహముగలవాఁడై. అప్పుండరీకాక్షుండు=ఆకృష్ణుఁడు. నిమికులప్రదీపకుండు = నిమివంశమును ప్రకాశింపఁజేయువాఁడు. అయినజనకచక్రవర్తిన్ = అయినట్టి జనకచక్రవర్తిని. కరుణించి=అనుగ్రహించి. అమ్మిథిలానగరంబునన్=ఆమిథిలయనుపట్టణమునందు పౌరజనంబులకున్=పట్టణములోని జనులకు. ఉన్నతశోభనంబులు=మేలైనశుభములను. కావించుచున్=కలుగఁజేయుచు. కొన్నిదినంబులుండెన్=కొన్నాళ్లు ఉండెను. అంతన్=అప్పుడు.

తా॥ అనియిట్లు కోరఁగా అతనియందుప్రేమగలవాఁడై యాకృష్ణుఁడు నిమివంశమును ప్రకాశింపఁ జేయువాఁడైన జనకచక్రవర్తిని మన్నించి ఆమిథిలాపట్టణమునందలిజనులకుమిక్కిలిశుభములను కలుగఁజేయుచు కొన్నాళ్లు ఆపట్టణమునందుండెను ఆసమయమునందు అని తా

౧౧౮౯.—మ॥ శ్రుతదేవుండును మోదియై మునిజన * స్తోమంబుతో నిందిరా
పతిఁదోకొంచు నిజాలయంబునకు నొ * ప్పన్నేగి యచ్చోట స
మ్మతి దర్భాస్తరణంబులన్నునిచి స * మ్యగ్జ్ఞాన పారీణుఁడై
సతియుం దాను పదాబ్జముల్గడిగి చం * చద్భక్తిఁ దత్తోయముల్.

టీ॥ శ్రుతదేవుండును=శ్రుతదేవుఁడుకూడ. మోదియై=సంతోషించినవాఁడై. మునిజన స్తోమంబుతోన్ = మునులసమూహముతో. ఇందిరాపతిన్=లక్ష్మీభర్తయైనకృష్ణుని. తోకొంచున్=పిలుచుకొని. నిజాలయంబునకున్=తనయింటికి. ఒప్పన్=తగునట్లు. ఏగి=పోయి. ఆచ్చోటన్=ఆయింటిలో. సమ్మతిన్ = ఇష్టముతో. దర్భాస్తరణంబులన్=దర్భాసనములయందు. ఉనిచి=కూర్చుండఁబెట్టి. సమ్యగ్జ్ఞానపారీణుఁడై=బ్రహ్మజ్ఞానముచేతతుదముట్టినవాఁడై. సతియున్=పెండ్లామును. (తానును) పదాబ్జములు=వారిపాదకమలములను. (కడిగి) చంచద్భక్తిన్=మేలైన భక్తితో. తత్తోయములు=ఆజలములను.

తా॥ శ్రుతదేవుఁడుఁ గూడ సంతోషముతో మునుల సమూహమును కృష్ణమూర్తిని తనయింటికిఁబిలుచుకొనిపోయి అందుదర్భాసనములయందు అందఱను వరుసగా కూర్చుండఁబెట్టి మిక్కిలి తెలివితో వారిపాదములను గడిగి ఆపరిశుద్ధజలమును తానును తనపెండ్లామును అని తాత్పర్యము.

౧౧౯౦.—చ॥ శిరములఁ దాల్చి నవ్య తుల * సీదళ దామ కుశ ప్రసూన వి
స్ఫురదరవిందమాలికలఁ * బూజయొనర్చి గృహాంధకూప సం
చరణుఁడనైన నాకడకుఁ * జక్రి దనంతనెవచ్చునట్టె సు
స్థిరమతిమున్ను నేతపముఁ * జేసితినంచును సంతసించుచున్.

టీ॥ శిరములన్=తలలయందు. తాల్చి=ధరించి. నవ్య...మాలికలన్ — నవ్య=క్రొత్తలైన. తులసీదళదామ=తొళసిదళములదండల చేతను. కుశ=దర్భలచేతను. ప్రసూన=పువ్వులయొక్క. విస్ఫురత్=వికసించిన. అరవింద=తామరపువ్వులయొక్క. మాలికలన్=దండలచేతను.

పూజయొనర్చి=పూజచేసి. గృహాంధకూపసంచరణుఁడను=ఇల్లనెడు (సంసారమనెడు) చీఁకటినూతియందు మెలఁగువాఁడను. ఐననాకు దర్శక్=అయినట్టినాయొద్దకు. చక్రి=కృష్ణమూర్తి. తనంతనె=తాను గానే. వచ్చినట్టి=రాఁదగినట్టి. ఏతపముక్ = ఏతపస్సును. సుస్థిర మతిక్=మిక్కిలినిలుకడగలబుద్ధితో. చేసితిక్=చేసితినో. అంచుక్= అని. సంతసించుచుక్=సంతోషము నొందుచును.

తా॥ తనతలలయందు చల్లుకొని అప్పుడు కోసితెచ్చిన తులసిదళముల దండలచేతను, దర్భలచేతను, మల్లెలు మొదలగు పుష్పలయు తామరపుష్పులయు దండలచేతను పూజచేసి చీఁకటి నూతిని బోలిన సంసారములోతగులుకొని మెలఁగుచున్న నాదగ్గఱకు శ్రీకృష్ణమూర్తి తానుగావచ్చునట్లు నేను పూర్వజన్మమునందు ఎటువంటితపస్సు చేసితినో అని అనుకొనుచుండెనని తాత్పర్యము.

౧౧౧౧.—తే॥ మఱియుఁదత్పాదతీర్థంబు ✻ మందిరమునఁ । గలయఁజిలికించి సంప్రీతి ✻ గడలుకొనఁగఁ
బత్రఫలపుష్పతోయము ✻ ల్భక్తినొసఁగి । హరిమురాంతకమూర్తి ని ✻ జాత్మ నిలిపి.

టీ॥ మఱియుక్=ఇదిగాక. తత్పాదతీర్థంబు=ఆకృష్ణునికాళ్లుగడిగిన నీళ్లు. మందిరమునక్=ఇంటిలో. కలయక్=అంతటను. చిలికించి= చల్లించి. సంప్రీతి=సంతోషము. కడలుకొనఁగక్=అతిశయింపఁగా. పత్రఫలపుష్పతోయములు = ఆకులు పండ్లు పువ్వులును. భక్తిక్ = ప్రీతితో. ఒసఁగి=ఇచ్చి. హరిమురాంతకమూర్తిక్ = మురాసురుని జంపిన శ్రీకృష్ణమూర్తిని. నిజాత్మక్=తనమనసునందు. నిలిపి=ఉంచి.

తా॥ అంతటితో తృప్తినొందక ఆశ్రుతదేవుఁడు ఆకృష్ణుని కాళ్లు గడిగినపరిశుద్ధజలమును తనయింటియందంతటను చల్లించి సంతోషము హెచ్చఁగా ఆకులు పండ్లు పువ్వులును భక్తితో సమర్పించి మురాసురునిజంపిన శ్రీకృష్ణునిరూపమునుతనమనసుననిలిపియనితాత్పర్యము.

౧౧౧౨.—తే॥ మానితంబగు విశ్వ ని ✻ దానమూర్తి । యైనకృష్ణుండు తనయింట ✻ నారగించెఁ
దనమనోరథ సిద్ధియుఁ ✻ దనకు నబ్బె । ననుచుఁ బైపుట్ట మల్లార్చి ✻ యాడుచుండె.

టీ॥ మానితంబగు విశ్వనిదానమూర్తి=గౌరవింపఁదగిన ప్రపంచమునకు మూలకారణమైన యాకృతిగలవాఁడు. (అయినకృష్ణుండు) తనయింటక్=తనయింటిలో. ఆరగించెక్=భోజనముచేసెను. తనమనోరథసిద్ధియుక్=తనకోరికనెఱవేఱుటయు. (తనకు) అబ్బెక్= లభించెను. అనుచుక్ = అని. పైపుట్టము = తనయుత్తరీయమును. అల్లార్చి = విదలించి. ఆడుచుండెక్ = నాట్యముచేయుచుండెను.

తా॥ లోకమునకు మూలకారణమై గౌరవింపఁదగిన యాకృతిగల శ్రీకృష్ణుఁడు తనయింట భోజనముచేసెను తనకోరిక లన్నియు నెఱవేఱెను అని సంతోషముతో ఉత్తరీయమును విదలించుకొనుచు నాట్యముచేయనారంభించెనని తాత్పర్యము.

౧౧౧౩.—చ॥ తరుణియుఁదానుఁ బుత్రులుఁ బ ✻ దంపడి కృష్ణుభజించుచుండఁ ద
చ్చరణము లంకపీఠమునఁ ✻ జాఁచిన మెల్లన నొత్తుచుక్ రమా
వరుఁగని పల్కె భక్తజన ✻ వత్సల మామక భాగ్యమెట్టిదో
హర చతురాస్యులు న్నెఱుఁగ ✻ నట్టి నినుం గనుఁగొంటి నెమ్మితోక్.

టీ॥ తరుణియుక్=పెండ్లామును. పుత్రులును = కొడుకులును. (తానును) పదంపడి = మఱియును. కృష్ణుక్ = కృష్ణుని. భజించుచుండక్=సేవించుచుండఁగా. తచ్చరణములు = ఆకృష్ణునియొక్క పాదములు- అంకపీఠమునక్=తన ఒడియందు. చాఁచినక్=చాఁగింపఁగా. మెల్లనక్=తిన్నగా. ఒత్తుచుక్=పిసుకుచు. రమావరుక్= కృష్ణుని. కని=చూచి. పల్కెక్=ఇట్లనెను. భక్తజనవత్సల=సేవకులయందుప్రేమగలయోస్వామీ. మామకభాగ్యము=నాయదృష్టము. ఎట్టిదో=ఎటువంటిదో — ఎంతమంచిదో అనుట. హరచతురాస్యులును=శివబ్రహ్మలుసయితము. ఎఱుఁగనట్టి=తెలిసికోలేని. నినుక్= నిన్ను. నెమ్మితోక్=ప్రీతితో. కనుఁగొంటిక్=చూచితిని.

తా॥ ఆట్లు పెండ్లాము బిడ్డలతోఁగూడ కృష్ణుని సేవించుచుండి పిమ్మటకృష్ణుఁడు తనయొడిలోనికిపాదములనుచాఁచఁగా ఆపాదములను మెల్లఁగా పిసుకుచు కృష్ణునిఁ జూచి స్వామీ! నాయదృష్టము ఎంతమంచిదో తెలియదు. శివుఁడు బ్రహ్మ మొదలయినవారికిఁ గూడ తెలిసికోఁగూడని నిన్ను ప్రీతితో సేవించుచుచూడఁగంటినని అనిపలికెనని తాత్పర్యము.

౧౧౧౪.—క॥ ముని యోగి మానస స్ఫుట । వనజంబుల నెల్లప్రొద్దు ✻ వసియించు భవ
ఘనదివ్యమూర్తి నాలో । చన గోచరమయ్యెఁ గాదె ✻ సర్వాత్మ హరీ.

టీ॥ సర్వాత్మ=ప్రణవమయప్రపంచస్వరూపుఁడవైన. హరీ=ఓశ్రీకృష్ణా. ముని...బులక్=మునివాక్సియమముగలిగినవసిష్ఠ కశ్యపాదిఋషులయొక్కయు. యోగి = సనకాదిబ్రహ్మనిష్ఠులయొక్కయు. మానస=మనస్సులనెడు. స్ఫుట=వికసించిన. వనజంబులక్=కమలములయందు. ఎల్లప్రొద్దు = ఎల్లప్పుడు. వసియించు = ఉండునట్టి. భవత్=నీదైన. ఘన=గొప్పదైన. దివ్యమూర్తి = అప్రాకృతమైన యాకృతి. నాలోచన గోచరమయ్యెఁగాదె-నాలోచన=నాకన్నులకు. గోచరమయ్యెఁగాదె=కనఁబడెనుగదా.

తా॥ ప్రపంచ స్వరూపుఁడవైన ఓకృష్ణస్వామీ! మునులయు యోగులయు తేటపాఱిన మనసులనెడు తామరలయందు వాసముచేయునట్టి అప్రాకృతమైన నీస్వరూపము నాకన్నులకు ఇప్పుడుకానఁబడెను గదా అని తాత్పర్యము.

వ॥ దేవా నీసచ్చరిత్రంబులు గర్ణరసాయనంబులుగా నాకర్ణించుచు నీకుఁ బూజలొనర్చుచు నీచరణార విందంబులకు వందనంబులు సేయుచు నీదివ్యనామ సంకీర్తనంబు సేయుచుం దమశరీరంబులు భవదధీనంబులుగా మెలంగు నిర్మల బోధాత్ములగువారి చిత్తంబులను దర్పణంబులం గానంబడు చుందువు కర్మవిక్షిప్త చిత్తులైనవారి హృదయంబుల నుండియు దూరగుండ వగుదువని మఱియు నిట్లనియె.

టీ॥ దేవా=స్వామీ. నీసచ్చరిత్రంబులు = నీవైనమంచికథలను. కర్ణరసాయనంబులుగాన్=చెవులకు ఇంపుగా. ఆకర్ణించుచున్ = వినుచు. నీకుఁబూజలొనర్చుచున్=నీకుఁబూజలు చేయుచు. నీచరణార విందంబులకున్ = నీపాదకమలములకు. వందనంబులు సేయుచున్= మ్రొక్కుచు. నీదివ్యనామసంకీర్తనంబు సేయుచున్=మేలైన నీనామములనుకీర్తించుచు. తమశరీరంబులు=తమయొక్క దేహములు. భవదధీనంబులుగాన్=నీకు అధీనములుగా. మెలంగు=వర్తిల్లునట్టి. నిర్మల బోధాత్ములు=స్వచ్ఛమైనబ్రహ్మజ్ఞానముగలవారు. అగువారిచిత్తంబులు=అగునట్టివారిమనసులు. అనుదర్పణంబులన్=అనునట్టియద్దములందు. కానంబడుచుందువు=అగపడుచుందువు. కర్మవిక్షిప్తచిత్తులు = కర్మములచేత చలింపఁ జేయఁబడినట్టి మనసులు గలవారు. అయినవారి హృదయంబులన్=అయినట్టిజనులయొక్కమనసులందు. (ఉండియును) దూరగుండవు = దూరమును పొందినవాఁడవు — కానరానివాఁడ వనుట. (అగుదువు అని) మఱియున్=ఇంకను. (ఇట్లనియెను)

తా॥ ఓస్వామీ ! నీవైన మంచి చరిత్రములను చెవులకింపుగా వినుచు, నీకుఁబూజలు సేయుచు, నీపాదములకు మ్రొక్కుచు, నీదివ్యములైన నామములనే ఉచ్చరించుచు, తమదేహములను నీయధీనములనుగాఁజేసి మెలఁగునట్టి దివ్య జ్ఞానముగల బ్రహ్మవేత్తలు తమ అంతఃకరణములనెడి అద్దములయందునీస్వరూపమునుజూచుచుందురు కర్మములను చేయుటయందలి పట్టుచేతకలవరమునొందిన అజ్ఞానులు, శ్లో॥అంతస్థమాత్మానమజంనదృష్ట్వాభ్రమంతిమూఢాః గిరిగహ్వరేషు॥ అనుప్రమాణముచేత తమ హృదయములయందుండెడు నిన్ను తెలిసికొ ఎక్కడనో యున్నవాఁడవు అనుకొని వెదకు చుందురు అని చెప్పి యింకను చెప్పుచున్నాఁడు.

౧౧౯౫—సీ॥ నీకు మ్రొక్కెదఁ గృష్ణ ✻ నిగమాంత సంవేద్య - లోకరక్షణ భక్త ✻ లోక వరద
నీపాద సేవనా ✻ నిరతుని నన్ను నే - పనిఁబంపె దానతి ✻ మ్మనినఁ గృష్ణుఁ
డెలనవ్వు మోమునఁ ✻ జెలువొంద నావిప్రు - కర మాత్మకరమునఁ ✻ గదియఁజేర్చి
పాటించి యతనితోఁ ✻ బలికెఁ దపశ్శక్తి - వఱలిన యమ్ముని ✻ వర్యు లెపుడుఁ
తే॥ దమ పదాంబుజరేణు వి ✻ తానకములు । దగుల లోకంబులను బవి ✻ త్రంబు సేయు
వారు ననుఁగూడి యెప్పుడు ✻ వలయు నెడల । కరుగుదెంతురు నీభాగ్య ✻ గరిమనిటకు.

టీ॥ (కృష్ణ) నిగమాంతసంవేద్య = వేదాంతములచేతఁ దెలియఁ దగినవాఁడా. లోకరక్షణ=లోకములను కాపాడు వాఁడా. భక్త లోకవరద = సేవక సమూహము కోరికలనిచ్చువాఁడా. ( నీకు మ్రొక్కెదను ) నీపాదసేవనానిరతునిన్ = నీయడుగులను కొలుచుటయం దాసక్తిగలవాఁడనైన. ( నన్ను ) ఏపనిఁబంపెదు = ఏమి చేయనుఆజ్ఞాపించెదవు. ఆనతిమ్మనినన్=సెలవిమ్మనఁగా. (కృష్ణుఁడు) ఎలనవ్వు=చిఱునవ్వు. మోమునన్=ముఖమునందు. చెలువొందన్= అందగింపఁగా. ఆవిప్రుకరము=ఆబ్రాహ్మణునియొక్క చేతిని. ఆత్మకరమునన్=తనచేతితో. కదియఁజేర్చి=చేర్చిపట్టి. పాటించి=ఆదరించి. అతనితోన్=ఆబ్రాహ్మణునితో. పలికెన్ = ఇట్లుపలికెను. తపశ్శక్తిన్ = తపస్సువలని సామర్థ్యముచేత. వఱలిన = ప్రసిద్ధి పొందిన. అమ్మునివర్యులు=ఆమునిశ్రేష్ఠులు. ఎపుడున్=ఎల్లప్పుడును. తమపదాంబుజ రేణువితానకములు = తమ పాదకమలములయందలి ధూళిపరంపరలు. తగులన్=సోఁకునట్లు. (లోకంబులను) పవిత్రంబు సేయువారు=పరిశుద్ధములనుగాఁజేయువారు. ననుఁగూడి = నాతోఁ జేరి. ఎప్పుడున్=ఎల్లప్పుడును. వలయునెడలకున్=కావలసినతావులకు అరుగుదెంతురు=వత్తురు. ఇటకున్=ఇక్కడికిని. నీభాగ్యగరిమన్= నీయదృష్టగౌరవముచేత. చనుదెంచిరి అనుక్రియపైపద్యముననున్నది.

తా॥ వేదాంతములచేతఁ దెలియఁదగినవాఁడవును, లోకములను రక్షించువాఁడవును, సేవకుల సమూహమునకు కోరినవరముల నిచ్చువాఁడవును నైనఓశ్రీకృష్ణా ! నేనునీకునమస్కరించెదనునీయడుగులను గొలుచుటయందు ఆసక్తిగలనన్ను ఏమిచేయను ఆజ్ఞాపింతువో అది చేయుటకు సిద్ధముగనున్నాను అనఁగా కృష్ణుఁడుచిఱునవ్వునవ్వుచు ఆబ్రాహ్మణునిచేయితనచేతితోఁబట్టుకొని ఆదరించితపఃప్రభావము చేత ప్రసిద్ధులయిన యీమునిశ్రేష్ఠులు ఎల్లప్పుడును తమకాలిదుమ్ము సోఁకించి లోకములనెల్లనుపరిశుద్ధములనుగాఁజేయుచుందురుకనుక ఎల్లప్పుడు కావలసిన తావులకు నావెంటవచ్చుచుందురు అట్లేయిప్పుడును నీయదృష్టవశముచేత ఇచ్చటికి వచ్చిరి యని చెప్పెనని తా.

వ॥ చనుదెంచిరి పుణ్యస్థలంబులును దీర్థంబులును దేవతలును సంస్పర్శనదర్శనార్చనంబులం బ్రాణులను సమస్త కిల్బిషంబులం బాయంజేయుదు రదియునుంగాక బ్రాహ్మణుండు జననమాత్రంబున జీవ కోటియందు ఘనుండైయుండు జప తపోధ్యానాధ్యయనాధ్యాత్మలం జతురుండయి మత్కారుణ్యా శ్రయుం డయ్యెనేని యతం డుత్తముండై వెలుంగు నతనిం జెప్పనేల యని మఱియు నిట్లనియె.

టీ॥ చనుదెంచిరి=వచ్చిరి. పుణ్యస్థలంబులును = కాశిగయాది పుణ్యములైన క్షేత్రములును. తీర్థంబులును = గంగాది పుణ్యతీర్థములును. దేవతలును = బ్రహ్మవిష్ణురుద్రాది దేవతలును. సంస్పర్శనదర్శనార్చనంబులన్ = తాఁకుటచేతను చూచుటచేతను అర్చించుటచేతను. ప్రాణులను=జీవులను. సమస్తకిల్బిషంబులన్=ఎల్లపాపముల నుండియు. పాయంజేయుదురు = బహుకాలమునకు తొలఁగునట్లు చేయుదురు. అదియునుంగాక=అంతేగాక. (బ్రాహ్మణుండు) జననమాత్రంబునన్=పుట్టుకచేతనే. జీవకోటియందున్=ప్రాణులసమూహమునందు. ఘనుండై=గొప్పవాఁడై. (ఉండును) జప ... త్మలన్—జప=గాయత్ర్యాది మంత్రజపమునందు. తపః = కృఛ్రచాంద్రాయణాది తపస్సునందును. ధ్యాన = బ్రహ్మనిష్ఠయందును. అధ్యయన = వేదముచదువుటయందును, అధ్యాత్మలన్=బ్రహ్మవిచారణయందును. చతురుండై=సమర్థుఁడై. మత్కార్యాశ్రయుండు = నావిషయములైన కార్యములను ఆశ్రయించినవాఁడు — నాసంబంధమయిన అర్చనాది కృత్యములను జేయువాఁడు. అయ్యేనిని=అయినయెడ. అతండు= అటువంటిబ్రాహ్మణుఁడు. ఉత్తముఁడై=అందఱియందును శ్రేష్ఠుఁడై. వెలుంగున్=ప్రకాశించును. అతనిన్=అట్టివానివిషయమును. చెప్పనేల=ఇట్టిదని చెప్పుటయెందుకు. (అని) మఱియునిట్లనియెను=ఇంకను చెప్పనారంభించెను.

తా॥ ఇచ్చటికిమునులువచ్చినారు పుణ్యస్థలములుతాఁకుటచేతను తీర్థములు చూచుటచేతను, దేవతలు పూజించుటచేతను, ప్రాణుల పాపములనెల్లను చిరకాలమునకు బోఁగొట్టుచుందురు, ఇదిగాక బ్రాహ్మణుఁడుపుట్టుకచేతనే గొప్పవాఁడైయుండునుగనుకఆబ్రాహ్మణుఁడు జపములు తపములు ధ్యానములు వేదాధ్యయనమును చేసి తత్త్వము తెలిసి సర్వమునందునుసమర్థుఁడై నాసేవచేయువాఁడు అగునేని ఉత్తముఁడై ప్రకాశించును అట్టిబ్రాహ్మణునివిషయము విశేషించి చెప్పవలసినదేకాదు అనిమఱియును కృష్ణుఁడు చెప్పనారంభించెను అని తాత్పర్యము.

౧౧౯౭.—క॥ నామది విప్రులపైఁ గల । ప్రేమము నాతనువునందుఁ * బెట్టనికతనన్
భూమీసురు లర్హ్యులు నీ । వీమునులం బూజసేయు * మిద్ధ చరిత్రా.

టీ॥ ఇద్ధచరిత్రా=ప్రసిద్ధమైననడవడిగలవాఁడా. నామదిన్= నామనసులో. విప్రులపైన్=బ్రాహ్మణులమీఁద. కలప్రేమము=కలిగినట్టిప్రీతిని. నాతనువునందున్=నాదేహమునందు. పెట్టనికతనన్= ఉంచకపోవుటచేత. భూమీసురులు=బ్రాహ్మణులు. అర్హ్యులు=అర్చనకుతగినవారు. (నీవు) ఈమునులన్=ఈఋషులను. (పూజచేయుము)

తా॥ ఓమంచినడవడిగలబ్రాహ్మణుఁడా! నాకుబ్రాహ్మణులయందుఁ గలప్రీతి నాదేహమునందు సైతములేదుకాఁబట్టినీవుఈబ్రాహ్మణులను పూజింపుము వీరుపూజకుఁదగినవారు అనికృష్ణమూర్తి పలికెనని తా.

౧౧౯౮.—క॥ ఇదియే నాకిష్టము ననుఁ । బదివేలవిధంబు లొలయ * భజియించిన నా
మది కింపవు నటుగావున । వదలని భక్తిన్ భజింపు * వసుధామరులన్.

టీ॥ ఇదియే=ఈబ్రాహ్మణులనుబూజించుటయే. (నాకు) ఇష్టము= ప్రియము.ననున్=నన్ను. (పదివేలవిధంబులు) ఒలయన్ = కూడుకొనునట్టుగా. భజియించినన్=సేవించినను. నామదికిన్=నామనసునకు. ఇంపవున్ = ఆసేవలు ఇంపుగానివియు నగును. అటుగావునన్=అట్లగుటవలన. వసుధామరులన్=బ్రాహ్మణులను. వదలని భక్తిన్ = విరామములేనిభక్తితో. భజింపుము = సేవింపుము.

తా॥ ఇప్పుడు నేనుచెప్పిన బ్రాహ్మణ పూజయే నాకు ప్రియము అనేకవిధములచేత నన్ను పూజించినను నాకు అది అంతతృప్తిగానుండదుకనుకనీవుభక్తివదలకబ్రాహ్మణపూజచేయుమఅనికృష్ణుఁడు శ్రుతదేవునితో చెప్పెనని తాత్పర్యము.

౧౧౯౯.—క॥ అని సర్వలోక గురుఁడగు । వనజోదరుఁ డానతిచ్చు * వాక్యంబుల జా
డనె భూమీసురుఁ డమ్ముని । జనులకు సద్భక్తిఁ బూజ * సలిపె న్వరుసన్.

టీ॥ (అని) సర్వలోకగురుఁడు=ఎల్లలోకములకునుతండ్రి — లేక సర్వప్రాణులకును జ్ఞానమునిచ్చువాఁడు. అగువనజోదరుఁడు=అగునట్టి శ్రీకృష్ణమూర్తి. ఆనతిచ్చువాక్యంబులజాడనె=సెలవిచ్చుమాటలవిధముననే. భూమీసురుఁడు=బ్రాహ్మణుఁడు. అమ్మునిజనులకున్ = ఆమునీశ్వరులకు. సద్భక్తిన్=ఏకాంతభక్తితో. వరుసన్=క్రమముగా. పూజసలిపెన్=పూజచేసెను — షోడశోపచారముల సలిపెననుట.

తా॥ అని యీవిధముగా సర్వలోకములకును గురువైన (తండ్రియైన) కృష్ణమూర్తిచెప్పఁగావిని ఆచొప్పుననేశ్రుతదేవుఁడు అప్పుడు తనయింటికి వచ్చియున్నమునీశ్వరులనందఱను క్రమముగాపూజించెనని తాత్పర్యము.

౧౨౦౦.—చ॥ ఎనయఁగఁ గృష్ణుఁడంత మిధి * లేశ్వర భూసురులం గృపావలో
కన మొలయన్ననూన సుభ * గస్థితిఁ బొందఁగఁజేసి వారి వీ
డ్కొని రథమెక్కి దివ్య ముని * కోటియుఁ దానునువచ్చెఁ గ్రమ్మఱన్
జనవర మోదమంబగు కు * శస్థలికిం బ్రమదాంత రంగుఁడై.

టీ॥ జనవర=రాజా. అంతన్ = అంతట. (కృష్ణుఁడు) మిధిలేశ్వర భూసురులన్ = మిధిలాపట్టణపురాజైన జనకునిని శ్రుతదేవుఁడను బ్రాహ్మణునిని. ఎనయఁగన్=సరిపడునట్లుగా. కృపావలోకనము=దయతోడిచూపు. ఒలయన్=వ్యాపింపఁగా. అనూనసుభగస్థితిన్=తక్కువలేనిచక్కనిచూపుయొక్కయునికిచేత. పొందఁగన్=పొందికయగునట్టుగా. (చేసి) వారిన్=ఆయిరువురను. వీడ్కొని=

వదలుకొని—వారితో పోయెదనని చెప్పి బయలుదేఱి. (రథమెక్కి) దివ్యమునికోటియుక్=దేవమునులసమూహమును. (తోనును) ప్రమదాంతరంగుఁడై = సంతోషముతోడి మనసు గలవాఁడై. మోక్షదంబౌ=ముక్తినిచ్చునది. అగుకుశస్థలికిన్=అగునట్టి ద్వారవతీ పట్టణమునకు. క్రమ్మఱన్=మరల. (వచ్చెను)

తా॥ ఓరాజా! అంతట కృష్ణుఁడు మిథిలాపట్టణపురాజైన జనక మహారాజుతోను అతని ఆశ్రితుఁడైన శ్రుతదేవుఁడను బ్రాహ్మణునితోను పోయివచ్చెదనని చెప్పి బయలుదేఱి దేవమునుల సమూహము వెంటరాఁగా రథమెక్కినవాఁడై ముక్తినిచ్చునదియైన ద్వారవతీ పట్టణమునకు మరల వచ్చెనని తాత్పర్యము.

శ్లో॥ అయోధ్యామథురామాయా కాశీకాంచీఅవంతికా
పురీద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయకాః॥



(*) పరీక్షిత్తునకు శుకమహాముని శ్రుతిగీతలఁ జెప్పుట. (*)

వ॥ అనిచెప్పిన బాదరాయణికి నభిమన్యు నందనుం డిట్లనియె మునీంద్రా ఘటపటాది వస్తుజాతంబు భంగి నిర్దేశింప నర్హంబుగాక సత్వాదిగుణ శూన్యంబైన బ్రహ్మంబునందు సత్వాదిగుణ గోచరంబులైన వేదంబులేక్రమంబునఁ బ్రవర్తించునట్టిచందంబు నాకెఱింగింపుమనిన భూవరునకు మునివరుండిట్లనియె, సకలచేతనా చేతనాంతర్యామియైన సర్వేశ్వరుండు సర్వశబ్దవాచ్యుండుగావున సకలజంతునివహంబులకుబుద్ధీంద్రియ మనఃప్రాణశరీరంబులను సృజియించి చేతనవర్గంబునకు జ్ఞానప్రదుండుగాన సకలనిగమసమూహంబులును దత్స్వరూపగుణవైభవప్రతిపాదకంబులుగావున ముఖ్యంబై ప్రవర్తించు శ్రుతిస్తోత్రం బుపనిషత్తుల్యంబు ననేకపూర్వ ఋషిపరంపరాయాతంబును నైన దీనిని శ్రద్ధాయుక్తుండై యెవ్వం డనుసంధించు నతనికి మోక్షంబు సులభంబు దీనికి నారాయణాఖ్యానంబను నొక్కయుపాఖ్యానంబుగలదు వినిపింతువినుము భగవత్ప్రియుండైననారదుం డొక్కనాఁడు నారాయణాశ్రమంబునకుం జని ఋషిగణ సమేతుండైన నారాయణ ఋషిం గనుంగొని నీవు నన్నడిగినట్లమ్మహాత్ము నడిగిన నతండు మున్నునీయర్థంబు శ్వేతద్వీపవాసులైన సనకసనందనాది దివ్యయోగీంద్రులు ప్రశ్నసలిపిన వారలకు సనందనుండు వాక్రుచ్చిన ప్రకారంబు నీకెఱింగించెదనని వక్కాణింపం దొడంగె శయానుండైన రాజశ్రేష్ఠునిం దత్పరాక్రమ దక్షతాది చిహ్నంబుల నుతియించు వందిజనంబుల చందంబున జగదవసానసమయంబున ననేకశక్తియుతుండై యోగనిద్రావశుండైనసర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబులుసేయు విధంబు నారాయణుండు నారదునకుం జెప్పిన తెఱంగున వినుమని యిట్లనియె.

టీ॥ అనిచెప్పినన్=అనియిట్లుచెప్పఁగా. బాదరాయణికిన్ = శుకునితో. అభిమన్యునందనుండు=పరీక్షిన్మహారాజు. (ఇట్లనియెను) మునీంద్రా = ఓమునిశ్రేష్ఠుఁడా. ఘటపటాదివస్తుజాతంబుభంగిన్= కుండలు కోకలు మొదలగు వస్తు సమూదాయమువలె. నిర్దేశింపన్ = ఇదియిట్టిదని చెప్పను. అర్హంబుగాక = సరిపడక. సత్వాదిగుణశూన్యంబు = సత్వము మొదలగు త్రిగుణములులేనిది. ఐనబ్రహ్మంబునందున్=అయినట్టి పరతత్వమునందు. సత్వాదిగుణగోచరంబులు= సత్వము మొదలగుగుణముల చేతతోఁచునవి. ఐనవేదంబులు=అయినట్టి చతుర్వేదములు. శ్లో॥ త్రైగుణ్యవిషయావేదాః నిస్త్రైగుణ్యోభవార్జున. అనిగీత॥ ఏక్రమంబునన్=ఏవిధముగా. ప్రవర్తించున్ = ప్రతిపాదించును. అట్టిచందంబు=ఆవిధమును. నాకెఱింగింపుము=నాకు తెలియఁజేయుము. అనినన్ = అనియడుగఁగా. భూవరునకున్ = రాజునకు. మునివరుండు=శుకమహాముని. (ఇట్లనియెను) సకల ... ర్యామి—సకల=సమస్తమైన. చేతన=ప్రాణముగలవియు. అచేతన=ప్రాణములేనివియునైన వస్తువులలో. అంతర్యామి=లోపలవర్తించువాఁడు. (అయిన సర్వేశ్వరుండు) సర్వశబ్దవాచ్యుండు=సమస్తశబ్దములచేతనుచెప్పఁబడినవాఁడు—శ్లో॥సర్వగత్వాదనంతస్య సఏవాహమవస్థితః। మత్తస్సర్వమహంసర్వం మయిసర్వంసనాతనః. అనిప్రమా

టీక. సర్వశక్తిమన్ కర్తను ప్రణవముద్వారక ప్రణవశబ్దముచేత చెప్పఁబడగినవాఁడు. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, ఓమితి బ్రహ్మ, ఓమితీదꣳ సర్వం॥ అనుశ్రుతి. కావునన్ = కనుక. సకలజంతు నివహంబులకున్ = స్థావర క్రిమి జలచర పక్షి పశు నరులనెడి యెల్ల ప్రాణుల సమూహమునకును. బుద్ధి...బులన్ — బుద్ధి=నిశ్చయాత్మకమైనబుద్ధిని. ఇంద్రియ=జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను. మనః=సంకల్పాత్మకమైన మనస్సును. ప్రాణ=పంచప్రాణములను. శరీరంబులన్=స్థూల సూక్ష్మకారణ శరీరములను. సృజియించి=కలుగఁజేసి. చేతనవర్గంబునకున్=ప్రాణులసమూహమునకు. జ్ఞానప్రదుండు = తెలివినిచ్చువాఁడు. కానన్=కనుకను. సకలనిగమ సమూహంబులును = ఎల్ల వేదముల సమూహములును. తత్స్వ...బులు—తత్ = ఆతెలివినిచ్చువాఁడైన భగవంతునిదైన, స్వరూప = సచ్చిదానంద స్వరూపముల యొక్కయు. గుణ = సర్వజ్ఞత్వాది శుభగుణముల యొక్కయు. వైభవ=సంపదను. ప్రతిపాదకంబులు=చెప్పునవి. కావునన్=కనుకను. ముఖ్యంబై=ప్రధానమయి. ప్రవర్తించు = ఉండునట్టి. శ్రుతిస్తోత్రంబు = వేదరూపమయిన స్తోత్రము. ఉపనిషత్తుల్యంబును=ఉపనిషత్తులతో సమానమయినదియు. అనేకపూర్వ ఋషిపరంపరాయాతంబును = అనేకులగు మునుపటి ఋషుల పరంపరచేతవచ్చినదియు. అయినదీనిని=అయినట్టి యీవేదరూపస్తోత్రమును. శ్రద్ధాయుక్తుండై = అక్కఱతోఁగూడుకొన్నవాఁడై. ఎవ్వండు = ఏమనుష్యుఁడు. అనుసంధించున్=పఠించునో. అతనికిన్=ఆమనుజునకు. మోక్షంబు = దుఃఖరహితస్థితి. సులభంబు = కష్టములేకదొరకునదియగును. దీనికిన్=ఈశ్రుతిస్తోత్రమును పఠించువానికి మోక్షము సులభము అనుటకు. (నారాయణాఖ్యానంబు) అను నొక్కయుపాఖ్యానంబు=అనునట్టి యొక్క కథ.(కలదు) వినిపింతున్=నీకుఁజెప్పెదను. (వినుము) భగవత్ప్రియుండు = భగవంతునికి ఇష్టుఁడు. అయిన నారదుండు = అయినట్టి నారదమహాముని. (ఒక్కనాఁడు) నారాయణాశ్రమంబునకున్ = నారాయణ ఋషియొక్క ఆశ్రమమునకు. చని=పోయి. ఋషిగణ సమేతుండైన = ఋషుల సమూహముతోఁగూడుకొన్నవాఁడైన. (నారాయణ ఋషిని) కనుంగొని = చూచి. (నీవు నన్ను) అడిగినట్లు = అడిగిన విధముగానే. అమ్మహాత్మున్ = అగొప్పవాఁడైన నారాయణమహర్షిని. అడిగినన్ = అడుగఁగా. అతండు=ఆనారాయణమహర్షి. మున్ను=మునుపు. ఈయర్థంబు = ఈవిషయమును. శ్వేతద్వీపవాసులయిన=తెల్లదీవియందుండువారైన. సనకసనందనాది=సనకుఁడు సనందనుఁడు మొదలుగాఁగల. దివ్యయోగీంద్రులు=దేవ ఋషులలో శ్రేష్ఠులు. ప్రశ్నసలిపినన్=తమలోతామ ప్రశ్నచేసికోఁగా. వారలకున్=ఆఅడిగిన మునులకు, (సనందనుండు)వాక్రుచ్చినప్రకారంబు=చెప్పినవిధము. నీకెఱింగించెదను = నీకు తెలియఁజెప్పెదను. (అని) వక్కాణింపందొడంగెన్ = చెప్పనారంభించెను. శయానుండైనరాజశ్రేష్ఠునిన్=పండుకొని నిద్రపోవుచున్న గొప్పరాజును. తత్పరా...బులన్—తత్ = ఆరాజుయొక్క. పరాక్రమ=పరులనుఆక్రమించుశక్తి. దక్షత=ఏపనికినిచాలియుండుట. ఆది=మొదలుగాఁగల. గుణ్యంబులన్=గుణములచేత. నుతియించు=పొగడునట్టి. వందిజనంబుల చందంబునన్ = స్తుతిపాఠకులవిధమున. జగదవసానసమయంబునన్=లోకములు లయమయినప్పుడు, అనేకశక్తియుతుండై=జ్ఞానక్రియాదులయినయనేకశక్తులతోఁగూడుకొన్నవాఁడై. యోగనిద్రావశుండైన = యోగనిద్రను పొందిన. సర్వేశ్వరునిన్ = భగవంతుని. (వేదంబులు) స్తోత్రంబులు. సేయువిధంబున=పొగడునట్టివిధమును. నారాయణుండు=నారాయణమహర్షి. (నారదునకు) చెప్పినతెఱంగునన్ = చెప్పినవిధమున. (వినుము) అని=శుకుఁడుచెప్పి. ఇట్లనియెన్=చెప్పనారంభించెను.

తా॥ అనియిట్లుచెప్పఁగావిని పరీక్షిన్మహారాజు శుకమహామునితో ఇట్లనియెను, ఓమునీశ్వరా ! కుండలు కోకలు మొదలగు వస్తువుల సమూహమువలె ఇదియిట్టిదియనిచెప్పను అనువుగాక సత్వము రజస్సు తమస్సుఅనుమూడుగుణములులేనిదైన పరబ్రహ్మమునందు (త్రైగుణ్యవిషయావేదాః) అనునట్లు సత్వాదిగుణములతో తోఁచునట్టి వేదములు ఏవిధముగానుండును, అనఁగా వేదములు త్రిగుణయుక్తములై యుండి త్రిగుణరహితుఁడయిన పరబ్రహ్మమునెట్లు ప్రతిపాదించును, ఆవిషయమును నాకు తెలియవలయునని అడుగఁగా శుకుఁడు ఆరాజుతో నిట్లుచెప్పెను- ( అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్య నారాయణస్థితః)అనుశ్రుతిచేత క్షేత్రనములును అచేతనములును అయిన యెల్లప్రాణులలోనువర్తించువాఁడైనభగవంతుఁడు (ససర్వనామ సచవిశ్వరూప సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్య నామధేయాని ) అను ప్రమాణముచేత మహదాదులయిన యెల్లశబ్దములచేతను చెప్పఁదగినవాఁడు కనుకను మీఁదచెప్పిన ప్రాణులకెల్లను బుద్ధి మనస్సు ఇంద్రియములు ప్రాణములు శరీరములు అనువానినిగలుగఁజేసి, అందు చేతనములగువానికి తెలివినికూడ కలుగఁజేయును కనుకను (సర్వవేదమయోవిప్రః సర్వవేదమయోస్మ్యహం) అనుప్రమాణము చేత భగవత్స్వరూపములైన ఎల్లవేదములును ఆభగవంతుని స్వరూప గుణముల యొక్క వైభవమును చెప్పునవికనుకను అన్నిటికి ప్రధానమైన వేదమనెడుస్తోత్రము వేదాంతములయిన యుపనిషత్తులను బోలినదై అనేకులగు మునుపటి ఋషుల పరంపరచేత సేవింపఁబడుచు వచ్చునది యగుటచేత అట్టి వేదస్తోత్రమును ఎవఁడు అక్కఱతోచదువునో వానికి మోక్షము అనాయాసముగా లభించును అందుకు సందేహము లేదు ఈవిషయమయి నారాయణాఖ్యానము అనఁబడునట్టి యొక కథగలదు దానిని నీకుఁ జెప్పెదనువినుము, పూర్వకాలమునఁదొకనాడు భగవంతునికి ప్రియభక్తుఁడయిన నారదమహాముని నారాయణాశ్రమమునకుఁ బోయి అనేక ఋషులతోఁ గూడుకొన్నవాఁడైయున్న నారాయణమహర్షిని జూచి నీవునన్నుఅడిగినట్లుఅడుగఁగా ఆనారాయణమహర్షి యీవిషయము మునుపు శ్వేతద్వీపమునందు భగవత్పరులయినసనకసనందనాదులు పరస్పరము చర్చచేయునపుడు సనందుఁడు చెప్పెను, ఆచొప్పుననే నేనిపుడు నీకు తెలియఁజెప్పెదను అని చెప్పనారంభించెను పండుకొని నిద్రపోవుచున్న రాజును స్తుతిపాఠకులు అతని బిరుదులను ఉగ్గడించి పొగడునట్లు తనచేత సృజింపఁబడిన లోకము లన్నియు లయమయినప్పుడు జ్ఞానక్రియాదులైన అనేక శక్తులతోఁగూడుకొన్నవాఁడయి యోగనిద్రను పొందిన భగవంతుని నిశ్శ్వాసములవలనఁ బుట్టిన వేదములు స్తోత్రములు చేయును, ఈవిషయమును నారాయణమహర్షి నారదునకు చెప్పినవిధమున నీకు నేనుచెప్పెదను వినుమని శుకమహాముని పరీక్షిత్తునకు చెప్పనారంభించె నని తాత్పర్యము.

౧౨౦౨.—సీ॥ జయజయ హరి దేవ * సకల జంతువులకు - జ్ఞానప్రదుండవు * గాన వాని
వలన దోషంబులు * గలిగినసుగణసం - తానంబుగాఁ బరి * జ్ఞానశక్తి
ముఖ్యషడ్గుణ పరి * పూర్ణతఁజేసి మా - యాత్మావశిష్టుఁడ * వగుచుఁ గార్య
కారణాత్మకుఁడవై * కడఁగి చరించుచు - నున్న నీయందుఁ బ * యోరుహాక్ష.
తే॥ తివిరి యామ్నాయములు ప్రవ * ర్తించుఁ గానఁ। బ్రకట త్రిగుణాత్మకంబైన * ప్రకృతితోడ
యోగమింతయు మాన్పవే * యోగిమాన । సాంబుజాత మధువ్రత * యని నుతించి.

టీ॥ హరి=ప్రళయకాలమున సకల లోకములను నీలోలయింపఁ జేసికొనునట్టి ఓవిష్ణుమూర్తీ. జయజయ=సర్వోత్కృష్టుఁడవై జయింపుము. దేవ = దీవ్యతి ఇతిదేవః, దివువిజిగీషాస్వప్న కాంతిగతిషు, అని ధాతువు. శ్లో॥ నతద్భాసయతేసూర్యో నశశాంకోనపావకః । యద్గత్వాననివర్తంతే తద్ధామపరమంమమ ॥ అని భగవద్గీత గనుక సూర్యచంద్రాగ్నులనుమీఱి వెలుఁగునట్టి వెలుఁగుచేత స్వయంప్రకాశుఁడవైనఓస్వామీ. సకలజంతువులకున్ = స్థావరజంగమాది సర్వప్రాణులకును. జ్ఞానప్రదుండవు = ఇహపరజ్ఞానమునిచ్చువాఁడవు. కానన్=కనుక. వానివలనన్=ఆప్రాణులవలన. దోషంబులు=దుర్గుణములు. (కలిగినను) సుగుణసంతానంబుగాన్=మంచిగుణములసముదాయమువలెనే. పరిజ్ఞాన... చేసి-పరిజ్ఞాన=వివరించి తెలిసికొనునట్టి. శక్తి=సామర్థ్యమనెడి. ముఖ్య=మొదలుగాఁగల. షడ్గుణ=ఆఱుగుణములయొక్క. పరిపూర్ణతఁజేసి=నింపుచేత-అనఁగా సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వభోక్తృత్వ సర్వనియంతృత్వ సర్వస్రష్టృత్వము లనెడు గుణములు గలవాఁడవు అగుటచేతను. మాయాత్మావశిష్టుఁడవు=ప్రకృతివలనను ఆప్రకృతి తామనెడుజీవాత్మలవలనను శేషించిన వాఁడవు. (అగుచును) కార్యకారణాత్మకుఁడవై—కార్య=ప్రపంచముయొక్క. కారణ=ప్రపంచసృష్టికి కారణములైన అవ్యక్త మహదహంకార పంచతన్మాత్ర పంచభూతములయొక్క. ఆత్మకుఁడవై=స్వరూపము గలవాఁడవై. కడఁగి=పూని. చరించుచున్న నీయందున్=మెలఁగుచున్న నీయందు. పయోరుహాక్ష=తామరలవంటి కన్నులుగల యోస్వామీ. తివిరి=పూని. ఆమ్నాయములు=వేదములు. ప్రవర్తించున్=ఉండును-జనించును. కానన్=కనుక. ప్రకటత్రిగుణాత్మకంబు = ప్రసిద్ధములయిన సత్వరజస్తమస్సులనెడుమూడుగుణములును గలది. ఐనప్రకృతితోడన్ = అయినట్టి మాయతో. యోగము=కూడిక. ఇంతయున్ = కొంచెమయినను. మాన్పవే=లేకుండునట్లు చేయవయ్యా. యోగిమానసాంబుజాతమధువ్రత=బ్రహ్మవేత్తలహృదయములనెడు కమలములయందుతుమ్మెదవలె ఆసక్తుఁడైవసించునట్టిస్వామీ. అనినుతించి=అనియీవిధముగాపొగడి.

తా॥ తామరలవంటికన్నులుగలవాఁడవును, యోగీశ్వరులమనస్సులనెడు కమలములయందు తుమ్మెదవలె ఆసక్తితో వసించునట్టివాఁడవును, ప్రళయకాలమున సకలలోకములను నీలోలయింపఁజేసికొనువాఁడవునైన ఓస్వామీ ! నీవు సర్వోత్కృష్టుఁడవైయుండుము, ఎల్లప్రాణులకును తెలివినిచ్చువాఁడవు నీవేకాఁబట్టి ఆప్రాణులవలనిదుర్గుణములనుగూడ సుగుణములుగానేయెంచి రక్షించునట్టి వాఁడవును, సర్వజ్ఞత్వము సర్వేశ్వరత్వము సర్వనియంతృత్వము సర్వస్రష్టృత్వము సర్వాంతర్యామిత్వము సర్వభోక్తృత్వము అనెడు ఆఱుగుణముల చేతనిండుకొన్నవాఁడవై, మాయను మాయాసంబంధముగలజీవాత్మలను మీఱిన వాఁడవై, ప్రపంచ స్వరూపుఁడవును, ప్రపంచ సృష్టికి కారణములైన అవ్యక్త మహదహంకార పంచతన్మాత్ర పంచభూతస్వరూపుఁడవును నీవే అయి ఉందువు అటువంటినీయందు వేదములుండునుకనుక (సర్వవేదమయోస్మ్యహం) అను ప్రమాణముచేత నీస్వరూపమైన మాకు సత్వము రజస్సు తమస్సు అనెడు మూడుగుణములకును ఉనికిపట్టయిన మూలప్రకృతితోడి సాంగత్యము కొంచెమైనను లేకుండమాన్పవయ్యా అని వేదములు పొగడెనని తాత్పర్యము.

వ॥ అదియునుంగాక. టీ॥ అంతేగాక.

౧౨౦౩.—సీ॥ పరమవిజ్ఞాన సం * పన్నులైనట్టి యో - గీంద్రులు మహిత ని * స్తంద్రలీలఁ
బరిదృశ్యమానమై * భాసిల్లు నిమ్మహీ - పర్వత ముఖర ప్ర * పంచమెల్లఁ
బ్రకట బ్రహ్మస్వరూ * పముగాఁగఁ దెలియుదు - రెలమి నీవును జగ * ద్విలయవేళ
నవశిష్టుఁడవుగాన * ననఘ నీయందు నీ - విపుల విశ్వోదయ * విలయములగు
తే॥ ఘటశరావాదులగు మృద్వి * కారములు మృ । దాత్మకంబైనయట్లు ప * ద్మాయతాక్ష
తవిలి కారణరూపంబుఁ * దాల్చులీలఁ । గడఁగి నీయందు బుద్ధి వా * క్కర్మములను.

టీ॥ పరమ...న్నులు—పరమ=శ్రేష్ఠమైన. విజ్ఞాన=అనుభవజ్ఞానమనెడు. సంపన్నులు=కలిమికలవారు. అయినట్టియోగీంద్రులు=అయినట్టి బ్రహ్మనిష్ఠులు. మహిత...లీలన్ — మహిత = పూజ్యమయిన. నిస్తంద్ర=పరాకులేని. లీలన్=విధమున — కొంచెమయినయెచ్చరిక తప్పనిగొప్పస్థితితో. పరిదృశ్యమానమై = చక్కఁగా కానవచ్చుచున్నదై. భాసిల్లు = ప్రకాశించునట్టి. ఇమ్మహీపర్వతముఖరప్రపంచము=భూమి కొండలు మొదలుగాఁగలయీప్రపంచము. ఎల్లన్= అంతయు—స్థావరజంగమాత్మకమైనప్రపంచమంతయును. ప్రకట...కాఁగన్—ప్రకట = ప్రసిద్ధమయిన. బ్రహ్మస్వరూపము = పరబ్రహ్మముయొక్క ఆకారము. కాఁగన్ = అగునట్లు. ఎలమిన్= సంతుష్టితో. తెలియుదురు = తెలిసికొందురు. శ్రు॥ వాచారంభణం వికారోనామధేయం, మృత్తికేత్యేవసత్యం, సర్వంఖల్విదం బ్రహ్మ, బ్రహ్మణోన్యంనకించన, పురుషఏవేదగ్ంసర్వంపురుషాన్నపరంకించిత్ విశ్వమేవేదం పురుషః ఏకోదేవో బహుధానివిష్టః॥ సౌమ్యైకేన

మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్, అని శ్రుతి, శ్లో॥ ప్రహితవహ్నిరవీందుముఖైస్సనా జగదిదం నభవేత్పృథగుత్థితం । బహుముఖైరపి మంత్రగణైరజత్వముదుమూర్తిరతో వినిగద్యసే॥ అని (నీవును) జగద్విలయవేళన్ = లోకమంతయు నశించునప్పుడు. అవశిష్టుఁడవు = మిగిలియుండువాఁడవు, కానన్ = కనుక. అనఘ = పాపములేని ఓస్వామీ. ఈవిపులవిశ్వోదయవిలయములు = విరివియైన యీ ప్రపంచముయొక్క కలుగుటయు నశించుటయును. నీయందున్ = నీయందే. ఘటశరావాదులు = కుండ మూకుడు మొదలగునవి. అగు మృద్వికారములు = అగునట్టి మట్టియొక్క మాఱురూపులు. మృదాత్మకం బైనయట్లు = మట్టియే అయినట్లు. అగును = ప్రపంచము నీరూపమే యగును. పద్మాయతాక్ష = తామరలవలె విశాలములైన కన్నులుగల యోస్వామీ. తవిలి = ఆసక్తితోని. కారణరూపంబున్ = జగత్తు పుట్టించుటకు కారణమయిన బ్రహ్మరూపమును. తాల్చు = ధరించునట్టి. లీలన్ = విధమును. కడఁగి = పూని. నీయందున్ = నీలోనే. బుద్ధివాక్కర్మములన్ = బుద్ధియొక్కయు వాక్కుయొక్కయు శరీరముయొక్కయు వ్యాపారమును.

తా॥ ఓస్వామీ! అనుభవజన్య జ్ఞానముగల బ్రహ్మవేత్తలు మిక్కిలి యెచ్చరికతోడి వ్యాపారముతో కానవచ్చుచున్న స్థావర జంగమాత్మకమయిన ప్రపంచమే నీవని తెలిసికొనుదురు, నీవును ఈసర్వ ప్రపంచము లయించునప్పుడు నశింపక నిలిచియుండువాఁడవు గనుక విరివిగానుండునట్టి యీ ప్రపంచముయొక్క ఉత్పత్తియు లయమును కుండ మూకుడు మొదలగునవి మట్టిచేతఁ జేయఁబడినవై మట్టికంటె వేఱుగాఁ దోఁచి మరల మట్టిలోనే కలిసి పోవునట్టు ప్రపంచము నీయందే పుట్టి గిట్టుచుండును అనఁగా నీవే జగత్స్వరూపుఁడవై కానఁబడి మరల ఆరూపమును కానరాకుండఁ జేయుచున్నావు కాఁబట్టి మిక్కిలి యక్కఱతో ఈప్రపంచ కారణమయిన బ్రహ్మరూపమును పొందునట్టి నిన్ను మనస్సు ధ్యానించునట్లును, వాక్కు పొగడునట్లును శరీరము నీకు ఊడిగము చేయునట్లును అని తాత్పర్యము.

౧౨౦౪.—క॥ అలవడఁ జేయుచు బయలం । బలువయి యిలఁ బెట్టఁబడిన * పద విన్యాసం
బుల పతనకారణములుగ । నలవుల సేవించుచును గృ * తార్థులునగుదుర్.

టీ॥ యోగీశ్వరులు = బ్రహ్మవేత్తలు. ఇలన్ = భూమియందు. పెట్టఁబడిన = ఉంచఁబడిన. పదవిన్యాసంబుల = అడుగులయొక్క పెట్టుటలే. బయలన్ = ఆకాశమునందు. బలువయి = భారమై. పతనకారణములుగన్ = పడుటకుఁ గారణములు కాఁగా. అలవడఁ జేయుచున్ = మనసుచేత నిన్ను ధ్యానింపను, వాక్కుచేత నీస్వరూప నిరూపణ చేయను, శరీరముచేత నిన్ను సేవింపను, అభ్యాసము చేయుచు. అలవులన్ = నేర్పులతో. సేవించుచున్ = శ్రవణమనన నిదిధ్యాసములచేత నిన్ను కొలుచుచు. కృతార్థులునగుచున్ = కృతకృత్యులగుచు (ఉందురు)

తా॥ యోగీశ్వరులు భూమియందు పెట్టిన అడుగులనే ఆకాశమునందు పెట్టినట్టయిన అవిబరువై పడుటకు కారణమగుటను అలవాటుచేత తెలిసికొన్నట్టుగా నేయితరదేవతారాధనాదులు జన్మకారణములని తెలిసికొనివదలి (ఏకోదేవో బహుధానివిష్టః) అను శ్రుతినిపట్టి సకలదేవతాస్వరూపుఁడవైన నిన్నే తలఁచుచు, నిన్నే పూజించుచు నిన్నే స్మరించుచు, కృతార్థులు అగుచుందురు అని తాత్పర్యము.

౧౨౦౫.—క॥ లీలం బ్రాకృత పూరుష । కాలాదికనిఖిలమగు జ * గంబులకెల్లన్
మాలిన్య నివారకమగు । నీలలితకథా సుధాబ్ధి * నిం గ్రుంకితగన్.

టీ॥ లీలన్ = వినోదరూపమైన. ప్రాకృత...నిఖిలము — ప్రాకృత = ప్రకృతి సంబంధముగల. పూరుష = పురుషులు — జనులు. కాల = ప్రాతర్మధ్యాహ్నాదికాలములు. ఆదిక = మొదలుగాఁగల. నిఖిలము = సమస్తమును. అగు = అయిన. జగంబులకెల్లన్ = లోకములకన్నిటికిని. మాలిన్యనివారకము = ఆప్రకృతి సంబంధమయిన అజ్ఞానమును పోఁగొట్టునది. (అగు) నీలలితకథాసుధాబ్ధినిన్ = మనోజ్ఞమయిన నీకథలనెడు పాలసముద్రమునందు. తగన్ = ఒప్పునట్లు — బాగుగా. క్రుంకి = మునిఁగి — స్నానము చేసి.

తా॥ నీకు వినోదరూపమయిన ప్రకృతియొక్క సంబంధము గలిగి వర్తిల్లునట్టి జనులు కాలభేదములు మొదలుగాఁగల వన్నియుఁ గలవైన లోకముల కన్నిటికిని ఆప్రకృతి వికారమును తొలఁగించునట్టి మనోజ్ఞమయిన నీకథలనెడు పాలసముద్రమునందు మునిఁగి అని తా.

౧౨౦౬.—చ॥ భరిత నిదాఘ తప్తుఁడగు * పాంథుఁడు శీతలవారిఁ గ్రుంకి దు
ష్కరమగు తాపముం దొఱఁగు * కైవడి సంసరణోగ్ర తాపము
న్వెరవునఁ బాయుచుండుదురు * నిన్ను భజించు మహాత్మకు ల్జరా
మరణ మనోగదంబులఁ గ్ర * మంబుగఁ బాయుట సెప్ప నేటికిన్.

టీ॥ భరితనిదాఘతప్తుఁడు = నిండిన వేసవియందు కాఁగినవాఁడు. అగు పాంథుఁడు = అగునట్టి బాటసారి. శీతలవారిన్ = చల్లని నీళ్లయందు. క్రుంకి = స్నానముచేసి. దుష్కరమగు తాపమున్ = ఓర్వరాని తాపమును. తొఱఁగు కైవడిన్ = పోఁగొట్టుకొను రీతిని. సంసరణోగ్రతాపమున్ — సంసరణ = అంతర బాహ్య సంసారములవలని. ఉగ్ర = భయంకరమయిన. తాపమున్ = ఆధ్యాత్మికము ఆధిదైవికము ఆధిభౌతికము అను త్రివిధ రూపమైన తాపమును. వెరవునన్ = నిన్నారాధించుటయనెడి జలమున మునుఁగుటయను ఉపాయముచేత. పాయుచుండుదురు = తొలఁగించుకొనుచుందురు. నిన్ను భజించు మహాత్మకులు = నిన్నుఁ గొలుచునట్టి పెద్దలు. జరా...బులన్ — జరా = ముసలితనమును. మరణ = చావును. మనోగదంబులన్ = మనోవ్యాధులను. క్రమంబుగన్ = వరుసగా. పాయుట = తొలఁగించుకొనుటను. చెప్ప నేటికిన్ = ఇఁక చెప్పవలసిన దేమి.

తా॥ లోకమునందు బుద్ధిమంతులగు వారు మంచి యెండకాలము

నందు ఎండలతో తపించునట్టి బాటసారి చల్లనినీళ్లలో మునిఁగి ఆతాప మును పోఁగొట్టుకొనునట్లు అధికమయిన భయమును కలుగఁజేయు నట్టిసంసారములవలనిత్రివిధసంతాపమునునిన్ను ఉపాసించుటయనెడి జలమున మునుఁగుటయనెడి ఉపాయముచేత తొలఁగించుకొనుచుం దురు, అట్లుండఁగా ఎల్లప్పుడు నిన్ను సేవించునట్టి పుణ్యాత్ములుమూసలి తనమును చావును మనోవ్యాధులను క్రమముగా పోఁగొట్టుకొందు రన్నమాట ఇఁక వేఱే చెప్పవలసినది లేదని తాత్పర్యము.

వ॥ అదియునుంగాక.

౧౨౦౭.—సీ॥ అనయంబు దేహాని * త్యానిత్య సద్విల - క్షణమునఁ బంచకో * శ వ్యవస్థ
లనువృద్ధిఁ బొరయుచు * నందులోపలనున్న - ప్రాణాన్న మానస * జ్ఞానమయము
లను చతుష్కోశంబు * లవ్వల వెలుఁగొందు - నానంద మయుఁడవు * గాన దేవ
సురుచిర స్వప్రకా * శుండవు నీపరి - గ్రహముగల్గుటఁ జేసి * కాదె ప్రకృతి
తే॥ మహదహంకార పంచత * న్మాత్రగగన । పవనతేజోంబు భూభూత * పంచకాది
కలిత తత్వంబు బ్రహ్మాండ * కార్యకరణ । మందు నెప్పుడు సమర్థంబ * యగుటఁజేసి.

టీ॥ దేహి=జీవుఁడు. నిత్య...మునన్—నిత్య=శాశ్వతమైన చిత్తు కంటెను. అనిత్య=అశాశ్వతమునైన అచిత్తుకంటెను—అనఁగా క్షరా క్షరము లనఁబడెడుప్రకృతిపురుషుల కంటెను. సత్=శ్రేష్ఠమైన. విల క్షణమునన్=సచ్చిదానందలక్షణముచేతను — పురుషోత్తమలక్షణము చేతననుట. శ్లో॥ ద్వావిమౌపురుషౌలోకే క్షరశ్చాక్షరఏవచ । క్షర స్సర్వాణిభూతాని కూటస్థోక్షర ఉచ్యతే । ఉత్తమఃపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః । యోలోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః । యస్మాత్క్షరమతీతోహ మక్షరాదపిచోత్తమః । అతోస్మి లోకేవేదేచ ప్రథితఃపురుషోత్తమః ॥ అని భగవద్గీత. తా॥ లోక మందు క్షరుఁడు అక్షరుఁడు అని పురుషులిరువురుగలరు వీరిలో క్షర పురుషుఁడు స్థావరజంగమ భూతములని అక్షరపురుషుఁడు జీవుఁడు అని చెప్పఁబడును, ఈక్షరాక్షరపురుషులకంటె ఉత్తమపురుషుఁడు పరమాత్మయనఁబడును, ఏపరమాత్మ త్రిలోకములలో నిండియుండి వానిని రక్షించుచున్నాఁడో ఆపరమాత్మే నాశనరహితుఁడైన శ్రీమ న్నారాయణుఁ డని చెప్పఁబడును, నేను క్షరపురుషుని అక్షరపురు షుని మీఱినవాఁడనగుటచేత లోకములయందును వేదములయందును పురుషోత్తమ నామము చేత ప్రసిద్ధికెక్కితిని అని తాత్పర్యము. పంచకోశవ్యవస్థలన్=అన్నమయాదులైన పంచకోశముల సంబంధ ములచేత. అనయంబు=మిక్కిలి. వృద్ధిఁబొరయుచున్=వ్యష్టి సమష్టి దేహములుగల పురుషరూపముతో పెరుగుచు — దుర్లభమైనపురుష రూపముగలవాఁడవై అనుట. అందులోపలన్=ఆవ్యష్టి సమష్టిదేహ ములలో. (ఉన్న) ప్రాణాన్న మానస జ్ఞానమయములు = ప్రాణ మయ అన్నమయ మనోమయ విజ్ఞానమయములు. అనుచతుష్కోశం బులవ్వలన్=అనునట్టి నాలుగుకోశములకునావలను. వెలుఁగొందు= ప్రకాశించునట్టి. ఆనందమయుఁడవు గానన్ = ఆనందమయ కోశ స్వరూపుఁడవుగనుక. దేవ=స్వామీ. సురుచిరస్వప్రకాశుండవు — సురుచిర=మిక్కిలివెలుఁగునట్టి. స్వప్రకాశుండవు = సూర్యచంద్రా గ్నుల కాంతులనుమీఱిన శుద్ధసత్వ స్వరూపము గలవాఁడవు. శ్రు॥ తస్యైషఏవశారీర ఆత్మా, సవాఏషపురుషోన్నరసమయః, సవాఏష పురుషవిధఏవ,తస్యపురుషవిధతాం అన్వయంపురుషవిధః తస్యప్రియ మేవశిరః, మోదోదక్షిణఃపక్షః, ప్రమోద ఉత్తరఃపక్షః, ఆనంద ఆత్మా, బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠా, అని యుపనిషత్తు. శ్లో॥ నరవపుః ప్రతిపద్యయదిత్వయి శ్రవణవర్ణనసంస్మరణాదిభిః। నరహరేనభజంతి నృణామిదం ధృతివదుచ్ఛ్వసితం విఫలంతతః॥ తా॥ భగవద్విచార ణయే లేని నరజన్మము ఉచ్ఛ్వాస నిశ్వాసములుగల తోలుతిత్తివలె వ్యర్థమని తాత్పర్యము. నీపరిగ్రహము=నీవుచేపట్టుట. కల్గుటఁజేసి కాదె = కలుగుటచేత నేకదా. నీవు అనుసరించి ప్రవేశించుటచేతఁ గలిగినసామర్థ్యముచేత, లేక నీవుసాక్షివైచూచుటచేత. శ్రు॥ తదైక్షత బహుస్స్యామితి, ఐతదాత్మ్యమిదం సర్వంతత్సత్యం సఆత్మేతి॥ అని శ్రుతి. ప్రకృతి...తత్వంబు—ప్రకృతి=అవ్యక్తతత్వము. మహత్ = మహత్తత్వము. అహంకార=సత్వరజస్తమోరూపమైన అహంకార తత్వము. పంచతన్మాత్ర=శబ్దస్పర్శరూపరసగంధములనెడు అయిదు తన్మాత్రలు. గగన=ఆకాశము. పవన=వాయువు. తేజః=అగ్ని. అంబు=జలము. భూ=భూమియననెడు. భూతపంచక=పంచమహా భూతములు. ఆది = మొదలుగాఁగల వానితో. కలిత = కూడిన. తత్వంబు = పరబ్రహ్మతత్వము. బ్రహ్మాండకార్యకరణమందున్ = సమష్టివ్యష్టిరూపదేహమును పుట్టించుటయందు. ఎప్పుడున్=సర్వకాల సర్వావస్థలయందును. సమర్థంబ=సామర్థ్యముగలదే. అగుటఁజేసి= అవుటచేత. శ్రు॥ తత్సృష్ట్వా, తదేవానుప్రావిశత్, తదనుప్రవిశ్య, సత్యత్యచ్చాభవత్॥ ఆత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యఃపృథివీ, పృథివ్యాఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నాత్పురుషః, అనియుపనిషత్తు. బ్రహ్మణో రవ్యక్తః, అవ్యక్తాన్మహతః, మహతోఽహంకారః, అహంకారా త్పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యో పంచమహాభూతాని, పంచ మహాభూతేభ్యోఽఖిలంజగత్॥ అనిసాంఖ్య సూత్రము.

శ్లో॥ తస్యేదంబ్రహ్మపుచ్ఛంస్యాత్ప్రతిష్ఠాహేతురిత్యతః। వ్యతి రేకశ్రుతేర్బ్రహ్మ విషయత్వ ప్రతీతితః ॥ శ్లోకస్య వక్ష్యమాణస్య బ్రహ్మప్రాధాన్యనిశ్చయాత్। ప్రియమోదాది రూపేణ విదితస్యజనై స్సమైః ॥ ఇహానందమయస్యాస్య శంకాయాశ్చాత్రసంగతేః । సద సద్భావయో ర్జ్ఞానాజ్ఞానయోశ్చనిరంశినః ॥ అంశిత్వాసంగతే ర్నిర్వి కారస్య మయటాత్రవై । వికారిత్వాబోధనాచ్చ మయటోప్యత్ర సంగతేః॥ తస్యైషఏవశారీర ఆత్మేతిచతదంతరం।ఆత్మాంతరంకీర్త్య మాన మానందమయవస్తునః ॥ బ్రహ్మత్వంనావగమయే దిత్యతఃపున రస్యహి। పచేతస్మిన్నిత్యశుద్ధే శోధ్యత్వానుపపత్తితః॥ నానందమయ శబ్దేన వాచ్యంబ్రహ్మేతినిశ్చితం । పుచ్ఛత్వేనైవయత్రత్ర రూపితంతు తదిష్యతఇతి॥ తత్తుచ్ఛం॥ శ్లో॥ కృత్స్నప్రకరణేష్వత్ర పూర్వమన్న మయాదిషు। స్వస్మాదనతిరిక్తైస్సా వయవైస్సనిరూపణాత్॥ శిరః

...రూపేణ పురుషత్వస్యనిశ్చితం। ప్రియమోదాదిభిస్స్వస్మాదభిన్నైః రూపితః॥ నభిద్యతేబ్రహ్మణోత్ర హ్యానందమయశబ్దితః। తత్తదంతరభూతస్యైవస్తునోబోధకస్యవై॥ తస్యైషఏవశారీర ఆత్మేత్యాత్మపదస్యహి। వ్యాఖ్యానందమయేపర్యవసన్నాకీర్తనాత్పునః॥ అన్యస్య బ్రహ్మపర్యాయస్యానందమయవస్తుతః। అన్నాదిమయపర్యాయేషూక్తానాంశ్లోకరూపిణాం॥ వాక్యానాంపక్షపుచ్ఛాది మదర్థపరతఃపునః। పుచ్ఛమాత్రపరస్యాస్య శ్లోకస్యాస్యాప్యసంగతేః॥ అనంతరేసోకామయ తేతివాక్యశ్రుతేనసః। ఇతిశబ్దేనపుంవస్తు బోధకేనతథాపునః॥ ప్రధానప్రకృతార్థస్య పరామర్శనసాధునా। అనంతరస్యానందమయస్యాత్రా బోధసంగతేః॥ బ్రహ్మణోవ్యవధానేన తదుపస్థాపనశ్రుతేః। బ్రహ్మణ్యానందశబ్దస్యా ద్దానందోబ్రహ్మ ఇత్యతః॥ శ్రుతేస్సంప్రతిపన్నత్వా దానందస్థాపనేత్యమాత్। ఆనందమయమాత్మానముపసంక్రమ్యవాక్యతః॥ ఆనందానందమయయోశ్చైకార్థస్యప్రతీతితః। ఆనందమయశబ్దేనపరబ్రహ్మైవబోధనాత్॥ ఆనందోబ్రహ్మేతివ్యజానాదితిపర్యాయతుల్యతః। ఆనందమయతుల్యార్థాచ్ఛబ్దాదానందతఃపరం॥ ప్రతీతార్థశ్రుతేఃపశ్చా దుపపత్తేరభావతః। నపుచ్ఛమేవబ్రహ్మేతి కింతుపుచ్ఛీతివిద్యతే॥ స్వాభిన్నపక్షపుచ్ఛాది పరప్రకరణస్యవై। అనుగుణ్యేనపఞ్చ్యాచ నిర్దేశస్యతథాపునః॥ అంశాంశిత్వేనోపపత్తేర్వ్యతిరేకస్యనిశ్చయాత్॥ ఆత్మాబ్రహ్మానందమయ శబ్దైరేకార్థబోధనాత్। తేషామన్యతమేనాపి శ్లోకస్యహ్యుపపత్తితః। ఆనందస్యాపరిచ్ఛిత్తేః పుచ్ఛబ్రహ్మపదస్యహి॥ ఆనందమయవాచ్యస్య ప్రసిద్ధేరప్యభావతః। సదసద్భావయోర్జ్ఞానాజ్ఞానయోశ్చతథాపునః॥ శంకాయాస్సంభవాదస్య రూపణస్యోపపత్తితః। అంశాంశిభ్యాంతథానందమయశబ్దగతస్యవై॥ మయట్ప్రత్యయస్యార్థికత్వేన ప్రాచుర్యార్థేపివాపునః। ఉపపత్తేర్వికారార్థకత్వాభావాచ్చబ్రహ్మణః॥ నిర్వికారత్వనిర్వాహదనన్యాత్మత్వవాదినః। తస్యైషఏవశారీర ఆత్మేత్యస్యావిరోధతః॥ తద్వస్త్వనుగుణత్వేన బోధనస్యవిధేఃపునః। ప్రత్యగర్థస్యబోధ్యత్వం సంహృతేర్నిహృతేస్తథా॥ ఆనందమయశబ్దేన వాచ్యస్యబ్రహ్మణస్తథా బోధ్యత్వస్యప్రపత్త్యాచ సాధ్యస్యహ్యుపపత్తితః॥ కాలుష్యశాంతిరూపస్య నపుచ్ఛంబ్రహ్మవైమతం। అన్యథానందమయతస్సఏవ బ్రహ్మతుస్థితం॥ ఇతిపుచ్ఛబ్రహ్మవాది దూషణోద్ధార ఇష్యతే. అని.

తా॥ దుర్లభమైన మనుష్య దేహమును ధరించినప్రాణి నిత్యము అనిత్యము అను నీరెంటికంటె విలక్షణమైన పరబ్రహ్మస్వరూపము చేతను, అన్నమయము ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము ఆనందమయము అను పంచకోశాత్మకమైన వ్యష్టిసమష్టి దేహమును ధరించియును, ఆపంచ కోశములలో కడపటిదైన ఆనంద మయ కోశమే స్వరూపముగా వెలుఁగునట్టి శుద్ధసత్వస్వరూపము చేతను, సాధనాంతర నిరపేక్ష స్వయంప్రకాశమాన విజ్ఞాన స్వరూపుఁడవైన నీవు చూడఁబడుటచేత అచేతనములైన అవ్యక్తము మహత్తు అహంకారము శబ్దస్పర్శ రూపరసగంధములు అనెడు పంచతన్మాత్రములు, ఆకాశము వాయువు అగ్ని జలము భూమియు అనెడు పంచ మహాభూతములు అనువానికి చేతనత్వమును గలుగఁజేసి వానిచేత బ్రహ్మాండమును పుట్టించి అందుప్రవేశించి వెలుఁగుచున్న నిన్ను అనితా.

## (*) పంచకోశవివరణము. (*)

అన్నమయము ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము ఆనందమయము అని కోశములయిదు విధములు.

ప్రశ్న. అన్నమయకోశమనఁగా ఎట్టిది. ఉత్తరువు. అన్నమువలన పుట్టి అన్నమువలననే వృద్ధిఁబొందుచున్నదయి స్తంభమువలెస్థూలమై చేతులు కాళ్లు మొదలైన అవయవములుగలదై షడ్భావవికారములు గలదైసప్తధాతుమయమైకనఁబడెడిస్థూలశరీరమే అన్నమయకోశము.

ప్రశ్న. ప్రాణమయ కోశమనఁగా ఏలాగంటిది.

ఉత్తరువు. వాక్కు పాణి పాదము పాయువు గుహ్యము అను కర్మేంద్రియములయిదును, ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానము లనెడు ప్రాణములయిదును గూడి ప్రాణమయకోశము.

ప్రశ్న. మనోమయ కోశమనఁగా ఎట్టిది.

ఉత్తరువు. మనస్సు శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము అనెడి జ్ఞానేంద్రియములయిదును జేరి మనోమయకోశము.

ప్రశ్న. విజ్ఞానమయ కోశమనఁగా ఏలాగంటిది.

ఉ. బుద్ధియును జ్ఞానేంద్రియము లయిదును గలసి విజ్ఞానమయకోశము.

ప్రశ్న. ఆనందమయ కోశమనఁగా ఎట్టిది.

ఉత్తరువు. ప్రియము మోదము ప్రమోదము అనెడి వృత్తులతోఁగూడి అజ్ఞానమే ప్రధానముగాఁగల అంతఃకరణమే ఆనందమయకోశము. ప్రియమనఁగా ఇష్టమయిన పదార్థమును కనినమాత్రముననే కలిగెడి సంతోషము ప్రియము. ఆపదార్థము తన హస్తగతమయిన ఫిమ్మటఁ గలిగెడి సంతోషము మోదము. ఆహస్తగతమయిన వస్తువును అనుభవించినతోడనే కలిగిన సంతోషము ప్రమోదము.

ప్రశ్న. వీనికి కోశములని సంజ్ఞ యేల కలిగెను.

ఉత్తరువు. కత్తిని ఒరయును, వీణను గవిసెనయును, అరఁటి బొందెను పట్టలును, పసిరికపురుగును పసిరికతిత్తియును, చింతపండును చింతగుల్లయును కప్పుకొనినట్లు పరమాత్మను కనఁబడనీయక కప్పుకొనియున్నవిగనుక వీనికి కోశములను పేళ్లు గలిగెను.

ప్రశ్న. అయితే దృష్టాంతమందు ఒరయును కత్తియును, గవిసెనయును వీణెయును, అరఁటిపట్టలును బొందెయును, పసిరికతిత్తియును పురుగును, చింతగుల్లయును చింతపండును వేఱయినవగుటవలనను సమానధర్మములు గలవి కానందునను ఒకదానినొకటి అనుసరించి ప్రకాశించునవి కానందునను ఆయొర మొదలైనవి ద్రవ్యములను మూసికొని యుండునట్టి వగును గాని దార్ష్టాంతికమందు కోశములు స్వసత్తవలన ప్రకాశించునవిగాక ఆత్మసత్తననుసరించి జీవించి ప్రకాశించుచునుండు పంచకోశములు పరమాత్మను కప్పునట్టి శక్తిగలవి యెట్లగును.

ఉ. సూర్యుని కిరణమువలననే కలిగి ఆసూర్యుని సత్తచేతనే ప్రబలుచు ఉండెడు మేఘము సూర్యుని మఱుఁగుపఱచిన తీరునను, అగ్ని సత్తవలనఁ గలిగి అగ్నిసత్తవల్లనే నెగడుచున్న పొగ అగ్నిని కప్పుచున్నట్లును, రజ్జు సత్తననుసరించితోఁచెడి సర్పము ఆత్రాటిని కప్పుచున్నట్లును, మట్టివల్ల పుట్టిన కుండలు మట్టిని మఱుఁగు పెట్టినట్లుగను, స్వర్ణమును పట్టి పుట్టిన నగలు స్వర్ణమును కప్పుచున్నట్లును ఆత్మసత్తననుసరించి వృద్ధినొందు పంచకోశములు పరమాత్మను గప్పునట్టి శక్తి గలవయ్యెను.

ప్రశ్న. అయితే పరమాత్మకు పంచకోశవ్యతిరిక్తత్వము ఎటువలె సిద్ధించును.

ఉ. కత్తి ఒర మొదలయినవి భేదములేక ఒకటిగానే వ్యవహరింపఁబడుచు ఒకటిగానే తోఁచినను విచారింపఁగా కత్తియును ఒరయును వేఱైనట్టుల వేదాంతశాస్త్రవిచారణచేత పరమాత్మ త్రికాలములయందును పంచకోశంబులకంటెను విలక్షణుఁడై తోఁచుటవలన పంచకోశవ్యతిరిక్తత్వమే లభించును.

ప్రశ్న. పంచకోశవిలక్షణుఁడయిన పరమాత్మకు పంచకోశములతో చేరిక కలదా. ఉ- కలదు.

ప్రశ్న. ఆచేరిక యెట్లు గలిగినది. ఉ. అన్యోన్యాధ్యాసముచేత కలిగినది.

ప్రశ్న. అన్యోన్యాధ్యాసమనఁగా నేమి.

ఉ. ఒకవస్తువునందలి గుణము మఱియొకవస్తువునందు తోఁచుట.

ప్రశ్న. అన్నమయకోశమునకును పరమాత్మకును కూటమి యెట్లు గలిగెను.

ఉ. జీవము సామాన్యము వికారము చిహ్నము కర్మము విశేషము జాతి ఆశ్రమము నామము రూపము సంస్కారము వేషము వర్ణము క్రియ అనెడువానివలన కలిగినది.

ప్రశ్న. ఎట్లనిన. ఉ- నేను జీవుఁడననుట జీవాధ్యాసము. నేను మనుష్యుఁడననుట జాత్యధ్యాసము. నేను పుట్టి పెరిగి యింతవాఁడనై క్షీణించి మరణించుచున్నాననుట వికారాధ్యాసము. నేను పురుషుఁడను స్త్రీని నపుంసకుఁడను అనుట చిహ్నాధ్యాసము. నేను బ్రాహ్మణుఁడను క్షత్రియుఁడను వైశ్యుఁడను శూద్రుఁడను అనుట వర్ణాధ్యాసము. నేను ఆంధ్రుఁడను ద్రవిడుఁడను కర్ణాటకుఁడను వెలనాటిని వేగినాటిని ములికినాటిని ప్రాఙ్నాటిని నియోగిని గుజరాతిని మహారాష్ట్రుఁడను కాశ్యపసగోత్రిని భారద్వాజసగోత్రిని ఆశ్వలాయనసూత్రిని ఆపస్తంబసూత్రిని బోధాయనసూత్రిని కాత్యాయనసూత్రిని అనుట విశేష జాత్యధ్యాసము. నేను బ్రహ్మచారిని గృహస్థుఁడను వానప్రస్థుఁడను సన్యాసిని అనుట ఆశ్రమాధ్యాసము. నేను కృష్ణదాసుఁడను రామదాసుఁడను ఎల్లంభట్టును తిప్పంభట్టును పోలంభట్టును అనుట నామాధ్యాసము. నల్లనివాఁడను ఎఱ్ఱనివాఁడను అనుట రూపాధ్యాసము. నేను దీక్షితుఁడను సోమయాజిని ప్రతివసంతయాజిని మహావ్రతయాజిని వాజపేయయాజిని పౌండరీకయాజిని అనుట సంస్కారాధ్యాసము. నేను మాయావాదిని తత్త్వవాదిని విశిష్టాద్వైతవాదిని పరమభాగవతుఁడను శైవుఁడను శాస్త్రజ్ఞుఁడను పౌరాణికుఁడను యోగీశ్వరుఁడను గంగాది పుణ్యతీర్థవాసిని అనుట వేషాధ్యాసము. నేను ఉపాధ్యాయుఁడను జ్ఞానిని అజ్ఞానిని పెండ్లికుమారుఁడను వడ్లంగిని కమ్మరిని కమ్మరిని మంగలిని చాకలిని మణిహారుఁడను కరణమును అనుట క్రియాధ్యాసము. ఇవి మొదలయిన అన్నమయకోశమందుఁగల లక్షణములు అవిషయమయిన ఆత్మయందును ఆత్మయందుఁగల సచ్చిదానంద లక్షణములు విషయమయిన అన్నమయకోశమందును తోఁచుచున్నవి గావున అన్నమయకోశమునకును పరమాత్మకును ఐకమత్యము వచ్చినది.

ప్ర. ప్రాణమయకోశమునకును పరబ్రహ్మమునకును కూటమి యెటులఁ గలిగినది.

ఉ. నేను ఆఁకలియును దప్పియును సామర్థ్యమును బలమును పరాక్రమమును గలవాఁడను వాచాలుఁడను దాతను మూఁగను కుంటిని గ్రుడ్డిని అనునవి మొదలయిన ప్రాణమయకోశమందుఁగల గుణములు పరమాత్మయందును పరమాత్మయందుఁగల సచ్చిదానంద నిత్యనిర్మల గుణములు ప్రాణమయకోశమందుఁ గలవిగాను ప్రాణముగలవాఁడనగుటచేత తోఁచుచున్నవి గనుక ప్రాణమయకోశమునకును పరమాత్మకును కూటమి వచ్చినది.

ప్ర. మనోమయకోశమునకును పరమాత్మకును చేరిక యెటువలెను.

ఉ. నేను సంకల్పమును వికల్పమును గలవాఁడను దుఃఖిని మోహిని కామిని క్రోధిని ద్వేషిని వినువాఁడను స్పృశించువాఁడను ఇచ్ఛగలవాఁడను రసజ్ఞుఁడను ఆఘ్రాణించువాఁడను చెవిటివాఁడను నాలుకలేనివాఁడను ముక్కులేనివాఁడను అనునవి మొదలగు మనోమయకోశనిష్ఠములయిన సంకల్పాదిధర్మములు ఆత్మయందును ఆత్మధర్మములైన సచ్చిదానందములు మనోమయకోశమందును మనస్సుండుటచేత తోఁచుచున్నవి కాఁబట్టి మనోమయకోశమునకును ఆత్మకును కూటమి వచ్చినది.

ప్ర. విజ్ఞానమయకోశంబునకు పరమాత్మకును కూటమి యెటులవచ్చెను.

ఉ. నేను కర్తను నిశ్చయము గలవాఁడను బుద్ధిమంతుఁడను ఊహాపోహలలో చతురుఁడను ఏకసంతగ్రాహిని శ్రోత్రియుఁడను విరక్తుఁడను పండితుఁడను లోకాంతరంబునకుఁ బోవువాఁడను అనెడు విజ్ఞానమయకోశనిష్ఠములయిన ధర్మంబులు ఆత్మయందును ఆత్మధర్మములైన సచ్చిదానందంబులు విజ్ఞానమయకోశమందును బుద్ధియుండుట వలన తోఁచుచున్నవి గనుక విజ్ఞానమయకోశమునకును ఆత్మకును కూటమి వచ్చినది.

ప్ర. ఆనందమయ కోశమునకును పరమాత్మకును కలయిక యెటుల వచ్చినది.

ఉ. నేను భోక్తను అసంతుష్టుఁడను సుఖిని రాజసుఁడను సాత్వికుఁడను తామసుఁడను తజ్జ్ఞుఁడను మూఢుఁడను శక్తుఁడను భ్రాంతుఁడను అనునవి మొదలయిన ఆనందమయకోశధర్మంబులు ఆత్మయందును ఆత్మధర్మంబులగు సచ్చిదానందములు ఆనందమయ కోశమందును ఆనందముండుట వలన తోఁచుచున్నవి కాఁబట్టి ఆనందమయ కోశమునకును పరమాత్మకును కూటమి వచ్చినది గనుక పంచకోశముల కంటె పరమాత్మ విలక్షణుఁడగుటను దృష్టాంతపూర్వకముగా ఎఱిఁగించెదము, నాయావు నాదూడ నాభార్య నాపుత్రుఁడు అని తన్ననుసరించుకొని తోఁచెడి ఆవులోనగునవి తానుగానట్లు దార్ష్టాంతికమందును నాశరీరము నాప్రాణము నామనస్సు నాబుద్ధి అని తన్ను సంబంధించుకొని తోఁచెడు పంచకోశములును తాను కానందున పంచకోశములకంటె వ్యతిరిక్తుఁడనని యెఱుఁగవచ్చును. దృష్టాంతమందు ఆవు బలిసినది దూడ చిక్కినది కోడె బ్రతుకదు కుమారుఁడు చెప్పినట్టు వినఁడు భార్య యింటికి స్వతంత్రురాలయినను బిడ్డలు లేనిది సాధనము సెలవు చేయకుమా అది తనకు హితమయిన కార్యమొక్కటియును చేయలేదు కూఁతురు మహామూఢురాలయి యున్నది కుమారుఁడు దుష్టుఁడయి యున్నాఁడు అనెడు పశువు మొదలగు వానియందలి వికారములును విషయములును తన్నంటనియట్లు దార్ష్టాంతికమందు అన్నమయకోశ నిష్ఠమయిన జీవత్వ మనుష్యత్వాది ధర్మములును, ప్రాణమయకోశనిష్ఠమయిన క్షుత్పిపాసాదిగుణములును, మనోమయకోశనిష్ఠమయిన సంకల్పాదిధర్మములును, విజ్ఞానమయకోశనిష్ఠమయిన కర్తృత్వాది గుణములును ఆనందమయకోశనిష్ఠమైన భోక్తృ

శ్వాదివికారమతును, పంచకోశవ్యతిరిక్తుఁడునుసాక్షియును అయిన తన్ను కాలత్రయమందు స్పృశింపలేవు కాఁబట్టి యిట్లు విచారించి తెలియుఁగుటయే పంచకోశ వ్యతిరిక్తజ్ఞానము.

ప్ర. ఈపంచకోశవ్యతిరిక్తజ్ఞానము రావచ్చునా. ఉ. రావచ్చును.

ప్ర. ఎట్లురావచ్చును. ఉ. అధ్యయనకాలమందు అధ్యయనము చేయు పురుషులచేత ఉచ్చరింపఁ బడిన శబ్దంబులను విభజించుటకు వశముగాకున్నను శ్రోత్రేంద్రియముచేత విని వివేకముగల బుద్ధిచేత ఇదివీనిశబ్దము ఇదివీనిశబ్దము అని యెఱిఁగినటులను, జలమందుఁగల వేఁడిమిని వేఱుపఱచుటకు తనచేతఁ గాకపోయినను త్వగింద్రియము చేత స్పృశించి వివేకసమేతమయిన బుద్ధిచేత జలంబును ఉష్ణమును ప్రత్యేకించి యెఱిఁగిన చందమునను, గోడయందు వ్రాయఁబడినచిత్తరువులోని తెలుపు ఎఱుపు నలుపు పసుపు ఆకుపసుపు మిశ్రము పొట్టి పొడుగు లావు సన్నముగానుండెడు రూపంబులను పంచుటకు అలవి గాకపోయినను చక్షురింద్రియముచేత వీక్షించి వివేకసహితమయిన బుద్ధిచేత ఇదిగోడ యివి దీనియందుతోఁచెడి చిత్రపు ప్రతిమల నీల పీతాదివర్ణములని తెలిసికొనినచందమునను, నీటిలోఁగలసినషడ్రసములను విభాగింప సాధ్యముకాకున్నను రసనేంద్రియముచేత అనుభవించి వివేకయుక్తమయినబుద్ధిచేత ఇది ఉప్పు ఇది పులుసు ఇది తీపు ఇదివగరు ఇదిచేదు ఇదికారము అని ప్రత్యేకంబుగా ఎఱిఁగినవిధమునను,వస్త్రములనాశ్రయించియున్న పరిమళములనువేఱుచేయశక్యము గాకున్నను ఘ్రాణేంద్రియముచేత ఆఘ్రాణించి వివేకశీలమైన బుద్ధిచేత ఇది సుగంధము ఇది దుర్గంధము ఇది మిశ్రగంధము అని తెలిసికొనిన తీరునను. దార్ష్టాంతికమందును పంచకోశంబులను వానితోఁ గూడియున్న ఆత్మను పంచుటకు అశక్యమయినను వివేకయుక్తంబగు బుద్ధిచేత పంచకోశ స్వరూపము ఇట్టివనియు ఆత్మస్వరూపము ఇట్టిదనియు విచారించినయెడల పంచకోశములతో ఆత్మకుకాలత్రయమందును సంబంధములేదని తెలియుఁగవచ్చును.

ప్ర. త్రాడు మొదలగువానియందు ఆరోపింపఁబడిన సర్పము మొదలగునవి త్రాడు మొదలగువానికంటె వేఱుగలేనట్లు పరమాత్మయందు ఆరోపింపఁబడిన పంచకోశములును పరమాత్మకంటె అన్యముగలేవు. ఈదృష్టాంతముచేత రజ్జువు ముత్తెపుఁజిప్ప ఎండమావులు అనెడు జ్ఞానము వచ్చినతర్వాత సర్పము వెండి నీళ్లు అనెడు భ్రమ లేనియట్లు దార్ష్టాంతికమందును ఆత్మవిషయిక జ్ఞానముకలిగినపిమ్మట పంచకోశములనెడు వ్యవహారము విడువకవచ్చుచున్నదిగనుక ఆరోపితములయిన పంచకోశములును అధిష్ఠానమయిన ఆత్మకంటె వ్యతిరిక్తముగలేవని బుద్ధియందు ఏవిధమున దృఢముగలుగును.

ఉ. ఎండమావులనుజూచి నీరనిభ్రమసిత్రాగఁదలఁచినవాఁడు విచారించి యివిజలములుగావు ఎండమావులు అనుజ్ఞానము వచ్చినను ఎండమావులను జూచినప్పుడు జలముగాఁదోఁచుచున్నట్లుగానే పరమాత్మయందుతోఁచిన పంచకోశములు పరమాత్మకంటె వేఱుగా లేవనియెఱిఁగినను తిరుగ పంచకోశముల ప్రతీతిరావచ్చును.

ప్ర. దృష్టాంతమయిన ఎండమావులయందు జలప్రతీతి మాత్రమే గాని స్నానపానాదులుచేయవలయునను భ్రమకానము. దార్ష్టాంతికమందు ఆత్మకంటె వేఱుగా పంచకోశములు లేవని యెఱిఁగినతర్వాతను పంచకోశముల ప్రతీతియును వానివ్యవహారములును వచ్చుచున్నవే రావచ్చునా. ఉ. రావచ్చును.

ప్ర. అదియెట్లు. ఉ. మృత్తికయందు ఆరోపింపఁబడిన కుండలు మూకుళ్లు చట్లు మొదలయినవి మట్టికంటె వేఱుగలేవని తెలిసినను ఆకుండలు లోనగువాని ప్రతీతియును వ్యవహారమును వచ్చినతీరునను సువర్ణమందు ఆరోపింపఁబడిన కడియములు కిరీటములు మొదలైన భూషణములు సువర్ణమునకంటె వేఱుగాలేవని యెఱిఁగినను ఆకడియములు మొదలగువాని రూపములును నామములును వ్యవహారములును వచ్చినవిధముగాను ఆత్మయందారోపింపఁబడిన పంచకోశములును అధిష్ఠానమయిన ఆత్మకంటె అన్యముగ లేవని యెఱిఁగినను పంచకోశములనెడుప్రతీతియును వ్యవహారమునురావచ్చును. ఈదృష్టాంతమందు కుండలు మొదలగునవి కనఁబడుచు వ్యవహారమునకు వచ్చినను సూక్ష్మబుద్ధిగలవానికి మట్టికంటెవేఱుగ కుండలు లోనైనవి లేవని మనస్సునందు స్థిరమయినతీరున దార్ష్టాంతికమందు పంచకోశములు తోఁచుచు వ్యవహారమునకువచ్చినను సూక్ష్మబుద్ధిగలవానికి పరబ్రహ్మముకంటె వ్యతిరిక్తముగ పంచకోశములు లేవని బుద్ధియందు దృఢముగలుగవచ్చును.ఇట్లెఱుఁగుటయేపంచకోశవ్యతిరిక్తజ్ఞానము.

ప్ర. ఈవిచారణకుప్రయోజనమేమి. ఉ. ఆత్మ అవస్థాత్రయమునందు అనుస్యూతుఁడై ఉన్నాఁడు. పంచకోశములు అవస్థాత్రయమునందు అనుస్యూతములై యుండలేదు కాఁబట్టి పంచకోశములు తోఁచుచువ్యవహారమునకువచ్చినను ఇవి (పురుషాన్నపరంకించిత్తను), శ్రుతి ప్రమాణమునుపట్టి పరబ్రహ్మముకంటె వ్యతిరిక్తముగ లేవని యెఱిఁగినవాఁడే కృతార్థుఁడు విద్వాంసుఁడు జీవన్ముక్తుఁడు పరబ్రహ్మను అని వేదాంత సిద్ధాంతము.

౧౨౦౮.—క॥ కోరి శరీరులు భవదను । సారంబున నిహపరైక ✽ సౌఖ్యంబులఁ బెం.
పారఁగ నందుచునుందురు । ధీరజనోత్తము లనంగ ✽ దివిజారి హరా.

టీ॥ దివిజారిహరా=దేవతలకుశత్రువులైన రాక్షసులను నశింపఁజేయునట్టి ఓస్వామీ. శరీరులు = ముక్తజీవులు. కోరి=అపేక్షించి. భవదనుసారంబునన్=అనన్యభక్తితో నిన్నారాధించుటచేత. ధీరజనోత్తములనంగన్=బ్రహ్మవిద్వరిష్ఠులనునట్టుగా. ఇహపరైకసౌఖ్యంబులన్=ఈలోకమునను పరలోకమునను పొందఁగల ముఖ్యసౌఖ్యములను. పెంపారఁగన్=అధికముగ. అందుచునుందురు=పొందుచుందురు.

తా॥ రాక్షసులను నాశముచేయునట్టి ఓస్వామీ ! లోకములోని ముక్తజీవులందఱును నిన్ను అనన్యభక్తితో శ్రవణ మనన నిదిధ్యాసములచేత ఆరాధించి బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠులై ఇహలోక సుఖములను పరలోకసుఖములనుకొఱఁతలేక అనుభవించుచుందురు అని తా.

౧౨౦౯.—ఆ॥ నిన్ను ననుసరింప ✽ నేరని కుజనులు । పవన పూర్ణచర్మ ✽ భస్త్రి సమితి
వోలెఁ జేయుచుందు ✽ రుచ్ఛ్వసనంబులు । బలిసియాత్మభేద ✽ భజనులగుచు.

టీ॥ నిన్ను=సచ్చిదానందపరబ్రహ్మమైననిన్ను. అనుసరింపక=శ్రవణ మనననిదిధ్యాసములచేత ఆరాధించుటకు. నేరనికుజనులు=శక్తిలేని బద్ధజీవులు. పవన...పోలెక్-పవన=గాలిచేత. పూర్ణ=నిండిన. చర్మభస్త్రి=తోలుతిత్తులయొక్క. సమితిపోలెక్=సమూహము వలెనే. బలిసి=లావెక్కి. ఆత్మభేదభజనులు=జీవాత్మ పరమాత్మలకు భేదము కల్పించువారు — లేక పరమాత్మకంటె నితరముకలదనెడు బుద్ధిగలవారు. (అగుచును) ఉచ్ఛ్వాసనంబులు చేయుచుందురు — నిట్టూర్పులువిడుచుచుందురు.

తా॥ నీతత్వము తెలిసి నిన్ను శ్రవణ మనన నిదిధ్యాసములచేత ఆరాధింపలేని బద్ధజీవులు జీవాత్మ పరమాత్మలకు భేదమునుకల్పించి వాదించుచు గాలిచేత నిండుకొన్నతోలుతిత్తులవలె చక్కగా ఉబ్బిన దేహములు గలవారై ఊపిరివిడుచుచు తిరుగుచునుందురు అని తా.

౧౨౧౦.—సీ॥ దేవ కొందఱు సూక్ష్మ ✻ దృక్కులైనట్టి మ - హాత్మకు లుదరస్థుఁ ✻ డైన వహ్ని
గా మదిఁ దలఁతురు ✻ గైకొని మఱికొంద । ఱారుణు లనుపేర ✻ నమరు ఋషులు
లీల సుషుమ్నా నా ✻ డీమార్గ గతుఁడవై - హృత్ప్ర దేశమునఁ జ ✻ రించుచున్న
రుచిర దేహాకాశ ✻ రూపిగా భావింతు - రట్టి హృత్పద్మంబు ✻ నందు వెడలి
తే॥ వితత మూర్ధన్య నాసికా ✻ గతులనోలి । బ్రహ్మ రంధ్రంబుఁ బ్రాపించి ✻ పరమపురుష
సుమహితానందమయ పరం ✻ జ్యోతివైన । యీశునినుఁబొంది మఱిపుట్ట ✻ రిలమహేశ.

టీ॥ దేవ=స్వయంప్రకాశుఁడవైన. మహేశ=బ్రహ్మవిష్ణురుద్ర మహేశ్వర సదాశివులనెడు పంచకర్తలను నియమించువాఁడవును. పరమపురుష=పురుషోత్తముఁడవైనయోస్వామీ. సూక్ష్మదృక్కులు=అనుభవజన్యజ్ఞానముగలవారు-అనఁగా వేదాంతశాస్త్రములయందు చెప్పఁబడినసంప్రదాయములైనఉపాసనా మార్గముల నెఱిఁగినవారు అనుట. ఐనట్టిమహాత్మకులు= అగునట్టిబ్రహ్మవేత్తలు. కొందఱు = కొంతమంది. ఉదరస్థుఁడైన = మణిపూరక చక్రమున నుండునట్టి. వహ్నిగాక్=అగ్నిహోత్రునిఁగా. మదిక్=తమమనసులో. తలఁతురు = ఎంతురు. శ్రు॥ ఉదరంబ్రహ్మేతిశార్కరాక్షా ఉపాసతే, హృదయంబ్రహ్మేత్యారుణయోబ్రహ్మహైవైత ఊర్ధ్వంత్వేవోద సర్పత్తచ్ఛిరోశ్రయతే ॥ అనిశ్రుతి, శ్లో॥ అహంవైశ్వానరో భూత్వా ప్రాణినాందేహమాశ్రితః । ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం॥ అనిగీత. (మఱికొందఱు ఆరుణులు) అనుపేరక్ = అనునట్టిపేరితో. అమరు ఋషులు=ఒప్పునట్టిమునులు. లీలక్ = విలాసముగా. సుషుమ్నానాడీమార్గగతుఁడవై=బొమ్మ మొదలుకొని శిరస్సువఱకువ్యాపించుచున్న సుషుమ్నా నాడీమార్గమున వెడలినవాఁడవై. హృత్ప్రదేశమునక్ = హృదయమందలి అనాహతచక్రమునందు. చరించుచున్న=మెలఁగుచున్న. రుచిర...రూపిగాక్—రుచిర=మనోహరమైన. దేహాకాశరూపిగాక్ = పరమాకాశస్వరూపుఁడవునైనవానిగా. కైకొని=గ్రహించి. భావింతురు=తలఁతురు. అట్టిహృత్పద్మంబునందుక్=అటువంటి అనాహతచక్రమునందుండి. వెడలి=బయలుదేఱి. వితతమూర్ధన్యనాసికాగతులక్ = విశాలమయిన నడినెత్తియొక్కయు ముక్కుయొక్కయు రంధ్రములమార్గమున — అనఁగా తేజోరూపమైనసూర్యనాడీమార్గమగు ఆజ్ఞాచక్రమునుండి యనుట. ఓలిక్=క్రమముగా. బ్రహ్మరంధ్రంబుక్ = సహస్రారచక్రమును. ప్రాపించి=పొంది—అనఁగా నీకునివాసమైన చిదాకాశ స్థానమును పొంది అనుట. సుమ...జ్యోతి—సుమహిత=మిక్కిలి రమణీయమైన. ఆనందమయ=నిరతిశయానందమయమైన. పరం=సర్వోత్కృష్టమైన జ్యోతి=ప్రకాశము. ఐనయీశుక్ = అయినట్టి పరబ్రహ్మమయిన. నినుక్=నీయందు. (పొంది) మఱి=మరల. ఇలక్ = భూమియందు. (పుట్టరు) శ్రు॥ శతంచైకా హృదయస్యనాడ్యః, తాసాంమూర్ధానమభినిస్సృతైకా, తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి, విష్వఙ్ఙన్యా ఉత్క్రమణేభవంతి॥ శ్లో॥ ఉదరాదిషుయఃపుంసాం చింతితోమునివర్త్మభిః। హంతిమృత్యుభయందేవో హృద్గతంతముపాస్మహే॥ అని. శ్రుతి॥ ఏషదేవపథోబ్రహ్మపథస్తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి ॥

తా॥ శిరస్సే పరబ్రహ్మమైననిన్నుపాసింపఁదగినస్థానమనిభావము.

తా॥ స్వయంప్రకాశుఁడవును, బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులనెడు పంచకర్తలను పంచకృత్యములందు నియమించువాఁడవును, పురుషోత్తముఁడవునైన ఓభగవంతుఁడా! వేదాంతశాస్త్రములయందుచెప్పఁబడినసంప్రదాయములైన ఉపాసనామార్గములను, అనుభవజన్యజ్ఞానముచేత నెఱిఁగినబ్రహ్మవేత్తలునిన్ను నాభిస్థానమునందలిమణిపూరకచక్రముననుండునట్టి జఠరాగ్నిస్వరూపునిఁగాను, మఱికొందఱు ఆరుణులు అనుపేరుగల యోగులు వినోదముగ సుషుమ్నానాడీమార్గమున వెడలి వక్షస్థలము నందలి అనాహత చక్రమున వెలిఁగెడుపరమాకాశస్వరూపునిఁగాను ధ్యానింతురు. మఱికొందఱు బ్రహ్మనిష్ఠులు అట్టిహృదయకమలమున నుండి బయలువెడలి ముక్కురంధ్రములయందలియిడాపింగళల మార్గమున రేచకపూరకకుంభకక్రమముగ సహస్రార మునుపొంది అందు పరమహంసస్వరూపమున వెలుఁగు నీయందైక్యమై మరలభూమియందుపుట్టకయుందురుఅనితా.

(✻) మూలాధారాది చక్ర వివరణము. (✻)

శ్లో॥ మహీంమూలాధారే కమపిమణిపూరేహుతవహం। స్థితంస్వాధిష్ఠానేహృదిమరుతమాకాశముపరి। మనోపిభ్రూమధ్యేసకలమపిభిత్వాకులపథం। సహస్రారేపద్మేసహరహసిపత్న్యావిహరసే॥ అనిసౌందర్యలహరియందును.॥ శ్లో॥ మూలాధారంగుదస్థానం స్వాధిష్ఠానంతు మేహనం। నాభిస్తు మణిపూరాఖ్యం హృదయాబ్జ మనాహతం। తాలుమూలంవిశుద్ధాఖ్యమాజ్ఞాఖ్యంనిటలాంబుజం। సహస్రారంబ్రహ్మరంధ్రమిత్యాగమ విదో విదుః॥ ఆధారస్తు చతుర్దళోరుణరుచి ర్వాసాంత వర్ణాశ్రయ। స్వాధిష్ఠానమనేకవైద్యుతనిభం బాలాంతషట్పత్రకం। రత్నాభంమణిపూరకందశదళం డాద్యం ఫకారాంతకం। పత్రైర్ద్వాదశభిస్త్వనాహతపురీ హైమీ కఠాంతాన్వితా । దృష్ట్వాఽరంస్వర షోడశైశ్చ సహితం జ్యోతిర్విశుద్ధాంబుజం । హంక్షేత్యక్షరపద్మపత్రయుగళం రత్నోపమాజ్ఞాపురీ । తస్మాదూర్ధ్వమధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం । నిత్యానందమయీసదాశివపురీ । శక్త్యేనమశ్శాశ్వతం॥ అనిశ్రీవిద్యయందును.శ్లో॥ ఆధారేలింగనాభౌ హృదయ

ష్టారసిక్తే తాలుమూలే అలాక్షే। ద్వ్యష్టార్ణే షోడశారే ద్విదశ దశదళే ద్వాదశార్ధే చతుష్కే । వాసాంతే బాలమధ్యే డఫకఠ సహితే కంఠదేశే స్వరాణాం। హంక్షం తత్త్వార్థయుక్తం సకలదళయుతం వర్ణరూపం నమామి॥ శ్లో॥ షట్ఛతాని గణేశాయ షట్సహస్రం స్వయంభువే । విష్ణవే షట్సహస్రంతు షట్సహస్రం పినాకినే। సహస్రమాత్మనే చైవ సహస్రం పరమాత్మనే। సహస్రమేకం గురవే అర్పయామి కృతం జపం॥ ఇట్లని అజపాగాయత్రియందును గలదు.

తా॥ మూలాధారము మొదలు కపాలముదాఁక వీణాదండమువలె బ్రహ్మదండి మేరువు అనుపేళ్లుగల వెన్నెముక యుండును. దానిసంటి మూలాధారమందు వ శ ష స అను నాలుగు అక్షరములుగల నాలుగు దళములుగలిగి భూమికి స్థానమై అపరంజిరంగు గలదై నాసికకు కారణమై మూలాధారచక్రమొప్పును. ఆచక్రంబున వసించు వినాయకునకు అజపాగాయత్రీ మంత్రజపమునందు ఆఱునూఱు హంసలు సమర్పింపఁబడును.

లింగస్థానమందు బ భ మ య ర ల అనెడి ఆఱు అక్షరములు గల ఆఱు రేకులు గలిగి జలమునకు స్థానమై తెల్లనిరంగుగలిగి నాలుకకు కారణమై స్వాధిష్ఠానచక్రము వెలుఁగును. ఆచక్రమున వసించి దానికధిపతియైన బ్రహ్మకు అజపాగాయత్రీమంత్రజపమున ఆఱువేల హంసలు సమర్పింపఁబడును.

నాభిస్థానమందు డ ఢ ణ త థ ద ధ న ప ఫ అనెడు పది అక్షరములు గల పది దళంబులతోఁగూడి ఎఱ్ఱనిరంగు గలదై అగ్నికి స్థానమై నేత్రంబులకు కారణమై మణిపూరక చక్రంబు భాసిల్లును. ఆచక్రంబున నుండు విష్ణునకు అజపాగాయత్రీమంత్రజపమున ఆఱు వేల హంసలు సమర్పింపఁబడును.

వక్షస్థలమందు క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అనెడు పండ్రెండక్షరంబులు గల పండ్రెండు దళములు గలదై ఆకుపచ్చవన్నె గలిగి వాయువునకు నివాసమై చర్మమునకు కారణమై అనాహత చక్రంబు రాజిల్లును. ఆచక్రంబున వసించి దానికధిపతియగు రుద్రమూర్తికి అజపాగాయత్రీమంత్రజపమందు ఆఱు వేల హంసలు సమర్పింపఁబడును.

కంఠస్థానమందు అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః అనెడు పదియాఱు అక్షరంబులు గల పదియాఱు దళంబులు గలిగి నీలవర్ణంబు గలదై మింటికి స్థానమై శ్రోత్రంబులకు కారణమై విశుద్ధచక్రంబు రంజిల్లును. అందు వసించి దానికి ప్రభువగు జీవరూపుఁడగు ఈశ్వరునకు అజపాగాయత్రీమంత్రజపమందు వేయి హంసలు సమర్పింపఁబడును.

భ్రూమధ్యమందు హ క్ష అను రెండక్షరంబులు గల రెండు దళంబులు గలిగి మాణిక్యవర్ణంబు గలదై అంతఃకరణంబునకు నిలయమై సకలేంద్రియ వ్యాపారంబులకు కారణమై ఆజ్ఞాచక్రంబు ప్రకాశించును. అందు వసించి దానికి దొరయై పరమాత్మస్వరూపుఁడై రాజిల్లు సదాశివునకు అజపాగాయత్రీమంత్రజపమందు వేయి హంసలు సమర్పింపఁబడును.

మఱియు కొందఱు జ్ఞానులు ఆధార కమలంబునకు నాసికకు చేరిక గావున నాసికకు విషయంబులగు సుగంధ దుర్గంధ సుగంధమిశ్ర దుర్గంధ దుర్గంధమిశ్ర సుగంధంబులు నాలుగే ఆధారకమలంబునకు నాలుగుదళంబులనియు, స్వాధిష్ఠానకమలంబునకు లోచనంబునకు కూడిక గావున లోచనంబునకు విషయంబులగు తెలుపు నలుపు పసుపు ఆకుపచ్చ ఎఱుపు మిశ్రము లావు సన్నము పొట్టి పొడుగు అనెడి దశవిధరూపంబులే దశదళంబులనియు, మణిపూరకకమలంబునకు నాసికకు పొందిక గాన నాలుకకు విషయంబులగు నవగరు తీపు ఉప్పు కారము చేదు పులుసు అనెడి షడ్రసములే షడ్దళంబులనియు, అనాహతకమలంబునకు శరీరచర్మమునకు సంబంధము గావున చర్మమునకు విషయంబులయిన శీత ఉష్ణ శీతమిశ్రోష్ణ ఉష్ణమిశ్రశీత మృదు కఠిన స్పర్శంబులు లాఘవ అల్ప అధికంబులచేత పండ్రెండగును. ఆపండ్రెండు విధంబులయిన స్పర్శంబులే అనాహతకమలంబునకు పండ్రెండు దళంబులనియు, విశుద్ధకమలంబునకు కర్ణంబునకు కలయికగనుక ఆకర్ణంబునకు విషయంబులైన అకారాది షోడశ స్వరరూపశబ్దంబులే షోడశదళంబులనియు, ఆజ్ఞేయకమలము మనస్సునకు నెలవుగనుక మనస్సునకు విషయంబులగు సంకల్ప వికల్పములే ఆజ్ఞేయచక్రంబునకు రెండు దళంబులనియు పలుకుదురు.

మఱి కుండలీశక్తిరూపమైన బిందుతత్త్వము జగద్వ్యాపారవృత్తి గలదైనప్పుడు నిలువనాధారమైనందున మూలాధారమనియు, ప్రభావము చూపతన చేత అధిష్ఠింపఁబడుటవలన స్వాధిష్ఠానమనియు, సాధకుఁడు తన్నునారాధించు సమయంబున మణిమయంబులై మ్రోగుచుండు అందెలు కడియములు కిరీటము భుజకీర్తులు మొదలగు నగలచేత తన శరీరము నిండించెడి స్థానమగుటవలన మణిపూరకమనియు, సాధకుఁడు పూజాకాలమందు విఘ్నకారులగు దుష్టభూత భేతాళ రాక్షసాదుల పోకకు మంగళవాద్యములు చేయుట ప్రసిద్ధము గనుక సాధకునకు సాహాయ్యకముగ కొట్టకనే చిణి చిణిచిణి ఘంటా శంఖ వీణ తాళ వేణు భేరీ మృదంగ మేఘధ్వనులు కలుగుచుండుట వలన అనాహతమనియు, సాధకుఁడు శుద్ధస్ఫటికాకృతిగా తన్ను ధ్యానించు చోటగుటచేత విశుద్ధమనియు, తన యాజ్ఞ చెల్లించు స్థలమగుటవలన ఆజ్ఞాచక్రమనియు, షట్చక్రములకు పేళ్లు గలిగెను.

మఱి ఆమూలాధారంబునకంటె రెండంగులంబుల మీఁదను స్వాధిష్ఠానంబునకు రెండంగుళంబుల దిగువను కుక్కుటాండంబువలె నాడీచక్రముండును. దానియందు డెబ్బదిరెండు వేల నాడులు పుట్టి కొన్ని మీఁదుగను కొన్ని క్రిందుగను కొన్ని ప్రక్కలను భూమియందలి నదులవలె శరీరంబున వ్యాపించుకొని యుండును. వానిలో పదినాడులు ముఖ్యంబులు, అందు కుహు శినీవాలి రక్తాహ్వయంబులనెడి మూఁడు నాడులు క్రిందుగ పాఱి కుహూనాడి మలంబును, శినీవాలీనాడి మూత్రమును, రక్తాహ్వయనాడి శుక్లశోణితంబులను, విసర్జనము చేయుచుండును. పూషా అలంపూష అను రెండు నాడులు కర్ణములయందుఁ జేరి వర్ణ ధ్వని స్వరమిశ్రరూపంబులైన శబ్దంబుల వినఁజేయుచుండును. గాంధారి హస్తిజిహ్వ అను నాడులు కన్నులలో వ్యాపించి దశవిధ రూపగ్రహణంబు చేయించుచుండును. మఱి బ్రహ్మదండికి కుడియెడమ పార్శ్వముల యందుండెడి యిడ పింగళ అను నాడులు హృదయముదాఁక వచ్చి ఆహృదయ మందలి ప్రాణ వాయువుతోడ భ్రూమధ్యమందు చేరి గంగ యమున అను పేళ్లు గలవియగును. అందు సూర్యుఁడనెడి పేరుగల యిడానాడి కుడినాసికయందుఁ జేరి తపిని తాపిని ధూమ్ర మరీచి జ్వాలిని రుచి సుషుమ్న భోగద విశ్వ బోధిని ధారిణి క్షమ అనెడి పండ్రెండు పేళ్లుగల పండ్రెండంగుళములవఱకు ప్రాణవాయువును వెలుపల తిరుగఁజేసి వానిలో నాలుగంగులములు క్షీణింపఁజేసి యెనిమిదంగులముల దాఁక ప్రాణవాయువును మరల లోపలికీడ్చుకొనును. చంద్రుఁడను పేరుగల పింగళానాడి యెడమ నాసికలోఁ జేరి ప్రాణవాయువును అమృత మానద పూష తుష్టి పుష్టి రతి ధృతి శశిని చంద్రిక కాంతి జ్యోత్స్న శ్రీ ప్రీతి అంగద పూర్ణ పూర్ణామృత అను పదియాఱు పేళ్లుగల పదియాఱంగులంబుల పొడవున వెలుపల వ్యాపింపఁజేసి యెనిమిదంగుళంబుల క్షీణింపఁజేసి యెనిమిదంగుళంబులదాఁక ప్రాణవాయువును లోపలికి నీడ్చుకొనును. మఱి సూర్యచంద్రసంజ్ఞలుగల యిడాపింగళానాడులు రెండును ఒకదినమున

శరువదియొక్క వేలఆఱునూఱుమాఱులు ఉచ్ఛ్వాసనిశ్వాసరూపంబులచేత మారిమారి పలుమాఱు తిరుగుచుండును. నాడీచక్రమందుఁ బుట్టిన శుక్లనాడి సుషుమ్న కుండలీశక్తి నాగకన్యకబ్రహ్మనాడి అను పేళ్లుగిలదియై వక్షస్థలంబుదాఁక వచ్చి నాడీచక్రంబునుండి తనతోడ వచ్చిన నూఱునాడుల నక్కడవిడిచి తాను నాలుకకొననుజేరి సరస్వతియనుపేరువడసి కొండనాలుక దవుడలు మెడ తల పండ్లు పెదవులు నాసికమిశ్రములు అను నెనిమిదిస్థానములయందు ఏఁబదియొక్క అక్షరములను పలికించుచు అచ్చటనణఁగి అంతర్గమనంబున పశ్చిమమార్గంబుగ భ్రూమధ్యంబునకుదిగి ముందటి ఇడాపింగళలలోసంగమమగును, అది త్రివేణీసంగమము త్రికూటము శృంగాటము చతుష్పథము అనుపేళ్లుగలదగును. ఇదె ఆజ్ఞాచక్రము. ఈయాజ్ఞాచక్రంబునకు మనోరూపంబుగ చిచ్ఛక్తి సహస్రారంబునుండి దిగివచ్చి అచ్చట వసించి ఇంద్రియములను సర్వవిషయములయందు ప్రవర్తింపఁ జేయును. జగత్సృష్టి స్థితి సంహార తిరోధానాను గ్రహములనెడి వ్యాపారములను చేయు పంచకర్తలకాజ్ఞాపించుటవలన ఆజ్ఞాచక్రమని పేరు. దీనిమీఁద చిచ్ఛక్తికి ఒక అంగుళమువఱకు శక్తియని, దానిపైమూఁడంగుళములవఱకు వ్యాపినియని, ఆవల నాలుగంగుళములదాఁక సమనయని, ఆమీఁద నాలుగంగుళములవఱకు ఉన్మనియని పేళ్లుగలుగును. ఈపండ్రెండంగుళములమీఁద బ్రహ్మరంధ్రము అదే ద్వాదశాంతము దీనియందు వేయిదళములుగల సహస్రారచక్రముగలదు అదినూటయిరువదియైదు చిన్నఱేకులుగల యెనిమిది పెద్దఱేకులు గలిగియుండును ఇదే అష్టదళపద్మము దీనిమధ్యమందు శివబీజమైన హకారమును, శక్తిబీజమైన సకారమును, ఈరెంటికి నడుమ త్రాసు ముంటివలె శివశ్శక్తులకు ఐక్యస్థానమై శివకళయగు జ్ఞానము హెచ్చినపుడు హకారము ప్రక్కను శక్తి కళయగు ప్రపంచజ్ఞానము హెచ్చినపుడు సకారము ప్రక్కను వాలుచు బిందురూపమైనబుద్ధితత్త్వము వెలుఁగుచుండును. ఇదే మూఁడక్షరము దీనిని దెలిసి లక్ష్యముంచినవారే పరమహంసలు అవధూతలు జీవన్ముక్తులు. మఱియీహకారబిందు సకారములే పతిపాశ పశువులు. నాదబిందు కళలు. సోమ సూర్యాగ్ని మండలములు. పురుష పుత్ర స్త్రీ ప్రస్తావములు. శుక్లమిశ్రరక్తపాదుకలు అనిచెప్పఁబడును. మఱి యీహకారబిందు సకారములు తమ్ము నమ్మినవారి సంసార బంధంబు హరించునవి గావున హంస యనఁబడును. మఱి హకారముసోమము, సకారముఅగ్ని. బిందువే మోక్షపదము. వీనిదైక్యమే అగ్నీషోమీయయజ్ఞము. యిదేకర్మకాండ విదులుచేయు బహిర్యజ్ఞము. మఱితత్పదమే హకారము. త్వంపదమే సకారము. వీనియైక్యమైన అసిపదమే బిందువు గావున జ్ఞానులకు నిదియే జీవేశ్వరైక్యరూపమగు యోగయజ్ఞము. మఱియీహంసయే గురుపాదుక గావున అజపాగాయత్రీమంత్రజపము సహస్రము సమర్పింపఁ బడును. మఱియిదే జ్ఞానాజ్ఞాన మిళితమైన ప్రపంచమందు నీళ్లనెడు అజ్ఞానమును విడిచి పాలనెడి జ్ఞానమును గ్రహించును గావున హంసపక్షియనఁబడును. మఱియీహంసఅష్టదళపద్మమందలి తూర్పుఱేకుపైవాలెనేని పుణ్యకర్మములు చేయవలెననుతలంపును ఆగ్నేయదళమందు వ్రాలెనేని సోమరితనము ను ఆలస్యములోనైన వృత్తులును, దక్షిణపు దళమందు ఒఱగెనేని క్రూరపుఁబనులు గావింప వలయునను సంకల్పములును, నైరృతిదళమందు చేరెనేని పాపకార్యములు సలుపవలయుననెడిబుద్ధులును, పశ్చిమదళమందు ~~నిలిచెనేని~~ ఆడుట పాడుట లేక వీనిని చూచుట మొదలగునవి చేయవలయుననెడియెన్నికలును, వాయవ్య దళమందుచేరెనేని నడచుట పరుగెత్తుట దుముకుట మొదలగునవి చేయ వలయునను కోరికలును, ఉత్తరపుదళమందు వ్రాలెనేని పదార్థములనను భవింపవలయునను నవిలోనగు నభిలాషలును, ఈశాన్య దళమందు చేరెనేని దానములు త్యాగములు మొదలగునవి చేయవలెననెడి యిచ్ఛలును, కేవలమధ్యమందు చేరెనేని వైరాగ్యము ఉపశాంతి దమము మొదలగుసాత్త్వికవృత్తులును, కేసరములందు ప్రవేశించెనేని జాగ్రత్తయు, దుద్దునందుఁ జేరిన స్వప్నంబును, పద్మనాళమునదిగిన నిద్రయును గలుగును. మఱి యీపద్మమును విడుచుటయే తురీయము. అని హంసోపనిషత్తునందుఁ జెప్పఁబడును.

వ॥ మఱియు వివిధ కాష్ఠాంతర్గతుండైన వాయుసఖుండు దద్గతదోషంబులం బొరయక నిత్యశుద్ధుండై తరతమభావంబుల వర్తించు చందంబున స్వసంకల్ప కృతంబులైన విచిత్ర శరీరంబులందు నంతర్యామివై ప్రవేశించి తత్తద్వివిచిత్రయోగ నియతంబైన హేయంబులం బొరయక సకలాత్మకంబై యేకరసంబై బ్రహ్మంబైన నిన్ను నైహికాముష్మిక ఫలసంగమంబు లేక విగత రజోగుణంబులనాసక్తులై కొందఱు భజియించుచుండుదు రదియునుంగాక దేవా భవదీయ సంకల్పాధీనంబులైన శరీరంబులం బ్రవేశించియున్న జీవ సమూహంబు నీకు శేషభూతంబని తెలిసి కొందఱు భవనివారకంబులైన శ్రీమత్త్వచ్చరణారవిందంబులు సేవించి కృతార్థులగుదురు మఱియును.

టీ॥ (మఱియును) వివిధకాష్ఠాంతర్గతుండు=నానావిధములైనకఱ్ఱలలోనుండువాఁడు. అయిన వాయుసఖుండు = అయినట్టి యగ్నిదేవుఁడు. తద్గతదోషంబులన్=వానియందలిదోషములను. పొరయక=పొందక. నిత్యశుద్ధుండై = ఎప్పుడును పరిశుద్ధుఁడై. తరతమభావంబులన్=అధికత్వముచేతను సర్వాధికత్వముచేతను. వర్తించుచందంబునన్=ఉండువిధమున. స్వసంకల్పకృతంబులు=తన సంకల్పముచేత చేయఁబడినవి. అయిన విచిత్ర శరీరంబులందున్=అయినట్టి ఆశ్చర్యకరములును, ఉత్తమ మధ్యమనీచరూపములునైన దేవమనుష్య తిర్యగ్దేహములయందు. అంతర్యామివై=లోపలవర్తించువాఁడవై. ప్రవేశించి=చొచ్చి. తత్తద్విచిత్రయోగనియతంబులు = ఆయాదేహములయందలివింతయైనకూడికచేతమాన రానివైన. హేయంబులన్=రోఁతలయందు—వికారములననుట. పొరయక=పొందక. సకలాత్మకంబై=అన్నియును నిజరూపముగనుండునదియై. ఏకరసంబై = ఒకతీరుననుండుట కలిగినదై. బ్రహ్మంబైన=సచ్చిదానందాఖండ నిర్మల పరతత్త్వమయిన. (నిన్ను) ఐహికాముష్మికఫలసంగమంబు=ఇహపరలోక సంబంధను—ఇహపరలోక సుఖములయందలి ప్రయోజనముల ములయందలి యాశ. లేక=లేనివారై. విగతరజోగుణంబులన్=పోయిన రాజసగుణము గలవారగుటచేత. (ఆసక్తులై కొందఱు) భజియించుచుండుదురు = సేవించుచుందురు. శ్లో॥ స్వనిర్మితేషు కార్యేషు తారతమ్యవివర్జితం। సర్వానుస్యూతసన్మాత్రం భగవంతం భజామహే॥

సర్వజ్ఞస్సర్వదృక్సర్వ జ్ఞానశక్తిబలర్ధిమాన్। అన్యూనశ్చాప్యవృద్ధిశ్చ స్వాధీనోనాదిమాన్వశీ। క్లమతంద్రీభయక్రోధ కామాదిభిరసంయుతః। నిరవద్యః పరంప్రాప్తేర్నిరధిష్ఠోక్షరక్రమః॥ అని. అదియునంగాక=అదిమాత్రముగాక. దేవా=ఓస్వామీ. భవదీయసంకల్పాధీనంబులయిన=నీసంకల్పమునకు లోఁబడినవైన. శరీరంబులన్=సురనరతిర్యగాదిదేహములయందు. ప్రవేశించి=చొచ్చి. ఉన్నజీవసమూహంబు=ఉన్నట్టి ప్రాణులగుంపు, (నీకు) శేషభూతంబని=మిగతయైనదని. (తెలిసి కొందఱు) భవనివారకంబులు=జన్మములనుతొలఁగించునవి. (అయిన) శ్రీమత్త్వచ్చరణారవిందంబులు=మోక్షసంపదను గలిగించునవియైననీపాదకమలములను. సేవించి=కొలిచి. కృతార్థులగుదురు=కృతకృత్యులు అవుదురు. (మఱియును)

తా॥ ఇదిగాక నానావిధములయిన కట్టెలలో నడఁగియుండునట్టి యగ్ని ఆకట్టెలయందలిలావు సన్నము పొట్టి పొడుగు సుగంధదుర్గంధములు మొదలైన వికారములను పొందక పరిశుద్ధుఁడయియుండునట్లు, తనసంకల్పముచేతనే చేయఁబడినవైన దేవతలు మనుష్యులు క్రిమిజలచర పక్షి పశువులు లోనగు వింతవింత శరీరములయందు అణఁగి వర్తించువాఁడవై ఆశరీరములలో చొచ్చి వానియందలి బహువిధములయిన వికారములను పొందక నిరతిశయానందస్వరూపముగల పరతత్త్వమైననిన్ను ఇహపరములయందలిసుఖములను గోరక నిర్మలమైన మనసుగలిగి నీసేవయందాసక్తిగల కొందఱు నిన్ను సేవించుచుందురు నీసంకల్పమువలనఁగలిగిన దేహములయందుఁజొచ్చియున్న జీవసమూహము నీకు శేషమయినదని తెలిసి జన్మములను పోఁగొట్టునవియైన నీపాదములను సేవించి కొందఱు కృతార్థులగుదురు అనితాత్పర్యము.

౧౨౧౨.—సీ॥ అనఘ దుర్గమమైన * యాత్మతత్త్వంబుఁ బ్ర * వర్తించు కొఱకు ది * వ్యంబులైన
యంచిత రామకృ * ష్ణాద్యవతారము - ల్భజియించియున్న నీ * భవ్యచరిత
మను సుధాంభోనిధి * నవగాహనముసేసి - విశ్రాంతచిత్తులై * వెలయుచుండి
మోక్షంబు బుద్ధిన * పేక్షింప నొల్లరు - మఱియుఁగొందఱు భవ * చ్చరణపంక
ఆ॥ జములఁదగిలి పుణ్య * తములయి హంసల। వడువునొంది భాగ * వత జనముల
నొనరువారు ప్రకట * యోగిజనాప్తమై। నట్టి ముక్తిఁగోర * రాత్మలందు.

టీ॥ అనఘ=పాపములులేనివాఁడవైన యోస్వామీ. దుర్గమమైన యాత్మతత్త్వంబున్=పొందరానిదైన పరమాత్మస్వరూపమును. ప్రవర్తించుకొఱకున్=ప్రవర్తిల్లఁజేయుటకొఱకు. దివ్యంబులైన=అప్రాకృతములైన. అంచిత...ములు—అంచిత=ఒప్పిదములైన. రామ=రామావతారము. కృష్ణ=కృష్ణావతారము. ఆది=మొదలగు. (అవతారములను) భజియించియున్న=పొందియున్న. నీభవ్యచరితము—శ్లాఘ్యమయిన నీచరిత్రము. అనుసుధాంభోనిధిన్ = అనునట్టిపాలసముద్రమునందు. అవగాహనముచేసి=మునిఁగి. విశ్రాంతచిత్తులై=నెమ్మదినొందిన మనసు గలవారై — ఆధ్యాత్మికాది త్రితాపములచేత విడువఁబడినవారై. శ్రు॥ యంసర్వేదేవానమంతి ముముక్షవో బ్రహ్మవాదినశ్చేతి॥ శ్లో॥ త్వత్కథామృతపాథోధౌ విహరంతో మహాముదః। కుర్వంతికృతినః కేచిచ్చతుర్వర్గం తృణోపమం॥ అని. వెలయుచుండి=ప్రకాశించుచుండి. మోక్షంబున్=ముక్తిని. బుద్ధిన్=బుద్ధియందు. (అపేక్షింపనొల్లరు) మఱియుఁగొందఱు = ఇంకఁగొందఱు. భవచ్చరణ పంకజములన్=నీపాద పద్మములయందు. తగిలి=ఆసక్తులై. పుణ్యతములయి = మిక్కిలియధికమయిన సుకృతవిశేషముగలవారై. హంసలవడువునొంది = పరమహంసలయిన యేకాంగుల విధమును పొంది. భాగవత జనములన్ = భగవంతుని సంబంధముగల (లేక) భగవద్గుణానుభవముగల జనులలో. ఒనరువారు = కూడుకొనియుండువారు. ప్రకటయోగిజనాప్తము=ప్రసిద్ధులైనయోగీశ్వరులచేత పొందఁదగినది. అయినట్టిముక్తిన్ = అయినట్టి మోక్షమును. ఆత్మలందున్=మనసులలో. కోరరు=తలంపరు.

తా॥ పాపములులేనివాఁడవైన ఓస్వామీ! పొంద శక్యముకానిదైన ఆత్మతత్త్వమును ప్రవర్తిల్లఁజేయుట కొఱకు ప్రకృతి సంబంధములుకాని రామావతారము కృష్ణావతారము మొదలగు అవతారములెత్తి వర్తించునట్టి నీచరిత్రము పాలసముద్రమువలె స్వచ్ఛమును మేరగానరానిదియునై యుండఁగా అట్టిచరిత్రమును వినుట పఠించుట విచారించుట మొదలగు క్రియలయందు మునిఁగి తేలుచు నెమ్మదినొందినమనసుగలవారు అగుచు కొందఱు మోక్షమును అపేక్షింపక వెలుఁగుచుందురు. మఱికొందఱు నీపాదపద్మములను ఆరాధించుటయందు ఆసక్తిగలవారై మిక్కిలిపుణ్యాత్ములయిన పరమహంసలవలె భగవంతుఁడవైననీగుణానుభవముగలజనులతోఁగూడి వర్తించువారై ప్రసిద్ధములైన యోగములవలన సిద్ధినొందిన యోగులకు పొందఁదగినదైన మోక్షమును మనసులలో తలంపనైన తలంపరు అనితాత్పర్యము.

౧౨౧౩.—ఉ॥ కొందఱు నీశరీరముల * కుంఠితభక్తి భవద్వశంబులై
చెందఁగ నీపదాబ్జములు * సేరి భజించుచుఁ దత్సుఖాత్ములై
యుందురు కొందఱీ తనువు * లొలిధరించి భవత్పదాబ్జముల్
పొందుగఁ గొల్వలేక యిలఁ * బుట్టుచుఁ జచ్చుచునుందు రవ్యయా.

టీ॥ అవ్యయా=నాశములేని యోస్వామీ. (కొందఱు) ఈశరీరములు=ఈమనుష్యదేహములను. అకుంఠితభక్తిన్ = మొక్కపోని భక్తితో. భవద్వశంబులై=నీకుఅధీనములై. చెందఁగన్=పొందఁగా. నీపదాబ్జములు = నీపాద కమలములను. (చేరి) భజించుచున్ = కొలుచుచు. తత్సుఖాత్ములై=ఆసేవవలనిసుఖముతోడి మనసులుగలవారై. (ఉందురు కొందఱు) ఈతనువులు=ఈమానవ దేహములను.

షలికా=క్రమముగా. (ధరించి) భవత్పదాబ్జములు = నీపాదకమలములను. పొందుగన్=అనువుగా. కొల్వలేక=సేవింపలేక. ఇలన్=భూమియందు. ( పుట్టుచును చచ్చుచును ) ఉందురు = ఉండుదురు.

శ్రు॥ అసుర్యానామ తేలోకా అంధేన తమసావృతాః। తాంస్తే ప్రేత్యాభిగఛంతియే కేచాత్మహనోజనాః॥ దేహాభిమానముగలవారు భగవంతునిధ్యానింపక వర్ణింపక జన్మపరంపరలలోఁజిక్కి అథోగతి పాలగుచున్నార్లని భావము.

తా॥ ఎప్పుడును నాశమునొందక శాశ్వతమైయుండునట్టిస్వామీ! కొందఱు పొందరానిదైన మానవ దేహమునుపొందిన మాత్రముననే ఆదేహమును నీకు అధీనముగాఁజేసి మిక్కుటమైన భక్తితో నీపాదపద్మములను కొలుచుచు అందువలని సుఖమును అనుభవించుచుందురు, కొందఱు అట్టిదుర్లభమయిననరశరీరమునుపొందియును నీపాదసేవ చేయనేరక (పునరపిజననం పునరపిమరణం పునరపిజననీ జఠరేశయనం) అను ప్రమాణమువలనభూమియందు మరలమరల పుట్టుచును చచ్చుచునుందురు అని తాత్పర్యము.

౧౨౧౪.—చ॥ యమనియమాది యోగమహి * తాత్మకులైన మునీంద్రులు న్విరో
ధమునఁ దలంచు చైద్య వసు * ధావరముఖ్య నృపుల్ఫణీంద్ర భో
గములన నొప్పు బాహువులు * గల్గిన నిన్నుభజించు గోపికల్
క్రమమున మేమును న్సరియ * కామెభవత్కృపకంబుజోదరా.

టీ॥ అంబుజోదరా=బ్రహ్మకు జన్మస్థానమయిన కమలము కడుపునందుఁగలవాఁడా. భవత్కృపకున్ = నీదయకు. యమనియమాది యోగమహితాత్మకులు=యమము నియమము మొదలగుయోగములచేత పరిశుద్ధమయిన మనసుగలవారు. ఐనమునీంద్రులును=అయినట్టిబ్రహ్మనిష్ఠులును. విరోధమునన్=శత్రుత్వముచేత. తలంచు=తలఁచునట్టి. చైద్యవసుధావరముఖ్యనృపులు=శిశుపాలుఁడు మొదలగురాజులును. ఫణీంద్రభోగములు = గొప్పపాముల దేహములు. అనన్ = అనునట్టుగా. ( ఒప్పు ) బాహువులు=చేతులు. కల్గిననిన్నున్—కలిగినట్టి నిన్ను. భజించు=కొలుచునట్టి గోపికలు=గొల్లపడుచులును. క్రమమునన్ = వరుసక్రమమున. (మేమును) సరియ = సమానులమే. కామె=కాదా.

తా॥ ఓస్వామీ ! నీదయకు యమనియమాదులైన యోగములను అభ్యసించి వానివలని సిద్ధినొందిన మునీశ్వరులును, పగచేత తలఁచునట్టి శిశుపాలుఁడు మొదలగు దుష్ట రాజులును, ఆలింగనాదులచేత సేవించునట్టి గోపికాస్త్రీలును, ఎల్లప్పుడును స్తుతిచేయునట్టిమేమును సమానులమే కదా — అనఁగా నీకు శత్రువులు మిత్రులు సేవకులు అనువారు అందఱును పాత్రులేగాని నీకు ఒకరు ఎచ్చు ఒకరుతక్కువ అనుభేదములేదు అని తాత్పర్యము.

(*) యమనియమాదియోగవివరణము. (*)

జీవసాక్షియగు ప్రత్యగాత్మకును ఈశ్వరసాక్షియగు పరబ్రహ్మమునకును ఘటాకాశ మహాకాశములకువలె ఐక్యము కలుగుటయే యోగము. అది చిత్తపరిపక్వములేనివారికి అభ్యాసయోగమని చిత్తపరిపక్వము గలవారికి జ్ఞాన యోగమని రెండు విధములు. అందు అభ్యాసయోగము ప్రాణాయామమనఁబడును. ఆప్రాణాయామము ప్రాకృతమని వైకృతమని కేవలకుంభకమని మూఁడువిధము లగును. ఆమూటియందు ప్రాకృతము మంత్రయోగము. వైకృతము లయయోగము. కేవలకుంభకముహఠయోగము, వీనిలోమంత్రయోగము అజపము జపము క్రియ స్మరణములనెడు నాలుగురూపములు గలది. అందు నేటిదిన సూర్యోదయము మొదలుకొని రేపటిదిన సూర్యోదయమువఱకు మూలాధారాది కమలములకు అధిదేవతలయినగణపతి మొదలగువారికి. శ్లో॥ షట్ఛతాని గణేశాయ షట్సహస్రంస్వయంభువే। విష్ణవేషట్సహస్రంతు షట్సహస్రంపినాకినే। సహస్రమాత్మనేచైవ సహస్రంపరమాత్మనే। సహస్రమేకంగురవే అర్పయామికృతం జపం॥ అనుశ్లోకప్రకారంబుగ ఇరువది యొకవేల ఆఱునూఱుహంసగాయత్రీ మంత్రజపము సమర్పించుటే అజపరూపమంత్రయోగము. ఋషి ఛంద దేవతా బీజ శక్తి కీలక అంగన్యాస కరన్యాస ధ్యాన కవచ హృదయ మాలా పంజర అర్గళ స్తోత్ర దిగ్బంధన దిగ్విమోక ప్రాణప్రతిష్ఠలును యంత్ర విగ్రహాద్యారాధనములును గలిగి మొదట ప్రణవమును నడుమ దేవతానామము చతుర్థ్యంతముగను కడపట వశ్య మారణ స్తంభన మోహన విద్వేషణ ఉచ్చాటన ఆకర్షణ ఆవేశనము లనెడి అష్టకర్మములకు తగిన నమః స్వాహా హుం ఫట్ వౌషట్ వషట్ ఠః స్వధ మొదలగు పల్లవములను ప్రణవాదిగఁ జేర్చి యిష్టసిద్ధికొఱకు జపింపఁబడునది జపరూప మంత్రయోగము. ఇది గాయత్రి మొదలుగ శైవ శాక్త వైష్ణవ కాపాలిక గాణాపత్య సౌరాది సమయ మంత్రభేదములచేత ఏడుకోట్లవిధములై యుండును. శ్రౌతస్మార్తాది కర్మములయందును గర్భాధానాది షోడశసంస్కారములయందును యజ్ఞాదులయందును వేదోక్త పురాణోక్తమంత్రములను నోటఁజెప్పుచు చేతులతో చరు ఆజ్య సమిత్ అక్షత పుష్ప చందన దర్భ జలాది పదార్థములచేత అచ్చటచ్చట క్రమముగ క్రియల నడపించునదియే క్రియారూప మంత్రయోగము. శ్రీరామ శివ గోవింద నారాయణ మహాదేవాది నామములను రాగతాళ నృత్యవాద్యములతోడహృద్యంబుగభజనసేయుట శ్రీరామాదినామములనుకోటిసంఖ్యగ వ్రాయుట ఆదేవతానామములతోడనే ఆదేవతారూపముల వ్రాయుట లోనగునవి స్మరణరూప మంత్రయోగము. లయయోగమనఁగ, శ్లో॥ మనోస్రేవసతే బిందుః ప్రాణాస్రేవసతేకళా। ఉభయోర్లీయతేనాదం లయయిత్యుచ్యతే బుధైః॥ అనాహతస్య శబ్దస్య తస్యశబ్దస్యయోధ్వనిః। ధ్వనిరంతర్గతంజ్యోతిః జ్యోతిరంతర్గతంమనః। తన్మనోవిలయంయాతి తద్విష్ణోఃపరమంపదం॥ ఇత్యాది ప్రమాణములచేత కొట్టఁబడకనే మ్రోగుచుండెడి అనాహతచక్రమందలి దశవిధప్రణవనాదముల నెఱిఁగిదశమనాద మెచ్చటలీనమగుచున్నదో అచ్చట ప్రాణాగ్రస్థితమైనచిత్కళాదర్శనముతోఁగూడి ఆదర్శనమందు మనోలీనమగుటయే లయయోగ మనఁబడును. ఈలయ యోగము మృడానికి మృడుఁడు లక్షవిధంబులఁదెలిపెను గ్రంథవిస్తరభీతిచేత నిచ్చట వ్రాయఁబడదు. హఠయోగమనఁగ ధర్మప్రభువు పాలించు రాజ్యమందలి పుణ్యనదీతీరమందు శాస్త్రోక్తక్రమంబుగ హఠయోగమఠముకట్టించుకొని యోగవిశిష్టుఁడగు గురునిదగ్గఱ నుంచుకొని వానిచేత నిర్ణయింపఁబడిన

ప్రకారముగ పథ్యములఁ జేయుచు భోజనాభ్యంగనాదులచేత శరీర రక్షణము చేయుచు గుదాకుంచనముచేత నీళ్లుపీల్చి అధోజలములఁ గడిగివిడుచుచు కల్పఘృతముల చేతను గండూషాదుల చేతను వక్షస్థల కంఠగత కఫపిత్తాదులఁ గ్రక్కుచు అంజననస్యాదులచేతకపాల నాసికాగత దుష్టజలమలాదులనువిసర్జించుచు శీతకాలమందుష్ణమును ఉష్ణకాలమందు శీతమును గలుగఁజేయు పవిత్రంబగుభస్మంబు శరీరమందెల్లఁబూయుచు సాత్వికాహారంబుల భుజించుచు కాయశుద్ధియు గురుదేవతాభక్తియుఁ గలిగి పరిశుద్ధాంతఃకరణుఁడై మితాహార విహార నిద్రాజాగ్రత్తులుగలవాఁడై స్థిరాసనుఁడై మూలబంధ ఉడ్యాణ బంధ జాలంధర బంధములతోడ భూత్కార సీత్కార శీతల కేవలాద్యష్టవిధకుంభకములచేత ప్రాణవాయువు నిరోధనము చేసి కాయసిద్ధి సంపాదించి ఆకాశగమన దూరదృష్టి దూరశ్రవణ ఘుటికా పాదుకా సిద్ధులును అణిమాద్యష్ట సిద్ధులును స్వేచ్ఛా మరణాదులును గలిగియుండుట హఠయోగము. జ్ఞానయోగమనఁగ గురువుల వలన వేదాంత శాస్త్రవిషయములను పలుమాఱును శ్రవణముచేసి మనన నిదిధ్యాసములను గావించి వైరాగ్యోప శాంతి వివేకవృత్తులు గలిగి సదాపరబ్రహ్మపరోక్షవృత్తిచేత జీవన్ముక్తినిపొంది విదేహముక్తిపర్యంతము ప్రారబ్ధ మనుభవించు చుండుటే జ్ఞాన యోగము. ఇదే రాజయోగము. ఈమంత్రలయహఠరాజయోగములలో ఏయోగమునభ్యసింపఁ దలఁచినను వారిచేత యమ నియమ ఆసన ప్రాణాయామములు నాలుగును ముందుగ నభ్యసింపఁదగినవి. యివే పూర్వాంగములు. ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులు నాలుగును యోగపూర్తి యందు నభ్యసింపఁదగినవి. ఇవే ఉత్తరాంగములు. ఇట్టి పూర్వాంగములైన యమనియమ ఆసనప్రాణాయామములు నాల్గింటియందును యమము అహింస సత్యము అస్తేయము బ్రహ్మచర్యము అపరిగ్రహము అని యైదువిధములు.

అహింసా లక్షణము.

ఉత్సాహ॥ ఈరుపేనునల్లిచీమ యీఁగ మొదలుజంతులఁ । గ్రూర సర్పవృశ్చికాది గురువిష ప్రధావళిఁ । ఘోరమృగముల న్వధింపఁ గోరకునికినాగమో । క్తోరుహింససేయ రెండునొప్పు నాయహింసకున్ ॥ తా॥ ఈరుపేను నల్లి ఈఁగ చీమ లోనగు స్వల్పజంతువులను, క్రూరములైనపాములు తేళ్లుమండ్రగబ్బలు మొదలగువిషజంతువులను, భయంకరములైనశరభములు సింహములు ఏనుఁగులుపులులు చిఱుతపులులు అడవిపందులు మొదలగు మృగములను చంపక యుండుటయును, వేదోక్తములగు యజ్ఞములయందు పశువులఁ జంపుటయును, ఈరెండును అహింసయని తాత్పర్యము.

సత్య లక్షణము.

క॥ ఉన్నది కన్నదివిన్నది । యున్నట్లుగఁ బలుకుటయును నొరు నకునత్యా । పన్నత గలుగఁగఁ గల్లా । ఘోన్నతిగల కల్లమాటయును సత్యమగున్ ॥ తా॥ ఉన్నసంగతి యున్నట్టుగను, చూచినసంగతిచూచినట్టుగను, విన్నసంగతివిన్నట్టుగనుతప్పక చెప్పుటయును, ఒకనికిసంభవించిన ఆపదఁ దప్పి మేలు కలుగుటకై యాడిన కల్లమాటయును సత్యమేయగునని తాత్పర్యము.

అస్తేయ లక్షణము.

క॥ ప్రస్తుతిగ నెట్టిదశపర । వస్తువులం ద్రికరణములవర్జించుటకా । నస్తేయమనుచుఁ జెప్పుదు । రస్తమితాజ్ఞాన తంత్రులైన మునీంద్రుల్ ॥ తా॥ ఎట్టికష్టకాలమందయినను పరులసొమ్మునపహరింప మనసునఁ దలఁపక అపహరింపుమని నోటఁజెప్పక చేతముట్టకయుండుట అస్తేయమని తాత్పర్యము.

బ్రహ్మచర్య లక్షణము.

క॥ కాంతల నందఱ నామర । కాంతకముగఁ బరిహరించుటది మేలొండే । కాంతయునిజభార్యావ్రత । సంతుష్టినిజెంద బ్రహ్మచర్యంబ యగున్ ॥ తా॥ స్త్రీసంపర్కంబు స్మరణించుదనుక లేకయైనను ఋతుకాలములయందు తనభార్యంగలసి తనివి నొందుచు నున్ననయినను బ్రహ్మచర్యం బని తాత్పర్యము.

అపరిగ్రహ లక్షణము.

ఆ॥ దానపూర్వకంబుగా నెవ్వరేమైన । నొసఁగ సంగ్రహింపకునికి సత్క్రియా । తముగ శిష్యులొసఁగు ద్రవ్యంబుఁగొనుటయూ । ననఘ తద పరిగ్రహంబువత్స ॥ తా॥ ధనధాన్యాదులను దానపూర్వకంబుగ నెవ్వరిచ్చినను పుచ్చుకొనక శిష్యులిచ్చిన పుచ్చుకొనుట అపరిగ్రహమని తా.

శౌచ లక్షణము.

తే॥ శౌచములు రెండు తెఱఁగులై చనుఁ బ్రసిద్ధి । మృత్తికాజలములచేతమిఱియ బాహ్య । మమలినాభ్యంతరపు శౌచమనఁగ భావ । శుద్ధియనికదవచియింతురిద్ధమతులు ॥ తా॥ బాహ్యపరిశుద్ధమని ఆంతర పరిశుద్ధమని పరిశుద్ధము రెండువిధములు. వానిలో మృత్తికచేతను జలము చేతను చేయఁబడునది బాహ్యపరిశుద్ధము. కామక్రోధలోభమోహ మదమత్సర దంభములు మొదలైన దుర్గుణ సంఘములతోడను ఆణవ కార్మికమాయిక మాయేయతిరోధానము లనెడు పంచమలములతోడను కూడక మనస్సు నిర్మలమయి యుండుటే ఆంతర పరిశుద్ధమని విజ్ఞాన సంపన్నులగు పండితులు పల్కుదురని తాత్పర్యము.

త్రివిధ తపోలక్షణము.

శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞ పూజనంశౌచమార్జవం । బ్రహ్మచర్యమహింసాచ శారీరంతప ఉచ్యతే । అనుద్వేగకరం వాక్యం సత్యంప్రియ హితంచయత్ । స్వాధ్యాయాభ్యాసనంచైవ వాఙ్మయంతప ఉచ్యతే । మనఃప్రసాదసౌమ్యత్వంమౌనమాత్మవినిగ్రహః । భావసంసిద్ధిరిత్యేతత్తపోమానసముచ్యతే ॥ తా॥ దేవతలను బ్రాహ్మణులను గురువులను పండితులనుపూజించుటయును, బాహ్యపరిశుద్ధమును అణఁకువయును బ్రహ్మచర్యవ్రతమును అహింసయును గలిగియుండుట శరీరసంబంధమైనతపస్సు. మనోవేదన గలుగఁజేయనదిగాక సత్యమై వినసొంపై మేలుగలుగఁజేయనదియైయుండు మాటలాడుటయును, వేదమూల మంత్రములనుపఠించుటయును, వాక్సంబంధమయిన తపస్సు. మనస్సునకు సమాధానమయినమంచినడవడియును, వాఙ్నియమమును మనోనిగ్రహమును మనశ్శుద్ధిగలిగి యుండుటయును మనస్సంబంధమైన తపస్సు అనితాత్పర్యము ॥ క॥ మనమున వాక్కునఁ గాయం । బునఁ దలఁపులఁ బలుకులను బ్రబుద్ధతనుపదా । సనిరూఢి యిద్ధపూర్వో । క్తనియతిఁ బచరించుటిదియ తపమగుఁ జేర్మిన్.

సంతోష లక్షణము.

క॥ ఆపదలను శోభనముల । నాపకచనఁ జూచుచును స్వయం స్వాగతవి । త్తాపత్తినమదమందుట । దీపితసంతోషమని కథింతురు ప్రాజ్ఞుల్ ॥ తా॥ శుభాశుభకార్యములను నిలుపక తగినకాలముల

యందే జరపించుచు, పేరాశపడక తనకులభించిన ద్రవ్యముతోడనే తృప్తిపొందుట సంతోషమని తాత్పర్యము.

స్వాధ్యాయలక్షణము.

తే॥ మఱియు స్వాధ్యాయమనమూలమంత్రపఠన। మదివిచారింప వాచకమని యుపాంశు। వనియుమానసికంబనియనఘమూఁడు। దెఱఁగులయియుండుఁ దెలిపెదఁ దెలియవినుము॥ క॥ ఒరులు వినఁగొనుట వాచక। మొరులు వినకయుండఁగొనుటయు నుపాంశువన। క్షర విరళముఁగొనిమదిసంస్మరియించుటమానసికము స్వాధ్యాయముగుఁ॥ తే॥ అందువాచకజపమునకధికతరము। పాంశుజప మయ్యుపాంశుజపమునకధిక। తరముమానసజపముగు దానికధిక। తరము లేదని తెలియుమో ధర్మనిరత.

తా॥ స్వాధ్యాయము వాచకమని ఉపాంశువని మానసికమని మూఁడు విధములు. అందు అన్యునికి వినఁబడునట్లు పఠించుట వాచకము. అన్యునికి వినఁబడకుండునట్లు పఠించుట ఉపాంశువు. ప్రత్యక్షరమును విరళించి మనస్సునందే జపించుట మానసికము. వాచక జపమునకంటె ఉపాంశుజపము శ్రేష్ఠము, దానికంటె మానసికజపము శ్రేష్ఠతరమని తాత్పర్యము.

ఈశ్వరప్రణిధానలక్షణము.

సీ॥ కరణంబులఖిలోపకరణంబులును గాఁగఁ ప్రాణంబులుపచారభటులు గాఁగ। గంగాప్రముఖనాడికలు జలంబులు గాఁగ షట్కమలములుపుష్పములు గాఁగ। జఠరాగ్ని హోత్రముజ్జ్వలధూపముం గాఁగఁ బటుజీవకళలు దీపంబు గాఁగ। నందితానందంబు నైవేద్యముం గాఁగ రవిశశిజ్యోతులారతులు గాఁగ। నంగదేవాలయమున సహస్రకమల। పీఠమున శాంతిజనకజోపేతుఁడగుచుఁ। జెలఁగుపరమాత్మ రాము నర్చించుచుంట। తత్త్వవిదులీశ్వర ప్రణిధానమంద్రు॥

తా॥ జ్ఞానేంద్రియములను కర్మేంద్రియములను అంతరింద్రియములను పూజాపాత్రములుగాను, దశవిధ ప్రాణములు పనివాండ్రుగాను, గంగా యమునా సరస్వత్యాది నామములుగల ఇడ పింగళ సుషుమ్న మొదలగు నాడులు అభిషేకాది జలములుగాను, ఆధారాది షట్కమలములు పుష్పములుగాను, జఠరాగ్ని ధూపముగాను, జీవకళలు దీపములుగాను, బ్రహ్మానందము నైవేద్యముగాను, సూర్యచంద్రమండల జ్యోతులు హారతులుగాను, శరీరమనెడు దేవాలయమందలి సహస్రారకమలమనెడు సింహాసనమునందు శాంతియనెడు సీతతోఁ గూడిన పరబ్రహ్మమగు శ్రీరాముని నెల్లప్పుడు పూజించుచుండుటయే యీశ్వరప్రణిధానమని బ్రహ్మవాదులైన పెద్దలు పలుకుదురని తా.

యోగాసనముల లక్షణములు వీరాసనము.

క॥ ఒకతొడపై నొకపాదము। నొకపాదముమీఁదఁ దొడయు నునిచి శరీరం। బకుటిలగతినిల్పినఁద। క్కకయది వీరాసనంబు కైవడి యయ్యెన్.

తా॥ ఒకతొడమీఁద నొకపాదమును, మఱియొక పాదముమీఁద తక్కినతొడయుఁ జేర్చి శరీరమవక్రముగ నిల్పినేని వీరాసన మనుట.

స్వస్తికాసనము.

క॥ పిక్కలతొడలనడుమలం। దొక్కటఁ బదతలము నిడి సమన్నతినొడలిన్। నిక్కించిన నీయాసన। మక్కజముగ స్వస్తికాహ్వయంబగు జగతిన్॥

తా॥ జంఘోరువులనడుమ పాదములఁ జొనిపి శరీరము చక్కఁగ నిక్కించెనేని స్వస్తికాసన మనుట.

పద్మాసనము.

శా॥ వామాంకంబున దక్షిణాంఘ్రియును దద్వామేతరాంకంబునన్ వామాంఘ్రిన్ ఘటియించి పశ్చిమదిశావ్యాప్తంబులౌ చేతులన్। నేమంబారఁగఁ గాళ్ళయంగుళములం జేకొన్నఁ బద్మాసనం। బౌ ముక్కుంగొనఁ జూపునుం జుబుకవృద్వ్యాసంగముం గ్లినన్.

తా॥ ఎడమతొడమీఁద కుడిపాదమును కుడితొడపైని ఎడమపాదమునునిచి వెనుకప్రక్కగ కుడిచేత ఎడమతొడమీఁదనున్న కుడికాలి పెద్దవ్రేలును ఎడమచేత కుడితొడమీఁద నున్న యెడమకాలి బొటనవ్రేలును పట్టుకొని ఱొమ్మున గడ్డముంచి భ్రూమధ్యమందు దృష్టి నిలిపెనేని పద్మాసన మనుట.

మతాంతర పద్మాసనము.

సీ॥ అజపద్మబంధంబ యగునైన నుత్తాన చరణంబు లూరు సంస్థములు గాఁగ। నూరుమధ్యంబున నుత్తానకరతలద్వయమును రాజదంతములమొదల। హత్తియుండెడి రసనాగ్రంబుఁ దొంటిభాతినయున్న చుబుకంబు దృష్టిగలిగి। మారుతంబల్లనఁ బూరించుచుండిన నదిపద్మమగు మతాంతరము నందు। మఱినిదియు మత్స్యమతము పద్మమునఁ బూర్వ। మట్లయుండుచు సంస్ఫుటహస్తయుగ్మ। మునగు దాకుంచనముఁ జలదనిలపూరి। తము విసర్జనవిధియు ధ్యానమునువలయు.

తా॥ ఎడమతొడపయిని కుడిపాదమును, కుడితొడపైని ఎడమపాదమును వెలికిలనుంచి, హస్తములు రెండుతొడలపై వెలికిలనుంచి, నాసాగ్రమందు లక్ష్యముంచి, దంతమూలమున నాలుక హత్తించి, వక్షమందు గడ్డంబుంచి మెల్లమెల్లగ వాయువును పూరించుచుండెనేని మతాంతర పద్మాసన మగును. మఱియు మునుపటివలె పద్మాసనమందుండి, చుబుకంబు వక్షంబున హత్తించి, చిత్తంబునందు ధ్యానము చేయుచు, నపానవాయువునూర్ధ్వముగా రేచించి కుండలీశక్తియుక్తముగ నిలిపి, ప్రాణవాయువును విడువఁగా నధిక జ్ఞానబోధ గలుగును. దీనిచేత నాడీద్వారమందు గాలినిల్చును. ఇట్లు మృతులగువారు ముక్తులగుదురు ఇదే బద్ధపద్మాసనము. ఇదే ముక్తపద్మాసనము.

యోగాసనము.

క॥ యోగపటజానుయుగసం। యోగంబునఁ బదతలంబులుర్విని నిలిపి లోఁ। సిగినకరములనుండిన। యోగాసనమండ్రు దీని యోగవిధిజ్ఞుల్.

తా॥ హంసదండము మోకాళ్ళక్రిందనుంచుకొని, పాదములనేలపై నిలిపి, తొడలనడుమ చేతులఁ జొనిపి పిక్కలఁ బట్టుకొని ఆత్మావలోకనముఁ జేయుచుండెనేని యోగశాస్త్రవేదులు దీనిని యోగాసనమందురని తాత్పర్యము.

కూర్మాసనము.

క॥ వీడఁబడిన గుల్ఫంబులఁ। గూడఁగ సంధించిపట్టి గుదముల వడఁగాఁ। బీడించినఁ గూర్మాసన। మీడితమతి నెఱుఁగుదురు యమీంద్రులు దీనిన్.

తా॥ ఆధారమునకు నుభయపార్శ్వములయందు రెండుకాళ్ళమడమలు హత్తించి నిక్కి చక్కఁగాఁ గూర్చుండెనేని కూర్మాసనమని తా.

ఉత్థాన కూర్మాసనము.

తే॥ కుక్కుటాసన బంధంబుఁ గూర్చినట్టి। కరయుగంబుల మెల్లనఁ

గంధరంబు। బంధనముఁ జేసి వెలికిలఁబడినకూర్మ। మట్లువడఁగనుత్థాన కూర్మాసనంబు.

తా॥ కుక్కుటాసనస్థుఁడైయుండి రెండుచేతులతో కంఠముపట్టు, కొని కూర్మమువలె వెలికిలఁబడియుండెనేని ఉత్థానకూర్మాసనమనుట.

### భద్రాసనము.

తే॥ అండములక్రింది నెలవులయందునుభయ। పార్శ్వములురాయ రెండుగుల్ఫములఁబెట్టి। పార్ష్ణిపదములఁగరములఁబట్టి నిశ్చ। లాత్ముఁడై యుండెనేని భద్రాసనంబు.

తా॥ అండములకు క్రిందిప్రక్కలయందుచీలమండల నునిచ్చిమడిమల రెంటిని రెండుచేతులఁబట్టి కదలకుండిన భద్రాసనమనుట. యీయాసనస్థుఁ డగువాఁడు సర్వవిషములను వ్యాధులను జయించును.

క॥ భాసురపద్మాసనసి। ద్ధాసనములువరములఁట గృహస్థులకుం బ। ద్మాసనమే మేలగుసి। ద్ధాసనము గృహస్థవర్తనాతీతులకున్.

తా॥ గృహస్థాశ్రమస్థులు పద్మాసన సిద్ధాసనస్థులై యుండుట యుత్తమమైనను గృహస్థులకుఁ బద్మాసనమును తక్కిన యాశ్రమస్థులకు సిద్ధాసనమును మేలనుట.

### సిద్ధాసనము.

శా॥ యోనిస్థానముఁబార్ష్ణి భాగఘటనాయుక్తిన్నిబంధించుచున్ దానన్మేఢ్రముమీఁద నొండనొకపాదంబూన సిద్ధాసనం। బౌనందింద్రియనిగ్రహంబును సుదేహస్థాణుభావంబుయో। గానందైక మనంబు భ్రూయుగళ మధ్యాలోకముంగల్గినన్.

తా॥ ఎడమకాలి మడిమ మూలాధారమందును, కుడికాలిమడిమ లింగస్థానమందును ఉంచి శిరోగ్రీవభుజములను చక్కఁగానిక్కించి భ్రూమధ్యావలోకనముఁ జేయుచుండిన సిద్ధాసనమగును. దీనిచేత ఇంద్రియనిగ్రహము శరీరపాటవము నిర్మలచిత్తవృత్తి గలుగును.

### మతాంతరసిద్ధాసనము.

క॥ వెండియునుసవ్యగుల్ఫము। దండముపైఁ బెట్టిక్రిందదక్షిణగుల్ఫం। బుండఁగనవక్రముగఁగూ। ర్చుండిన సిద్ధాసనంబయాఁబక్షమునన్.

తా॥ లింగముమీఁద ఎడమ మడమనుంచి, దానిపై కుడిమడమనుంచి ముందువలె నాసాగ్రమువీక్షించుచుండెనేని యిదిమతాంతర సిద్ధాసనమనుట. దీనినివజ్రాసనమని ముక్తాసనమని గుప్తాసనమని బహువిధములఁ జెప్పుదురు ఇదిసకలాసనములలో మేలయినది, ముక్తిద్వారకవాట పాటనపటువైనది.

### సింహాసనము.

శా॥ అండాధస్థలి నూరుపార్శ్వముల సవ్యాసవ్య గుల్ఫద్వయం। బొండొంటింగ్రమహీనభంగి నిడిదోర్యుగ్మాంగుళుల్జానులం। దుండన్ప్రసరించినిక్కి వివృతాస్యుండైన సింహాసనం। బొండేమింగనఁ బోక నాసికముఁదానొలిం బరీక్షింపఁగన్.

తా॥ అండములక్రింది నెలవులయందు తొడలవెనుక భాగములు సోఁకునట్లు కుడియెడమ మడిమలమార్చియుంచి కుడి యెడమచేతుల వ్రేళ్లను మోకాళ్లమీఁదసవ్యంబుగ వెడల్పుగనుంచి నిక్కికూర్చుండి నోరుఁ దెఱచికొని భ్రూమధ్యమందలి చిద్బిందువును తిలకించుచున్న సింహాసనమనుట.

### కుక్కుటాసనము.

క॥ జలజాసనంబునంగర। ములు జానూరువులమధ్యమునఁ జొనిపి ధరన్। నిలిపి గగనమున నంగం। బులవడ నిలుపంగఁ గుక్కుటాసనమయ్యెన్.

తా॥ పద్మాసనమున నుండి మోకాళ్ల తొడల సందుల చేతులఁ దూర్చి హస్తముల నేలనూని పైకెగసినట్లుండిన కుక్కుటాసనమనుట.

### గోముఖాసనము.

క॥ వామదిశపృష్ఠపార్శ్వము। ధామముగాదక్షగుల్ఫతలమునునట్లు। వ్వామపుగుల్ఫమువలనిడ। గోముఖ మీయాసనంబు గోముఖభాతిన్.

తా॥ ఎడమకాలిమడిమ కుడివీఁపుప్రక్కగాను, కుడికాలిమడిమ ఎడమవీఁపు వైపుగాను, మోకాలిమీఁద మోకాలు గదియనుంచి, ఒడలు చక్కఁగ నిక్కించి భ్రూమధ్యావలోకనము చేయుచుండెనేని గోముఖాసనం బగును.

### ధనురాసనము.

క॥ మనుపాదాంగుష్ఠంబులు। దనచేతులు చెవులదాక ధనువ్వదివియున। య్యనువున నెడమఁగుడిఁదివియు। ధనురాసన మండ్రు యోగతత్త్వవిధిజ్ఞుల్.

తా॥ పాదాంగుష్ఠముల రెంటిని రెండు చేతులను ధనురాకృతిగ వీఁపువెనుక చెవులకు సరిగాఁ బట్టియుండిన ధనురాసనం బగును.

### మయూరాసనము.

మహాస్రగ్ధర॥ ధరణిన్హస్తస్థలంబుల్దగులనిలుప్పచున్దండముంబోలెఁ దత్కూ। ర్పరయుగ్మన్యస్తనాభీభవనతలయుగో ద్భాసియైయున్నతాస్య। స్థిరుఁడైయాకాశదేశ స్థితినిలిచినదా శ్రీమయూరాసనంబా। హరియించున్రోగదోషాత్యశన విష సమూహంబులన్రంహయుక్తిన్.

తా॥ చేతుల నేలనూని మోచేతులనాభియిరుప్రక్కలనుంచి ముఖముపైకెత్తికాళ్లుచాఁచి నెమలితోఁకవలెపైకెత్తినమయూరాసనమగును. దీనిచేతనుదరగుల్మాది రోగములు సర్వపాపములు వేగముగా నశించును. జఠరాగ్ని ప్రజ్వరిల్లి విషమునైన జీర్ణింపఁజేయును.

### కపాలాసనము.

సీ॥ ఊర్ధ్వసంస్థితనాభియునధస్తాలువునూర్ధ్వభానుఁడునధోయుక్తశశియు। నూర్ధ్వపాదంబులునాగినధశ్శిరమును గలయదివిపరీతకరణసంజ్ఞ। గలకపాలాసనక్రమమయ్యెగురువాక్యమున నిది సిద్ధించుజనులకెలమి। నిత్యంబునభ్యాసనిరతునకీ కపాలాసనంబఖిలరోగాళిఁ జెఱుచు। జఠరవహ్ని వర్ధిలఁజేయు జగతినట్టి। సాధకునకు నాహారంబు సంగ్రహింప। జనుబహుళముగ నల్పభోజనముచేత। ననిలవేగంబు విడిపించునతనితనువు॥ ఈయాసనమును ప్రతిదినము యామమాత్రమభ్యాసము చేయుచుండిన మూఁడునెలలకు పిదప వలిపలితవిరహితాంగుఁడును మృత్యుంజయుఁడునగును. శ్లో॥ నాభిస్థానేవసేదగ్నిః హృదిస్థానే దివాకరః। భ్రూమధ్యేవసతిశ్చంద్రః చంద్రాగ్రేచ వసేన్మనః॥ తా॥ తలక్రిందుగనిలిచి భ్రూమధ్యమందలి చిద్బిందువును జూచుచుండెనేని కపాలాసనము.

### ముక్తాసనము.

క॥ పదగుల్ఫంబున గుదముం। గదియంగానిల్పి యంకగతమైయుండం। బదమొకటిసంఘటించిన। నదిముక్తాసనమవక్రమగుచునమరున్॥

తా॥ ఎడమకాలి మడిమచేత మూలాధారము గప్పి, కుడియడుగును ఎడమతొడమీఁదనుంచిన నది ముక్తాసనమగును.

ఉ ట్టి భా స న ము.

క॥ వెలికిలఁజరణతలంబులు। దలమీఁదం జేర్చి ధరణీతలమున నిలుపం। గలిగెడునట్లుగఁ గరములు। నలపశ్చిమమెత్త ఉట్టిభాసనమయ్యెన్॥

తా॥ పాదములు వెలికలనుండ సిరస్సుపైఁ గదయించి చేతులతో పూనికగా నిలిచి వెనుకటిభాగము పైకెత్తఁగాఁ ఉట్టిభాసనమగును.

పశ్చిమతాణువాసనము.

చ॥ పదములభూమిదండములభాతిగఁ జాఁచి కరాంగుళంబులన్। బదయుగళాగ్రము ల్బిగియఁబట్టి లలాటము జానుయుగ్మముం। బదిలముగా ఘటింపనిది పశ్చిమతానము దీనరోగముల్। గదియవు పశ్చిమంబునను గాలియగున్ జఠరాగ్నికార్శ్యముల్॥

తా॥ నేలమీఁద రెండుకాళ్లు చక్కఁగాఁ జాఁచి రెండుకాళ్ల బొటనవ్రేళ్లు రెండుచేతులఁబట్టుకొని మోకాళ్లమీఁద లలాటంబుంచె నేని పశ్చిమతాణువాసనము. ఇందున వాయువు పశ్చిమమార్గముగా నడుచుట వలన జఠరాగ్ని ప్రజ్వరిల్లి కడుపు పల్చనై రోగములు నశించు ననుట.

పూర్వతాణువాసనము.

తే॥ పదుసమీగాళ్లు నేలమోవంగ మడిచి। మడిమలును బిఱుఁదులనుగూర్చి మస్తకంబు। నడుముఁ గరకూర్పరంబుల నదిమిమోపి। నడుమెగయనున్నఁ బూర్వతానంబటండ్రు॥

తా॥ కాలివ్రేళ్లు మడిచి భూమిమీఁదనిల్పి, మడమలును పిఱుఁదులను జేర్చి శిరస్సును చేతులతోడ నడుము మోచేతులతోడ నదిమి పట్టుకొని నడుము నిక్కించిన పూర్వతాణువాసనమనుట.

అ ర్భ కా స న ము.

మ॥ పదతలముల్ధరాతలముపైఁ గడుఁ డగ్గఱ నిల్పి లోతొడల్। గదిసిన జంఘలు న్మతిలలాటము మోపిన జానుయుగ్మమున్। బ్రిదులక యుండు హస్తపరిపీడితజానువుగల్గి యుండెనే। నిదియగు నర్భకాసనము హీనసుఖాస్పదమండ్రు సంయముల్॥

తా॥ పిఱుఁదులు క్రింద మోపియైనను మోపకయైనను గొంతు గూర్చుండి మోకాళ్లమీఁద శిరమునుంచుకొని మోకాళ్లను చేతులతోఁ జుట్టి పట్టుకొనె నేని అర్భకాసనము. అదియత్యంతసుఖాస్పదమనుట.

కామదహనాసనము.

చ॥ అవనితలంబుఁ బొందఁగఁ బదాంగుళమూలములొల్ల నిల్పి జా। నువులు నభస్థలంబునన నూల్కొనఁ బార్ష్ణియుగంబు యోనియన్। దవులఁగ యోగదండఘటనాస్థితి హస్తతలంబులుండెనే। నవిరళమైన కామదహనాసనమండ్రిది యోగతత్పరుల్॥

తా॥ మునివ్రేళ్లు నేలమీఁదనిల్పి మోకాళ్లు క్రిందమోపక పిఱుఁదులు మడిమలు నాటియుండునట్లుండి హంసదండముల మీఁదఁ జేతులునూని నిక్కి భ్రూమధ్యావలోకనము చేయుచున్న యోగశాస్త్రవేదులు కామదహనాసనమని పల్కుదురనుట.

ప్రాణాయామలక్షణము.

తే॥ ప్రణవపంచాక్షరాష్టాక్షరాదికముల। మాత్రగాఁ జేసి పూరకమాత్రలకును। రెట్టికుంభకమున నిల్పి రేచకంబు। నాడిశోధనమట్లు చేయంగవలయు॥ తే॥ సోముదెసఁ గాలిఁగొనుచు సుషుమ్నఁ బట్టి। సూర్యుదెస విడి క్రమ్మర సూర్యువలని। పింగళంబునఁ గొనిపట్టి విడువ నిగుడ విడువవలయు యథాశక్తిని దుగక్షపుడు॥ ఓంకారము పంచాక్షరము అష్టాక్షరము మొదలగు మంత్రములలో ఒక్క మంత్రమును ఒక్కమాత్రగాఁ జేసి పూరకమందు నిర్ణయములగు మాత్రలకంటె రెట్టిగా కుంభకమునందు నిలిపి రేచకమునందు పూరకమందలి మాత్రలలో సగము నిర్ణయించి సుషుమ్నానాడి యందలి యంతలఁ జూడవలయును. మఱియు ఎడమముక్కున ప్రాణవాయువును పూరించి సుషుమ్న యందు నిల్పి కుడిముక్కున విడిచి మరల కుడిముక్కున పూరించి సుషుమ్నయందు నిల్పి యెడమముక్కున విడుచుచు నీతీరున నెల్లప్పుడు యథాశక్తిగ ప్రాణాయామము చేయుచు నుండవలయు ననుట. యీ ప్రాణాయామము ప్రాకృతమని వైకృతమని కుంభకమని త్రివిధము. అందు నేటిదినము సూర్యోదయము మొదలు రేపటిదినము సూర్యోదయము వఱకు మూలాధారకమలంబున గణపతికి ఆఱునూఱును, స్వాధిష్ఠానకమలమున బ్రహ్మకు ఆఱువేలును, మణిపూరకమలంబున విష్ణుదేవునకు ఆఱువేలును, అనాహతకమలంబున రుద్రునకు ఆఱువేలును, విశుద్ధకమలంబున నీశ్వరునకు సహస్రంబును, ఆజ్ఞేయకమలంబున సదాశివునకు సహస్రంబును, సహస్రారంబున గురువునకు సహస్రంబును, అజపా గాయత్రీ మంత్రజపము సమర్పించుటే ప్రాకృత ప్రాణాయామము. రేచక పూరక కుంభక క్రమములచేత తొలుత అథస్సంచారముగల ప్రాణ వాయువునందు ఊర్ధ్వ సంచారముగల అపానమును, వెనుక అపానమందు ప్రాణమును చేర్చుట వైకృతప్రాణాయామము. మూలబంధ ఉడ్యాణబంధ జాలంధర బంధములఁ గావించి రేచకపూరకములను నిలిపి ప్రాణాపానములను రెంటిని రేపగలొక్కపక్కిఁగ నిలుపుట కుంభకప్రాణాయామము. రేచకమనఁగ ప్రాణవాయువును మూలాధారమునుండి బ్రహ్మరంధ్ర పర్యంతము సుషుమ్నానాళ ద్వారముగ నుత్థాపనము చేయుట. పూరకమనఁగ బ్రహ్మరంధ్ర పర్యంతము రేచించిన వాయువును మరల సుషుమ్నానాళ ద్వారముగ మూలాధారమునఁ జేర్చుట. కుంభకమనఁగ రేచించిన వాయువును బ్రహ్మరంధ్రమందు మాత్రాసంఖ్యగ నిలుపుట. ఇదే యూర్ధ్వకుంభకము. పూరించిన వాయువును మాత్రాసంఖ్యగ మూలాధారమున నిలుపుట అథోకుంభకము.

మూలబంధమనఁగ ఎడమమడిమచేత గుదస్థానమును బంధించుట.

ఉడ్యాణబంధమనఁగ కుడిమడిమచేత బొడ్డును మూయుట.

జాలంధరబంధమనఁగ గడ్డము ఱొమ్మునందుంచుట.

మఱియొకవిధమగు ప్రాణాయామము. కుడిముక్కు ఇడ యిదే సూర్యనాడి, యెడమముక్కు పింగళ యిదే చంద్రనాడి, వీనియందు సంచరించు ప్రాణవాయువును బ్రహ్మబీజమైన ప్రణవమందలి అకార ఉకార మకారములను మూటిని మూఁడుమాత్రలనుగాఁ జేసికొని వానిలో అకారముచేత సూర్యనాడిని పన్నెండుమాత్రల కాలమున, మకారముచేత చంద్రనాడిని పదియాఱుమాత్రలకాలమున పూరించి, ఉకారముచేత రెండునాడులను చేర్చి, పదిమాత్రలకాలము సుషుమ్నయందు కుంభించి, పిదప నడినాళముచేత క్రమముగా పూరించుట ప్రాణాయామము. ఇట్లు బాల కౌమార యౌవన వృద్ధ నిష్కళ లనెడు పేళ్లుగల ప్రాతఃకాలము మధ్యాహ్నకాలము సాయంకాలము అర్థరాత్రకాలము వీనియందు ప్రతిదినమును ప్రతివేళను ఇరువదిమార్లు

తప్పక ప్రాణాయామము చేయుచుండెనేని వాయువుస్థిరపడి వెనుక కేవలకుంభకమునకు మార్గమగును. ఈప్రాణాయామ లక్షణములనేక విధములుగనుండును గావునగురూపదేశమునఁ దెలిసికొనవలయును.

### ప్రత్యాహారలక్షణము.

వర్ణరూప ధ్వనిరూపములైన సకలశబ్దములనువినుట, మృదువుకఠినము ఉష్ణము శీతము మొదలగు స్పర్శములను తెలిసికొనుట. పొట్టి పొడుగు లావు సన్నము నలుపు తెలుపు పసుపు ఎఱుపు ఆకుపచ్చ మిశ్రములని పదివిధములైన రూపములను జూచుట. ఉప్పు పులుసు కారము తీపు చేదు వగరు అను షడ్రసములను ఎఱుఁగుట, సుగంధము దుర్గంధము మిశ్రగంధములను మూరుకొనుట, సుశబ్దములను అపశబ్దములను పలుకుట, ఇచ్చుట పుచ్చుకొనుట లోనగు పనులను జేయుట, నడుచుట ఎగురుట పరుగెత్తుట మొదలగు పనులనుగావించుట, మలవిసర్జనముచేయుట, సురతాదులచేత ఆనందించుట, సంశయించుట, నిశ్చయించుట, చంచలించుట, అభిమానించుట, అను గుణములనుండి శ్రోత్రము త్వక్కు చక్షువుజిహ్వ ఘ్రాణమువాక్కు హస్తము పాదము పాయువు గుహ్యము అనెడు పదునాలుగింద్రియములను త్రిప్పుట ప్రత్యాహారము.

### ధ్యానలక్షణము.

ధ్యానము సగుణధ్యానము నిర్గుణధ్యానము అని రెండువిధములు అందు హృదయపద్మమందుతటస్థలక్షణస్వరూపుఁడైనవిరాట్పురుషుని నిలిపిమనస్సుచేత సమస్తవస్తువులనుగల్పించి షోడశోపచారములను జేసి ధ్యానించుటయేసగుణధ్యానము. పద్మాసనంబుననుండిశరీరంబు నిక్కించిహస్తంబులనుతొడలపైనుంచినేత్రంబులనుమూసిస్థూలసూక్ష్మకారణశరీరములునుపదునాలుగింద్రియములునుదశవిధప్రాణంబులును దృశ్యములుఆదేహేంద్రియప్రాణంబులు నేఁగానువీనినివీక్షించుసాక్షిని. సాక్షినినేననెడువృత్తియునుదృశ్యమేగనుకఆవృత్తినిజూచుసాక్షినిఅనిమాయాకల్పితములైవిజాతీయములగుయుష్మత్ప్రతీతి ప్రత్యయగోచరాదులనెడుబహిర్దృశ్యములను, సజాతీయములగు అస్మత్ప్రతీతి ప్రత్యయగోచరాదులనెడి యాంతరదృశ్యములను ఆదృశ్యములకుసాక్షిననెడువృత్తిని నిషేధించుచు సత్యజ్ఞానానంద నిర్మలాఖండ స్వరూపమై సర్వదృక్కగు పరబ్రహ్మము తాననెడు దృఢముగలుగుదాఁకనెల్లప్పుడునిర్వికల్పబ్రహ్మనిష్ఠగలిగియుండుటేనిర్గుణధ్యానము.

### ధారణాలక్షణము.

మూలాధారము స్వాధిష్ఠానము మణిపూరము అనాహతము విశుద్ధము ఆజ్ఞేయము సహస్రారము అనెడు కమలములయందు వానికినధిదేవతలయిన గణపతి బ్రహ్మవిష్ణు రుద్ర ఈశ్వర సదాశివ గురువులను అక్కడక్కడ ధ్యానించునపుడు మనస్సును నిలుపుటే ధారణ.

### సమాధిలక్షణము.

శ్లో॥ సవికల్పోనిర్వికల్ప స్సమాధిర్ద్వివిధాభవేత్। దృశ్యశబ్దానువిద్ధోయంసవికల్పఃపునర్ద్విధా॥ తా॥ సమాధిసవికల్పకమనినిర్వికల్పకమని ద్వివిధముఅందుసవికల్పకముదృశ్యానువిద్ధసవికల్పకమనిశబ్దానువిద్ధసవికల్పకమనియిరుతెఱఁగులుగలదగును, ఈరెంటనునిర్వికల్పమొక్కటియనుగూడి మూడువిధములయ్యెను. ఈమూడును బాహ్యాంతర భేదములచేత బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకసమాధియని, బాహ్యశబ్దానువిద్ధసవికల్పక సమాధియని, బాహ్యనిర్వికల్పకసమాధియని, ఆంతరదృశ్యానువిద్ధసవికల్పకసమాధియని, ఆంతరశబ్దానువిద్ధసవికల్పకసమాధియని, ఆంతరనిర్వికల్పకసమాధియని ఆఱువిధములు. అందు తనకంటె నన్యములుగతోఁచెడు బ్రహ్మవిష్ణు రుద్రేశ్వర సదాశివాది పిపీలికాంతమగుసమస్తచేతనములును, తృణాది మేరుపర్యంతమగుఅచేతనములును తనతెలివియందుఁబుట్టిగిట్టునవికాఁబట్టి అవితన ప్రజ్ఞానకల్పితములని ఆప్రజ్ఞానమే పరబ్రహ్మమని ఆపరబ్రహ్మమేతానని చూచుట బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకసమాధి. శివరామగోవిందనారాయణ వాసుదేవమహాదేవాది సకలనామములలో తనచెవికి వినఁబడిన నామము తానుగానవిడిచిసర్వనామవిలక్షణమైన పరబ్రహ్మవస్తువునుఁదలంచుటే బాహ్యశబ్దానువిద్ధసవికల్పకసమాధి. కామాదిస్వజ్ఞప్తిపర్యంతముఁగలవృత్తులు తనయందుఁ గలిగినప్పుడు వానినన్నింటిని అప్పుడప్పుడు ఒక్కటొక్కటిని క్రమముగా నేనుగానని నిగ్రహించి వీనికన్నిటికిని విలక్షణమైనపరబ్రహ్మమును భావించుటే ఆంతర దృశ్యానువిద్ధసవికల్పకసమాధి. రాగద్వేష కామక్రోధలోభ మోహ మద మత్సర ఈర్ష్య అసూయదర్ప అహంకారాది స్వజ్ఞప్తిపర్యంతమైన సకలాంతర వస్తునామములను నేనుగానవిడిచి సర్వవిలక్షణమైన పరమాత్మనూహించుటే ఆంతరశబ్దానువిద్ధసవికల్పకసమాధి. ఈచతుర్విధసవికల్పకసమాధులయందుసుస్థిరతగలిగి ఆంతరబాహ్యములయందుతనకునన్యమేమియు తోఁచక. తోఁచినను సముద్రమందు మునిచిన కుండ లోపలవెలుపల పరిపూర్ణమై ఆకాశమందుంచినకుండ లోపలవెలుపల శూన్యమైనట్లుండుటే బాహ్యనిర్వికల్పకసమాధి. పైనిచెప్పిన వృత్తులేవియులేక అఖండ పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపమైయుండుటే ఆంతర నిర్వికల్పకసమాధి. ఆ॥ ఎదుటఁగానుపించునెల్ల చిదాభాస। కళలుతనకు వేఱుగావటంచుఁ। దెలియుతెలివినెపుడుఁ దెలియుట బాహ్యదృ। శ్యానువిద్ధమనఁగ నలరువత్స॥ క॥ అంతరమగుద్విదళంబున। వింతగఁజాపట్టుకళల వీక్షించుచుఁదా। సంతసమందుచునుండుట। యంతరదృశ్యానువిద్ధమనఁబడుసుమతీ॥ తే॥ బాహ్యమునఁజెక్కు గావినఁబడెడి శబ్ద। తతులఁదెలిసెడు తెలివియె తానటంచుఁ। దెలిసియానంద రసమునఁ దేలుచుంట। బాహ్యశబ్దానువిద్ధమైపరఁగువత్స॥ క॥ అంతర్హృదయ నభంబున। సంతతమొగి మ్రోయు ప్రణవశబ్దంబుల నా। ద్యంతమువిను తనుఁ దెలియుట। యాంతరశబ్దానువిద్ధ మనఁబడుఁబుత్రా॥ ఆ॥ బాహ్యదృశ్యశబ్దపటలంబుఁగను నాత్ముఁ। గనుటబాహ్య నిర్వికల్పమాంత। రస్థదృశ్యశబ్దరాశిఁగన్గొను నాత్ముఁ। గనుటలోని నిర్వికల్పమనఘ.

### పంచదశయోగాంగముల వివరణము.

యమము నియమము త్యాగము మౌనము దేశము కాలము ఆసనము మూలబంధము దేహసామ్యము దృక్స్థితి ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానముధారణ సమాధి అని నిర్గుణయోగాంగములు పదియయిదువిధములు.

### యమలక్షణము.

పంచభూతములు త్రిశరీరములు అనెడు బాహ్యదృశ్యములును, చతుర్దశేంద్రియములు దశవిధప్రాణములు అనెడి ఆంతరదృశ్యములునుపరబ్రహ్మమేయనియును, ఆపరబ్రహ్మమేతాననియును తలఁచి వికల్పములేకయుండుటే యమము.

### నియమలక్షణము.

వర్ణరూప ధ్వని రూపములయిన సర్వ శబ్దములను చెవిలోవినుచు, మృదువు కఠినము వేఁడిమి చల్లన మొదలగు స్పర్శములను చర్మముచేత

గ్రహించుచు, దశవిధరూపములను కంటితోఁ జూచుచు, షడ్రసములను నాలుకచేతఁ దెలిసికొనుచు, సుగంధదుర్గంధ మిశ్రగంధములను ముక్కుచేత నాఘ్రాణించుచు, సుశబ్దాపశబ్దములను నోటఁ బలుకుచు దానప్రతిగ్రహాదిసర్వకార్యములను హస్తములతోఁ జేయుచు పాదములతో నడుచుచు నాలుగువర్ణములకు నాలుగాశ్రమములకు తగిన పనుల నెల్లప్పుడుఁ జేయుచు అంతఃకరణముచేత ఇహపరవిషయములనూహించుచు, తిరుగు నెడల కన్ను చెవి మొదలయిన యింద్రియములతో ఈయీయింద్రియములు చూచుట వినుట లోనగు విషయములతో ఈయీవిషయములనంటి పడుచున్నవి. నేనీయింద్రియములను శబ్దాదియ విషయములను సాక్షినైయీక్షించువాఁడను. సచ్చిదానంద స్వరూపుఁడను. త్రిగుణసంబంధములయిన శాంతఘోరమూఢవృత్తులును, బ్రాహ్మణాదిజాతులును, దీర్ఘహ్రస్వస్థూలసూక్ష్మాదిరూపములును, శివ రామ గోవింద నారాయణ మహాదేవాది నామములును లేనివాఁడను అనియెఱిఁగి యెల్లప్పుడుల్లాసముతో తన్ను తాను వీక్షింపుచు ఈనేమమును వదలకయుండుటే నియమము.

త్యాగలక్షణము.

నేను ప్రత్యగాత్మస్వరూపుఁడను, శరీరేంద్రియ మనఃప్రాణాదులు నేఁగానని వానియందభిమానము వదలుటయే త్యాగము.

మౌనలక్షణము.

యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ అను శ్రుతిచేత వాక్కువలన ఇట్టిది అట్టిది అనిపలుకరాక, మనస్సుచేత ఇట్టిది అట్టిది అనియూహింపరాక వెలుఁగు పరమాత్మ తానై మితముగ సంభాషించుచు సంభాషించినమాట లివియని జ్ఞప్తియుంచక, నిస్సంకల్పుఁడై యెల్లప్పుడు బ్రహ్మానందామృతము ననుభవించుచునుండుటయే మౌనము.

దేశలక్షణము.

ఆత్మానాత్మజ్ఞానము గల పండితులచేతను, గురూపదేశము చేతను, తెలిసికొనఁబడునదియై, జ్ఞానభూముల నేడింటి నిమీఱినదై, అంతరింద్రియ జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రాణ అవ్యక్తమహదాదుల ప్రవర్తనములును, కామ క్రోధ లోభ మోహ మద మత్సర భయసుఖదుఃఖ జనన మరణాదులును, ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికము లనెడు త్రితాపములును, కామక్రోధాది షడ్రశత్రువుల బాధలును లేక, కాలత్రయమందుఁ గలదై నిర్మలమై అప్రాకృతమై సర్వశ్రేష్ఠమై నిరతిశయానందస్వరూపమై మెఱయు పరబ్రహ్మమే యేకాంతదేశము. ఆస్థలంబున నివసించు భక్తుఁడు జీవన్ముక్తుఁడై ఆనందయుక్తుఁడగును.

కాలలక్షణము.

అఖండమైన కాలమును చిగుళ్లు ఆకులు మొగ్గలు పూలు పిందెలు కాయలు పండ్లు మొదలగువాని యుత్పత్తి స్థితి లయములకు సాధనముగ విభాగించుచు, పంచకర్తల యుత్పత్తిస్థితిలయములకు ముందును వెనుకను వృద్ధిక్షీణములులేక ఒక్కతీరుగ వెలుఁగుచు, కాలనియమము లేక ప్రకాశిల్లు పరబ్రహ్మమే కాలము. యోగి ఆకాలస్వరూపము తానై నిమేషాది పంచకర్తల ప్రళయాంతమైన కాలమునకు లోఁబడక మెఱయుచుండును.

ఆసనలక్షణము.

సూక్ష్మశరీరమందుండు ప్రాణవాయు ధర్మమగు కదలుట హస్తపాదములను చాఁచుట ముడుచుట పరుగెత్తుట యెగురుట దుముకుట మొదలగునవియును, స్థూలశరీరధర్మమైన శరీరపీడయును, కారణశరీరధర్మమగు బడలిక మందము నిద్ర ఆయాసము మొదలగునవియును, బ్రహ్మము తానగుటచేతఁ గలుగవు గావున ఆపరబ్రహ్మము తానై యుండుటే సుఖాసనము.

సిద్ధాసనలక్షణము.

పుట్టుట పెరుగుట తరుగుట చచ్చుటలులేక యెల్లప్పుడు నేదిప్రకాశిల్లునో, యోగులపరోక్షజ్ఞానదృష్టిచేత శోధించిచూచి దేనియందైక్యమైనతోడనే సకలసిద్ధులు గలవారగుదురో ఆపరబ్రహ్మమే సిద్ధాసనము.

మూలబంధలక్షణము.

అష్టపాశబంధములకు ముఖ్యకారణమైన మూలప్రకృతిసంబంధము దేనిని సందర్శించిన మాత్రముననే వీడునో, ముప్పదియాఱుతత్త్వములకు ఏది కారణమైయున్నదో ఆపరబ్రహ్మమే మూలబంధము.

దేహసామ్యలక్షణము.

సముద్రమునందు నదులు గలసి అభేదముగ నున్నట్లు బ్రహ్మానందమందు చతుర్దశేంద్రియ గుణములగు శబ్దము స్పర్శము మొదలగునవి చేరి ఆనందమయమైయుండుటే దేహసామ్యము.

దృక్స్థితిలక్షణము.

చెవి చర్మము కన్ను నాలుక ముక్కు నోరు హస్తము పాదము గుదము గుహ్యము అనెడు వెలుపలి దశేంద్రియముల వృత్తులయిన శబ్దము స్పర్శము రూపము రసము గంధము వచనము దానము గమనము విసర్జనము ఆనందము అనువాని నెఱుఁగునది బాహ్యలక్ష్యము. మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనెడు అంతరింద్రియముల వృత్తులైన సంశయము నిశ్చయము చంచలము కర్తవ్యము అనువానిని ఎఱుఁగునది అంతర్లక్ష్యము. వెలుపలి లోపలి యింద్రియముల విషయముల నెఱుఁగునది అంతరబాహ్య మధ్యలక్ష్యము. జ్ఞానేంద్రియ మనోవృత్తుల నెఱుఁగునది షణ్ముఖీలక్ష్యము అంతరబాహ్య మధ్య షణ్ముఖీ లక్ష్యముల నెఱుఁగునది శాంభవీ లక్ష్యము. ఇది అన్ని లక్ష్యములలో నుత్తమమయినది. ఆశాంభవీలక్ష్యముచేత సర్వదృక్కగు పరబ్రహ్మమందు దృష్టినిలిపి వికల్పములేక యుండుటే దృక్స్థితి.

ప్రాణాయామలక్షణము.

పంచప్రాణములను చతుర్దశేంద్రియములను వానివృత్తులను పరబ్రహ్మమని ఆపరబ్రహ్మము తానని భావించుటే ప్రాణాయామము. మనస్సునకు వెలుపలఁ గనఁబడెడు ఘటము పటము మొదలగునవి యనెడు నామములును రూపములును, లోపలఁ గనఁబడెడు కామము క్రోధము లోభము మొదలగునవి యనెడు నామములును రూపములును మాయాకల్పితములు కనుక అవి తానుగానని నిషేధించి సచ్చిదానంద పరబ్రహ్మము తాననెడు భావమును అంతరంగమున నిల్పి ఆభావమును తొలఁగనీయక ప్రజ్ఞను పరబ్రహ్మమందు లీనము చేసియుండుటే ప్రాణాయామము.

ప్రత్యాహారలక్షణము.

పరబ్రహ్మ సంబంధములైన సచ్చిదానంద నిత్యనిర్మల శాంతశమదమాద్యనంతకల్యాణగుణములను, ప్రకృతిసంబంధములైన కామక్రోధ లోభ మోహాది దుర్గుణములను పరమాత్మగా భావించుటే ప్రత్యాహారము.

ధ్యానలక్షణము.

స్థూలసూక్ష్మ కారణశరీరములు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, దశవిధప్రాణములు, మనోబుద్ధి చిత్తాహంకారములు, మొదలగునవి యనెడు దృశ్యములు నేఁగాను. వీనిని తెలిసికొనెడు సాక్షిస్వరూపుఁడను. అనియెంచి ఆనిలుకడ తప్పకయుండుటే ధ్యానము.

ధారణాలక్షణము.

కర్త్రుకరణ కార్యరూపమైనమనస్సు దేనినిసంకల్పించునో, దేనిని చూచునో, ఆసంకల్పించినది చూచినది పరమాత్మయనుసంకల్పమును ఆమనస్సునందే స్థిరపఱచుట ధారణాయోగము. శ్లో॥ యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతిభావయేత్, యద్యత్స్పృశతిహస్తాభ్యాం తత్తదాత్మేతిభావయేత్, యద్యచ్ఛృణోతికర్ణాభ్యాంతత్తదాత్మేతిభావయేత్, ఇట్లని శైవల్యోపనిషత్తునందు। శ్లో॥ మనసావచసాదృష్ట్యా గృహ్యతేన్యైరపీంద్రియైః।అహమేవనమత్తోన్యదితిబుధ్యధ్వమంజసా॥ అని భాగవతము.

సమాధిలక్షణము.

జాగ్రత్త స్వప్నము సుషుప్తి తురీయము అనెడి అవస్థలయందును ఆయవస్థలలో తోచినసమస్తభోగభోగ్యసాధనములు సాక్షాత్కారములనెడి సకలమును పరమాత్మయనియెల్లప్పుడుదర్శించుట సమాధి.

౧౨౧౫.—మ॥ అరవిందాక్ష భవత్స్వరూపములఁ బ్ర * త్యక్షంబునం గాన నె
వ్వరికిం బోలదు శాస్త్రగోచరుఁడవై * వర్తింతు వీసృష్టిముక్
ధర సద్రూపుఁడవైన నీవలన నీ * ధాత్రాద్యమర్త్యుల్జనిం
చిరి నిన్నంతకమున్నెఱుంగఁ గలమే * చింతింప నేమచ్యుతా.

టీ॥ అరవిందాక్ష = కమలములవంటి కన్నులుగలవాఁడా. లేక, రవి=సూర్యుఁడు-సంతాపమునిచ్చువాఁడనిభావము. (రవికానివాఁడు అరవి) అరవిం=చంద్రుని - చల్లఁదనమును. ద=ఇచ్చునట్టి. అక్ష=కన్నులుగలవాఁడా - భక్తుల సంతాపమును నివారించునట్టి చూపుగలవాఁడనుట. భవత్స్వరూపములన్ = సచ్చిదానంద పరిపూర్ణాఖండమయములైన నీస్వరూపములను. ప్రత్యక్షంబునన్ = కన్నుల యెదుట-అపరోక్షముగాననుట. కానన్ = చూడను. ఎవ్వరికిన్ = ఎట్టినిర్వికల్పనిష్ఠగల వారికిని. పోలదు=సరిపడదు - శక్యముకాదు. అచ్యుతా = నాశరహితుఁడా. శాస్త్రగోచరుఁడవై = వేదాంతశాస్త్రములందుఁ దోఁచువాఁడవై. వర్తింతువు = ఉందువు. ఈసృష్టిమున్ = ఈప్రపంచమునుకలుగఁజేయుటకుముందు. ధరన్ = భూమియందు. సద్రూపుఁడవు=చెడనిపరబ్రహ్మస్వరూపముగలవాఁడవు-ఐన నీవలనన్ =అయియుండిన నీవలన. ఈధాత్రాద్యమర్త్యులు=ఈబ్రహ్మ మొదలగుదేవతలు. జనించిరి=పుట్టిరి. చింతింపన్ = విచారింపఁగా. (నిన్ను) నేము = మేము. అంతకు మున్ను=ఆబ్రహ్మాదులపుట్టుకకుముందు. ఎఱుంగఁగలమే=మే మెఱుఁగుదుమా. శ్రు॥ యతోవాచోనివర్తంతే,అప్రాప్యమనసాసహ,నతత్రచక్షుర్గచ్ఛతినవాగ్గచ్ఛతినోమనః॥

తా॥ ఓ స్వామీ! నీస్వరూపములను వేదాంతశాస్త్రములవలనఁ దెలిసికోవలసినవారమే గాని ప్రత్యక్షముగా తెలిసికొనుటకు శక్తులము కాము, మఱియెవరును తెలిసికొనుటకు శక్తులు కారు ఈప్రపంచ సృష్టికి మునుపు నీవు ఎప్పుడును చెడని దివ్యరూపము గలవాఁడవై యుండి సృష్ట్యాదికార్యములకు బ్రహ్మ మొదలగు దేవతలను పుట్టించితివి. అంతకుముందు నీవు ఏరూపముతో నుంటివో తెలిసికొనుటకు మేము చాలుదుమా ? మేము తెలిసికోలేరమని తాత్పర్యము.

శ్రు॥ నాసదాసీన్నోసదాసీత్, ఏకోహవైనారాయణ ఆసీత్, నబ్రహ్మనేశానోనేమేద్యావాపృథివీ. అని శ్రుతి.

వ॥ అట్టినిన్నుం బరమాణుకారణవాదులైన కణ్వగౌతమాదులును, బ్రకృతి కారణవాదులైన సాంఖ్యులును, దేహాత్మవాదులైన బౌద్ధులును, వివిధంబులైన కుతర్కంబులచేతం బరస్పరావ్యాహతంబులైన మతంబులు దమతమకుతర్కవాదంబుల సమర్థించుచు నిన్నుం దెలియలేరు, మహాభాగ్య వంతులైన యోగీంద్రులకు నీవు ప్రత్యక్షంబైన నివి యన్నియు నసత్యంబులనికానవచ్చు వెండియుఁ గొందఱు సచరాచరవస్తుజాతంబులకు నంతర్యామివై సర్వంబు నీవయగుటం దెలియలేక యనిత్యంబనియును విపరీతబుద్ధిం దెలియుదురుగాని భవదీయదివ్యతత్త్వంబు నిక్కంబుగఁ దెలియనేరరు కొందఱుజగద్భరితుండవుగాన జగద్రూపకుండవైననిన్నుం గటక మకుట కర్ణికాది వివిధభూషణభేదంబులం గనకంబు నిజ స్వరూపంబు విడువక వర్తించుచందంబున జగద్వికారానుగతుండ వయ్యును నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణాత్మకుండవై యుండుదువని యాత్మవిదులైనవారు దెలియుదు రదియునుంగాక.

టీ॥ అట్టినిన్నున్ =అటువంటినిన్ను. పరమాణు కారణవాదులు= పరమాణుస్వరూపుఁడైన పరబ్రహ్మమే జగత్సృష్టికి కారణముగా వాదించువారు, (అయిన) కణ్వ గౌతమాదులును=కణ్వుఁడు గౌతముఁడు మొదలగువారును. శ్లో॥ జాలసూర్యమరీచిస్థం యచ్ఛసూక్ష్మతమంరజః। తస్యషష్టమోభాగ స్త్వణురిత్యభిధీయతే ॥ తస్యషష్టమోభాగస్తుపరమాణుస్తుప్రకీర్తితః॥ తా॥ ఇంటికప్పులసందు నుండి వచ్చిన సూర్య కిరణపు వెలుతురునందు వచ్చుచు పోవుచున్న దుమ్ములలో అన్నిటికిని చిన్నదుమ్మునందు ఆఱవపాలు లేకయేనిమిదవపాలు అణువు, అందు ఆఱవపాలుఎనిమిదవపాలుపరమాణువని తా॥ ప్రకృతికారణవాదులు = అవ్యక్తనామక ప్రకృతియే సర్వమునకు కారణముగా వాదించువారు. ఐనసాంఖ్యులును=అయినట్టిసాంఖ్యమతస్థులును. దేహాత్మవాదులు = దేహమే ఆత్మయని వాదించువారైన. బౌద్ధులును=బౌద్ధమతము గలవారును. వివిధంబులు=నానావిధములు. (అయిన) కుతర్కంబులచేతన్ = ఆత్మస్థూలత్వ కృశత్వ మనుష్యత్వ మృగత్వాది వికారములు గలవాఁడు అనెడు కుత్సితవాదములచేత. పరస్పరావ్యాహతంబులు = ఒండొరులచేత కొట్టుపడనివి. ఐనమతంబులు = అయినట్టి మతములను. తమతమకుతర్కవాదంబులన్ = తమతమయొక్క కుత్సితాక్షేపములతోడి వాదించుటలచేత. సమర్థించుచున్ =సాధించుచు. (నిన్ను) తెలియలేరు=తెలిసికోఁజాలరు. శ్రు ॥ ఆసద్వా ఇదమగ్ర ఆసీత్, సదేవ సోమ్యేద

ష్వగ్ ఆసీత్, బ్రహ్మాప్యనక్ బ్రహ్మాత్మ్యేతి సమానేష్వక్షే పురుషోని మగ్నాః; అతిశయోక్తి చలిముహ్యమానః, అవిద్యాయామంతరేవ ర్తమానాపి స్వయంధీరాగ్గ్యపండితంమన్యమానాః, జంఘన్యమానాః పరియంతిమూఢా, అంధే నైవ నీయమానాయథాంధాః, అని. మహాభాగ్యవంతులు = ఎల్లప్పుడు శ్రవణమనన నిదిధ్యాసములచేత నిన్నారాధించుటయనెడు మిక్కిలియదృష్టముగలవారు. ఐనయోగీంద్రులకుఁ = అయినట్టి బ్రహ్మవిద్వరిష్ఠులకు. నీవు = సచ్చిదానంద పరబ్రహ్మమైన నీవు. ప్రత్యక్షుఁడవైనఁ = కన్నులకెదుటఁ కానఁబడినవాఁడవు కాఁగా— అనఁగా కనఁబడునది వినఁబడునది ఊహింపఁబడునది యంతయు నీ వేయను దృఢముకలుగఁగా. ఇవియన్నియుఁ = ఈచెప్పిన కణ్వ గౌతమాదులకుత్సితవాదములన్నియు. అసత్యంబులని = అబద్ధములని. కానవచ్చుఁ = తెలియవచ్చును. శ్లో॥ మిథ్యాతర్క సుకర్కశేరిత మహావాదాంధకారాంతరే। భ్రామ్యన్మందమతే రమందమహిమఁ త్వద్జ్ఞానవర్త్మాస్ఫుటం॥ శ్రీమన్మాధవవామనత్రిణయన శ్రీశంకర శ్రీపతే! గోవిందేతి ముదావదన్ మధుపతే ముక్తః కదాస్యామ్యహం॥ అని. కొండియుఁ = మఱియును. కొందఱు = కొంతమంది. సచరాచరవస్తుజాతంబులకుఁ = చరములతోడను అచరములతోడను గూడిన వస్తువుల సముదాయములకు, అంతర్యామివై = లోపలనణఁగివర్తించువాఁడవై— శ్రు॥ అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః॥ అని శ్రుతి. సర్వంబు = అంతయు. నీవ = నీవే. అగుటఁ = అవుటను. తెలియలేక = తెలిసికోఁజాలక. అనిత్యంబనియుఁ = శాశ్వతముకాదనియు— కనఁబడు నది వినఁబడు నది ఊహింపఁబడు నది యంతయును బ్రహ్మము కాదని అనుటు. విపరీతబుద్ధిఁ = పరబ్రహ్మమునకంటె వేఱుగ లోకము కలదనెడి విపరీతబుద్ధిచేత. తెలియుదురు = తెలిసికొందురు. (కాని) భవదీయ దివ్యతత్త్వంబు = నీదైన అప్రాకృత సచ్చిదానంద స్వరూపమును. నిక్కంబుగఁ = నిజముగ. తెలియనేరరు = తెలిసికోఁజాలరు. కొందఱు = కొంతమంది. జగద్భరితుండవు = లోకమునందు నిండుకొన్నవాఁడవు (లేక) లోకముచేత భరింపఁ బడువాఁడవు. కానఁ = కనుక. జగద్రూపకుండవు = లోకమేస్వరూపముగాఁగలవాఁడవు. ఐననిన్నుఁ = అయినట్టినిన్ను. కటకమకుటకర్ణికాదివివిధభూషణశ్రేణంబులఁ = కడియములు కిరీటములు కమ్మలు మొదలుగాఁ గల నానావిధములైన యాభరణముల వేఱుపాటుచేత. కనకంబు = బంగారు. నిజస్వరూపంబుఁ = తనయాకృతిని. విడువక = వదలక. వర్తించుచందంబునఁ = ఉండునట్లు. జగద్వికారానుగతుండవు = జగత్తుయొక్క వికారమును అనుసరించిపొందువాఁడవు. (అయ్యును) నిఖిల...త్మకుండవై — నిఖిల = సకలమయిన. హేయ = రోయఁదగిన వానికి—అనఁగా అనృత జడ దుఃఖ ఘంక కలినము లనెడు గుణములకు. ప్రత్యనీక = విరుద్ధమయిన. కల్యాణగుణ = శుభకరములైన సచ్చిదానంద పరిపూర్ణనిర్మలత్వములే. ఆత్మకుండవు = స్వరూపముగాఁ గలవాఁడవు. (అయియుందువు అని) ఆత్మవిదులైనవారు = బ్రహ్మవేత్తలు. తెలియుదురు = తెలిసికొందురు. అదియునుంగాక = అది మాత్రమే కాకుండ.

తా॥ అటువంటినిన్ను పరమాణు స్వరూపుఁడైన పరమాత్మరే ప్రపంచోత్పత్తికి కారణముగా వాదించువారైన కణ్వుఁడు గౌతముఁడు మొదలగువారును, ప్రకృతియే జగత్సృష్టికి కారణము అని వాదించువారైన సాంఖ్యులును, దేహమే ఆత్మయని వాదించువారైన బౌద్ధమతస్థులును, నానావిధములైన కుత్సితాక్షేపములు చేయుచు ఒకరికొకరుతగ్గక తమతమ మతములను ఊర్జితపఱుచుకొనుచు నిన్ను తెలిసికోలేకయుందురు, ఎప్పుడును నిన్నారాధించుటయనెడు మంచియదృష్టముగల యోగీశ్వరులకు నీవు కానఁబడినప్పుడు పైనిచెప్పిన గౌతముఁడు మొదలగువారి వాదములన్నియు అబద్ధములని తెలియవచ్చును. మఱి కొందఱు చరములును అచరములును అయిన సర్వవస్తువులకు లోపలను వెలుపలను వర్తించునట్టివాఁడవు. నీవేయనుటను తెలిసికోఁజాలక నీకంటె అన్యముగలదనెడి విపరీతబుద్ధిచేత సర్వమును నీవు కాదనియెంతురు కాని అప్రాకృతమయిన నీస్వభావమును చక్కఁగా తెలిసికోలేరు, కొందఱు లోకమును ధరించువాఁడవు గనుక జగత్తే స్వరూపముగాఁగలవాఁడవగు నిన్ను కడియములు కిరీటములు కమ్మలు మొదలుగాఁగలసొమ్ముల వేఱుపాటుచేత బంగారుతనస్వరూపమును విడువక వర్తించునట్లు జగత్తుయొక్క వికారముల నన్నిటిని అనుస్యూతముగా పొందువాఁడవుగా నుండియు నిఖిలహేయప్రత్యనీక కల్యాణగుణములు గలవాఁడవై యుందువు అని నీస్వరూపమునెఱిఁగిన పండితులు దెలిసికొందురు ఇంతేకాక ఇంకను చెప్పుచున్నానని తాత్పర్యము.

౧౨౧౬.—మ॥ వనజాతాక్ష భవత్పదాబ్జయుగ సే ✻ వాసక్తులైనట్టి య
జ్జనముల్మృత్యు శిరంబుఁదన్ని ఘనసం ✻ సారాంబుధిఁ దాఁటి పా
వనులై లోకములం బునీతములుగా ✻ వర్తించుచు న్నిత్యశో
భనమై యొప్పెడిముక్తిఁ బొందుదురు శుం ✻ భద్వైభవోపేతులై.

టీ॥ వనజాతాక్ష = తామరలవంటికన్నులుగలయోస్వామీ. భవత్పదాబ్జయుగసేవాసక్తులు = శ్రు॥ పాదోస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి, అను శ్రుత్యర్థమునుపట్టి నీయడుగుఁదామరలను కొలుచుటయందు ఆసక్తిగలవారు. ఐనట్టియజ్జనములు = అయినటువంటియాముక్తజీవులు. మృత్యుశిరంబు దన్ని = మృత్యువును అణఁగఁ ద్రొక్కి. ఘనసంసారాంబుధిఁ = గొప్పదియైన సంసారసముద్రమును. (దాఁటి) పావనులై = పరిశుద్ధులై. లోకములఁ = లోకములోని ప్రాణులను. పునీతములుగాఁ = పరిశుద్ధములగునట్లు. వర్తించుచుఁ = మెలఁగుచు. శుంభద్వైభవోపేతులై = మేలైనసర్వజ్ఞత్వసర్వేశ్వరత్వాదివైభవముతోఁ గూడుకొన్నవారై. నిత్యశోభనమై = ఎల్లప్పుడు నశింపని కాంతిగలదై. శ్లో॥ నతద్భాసయతే సూర్యో నశశాంకో నపావకః। యద్గత్వాననివర్తంతే తద్ధామ పరమంమమ. అనిగీత. ఒప్పెడి = ఒప్పునట్టి. ముక్తిఁ = మోక్షమును. (పొందుదురు)

తా॥ ఓస్వామీ ! నీపాదకమలములను అక్కఱతో కొలుచునట్టి ముక్తజీవులు మృత్యువును జయించి సంసారమనెడు దరిలేని సముద్రమును అలక్ష్యముగా దాఁటి లోకములోని ప్రాణులనెల్లను పరిశుద్ధులు అగునట్లు మెలఁగుచు కడపట సదా ఆనందమును పొందఁజేయునట్టిదియు మిక్కిలి వైభవముతో ఒప్పునట్టిదియునైన మోక్షమును పొందుదురని తా.

మ॥ మిము సద్భక్తి భజింప నొల్లకిల దు * ర్మేధం బ్రవర్తించు నీ
చమతి వ్రాతము నేర్పునం బసులఁ బా * శశ్రేణి బంధించు చం
దమునం బెక్కగు నామరూపములచే * త న్వారి బంధించి దు
ర్గమ సంసారపయోధిఁ ద్రోతువు దళ * త్కంజాత పత్త్రేక్షణా.

టీ॥ దళత్కంజాతపత్త్రేక్షణా = వికసించిన తామరఱేకులవంటి కన్నులుగల స్వామీ. మిమున్ = పరబ్రహ్మమైన మిమ్ము. సద్భక్తిన్ = అనన్యభక్తితో. భజింపనొల్లక = కొలువఁజాలక. ఇలన్ = భూమియందు. దుర్మేధన్ = భగవద్వ్యతిరిక్తముగలదనెడు దుష్టబుద్ధితో. ప్రవర్తించు = మెలఁగునట్టి. నీచమతివ్రాతమున్ = అల్పబుద్ధులుగల అజ్ఞానజనులయొక్క సమూహమును. నేర్పునన్ = ఉపాయముచేత. పసులన్ = పశువులను. పాశశ్రేణిన్ = దామెనత్రాళ్లతో. బంధించు చందమునన్ = కట్టివేయు విధమున. పెక్కు = అనేకములు. అగు నామరూపములచేతన్ = దేవతాంతర నామరూప భేదములచేతను. బంధించి = కట్టివేసి. వారిన్ = అట్లుకట్టుపడ్డవారిని. దుర్గమసంసారపయోధిన్ = పొందరాని సంసారసముద్రమునందు. త్రోతువు = పడఁద్రోయుదువు. శ్రు॥ తస్యవాక్తంతిర్నామానిదామానితస్యేదంవాచా తంత్యానామభిర్దామభిసర్వం సితమితి. అనిశ్రుతి. నిన్ననపరోక్షజ్ఞానముతో సేవించువారిని సంసారసముద్రమునుండి దాఁటింతువని భావము.

తా॥ పూచినతామరఱేకులనుబోలినకన్నులుగలశ్రీకృష్ణా! ఎవ్వరు మిమ్ముభక్తియుక్తులై సేవింపక చెడ్డబుద్ధిగలవారై భూమియందు చరింతురో అట్టినీచబుద్ధిగల పామరులను పశువులను దామెనత్రాటితో వరుసగా కట్టివేయునట్లు నానావిధనామరూపభేదములచేతకట్టివేసిసంసారమనెడు దాఁటరాని సముద్రమునందు పడఁద్రోయుదువు అనితా.

శ్రు॥ వేహంతేదేవః పరంబ్రహ్మ తారకం వ్యాచష్టే, యమేవైష వృణుతేతే॥ నలభ్యః, యస్యదేవేపరాభక్తిః. అనిశ్రుతి. శ్లో॥ తపంతు తాపైః ప్రపతంతు పర్వతా దటంతు తీర్థాని పఠంతుచాగమాన్ యజంతుయాగైర్వివదంతువాదైర్హరింవినానైవమృతింతరంతి.

వ॥ దేవా కర్మమూలంబులైన పాణిపాదంబులు లేనివాఁడవయ్యును స్వతంత్రుండవు, బ్రహ్మాదులు భవత్పరతంత్రులై యుందురు స్థిరచరరూపంబులుగల చేతనకోటికి నీవు సర్వవిధినియంతవు కావున నీకృపావలోకనంబుగలవారికి మోక్షంబుకరస్థితంబైయుండు, భవత్కృపావలోకనంబు లేనికష్టాత్ములు నష్టాత్ములై దుర్గతిం గూలుదురట్టి జీవులు దేవతిర్యఙ్మనుష్యస్థావరాదిశరీరంబులు సొచ్చి యణురూపులై యుందురందు నీవుందువు తదంతరాత్మవగుచు మఱియును.

టీ॥ దేవా = స్వామీ. కర్మమూలంబులు = ఇచ్చుట పుచ్చుకొనుట నడుచుటకు సాధనములు. అయినపాణిపాదంబులు = అయినట్టి కాళ్లును చేతులును. లేనివాఁడవయ్యును = లేనివాఁడవుగానుండియు — ఇంద్రియజన్యజ్ఞానము లేనివాఁడవైనను అనుట. స్వతంత్రుండవు = ఒకరి సహాయమునుకోరనివాఁడవు — నిత్యనిరుపాధిక నిరతిశయజ్ఞానసహితుఁడవని భావము. శ్రు॥ నతస్యకార్యంకరణంచవిద్యతే నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే । పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీజ్ఞానబలక్రియాచ । అపాణిపాదోజవనోగృహీతా పశ్యత్యచక్షుస్సశృణోత్యకర్ణః। సవేత్తివేద్యంనచతస్యాస్తివేత్తాతమాహురగ్ర్యంపురుషంమహాంతం ॥ పశ్యత్యచక్షుస్సశృణోత్యకర్ణో నతస్యకార్యం కరణంచవిద్యతే. అనిశ్రుతి॥ శ్లో॥ అనింద్రియోపియోదేవస్సర్వకారకశక్తిధృత్ । సర్వజ్ఞస్సర్వకర్తాచసర్వసేవ్యంనమామితం॥ అని. బ్రహ్మాదులు = చతుర్ముఖబ్రహ్మనవబ్రహ్మలు వాయుసూర్యాగ్నీంద్రులు మొదలగువారు. భవత్పరతంత్రులై = నీతోడుపాటునపేక్షించువారై. ఉండుదురు = ఉందురు — అనఁగా నీకువెఱచి తమపనులనునడపుచుండుదురనిభావము. శ్రు॥ భీషాస్మాద్వాతఃపవతే, భీషోదేతిసూర్యః, భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతిపంచమ ఇతి, భయాదస్యాగ్నిస్తపతి, భయాత్తపతి సూర్యః, భయాదింద్రశ్చవాయుశ్చ, మృత్యుర్ధావతిపంచమః, యదిదంకించ, జగత్సర్వంప్రాణ ఏజతినిస్సృతం మహద్భయం వజ్రముద్యతం యఏతద్విదు రమృతాస్తే భవంతి॥ అనిశ్రుతులు. స్థిరచరరూపంబులుగల చేతన కోటికిన్ = ఉన్నతావునుండి కదలకుండుటయు యథేచ్ఛముగా తిరుగుటయు స్వరూపములుగాఁగల ప్రాణులసమూహమునకు. (నీవు) సర్వవిధినియంతవు = ఎల్లవిధులనునియమించువాఁడవు. కావునన్ = కనుక. నీకృపావలోకనంబుగలవారికిన్ = దయతోడినీచూపు గలవారికి — నీదయకుపాత్రులైనవారికి. మోక్షంబు = ముక్తి. కరస్థితంబై = చేతియందుండుదానివంటిదై. (ఉండును) భవత్కృపావలోకనంబు = నీదయతోడిచూపు. లేనికష్టాత్ములు = లేనిపామరులు. నష్టాత్ములై = చెడునట్టిస్వభావము గలవారై, దుర్గతిన్ = నరకమునందు. కూలుదురు = పడుదురు. అట్టిజీవులు = అటువంటిప్రాణులు. దేవతిర్యఙ్మనుష్యస్థావరాదిశరీరంబులు = దేవతలయు తిర్యక్కులయు మనుష్యులయు స్థావరాదులయు శరీరములను. చొచ్చి = ప్రవేశించి. అణురూపులై = దుమ్ములోనిగవలనుబోలినస్వరూపములుగలవారై. (ఉందురు) అందున్ = ఆసూక్ష్మరూపమునందు. (నీవు ఉందువు) తదంతరాత్మవగుచున్ = దానిలోపలియాత్మవు అగుచును. మఱియును = ఇదిగాక.

శ్రు॥ యథాగ్నేఃక్షుద్రావిస్ఫులింగావ్యుచ్చరంతి,ఏవమేవాస్మాదాత్మనస్సర్వే ప్రాణాస్సర్వే లోకాస్సర్వే దేవాస్సర్వాణి భూతాని సర్వఏత ఆత్మనోవ్యుచ్చరంతి॥ అనిశ్రుతి. శ్లో॥ త్వదీక్షణవశక్షోభమాయా బోధితకర్మభిః । జాతాన్ సంసరతః ఖిన్నాన్ నృహరే పాహినఃపితః.

తా॥ ఓయేలినవాఁడా ! ఇచ్చుట పుచ్చుకొనుట నడచుట మొదలైనపనులుచేయుటకు సాధనములైనకాలుసేతులు మొదలగునవి లేనివాఁడవుగానుండియు అన్నిటినినడపునట్టి స్వతంత్రుఁడవై యుందువు బ్రహ్మమొదలగు వారందఱు నీకు పరతంత్రులైయుందురు స్థావరములును జంగమములునైన ప్రాణులసమూహమునకు నీవు ఎల్లనియమములను నియమించువాఁడవు కాఁబట్టి దయతోడిదైన నీచల్లని చూపును

పొందినవారికి మోక్షము అరచేతిలోనిదై యుండును, నీదయాదృష్టిని పొందనేరని నీచమనస్సు గలవారు చెడినస్వరూపము గలవారై నరకమ్ములందు పడుదురు, అట్టికూలినజీవులు దేవతలు తిర్యక్కులు మనుష్యులు స్థావరములు మొదలుగాఁగలవానిరూపములనుపొందిమిక్కిలి సూక్ష్మములయిన శరీరములను ధరించియుందురు, ఆశరీరములయందు జీవాత్మవై నీవు అణఁగియుందువు ఇంతేకాదు అనితాత్పర్యము.

౧౨౧౯.—క॥ మదిఁదలపోయఁగ జలబు। ద్బుదములు ధరఁబుట్టిపొలియు ✽ పోలికగల యీ
త్రిదశాది దేహములలో। వదలక వర్తించు నాత్మ ✽ వర్గము నోలిన్.

టీ॥ మదిన్=మనసునందు. తలపోయఁగన్=విచారింపఁగా. జలబుద్బుదములు=నీటిబుగ్గలు. ధరన్=భూమియందు. (పుట్టి)పొలియు పోలిక=అణఁగిపోవునట్టివిధము. కలయీ త్రిదశాది దేహములలోన్=కలిగినట్టియీ చెప్పఁబడిన దేవతాశరీరము మొదలుగాఁగల దేహములలో. వదలక=ఎడఁబాయక. వర్తించు నాత్మవర్గమున్=ఉండునట్టి జీవాత్మలసమూహమును. ఓలిన్=క్రమముగా. తా, పైపద్యమునందు.

౧౨౨౦.—ఆ॥ ప్రళయవేళ నీవు ✽ భరియింతు వంతకుఁ। గారణంబ వగుటఁ ✽ గమలనాభ
భక్త పారిజాత ✽ భవభూరి తిమిర ది। నేశ దుష్టదైత్య ✽ నాశ కృష్ణ.

టీ॥ కమలనాభ=బొడ్డునందు తామరగలవాఁడవును. భక్తపారిజాత=సేవకులకుకల్పవృక్షమైనవాఁడవును. భవభూరితిమిరదినేశ=జన్మములనెడుమిక్కుటమైనచీఁకటికిసూర్యుఁడైనవాఁడవును. దుష్టదైత్యనాశ=దుష్టులైన రాక్షసులను నాశముచేయు వాఁడవునునైన. కృష్ణ=కృష్ణమూర్తీ. (నీవు)అంతకున్=సమస్తమునకును-సృష్టిస్థితిలయ తిరోధానానుగ్రహములనెడు పంచకృత్యములకుననుట. కారణంబవగుటన్=హేతువైనవాఁడవగుటచేత. (ప్రళయవేళను)భరియింతువు=స్థావరక్రిమిజలచరపక్షిపశునరసురలనెడు సర్వజీవులను వహింతువు.

తా॥ బొడ్డునందు బ్రహ్మకు జన్మస్థానమయిన తామర గలవాఁడవును, సేవకులకు కల్పవృక్షమువలె కోరిన కోరికలనిచ్చువాఁడవును, పుట్టుకలనెడు మేరలేని చీఁకటినిపోఁగొట్టుటయందు సూర్యుఁడవగువాఁడవును, చెడ్డవారైన రాక్షసులనెల్లనునశింపఁజేయువాఁడవునైన ఓస్వామీ ! విచారించి చూడఁగా నీళ్లలోలేచి అణఁగిపోవు బుగ్గలవలె భూమియందు పుట్టుచు నశించుచునుండునట్టి యెల్లదేహధారుల సమూహమును సృష్టిస్థితిలయ హేతుభూతుఁడవైన నీవు ప్రళయకాలమునందు నీయందుంచుకొని యుందువు అని తాత్పర్యము.

౧౨౨౧.—చ॥ అనఘ జితేంద్రియస్ఫురణు ✽ లయ్యును జంచలమైన మానసం
బను తురగంబు బోధమహి ✽ తాత్మ వివేకపు నూలిత్రాట న
ల్లనఁ గదియంగఁ బట్టను ద ✽ లంచుచు ముక్తికుపాయ లాభమే
యనువున లేమికి న్వగల ✽ నందెడు నాత్మలువో తలంపఁగన్.

టీ॥ అనఘ=పాపములేనివాఁడవైనయోస్వామీ. తలంపఁగన్=విచారింపఁగా. ఆత్మలు=సురనరాదిజీవులు. జితేంద్రియస్ఫురణులు=ఇంద్రియజయమునందలి జ్ఞప్తిగలవారు. (అయ్యును) చంచలమైన=చంచలించునట్టి స్వభావముగలదైన. మానసంబను తురగంబున్=మనస్సనెడుగుఱ్ఱమును, బోధమహితాత్మ వివేకపు నూలిత్రాటన్=జ్ఞానముచేత పూజ్యమైన పరమాత్మను తెలిసికొనుట యనెడు నూలిత్రాటిచేత. అల్లనన్ = మెల్లఁగా. కదియంగఁ బట్టన్=చలింపక నిలువఁబట్టుటకు. తలంచుచున్ = ప్రయత్నపడుచు. ముక్తికిన్ = మోక్షమునకు. ఉపాయలాభము = ఉపాయము కలుగుట. ఏయనువునన్=ఏవిధముచేతను. లేమికిన్=లేకుండుటకు. ఆత్మలు=నీపాదసేవలేని జీవులు. వగలనందెడుఁబో = విచార పడుచున్నవి సుమీ.

తా॥ పాపములేవియులేనియోస్వామీ! ఇంద్రియజయమునొందునట్టి సామర్థ్యముగలవారుగానుండియు చలించునట్టి స్వభావముగల మనస్సనెడుగుఱ్ఱమును బ్రహ్మజ్ఞానమనెడునూలిత్రాటిచేత మెల్లగా బిగఁబట్టుటకు యత్నించుచు ఆమనస్సు స్వాధీనము కానందున మోక్షమునొందుటకు మార్గమేదియుఁ గానక నీపాదారవింద భజనలేనిజీవులు విచారము నొందుచుందురని తాత్పర్యము.

౧౨౨౨.—చ॥ గురుపద పంకజాతములు ✽ గొల్వని వారలువో మహాబ్ధి ని
స్తరణకుఁ గర్ణధార రహి ✽ తంబగునావను సంగ్రహించు బే
హారిగతి భూరిదుస్తర భ ✽ వాంబుధిలోన మునుంగుచుందురం
బురుహదళాక్ష నిత్యపరి ✽ పూర్ణుఁడవై తనరారు నిన్నొగిన్.

టీ॥ అంబురుహదళాక్ష=తామరరేకులవంటి కన్నులుగలస్వామీ. గురుపద పంకజాతములు = ఆచార్యుల పాదకమలములను. కొల్వని వారలువో=సేవింపనివారే. మహాబ్ధి నిస్తరణకున్ = గొప్పసముద్రమును దాఁటుటకు. కర్ణధారరహితంబగు నావన్=ఓడనడపువాఁడు లేనియోడను. సంగ్రహించు బేహారిగతిన్ = చేర్చికొనునట్టి బేరగానివలె=ఎక్కి బేరమాడఁబోవు వానివలె. భూరిదుస్తరభవాంబుధిలోనన్ = మిక్కుటమయినదియు దాఁటరానిదియునైన సంసారసముద్రమునందు. మునుంగుచుందురు=మునిఁగిపోవుచుందురు. నిత్యపరిపూర్ణుఁడవై=ఎల్లప్పుడు అంతటను నిండినవాఁడవై. తనరారు = ఒప్పునట్టి.(నిన్ను) ఒగిన్=క్రమముగా. శ్రు॥ తద్విజ్ఞానార్థంస్వగురుమేవాభిగచ్ఛేత్, సమిత్పాణింశ్రోత్రియంబ్రహ్మనిష్ఠం, ఆచార్యవాన్‌పురుషోవేద, నైషాతర్కేణ మతిరాపనేయా ప్రోక్తాన్యేనైవసుజ్ఞానాయ

ద్రేష్ఠేతి. అని శ్రుతి. శ్లో॥ యదాపరానందగురోర్భవత్పదేపదంమనో మే భగవన్ల భేత తదానిరస్తాఖిలసాధనశ్రమః శ్రయేయసౌఖ్యంభవతః కృపావశాత్ ॥ సంసారచక్ర క్రకచైర్విదీర్ణ ముదీర్ణనానాభవతాప తప్తం । కథంచిదాపన్నమిహప్రపన్నం త్వముద్ధర శ్రీనృహరే న్నృలోకం॥ శ్లో॥ గుశబ్దస్త్వంధకారస్స్యా ద్రుశబ్దస్తన్నివర్తకః । అంధకార నివర్తత్వా ద్గురురిత్యభిధీయతే ॥ ఆచినోతిహి శాస్త్రార్థ మాచారేస్థాపయత్యపి । ఆచరేత్స్వయమస్యేవ యస్మాదాచార్య ఉచ్యతే॥ అని.

తా॥ తామరతేకులనుబోలినకన్నులుగలఓస్వామీ! గురుసేవచేసితత్త్వమెఱుఁగ నేరని పామరులు పెద్దసముద్రమును దాఁటుటకు ఓడవాఁడు లేనిఓడయందు కూర్చుండి చేరమాడఁబోవు వర్తకునివలె మేర లేనిదియు దాఁటరానిదియునైన సంసారసముద్రమునందు మునిఁగిపోవుచుందురు, అంతటనునిండుకొని యెల్లప్పుడును వెలుఁగునట్టినిన్ను చేరలేరని తా.

౧౪౪౩.—తే॥ పుత్ర దార గృహక్షేత్ర * భూరివిషయ । ఘనసుఖాసక్తుఁడగుచు నే * మనుజుఁడేని
నర్థి భజియించు వాఁడు భ * వాబ్ధి లోనఁ । జెంది యెన్నాళ్లకును దరిఁ * జేరలేఁడు.

టీ॥ పుత్ర...సక్తుఁడు—పుత్ర=కొడుకులు, దార=పెండ్లాము. గృహ=ఇల్లు. క్షేత్ర=సాగుబడిపొలము. (వీనితోడివైన) భూరి = అధికములయిన. విషయ = విషయములవలని. ఘన = గొప్పదైన. సుఖ=సుఖమునందు. ఆసక్తుఁడు = అపేక్షకలవాఁడు. అగుచున్ = ఔచును. ఏమనుజుఁడేని=ఏమనుష్యుఁడు. అర్థిన్ = ఇష్టముతో. భజియించున్=సేవించునో — అనుభవించునో. వాఁడు = ఆమనుష్యుఁడు. భవాబ్ధిలోనన్ = జన్మసముద్రమునందు. చెంది=పొంది. ఎన్నాళ్లకున్=ఎంతకాలమునకును. దరిఁజేరలేఁడు = గట్టునందుఁ జేరఁజాలఁడు.

తా॥ ఏమనుష్యుఁడుబిడ్డలు పెండ్లాము ఇల్లుమడిచేను అనువానియందు ఆసక్తిగలవాఁడై విశేషమైనవిషయసుఖములను పొందఁగోరునో అటువంటిమానవుఁడు సంసారసముద్రమునందుండిదరిఁ జేర నేరఁడని తా.

శ్లో॥ భజతోహిభవాన్ సాక్షా త్పరమానందచిద్ఘనః । ఆత్మైవ కిమతః కృత్యం తుచ్ఛదారసుతాదిభిః॥ శ్రు॥ రసోవైసః రసగ్గ్ హ్యేవాయంలబ్ధ్వానందీ భవతి కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందోనస్యాత్, అని శ్రుతి గనుక నీయందు ప్రీతిగలవాఁడు నిత్యానందము ననుభవించునుగాని పుత్రకళత్రాదులయందు ప్రీతిగలవాఁడు ఆనందము ననుభవింప నేరఁడనిభావము.

౧౪౪౪.—సీ॥ జగతిపైఁగల తీర్థ * సాధనంబుల నెల్లఁ - బుణ్యానువర్తన * స్ఫురితులగుచుఁ
పాటించి నీయందు * బద్ధమత్సరములు - లేక భక్తామరా * నోకహంబ
వగు భవత్పాదాబ్జ * యుగళంబు సేవించి - భవపాశముల నెల్లఁ * బాఱఁదోలి
సమమతులై యదృ * చ్ఛాలాభ తుష మేరు - సమముగాఁ గైకొని * సాధులగుచుఁ
తే॥ పాదతీర్థంబుగల మహా * భాగవత జ । నోత్తమోత్తములైనట్టి * యోగివరుల
వారకెప్పుడు సేవించు * వాఁడు పొందుఁ । బ్రవిమలానందమయ మోక్ష * పదము మఱియు.

టీ॥ జగతిపైన్=భూమిమీఁద-ఈభూలోకమునందు. కల=కలిగిన. తీర్థసాధనంబుల నెల్లన్ = పుణ్యనదీక్షేత్రములను పొందుటకు సాధనములయిన కార్యముల నెల్లను. పుణ్యానువర్తనస్ఫురితులు = తమ పూర్వపుణ్యముచేత అనువర్తించి ప్రకాశించువారు. (అగుచును) పాటించి = ఆదరించి. నీయందున్ = నీయెడ. బద్ధమత్సరములు = అంటిన మచ్చరములు. లేక=లేనివారై. భక్తామరానోకహంబవు= భక్తులకుకల్పవృక్షమవు. అగు = అగునట్టి. భవత్పాదాబ్జయుగళంబున్=నీపాదకమలముల జంటను. సేవించి = కొలిచి. భవపాశముల నెల్లన్=జన్మములనెడు కట్టుత్రాళ్లనన్నిటిని. పాఱఁదోలి = తొలఁగించుకొని. సమమతులై = సర్వజీవులయందుసమానమయిన బుద్ధిగలవారై—వీరుపగవారు వీరుకావలసినవారు అను భేదబుద్ధి లేక యనుట. యదృచ్ఛాలాభతుషన్=తనంతట లభించిన పొట్టునైనను. మేరుసమముగాన్ = మేరుపర్వతముతో సమానముగా. కైకొని= అంగీకరించి—తలఁచి. సాధులగుచున్=తిన్నఁదనము గలవారగుచు. పాదతీర్థంబు = పరిశుద్ధమయిన పాదోదకము. కల=కలిగిన. మహాభాగవతజనోత్తమోత్తములు=గొప్పవారైనభగవద్భక్తులలో మిక్కిలి యుత్తములు. అయినట్టి యోగివరులన్ = అయిన యోగీశ్వరులను. వారకన్=సంకోచింపక. ఎప్పుడున్=ఎల్లప్పుడును. సేవించువాఁడు= కొలుచునట్టివాఁడు. ప్రవిమలానందమయ మోక్షపదమున్=మిక్కిలి స్వచ్ఛమయిన సంతోషస్వరూపమగు మోక్షస్థానమును. (పొందును) మఱియున్ = ఇదిగాక. శ్లో॥ ముంచన్నంగతదంగ సంగమనిశం త్వామేవ సంచింతయన్ । సంతస్సంతియతోయతో గతమదా స్తానాశ్రమానావసన్। నిత్యంతన్ముఖపంకజాద్విగళిత త్వత్పుణ్య గాథామృత। స్రోతస్సంప్లవసంప్లుతో నరహరే నన్యామహం దేవభృత్॥ అని.

తా॥ ఈభూలోకమునందు పుణ్యనదులను పుణ్యక్షేత్రములను పొందుటకు సాధనములయిన సత్కార్యములను తమ పూర్వపుణ్యవిశేషములవలననడపునట్టి వివేకులు నీయందువిరోధబుద్ధి లేక భక్తులపాలిటికల్పవృక్షమైన నీపాద కమలములను కొలిచి. జన్మబంధములను తొలఁగించుకొని శత్రులు మిత్రులు అనుభేదబుద్ధిలేక యెల్లవారియెడలను సమముగావర్తించుచు తనంతట దొరకిన అల్పవస్తువునైనను మేరుపర్వతముతో సమానముగానెంచుచు సాధువులై పరిశుద్ధులైన భగవద్భక్తుల పాదతీర్థమును కోరి అట్టియోగీశ్వరులను సేవించుచు వర్తించునట్టి పుణ్యాత్ముఁడు నిర్మలమయిన ఆనందమును కలుగఁజేయునట్టి మోక్షస్థానమును పొందును అని తాత్పర్యము.

వ॥ సత్తైన ప్రకృతివలన నుత్పన్నంబైన యీజగత్తు సత్తుగావలయు నదియెట్లనినం గనకోత్పన్నంబులైన భూషణంబులు గనకమయంబులై కానంబడుచందంబుననని సాంఖ్యులందు పలికినవిని యద్వైతవాదియిట్లను నెయ్యదియుత్ప

న్నంబుగాదదియు సత్తుగాదను వ్యతిరేకవ్యాప్తినియమంబు నిత్యసత్యంబైన బ్రహ్మంబునందుఁ దర్కహతంబగుం
గావునం బ్రపంచంబు మిథ్యయని నిరూపించిన నాప్రపంచంబు బ్రహ్మ విశేషణంబై కార్యకారణావస్థలు గలిగి
యున్నంత మాత్రంబున మిథ్య గానేరదాప్రపంచంబునకుం గార్యకారణావస్థలు నిత్యంబులు గావున నవస్థా
ద్వయయుక్తంబైన ప్రపంచంబు సత్యంబని వెండియు నద్వైతియిట్లను బహుగ్రంథప్రతిపాదితంబైన జగన్మిథ్యా
త్వంబులేమి యెట్లనిన నదియును గర్మవశులైన జడుల నవిద్యా ప్రతిపాదకంబై కుతర్క సమేతంబైన భారతి
యంధపరంపరా వ్యవహారంబునం జేసి భ్రమియించుఁ గారణావస్థలయందు బ్రహ్మవిశేషణంబైన సూక్ష్మరూపం
బునం బ్రపంచంబు సత్తైయుండు సత్యంబు బోధాయోగ్యంబు గావున నీకువిశేషణంబైయుండును నీవు దేహగతుం

డైన దేహియందు నంతర్యామివయ్యుం గర్మఫలంబులం బొరయక గర్మఫలభోక్తయైన జీవునకు సాక్షిభూతంబవై
యుండుదు వట్టినిన్ను నజ్ఞులైన మానవులు నిజకంఠలగ్నంబైన కంఠికామణి నిత్యసన్నిహితంబై వెలుంగుచుండినం
గానకవర్తించు తెఱంగున హృదయపద్మమధ్యంబున ననంత తేజోవిరాజమానుండవై ప్రకాశించు నిన్నుం దెలియలేరు
సకలాండ నాయకుండవైన నీయందు శ్రుతులు ముఖ్యవృత్తిం బ్రవర్తించునని శ్రుత్యధి దేవతలు నారాయణు నభి
నందించిన తెఱంగున సనందనుండు మహర్షుల కెఱింగించిన ప్రకారంబని నారాయణఋషి నారదునకుం జెప్పిన నమ్మహా
త్ముండు మజ్జనకుండైన వేదవ్యాసమునీంద్రునకు నుపన్యసించె నయ్యర్థంబు నతండు నాకుం జెప్పిన విధంబున నీకుం
జెప్పితి నీయుపాఖ్యానంబు సకలవేదశాస్త్రపురాణేతిహాససారంబు పనిషత్తుల్యంబు దీనిఁ బఠించువారును విను వారును
విగతకల్మషులై యిహపరసౌఖ్యంబులం బొంది వర్తింతురని చెప్పిన శుకయోగీంద్రునకు రాజయోగీంద్రుం డిట్లనియె.

టీ॥ సత్తు=త్రికాలములయందును చెడనిది. అయిన ప్రకృతివలనన్ = అయినట్టిమూలప్రకృతివలన. ఉత్పన్నంబైన = కలిగిన. ఈజగత్తు= స్థావర జంగమాత్మకమైన యీప్రపంచము. సత్తుగావలయున్ = త్రికాలములయందును చెడనిదియే కావలెను. శ్రు॥ ఆసద్వా ఇద మగ్రఆసీత్ తతోవైసదజాయత ॥ ద్వాసుపర్ణా సయుజాసఖాయా సమానంవృక్షంపరిషస్వజాతే తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి॥ అజామేకాంలోహితశుక్లకృష్ణాం బహ్వీంప్రజాం జనయంతీగ్ంసరూపాం అజోహ్యేకో జుషమాణోను శేతేజహాత్యేనాం భుక్తభోగామజోన్యః, అను శ్రుతులనుపట్టి జగత్సృష్టిస్థితిలయకారణ మైన ప్రకృతివలన పుట్టిన జగత్తుసత్తేయగుననిభావము. అది=అసత్తు గుటు. ఎట్లనినన్ = ఎట్లు అనఁగా. కనకోత్పన్నంబులైన భూషణం బులు=బంగారువలనఁగలిగిన సొమ్ములు. కనకమయంబులై=బంగారు వికారము గలవై. కానంబడు చందంబునన్=అగపడునట్లు. (అని) సాంఖ్యుండు=సాంఖ్యమతస్థుఁడు. పలికినన్=చెప్పఁగా—పరిణామ వాదము చేయఁగా. (విని) అద్వైతవాది=అద్వైతమును వాదించు వాఁడు. ఇట్లనున్ = ఇట్లుపలికెను. ఎయ్యదియుత్పన్నంబుగాదు = ఏదిపుట్టదో. అదియుసత్తుగాదు = కాలత్రయమునందు నశించునది. కాదు. అనువ్యతిరేకవ్యాప్తినియమంబు=అనునట్టివిరుద్ధవ్యాప్తియొక్క నియమము. నిత్యసత్యంబైన బ్రహ్మంబునందున్=దేశ కాల వస్తు పరి చ్ఛేద శూన్యమైనదియు త్రికాలముల యందును నశింపనిదియు నైన పరబ్రహ్మమునందు. తర్కహతంబు = వాదముచేత కొట్టుపడినది (అగును) అనఁగా వివృత్తోపాదానకారణముచేత రజ్జువునందు సర్ప భ్రాంతితోఁచినను దానియందు సర్పము లేనట్టుగానే సచ్చిదానంద పరబ్రహ్మమునందు ప్రపంచభ్రమము తోఁచినను తోఁచును గాని మిథ్యారూపమైన ప్రకృతియందు ప్రపంచము తోఁచదు. తోఁచునంటి వేని అది కాలత్రయమునందును బ్రహ్మజ్ఞానముచేత నశించుచున్నది. గనుక సత్తని పలుకరాదు, శశవిషాణవంధ్యాపుత్ర గగనారవిందముల వలె తోఁచక యుండుటలేక అహమజ్ఞః జ్ఞాని సుఖీ దుఃఖీ అని అను కొనుటగలదు గనుక అసత్తనరాదు, ఒక్కవస్తువు సత్తుగాను అసత్తు గాను ఉండుననుట ప్రత్యక్షవిరోధము గనుక సదసత్తని అనరాదు, బ్రహ్మభిన్నముకాదు గనుక భిన్నమని అనరాదు, చేతనత్వము వచ్చును గనుక అభిన్నమనరాదు, ప్రత్యక్షవిరోధము సంభవించుచున్నది గనుక భిన్నాభిన్నమనరాదు, మూలకారణమైయున్నది గనుక సావయవమన రాదు, జగదాకారముగ పరిణమించుటగలదు గనుక నిరవయవమన రాదు, విరుద్ధము గనుక ఉభయాత్మకము గాదు, ఏమనవలయు ననిన అనిర్వచనీయమని పలుకవలయును అనిర్వచనీయమనఁగా పలుకఁ దగనిది. మిథ్యఅనిభావము. యామాసామాయా ఏదినిషేధమైనదో అదిమాయఅనిఅర్థము. యానవిద్యతే సా అవిద్యా ఏది లేనిదో అది అవిద్య అని అర్థముగనుక సచ్చిదానంద పరబ్రహ్మవ్యతిరిక్తముగా వస్త్వంతరము లేదు. శ్రు॥ ఏకమేవాద్వితీయంబ్రహ్మ, విజ్ఞానమానందం బ్రహ్మ, తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నాత్పురుషః, సవాఏషపురుషోన్న రసమయః, ఐతదాత్మ్యమిదంసర్వం, తత్సత్యం, నేహనానాస్తికించన, మృత్యో స్సమృత్యుమాప్నోతి, యఇహ నానేవపశ్యతి, యతోవా ఇమానిభూతానిజాయంతే, ఏనజాతానిజీవంతి, యత్ప్రయంత్యభి సంవిశంతి, తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి, సదేవసోమ్యేదమగ్రఆసీత్, ఆత్మావా ఇదమేకఏవాగ్ర ఆసీత్, నాసదాసీన్నోసదాసీత్, యథా సోమ్యైకేన మృత్పిండేన విజ్ఞాతేనసర్వంమృణ్మయం విజ్ఞాతంస్యాత్, వాచారంభణంవికారో నామధేయంమృత్తికేత్యేవసత్యం, స్తబ్ధోప్య తదాదేశమప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతంభవత్యమతంమతమవిజ్ఞాతం విజ్ఞాతంస్యాత్, ఏకోదేవోబహుధానివిష్టః, ససర్వనామ సచవిశ్వ రూప, సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్యనామధేయాని. ప్రజ్ఞానం బ్రహ్మ, అని శ్రుతులు. శ్లో॥ యతస్సర్వాణిభూతాని భవంత్యాదియుగాగమే॥

యస్మింశ్చ ప్రళయం యాంతి పునరేవ యుగక్షయే । తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే॥ అని విష్ణుసహస్రనామము. శ్లో॥ లీయతే గమ్యతే యత్ర విశ్వంయేన చరాచరం। తదేతల్లింగమిత్యుక్తం లింగతత్వపరాయణైః। లీయతేలయమిత్యుక్తం గమ్యతే సృష్టిరుచ్యతే॥ అని లింగపురాణము. సర్వాధారో నిరాధారః, అనిగీత గనుక నిత్యసత్యపరబ్రహ్మమునందు ప్రపంచము పుట్టి పెరిగి గిట్టుచుండును గాని అత్యంతాభావమైన ప్రకృతివలన లోకము పుట్టుననుట గొడ్రాలి బిడ్డయన్నట్టుని భావము. కావునన్ = కనుక. ప్రపంచంబు = లోకము. మిథ్య = అబద్ధము. అని నిరూపించినన్ = అని నిర్ణయించి చెప్పిన పక్షమునను. ఆ ప్రపంచంబు = ఆలోకము. బ్రహ్మవిశేషణంబై = పరబ్రహ్మమును తెలియఁబఱచునదియై. కార్యకారణావస్థలు — కార్య = స్థావర క్రిమి జలచర పక్షి పశు నర సుర లనెడు ప్రాణులును ఆ ప్రాణులకు నిలువఁదగిన పదునాలుగు లోకములును ఆహారములును వస్త్రభూషణ పుష్పచందనాదులు ననెడి. కారణ = పంచమహాభూత పంచతన్మాత్రాహంకార మహత్తత్వావ్యక్తములు ననెడు. అవస్థలు = దశలు. కలిగియున్నంతమాత్రంబునన్ = కలిగియుండిన మాత్రముచేతనే. మిథ్యగావేరదు = అసత్యము కాఁజాలదు. ఆ ప్రపంచంబునకున్ = ఆజగత్తునకు. కార్యకారణావస్థలు = కార్యములు కారణములు అనెడు దశలు. నిత్యంబులు = శాశ్వతములు. కావునన్ = కనుక. అవస్థాద్వయయుక్తంబు = కార్యకారణావస్థలతోను గూడుకొన్నది. అయిన ప్రపంచంబు = అయినట్టి లోకము. సత్యంబు = సచ్చిదానందపరబ్రహ్మమందే పుట్టిలయించుచున్నది గనుక నిజమే. (అని) పెండ్లియున్ = మఱియును. అద్వైతి = అద్వైతమతస్థుఁడు, ఇట్లనున్ = ఇట్లు పలికెను. బహుగ్రంథప్రతిపాదితంబు = అనేకగ్రంథములయందుఁ జెప్పఁబడినది. అయిన జగన్మిథ్యాత్వంబు = అయినట్టి లోకము అసత్యమనుట. లేమి = లేకుండుట. ఎట్లనినన్ = ఏవిధము అనఁగా. అదియును = ఆజగన్మిథ్యాత్వమును. కర్మవశులు = ఆగామి సంచిత ప్రారబ్ధరూప కర్మకు అధీనులు. అయిన జడులన్ = అయినట్టి మూఢులను. అవిద్యాప్రతిపాదకంబై = అజ్ఞానముచేత చెప్పఁబడినదయి. కుతర్క పక్షేతంబు = భేదవాదముతోఁ గూడినది. అయిన భారతి = అయినట్టి వేదవాక్కు. అంధపరంపరా వ్యవహారంబునం జేసి = గ్రుడ్డివారి తరముల వెంబడి దైన వాడుక చేత. భ్రమియించున్ = భ్రమపెట్టును. కారణావస్థలయందున్ = ప్రపంచోత్పత్తి కారణములైన అవ్యక్త మహదాదుల లయావస్థలయందు. బ్రహ్మవిశేషణంబైన = పరబ్రహ్మమునకు విశేషణమైన — అనఁగా బ్రహ్మమును తెలుపునదియైన, సూక్ష్మరూపంబునన్ = చంద్ర ప్రకాశము చేత అంధకారమంతయు నశించి చంద్రునియందు కళంకరూపముగ నున్నట్టుగానే పరబ్రహ్మమునందు సూక్ష్మస్వరూపము చేత. ప్రపంచంబు = లోకము. సత్తై = శాశ్వతమై. (ఉండును) సత్యంబు = చెడనిది. బోధాయోగ్యంబు = నిర్వికల్ప జ్ఞానమునకుఁ దగినది. కావునన్ = కనుక. నీకు విశేషణంబైయుండును = ప్రపంచము నిన్ను తెలియఁబఱచునదియైయుండును. ( నీవు ) దేహగతుండవు = దేహమును బొందిన వాఁడవు. అయిన దేహియందున్ = అయినట్టి జీవునియందు. అంతర్వ్యాప్తివయ్యున్ = లోపల వర్తించువాఁడవుగా నుండియు. కర్మఫలంబులన్ = ఇచ్ఛ అనిచ్ఛ పరేచ్ఛ అనెడు కర్మములవలని ప్రయోజనములను. పొరయక = పొందక. కర్మఫలభోక్త = ఆయా సత్కర్మ దుష్కర్మములకుఁదగిన ఫలముల ననుభవించువాఁడు. అయిన జీవునకున్ = అయినట్టి క్షేత్రజ్ఞునకు. సాక్షిభూతంబవై = సాక్షియైనవాఁడవై. (ఉండుదువు) శ్లో॥ క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత॥ అనిగీత. క॥ పురుషుఁడన్న వేఱొకండే। పురుషోత్తముఁడైన యేనపురుషోత్తమతా। స్ఫురణకుఁ బురుషత్వంబును। మెరమెరగలదదియకాదె మెయికొనుఁగ్రియకున్॥ అని భారతము. అట్టినిన్నున్ = జీవసాక్షివైన నిన్ను. అజ్ఞులయిన మానవులు = శ్రుతియుక్త్యనుభవములు లేని అజ్ఞాన జీవులు. నిజకంఠలగ్నంబు = తమ మెడలయందు పొందినది. అయిన కంఠికామణి = అయినట్టి కంఠహారమునందలి రత్నము. నిత్యసన్నిహితంబై = ఎల్లప్పుడు దగ్గఱనుండునదియై. వెలుంగుచుండినన్ = ప్రకాశించుచుండినను. కానక = దానిని చూడక. వర్తించు తెఱంగునన్ = మెలఁగురీతిగా. హృదయపద్మమధ్యంబునన్ = తమ మనఃకమలము నడుమ. అనంత తేజోవిరాజమానుండవై = మేరలేని తేజస్సుచేత వెలుఁగుచున్నవాఁడవై. ప్రకాశించు నిన్నున్ = వెలుఁగునట్టి నిన్ను. తెలియలేరు = తెలిసికోఁజాలరు. శ్లో॥ సర్వత్రానస్థితో హ్యాత్మా న సర్వత్రావభాసతే । బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్॥ అంతస్థమాత్మాన మజం న దృష్ట్వా భ్రమంతి మూఢాః గిరిగహ్వరేషు॥ హృత్పుండరీకాంతర సన్నివిష్టం స్వతేజసా వ్యాప్తనభోవకాశం। అతీంద్రియం సూక్ష్మమనంతమాద్యం ధ్యాయేత్పరానందమయం మహేశం, అని. సకలాండనాయకుండవు = బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ మాయాండములకును అధిపతివి. అయిన నీయందున్ = అయినట్టి నీయందు. శ్రుతులు = వేదములు. ముఖ్యవృత్తిన్ = ఉపక్రమోపసంహారాది షల్లింగములచేత ప్రతిపాదింపఁబడిన స్వరూపజ్ఞానవృత్తిచేత. ప్రవర్తించున్ = నడచును — సమన్వయము లగుచుండును అనుట. (అని) శ్రుత్యధిదేవతలు = వేదములకు అధికరించునట్టి దేవతలు. నారాయణున్ = శ్రీపరమాత్మను. అభినందించిన తెఱంగునన్ = స్తుతించిన రీతిని. సనందనుండు = సనందన మహాముని. మహర్షులకున్ = శిష్యులైన మహామునులకు. ఎఱింగించిన ప్రకారంబు = తెలియఁజేసిన విధము. (అని) నారాయణ ఋషి = నారాయణుఁడు అను మహాముని. నారదునకున్ = నారదునితో, చెప్పినన్ = చెప్పఁగా. ఆమ్మహాత్ముండు = ఆగొప్పవాఁడైన నారదుఁడు. సజ్జనకుండు = మా తండ్రి. అయిన వేదవ్యాసమునీంద్రునకున్ = ఐనట్టి వేదవ్యాస మహామునికి. ఉపన్యసించెన్ = చెప్పెను. అయ్యర్థంబును = ఆవిషయమును. అతండు = ఆ వేదవ్యాసుఁడు. నాకుం జెప్పినవిధంబునన్ = నాతో చెప్పినరీతిని. (నీకు) చెప్పితిన్ = చెప్పినాను. ఈయుపాఖ్యానంబు = ఈకథ. సకలవేదశాస్త్రపురాణేతిహాససారంబు = ఎల్లవేదములయు శాస్త్రములయు పురాణములయు ఇతిహాసములయు సత్తయయిన యర్థము. ఉపనిషత్తుల్యంబు = ఉపనిషత్తులతో సమానము. దీనిన్ = ఈయితిహాసమును. పఠించువారును = చదువు వారును. వినువారును = వినునట్టివారును. విగతకల్మషులై = పోయిన పాపములు గలవారై. ఇహపరసౌఖ్యంబులన్ = ఈలోకమునందలివియు పరలోకమునందలివియునైన సుఖములను. ఒంది = పొంది. వర్తింతురు = ఉందురు. (అని చెప్పిన) శుకయోగీంద్రునకున్ = శుకమహామునికి. రాజయోగీంద్రుండు = రాజర్షియైన పరీక్షిత్తు. ఇట్లనియెన్ = ఇట్లు పలికెను,

తా॥ భూతభవిష్యద్వర్తమానములనెడి మూఁడుకాలములయందు చెడక యుండునదియగు మూలప్రకృతివలనఁ గలిగిన యీ ప్రపంచము

పైమూడు కాలములందును చెడనిదియే కావలెను అదియెట్లుసత్తగు ననిన బంగారుచేత చేయఁబడిన ఆభరణములు బంగారు వలెనే యున్నట్లు అని తెలిసికొనుము అని సాంఖ్యుఁడు చెప్పఁగా అద్వైతవాది ఆమాటవిని ఏదిపుట్టదో అదిసత్తుగాదు అను వ్యతిరేకవ్యాప్తి నియమము దేశకాలవస్తు పరిచ్ఛేద శూన్యమైనపరబ్రహ్మమునందు నిర్వివాదమై వర్తించునుగాని అసత్యమయిన ప్రకృతియందు వర్తింపదు, అట్లుకాదనెడిపక్షమున ఆప్రకృతి మూడుకాలములయందును బ్రహ్మజ్ఞానముచేత నాశమునొందుచున్నదికనుక అదిసత్తుకాదు, సత్తు కాకపోయినను దానియందేసత్త్వము ఆరోపితమగు ననెడుపక్షమున సదసత్త్వములు రెండును ఒకవస్తువునకుధర్మములు గానుండవు, పరబ్రహ్మమువలెన వేఱయినవికాదు గనుక భిన్నమనియనఁగూడదు, చేతనత్వము వచ్చుటచేత అభిన్నమనియుఁ జెప్పఁగూడదు, ప్రత్యక్షవిరోధము గనుక భిన్నమును అభిన్నమనని చెప్పసరిపడదు, మూలకారణమగుటచేత సావయవముగాదు, జగదాకారముగ పరిణమించుటచేత నిరవయవముగాదు, ఉభయాత్మకమనుటకును అనువుగాదు, మఱియేమియనవలెనన్న అనిర్వచనీయమని చెప్పవలెనుకనుక లోకము అబద్ధమని నిరూపించినపక్షమున ఆలోకము పరబ్రహ్మమును తోఁపించునదియై కార్యకారణదశలుగలిగి అసత్యముగాకయున్నది, ఆప్రపంచమునకు కార్యకారణావస్థలుస్వభావసిద్ధములు ఆరెండవస్థలునుగల ప్రపంచము సచ్చిదానంద పరబ్రహ్మమునందే పుట్టి నశించుచున్నదిగనుక అదిసత్యమేయనవచ్చును అనిచెప్పి అద్వైతిమఱియును చెప్పనారంభించెను, అనేకగ్రంథములయందు మిథ్యయనిచెప్పఁబడుచున్నజగత్తు సత్యము ఎట్లు అగును ఆజగత్తు మిథ్యయనుట ఆగామి సంచిత ప్రారబ్ధకర్మములలోమునిఁగి మెలఁగుమూఢులను, అజ్ఞానముచేతఁ జెప్పఁబడినదియు భేదవాదముతోఁ గూడినదియు నైన భేదవాక్యము అనేకులుగ్రుడ్డివారుకన్నుగానక ఒకరినివెంబడించియొకరు పోవునట్లు మెలఁగెడు వాడుకచేత భ్రమపెట్టును, ప్రపంచోత్పత్తికారణములయినఅవ్యక్తమహదాదులు లయించునట్టిదశయందుబ్రహ్మమునకు విశేషణమయిన ప్రపంచము సత్తైయుండును, సత్యము నిర్వికల్పజ్ఞానమునకు పాత్రము గనుక ఆప్రపంచము నిన్ను తెలియఁజేయునదియై యుండును, నీవు దేహమును ధరించిన జీవునిలోపల వర్తించువాఁడవైయుండియు కోరినవియు కోరనివియు అన్యులచేతకోరఁబడినవియునైన క్రియలవలని ప్రయోజనములనుపొందక అకర్మములవలని ఫలములను అనుభవించువాఁడైన జీవునకుసాక్షివైయుండుదువు, జీవసాక్షివైననిన్ను అజ్ఞానులగువారు తమమెడలయందలి హారములలోని రత్నములు తమదగ్గఱనే వెలుఁగుచున్నవైనను చూచి తెలిసికోలేక యుండునట్లు తమ హృదయకమలములలో మేరలేనితేజస్సుతో వెలుఁగొందుచుండునట్టినిన్ను తెలిసికోలేరు, నీవుబ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ మాయాండములకు అధిపతివి అట్టినీయందు వేదములు ఉపక్రమోప సంహారాదులైన ఆఱు లింగములచేతను ప్రతిపాదింపఁబడిన స్వరూపజ్ఞానవృత్తిచేత సమన్వయము చేయఁబడుచుండును అని వేదములను అధికరించునట్టి దేవతలు శ్రీమన్నారాయణుని పొగడినరీతిని సనందనమహాముని తనశిష్యులయిన మహామునులకుఁ జెప్పినవిధమున నారాయణమహర్షి నారదునకు బోధింపఁగా ఆనారదుఁడు మాతండ్రియైన వ్యాసమహామునికి చెప్పెను, ఆవేదవ్యాసుఁడు నాకు బోధించెను, ఆయన నాకుబోధించినవిధమున నేనునీకుఁ జెప్పితిని, ఈవిషయము సకలమైన వేదములయు శాస్త్రములయు పురాణములయు ఇతిహాసములయుసారమైనది, ఇది ఉపనిషత్తులతోసమానము, ఈయితిహాసమును చదువువారును వినువారును ఎల్లపాపములవలనను విడువఁబడినవారై ఇహపర లోకసుఖములను అనుభవింతురు అని శుకమహాముని చెప్పఁగా పరీక్షిత్తువిని యీవిధముగా పలికెనని తాత్పర్యము.

## (*) పరీక్షిత్తునకు శుకయోగి విష్ణుసేవాప్రాశస్త్యంబు చెప్పుట. (*)

మ॥ మునినాథోత్తమ దేవదానవులలో *
ముక్కంటి సేవించువా
రనయంబుఁ బహుశక్తిసంపదలసౌ *
ఖ్యానందులై యుండ న
వ్వనజాతాక్షు రమామనోవిభుని శ *
శ్వద్భక్తిసేవించు స
న్మునివర్యుల్దఁబేదలౌటకుఁగతం *
బున్నాకెఱింగింపవే.

టీ॥ మునినాథోత్తమ = మునీశ్వరులలో శ్రేష్ఠుఁడవైనఓశుకుఁడ. దేవదానవులలోన్ = దేవతలలోనుదానవులలోను. ముక్కంటిన్ = శివుని. సేవించువారు = కొలుచువారు. అనయంబున్ = మిక్కిలి. బహుశక్తిసంపదలన్ = మిక్కుటమగుబలముచేతను కలిమిచేతను. సౌఖ్యానందులై = సౌఖ్యమును సంతోషమును గలవారై. ఉండఁగ = ఉండఁగా. రమామనోవిభునిన్ = లక్ష్మీదేవికిమనోనాయకుఁడైన. ఆవ్వనజాతాక్షున్ = ప్రసిద్ధుఁడైన విష్ణుమూర్తిని. శశ్వద్భక్తిన్ = మిక్కిలిభక్తితో. సేవించు

పరీక్షిన్మహారాజు.

శుకమహర్షి.

సన్మునివర్యులు=కొలుచునట్టివారైన మునిశ్రేష్ఠులు. కడుఁ = మిక్కిలి. పేదలు=దరిద్రులు. ఔటకున్=అగుటకు. కతంబున్ = కారణమును. (నాకు) ఎఱింగింపవే=తెలియఁజేయవయ్యా.

తా॥ ఓశుకమహామునీశ్వరుఁడా! దేవతలలోను దానవులలోను ఎవరుశివుని కొలుతురో వారుమిక్కిలిబలమును సంపదయుఁగలవారై యున్నారు, ఎవరుశ్రీలక్ష్మీభర్తయైన నారాయణమూర్తినికొలుతురో వారుదరిద్రులై యున్నారు అందులకు కారణమేమో నాకు తెలియఁజేయుము అనిపరీక్షిన్మహారాజు అడిగెనని తాత్పర్యము.

౧౨౨౭.—సీ॥ నావుడుశుకయోగి ✻ నరనాథుఁగనుఁగొని - వినుమెఱింగింతుఁ ద ✻ ద్విధముఁదెలియ
ఘనశక్తి సహితుండు ✻ కాలకంధరుఁడు దా - వినుత గుణక్రియా ✻ న్వితుఁడుగాన
రాగాది యుక్తుఁడై ✻ రాగిల్లు సంపద - లాతనిఁ గొలుచువా ✻ రందుచుందు
రచ్యుతుఁ బరము న ✻ నంతు గుణాతీతుఁ - బురుషోత్తముని నాది ✻ పురుషు ననఘు
తే॥ నర్థి భజియించువారు రా ✻ గాదిరహితు । లగుచు దీపింతు రెంతయు ✻ ననఘచరిత
ధర్మ నందనుఁ డశ్వమే ✻ ధంబు చేసి । పిదప సాత్త్విక కథనము ✻ ప్రీతితోడ.

టీ॥ నావుడున్=అనఁగా. శుకయోగి = శుకమహాముని. నరనాథున్=రాజును. కనుఁగొని=చూచి. తద్విధమున్=ఆవిధమును. తెలియన్=విశదముగా. ఎఱింగింతున్=తెలియఁజేసెదను. (వినుము) ఘనశక్తిసహితుండు-గొప్పదియైనస్వశక్తితోఁగూడుకొన్నవాఁడగు. కాలకంధరుఁడు=శివుఁడు. (తాను)వినుత=కొనియాడఁబడిన. గుణక్రియాన్వితుఁడు=సర్వజ్ఞత్వాదిగుణములతోడనువానిక్రియలతోడను గూడినవాఁడు. కానన్=కనుక. రాగాదియుక్తుఁడై=అనురాగము మొదలగువానితోఁగూడినవాఁడై. రాగిల్లు=ప్రకాశించునట్టి. సంపదలు=కలుములను. ఆతనిన్=ఆశివుని. కొలుచువారు=సేవించువారు. అందుచుందురు = పొందుచుందురు. పరమున్ = సర్వోత్కృష్టుఁడును. అనంతున్=అంతములేనివాఁడును. గుణాతీతున్=త్రిగుణములకు పైనియైనవాఁడును(లేక) హేయగుణములనెల్లను మీఱినవాఁడును. పురుషోత్తమునిన్ = పురుషశ్రేష్ఠుఁడును. ఆదిపురుషున్ = జగత్సృష్టికారణమైనపరబ్రహ్మమైనవాఁడును. అనఘున్=పాపములేనివాఁడునైన, అచ్యుతున్=జననమరణాదులులేనివిష్ణుమూర్తిని. అర్థిన్=ఇష్టముతో-భక్తితో. భజియించువారు=కొలుచువారు. రాగాదిరహితులు=రాగము ద్వేషము మొదలగునవిలేనివారు. (అగుచు) ఎంతయున్=మిక్కిలి. దీపింతురు=ప్రకాశింతురు. అనఘచరిత=నింద్యముగానినడవడికగలఓపరీక్షితుఁడా: ధర్మనందనుఁడు=ధర్మరాజు. అశ్వమేధంబు=అశ్వమేధయాగమును. (చేసి) పిదపన్=పిమ్మట. ప్రీతితోడన్ = సంతోషముతో. సాత్త్వికకథనము=సత్త్వగుణప్రధానమయిన కథను. వినుచుండియని పైపద్యములో క్రియయున్నది.

తా॥ అనఁగా శుకుఁడు పరీక్షిన్మహారాజును చూచి, ఓరాజా! నీవడిగిన విషయమునువిశదముగా తెలియఁజెప్పెదనువినుము; అధికశక్తియుక్తుఁడైనశివుఁడు ప్రసిద్ధమైన సర్వజ్ఞత్వాది గుణములతోడను క్రియలతోడను గూడుకొన్నవాఁడుగనుక రాగాదులతోఁగూడి వెలుఁగునట్టి కలుములు ఆశివునిఁ గొలుచునట్టివారికి కలుగుచున్నవి, సర్వోత్కృష్టుఁడును, దేశకాలవస్తు పరిచ్ఛేదములు లేనివాఁడును, త్రిగుణములు లేనివాఁడును, (లేక) నిఖిలహేయ గుణములు లేనివాఁడును, పురుషోత్తముఁడును, పురాణపురుషుఁడును, పాపములు లేనివాఁడునునైన శ్రీమన్నారాయణునికొలుచువారు రాగాదులులేనివారై మిక్కిలిప్రకాశింతురు, మునుపుధర్మరాజు అశ్వమేధయాగము చేసి ఆయాగముచేసినపిమ్మటసత్త్వగుణప్రధానములగుసత్కథలను వినుచుండి యని తాత్పర్యము.

౧౨౨౮.—ఉ॥ నారదసంయమీంద్రువల ✻ నన్ వినుచుండి యనంతరంబ పం
కేరుహ నాభుఁజూచి యడి ✻ గెన్ దగనిప్పుడు నీవునన్ను నిం
డారిన భక్తిమై నడిగి ✻ నట్లు యతండును మందహాస సం
స్ఫార కపోలుఁడై పలికెఁ ✻ బాండు తనూభవుతోడఁ జెప్పఁగన్.

టీ॥ నారదసంయమీంద్రువలనన్=నారదమహాముని వలన. వినుచుండి=ఆసాత్త్వికకథనమును వినుచుండి. అనంతరంబ = అటుపిమ్మటనే. పంకేరుహనాభుఁజూచి=శ్రీకృష్ణునిఁజూచి. (ఇప్పుడునీవునన్ను) నిండారిన భక్తిమైన్=సంపూర్ణభక్తితో. అడిగినట్లు = అడిగిన రీతిగానే. తగన్=ఒప్పునట్లు (అడిగెను) అతండును=ఆకృష్ణుఁడును. మందహాససంస్ఫారకపోలుఁడై = చిఱునవ్వుచేత నిగనిగమెఱయుచున్న చెక్కిళ్లుగలవాఁడై. పాండుతనూభవుతోడన్=పాండురాజు కొడుకైనధర్మరాజుతో. చెప్పఁగన్=శీఘ్రముగా. పలికెన్=చెప్పెను.

తా॥ నారదమహామునివలన సాత్త్వికములైన కథలను వినుచుండి వెంటనేకృష్ణమూర్తినిఁజూచి యిప్పుడు నీవు అడిగినట్టుగానే ఒప్పిదముగా అడుగఁగా కృష్ణుఁడును చిఱునవ్వు నవ్వుచు ధర్మరాజునకు ప్రత్యుత్తరము చెప్పెను అని తాత్పర్యము.

౧౨౨౯.—సీ॥ వసుమతీనాథ యె ✻ వ్వనిమీఁద నాకను - గ్రహబుద్ధి వొడము నా ✻ ఘనుని విత్త
మంతయుఁ గ్రమమున ✻ నపహరించినవాఁడు - ధనహీనుఁడగుచు సం ✻ తాపమందు
విడుతురు బంధు ల ✻ వ్విధమున నొందిలి - మై చేయునదిలేక ✻ యఖిల కార్య
భాగంబు లుడిగి మ ✻ ద్భక్తులతో మైత్రి - నెఱపుచు విజ్ఞాన ✻ నిరతుఁ డగుచుఁ

తే॥ పిదప వాఁడవ్యయానంద * పదమునాత్మఁ । బరఁగి శ్రీవిష్ణులోక సం * ప్రాప్తినొందుఁ
గాన మత్సేవ మిగుల దు * ష్కరమటంచు । వదలిభజియింతు రితరదే * వతల నెపుడు.

టీ॥ వసుమతీనాథ=రాజా. ఎవ్వనిమీఁదన్=ఎవనిపైని. (నాకు) అనుగ్రహబుద్ధి=అనుగ్రహింప వలెననుబుద్ధి. పొడమున్=పుట్టునో. అఘునినిత్తమంతయున్=అగొప్పవానిధనమంతయు. క్రమమునన్=క్రమముగా—నానాట. అపహరించినన్=మోసపుచ్చి తీసికొన్నపక్షమున. వాఁడు=ఆమనుష్యుఁడు. ధనహీనుఁడగుచున్=ధనముచేత తక్కువయినవాఁడగుచు. సంతాపమందున్=దుఃఖమును పొందును. బంధులు=చుట్టములు. విడుతురు = వానినివిడిచిపెట్టుదురు. అర్థిమునన్=ఆరీతిగా. ఒంటరియై = ఒంటరివాఁడై. చేయనదిలేక = చేయఁగలపని యేదియు లేక. అఖిలకార్యభాగంబులు=ఎల్లపనులును. ఉడిగి=మాని. మద్భృత్యులతోన్=నాసేవకులతో. మైత్రినెఱపుచున్=స్నేహముచేయుచు. విజ్ఞాననిరతుఁడు=సర్వముభగవంతుఁడేయనెడు విశేషజ్ఞానమునందు ఆసక్తుఁడు. అగుచున్=అయి. పిదపన్=పిమ్మట వాఁడు=అట్టిమనుష్యుఁడు. అవ్యయానందపదమున్=చెడనియానందమునకు ఉనికిపట్టయిన. ఆత్మన్=మనసుచేత. పరఁగి=ప్రసిద్ధుఁడై. శ్రీవిష్ణులోకసంప్రాప్తిన్=శ్రీవిష్ణులోకమునందుఁ జేరుటను. ఒందున్=పొందును. కానన్=కనుక. మత్సేవ = నాకొలువు. మిగులదుష్కరము=మిక్కిలికష్టము. అటంచున్=అని. (వదలి) ఎపుడున్=ఎల్లప్పుడు. ఇతరదేవతలన్=అన్యదేవతలను. భజియింతురు=కొలుతురు.

తా॥ ఎవనిపైని అనుగ్రహింప వలెనను బుద్ధిపుట్టునో వానిధనమంతయు నానాట నేనపహరింతును, అంతట ఆట్టిమానవుఁడుధనములేనివాఁడై దుఃఖపడుచుండును, అంతటబంధువులందఱు వానినివిడిచిపెట్టిపోదురు, అట్లు ఒంటరివాఁడై యేమిచేయను తోఁచక యెల్లపనులుమాని నాసేవకులతో చెలిమిచేసి ( జలేవిష్ణుస్థలేవిష్ణుః విష్ణుస్థావరజంగమే । అంతర్విష్ణు ర్బహిర్విష్ణు స్సర్వంవిష్ణు మయంజగత్॥) అనెడు విశేషజ్ఞానమునుపొంది ఎప్పుడును చెడని సంతోషముతోడి మనసు గలవాఁడై శ్రీవిష్ణులోకమును పొందునుగనుకనన్ను సేవించుట కష్టమని యెల్లప్పుడు ఇతర దేవతలనే సేవించుచుందురు అని తా.

౧౨౩౦.—క॥ సేవింప వారు దమకుం । గావించిన శోభనములఁ * గని నిజములుగా
భావించివారుమఱతురు । భావములఁ గృతఘ్నవృత్తిఁ * బని తమపనిగన్.

టీ॥ సేవింపన్=కొలువఁగా. వారు=ఆదేవతలు. (తమకు) కావించినశోభనములన్=చేసినమేలులను. కని=పొంది. నిజములుగాన్=సత్యములుగా. భావించి=తలఁచి, వారు=ఆమేలునుపొందినజనులు. కృతఘ్నవృత్తిన్=చేసినమేలు మఱచునట్టి వ్యాపారముతో. పని = అగుచున్న కార్యము. తమపనిగన్ = తమవల్లనే అయినపనిగా. భావములన్=మనసులయందు. (తలఁచుకొని) మఱతురు = తమకు మేలులనుకలుగఁజేసిన దేవతలను సైతము మఱచిపోదురు.

తా॥ అట్లు ఇతరదేవతలను సేవింపఁగా ఆదేవతలు వారికి శుభములను కొన్నిటిని కలుగఁ జేయుదురు, ఆశుభములే శాశ్వతములని ఆవితమవల్లనే అయినపనులని యెంచి కృతఘ్నులై తమకు శుభముల నిచ్చినదేవతలనుసైతము మఱచిపోదురు అని తాత్పర్యము.

(*) నారదుఁడు శివునినారాధింపుమని వృకాసురునకుఁ జెప్పుట. (*)

క॥ మెలఁగుచు నుందురు దీనికిఁ । గలదొకయితిహాసమిపుడు * గైకొని నీకుం
దెలియఁగఁ జెప్పెదదానన । యలవడునీవడుగుప్రశ్న * కగునుత్తరమున్.


వృకాసురుఁడు.

టీ॥ మెలఁగుచుందురు = ( ముందుచెప్పినచొప్పున సర్వముతమవల్లనే జరగుచున్నదని యెంచి) వర్తించుచుందురు. దీనికిన్=ఇట్లుప్రవర్తింతురు అనుటకు. ఒకయితిహాసము=పూర్వకథయొకటి. (కలదు) ఇపుడు=ఇప్పుడు. గైకొని=ఆకథనుపట్టి. (నీకు) తెలియఁగఁజెప్పెదన్=విశదమగునట్లుచెప్పెదను. దానన=విశదముగా చెప్పుటచేతనే. (నీవు) అడుగుప్రశ్నకున్=అడుగునట్టిప్రశ్నకు. అగునుత్తరమున్=తగినట్టియుత్తరముకూడ. అలవడున్=సరిపడును.

తా॥ ముందుచెప్పిన చొప్పున తమకు శుభములు కలుగఁజేసిన దేవతలనుసైతము మఱచి అన్నిపనులు తమవల్లనైనవేయని తిరుగుచుందురు. ఇందులకు ఒకపూర్వకథగలదుదానినినీకుఁ జెప్పెదను ఆకథయేనీవు అడిగినదానికి ఉత్తరమును అగును అనితాత్పర్యము.

౧౨౩౧.—క॥ శకుఁడను దైత్యుని తనయుఁడు । వృకుఁడనువాఁడొకఁడు దుర్వి * వేకుఁడు సుజన
ప్రకరముల నలఁపఁ దెరువున । నొకనాఁ డొదిగుండి దివ్య * యోగిం గనుచున్.

టీ॥ (శకుఁడు) అనుదైత్యునితనయుఁడు = అనునట్టియసురుని కొడుకు. (వృకుఁడు) అనువాఁడొకఁడు = అను పేరుగల యొక అసురుఁడు. దుర్వివేకుఁడు=దుష్టబుద్ధిగలవాఁడు. సుజనప్రకరములన్=సజ్జనులసమూహములను. అలఁపన్=శ్రమపెట్టుటకు. ఒకనాఁడు=ఒకదినము. తెరువునన్=మార్గమునందు. ఒదిఁగుండి=దాఁగియుండి. దివ్యయోగిన్=దేవమునియైన నారదుని. కనుచున్=చూచుచు.

తా॥ శకునుఁడు అను పేరుగల అసురునికి వృకుఁడు అను పేరుగల కొడుకొకఁడు కలఁడు వాఁడు, యోగ్యులను పెద్దలనెల్లను బాధించుచు ఒకనాఁడు ఒకదారిలో దాఁగియుండి ఆదారిని బోవుచున్న నారదమహామునినిజూచి యని తాత్పర్యము.

౧౨౩౩.—క॥ కరములు మోడిచి మౌనీ । శ్వర నారద లలిత ధీవి * శారద నన్నుం
గరుణించి యానతీ శుభ । కరులగు హరిహర హిరణ్య * గర్భులలోనన్.

౧౨౩౪.—ఆ॥ కడఁగి కొలువ శీఘ్ర * కాలంబులోఁ దన । యిష్టమయిన వరము * లిచ్చునట్టి
దైవ మెవ్వఁడనిన * దానవుఁ గనుఁగొని । మునివరుండు వలికె * ముదముతోడ.

టీ॥ కరములు మోడిచి = చేతులు జోడించికొని. మౌనీశ్వర = మునిశ్రేష్ఠుఁడవైన. లలితధీవిశారద=మనోజ్ఞమైన బుద్ధిచతురతగల. నారద=నారదుఁడా. శుభకరులు=మేలుకలుగఁజేయువారు. అగు= అయిన. హరిహరహిరణ్యగర్భులలోనన్=విష్ణుశివబ్రహ్మలలో. కడఁగి= పూని. కొలువన్ = సేవచేయఁగా. శీఘ్రకాలంబులోన్ = శీఘ్రకాలములో. తనయిష్టమయినవరములు = తానుకోరిన వరములను. ఇచ్చునట్టిదైవము=ఇచ్చునట్టిదేవుఁడు. ఎవ్వఁడు=ఎవఁడు. నన్నున్= నాయందు. కరుణించి=దయచేసి. ఆనతీ = ఆనతియిమ్ము—సెలవిమ్ము. అనినన్=అనఁగా. దానవున్=వృకాసురుని. కనుఁగొని=చూచి. ముదముతోడన్=సంతోషముతో. మునివరుండు = మునిశ్రేష్ఠుఁడైన నారదుఁడు. పలికెన్=చెప్పెను.

తా॥ చేతులు జోడించుకొన్నవాఁడై మునిశ్రేష్ఠుఁడవును, తెలివితోడి బుద్ధిగలవాఁడవునైన యోనారదా! ప్రాణులకు మేలుగలుగఁజేయువారైన విష్ణువు శివుఁడు బ్రహ్మ అనెడు త్రిమూర్తులలోను ప్రయత్నముతో తన్ను సేవించువాని కోరికలను శీఘ్రకాలములోనే యిచ్చునట్టిదేవుఁడు ఎవఁడో దయచేసినాకుఁదెలియఁజెప్పుము అని అడుగఁగా నారదమహాముని అందుకు సంతోషించినవాఁడై యిట్లు చెప్పెనని తాత్పర్యము.

వ॥ వినుము దుర్గుణ సుగుణంబులలో నొక్కటి యెచ్చటఁగలుగు నచ్చట నాక్షణంబ కోపప్రసాద ఫలంబులు చూపువాఁడమ్మువ్వురయందు ఫాలలోచనుం డివ్విధంబు తెలిసినవారై బాణాసురదశకంధరులు సమగ్ర భక్తియుక్తులై సేవించి యసమానసామ్రాజ్యవైభవంబుల నొంది ప్రసిద్ధులై రట్లుగావున నీవునమ్మహాత్ముని సేవింపు మతనివలన నభిమతఫలంబులు వేగంబ ప్రాప్తంబయ్యెడి నని చెప్పిన నతండాక్షణంబ.

టీ॥ (వినుము) దుర్గుణ సుగుణంబులలోన్ = చెడ్డగుణములలోను మంచిగుణములలోను. ఒక్కటి=ఏదైననొకటి. ఎచ్చటన్=ఎక్కడ. కలుగున్=కలుగునో. అచ్చటన్=అక్కడ. ఆక్షణంబ = అప్పుడే. కోపప్రసాద ఫలంబులు=కోపము అనుగ్రహము వీనివలని ప్రయోజనములు. చూపువాఁడు = కనఁబఱచువాఁడు. అమ్మువ్వురయందున్ = ఆవిష్ణు శివ బ్రహ్మలలో. ఫాలలోచనుండు = శివుఁడు. ఇవ్విధంబు= శివుఁడు ఇట్టివాఁడగుటను. తెలిసినవారై=తెలిసికొన్నవారై. బాణాసురదశకంధరులు=బాణాసురుఁడును రావణాసురుఁడును. సమగ్ర= పూర్ణమైన. భక్తియుక్తులై=భక్తితోఁగూడుకొన్నవారై. సేవించి = కొలిచి. అసమాన సామ్రాజ్యవైభవంబులన్ = ఈడులేని ప్రభుత్వ సంపదలను. ఒంది=పొంది. (ప్రసిద్ధులైరి) అట్లుగావునన్=అట్లగుట వలన. (నీవును) అమ్మహాత్మునిన్=ఆగొప్పవాఁడైనశివుని. సేవింపుము= కొలువుము. అతనివలనన్=ఆశివునివలన. అభిమత ఫలంబులు=కోరిన కోరికలు. వేగంబ=శీఘ్రముగానే. ప్రాప్తంబయ్యెడిన్ = లభించును. అనిచెప్పినన్ = అనినారదుఁడుచెప్పఁగా. అతండు = వృకాసురుఁడు. ఆక్షణంబ=అప్పుడే.

తా॥ (వినుము) మంచిచెడ్డగుణములలో ఏగుణములుకలిగియున్నను చెడ్డగుణములు గలవారియెడల కోపమును మంచి గుణములు గలవారియెడల అనుగ్రహమును గలవాఁడై అందులకుఁదగినఫలమును అప్పుడే కలుగఁజేయువాఁడు శ్రీవిష్ణువుబ్రహ్మ శివుఁడు ఈముగ్గురిలోను శివుఁడే గాని యితరుఁడుకాఁడు శివుఁడు అటువంటివాఁడు అని తెలిసికొని ఆతనినికొలిచి యీడులేని ప్రభుత్వ సంపదనుపొంది బాణాసురుఁడును రావణాసురుఁడును మిక్కిలి ప్రసిద్ధిని వహించిరి కాఁబట్టినీవును ఆశివమూర్తినికొలిచి కోరినకోరికలను నెఱవేర్చుకొనుము అని నారద మహాముని చెప్పఁగా అప్పుడే వృకాసురుఁడు శివసేవ చేయఁబూనిన వాఁడైయని తాత్పర్యము.

౧౨౩౫.—సీ॥ దీపించు కేదార * తీర్థంబునకు నేగి - యతిసాహసాత్మకుం * డైన యసుర
లోకము ల్వెఱఁగంద * నాకాలకంధరు - వరదుని నంబికా * వరునిఁ గూర్చి
తనమేని కండలు * దండుఁడైఖండించి - యగ్ని కాహుతులుగా * నలరవేల్చి
దర్పకారాతి ప్ర * త్యక్షంబు గాకున్న - జడియక సప్తవా * సరములందుఁ,
తే॥ బూని తత్తీర్థమునఁ గృత * స్నానుఁడగుచు । వెడలి మృత్యువుఁగోఱనా * వెలయునట్టి
గండ్రగొడ్డంటఁ దనమస్త * కంబుఁదునుము । కొనఁగఁబూనిన నయ్యగ్ని * కుండమునను.

టీ॥ దీపించు=ప్రకాశించునట్టి. కేదారతీర్థంబునకున్=కేదారము అను పుణ్యతీర్థమునకు. ఏగి=పోయి. అతిసాహసాత్మకుండు=మిక్కిలి తెగువతోడి బుద్ధిగలవాఁడు. అయినయసుర=అయినట్టి యావృకాసురుఁడు. లోకములు = లోకములలోని జనులు. వెఱఁగందన్ = ఆశ్చర్యపడునట్లుగా. వరదునిన్ = కోరినకోరికల నిచ్చువాఁడైన. అంబికావరునిన్=పార్వతీదేవికి పెనిమిటియైన. అకాలకంధరున్ =

శివుని. కూర్చి=గుఱించి. ఉద్దండుఁడై=మిక్కిలియధికుఁడై. తనమేని కండలు=తన దేహములోనిమాంసములను. ఖండించి=కోసి. అగ్నికిన్= అగ్నిహోత్రమునకు. ఆహుతులుగాన్ = ఆహుతులు అగునట్లుగా. అలరన్=ఒప్పిదముగా. వేల్చి=హోమము చేసి. దర్పకారాతి=మన్మథునకుపగవాఁడైన శివుఁడు. ప్రత్యక్షంబు గాకున్నన్ = తనయెదుట కానరాకపోఁగా. జడియక=భయపడక. సప్తవాసరములు=ఏడుదినములు. ఆందున్ = అచ్చట. పూని=ప్రయత్నపడి. తత్తీర్థమునన్ = ఆకేదారతీర్థమునందు. కృతస్నానుఁడు = చేయఁబడిన స్నానముగలవాఁడు. అగుచున్ =అయి. వెడలి=బయటికివచ్చి. మృత్యువుకోఱనాన్= మృత్యుదేవతయొక్క కోఱపల్లో అనునట్లుగా. వెలయునట్టి=ఒప్పునట్టి. గండ్రగొడ్డంటన్ = గండ్రగొడ్డలితో. తనమస్తకంబున్=తనతలను. తునుముకొనఁగన్=నఱుకుకొనుటకు. పూనినన్=ప్రయత్నపడఁగా. అయ్యగ్నికుండమునను,= ఆయగ్ని గుండమునందుండి.

తా॥ ఆవృకాసురుఁడు ప్రకాశించునట్టి కేదారమనెడు పుణ్యతీర్థమునకుఁబోయి తెగువగల మనసుతో ఎల్లలోకులును ఆశ్చర్యపడునట్లు కోరినకోరికలను నెఱవేర్చువాఁడును శ్రీపార్వతీ పతియునైన శివునిఁగూర్చి జంకక తన దేహములోనిమాంసమును ఖండములుఖండములుగాఁగోసి అగ్నిలోవేల్చి అందులకు శివుఁడు ప్రత్యక్షము కాకపోఁగా ధైర్యముతో ఆకేదారతీర్థమునందు ఏడుదినములు స్నానముచేసి లేచి వచ్చి మృత్యువుయొక్క కోఱవలెవెలుఁగుచున్న గండ్రగొడ్డలితో తన తలనఱుకొనుటకు యత్నించుచుండఁగా ఆయగ్నికుండము నందుండి యనితాత్పర్యము.

## (*)వృకాసురునకుశివుఁడుప్రత్యక్షమైవరమిచ్చుట.(*)

క॥ అరుదుగ వెలువడి రుద్రుఁడు
గరుణ దలిర్పంగ వాని ✻ కరమాత్మకరాం
బురుహమునఁబట్టి తెగువకుఁ
జోరవలవదు మెచ్చువచ్చె ✻ సుమహితచరితా.

టీ॥ రుద్రుఁడు = శివుఁడు. అరుదుగన్=వింతగా. వెలువడి = బయలుదేఱివచ్చి. కరుణ=దయ. తలిర్పంగన్ = చిగిరింపఁగా—అతిశయింపఁగా. వానికరము=వానిచేయి. ఆత్మకరాంబురుహమునన్ = తనహస్తకమలముతో. పట్టి=పట్టుకొని. సుమహితచరితా=మిక్కిలిమేలైనచరిత్రము గలవాఁడా. మెచ్చువచ్చెన్=నీచరిత్రమునకు నేను మెచ్చుకొంటిని. తెగువకుఁజోరవలవదు=సాహసమునకు చొరవద్దు.

తా॥ శివుఁడు వింతగా బయలువెడలివచ్చి వానియందలిదయ అతిశయింపఁగా తనచేతితో వానిచేయి పట్టుకొని మంచి నడవడి గలఓయి వృకాసురుఁడా ! నీధైర్యమునకు మెచ్చుకొన్నాను.ఇఁక తెగువకు చొరవలదు అనిపలికెనని తాత్పర్యము.




### వి శే షా ర్థ ము.

టీ॥ రుద్రుఁడు = వ్యు॥ రుద్‌సాంసారికదుఃఖంద్రావయతి నాశయతీతి రుద్రః॥ అనివ్యుత్పత్తి, సంసారదుఃఖమును నశింపఁజేయునట్టి విజ్ఞానస్వరూపుఁడుఅనిఅర్థము. రుద్, రోదనేఅనిధాతువు. (సర్వోవైరుద్రః ) అనిశ్రుతి. సర్వమురుద్రుఁడేయనిభావము: సర్వశబ్దమునకు ఓంకారమర్థముగనుక(ఓమిత్యేకాక్షరంబ్రహ్మ ఓమితిబ్రహ్మ ఓమితీదగ్ం సర్వం ఓంభూః ఓంభువః ఓగ్ంసువః ఓంమహః. ఓంజనః ఓంతపః ఓగ్ంసత్యం ఓంతద్బ్రహ్మ ఓంతద్వాయుః ఓంతదాత్మా ఓంతత్సత్యం ఓంతత్సర్వంఓంతత్పురోర్నమః అంతశ్చరతిభూతేషు గుహాయాం విశ్వమూర్తిషు త్వంయజ్ఞస్త్వం వషట్కార స్త్వ మింద్రస్త్వం విష్ణుస్త్వం రుద్రస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః త్వంతదాప ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం॥ అనిశ్రుతి, కంటికికనఁబడెడు చెవికివినఁబడెడు మనస్సుచేత నూహింపఁబడెడు పదునాలుగు లోకములును, లోకాధిపతులునులోకములలోనిసర్వప్రాణులును,ఆప్రాణులకుఁదగిన ఆహార వస్త్ర భూషణ చందన పుష్పాదులును, బ్రహ్మాది దేవతలును రుద్రుఁడే యని అర్థము. శ్లో॥ సద్యోజాతాత్తథాభూమి ర్వామదేవోద్భవంజలం । అఘోరాద్వహ్నిరుత్పన్న స్తత్పురుషాద్వాయురుచ్యతే । య్యీశానాద్గగనంజాతం పంచబ్రహ్మమయంజగత్॥ పృథ్వీబ్రహ్మాజలే విష్ణు స్తథారుద్రోహుతాశనః। ఈశ్వరఃపవనశ్చైవ ఆకాశేతుసదాశివః॥ తా॥ బ్రహ్మ అధిదేవతగాఁగలభూమి శివునిసద్యోజాత ముఖమునందు పుట్టెను. శ్రీమహావిష్ణు వధిదేవత గాఁగల జలము శివుని వామదేవముఖమునందుపుట్టెను. రుద్రుఁడు అధిదేవతగాఁగల అగ్ని శివుని అఘోర ముఖమునందు పుట్టెను. ఈశ్వరుఁడు అధిదేవత గాఁగల వాయువు శివునితత్పురుష ముఖమునందు పుట్టెను. సదాశివుఁడు అధిదేవతగాఁగల ఆకాశము శివునియీశానముఖమునందుపుట్టెను గనుక పంచభూతములును వానికి అధిదేవతలైన పంచబ్రహ్మలును శివస్వరూపములేయనియును లోకముపంచబ్రహ్మమయమైనదనియును భావము. శ్లో॥ ద్వయముష్ణంద్వయంశీతం అనుష్ణాశీతలద్వయం। ద్వయమస్పర్శనంచైవ పాంతునశ్శివమూర్తయః॥ భూరంభాంస్య నలోనిలోంబర మహర్నాథోహి మాంశుఃపుమా। నిత్యాభాతిచరాచరాత్మకమిదంయస్యైవమూర్త్యష్టకం। నాన్యత్కించనవిద్యతేవిమృశతాంయస్మాత్పరస్మాద్విభో। తస్మైశ్రీగురుమూర్తయే నమఇదంశ్రీదక్షిణామూర్తయే॥ అని యున్నదిగనుక పంచభూతములును సూర్యచంద్రులును పురుషుఁడును అనెడి అష్టరూపములును శివుఁడే, శివునికంటె వేఱుగనేదియు లేదని భావము. శ్లో॥ యఃపుత్రఃపితరంద్వేష్టితంవింద్యాదన్యరేతసం। యస్తునారాయణం ద్వేష్టి తంవింద్యాదంత్యరేతసం॥ అనియున్నదిగనుక రుద్రునికంటె నన్య

ముగ శ్రీమహావిష్ణువుగలఁడని అతఁడు రుద్రునికంటెతక్కువవాఁడని యెంచి దూషింపరాదని అర్థము. శ్లో॥ మద్భక్తోశ్శంకరద్వేషీ మద్వేషీ శంకరప్రియః । తావుభౌనరకంయాతియావచ్చంద్రదివాకరౌ॥ అని విష్ణువాక్యముగనుక శ్రీవాసుదేవుఁడైన శ్రీమహావిష్ణువుకంటెఅన్యుఁడుగ వామదేవుఁడైన శివుఁడు గలఁడు అతఁడు శ్రీమహావిష్ణువునకంటె తక్కువవాఁడనెడు భేదబుద్ధితోశివునిదూషించువారు సూర్యచంద్రులు గలంతవఱకు నరకముపాలగుదురని అర్థము గనుక (ఏకో దేవోబహుధానివిష్టః) అనుశ్రుత్యర్థమును మనసుననూని భేదవాదమును మాని సర్వము త్రిమూర్త్యాత్మక సచ్చిదానందపరబ్రహ్మమేయను నిర్వికల్పనిష్ఠ గలిగి ఆనందింపవలయును.

౧౨౩౮.—క॥ నీమదిఁ బొడమిన కోరిక। లేమైనను వేఁడు మిపుడ * యిచ్చెదననినన్ దామనమునసంతసపడి।యామనుజాశనుఁడుహరుప * దాంబుజములకున్.

టీ॥ నీమదిన్=నీమనసునందు. పొడమినకోరికలు=పుట్టినకోరికలు. ఏమైనన్=ఎట్టివైనను. వేఁడుము = అడుగుము. ఇపుడ = ఇప్పుడే. (ఇచ్చెదను) అనినన్=అనఁగా. తాన్=తాను. మనమునన్=మనసునందు. సంతసపడి=సంతోషించి. ఆమనుజాశనుఁడు=ఆరాక్షసుఁడు. హరు పదాంబుజములకున్ = శివునియొక్క పాద పద్మములకు.

తా॥ నీకు ఏమికోరికగలదో దానినిచెప్పుము ఇచ్చిసంతోషపెట్టెద నని అనఁగా సంతోషించి ఆరాక్షసుఁడు శివునిపాదపద్మములనుగూర్చి యని తాత్పర్యము.

౧౨౩౯.—తే॥ వందనంబాచరించి యో * యిందుమకుట। ఫాలలోచన వరద మ * త్పాణితలము నేను నెవ్వని తలమీఁద * నిడిన వాని। మస్తకము నూఱుప్రయ్యలై * మడియ నీవె.

టీ॥ వందనంబాచరించి=మ్రొక్కి. ఓయిందుమకుట=చంద్రుఁడు కిరీటముగాఁగల. ఫాలలోచన=నొసటకన్నుగల. వరద = కోరికల నిచ్చునట్టియోస్వామీ. మత్పాణితలము=నాఅరచేయి. (నేను) ఎవ్వని తలమీఁదనిడినన్=ఎవనితలమీఁదఁబెట్టినను. వానిమస్తకము=నాచేయి పెట్టఁబడిన వానితల. నూఱుప్రయ్యలై=నూఱుబ్రద్దలై. మడియన్=చచ్చునట్లు. ఈవె = ఈవరము కృపతో నాకు నియ్యవయ్యా.

తా॥ మ్రొక్కినవాఁడై చంద్రుఁడు కిరీటముగాఁ గలిగినట్టియు, నొసటకన్నుగలిగినట్టియు, నాకోరికలనిచ్చునట్టివాఁడవునైనఓస్వామీ! నేనెవనినెత్తిని నాచేయిని పెట్టుదునోవాఁడు అప్పుడే తలనూఱుబ్రద్దలుగా పగిలిచచ్చునట్టు వరమియ్యవయ్యా అనియడిగెనని తాత్పర్యము.

౧౨౪౦.—క॥ అని వేఁడిన నమ్మాటకు। విని మదనారాతి నవ్వి * విబుధాహితు కో రినవరముఁ దడయకిచ్చిన। దనుజుఁడు దద్వరపరీక్షఁ * దాఁజేయుటకున్.

టీ॥ అనివేఁడినన్=అనియడుగఁగా. అమ్మాటన్ = ఆయడిగిన మాటను. (విని) మదనారాతి=శివుఁడు. (నవ్వి) విబుధాహితు కోరిన వరమ్మున్=దేవశత్రువైనవృకాసురుఁడుకోరినవరమును. తడయక=ఆలస్యముచేయక. ఇచ్చినన్=ఇయ్యఁగా. దనుజుఁడు=రాక్షసుఁడు. (తాను) తద్వర=ఆవరముయొక్క. (పరీక్షను) చేయుటకున్=చేయునిమిత్తము.

తా॥ అని వృకాసురుఁడు అడుగఁగా ఆమాటవిని నవ్వినవాఁడై శివుఁడు ఆలస్యముచేయక అప్పుడేవాఁడు కోరిన వరమిచ్చెను అంతట వాఁడు ఆవరమును పరీక్షచేయుటకై యని తాత్పర్యము.

## విశేషార్థము.

నవ్వి=శ్రు॥ యద్యత్పశ్యతిచక్షుర్భ్యాం తత్తదాత్మేతిభావయేత్॥ అనియుపనిషత్తు, శ్లో॥ మాతృవత్పరదారాణి పరద్రవ్యాణిలోష్ఠవత్। ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యతిసపశ్యతి॥ అనిభారతముగనుక తన కంటికికనఁబడెడు స్థావరజంగమప్రాణులన్నియుతానేయనితలంపక స్వేతరములని తలఁచి వానిని నశింపఁజేయఁబూని యిట్టి వరమును ఈయసురుఁడు గోరెనుకాఁబట్టి ఈవరమే వీనిమరణమునకు కారణముకాఁగలదనిశివుఁడు నవ్వెననిభావము. అసురుఁడు=వ్యు॥ అసుషురమతీత్యసురః, అనివ్యుత్పత్తి. దేహాభిమానము గలవాఁడని అర్థము.

౧౨౪౧.—వ॥ ఆక్షణంబ వరదాన గర్వంబున నుద్వృత్తుండై కడంగి.

టీ॥ ఆక్షణంబ = అనిమిషమునసే. వరదానగర్వంబునన్=శివుని వలన వరము పొందినట్టి అహంకారముచేత. ఉద్వృత్తుండై=మదముచేత మీఁదుచూచుస్వభావము గలవాఁడై. కడంగి=పూని.

తా॥ అప్పుడే ఆవృకాసురుఁడు శివునివలన వరము పొందిన గర్వముచేత హెచ్చినవాఁడై వరపరీక్షకు ప్రయత్నించి యని తా.

౧౨౪౨.—క॥ ఆహరు మస్తకమునఁ గడు। సాహసమునఁ జేయివెట్ట * జడియక గదియ న్నోహోతన మెచ్చులుదన। కాహా పైవచ్చె ననుచు * నభవుఁడు భీతిన్.

టీ॥ ఆహరుమస్తకమునన్ = ఆశివునితలమీఁద. చేయివెట్టన్= చేయిపెట్టుటకు. కడుసాహసమునన్=మిగులతెగువతో. (జడియక) గదియన్=చేరరాఁగా. అభవుఁడు=శివుఁడు. ఓహో=ఔరా. తన మెచ్చులు=తనవరములు. (తనకు) ఆహా=అక్కటా. పైవచ్చెన్= మీఁదికివచ్చెను. అనుచున్=అనియనుకొనుచు. భీతిన్=భయముతో.

తా॥ ఆశివుని తలమీఁద చెయిపెట్టుటకయి భయపడకుండ తెగువతో చేరఁబోఁగా ఔరా! నేనిచ్చిన వరము నామీఁదికే వచ్చెనా అయ్యో! అనుచు భయముతో నని తాత్పర్యము.

౧౨౪౩.—క॥ దనుజుఁడు దనవెనువెంటం। జనుదే ముల్లోకములును * సంత్రాసముగా గొనిపాఱుసురలు మనములఁ। దనికిరి దానిక్కిని బ్రతివి * ధానము లేమిన్.

టీ॥ దనుజుఁడు=వృకాసురుఁడు. తన వెనువెంటన్=తన వీఁపు వెంబడిని. చనుదేన్=రాఁగా. ముల్లోకములును=మూఁడులోకములును. సంత్రాసము గైకొని=భయమునుపొంది, పాఱన్=శివుఁడు పరుగెత్తఁగా. సురలు=దేవతలు. దానికిన్=ఆవరమునకు. ప్రతివిధానము=ప్రతిక్రియ. లేమిన్ = లేకపోవుటచేత. మనములన్=మనసులలో. తనికిరి=తలఁకిరి-భయపడిరి.

తా॥ అప్పుడు వృకాసురుఁడు వెంబడించితఱుమఁగా పరుగెత్తి మూఁడులోకములను దిరుగుచున్నశివునిఁజూచి అందులకుబదులు ఏమి చేయ్యనువల్లలేక తమమనసులలోభయమునుపొందిరి అనితాత్పర్యము.

## విశేషార్థము.

వృకాసురుఁడు తనతలమీఁద చెయి పెట్టవచ్చినప్పుడు శివుఁడు పారిపోవుట తానుమరణింతుననెడు భీతిచేతకాదు అవుననెడుపక్షమున ప్రలయకాలమున శివుఁడు తనఫాలనేత్రమును దెఱచిలోకములను భస్మముచేయుటయును, మన్మథుఁడు తన తపస్సు చెఱుపవచ్చినప్పుడుఫాలనేత్రాగ్నిచేతభస్మముచేయఁగా అతఁడుశ్రీమహావిష్ణువు కృష్ణావతారమెత్తినప్పుడు రుక్మిణీదేవిగర్భమునఁబుట్టుటయును, ప్రసిద్ధములేగనుక మహాప్రభావసంపన్నుఁడైనహరుఁడు నీచుఁడైన అసురునకు వెఱచి పరుగెత్తెననితలఁపరాదు, మఱియేమి అనిన వృకాసురునకు తానిచ్చినవరము అమోఘమైనది, వాఁడుపూనినపని లోకనాశకరమైనదిగనుక అదితనకుఇష్టములేక వానినినశింపఁజేయుశక్తితనకుఁ గలిగియును తానుపెట్టిన ముష్టిచెట్టునైనను తాను కొట్టివేయరాదను లోకోక్తినిపట్టి వాఁడుతనకుభక్తుఁడగుటవలన వానిని తాను చంపక విష్ణుదేవునిచేత నశింపఁజేయఁ దలఁచి యీలీల లీలసలిపెను గాని ముందు జరుగఁబోవునది తెలియక కాదు. అవుననెడుపక్షమున శ్రీమహావిష్ణువుశ్రీరామావతారమెత్తినపుడు నీచుఁడైనమారీచుఁడు మాయామృగమైవచ్చినాఁడనియు, తానామృగము వెంటఁబోయినయెడల తనభార్యను రావణుఁడెత్తుకొనిపోవుననియు, వాలి సుగ్రీవులు యుద్ధము చేయునప్పుడు వారి భేదమును, ఇంద్రజిత్తు మాయాసీతను నఱికెననియును అతనికి తెలియలేదనవలెను, అనినపక్షమున సర్వజ్ఞత్వమునకు హాని సంభవించుచున్నది గనుక అది యొకవిలాసమనవలెను. తరల॥ పరమపూరుషుఁడొక్కఁడాఢ్యుఁడు పాలనోద్భవనాశముల్ । సొరదిఁ జేయ ముకుందపద్మజశూలిసంజ్ఞలఁ బ్రాకృత । స్ఫురితసత్వరజస్తమంబులఁ బొందునందు శుభస్థితుల్ । హరిచరాచర కోటికిచ్చు ననంతసత్వనిరూఢుఁడై॥ అని శ్రీభాగవతప్రథమస్కంధము. తా॥ 'ఏకో నారాయణః నద్వితీయోస్తి; ఏకమేవాద్వితీయంబ్రహ్మ', అనియుపనిషత్తుగనుక సజాతీయవిజాతీయ స్వగతభేదములును, దేశకాలవస్తుపరిచ్ఛేదములును లేనివాఁడై వెలుఁగునట్టి పరబ్రహ్మము, (ఏకంసంతం బహుధాకల్పయంతి అజాయమానో బహుధావిజాయతే, ఏకోదేవో బహుధానివిష్టః) అనిశ్రుతులు కాఁబట్టి తాను సర్వస్వతంత్రుఁడును, సర్వశక్తిసంపన్నుఁడునుగనుక తనలీలకై తన్నుతానే పుట్టించుకొనుటకు చతుర్ముఖబ్రహ్మరూపముచేతను, పుట్టించుకొన్న తన్ను రక్షించుకొనుటకు విష్ణురూపముచేతను, రక్షించుకొన్న తన్ను సంహరించుకొనుటకు రుద్రరూపముచేతను, తానేయున్నాఁడు గనుక సర్వము స్వవిలాసమని తాత్పర్యము. వ॥ అట్లు చనిచని.

౧౨౪౪—సీ॥ నిరుపమానందమై * నిఖిల లోకములకు - నవలయై యమృత ప * దాఖ్యఁ దనరి
దినకర చంద్రదీ * ధితులకుఁ జొరరాక - సలలితసహజ తే * జమున వెలుఁగు
సమధికంబగు శుద్ధ * సత్వగరిష్ఠమై - కర మొప్పి యోగీంద్ర * గమ్యమగుచు
హరిపద ధ్యాన పా * రాయణులైన త - ద్దాసుల కలరు ని * వాసమగుచుఁ
తే॥ బ్రవిమలానంత తేజోవి * రాజమాన । దివ్యమణిహేమ కలితసం * దీప్త భవ్య
సౌధమండప తోరణ * స్తంభ విపుల । గోపురాకీర్ణ సురము వై * కుంఠపురము.

టీ॥ నిరుపమానందమై=సాటిలేనియానందముగలదై. చతుర్ముఖబ్రహ్మాద్యానందములను మీఱిననిరతిశయానందముగ్గలదై. నిఖిలలోకములకున్ = ఎల్లలోకములకును. అవలయై = అవతలిదై. అమృతపదాఖ్యన్=మోక్షస్థానము అనుపేరితో. తనరి=ప్రసిద్ధిఁజెంది. దినకరచంద్రదీధితులకున్=సూర్యచంద్రుల కాంతులకు. చొరరాక = ప్రవేశింపఁగూడక. సలలితసహజతేజమునన్ = మిక్కిలి యొప్పిదమయిన తన తేజస్సుతో. వెలుఁగు=ప్రకాశించునట్టి. శ్లో॥ నతద్భాసయతేసూర్యో నశశాంకో నపావకః। యద్గత్వాననివర్తంతే తద్ధామ పరమంమమ॥ అనిభగవద్గీత. సమధికంబగు=మిక్కిలి యెచ్చయిన, శుద్ధసత్వగరిష్ఠమై=త్రిగుణసమావస్థయైన కేవల శుద్ధసత్వముచేత ఘనతనొందినదై. కరము = మిక్కిలి. (ఒప్పి) యోగీంద్రగమ్యము=బ్రహ్మవిద్వరిష్ఠులచేత పొందఁదగినది. (అగుచును) హరిపదధ్యానపారాయణులు=శ్రీవిష్ణుపాదములను ధ్యానించుటయందు. (ఆసక్తులు) అయినతద్దాసులకున్=అయినట్టి హరిదాసులకు. అలరునివాసము=ఒప్పునట్టి యునికిపట్టు. (అగుచును) ప్రవిమలా ... సురము - ప్రవిమల=మిక్కిలి నిర్మలమయిన. అనంత=మితిలేని. తేజః=తేజస్సుచేత. విరాజమాన=వెలుఁగుచున్న. దివ్య=అప్రాకృతమైన. మణి=రత్నములతోడను. హేమ=బంగారుతోడను. కలిత=కూడిన. సందీప్త=తేజరిల్లునట్టి. భవ్య=శ్లాఘ్యమైన. సౌధ=మేడలయందలి. మండప=మండపముయొక్క. తోరణస్తంభ=బహిర్ద్వారముయొక్క కంబములందును. విపుల = పెద్దదైన. గోపుర = పట్టణద్వారమునందును. ఆకీర్ణ=నిండిన. సురము=దేవతలుగలదియైన. వైకుంఠపురమున్=వైకుంఠపురమును. కనుంగొని యని పైపద్యములో క్రియ.

తా॥ సరిపోల్పరాని సంతోషముగలిగి అమృతస్థానము అనుపేరు పొంది, సూర్యచంద్రప్రకాశములకు చొరరాక మిక్కిలియొప్పునట్టి తన తేజస్సుతో వెలుఁగొందుచు మిక్కిలిశుద్ధము హెచ్చైనదియు కేవలసత్వగుణ ప్రధానులగుటచేతగౌరవమునుపొందిన యోగీశ్వరులకుపొందఁదగినదై శ్రీహరిచరణ స్మరణమునందు అక్కఱగల హరిదాసులకు మనోజ్ఞమైన యునికిపట్టయి మిక్కిలినిర్మలమును మేరమీఱి...

నదియునైన తేజస్సుచేత ప్రకాశించుచున్న అప్రాకృతమయిన రత్నములతోడను బంగారుతోడను గూర్పఁబడి వెలుఁగొందునట్టి శ్లాఘ్యమయిన మేడయొక్క ద్వారమునందును గోపురద్వారమందును నిండుకొన్న దేవతలుగలదియైన వైకుంఠపట్టణమును జూచియని తాత్పర్యము.

వ॥ కనుంగొని యమ్మహాస్థానంబు డాయంజనుటయు నప్పుండరీ కాక్షుం డఖండ వైభవంబునం గుండలీశ్వర భోగ తల్పంబునం బరమానంద కందళిత హృదయారవిందుండై యిందిరానయన చకోరకంబుల నిజమందహాససాంద్ర చంద్రికావితతిం దేల్చుచు నార్తభక్తజనరక్షణంబు పనిగా మెలంగుచు వివిధవినోదంబులం దగిలియుండియు ఫాలలోచనుం డద్దనుజపాలునకుం దలంపక యిచ్చినవరంబు తనతలమీఁద వచ్చిన కలంగిచను దెంచుట తనదివ్యచిత్తంబున నెఱింగి యకాలకంధరుని యవస్థ నివారింపం దలంచి యయ్యిందిరాదేవితోడి వినోదంబు చాలించి యప్పుడు.

టీ॥ కనుంగొని=చూచి. అమ్మహాస్థానంబు=ఆవైకుంఠము నందలి గొప్పదైన యాస్థానమండపమును. డాయంజనుటయుఁ = చేరఁబోఁగా. అప్పుండరీకాక్షుండు = ఆవిష్ణుదేవుఁడు. అఖండవైభవంబునన్ = తక్కువగాని యైశ్వర్యముతో. కుండలీశ్వరభోగతల్పంబునన్ = శేషుని దేహమనెడు పానుపునందు. పరమానందకందళిత హృదయారవిందుండై=మేలైనసంతోషము మొలకెత్తుచున్న మనస్సనెడి కమలముగలవాఁడై. ఇందిరానయనచకోరకంబులన్=లక్ష్మీదేవియొక్క కన్నులనెడి చకోరపక్షులను. నిజమందహాససాంద్రచంద్రికావితతిన్=తనచిఱునవ్వనెడు దట్టమైన వెన్నెలప్రోగునందు. తేల్చుచున్=తేలునట్లు చేయుచు—ఆనందింపఁజేయుచు. ఆర్తభక్తజనరక్షణంబు=పీడితులైన భక్తజనులయొక్క రక్షణము. పనిగాన్=తనకు పనిగా. మెలంగుచున్=ప్రవర్తించుచు. వివిధవినోదంబులన్ = నానావిధములయిన వేడుకలయందు. తగిలి=ఆసక్తుఁడై. (ఉండియును) ఫాలలోచనుండు=శివుఁడు. అద్దనుజపాలునకున్ = ఆరాక్షసశ్రేష్ఠునకు. తలంపక=యోచింపక. ఇచ్చినవరంబు = ఇచ్చినట్టివరము. తనతలమీఁద వచ్చినన్=తనతలమీఁదికి రాఁగా. కలంగి=కలఁతనొంది. చనుదెంచుట=వచ్చుటను. తనదివ్యచిత్తంబునన్=శ్లాఘ్యమైన తన మనసునందు. ఎఱింగి=తెలిసికొని. ఆకాలకంధరుని యవస్థ = ఆశివునియొక్క దుర్దశను. నివారింపందలంచి=పోఁగొట్టఁదలఁచి. అయ్యిందిరాదేవితోడివినోదంబు=లక్ష్మీదేవితోడి వేడుక. చాలించి=నిలిపి. (అప్పుడు)

తా॥ అట్టి యావైకుంఠమునుజూచి అందలి యాస్థానమండపము చేరఁబోఁగా శ్రీమన్నారాయణుఁడు మిక్కుటమయిన యైశ్వర్యముతో శేషశయనమునందు మిక్కుటమయిన యానందము పుట్టుచుండఁగా ఒప్పునట్టిమనస్సుతో శ్రీలక్ష్మీదేవి కన్నులనెడు చకోరపక్షులకు దట్టమైన వెన్నెలవంటి తనచిఱునవ్వుతో వికాసమును కలుగఁజేయుచు పీడనొందినభక్తులను కాపాడుటయే పనిగా మెలఁగునట్టి యాశ్రీహరి శివుఁడు ముందువెనుక యోచింపక వరమిచ్చి అందువలన పొసఁగిన ఆపదకు వెఱచి రాక్షసుఁడు వెంబడింపఁగా పరుగెత్తివచ్చుచున్నాఁడని తెలిసికొని శ్రీలక్ష్మీదేవితోడి వినోదములనుమానియని తాత్పర్యము.

౧౨౭౬.—సీ॥ తాపింఛ రుచితోడఁ ✻ దత్తరించెడు మేను - పసిఁడి ముంజియుఁదగు ✻ పట్టుగోఁడుగు
ధవళాంశురుచి జన్ని ✻ దంబును దిన్నని - దండంబు చేతఁగ ✻ మండలువును
బసుపు గోఁచియుఁ జిన్ని ✻ పట్టెవర్ధనమును - రాజతంబైన మృ ✻ గాజినంబుఁ
దూలాడు సిగయును ✻ వ్రేలుమారటగోఁచి - వ్రేలిమి బొట్టును ✻ వ్రేళ్ల దర్భ
తే॥ దనరసందీప్తహవ్యవా ✻ హనసమాన । కాంతిఁజెలువొందియద్భుత ✻ క్రమమెలర్పఁ
జతురగతినప్డు వటువువే ✻ షంబుఁదాల్చి । వచ్చి యానీచదానవ ✻ వరునిఁ జేరి.

టీ॥ తాపింఛరుచితోడన్ = చీఁకటిమ్రానివన్నెతో. త్రత్తరించెడు=నటించెడు—తళతళలాడెడు. మేను = దేహము. పసిఁడిముంజియు = బంగారుముంజిమొలత్రాడును. తగు = తగిన. (పట్టుగోడుగును) ధవళాంశురుచిజన్నిదంబును=చంద్రకిరణమువలె తెల్లగా వెలుఁగు యజ్ఞోపవీతమును. తిన్ననిదండంబు = వంకరలేని మోదుగు కోలయు. చేతన్=చేతియందు. కమండలువును = ముక్కుగల మట్టిపాత్రమును. (పసుపుగోఁచియు) చిన్నిపట్టెవర్ధనమును=మనోహరమయిన పట్టెనామమును. రాజతంబైన=వెండివన్నెగల. మృగాజినంబును=కృష్ణాజినమును. తూలాడు=కదలాడుచున్న. సిగయును = జుట్టును. వ్రేలు = దండమునందు వ్రేలాడుచున్న. మారటగోఁచి=మాఱుగోఁచియు. వ్రేలిమిబొట్టును = హోమాంగారపుబొట్టును. వ్రేళ్లన్=చేతివేళ్లయందు. దర్భ=పవిత్రమును. తనరన్=ఒప్పఁగా. సందీప్తహవ్యవాహన సమానకాంతిన్=మండుచున్న అగ్నియొక్క వెలుఁగువంటి వెలుఁగుతో. చెలువొంది = అందగించి. అద్భుతక్రమము—ఆశ్చర్యరీతి, ఎలర్పన్=చిగుర్పఁగా — అతిశయింపఁగా. చతురగతిన్=నేర్పరితనపురీతితో. అప్డు=ఆసమయమునందు. వటువువేషంబున్=బ్రహ్మచారివేషమును. తాల్చి=ధరించి. (వచ్చి) ఆనీచదానవవరునిన్=నీచుఁడైనయారాక్షసశ్రేష్ఠుని. చేరి = సమీపించి.

తా॥ అప్పుడు నల్లఁగా తళతళలాడుచున్న దేహమును, బంగారు ముంజిత్రాడును, పట్టుగొడుగును, తెల్లని యజ్ఞోపవీతమును, చేతదండకమండలువులును, పసుపుగోఁచియు, అందమయిన పట్టెనామమును, తెల్లని కృష్ణాజినమును, కదలాడుచున్న జుట్టును, దండమునందు వ్రేలఁగట్టియున్న రెండవగోఁచియు, హోమాంగారము చేత పెట్టుకొన్న బొట్టును, వ్రేళ్లయందు పవిత్రములును ఒప్పఁగా మండుచున్న నిప్పువలె వెలుఁగుచు అందగిల్లుచున్న ఆశ్చర్యమును కలుగఁజేసెడి ఒకబ్రహ్మచారివేషమును వేసికొని నీచుఁడైన అవృకాసురునిదగ్గఱపోయి అని తా.




(*) శివద్రోహముచేయఁబూనిన వృకాసురుఁడు విష్ణుమాయచేమడియుట. (*)

వ॥ కైతవంబున నతనికి నమస్కరించి మృదుమధుర భాషణంబుల ననునయించుచు నయ్యసురాధమున కిట్లనియె నివ్విధంబున మార్గపరిశ్రాంతుండవై యింతదూరంబేల చనుదెంచితివి సకలసౌఖ్య కారణంబైనయీశరీరంబు నిరర్థకంబుచేసి వృధాయాసంబున దుఃఖపఱుపం దగునే యియ్యెడం గొంతదడవు విశ్రమింపు మీప్రయాసంబునకుం గతంబెయ్యది కపటహృదయుండవుగాక నీయధ్యవసాయంబెఱింగింపుమని మృదుమధురంబుగాఁబలికిన నమ్మహాత్ముని సుధారస తుల్యంబులైన వాక్యంబులువిని సంతసిల్లి యప్పిశితాశనుండు దనపూనిన కార్యంబతని కెఱింగించిన.

టీ॥ కైతవంబునన్ = వంచనచేత. అతనికిన్ = ఆశివునికి. నమస్కరించి = మ్రొక్కి. మృదుమధురభాషణంబులన్ = తిన్ననివియు ఇంపైనవియునైన మాటలచేత. అనునయించుచున్ = ఊఱడించుచు. అయ్యసురాధమునకున్ = అధముఁడైనయావృకాసురునితో. ఇట్లనియెన్ = ఇట్లుపలికెను. ఇవ్విధంబునన్ = ఈరీతిగా. మార్గపరిశ్రాంతుండవై = త్రోవబడలికను పొందినవాఁడవై. (ఇంతదూరంబు) ఏలచనుదెంచితివి = ఎందుకువచ్చితివి. సకలసౌఖ్యకారణంబు = ఎల్లసౌఖ్యములకు నిమిత్తము. అయినయీశరీరంబున్ = అయినట్టియీనరదేహమును. నిరర్థకంబు = వ్యర్థము. (చేసి) వృధాయాసంబునన్ = పనికిమాలిన శ్రమచేత. దుఃఖపఱుపందగునే = బాధపెట్టవచ్చునా. ఇయ్యెడన్ = ఈసమయమునందు. కొంతదడవు = కొంతసేపు. విశ్రమింపుము = అలపుదీఱ కూర్చుండుము. ఈప్రయాసంబునకున్ = ఈశ్రమమునకు. కతంబు = కారణము. ఎయ్యది = ఏది. కపటహృదయుండవు = మనసున కపటముగలవాఁడవు. (కాక) నీయధ్యవసాయంబు నీయుద్దేశ్యమును. (ఎఱిఁగింపుము అని) మృదుమధురంబుగాన్ = మెత్తగానుఇంపుగాను నుండునట్లు. పలికినన్ = మాటలాడఁగా. అమ్మహాత్ముని = ఆగొప్పవానియొక్క. సుధారస తుల్యంబులు = అమృతరసమును బోలినవి. (అయినవాక్యంబులువిని) సంతసిల్లి = సంతోషించి. అప్పిశితాశనుండు = ఆరాక్షసుఁడు. తనపూనినకార్యంబు = తానుప్రయత్నించినపని. అతనికిన్ = ఆకపటబ్రహ్మచారికి. ఎఱింగించినన్ = తెలియఁజేయఁగా.

తా॥ వంచనతోనుండుపరుగెత్తివచ్చుచున్నశివునికిమ్రొక్కి మంచి తియ్యని మాటలచేత ఊఱడించి, వృకాసురునిఁజూచి యేలయీరీతి త్రోవనడచినబడలికనొందెదవు ఇంతదూరముఇట్లువచ్చుటకు కారణ మేమి, ఎల్ల సౌఖ్యములకును సాధనమయిన యీదేహమును వ్యర్థముగా ఇట్లు ఆయాసపెట్టవచ్చునా? ఇప్పుడుకొంచెముసేపు ఇక్కడ కూర్చుండి అలపుతీర్చుకో, ఈప్రయాసమునకుకారణమునుదాఁచక నాతోచెప్పుము, నీవు ఏమికోరియిట్లు ఆయాసపడుచున్నావు చెప్పుము అని మంచి తియ్యని మాటలతో అడుగఁగా అమృతరసమును బోలిన ఆమాటలనువినివృకాసురుఁడుతానుపూనినపనియిట్టిదియని ఆబ్రహ్మచారితో చెప్పెనని తాత్పర్యము.

౧౨౪౮.—చ॥ హరి దరహాసమొప్పఁ బిశి ❋ తాశనుఁ గన్గొని పల్కె దానవే
శ్వరమను దక్షుశాపమునఁ ❋ జాల పిశాచపతౌట సూనృత
స్ఫురణము మాని సంతతము ❋ బొంకుచు నుండు పురారిమాట నీ
వరయక వెంటనేగఁ దగ ❋ దాతని సేఁతలు మాకు వింతలే.

టీ॥ హరి = విష్ణుమూర్తి. దరహాసము = చిఱునవ్వు. ఒప్పన్ = ఒప్పఁగా. పిశితాశనున్ = రాక్షసుని. కన్గొని = చూచి. పల్కెను = ఇట్లుపలికెను. దానవేశ్వర = రాక్షసశ్రేష్ఠుఁడా. మను = మనుపు; దక్షుశాపమునన్ = దక్షునియొక్కశాపముచేత. చాలన్ = మిక్కిలి. పిశాచపతౌటన్ = పిశాచములకురాజగుటచేత. సూనృతస్ఫురణము = నిజముయొక్క ప్రకాశింపఁ జేయుటను—నిజముచెప్పుటను. (మాని) సంతతమున్ = ఎల్లప్పుడు. బొంకుచునుండు = అబద్ధములుచెప్పుచుండునట్టి. పురారిమాట = శివునియొక్కమాటను. (నీవు) అరయక = విచారింపక. వెంటనేగన్ = వెంబడించిపోవుట. (తగదు) ఆతనిసేఁతలు = ఆశివునియొక్కచర్యలు. (మాకు) వింతలే = ఆశ్చర్యములా—క్రొత్తలా.

తా॥ వృకాసురుఁడట్లు తనవృత్తాంతమంతయుఁ జెప్పఁగా విష్ణుమూర్తి విని యనువ్వుచువానినిజూచి ఓయిరాక్షసోత్తమా! మునుపు దక్షునిశాపముచేత పిశాచముల కెల్లను రాజై నిజము మాటలాడుట మానియెల్లప్పుడు అబద్ధాలాడుచుండునట్టి శివుని మాటఁనునమ్మి నీవు ఆయనవెంట ప్రయాసపడి యిట్లు పరుగెత్తవలదు ఈయన చెప్పలు మాకు క్రొత్తలుకావు మేము ఈయన స్వభావము నెఱుఁగుదు మనితా.

౧౨౪౯.—ఆ॥ నిజము వలికె నేని ✽ నెఱిఁ దనతలమీఁద । నీకరంబు మోఁప ✽ నీక తలఁగి
వచ్చునోటు వీని ✽ వలనఁ బ్రత్యయమున । దగుల నేమిగలదు ✽ దనుజవర్య.

టీ॥ దనుజవర్య=ఓరాక్షసశ్రేష్ఠుఁడా. నిజము వలికె నేనిన్=నిజమేచెప్పిన పక్షమున. నెఱిన్=క్రమముగా. (తనతలమీఁదను) నీకరంబున్=నీచేతిని. మోఁపనీక=పెట్టనియ్యక. తలఁగివచ్చునోటు=తొలఁగివచ్చునా. వీనివలనన్=ఈశివునియెడల. ప్రత్యయమునన్=నమ్మకముచేత. ని॥ ప్రత్యయోధీనశపథజ్ఞానవిశ్వాసహేతుషు॥ అని అను. తగులన్=వెంబడింపఁగా. ఏమిగలదు=ఏమిప్రయోజనముకలదు.

తా॥ ఓరాక్షసోత్తమా! ఇతఁడు నిజముచెప్పినవాఁడైన పక్షమున క్రమముగా తనతలమీఁదనే చేయి పెట్టనియ్యఁడా? ఏలయిట్లు తొలఁగి పరుగెత్తెను కనుక నీవు ఇతనియందు లేనినమ్మకము పెట్టి వెంబడించివచ్చుట వ్యర్థము అని చెప్పెనని తాత్పర్యము.

౧౨౫౦.—ఆ॥ అశుచితోడ నతని ✽ నంటఁగఁ బనిగాదు । కాలు చేయిఁ గడిగి ✽ కరము వార్చి
యతని వెంట వేడ్క ✽ నరుగుదు వేని నీ । వవతలంటఁ దగులు ✽ నసురనాథ.

టీ॥ అసురనాథ=ఓరాక్షసోత్తమా. అశుచితోడన్=మైలతో. అతనిన్=ఆశివుని. అంటఁగన్=అంటుట. పనిగాదు=యుక్తము కాదు. కాలుచేయి=కాలును చేయియును. కడిగి=కడుగుకొని. కరమువార్చి=మిక్కిలి యాచమించి—ముమ్మాఱు ఆచమించి యనుట. అతనివెంటన్=ఆశివునివెంట. వేడ్కన్=కుతూహలముతో. అరుగుదువేని=పోయినపక్షమున. (నీవు) అవతల=అటుపిమ్మట. అంటన్=తాఁకఁగా. తగులున్=అతఁడు చిక్కును.

తా॥ ఓరాక్షసోత్తమా! నీవుమయిలతో అతనిని తాఁకఁగూడదు కాళ్లు చేతులు కడుగుకొని ముమ్మాఱు ఆచమనముచేసి అతనిని వెంబడించి తటిమిపట్టుకొనెదు పక్షమున అతఁడు నీకుఁ జిక్కునని తా.

౧౨౫౧.—మ॥ అతి దుశ్శంకలు మాని పొమ్మనిన దై ✽ త్యారాతి మాయావిమో
హితుఁడై విస్మృతినొంది తామసమునన్ ✽ నేపారి వాఁ డాత్మపా
ణితలంబున్ దన నెత్తి మోపికొని తా ✽ నేలన్ వెసం గూలె వి
శ్రుతదంభోళిహతి న్వడిం బడు మహా ✽ క్షోణీధరంబో యనన్.

టీ॥ అతిదుశ్శంకలు=విశేషసందేహములు. మాని=వదలి. పొమ్ము=ఊరకపో. అనినన్=అనఁగా. దైత్యా ... తుఁడై—దైత్యారాతి=రాక్షసశత్రువైన విష్ణుమూర్తియొక్క. మాయా=మాయచేత. విమోహితుఁడై=మిక్కిలి మోహము నొందినవాఁడై. విస్మృతిన్=జ్ఞప్తిలేమిని. (పొంది) తామసమునన్=తమోగుణావేశముచేత. ఏపారి=అతిశయించి. వాఁడు=ఆవృకాసురుఁడు. ఆత్మపాణితలంబున్=తనయరచేతిని. తననెత్తిన్=తనతలయందు. మోపికొని=పెట్టుకొని. (తాను) విశ్రుతదంభోళిహతిన్=ప్రసిద్ధమయినవజ్రాయుధపు పెట్టుచేత. వడిన్=వేగముతో. పడు=కూలునట్టి. మహాక్షోణీధరంబో=గొప్పకొండయో. అనన్=అనునట్లుగా. నేలన్=భూమియందు. వెసన్=వడిగా. కూలెన్=పడెను.

తా॥ ఊరక లేనిపోని సందేహములు పెట్టుకొనకపో అని విష్ణుమూర్తి చెప్పఁగా వాఁడు ఆవిష్ణుని మాయచేత మిక్కిలి మోహమును పొందినవాఁడై తనకు శివుఁడిచ్చిన వరమును మఱచి కేవలతామసవృత్తితో తనచేయి తననెత్తిని పెట్టుకొని వజ్రాయుధము దెబ్బచేత వేగముతో పడునట్టి పెద్దకొండవలె తలపగిలి నేలఁబడిచచ్చెననితా.

౧౨౫౨.—వ॥ అట్లు తనతల నూఱు వ్రయ్యలై నేలం గూలిన యసురం గని యప్పుడు.

టీ॥ అట్లు=ఆవిధముగా. (తనతల) నూఱువ్రయ్యలై=నూఱు బ్రద్దలై. నేలంగూలినయసురన్=భూమిమీఁదఁబడినరాక్షసుని. కని=చూచి. (అప్పుడు)

తా॥ ఆవిధముగా తనచేయి తలమీఁదఁ బెట్టుకొని తలనూఱు బ్రద్దలుగా పగిలి క్రిందఁబడి చచ్చిన రాక్షసునిఁజూచి ఆసమయమునందు అనితాత్పర్యము.

౧౨౫౩.—క॥ సురలసురాంతకు మీఁదన్ । వరమందార ప్రసూన ✽ వర్షము లోలిన్
గురిసిరి తుములంబై దివి । మొరసె న్సురదుందుభి ప్ర ✽ ముఖ తూర్యంబుల్.

టీ॥ సురలు=దేవతలు. అసురాంతకుమీఁదన్=విష్ణుమూర్తిమీఁద. వరమందారప్రసూనవర్షములు=శ్రేష్ఠమయిన కల్పవృక్షపు పువ్వులవానలు. ఓలిన్=క్రమముగా. కురిసిరి=కురియించిరి. దివిన్=మింటను. సురదుందుభిప్రముఖతూర్యంబులు=దేవతలభేరులు మొదలగువాద్యములు. తుములంబై=సందడిగా. మొరసెన్=మ్రోఁగెను.

తా॥ దేవతలు విష్ణుమూర్తిమీఁద పువ్వులవానలు కురియించిరి. ఆకాశమునందు భేరులు మొదలైన వాద్యములు ఎడతెగక మ్రోఁగెను. అనితాత్పర్యము.

గంధర్వులు.












* దేవతలువిష్ణువుమీఁదపూలుకురిసిపాడియాడుట. *

౧౨౫౮.—క॥ పాడిరి గంధర్వోత్తము । లాడిరిదివి నప్సరసలు * నన్యోన్యముగన్
గూడిరిగ్రహములుభయముల। వీడిరిమునికోటులంత * విమలచరిత్రా.

టీ॥ విమలచరిత్రా=మంచినడవడిగలఓపరీక్షిన్మహారాజా. అంతన్=అప్పుడు. దివిన్ = మింటియందు. గంధర్వోత్తములు = గంధర్వశ్రేష్ఠులు. ( పాడిరి అప్సరసలు ఆడిరి) గ్రహములు=సూర్యచంద్రాదులు. అన్యోన్యముగన్=ఒండొరులతో. కూడిరి = కూడుకొనిరి. మునికోటులు=మునిసమూహములు. (భయములను) వీడిరి=వదలిరి.

తా॥ ఇంకను అప్పుడు మింటియందు గంధర్వులు గానముచేసిరి, అప్సరస్త్రీలు నాట్యముచేసిరి, సూర్యాదిగ్రహములెల్లను ఒకచోటఁ గూడుకొనెను, మునులందఱును భయములేక మెలఁగసాగిరి అనిభా.

౧౨౫౫.—క॥ మురహరుఁడెలనవ్వొలయఁగఁ। బురహరుఁదగఁజూచిపలికె * భూతేశ్వరయీ
నరభోజనుండు నీకి । త్తఱి నెగ్గొనరింపఁ దలఁచి * తానే పొలిసెన్.

టీ॥ మురహరుఁడు=శ్రీవిష్ణుఁడు. ఎలనవ్వొలయఁగన్ = చిఱునవ్వుకలుగఁగా—చిఱునవ్వునవ్వుచు. పురహరున్=శివుని. (చూచి) తగన్=తగునట్లు. పలికెన్=చెప్పెను. భూతేశ్వర=శివుఁడా. ఈనరభోజనుండు=ఈరాక్షసుఁడు. (నీకు) ఇత్తఱిన్=ఈసమయమునందు. ఎగ్గొనరింపన్=కీడుచేయను. (తలఁచి తానే) పొలిసెన్=చచ్చెను.

తా॥ విష్ణుదేవుఁడుచిఱునవ్వునవ్వుచుసాంబమూర్తినిఁజూచి ఓశివుఁడా ! యీరాక్షసుఁడు ఇప్పుడు నీకుకీడుచేయఁదలఁచి తానే నశించెను అని తాత్పర్యము.

వ॥ అది యట్టిదికాదె యిజ్జగంబున నధికుండైనవానికి నపకారంబుగావించిన మానవులకు శుభంబు గలుగునే యదియునుంగాక జగద్గురుండవగు నీకవజ్ఞఁదలంచు కష్టాత్ముండు వాలియుటం జెప్ప నేల యట్టి దుష్టచిత్తుల కిట్టివరంబు లిచ్చుట కర్జంబుగాదని యప్పురాంతకు వీడ్కొలిపిన నతండు మురాంతకుని ననేక విధంబుల నభినందించి నిజ మందిరంబునకుం జనియెనని చెప్పి యిట్లనియె.

టీ॥ అదియట్టిదికాదె=వాఁడుచేసినయీచెడ్డపనివానినినాశము చేయునదియేకదా. ఇజ్జగంబునన్ = ఈలోకమునందు. అధికుండైన వానికిన్=గొప్పవానికి. అపకారంబు = కీడు. కావించినమానవులకున్=చేసినమనుష్యులకు. శుభంబుగలుగునే = మేలుగలుగునా.

(ఆదియునుంగాక) జగద్గురుండవు=లోకములకెల్లగురుడైనవాఁడవు. లేక లోకములకు తండ్రివి, లోకములను బుట్టించువాఁడవు అనుట. శ్లో॥ గురుస్తుగీష్పతౌ శ్రేష్ఠే గురౌపితరిదుర్భరే ॥ అని విశ్వనిఘంటు. అగునీకున్=అగునట్టినీకు. అవజ్ఞన్=అవమానమును. తలఁచుకష్టాత్ముండు=తలఁచునట్టి నీచుఁడు. పొలియుటన్ = చచ్చుటను. చెప్పనేల=చెప్పవలసినదేమి. అట్టిదుష్టచిత్తులకున్=అటువంటిచెడ్డమనసుగలవారికి. ( ఇట్టివరంబులిచ్చుట ) కర్జంబుకాదు = పనికాదు — యుక్తముకాదనుట. (అని) అప్పురాంతకున్ = ఆశివుని. వీడ్కొలిపినన్=పంపఁగా. (అతండు) మురాంతకునిన్=విష్ణువును. అనేక కథంబులన్=బహువిధములచేత. అభినందించి = కొనియాడి. నిజమందిరంబునకున్=తనయింటికి. చనియెన్=పోయెను. (అనిచెప్పి) ఇట్లనియెన్=శుకమహాముని యీవిధముగా పలికెను.

తా॥ వాఁడుచేసినపని వానినినాశముచేయునదేకదా, ఈలోకమునం దెవఁడైనను ఒకగొప్పవానికి చెఱుపుచేసినయెడ అట్టివానికి మేలుగలుగదు అనఁగా, లోకములకు తండ్రివైన నీవంటివానికి అవమానముచేయఁదలఁచిన దుష్టునకు చెఱుపు గలుగుననుట సహజమే కదా, అటువంటి దుష్టులకు ఇటువంటివరములు ఇచ్చుటతగదు అని చెప్పిశివునికి పోను అనుజ్ఞయియ్యఁగా అతఁడు తానును విష్ణువును నానావిధములపొగడి తనయింటికి పోయెను అనిపరీక్షిన్మహారాజుతో శుకమహామునిచెప్పి మఱియును జెప్పనారంభించె నని తాత్పర్యము,

౧౨౫౭.—క॥ మానవనాయక యీయా । ఖ్యానముఁ జదివినను వినిన ✻ ఘనపుణ్యులు ని
త్యానందసౌఖ్యములు పెం । పూనుదురటమీఁద ముక్తిఁ ✻ బొందుదు రెలమిన్.

టీ॥ మానవనాయక=రాజా. ఈయాఖ్యానమున్=ఈకథను. చదివినను వినినఘనపుణ్యులు = పఠించినట్టి విన్నట్టి విశేషపుణ్యము గలవారు. నిత్యానందసౌఖ్యములపెంపున్=ఎన్నఁడునుచెడనిసంతోషముయొక్కయు సౌఖ్యముయొక్కయు అభివృద్ధిని. పూనుదురు = అవలంబింతురు—పొందుదురు. అటమీఁదన్=అంతమీఁదట. ఎలమిన్=అధికసంతోషముతో. ముక్తిన్ = మోక్షమును. ( పొందుదురు )

తా॥ ఓరాజా ! ఈకథనువిన్న పుణ్యాత్ములు ఎవరోవారు ఎన్నఁడును చెడనిసుఖమును సంతోషమును చిరకాలము అనుభవించి కడపట సుఖస్వరూపమయినమోక్షమును పొందుదురు అనితాత్పర్యము.

వ॥ అని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

౧౨౫౮.—క॥ జననాయక యింకఁ బురా । తనవృత్తం బొకటినీకుఁ ✻ దగ నెఱిఁగింతున్
వినుము తపోమహిమలఁ జెం । దినముని జనులును సరస్వ ✻ తీ నదిపొంతన్.

టీ॥ జననాయక=ఓరాజా. ఇంకన్=ఇఁకను. పురాతనవృత్తం బొకటి=ఒకపూర్వవృత్తాంతమును. (నీకు)తగన్=తగునట్లు. ఎఱిఁగింతును=తెలియఁజేయుదును. (వినుము)తపోమహిమలన్=కాయికవాచికమానసికతపస్సులవలనిప్రభావములను. చెందినమునిజనులును=పొందినమునీశ్వరులును. సరస్వతీనదిపొంతన్=సరస్వతీనది దగ్గఱ.

తా॥ ఓరాజా ! ఇంకొకపూర్వకథయొకటిగలదు దానిని నీకుఁ జెప్పెదనువినుము తపస్సుచేత ప్రభావమునుపొందినమునీశ్వరులందఱు సరస్వతీనది గట్టునందు అని తాత్పర్యము.

౧౨౫౯.—క॥ వితతక్రియ లొప్పఁగ స । త్క్రతువుల నొనరింప నచటఁ ✻ గైకొని లక్ష్మీ
పతి భవపితామహులలో । నతులితముగ నెవ్వఁ డధికుఁ ✻ డని తమలోనన్.

టీ॥ వితతక్రియలు=విశేషముగానడపఁబడినక్రియలు. ఒప్పఁగన్=ఒప్పిదములగుచుండఁగా. (సత్క్రతువులను)ఒనరింపఁగన్=చేయఁగా. (అచట) కైకొని=పూని. లక్ష్మీపతిభవపితామహులలోన్ = విష్ణు శివ బ్రహ్మలలో. అతులితముగన్=ఈడులేనివిధముగా. ఎవ్వఁడధికుఁడు=అధికుఁడెవఁడు. (అని) తమలోనన్=తమలోఁదాము.

తా॥ విస్తరింపఁబడిన తంత్రములతో మంచియజ్ఞములను జేయుచుండి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురిలోను సర్వాధికులు ఎవరు అగుదురు అని తమలోఁదాము ఆలోచించియని తాత్పర్యము.

౧౨౬౦.—వ॥ ఇట్లు తలపోసి తన్మహత్త్వం బంతయుం దెలిసిరమ్మని భృగుమహాముని నమ్ము
న్వరు వేల్పుల కడకుం బంపిన నత్తాపసోత్తముండు చనిచని ముందట.

టీ॥ ఇట్లు=ఈవిధముగా. తలపోసి=ఆలోచనచేసి. తన్మహత్త్వంబు=ఆసర్వాధికుఁడైన భగవంతునియొక్క మహిమము. అంతయున్ = సమస్తమును. తెలిసి = తెలిసికొని. (రమ్మని) భృగుమహామునిన్ = భృగువు అనుమునీశ్వరుని. అమ్మువ్వురువేల్పులకడకున్ = ఆముగ్గురు దేవతలయొద్దకును. పంపినన్=పంపఁగా. అత్తాపసోత్తముండు = ఆమునీశ్వరుఁడు. చనిచని = బహుదూరము పోయి. (ముందటను)

తా॥ ఈవిధముగా ఆలోచించి సర్వాధికుఁడైన యాదేవుని యొక్కమహిమను విశదముగా తెలిసికొని వచ్చుటకై ఆమునులుభృగుమహామునీశ్వరుని ఆవిష్ణు శివ బ్రహ్మలయొద్దకు పంపఁగా అతఁడును బహుదూరముపోయి యెదుటఁజూచి యని తాత్పర్యము.


బ్రహ్మ.


శివుఁడు.


విష్ణువు.

## (*) భృగు మహర్షి త్రిమూర్తుల శోధింపఁ బోవుట. (*)


భృగుమహర్షి.

క॥ జలరుహ సంజాతు సభా । స్థలమున కొగి నేగి యతని * సత్వగుణంబుల్
దెలియుటకై నుతివందన । ములు సేయకయున్న నజుఁడు * ముసముస యనుచున్.

టీ॥ జలరుహసంజాతు సభాస్థలమునకున్=బ్రహ్మయొక్క కొలువుకూటమునకు. ఒగిన్ = క్రమముగా. ఏగి=పోయి. అతనిసత్వగుణంబుల్=అతనియొక్క శాంతగుణమును. తెలియుటకై=తెలిసికొనుటకై. నుతివందనములు=స్తోత్రమును నమస్కారమును. చేయకయున్నన్ = చేయకనిలువఁబడియుండఁగా. అజుఁడు = బ్రహ్మ. ముసముస యనుచున్ = కోపవికారమును జూపుచు.

తా॥ బ్రహ్మదేవుని సభకుఁబోయి అతనియందుఁగల సత్వగుణధర్మమును తెలిసికొనుటకై అతనికి స్తోత్రము చేయకయు, మ్రొక్కకయు, ఊరకయుండఁగా బ్రహ్మకోపవికారమును జూపుచు నని తాత్పర్యము.

౧౨౬౨.—క॥ మనమునఁ గలఁగుచు భృగుతన । తనుజాతుండగుట బుద్ధిఁ * దలఁచినవాఁడై
ఘనరోష స్ఫురితాగ్ని । న్ననయము శాంతోద కముల * నల్లన నార్చెన్.

టీ॥ మనమునన్=మనసునందు. కలఁగుచున్ = కలఁతపడుచు. భృగు=భృగుమహాముని. తనతనుజాతుండు=తనకొడుకు. (అగుటను) బుద్ధిన్=బుద్ధియందు. (తలఁచినవాఁడై) ఘనరోషస్ఫురితాగ్నిన్ = అధికమైన రోషమనెడుగనగనలాడునిప్పును. అనయము=మిక్కిలి. శాంతోదకములన్=ఓర్పనెడునీళ్లచేత. అల్లనన్=మెల్లఁగా. (ఆర్చెను)

తా॥ మనసునందు కలఁతనొందుచు భృగువు తనకుకొడుకు అను తలఁపుచేత అతనిపైని తనకుఁగలిగిన కోపము అనెడిమండెడునిప్పును ఓర్పు అనెడి నీళ్లచేత చల్లార్చెను అనితాత్పర్యము.

౧౨౬౩.—చ॥ మహిత తపోధనుండు ముని * మండనుఁ డయ్యెడఁబాసి వెండియు
న్నహిపతిభూషుఁగాన రజ * తాద్రికి నేగియు నగ్గిరీంద్రుపైఁ
దుహిన మయూఖ శేఖరుఁడు * దుర్గయుఁ దానును విశ్రమించుచున్
ద్రుహిణతనూభవుం డెదుటఁ * దోఁచుటకాత్మఁ బ్రమోద మందుచున్.

టీ॥ మహితతపోధనుండు=పూజ్యమయిన తపస్సేధనముగాఁగల వాఁడును. మునిమండనుఁడు=మునులకు అలంకారమైనవాఁడునైన భృగుమహాముని. అయ్యెడన్ = అబ్రహ్మలోకమును. పాసి=వదలి. వెండియున్=పిమ్మట. అహిపతిభూషున్=సర్పరాజైన శేషుఁడే ఆభరణముగాఁగలవాఁడైనశివుని. కానన్=చూడను. రజతాద్రికిన్=వెండికొండకు. ఏగియున్=పోయియు. అగ్గిరీంద్రుపైన్=శ్రేష్ఠమైన ఆకొండమీఁద. తుహినమయూఖశేఖరుఁడు = చంద్రునిసిగపువ్వుగా నుంచుకొన్నశివుఁడు. దుర్గయున్=పార్వతియు. (తానును) విశ్రమించుచున్=కూర్చుండుచు. ద్రుహిణ తనూభవుండు=బ్రహ్మకొడుకైన భృగుమహాముని. (ఎదుటను)తోఁచుటకున్=కనఁబడుటకు. ఆత్మన్=మనసునందు. ప్రమోదము=సంతోషమును. అందుచున్=పొందుచు.

తా॥ పూజ్యమయినతపస్సుచేసి మహిమను పొందిన మునిశ్రేష్ఠుఁడైన భృగువు అందుండి బయలుదేఱి వెంటనే శివునిఁ జూడవలెనని వెండికొండకుఁ బోయి ఆకొండమీఁద శివుఁడు పార్వతితోఁ గూడ కూర్చుండియుండి బ్రహ్మకొడుకైన భృగుమహాముని వచ్చుటకు మనసులో సంతోషించియని తాత్పర్యము.

౧౩౬౪.—క॥ కనుఁగొని భ్రాతృస్నేహం । బునఁగౌఁగిటఁజేర్చ ననుచు ✻ ముక్కంటిరయం
బున నెదురేగినమునిరు । ద్రునియందుల సత్వగుణముఁ ✻ దోఁ దెలియుటకై.

టీ॥ కనుఁగొని=భృగువునుజూచి. భ్రాతృస్నేహంబునన్=తోడఁబుట్టినవాఁడు అనుప్రీతిచేత. కౌఁగిటఁజేర్చన్ = ఆలింగనముచేసికొనును. అనుచున్=అనితలఁచుచు. ముక్కంటి = శివుఁడు. రయంబునన్=శీఘ్రముగా. ఎదురేగినన్=ఎదుర్కొని పోఁగా. ముని = భృగువు. రుద్రునియందుల సత్వగుణమున్=శివునియందుఁగల సత్వగుణమును. తోన్=వెంటనే. తెలియుటకై = తెలిసికొనుటకొఱకు.

తా॥ భృగుమహామునినిజూచి తాను సోదరుఁడు అనుసంబంధమువలని స్నేహముచేత తన్ను కౌఁగిలించుకొనును అని తలఁచి యెదుర్కొనిపోఁగా అతఁడు శివునియందుఁగల సత్వగుణధర్మమును తెలిసికోఁదలఁచినవాఁడై యని తాత్పర్యము.

వ॥ అతనిఁ గైకొనక యూరకుండిన.

టీ॥ అతనిన్=ఆశివుని. కైకొనక=లక్ష్యపెట్టక. ఊరకుండినన్ = ఏమియు పలుకకయూరకుండఁగా.

౧౩౬౫.—ఉ॥ ఆసిటలాంబకుండు గమ ✻ లాసననందనుఁ జూచి భూరి కా
లానల రోషవేగ భయ ✻ దాకృతిఁదాల్చి పటుస్ఫులింగ సం
తానములొల్క శూలమునఁ ✻ దాపసముఖ్యు నురంబు వ్రేయఁగాఁ
బూనినఁ బార్వతీరమణి ✻ బోరున నడ్డమువొచ్చి చెచ్చెరన్.

టీ॥ ఆసిటలాంబకుండు = వాసట కన్నుగలయాశివుఁడు. కమలాసన నందనున్=బ్రహ్మకొడుకైన భృగువును. (చూచి)భూరి... కృతిన్—భూరి=మిక్కుటమయిన. కాలానల=ప్రళయకాలపునిప్పును బోలిన. రోష=కోపముయొక్క. వేగ=వడిచేత. భయదాకృతిన్=భయమును కలుగఁజేయునట్టి యాకారమును. తాల్చి = ధరించి. పటుస్ఫులింగసంతానములు=అధికములయినమిడుఁగుఱులప్రోగులు, ఒల్కన్=రాలఁగా. శూలమునన్=తనశూలాయుధముచేత. తాపసముఖ్యునురంబున్ = మునిశ్రేష్ఠుఁడైన భృగువుయొక్క ఱొమ్మును. వ్రేయఁగాన్=కొట్టుటకు. పూనినన్=పూనఁగా. పార్వతీరమణి=పార్వతీదేవి. బోరునన్=శీఘ్రముగా. అడ్డమువొచ్చి =; అడ్డముగా వచ్చి. చెచ్చెరన్=తటాలున.

తా॥ అంతట శివుఁడుభృగుమహామునినిజూచి అధికమయిన కోపముతో ప్రలయకాలాగ్నివలె మండిపడుచుభయంకరమయినయాకారముతో కన్నుల నిప్పులురాల్చుచు తన శూలాయుధమును ఎత్తుకొని అతనిఱొమ్మును పొడువఁబోఁగా పార్వతీదేవి అతనికి అడ్డము వచ్చినదై యని తాత్పర్యము.





(✻) భృగుమహాముని విష్ణుమూర్తిని తన్నుట. (✻)

౧౩౬౬.—క॥ తనవిభు పాదములకు వం । దనముం గావించి సముచి ✻ త ప్రియముల న
య్యనలాక్షుని కోపము మా । న్చిన నమ్మునినాథుఁ డచట ✻ నిలువక చనియెన్.

టీ॥ తనవిభుపాదములకున్=తన పెనిమిటియొక్క అడుగులకు. వందనమున్=నమస్కారమును. కావించి = చేసి. సముచితప్రియములన్=తగినమంచిమాటలచేత. అయ్యనలాక్షునికోపమున్=అశ్వని కోపమును. మాన్చినన్=పోఁగొట్టఁగా. అమ్మునినాథుఁడు=ఆభృగుమహాముని. అచ్చటన్=అక్కడ. (నిలువక) చనియెన్=పోయెను.

తా॥ తనపెనిమిటికాళ్లపైఁబడిమ్రొక్కి తగినమంచిమాటలుచెప్పి ఆయనకోపమును అణఁచెను, అంతట భృగుమహాముని అక్కడనిలువక బయలుదేఱిపోయెనని తాత్పర్యము.

౧౨౬౭.—సీ॥ పొలుపొందు వైకుంఠ * పురమున కర్థితోఁ - జని యందు సమధికై * శ్వర్య మొప్పఁ
గమలాంక పర్యంక * గతుఁడై సుఖించు న - క్కౌస్తుభభూషు వ * క్షస్థలంబుఁ
దనపాదమునఁ బట్టు * తన్నెఁ దన్నినఁ బాన్పు - డిగివచ్చి మునిఁజూచి * నగధరుండు
పదములఁ కెఱఁగి యో * పరమ తపోధన - యీగతి నీవచ్చు * టెఱుఁగలేక
తే॥ యున్న నాతప్పు మన్నించి * నన్నుఁ గరుణఁ । జూచి యీదివ్యమణిమయ * స్ఫూర్తిఁదనరు
రుచిరసింహాసనమునఁ గూ * ర్చుండు దివ్య । తాపసోత్తమ యభయప్ర * దాననిపుణ.

టీ॥ పొలుపు=అందము. ఒందు = పొందునట్టి. వైకుంఠపురమునకున్=వైకుంఠపట్టణమునకు. అర్థిన్ = ప్రీతితో. చని = పోయి. అందున్ = ఆవైకుంఠపట్టణమునందు. సమధికైశ్వర్యము = మిక్కిలి యెచ్చైన కలిమిని. ఒప్పన్=ఒప్పఁగా. కమలాంకపర్యంకగతుఁడు= లక్ష్మీదేవియొక్క ఒడిని శేషశయ్యను పొందినవాఁడు. ఐ = అయి. సుఖించు = సుఖము ననుభవించుచున్న. అక్కౌస్తుభభూషు వక్షస్థలంబున్ = కౌస్తుభమణి యాభరణము గాఁగల యావిష్ణుదేవుని ఱొమ్మును. తనపాదమునన్=తన కాలితో. బిట్టుతన్నెన్ = గట్టిగా తన్నెను. తన్నినన్ = తన్నఁగా. పాన్పుడిగి=పడకయందుండిదిగి. వచ్చి=ఈవలికివచ్చి. మునిన్=భృగువును. (చూచి) నగధరుండు= విష్ణుదేవుఁడు. పదములకున్ = ఆయన అడుగులకు. ఎఱఁగి= మ్రొక్కి. ఓపరమతపోధన=మేలైనతపస్సే ధనముగాఁగల ఓభృగుమహామునీ. ఈగతిన్ = ఈవిధముగా. నీవచ్చుట=నీయొక్కరాక. ఎఱుఁగలేక=తెలియక. (ఉన్ననాతప్పు) మన్నించి=ఓర్చి. (నన్ను) కరుణన్=దయతో. చూచి=కటాక్షించి. ఈ...నన్—ఈ=ఈయెదుటనుండెడు. దివ్య=అప్రాకృతమయిన. మణిమయ=రత్నవికారమయిన. స్ఫూర్తిన్=ప్రకాశముచేత. తనరు=ఒప్పునట్టి. రుచిర సింహాసనమునన్ = తేజరిల్లుచున్న సింహాసనమునందు. కూర్చుండు = కూర్చుండుము. దివ్యతాపసోత్తమ = దేవర్షిశ్రేష్ఠుఁడా. అభయప్రదాననిపుణ = భయములేమిని ఇచ్చుటయందు నేర్పుగలవాఁడా.

తా॥ మిక్కిలి మనోజ్ఞమయిన వైకుంఠ పట్టణమునకు ప్రీతితో పోయి ఆవైకుంఠపట్టణమునందు మిక్కిలిహెచ్చైనకలిమితో లక్ష్మీదేవి యొడిలో తలమోపి పానుపునందు పండుకొనిసుఖించుచున్న కౌస్తుభమణిని ఆభరణముగా ధరించిన విష్ణుదేవుని ఱొమ్మునందు తనకాలితో తన్నెను, అట్లుతన్నఁగా విష్ణుదేవుఁడుపానుపునుండి దిగివచ్చిభృగుమహామునినిజూచి ఆయన అడుగులకుమ్రొక్కి ఓమునీశ్వరా! నీవిట్లు వచ్చుటతెలిసికోకుండ ఉండిన అవజ్ఞకు ఓర్చి నన్నుకరుణించి ఈయెదుట నుండెడి దివ్యరత్నములు దాఁపిన వెలుఁగుచున్న సింహాసనమునందుఁ గూర్చుండుము అనివేఁడుకొనెనని తాత్పర్యము.

౧౨౬౮.—క॥ అలఘు పవిత్ర భవత్పద । జలములు నను నస్మదీయ * జఠరస్థ జగం
బుల లోకపాలురను బొలు । పలరఁగఁబుణ్యులనుజేయు * ననఘచరిత్రా.

టీ॥ అనఘచరిత్రా—అనఘ = పాపరహితమైన. చరిత్రా=నడవడిగల ఓభృగుమహామునీశ్వరుఁడా. అలఘు పవిత్ర భవత్పద జలములు—అలఘు=శ్రేష్ఠములైన. పవిత్ర=పరిశుద్ధములయిన. భవత్=నీయొక్క. పద=పాదములయందలి. (జలములు) ననున్=సర్వలోకకర్తనైననన్నును. అస్మదీయజఠరస్థజగంబులన్—అస్మదీయ = నాదియైన. జఠరస్థ=కడుపునందలి. జగంబులన్ = పదునాలుగులోకములను. లోకపాలురన్=ఆలోకములనుపాలించువారైనయింద్రాది దేవతలను. పొలుపలరఁగన్ = మిక్కిలిఒప్పిదమగునట్లుగా. పుణ్యులనుజేయున్=కృతార్థులనుజేయును.

తా॥ పాపరహితమైననడవడిగల ఓభృగుమహామునీశ్వరుఁడా! నిత్య పరిశుద్ధము లయిన మీకాళ్లు గడిగిన నీళ్లు నన్నును, నాకడుపులోనుండెడు పదునాలుగు లోకములను, ఆలోకములకు ప్రభువులయిన యింద్రాది దేవతలను, మిక్కిలి కృతార్థులను జేయును అని శ్రీవిష్ణుమూర్తిపలికెనని తాత్పర్యము.

వ॥ మునీంద్రా భవదీయ పాదాబ్జహతి మద్భుజాంతరంబునకు భూషణంబయ్యె భవదాగమనంబుమాబోఁటి వారికి శుభావహంబుగాదె యేనుధన్యుండనైతినని మృదుమధురాలాపంబుల ననునయించిన నమ్ముని వరుండు లక్ష్మీనాథు సంభాషణంబులకుఁ జిత్తంబునం బరమానందంబునొంది యమ్ముకుందు ననంతకల్యాణ గుణనిధి నభినందించి యానందబాష్పధారాసిక్తకపోలుండగుచుఁ దద్భక్తిపారవశ్యంబున నొండుపలుకనేరక యతనిచేత నామంత్రణంబుపడసి మరలి సరస్వతీతీరంబుననున్న మునులసన్నిధికిం జనుదెంచి వారలం గనుంగొని.

టీ॥ మునీంద్రా = ఓమునిశ్రేష్ఠుఁడా. భవదీయపాదాబ్జహతి= నీదైనపాదకమలములతోన్ను. మద్భుజాంతరంబునకున్ = నాఱొమ్మునకు. భూషణంబయ్యెన్=అలంకారమాయెను. భవదాగమనంబు= మీయొక్కరాక. మాబోఁటివారికిన్=మావంటివారికి. శుభావహంబు=

మేలునిచ్చునది. కాదె=కదా. ఏను=నేను. ధన్యుండనైతిఁ=కృతార్థుఁడనైతిని, (అని) మృదుమధురాలాపంబులన్ = మెత్తఁదనముగల యింపైనమాటలచేత. అనునయించినన్=లాలింపఁగా. అమ్మునివరుండు= ఆమునిశ్రేష్ఠుఁడైన భృగువు. లక్ష్మీనాథు సంభాషణంబులకున్=శ్రీమన్నారాయణునిమాటలకు. చిత్తంబునన్ = మనసునందు. పరమానందంబునొంది = మిక్కిలిసంతోషించి. ఆమ్ముకుందున్=ఆవిష్ణువును. అనంతకల్యాణగుణనిధిన్=మేరలేనిమంచిగుణములకు ఉనికిపట్టయినవానిని. అభినందించి = పొగడి. ఆనందబాష్పధారాసిక్తకపోలుండు=సంతోషాతిశయమువలనఁబుట్టినకన్నీటిదారలచేత తడుపఁబడిన చెక్కిళ్లు గలవాఁడు. అగుచున్ = అవుచును. తద్భక్తిపారవశ్యంబునన్=ఆవిష్ణునియందలిభక్తివలనిచొక్కుచేత. ఒండుపలుకనేరక = ఏమియుబదులుచెప్పఁజాలక. అతనిచేతన్ = ఆవిష్ణుదేవుని చేత. ఆమంత్రణంబు=అనుజ్ఞను. పడసి=పొంది. (మరలి) సరస్వతీతీరంబునన్=సరస్వతీనదిగట్టున. ఉన్నమునులసన్నిధికిన్ = ఉన్నట్టి మునులయొద్దకు. చనుదెంచి=వచ్చి. (వారలను) కనుంగొని=చూచి.

తా॥ ఓమునిశ్రేష్ఠుఁడా! నీకాలితన్ను నాయొమ్మునకు అలంకారమయ్యెను, నీరాక మావంటి వారికి మేలుకలుగఁజేయునదే కదా? నేను కృతార్థుఁడనైతిని అని తిన్ననియింపైన మాటలచేత లాలనచేయఁగా ఆభృగుమహాముని ఆవిష్ణుదేవుని మాటలకు మనసున సంతోషించి మేరలేనిమంచిగుణములుగల యాదేవుని పొగడి సంతోషముయొక్క అతిశయముచేత పుట్టిన కన్నీళ్లచేత తడిసినచెక్కిళ్లు గలవాఁడగుచు అతనియందలి భక్తిచేత దేహము తెలియనివాఁడై యేమిచెప్పనునోరు రాక ఆవిష్ణుదేవుని యనుజ్ఞపుచ్చుకొని అందుండిబయలుదేఱి సరస్వతీనదిగట్టునకు వచ్చి అచ్చటి మునులనుజూచి యని తాత్పర్యము.

౧౨౪౦.—సీ॥ ముని నాయకులతోడఁ * దన పోయివచ్చిన - తెఱఁగును దనమది * దృష్టమైన
మూఁడుమూర్తులవిధం * బును నెఱిఁగించిన - విని వారు మనముల * విస్మయంబు
నంది చిత్తంబుల * సందేహమును బాసి - చిన్మయాకారు ల * క్ష్మీసతీశుఁ
ననుపముఁ డనవద్యుఁ * డఖిలకల్యాణ గు - ణాకరుఁ డాదిమ * ధ్యాంత రహితుఁ
తే॥ డైతనర్చిన పుండరీ * కాక్షుఁ డొకఁడు। గాక ప్రణుతింప దైవ మె * క్కడను వేఱ
కలఁడె యని బుద్ధి విజ్ఞాన * కలితు లగుచు। హరిపదాబ్జాతయుగళంబు * నర్థిఁ గొలిచి.

టీ॥ మునినాయకులతోడన్ = ఆమునిశ్రేష్ఠులతో, తనపోయివచ్చినతెఱఁగును = తానుపోయివచ్చినవిధమును. తనమదిన్=తనమనస్సునందు. దృష్టమయిన=తోఁచిన. మూఁడుమూర్తులవిధంబును= త్రిమూర్తులయొక్క రీతియు. ఎఱిఁగించినన్=తెలియఁజేయఁగా. (విని వారు) మనములన్=మనసులలో. విస్మయంబునంది = ఆశ్చర్యమును పొంది. చిత్తంబులన్=మనస్సులయందు. సందేహము=విష్ణువునకంటె శ్రేష్ఠుఁడైనదేవుఁడొకఁడున్నాఁడేమో అనెడిఅనుమానము. పాసి=తొలఁగి. చిన్మయాకారున్=జ్ఞానస్వరూపుఁడైన. లక్ష్మీసతీశున్ = శ్రీమన్నారాయణుని. అనుపముఁడు = సాటిలేనివాఁడు. అనవద్యుఁడు = నింద్యుఁడుకానివాఁడు. అఖిలకల్యాణగుణాకరుఁడు = ఎల్లమంచిగుణములకునుగనియైనవాఁడు. ఆదిమధ్యాంతరహితుఁడు= మొదలునడుము తుదలు లేనివాఁడు—పుట్టుట పెరుగుట చచ్చుటలు లేనివాఁడనుట. అయితనర్చిన పుండరీకాక్షుఁడు = అయియొప్పిన శ్రీవిష్ణుమూర్తి. ఒకఁడుగాక=ఒక్కఁడేగాక. ప్రణుతింపన్=కొనియాడను. ఎక్కడను=ఏచోటనైనను. దైవము= దేవుఁడు. వేఱ కలఁడె=ఇతరుఁడొకఁడు ఉన్నాఁడా. (అని) బుద్ధిన్=బుద్ధియందు. విజ్ఞానకలితులు=విష్ణుదేవుఁడే సర్వోత్తముఁడనెడువిశేషజ్ఞానముతోఁ గూడుకొన్నవారు. (అగుచును) హరిపదాబ్జాతయుగళంబున్=శ్రీవిష్ణునియొక్క పాదకమలములజంటను. అర్థిన్=ప్రీతితో. కొలిచి=సేవించి.

తా॥ ఆమునిశ్రేష్ఠులతో తానువిష్ణుశివబ్రహ్మలలోకములకుపోయి వచ్చిన వృత్తాంతమును, వారినిజూచి నప్పుడు తనకుతోఁచిన వారి రీతులను తెలియఁజేయఁగా ఆమునులువిని తమమనసులలో ఆశ్చర్యమును పొందినవారై విష్ణుదేవునికంటె శ్రేష్ఠుఁడైన దేవుఁడు వేఱొకఁడుగలఁడేమోయనెడి మనసులలోనిసందేహమునువాని సాటిలేనివాఁడును,నింద్యుఁడుకానివాఁడును,సర్వజ్ఞత్వాదిగుణములుగలవాఁడును, పుట్టుట పెరుగుట చచ్చుటఅను అవస్థలు లేనివాఁడును, తామరలవంటి కన్నులుగలవాఁడునైన శ్రీలక్ష్మీభర్తనుజ్ఞానస్వరూపుఁడని భావించి ఆవిష్ణుమూర్తికంటె నితరుఁడైన దేవుఁడొకఁడుమనకు పూజ్యుఁడగువాఁడుకలఁడా! అనువిశేషజ్ఞానమునుపొందినబుద్ధులతో శ్రీవిష్ణుమూర్తిపాదకమలములను ప్రీతితో సేవించి యని తాత్పర్యము.

౧౨౪౧.—వ॥ అట్లు సేవించి యవ్యయానందంబైన వైకుంఠధామంబు నొందిరని చెప్పి వెండియు నిట్లనియె.

టీ॥ అట్లుసేవించి = ఆవిధముగా సేవించి. అవ్యయానందంబు=చెడనిసంతోషముగలది. అయినవైకుంఠధామంబున్=అయినవైకుంఠపట్టణమును. ఒందిరి = పొందిరి. (అనిచెప్పి) వెండియున్ = మఱియును. ఇట్లనియెన్ = ముందుచెప్పఁబోవు విధమునఁ బలికెను.

తా॥ ఆవిధముగా చెడని సంతోషము నిచ్చునట్టి వైకుంఠపట్టణమును పొందిరి అని శుకమహాముని యిట్లుపలికెనని తాత్పర్యము.

౧౨౪౨.—సీ॥ నరనాథ యొకనాఁడు * నలినాయతాక్షుండు - పొలుచు కుశస్థలి * పురమునందు
సుఖముండ నొక్కభూ * సుర వర్యుభార్యకుఁ - బుత్రుండు జన్మించి * పుట్టినపుడ
మృతుఁడైన ఘనశోక * వితతిచేఁ గ్రాఁగుచు - నాడింభకునిఁ గొంచు * నవని సురుఁడు
చనుదెంచి పిలుచు రా * జ ద్వారమునఁ బెట్టి - కన్నుల బాష్పాంబు * కణము లొల్కుక

తే॥ బాపురే విధి నను దుఃఖ * పఱుపఁదగునె । యనుచు దూఱుచుఁ దనుఁదిట్టు * కొనుచు వగల
గుండె మండంద నెఱియనా * క్రందనంబు । సేయుచునువచ్చి యావిప్ర * శేఖరుండు.

టీ॥ నరనాథ=ఓరాజా. ఒకనాడు=ఒకదినము. నలినాయతాక్షుండు = కమలములవలె విశాలములయిన కన్నులుగల కృష్ణుఁడు. ఏలుచు=ఉండునట్టి. కుశస్థలిపురమునందున్=ద్వారకాపట్టణమునందు. సుఖముండన్=సుఖముగానుండఁగా. ఒక్క భూసురవర్యుభార్యకున్=ఒకబ్రాహ్మణశ్రేష్ఠుని పెండ్లానికి. పుత్రుండు=కొడుకు. జన్మించి = పుట్టి. పుట్టినప్డ=పుట్టినతోడనే. మృతుఁడైనన్=చావఁగా. ఘనశోకవీతతిచేన్=అధికమైనదుఃఖసముదాయముచేత. క్రాఁగుచున్=తపించుచు. ఆడింభకునిన్=ఆబిడ్డను. కొంచున్=ఎత్తుకొని. అవనిసురుఁడు=బ్రాహ్మణుఁడు. చనుదెంచి=వచ్చి. రాజద్వారమునన్=రాజునింటివాకిట. (పెట్టి) కన్నులన్ = కన్నులయందు. బాష్పాంబుకణములు = కన్నీటిచినుకులు. ఒలుకన్ = రాలఁగా. బాపురే=ఔరా. విధి=దైవమా. ననున్=నన్ను. దుఃఖపఱుపన్=దుఃఖపెట్టుట. తగునే=నీకుఁదగునా. (అనుచు) దూఱుచున్=దూషించుచు. తనున్=తన్ను. పెలుచన్=గట్టిగా. (తిట్టుకొనుచు) వగలన్ = దుఃఖములచేత. డెందము=మనస్సు. అందంద=క్రమముగా. నెఱియన్=పగులఁగా. ఆక్రందనంబుసేయుచున్ = ఏడ్చుచు. (వచ్చి) ఆవిప్రశేఖరుండు=ఆబ్రాహ్మణశ్రేష్ఠుఁడు.

తా॥ ఓరాజా ! ఒకనాఁడు శ్రీకృష్ణమూర్తికి ఉనికిపట్టైన ద్వారకయను పట్టణమునందు ఒకబ్రాహ్మణుఁడు సుఖముగా వాసము చేయుచుండఁగా ఆతనిభార్య నీళ్లాడి నీళ్లాడినతోడనే పుట్టినబిడ్డ చనిపోయెను, అంతట ఆబ్రాహ్మణుఁడు మిక్కిలి దుఃఖమును పొంది తపించుచు ఆబిడ్డ నెత్తుకొని కృష్ణుని నగరివాకిట తెచ్చి కన్నుల నీళ్లు కార్చుకొనుచు ఔరా దైవమా! నన్ను దుఃఖపెట్టుట నీకుఁ దగునా? అని దైవమును దూఱుచు గట్టిగా తన్ను తిట్టుకొనుచు దుఃఖముచేత గుండెలుపగిలి బద్దలగునట్టుగా ఏడ్చుచు అనితాత్పర్యము.

(*) విప్రుండుమృతులైనతనపుత్రులఁదెచ్చికృష్ణునినగరివాకిటఁబెట్టియేడ్చుట. (*)



బ్రాహ్మణుఁడు.

సీ॥ అధికశోకంబున * నలమటఁబొందుచు - నచ్చటి జనులతో * ననియెఁ బెలుచ
బ్రాహ్మణ విద్వేష * వంతుఁడై తగశాస్త్ర - పద్ధతి నడవక * పాపవర్తి
యగుక్షత్రబాంధవుఁ * డగువానిదురితంబు-చేత మత్పుత్రుండు * జాతమైన
యప్పుడమృతుఁడయ్యె * నక్కటహింసకు - రోయకయప్పుడ * న్యాయకారి
తే॥ యగుచువిషయానుగతచిత్తుఁ*డైనయట్టి।రాజుదేశంబుప్రజలుని*రాశులగుచు
దుఃఖములఁజాలవనటఁబొం*దుదురటంచు।నేడ్చుచునచటనిల్వక*యేగెనపుడు.

టీ॥ అధికశోకంబునన్ = మిక్కుటమయినదుఃఖముతో. అలమటఁబొందుచున్ = దుఃఖపడుచు. అచ్చటిజనులతోన్ = అక్కడనున్నజనులతో. పెలుచన్ = గట్టిగా. అనియెన్ = పలికెను. బ్రాహ్మణవిద్వేషవంతుఁడై = బ్రాహ్మణుల యందు పగగల వాఁడై. తగన్ = తగునట్లు. శాస్త్రపద్ధతిన్=శాస్త్రమార్గమునందు. నడవక=వర్తింపక. పాపవర్తి = న్యాయశాస్త్ర విరుద్ధమయిననడువడి గలవాఁడు. అగు క్షత్రబాంధవుఁడు = అగునట్టినీచరాజు. అగువానిదురితంబుచేతన్ = అగునట్టివానియొక్కపాపముచేత. మత్పుత్రుండు=నాకొడుకు. జాతమయినయప్పుడ=పుట్టినప్పుడే. మృతుఁడయ్యెన్ = చచ్చెను. అక్కట = అయ్యో. హింసకున్=బాధకు. రోయక=విసుగక. ఎప్పుడున్=ఎల్లప్పుడును. అన్యాయకారి=అధర్మమునుచేయువాఁడు. ( అగుచును ) విషయానుగతచిత్తుఁడు = ఇంద్రియచాంచల్యములయందుపొందినమనసుగలవాఁడు. ఐనట్టిరాజు దేశంబుప్రజలు = అయినట్టిరాజుయొక్క దేశమునందుండుజనులు. నిరాశులగుచున్ = ఆశలేనివారగుచు. దుఃఖములన్ = దుఃఖములచేత. చాలన్=మిక్కిలి. వనటఁబొందుదురు=తపింతురు. అటంచున్=అనిచెప్పుచు. (ఏడ్చుచు) అచటన్=అక్కడ. (నిలువక) అప్పుడు=ఆసమయమునందు. ఏగెన్=పోయెను.

తా॥ ఆబ్రాహ్మణుఁడు మిక్కిలి దుఃఖముతో సంకటపడుచును అక్కడనున్నజనులనుజూచి ఏరాజు బ్రాహ్మణులయందు శత్రుత్వము గలిగి శాస్త్రమునందు చెప్పఁబడిన ధర్మమార్గమును అవలంబింపక మెలఁగునో అట్టి నీచరాజుయొక్క పాపముచేత నాకొడుకు పుట్టినప్పుడేచచ్చెను, అయ్యో ! హింసకు వెఱవక యెప్పుడును అధర్మమునే చేయుచుండునట్టివాఁడు విషయములయందు మరిగినవాఁడును అయిన రాజుయొక్క దేశమునందుండుజనులు తమకు మేలుగలుగును అను ఆశలేక ఆపదలచేత సంకటపడుచుందురు అని చెప్పి యేడ్చుచు అక్కడనిలువక వెడలి పోయెనని తాత్పర్యము.

వ॥ ఇవ్విధంబున మఱియుం దనసుతులు మృతులైన వారలం గొనివచ్చి యెప్పటియట్ల పలవరిం
చుచు నవ్విప్రుండు రాజు మొగసాలం బెట్టి రోదనంబు సేయుచు కొన్నిగాథలు సదివి పోవు
చుండె నవ్విధంబున నెనమండ్రు సుతులు మృతులైనపిదపం దొమ్మిదవ కుమారుండైన శిశువు
నెత్తితెచ్చి యెప్పటి విధంబునఁ బలవరించుచున్న బ్రాహ్మణునిఁ గని యర్జునుం డిట్లనియె.

టీ॥ ఇవ్విధంబునన్ = ఈరీతిగా. మఱియును = ఇంకను. తన సుతులు=తనకొడుకులు. మృతులైనన్=చావఁగా. వారలన్=ఆచచ్చినకొడుకులను. కొనివచ్చి=ఎత్తుకొనివచ్చి. ఎప్పటియట్ల=ఎప్పటి వలెనే. పలవరించుచున్=ప్రలాపించుచు. అవ్విప్రుండు=ఆబ్రాహ్మణుఁడు. రాజు మొగసాలంబెట్టి=రాజునగరివాకిటనుంచి. రోదనంబు చేయుచున్=ఏడ్చుచు. కొన్ని గాథలుసదివి = కొన్ని న్యాయకథలు చెప్పి. ( పోవుచుండెను ) అవ్విధంబునన్ = ఆరీతిగా. ఎనమండ్రు సుతులు = ఎనిమిదిమంది కొడుకులు. మృతులైన పిదపన్ = చచ్చిన పిమ్మట. (తొమ్మిదవకుమారుండైన) శిశువున్ = బిడ్డను. ఎత్తితెచ్చి= ఎత్తుకొనివచ్చి. ఎప్పటివిధమ్మునన్ = మునుపటివలెనే. పలవరించుచున్న=ప్రలాపించుచున్న. (బ్రాహ్మణునికనిఅర్జునుండుఇట్లనియెను)

తా॥ ఈమేరకుతనకొడుకులు ఒకరివెంటనొకరుగా పుట్టుచునే చచ్చుచుండఁగా వారినెల్లను ఎత్తుకొనివచ్చి రాజునగరివాకిటఁ బెట్టి కొన్నినీతులుచెప్పి యేడ్చిపోవుచుండెను, అట్లు ఎనిమిదిమందిబిడ్డలు చావఁగా తొమ్మిదవవాఁడును పుట్టిచచ్చెను, ఆచచ్చినబిడ్డను మునుపటివలెనేపలవరించుచు కొనిపోయిరాజునగరిముందటఁబెట్టి ఎప్పటివలెనేయేడ్చుచుండఁగా అర్జునుఁడుచూచి ఆబ్రాహ్మణునితో ఇట్లు పలికెనని తాత్పర్యము.

౧౨౭౫.—క॥ ఈపగిది నీవువగలన్ । వాపోవఁగఁ జూచి యకట ✱ వారింపఁగఁ దా
నోపిన విలుకాఁడొక్కం । డీపురి లేఁడయ్యె నయ్య ✱ యిది పాపమగున్.

టీ॥ ఈపగిదిన్=ఈవిధముగా. (నీవు) వగలన్ = దుఃఖముల చేత. వాపోవఁగన్=ఏడువఁగా. (చూచి) వారింపఁగన్ = ఆయేడ్పుసమాన్పుటకు. ఓపిన=చాలిన. విలుకాఁడు=విల్లుపట్టినశూరుఁడు తాన్=తాను. ఒక్కండున్=ఒకఁడైనను. ఈపురిన్=ఈపట్టణము నందు. లేఁడయ్యెనయ్య=లేకపోయెనా. అకట=అయ్యో. ఇది=ఇట్లు నీదుఃఖమునుచూచి సహించుటకు. పాపమగున్=పాపము అగును.

తా॥ ఓబ్రాహ్మణుఁడా! నీవు ఈవిధముగా అధిక దుఃఖముతో ఏడ్చుచుండఁగానిన్ను ఆదరించినీదుఃఖమునుపోఁగొట్టఁజాలిన బంటు ఒకఁడైనను ఈపట్టణములో లేకపోయెనా? అయ్యో! పాపము అని అర్జునుఁడు బ్రాహ్మణునితో అనియెనని తాత్పర్యము.

౧౨౭౬.—సీ॥ పుత్రులఁ గోల్పోయి ✱ భూరి శోకంబున - వనటఁ బొందుచు విప్ర ✱ వరులుచాల
నేరాజు రాజ్యమం ✱ దేని వసింపుదు - రా రాజుఁ దలపోయ ✱ నవని మీఁద
నటునిగా నాత్మ నె ✱ న్నందగు నీపుత్రు - నేఁ బ్రతికించెద ✱ నిపుడు పూని
యటు సేయ నైతి నే ✱ ననలంబు సొచ్చెద - నని భూసురుఁడు వెఱఁ ✱ గందఁ బలుక
తే॥ నతఁడువిని యిట్టివెడఁగుమా ✱ టాడఁదగునె । భూరి విక్రమశాలి రా ✱ ముండు మేటి
బలుఁడు హరియును ధైర్య సం ✱ పన్ను లనఁగఁ । దనరు ప్రద్యుమ్నుఁ డతనినం ✱ దనుఁడుమఱియు.

టీ॥ పుత్రులన్ = కొడుకులను. కోల్పోయి = పోఁగొట్టుకొని. భూరిశోకంబునన్=అధికమైనమనోవ్యథతో. వనటఁబొందుచున్=దుఃఖపడుచు. విప్రవరులు=బ్రాహ్మణులు. చాలన్=విశేషముగా. ఏరాజురాజ్యమందేని=ఏరాజుయొక్క రాజ్యమునందు. వసింపుదురు= ఉందురో. ఆరాజున్=అట్టిరాజ్యము నేలెడురాజును. అవనిమీఁదన్= భూమియందు. తలపోయన్=విచారింపఁగా. నటునిగాన్ = రాజు వలెనటించునట్టివానిఁగా. ఆత్మన్=మనస్సునందు. ఎన్నందగున్= ఎంచవలసినది. ఇపుడు=ఈసమయమునందు. నీపుత్రున్ = నీకొడుకును. ఏన్=నేను. పూని=యత్నపడి. (బ్రతికించెదను) అటుసేయ నైతి నేని=అట్లు బ్రతికింపలేకపోయినపక్షమున. అనలంబుసొచ్చెదన్= అగ్నియందుఁ బ్రవేశించెదను. (అని) భూసురుఁడు=బ్రాహ్మణుఁడు. వెఱఁగందన్ = ఆశ్చర్యపడునట్టుగా. పలుకన్ = చెప్పఁగా. అతఁడు=ఆబ్రాహ్మణుఁడు. ( విని ) ఇట్టివెడఁగుమాట = ఈయుపయోగములేనివెఱ్ఱిమాట. ఆడఁదగునె=చెప్పవచ్చునా. భూరివిక్రమశాలి=మిక్కుటమయినపరాక్రమముచేతఒప్పినవాఁడు. రాముండు= బలరాముఁడు. మేటిబలుఁడు=అధికబలముగలవాఁడు. హరియును= శ్రీకృష్ణుఁడును. ధైర్యసంపన్నులు=ధైర్యముకలిమిగలవారు. అనఁగఁ దనరు=అనఁగాఒప్పునట్టి. (ప్రద్యుమ్నుఁడును) అతనినందనుఁడు= ఆప్రద్యుమ్నుని కొడుకైన యనిరుద్ధుఁడును. మఱియున్=వీరుగాక.

తా॥ ఏరాజుయొక్క రాజ్యమునందు బ్రాహ్మణులు కొడుకులను పోఁగొట్టుకొని దుఃఖమునుపొందుచునుందురో ఆరాజును రాజువంటివాఁడనవలెనుగాని రాజు అనరాదు కనుక ఇప్పుడు నీకొడుకును నేను ఎట్లయిన బ్రతికించెదను, బ్రతికింపలేక పోయినపక్షమున నేను అగ్నిప్రవేశముచేసెదను అని బ్రాహ్మణుఁడు ఆశ్చర్యపడునట్లుగా ప్రతిజ్ఞ చేయఁగా బ్రాహ్మణుఁడు ఓయి అర్జునా ఏల యీయుపయోగము లేనిప్రతిజ్ఞలు చేసెదవు? మిక్కిలి పరాక్రమముగల బలరాముఁడును మిక్కిలిబలవంతుఁడు అనఁబడిన శ్రీకృష్ణుఁడును మిక్కిలిధైర్యముగల వారుఅనఁబడిన ప్రద్యుమ్నుఁడును అనిరుద్ధుఁడును వీరేగాకఅనితా.

౧౨౭౭.—తే॥ వినుత బలులైన యాదవ ✱ వీర వరులు । గలుగ వారలచేఁగాని ✱ కార్యమీవు-
చక్కఁబెట్టుట యెట్లు నీ ✱ చనెడిత్రోవఁ । బొమ్ము నావుడు నయ్యింద్ర ✱ పుత్రుఁడపుడు.

టీ॥ వినుతబలులు = కొనియాడఁబడిన బలములుగలవారు. ఐన యాదవవీరవరులు=అయినట్టిశూరశ్రేష్ఠులైనయాదవులు. కలుగన్= కలిగియుండఁగా. వారలచేన్=ఆయాదవవీరులచేత. కాని కార్యము= కాకుండునట్టిపని. ఈవు=నీవు. చక్కఁబెట్టుట=నెఱవేర్చుట. (ఎట్లు) నీచనెడిత్రోవఁబొమ్ము = నీదారిఁబట్టుకొనినీవుపో. నావుడున్ = అనఁగా. అయ్యింద్రపుత్రుఁడు = ఆయర్జునుఁడు. (అపుడు)

తా॥ కొనియాడఁ బడిన బలములు గల శూరులైన యాదవు లున్నారు వారుతమచేతఁగాదని మానుకొన్న పనినీచేత అగునుఅనుట ఎటువంటిది నీచేత కానేకాదు ఊరకలేనిపోని ప్రజ్ఞలుపలుకకే నీవు వచ్చినదారిఁ బట్టుకొనిపొమ్మని బ్రాహ్మణుఁడు అనఁగాఆయర్జునుఁడు ఆసమయము నందని తాత్పర్యము.

౧౨౭౮.—క॥ మనమున దురహంకారము । ఘనముగఁ బొడమంటయు నపుడు * గవ్వడివిప్రుం
గనుఁగొని యచ్చటి జనములు । వినఁగా నిట్లనియె రోష * విహ్వల మతియై.

టీ॥ మనమునన్=మనసునందు. దురహంకారము=పెద్దగర్వము. ఘనముగన్=అధికముగా. పొడమంటయును=పుట్టఁగా. (అపుడు) కవ్వడి=అర్జునుఁడు. విప్రున్=బ్రాహ్మణుని. కనుఁగొని=చూచి. అచ్చటి జనములు=అక్కడనుండునట్టి మనుష్యులు. వినఁగాన్=వినుచుండఁగా. రోషవిహ్వల మతియై=కోపముచేతస్వాధీనతతప్పిన బుద్ధిగలవాఁడై. ఇట్లనియెను=ముందుఁజెప్పఁబోవునట్లు పలికెను.

తా॥ అప్పుడు అర్జునుఁడు మనసునందు పెద్దగర్వము హెచ్చుగా కలుగఁగా బ్రాహ్మణునిజూచి మిక్కిలి కోపముచేత బుద్ధిభ్రమముగలు గఁగా అక్కడనున్న జనులందఱు వినునట్లుగా ఇట్లుపలికెననితా ర్యము.

౧౨౭౯.—మ॥ బలుఁడంగాను మురాసురాంతకుఁడఁ గాఁ * బ్రద్యుమ్నుఁడంగాను నేఁ
దలఁపం దత్తనయుండఁ గానని విరు * ద్ధ వ్రాతముల్ భీషణో
జ్జ్వల గాండీవ ధనుర్విముక్త నిశితా * స్త్ర శ్రేణిచేఁ బీన్గుపెం
టలు గావించు పరాక్రమ ప్రకట చం * డస్ఫూర్తి నేఁ బార్థుఁడన్.

టీ॥ నేన్=నేను. బలుఁడంగాను=బలరాముఁడనుగాను. మురాసురాంతకుఁడఁగాన్=శ్రీకృష్ణుఁడనుగాను. ప్రద్యుమ్నుఁడం గాను=ప్రద్యుమ్నుఁడనుగాను. తలఁపన్=విచారింపఁగా. తత్తన యుండఁగాన్=ఆప్రద్యుమ్నుని కొడుకైన అనిరుద్ధుఁడనుగాను. అనిన్=యుద్ధమునందు. విరుద్ధవ్రాతముల్=విరుద్ధముగాప్రవర్తించు నట్టివారైనశత్రువులసమూహమును. భీష ... శ్రేణిచేన్—భీషణ=భయంకరమై. ఉజ్జ్వల=వెలుఁగుచున్న. గాండీవ=గాండీవమనెడు. ధనుః=వింటివలననుండి. విముక్త=విడువఁబడిన. నిశిత=వాఁడి యైన. అస్త్రశ్రేణిచేన్=బాణపఙ్క్తిచేత. పీన్గుపెంటలు=పీనుఁగుల ప్రోగులు. కావించు=చేయునట్టి. పరాక్రమప్రకటచండస్ఫూర్తిన్=పరాక్రమముచేత ప్రసిద్ధినొందిన తీక్ష్ణమైన ప్రకాశముగల. (నేను) పార్థుఁడన్=అర్జునుఁడను. వ॥ అదియనుంగాక.

తా॥ ఓయిబ్రాహ్మణుఁడా! నేనునీవిప్పుడుచెప్పిన బలరాముఁడు కృష్ణుఁడు ప్రద్యుమ్నుఁడు అనిరుద్ధుఁడు అను వారిలో నెవ్వఁడను గాను, మఱినేను ఎవఁడననఁగా యుద్ధమునందు శత్రురాజులసమూహమును భయంకర మయి వెలుఁగుచున్న గాండీవ మనెడి ధనుస్సు నుండి విడువఁబడిన తీక్ష్ణములైన బాణములచేత పీనుఁగులుగాఁ జేసె మిక్కిలి తేజరిల్లుచున్న అర్జునుఁడను అని తెలిసికొమ్మని తాత్పర్యము.

౧౨౮౦.—చ॥ బలిమిమురాంతకుం దొడరి * బాహువిజృంభణమొప్పనెక్కటిన్
దలపడి పోరునట్టి రణ * ధైర్యుని నన్ను నెఱుంగ వక్కటా
బెలుకుఱ మృత్యుదేవతను * బింకమడంచి భవత్తనూజుల
న్నలవుఁ జలంబుఁ జూపి కొని * యాడఁగనిప్పుడె తెచ్చియిచ్చెదన్.

టీ॥ అక్కటా=అయ్యో. బలిమిన్=బలముచేత. మురాంతకున్=కృష్ణుని. తొడరి=ఎదిరించి. బాహువిజృంభణము=భుజపరాక్రమము. ఒప్పన్=ఒప్పుచుండఁగా. ఎక్కటిన్=ఒంటరినై. తలపడి=మార్కొని. పోరునట్టి=యుద్ధముచేయునట్టి. రణధైర్యునిన్=యుద్ధమునందుధీరత్వముగల. (నన్ను) ఎఱుంగవు=నీవు ఎఱుఁగవు. మృత్యుదేవతను=చంపునట్టిదేవతను. బెలుకుఱన్=దిగులుచేతఅవయవములస్వాధీనతతప్పునట్లు. బింకము=బిగువును—గర్వమును. అడంచి=అణఁగఁగొట్టి. భవత్తనూజులన్=నీకొడుకులను. అలవున్=సామర్థ్యమును. చలంబున్=పట్టుదలను. చూపి=కనఁబఱిచి. కొనియాడఁగన్=నీవునన్నుపొగడునట్టుగా. (ఇప్పుడె తెచ్చియిచ్చెదను)

తా॥ ఓబ్రాహ్మణుఁడా! నీవు నాసామర్థ్యమును తెలిసికోలేకపోతివే, అయ్యోయింత వెఱ్ఱివారుగలరా? నేనుబలముచేతఒంటరినై శ్రీకృష్ణ మూర్తిని ఎదిరించి నాభుజబలను అందఱికి తెలియునట్లుగా పోరాడఁజాలిన వాఁడను, ఇప్పుడేనీవు సంతోషించిపొగడునట్లుగా మృత్యుదేవతనుబట్టిదిగులుపడి ముడుఁగుఁగొనునట్లు గర్వమణఁగఁ గొట్టి నాపట్టుదలను సామర్థ్యమును జూపి నీకొడుకులను అందఱను తీసికొనివచ్చి నీకు ఒప్పించెద నని తాత్పర్యము.

వ॥ అని నమ్మంబలికిన నర్జును ప్రతిజ్ఞకు భూసురుండు మనంబున నూఱడిల్లి యతని నభినందించుచు
నిజ మందిరంబునకుం జని కొన్నిదినంబు లుండునంతం దన భార్యకుఁ బ్రసూతివేదనా సమ
యంబైనం జనుదెంచి విప్వచ్చుంగని తద్విధం బెఱింగించిన నయ్యింద్ర తనయుం డప్పుడు.

టీ॥ (అని) నమ్మంబలికినన్=నమ్మునట్లుగాఁజెప్పఁగా. భూసురుండు=బ్రాహ్మణుఁడు. అర్జునుప్రతిజ్ఞకున్=అర్జునునియొక్కపంతమునకు. మనంబునన్=మనసునందు. ఊఱడిల్లి=ఊఱటనుపొంది. అతనిన్=ఆయర్జునుని. అభినందించుచున్=పొగడుచు. నిజమందిరంబునకున్=తనయింటికి. చని=పోయి. కొన్నిదినంబులు=కొన్నాళ్లు. ఉండునంతన్=ఉండఁగా. తనభార్యకున్=తనపెండ్లాము

మునకు. ప్రసూతివేదనాసమయంబు = బిడ్డనుకనెడి నొప్పులుకలుగు సమయము. ఐనన్ = కాఁగా. చనుదెంచి=వచ్చి. విప్రవచ్చుంగని=అర్జునునిఁజూచి. తద్విధంబు=అనొప్పులఁబడువిధమును. ఎఱింగించినన్ = తెలియఁజేయఁగా. అయ్యింద్రతనయుండు=ఆయర్జునుఁడు. (అప్పుడు)

తా॥ అనిఱియీవిధముగా బ్రాహ్మణునికిఁతనయందు నమ్మకముపుట్టునట్లు అర్జునుఁడు పంతములాడఁగా అతఁడునమ్మిమనసున నెమ్మదినొంది యుండెను ఆట్లుండఁగా కొన్నాళ్లకు ఆబ్రాహ్మణునిభార్య గర్భము ధరించి కనప్రొద్దులై నొప్పులఁ బడుచుండఁగా అవర్త మానమును బ్రాహ్మణుఁడు అర్జుననివద్దకువచ్చిచెప్పెను అర్జునుఁడును ఆసమయమునందు అనితాత్పర్యము.

౧౨౮౨.—చ॥ లలిత విశిష్ట సంచిత జ * లంబుల నాచమనంబుచేసి సు
స్థలముననిల్చి రుద్రునకు * సమ్మతి మ్రొక్కి మహాస్త్ర వేది ని
ర్మల శుభ మంత్ర దేవతల * మానసమందుఁదలంచి గాండివం
బలవడనెక్కుఁద్రోచి బిగి * యంగదియించి నిషంగయుగ్మమున్.

టీ॥ లలితవిశిష్టసంచితజలంబులన్ = మంచిపరిశుద్ధమయిన తాను తెచ్చియుంచుకొన్ననీళ్లచేత. (ఆచమనంబుచేసి) సుస్థలమునన్ =పరిశుద్ధమైనచోట. నిల్చి=నిలువఁబడి. రుద్రునకున్ =సంహారకర్తయైనశివునికి. సమ్మతిన్ =ఇష్టముతో—ప్రీతితో. (మ్రొక్కి) మహాస్త్రవేది=గొప్పయస్త్రముల నెఱిఁగిన వాఁడైనయాయర్జునుఁడు. నిర్మలశుభమంత్రదేవతలన్ = పరిశుద్ధములైనవియు మంచివియునైన ఆయస్త్రముల మంత్రములను దేవతలను.(మానసమందుతలంచి) గాండివంబు=గాండివమనెడితనధనుస్సును. అలవడన్ = సరిపడువట్లు. ఎక్కుద్రోచి= అల్లెత్రాడు ఎక్కపెట్టి. బిగియన్ =బిఱ్ఱుగా. నిషంగయుగ్మమున్ = రెండు అమ్ములపొదులను. కదియించి = మూఁపునఁ జేర్చికట్టుకొని.

తా॥ గొప్పగొప్ప అస్త్రముల నెఱిఁగిన ఆయర్జునుఁడు పరిశుద్ధముగా తెచ్చియుంచుకొన్న మంచినీళ్లచేత ఆచమనము చేసి పరిశుద్ధమయినప్రదేశమునందు నిలువఁబడి సంహారకర్తయైన రుద్రునకు నమస్కరించి ఎల్లఅస్త్రములమంత్రములను వాని అధిదేవతలను స్మరించి ధనుస్సు నందు అల్లెత్రాటిని ఎక్కించి రెండు అమ్ముల పొదులను బిఱ్ఱుగా మూఁపున నంటఁగట్టుకొని అనితాత్పర్యము.

వ॥ ఇవ్విధంబునఁ గట్టాయితంబై యప్పుడు.

టీ॥ ఇవ్విధంబునన్ =ఈరీతిగా. కట్టాయితంబై = మిక్కిలిసిద్ధపడినవాఁడై. (అప్పుడు)

౧౨౮౩.—సీ॥ భూసురు వెంట ని * మ్ముల నేగి సూతికా - భవనంబు చుట్టును * బాణవితతి
నరికట్టి దిక్కులు * నాకాశ పథము ధ - రాతలంబెల్ల నీ * రంధ్రముఁగను
శరపంజరముఁగట్టి * శౌర్యంబు దీపింపఁ - గడునప్రమత్తుఁడై * కాచియున్న
యెడ నమ్మహీ సురు * నింటికిఁబుత్రుండు - జనియించినప్పు డ * చ్చటి జనంబు

తే॥ పోయెఁబోఁయెఁగదేయని * బొబ్బలిడఁగ । బొందితోడన యాకాశ * మునకుమాయఁ
జెందెనప్పుడు దుఃఖంబు * నొంది భూమి । సురుఁడు విలపించుచును ముర * హరునికడకు.

టీ॥ భూసురువెంటన్ = బ్రాహ్మణునివెంబడిని. ఇమ్ములన్ =సుఖముగా. ఏగి = పోయి. సూతికాభవనంబుచుట్టును=బిడ్డనుగనునట్టి యింటిచుట్టును. బాణవితతిన్ = బాణసమూహముచేత. అరికట్టి = ముట్టడివేసి. (దిక్కులును) ఆకాశపథమున్ = ఆకాశమార్గమును. ధరాతలంబెల్లన్ = భూప్రదేశమంతయును. నీరంధ్రముగన్ =సందులేకుండ. శరపంజరము = బాణములగూఁడు. (కట్టి) శౌర్యంబు = తనశూరత్వము. దీపింపన్ =ప్రకాశించునట్లు. కడునప్రమత్తుఁడై= మిక్కిలియెచ్చరిక గలవాఁడై. కాచియున్నయెడన్ = కనిపెట్టియుండుసమయమునందు. అమ్మహీసురునింటికిన్ = ఆబ్రాహ్మణుని భార్యకు. పుత్రుండు = కొడుకు. జనియించి = పుట్టి. అప్పుడు = అప్పుడే. అచ్చటిజనంబు=అక్కడనుండునట్టిజనసమూహము. పోయెఁ బోయెఁగదే=పోయెనేపోయెనే. (అని)బొబ్బలిడఁగన్ =కూఁతలు పెట్టియేడువఁగా. బొందితోడన= దేహముతోనే. ఆకాశమునకున్ = మింటికి. మాయఁజెందెన్ = మాయమయ్యెను. (అప్పుడు) భూమిసురుఁడు=బ్రాహ్మణుఁడు. దుఃఖంబునొంది=దుఃఖమునుపొంది. విలపించుచున్ =ప్రలాపించుచు. మురహరునికడకున్ =కృష్ణునియొద్దకు.

తా॥ ఈవిధముగా సిద్ధపడినవాఁడై బ్రాహ్మణుని వెంబడిని సుఖముగాఁబోయి బిడ్డనుగనెడి యింటిచుట్టును క్రిందను మీఁదను తన బాణములచేత సందులేకుండ గూఁడుకట్టి తనశూరత్వము ఎల్లవారికి తెలియఁబడునట్టుగా మిక్కిలి యెచ్చరికతో కాచియుండెను, ఆసమయమునందుబ్రాహ్మణునిభార్యకొడుకునుగనెను, ఆకనినబిడ్డనేలను పడీపడకమునుపే చుట్టుపట్లనున్న వారందఱు అయ్యో? పోయెనే పోయెనేయని మొఱలు పెట్టుచుండఁగా దేహముతోనే ఆకాశమునకు ఎగసి మాయమైపోయెను, అంతట బ్రాహ్మణుఁడుదుఃఖించుచు మొఱ్ఱోయని అంగలార్చుచు కృష్ణునిదగ్గఱకుపోయెననితాత్పర్యము.

వ॥ అప్పుడుచని=ఆసమయమునందేపోయి.

౧౨౮౪.—క॥ ముందఱ నిల్చి ముకుంద స । నందన మునివినుత నంద * నందన పరమా
నంద శరదిందు చందన । కుంద యశస్సాంద్ర కృష్ణ * గోవింద హరీ.

టీ॥ మ్రోలన్ = ఎదుట. నిల్చి = నిలువఁబడి. ముకుంద = ఇహపరసుఖముల నిచ్చువాఁడా. సనందన మునివినుత=సనందనుఁ డనెడి మునీశ్వరునిచేత కొనియాడఁబడినవాఁడా. నందనందన = నందునికొడుకా. పరమానంద = నిరతిశయానంద స్వరూపుఁడా. శరదిందు...సాంద్ర-శరదిందు = శరత్కాలపుచంద్రునిని. చందన= మంచిగంధమును. కుంద= మొల్లపువ్వులను బోలిన. యశః=కీర్తిచేత. సాంద్ర=దట్టమయినవాఁడా. కృష్ణ=సర్వలోకములకు సుఖమునిచ్చు వాఁడా. గోవింద = వేదములచేత నెఱుఁగఁదగిన స్వభావముగల వాఁడా. హరీ=పాపములను హరించువాఁడా.

తా॥ ఇహపర సుఖములనిచ్చువాఁడవును, సనందనునిచేత కొనియాఁడఁబడు వాఁడవును, నందుని కొడుకవును, నిరతిశయానంద స్వరూపుఁడవును, శరత్కాలచంద్రుని మంచిగంధమును మొల్లపువ్వులనుబోలినదట్టమైన కీర్తిగలవాఁడవును, వేదములచేత నెఱుఁగఁదగిన వాఁడవును, పాపములనుపోఁగొట్టువాఁడవునైనయో కృష్ణా అనితా.

వ॥ అవధరింపుము దేవా యర్జునుం డనెడి పౌరుషవిహీనుం డాడిన వృథాజల్పంబులు నమ్మి పుత్త్రుం గోలుపడి జేలనైన నన్ను నేమందు నిఖిలవిశ్వోత్పత్తి స్థితిలయంబులకుఁ బ్రధానహేతుభూతుండవైన నీవు సమర్థుండవయ్యు వారింపంజాలక చూచుచుండ నొక్క మనుష్యమాత్త్రుండు దీర్పంజాలెడువాఁడు గలండే యని వెండియు.

టీ॥ దేవా=స్వామీ. అవధరింపుము = వినుము. (అర్జునుండు) అనెడి పౌరుషవిహీనుండు=అను పేరుగల మగతనముచేత తక్కువైన వాఁడు. ఆడిన వృథాజల్పంబులు = చెప్పిన వ్యర్థములైన మాటలు. (నమ్మి) పుత్త్రున్=కొడుకును. కోలుపడి పోఁగొట్టుకొని. జేలను= మూఢుఁడను. ఐన నన్ను నేమందున్=అయినట్టి నన్ను ఏమనుకొందును. నిఖిల విశ్వోత్పత్తి స్థితి లయంబులకున్ = ఎల్ల లోకముల యొక్క పుట్టుక ఉనికి నాశము అను నీమూటికిని. ప్రధాన హేతుభూతుండవు= ముఖ్యకారణమైన వాఁడవు. అయిన నీవు=అయినట్టి నీవు. సమర్థుండ వయ్యున్ = శక్తుఁడవైయుండియు. వారింపంజాలక = నిలుపలేక. చూచుచుండఁగ=చూచుచునుండఁగా. ఒక్కమనుష్యమాత్త్రుండు= సామాన్యుఁడైన యొక మనుష్యుఁడు. తీర్పంజాలెడువాఁడు=చక్కఁ బెట్టఁగలవాఁడు. కలండే=ఉండునా. (అని) వెండియున్=మఱియును.

తా॥ ఓస్వామీ! నా మనవి చిత్తగింపుము అర్జునుఁడు అను పేరుగల ఒక మగతనములేని అల్పుఁడు చెప్పిన వ్యర్థపుమాటలను నమ్మి కొడుకును పోఁగొట్టుకొన్న మూఢుఁడను అగు నన్ను ఏమనవచ్చును, ఎల్ల లోకములను పుట్టింపను పెంపను నశింపఁజేయను కారణమయిన నీవే చక్కఁబెట్టలేక ఊరక చూచుచుండు పనిని సామాన్యుఁడైన ఒక మనుష్యుఁడు చక్కఁబెట్టఁగలఁడా అని మఱియును జెప్ప నారంభించెననితా.

౧౭౮౬.—క॥ ఎక్కడి పాండుతనూభవుఁ । డెక్కడి విలుకాఁడు వీని * కెక్కడి సత్త్వం
బెక్కడి గాండీవము దన । కెక్కడి దివ్యాస్త్రసమితి * యేమన వచ్చున్.

టీ॥ ఎక్కడి పాండుతనూభవుఁడు=పాండు రాజు కొడుకనఁగా ఎక్కడివాఁడు. ఎక్కడి విలుకాఁడు=ఎక్కడి ధనుస్సు పట్టినవాఁడు. (వీనికి) ఎక్కడి సత్త్వంబు=ఎక్కడి బలము. (తనకు ఎక్కడి గాండీవము) ఎక్కడి దివ్యాస్త్రసమితి=ఎక్కడి దివ్యాస్త్రముల గుంపు. ఏమనవచ్చున్ =ఇఁక నీవింతకు ఏమి చెప్పవచ్చును. ఈ పద్యమునందు ఎక్కడి ఎక్కడి అను పదముల ప్రయోగముచేత ఇవియన్నియు నీకృపవలన నేగలిగినవిగా నుండఁగా తానే మొనగాఁడై లేనిపోని ప్రతిజ్ఞను చేసెనని భావము.

తా॥ కృష్ణా! అర్జునుఁడు గొప్పవిలుకాఁడు అను ప్రసిద్ధియు, వాని బలమును, వాని గాండీవమును, వాని దివ్యాస్త్రసమూహమును, నీయనుగ్రహమువలనఁ గలిగినవే కాని నీయనుగ్రహము లేనియెడల వానికి ఇవి యన్నియును ఎక్కడినుండివచ్చును కనుక వాఁడు వృథాగర్వముచేత కొఱగాని ప్రతిజ్ఞ చేసెను ఇందుకేమి అనవచ్చునని తాత్పర్యము.

౧౭౮౭.—క॥ అనితను నోడక నిందిం । చిన నయ్యర్జునుఁడు చాలఁ * జిడిముడి పడుచున్
దనవిద్యామహిమ పెంపునఁ । జనియె న్వెస దండపాణి * సదనంబునకున్.

టీ॥ (అని) తనున్=తన్ను. ఓడక=భయపడక. నిందించినన్= దూషింపఁగా. అయ్యర్జునుఁడు=ఆయర్జునుఁడు. చాలన్=మిక్కిలి. చిడిముడిపడుచున్ = కోపవికారమును జూపుచు. తనవిద్యామహిమ పెంపునన్ = తాను నేర్చిన విద్యయొక్క ప్రభావ గౌరవముచేత. వెసన్ = శీఘ్రముగా. దండపాణిసదనంబునకున్ = దండమును చేతియందు ధరియించిన యముని యింటికి. చనియెన్ = పోయెను.

తా॥ అని యీవిధముగా కొంచమైనను భయమన్నది లేక తన్ను బ్రాహ్మణుఁడు దూషింప నారంభింపఁగా అర్జునుఁడు తనవిద్యవలని మహిమాతిశయముచేత అతిశీఘ్రముగా యమలోకమునకు పోయెనని తాత్పర్యము.

౧౭౮౮.—క॥ చనియందు ధారుణీసుర । తనయులు లేకుంట తెలిసి * తడయక యింద్రా
గ్ని నిరృతి వరుణ సమీరణ । ధనదేశానాలయములు * దగఁ బరికించెన్.

టీ॥ చని=పోయి. అందున్=ఆపట్టణమునందు. ధారుణీసురతనయులు=బ్రాహ్మణునికొడుకులు. లేకుంట=లేకయుండుట. తెలిసి= తెలిసికొని. తడయక=ఆలస్యముచేయక — అక్కడ కొంచెము సేపైన నిలువక. ఇంద్రా....ములు=ఇంద్ర=దేవేంద్రునియొక్కయు. అగ్ని= అగ్నిదేవునియొక్కయు. నిరృతి=నైరృతునియొక్కయు. వరుణ = వరుణునియొక్కయు. సమీరణ=వాయుదేవునియొక్కయు. ధనద= కుబేరునియొక్కయు. ఈశాన = ఈశానునియొక్కయు. ఆలయములు=ఇండ్లు. తగన్=తగునట్టు. పరికించెన్=శోధించెను.

తా॥ అట్లుయమలోకమునకుఁబోయి అచ్చటబ్రాహ్మణునికొమారులు లేకపోఁగా అక్కడినుండి తక్కిన దిక్పాలకులైన యింద్రుఁడు మొదలగువారి లోకములకుఁబోయివారివారి పట్టణములలో బ్రాహ్మణ కుమారులను వెదకెను అని తాత్పర్యము. వ॥ అప్పుడు.

౧౫౮౯.—చ॥ నర సుర యక్ష కింపురుష ✻ నాగ నిశాచర సిద్ధ సాధ్య ఖే
చర విహగేంద్ర గుహ్యక పి ✻ శాచ నివాసములందురోసి భూ
సురసుతు లేగినట్టిగతి ✻ చొప్పడకుండుట చూచి క్రమ్మరన్
ధరణికి నేగుదెంచి బెడి ✻ దంబుగ నగ్ని సొరంగఁ బూనినన్.

టీ॥ నరసుర...నివాసములందున్—నర=మనుష్యులయు. సుర=దేవతలయు. యక్ష = యక్షులయు. కింపురుష = కింపురుషులయు. నాగ=సర్పములయు. నిశాచర = రాక్షసులయు. సిద్ధ=సిద్ధులయు. సాధ్య=సాధ్యులయు. ఖేచర = ఆకాశమునందు చరించునట్టిదేవయోనివిశేషులయు. విహగేంద్ర = గరుడులయు. గుహ్యక=గుహ్యకులయు. పిశాచ=పిశాచములయు. నివాసములందున్ = ఉనికిపట్లయందు. రోసి=వెదకి. భూసురసుతులు = బ్రాహ్మణకుమారులు. ఏగినట్టిగతి = పోయినజాడ. చొప్పడకుండుట=ఏర్పడకయుండుట — తెలియకుండుట. (చూచి) క్రమ్మరన్=తిరుగా. ధరణికిన్=భూమికి. ఏగుదెంచి = వచ్చి. బెడిదంబుగన్ = భయంకరముగా. అగ్ని సొరంగన్=అగ్నిలో ప్రవేశించుటకు. పూనినన్=యత్నింపఁగా.

తా॥ అంతటనిలువక మనుష్యులు దేవతలు యక్షులు కింపురుషులు నాగులు గరుడులు రాక్షసులు సిద్ధులుసాధ్యులు ఖేచరులు గుహ్యకులు పిశాచులు అనువారు నివాసముచేయు చోటుల యందెల్ల బ్రాహ్మణ కుమారుల వెదకి ఎక్కడను వారిపోబడి గానక అక్కడనుండి మరల భూలోకమునకువచ్చి చూచువారికి భయముతోఁచునట్లు అగ్నిప్రవేశము చేయఁబోఁగా నని తాత్పర్యము.





(✻)శ్రీకృష్ణమూర్తి యర్జునసమేతుండై బ్రాహ్మణ కుమారులఁ దేఁబోవుట.(✻)

౧౫౯౦.—వ॥ ఇవ్విధం బంతయు నెఱింగి యమ్మురాంతకుండు విప్రనందనుల
నీకుం జూపెదనని యనలంబు సొరకుండ నతని నివారించియప్పుడు.

టీ॥ ఇవ్విధంబంతయున్ = ఈరీతియంతయు. ఎఱింగి = తెలిసి. అమ్మురాంతకుండు = ఆకృష్ణుఁడు. విప్రనందనులన్ = బ్రాహ్మణుని కొడుకులను. (నీకుంజూపెదనుఅని) అనలంబు=అగ్నిని. చొరకుండన్=ప్రవేశింపకుండ. అతనిన్=అయర్జునుని. నివారించి=నిలిపి. (అప్పుడు)

తా॥ ఈవిధముగాఅర్జునుఁడుఅగ్నిప్రవేశముచేయఁబోవువృత్తాంతమును కృష్ణుఁడు తెలిసికొని బ్రాహ్మణుని కొడుకులను నీకుఁజూపెదను రమ్మని అర్జునునిఅగ్నిప్రవేశము చేయకుండఈవలికిపిలుచుకొనివచ్చి అని తాత్పర్యము.

౧౫౯౧,—ఉ॥ సుందరదివ్య రత్న రుచి ✻ శోభితమై తనరారు కాంచన
స్యందన మంబుజాప్తుఁ డుద ✻ యాచల మెక్కు విధంబుదోఁపఁ బా
రందరి దాను నెక్కి తను ✻ రశ్ములు దిగ్వితతిన్ వెలుంగ గో
విందుఁ డుదారలీలఁ జనె ✻ విప్రతనూజ గవేషణార్థియై.

టీ॥ గోవిందుఁడు=కృష్ణుఁడు. సుందర...తము—సుందర=అందమైన, దివ్య=శ్రేష్ఠములైన. రత్న=మణులయొక్క. రుచి=ప్రకాశముచేత, శోభితమై=వెలుఁగునదియై. తనరారు=ఒప్పునట్టి. కాంచనస్యందనము=బంగారుతేరు. అంబుజాప్తుఁడు=సూర్యుఁడు. ఉదయాచలము=ఉదయపర్వతమును. ఎక్కువిధంబు=ఎక్కునట్టిరీతి. తోఁపఁగ=కనఁబడ. పౌరందరి=అర్జునుఁడును. (తానును ఎక్కి) తనురశ్ములు=దేహకాంతులు. దిగ్వితతికి=దిక్కులగుంపునందు. వెలుంగఁగ=ప్రకాశింపఁగా. ఉదారలీలన్=సరళమైనరీతిని. విప్రతనూజగవేషణార్థియై=బ్రాహ్మణునికొడుకులనువెదకఁగోరినవాఁడై. చనన్ = పోయెను.

తా॥ అంతట కృష్ణుఁడు అందమైనదియు మేలయినరత్నములచేత పొదుఁగఁబడినదియునై యొప్పునట్టి బంగారురథమును సూర్యుఁడు ఉదయపర్వతముపై నెక్కిన విధముగా అర్జునునితోఁగూడ ఎక్కి తమదేహకాంతులు దిక్కులందు వ్యాపించి ప్రకాశింపఁగా సరళమయినమార్గమున బ్రాహ్మణకుమారుల వెదకఁగోరినవాఁడై పోయెననితా.

౧౨౯౨.—చ॥ చని పుర గోష్ఠ దుర్గ వన * జాన పదాచల పక్కణ ప్రభూ
త నద నదీ సరోవరయు * త క్షితినంతయు దాఁటి సప్తవా
రినిధుల దీవులం గులగి * రిప్రకరంబును నుత్తరించి మే
రునగము నాక్రమించుచు మ * రుద్గతితో రథ మేగె నత్తఱిన్.

టీ॥ చని=పోయి. పుర...క్షితిన్—పుర=పట్టణములు. గోష్ఠ=గోవులమందలు. దుర్గ=ఇతరులకుఁజొరరానికోటలు. వన=తోపులు. జానపద = జనులుండుదేశములు. అచల = కొండలు. పక్కణ=బోయపల్లెలు. ప్రభూత=చాలగొప్పవైన. నద=పడమరగాఁబాఱునట్టి యేఱులు. నదీ=తూర్పుగాఁ బాఱునట్టి యేఱులు. సరోవర = శ్రేష్ఠములైనకొలఁకులు. యుత=వీనితోడఁగూడిన. క్షితిన్=భూమిని. (అంతయును దాఁటి) సప్తవారినిధులన్=ఏడుసముద్రములను. దీవులన్=ఏడుద్వీపములను. కులగిరిప్రకరంబున్=ఏడుకులపర్వతములసమూహమును. ఉత్తరించి=దాఁటి. మేరునగమున్=మేరుపర్వతమును. ఆక్రమించుచున్=ఆవరించుకొనుచు. అత్తఱిన్=ఆసమయమునందు. మరుద్గతితోన్=వాయువేగముతో. రథము = తేరు. ఏగెన్=పోయెను.

తా॥ ఆవిధముగా బ్రాహ్మణకుమారులను వెదకుటకై బయలుదేఱఁగా పట్టణములు మందలు కోటలు తోపులు దేశములు కొండలు బోయపల్లెలు ఏఱ్లు వాఁగులు సరస్సులు మొదలగువానితోఁగూడుకొన్న యీభూమి నంతయు దాఁటి పిమ్మట లవణ ఇక్షు సుర సర్పి దధి క్షీర శుద్ధోదకములనెడు ఏడుసముద్రములను, జంబువు ప్లక్షము కుశము క్రౌంచము శాకము శాల్మలముపుష్కరమున నెడు ఏడుదీవులను, మహేంద్రము మలయము సహ్యము శుక్తిమంతము గంధమాదనము వింధ్యము పారియాత్రము అను సప్తకులాచలములను దాఁటి మేరుపర్వతముఁజేరి అందుండి వాయువేగముతో రథముపోయెననితా.

౧౨౯౩.—చ॥ మసలక భూరిసంతమస * మండలముం దఱియంగఁజొచ్చి సా
హసమునఁ బోవఁబోవఁగ భ * యంకరమై మదిగోచరింపమిన్
వసుమతి మ్రోఁకరిల్ల రథ * వాజులు మార్గము దప్పి నిల్చినన్
బిసరుహపత్రలోచనుఁ డ * భేద్యతమఃపటలంబు వాపఁగన్.

టీ॥ మసలక = నిలువక. భూరిసంతమసమండలమున్ = అధికమయిన చీఁకటిగల ప్రదేశమును. తఱియంగఁజొచ్చి=చేరఁబోయి. సాహసమునన్ = తెగువతో. పోవఁబోవఁగన్ = బహుదూరము పోఁగా. భయంకరమై=భయమును కలుగఁజేయునట్టిదై. మదిన్ = మనస్సునందు. గోచరింపమిన్ = దారియిదియని తెలియకపోఁగా. రథవాజులు=తేరునకుఁగట్టిన గుఱ్ఱములు. మార్గముదప్పి=దారితప్పి. వసుమతిన్=భూమియందు. మ్రోఁకరిల్లన్=మోఁకాళ్లక్రిందఁదాఁకునట్లుగాపడి. నిల్చినన్ = నిలువఁబడఁగా. బిసరుహపత్రలోచనుఁడు=తామరరేకులవంటి కన్నులుగల కృష్ణమూర్తి. అభేద్యతమఃపటలంబున్=భేదింపరాని చీఁకటిసముదాయమును. వాపఁగన్ = తొలఁగింపఁగా.

తా॥ అట్లునిలువకపోయి అధికమయినచీఁకటికమ్ముకొనియుండు ప్రదేశమునుచేరి ఆచీఁకటికి భయపడక సాహసముతో బహుదూరముపోఁగా గుఱ్ఱములు దారితెలియక చిత్తభ్రమ కలిగి ఆభయంకరమయినచీఁకటిలో నిలువఁబడిపోయెను, అంతట శ్రీకృష్ణమూర్తి ఆచీఁకటినంతయు తొలఁగించుటకై యని తాత్పర్యము.

౧౨౯౪.—సీ॥ బాలభానుప్రభా * భాసమానద్యుతిఁ - గరమొప్పు నిజరథాం * గంబుఁ బనుప
నమ్మహాస్త్రం బేగి * చిమ్మచీఁకటి నెల్ల - నఱిముఱి నందంద * నఱకి వైచి
యగ్రభాగంబున * నతులిత గతి నేగ - నామార్గమున నిజ * స్యందనంబుఁ
గడువడిఁ దోలి యా * కడిఁది తమోభూమిఁ - గడవ ముందరఁ గడ * గాన రాక

తే॥ మిక్కుటంబుగ దృష్టి మి * రిమిట్లు గొలుపఁ । జదల వెలుఁగొందు దివ్యతే * జంబు చూచి
మొనసి గాండీవి గన్నులు * మూసికొనుచు । నాత్మ భయమంది కొంతెద * వ్వరిగి యరిగె.

టీ॥ బాలభానుప్రభాభాసమానద్యుతిన్ = ఉదయకాలపుసూర్యుని వెలుఁగువంటి వెలుఁగుచేత ప్రకాశించుచున్న ప్రకాశముతో. కరము = మిక్కిలి. ఒప్పు = ఒప్పునట్టి. నిజరథాంగంబున్ = తనచక్రమును. పనుపన్ = పంపఁగా. అమ్మహాస్త్రంబు = ఆగొప్ప యస్త్రము. ఏగి = పోయి. ఉమ్మచీఁకటినెల్లన్ = మిక్కుటమయినయాచీఁకటినంతయు. అతిముతిన్ = త్వరతో. అందంద = క్రమక్రమముగా. (నఱకివైచి) అగ్రభాగంబునన్ = ముందటితట్టు. అతులితగతిన్ = ఈడులేనివడిగల నడకతో. ఏగన్ = పోఁగా. ఆమార్గమునన్ = ఆదారిని. నిజస్యందనంబున్ = తనరథమును. కడువడిన్ = మిక్కిలి వడిగా. (తోలి) ఆకడిఁదితమోభూమిన్ = అసాధ్యమయిన ఆచీఁకటినేలను. కడవన్ = దాఁటఁగా. ముందరన్ = ఎదుట. కడగానరాక = కొలఁది తెలియశక్యముగాక. మిక్కుటంబుగన్ = అధికముగా. దృష్టి = చూపు. మిర్మిట్లుగొలుపన్ = చెదరునట్లు చేయఁగా. చదలన్ = ఆకాశమునందు. వెలుఁగొందు = ప్రకాశించునట్టి. దివ్యతేజంబు = అప్రాకృతమయినతేజస్సును. (చూచి) మొనసి = పూని – మ్రొగ్గి. గాండీవి = అర్జునుఁడు. (కన్నులుమూసికొనుచును) ఆత్మన్ = మనస్సునందు. భయమంది = వెఱచి, కొంతదవ్వు = కొంతదూరము. అరిగియరిగి = పోయిపోయి.

తా॥ ఉదయకాలపు సూర్యబింబము ప్రకాశించునట్లు ప్రకాశించుచున్నదియు, మిక్కిలి మనోజ్ఞకాంతితోఁ గూడుకొన్నదియునయిన తనచక్రమును కృష్ణుఁడు పంపఁగా ఆచక్రముముందుపోయి చీఁకటినంతయుఁదొలఁగించిదారిచూపఁగా ఆత్రోవను మిక్కిలివడిగా తనరథమునుతోలుకొనిఅసాధ్యమయిన ఆచీఁకటినేలనుదాఁటిపోయెను, అప్పుడు అర్జునుఁడు ఎదుట మేరలేని ప్రకాశముచేత, చూపులను చెదరునట్లుచేయుచున్న దివ్యమయిన తేజస్సునుజూచి మనసున భయపడి కన్నులు మూసికొనుచుకొంతదూరము పోయియని తాత్పర్యము.

౧౨౯౫.—తే॥ కడఁగి దుర్వార మారుతో * త్కట విధూత । చటుల సర్వంకషోర్మి భీ * షణ గభీర
వారిపూరంబుసొచ్చి త * న్నీరమధ్య । భాగమునఁ గోటిసూర్యుల * ప్రభలు వెలుఁగ.

టీ॥ కడఁగి = పూని. దుర్వార...పూరంబు — దుర్వార = నిలుపఁగూడని. మారుత = గాలిచేత. ఉత్కట = అధికముగా. విధూత = ఎగురఁగొట్టఁబడిన. చటుల = చలించునట్టి. సర్వంకష = అంతటను ఒరయుచున్న. ఊర్మి = అలలచేత. భీషణ = భయంకరమైన. గభీర = లోఁతైన. వారిపూరంబు = జల ప్రవాహమును. చొచ్చి = ప్రవేశించి. తన్నీరమధ్యభాగమునన్ = ఆజలమునడుమ. కోటిసూర్యులప్రభలు = కోటిసంఖ్యలసూర్యులయొక్క కాంతులు. వెలుఁగన్ = ప్రకాశింపఁగా.

తా॥ ప్రయత్నపూర్వకముగ నిలుపఁగూడని పెద్దగాలిచేతకొట్టఁబడి చలించుచు అంతటను ఒరయుచున్న అలలచేత భయమును పుట్టించునదియు, లోఁతైనదియునైన జలప్రదేశమునందుఁజొచ్చి ఆనీళ్ల నడుమ కోటిసూర్యులు వెలిఁగినట్లు వెలుఁగుచున్నయని తాత్పర్యము.



కృష్ణుఁడు.





అర్జునుఁడు.

(*) శ్రీకృష్ణార్జునులు వైకుంఠమున శ్రీమహావిష్ణుని దర్శించి విప్రబాలకులఁ దెచ్చుట. (*)

వ॥ మఱియును జారుదివ్యమణిసహస్ర స్తంభాభిరామంబు, నాలంబిత కమనీయ నూత్నరత్నమాలికాలంకృతంబును, భానుశశిమయూఖాగమ్యంబును, ననంత తేజోవిరాజితంబును, బునరావృత్తిరహిత మార్గంబును, నిత్యైశ్వర్యదాయకంబును, నవ్యయంబును, నత్యున్నతంబును, ననూనవిభవంబును, బరమయోగీంద్ర గమ్యంబును, బరమ భాగవత నివాసంబును నై యొప్పు నద్దివ్య ధామంబునందు.

టీ॥ మఱియును = ఇదిగాక. చారు...రామంబును — చారు = మనోజ్ఞమయిన. దివ్య = అప్రాకృతమైన. మణి = రత్నములయొక్క. సహస్ర = వేయింటిచేతనైన - అనేకములచేతనైన. స్తంభ = కూచములచేత. అభిరామంబును = ఒప్పునదియును. ఆలంబిత...లంకృతంబును = ఆలంబిత = వ్రేలుచున్న. కమనీయ = మనోజ్ఞమైన. నూత్న = క్రొత్తవైన. రత్న = రత్నములయొక్క. మాలికా = సరములచేత. అలంకృతంబును = అలంకరింపఁబడినదియు. భానుశశిమయూఖాగమ్యంబును = సూర్యచంద్రకిరణములకు ప్రవేశింపరానిదియు. అనంతతేజోవిరాజమానంబును = మేరలేని తేజస్సుచేత వెలుఁగునదియును. పునరావృత్తిరహితమార్గంబును = మరల నొకసారి పుట్టుటలేని త్రోవయును. నిత్యైశ్వర్యదాయకంబును = శాశ్వతమైన మోక్షైశ్వర్యము నిచ్చునదియు. అవ్యయంబును = నశింపనిదియు. అత్యున్నతంబును = బ్రహ్మాదిలోకములకంటె మిగులగొప్పదియు. అనూనవిభవంబును = తక్కువలేని వేడుకగలదియు. పరమయోగీంద్రగమ్యంబును = ఉత్తములయిన యోగీశ్వరులకు పొందఁ దగినదియు. పరమభాగవతనివాసంబును = మిక్కిలి శ్రేష్ఠులయిన భగవద్భక్తులకు ఉనికిపట్టును. (ఐ) ఒప్పునద్దివ్యధామంబునందున్ = అందగించుచున్న ఆదివ్యమయిన యింటియందు.

తా॥ మనోజ్ఞములును అప్రాకృతములునైన బహువిధరత్నములు పొదిఁగిన స్తంభములచేత ఒప్పునదియు, వ్రేలుచున్న అందగించునట్టి క్రొత్తరత్నముల సరములచేత అలంకరింపఁబడినదియు, సూర్యకిరణములకును చంద్రకిరణములకును చొరరానిదియు, మిక్కిలి యెచ్చైన తేజస్సుచేత మెలఁగునదియు, పునర్జన్మము లేకుండుటకు త్రోవయు, ఎన్నఁడును చెడని మోక్షైశ్వర్యము నిచ్చునదియు, ఎప్పుడును నశింపనిదియు, బ్రహ్మాదిలోకములకంటె మిక్కిలి శ్రేష్ఠమైనదియు, తక్కువలేని వేడుకలు గలదియు, ఉత్తములయిన యోగీశ్వరులకు పొందఁదగినదియు, భగవద్భక్తులైన ఉత్తములకు ఉనికిపట్టునునైన యొకదివ్యమైనయిల్లుఁడుండెను ఆయింటిలో నని తాత్పర్యము.

౧౫౫౩.—సీ॥ సాంద్ర శరచ్చంద్ర * చంద్రికా కర్పూర - నీహార హారాభ * దేహమమర
నిందిందిరేందీవ * రేంద్ర నీలద్యుతిఁ - గరమొప్పు మేచక * కంఠ సమితి
నరుణాంశుబింబ భా * సురపద్మరాగ వి - న్యస్త సహస్రోరు * మస్తకములు
వివృతాననోద్గత * విష ధూమ రేఖల - లీలఁ జూపట్టిన * నాలు కలును
తే॥ గలితసాయంతనజ్వల * జ్జ్వలన కుండ । ముల విడంబించు వేఁడిచూ * పులును గలిగి
భూరికలధౌత గిరినిభా * కార మమరఁ । బరఁగుభోగీంద్రభోగత * ల్పంబు నందు.

టీ॥ సాంద్ర...దేహము — సాంద్ర = దట్టమయిన. శరచ్చంద్ర = శరత్కాలపు చంద్రుని వల్లనయిన. చంద్రికా = వెన్నెలతోడను. కర్పూర = కర్పూరముతోడను. నీహార = మంచుతోడను. హార = ముత్యాలపేరులతోడను. ఆభ = పోలి వెలుఁగునట్టి. దేహము = శరీరము. అమరన్ = ఒప్పఁగా. ఇందింది...ద్యుతిన్ = ఇందిందిర = తుమ్మెదలయు. ఇందీవర = నల్లగలువలయు. ఇంద్రనీల = ఇంద్రనీలమణులయు. ద్యుతిన్ = కాంతివంటి కాంతిచేత. కరము = మిక్కిలి. ఒప్పు = ఒప్పునట్టి. మేచకకంఠసమితిన్ = నల్లని మెడలసమూహమును. అరుణాంశు...మస్తకములును. అరుణాంశు = ఎఱ్ఱనికిరణములుగల సూర్యునియొక్క. బింబ = మండలమువలె. భాసుర = ప్రకాశించునట్టి. పద్మరాగ = కెంపులచేత. విన్యస్త = ఉంచఁబడిన. సహస్ర = వేయియైన. ఉరు = గొప్పలైన. మస్తకములును = తలలును. వివృత...లీలన్ - వివృత = తెఱవఁబడిన. ఆనన = నోళ్లనుండి. ఉద్గత = మీఁదికి వచ్చుచున్న. విషధూమరేఖలలీలన్ = విషమువల్లఁ బుట్టిన పొగలు లేచుటవలెనే. చూపట్టిన = కనఁబడిన. (నాలుకలును) కలిత...కుండములన్ — కలిత = కూడిన. సాయంతన = సాయంకాలమునందలి. జ్వలత్ = వెలుగుఁచున్న. జ్వలనకుండములన్ = అగ్నిగుండములను. విడంబించు = సరిపోలునట్టి. వేఁడిచూపులును = తీవ్రమైనచూపులును. (కలిగి) భూరికలధౌతగిరినిభాకారము = పెద్దదైన వెండికొండను బోలినరూపము. అమరన్ = ఒప్పఁగా. పరఁగు = ప్రసిద్ధినొందునట్టి. భోగీంద్రభోగతల్పంబునందున్ = సర్పరాజైన శేషునిదేహమయిన పాన్పునందు.

తా॥ శరత్కాలము నందు వెలుఁగునట్టి దట్టమయిన వెన్నెలను కర్పూరమును మంచును ముత్యాలసరములను బోలిన తెల్లనికాంతిచేత వెలుఁగునట్టి దేహమును, తుమ్మెదలు నల్లగలువలు ఇంద్రనీలమణులు వీనియొక్క కాంతివంటి నల్లని కాంతిగల మెడలును, సూర్యబింబముల వలె వెలుఁగునట్టి దివ్యములయిన పద్మరాగ మణులచేత ఒప్పునట్టి వేయితలలును, తెఱవఁబడిన నోళ్లనుండి చాఁపఁబడునట్టి విషపుపొగలను బోలిన నాలుకలును, సాయంకాలము నందుమండుచుండు అగ్నిగుండములవలె వెలుఁగునట్టి కన్నులును గలిగి పెద్ద వెండికొండవలె వెలుఁగుచుండునట్టి సర్పరాజైన శేషునిదేహమైనపాన్పునందు అని తా

౧౫౫౪.—వ॥ సుఖాసీనుండై యున్నవాని డాయంజని యప్పుడు.

టీ॥ సుఖాసీనుండై = సుఖముగాఁ గూర్చున్నవాఁడై. ఉన్నవానిన్ = ఉన్నట్టి మహాపురుషుని. డాయంజని = దగ్గఱఁబోయి. (అప్పుడు)

తా॥ సుఖముగాఁ గూర్చున్న ఒకానొక పురుషశ్రేష్ఠుని దగ్గఱఁబోయి ఆసమయమునందు అని తాత్పర్యము.

౧౫౫౫.—సీ॥ సజల నీలాంబుద * శ్యామాయమానాంగు - నాశ్రితావన ముది * తాంతరంగు
సనకాదియోగి హృ * ద్వనజ మరాళేంద్రు - ముఖపద్మరుచిజిత * పూర్ణ చంద్రుఁ
గమనీయ నిఖిలజ * గద్ధిత చారిత్రుఁ - బ్రత్యూష సంఫుల్ల * పద్మనేత్రు
నిందిరా హృదయార * విందారు ణోల్లాసు - శ్రీకర పీత కౌ * శేయవాసు

తే॥ హారకుండల కటక కే * యూర మకుట । కంకణాంగదమణిముద్రి * కా వినూత్న
రత్న నూపుర కాంచీ వి * రాజమాను । భవ మహార్ణవ శోషు స * ద్భక్తపోషు.

టీ॥ సజల... మానాంగుఁ—సజల = నీళ్లతోఁగూడిన. నీలాంబుద = నల్లనిమేఘములను. శ్యామాయమాన = చామనచాయగలవానిఁగా నాచరించుచున్న. అంగుఁ=దేహముగలవారిని. ఆశ్రితా... రంగుఁ—ఆశ్రిత = ఆశ్రయించిన వారిని. అవన = రక్షించుటచేత. ముదిత=సంతోషము నొందిన. అంతరంగుఁ = మనసుగలవానిని. సనకాది... శేంద్రుఁ—సనక = సనకుఁడు. ఆది=మొదలుగాఁగల యోగి = యోగీశ్వరులయొక్క. హృత్=మనస్సులనెడు. వనజ = తామరలందు ఉండెడు. వరాళేంద్రుఁ = శ్రేష్ఠమయిన హంసయైన వానిని. ముఖపద్మరుచిజిత పూర్ణచంద్రుఁ = ముఖమనెడు పద్మము యొక్క కాంతిచేత జయింపఁబడిన చంద్రుఁడుగలవానిని. కమనీయ నిఖిల జగద్ధిత చారిత్రుఁ = మనోజ్ఞమయినది యెల్లలోకములకు మేలయినదియు నైన నడవడి గలవానిని. ప్రత్యూష సంఫుల్లపద్మనేత్రుఁ=వేకువనుచక్కఁగా వికసించిన కమలమునుబోలిన కన్నులు గలవానిని. ఇందిరాహృదయారవిందారుణోల్లాసుఁ = లక్ష్మీదేవి యొక్క హృదయకమలమునకు సూర్యునివలె వెలుఁగునట్టి యుత్సాహముగలవానిని. శ్రీకరపీతకౌశేయవాసుఁ=సంపత్కరమైన పచ్చపట్టు వస్త్రముగలవానిని. హారకుండల... విరాజమానుఁ — హార=ముత్యాలపేరులచేతను. కుండల=చెవిపోఁగులచేతను. కటక = కడియములచేతను. కేయూర = బాహుపురులచేతను. మకుట=కిరీటముచేతను. కంకణ = ముంజేతి కడియములచేతను. అంగద=సందిటి వంకీలచేతను. మణిముద్రికా=రత్నముల ముద్దుటుంగరములచేతను. నూత్నరత్న = క్రొత్తరత్నములు పొదిఁగిన. నూపుర=అందెలచేతను. కాంచీ=మొలనూలిచేతను. విరాజమానుఁ = తేజరిల్లుచున్నవానిని. భవమహార్ణవశోషుఁ=జన్మములనెడు గొప్పసముద్రమును ఇంకించువానిని. సద్భక్తపోషుఁ=అనన్యభక్తిగల సేవకులను కాపాడువానిని.

తా॥ నీళ్లతోఁగూడిన వానకాలమునందలి నల్లమబ్బులకు వన్నె పెట్టునట్టి దేహకాంతియు, తన్ను ఆశ్రయించిన భక్తులను రక్షించుటవలన సంతోషించిన మనస్సును, సనకుఁడు మొదలగు దేవమునీంద్రుల హృదయములనెడి కమలములయందు వాసము చేయుటయందు హంసపోలికయు, తనయొక్క తేటఁదనముచేత చంద్రుని గెలువఁజాలిన ముఖకమలమును, ఎల్లలోకములకు మేలు గలిగించునట్టి నడవడియు, వేకువను చక్కఁగా వికసించిన కమలములవంటి కన్నులును, శ్రీలక్ష్మీదేవియొక్క మనసునకు ఆనందమును కలిగించుటయందు సూర్యునివంటి తేజస్సును, సంపదను కలుగఁజేయునట్టిదైన పచ్చ పట్టు వస్త్రమును, మిక్కిలి వెలుఁగుచున్న ముత్యాలహారములు చెవిపోఁగులు కడియములు బాహుపురులు సందిటి కడియములు వంకీలు కిరీటము ముంజేతికడియములు రత్నములుపొదిఁగిన ముద్దుటుంగరములు మొలనూలు మొదలగు ఆభరణములవలని అలంకారమును గలిగి జన్మములనెడి సముద్రమును ఇంకించువాఁడును, మంచి భక్తులను పోషించువాఁడునై యొప్పుచున్నవానిని అని తాత్పర్యము.

వ॥ మఱియు సనందనాది మునిజన సంతత సేవితు నానంద కందళిత హృదయారవిందు నరవింద వాసినీ వసుంధరా సుందరీ సమేతు నారద యోగీంద్ర సంకీర్తనానందితు నవ్యయు ననఘు ననంతు నప్రమేయు నజితు నవికారు నాదిమధ్యాంతరహితు భవలయాతీతుఁ గరుణాసుధాసముద్రు నచ్యుతు మహానుభావుఁ బరమపురుషుఁ బురుషోత్తము నిఖిలజగదుత్పత్తిస్థితిలయకారణుఁ జిదచిదీశ్వరు నష్టభుజుఁ గౌస్తుభ శ్రీవత్సవక్షు శంఖ చక్ర గదా పద్మ శార్ఙ్గాది దివ్యసాధను సర్వశక్తిసేవితుఁ బరమేష్ఠి జనకుండగు నారాయణుం గనుంగొని దండ ప్రణామంబులు సేసి కర కమలంబులు మొగిచి భక్తిపూర్వకంబుగా నభినందించిన నయ్యాదిదేవుండు వారలం గరుణావలోకనంబులనిగుడ నవలోకించి దరహాసపూరంబు తోరంబుగా సాదరంబుగ నిట్లనియె.

టీ॥ మఱియుఁ=ఇదిగాక. సనంద..., సేవితుఁ—సనందన=సనందనుఁడు. ఆది=మొదలుగాఁగల. మునిజన=మునీశ్వరులచేత. సంతత=ఎల్లప్పుడును. సేవితుఁ = సేవింపఁబడిన వానిని. ఆనంద కందళిత హృదయారవిందుఁ=సంతోషము మొలచుచున్న మనఃకమలము కలవానిని. అరవిందవాసినీవసుంధరాసుందరీసమేతుఁ=శ్రీభూదేవులతోఁగూడుకొన్నవానిని. నారదయోగీంద్రసంకీర్తనానందితుఁ=నారదమహాముని యొక్క మంచి పాటలచేత సంతోషించిన వానిని. అవ్యయుఁ = నశింపనివానిని. అనఘుఁ = పాపములులేనివానిని. అనంతుఁ = తుదలేనివానిని. అప్రమేయుఁ = ఇంతవాఁడనిచెప్ప శక్యముగాని వానిని. అజితుఁ=దేనిచేతను జయింపఁబడని వానిని. అవికారుఁ = షడ్భావవికారములు లేనివానిని. ఆదిమధ్యాంతరహితుఁ=మొదలు నడుము తుద యనునవి లేనివానిని. భవలయాతీతుఁ = జన్మ నాశములను అతిక్రమించిన వానిని. కరుణాసుధాసముద్రుఁ=దయయనుపాలసముద్రమువంటివాని. అచ్యుతుఁ=స్వరూపమునుండి జారనివానిని. శ్రు॥ శాశ్వతంశివమచ్యుతం, అని శ్రుతి॥ శ్లో॥ యస్మాన్నచ్యుతపూర్వోఽహ మచ్యుతస్తేన కర్మణా॥ అని భగవద్వాక్యము. మహానుభావుఁ=గొప్ప ప్రభావముగలవానిని. పరమపురుషుఁ—పరమ=సర్వోత్కృష్టుఁడైన. పురుషుఁ = సర్వశరీరములయందు జీవరూపమున నుండువానిని. పురుషోత్తముఁ=పురుషులలో శ్రేష్ఠుఁడయినవానిని. శ్లో॥ యస్మాత్క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః । అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥ అనిభగవద్గీతగనుక క్షరాక్షరతత్త్వములను మీఱినవాఁడును. నిఖిలజగదుత్పత్తిస్థితిలయకారణుఁ = ఎల్లలోకములయొక్క కలుగుటకు ఉండుటకు నాశమునకును కారణమయినవానిని. చిదచిదీశ్వరుఁ= చిత్తు అచిత్తు ఈ రెంటికిని ప్రభువగువానిని. అష్టభుజుఁ=ఎనిమిదిచేతులుగలవానిని. కౌస్తుభశ్రీవత్సవక్షుఁ=కౌస్తుభమనుమణియు శ్రీవత్సమనుమచ్చయుఁ

గలబొమ్మగలవానిని. శంఖచక్రగదాపద్మశార్ఙ్గాదిదివ్య సాధనుల్ = శంఖముచక్రముగదాపద్మముశార్ఙ్గము మొదలగుదివ్యములైన ఆయుధములుగలవానిని. సర్వశక్తిసేవితుల్ = ఎల్లశక్తులచేతను సేవింపఁబడువానిని. పరమేష్ఠిజనకుండు = బ్రహ్మతండ్రి. అగునారాయణుల్ = అగునట్టి శ్రీమన్నారాయణుని. కనుంగొని = చూచి. దండప్రణామంబులుచేసి = సాగిలఁబడి మ్రొక్కి. కరకమలంబులుమొగిచి = హస్తకమలములను జోడించుకొని. భక్తి పూర్వకంబుగాల్ = భక్తిముందు కల్గునట్లుగా — భక్తితో. అభినందించినల్ = పొగడఁగా. అయ్యాదిదేవుండు = త్రిమూర్తులయుత్పత్తికి ముందున్న దేవుఁడయినయానారాయణుఁడు. వారల్ = ఆకృష్ణార్జునులను. కరుణావలోకనంబులు = దయతోడిచూపులు. నిగుడల్ = వ్యాపింపఁగా. అవలోకించి = చూచి. దరహాస పూరంబు = చిఱునవ్వుయొక్క ప్రవాహము — అధికమయిన చిఱునవ్వు. తోరంబుగాల్ = అధికముకాఁగా. సాదరంబుగల్ = ఆదరముతో. (ఇట్లనియెను)

తా॥ ఇదిగాక సనందనుఁడు మొదలుగాఁగల మునీశ్వరులచేత సేవింపఁబడినవాఁడును, సంతోషము మొలకలెత్తుచున్న మనసు గలవాఁడును, శ్రీ భూదేవులతోఁ గూడుకొన్నవాఁడును, నారదుఁడు చేయు వీణాగానమును విని ఆనందించువాఁడును, నాశము లేనివాఁడును, పాపములు లేనివాఁడును, మేర లేనివాఁడును, తుది లేనివాఁడును, ఇంద్రియాదులచేత జయింపఁబడనివాఁడును, షడ్భావ వికారములు లేనివాఁడును, మొదలు నడుమ తుదలు లేనివాఁడును, జన్మనాశములు లేనివాఁడును, దయయనెడి అమృతమునకు సముద్రుఁడయినవాఁడును, దేనివలననుజాఁ అనివాఁడును, గొప్పమహిమగలవాఁడును, ప్రధానపురుషుఁడును, పురుషశ్రేష్ఠుఁడును, లోకమును పుట్టింపను వృద్ధిపొందింపను నాశము గావింపను హేతువైన వాఁడును, జ్ఞానాజ్ఞానములకు ఈశ్వరుఁడును, ఎనిమిదిచేతులుగలవాఁడును, కౌస్తుభమణియు శ్రీవత్సమును అను మచ్చయు ఱొమ్మునందుఁగలవాఁడును, శంఖము చక్రము గద పద్మము శార్ఙ్గము మొదలగు దివ్యములయిన ఆయుధములు గలవాఁడును, ఇచ్ఛాజ్ఞానక్రియాది శక్తులచేత సేవింపఁబడినవాఁడును, బ్రహ్మకు తండ్రియునైన శ్రీమన్నారాయణుని దర్శనము చేసి సాగిలఁబడి మ్రొక్కి చేతులు జోడించుకొని భక్తితో స్తోత్రము చేయఁగా ఆయాదిదేవుఁడయిన శ్రీమన్నారాయణుఁడు ఆకృష్ణార్జునులను దయతోడి చూపులతోఁ జూచి చిఱునగవు ప్రవాహమువలె విశేషముగా ప్రసరింపఁగా ఆదరముతోఁ గూడుకొన్నవాఁడైయిట్లు పలికెనని తాత్పర్యము.

౧౩౦౧.—క॥ ధరణికి వ్రేఁగగు దైత్యులఁ । బోఁబోరి వధియించిధర్మ ❋ మున్నిలుపుటకై ।
ధరజనియించితి రిరువురు । నరనారాయణు లనంగ ❋ నాయంశ మునన్.

టీ॥ ధరణికిల్ = భూమికి. వ్రేఁగు = బరువు. అగుదైత్యులల్ = అగునట్టిరాక్షసులను. పోరిఁబోరిల్ = క్రమక్రమముగా. (వధియించిధర్మమును నిలుపుటకై) ధరల్ = భూమియందు. ఇరువురును = మీరిద్దఱును. నాయంశమునల్ = నాకళాంశమునందు. నరనారాయణులనంగల్ = నరుఁడు నారాయణుఁడు అనుపేరులతో. జనియించితిరి = పుట్టితిరి.

తా॥ మీరిద్దఱును భూమికిబరువుగానుండు పాపాత్ములయినరాక్షసులనెల్లను చంపుటకై నరుఁడు నారాయణుఁడు అను నామధేయములతో నాపూర్ణ కళాంశమునందు భూమిలో పుట్టినారు అని తా.

౧౩౦౨.—క॥ ఆరూఢ నియతితోఁ బెం । పారిన మిము నిమ్మునీంద్రు ❋ లందఱుఁ జూడం ।
గోరిన మీవచ్చుటకై । ధారుణిసుర సుతుల నిటకుఁ ❋ దగఁ దేవలసెన్.

టీ॥ ఆరూఢనియతితోఁల్ = మిక్కిలి యెచ్చైన నియమముతో. పెంపారిన = గౌరవమునుపొందిన. మిముల్ = మీయిద్దఱను. ఇమ్మునీంద్రులందఱుల్ = ఇచ్చటనుండెడి యీమునిశ్రేష్ఠులు అందఱును. చూడంగోరినల్ = చూడవలెననుకోరిక కలవారు కాఁగా. మీవచ్చుటకై = మీరిచ్చటికి వచ్చుటకై. ధారుణి సురసుతులల్ = బ్రాహ్మణుని కొడుకులను. ఇటకుల్ = ఇచ్చటికి. తగల్ = తగునట్లు. (తేవలసెను)

తా॥ మిక్కుటమయిన నియమముతోఁ గొప్పఁదనమును వహించిన మీయిద్దఱను జూడవలెనని యిక్కడి మునిశ్రేష్ఠులందఱును కోరినారు గనుక మిమ్మును ఇచ్చటికిరప్పించుటకై యిచ్చటికి బ్రాహ్మణకుమారులను రప్పింపవలసివచ్చెనని తాత్పర్యము.





అర్జునుఁడు.

(❋) కృష్ణార్జునులు విప్రునకుఁ బుత్రుల నప్పగించుట. (❋)

౧౩౦౩.—క॥ అని యాడింభకులను దో । కొనిపొండని యిచ్చి వీడు ❋ కొలిపిన వారల్ ।
వినుతులఁ బెక్కువిధమ్ముల । వినిపించుచు నచటువాసి ❋ విప్రుని సుతులన్.

టీ॥ (అని) ఆడింభకులను = ఆబ్రాహ్మణకుమారులను. తోకొని పొందు=పిలుచుకొనిపొంది. (అని యిచ్చి) వీడుకొలిపినన్ = సెలవిచ్చి పంపఁగా. (వారలు) వినుతులన్ = స్తోత్రములను. పెక్కువిధమ్ములన్ = నానావిధములచేత. వినిపింపుచున్ = వినికిచేయుచు. అచటువాసి = అచోటునుండి కదలి. విప్రునిసుతులన్ = బ్రాహ్మణుని కొడుకులను.

తా॥ అని చెప్పి బ్రాహ్మణునికొడుకులను ఒప్పగించి పిలుచుకొని పొమ్మని సెలవిచ్చి పంపఁగా ఆకృష్ణార్జునులును నానావిధములపొగడుచును ఆబ్రాహ్మణ కుమారులను పిలుచుకొని అని తాత్పర్యము.

౧౩౦౪.—వ॥ తోడ్కొని సంప్రాప్తమనోరథులై యబ్బాలకులం దత్తద్వయో రూపంబులతోడఁ దెచ్చి
యాబ్రాహ్మణునికి సమర్పించిన నతండు సంతుష్టాంతరంగుండయ్యె నయ్యవసరంబున.

టీ॥ తోడ్కొని=పిలుచుకొని. సంప్రాప్తమనోరథులై=పొందఁబడినకోరికగలవారై. ఆబ్బాలకులన్=ఆపిల్లకాయలను. తత్తద్వయోరూపంబులతోడన్=వారివారి యీడునకుఁదగిన యాకారములతో. తెచ్చి=తీసికొనివచ్చి. (ఆబ్రాహ్మణునికి) సమర్పించినన్=ఇయ్యఁగా. అతండు=ఆబ్రాహ్మణుఁడు. సంతుష్టాంతరంగుండయ్యెన్=సంతోషించినమనసుగలవాఁడాయెను. అయ్యవసరంబునన్=ఆసమయమందు.

తా॥ ఆవిధముగా పిలుచుకొని తమకోరిక నెఱవేర్చుకొన్నవారై ఆబ్రాహ్మణ కుమారులను వారివారి వయసునకుఁ దగిన ఆకారములతో తీసికొనివచ్చి ఆబ్రాహ్మణునికి ఒప్పింపఁగా ఆతఁడు సంతోషించెను ఆసమయమునందు అని తాత్పర్యము.

౧౩౦౫.—చ॥ అనిమిషనాథ నందనుఁ డ * హర్పతితేజుఁడు గృష్ణుతోడఁ దా
జని యచటం గనుంగొని యు * సర్వశరణ్యునిఁ బుండరీకనే
త్రుని నిజధామవైభవ త * దున్నత తన్మహనీయ కీర్తికిన్
మనమున మోదమంది పలు * మాఱును సన్నుతిఁ జేసె భూవరా.

టీ॥ భూవరా = రాజా. అనిమిషనాథనందనుఁడు = ఇంద్రుని కొడుకైన అర్జునుఁడు. ఆహర్పతితేజుఁడు = సూర్యుని తేజస్సువంటి తేజస్సుగలవాఁడైన. కృష్ణుతోడన్ = శ్రీకృష్ణమూర్తితోఁ గూడ. తాన్ = తాను. చని=పోయి. అచటన్=ఆపరమపదమునందు. సర్వశరణ్యునిన్=ఎల్లవారికిని రక్షకుఁడయిన శ్రీమన్నారాయణుని. కనుంగొనియున్=చూచియు. పుండరీకనేత్రుని = శ్రీమన్నారాయణుని యొక్క. నిజధామవైభవతదున్నత తన్మహనీయకీర్తికిన్ = స్వకీయమైన నగరియొక్క వైభవమునకును దాని పొడవునకును అతనిమహత్తరమైన కీర్తికిని. మనమునన్=మనసునందు. మోదమంది=సంతోషించి. పలుమాఱును=మాటిమాటికి. సన్నుతిఁ జేసెన్=పొగడెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! అర్జునుఁడు సూర్యుని తేజస్సువంటి తేజస్సుగల శ్రీకృష్ణమూర్తితోఁ గూడ తాను పోయి ప్రత్యక్షముగా సమస్తమునకు రక్షకుఁడైన శ్రీమన్నారాయణుని పరమపదమునందుఁ జూచియు ఆయనదైన పరమపదముయొక్క వైభవమునకును దాని గొప్పతనమునకును దానిదైనగొప్పకీర్తికిని మనస్సున సంతోషించి పలుమాఱు పొగడనారంభించెనని తాత్పర్యము.

౧౩౦౬.—తే॥ వారిజాక్షుని భక్తమం * దారు ననఘుఁ । గృష్ణు నఖిలేశుఁ గేశవు * జిష్ణుఁ బరము
వినుతిసేయుచుఁ దత్పాద * వనజములకు । వందనము లాచరించి యా * నందమొందె.

టీ॥ వారిజాక్షునిన్=తామరలవంటికన్నులుగలవాఁడును. భక్తమందారున్=సేవకులకు కల్పవృక్షమును. అనఘున్ = పాపములేనివాఁడును. అఖిలేశున్=సర్వమునకు ప్రభువైనవాఁడును. కేశవున్ = శివబ్రహ్మలకు జన్మస్థానమైనవాఁడును. జిష్ణున్ = జయశీలుఁడును. పరమున్ = పరబ్రహ్మమునైన. కృష్ణున్ = కృష్ణమూర్తిని. వినుతిసేయుచున్=పొగడుచు. తత్పాదవనజములకున్=అతనిపాదకమలములకు. వందనము లాచరించి = నమస్కారములుచేసి. ఆనందమొందెన్=సంతోషించెను—నిరతిశయానందమునొందుచుండెననుట.

తా॥ తామరలవంటికన్నులుగలవాఁడును, సేవకులపాలిటి కల్పవృక్షమును, పాపములులేనివాఁడును, సర్వమునకు నీశ్వరుఁడును, శివునకును బ్రహ్మకును జన్మస్థానమయినవాఁడును, జయించుస్వభావముగలవాఁడును, పరబ్రహ్మస్వరూపుఁడును నైన శ్రీకృష్ణమూర్తిని స్తోత్రము చేయుచు అతని అడుగులకు మ్రొక్కి సంతోషించెనని తాత్పర్యము. వ॥ అంత.

౧౩౦౭.—మ॥ హరి సర్వేశుఁ డనంతుఁ డాద్యుఁ డభవుం * డామ్నాయసంవేది భూ
సురముఖ్య ప్రజలన్సమస్తధన వ * స్తు శ్రేణి నొప్పారఁగాఁ
బరిరక్షించుచు ధర్మము న్నిలుపుచున్ * బాపాత్ములన్ ద్రుంచుచున్
బరమోత్సాహ మెలర్ప భూరివిభవ [illegible] జిష్ణుఁడై ద్వారకన్.

టీ॥ సర్వేశుఁడు = అన్నిటి నేలినవాఁడు. అనంతుఁడు = కొనలేనివాఁడు. ఆద్యుఁడు=జగత్తునకు మొదటివాఁడు. అభవుఁడు=పుట్టుకలేనివాఁడు. ఆమ్నాయసంవేది=వేద వేదాంతములనెఱిఁగినవాఁడునైన. హరి=శ్రీకృష్ణుఁడు. భూసురముఖ్యప్రజలన్=బ్రాహ్మణులు మొదలుగాఁగలజనులను. సమస్తధనవస్తుశ్రేణిన్=ఎల్లవిధములయినధనములచేతను వస్తువులచేతను. ఒప్పారఁగాన్=ఒప్పునట్లు. పరిరక్షించుచున్ = చక్కఁగాఁ గాపాడుచు. (ధర్మమును) నిలుపుచున్=స్థాపించుచును. పాపాత్ములన్ = పాపచిత్తముగలవారిని. త్రుంచుచున్=చంపుచు. పరమోత్సాహము=అధికమయినయుత్సాహము. ఎలర్పన్ = అతిశయింపఁగా. భూరివిభవభ్రాజిష్ణుఁడై =

అధికమయిన శుభకార్యములచేత వెలుగుచునట్టి స్వభావము గలవాఁడై. ద్వారకన్ = ద్వారకయందు.

తా॥ అన్నిటిని నేలినవాఁడును, అంతము లేనివాఁడును, జగత్సృష్టికి మొట్టమొదటివాఁడును, పుట్టుకలేనివాఁడును, వేదములను వేదాంతములను దెలిసినవాఁడును నైన శ్రీకృష్ణమూర్తి బ్రాహ్మణులు మొదలుగాఁగల నాలుగుజాతుల ప్రజలను ధనధాన్యములు మొదలగువాని సమృద్ధిచేత ఒప్పునట్లు లెస్సగా కాపాడుచు ధర్మమును స్థాపించుచు పాపచిత్తులగు దుష్టులను జంపుచు మిక్కిలిపూనికతో మిక్కుటమైన శుభకార్యములచేత ప్రకాశించుచు ద్వారకయందు అని తాత్పర్యము.

౧౩౦౪.—క॥ జనవినుతముగాఁ బెక్కుస । వనములు దనుఁదానగూర్చి * వైదిక యుక్తి
న్నొనరించుచు ననురాగము । మనమునఁ దళుకొత్త దైత్య * మర్దనుఁ డెలమిన్.

టీ॥ దైత్యమర్దనుఁడు = శ్రీకృష్ణమూర్తి. జనవినుతముగాన్ = జనులచేత కొనియాడఁబడినవియగునట్టుగా. పెక్కుసవనములు = అనేక యజ్ఞములు. మనమునన్ = మనసునందు. అనురాగము = ఆసక్తి. తళుకొత్తన్ = కలుగఁగా. (బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం। బ్రహ్మైవ తేనగంతవ్యం బ్రహ్మకర్మసమాధినా) అను శ్రుతినిపట్టి. తనున్ = పరబ్రహ్మమైన తన్ను. తాన = తానే. కూర్చి = ఉద్దేశించి. వైదికయుక్తిన్ = వేదమునందుఁ జెప్పఁబడిన క్రమముతో. ఒనరించుచున్ = చేయుచు. ఎలమిన్ = సంతోషముతో. (ఉండెను)

తా॥ రాక్షసులకు నాశకరుఁడైన శ్రీకృష్ణమూర్తి ఎల్లజనులు కొనియాడునట్లు వేదమునందు విధింపఁబడిన క్రమము చొప్పున తన్ను తానే ఉద్దేశించి మిక్కిలి యాసక్తితో అనేకయజ్ఞములను చేయుచు మిక్కిలి సంతోషముతో ఉండెను అని తాత్పర్యము.

వ॥ అట్లు కృష్ణుండు ద్వారకానగరంబునఁ బూజ్యంబగు రాజ్యంబు సేయుచుఁ బురందరవిభవంబున నిరవొంది కనక
మణిమయ విమాన మండప గోపుర ప్రాసాద సౌధ చంద్రశాలాంగణాది వివిధ భవనంబు లందును, రంగ
దుత్తుంగ తరంగ డోలావిలోల కలహంస చక్రవాక కారండవ సారస క్రౌంచముఖ జలవిహంగ విలస దుచ్చలిత
గరుదనిలదరదమలకమల కుముద కల్హార సందోహ నిష్యంద మకరంద రసపాన మదవ దిందిందిరకుల కలగాయక
ఝుంకార నినదంబులును, నిరంతర వసంతసమయ సముచిత పల్లవిత కోరకిత బాలరసాలజాల లాలిత కిసలయ
విసరఖాదనజాత కుతూహలాయమానకషాయకంఠకలకంఠకలరవ మృదంగ ఘోషణంబులును, నిశిత నిజచంచూ
పుట నిర్దళితసకలజన నయనానంద సుందరనందిత మాకందపరిపక్వ ఫలరంధ్రవినిర్గళన్మధుర రసాస్వాదన ముదిత
రాజకీర శారికానికర మృదు మధుర వచనరచనావంశ కృత్యంబులు, నమరపురంధ్రీజన పీనపయోధర మండల
విలిప్త లలితకుంకుమ పంకసంకుల సౌగంధ్యానుబంధ బంధురగంధాను మోదితుండును, జందనాచల సానుదేశ
సంజాత మంజుల మాధవీలతా నికుంజ పుంజ మంజులకింజల్క రంజిత నివాసవిసర విహరమాణ శబరికా కబ
రికా పరిపూర్ణ సురభికుసుమమాలికా పరిమళవహుండును, గళిందకన్యకాకల్లోల సందోహ పరిస్పందకందళిత
మందగమనుండును నగుమందానిల విదూషకునిచేఁ బోషితాభ్యాసితలాలితలగు నేలాలతావితాన నటులనటనం
బుల విరాజితంబులగు కాసార తీర భాసురోద్యానంబులందును, జారు ఘనసార పటీర బాల రసాల సాలనీప
తాపింఛజంబూజంబీర నింబకదంబప్రముఖ ముఖ్య శాఖిశాఖాకీర్ణ శీతలచ్ఛాయావిరచిత విమలచంద్రకాంతోపల
వేదికాస్థలములందును, నుదంచితపింఛవిభాసిత బాలనీలకంఠ కేకారవవ్యాకులీకృత కృతకమహీధరంబులందును,
లలిత మణివాలుకానేక పులిన తలంబులందును, కప్పురంపుదిప్పలను, కురువేరు చప్పరంబులను, విరచిత చారు
యంత్రనిబద్ధకలశ నిర్యత్పయోధారాశీకరపరంపరాసంపాదిత నిరంతర హేమంతసమయ ప్రదేశంబుల నిందిరా
రమణుండు షోడశసహస్రవధూయుక్తుండై యందఱ కన్నిరూపులై లలితసౌదామనీలతా సమేత నీలనీరదంబుల
విడంబించుచుఁ గరేణుకా కలిత దిగ్గజంబునోజ రాజిల్లుచు, సలిలకేళీ విహారంబులు మొదలైన లీలావినోదంబులు
సలుపుచు నంతర్గపురంబునఁ గొలువున్న యవసరంబున వివిధ వేణు వీణాది వాద్య వినోదంబుల, మంజుగానం
బుల, గవిగ్గాయక సూతవందిమాగధ జన సంకీర్తనంబుల, నటనటీజన నాట్యంబుల, విదూషక పరిహాసోక్తుల,
సరస సల్లాప మృదు మధుర భాషణంబులఁ బ్రొద్దు పుచ్చుచు నానంద రసాబ్ధి నోలాడు చుండె నంత.

టీ॥ (అట్లు కృష్ణుండు) ద్వారకా నగరంబునన్ = ద్వారకాపట్టణమునందు. పూజ్యంబగు రాజ్యంబు = ఘనమయిన ప్రభుత్వమును. (చేయుచు) పురందరవిభవంబునన్ = దేవేంద్ర వైభవముతో. ఇర ... కనక = బంగారు మయములును. మణిమయ = రత్నమయములును నైన. విమాన = శిఖరములతోడి చప్పరములవంటి కట్టడములును. మండప = మండపములును. గోపుర = గోపురములునుగల. ప్రాసాద = దేవాలయములు. సౌధ = నగళ్లు. చంద్రశాల = ఏడంతస్తుల మీఁది ఒంటిస్తంభపు మేడలు. అంగణ =

ముంగిళ్లు. ఆది=మొదలుగాఁగల. వివిధభవనంబులందుఁగా = నానావిధములయిన యిండ్లయందును. రంగ...నినదంబులును—రంగత్ = చలించుచున్న. ఉత్తుంగ=పొడుపులైన. తరంగ=అలలనెడు. డోలా=ఉయ్యాలలయందు. విలోల=ఊఁగుచున్న. కలహంస=ఉత్తమజాతి హంసలు. చక్రవాక=జక్కవపక్షులు. కారండవ=కన్నెలేడిపిట్టలు. సారస = బెగ్గురుపక్షులు. క్రౌంచ = కొక్కెరాలు అనుపక్షులు. ముఖ=మొదలుగాఁగల. జలవిహగ=జలపక్షులయొక్క. విలసత్ = విరియుచున్న. ఉచ్చలిత=ఎగయనాడింపఁబడిన. గరుత్ = తెక్కల వలని. అనిల=గాలిచేత. దరత్=కొంచెముపూచిన. అమలకమల=తెల్లదామరలయు. కుముద=తెల్లకలువలయు. కల్హార=ఎఱ్ఱకలువలయు. సందోహ=సమూహములయందుండి. నిష్యంద = స్రవించుచున్న. మకరందరస=పూఁదేనెను. పాన=త్రాగుటచేత. మదవత్=క్రొవ్విన. ఇందిందిరకుల=తుమ్మెదకూటువులనెడి. కలగాయక=అవ్యక్తమధురధ్వనితో పాడునట్టి పాఠకులయొక్క. ఝంకార=ఝుమ్మనెడి. నినదంబులను=ధ్వనులను. నిరంతర...బులును—నిరంతర = అవకాశము లేని. వసంతసమయ=వసంత ఋతువునందలి. సముచిత = తగిన. పల్లవిత=చిగిర్చినవియు. కోరకిత = మొగ్గలు వేసినవియునైన. బాలరసాల=లేఁతమామిడిగున్నలయొక్క. జాల=పట్టులయందు. లాలిత=లాలనచేయఁబడిన—చక్కగా పుట్టియున్న. కిసలయ=చిగుళ్లయొక్క. విసర=సముదాయమును. ఖాదన=తినుటవలన. జాత=పుట్టిన. కుతూహలాయమాన=వేడుకపడుచున్న. కషాయకంఠ = ఒగర్చుచున్న గొంతులుగల. కలకంఠ=కోవెలలయొక్క. కలరవ=అవ్యక్తమధురధ్వనుల నెడు. మృదంగఘోషణంబులును=మద్దెలధ్వనులును. నిశిత... కృత్యంబులును—నిశిత = వాఁడులైన. నిక్షి=తమదైన. చంచూపుట=ముక్కుగోళ్లచేత. నిర్దళిత=చీల్పఁబడిన. సకలజన=ఎల్లజనులయొక్క. నయన = కన్నులకు. ఆనంద = సంతోషకరములయిన. సుందర = అందములైన. నందిత=కొనియాడఁబడిన. మాకంద=తియ్యమామిళ్లయందలి. పరిపక్వ=చక్కగామాఁగిన. ఫల=పండ్లయొక్క. రంధ్ర=చీలికలయందుండి. విగళత్=జాఱుచున్న. మధుర=తియ్యనైన. రస=పానకమును. ఆస్వాదన=త్రాగుటచేత. ముదిత = సంతోషించిన. రాజకీర=శ్రేష్ఠములయిన చిలుకలయు. శారికా=గోరువంకలయు. నికర=గుంపులయొక్క. మృదు=తిన్ననైన. మధుర=ఇంపైన. వచన=మాటలయొక్క. రచనా=కూర్పులయొక్క. వంశ = సముదాయములయొక్క. కృత్యంబులును=పనులును. అమర... మోదితుండును—అమరపురంధ్రిజన=దేవతాస్త్రీలయొక్క. క్షీన=ఉదుటుగల. పయోధర=స్తనములయొక్క. మండల = వట్రువైన ప్రదేశములయందు. విలిప్త=చక్కఁగాపూయఁబడిన. లలిత=మనోజ్ఞమయిన. కుంకుమ=కుంకుమపువ్వుతోఁజేరిన. పంక=కలపముయొక్క. సంకుల=దళ...వలని. సౌగంధ్య=మంచివాసనతోడి. అనుబంధ=సంబంధముచేత. బంధుర=ఘనమైన. గంధ=మంచివాసనచేత. అనుమోదితుండును=ఆనందించినవాఁడును. చందనాచల...వహుండును—చందనాచల=గందపుఁగొండయొక్క. సానుదేశ = చఱియయందు. సంజాత = పుట్టిన. మంజుల=మనోజ్ఞమయిన. మాధవీలతా=పువ్వుల గురివింద తీఁగలతోడి. నికుంజ=పొదరిండ్లయొక్క. పుంజ=సమూహమునందలి. మంజుల=మనోజ్ఞమయిన. కింజల్క = కేసరములచేత. రంజిత = ఆంపగించుచున్న. నివాస = ఉనికిపట్లయొక్క. విసర=సమూహమునందు. విహరమాణ=విహరించుచున్న. శబరికా=శబరస్త్రీలయొక్క. కబరికా=కొప్పులయందు. పరిపూర్ణ=నిండిన. సురభి=పరిమళము...ల. కుసుమమాలికా=పువ్వుదండలవలని. పరిమళ=మంచివాసనను. వహుండును=వహించిన వాఁడును. కళింద...గమనుండును—కళిందకన్యకా = యమునానదియందలి. కల్లోల=గొప్ప అలలయొక్క. సందోహ=సమూహముయొక్క. పరిస్పంద=మిక్కిలికదలుటవలన. కందళిత=మొలచిన. మందగమనుండును=మెల్లనినడకగల్గువాఁడును. (అగు) మందానిల విదూషకునిచేత = మందమారుతమను అనునట్టి విదూషకునిచేత. (విదూషకుఁడు=ఎప్పుడును పరిహాసము చేసినవ్వు పుట్టించునట్టి శృంగార నాయక సచివుఁడు.) పోషితాభ్యాసితలాలితలు = పోషింపఁబడిన వారును, అభ్యాసము చేయఁబడినవారును, లాలింపఁబడినవారును. (అగు) ఏలాలతావితాననటులసటునంయులకు = ఏలకితీఁగెల సముదాయము లనెడు ఆటకత్తెలయొక్క ఆటలచేత. విరాజితంబులు=ప్రకాశించునవి. (అగు) కాసారతీర భాసురోద్యానంబులందుఁగా = సరస్సుల గట్టులయందు ప్రకాశించునట్టి యుద్యానవనములయందును. చారు...స్థలములందుఁగా — చారు = మనోజ్ఞములైన. ఘనసార=కర్పూరపు అరఁటులు. పటీర=గందపుమ్రాఁకులు. బాలరసాల=తియ్యమామిడిగున్నలు. సాల=ఏపెమ్రాఁకులు. నీప=కడపచెట్లు. తాపింఛ=చీఁకటిమ్రాఁకులు. జంబూ=నేరేడుమ్రాఁకులు. జంబీర=నిమ్మమ్రాఁకులు. నింబ=వేఁపమ్రాఁకులు. కదంబ=బట్టకడిమిమ్రాఁకులు. ప్రముఖ=మొదలుగాఁగల. ముఖ్య=ప్రధానములయిన. శాఖి=వృక్షములయొక్క. శాఖా = కొమ్మలచేత. కీర్ణ=నిండిన. శీతల=చల్లనైన. ఛాయా=నీడలుగల. విరచిత=చేయఁబడిన. విమల=నిర్మలములయిన. చంద్రకాంతోపల = చంద్రకాంతపు రాలచేతఁజేయఁబడిన. వేదికాస్థలములందుఁగా=అరఁగులయందును. ఉదంచిత ...ధరంబులును—ఉదంచిత = మీఁదికెత్తఁబడి యొప్పిదములయిన. పింఛ=కుంచెలచేత. విభాసిత = ప్రకాశింపఁజేయఁబడిన. బాలనీలకంఠ=నెమలిపిల్లలయొక్క. కేకారవ=కేకలధ్వనులచేత. వ్యాకులీకృత=కలఁతనొందింపఁబడిన. కృతకమహీధరంబులందుఁగా = కృత్రిమములయిన కొండలయందును. లలిత ... పులినతలంబులందుఁగా — లలిత=మనోజ్ఞములయిన. మణి=రత్నమయములైన. వాలుకా=ఇసుకచేతనైన. ఆసేక=పికిలైన. పులినతలంబులందుఁగా=ఇసుకతిప్పలయందును. కప్పురంపుఁదిప్పలను = కర్పూరపుఁ దిబ్బలయందును. కురువేరు చప్పరంబులను=కురువేరుతో వేసిన పందిళ్లయందును. విరచిత...ప్రదేశంబులఁగా—విరచిత=చేయఁబడిన. దారుయంత్ర = కీలుగల కొయ్యబొమ్మలయందు—ఏతము మొదలగువానియందు. నిబద్ధ=కట్టఁబడిన. కలశ = కుండలయందుండి. నిర్యత్ = స్రవించుచున్న. పయోధారా =నీటిధారలయొక్క. శీకర=తుంపురులయొక్క. పరంపరా = ఎడతెగని వరుసలచేత. సంపాదిత = కలుగఁజేయఁబడిన. నిరంతర=అవకాశములేని. హేమంతసమయ=హేమంత ఋతువును తోఁపించునట్టి. ప్రదేశంబులఁగా = చోటులయందును. ఇందిరారమణుండు = శ్రీలక్ష్మీభర్తయయిన కృష్ణుఁడు. షోడశసహస్ర వధూయుక్తుండై=పదియాఱువేల భార్యలతోఁగూడుకొన్నవాఁడై. అందఱకు=ఎల్లవారికిని. అన్నిరూపులై=అన్నియాకృతులు పొందినవాఁడై.

లలిత...నీరదంబులన్—లలిత = మనోజ్ఞమయిన. సౌదామనీలతా=మెఱుపు తీఁగలతోడ. సమేత=కూడిన. నీలనీరదంబులన్=నల్లమబ్బులను. విడంబించుచున్= సరిపోలుచు. కరేణుకా ... ఓజన్—కరేణుకా=ఆఁడు ఏనుఁగులతోడ. కలిత=కూడిన. దిగ్గజంబునోజన్=దిగ్గజమువలె. రాజిల్లుచున్ = ప్రకాశించుచు. సలిలకేళివిహారంబులు= జలక్రీడయందువిహరించుటలు. (మొదలైన)లీలావినోదంబులు=వేడుకయాటలు. స్ఫులుప్రుచున్=నడపుచు. అంతర్గృపురంబునన్ = లోపలియింటియందు. కొలువున్నయవసరంబునన్ = కొలువు దీరియుండు సమయమునందు. వివిధ...వినోదంబులన్ — వివిధ = నానావిధములయిన. వేణు=పిల్లనఁగ్రోవి. వీణా=వీణియ. ఆది=మొదలైన. వాద్యవినోదంబులన్=వాద్యములవలని వేడుకలచేతను. మంజుగానంబులన్= మనోహరములైన పాటలచేతను. కవి...సంకీర్తనంబులన్ — కవి = కావ్యకర్తలు. గాయక=పాఠకులు. సూత=బట్టువాండ్రు. వంది స్తుతిపాఠకులు. మాగధ=వంశావళిచదువువారలునైన. జన=జనులయొక్క. సంకీర్తనంబులన్=స్తోత్రములచేతను. నటనటీజన నాట్యంబులన్ = నట్టువకాండ్రయొక్కయు నట్టువకత్తెలయు ఆటలచేతను. విదూషకపరిహాసోక్తులన్=విదూషకుఁడు అనఁబడు శృంగారనాయక సచివునియొక్క యెగతాళిమాటల చేతను. సరససల్లాప మృదు మధుర భాషణంబులన్—సరస=రసవంతములైన. సల్లాప=ముచ్చటలచేతను. మృదు=సులభోచ్చారణగల. మధుర = ఇంపైన. భాషణంబులన్= మాటల చేతను. ప్రొద్దు పుచ్చుచున్ = కాలము గడపుచు. ఆనందరసాబ్ధిన్=సంతోషరసమను సముద్రమునందు. ఓలాడుచుండెన్= ఈఁదులాడుచుండెను. అంతన్=అప్పుడు.

తా॥ ఆవిధముగా శ్రీకృష్ణమూర్తి ద్వారకాపట్టణమునందు మెచ్చుకోఁదగిన మహిమతో రాజ్యము చేయుచు దేవేంద్రభోగముతో నివసించియుండి బంగారుమయములును రత్నమయములునైన మండపములు గోపురములు గుళ్లు నగళ్లు మేడలు మాంగిళ్లు మొదలగు నానావిధములైన యిండ్లయందును, చలించుచున్న పెద్ద అలలయందు ఉయ్యాలలూఁగుచున్న హంసలు జక్కవలు కన్నెలేళ్లు బెగ్గురులు కొంగలు మొదలుగాఁగల జలపక్షులు విప్పఁబడిన తెక్కలు మీఁదికెత్తి వీచుటవలనఁ బుట్టిన గాలిచేత కదలి కొంచెము విరిసిన తెల్లతామరలయు తెల్లకలువలయు ఎఱ్ఱగలువలయు సమూహముల వలననుండి కాఱుచున్న పూఁదేనెను త్రాగి మత్తుగొన్న తుమ్మెదల జుమ్మనెడి రొదలచప్పుళ్లును, అవకాశములేని వసంతఋతువునందలి చక్కగా చిగిర్చినవియు మొగ్గలెత్తినవియునైన తియ్యమామిడిగున్నల చాళ్లయందు లెస్సగాఁగాన వచ్చుచున్న చిగుళ్ల జొంపములను తినుటయందలి తమకముచేత ఒగర్చుచున్న గొంతులుగలకోవెలల గుంపుల అవ్యక్త మధుర ధ్వనులనెడు మద్దెల మ్రోఁతలును, వాఁడులైన తమ ముక్కుగోళ్లచేత చీల్పఁబడినయెల్లజనుల కన్నులకు పండుగుగా అందగించుచు కొనియాడఁబడనయ్యె మామిళ్లయందు పండిమాఁగిన పండ్లచీలికలయందుండి స్రవించుచున్న తియ్యని పానకమును త్రాగి సంతోషించిన చిలుకలయు గోరువంకలయు సమూహములయొక్క సులభోచ్చారణగల యింపు లైన మాటలకూర్పులును, దేవతాస్త్రీలయొక్క బలిసిన స్తనములే వక్షస్థల ప్రదేశములందు చక్కగా పూయఁబడిన పచ్చకప్పురము కుంకుమపువ్వు మొదలగు పరిమళవస్తువులు కూర్చిన కలపములయొక్క మంచివాసనయొక్క సంబంధముచేత సంతోషించిన వాఁడును, లేత పరిమళించుచున్నవాఁడును, గంధపుకొండచఱియలయందుఁ బుట్టిన మనోజ్ఞములయిన బండిగురివెంద తీఁగల అల్లికగల పొదరిండ్లవాకిళ్లయందు మనోహరములయిన కేసరములచేత అందగించుచు తన యునికిపట్లయందు విహరించుచున్న శబరస్త్రీలయొక్క కొప్పులయందు విందుకొనియుండు మంచివాసనగల పుష్పదండలవాసనను వహించినవాఁడును, యమునానదియందలి గొప్ప అలలయందు ఊఁగుచు మెల్లఁగా సంచరించువాఁడును, ఆయిన మెల్లని గాలి యనెడు విదూషకునిచేత పోషింపఁబడియు అభ్యాసము చేయఁబడియు లాలింపఁబడియును ఒప్పునట్టి యేలకితీఁగలనెడి ఆటకత్తెలయొక్క ఆటలచేత ప్రకాశించుచుండెడి సరస్సుల గట్టులందలి మనోహరములైన ఉద్యానవనములయందును, పిక్కిలి అందగించుచున్న కర్పూరపుఅరఁటులుగంధపు మ్రాఁకులు తియ్యమామిడిగున్నలు ఏపమ్రాఁకులు కదపమ్రాఁకులు చీఁకటిమ్రాఁకులు నేరేడుమ్రాఁకులు నిమ్మమ్రాఁకులు పొఁకమ్రాఁకులు బట్టకడిమిమ్రాఁకులు మొదలుగాఁగల మ్రాఁకులయొక్క అంతటను వ్యాపించిన చల్లనినీడలయందు కాఁగుపఁబడి చంద్రకాంతపు మణుల అరుఁగులయందును, మీఁదికెత్తుకొని విరియఁదీసిన పించెముచేత అందగించునట్టి నెమళ్లకొదమ కేకలచేత కలఁతనొందింపఁబడిన కృత్రిమ పర్వతములయందును, మనోజ్ఞములును రత్నమయములునైన చెక్కు ఇసుక తిప్పలయందును, మఱియు కర్పూరపు దిబ్బలయందును, కురువేరు చప్పరములయందును, ఏఁతములు మొదలయిన వానియందు త్రోవ నట్టి కుండలవలననుండి కాఱుచున్న నీటి తుంపురులవలన హేమంత ఋతువువలెఁదోఁచుచున్న చల్లనిప్రదేశములయందును, శ్రీకృష్ణుని భర్తయయిన శ్రీకృష్ణమూర్తి పదియాఱువేల యిల్లాండ్రతోడను గూడుకొని అందఱికిని అన్నిరూపులెత్తి మెఱుపుతీఁగెలతోఁ గూడుకొని వెలుఁగునట్టి నల్లమబ్బులను బోలుచు ఆఁడు ఏనుఁగులతోఁ గూడిన దిగ్గజములవలెఁ గనఁబడుచు జలక్రీడలాది వినోదించుచు అంతఃపురమునందు కొలువుదీరి పిల్లనగ్రోవి వీణె మొదలగు నానావిధ వాద్యములను మనోహరములైన పాటలను కవులు గాయకులు సూతులు మాగధులు వందులు మొదలగువారి స్తోత్రములను ఆటకాండ్రు ఆటకత్తెలు ఆడునట్టి యాటలను, విదూషకుని పరిహాసపు మాటలను విని ఆనందించుచు సరసములైన ముచ్చటలాడుచు సులభోచ్చారణగల యింపులయిన మంచిమాటలాడుచు ప్రొద్దుపుచ్చి సముద్రమువలె మేరలేని యానందరసమునందు మునిఁగి తేలుచుండెనని తాత్పర్యము.

౧౩౧౦.—మ॥ అరవిందాక్షు పదాంబుజాత యుగళ * ధ్యానాను రాగక్రియా
సరసాలాప విలోకనానుగత చం * చత్సౌఖ్య కేళీరతిన్
దరుణుల్ నాలుఁ బదాఱువేలు మహితో * త్సాహంబునం జొక్కి త
త్పరతైఁ దొండు దలంపకుండిరి సవి * భ్రాంతాత్మలై భూవరా.

టీ॥ భూవరా=రాజా. తరుణులు = కృష్ణునిభార్యలు. నూఱు పదాఱువేలు = పదియాఱువేల నూఱుగురును. అరవిందాక్ష ... వరతిన్—అరవిందాక్ష=శ్రీకృష్ణమూర్తియొక్క. పదాంబుజాత=పాద కమలమ్ములయొక్క. యుగళ=జంటను. ధ్యాన = ధ్యానముచేయుట యందును. అనురాగక్రియా=కూరిమిని పుట్టించునట్టిపనులయందును. సరస=రసవంతములయిన. ఆలాప=ముచ్చటలయందును. విలోకన= చూపులయందును. అనుగత = అనుసరించి తిరుగుటలయందును. చంచత్=ఒప్పిదమయిన. సౌఖ్యకేళీ=సుఖక్రీడయందును. రతిన్ = ఆసక్తితో. మహితోత్సాహంబునన్=మిక్కుటమైనకుతూహలమందు. చొక్కి = పరవశత్వమునొంది. తత్పరలై=ఆకృష్ణునియందే అంటిన మనసుగలవారై. ఒండుదలంపక=ఇతరమేమియుఁదలఁపక. సవిభ్రాంతాత్మలై=భ్రమనొందిన మనసుగలవారై. (ఉండిరి)

తా॥ ఓపరీక్షిన్మహారాజా! కృష్ణునిభార్యలయిన పదియాఱువేల నూఱుగురుస్త్రీలును కృష్ణుని పాదసేవయందు ఆసక్తలై అతనికితమ యందుప్రీతికలుగునట్టిపనులనేచేయుచు సరసముగా ముచ్చటలాడుచు ఆసక్తితోఁజూచుచు అతఁడు ఎట్లు మెలఁగినను అతనిని అనుసరించియే మెలఁగుచు సుఖముగా క్రీడించుచు మిక్కిలి యుత్సాహమును పరవశత్వమునుగలవారై ఇతరాసక్తిలేకతమమనసులు భ్రమింపఁగా నుండిరి అని తాత్పర్యము.

వ॥ అదియునుంగాక.

౧౩౧౧.—మ॥ హరి నామాంకితమైన గీతమొక మా ॥ టాలించి మాహాత్ములున్
విరతిం బొందఁగఁ జాలియుందురఁట యా ॥ విశ్వాత్ము నీక్షించుచున్
బరిరంభించుచు నంటుచు న్నగుచు సం ॥ భాషించుచున్నుండు సుం
దరు లానంద నిమగ్నలౌట కిల చో ॥ ద్యంబేమి భూవల్లభా.

టీ॥ భూవల్లభా=రాజా. హరినామాంకితము = శ్రీవిష్ణునామము గుఱుతుగాఁగలది — శ్రీవిష్ణునామములను దెలుపునది. ఐనగీతము = అయినట్టిపాట. ఒకమాటు = ఒకసారి. ఆలించి=విని. మాహాత్ములును=తెలివిమాలినవారును. విరతిన్=విరాగమును. పొందఁగన్= పొందను. చాలి=సమర్థులై. ఉందురఁట=ఉందురుఅనుమాటప్రసిద్ధము. (అట్లుండఁగా) ఆవిశ్వాత్మున్ = సర్వస్వరూపుఁడైన యాశ్రీకృష్ణ మూర్తిని. ఈక్షించుచున్=చూచుచు. పరిరంభించుచున్ = కౌఁగిలించుకొనుచు. అంటుచున్=తాఁకుచు. నగుచున్=పరిహసించుచు. సంభాషించుచున్ = ముచ్చటలాడుచు. ఉండు=ఉండునట్టి. సుందరులు=స్త్రీలు. ఆనందనిమగ్నలు=సంతోషమునందు మునిఁగినవారు. ఔటకున్=అగుటకు. ఇలన్=భూమియందు. చోద్యంబేమి=ఆశ్చర్యమేమియున్నది.

తా॥ ఓపరీక్షిన్మహారాజా! శ్రీహరినామము అంకితముగాఁజేయఁబడినపాటను ఒకదానినిఒకసారివిన్నమాత్రముచేత నేయేమి తెలియని మూఢులుగూడ విరాగమును పొందఁగలవారు అగుచుండఁగా సర్వస్వరూపుఁడైన ఆభగవంతుని ఎల్లప్పుడు చూచుచు, కౌఁగిలించుకొనుచు, తాఁకుచు, ఎగతాళిచేయుచు, ముచ్చటలాడుచు, ప్రొద్దులు పుచ్చునట్టి యిల్లాండ్రు సంతోషమునందు మునిఁగి తేలుచునుండుట ఆశ్చర్యము కాదుగదా అని తాత్పర్యము.

వ॥ అనిచెప్పి మఱియు నిట్లనియె.

౧౩౧౨.—ఉ॥ వారక కృష్ణుఁ డిప్పగిది ॥ వైదికవృత్తి గృహస్థ ధర్మ మే
పారఁగఁ బూని ధర్మమును ॥ నర్థముఁ గామమునందుఁ జూపుచున్
గోరిక మీఱి సజ్జనుల ॥ కుం గతి దాన యనంగ నొప్పి సం
సారి గతిన్ మెలంగె నృప ॥ సత్తమ లోక విడంబ నార్థమై.

టీ॥ నృపసత్తమ = ఓరాజశ్రేష్ఠుఁడా. (కృష్ణుఁడు) వారక= మానక. ఇప్పగిదిన్=ఈవిధముగా. వైదికవృత్తిన్ = వేదమునందుఁ జెప్పఁబడినక్రమముతోడివ్యాపారముతో. గృహస్థధర్మము=గృహస్థాశ్రమధర్మము. ఏపారఁగన్=అతిశయింపఁగా. పూని=అవలంబించి. ధర్మమును = పుణ్యమును. అర్థమును=ధనసంపాదనమును. కామమును = ఇచ్చవచ్చిన సుఖములను అనుభవించుటయును. (అనుపురుషార్థములను) అందున్=ఆగృహస్థధర్మమునందు. చూపుచున్=కనఁబఱుచుచు. కోరికమీఱి=ఇచ్ఛావ్యాపారముచేత అతిశయించి, లోకవిడంబనార్థమై=లోకములోని జనులను బోలియుండుటకై. సంసారి గతిన్=సంసారముగలవాని వలెనే. సజ్జనులకున్=సత్పురుషులకు. గతి = దిక్కు. తాన = తానే. అనంగన్ = అనునట్లు. ఒప్పి = మనోజ్ఞముగఁదగియున్నవాఁడై. మెలంగెన్=ప్రవర్తించెను.

తా॥ ఓపరీక్షిన్మహారాజా ! ఈముందుచెప్పినరీతిని శ్రీకృష్ణుఁడు తప్పక వేదవిహితములైన వ్యాపారములతోడి గృహస్థ ధర్మమును నడపువాఁడై ధర్మార్థకామములు అనెడు ఈలోకమునఁదలి మూఁడు పురుషార్థములను అనుభవించుచు ఆగృహస్థ ధర్మమునందు మిక్కిలి యాసక్తితో లోకములోనివారినడతను అనుసరించి సత్పురుషులకెల్ల దిక్కై సంసారులరీతిని ప్రవర్తించె నని తాత్పర్యము.

౧౩౧౩.—సీ॥ హరియిట్లు గృహమేధి ॥ యగుచు శతోత్తర - షోడశ సాహస్ర ॥ సుందరులను
మునునీకు నెఱుఁగఁ జె ॥ ప్పినరీతి నందఱ - కన్ని రూపములు దా ॥ నర్థిఁదాల్చి
కైకొని యొక్కొక్క ॥ కామినీ మణియందు - రమణ నమోఘ వీ ॥ ర్యమునఁజేసి
పదు రేసి కొడుకులఁ ॥ బడసె రుక్మిణ్యాది - పట్టమహిషులకు సం ॥ భవులునైన

తే॥ నందనులలోన ధరణి నె * న్నంగ బాహు । బల పరాక్రమ విజయ సం * పద్విశేష
మానితాత్ములు పదునెన * మండ్రువారి । నెఱుఁగ వినిపింతు వినుము రా * జేంద్రచంద్ర.

టీ॥ హరి=కృష్ణుఁడు. ఇట్లు=ఈవిధముగా. గృహమేధియగుచున్=గృహస్థుఁడగుచు. శతోత్తర... సుందరులన్—శతోత్తర = నూఱు మీఁదగల. షోడశసాహస్ర=పదియాఱువేలైన. సుందరులను=భార్యలను. మును=మునుపు. (నీకు) ఎఱుఁగఁజెప్పినరీతిన్=తెలియఁజేసిన విధమున. అందఱకున్ = ఎల్లవారికిని. (అన్నిరూపములు తాను) అర్థిన్=ప్రీతితో. తాల్చి=ధరించి. కైకొని=అక్కునపట్టి—ఆదరించి. ఒక్కొక్క కామినీమణియందున్ = ఒక్కొక్క పెండ్లామునందును. రమణన్=ఒప్పిదముగా. అమోఘవీర్యమునఁజేసి=వ్యర్థముగాని తన వీర్యముచేత. పదురేసికొడుకులన్ = పదిపదిమంది కొడుకులను. పడసెన్ = పొందెను. (వీరుగాక) రుక్మిణ్యాది పట్టమహిషులకున్=రుక్మిణి మొదలుగాఁగల పట్టపుదేవులకు. సంభవులు నైన నందనులలోనన్=పుట్టినకొడుకులలో. ధరణిన్=భూమియందు. ఎన్నంగన్=శ్లాఘింపఁగా. బాహు... మానితాత్ములు—బాహుబల=భుజబలము. పరాక్రమ=శత్రువులనాక్రమించుశక్తి. విజయ=గెలుపు. (వీనియొక్క) సంపత్=కలిమియొక్క. విశేష=అతిశయముచేత. మానితాత్ములు=గౌరవింపఁదగిన స్వభావముగలవారు. పదునెనమండ్రు = పదునెనిమిదిమంది. రాజేంద్రచంద్ర = మహారాజులలో శ్రేష్ఠుఁడైన పరీక్షిత్తుఁడా. వారిన్=ఆపదునెనమండ్రను. ఎఱుఁగన్ = తెలియునట్లు. వినిపింతున్=చెప్పెదను. (వినుము)

తా॥ ఈరీతిగా శ్రీకృష్ణమూర్తి గృహస్థుఁడై పదియాఱువేల నూఱుగురు భార్యలను మున్దునీతోఁజెప్పినవిధమున పెండ్లాడి తాను అందఱికి అన్నిరూపములనుధరించి ప్రీతితో ఒక్కొక్క భార్యయందు పదేసిమంది కొడుకులచొప్పున అందఱియందును సంతానమును పడసెను వీరుగాక పట్టపుదేవులయినరుక్మిణిమొదలగువారియందుఁబుట్టిన కొమారులలో పదునెనిమిది మంది మిక్కుటమయిన బలమును పరాక్రమమునుజయించు స్వభావమును గలిగి ప్రసిద్ధినొందినవారు వారిని తెలియఁజేసెదను వినుమని శుకుఁడు పరీక్షిన్మహారాజుతో చెప్పెనని తాత్పర్యము.

గంధర్వులు.





గంధర్వులు.





సత్యభామ.




రుక్మిణీదేవి.




## (*) శ్రీకృష్ణుని వంశానుక్రమము. (*)

వ॥ అని యిట్లను వారలు ప్రద్యుమ్నానిరుద్ధ దీప్తిమద్భాను సాంబ మిత్ర బృహద్భాను మిత్రవింద వృకారుణ పుష్కర దేవబాహు శ్రుతదేవ సునందన చిత్రభాను వరూథ కవి న్యగ్రోధులను నామంబులఁ బ్రసిద్ధులై వెండియుఁ ద్రివక్రయందు సంభవించిన యుపశ్లోకుండనువాఁడు దనజనకుండైన కృష్ణ పాదారవింద సేవానిరతుం డగుచు నారద యోగీంద్రునకు శిష్యుండై యఖండిత దివ్యజ్ఞాన బోధాత్ముండగుచు నతండు స్త్రీ శూద్ర దాసీజన సంస్కారంబై స్మరణ మాత్రంబున ముక్తి సంభవించునట్టి సాత్వత తంత్రంబను వైష్ణవ స్మృతిఁ గల్పించె నిట్లు మధుసూదన నందనులు బహు ప్రజలు నధికాయు రున్నతులు ననల్ప వీర్యవంతు

లును బ్రహ్మణ్యులునై విఖ్యాతిం బొందిరి వారిని లెక్కపెట్టఁ బదివేల వత్సరంబులకైనం దీరదు మున్ను
నీకెఱింగించినట్లు తత్కుమారులకు విద్యావిశేషంబుల నియమించు గురుజనంబులు మూఁడుకోట్లు నెనుబ
దెనిమిదివేల నూర్గురనం గలిగి యుండు రకుమారుల లెక్కింప నెవ్వరికిని వశంబుగా దదియునుం గాక.

టీ॥ (అని) ఇట్లనుచు = ఇట్లు చెప్పనారంభించెను. వారలు = ఆకుమారులు. ప్రద్యుమ్న ... న్యగ్రోధులు — ప్రద్యుమ్న = ప్రద్యుమ్నుఁడు. అనిరుద్ధ = అనిరుద్ధుఁడు. దీప్తిమత్ = దీప్తిమంతుఁడు. భాను = భానుఁడు. సాంబ = సాంబుఁడు. మిత్ర = మిత్రుఁడు. బృహద్భాను = బృహద్భానుఁడు. మిత్రవింద = మిత్రవిందుఁడు. వృక = వృకుఁడు. అరుణ = అరుణుఁడు. పుష్కర = పుష్కరుఁడు. దేవబాహు = దేవబాహువు. శ్రుతదేవ = శ్రుతదేవుఁడు. సునందన = సునందనుఁడు. చిత్రభాను = చిత్రభానుఁడు. వరూథ = వరూథుఁడు. (కవి న్యగ్రోధుఁడు) అనునామంబులన్ = అనునట్టి పేళ్లచేత. ప్రసిద్ధులైరి = ప్రసిద్ధిని పొందినవారలైరి. వెండియున్ = మఱియును. త్రివక్రయందున్ = కుబ్జయందు. సంభవించిన = పుట్టిన. (ఉపశ్లోకుండు) అనువాఁడు = అను పేరుగలవాఁడు. తనజనకుండు = తనతండ్రి. (అయిన) కృష్ణపాదారవిందసేవారతుండు. శ్రీకృష్ణమూర్తియొక్క పాదకమలములను గొలుచుటయందు. (ఆసక్తుఁడు) అగుచున్ = అవుచును. నారదయోగీంద్రునకున్ = నారదమహామునికి. (శిష్యుండై) అఖండితదివ్యజ్ఞానబోధాత్ముండు = కొఱఁతలేని దివ్యమయిన జ్ఞానము తెలిసిన మనసు గలవాఁడు. (అగుచు) ఆతండు = ఆయుపశ్లోకుఁడు. స్త్రీశూద్రదాసీజనసంస్కారంబై = ఆఁడువారు శూద్రులు పరిచారికలునైన జనులను దిద్దునదియై. స్మరణమాత్రంబునన్ = తలఁపుమాత్రముచేతనే. ముక్తి = మోక్షము. సంభవించునట్టి = కలుగునట్టి. (సాత్వతతంత్రంబు) అను వైష్ణవస్మృతిన్ = అనుపేరుగల వైష్ణవధర్మశాస్త్రమును. కల్పించెన్ = కలుగఁజేసెను. (ఇట్లు) మధుసూదననందనులు = శ్రీకృష్ణునికొడుకులు. బహుప్రజలును = అనేకులు బిడ్డలు గలవారును. అధికాయురున్నతులును = మిక్కుటమయిన ఆయుస్సుచేత గొప్పవారును. అనల్పవీర్యవంతులును = తక్కువకాని వీర్యముగలవారును. బ్రహ్మణ్యులును = వేదమునందుఁ జెప్పఁబడిన ధర్మములను నడపువారును. (అయి) విఖ్యాతిన్ = ప్రసిద్ధిని. (పొందిరి) వారిని = ఆకుమారులను. (లెక్కపెట్టను) పదివేలవత్సరంబులకైనన్ = పదివేలయేండ్లకైనను. తీరదు = శక్యముకాదు. మున్ను = మునుపు. (నీకు) ఎఱింగించినట్లు = తెలియఁజేసినవిధమున. తత్కుమారులకున్ = ఆచిన్నవాండ్రకు. విద్యావిశేషంబులన్ = విద్యలు మొదలగునవి చెప్పుటయందు. నియమించు = ఏర్పఱుచు. గురుజనంబులు = ఉపాధ్యాయులు. మూఁడుకోట్లు నెనుబదెనిమిదివేలు నూర్గురు = మూఁడుకోట్లమీఁద ఎనుబదెనిమిదివేల నూఱుమంది. అనన్ = అనఁగా. (కలిగియుందురు) అక్కుమారులన్ = ఆచిన్నవాండ్రను. లెక్కింపన్ = లెక్కపెట్టను. (ఎవ్వరికిని) వశంబుగాదు = శక్యముకాదు. అదియునుంగాక = అంతేగాక.

తా॥ ఇట్లుచెప్పి మఱియును శుకుండుచెప్పనారంభించెను ఆకృష్ణమూర్తి కొడుకులు ప్రద్యుమ్నుఁడు అనిరుద్ధుఁడు దీప్తిమంతుఁడు భానుఁడు సాంబుఁడు మిత్రుఁడు బృహద్భానుఁడు మిత్రవిందుఁడు వృకుఁడు అరుణుఁడు పుష్కరుఁడు దేవబాహువు శ్రుతదేవుఁడు సునందనుఁడు చిత్రభానుఁడు వరూథుఁడు కవి న్యగ్రోధుఁడు అను పేళ్లచేత ప్రసిద్ధులువీరుగాక త్రివక్రయను దానివలన కృష్ణునకుఁ బుట్టిన కొడుకు ఉపశ్లోకుఁడు అనువాఁడు ఒకఁడుగలఁడువాఁడుతనతండ్రియైన కృష్ణునిపాదకమలములను సేవించుటయందు ఆసక్తి గలవాఁడై నారదమహామునికి శిష్యుఁడై మేలయిన దివ్యజ్ఞానమును పడసి స్త్రీలు శూద్రులు పరిచారికలు మొదలగువారికి తెలివి గలుగఁజేయునదియు తలఁచినమాత్రముననే మోక్షము నిచ్చునదియునైనసాత్వతతంత్రము అను వైష్ణవధర్మశాస్త్రమును చేసెను ఈప్రకారము కృష్ణుని కొమారులు అనేకులయి అనేకులను బిడ్డలనుగని దీర్ఘాయుస్సును మిక్కుటమైన వీర్యమునుగలిగి వేదోక్తధర్మములను నడపుచు ప్రసిద్ధిని వహించిరి వారిని పదివేలయేండ్లకైనను ఎంచశక్యముకాదు మునుపు నీతోఁ జెప్పినవిధముగా ఆకృష్ణుని కుమారులకుచదువుచెప్ప నేర్పఱుపఁబడిన యుపాధ్యాయులు మాత్రము మూఁడుకోట్లనెనుబదెనిమిదివేలనూఱుగురు అట్లుండఁగా వారినెవ్వరు లెక్కపెట్టఁగలరు అనిచెప్పెననితా.

౧౩౧౫.—క॥ నరవర దేవాసుర సం గరమునమును నిహతులైన * క్రవ్యాద సము
త్కరము నరేశ్వరులై ద్వా । పరమున జనియించి ప్రజల * బాధలఁ బఱుపన్.

టీ॥ నరవర = ఓరాజా. దేవాసురసంగరమునన్ = దేవతలయు అసురులయు యుద్ధమునందు. మును = పూర్వకాలమునందు. నిహతులైన = చంపఁబడినవారైన. క్రవ్యాదసముత్కరము — రాక్షసుల సమూహము. ద్వాపరమునన్ = ద్వాపరయుగమునందు. నరేశ్వరులై = రాజులై. జనియించి = పుట్టి. ప్రజలన్ = జనులను. బాధలఁబఱుపన్ = బాధింపఁగా — బహువిధములయినబాధలనుకలుగఁజేయఁగా ననుట.

తా॥ ఓరాజా! ఇంతకుముందు చెప్పినమాత్రమే గాక పూర్వకాలమునందు జరిగిన దేవాసుర యుద్ధములో చచ్చినరాక్షసు లందఱును ద్వాపరయుగమునందు రాజులైపుట్టి జనులనెల్లను బాధింపఁగా ననితాత్పర్యము.

౧౩౧౬.—క॥ హరితద్వధార్థమై ని । ర్జరులను యదుకులమునందు * జనియింపింపం
ధరనూటొక్కకులంబై । పరఁగిరి వారిని గణింప * బ్రహ్మకు వశమే.

టీ॥ హరి = విష్ణుమూర్తి. తద్వధార్థమై = వారిని చంపుటకై. నిర్జరులను = దేవతలను. యదుకులమునందున్ = యాదవవంశమునందు. జనియింపింపన్ = పుట్టింపఁగా. ధరన్ = భూమియందు. నూటొక్కకులంబై — నూటిమీఁద నొకవంశము కలవారై. పరఁగిరి = ప్రసిద్ధి నొందిరి. వారిని = ఆయాదవులను. గణింపన్ = ఎంచను. బ్రహ్మకున్ = బ్రహ్మకైనను. వశమే = తరమా.

తా॥ శ్రీవిష్ణుదేవుఁడు ఆరాజులుగాఁబుట్టిన రాక్షసులను చంపుటకై దేవతల నెల్లను యాదవులనుగా భూమియందుపుట్టించెను అట్లు పుట్టింపఁబడిన యాదవులు నూటయొక్క గోత్రములు గలవారై ప్రసిద్ధిఁగాంచిరి అట్టియాదవులు ఇందఱని లెక్కపెట్టిచెప్పుటకుబ్రహ్మదేవునికైనను శక్యముకాదు అని తాత్పర్యము.

వ॥ అట్టి యన్వయంబు నందు మాధవునకు రుక్మిణీదేవియందుఁ బితృసముండును సమగ్రభుజా విజృంభణుండును నై ప్రద్యుమ్నుండు జనించె, నతనికి రుక్మికూఁతురగు శుభాంగివలన ననిరుద్ధుం డుదయించె, నతనికి మౌసలావశిష్టుం డైన వజ్రుండు సంభవించె, నతనికిఁ బ్రతిబాహుండు పుట్టె, వానికి సుబాహుండు జన్మించె, నతనికి నుగ్రసేనుండు ప్రభవించె, నాతనికిశతసేనుండుగలిగె, నిట్లుయదువృష్ణి భోజాంధక వంశంబులు పరమపవిత్రంబులై పుండరీకాక్షుని కటాక్షవీక్షణ శయ్యాసనానుగత సరసాలాప స్నానాశన క్రీడావినోదంబు లనిశంబుం జెందుచు సర్వ దేవతార్థంబు సమస్తంబైన క్రతువు లొనరించుచుఁ బరమానంద కందళిత చిత్తులై రని చెప్పి వెండియు.

టీ॥ అట్టియన్వయంబునందున్ = అటువంటివంశమునందు. మాధవునకున్ = కృష్ణునకు. (రుక్మిణీదేవియందు) పితృసముండును = తన తండ్రితో సమానుఁడును. సమగ్రభుజావిజృంభణుండును = కొఱఁతలేని భుజముల యాటోపముగలవాఁడును. (అయి ప్రద్యుమ్నుండు) జనించెన్ = పుట్టెను. అతనికిన్ = ఆప్రద్యుమ్నునికి. రుక్మికూఁతురు = రుక్మియనువాని కూఁతురైన. శుభాంగివలనన్ = శుభాంగి అనుదానివలన. (అనిరుద్ధుండు) ఉదయించెన్ = పుట్టెను. అతనికిన్ = అయనిరుద్ధునికి. మౌసలావశిష్టుండైన = ముసలసంబంధమైనబాధలోఁబడక మిగిలినవాఁడైన. (వజ్రుండు) సంభవించెన్ = పుట్టెను. అతనికిన్ = ఆవజ్రునకు. (ప్రతిబాహుండుపుట్టెను) వానికిన్ = ఆప్రతిబాహునికి. (సుబాహుండు) జన్మించెన్ = పుట్టెను. అతనికిన్ = ఆసుబాహునికి. (ఉగ్రసేనుండు) ంచెన్ = పుట్టెను. ఆతనికిన్ = ఆయుగ్రసేనునికి. (శతసేనుండు) న్ = పుట్టెను. (ఇట్లు) యదువృష్ణి భోజాంధక వంశంబులు = యదువుదియు వృష్ణిదియు భోజునిదియు అంధకునిదియునైన వంశములు. పరమపవిత్రంబులై = మిక్కిలిపరిశుద్ధములయి. పుండరీకాక్షుని...వినోదంబులన్ = పుండరీకాక్షుని = కృష్ణునియొక్క. కటాక్షవీక్షణ = కడకంటిచూపులు. శయ్యా = పడకలు. ఆసన = పీఁటలు. అనుగత = వెంబడించితిరుగుటలు. సరసాలాప = రసవంతములైన ముచ్చటలు. స్నాన = స్నానములు. అశన = భోజనములు. క్రీడా = ఆటలు. వినోదంబులన్ = వీనివలనివేడుకలను. అనిశంబున్ = ఎల్లప్పుడును. చెందుచున్ = పొందుచు. సర్వదేవతార్థంబు = ఎల్ల దేవతలకొఱకు. సమస్తంబైన = ఎల్లవియునైన. క్రతువులు = యాగములను. ఒనరించుచున్ = చేయుచు. పరమానంద కందళితచిత్తులు = మేలైనసంతోషము మొలకెత్తుచున్న మనసులు గలవారలు. (అయిరి అనిచెప్పి) వెండియున్ = మఱియును.

తా॥ అటువంటి ఆయదువంశము నందు శ్రీకృష్ణమూర్తికి రుక్మిణీదేవియందు తనతండ్రియైనకృష్ణునితో సమానుఁడును కొఱఁతలేనిభుజబలముగలవాఁడునై ప్రద్యుమ్నుఁడు పుట్టెను, ఆప్రద్యుమ్నునికి రుక్మికూఁతురైన శుభాంగి అనుదానియందు అనిరుద్ధుఁడుపుట్టెను, ఆయనిరుద్ధునికి ముసలముయొక్క చూర్ణమువలనఁ బుట్టిన తుంగపెట్టుచేత చావకబ్రతికిన వజ్రుఁడు అనువాఁడు పుట్టెను, ఆవజ్రునికి ప్రతిబాహుఁడు అనువాఁడు పుట్టెను, ఆప్రతిబాహునికి సుబాహుఁడు అనువాఁడుపుట్టెను, ఆసుబాహునికి ఉగ్రసేనుఁడుఅనువాఁడుపుట్టెను, ఆయుగ్రసేనునికి శతసేనుఁడు అనువాఁడు పుట్టెను, ఈవిధముగా యదువృష్ణిభోజుఁడు అంధకుఁడు అనువారివంశములు మిక్కిలినిర్మలములయి శ్రీకృష్ణునితోడి చూపులు పడకలు కూర్చుండుటలు వెంబడించితిరుగుటలు సరసముగా ముచ్చటలాడుటలు స్నానములుచేయుటలు భోజనముచేయుటలు ఆటలాడుటలుమొదలుగాఁగలవానివలని వేడుకలను ఎల్లప్పుడుపొందుచు ఎల్లదేవతలకొఱకును ఎల్లయజ్ఞములను చేయుచు మిక్కిలిసంతోషముతో కాలముగడపిరి అనిచెప్పి శుకమహాముని ఇంకనేమోచెప్పఁబోవుచున్నాఁడని తాత్పర్యము.

౧౩౧౮.—మ॥ పరమోత్సాహముతోడ మాధవుఁడు శుం * భల్లీలఁ బూరించు న
మ్మురళీ గానము వీనులం జిలికినన్ * మోదించి గోపాలసుం
దరులేతెంతు రరణ్యభూములకుఁ ద * ద్దాస్యంబుఁ గామించి య
క్కరుణావార్ధి భజింపకుందురె బుధుల్ * కౌరవ్యవంశాగ్రణీ.

టీ॥ కౌరవ్య వంశాగ్రణీ = కురుసంబంధమయిన వంశమునందు ముఖ్యుఁడా. పరమోత్సాహముతోడన్ = మిక్కిలియుత్సాహముతో. మాధవుఁడు = కృష్ణుఁడు. శుంభల్లీలన్ = మిక్కిలివిలాసముగా. పూరించు = ఊఁదునట్టి. అమ్మురళీగానమున్ = ఆపిల్లనఁగ్రోవిపాట. వీనులన్ = చెవులయందు. చిలికినన్ = సోఁకినమాత్రమున. మోదించి = సంతోషించి. గోపాలసుందరులు = గోపికాస్త్రీలు. తద్దాస్యంబున్ = ఆకృష్ణునికొలువును. కామించి = కోరి. అరణ్యభూములకున్ = అడవిప్రదేశములకు. ఏతెంతురు = వత్తురు. బుధులు = విద్వాంసులగువారు. అక్కరుణావార్ధిన్ = దయాసముద్రుఁడైనఆకృష్ణుని. భజింపకుందురె = సేవింపక యుందురా.

తా॥ కురువంశశ్రేష్ఠుఁడైనయోపరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణమూర్తి మిక్కిలియుత్సాహము గలవాఁడై విలాసముగా పిల్లనఁగ్రోవియూఁదునప్పుడు ఆగానముచెవిసోఁకిన మాత్రముచేతనే ఆయనను కొలువవలెనను కోరికతో గోపికాస్త్రీలు ఇండ్లువాకిండ్లువిడిచి అడవులకువచ్చుచుందురు అట్లుండఁగా ఇఁక పండితులగువారు-దయాసముద్రుఁడైన ఆకృష్ణమూర్తిని సేవింపకయుందురా? సేవింపనే సేవింపుదురు అని తా.

౧౩౧౯.—మ॥ మతి నెవ్వాని యమంగళఘ్నమగు నా * మం బర్థిఁ జింతించిన
న్నుతిగావించిన విన్నమానవులు ధ * న్యుల్భూరి సంసార దు
ష్కృతులం ద్రోతురు కాలచక్రమహితా * సింబ ట్టియాకృష్ణుఁ డీ
క్షితిభారం బుడుగంగఁజేయు టిది యే * చిత్రంబు భూవల్లభా.

టీ॥ భూవల్లభా=రాజా. మతిన్=మనసునందు. ఎవ్వాని=ఏదేవునియొక్క. అమంగళఘ్నము=అశుభములను పోఁగొట్టునది. అగు నామంబున్ = అగునట్టి పేరును. అర్థిన్=ప్రీతితో. చింతించినన్=తలఁచినను.నుతిగావించినన్=పొగడినను.విన్నన్=ఒకరుచెప్పఁగా విన్నను. మానవులు = మనుష్యులు. ధన్యులు=కృతార్థులు. భూరి సంసార దుష్కృతులన్ = విస్తారమయిన సంసారమువలనిదోషములను. ద్రోతురు=తొలఁగింతురు. ఆకృష్ణుఁడు =అట్టినామమహిమ గలిగినకృష్ణమూర్తి. కాలచక్ర మహితాసిన్—కాలచక్ర=కాలచక్రమనెడు.మహిత=గొప్పదైన.అసిన్=కత్తిని.పట్టి=చేతఁబట్టి.ఈక్షితి భారంబున్=ఈభూభాగమును. ఉడుగంగఁజేయుట = మాన్పుట. ఇదియేచిత్రంబు=ఇదియేమి ఆశ్చర్యము—ఆశ్చర్యము కాదు అనుట.

తా॥ ఓరాజా ! ఏశ్రీకృష్ణదేవునియొక్క కీడులను తొలఁగించునట్టి నామమును మనసునందుప్రీతితోతలఁచినను పొగడినను ఎవరైన పొగడఁగా విన్నను మనుష్యులు కృతార్థులై మేరలేని సంసారదుఃఖములనుబాపుకొందురు,అట్టినామమహిమగలశ్రీకృష్ణుఁడుకాలచక్రము అనెడి గొప్పకత్తినిబూని యీభూమియొక్కబరువును మాన్పుటఁ కసాధారణధర్మమేకాని ఆశ్చర్యముకాదు అని తాత్పర్యము.

వ॥ ఇవ్విధంబున గోపికాజనమనోజాతుండైన కృష్ణుండు లీలామానుష విగ్రహుండై నిజరాజధానియైన ద్వారకాపురంబున నమానుషవిభవంబులగు సౌఖ్యంబులఁ బొదలుచుండెనని చెప్పి మఱియునిట్లనియె.

టీ॥ ఇవ్విధంబునన్ = ఈరీతిగా. గోపికాజనమనోజాతుండు= గోపికాస్త్రీలకు మన్మథుఁడు — గోపికాస్త్రీలను మోహింపఁజేయువాఁడు. (అయిన కృష్ణుండు). లీలామానుషవిగ్రహుండై = విలాసరూపమయిన మనుష్యదేహమును ధరించినవాఁడై. నిజరాజధాని = తనపట్టణము. ఐనద్వారకాపురంబునన్=ఐనట్టి ద్వారకా పట్టణమునందు. అమానుషవిభవంబులు = మనుష్యులవి కానివేడుకలు. అగు సౌఖ్యంబులన్=అగునట్టి సుఖములచేత. పొదలుచుండెన్ = వర్థిల్లుచుండెను. (అని చెప్పి) మఱియున్=ఇంకను. (ఇట్లనియెను)

తా॥ ఈప్రకారము గోపికాస్త్రీలను మన్మథునివలె మోహింపఁజేయువాఁడైన శ్రీకృష్ణమూర్తి లీలామానుష విగ్రహుఁడై తనదైన ద్వారకాపట్టణమునందుమనుష్యసామాన్యముల కానిసుఖములననుభవించుచుండెననిచెప్పిశుకమహామునిమఱియునుచె రంభించెననితా

౧౩౨౧.—మ॥ మనుజేంద్రోత్తమ యేనునీకుఁ ద్రిజగ * న్మాన్యంబునై యొప్పఁ జె
ప్పిన యీకృష్ణకథా సుధారసము సం * ప్రీతాత్ములై భక్తిఁ గ్రో
లిన పుణ్యాత్ములు గాంతురిందు సుఖము * ల్నిర్ధూత సర్వాఘులై
యనయంబుం దుదిఁగాంతు రచ్యుత పదం * బైనట్టి కైవల్యమున్.

టీ॥ మనుజేంద్రోత్తమ=రాజశ్రేష్ఠులలోనుత్తముఁడైనయోపరీక్షిన్మహారాజా. ఏను=నేను. (నీకు) త్రిజగన్మాన్యంబునై=మూఁడులోకములందునుసన్మానింపఁదగినదై. ఒప్పన్=తగునట్లు.చెప్పినయీకృష్ణకథాసుధారసమున్=చెప్పినట్టి యీకృష్ణునికథయనెడు అమృతరసమును. సంప్రీతాత్ములై=సంతోషించిన మనసుగలవారై. భక్తిన్ = భక్తితో. గ్రోలిన = త్రాగిన—వినియనుభవించిన. పుణ్యాత్ములు = పుణ్యముగలవారు. ఇందున్=ఈలోకమునందు.నిర్ధూతసర్వాఘులై=తొలఁగింపఁబడినయెల్లపాపములుగలవారై. అనయంబున్=మిక్కిలి. సుఖములు=సౌఖ్యములను. కాంతురు = పొందుదురు. తుదిన్=కడపటఁ—చనిపోయిన. పిమ్మట. అచ్యుతపదంబు=శ్రీవిష్ణుస్థానము. ఐనట్టి కైవల్యమున్=అయిన మోక్షపదవిని. కాంతురు=పొందుదురు.

తా॥ ఓపరీక్షిన్మహారాజా ! నేను నీకు చెప్పినదియు మూఁడులోకములందు సన్మానింపఁదగినదియునై యొప్పునట్టి యీకృష్ణకథయను అమృతమును భక్తితోను సంతోషముతోను అనుభవించునట్టి పుణ్యాత్ములు ఈలోకమునందుమిక్కిలిసుఖమును పొందుటయేగాక పరలోకమునందుశ్రీవిష్ణుస్థానమయినపరమపదమునుబొందుదురు అనితా

౧౩౨౨.—క॥ అనియిట్లు బాదరాయణి । మనమున రాగిల్ల నాభి * మన్యునకుం జె
ప్పినవిధమున సూతుఁడు ముని । జనులకెఱిఁగింప వారు * సమ్మతితోడన్.

టీ॥ (అని) ఇట్లు=ఈవిధముగా. బాదరాయణి=శుకమహాముని. ఆభిమన్యునకున్=పరీక్షిన్మహారాజునకు. మనమునన్=మనసునందు. రాగిల్లన్=సంతోషించునట్లు. (చెప్పినవిధమునసూతుఁడు) మునిజనులకున్=శౌనకుఁడు మొదలుగాఁగలమునీశ్వరులకు. ఎఱిఁగింపన్= చెప్పఁగా. వారు = ఆమునులు. సమ్మతితోడన్ = ఇష్టముతో.

తా॥ అని యీప్రకారముగా శుకమహాముని పరీక్షిన్మహారాజునకుఁ జెప్పిన భాగవతపురాణకథను సూతుఁడు శౌనకాదులైనమహామునులకుఁ జెప్పఁగా వారుసంతోషించినవారై అని తాత్పర్యము.

౧౩౨౩.—క॥ సూతుని బహువిధముల సం । ప్రీతునిఁ గావించి మహిమఁ * బెంపారుచు వి
ఖ్యాతికి నెక్కిన కృష్ణ క । థా తత్పరులైరి బుద్ధిఁ * దలఁగని భక్తిన్.

టీ॥ సూతునిన్=ఉగ్రశ్రవసుని. బహువిధములన్=అనేకవిధములుగా. సంప్రీతునిన్ = సంతోషించినవానిఁగా. కావించి = చేసి. మహిమన్ = గౌరవముచేత. పెంపారుచున్ = అతిశయించుచు. బుద్ధిన్ = అంతరంగమందు. తలఁగనిభక్తిన్ = తగ్గనిముఖ్యభక్తిచేత. విఖ్యాతికినెక్కిన = ప్రసిద్ధినొందిన. కృష్ణకథాతత్పరులు = కృష్ణుని కథలను వినుటయందు ఆసక్తి గలవారలు. (అయిరి)

తా॥ శౌనకాదులయిన మునులు సూతుని నానావిధములచేత సంతోషపెట్టి ప్రభావము గలవారై వర్ధిల్లుచు తమ మనస్సుల యందు ప్రసిద్ధమయిన శ్రీకృష్ణ కథలను వినుటయందలి ఆసక్తిగలవారై ప్రవర్తించిరని తాత్పర్యము.

౧౩౨౪.—చ॥ సరసిజ పత్రనేత్ర రఘు * సత్తమ దుష్ట మదాసురేంద్ర సం
హరణ దయాపయోధి జన * కాత్మభవానన పద్మమిత్ర భా
స్కరకుల వార్ధిచంద్రమిహి * కా వసుధాధరసూతి సన్నుత
స్ఫురిత చరిత్ర భక్తజన * పోషణ భూషణ పాప శోషణా.

టీ॥సరసిజపత్రనేత్ర=తామరరేకులవంటికన్నులుగలవాఁడా.రఘుసత్తమ=రఘువంశశ్రేష్ఠుఁడా. దుష్టమదాసురేంద్రసంహరణ=చెడ్డవారునుమదించినవారునైనరాక్షసులనుచంపువాఁడా.దయాపయోధి=దయాసముద్రుఁడా.జనకాత్మభవాననపద్మమిత్ర=జనకునికూఁతురైన సీతాదేవిముఖమనెడు కమలమునకుసూర్యుఁడా. భాస్కరకులవార్ధిచంద్రమిహికా = సూర్యవంశమనెడు సముద్రమునకు చంద్రుని చల్లఁదనమువంటిచల్లఁదనముతోఁడి ప్రకాశముగలవాఁడా. వసుధాధరసూతిసన్నుత స్ఫురితచరిత్ర = పార్వతీదేవిచేతకొనియాడఁబడి ప్రకాశించునట్టి చరిత్రముగలవాఁడా. భక్తజన పోషణభూషణ = సేవకులైన జనులను పోషించుటయే అలంకారముగాఁ గలవాఁడా. పాపశోషణా=బ్రహ్మహత్యసురాపానముగురుతల్పగమనము విప్రధనహరణముఇవిగలవారిచెలిమి అనుపాపములనునశింపఁజేయువాఁడా.

తా॥ తామరలవంటికన్నులు గలవాఁడవును, రఘువంశశ్రేష్ఠుఁడవును, మదించినచెడ్డరాక్షసులను చంపువాఁడవును, మిక్కిలిదయగలవాఁడవును, పద్మమువంటి సీతాదేవియొక్క ముఖమును వికసింపఁజేయుటయందు సూర్యునివంటి వాఁడవును, సూర్యవంశమ అనెడి సముద్రమునందు చంద్రునివలె చల్లనివెలుఁగుతో పుట్టినవాఁడవును, పార్వతీదేవిచేత స్తోత్రముచేయఁబడునట్టి చరిత్రముగలవాఁడవును, సేవకులను కాపాడుటయే అలంకారముగాఁగలవాఁడవును, పాపములనునశింపఁజేయువాఁడవునైన ఓరామచంద్రా! అనితాత్పర్యము.

౧౩౨౫.—క॥ మారీచ భూరి మాయా । నీరంధ్ర మహాంధకార * నీరేజహిత
క్ష్మారమణ వినుతపాదాం । భోరుహ మహితావతార * పుణ్యవిచారా.

టీ॥ మారీచ...హిత—మారీచ=మారీచునిదైన. భూరి = అధికమయిన. మాయా=మాయయనెడు.నీరంధ్ర=దట్టమయిన.మహాంధకార=గొప్పచీఁకటికి.నీరేజహిత=సూర్యుఁడా.క్ష్మారమణ...తార-క్ష్మారమణ = రాజులచేత. వినుత=కొనియాడఁబడునట్టి. పాదాంభోరుహ=పాదకమలములుగల. మహిత=పూజ్యమైన. అవతార=అవతారముగలవాఁడా.పుణ్యవిచారా=ధర్మవిచారముగలవాఁడా.

తా॥ మారీచునిదైన గొప్ప మాయయనెడు చీఁకటిని అణఁచివేయుటయందు సూర్యునివంటి వాఁడవును, ఎల్లరాజులచేతను కొనియాడఁబడునట్టి అడుగులుగలపూజ్యమయినపుట్టుకగలవాఁడవును, ధర్మమునువిచారించునట్టి వాఁడవునైన శ్రీరామా! అని తాత్పర్యము.

౧౩౨౬.—మాలిని॥ శరధి మదవిరామా * సర్వలోకాభిరామా । సురరిపు విషభీమా * సుందరీలోక కామా
ధరణివరలలామా * తాపసస్తోత్రసీమా । సురుచిరగుణధామా * సూర్యవంశాబ్ధిసోమా.

టీ॥ శరధిమదవిరామా=సముద్రముయొక్కమదమునుఅణఁచినవాఁడా. సర్వలోకాభిరామా = ఎల్లలోకములందునుమనోజ్ఞుఁడా. సురరిపువిషభీమా = దేవతలశత్రువులైన రాక్షసులనెడువిషమునకు శివుఁడా. సుందరీలోకకామా = స్త్రీసమూహమునకుమన్మథుఁడా. ధరణివరలలామా = రాజులకుభూషణమయినవాఁడా—(లేక)రాజులలోశ్రేష్ఠుఁడా. తాపసస్తోత్రసీమా = మునీశ్వరులపొగడ్తకుమేరయయినవాఁడా. సురుచిరగుణధామా=మిక్కిలిమనోజ్ఞమయినగుణములకుఉనికిపట్టయిన వాఁడా. సూర్యవంశాబ్ధిసోమా=సూర్యవంశమనెడుసముద్రమునకుచంద్రుఁడా.

తా॥ సముద్రము యొక్క పొంగును అణఁచిన వాఁడవును, ఎల్లలోకములందునుమనోజ్ఞుఁడవును, విషమువలెలోకులకుచెఱుపుచేయునట్టి రాక్షసులను శివునివలె స్వరూప నాశము చేయు వాఁడవును, స్త్రీలకు మన్మథునివలె మోహమునుబుట్టించువాఁడవును, రాజులలో

శ్రేష్ఠుఁడవును, మునీశ్వరుల పొగడ్తలకు తగినవాఁడవును, మిక్కిలి మేలయిన గుణములకు ఉనికి పట్టయిన వాఁడవును, సూర్య వంశ మనెడు సముద్రమునందు చంద్రునివలె ప్రకాశమును కలుగఁ జేయఁ బుట్టినవాఁడవునైన ఓ శ్రీరామా యని తాత్పర్యము.

## (*) గద్య. (*)

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందుఁ బ్రద్యుమ్న జన్మంబును, శంబరోద్యోగంబును, సత్రాజిత్తునకు సూర్యుండు శమంతకమణి నిచ్చుటయుఁ, దన్నిమిత్తంబునం బ్రసేనుని సింహంబు వధియించుటయు, దాని జాంబవంతుండు దునిమి మాణిక్యంబు గొనిపోవుటయు, గోవిందుండు ప్రసేనునిం దునిమి మణిఁ గొనిపోయెనని సత్రాజిత్తుండు నిందనారోపించుటయుఁ, గృష్ణుండు దన్నిమిత్తంబున జాంబవంతునిం దొడరి మణియుక్తంబుగా జాంబవతిం గొనివచ్చి వివాహంబగుటయు, సత్రాజిత్తునకు మణి నిచ్చుటయు, సత్యభామాపరిణయంబును, పాండవులు లాక్షాగృహంబున దగ్ధులైరని విని వాసుదేవుండు బలభద్రసహితుండై హస్తినాపురంబున కరుగుటయు, నక్రూర కృతవర్మానుమతంబున శతధన్వుండు సత్రాజిత్తుం జంపి మణిఁ గొనిపోవుటయుఁ, దదర్థంబా సత్యభామ కరినగరంబునకేగి కృష్ణునకు విన్నవించిన నతండు మఱలిచనుదెంచి శతధన్వుం ద్రుంచుటయు, బలభద్రుండు మిథిలానగరంబునకుం జనుటయు, నందు దుర్యోధనుండు రామునివలన గదావిద్య నభ్యసించుటయుఁ, గృష్ణుండు సత్రాజిత్తునకుం బరలోకక్రియలు నడపుటయు, శతధన్వుని మణి దాఁచినవాఁడై యక్రూరుండు భయంబునం ద్వారకానగరంబు విడిచిపోయిన నతని లేమి ననావృష్టియైనం గృష్ణుం డక్రూరుని మఱలరప్పించుటయు, దామోదరుం డింద్రప్రస్థపురంబున కరుగుటయు, నర్జున సమేతుండై మృగయా వినోదార్థం బరణ్యంబునకుం జని కాళిందిం గొనివచ్చుటయుఁ, గాండవదహనంబు, నగ్నిపురుషుం డర్జునునకు నక్షయతూణీర గాండీవకవచ రథ రథ్యంబుల నిచ్చుటయు, మయుండు ధర్మరాజునకు సభగావించి యిచ్చుటయు, నగధరుండు మఱలి నిజనగరంబున కరుగుదెంచి కాళిందిని వివాహంబగుటయు, మిత్రవింద నాగ్నజిత్తి భద్రా, మద్రరాజకన్యలం గ్రమంబునఁ గరగ్రహణంబగుటయు, నరకాసురయుద్ధంబును, దద్గృహంబుననున్న రాజకన్యలం బదాఱువేలం దెచ్చుటయు, స్వర్గగమనంబు, నదితికిం గుండలంబు లిచ్చుటయుఁ, బారిజాతాపహరణంబును, బదాఱువేల రాజకన్యలం బరిణయంబగుటయు, రుక్మిణీదేవీ విప్రలంభంబును, రుక్మిణీస్తోత్రంబును, గృష్ణకుమారోత్పత్తియుఁ, దద్గురుజనసంఖ్యయుఁ, బ్రద్యుమ్నవివాహంబు, ననిరుద్ధుజన్మంబును, దద్వివాహార్థంబు గుండిననగరంబునకుం జనుటయు, రుక్మిబలభద్రుల జూదంబును, రుక్మివధయు, నుషాకన్యయనిరుద్ధుని స్వప్నంబునం గని మోహించుటయుఁ, దన్నిమిత్తంబునఁ జిత్రరేఖ సకలదేశరాజులఁ బటంబున లిఖించి చూపి యనిరుద్ధునిఁ దెచ్చుటయు, బాణాసురయుద్ధంబును, నృగోపాఖ్యానంబును, బలభద్రుని ఘోషయాత్రయుఁ, గాళిందీభేదనంబును, గృష్ణుండు పౌండ్రకవాసుదేవ కాశిరాజులవధియించుటయుఁ, గాశిరాజపుత్రుండైన సుదక్షిణుం డభిచారహోమంబున వ్రేల్చి కృత్తిం బడసి కృష్ణుపాలికిం బుత్తెంచిన సుదర్శనంబు చేతఁ గృత్తి సుదక్షిణ సహితంబుగాఁ గాశీపురంబు భస్మంబు సేయుటయు, బలరాముండు రైవతనగంబునందు ద్వివిదుండను వనచరుని వధియించుటయు, సాంబుండు దుర్యోధను కూఁతురగు లక్షణ నెత్తికొనివచ్చినఁ గౌరవులతనిం గొనిపోయి చెఱంబెట్టుటయుఁ, దద్వృత్తాంతం బంతయు నారదువలన విని బలుండు నాగనగరంబునకుం జనుటయుఁ, గౌరవులాడిన యగౌరవ వచనంబులకు బలరాముండు గోపించి హస్తిపురంబును గంగం బడఁద్రోయ గమకించుటయుఁ, గౌరవులు భయంబున నంగనాయుక్తంబుగా సాంబునిం దెచ్చి యిచ్చుటయు, బలభద్రుండు ద్వారకా నగరంబునకు వచ్చుటయు, నారదుండు హరిపదాఱువేలకన్యకల నొకముహూర్తంబున నందఱకన్నిరూపులై వివాహం

అయ్యెనని విని తత్ప్రభావంబు దెలియంగోరి యరుగుదెంచుటయుఁ, దన్మాహాత్మ్యంబునుసూచి మఱలిచనుటయు, జరాసంధునిచేత బద్ధులైనరాజులు గృష్ణుపాలికిదూతం బుత్తెంచుటయు, నారదాగమనంబును, బాండవుల ప్రశంసయు, నుద్ధవకార్యబోధంబు, నింద్ర ప్రస్థాగమనంబును, ధర్మరాజు సేయు రాజసూయారంభంబును, దిగ్విజయంబును, జరాసంధవధయును, రాజబంధమోక్షణంబును, రాజసూయంబు నెఱవేఱుటయును, శిశుపాలవధయు, నవభృథంబును, రాజసూయ వైభవ దర్శనాసహ్యమానమానసుండై సుయోధనుండు మయనిర్మిత సభామధ్యంబునఁగట్టినపుట్టంబులు దడియంద్రెళ్లుటయుఁ, దన్నిమిత్త పరిభవంబునొంది రాజనిజపురికరుగుటయు, గృష్ణుండు ధర్మరాజ ప్రార్థితుండై యాదవులనిలిపికొన్ని నెలలు కాండవ ప్రస్థంబు నవసించుటయు, సాళ్వుండు తపస్సు చేసి హరుని మెప్పించి సౌభకాఖ్యంబగు విమానంబువడసి నిజసైన్యసమేతుండై ద్వారకా నగరంబు నిరోధించుటయు, యాదవసాళ్వ యుద్ధంబును, గృష్ణుండు మఱలి చనుదెంచి సాల్వుం బరిమార్చుటయు, దంత వక్ర వధయును విదూరమరణంబును, గృష్ణుండు యాదవబలసమేతుండై క్రమ్మఱ పురంబునకుంజనుటయు, గౌరవ పాండవులకు యుద్ధంబగునని బలదేవుండు తీర్థయాత్రచనుటయు, నందు జాహ్నవీప్రముఖ నదులంగృతస్నానుండై నైమిశారణ్యంబునకుం జనుటయు, నచ్చటి మునులు పూజింప బూజితుండై తత్సమీపంబున, నున్నతాసనంబున నుండి సూతుండు దన్నుంగని లేవకుండిన నలిగి రాముండు గుశాగ్రంబున నతనివధించుటయు, బ్రహ్మహత్యాదోషంబు గలిగి మునులు పలికిన సూతుంబునర్జీవితుం జేయుటయు, నమ్మునులకుం బ్రియంబుగాఁ గానుపాలుం డిల్వల సుతుండగు వల్వలు మార్చుటయు, వారిచేత ననుమతుండై హలధరుండు తత్సమీపతీర్థంబులస్నాతుండై గంగా సాగర సంగమంబునకుం జనుటయు, మహేంద్ర నగ ప్రవేశంబును, బరశురామదర్శనంబును, సప్తగోదావరిం గ్రుంకుటయు, మఱియు మధ్య దేశమందుఁగల అర్థం శ్రీశైల వేంకటాచలంబులు దర్శించుటయు, వృషభాద్రి హరిక్షేత్ర సేతుబంధ రామేశ్వరమ్ములం గని తామ్రపర్ణీతీర్థంబున, కృతస్నానుండై గోదానంబులొనరించి మలయగిరియం దగస్త్యునిం గనుటయు, సముద్రకన్యా దుర్గాదేవుల నుపాసించుటయు, నందు బ్రాహ్మణజనంబు వలనం బాండవ ధార్త రాష్ట్ర భండనంబున సకల రాజలోకంబును మృతినొందిరని వినుటయు, వాయునందన సుయోధనులు గదాయుద్ధ సన్నద్ధులగుట విని వారిని వారించుటకై రౌహిణేయుండందుల కరుగుటయు, నచట వారిచేఁ బూజితుండై వారినివారింపలేక మగుడి ద్వారగకరుగుటయుఁ, గొన్ని వాసరంబులకు మఱల నైమిశారణ్యంబునకుంబోయి యచట యజ్ఞంబుఁజేసి రేవతియుందాను నవభృథంబాడి నిజపురంబున కేతెంచుటయుఁ, గుచేలోపాఖ్యానంబును, సూర్యోపరాగంబునఁ గృష్ణుండు రామునితోఁజేరి పురరక్షణంబునకుఁ బ్రద్యుమ్నాది కుమారులనిలిపి షోడశసహ స్రాంగనాపరివృతుండై యక్రూర వసుదేవోగ్రసేనాది యాదవవీరులు దోడరా శమంత పంచక తీర్థంబునకరిగి కృతస్నానుండైవసించి యుండుటయుఁ, బాండవ కౌరవాది సకల రాజలోకంబును దత్తీర్థంబునకు వచ్చుటయు, గుంతీదేవి దుఃఖంబును, నందయశోదాసహితులైన గోపగోపికా జనంబులు చనుదెంచుటయుఁ, గుశల ప్రశ్నాది సంభాషణంబులును, మద్రకన్యాద్రౌపదీ సంభాషణంబును, దదనంతరంబ సకల రాజలోకంబును శమంత పంచక తీర్థంబుల స్నాతులై రామకృష్ణాది యాదవవీరుల నామంత్రణంబు చేసి నిజనగరంబులకుం బోవుటయుఁ, గృష్ణుని దర్శించుటకు మునీంద్రులేతెంచుటయు, వారియనుమతిని వసుదేవుండుయాగంబు నెఱవేర్చుటయు, నందయశోదాది గోపికా నివహంబుల నిజపురంబున కనిచి యుగ్రసేనాది యాదవ వీరులం దానును మాధవుండును నిజపుర ప్రవేశంబగుటయుఁ, దొల్లి కంసునిచేత హతులైయమపురంబునున్న దేవకీదేవి సుతుల రామకృష్ణులు యోగమాయాబలంబునం దెచ్చి యామెకిచ్చుటయు, నర్జునుడు సుభద్రను వివాహంబగు

టయుఁ, గృష్ణుండు మిథిలానగరంబున కరుగుటయు, శ్రుతదేవ జనకులచరిత్రంబును, వారలతో బ్రాహ్మణ ప్రశంసనపేయుటయుఁ గృష్ణుండు మఱలి తనపురంబున కరుగుటయు, శ్రుతిగీతలును, హరిహరబ్రహ్మల తారతమ్య చరిత్రంబును, కుశస్థలినుండు బ్రాహ్మణుని చరిత్రంబును, నతని తనయులు వరలోకంబునకుం బోయినఁ గృష్ణార్జునులు తమయోగబలంబున వారిందెచ్చి యవ్విప్రున కిచ్చుటయుఁ, గృష్ణుండర్జును వీడ్కొని ద్వారక కరుగుటయు, నందమాధవుండయ్యాప్రదేశంబబుల నకల భార్యా పరివృతుండై విహరించుటయు, యదు వృష్టి భోజ, కుకుర, అంధక వంశ చరిత్రంబునను కథలం గల దశమస్కంధంబునం దుత్తర భాగంబు నమాప్తము.

పరమేశ్వరుని యొక్క దయతోఁ గూడుకొన్న కవిత్వము యొక్క వైచిత్రిగల, కేసన మంత్రికుమారుఁడైనవాఁడును, ఒకరివలన నేరువకయే, లభించిన పాండిత్యముగలవాఁడునైన పోతనామాత్యుని. చేతరచియింపఁబడిన శ్రీమహాభాగవతమనెడు మహాపురాణమునందు ప్రద్యుమ్న జననము మొదలుయదువృష్ణిభోజాంధకవంశ చరిత్రపర్యంతమైన కథలు గల దశమస్కంధమునందలి యుత్తరభాగము ముగిసెననితా.



శ్రీ కృ ష్ణా ర్ప ణ మ స్తు.

